# శ్రీ కోరాడ రామకృష్ణయ్య శత జయం

# సాహితీ నీరాజనం

# Sri Korada Ramakrishnaiy

# Centenary Festschrift



శ్రీ కోరాడ రామకృష్ణయ్య శత జయంతి

# సాహితీ నీరాజనం

# Korada Ramakrishnaiya Centenary Festschrift

*Editor*

**Korada Mahadeva Sastri**


*Sponsored by:*

**SUSARLA INTERNATIONAL TRUST ACADEMY (SITA)**

*Chairman.* **Susarla Gopala Sastry**

AND

**SONTY RENAISSANCE INTERNATIONAL (SRI) FOUNDATION**

*Chairman* **Sriram Sonty**

**1992**

శ్రీ కోరాడ రామకృష్ణయ్య శత జయంతి
సాహితీ నీరాజనం

Korada Ramakrishnaiya Centenary
**Festschrift**

Editor.
Korada Mahadeva Sastri



Publishers:
SITA TRUST
'Sita Nivas', 48-9-16, Dwarakanagar,
Visakhapatnam - 530 016, INDIA.
Phone: 54098, 54406
*And*
SRI FOUNDATION
3042, Carmel Drive, Flossmoor,
IL. 60422 (USA).
Phone: 708-957-4302

Printed at
KALA JYOTHI PROCESS (PVT) LTD
RTC X Roads, Musheerabad,
Hyderabad - 500 020, INDIA

# Sri Korada Ramakrishnaiya Centenary Committee

**CONVENOR**

Sri S. Gopala Sastry

**EDITOR**

Dr K Mahadeva Sastri

**ADVISORY COMMITTEE**

Dr. Bezawada Gopala Reddy
Dr M.R. Appa Rao
Dr C. Narayana Reddy
Dr. M. Gopala Krishna Reddy
Dr. V.I. Subramoniam
Dr. P.V.R.K. Prasad, IAS
Sri M.V. Narayana Rao, IPS
Sri C.S.N. Raju
Dr. Sriram Sonty (USA)

**EDITORIAL COMMITTEE**

Sri Chimakurti Seshagiri Rao
Dr. Chekuri Rama Rao
Dr. Tirumala Ramachandra
Sri Bommakanti Srinivasacharyulu
Dr. B. Ramakrishna Reddy
Dr. Akkiraju Ramapathi Rao
Sri Korlapati Srirama Murthy
Dr G. Indira
Smt. Sarada Purna Sonty (USA)

**STEERING COMMITTEE**

Sri P. Ramachandra Rao
Dr. Ramavarapu Sarat Babu
Sri B. Viswanatha Sarma
Sri K. Ramachandra Sastri
Smt. S. Sita Devi
Sri M.L Narasimha Rao
Sri Yarlagadda Anjaneyulu
Dr. K. Ramanjaneyulu
Sri K. Nageswara Rao
Sri G. Ramakrishna Prasad
Sri S. Ramgopal
Dr. S. Vijayalakshmi (USA)

... His (K. Ramakrishnaiya's) work on Tikkana is inspired by a noble and really original conception... I am sure these aspects of his work will last for all time to his credit and entitle him to the gratitude of all lovers of the Telugu Mahabharata.'

**Dr. Burra Seshagiri Rao**

గౌరవనీయులైన ప్రధానమంత్రి

# శ్రీ పి. వి. నరసింహారావు గారు



ఈ గ్రంథాన్ని 1992 నవంబరు 30వ తేదీన
ఢిల్లీలో ఆవిష్కరించారు.

# Foreword

Sri Korada Ramakrishnaiya was one of the stalwarts of this century in the Telugu literar field. His unique contribution to the fundamental researches in Dravidian Philology and literar criticism is a rich legacy to posterity.

To commemorate his memory in a manner befitting his stature, a centenary committe was formed in June 1991 with eminent personalities in Arts and letters like Dr. Bezawad Gopala Reddi, Dr. M.R. Appa Rao, Sri P.V.R.K. Prasad I.A.S., Dr. C. Narayana Reddi an Dr V I. Subramoniam as its Advisors.

Susarla International Trust Academy (SITA), Visakhapatnam and Sonty Renaissanc International (SRI) Foundation, Illinois, U.S.A. have jointly sponsered the centenary celebration

During the centenary year 1991-92 meetings and seminars were held on the life ar works of Korada Ramakrishnaiya at different educational centers with the active cooperatio of the centenary committee, as follows:

| | Date and Place | Institution | Chairperson |
|---|---|---|---|
| 1. | 4-10-1991 VISAKHAPATNAM | Telugu Dept. Andhra University | Dr.M. Gopalakrishna Reddi Vice-Chancellor |
| 2 | 22-10-1991 HYDERABAD | Telugu University | Dr.C. Narayana Reddi Vice-Chancellor |
| 3. | 28-10-1991 VIJAYAWADA | Sarada College | Dr.M.R. Appa Rao Ex-Vice-Chancellor Andhra University |
| 4. | 29-10-1991 TANUKU | Nannaya Bhattaraka Peetham | Sri Mallina Ramachandra Rao Managing Director, Gowtami Solvent Oils, Tanuku |
| 5 | 30-10-1991 ELURU | The Federation of Science, Philosophy and Arts | Sri S. Gopala Sastri Convenor K.R.centenary Committee |
| 6. | 31-10-1991 AMALAPURAM | 'Kala Triveni' | Prof. Betavolu Ramabrahmam Director, Sahitya Peetham, Telugu University, Rajahmundry |

| | | | |
|---|---|---|---|
| 7. | 1-11-1991<br>MUNGANDA | Jagannatha<br>Panditaraya Peetham | Dr.Khandavilli<br>Subba Rao, MBBS |
| 8. | 21-11-1991<br>ANANTAPUR | Sai Baba National<br>Junior College | Sri Meda Subramanyam<br>Correspondent<br>SSBN Junior College |
| 9. | 25,26-1-1992<br>MADRAS | Telugu Department,<br>Madras University | Dr. V. Ramachandra<br>Professor of Telugu |
| 10. | 28-1-1992<br>ANANTAPUR | Andhra Bharati,<br>Sri Krishnadevaraya<br>University | Dr. Sardesai Tirumala Rao |
| 11. | 6-3-1992<br>BANGALORE | Department of<br>Telugu Studies,<br>Bangalore University | Sri Sakala Narasimhulu Chetty |
| 12. | 25-3-1992<br>VARANASI | Department of Telugu,<br>Benares Hindu University | Prof. L.K. Tripathi, Dean,<br>Faculty of Arts, B.H.U. |
| 13. | 22-10-1992<br>HYDERABAD | Sri Krishnadevaraya<br>Andhra Bhasha Nilayam | Sri M.V. Narayana Rao I.P.S. |

Besides, a few meetings in Commemoration of Ramakrishnaiya were also held in Chicago and some other educational centres in U.S.A.

At the first meeting held in the Andhra University, Visakhapatnam in october 1991, Sri P.V.R.K. Prasad, Dr. M. Gopalakrishna Reddi and Sri Vasanta Rao Venkata Rao paid rich tributes to the memory of Korada Ramakrishnaiya and emphasised the need to publish his complete works and make them available for Research scholars. Sri Bezawada Gopala Reddi described him as the 'mother-root' of linguistic Studies in South India.

Dr. C. Narayana Reddi presiding over the meeting held under the auspices of the Telugu University, Hyderabad stressed the importance of the original researches of Ramakrishnaiya on 'Desi' metres and the common features of prosody of the four South Indian languages.

Dr. M.R. Appa Rao who presided over the meeting held in the Sarada College, Vijayawada underscored the value of Korada's contributions to Modernism in Telugu and expressed the hope that his memory will be perpetuated by bringing a new edition of his works.

The Telugu Department of the University of Madras conducted a National Seminar on Telugu Research - 'Yesterday, Today and Tomorrow' on the 25th and 26th January 1992 as a mark of respect to the memory of Ramakrishnaiya who was the first Professor of Telugu in that University. And one of the sessions of the seminar on the forenoon of 26th was entirely devoted to a review of the original contributions of Ramakrishnaiah to Comparative Studies.

Andhra Bharati, Sri Krishnadevaraya University conducted a seminar in which staff members of the Telugu Department presented an in-depth study of various aspects of Ramakrishnaiah's Contributions.

The Seminar on 'Evolution of comparative studies in Telugu - Korada Ramakrishnaiya's contribution' held at the Banaras Hindu University, an illuminating one, was attended by members of the Hindi and other language departments too.

We are happy to state that the Central Sahitya Akademi, New Delhi has made a grant of Rs.20,000/- for conducting a seminar on the life and works of Ramakrishnaiah. The seminar will be held under the auspices of the Hyderabad University in February, 1993.

The Centenary Committee felt it will be a fitting finale to the centenary year to publish a centenary Festschrift with scholarly articles contributed by eminent scholars

We are grateful to all the contributors for readily cooperating with us in this stupendous project.

We are profoundly thankful to the Hon'ble Prime Minister, Sri PV Narasimha Rao for having kindly agreed to release the volume on the 30th November, 1992.

We will be failing in our duty if we do not place on record our gratitude to the members of the centenary committee for their valuable guidance and help, and especially to the Philanthropists for generously contributing to the centenary fund and making this project a success. We cannot adequately thank Sri Alapati Ravindranath, Proprietor of the Kala Jyothi Process Ltd., for his kind cooperation in Printing the Centenary Festschrift in record time.

**S. Gopala Sastri**

The one way to make wisdom and health go hand in hand, is by exercising your body and brain simultaneously in your youth, and thereby preparing that store of energy which will be called upon for use in later life.

**Alaka Narayana Gajapathi**

Yuvarajah of Vizianagaram,
Maharajah's College Magazine-1921.

# సం పా ద కీ యం

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు జగమెరిగిన భాషా శాస్త్ర పరిశోధకులు. సంస్కృతాంధ్రాంగ్ల విద్వాంసులు. తెలుగు భాషా సాహిత్యాలనూ, తమిళ కన్నడాది ఇతర భాషా సాహిత్యాలనూ కూడా క్షుణ్ణంగా అధ్యయనం చేసి తెలుగు భాషనూ, తెలుగు సాహిత్యాన్నీ ఇతర ద్రావిడ భాషా సాహిత్యాలతో సరిపోల్చి చూపే తులనాత్మక పరిశోధనకు మార్గదర్శకులైన వారు.

శ్రీ రామకృష్ణయ్యగారు తెలుగు భాషా సాహిత్యాలకు చేసిన ఎనలేని సేవకు తగిన విధంగా ఆయన శతవార్షిక జయంతి ఉత్సవాలను జరపడం కోసం ఏర్పాటైన 'కోరాడ రామకృష్ణయ్య శతవార్షిక జయంత్యుత్సవ సంఘం' వారు ఈ ఏడాది పొడుగునా దేశంలోని వివిధ నగరాలలోనూ, విద్యా కేంద్రాలలోనూ మాత్రమే కాక అమెరికా వంటి విదేశాలలో కూడా విద్వత్ సదస్సులను నిర్వహించడం ద్వారా రామకృష్ణయ్య గారి సాహిత్య సేవనూ, వారి ఉదాత్త వ్యక్తిత్వాన్నీ తెలుగువారు కృతజ్ఞతా పూర్వకంగా స్మరించడానికి అవకాశం కలిగించడం ముదావహం.

ఈ ఏడాది పొడుగునా జరిగిన కార్యక్రమాలకు శిఖరాయమానంగా శతజయంతి ఉత్సవ సంఘంవారు ఈ 'కోరాడ రామకృష్ణయ్య శతవార్షిక జయంతి సాహితీ నీరాజనం' ప్రచురణకు పూనుకొని దానికి రూప కల్పన చేసే బాధ్యతను ఈ సంపాదక సమితి వారికి ఒప్పగించారు.

ఈ సంపుటం ప్రచురణ ద్వారా రెండు ప్రధాన లక్ష్యాలను సాధించడం సముచితంగా ఉంటుందని భావింపబడింది. ఒకటి: రామకృష్ణయ్యగారి ముద్రిత రచనలు కాక వివిధ పత్రికలలో చెల్లాచెదరుగా ప్రచురితమైన ఆయన ప్రముఖ వ్యాసాలలో కొన్నింటిని ఈ సంపుటిలో చేర్చి తద్వారా శ్రీ రామ కృష్ణయ్యగారు తెలుగు భాషా సాహిత్యాలకు చేసిన సేవలను పాఠకులకు గుర్తు చేయడం; రెండు: శ్రీ గిడుగు రామమూర్తి స్మారక సంచిక, శ్రీ వావిళ్ల రామస్వామి శాస్త్రి స్మారక సంచికల లాగ ప్రముఖ విద్వాంసుల నుంచి అమూల్య మైన పరిశోధక వ్యాసాలను సేకరించి ప్రతిగ్రంథాలయంలోనూ తప్పకుండా ఉండదగిన సమాలోచక గ్రంథంగా ఈ సంపుటాన్ని తయారు చేయడం.

ఈ లక్ష్యాలను దృష్టిలో ఉంచుకొని సంపాదకులు దేశంలోనూ, అమెరికా వంటి విదేశాలలోనూ ఉన్న ప్రముఖ విద్వాంసులందరికి లేఖలు వ్రాసి వారి అమూల్య రచనలను సేకరించడం జరిగింది. అలా సేకరించిన వాటిలో తెలుగు వ్యాసాలే కాక ఆంగ్ల వ్యాసాలు కూడా కొన్ని ఉన్నాయి.

సేకరించిన తెలుగు వ్యాసాలను నాలుగు ప్రధాన భాగాలుగా విభజించాము. 'కోరాడ వారి వంశం, జీవితం, రచనలు' ప్రథమ భాగం. దీనిలో మొదటి వ్యాసంలో రామకృష్ణయ్యగారి పూర్వీకులను గురించీ, ఆయన జీవిత విశేషాలను గురించీ, రచనలను గురించీ విపులంగా వివరించటం జరిగింది. ఈ విభాగం ఆరంభంలో రామకృష్ణయ్యగారి పితామహులైన కోరాడ రామచంద్రశాస్త్రిగారి 'ఉపమావళీ' అనే ఒక లఘు సంస్కృత కావ్యం, 'ఉన్మత్త రాఘవం' అనే సంస్కృత నాటకానువాదం కూడా చేర్చాము. ఈ ప్రథమ విభాగంలో ఉన్న మొత్తం 43 వ్యాసాలలోనూ పై మూడు వ్యాసాలూ కాక, రామకృష్ణయ్య గారి 30 ప్రసిద్ధ వ్యాసాలను ప్రచురించాము, వీటిలో 'కవిరాజ శిఖామణి - కావ్య కథా సూత్రము' అన్నది అముద్రిత లిఖిత ప్రతి నుండి ప్రప్రథమంగా ప్రచురితము.

ఈ విభాగంలోని తక్కిన 10 రచనలూ 'స్మృత్యంజలి' రూపంలో శ్రీ సి.నారాయణ రెడ్డి, శ్రీ ఎం.ఆర్. అప్పారావు, శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ వంటి ప్రముఖులు రచించినవి.

రెండవ భాగం 'భాషా సమాలోచనం'. ఈ విభాగంలో ఉన్న 8 వ్యాసాలలో శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి, శ్రీ తూమాటి దొణప్ప వంటి ప్రముఖుల రచన లున్నాయి.

మూడవ విభాగం 'సాహిత్య సమాలోచనం'. దీనిలో చేరిన 30 వ్యాసాలలో 3 సంస్కృత సాహిత్యాన్ని గూర్చినవి. ఒకటి కన్నడ సాహిత్యానికి సంబంధించినది. రెండు హిందీ సాహిత్యాన్ని గూర్చినవి. లంబాడీల సాహిత్యానికి సంబంధించిన వ్యాసం కూడా ఒకటి ఉంది. ఈ విభాగంలో శ్రీమతి పి. యశోదా రెడ్డి, శ్రీ పి.యస్.ఆర్. అప్పారావు వంటి ప్రముఖుల రచన లున్నాయి.

నాలుగో విభాగం 'సంస్కృతి సమాలోచనం'. దీనిలో మొత్తం 20 వ్యాసాలున్నాయి. శ్రీ భాష్యం అప్పలాచార్యులు, శ్రీ ఇంగువ కార్తికేయ శర్మ, శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి వంటి ప్రముఖుల వ్యాసాలు ఈ విభాగంలో ఉన్నాయి. 'రామాయణ పరమార్థం'. 'భారతీయ సౌందర్యతత్త్వం', 'చతుర్భాణి' వంటి మన సంస్కృతిలోని వివిధ ముఖాలను ప్రదర్శించే రచనలు ఈ విభాగంలో కనిపిస్తాయి. శంకరాచార్యుని కాల నిర్ణయం పునఃపరిశీలన, అలంపురం ఆలయ నిర్మాణ విశేషాలు, కృష్ణదేవరాయలు - నూతనాంశములు వంటి కొన్ని చారిత్రక వ్యాసాలను కూడా ఈ విభాగంలో చేర్చడం జరిగింది.

నాలుగు భాగాలుగా రూపొందిన ఈ తెలుగు వ్యాసాల తరువాత చివరి విభాగంగా ఆంగ్ల వ్యాసాలను చేర్చాము. ఈ విభాగంలోని 20 వ్యాసాలలోనూ మూడు కోరాడ వారి ఆంగ్ల రచనలు. తక్కినవి శ్రీ వి.ఐ. సుబ్రమణ్యం, శ్రీ ఇ. అన్నామలై, శ్రీ బి. రామకృష్ణారెడ్డి, శ్రీ శ్రీరామ్ శాంతి, శ్రీ కోట సుందరరామ శర్మ వంటి ప్రముఖులు రచించినవి.

మొత్తం 120 వ్యాసాలతో కూడిన ఈ సంపుటం సంపాదకులు తలపెట్టిన రెండు లక్ష్యాలనూ పరిమిత ప్రమాణంలో అయినా సాధించ గలిగితే సంపాదకులు కృతకృత్యులు అయినట్లు!

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి బహుముఖీన సరస్వతికి ఈ విధంగా ఉడుతా భక్తిగా అయినా సేవ చేసే అవకాశం ఈ సంపాదక సమితికి కల్పించినందుకు శతజయంతి ఉత్సవ కార్యదర్శి శ్రీ సుసర్ల గోపాలశాస్త్రి గారికి ఈ సమితి కృతజ్ఞతా బద్ధము.

కొన్ని వ్యాసాలు సకాలంలో అందనందువల్లనూ, కొన్ని పునరుక్తులుగా ఉన్నందు వల్లనూ, రచయితలు సాదరంగా పంపిన వ్యాసాలలో కూడా కొన్నిటిని ఈ సంపుటంలో ప్రచురించ లేకపోయినందుకు సంపాదక సమితి వారు చింతిస్తున్నారు. అలాంటి రచయితలు పెద్ద మనసుతో మన్నించగలరని విశ్వసిస్తున్నాము.

సంపాదకులు ముఖ్యంగా కృతజ్ఞత తెలుపుకోవలసినది అడుగగానే వ్యాసాలు పంపించి మాతో సహకరించిన రచయితలకు. నిజానికి ఆ రచయితల ప్రతిభా స్వరూపమే ఈ సంపుటం. సంపాదకులు కేవలం నిమిత్త మాత్రులు.

హైదరాబాదు **సంపాదక సమితి**

**31.10.1992**

# వ్యాసాల వరుస



## 'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు

## స్మృత్యంజలి



## భాషా సమాలోచనం



## సాహిత్య సమాలోచనం

## సంస్కృతి సమాలోచనం

## Selections from 'Korada'



## Language, Literature and Culture

# కోరాడ రామకృష్ణయ్యగారి వంశం - జీవితం - రచనలు

శ్రీ తిరుమల రామచంద్ర

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 1952 ఆగస్టులో ప్రారంభమయింది. దానిలో భాషా చర్చకూడ ఉండాలను కున్న సంపాదకులు ఒక పదాన్నో, పదబంధాన్నో మౌలి కంగా చర్చించాలని, ఆ చర్చ శాస్త్ర పరిభాషా జటిలం కాకుండా కథ చెప్పినట్లు ఉండాలని, వారపత్రికలో ఒక పుటకు మించరాదని, ఈ పనికి పూనుకోమని నన్ను ఆదేశించారు. ఈ సదవకాశం జారవిడువలేక ''నుడి నానుడి'' అనే శీర్షిక క్రింద వారం వారం ఒక పదాన్ని చర్చించడానికి పూనుకున్నాను.

అప్పుడు నాకు, చిన్ననాడు యాదృచ్ఛికంగా కన్నెమారా ।బరీలో తిరగవేసిన ''వాట్స్ డిక్షనరీ ఆఫ్ కమర్షియల్ । డక్ట్స్ ఇన్ ఇండియా, బర్మా అండ్ సిలన్'' అనే ఘంటువు గుర్తుకు వచ్చింది. అప్పుడు నేను దానిలోని పద పదార్థ విచారం చదివి నివ్వెర పోయాను. ఎంత గొప్ప పరిశ్రమ అది? అలాంటిది తెలుగులో ఉంటే ఎంత బాగుండును? - అని అనిపించింది. అది నాబోటి ఒంటరిగానికి, పరిమిత బుద్ధికి సాధ్యమా?

కాని, ''నుడి - నా నుడి'' శీర్షికలో పరిశ్రమించడానికి నా చిన్ననాటి ఆ డిక్షనరీ పరిచయం ప్రోత్సాహ మిచ్చింది. నేను ప్రతి పదాన్ని తెలుగు తోబుట్టువులలోని సమానార్థక సరూపపదాలతో తులనాత్మకంగా తరచి చూడడమేకాక పదం పుట్టు పూర్వాలను మానవజాతి పరిణామ చరిత్ర దృష్టితో కూడా తెలుసుకొనడానికి ప్రయత్నించాను. ఈ ప్రయత్నంలో ఎన్నో సందేహాలు పుట్టుకువచ్చేవి. వాటి నివారణ కోసం మద్రాసు విశ్వవిద్యాలయంలోని తమిళశాఖా ధ్యక్షులు శ్రీ సేతు పి గారి వద్దకు, తెలుగు శాఖాధ్యక్షులు శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారివద్దకు, కన్నడ శాఖాధ్య క్షులు శ్రీ మరియ ౖ భట్టుగారి వద్దకు పరుగులు తీసేవాడిని.

ఒకసారి కందులు గురించి వ్రాద్దామనుకున్నాను. సాయం కాలం కూర్చున్న వాణ్ని రాత్రి ఏడైనా ఏమీ తోచక కొట్టుకుంటున్నాను. వ్రాసి చింపిన కాగితాలు పక్కన పెద్దకుప్పగా పడి ఉన్నాయి. వ్రాత తక్కువయినా, కాయి తాలు చింపి పోగుచేయడం మాత్రం ఎక్కువే - అని నా శ్రీమతి అనంత లక్ష్మి విసుక్కుంది ఎప్పటిలాగే. నేను తిరువల్లిక్కేణిలో అక్బర్ సాహెబ్ వీధి మొదటి ఇంట్లో ఉండే వాడిని. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు సింగరాచారి వీధి, తేరువీధి కలిసే మూలలో ఉండేవారు. అది నేనున్న ఇంటికి ఫర్లాంగున్నర దూరంలో ఉంటుంది.

నేను ఏదో కొంప మునిగినట్లు లేచి సింగరాచారి వీధికి బయలుదేరాను. అప్పుడు రాత్రి పదిన్నర గంట కావచ్చు. రామకృష్ణయ్యగారి యింటి తలుపు తట్టాను. వారే వచ్చి తలుపు తీశారు. ''ఏమిటి? ఇంత హడావిడిగా వచ్చారు?'' అని ప్రశ్నిస్తూ, వసారాలో ఉన్న బెంచీ మీద కూర్చోమ న్నారు. ఈ బెంచీ ఎన్నో సాధారణ, విశేష, అత్యవసర సాహిత్య గోష్ఠులకు సాక్షి. ''ఏమీ లేదు. కందులు ఎలా వచ్చాయో తెలీలేదు. అందుకోసం - '' అని నేను నీళ్లు నమిలాను. ''దీనికేమిటి తొందర? ఈ అర్ధరాత్రి వేళే రావాలా? రేపు ఉదయం రావచ్చు గదా!'' అని మరొకరైతే అనేవారే. కాని, రామకృష్ణయ్యగారు ''ఓహో! అదా? ఆలోచిద్దాం'' అంటూ నా పక్కనే బెంచీ మీద కూర్చుని ఆత్మగతంగా ''ఇది కాబోలు. అదే అదే. మరి ఇదో! ఔను. అదే. అంతే!'' అని అనుకుంటూ, మధ్య మధ్య నాతో మాట్లాడుతూ ''ఇలా ఆలోచించండి. ఇలాటి వాటికి పేర్లు వాటి ఆకారం, రంగు మొదలయిన వాటిని బట్టి వచ్చి ఉంటాయి. పయిర్ - పెసర్ పచ్చరంగును బట్టి వచ్చిందేగా. ఇదీ అంతే కందు-కందిరీగ-కందెన'' అని అంటూ మళ్ళీ ఆలోచనలో పడ్డారు. చివరకు ''అంతే లేండి. కందులు కొంచెం ఎరుపు చాయలో ఉంటాయి. కదా! రంగును బట్టే వచ్చి ఉంటుందీ పేరు, ప్రస్తుతం ఈ ధోరణిలో ఊహిస్తూ మరికొన్ని పదాలు చూద్దాం'' అన్నారు.

పాల్! పాలమ్మా! - అంటూ పాలవాళ్ల కేకలు వినబడ్డాయి. నేను లేచి తప్పుచేసిన వాణ్ని గనుక వినయంగా ''తెల్లవార

వచ్చింది. మీ నిద్రపోగొట్టాను. మన్నించాలి. తెల్లవారగానే వ్రాయాలిగదా అని వచ్చాను. ఇంత పొద్దవుతుందని అనుకోలేదు'' అన్నాను. ''మరేం ఫరవాలేదు. నేనూ విద్యార్థినే. ఈ విషయంలో ఎప్పటికప్పుడు కొత్త సమస్యలు పుట్టుకు వస్తుంటాయి'' అని అన్నారు రామకృష్ణయ్యగారు అతి సహజ సరళంగా.

ఇదీ రామకృష్ణయ్యగారి భవ్య వ్యక్తిత్వం. ''రేపు యూనివర్సిటీకి రండి. చూద్దాం. ఈ అపరాత్రిలో కొంపేం మునిగింది?'' అని రెండు మాటల్లో నన్ను పంపి వేయవచ్చు. కాని వారిది అలాంటి స్వభావం కాదు. ''జిజ్ఞాసతో వచ్చాడు. సంతృప్తి పరచి పంపుదాం'' అనే సౌజన్యం వారిది. అంతటి విద్వాంసులయినా, నిరంతర విద్యార్థి వారు.

## కోరాడ వంశం - మూల పురుషుడు మహాదేవ శాస్త్రి

రామకృష్ణయ్యగారికి ఈ సౌజన్యం లోకవృత్త పరిశీలన వల్లనో, చదువువల్లనో అబ్బిందికాదు; ఆనువంశికమైనది. కోరాడ వంశంలో జనించిన వారందరూ - వారి పితామహ ప్రపితామహులందరూ అలాంటి సౌజన్య మూర్తులే. ''విద్య యొసగును వినయంబు'' అనే సూక్తికి అందరూ లక్ష్య భూతులే. కోరాడవంశం మూల పురుషుడు మహాదేవశాస్త్రి. రామకృష్ణయ్యగారి పితామహులైన రామచంద్రశాస్త్రిగారు తమ వంశాన్ని గూర్చి ఇలా చెప్పుకొన్నారు:

''కేశవ నిధ్యాన విశు
ద్ధాన్తరతా ప్రవృత్తితో విశదః,
కోరాడ ఇతి చ సంతతి
రభవ త్తస్యా మభూ న్మహాదేవః.''

కోరాడ వంశం కేశవ ధ్యాన విశుద్ధమైన మనఃప్రవృత్తి కలది. ఆ వంశంలో మహాదేవ శాస్త్రి జన్మించారు.

''స సర్వశాస్త్రప్రభవైకరూపః
శ్రీ దేవతా పాద సరోజ బంభరః,
స్వస్యాన్వ యోత్పన్న జనుష్మతాం మనా
గ్వ్యమూఢతా నోచిత మిత్యవేత్య సః.

శ్రీశైల గోత్రే భ్రమరాంబికాన్తే
మాలూర పత్రైర్విరసైః కృతాహృతిః,
శర్వాక్షి విజ్ఞేయ మితే రనారతమ్
చక్రేద్భుతం తద్వ్రత మిద్ధధైర్యకః''

ఆ మహాదేవశాస్త్రి శ్రీ విద్యోపాసకుడు, శ్రీ దేవతాపాద పద్మ భ్రమరాయమాణుడు. తన వంశంలో పుట్టే వారెవరూ విద్యావిహీనులు కారాదని విద్యాజ్ఞానవంతులు కావాల భావించి, శ్రీశైలంలో భ్రమరాంబికాసన్నిధానంలో ఎండ మారేడు దళాలు ఆహారంగా గ్రహించి ఇరవైయేడు దినాలు మహాధైర్యంతో అద్భుతమైన తపస్సు చేశాడు. అత తపస్సుకు భ్రమరాంబిక సంతుష్టాంతరంగ అయి ''ఏమి నీ వాంఛితం?'' అని ప్రశ్నించింది. అప్పుడు మహాదేవశా ఇలా విన్నవించారు:

''సర్వం హ్యదృష్టస్య వశం హి కామం
విద్యాస్తిచే త్సర్వ విపన్నివృత్తేః,
తయాప్యతే సర్వజనేషు మాన్యతా
యయేయతే సౌఖ్య మజస్రగమ్యమ్.

రాజానో బహు మానయంత్యయ మివా
జస్రం ద్రవ ద్రవ్యతః
స్వేకాజ్ఞాత పిశఙ్గ రూప కనకం
సత్పాండితిం పూరుషమ్,
తేనా త్యంత సుఖీ భవత్యవిరతం
యాచేన తత్సమ్ప దో
హేలా జాలవశీకృతే ప్రియతమే
చాశావికోద్భాసినీః.

యాచే భగీరథ రథానుగ జహ్ను కన్యా
ప్రోద్యద్ధురీ సహచరీ భవన ప్రకాణ్డామ్,
విద్యాం విధేహి దయయా మృతసారవత్యాం
హ్యాసప్తమా న్మమకులే ధ్రువపూరుషాణామ్.''

''దేవీ! అంతా అదృష్టానికి లోబడిందనే మాట నిజ కాని, విద్య ఉంటే సకల విపత్తులు తొలగుతాయి. విద్య సకల జనుల ప్రశంస పొందవచ్చు. దానివల్ల సకల సౌఖ్యా నిరంతరం కలుగుతాయి. బంగారు ద్రవించిపోయేది కావ వల్ల కాలిస్తే పచ్చని రూపం పోతుంది. విద్య అటువం కాదు. కనుక సత్పాండిత్యం కల వాడిని రాజులు నిరంత గౌర విస్తారు. అందువల్ల, నేను విలాసాలతో మనను మభ్యపెట్టే మెరుపుల్లాంటి సంపదలను కోరను. భ రథాన్ని వెన్నంటి వచ్చిన గంగానదీ ధురీ సహచరి అ అమృత సారవతి అయిన విద్యను ఏడు తరాల వ అనుగ్రహించు''. ఈ ప్రార్థనను మన్నించి దేవి ఆ అనుగ్రహించింది. కనుకనే ఈ వంశం పండిత శిఖామణ ఆకరమై విరాజిల్లింది.

మహాదేవ శాస్త్రి తర్వాత అపరిగ్రహ దీక్షితుడు అల్లాడ అనేవారు సకల శాస్త్ర పారంగతులయినా, పరులకు జాపడానికి ఇష్టంలేక దరిద్రంగానే జీవితం గడిపారు.

యేళ్లు వచ్చాయి. షష్ట్యబ్ద పూర్తి చేసుకొందామనే కోరిక కలిగింది. ఈ సంగతిని ఆ గ్రామ ప్రజలు కనిపెట్టి, ఆయనతో శతఘంటా శతావధానం చేయించారట. ఆ సమయంలోనే ఆయన ''శత ఘాంటిక చూడామణి'' అనే బిరుదు పొందారట. గ్రామ ప్రజలు ఆయనకు కొంత భూమిని దానమివ్వా లనుకున్నారట. దానికి కూడ ఆయన ఒప్పుకోక పోగా, ప్రజలు బలవంతపెట్టి ''కన్యను, విద్యను, భూమిని పరిగ్రహిస్తే ఏ దోషమూ లేదు. దీనివల్ల మీ అపరిగ్రహత్వానికి భంగం కలుగదు'' అని నచ్చజెప్పి, పుట్టెడు భూమి ఇచ్చారట. ఈ అల్లాడశాస్త్రిగారు చెప్పిన శ్లోకమొకటి తమ మాతామహుల వలన విన్నానని రామచంద్రశాస్త్రిగారు తెలి పారు. ఆ శ్లోకమిది:

కమల సమశయానః పాద్విరాడాశయానః
స్వభరణ వశయానః ప్రోష్ఠితోసంశయానః,
వరమధికశయానః క్షత్రపాశాశయానో
ప్యధిజలధిశయానః పాతు పక్షీశయానః.

## తారకమంత్రోపాసకులు లక్ష్మణశాస్త్రి

ఈ అల్లాడశాస్త్రి కుమారుడు జగన్నాథశాస్త్రి ''నిజాంత ర్వాణిత్వ ప్రథిమ విధుతాశేష విభవా విరాజంతే కీర్తి స్థగిత సకలాశాంత వివరాః'' దిగంత వ్యాప్త కీర్తిగలవారట. ఈ జగన్నాథశాస్త్రికి ఇద్దరు కుమారులు. వీరిలో పెద్దవారు సూరిశాస్త్రి. ఈయన వారణాసికి వెళ్ళి గౌతమతర్కంలో అఖండ పాండిత్యం సంపాదించారు. ఈయనకు సంతతిలేదు, రెండవ వారి పేరు అంబాదాసు. ఈయనకు సూరిశాస్త్రి, లక్ష్మణశాస్త్రి అని ఇద్దరు కుమారులు. వీరిలో సూరిశాస్త్రి వేదాధ్యయనం జేసి శాస్త్రాధ్యయనం చేద్దామనుకున్నారు. కాని తండ్రి గతించడం వల్ల, దేశం క్షామపీడితం కావడంవల్ల శాస్త్రాధ్యయనం చేయలేక పోయారు. తిండికోసం పోరాడవల సివచ్చింది. వీరితల్లి వీరిద్దరినీ పిలుచుకొని గతిలేని వారికి రాజే గతి అన్నట్లుగా, కాటిరేవు కోనరాజు వద్దకు బయలుదేరింది. కాని, దారిలో దొంగలు వారిని చుట్టుముట్టి తల్లిని, సూరిశాస్త్రిని చంపివేశారు. చిన్న వాడయిన లక్ష్మణశాస్త్రి ఏ విధంగానో దొంగల బారినుంచి తప్పించు కొని ఆరాజు వద్ద చేరారు. అతని ఆదరంతో ఉద్యోగం సంపాదించారు. రాజు నాలుగు వేల రూపాయలు ఇస్తానని వాగ్దానం చేశాడు. కాని దురదృష్టవశాత్తు కోనరాజుకూ, అతని సోదరులకు కలతలు ఏర్పడ్డాయి. ఆ పరిస్థితిలో అచ్చట ఉండడం తగదని లక్ష్మణ శాస్త్రికి తోచింది. ఆయన వెంటనే కోనరాజు ఇస్తానన్న నాలుగువేల రూపాయలు కూడ తీసుకోకుండా ఆ ఊరు వదిలారు. పిదప దేశాటన చేస్తూ, వివిధ పట్టణాలను చూస్తూ, ఎక్కడో ఒక యోగీంద్రుని నుంచి రామతారక మంత్రం ఉపదేశం పొంది, కొంత కాలానికి స్వదేశానికి తిరిగి వచ్చి, వివాహం చేసుకొని అత్త వారింటనే ఉండిపోయారు. ఈయనకు ముగ్గురు కుమారులు. పెద్దవాడు రామచంద్రశాస్త్రి, రెండవవాడు రామకృష్ణశాస్త్రి. మూడవవాడు సుబ్బరాయడు.

రెండవ వాడయిన రామకృష్ణశాస్త్రికి బాల్యంలో చదువుపై ఆసక్తి ఉండేది కాదుట. సోమరిగా తిరిగే వాడట. ఈ తిరుగుళ్ళు సహించలేక అన్న అయిన రామచంద్రశాస్త్రి చెంపలు వాయించారట. దానితో అతనికి రోషం వచ్చింది. ఇల్లు వదలిపెట్టి ఎక్కడెక్కడో తిరుగుతూ చివరికి వారణాసి చేరి శాస్త్రాధ్యయనం మొదలు పెట్టాడట. ఒక సంవత్సరం లోనే వ్యాకరణ శాస్త్రంలో సంపూర్ణ పాండిత్యం సంపాదించి శాస్త్ర చర్చలు చేసేవాడని ఉత్తరాలు వచ్చేవట. మరొక ఏడు గడిచే వేళకు న్యాయాదిశాస్త్రాలలోను అపార పాండిత్యం సంపాదించి కాశీరాజు సభలో జరిగిన శాస్త్రచర్చలో పండితులను అందరినీ ఓడించినట్లు ఉత్తరాలు వచ్చాయట. ఉత్తరాల వల్ల అతని పాండిత్య ప్రకర్ష తెలిసి అతని అన్న రామచంద్రశాస్త్రి, తక్కిన వారు మహానంద పరవశులై అతనికి వివాహ ప్రయత్నం చేయసాగినారట. మరికొంత కాలం గడిచేటప్పటికి అతని పాండిత్యానికి ఇందోర్ రాజు హోల్కార్ మెచ్చి ఆస్థాన పండితునిగా నియమించి పిలుచుకొని వెళ్ళాడని, కొంతకాలం తరువాత హఠాత్తుగ మరణించాడని తెలియవచ్చింది. తమ్ముడు మరణించాడనే దుఃఖం రామచం ద్రశాస్త్రిగారిని పిచ్చివానిని చేసింది. ఆయన దుఃఖావేశంతో మైమరచి వీథులలో పొర్లారట.

## రామచంద్ర కవిగారు

కోరాడ వంశాన్ని మహోజ్జ్వలం చేసినవారు రామచంద్ర శాస్త్రిగారు, ఈయన 1816 యువ సంవత్సరం ఆశ్వయుజ శుద్ధ దశమి గోదావరి జిల్లా అమలాపురం తాలూకా కేశనకుఱ్ఱు గ్రామంలో జన్మించారు. బాల్యమంతా మాతామహుల ఇంటనే గడిచింది. అక్కడే 12వ ఏట తమ తండ్రి వద్ద శ్రీరామ మంత్రం ఉపదేశం పొందారు. ఎంతో ఆసక్తితో పునశ్చరణ చేశారు. మాతామహుని వద్దనే రఘువంశం ప్రారంభించారు. తరువాత సమీపంలో ఉండే తండ్రిగారి స్వస్థలమైన నడవపల్లికి వచ్చారు. అక్కడ సోమయాజుల సూరన్నగారనే విద్వాంసుల వద్ద కావ్యవ్యాకరణాదులు అభ్యసిస్తూ, అప్పుడప్పుడు శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారి వద్ద అలంకార శాస్త్ర గ్రంథాలు చదువుతూ, కవిత చెప్పడం అలవరచుకొన్నారు. సూరన్న శాస్త్రి గారితో కావ్యపాఠం చదువుతూ పొలానికి పోయి,

తిరిగి వచ్చేటప్పుడు కొన్ని శ్లోకాలు అల్లి ఆయనను (సూరన్న శాస్త్రిగారిని) దిద్దండనే వారట. గురువుగారు ఆశ్చర్యపడి ఆ శ్లోకాలు దిద్దడానికీ తాను తగిన వాడిని కానని, పెద్దల వద్దకు పోతే నీ కవిత్వానికి ప్రోత్సాహం ఉంటుందని చెప్పేవారట. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి గారు మహాకవి. గంగా ప్రవాహం వంటి ఆయన కవితా ధారే రామచంద్రశాస్త్రి గారి కవితకు ప్రోత్సాహమి ।నట్లు తోస్తుంది. ఈ కవితా సంబంధంతోనే రామచంద్రశా' శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారి శిష్యులయ్యారు. ''శ్రీ శిష్టు ంశాబ్ది శశికరుడు సకల విద్యాజన్మసద్మాయమాన జిహ్వాంచలు డమిత కావ్యాళికర్త యయిన శ్రీ కృష్ణమూర్తి పదాబ్జసేవనాత్త సద్గ్రంథ కల్పనాయత్త సుమతి విరచిత శ్రవ్యదృశ్యాత్మ వివిధ కావ్యుడు'' అని తనను చెప్పుకొన్నారు రామచంద్రశాస్త్రిగారు.

ఇలా కొంతకాలం జరిగింది. కొందరు మిత్రులు రామచంద్రశాస్త్రి గారిని వివాహ ప్రయత్నం చేయమని ప్రోత్సహించారు.

శ్లో. త్వం సాహిత్య పరోసి సాధు కవితా
ధుర్యోసి తే వాగ్మితా
సిద్ధా ప్రవ్రజ చెన్న పట్టణ పురీం
విద్యాలయే హూణకాః,
అధ్యాస్యాధ్యక్షమాయ విత్తబహులం
దత్వా పరార్థం వరం
తేన స్యాత్త్వవ సత్కళత్ర విభవః
తస్మా దిహైతత్కురు.''

''నీ తండ్రి బీదవాడు కనుక నీకు వివాహం చేయలేదు. నీవు సాహిత్య పరుడివి. మంచి కవిత చెప్పడంలో సమర్థుడివి. మంచి వాగ్మివని జనంలో ఖ్యాతి పొందిన వాడివి. చెన్న పట్టణానికి వెళ్లు. అక్కడ ఆంగ్లేయులు అర్హుడయిన నీకు విరాళంగా డబ్బు ఇస్తారు. దానివల్ల నీవు సత్కళత్రాన్ని వివాహమాడవచ్చు. అలా చేయి'' అని మిత్రు లన్నారు. మిత్రుల ప్రోద్బలంతో ఈయన సంపాదనకై చెన్నపట్నం వెళ్లడానికి సిద్ధమయ్యారు. ఆ సమయంలో ఈయన కవితల యెడ అత్యంతాసక్తి గల శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారు ఈయన చెన్నపట్నం ప్రయాణం సంగతి విని తన పరిచితులయిన రామచంద్రపురం రాజుల ఆస్థానంలో ప్రవేశానికి ఒక లేఖ వ్రాసి, దీనివలన నీ కార్యం సఫలమౌతుందని తత్‌క్షణమే ఒక భటుని చేతి కిచ్చి పంపారట.

రామచంద్రశాస్త్రిగారు ఆ లేఖ తీసుకొని ఆరాజు వద్దకు బయలుదేరారు. ఇంతలో దేశంలో గాలివానలు విజృంభించి క్షామం సంభవించింది. అందువల్ల ఆ రాజు ఈయనతో ''రెండు నెలలపాటు మా ఆస్థానంలో ఉండండి. తర్వాత చూస్తాను'' అన్నాడు. రామచంద్రశాస్త్రిగారికి అక్కడ ఉండడం నచ్చలేదు. పండితులకు చెన్నపట్నంలో మున్సిఫ్ పదవి ఇస్తారనే వదంతి విన్నారు. వెంటనే మళ్ళీ చెన్నపట్నా నికే బయలుదేరారు. దారిలో బందరు (మచిలీపట్నం) చేరారు. అప్పటికి తమ వద్ద ఉన్న సొమ్మంతా వ్యయమ యింది. వెనుకటి దినం భోజనం కూడ లేదు. కనుక బాగా అలసిపోయారు. కాని, ఊరు కొత్త. ఆత్మగౌరవం, స్వాతంత్ర్యం పాలు ఎక్కువ. కనుక ఎవరినన్నా యాచిద్దా మన్నా మనసొప్పలేదు. ఏమీ తోచక గొడుగు పేట మల్లేశ్వరస్వామి ఆలయానికి వెళ్లి దర్శనానంతరం విశ్రమించి, సాయంకాలం అయ్యేవేళకు ఈశ్వర స్తుతి రూపాలయిన కొన్ని శ్లోకాలు చదువుతూ కూర్చున్నారు. ఆ శ్లోకాల ధ్వని వీథిలో పోయేవారికి కూడా వినిపించింది. అప్పుడు ప్రభల అప్పన్నశా స్త్రిగారు అనే విద్వాంసులు ఆ దారిన పోతూ, రామచంద్రశాస్త్రి గారు పఠిస్తున్న శ్లోకాలు విన్నారు. ఆ వాగ్ధాలానికి ఆశ్చర్యపడి గుడిలో ప్రవేశించి ''మీరెవ్వరు?'' అని ప్రశ్నించారు. ''నేనెవ్వరైతే ఏమివని?'' అని రామచంద్రశాస్త్రి సమాధానం చెప్పక ఎదురు ప్రశ్నవేశారు.

కాని, అప్పన్న శాస్త్రిగారు అంతతో వదలలేదు. బలవంతం చేశారు, సంగతి వివరంగా చెప్పమని. రామచంద్ర శాస్త్రిగారు ఇక గత్యంతరం లేక, తమ చెన్నపట్టణ యాత్రా కారణం చెప్పారు. అప్పన్నశాస్త్రిగారు ఈయన కవితా ధారకు, స్వతంత్ర బుద్ధికి ఆశ్చర్య పడుతూ, ఎంతో వాత్సల్యంతో నవ్వి, ''ఒకపూట భోజనానికే ఇతరులను ఆశ్రయింపలేని వాడివి చెన్నపట్టణానికి పోయి మునసఫీ సంపాదించగలవా?'' అని ఛలోక్తి విసిరి, లేలే అంటూ ఈయనను తన యింటికి పిలుచుకొనిపోయి, తన భార్యను పిలిచి ఈయనను పుత్ర వాత్సల్యంతో చూడమని చెబుతూ ఆమెకు ఇతనిని అప్పగిం చారు.

రామచంద్రశాస్త్రిగారు ఆ యింట్లో కొంత కాలం భోజనం చేస్తూ తర్వాత వారాలు చేసుకొని ఇంగువ రామస్వామి శాస్త్రి అనే గొప్ప మంత్రశాస్త్రవేత్త వద్ద మంత్రశాస్త్ర గ్రంథాలు చదివారు. వివాహ ప్రయత్నాలు కూడ చేశారు కాని, కలిసి రాలేదు. అక్కడి వారంతా ఆయనన ''చెన్నపట్నం ప్రయాణం ఎందుకు? ఇక్కడే ఉండి పొండి!' అని బలవంతం చేశారు. ఆయన వారి మాటలు కాదనలే! అక్కడే ఉన్నారు. ఈయన ప్రతిభ నానాటికీ విస్తరించింది వర్ఘెం అద్వైత పరబ్రహ్మశాస్త్రి అనే వారు ఈయనకు వివాహం కోసం వంద రూపాయలు ఇవ్వదలచి తనతో కొంత వాక్యార్థ

చేయమన్నారు. ఆ వాక్యార్థంలో రామచంద్రశాస్త్రిగారికి ఆయనతో ఒక అంశంలో ఏకీభావం కుదరలేదు; ఆయన వాదం దుర్బలమని ఆక్షేపించి సమర్థించలేదు. అద్వైత పరబ్రహ్మశాస్త్రి కోపగించుకొని చేస్తానన్న సహాయం దానితో చేయలేదు. అప్పుడు కొందరు మిత్రులు రామచంద్రశాస్త్రిగారితో "కార్యం ఫలోన్ముఖంగా ఉండగా, ఆయనతో ఇలా భేదించడం కార్యసాధకుని లక్షణం కాదు. ఆయన వాదాన్ని అంగీకరించండి" అని అన్నారు. కాని, శాస్త్ర విషయం గనుక దానికి అంగీకరించలేదు. కాని, అద్వైత పరబ్రహ్మశాస్త్రి గారే కొందరి సలహాపై మనసు మార్చుకొని రామచంద్రశాస్త్రి గారికి వాగ్దానం చేసిన వంద రూపాయలూ ఇచ్చారు. ఈ డబ్బుతో ఈయన వివాహం కోసం స్వస్థలానికి బయలుదేరారు. దారిలో అమలాపురంలో గొడవర్తి నాగేశ్వరావధాను లనే వారు ఈయన ప్రఖ్యాతిని విని కన్యను ఇస్తామని అన్నారు. "తలిదండ్రుల అనుమతి పొంది తెలియజేస్తాను" అని రామచంద్ర శాస్త్రిగారు స్వస్థలమైన నడవపల్లికి బయలుదేరారు.

రామచంద్రశాస్త్రిగారు ఇల్లుచేరిన వార్త వెంటనే గ్రామమంతా వ్యాపించింది. ఆప్తులందరూ ఆనందించారు. కొందరు అసూయాభిహతులు "ఇతడు ఇంతలో ఇంతవాడయ్యాడా?" అని కుములసాగినారు. రామచంద్రశాస్త్రిగారు ఒకనాడు స్నానార్థం ఏటికి పోతుండగా, ఆ అసూయాదగ్ధులు అడ్డు వచ్చి, "నీవు కవిత్వం చెబుతావట. అవధానం చేయగలవా?" అని ప్రశ్నించారు. ఈయన వారి ఆతురతకు ఆశ్చర్యపడి, "అలాగే. భోజనం అయింతరువాత కూర్చుందాం". అన్నారట. కాని వారు దానికి ఒప్పుకోలేదు. "నీవు అందుకు సమర్థుడివైతే నిలుచున్న పళంగానే చెప్పి కదులు!" అని బలవంత పెట్టారు. "అట్లయితే లేఖకులను పిలిపించండి. నేను చెప్పే పద్యాలు వ్రాసుకోవాలి గదా!" అని శాస్త్రి గారన్నారట. అప్పుడు అసూయాపరులు ఆ ఊరిలోని వారందరినీ పిలిపించగా, అరనై ఏడుగురు ఘంటాలు ఆకులతో వచ్చారు. అందరూ సమీపంలో ఉన్న నడవపల్లి దేవాలయంలో సమావేశమయ్యారు. శాస్త్రిగారు వెంటనే ఒక్కొక్కపాదం చెప్పడం ప్రారంభించి సూర్యాస్తమయం అయ్యేటప్పటికి 107 పద్యాలు ముగించారు. సభలోని ఒకరు "ఇంకా పద్యాలు చెప్పగలవా?" అని ప్రశ్నించారు. "ఆ! చెప్పగలను. ఈతకు లోతేమిటి?" అని సమాధాన మిచ్చారు శాస్త్రిగారు. ఈ శతావధానం చూచి ఆశ్చర్యపడినవారిలో కొందరు నలభై రూపాయలు శాస్త్రిగారికి కానుక సమర్పించారు.

శాస్త్రిగారు మళ్లీ వివాహం కోసం ధన సంపాదన ప్రయత్నం చేశారు. ఒక వైశ్యుడు నలభై రూపాయలు అప్పివ్వడానికి ఒప్పు కొన్నాడు. అమలాపుర వాస్తవ్యులయిన గొడవర్తి నాగేశ్వరావధానుల కుమార్తెతోనే శాస్త్రిగారికి వివాహం జరిగింది. వివాహమైన వెంటనే, వివాహం కోసం చేసిన అప్పు తీర్చడానికి సంపాదించాలి. కనుక సంపాదనార్థమై ఆయన నిజాం ప్రాంతంలోని సంస్థానాలకు బయలు దేరారు. దారిలో బందరు చేరారు. అక్కడ నోబిల్ పాఠశాలలో పండితులుగా ఉన్న పూర్వపరిచితులు పసుమర్తి ఉమా మహేశ్వర శాస్త్రిగారు రామచంద్ర శాస్త్రిగారిని కలుసుకోడం తటస్థించింది. అప్పుడు ఆ పాఠశాలాధ్యక్షుడు మరొక పండితునికోసం అన్వేషిస్తున్నారు. అందు వలన రామచంద్ర శాస్త్రిగారి నిజాం ప్రయాణం ఆపి, ఆయనను ఆ పండిత పదవిలో నియమించేట్టు ప్రయత్నించాలని ఉమామహేశ్వర శాస్త్రిగారు అప్పన్న శాస్త్రి గారితో ప్రస్తావించారు. అప్పన్న శాస్త్రిగారికి రామచంద్ర శాస్త్రి స్వభావం తెలుసు కనుక ఆయన "నీకు రాజుల ఆశ్రయం పొందే నేర్పు, ఒకరిని యాచించి ధనం సంపాదించడానికి కావలసిన తంత్రజ్ఞానం తక్కువ. అలాటి పోకడలు మానుకో." అని బలవంతపెట్టి ప్రయాణం ఆపివేయించి, నోబిల్ గారితో ఈయన పాండిత్యాదులు చెప్పి, పండిత పదవి ఇప్పించారు. నోబిల్ గారు "ప్రారంభంలో ఏడు రూపాయలు వేతనం. క్రమంగా వృద్ధి చేస్తాము" అన్నారు. రామచంద్ర శాస్త్రి గారు అంగీకరించి ఆ ఉపాధ్యాయపదవిలో చేరారు.

శాస్త్రిగారు అది మొదలు ఆ పాఠశాలలో ఒకే రీతిగా, నలభైమూడేండ్ల పాటు అధికారుల మన్నన పొందుతూ, ఆత్మ గౌరవ స్వాతంత్ర్యాలు కాపాడుకొంటూ, ఆ పాఠశాల కళాశాలగా మారినప్పుడు, దానిలో ప్రధానాంధ్ర పండితులయి, వేతనం క్రమంగా నలభై రూపాయిలకు పెరగగా, తమ కాలమంతా అధ్యాపనంలోను, గ్రంథ రచనలోను వెళ్లబుచ్చుతూ, జీవితం సుఖంగా గడిపారు. పెక్కు సంస్కృతాంధ్ర గ్రంథాలు రచించి 1900 లకు సరైన శార్వరి సంవత్సర శ్రావణ మాస బహుళ పాడ్యమినాడు కీర్తి కాయులయ్యారు.

## శాస్త్రిగారి ఆత్మగౌరవం

శాస్త్రిగారు ఆ పాఠశాలలో ఉన్నంతకాలం యూరోపియను అధికారులు వారిని అత్యంత గౌరవంతో చూచారు. మిషనరీలలో స్వమత స్థాపనోద్యమమే కాని, పరమత దూషణ చింత అంతగా లేని ఆ కాలంలో ఏ మతం వారు ఆ మతాన్ని

పట్టుదలతో అనుసరించడం అసూయా హేతువయ్యేది కాదు. కనుక మిషనరీలైనా ఈయనతో మాట్లాడవలసి వచ్చినప్పుడు కొంత దూరం నుంచే మాట్లాడుతూ, ఆయన నైష్ఠికతను, మతాచారానుసరణనూ గౌరవించేవారు. శాస్త్రిగారు కూడ వారి ఎడల అత్యంత గౌరవంతో ప్రవర్తిస్తూ, తన స్వాతంత్ర్యానికి గాని, నైష్ఠికతకు గాని ఎట్టిలోపమూ రానీక స్వధర్మాచరణంలో అప్రమత్తులై ఉండేవారు.

ఒకసారి కళాశాలాధ్యక్షులు నోబిల్‌గారు ఒక శ్లోకాన్ని రెవరెండ్ మంచాల రత్నంగారి కిచ్చి దాని అర్థం తెలుసుకొని రమ్మని శాస్త్రిగారి వద్దకు పంపారు. శాస్త్రిగారు దానికి తగినట్లర్థం చెప్పి పంపారు. నోబిల్ గారు తమకు అభిమాన పాత్రుడైన మరొక పండితుడు చెప్పిన అర్థం చెప్పి, ''ఇలా చెప్పకూడదా?'' కనుక్కొని రమ్మని రత్నంగారిని మరల పంపారు. ''ఆ అర్థం అక్కడ పొసగదు'' అని స్పష్టంగా చెప్పి పంపారు శాస్త్రిగారు. నోబిల్‌గారికి కొంచెం కోపం వచ్చింది. స్వయంగా వచ్చి అర్థం అడిగారు. ''తప్పు తప్పేగాని, మీరు వచ్చి అడిగినంత మాత్రాన ఒప్పు అవుతుందా?'' అని బదులు చెప్పారు. తాము చెప్పిన అర్థం కాదని, తమను గూడ ధిక్కరించాడు ఈ శాస్త్రిగారు అని నోబిల్‌గారు అపోహపడి, ఆయనను కళాశాలనుంచి తొలగించడానికి ప్రయత్నించారు. కొందరు స్నేహితులు ''ఆయన పాండిత్యం అగాధం. శాస్త్రంలో అంత స్వాతంత్ర్యం ఉండడం వల్లనే అంత నిరూఢిగా చెప్పారు. మిమ్మల్ని ధిక్కరించే తలంపు లేదు. ఆయనను తొలగిస్తే ఇంతటి పండితుడు దొరకడం కష్టం!'' అని నోబిల్ గారికి నచ్చ జెప్పగా, ఆయన శాంతించాడు.

## మాడభూషి వారితో వాదం

శాస్త్రిగారు యశోలుబ్ధులు, ధనకాంక్షి కానందువల్ల తనపాండిత్యాన్ని చాటు కొనకపోయినా, ఆయన శిష్యులయిన కళాశాలా విద్యార్థులకు ఆయన ఎడల గల గౌరవంతో ఆయన ఖ్యాతి అచ్చటచ్చట వ్యాపించింది. పూర్వంనుంచి మన పండితులలో అన్య పరాభవేచ్ఛ ఎక్కువ. ఒకప్పుడు, ఏకసంథాగ్రాహి, విద్వానిత్యాద్యనేక బిరుదాంకితులు, సుప్రసిద్ధులు అయిన మాడభూషి వేంకటాచార్యులవారు రామచంద్ర శాస్త్రిగారిని గురించి చాలా విన్నప్పటికీ, అసూయాగ్రస్తులై కాబోలు ఆ కళాశాలలో అపుడు విద్యార్థులయి వున్న వెచ్చా గోపాల కృష్ణమ్మ, ధర్మపురి గార్ల చేతికి

శ్లో ''చింతకాయ కలేకాయి బీరకాయత మారికే,।
ఉచ్చింతకాయ వాక్యాయ సాధకాయ తమంజలిమ్. ॥''

ఇత్యాది శ్లోకాలను, సమస్యలను ఇచ్చి రామచంద్ర శాస్త్రిగారిని ఉద్దేశించి, ''పండితుడెవడైనా ఉంటే, వీటికి అర్థం వ్రాసుకొని రమ్మని'' ఇచ్చారు. శాస్త్రిగారు వాటికి అనేక విధాలుగా అర్థాలు వ్రాసి యిచ్చి,

శ్లో. ''కమల సమ శయానః పాద్విరాడాశయానః
స్వభరణ వశయానః ప్రోజ్ఝితో సంశయానః,।
వర మధిక శయానః క్షత్రపాశాశయానో
వ్యధి జలధి శయానః పాతు పక్షీశయానః. ॥''

అనే తమ పూర్వుల శ్లోకాన్ని,

శ్లో. బర్హిశ్యావ్య విత్త మారుట్కలయ
పృథుగణం చాధ్వరే దైవమేతి
ప్రీతిం కీదృక్స్వవర్గం నవహతి చ
హితః కోత్ర బింబం చ కీదృక్,।
కిం సాధు స్వత్విపాసుం వదతి
హలిన మా కారయాన్యోనతం కిమ్
లాంతం కిం వక్తి మత్స్యం పదమవతు
సతత్రశ్న కార్యాభిధో వః. ॥''

అనే శ్లోకమూ ఇచ్చి వాటికి అర్థం వ్రాయించు కొని రండని ఆ విద్యార్థులచేతనే పంపారు. వాటికి బదులు రాలేదు.

## శిష్టువారికి ఏకలవ్య శిష్యత్వం

నోబిల్ పాఠశాలలో పండితులుగా ఉన్న పసుమర్తి ఉమా మహేశ్వర శాస్త్రిగారు అప్పుడప్పుడు కఠిన సమస్యలను ఇచ్చి రామచంద్ర శాస్త్రిగారు పూర్తిచేసినప్పుడు చాల సంతోషించేవారు. ఎవరైనా అలాటి కఠిన శ్లోకాలు గాని, సమస్యలు గాని తెస్తే ''పొట్టి శాస్త్రులను అడగండి!'' అని ఆయన వద్దకు పంపేవారు. శ్రీ శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారికి రామచంద్ర శాస్త్రిగారిపై గల ఆదరాన్ని గురించి ఇది వరకే పేర్కొన్నాను. ఈయనకు ఆయన ఎడల గల భక్తి ఈయన గ్రంథాలలోని గురుస్తుతులలో వ్యక్తమవుతున్నది. 'శృంగార సుధార్ణవ' మనే భాణంలో ఈయన కృష్ణమూర్తి శాస్త్రి గారిని గురించి ఇలా చెప్పారు:

శ్లో. యేన స్వైర మకారి సారశరణం
వేదాననం శక్ర వై
రూప్యా దాత్ర సరస్వతీ స్వజనితాం
సీతా పరం ప్రాణితా,
సత్కానాద కలా భవత్కృత పరి
ష్వంగేవ గాంధర్వికా

మీమాంసా సరణౌ పదాని మృదితా
న్యశ్రాంత మశ్రాంతితః.

తాదృక్కిష్టకుల ప్రకాశన కరః
శ్రీసక్తి నిత్యోత్సవః
స్వచ్ఛందం వసుదేవపోషణ మనా
శ్చంచ త్కలా భావుకః,
దృప్య త్పూర్వబుధ ప్రథాహృతి లస
త్సౌందర్యన శ్రీ కరః
శ్రీ కృష్ణ స్సుమనశ్శిరోమణి రిరా
కామి ప్రసూనుః పరమ్.

శ్లో. యద్వాగ్గుంభా శ్శుశుంభుః
భుజగపరిబృధాక్షీణ సంక్షేమ భావో
త్పుష ప్రత్యర్థి దృప్య
త్కనకధరలసచ్ఛృంగ భంగాధి సృష్టౌ,
ప్రోద్యజంఝానభస్వ
ద్రమణగణలసద్గుంభ శుంభత్స గర్వాః
ప్రావృడ్ధారాధరౌఘోద్భవ
దశని సమార్భట్య ధిక్షేపదక్షాః.

శ్లో. శరద్వ్యా కోచాం భోజనివన
విహారోన్మద సిత
చ్ఛద క్రేంకారాహం కృతి హృతి
కలా కల్పకలనాః,
ప్రియాలోకోల్లాసి స్మర తదభికా
కర్షణ మనః
కురంగాక్షీ పాదాంగద
మధుర శింజా సహచరాః.

శ్లో. తదనుగ్రహ వారితాజ్ఞతా
జనితాంచత్కవితావతారకః, ।
కృతిగుంభిత మాధురీ భరో
వరకౌండిన్య శుభాన్వయోదయః.

## కృత్యాదులలో గురుస్తుతి

రామచంద్ర శాస్త్రిగారు తాము రచించిన 'దేవీ విజయః' అనే కావ్యంలో శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారిని గురించి ఇలా స్తుతించారు:

శ్లో. శ్రీ శిష్టు వంశ కమలాకర వాసరేశం
శ్రీకృష్ణ మూర్తి గురు మాగమ చారుచర్యమ్,
నానా ప్రబంధ పరి కల్పన విత్త వృత్తం
సేసేయ కృష్ణమివ తం దయితార్థ సిద్ధ్యై.

రామచంద్ర శాస్త్రిగారు తాము మంత్ర శాస్త్ర గ్రంథాలు అధ్యయనం చేసిన గురువులు శ్రీ ఇంగువ రామస్వామి శాస్త్రిగారిని గురించి చెప్పిన శ్లోకాలు ఇవి:

శ్లో. "శ్రీహింగు వంశ విమలోపల మాత్మతత్త్వ
జ్ఞానాంతరం సరసధీక మనీషి వంద్యమ్,
నానా కలామృతకరం ద్విజరాజ రామ
స్వామీతి సద్గురు మజస్ర ముపాశ్రయేహమ్.

శ్లో. శ్రీ గురు గురుతర కరుణా
పాదిత కవితాంకురః ప్రణమ్య బుధాన్,
కోరాడ రామచంద్రో
లక్ష్మణ సుబ్బాంబయో స్సుతః ప్రథమః.

బాణ ముఖ రూపకాణాం
నిర్మాతా శ్రీ మహేశమతి నిరతః,
దేవీ విజయో నామ
ప్రబంధ మిహ కర్తు మాత్త చిత్తో స్మి."

శాస్త్రిగారి మృత్యుంజయ విజయ కావ్యప్రారంభంలోని గురుస్తుతి ఇది

శ్లో. కుంభకర గండగమన్తైః
కుచోరు కటి యాన మఖిల మనుకుర్వన్,
ప్రేయస్యాః ప్రత్యూహో
ధ్వాంతాదిత్య స్సదిశతు మమ భద్రమ్.

గంగాధర సూనోస్తవ
కుంభభృతి శిరసి నయుగళం స్థానే,
ఇతి సమ్మదయా ప్రియయా
త్వత్సక్తిరసః కరశ్చ తామవదత్.

స జయతి గిరిజని వనితా
హృత పార్శ్వ స్ఫురిత కామనో దేవః,
పతిహృది రుదిత రతీ క్షమ
జల శమితాళిక దృగగ్ని సంరంభః.

నిజకర సంప్రేషణతః
తమసి నిమగ ం భువన మపి స దేవః,
దయయా సము ˣన్ కృత
నమసా మ మశ్చ జయతి హరన్.

సకల కళా వళి కలితం
ప్రథమ గురుం ప్రథిత సాధుతా సారమ్,
సారమతిం శ్లాఘ్యపదం
రాజేశ్వర మాశ్రయే ప్రసూజనకమ్.

అభ్యాగతాన్నదాన
ప్రథితాన్వర్థాభిధాన మంతరత:,
నిహిత శ్రీ గౌరీశం
గురుమివ వందేన్నపం ప్రబల వంశ్యమ్.

శ్రీ శిష్టు వంశ తార:
కృతి కర్తా కృష్ణ మూర్తి కృతిచంద్ర:, ।
పూరయతు మదభిలాషం
మనసిస్థిత ఏవ గురు రలం ధ్యాత:. ॥

శ్రీ హింగ్వన్వయ జల నిధి
రాకా మృతదీధితి ర్గురు ర్జయతాత్,
విఖ్యాత సకల విద్యో
రామస్వామి విపశ్చిదగ్రసర:.

సకల మునినికరమండన
కౌండిన్య సగోత్ర లక్షణ స్సాధు:,
సత్యాం సుబ్బాంబాయాం
జనయామాస కృతగురుతతి ప్రణతిమ్.

కోరాడ రామచంద్ర:
తనుతే స్వవచ: పవిత్రతా సిద్ధ్యై,
మృత్యుంజయ విజయాహ్వయ
కావ్యం కర్తుం సముత్సుక స్సమభూత్.

శ్రీ శివగురు కరుణాత:
ప్రాపితశృంగం మహేశ గుణ కథనాత్,
పరిశీలయంతు సుధియ:
తదిదం కావ్యం రసాదిచతురధియ:.

సర్వోపి వదతి లపితం
సలలిత మితి మతిమతా తదజ్ఞేయమ్,
యావన్న రసిక వశతా
ముపేత్య తా నన్యతో నివారయతి.

నిజరససేవన చతురే
చతురైధిత వృత్తి రీతి గుణ నికరే,
కృతి వనితా వేత్తి ముదం
సమాగతే స్వప్రియే నిరస్తపరా.

స్వరస నిషేవణ కృతిని
ప్రాప్తే లిని మాలతీ వికస్వర గుణాఢ్యా,
శుక పిక ముఖ విహగానా
మనాదరం కిన్ను గణయతి మనాగ్వా.

పూర్వోదిత మితి కావ్యం
బహుమన్యత ఏవ నవ్యమితి న చాన్యత్,
కిం తై రుపకృత మితరై
రపకృత మేతన్న జానీమ:.

పూర్వత్వం చే త్కారణ
మాద్యకృతౌ సౌహృదస్య కుచయుగళాత్,
రసికానాం జగతి తథా
యతి న కిమితి భవతి యువతి పాదతలే.

స్వరసగ్రహ చాతుర్యా
భావ: పరకృత కృతీడగా మర్థ:,
తన్నిజ పరభాగేచ్ఛా
జనయంతి.....''

శ్రీ రామచంద్ర శాస్త్రిగారు శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారి వద్ద, శ్రీ ఇంగువ రామస్వామి శాస్త్రుల వద్ద అంతే వాసిగా ఉన్నట్లు సుప్రసిద్ధ విదుషీ మణి, కవయిత్రి, కవితిలక, కవితా విశారద ఇత్యాది బిరుదాంకిత శ్రీమతి కాంచన పల్లి కనకమ్మ గారు కూడ శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహా విద్యాపీఠ గురుపరంపరలో తెలియజేయడం పై శ్లోకాలకు సమర్థకం. కనకమ్మ గారి పద్యా లివి:

మ. వర కోరాడ సుధా పయోధి విధుడై
వాణీ పుమాకారమై
పరమేశ ప్రతిమానుడై జప తప
స్స్వాధ్యాయ లోలాత్ముడై

సురభాషా కవిచంద్రుడై సకలుడై
సుశ్లోకుడై మించె సు
స్థిరుడై యచ్యుత రామ పూజ్యుడగుచున్
శ్రీ రామ చంద్రుండహో!

ఉ.తా మదికూర్చి నట్టివి
శతంబులు ధారణ బట్టె పద్యముల్
ధీమహితుండు వ్రాయు దన
తీరిక వేళల సంస్కృతాంధ్రముల్
ఈ మెయి సత్ప్రబంధముల
వే యొకనాటికి మించి యున్న వు
ద్దామ యశుల్ కవీంద్రులు
నెదన్ ముదమొందగ నెందునేటికిన్.

మ. తన సాహిత్యము గానభంగులు కవి
త్వప్రౌఢిమల్ ధీరులెం
దు నపూర్వంబులటంచు మెచ్చగ వరే
ణ్యుండైన శ్రీ శిష్టు కృ
ష్ణుని గృష్ణున్ మును గృష్ణునట్లు కొలిచెన్
గోరాడరాముండు శి
ష్యునకున్ సద్గురు మూర్తికిన్ గలిగె స
ద్యోగం బనన్ బండితుల్.

శా. రామస్వామి బుధుండు హింగుకుల పా
రా వార నీహారదృక్
స్తోముండాద్యుడు మంత్రదీక్షల నగ
స్త్యం డంబికా పాదపూ
జా మాహాత్మ్యధురంధరత్వమున
నిచ్చల్ దన్ గటాక్షింపగా
శ్రీ మాతాకృతి 'రాకుచంద్రకవి'
కాంచెన్ నిత్య యోగంబునన్.

శ్రీ కృష్ణమూర్తి శాస్త్రిగారికి శాస్త్రిగారి కవిత వినడమంటే పరమ సంతోషం. అందువల్ల శాస్త్రిగారు సెలవులలో స్వస్థలానికి పోయినప్పుడెల్లా వారికి తమ కవిత్వం వినిపించేవారు. అంతే కాక, కృష్ణమూర్తి శాస్త్రిగారు శాస్త్రిగారిని పల్లెలలో జరిగే దొమ్మరాటలు, కోడి పందేలు మొదలయిన వినోదాలను చూడడానికి పిలుచుకొని పోయేవారు; వాటిని చూచి తిరిగి వచ్చేటప్పుడు ఆ ఆటలను వర్ణించమని శాస్త్రిగారిని కోరేవారు. తామూ కొన్ని శ్లోకాలు చెప్పేవారు. ఇలాటి వినోదాలను చూడడం వల్ల వినోదాలు చూపేవారు మాట్లాడే పారిభాషిక పదాలు తెలుస్తా యని వాటిని చూడడానికి ప్రోత్సహించేవారు.

శాస్త్రిగారికి నోబిల్ పాఠశాలలో ప్రవేశించింది మొదలు నిత్యకృత్యానుష్ఠానం, అధ్యాపనం, కవితావ్యాసంగం, గ్రంథ రచనం తప్ప మరొక జోక్యమే లేదు. ఈయన గ్రంథాలు వ్రాసే టప్పుడు ఏకంగా వ్రాసుకొని వెళ్ళడమే కాని, తిరిగి చూచుకోడంగాని, వ్రాసి కొట్టివేసి మళ్ళీ వ్రాయడం గాని ఎక్కడా కనిపించదు. ఆ కవితా ప్రవాహం ఒక్కరీతిగానే ప్రసరించేది. ఈయనకు మంత్ర శాస్త్రంలో కల ప్రవేశానికి 12 వ యేటనే ఉపదేశం పొందడం దేవీ విజయం, కుమారోదయం, లలితాఖండం మొదలయిన కావ్యాల రచన తార్కాణాలు.

## తెలుగులో తొలి నాటకం

ఈయన దాదాపు నలభై గ్రంథాలు రచించారు. సంస్కృత భాషలో గంభీర భావాలతో, రమణీయ కల్పనలతో మధుర తర శైలిలో ఇన్ని గ్రంథాలు రచించిన వారు ఈ మధ్య కాలంలో ఆంధ్ర దేశంలో కొందరే కనిపిస్తారు. ఈయన తెలుగులో రచించిన గ్రంథాలు తెలుగు నాడంతటా ఎక్కువ ప్రచారం కాకపోయినా, ఆంధ్రవాఙ్మయంలో నూతన శాఖలకు దారితీసినవాడు ఈయనే అని చాటుతున్నాయి. ఆంధ్ర కవులు నాటకాది రూపక రచనకు పూనుకొనని కాల మది

అలాటి కాలంలో ''బహుల గుణంబుల ననేక లేఖినీ విలేఖిత హృద్య పద్యావళీ సంతోషిత పరజన స్వాంతుండగు నతం డొక్కనాడు నానావిధ ప్రబంధ ప్రకారంబులు గోష్ఠీ వశంబునం దలపోయుచు దృశ్యశ్రవ్య కథా మయంబులగు కావ్యంబుల శ్రవ్యమాత్రంబులు మహాకవులచే ద్రిలింగ భాష యందు గ్రథితంబులుగ దృశ్యంబు లగునవి తాదృశంబులు గామికిం జింతించి, తద్గ్రథన నిషేధ కారణంబు గానక.... సంచితోత్సాహుండై సంస్కృతాంధ్ర మిశ్రంబుగా ప్రాచీనానుశాసనోక్త లక్షణ లక్షితంబగు నటుల సకల సరస పదార్థవనీవాటియగు ''మంజరీ మధుకరీయం బను నాటిక''ను రచించారు. ఈ నాటిక 1860 ప్రాంతంలో రచితమైంది.

అప్పటికి ఎలకూచి బాలసరస్వతి 'రంగకౌముది' మొదలైన నాటకాలు రచించినట్లు ప్రథేకాని, ఆ నాటకాలు ఎక్కడా కనిపించలేదు. ఈ మంజరీ మధుకరీయంలోని ఇతివృత్తం అపూర్వమైంది. స్వకపోల కల్పితం. పురాణాదుల నుంచి తీసుకున్నది కాదు. ఇప్పటి రంగ వ్యవస్థను బట్టి ప్రదర్శన యోగ్యం కాకున్నా, ప్రాచీన సంప్రదాయాన్ని అనుసరించి, స్వపాండిత్య ప్రకర్ష ప్రఖ్యాపనమే ముఖ్యమని కవులు భావించే కాలంలో రచితమైంది గనుక ప్రదర్శన యోగ్యాలయిన ఆధునిక నాటకాలకన్నా కొంచెం భిన్నంగా ఉన్నప్పటికీ, ఆంధ్ర వాఙ్మయంలో నాటక శాఖకు మూలమైన గ్రంథాలలో ఇదీ ఒక టనడంలో సందేహం లేదు. అంతే కాక ఈయన శాకుంతలం, వేణీసంహారం, ముద్రా రాక్షసం మొదలయిన సంస్కృత నాటకాలను అంతకు పూర్వమే ఆంధ్రీకరించి ఈ ఉద్యమానికి దారి తీసినవా రయ్యారు. ఆంధ్ర సారస్వతంలో ప్రప్రథమంగా గద్యరచనకు కలం పట్టిన వారిలో ఈయన కూడ ఒకరు. నయప్రదీపము (పంచతంత్ర విగ్రహానువాదం) మొదలయినవి ఒక్కొక చోట దీర్ఘ సమాసజటిలాలయి ఉన్నా, రథాంగదూతం, పరశురామ విజయం చాల సులభశైలిలో ఉండడం చూడగా, అప్పటికే గద్యశైలిపట్ల అభిరుచి మారిందని, దాని కనుగుణంగానే ఈయన ప్రయత్నాలు చేయడం వల్ల నూతన యుగావిర్భావ కాంతులు ఈయనపై అప్పటికే కొంత సోకాయని, ఆ నూతన యుగ చిహ్నాలే ఈయన కవితలోను కనిపించాయని మనం ఊహించవచ్చు.

## రామచంద్రశాస్త్రి గారి రచనలు

ఈయన రచించిన సంస్కృత గ్రంథాలలో కొన్ని.

1) కుమారోదయచంపు. ఇరవైయేడుల్లాసాల మహా కావ్యం. 2) శృంగార సుధార్ణవ భాణం. 3)రామచంద్ర విజయవ్యాయోగం. 4) ధీసౌధం. సంస్కృతం అభ్యసించే విద్యార్థులకు అనుకూలంగా సులభశైలిలో వ్రాసిన వ్యాకరణం 5) శృంగార మంజరి 6) కమనానంద భాణం. 7) పుమర్థ సేవధి కావ్యం 8) దేవీ విజయచంపు 9) మృత్యుంజయ విజయకావ్యం 10) ఉత్తర రామాయణం 11) త్రిపురాసుర విజయ డిమం 12) రాజవంశం 13) మంజరీ సౌరభం 14) భాష్యార్థ సంగ్రహం - భాస్కర రాయ ప్రణీత దేవీ సహస్రనామ వ్యాఖ్య. 15) దేవీస్తవం 16) శ్రీ కృష్ణోదయం 17) కందర్పదర్పం 18) వైరాగ్య వర్ధని 19) ఉపమావళి 20) ఘనవృత్తం - కాళి దాసకృత మేఘ సందేశోత్తర కథాభాగరూపం. 21) కవి కంఠపాశ వ్యాఖ్య - మూలం కాళిదాస విరచితం 22) అమృతానంద యోగి విరచిత సర్వాలంకారసం గ్రహ వ్యాఖ్య. ఆంధ్రీకృత గ్రంథాలు. 23) ఉన్మత్తరాఘవం - భాస్కర కవికృతం 24) ముద్రారాక్షసం 25) శాకుంతలం 26) వేణీ సంహారం. 27) ఉత్తర రామచరితం 28) రథాంగదూతం 29) నయప్రదీపం - పంచతంత్రంలోని విగ్రహానికి తెనుగు. స్వతంత్రమైన తెలుగు రచనలు. 30) మంజరీ మధుకరీయం 31) పరశురామ విజయం - వచనం.

ఘనవృత్తమ్: రామచంద్ర శాస్త్రిగారు రచించిన గ్రంథాలలో 'ఘనవృత్త'మనే సంస్కృత కావ్యం, 'మంజరీ మధుకరీయ'మనే తెలుగు నాటకం ప్రసిద్ధాలు. ఘనవృత్తం గురించి కొంత వివరణ అవసరం. ''తత్సందేశం జలధరవరో దివ్యవాచా చచక్షే, శృత్వావార్తాం జలదకథితాం తాం ధనేశోపి సద్యః'' అనే రెండు శ్లోకాలు మేఘ సందేశంలో సంక్షేపంగా చెప్పి మేఘుని అలకాగమనం, సందేశ నివేదనం, యక్షాంగనా స్థితి, తచ్ఛుభవార్తాహరణం, శాపాంతంలో యక్షయక్షాంగనా సమాగమం మొదలయిన అంశాలు ఈ ఘనవృత్తంలో విపులీకృతాలు. యక్ష సందేశం వినిన తర్వాత మేఘుని వృత్తాంతం గురించి తెల్పేది గనుక దీనికి ఘనవృత్తమ్ అనే పేరు వచ్చింది. సందేశం మాత్రమే తెలిపేది గనుక అది మేఘ సందేశమయింది. కాళిదాసు మేఘ సందేశాన్ని రాముడు సీతకు హనుమంతుని ద్వారా పంపిన సందేశాన్ని మనసులో ఉంచుకొని రచించగా, శాస్త్రిగారు కూడ దానిని అనుసరించే ఈ ఘనవృత్తమ్ రచించారు.

కాళిదాసు మేఘసందేశంలో మొదటి సర్గలో అలకా పట్టణం మార్గాన్ని, రెండవసర్గలో అలకా పట్టణ రామణీయకాన్ని, యక్షాంగనా విరహావస్థను, సందేశ కథనాన్ని వర్ణించి రెండు శ్లోకాలతో కావ్యాన్ని హఠాత్తుగా ముగించాడు. కనుక పాఠకులకు తర్వాతి కథ ఏమిటనే కుతూహలం కలగడం సహజం. ఈ ఘనవృత్తం ఆ అసంపూర్తి కథను పూర్తి చేసి, యక్షయక్షాంగనా సమాగమ ప్రకారం తెలిపి పాఠకుల ఉత్కంఠతను శమింపజేస్తుంది.

ఘన వృత్తం ప్రథమ సర్గలోని ఇతివృత్త మిది: మేఘుడు యక్షుని సందేశం విని, బయలుదేరాడు యక్షుడు చెప్పిన మార్గంలో అలకా పట్టణం చేరాడు ఆ యక్షుడు చెప్పిన గుర్తులతో అతని గృహమేదో తెలుసుకొని, దేవీ పూజానంతరం తదేకధ్యానంతో శయనించి ఉన్న యక్షాంగనను ఒక గవాక్షంనుంచి చూచాడు. ఆమె అశోక వృక్షం కింద విచారంతో ఉన్న సీతాదేవిలాగ కనిపించింది. వాయుపుత్రుడు సీతాదేవికి రామవృత్తాంతం తెలియ జేసినట్లే, యక్షాంగనకు యక్ష వృత్తాంతం తెలియజేశాడు. యక్షాంగన ఇది కల ఏమో అని శంకిస్తుండగా, మేఘుడు కామరూపుడు కావడంవల్ల సుందరాకారంతో ఆమె ఎదుట నిలుచున్నాడు. ఆమె భర్త సందేశంతో అతని మిత్రుడు తన వద్దకు రావడం తాను కావిస్తున్న దేవీ పూజాఫలమని భావించి, మేఘునికి సముచితాతిథ్య మిచ్చి, మేఘుని పుట్టుపూర్వోత్తరాలు, యక్షునికి అతనికి గల స్నేహం, యక్షుని ప్రస్తుత స్థితి తెలుసుకోదలచింది.

మేఘుడు, యక్షుడు ఆమె విరహంతో ఉన్మాది అయిపోయాడని కొన్ని ఉన్మాదచర్యలు తెలిపాడు. అతని తపఃక్రమం, ఇంద్రియ నిగ్రహం, ఏక పత్నీ వ్రతం మున్నగు సద్గుణాలను ప్రకటించే ఒక సందర్భం తెలియజేశాడు.

యక్షుడు తన అధికార ప్రమత్తత వలన గదా పత్నీ వియోగం సంభవించిందనే పశ్చాత్తాపంతో రామగిర్యాశ్రమంలో తపస్సు చేస్తుండగా, దేవేంద్రుడు అతని తపస్సుకు భయపడి విఘ్నం కలిగించడానికి సురూప అనే వేశ్యను పంపుతాడు. అది అతనిని లోబరచు కొనడానికి ఎన్నో కుయుక్తులు పన్నుతుంది. అతడు వాటిని తెలుసుకొని ''లోకే నానాజన కృతపరిష్వంగ సందూషితానాం సంగం సంతః ఖలు సమగదంస్తం రసాభాస మూలం'' (లోకంలో బహుపురుషుల ఆలింగనంతో దూషితులైన వారవనితల సంగమం రసాభాస కారణమని పెద్దలు చెబుతారు గదా!) మొదలయిన నీతి వాక్యాలతో ఖండించి, ఆ వేశ్య ప్రయత్న పూర్వకంగా చేసే విలాసాలు తనధర్మ పత్ని సహజ విలాసాలకు సరికావని

పొల్చి చెబుతాడు. తర్వాత ''స్వర్గంగాయాః పయసి విహరద్రాజ హంసస్య కుల్యా సిత్వం యాహి ద్రుతతర మితో యాహి కుంజాంతరం తత్'' (నా భార్య ఆకాశగంగ వంటిది. నీవొక కాలువ వంటి దానివి. ఆకాశగంగలో విహరించే హంస కాలువలో విహరిస్తుందా? కనుక నీవు ఇక్కడి నుంచి వెంటనే వెళ్ళిపో) అని గట్టిగా మందలిస్తాడు. ఆ మందలింపునకు ఆ వేశ్య సిగ్గుపడి వెళ్ళిపోతుంది. అక్కడి మునులంతా యక్షుని ఇంద్రియ నిగ్రహానికి ఆశ్చర్య పడ్డారు.

తన భర్త ఏకపత్నీ వ్రతానికి, ఇంద్రియ నిగ్రహానికి యక్షాంగన సంభ్రమా శ్చర్యాలు పొంది ఆనంద సముద్రంలో మునకలువేసి పరవశించి స్మృతి తప్పినట్టు అయిపోయింది. ఇది ప్రథమ సర్గకథ.

ఈ ప్రథమ సర్గలో మేఘుని ఆభిజాత్యానికి తగిన సద్గుణాలు, యక్షుని సద్గుణాలు, వర్ణితమయ్యాయి సురూపకు, తపోనిష్ఠుడయిన యక్షునికి జరిగిన సంభాషణం అతి రమణీయం ఇంత వరకు వియోగావస్థలో ఉన్న యక్షుని చర్య, అతని స్వభామూ మనకు స్పష్టమయాయి. కాని, యక్షాంగన సంగతి స్పష్టంగా తెలియలేదు. కనుక ఆమె ఎలా గడిపిందో పాఠకులు తెలుసుకొనడానికి ఉత్కంఠతో ఉంటారు. మేఘుడు కూడ వినకుతూహలిగా ఉన్నాడు. స్వయంగా ఆమె తెలుపడం ఉచితం కాదు కనుక చెలికత్తెలెవరైన తెలియ జేయడం సందర్భోచితం. కనుక కవి రెండవ సర్గలో యక్షాంగన విరహవృత్తాంతం చెలిచే చెప్పిస్తాడు.

ఆనందపారవశ్యంతో స్మృతి లేక పడి ఉన్న యక్షాంగనకు ఆమె చెలి శైత్యోపచారం చేస్తూ, మేఘునికి ప్రియవియోగ సమయంలో ఆమె ఎలా గడిపిందో వివరించింది. శాపవృత్తాంతం విన్న వెంటనే యక్షుడు ఇంటికి రావడం విషాదకారణమని భావించి ఎక్కడికో వెళ్లిపోయాడు. ఈ వార్త ఇంటికి తెలియగానే హాహాకారాలతో యక్షాంగన మూర్ఛపోయింది.

అప్పుడు దుష్ట శిక్షకుడు, ఆశ్రిత వత్సలుడు అయిన కుబేరుడు పంపగా అతని భార్య యక్షుని యింటికి వచ్చి, విరహతాపంతో వేగుతున్న యక్షాంగనను ఓదార్చి, ''కేవా న స్యుః పరిభవ పదం కర్మణా స్వార్జితేన'' (తాము చేసుకొన్న కర్మతో ఎవరికి మాత్రం అవమానం కలుగదు?) అని అంటూ, చేసిన కర్మ అనుభవింపక తప్పదు, లోకోద్ధారకులైన మహాపురుషులు, అవతార పురుషులు కూడ కర్మబద్ధులవుతుండగా, మన బోటి వాళ్లొక లెక్కా? ''అని చెబుతూ, తనభర్త వలన తాను ఉపదేశం పొందిన అంబికా మంత్రం ఉపదేశించి, ''ఈ మంత్ర పురశ్చరణ వలన నీకు మనశ్శాంతి కలుగడమే కాక, జన్మసాఫల్యమూ కలుగుతుంది'' అని చెప్పి వెళ్లుతుంది.

పిదప ఆ యక్షాంగన నిష్ఠాగరిష్ఠ, ''త్యక్తలోకప్రచార'' అయి పరాశక్తిని ధ్యానించసాగింది. కొన్నాళ్లకు ఆ పరాశక్తి ఆమె పూజలకు మెచ్చి సాక్షాత్కరిస్తుంది. ''నీకు శుభం కలుగుతుంది. కుబేరుడు నా ప్రియ భక్తుడు. అతని శాపాన్ని నేనూ మరల్చలేను. నీ భర్త శాపానికి కారణం ఉంది. పూర్వజన్మలో ఇతని కూతురు, అల్లుడు వయసులో ఉండి కలుసుకొనడానికి ప్రయత్నిస్తారు. యక్షుడు వారిని కలువ నీయక అడ్డుపడుతాడు. నీవు తమ పతులపై ఆసక్తలయిన నీ చెలికత్తెలను, నిరంతరం నీ వద్దే ఉండేట్టుచేసి, వారు తమ భర్తలతో కలవనీయ కుండా చేస్తున్నావు. ఇదొక కారణం. కనుక మీకు వియోగం సంభవించింది. కనుక 'విహితం కర్మ భోక్తవ్య మేవ. చింత పడకు త్వరలో నీకు శుభం కలుగుతుంది.' అని ఆశీర్వదించి అంతర్ధానం చెందింది.

అప్పటినుంచి ఈ యక్షాంగన ఆ పరదేవతోపాసనతోను, తత్కథాశ్రవణంతోను కాలం గడుపుతూ, తన భర్త రాకకై ఎదురు చూస్తున్నది - అని చెలికత్తె చెప్పింది.

ఇలా చెబుతుండగా యక్షాంగనకు మూర్ఛ దిగి పోయి తెలివి వచ్చింది. ఆమె తన భర్తకు సంబంధించిన కొన్ని రహస్య వృత్తాంతాలను మేఘునికి చెప్పి, అలా తనకు ఇష్టమైన పనులు చేసే ప్రియుడు, తనను ఎడబాసినందుకు చింతపడుతూ, నమస్కార పూర్వకంగా యక్షునికి సందేశం పంపింది. మేఘుడు కూడ వర్షాకాలంతో కూడి ఇష్టార్థాలు పొందాలని శుభాశంసన చేసింది. మేఘునికి అనేక రత్నాదులు, కానుక యిచ్చి పంపింది.

మేఘుడు మరల చిత్రకూటానికి పోయి, మిక్కిలి కృశించిన యక్షుని చూచి స్తనితవచనాలతో ''...భవ్యపాత్రం వధూటీ భావత్కేతి స్ఫుటమకథయద్రామమే వాంజనేయః - నీ ప్రియురాలు జీవించి ఉంది శుభాలు పొందగలవు'' - అని రాముడికి ఆంజనేయుడు సీతాదేవి యోగక్షేమాలు తెలిపినట్లుగా తెలిపి వెళ్లిపోయాడు.

వర్షాకాలానంతరం శరదృతువు వచ్చింది. ''ఉన్నిద్రోభూత్సపది కమలాకాముక శ్శేష తల్పాత్.'' ఉత్థా నైకాదశినాడు విష్ణువు శేషతల్పం నుంచి మేల్కొన్నాడు. వెంటనే యక్షునికి శాప విమోచనం కలిగింది; సంపూర్ణ తేజస్సుతో తన నగరం చేరుకున్నాడు.

అక్కడ యక్షాంగన దేవీపూజకై పెద్దలను రావించి, పూజకు సిద్ధంగా ఉంది. యక్షుడు రాగానే ససంభ్రమంగా

యక్షునికి స్వాగత మిచ్చి, మాల్యాంబరాదులతో గౌరవించి, రత్నఖచితమైన తులసి మంటపంలో పరాశక్తిని పూజించి, పెద్దలను ఉచిత రీతిని సత్కరించి భర్తతో సరససల్లాపాలు చేస్తుంది.

మరుసటి నాడు కుబేరుడు శాపవిముక్తుడైన యక్షుణ్ని చూడడానికి వస్తాడు. యక్షుని ఇంద్రియ నిగ్రహాన్ని మెచ్చుకొంటాడు. యక్షుని భార్య పరమశివాయత్త చిత్త అయినందుకు ఆమెను ప్రశంసిస్తాడు. అప్పుడు యక్షుడు వినయంతో తనకు మరల తన సేవాధికారం అనుగ్రహించ మని కుబేరుణ్ని అభ్యర్థిస్తాడు. కుబేరుడు యక్షుని అభ్యర్థన విని ''యక్షా! నీవు సేవావృత్తి నుంచి విముక్తుడవయ్యావు. నా ఇంటి నుంచి నీవు కావలసినంత ధనం తీసుకొని ధర్మార్థకామాలు అనుభవించు'' అని అనుగ్రహిస్తాడు. తర్వాత యక్షదంపతులు అప్రమత్తులై నిత్యక౯ లు నెరవే రుస్తూ, ధర్మార్థకామాల ఎడల సమాన దృ కలిగి, పరదేవతోపాసనా యత్త చిత్తులై కాలం గడుపుతా .

రామచంద్రశాస్త్రిగారు ఘనవృత్తంలో ప్రతిపాదించిన ముఖ్యాంశాలివి: ప్రతి మానవుడు పూర్వజన్మలో తాను చేసిన కర్మకు బద్ధుడు. ఆ కర్మకు మరొకరు కారకులు గాని, పరిహారకులుగాని కారు. ఆ కర్మ అనుభవించి తీరవలసిందే; వేరొక విధంగా నశించదు. కనుక ఈ జన్మలో తాను ఏ కార్యాచరణకై నియుక్తుడయాడో ఆ కార్యాలను శక్తివంచన లేకుండ, ఫలాపేక్షలేకుండ నిర్వర్తించాలి. ప్రతి వ్యక్తీ ఇంద్రియనిగ్రహం అలవరచుకోవాలి. అది ముఖ్య కర్తవ్యం. దానితో సమాధిని సమకూర్చుకొనడానికి బ్రహ్మాదు లకు కూడ మూలకారణమైనట్టి పరాశక్తిని ఉపాసించి కర్మ బంధం అతిక్రమిస్తేగాని, మోక్షం సిద్ధించదు. ఆపరాశక్తి

న స్త్రీ నా నో తదుభయ వపుః
నా ప్యనిర్వాచ్య రూపా
బ్రహ్మాదీనా మపి చ జననీ
లోక రక్షాప్రసంగాత్,
నానా రూపా విరచిత కృతిః
పూజితా చక్రిముఖ్యైః
నిస్సైగుణ్యే మహసి కుసుమే
సౌరభశ్రీ రివాస్తే. (ఘన. ద్వి.8)

స్త్రీ పురుషరూపం కానిది, తదుభయరూపం కానిది, నానారూపమైనది, లోకరక్షణమే ముఖ్యకర్తవ్య మైనట్టిది, జగన్మాతగా పేర్కొన దగినది, బ్రహ్మాదుల పూజలను అందుకొనేది ఆపరాశక్తి పూవులలో ఘ్రాణేంద్రియమాత్ర గోచర మయ్యే పరిమళం వలె త్రిగుణరహితమైన తేజఃకుసు మంలో పరిమళ శ్రీ వలె విరాజిల్లుతున్నది.

దీనిని సహృదయులు చదివితే ఇంకా ఎన్నో విశేషాలు తెలుస్తాయి.

## మంజరీ మధుకరీయము

మంజరీ మధు కరీయము తెలుగు నాటిక. దీనిని శాస్త్రిగారు 1860 ప్రాంతంలో రచించారు. దీని ఇతవృత్తం అపూర్వం. స్వకపోల కల్పితం. పురాణాదుల నుంచి సంగ్రహించింది కాదు. దీని కథ సంగ్రహంగా ఇది 1వ అంకం. రాజకుమారి మంజరి నవ యౌవనవతి అవుతుంది. ఆ సమయంలో శరీరంలో కలిగిన నూతనమైన మార్పులు ఆమెకు అర్థం కాలేదు. పాటమరించిన పాలిండ్లు మొదలయిన వాటిని ఆమె కంతులని భావించింది మందు ఇప్పించమని తల్లి అయిన సంతానవల్లిని కోరుతుంది. ఆమె సిగ్గుతో తన కుమార్తెకు వాస్తవ విషయం చెప్పలేక పోయింది. తన పుట్టి నింటి నుంచి మంజరి చెలికత్తె అయిన ఆమోదరేఖను రప్పించి, రాజకుమారికి ఆమె యౌవన విషయం వివరించమని చెబుతుంది. 2వ అంకం: ఆమోదరేఖ సకల విద్యా ప్రవీణ. ఆమె వల్ల వాస్తవం తెలుసుకొని మంజరి సిగ్గుపడుతుంది. రాజకుమారి ఆమె వల్ల గానకళ నేర్చుకుంది. ఒకనాడు వారిద్దరు ఉద్యానవనంలో ఉండగా, కుంభస్తవి అనే చేటిక వచ్చి, చండ యోగిని అనే యోగినిని చూడడానికి మంజరిని అంతఃపురానికి పిలుచుకుని పోతుంది. చండ యోగిని క్షుద్ర మంత్రోపాసకురాలు. సామంత రాజకన్యలకు గురువు. మంజరి విద్వాంసురాలని ప్రసిద్ధి పొందినందున, ఆమెను వాదంలోనో మరే విధంగానో ఓడించడానికి చండయోగిని వచ్చింది. వారిద్దరికి వాదం జరుగుతుంది. చండయోగినితో ఆమోదరేఖ ఆమె గురువైన రాజయోగిని కూడ వాదించారు. చండయోగిని ఓడిపోతుంది. 3వ అంకం: ఆమోదరేఖకు సంయమి అనే స్నేహితురాలు ఉంది. ఆమె స్నేహితురాలు సుమతి. వీరిద్దరూ తపస్వినులు. వీరు ఆమోద రేఖా మంజరులకు వచ్చిన ఆపదను గురించి చర్చించుకుంటారు. ఆ ఆపద ఇది: మంజరి ఒక రాత్రి కలలో ఒకరాజ చంద్రునితో రతి సుఖమనుభవించి ఆ పారవశ్యంతో అతనిని గురించి ఆశువుగా పద్యాలు చెబుతుంది. అందుకు అందరూ కలత పడుతారు. ఒకనాడు మంజరి ఆమోదరేఖలు ఉద్యానవనంలో ఉండగా, చండయోగిని నియమించిన ఒక రాక్షసుడు హరిణ రూపంలో వచ్చి వారిని తన కొమ్ముల సందులో ఇరికించు కొని ఆకాశానికి ఎగిసి పోతాడు. తపస్విను లిద్దరూ ఇలా మాట్లాడు కుంటుండగా, ఒక కాపాలిక వచ్చి, కలలో మంజరిని

కలుసుకున్న మధుకరరాజ పరమేశ్వరుడు విరహి అయి అరణ్యంలో తిరుగుతూ, ఆకాశంలో ఎగిరి పోతున్న హరిణాన్ని బాణంతో కొట్టాడని, హరిణ రూపంలో ఉన్న రాక్షసుడు నిజరూపంతో తాను అపహరించుకొని పోతున్న ఇద్దరిని ఒక ఇనుప పెట్టెలో బంధించి దాచి, మధుకరునితో పోరాడి మరణించాడని చెప్పింది. పెట్టె ఏమైందో మధుకరునికి తెలీలేదు. మంజరి వార్త తెలియక విలపిస్తూన్న, అగ్ని ప్రవేశంచేయనున్న రాజమాతకు కాపాలిక మాయతో ఒక మణి ఘంటికను ఒక లేఖతో సహా అందజేస్తుంది. అవి రాజమాత చేతిలో పడుతాయి. మంజరి క్షేమంగా తిరిగి వస్తుందని, రాజయోగిని శాపంతో చండయోగిని పిచ్చిదైపోయిందని ఆ లేఖ వల్ల తెలిసింది. రాజమాత మనస్సు ఊరట చెందుతుంది. మధుకర చక్రవర్తి భార్య హేలావతి ఎదుట మంజరి ఆమోదరేఖ ఉన్న ఇనుప పెట్టె పడుతుంది. ఆమె ఆ పెట్టె తెరిపించి, దానిలో ఇద్దరు సుందరులు ఉండడంచూచి ఆశ్చర్యపడి వారిని అంతఃపురంలో రాజు కంటబడకుండా దాచింది. రాజు విచారంతో ఉండడానికి కారణమేమో ఆమెకు తెలియలేదు. ఈ విషయాన్ని కుంభస్తని అనే చేటి విదూషకునికి తెలుపుతుంది. విదూషకుడు రాజును కలిసినప్పుడు రాజు, తన చింతకు కారణం చెబుతాడు. విదూషకుడు కుంభస్తని చెప్పిన దానితో రాజు చెప్పిన దానిని సరిపోల్చుకుని రాణి, రాజును ప్రసన్నుని చేసుకొనేట్లు యుక్తి చేస్తాడు. విదూషకుని భార్యయుక్తితో ఒక విప్రశ్నిక వచ్చి ఖేచర స్త్రీ సందర్శనం వల్ల రాజు స్వస్థచిత్తుడవుతాడని ప్రశ్నచెయితుంది. ఇనుప పెట్టెలో నుంచి బయటపడిన మంజరి, ఆమోద రేఖలు ఖేచరస్త్రీలని రాణి భ్రమపడి ఆమోదరేఖను రాజుకు కనపడేట్లు చేస్తుంది. మంజరిని చూస్తే రాజు మనస్సు మారుతుందని ఆమెను రాజుకు కనబడనీ లేదు. రాజు, విదూషకుడు మంజరిని చూడడం ఎట్లా అని ఆలోచిస్తూ, క్రీడాశాలకు రాగా, అక్కడ మంజరి కనిపిస్తుంది. మధుకరుడు మంజరిని గాంధర్వ విధితో వివాహం చేసుకుంటాడు. ఇంతలో రాణి వచ్చి అల్లరిచేయగా రాజు వెళ్లిపోతాడు. రాణి కోపంతో ఆమోదరేఖను, మంజరిని చెరసాలలో పడేస్తుంది. రాజు చర్యకు రాణి చింతిస్తూండగా, ఆమె తల్లి నుంచి ఒక లేఖ వస్తుంది. దానినిబట్టి మంజరి రాణి పినతల్లి కుమార్తె అని స్పష్టమవుతుంది. రాణి పశ్చాత్తాప పడుతుంది. రాజు వద్దకు వచ్చి క్షమాపణ కోరుతుంది. మంజరిని రాణిని చేసి, తాను 'భట్టిని' కావడానికి సమ్మతిస్తుంది. పిదప రాణే మంజరిని పిలుచుకొని వచ్చి, రాజుచేత పాణి గ్రహణం చేయిస్తుంది.

ఈ నాటికలోని ప్రథమాంకంలోని ఆమోదరేఖామంజరుల సంభాషణలో కొంత మచ్చుకు ఉదాహరిస్తాను:

(అనంతరంబున మంజరియు నామోదరేఖయు బ్రవేశించుచున్నారు.)

ఆమో: హళా! మంజరి! సుమాళంబుగ నుంటివి గదా.
మంజరి: అత్తికా! నీవు వచ్చుట నింక నింక యద్ది కలుగునని నెమ్మనంబున నమ్మెదనే.
ఆమో: హళా! యిట్లేంటి వేమే?
మంజరి: అత్తికా! నీవు నా చెంగట నుంటివే.
ఆమో: హళా! నీ కురంగట నవ్వ మొదలుగల వారందరున్నారు గదా.
మంజ: అత్తికా! యీ యవ్వ తొంటి యవ్వ యనుకొంటివే?
ఆమో: యిప్పుడు గ్రొత్తగ మరి యొకతె యేతెంచెనే?
మంజ: కాదే. యవ్వయనిన యద్దియే కాని దాని యాత్మ మారినదే.

ఆమో: ఓసీ చెలియా. కాదే. తొల్లింటికంటె నీ యాత్మ మారి దాని నెరుంగక యమ్మను వింతగ దూరుచున్నావు.

మంజ: అత్తికా! నీవు కొన్ని నాడులు దడవున నుండుట నీయాత్మయుం దారుమారయ్యెనని దలంపనగునె.

రామకృష్ణయ్య గారు తమ పితామహులు రచించిన ఈ నాటికను గూర్చి ఇలా వ్రాశారు: ఈ నాటిక 1860 సం. ప్రాంతమున రచింప బడియుండెను. ఈ మంజరీ మధుకరీయ మందలి కథ అపూర్వము స్వకపోలకల్పితము. పురాణాదుల నుండి సంగ్రహింప బడినది కాదు. ఇది ప్రస్తుతపురంగ వ్యవస్థను బట్టి ప్రదర్శించుటకు కనుకూలము కాకున్నను, ప్రాచీన సంప్రదాయముల ననుసరించి స్వపాండిత్య ప్రకర్షయే ముఖ్యముగా కవులందఱు తలచు చుండెడి కాలమున వ్రాసిన గ్రంథమగుట ప్రదర్శన యోగ్యములగు నాధునిక నాటకముల కంటె కించిద్భిన్నమై యుండినను ఆంధ్ర వాఙ్మయమున నాటక శాఖకు మూలమగు గ్రంథములలో నొక్కటి యైయుండుననుటకు సందియముండదు. (ఘనవృత్తం పీఠిక పుట 18-19).

సుప్రసిద్ధ నాట్య శాస్త్రజ్ఞులు డాక్టర్ పోణంగి శ్రీ రామ అప్పారావు గారు నాటకాలలో ఏది ప్రాచీనం, ఏది అర్వాచీనం అనే విషయం చర్చిస్తూ, ''మన మీ మీమాంస క్రొత్తగా చేయుటకంటె, విషయములను స్వయముగా ఎరిగిన పెద్దల నుండి సమాచారమును సేకరించి నలుబది సంవత్సరముల కిందట అనగా 1917లో శ్రీ రామకృష్ణయ్య గారు వ్రాసి

దానిని విశ్వసించి, 1860 ప్రాంతముల రచింపబడిన మంజరీ మధుకరీయము లభ్యమైనంతలో ప్రథమాంధ్ర రూపకమని తలచుట సమంజసముగా కన్పట్టుచున్నది'' అని తీర్పు చెప్పారు. (స్రవంతి 1958 ఏప్రిల్)

రామచంద్రశాస్త్రిగారు స్వోదయః అనే పేరుతో ఆత్మ కథను కావ్యంగా రచించారు. 19వ శతాబ్దిలో సంస్కృతభాషలో రచితమైన మొదటి స్వీయ చరిత్ర ఇదే. ఈ ఆత్మకథ చివర తాము రచించిన సంస్కృతాంధ్ర గ్రంథాలు అనువాదాలను తెలిపారు.

## తండ్రిని మించిన తనయుడు

రామచంద్రశాస్త్రిగారికి ముగ్గురు కుమారులు - లక్ష్మీ మనోహరం, రామకృష్ణ శాస్త్రి, దుర్గా నాగేశ్వర శాస్త్రి అనేవారు; ఇద్దరు కుమార్తెలు. లక్ష్మీ మనోహరం గారు కొంత వరకు సంస్కృతం నేర్చి, మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులై రెవెన్యూ శాఖలో భుత్వోద్యోగం చేశారు. రెండవ కుమారుడైన రామకృష్ణ శా' గారు కళాశాలలో ఆంగ్ల విద్య అభ్యసించారు; త్వరలోనే ంస్కృతంలోను అమోఘ మైన పాండిత్యం సంపాదించారు. ఎంతో కీర్తిమంతులు కావలసిన వారు. కాని విద్యకు తగిన వికాసం కలుగకముందే అల్పవయస్సులోనే మరణించారు. ఆయనకు ఇద్దరు కుమారులు. వారు ప్రభుత్వోద్యోగాలు చేసి ఉపకారవేతనం పొంది విశ్రాంతి తీసుకుంటున్నారు.

రామచంద్ర శాస్త్రిగారి మూడవ కుమారుడైన దుర్గా నాగేశ్వర శాస్త్రిగారు తండ్రిని మించిన కుమారులు. సహజ పాండితీధురీణులు. కళాశాలలో మెట్రిక్యులేషన్ చదువుతూనే, తండ్రి వద్ద సంస్కృతం అభ్యసించారు. తండ్రి అనారోగ్యంతో కళాశాలకు వెళ్లకపోతే, మెట్రిక్యులేషన్ పరీక్షకు వెళ్లడం మానివేసి, తండ్రి స్థానంలో కళాశాలలో పండితులుగా ప్రవేశించి, కాలేజీ విద్యార్థులకు గూడ పాఠాలు చెబుతూ, తండ్రిగారి పనిని చాల సమర్థతతో నిర్వహించిన సాహసికులు. తక్కిన ఉపధ్యాయులు తరగతి గది తలుపుల వద్ద నిలబడి వారి పాఠం విని, సాయంకాలం రామచంద్రశాస్త్రి గారి దగ్గరికి వెళ్లి నాగేశ్వరశాస్త్రిగారి సామర్థ్యాన్ని కొనియాడే వారట. వారు స్వల్పకాలంలోనే సర్వశాస్త్ర పారంగతుల య్యారు. యోగాభ్యాస నిరతులు, నిరాడంబరులు, పరమార్థ విషయైక దృష్టిగల వారు, స్థిత ప్రజ్ఞులు. అంతర్ముఖులు అయి తండ్రి గారి అనంతరం తండ్రిగారి వలెనే దాదాపు 33 సంవత్సరాలు బందరు నోబిల్ కళాశాలలో పండితులుగా ఉండి, ఆత్మ గౌరవంతో క్రైస్తవ పాదిరీల ఆదరం పొందారు. శ్రీమతి కాంచనపల్లి కనకమ్మగారు తమ శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహా విద్యాపీఠం గురుపరంపరలో దుర్గా నాగేశ్వర శాస్త్రి గారిని గురించి ఇలా ప్రశంసించారు:

శా. అతి శాంతుండు మహామహుండు ముని
    యోగానంద నాథుండు సా
  ధిత సర్వార్థుడు దేశికాంఘ్రియుగ భ
    క్తిక్రీత ముక్త్యంగనా
  యుతు దేకాంతుడు రామచంద్ర వరిచ
    ర్యోత్సాహి నాగేశు డ
  ప్రతిముం డుత్తము డాద్యయోగిజనసం
    భావ్యాంతరంగుండహో!

శా. బాలోన్మత్త పిశాచ వర్తనములన్
    బ్రహ్మాత్వముం డాచి ద్ర
  గ్జాలంబున్ దుది లక్ష్యమం దునిచి జా
    గ్రన్నిద్ర గై కొంచు నా
  భీలంబౌ భవవారిధిం గడచి యా
    విశ్వంబు తానై మహా
  లీలన్ మా గురు దేశికుం డలరె ని
    ర్లిప్తాగ్ర గణ్యుండనన్.

శా. కారుల్ కత్తులు కత్తెరల్ గొని తనున్
    గారించుచున్ గండలన్
  జీరన్, వైద్యులదేరినో యనుచు ని
    శ్చింతంబుగా బండె నే
  ధీరుం డక్షులు మూయకుండ నదియన్
    దీరంగ జాగే లౌకో
  ప్రారంభింపుడటన్న యా ఘనుడె యో
    గానందనాథుండహో.

నాగేశ్వరశాస్త్రిగారు యోగాభ్యాసం చేయగా మిగి కాలమంతా కళాశాలలోనే గాక ఇంటి వద్ద కూడ అ శిష్యులకు తర్కవ్యాకరణ వేదాంత సాహిత్యాది శాస్త్రాల అత్యాదరంతో బోధిస్తూ నిరాడంబరంగా సుఖ సరళజీవి గడుపుతూ, అంతర్దృష్టితో యోగసిద్ధి పొందారు. ఆ కాలం కళాశాల ప్రిన్సిపాలులయిన క్లర్క్, పెన్ మొదలైన విదేశీయ కాక కళాశాల పండితులు, పట్టణంలోని పలువురు ఉద్యోగు ఈయన వద్ద ఏదో ఒకపాఠం చదివే వారు. ఆ తరంలో బందరు నోబిల్ కళాశాల విద్యార్థులు చాలమంది ఈయ శిష్యులై, ఈయన ఎడల భక్తి తాత్పర్యాలు కలిగి ఉండేవా ఈ పాఠాలు కళాశాలకు వెళ్లుతున్నప్పుడు దారిలో, మధ్యాహ్నం విరామ సమయంలోను, సాయంకాలం ఇం తిరిగి వస్తున్నప్పుడు దారిలోను, రాత్రి పడుకోబేయేవ - ఇలా ఎవరి వీలును బట్టి వారు చదువుకొనే వా గురువుగారి వీలు కాదు.

నాగేశ్వర శాస్త్రిగారికి నిశితమైన శాస్త్రదృష్టి ఉండేది కాని, కవితా దృష్టి తక్కువ. ''మీరు గ్రంథాలు ఎందుకు వ్రాయరు?'' అని ఎవరో అడిగితే, ''మా తండ్రి గారి గ్రంథాలు లోకంలో ప్రచారమయితే చాలదా? నేను వ్రాయడం ఎందుకూ?'' అని అనే వారు. కనుక గ్రంథ రచనా ప్రయత్నం విరమించి, తండ్రి గారి గ్రంథాలను ప్రచురించడా నికి ప్రయత్నించి కృతార్థు లయ్యారు. శృంగార సుధార్ణవ భాణం, ఘనవృత్తం, కుమారోదయ చంపువు, దేవీ విజయం, ఉపమావళి అనే సంస్కృత కావ్యాలను తెలుగు టీకాతాత్పర్యా లతోను, మంజరీ మధుకరీయం నాటికను, నయ ప్రదీపం, పరశురామ విజయం, రథాంగ దూతం అనే తెలుగు గద్య పద్య కావ్యాలను తొలుత ప్రచురించిన వారు వీరే.

నాగేశ్వర శాస్త్రిగారి వద్దకు ఇతర స్థలాలలో ఉన్నవారు సెలవులలో వచ్చి చదువుకొనే వారు. ఇలాటి వారిలో దర్భావెంకట కృష్ణమూర్తిగా రొకరు. ఈయన మదనపల్లిలో ఉన్న బిసెంట్ థియసాఫికల్ సొసైటీ కళాశాలలోను, తరువాత నెల్లూరు వెంకటగిరి రాజావారి కాలేజీలోను తెలుగు శాఖాధ్యక్షులుగా పనిచేశారు. ఈయన నాగేశ్వరశాస్త్రి గారి సతీమణి ఔదార్యం, అతిథి సత్కారం గురించి చెప్పిన ఉదంతాన్ని కోరాడ రామకృష్ణయ్య గారి పుత్రులు డాక్టర్ కోరాడ మహాదేవ శాస్త్రిగారు చెప్పగా విన్నాను: ''ఆమె మానేపల్లి అనంతావధానుల కుమార్తె. అన్నపూర్ణకు సరితూగ గల సాధ్వి. ఆమె భోజనం ఆప్యాయంగా పెట్టేవారు. రుచిగా వండేవారు. భోజనం చేసిన పిదప భుక్తాయాసం తీర్చుకోడా నికి ఒకటి రెండు గంటలు అక్కడే పడుకుని వెళ్ళేవాడిని'' అని దర్భావారు చెప్పేవారట.

## రెండు తరాలకు పైగా తండ్రీ కొడుకుల పాఠాలు

రామచంద్ర శాస్త్రిగారు, దుర్గా నాగేశ్వర శాస్త్రిగారు - తండ్రి కొడుకు లిద్దరు 75 సంవత్సరాల పాటు బందరు నోబిల్ కళాశాలలో ఆంధ్రోపాధ్యాయులుగా ఉన్నారు. రామచంద్ర శాస్త్రిగారికి బందరు ఉప్పెన అనుభవమూ ఉంది.

ఒకసారి ఎవరో గిట్టని వారు నాగేశ్వర శాస్త్రిగారికి వాగ్బంధం చేశారు. అప్పుడు ఆయన ఇంటికి పోకుండా ఒక వీధి మలుపులో ఒక రోజంతా ఉండి వాగ్బంధం తిప్పుకున్నారట. ఇంటికి రాలేదేమని వెతుక్కుంటూ వచ్చిన వాళ్లతో పలక, బలపం తెమ్మని సైగ చేసి, దాని మీద ''మీరు భయపడ వద్దు. మరుసటి దినం ఇంటికి వస్తాను'' అని ధైర్యం చెప్పి పంపిం చారట.

## మత్తుమందు లేకనే శస్త్ర చికిత్స

నాగేశ్వర శాస్త్రిగారు శస్త్ర చికిత్స కోసమని మద్రాసులోని ఒక సుప్రసిద్ధ వైద్యుని వద్దకు వెళ్లారు. డాక్టర్ మత్తుమందు ఇవ్వబోగా, వద్దని చెప్పి, మత్తుమందు లేకనే శస్త్రచికిత్స చేయించుకోగా, వైద్యులు ఆశ్చర్యపడ్డారు.

నాగేశ్వర శాస్త్రిగారు అమృతానంద స్వామికి గురువులు. ఈయన పూర్వాశ్రమం పేరు నాగభూషణం గారు. నాగేశ్వర శాస్త్రిగారు నిరాడంబరులు గనుక నివురుగప్పిన నిప్పులాగ ఉండేవారు. ఈయన మంత్ర శాస్త్రవులోతులు ఎరిగిన వారని ఎవరికీ తెలియదు. నాగభూషణం గారు ఆ మార్గంలో ఉన్న వారుగనుక ఈ సంగతిని ఎలాగో పసిగట్టి, వారియింటికి వచ్చి, శాస్త్రిగారి పాదాల మీద పడిపోయారట అమాంతం. ''మీరు అనుగ్రహిస్తా నంటే తప్ప లేవను'' అని అన్నారట. నాగేశ్వరశాస్త్రిగారు ఏమిటో తెలియకవిస్తుపోయి, ''ఏమిటి విషయం?'' అని, ప్రశ్నించగా, నాగభూషణం గారు ''ముందుగా మాట ఇవ్వండి.'' అని శాస్త్రిగారి అంగీకారం పొందిన మీదట, తమకు మంత్ర శాస్త్ర రహస్యాలు బోధించవలసినదిగా అభ్యర్థించారట. ఆ విధంగా ఆయన శిష్యులై తర్వాత అమృతానందస్వామి అయినారు. ఆయన శిష్యులు కాంచనపల్లి కనకమ్మగారు, చుండూరు వెంకటరెడ్డి గారు విజయవాడలో అమృతానందస్వామి పీఠం ఏర్పాటు చేసి, దాని పక్షాన ఆధ్యాత్మిక, సాహిత్య కార్యక్రమాలు జరుపుతుండేవారు. కనకమ్మగారు త్రిలింగ విద్యాపీఠ గురుప రంపరలో నాగేశ్వరశాస్త్రి గారిని, రామచంద్ర శాస్త్రిగారిని ప్రస్తుతించడం ఇది వరకే తెలిపాను.

నాగేశ్వర శాస్త్రిగారి సమకాలికులు చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారు. ఆయన నోబిల్ కళాశాలకు అనుబంధమైన హైస్కూలులో పని చేసేవారు. వెంకటశాస్త్రిగారు తమ కథలు - గాథలు జ్ఞాపకాలలో రామచంద్ర శాస్త్రిగారిని, నాగేశ్వర శాస్త్రిగారిని గురించి ప్రస్తావించారు.

నాగేశ్వర శాస్త్రిగారు తమ కుటుంబంలోని వారికెవ్వరికీ మంత్ర శాస్త్ర రహస్యాలు చెప్పలేదు. లక్ష్మీ మనోహరం గారి రెండవ కుమారుడు శేషావధాని గారు, శాస్త్రిగారి చివరినాళ్లలో జంకుతూ, తనకు ఏదైనా మంత్రోపదేశం చేయమని కోరారు; ఆధ్యాత్మిక విషయం చెప్పమనీ ప్రార్థిం చారు. ఆయన ''అవన్నీ ఎందుకురా. గాయత్రి చేసుకో!'' అన్నారట. అదే వేద వాక్కుగా భావించి శేషావధానులు గారు నిష్ఠాపరాయణులై గాయత్రీ మంత్ర జపంచేశారు. తైత్తిరీయం మున్నగు ఉపనిషత్తులు పఠిస్తూ, చివరి దశలో 'సోహం' భావం పొంది, ఏ విధమయిన సాంసారిక బంధాన్ని

దరికి రానీక 1960లో పరమపదించారు. ఈయన మొదట హైస్కూలులోను, తరువాత రెవెన్యూ శాఖలోను గుమాస్తాగా పనిచేశారు. కాని క్రమంగా ఆధ్యాత్మిక పరిణతి పొందారు.

## లక్ష్మీ మనోహరంగారి త్యాగ సేవ

రామచంద్ర శాస్త్రిగారి జ్యేష్ఠ పుత్రులు, రామకృష్ణయ్యగారి జనకులు అయిన లక్ష్మీ మనోహరం గారిని గురించి ముఖ్యమైన విషయం ఒకటి చెప్పాలి. ఈయన మెట్రిక్యులేషన్ ప్యాసయి బందరు తాలూకాఫీసులో గుమాస్తాగా చేరారు. ఈయనా, ఈయన భార్య సీతమ్మ రామచంద్రశాస్త్రిగారికి సకలోపచారాలతో సేవ చేసేవారు. లక్ష్మీ మనోహరం గారికి ఎన్నోసార్లు ప్రమోషన్ వచ్చింది. కాని, ప్రమోషన్ వస్తే వేరే ఊరు పోవలసి వస్తుందని, తండ్రిగారికి సేవ చేసేవారు ఎవరూ ఉండక పోతారని ప్రమోషన్ మానుకొని, బందరులోనే ఉండి పోయారు. చివరికి హెడ్ గుమాస్తాగానే ఉద్యోగ విరమణ చేశారు. ఈయన దగ్గర పనిచేసే వారంతా డిప్యూటీ కలెక్టర్లు, ఇంకా ఎన్నో పెద్దపెద్ద ఉద్యోగులు అయ్యారు. వాళ్లందరికీ లక్ష్మీ మనోహరంగారంటే వారి మహోన్నత వ్యక్తిత్వాన్ని బట్టి చాలా గౌరవం.

ఆయన సంస్కృతం బాగా చదువుకొన్నారు. కాని, గొప్ప పండితులు కారు. తండ్రి గారయిన రామచంద్ర శాస్త్రిగారి సేవకే జీవితం అర్పించి, తక్కువ జీతంతోనే సంతృప్తి పడి ఆదర్శ ప్రాయులయ్యారు.

ఈయన 1861లో పింగళ నామ సంవత్సర భాద్రపద పౌర్ణమి నాడు జన్మించారు. 12వ ఏట వివాహం జరిగింది. భార్య సీతమ్మగారు, గొడవర్తి నాగేశ్వరావ ధానుల కుమార్తె.

లక్ష్మీ మనోహరం గారికి ఇద్దరు కుమారులు. రామకృష్ణయ్య, శేషావధానులు అనేవారు. శేషావధానుల సంగతి ఇదివరకే తెలిపాను. ఆయనకు ఇద్దరు కుమారులు.

## రామకృష్ణయ్యగారు

రామకృష్ణయ్యగారు సాహిత్య మర్మజ్ఞులు. ఈ శతాబ్దం పూర్వార్ధంలలో తెలుగులో పరిశోధనకు బంగారు బాటలు తీర్చినవారు. ప్రాచ్యపాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులను ఆకళించుకున్న రామకృష్ణయ్యగారు తెలుగు భాషా వ్యాకరణాధ్యయనంలో ఆధునిక భాషా శాస్త్ర పద్ధతిని, తెలుగు సాహిత్యాధ్యయనంలో పాశ్చాత్య విమర్శ సూత్రాల సమన్వయాన్ని ప్రవేశ పెట్టిన అభ్యుదయ వైతాళికులు. "ప్రాక్ప్రతీచీ విజ్ఞానాలను, సాహితీ సంప్రదాయాలను జీర్ణించుకొని తెలుగు భాషా సాహిత్యములలో స్వతంత్ర విమర్శన దృష్టిని ప్రవేశపెట్టిన వారిలో శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారొకరు." అని అభ్యుదయ పత్రిక వీరిని కీర్తించింది. (1947-ఏప్రిల్.)

* * *

రామకృష్ణయ్యగారు ఖరనామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి చిత్రా నక్షత్రం నాడు (1891 అక్టోబర్ 2వ తేదీ) అమలాపురంలో మాతామహుల ఇంట్లో జన్మించారు. మాతామహులు గొడవర్తి నాగేశ్వరావధానులుగారు. ఈయనను గురించి ఒక ఉదంతం ఉంది. ఈయన చాల నిష్ఠాపరులు. వేంకటేశ్వర భక్తులు. ఈయన తమ యింటి ఆవరణలో ఒక చోట వేంకటేశ్వరుని పటం పెట్టి దానికి దగ్గరగా ఒక బిందె పెట్టే వారు. భక్తుల కానుకలతో ఆ బిందె నిండి పోయేది. తర్వాత మరొక బిందె. అదీ నిండి పోయేది. ఆ డబ్బుతో నాలుగు గోడలు లేపి పాక వేశారు. ఆ పాక క్రమంగా మంటపంగా మారింది. తర్వాత వేంకటేశ్వర విగ్రహ ప్రతిష్ఠ, గుడి ఆవరణం ఏర్పడ్డాయి. తర్వాత గుడి చుట్టూ ఇళ్లు వెలిశాయి. ఇప్పుడది అమలాపురంలో వెంకటేశ్వరాగ్రహారం, పెద్ద క్షేత్రమయింది.

## రామకృష్ణయ్యగారి బాల్యం

రామకృష్ణయ్య గారు తల్లిదండ్రులకు చిరకాలానికి పుట్టిన కుమారులు. తల్లి సీతమ్మగారు ఓరిమీ భక్తి పవిత్రత మొదలయిన గుణాలకు సీతమ్మే. పది తరాలనుంచి పండిత కుటుంబం. తాతగారు గోదావరి జిల్లా నుంచి వచ్చి బందరు చేరి, అక్కడ గౌరవాదరాలతో ఇరుగు పొరుగు వారి ప్రోత్సాహంతో కట్టిన యిల్లు తండ్రితాతల అనూచాన శిష్ట సంప్రదాయ గౌరవాలతో తులదూగేది. వచ్చేపోయే బంధువులు, పెద్దలు, పండితులు, శిష్యులతో సందడిగా ఉండేది. ఒకనాడు ఎడవల్లి రామకృష్ణయ్య గారనే జ్యోతిర్వేత్త వచ్చారు. ఆయన నిష్ఠాపరులైన పండితులు. "ఈ పిల్లవాడు చాల అదృష్టవంతుడు. ముద్రణాధికారి అవుతాడు" అని జ్యోస్యం చెప్పారు. ఆ మాటకు తల్లిదండ్రులు "భాగ్యవంతం ప్రసూయేథాః మా శూరం మా చ పండితమ్" అనే భారత సూక్తిని స్మరించుకొని, పిల్లవాడు అదృష్టవంతుడైతే చాలును అని సంతోష పడ్డారు. తదనుగుణంగానే రామకృష్ణయ్యగారి జీవితంలో అదృష్టం కూడి వచ్చింది.

రామకృష్ణయ్య గారికి బాల్యంలో పరిసరాలు విద్యానుకూలమైనట్టివి. రామచంద్ర శాస్త్రిగారి గాంభీర్య గౌరవాలు, వారి గ్రంథరచనా వ్యగ్రత, పాండిత్య ప్రభావాదుల ఎడల చుట్టుపట్ల వారికి ఉన్న గౌరవాదరాలు రామకృష్ణయ్యగారి లేలేత మనస్సుపై ముద్ర వేశాయి. బందరు బడిలో కొంత కాలం

చదివారు. బండకొయ్యల, కోదండాల శిక్షణ పద్ధతి ప్రబలంగా ఉన్న కాలమది. వీధిబడిలో ఈయన అలాటి శిక్షకు గురికాలేదు కాని, తోటి విద్యార్థులు ఈ శిక్షలకు గురి అవుతుండడం చూచి నిర్విణ్ణులై దుఃఖించేవారు. తర్వాత నాదెళ్ల పురుషోత్తమ కవిగారి ప్రాథమిక పాఠశాలలో చేరారు. ఆ కాలంలో ప్రాథమిక విద్యాబోధనకు నాదెళ్ల వారిది పెట్టింది పేరు. పిల్లలకు ఆయన ఎడల భయభక్తులు ఆదరాభిమానాలు హెచ్చుగానే ఉండేవి.

రామకృష్ణయ్యగారు నాదెళ్ల పురుషోత్తమ కవిగారి ప్రాథమిక పాఠశాలలో చదివిన తర్వాత మూడవఫారం వరకు హిందూ హైస్కూలులో చదివారు. నాల్గవ ఫారం నుంచి నోబిల్ కాలేజీలో చేరారు. అక్కడే బి.ఎ. పూర్తి చేశారు. ఇంకా అప్పటికి పాతచేతులు బ్రహ్మయ్య లింగంగారు తెలుగు పండితులు, కుంటి రంగాచార్యులు గారు సంస్కృత పండితులుగా ఉన్నారు. వారి చమత్కార భాషణలు, పిల్లల వేళాకోళాలు, తెలుగు క్లాసులో అల్లర్లు విశేషంగా ఉండేవి. అప్పుడు హెడ్ మాస్టరు కుంభకోణం కృష్ణమాచార్యులు గారు. ఆయన హయాం బెత్తపు దెబ్బలహయాం. ఆయనంటే చిన్నా, పెద్దా అందరికీ హడల్. ఆయన ఆంగ్ల పాండిత్యం, బోధన శక్తి కూడ హడలెత్తించేవే. కోకా పిళ్లారి సెట్టి ఫుట్‌బాల్, టెన్నిస్ పందేలు మహోత్సాహంగా జరిగేవి.

దేశంలో స్వాతంత్ర్యోద్యమం తీవ్రంగా ఉంది. దాని భాగంగా వందేమాతరం ఉద్యమం ముమ్మరమైంది. మహావక్త బిపిన్ చంద్రపాల్ దేశమంతటా సుడిగాలి వలె తిరుగుతూ బ్రిటిష్ ప్రభుత్వ ప్రతికూల ప్రసంగాలు చేస్తూ దేశప్రజలను ప్రోత్సహిస్తున్నారు. ఆయన బందరుకు కూడ వచ్చి ప్రసంగించారు. కౌతా శ్రీరామ శాస్త్రిగారు బందరులోని మచ్చుల చావడిలో ఎడతెగకుండ జాతి ప్రబోధక ప్రసంగాలు చేస్తున్నారు. వాటిని విని విద్యార్థులు దిగ్భ్రమ చెందుతు న్నారు. రవీంద్రనాథ ఠాకూర్ మున్నగు వారు భారతీయ ప్రతిభను ప్రపంచ వ్యాప్తం చేస్తున్న కాలం అది. గాంధీజీ ఆఫ్రికాలో సత్యాగ్రహం చేస్తూ ప్రపంచప్రజలను ఆకర్షిస్తు న్నారు. ప్రత్యేకంగా బందరులో హిందూ హైస్కూలు ఇసుకబయలులో సభలు సమావేశాలు జరిగేవి. గాంధీజీ బందరుకు వచ్చినప్పుడు తమ (రామకృష్ణయ్యగారి) సహాధ్యా యులు శ్రీమత్తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులుగారు గాంధీజీకి ఒక్కసారిగా 500-00 రూపాయలు విరాళ మివ్వడం, హిందూ బాల భారత సమాజంలో మతోపన్యా సాలు, ప్రభుత్వ విద్యావిధానానికి నిరసనగా స్థాపించిన ఆంధ్ర జాతీయ కళాశాల కోసం దీపావళి సందర్భంగా వసూళ్లు, స్వాముల వార్ల భిక్షలు, దేవాలయాల్లో వేదాంతోపన్యాసాలు, కళాశాలలలో క్రైస్తవ మతబోధకులయిన ప్రిన్సిపాలులు మున్న గువారి దైనందిన ప్రార్థనలు (సెర్మన్లు), చర్చలు, కొందరు విద్యార్థుల క్రైస్తవమత స్వీకరణ ప్రయత్నాలు, వాటి ప్రతిఘటన యత్నాలు, శివగంగ మహిషాసుర మర్దనీ ఉత్సవాలు, ఏనుగంబారీలు, తాలింఖానాలు, దీపావళినాడు టంక సేరు తోటాల అడాయీలు - ఇలా రామకృష్ణయ్యగారి విద్యార్థిదశ అతి చమత్కారంగా జరిగింది. రామకృష్ణయ్య గారు మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులు కాగానే, వారికి ముంగండ గ్రామవాసు లయిన ఖండవల్లి రామమూర్తి శాస్త్రిగారి ద్వితీయ పుత్రిక అన్నపూర్ణాంబ గారితో వివాహం జరిగింది.

## నోబిల్ పాఠశాలలో పండిత పదవి

రామకృష్ణయ్యగారి పినతండ్రి నాగేశ్వర శాస్త్రిగారికి సంతానం లేదు. ఆయన రామకృష్ణయ్యగారిని కుమారుని లాగ చూచేవారు. కళాశాలలోనేకాక, ఇంట్లోను ఆయనకు గురువులుగా ఉండేవారు. అందువలననే రామకృష్ణయ్యగారు తమ ఆంధ్ర భారత కవితా విమర్శనము ప్రారంభంలో

''శ్రీరామచంద్ర కృతినం
ద్వంద్వాతీతం గురోర్గురుమ్,
యోగీశ్వరం జ్ఞానధనం
వందే నాగేశ్వరం గురుమ్.''

అని నాగేశ్వరశాస్త్రిగారిని గురువులుగా స్మరించారు. రామకృష్ణ య్యగారు మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణులై కాలేజీకి వచ్చారు. నోబిల్ కాలేజీలో బి.ఎ. చదివారు. ఈయన కాలేజీకి వచ్చేసరికి కొత్తగా వచ్చింది ఇంటర్మీడియేట్ పద్ధతి. ఎఫ్.ఎ.లో నియతంగా ఉండే లెక్కల బాధ తప్పించుకొని తెలుగు, సంస్కృతం, చరిత్రలు ఐచ్ఛిక విషయాలుగా చదివే అవకాశం ఏర్పడింది. ఆ కాలేజీలోనే పినతండ్రి నాగేశ్వరశాస్త్రి గారు పండితులు. ఆయన ప్రోత్సాహంతో సంస్కృతాంధ్రాలు అభిమాన శాఖగా బి.ఎ.లో రామకృష్ణయ్యగారు చేరారు. ఇంట్లో కావ్య శాస్త్ర పాఠాలు వారివద్దనే చదివేవారు. అప్పుడు వాళ్లతరగతిలో ఇద్దరే విద్యార్థులు ఉండేవారు. రామకృష్ణయ్య గారు 1915లో బి.ఎ. పరీక్షలో ఉత్తీర్ణులు కాగానే, నోబిల్ పాఠశాలలో పండితులుగా నియమితులయ్యారు.

రామకృష్ణయ్య గారి సహాధ్యాయులు శ్రీ మత్తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులుగారు నోబిల్ కాలేజీలో బి.ఎ. పట్టభద్రులయిన తర్వాత మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఎం.ఎ. సంస్కృతం రెండేళ్లు మహామహోపాధ్యాయ కుప్పు స్వామి శాస్త్రిగారి వద్ద చదువుకున్నారు. తర్వాత ఆయన

విజయనగరం సంస్కృత కళాశాలలో వైస్ ప్రిన్సిపాలుగా చేరారు. కొంత కాలం తర్వాత ఆయన స్వరాజ్యోద్యమంలో పాల్గొని తమ పదవిని వదలిపెట్టి, స్వగ్రామమయిన చిట్టిగూడూరులో సంస్కృత కళాశాల స్థాపించి తామే ప్రిన్సిపాలయి విద్యార్థులకు భోజనాది వసతులు ఏర్పాటుచేసి నిర్వహించి, పెక్కుమందిని సంస్కృతాంధ్ర విద్వాంసులనుగా తీర్చిదిద్దారు.

## ఆనంద గజపతి ప్రోత్సాహం

రామకృష్ణయ్యగారు నోబిల్ పాఠశాలలో పండితులుగా పని చక్కగానే నిర్వహిస్తున్నారు. ఆ సమయంలో విజయనగర సంస్కృత కళాశాలలో వైస్ ప్రిన్సిపాలుగా వరదాచార్యులు గారు పనిచేస్తున్నారు. విజయనగరం ఆర్ట్స్ కాలేజి ప్రిన్సిపాలు తమ కాలేజీకి సంస్కృతం, తెలుగు లెక్చరర్ స్థానానికి ఒక వ్యక్తి కావాలని కోరారు వరదాచార్యులు గారిని. ఆయన రామకృష్ణయ్యగారి పేరు సూచించారు. అక్కడ బి.ఎ. లో పార్ట్ - III తెలుగు - సంస్కృతం పెట్టారు. ఆంధ్ర ప్రాంతంలో అప్పుడు కాలేజీలు ఉన్నది నాలుగు పట్టణాలలోనే - విజయనగరం, రాజమండ్రి, బందరు, అనంతపురం. బి.ఎ. పార్ట్ III విజయనగరం కాలేజీలోనే మొట్టమొదట ప్రవేశ పెట్టారు. మద్రాసు విశ్వవిద్యాలయం అనుమతి పొందారు. దానికి కారణం బహుశా ఆనంద గజపతి ప్రోత్సాహం కావచ్చు. ఆయన సంస్కృతాంధ్రాలలోనూ పండితులు. తక్కిన రాజుల లాగ శ్రుత పాండిత్యంవారు రు. పండితుల వాగ్వాదాలలో తాము పరీక్షకులుగా వహరించి, వారివారి విద త్తుకు తగినట్లు బహూకరించగల శ సంపన్నులు. ఆయన ' చ్యవిజ్ఞానం కలవారు మాత్రమే _క, ఆ కాలంలో పాశ్చా దేశాల్లో జరుగుతున్న భాషాశాస్త్ర చర్చలతోను పరిచయం కలవారు. మాక్స్‌ముల్లర్ ఋగ్వేదాన్ని నాగరీలిపిలో ముద్రించడానికి ప్రోత్సాహమిచ్చినవారు. పాశ్చాత్య పండితులు సంస్కృత భాషా పరిచయంతో ఇండో-యూరోపియన్ ఏక భాషా కుటుంబం ఏర్పరచి ఆయా భాషలకుగల పరస్పర సంబంధాన్ని పరిశీలించిన కాలమది. ఈ పరస్పర సంబంధ నిరూపణ వల్ల జనించిన భాషా సిద్ధాంతాలను ప్రపంచంలోని ఇతర భాషలకు కూడ అన్వయింప జేసి, ఇతర భాషా కుటుంబాలను కనుగొనాలనే ఉత్సాహం పొంగులు వారిన కాలమది. 19వ శతాబ్దంలో భారతదేశానికి మతప్రచారకుడుగా వచ్చిన రెవరెండ్ కాల్డ్‌వెల్ తెలుగు, కన్నడ, తమిళ, మలయాళ భాషలు సంస్కృత జన్యాలు కావని, అవి ఒక ప్రత్యేక కుటుంబానికి చెందినవని Comparative grammar of the Dravidian or the South Indian Family of Languages" అనే గ్రంథం ప్రచురించారు. ఈ సిద్ధాంతాన్ని గురించి ఆలోచించినవారు చాలా తక్కువ. కనుక ఒక సంస్థద్వారా పరిశోధించ వలసిన అవసరం ఉందని ఆనందగజపతికి తోచి ఉంటుంది.

ఆనందగజపతి వారసుడు అలకనారాయణ గజపతి కూడా కాలేజీ అభివృద్ధి పరిశోధనల విషయంలో చాల కుతూహలోత్సాహాలు చూపించే వారు. 1921లో "Maharaja's College Magazine, a quarterly Journal devoted to Research" అనే త్రైమాసిక పత్రిక ప్రారంభించారు.

ఈ పత్రికలో కొన్ని పుటలలో కాలేజీనివేదిక మినహా మిగతా ఎక్కువ భాగం పరిశోధన వ్యాసాలే ఉండేవి. విజ్ఞాన శాస్త్రంలో చాల పురోగమించిన పరిశోధన వ్యాసాలు ఈ పత్రికలో ప్రచురిత మయాయి. విదేశాలనుంచి శాస్త్రజ్ఞుల అభిప్రాయాలు, నోట్సు ప్రచురించేవారు.

## విజయనగరం కళాశాలలో లెక్చరర్ పదవి

శ్రీ వరదాచార్యులుగారి చొరవతో కళాశాల ప్రిన్సిపాలు శ్రీ రామనుజాచార్యులు (రామావతారం) గారి పిలుపుతో రామకృష్ణయ్య గారికి ఆ కళాశాలలో సంస్కృతాంధ్రోపన్యాస కోద్యోగం సులభంగానే దొరికింది. నోబిల్ హైస్కూలులో ఏ రెండవ ఫారం ఉపాధ్యాయులుగానో స్థిరపడి పోకుండ కాలేజీలో ఉద్యోగం లభించడం అదృష్టమనే అప్పులందరు అన్నారు. కాని, తండ్రి గారైన లక్ష్మీ మనోహరంగారికి మాత్రం కుమారుడు రెవెన్యూ పరీక్షలు చదివి డిప్యూటీ తాసీల్దారు కావాలని ఉండేది. ఆ విధంగానే సలహాయిచ్చార కూడా. కాని, అప్పటికి విజయనగరం కళాశాలలో సంస్కృతాంధ్రాలు రెండు భాషల్లో బి.ఎ.లో ఉత్తీర్ణులయినవార అవసరం కావడం, ఇతరు లెవరూ పోటీ లేక పోవడం అదృష్టమనే చెప్పాలి. రామకృష్ణయ్యగారు ఆ పదవిలో ఉం బి.ఎ. పార్ట్ - III విద్యార్థులకు సంస్కృత భాషాశాస్త్రం ద్రావిడ వ్యాకరణం బోధించ వలసి ఉండడం వల్ల భాషా శాస్త్ర విషయంలో కొంత శ్రద్ధతో పని చేయవలసి ఆవశ్యకత ఏర్పడింది.

## రామకృష్ణయ్యగారి వ్యాస రచన

ఉద్యోగం ప్రారంభం నుంచే ఆయా శాఖలలో ఉద్దండులై వారి సాహచర్యం రామకృష్ణయ్య గారి పరిశోధనకు చా ఉపయోగకరమైంది. ఆంగ్ల భాషోపన్యాసకులు ఉళ్లాల్ సుబ్బ యభట్టు గారితో వారికి సన్నిహితత్వం ఏర్పడిం భట్టుగారు తుళు, కన్నడ భాషలను బాగా ఎరిగిన వార కనుక వారితో ద్రావిడభాషా తత్త్వాన్ని గూర్చి తరచ కన్నడ తుళు భాషలను గూర్చి చర్చిస్తూ ఉండేవార

దాని వల్ల ద్రావిడ భాషా శాస్త్రాభినివేశం, తత్తత్త్వ పరిశీలన కుతూహలమూ విశేషంగా పెంపొందాయి. శ్రీ భట్టుగారి ప్రోత్సాహంతోను, ఆయనతో కలసీ రామకృష్ణయ్య గారు కాలేజీ త్రైమాసిక పత్రిక మొదటి సంచికలో ''ద్రావిడ భాషాపద చరితము'' అనే వ్యాసం వ్రాశారు. ద్రావిడ భాషా తులనాత్మక పరిశీలనకు రామకృష్ణయ్యగారే వైతాళికులు. భట్టుగారి ప్రోత్సాహంతోనే వర్ణోత్పత్తి క్రమం గురించి, ఇలాగే మరికొన్ని వ్యాసాలు వ్రాశారు. అక్కడ తెలుగు పండితులుగా ఉన్న అడిదము రామారావు, వింజమూరి గోవిందరాజా చారి గారు మొదలయిన వారి ప్రోత్సాహంతో కొన్ని సాహిత్య వ్యాసాలను, విమర్శలను, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికకు వ్రాశారు. తక్కిన పత్రికలకు వ్యాసాలు వ్రాయనారంభించారు.

అప్పటికి తెలుగుదేశంలో భాషాశాస్త్రం (Philology) లో పరిశ్రమ చేస్తుండినవారు యిద్దరే - గిడుగు రామమూర్తి పంతులు గారు, చిలుకూరి నారాయణరావుగారు. వీరిద్దరూ కూడ ఆధునిక భాషా సిద్ధాంతాలను క్షుణ్ణంగా ఎరిగిన వారు. రామ మూర్తి పంతులుగారి దృష్టి గ్రాంథిక వ్యావహారిక భాషాభేదాల మీద పడింది. వ్యవహారంలో ఉన్నభాషనే కదా ప్రజలు తమ అవసరాలకు వాడుకోవలసింది అనే జిజ్ఞాసతో ఆయన వ్యావహారిక భాషోద్యమంలో పడ్డారు. ద్రావిడ భాషా పరిశోధన వారి రంగం కాదు. ఇక చిలుకూరి నారాయణరావు గారు ఆంధ్ర భాషా చరిత్ర రచనకు పూనుకొని, తెలుగుకు ఇతర ద్రావిడ భాషలతో గల సంబంధం, ద్రావిడ భాషల విశిష్టత మున్నగు వాటిలో పరిశోధన చేసిన వారే. కాని, తెలుగు ప్రాకృత జన్యమనే సిద్ధాంతంతో మరొక దారి తొక్కారు. ప్రాకృత జన్యవాదమున తాను సూచించిన ధ్వని మార్పులు ధ్వని సూత్రములకు కట్టుబడుతున్నవా అనే జిజ్ఞాస లేని కారణంగా, ఆయన చేసిన రూపనిష్పత్తి శాస్త్రీయం కాకపోయింది. దొందు రెండుగా మారింది అని అన్నప్పుడు, దకారం అదే సన్నివేశంలో ఇతర రూపాలలో కూడ రేఫగా మారిందని చూపించాలి కదా! తెలుగు పదాలకు మూలధాతువుల పోలిక చూపడం కూడ శాస్త్రీయ మనిపించుకోదు. ఉ.సం.భింద్ - తె.పీకు. అయినా ఆంధ్రవిశ్వవిద్యాలయం ప్రచురించిన ఆంధ్ర భాషా చరిత్ర రెండు సంపుటాలలోను నారాయణరావు గారి అసాధారణ మైన కృషి కనిపిస్తుంది.

## రామకృష్ణయ్యగారి తులన పద్ధతి

రామకృష్ణయ్యగారు విజయనగరంలో ద్రావిడ భాషలను గురించి, వాటి పరస్పర సంబంధం, ద్రావిడ భాషలలో లింగవచన పదాలలో పోలిక మొదలయిన వాటిని గురించి శాస్త్రీయ పద్ధతిలో పరిశోధన చేస్తూ, మొదట్లో విజయన గరం కాలేజీ మేగజైన్‌లోను, తర్వాత భారతి మున్నగు పత్రికలలోను అసంఖ్యాకంగా వ్యాసాలు ప్రచురించారు. వారి ద్రావిడ భాషాశబ్ద నిష్పాదన చర్చ ఇలా ఉంటుంది: తెలుగులో బాహుమూలానికి చంక అనే పదం వాడుతున్నాము. దీనిని తమిళులోని కైక్కుళి అనే శబ్దంతో పోల్చారు. కై=చేయి, కుళి=గొయ్యి. ఒక మూల ధాతువు నుంచే ఈ పదాలు ఏర్పడినాయని, తాలవ్యీకరణం చేత కకారం చ కారమయిం దనీ నిరూపించారు. ఇతర భాషలలోను తాలవ్యీకరణ సూత్రం వర్తిస్తుంది. గ్రీకు భాషలో 'కెకోరె' శబ్దం ప్రాచీనం. కకారం మీద తాలవ్యాచ్చు 'ఎ' కారం ఉండడం వల్ల సంస్కృతంలో అది సమీకరణం చేత తాలవ్య మయింది. పూర్వ సంస్కృ తంలో కెకోరే ఉండి చెకోరె అయి అనంతర కాలంలో ఎకార ఒకారాలు అకారంగా మారడం చేత 'చకార' అయింది. ఈ భాషా శాస్త్ర వ్యాసంగం ఆంగ్లోపన్యాసకులు సుబ్బరాయ భట్టుగారి సహకారంతో నిరంతరం నిరంతరాయంగా జరి గింది.

## సాహిత్య వ్యాసాలు

రామకృష్ణయ్యగారు కాలేజి మేగజైనులో భాషా శాస్త్రానికి సంబంధించినవీ శ్రీనాథుడు-సంధియుగము, భీమేశ్వరపురా ణము, రస చర్చమొదలుగా తెలుగు సాహిత్యానికి, అలంకార శాస్త్రానికీ సంబంధించిన అనేక వ్యాసాలు వరుసగా ప్రచురిం చారు. అవ్యాసాలు ప్రచురించిన సంచికలు ప్రస్తుతం లభ్యం కావడం లేదు. విజయనగరం కాలేజీ వారికి ఇలాటి మేగజైను వుందనే విషయం కూడ ఇప్పుడు తెలిసినట్టు కనిపించదు.

రామకృష్ణయ్యగారు భాషాశాస్త్ర పరిశోధన, సాహిత్య విమర్శ ఇలా సాగిస్తూ 1921లో సంస్కృతాంధ్ర భాషలు అభిమాన భాగంగా ఎం.ఎ. పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. 1924లో మద్రాసులో అఖిల భారత ప్రాచ్య విద్యావేత్తల మహాసభ (ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్స్) జరిగింది. కాలేజి ప్రిన్సిపాల్ శ్రీ రామానుజాచార్యులు గారి ప్రోత్సాహంతో కాలేజీ పక్షాన ప్రతినిధిగా (డెలిగేట్‌గా) ఆ మహాసభలో పాల్గొన్నారు. అప్పటి నుంచి తరచు ఆ మహాసభలకు వెళ్లేవారు. ఇలా పాల్గొనడం చాల ప్రయోజనక రంగా ఉండేది. మద్రాసు విశ్వవిద్యాలయంలో చేరిన తర్వాత ప్రతి సభకు విశ్వవిద్యాలయం పక్షాన వెళ్లేవారు. దీనివల్ల ఆయా రంగాలలో కృషి చేసే వారితో పరిచయాలు ఏర్పడేవి. ఈ విధంగా ఏర్పడినదే మహావిద్వాంసులు, పశ్చిమ వంగ రాష్ట్ర శాసనసభ అధ్యక్షుడు డాక్టర్ సునీతికుమార్ చటర్జీ

గారితో స్నేహం. ఆయన ద్రావిడ భాషా శాస్త్రంలోను గొప్ప పరిశ్రమ చేసిన వారు గనుక వారితో రామకృష్ణయ్య గారు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవారు. రామకృష్ణయ్యగారు విజయనగరం కాలేజీలో పన్నెండు సంవత్సరాలు పని చేశారు. ఆ పన్నెండేళ్లూ ఆయన చేసిన కృషి మౌలిక పరిశోధన అనదగినది. 1947లో దర్భాంగాలో జరిగిన ఓరియంటల్ కాన్ఫరెన్స్ 14వ సమావేశంలో ద్రావిడవిజ్ఞాన విభాగానికి అధ్యక్షత వహించారు.

## మద్రాసు విశ్వవిద్యాలయం ఆహ్వానం

మద్రాసు విశ్వవిద్యాలయానికి సర్ రఘుపతి వెంకట రత్నం నాయుడుగారు వైస్ ఛాన్సలర్ అయ్యారు. ఆయన ఆదేశంతో 1927లో మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగు, కన్నడ, తమిళ, మళయాళ శాఖలు ప్రారంభించాలనే నిర్ణయం జరిగింది. ఈ నాలుగు భాషల శాఖలు ప్రారంభించడం వల్ల తులనాత్మక అధ్యయనానికి ప్రయోజనకరంగా ఉంటుం దని వైస్ చాన్సలర్ ఉద్దేశం. భాషా శాస్త్ర (Philology) పరిశోధనకు ఎక్కువ ప్రాధాన్యం కల్పించాలని కూడ వారి ఆశయం. ఈ సదాశయంతో విశ్వవిద్యాలయం వారు కోలిన్స్ అనే పాశ్చాత్య భాషా శాస్త్ర విద్వాంసుణ్ని యూరోప్ నుంచి ఆహ్వానించి విశ్వవిద్యాలయంలో భాషా శాస్త్రం మీద ఉపన్యాసా లిప్పించారు.

ఈ నాలుగు శాఖలలో పనిచేయడానికి అర్హులను అన్వేషించి ఆహ్వానించ దలచారు. ద్రావిడ భాషల విషయంలో కొంత అనుభవం, పరిశోధన దృష్టి కలవారిని నియమించాలని వెంకటరత్నం నాయుడుగారి అభిప్రాయం. ఈలాటి అను భవం కలవారు ఇద్దరు ముగ్గురే. గిడుగు రామమూర్తి పంతులుగారు వృద్ధులు కాబోలు! చిలుకూరి నారాయణరావు గారు ప్రభుత్వ కళాశాలలో కుదురు కొని ఉన్నారు 150 రూపాయల వేతనం ఆయనకు అంత ఆకర్షణీయం కాదు. అప్పటికి తెలుగు పార్ట్ III లో బోధించే కళాశాల ఒక్క విజయనగరం కాలేజీయే. ఎవరు దీనికి అర్హులా అని నాయుడు గారు అన్వేషించారు. వారి దృష్టి రామకృష్ణయ్యగారిపై పడింది. అప్పుడు ఇలాటి ఉద్యోగాలకు దరఖాస్తులు పెట్టడం, ఇంటర్వ్యూ వంటి వేమీ లేదు. కాళిదాసు చెప్పినట్టు - ''న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్'' లాగ అర్హులయిన వారిని వెదికి ఎన్నుకొనేవారు. రామకృష్ణ య్యగారికి భాషా సాహిత్య వ్యాసాల మూలంగా కొంత ప్రసిద్ధి అప్పటికే ఏర్పడింది. నాయుడుగారు రామకృష్ణయ్యగారిని మద్రాసు విశ్వవిద్యాలయంలో ప్రాచ్యపరిశోధన సంస్థలో చేరండని ఆహ్వానించారు.

## దివానుకు నాయుడు గారి లేఖ

అప్పుడు మామిడిపూడి వెంకటరంగయ్య గారు విజయన గరం దివానుగా ఉండేవారు. నాయుడు గారు వెంకటరం గయ్య గారికి ఉత్తరం వ్రాసి రామకృష్ణయ్యగారిని మద్రాసు విశ్వవిద్యాలయానికి దరఖాస్తు పంపండని కోరారు. కాని, రామకృష్ణయ్యగారు కొత్త చోటికి వెళ్లడానికి అంతగా ఇష్టపడలేదు, ఊరకున్నారు. కాని, కొన్ని రోజులు గడచిన తర్వాత నాయుడు గారు వెంటరంగయ్యగారికి మళ్లీ కబురు చేశారు ''వారి నుంచి దరఖాస్తు రాలేదు, పంపించ మనండి'' అని. వెంకటరంగయ్య గారు మళ్లీ రామకృష్ణయ్యగారిని పిలిచి, మాట్లాడారు. కాని, రామకృష్ణయ్యగారు మద్రాసుకు వెళ్లడా నికి ఉత్సాహం కనబరచలేదు. ''ఇక్కడ బాగానే ఉంది కదా!'' అని సవినయంగా చెప్పారు దివాను గారికి. అప్పుడు వెంకటరంగయ్యగారు ''దరఖాస్తు పంపండి.'' అక్కడ ఉద్యో గంలో చేరండి. ఇక్కడ మీ ఉద్యోగానికి భద్రత (lien) ఇస్తాను. మీరు ఎప్పుడు తిరిగి రాదలచుకుంటే, అప్పుడు రావచ్చు.'' అని ప్రోత్సహించి పంపించారు.

## మద్రాసుకు పయనం

మద్రాసుకు వెళ్లేటప్పుడు కూడ తిరిగి త్వరలో వచ్చేస్తా మనే రామకృష్ణయ్యగారి భావన. వారి సతీమణి అన్నపూ ర్ణాంబ గారయితే ఇంటి సామానంతా అక్కడ తమ బంధువులు స్థానిక హైస్కూలు హెడ్ మాస్టర్ శ్రీ చెరుకూరి జోగా రావుగారి ఇంట్లో ఒక గదిలో పెట్టి ''మేము మళ్లీ ఏడాదికి వచ్చేస్తాము. అంతవరకు సామాను ఉంచండి'' అన్నారట. అప్పుడు గృహ యజమాని ''ఇంక మీరిక్కడికి ఏం వస్తారు? వాళ్లు వదలి పెట్టరు.'' అన్నారట. ఆయన అన్నట్టుగానే మద్రాసులో ఉండి పోవడం జరిగింది.

మద్రాసు విశ్వవిద్యాలయంలో భాషా విభాగాలలో మొదట ఎం.ఎ. పట్టభద్రులను ఒక్కొక్కరినే నియమించారు. వారిని రీడర్ అన్నారు. వేతనం రూ.150. తర్వాత ఈ పదవిని సీనియర్ లెక్చరర్‌గా మార్చారు. అప్పుడు జీతం స్కేలు 210-15-300 రూపాయలు. ద్రావిడ భాషా శాఖలతోపాటు సంస్కృతం, ఉర్దూ శాఖలూ ఉండేవి. ఈ భాషా శాఖలన్నిటినీ కలిపి ప్రాచ్యపరిశోధన సంస్థ (Oriental Research Institute అన్నారు. ఈ రీడర్లకు బోధన పని ఏమీ లేదు. అప్పటి కళాశాలలలో దేశంలో ఎక్కడా ఎం.ఎ. తరగతులు లేవు అభ్యర్థులు ప్రైవేటుగా చదువు కొని వెళ్లవలసిందే.

## మద్రాసులో రామకృష్ణయ్యగారి దినచర్య

రామకృష్ణయ్యగారి అప్పటి దినచర్యను ఆయన కుమారులు ఆచార్య మహాదేవ శాస్త్రి గారు తెలిపిన దానిని ఇక్కడ పొందుపరుస్తున్నాను: ''అప్పుడు మద్రాసు విశ్వవిద్యాలయం ఎగ్మూరులోని లింబ్డి గార్డెన్స్‌లో ఉండేది, తర్వాత 1939లో మెరీనాబీచిలో నూతన భవనాలు కట్టిన తర్వాత అక్కడికి మారింది. నాన్నగారు లింబ్డి గార్డెన్స్‌కు నడిచి వెళ్లి వస్తుండేవారు. ఇంటి నుంచి పది పదిన్నర గంటకు బయలుదేరేవారు. కోటు, తల పాగా ఉండేవి. సాయంత్రం 5-00 గంటలకు తిరిగి వచ్చేవారు. పనివేళలు 11-00 గంటల నుంచి సాయం కాలం 4-00 గంటల వరకు ఉండేవి. అయినా నిర్బంధం ఏమీ లేదు. పరిశోధన రంగానికి చెందిన వారన్న దృష్టితో వారికి స్వేచ్ఛ ఉండేది. కాని, నాన్నగారు ఎప్పుడూ సకాలానికి వెళ్లే రూఢిని (routine) తప్పలేదు. మద్రాసుకు రాగానే మేము తిరువ ్లికేణిలో కెల్లెట్ హైస్కూలుకు ఎదురుగా ఉన్న స్వామిపి ీధిలో మద్రాసు విశ్వవిద్యాలయం లైబ్రరీలో లైబ్రేరియ గా పనిచేస్తున్న ఎస్.ఆర్. రంగనాథన్ గారింట్లో అద్దెకు ఉండే వాళ్లం. రంగనాథన్‌గారు తర్వాత ప్రపంచ విఖ్యాతులయ్యారు లైబ్రరీ పుస్తకాల వర్గీకరణ విధానానికి. అప్పటి ఇంట్లో కుర్చీలు బల్లలు అనేవి లేవు. నాన్నగారు చాపమీద కూర్చుని పెట్టె మీద వ్రాసుకొనేవారు. ఆంధ్ర భారత కవితావిమర్శన ఆ విధంగా వ్రాసిందే. భారతకవితపై ఆయన విజయ నగరం లోను, మద్రాసులోను ఉపన్యాసాలిచ్చారు. ఆ వ్యాసాలు పుస్తకంగా అచ్చుకాకముందు పత్రికలలో వాటి ముఖ్యాంశాలు విస్తృతంగా ప్రముఖంగా ప్రచురితమయాయి.

''విజయనగరం కాలేజీ అధ్యాపకులు నాన్నగారిని ఎంతో ప్రేమ గౌరవాలతో చూచేవారు. అడిదము రామారావుగారు, తక్కిన అధ్యాపకులూ నాన్నగారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవారు. ఆంగ్లోపన్యాసకులు భట్టుగారు మద్రాసుకు వచ్చినప్పుడు ఒకటి రెండు మాట్లు మా యింట్లో బసచేయడం, బాపాలాల్ దుకాణానికి వెళ్లి నగలు తీసుకోడం నాకు బాగా గుర్తు.

''కొంత కాలానికి స్వామి పిళ్లె వీధినుంచి పార్థ సారథి స్వామి గుడిమాడ వీధియైన తొళసింగపెరుమాళ్ వీధికి, తర్వాత తేరు వీధికి మారాము. తేరు వీధి చివరియిల్లు నెల్లూరు వాళ్లది. దాని పక్క యిల్లు సింగరాచారి వీధికి చేరింది. ఆ యింట్లో బాలారిష్టాలు జరిగేవి. ఆ ఇంట్లోదిగిన వాళ్ల పిల్లలు పోవడంవల్ల శోకాలు తరచుగా వినిపించేవి. ఆ యిల్లు అమ్మకానికి వచ్చింది. అది ఒక మార్వాడీది; పెంకుటిల్లు. చూరూ, ఇల్లూ చాల లోమట్టంగా ఉండేవి. మా అమ్మగారు 'బాలారిష్టాలు మనకేమీ చేయవులే. మన పిల్లలు పెద్ద వాళ్లయ్యారు' అని అన్నారు. నాన్నగారు ధైర్యం చేసి ఆ యిల్లు కొన్నారు. పార్థసారథి స్వామి సన్నిధిని ఉండాలని కోరిక. ఆ యింట్లో ప్రవేశించిన తర్వాత నాన్నగారి చిన్ననాటి స్నేహితులు వారణాసి సుబ్రహ్మణ్యంగారు ఒక మారు వచ్చి, ఇల్లు చూచి, ''తలకు తగులుతూంది పెంక. ఈ యిల్లు ఎలా కొన్నావు?'' అని అడిగారు. నాన్నగారు వెంటనే, ఇంటి కప్పు మీది రెండు పెంకులు తీసి పక్కన పెట్టారు. ఇల్లు పడగొట్టి కొత్తగా కట్టడానికి అది నాంది.

## కొన్న యింటి కథ

''ఆ యింటి మార్వాడీ యిల్లు మాకు ఒప్పజెప్పినప్పుడు ఒక కథ చెప్పాడు: 'ఆ యిల్లు వెనకటికి ఒక వేశ్యది. తల్లీ కూతుళ్లకు పడక వారిలో ఒకరు నగలన్నీ ఇంట్లో ఎక్కడో పాతిపెట్టారు. ఆ విషయం ఎవరికీ చెప్పకుండా ఇద్దరూ మరణించారు. అందుకే ఈ బాలారిష్టాలు.' మా నాన్నగారు ఇల్లు మళ్లీ కట్టించే ప్రయత్నం చేద్దామని అనుకుంటున్న తరుణంలో, ఆ రాత్రి మా అమ్మగారికి ఒక కల వచ్చింది. ఆ కల ఏమిటంటే, చాల అందమైన అమ్మాయి ఒకతె ఒంటినిండా నగలతో లక్ష్మిలా కళ కళలాడుతూ ఉంది. ఆ అమ్మాయి వీధి గదిలో గోడకు చేరబడి నిలుచుంది. 'చిరకాలంగా నేను ఇక్కడ ఉన్నాను. త్వరలో నేను వెళ్లిపోతున్నాను. ఇక ఈ ఇల్లు మీది. మీరు సుఖంగా ఉండండి' అని చెప్పింది. మా అమ్మగారు మేల్కొని మా నాన్నగారితో ఈ కల విషయం చెప్పారు. నాన్నగారు మరుసటి దినం శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారితో ఈ విషయం ప్రస్తావించారు. మార్వాడీ చెప్పిన పాతు ఆ అమ్మాయి నిలుచున్న చోట ఉంటుందని అనుకున్నారు. ఇల్లు కట్టేటప్పుడు జాగ్రత్తగా చూస్తుండమని నాన్నగారు మా అమ్మగారితో చెప్పారు. ఒకరోజు పని వాళ్లు పనిచేస్తూంటే, మా అమ్మగారు ఏదో పని మీద ఐస్ హౌస్‌కు వెళ్లడం జరిగింది. రెండు గంటలయిన తర్వాత తిరిగి వచ్చేటప్పటికి అక్కడ పని వాళ్లెవళ్లూ లేరు. వాళ్లంతా ఏమయ్యారని అక్కడున్న ఒకరిని అడిగితే, అతడు చేత్తో ఒక పెట్టెను అభినయంతో చూపుతూ, బొదె బొదె అన్నాడు. గోడలో ఒక చిన్నఅర, పసుపు రంగుతో కనిపించింది. దాంట్లో ఉన్నది పని వాళ్లు పట్టుకు పోయారన్న మాట. బొదె అంటే పాతు.

## అప్పటి జీతాలు

రామకృష్ణయ్యగారు 1927లో మద్రాసు విశ్వవిద్యాలయంలో రీడరుగా చేరి 1950లో సీనియర్ లెక్చరరుగా

పదవీ విరమణ చేశారు. అప్పటి మద్రాసు విశ్వవిద్యాలయం వేతనాల స్కేలు ఎలా ఉండేదో తెలుపడానికి 1936లో మద్రాసు విశ్వవిద్యాలయం ప్రచురించిన 'Half yearly list of Officers and Servants' (మద్రాసు విశ్వవిద్యాలయం అధికారుల, సేవకుల అర్ధ సంవత్సరం పట్టిక) నుండి తెలుగుశాఖకు సంబంధించిన వివరాలను పేర్కొంటాను:

(10) Oriental Institute (b) Department of Telugu

Korada Ramakrishnayya, Senior Lecturer. Pay Rs 300/- (from 25-7-1930), (Rs.210-15-300), Brahmin, Born 2-10-1891 Appointed as Reader 26.10.1927. Appointed as Senior Lecturer 1-7-1930. Date of promotion to the present grade 1-7-1930 Qualification - M.A.

రామకృష్ణయ్యగారు, తక్కిన సీనియర్ లెక్చరర్లు ఈ వేతనాల స్కేలులో ఆరు సంవత్సరాలకు వేతన గరిష్ఠ పరిమితిని అందుకున్నారు. తరువాత ప్రత్యేక వేతనం అనే పేరుతో రూ. 50-20-150 పెంచారు. దానితో సీనియర్ లెక్చరర్‌ల జీతం గరిష్ఠపరిమితి రు. 450కి పెరిగింది.

## కన్నుమూసేవరకు నిరంతర పరిశోధన

రామకృష్ణయ్యగారు మద్రాసు విశ్వవిద్యాలయంలో పదవీ విరమణ చేసిన పిదప తిరుమల తిరుపతి దేవస్థానం ప్రాచ్య పరిశోధనాలయంలో రీడరుగా నియమితులై ఆరేళ్లు పనిచేశారు. ఆయన విజయ నగరం కాలేజీలో చేరినది మొదలు, మద్రాసు విశ్వ విద్యాలయం ప్రాచ్య పరిశోధన సంస్థలో చేరి, తిరుపతి సంస్థ నుంచి విరమించే వరకు 40 సంవత్సరాలు, తర్వాత కీర్తి కాయులు అయ్యే వరకు కూడ ఆంధ్ర భాషా వాఙ్మయ పరిశోధన రంగంలో నూతన దృక్పథం కలిగించడానికి నిరంతరం ప్రయత్నం చేశారు. అసిధారావ్రతంగా పరిశోధన వ్యాపృతులైనారు.

## తెలుగు శాఖ తొలి ఫలం

దక్షిణ దేశ భాషల విషయంలో పరిశోధన అప్పటికి ఇంకా కొత్త మార్గమే కావడం వల్ల మద్రాసు విశ్వవిద్యాలయంలో చేయదగిన పనులను గురించి పలువురు పలు విధాలుగా ఆలోచించేవారు. నిశ్చి తాభిప్రాయాలు లేవు. అందువల్ల పని కొంతకాలం వరకు గడ్డుగానే ఉండేది. అయితే రామకృష్ణయ్యగారికి అప్పటికే పరిశోధన రంగంలో మంచి అనుభవం ఉంది. ఆంధ్ర భాషా సాహిత్యాల పరిణామం అన్వేషించి వాటి ప్రత్యేక లక్షణాలు, విశిష్టత ఎలాటివో వ్యక్త పరచడమే ప్రాచ్య పరిశోధన శాఖలో జరుగవలసిన ముఖ్యమయిన పని అని ఆయన భావించారు. అంతేకాక ఆంగ్ల భాషా సాహిత్య పరిజ్ఞానం వల్ల మనం సంపాదించిన భాషా సాహిత్య విమర్శపద్ధతులను మన భాషా సాహిత్యాల పరిణామావగతికి సమన్వయించి విచారించడం ఆవశ్యకమనీ భావించారు. కనుకనే ఆయన తమ శాఖ తొలి నివేదికలో ఈ విషయాన్ని ఉద్ఘాటించారు. ఆంధ్రభాషా పరిశీలన విషయంలోగాని, సాహిత్య పరిశీలన విషయంలోగాని మూలాధారంగా గ్రహింపదగినది ఆంధ్ర భారతమే కనుక తత్పరిశీలనతోనే తమ శాఖలోని పరిశోధన ప్రారంభించారు. దాని ఫలితమే 'ఆంధ్ర భారత కవితా విమర్శనము.'' దీనిని ఆయన మొదట ప్రచురించారు. దానిలో తమ లక్ష్యాలను గురించి ఇలా స్పష్టంగా చెప్పుకున్నారు:

''ఆంధ్ర భాషా వాఙ్మయముల చరితమును వాని సక్రమ పరిణామమును అన్వేషించి విమర్శించుటయే ప్రాచ్యపరిశోధనాలయ మందలి ఆంధ్ర శాఖ చేయ దగినపని.... భారతమే ఈ భాషలో మొదటి యుద్గ్రంథ మగుటచే తద్భాషా వాఙ్మయ పరిణామమున కిది ఎంతవరకు తోడ్పడినదో తెలిసికొనవలసిన యావశ్యకత కలదు. .... భారత కవితకు తద్దేశకాల పరిస్థితులతో నెట్టి సంబంధము గలదో, అది ఆంధ్ర భాషా వాఙ్మయ పరిణామమున కెట్లు తోడ్పడినదో..... విమర్శన లింకను బయలు దేరవలసియున్నవి. గీర్వాణ సారస్వత మహా వృక్షశాఖకు గట్టిన అంటుగా బయలుదేరి విజృంభించిన ఆంధ్ర సారస్వతమునందు ఆంధ్ర జాతీయతాగుణ మెంత వర కున్నదో పరిశీలింప వలసియున్నది. ప్రాచీనాంధ్ర భాషా స్వరూపమును గుర్తించి, దాని కితర ద్రావిడ భాషల తోను సంస్కృత ప్రాకృతములతోడను గల సంబంధ బాంధవ్యములను నిర్ణయించి, తద్భాషా చరిత్ర నన్వేషించుటయు నావశ్యకమే.''

## భాషా పరిశోధనకు నాంది

ఈ లక్ష్యంతోనే ఆంధ్రభాషా తత్త్వాన్ని, సాహితీ రీతుల పరిణామాన్ని పరిశోధించి వివరించే ప్రయత్నం చేశారు. ఆంధ్రభాషా చరిత్రాన్వేషణకు ద్రావిడ భాషాతత్త్వ పరిశీలన ముఖ్యసాధనమని భావించి కాల్డ్‌వెల్ మార్గాన్నే అనుసరించి తెలుగు భాష పుట్టు పూర్వోత్తరాలు కనుగొనడానికి ప్రయత్నించారు. సంస్కృత ప్రాకృతాలకంటె, తమిళ కన్నడాది దక్షిణ దేశ భాషలే ఎక్కువ సహాయకారులు కాగలవ నిశ్చయానికి వచ్చారు. ఈ నిశ్చయాన్ని పురస్కరించుకొ "Studies in Dravidian Philology" అనే పుస్తకం తొలుత ప్రకటించారు. సంస్కృతమే అన్ని భాషలకు జనని అని, తెలుగు సంస్కృత భవమే అని భావించి సంస్కృత వ్యాకరణ

పద్ధతిలోనే తెలుగు వ్యాకరణం రచించిన తెలుగు పండితుల దురభిప్రాయం తొలగించి, తెలుగు వ్యాకరణ విశేషాలు అనే వాటిని భాషా చారిత్రక పద్ధతి ప్రకారం సమన్వయించి చూపడానికి అనేక విమర్శక వ్యాసాలు గ్రంథాలు రచించారు. సంధి, భాషోత్పత్తి, వర్ణోత్పత్తి క్రమము మొదలయిన గ్రంథాలు ఈ దృష్టితో రచిత మైనవే.

## ప్రభుత్వ పురస్కారం

సంయుక్త మద్రాసు ప్రభుత్వం వారు 1950లో వీరి భాషాపరిశోధనల విలువలను గుర్తించి తెలుగు భాషా సమితి ద్వారా రు.500 బహుమానమిచ్చి సత్కరించారు.

పాఠశాలలోను, కళాశాలలలోను వ్యాకరణం బోధించే పండితులకు తెలుగు వ్యాకరణ సూత్రాలను బోధించే విషయంలో చారిత్రక దృక్పథం ఏర్పడాలని రామకృష్ణయ్య గారి ఆశయం. భాష విషయంలోను సంస్కృతం నుంచి వచ్చి చేరిన సంప్రదాయ పక్కికి భిన్నమై, దక్షిణ దేశీయ భాషలకు సహజమైన సంప్రదాయ ఫక్కి ఒకటున్నదని, అది సంస్కృత సంప్రదాయ ప్రాబల్యం వలన మాటుమణిగి పోయిందని, కనుక అట్టి దేశీయ సంప్రదాయ సిద్ధమైన వాఙ్మయాన్ని - పద్యాలు, పాటలు, సంకీర్తనలు మొదలయిన వాటిని - పునరుద్ధరించి, దానిలోని ఛందస్సాహిత్య భాషావిశేషాలను ఇతరమైన దక్షిణ దేశ భాషా సాహిత్యాలతో పోల్చి పరిశీలించడం అవశ్యకమని వారు అభిప్రాయపడ్డారు. ఈ విషయాలు ప్రతి పాదించడానికే వారు ''దక్షిణ దేశ భాషలు - దేశి'' అనే గ్రంథాన్ని ప్రచురించారు. తెలుగులోని ఉపజాతి ఛ్చందస్సును తమిళ కన్నడ ఛ్చందస్సులతో పోల్చి చూస్తే, దేశీయ ద్రావిడ ఛ్చందోరీతి విశిష్టంగా బయలు పడుతుందని వారి ఆశయం.

మన సాహిత్య విమర్శనలో పాశ్చాత్య పద్ధతులను అనుసరించ వలసిన ఆవశ్యకతను వ్యక్తం చేయడానికి ''కాళిదాసుని కళా ప్రతిభలు'', సారస్వత వ్యాసములు మొదలయిన విమర్శ వ్యాసాలను ప్రకటించారు.

## రామకృష్ణయ్యగారి అపార కృషి

రామకృష్ణయ్యగారు మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి విరమించిన తర్వాత, తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన సంస్థలో రీడరుగా చేరి 1950 నుంచి 1956 వరకు పని చేశారు. ఈయన 1915 నుంచి 1956 వరకు 41 సంవత్సరాల పాటు చేసిన సేవ అపారమైనది, అమూల్యమైనది. వారి సేవ ఈ విధంగా క్రోడీకరించవచ్చు:

### 1. తెలుగు భాషా శాస్త్ర గ్రంథాలు:

**1. భాషోత్పత్తి క్రమము; భాషా చరిత్రము:** భాషాశాస్త్ర సిద్ధాంతానికి పీఠికాప్రాయమయిన ఈ పుస్తకం భాషల మధ్య గల సజాతీయ సిద్ధాంత సంబంధాన్ని నిరూపించడంలో అనుసరించిన సూత్రాలను వివరించడంతోపాటు పదాల అర్థ స్వరూపాల మార్పులను కూడ విశదీకరిస్తుంది. దీనిని రామకృష్ణయ్యగారు మొదట ఆంధ్ర సాహిత్య పరిషత్సమావే శంలో చదివారు. తర్వాత ఇది ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రి కలో వరుసగా ప్రచురితమయింది. పిదప దీనిని రామకృష్ణయ్య గారు పుస్తక రూపంలో ప్రకటించారు. ఇది నాల్గు ముద్రణలు పొందింది. నాల్గవ ముద్రణ 1967లో. ప్రథమ ముద్రణకు అప్పటి ఆంధ్ర సాహిత్య పరిషదధ్యక్షులు శ్రీ ఆచంట సాంఖ్యాయనశర్మగారు తొలిపలుకు వ్రాశారు. ''ఆంధ్ర భాషాభిమానులందరును వీరి గ్రంథమును సాదరముగా గ్రహించి సమగ్రముగా పఠించి కృతకృత్యులు గాగోరుచు న్నాను'' అని తొలిపలుకులో అన్నారు.

**2. స్టడీస్ ఇన్ ద్రవిడియన్ ఫైలాలజీ:** (ద్రావిడ భాష శాస్త్ర పరిశీలనము) ఈ ఆంగ్ల గ్రంథం ఆర్య ద్రావిడ భాషల పరస్పర ప్రభావాన్ని తెలుపుతూ, నామ విభక్తి క్రియావిభక్తుల విషయంలో ద్రావిడ భాషల సంయుక్త పద రూపత్వ లక్షణాన్ని వివరిస్తుంది.

**3. తెలుగు లాంగ్వేజ్ ఇన్ ద ఫస్ట్ మిలినియం ఎ.డి:** (ప్రాఙ్నన్నయ యుగంలో తెలుగు భాష) ఇది తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం జర్నల్‌లో ధారావాహి కంగా మొదట ప్రచురితమైంది. క్రీస్తుశకం 1000 వరకు ఉన్న శాసనాలు ఆధారంగా ప్రాచీన తెలుగుభాషకు చారిత్రక వ్యాకరణం వ్రాయడానికి జరిగిన మొట్టమొదటి ప్రయత్నమిది.

**4. భాషా చారిత్రక వ్యాసములు:** రామకృష్ణయ్య గారు వివిధ పత్రికలలో ప్రచురించిన భాషా శాస్త్ర చారిత్రక వ్యాసాల సంకలనమిది.

**5. సంధి:** ఈ గ్రంథం రామకృష్ణయ్యగారి మౌలిక పరిశోధన పద్ధతికి మణిమకుటం. దీనిలో ఆయన తెలగులోని సంధి నియమాలను చారిత్రక పద్ధతిని అనుసరించి ఇతర సన్నిహిత భాషా లక్షణాలతో సరిపోల్చి, అందులోని విశేషాలను సకారణంగా సమన్వయం చేయడానికి ప్రయత్నం చేశారు. సంధిలో ఉత్తునకు సంధి నిత్యంగా రావడానికి కారణం అది శబ్దానికి అవయవంగా సంబంధించింది కాకపోవడమే. ఈ విషయం ఎలా తెలిసింది? తెలుగు పదాలను సోదర

భాషా పదాలతో పోల్చి చూడడం వల్ల అవన్-అవన్లు-వాడు; తోల్-తోలు. శబ్దంలో చివరి ఉకారం అవయవం కానప్పుడు - అవయవికంగా సంబంధించ నప్పుడు అది లోపించినా అర్థానికి భంగం కలుగదు. అటువంటి స్థితిలో సంధి నిత్యంగా కనిపిస్తుంది. క్త్వార్థకేకారం, షష్ఠి అకారం, వ్యాకరణార్థ బోధకాలు గనుక అవి సంధిలో లోపించవు. కాని, లోపించిన ఉదాహరణలూ ఉన్నాయంటే, వాటికి సమన్వయమూ చూపారు రామకృష్ణయ్యగారు. ఇలా లోప సంధి, ఆగమ సంధి, ఆదేశ సంధి - వీటిని సకారణంగా అన్వయించి చూపారు. పాద-ఇల్లు-పాదరిల్లు అయిందంటే అక్కడిరకారం (రేఫ) చారిత్ర కావశేషం (Historical Survival) అన్నారు. పాదరు పాదయొక్క పూర్వరూపం. పాదరు- ఇల్లు=పాద రిల్లు కొంతకాలానికి శబ్దంలోని రేఫ లోపించి పాద వ్యవహారంలోకి రాగా, పాదరిల్లు లోని రేఫ ఆగమంగా నిరూపించారు వైయాకరణులు. కొమరు-ఆలు-కొమరాలు కాగా, ఏతత్సామ్యం చేత ఈ రేఫ మరికొన్ని విశేషణ సమాసాల్లోకి ప్రసరించింది - పేదరాలు, బీదరాలు లాగ. ఆదేశ సంధికి గసడదవాదేశ, సరళాదేశ సంధులు ఉదాహర ణాలు కదా. ఈ రెండూ కూడా నిజానికి వర్ణ సమీకరణం వలన కలిగేవే. వాడు + కొట్టె=వాడు గొట్టె. ఇక్కడ కకారం అజ్మధ్యస్థం అయింది కదా. అచ్చులు నాదాలు. ఈనాద వర్ణాల మధ్య ఉన్న శ్వాస స్పర్శకకారం నాదస్పర్శగకారంగా మారింది. పూచెన్ + కలువులు=పూచెన్గలువలు. నాదనకార ప్రభావం వల్ల పక్కన ఉన్న శ్వాసకకారం నాదగకారమైంది. సమాస సంధిలో కలిగే విలక్షణమైన వ్యాకరణ కార్యాలకు రామకృష్ణయ్యగారు కారణాలేమిటో సూచించారు. పూవు + రెమ్మ=పూరెమ్మ అని వ్యాకరణ కారుడు చెబుతాడు. నిజానికి పూవు యొక్క పూర్వరూపం పూ. cf ఆవు యొక్క పూర్వరూపం ఆ. పూ+రెమ్మ=పూరెమ్మ. ఒక కాలంలో భాష ఈ ఏకాక్షర ధాతువులను సహించక ద్వ్యక్షర ధాతువులుగా మారాయి పూవు, ఆవు ఇత్యాదిగా. అప్పుడు వ్యవహారంలో ఉన్న రూపాలకు ప్రక్రియ చెప్పేటప్పుడు వులోపం చెప్పుకోవలసి వచ్చింది. లేన్+కొమ్మ = లేఁగొమ్మ. త.ఇళంగొంబు 'ఇల' 'ఎల' అయింది. ఉదా: ఎల మావి. లే క్రమంగా లేంత అయింది. న్ త అనుబంధ ప్రత్యయం. ప్రాన్ + కెంపు=ప్రాంగెంపు. ప్రాంత ప్రాచీన రూపం.

సంధి గ్రంథంలో లోపా గమాదేశ వికారాలను రామకృష్ణ య్యగారీ విధంగా చారిత్రికంగా సమన్వయించి చూపారు. ఇదే విధంగా భాషలోని కొన్ని ఇతరాంశాలను (నామ విభక్తి క్రియా విభక్త్యాదులు) కూడ వారు కొన్ని వ్యాసాలలో చర్చించారు.

సంధి వంటి గ్రంథం ఇంతవరకు తెలుగులో వెలువడ లేదు.

**6. ద్రవిడియన్ కాగ్నేట్స్:** (ద్రావిడ భాషా సమాన శబ్దాలు) రామకృష్ణయ్యగారు దక్షిణ ద్రావిడ భాషలలోని పదాలను ఈ గ్రంథంలో ఏర్చి కూర్చారు. తులనాత్మక వ్యాకరణాధ్య యనానికి ఇది కావలసిన ప్రాథమిక సామగ్రి. మూలద్రావిడ భాషా స్వరూపాన్ని పునర్నిర్మాణం చేయడానికి ధ్వనుల్లోను అర్థాల్లోను ఆ భాషా రూపాల్లో కాలక్రమాన కలిగిన మార్పులను తెలుసు కోడానికి ఈ పద జాలం అత్యవసరం. కాల్డ్వెల్ తన కంపేరిటివ్ ద్రవిడియన్ గ్రామర్‌లో ఈ విషయం చెప్పాడు. ద్రావిడ భాషా సమాన పదజాలాన్ని తీసుకొని ఒక పుస్తక రూపంలో ప్రకటించడంలో వీరిదే ప్రథమ ప్రయత్నం. ఇందులో ఆయా పదాల దగ్గర చెప్పిన నోట్స్‌లోను, ఉపోద్ఘాతంలోను అనేక విషయాలు వీరు ప్రతి పాదించారు.

అన్నల్స్ ఆఫ్ ఓరియంటల్ రీసెర్చ్ మొదలయిన పత్రికలలో ప్రచురితమైన పెక్కు వ్యాసాలు - ద్రవిడియన్ ఫొనెటిక్స్, ద ద్రవిడియన్ ఇన్సెనిటివ్, ద ద్రవిడియన్ ప్యాసివ్, ద్రవిడయన్ ఇన్‌ఫ్లెక్షన్ - మొదలయినవి ఆంగ్లంలో ఉన్నాయి. ఈ గ్రంథాలు, వ్యాసాలు ద్రావిడ భాషల ధ్వని పదవాక్య నిర్మాణంలో సామ్యాన్ని చూపడమే కాక తెలుగు సంస్కృతజన్యమనే సిద్ధాంతాన్ని పరాస్తం చేస్తాయి.

## 2. సాహిత్య విమర్శ గ్రంథాలు:

**1. ఆంధ్ర భారత కవితా విమర్శనము.** రామకృష్ణయ్యగారు ఈ గ్రంథం పీఠికలో ఇలా అన్నారు. ''భారతమే ఈ భాషలో మొదటి యుద్గ్రంథమగుటచే తద్భాషా వాఙ్మయ పరిణామము నకిది ఎంతవరకు తోడ్పడినదో తెలిసికొన వలసిన యావశ్య కత కలదు. కావున భారతకథకు తత్తద్దేశకాల పరిస్థితులకు నెట్టి సంబంధము కలదో, ఇది ఆంధ్ర భాషా పరిణామమున కెట్లు తోడ్పడినదో, కవిత్రయము యొక్క, అందు వ ముగా కవిబ్రహ్మ యొక్క కవితా నిర్మాణ చాతుర్య విశేష గుణములు కలదగుటచే సర్వాతిశాయియై వెలం న్నదో పరిశీలించి వివరింపగల విమర్శన ఆవశ్యకము.'' ఈ మాటలకు అనుగుణంగా ఈ ఉత్తమ గ్రంథం రచించారు హిందూ పత్రికలో ఈ ఉత్తమ గ్రంథంపై వెలువడిన సమీక్ష ''కవిత్వతత్త్వ విచారముతో సాహిత్య విమర్శలో విప్లవాత్మ మైన మార్పులు తెచ్చిన కట్టమంచి రామలింగారెడ్డిగారే ఆంధ్ర మహాభారతంపై విమర్శనాత్మకమైన పరిశీలనను వెలువరిస్తా రని తెలుగు సాహిత్య ప్రపంచం ప్రతీక్షించింది. కాని, కోరం

రామకృష్ణయ్యగారి రచన అలాటి అవసరాన్ని తీర్చింది.'' అని ముక్తకంఠంతో ప్రశంసించింది. ఈ గ్రంథం మహారంజకమై పాఠకుల హృదయాలపైన, అనంతర కాలంలో వచ్చిన భారత విమర్శలపైన చెరగని ముద్ర వేసింది

దాదాపు 500 పుటల ఈ గ్రంథంలో (1) ఆంధ్ర వాఙ్మయము- ఆంధ్ర మహాభారతము, (2) మతస్థితి - వాఙ్మయము, (3) భారతాంధ్రీకరణము - తిక్కన (4) తిక్కనార్యుని కళాప్రతిభలు అనే నాలుగు భాగాలున్నాయి. విపులంగా జరిగిన చర్చలో ముందు ఎవరూ పరిశీలించని, నూతనమైన విషయాలను ఎన్నిటినో శ్రీ రామకృష్ణయ్యగారు వెలుగులోకి తెచ్చారు. వాటిని సంగ్రహంగా ఇలా పేర్కొనవచ్చు.

మొదటి భాగం: నన్నయాదుల కంటె శ్రీనాథ సుకవి కంటె ఎంతో ముందంజ వేసిన తిక్కన ''దేశీయపు పలుకుబడిని ఆ మాత్రమైనను చిరస్థాయిగా నిలుపవలెననెడి తలంపుతో'' రచన కొనసాగించాడు. తిక్కన భారతంలో కనిపించే ' చీనాంధ్ర భాషా ప్రయోగ చమత్కృతులు మరొక చోట కా ము. ఈ విధంగా నన్నయ కన్నా గూడ తిక్కన ఆంధ్రభా మహోపకారకుడయ్యాడు. తిక్కన శిల్పం గొప్పగా కథాకథన గౌరవ వేగాల మాటున దాగి ఉంటుంది.

నన్నయ అవతారికలో ఎక్కడచూచినా, కర్మపరమైన వైదికమతమే దర్శన మి ంది. నన్నయ తాను రచించిన భాగాలన్నిటినీ ఈ దృ ానే రచించినట్లు తోస్తుంది. అందుకు ఉదాహరణ భా తంలోని మంగళాచరణ శ్లోకం. పంపకవి విక్రమార్జున విజయంలో అరికేసరి రాజును పొగడినట్టు, రాజును నాయకునితో ఐక్యం చేసి రచించినట్టు, నన్నయ రాజ రాజ నరేంద్రుని భరతవంశీయుడుగా స్తుతించాడు. ఈ విషయంలో కవులిద్దరికీ పోలికలున్నాయి. కాని, పంప, నన్నయ కావ్యాలకు భేదం చాలా ఉంది. నన్నయకు వైదిక ధార్మిక విషయ వర్ణన సందర్భంలో ఉత్సాహం పెరుగుతున్నట్టు తోస్తుంది. ఈ సంగతిని ఇంతకు ముందు ఎవరూ గుర్తించలేదు.

నన్నయ తర్వాత నన్నయ అంతటి వాడుగా ప్రసిద్ధి పొందిన అథర్వణుడు విరాటోద్యోగ భీష్మపర్వాలను రచించాడు. ఇతడు జైన మతావలంబి. కనుక తత్సంప్రదాయానుసారంగా రచించాడు. భారత కథే అయినప్పటికి ఆ రచన రూపు మాసింది. (ఇది రామకృష్ణయ్యగారు చెప్పిన మరొక కొత్త సంగతి) అందువల్లే తిక్కన భారతానికి వచ్చిన ప్రచారం అథర్వణుని భారతానికి రాలేదు. అది మరుగు పడింది.

తిక్కనార్యుని కళా ప్రతిభలు - అనే నాల్గవ ప్రకరణంలో మూల కథపై తిక్కన వేసిన ఆంధ్రతాముద్ర, తిక్కనార్యుని వర్ణనలు, ప్రకృతి వర్ణనలు, తిక్కన మనోవృత్తి వివరణ శక్తి, నాటకకళాచాతుర్యం, తిక్కన శృంగార వర్ణనలు, పాత్ర పోషణ రీతులు, రసపోషణ రీతులు, నాటక రీతులు, తిక్కనార్యుని భాషా శైలులు, పూర్వోత్తర సందర్భాలకు జక్కని పొందిక కల్పించుట, ఉపమాలంకార ప్రయోగము, సందర్భానుసారముగ భావమును స్ఫురింప జేయుపద రచన, ఆంధ్ర భాషా జాతీయ ప్రయోగనైపుణ్యము, అర్థము మారిన ధాతువులు, పదజాలము, కారకవిశేషములు అనే ఉప శీర్షికలలో తిక్కనార్యుని రచనారామణీయ ప్రవాహాన్ని రామకృష్ణయ్యగారు మరవలు పారించారు. భారతాంధ్రీకరణంలో తిక్కనార్యుడు అనుసరించిన తీరును అతని రచనా శక్తిని సమీక్షిస్తూ రామకృష్ణయ్యగారు వ్రాసిన ఉపసంహార వాక్యాలను ఇక్కడ ఉదాహరించడం విధిగా భావిస్తున్నాను:

''ఇట్లు సహజంబై, సలక్షణంబై, శక్తిమంతంబై, జాతీయ యుక్తంబై, దేశీయ బహుళంబగు నాంధ్రభాషలో, భవ్యకవితావేశుండు, విజ్ఞాన సంపద్విఖ్యాతుండు, సంయమిప్రకర సంభావ్యాను భావ్యుండునగు కృష్ణద్వైపాయను డర్థిలోక హితనిష్ఠం బూని రచించిన లెఖ్యంబగు నీ యామ్నాయమునందలి యర్థమును బ్రబంధ మండలిగా రచించి యాంధ్రావళికి మోదముం గూర్పనెంచిన తిక్కనార్యుడు 'హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి' యగు నీ విరాట పర్వమును రచించు సందర్భమున, సంస్కృతమూలము నందలి యర్థమును కావ్యకళా దృష్టితో జూచి యందలి విషయముల యౌచిత్యానౌచిత్యములను, గుణదోషములను పరిశీలించి మూలమునందలి, యే విషయము నెచ్చట నుపయోగించు కొనవగునో దాని నచ్చో నుపయోగించుకొనుచు; సందర్భానుకూలముగ రసమును బోషించుచు, పాత్రల శీలమును వ్యక్తీకరించుచు, సంభాషణలను బెంచుచు, కథాంశములను దారుమారు చేయుచు, కావ్యకళా సౌందర్యమునకు దోడ్పడని సందర్భములను విడనాడుచు, నద్దాని బోషించుట కనువగు వర్ణనలను - అనగా ప్రకృతి వర్ణనలను, శీలపోషక వర్ణనలను, భావచ్ఛాయాసూచక వర్ణనలను, మనోవృత్తి ప్రకాశక - ప్రస్ఫోరక వర్ణనలను, స్వీయ దేశీయాచార వర్ణనలను సందర్భాను కూలముగ స్వయముగ రచించి చేర్చుచు, దనభాషాంతరీకృత గ్రంథము నత్యంతరసోద్బోధకంబై కావ్యకళ కాదర్శ భూతంబై స్వతంత్రంబగు నుత్తమ ధ్వని కావ్యముగ నొనర్చి ధన్యుడైనాడు. ఆంధ్రావళి కత్యంత మోదముం గూర్చినాడు. భక్తకోటికి వరణీయుడైనాడు. తాననుభవించిన కవిత్వతత్త్వనిరతి

శయానుభావానందమును తన దేశీయులకు కూడ చవి కొలిపినాడు. ఇక ఉద్యోగాదులగు తక్కిన పదునాల్గింటిలో గూడ నాంధ్రావళి యీ మహనీయుని భావశిల్ప మహత్త్వము నారసి యత్యంతామోద భరితులై కావ్య రసాంబుధినద్వైతానంతాంబుధి నోలలాడుదురు గాక!''

ఈ ఆంధ్ర భారత కవితా విమర్శనము సమకాలిక కవి పండిత విమర్శకుల మన్ననలను విశేషంగా పొందింది. రామకృష్ణయ్యగారు సంస్కరించి ప్రచురించిన విష్ణుమాయా నాటకం మున్నగు గ్రంథాలు పండితుల ఆదరం పొందాయి. ఆ విమర్శలను, అభిప్రాయాలను కొన్నిటిని ఇక్కడ పొందుపరుస్తున్నాను.

## సమీక్షలు, అభిప్రాయాలు

### HINDU: 18 JUNE 1930

*[Telugu - pp.459, Price.2/- By Korada Rama Krishnaiya, M.A. Senior Lecturer in Telugu, Oriental Research Institute, Madras University, Published in the Andhra Grandha Mala in the Andhra Patrika Office, Madras]*

It has long since been expected that Mr.C.R. Reddi would fulfil his promise of giving the Telugu public a rigid critical revaluation of Mahabharata in general and the Telugu version which he along with many of his countrymen, believes to be an original creation in particular. We hope the critique on Mahabharata will yet see the light of day. Meanwhile we cannot be too grateful to the younger men, especially of the attainments of Mr. K. Ramakrishnaiya, who are taking up the task of paying a pious tribute to the memory of the Telugu poets of the Mahabharata....

Mr. Ramakrishnaiya herein deals with only a portion of the work of the poet Tikkana - Virataparvamu. He has done well in thus restricting his sphere of work, for to judge the work of a poet of the eminence and loneliness of Tikkana much can be gained by focussing light upon single spots more than by surveying a poet's achievment of such wide range and complexity. **The work is scholarly without being pedantic and interesting without being too 'popular'.** The pre-Nannaya period in Telugu Literature is traced with great skill and Nannay's love for Vedic tradition and Tikkana's Advaita are brought out by decisive internal evidence. The comparison of Tikkana's work with the original Sanskrit of Vyasa is very illuminating. The author has chosen the right passages and his method of treatment is extremely interesting. There is much force in his contention that Tikkana planned and executed the Virataparvamu as a model type of Prabandha and its great and continued influence on subsquent writers who unquestionably borrowed many points of beauty and techincal form, although they could not equal him in the stately march of his verse which charges with the tramp and impetus of cavalry, is profusely illustrated from later poets. **The enumeration of the artistic qualities of Tikkana's verse shows rare insight and critical acumen in the author,** and there is no doubt that he would have driven home much better the uniqueness of Tikkana's method by drawing a comparison in style and attitude towards life between him and his great predecessor Nannaya. There are not occasions lacking even in Virataparvamu, if only Tikkana had the mind, to undertake natural description, but he is always preoccupied with the poignant drama of conflict in human nature and portrays nature only as a dim and passive ground against which he paints the luminous figures of the Epic. Nannaya, on the contrary, is always fascinated with the trees, the forest breezes and the mountains and can hold communion with nature untrod by human feet.

Apart from these major considerations, there are in the book many passages of absorbing interest to the admirers of Tikkana. We anxiously await further studies from the pen of this gifted author and hope he would take us at some early date to the very end of this great work which belongs to the ages.

**RARA**

**The Journal of the Andhra Historical Research Society**

**(Volume VI - October 1931 - Part 2).**

It is the result of the author's work as the Madras University Reader in Telugu in 1928. It is a good attempt at a critical and historical study of the Telugu Language and its Literature as found in Andhra Bharatam. The author has compared the Telugu Virata Parvam with the Sanskrit Original with a view to assess the real worth of Tikkana's poetic beauties, and has given us several extracts from the same.

At the outset, in the first part, he traces the several stages in the evolution of Telugu script and language with the help of certain Old Telugu inscriptions of the Eastern Chalukyas and Eastern Gangas. He then describes the style and compostion of Bharatam. In the second part, he describes the religious history of the Dekkan and South India under the Andhras, the Pallavas and the Chalukyas and narrates the reasons that lead to the Edition of Telugu Bharatam. The author then quotes several passages from both the Sanskrit original and the Telugu transalation to show the differences in subject-matter, style, etc. The author thus describes the descriptive skill of Nannaya.

In the third and fourth parts, he describes the several beauties of Tikkana Somay- i's Telugu translations and descriptions by qu ng several passages from Virataparvam wh ch ought to be read by every one. As the author rightly describes, there is a systematic arrangement of ideas with a motive to produce dramatic effect and as for poetic skill and style, it is inimitable.

We heartily congratulate the author on the excellent work he has produced and **we think literary criticism should flow hereafter on the lines suggested by him.**

R.S.R

**Opinions of Contemporaries**

**I**

**Sri Tekumalla Achyuta Rao Pantulu Garu,** M.A., L.T., Head Master, Training School, Rajahmundry, dated 24-1-1932

I thank you very much for having sent me a copy of your excellent criticism of the Andhra Maha Bharatam written by you under the title Andhra Bharata Kavita Vimarsanamu. I was much pleased to go through the book and find such excellent criticism at your hands on the best portion of the Telugu Bharatam, namely, the Virata Parvam. Your criticism, I think, is the first of its kind which I have had the pleasure of perusing during recent years. Several Telugu scholars and poets have had their say about the merits and defects of our greatest national poem namely the Andhra Maha Bharatam written by our poetic Trinity. But I have no hesitation in saying that **I found your critcism to be by far the best yet available on the subject.** You have made your criticism modern in the best acceptance of the term without calling yourself off from the time-honoured traditons of our ancient Literary Critics, namely, the Rhetoricians. You have brought into your book an unprejudiced mind full of appreciation of the author and at the same time alive to the deficiencies judged by the ideal standards of criticism. Your estimate of Tikkana as the national poet who has fashioned the life and literature of the Andhra country is entirely agreeable to me. An ill-natured critic of your work may pick out a flaw here or a flaw there, or a discrepancy here or a discrepancy there but such ill-natured criticism apart, every real scholar in Andhra Desa should, I think, be grateful to you for your performances on such a large scale. The zeal and enthusiasm with which you have evidently approached the subject make me hope that you will not give up the subjects after this first attempt but will continue it in

some more volumes until you complete your studies in the Andhra Bharata. I wish to suggest to you for your consideration the following comprehensive scheme of criticism.

1. First three parvams (Nannaya and Yerrapragada). 2. Udyoga Parvam. 3.Yuddha Panchakam. 4.Santi Panchakam. and 5.The last three parvams.

If you complete these things you will be giving quite an insight to every Andhra to understand and appreciate the full value of this, the greatest Andhra poem.

II

**Chilukuri Narayana Rao,** M.A., Ph.D.,
**Lecturer in Sanskrit, Telugu, & Kannada,**
**C.D. College, Anantapur.**

The above book is a scholarly study of the Telugu Mahabharata and is the first extensive appreciation of that great work. Beyond stray articles in the press, there has not appeared so far any study in a book form carried on in a systematic manner. The author is to be congratulated on the **excellent exposition of the subject which is new in the field of Telugu literary criticism.** The first chapter of this book deals with the methods of literary criticism and divides Telugu Literature into various ages based on well defined characteristics and acquaints us with the earliest extant remains of the Telugu Language. The second chapter deals with the religious and social conditions at the time of the writing of the Telugu Mahabharata and institutes a comparison between the points of view of approach to the subject by Nannaya and Tikkana. Nannaya had the vaidiki and religious outlook whereas Tikkana was a poet par excellence. The third chapter makes an elaborate study of the Virataparva translated by Tikkana and is well worth reading by Telugu scholars. The fourth chapter continues the study of the same, deals with the poetic qualities of Tikkana and ends with the linguistic peculiarities of the poet. We hope that the author will continue his studies in this direction and enrich Telugu Literature by his writings.

III

**Dr. B. Seshagiri Rao Pantulu Garu,** M.A., Ph.D., D.Hist., E.T.Litt. (WIES) Professor of English and Comparative Literature, M.R. College, Vizianagaram.

I have read with great interst the Critical Essays on Bharata by M.R.Ry. Korada Ramakrishnaiya Garu M.A., of the Oriental Research Institute of the University of Madras.

His work on Tikkana which bulks most largely in these Essays is inspired by a noble and really original conception and so far as it goes is quite valid. What Tikkana suggested in calling his Parvams a "Prabhandha - Mandali" has been amply and justly sustained by this critique.

Apart from all critical controversies on side issues raised by his publication. I am sure **these aspects of his work will last for all time to his credit** and entitle him to the gratitude of all lovers of the Telugu Mahabharata.

**2. దక్షిణ దేశ భాషా సాహిత్యములు - దేశి:** ఈ గ్రంథం ఆర్యేతర భాషాభావనలు ఆర్య సంస్కృతిలో అంతర్వాహినులుగా, విడదీయరానంతగా చేరిపోయినవని నిరూపిస్తుంది. దక్షిణ భాషల ప్రాచీన సాహిత్యంలోని ఛందస్సాహితీరీతుల విశేషలక్షణాలను బట్టి ప్రాచీన దక్షిణ దేశీయమైన దేశికి సంబంధించిన వివిధ విషయాలను ఈ గ్రంథం తలస్పర్శిగా పరిశోధిస్తుంది. ఈ గ్రంథంలో ఆరు ప్రకరణాలున్నాయి: (1) భాషాసారస్వతములు-దేశి (2) దక్షిణదేశభాషల విశేష లక్షణములు, (3) దక్షిణ దేశభాషా సారస్వత లక్షణములు, (4) ఆంధ్రము-తెలుగు, (5) ఛందస్సాహితీరీతులు, (6) దేశిరచనలు.

మొదటి ప్రకరణంలో - భాషా విషయంలోను ఛందస్సాహితీ రీతుల విషయంలోను దక్షిణ భాషలక

సహజం, సమానం అయిన సంప్రదాయ పద్ధతే 'దేశి' అని నిర్వచించారు. రెండవ ప్రకరణంలో - ద్రవిడ ధాతు లక్షణం, వర్ణ సమామ్నాయం, ధ్వని లక్షణాలు, హ్రస్వ ఎకార ఒకార, మూర్ధన్యాక్షరాలు, శకటరేఫ ళకారాలు, అనుస్వారానికి అనునాసికం వ్రాయడం, సంధి, లింగ వివక్ష, విభక్తి స్వరూపం, విశేషణాలు, ఉత్తమ పురుష సర్వనామ బహు వచన రూపం, సంబంధార్థక సర్వనామాలకు వాడుకలేక పోవడం, క్రియా రూపాలు. వ్యతిరేకార్థక క్రియా రూప ప్రక్రియ, సముచ్చయార్థానికి మారు క్రియా జన్య రూపాలు వాడడం, నామ క్రియలు, వాక్యనిర్మాణం, శబ్దజాలం చర్చించారు. వాటిలో ద్రావిడభాషలకున్న సామ్యం చూపారు. మూడవ ప్రకరణంలో దక్షిణ దేశ భాషా సారస్వతాల విశిష్టలక్షణాలు చర్చించారు. సంస్కృత ప్రాకృతాల సంబంధంతో దక్షిణ భాషలలో కలిగిన మార్పు, మార్గ పద్ధతి అనుసరణ వల్ల దేశికి కలిగిన మార్పు వివరించారు. నాల్గవ ప్రకరణంలో - ఆంధ్రము-తెలుగు సహజ సంబంధం లేని పదాలయినా క్రమంగా పర్యాయా లయ్యాయని, త్రిలింగ శబ్దం తెలుగు అనే దేశిపదానికి సంస్కృతీకరణమేనని వివరించారు. ఐదవ ప్రకరణంలో - దేశిచ్ఛందాలయిన మాత్రాచ్ఛందస్సును విపులంగా చర్చించి, నన్నయ కన్నడ కవుల వలె కొన్ని దేశిచ్ఛందస్సులను స్వీకరించినా సంస్కృత ఛందస్సును స్వీకరించి, అక్షర రమ్యత పాటించి సంస్కృత తత్సమభాషను వాడి, వివిధ రూపాలలో ఉన్న దేశ్యశబ్దాలలో శిష్టుల వ్యవహారంలో ఉన్న పదాలతో, చంపూకావ్యపద్ధతిలో, భాషను నియమించి భారత రచన చేశాడని వివరించారు. చివరిదయిన ఆరవ ప్రకరణంలో దేశిరచనలను గురించి చర్చించిన పిదప తెలుగు లాక్షణికులు దేశి రచనలలో కొన్నిటిని మాత్రమే గ్రహించి తక్కినవాటిని వదలి వేసినా, వాటిలో అనేకం చిరకాలంనుంచీ సామాన్య జన వ్యవహారంలో ఉన్నా యని తెలిపి ''వీనికి సరియైన లక్షణ సమన్వయము, లక్ష్య సంపాదనము, భిన్నభాషలలోని దేశి రచనలకు గల పరస్పర సంబంధాన్వేషణము, భిన్నములగునీ ఛందోరీతుల మూల తత్త్వ పరిశీలనము, ఆయా దేశభాగములం దింకను నిలిచిన దేశిరచనల సంగ్రహణము, వాని ముద్రణము'' జరుగాలని ఆకాంక్షించారు.

**3. సారస్వత వ్యాసములు:** (1) దీనిలో జాతీయ జీవనము: వాఙ్మయము, (2) విమర్శన పద్ధతులు (3) నన్నయకు పూర్వమాంధ్ర వాఙ్మయస్థితి (4) ఆంధ్రవాఙ్మయ చరిత్రము: యుగ విభజనము (5) భారతాంధ్రీ కరణము: ఎఱ్ఱాప్రెగ్గడ- అనే ఐదు వ్యాసాలున్నాయి. దేశంలో ఒక్కొక్క కాలంలో కలిగే వివిధ రూపాలయిన విప్లవాలు జాతీయ జీవనాన్ని ఎలా మార్చుతాయో, అదే విధంగా భాషా వాఙ్మయాలను గూడ మార్చగలిగి ఉంటాయని మొదటి వ్యాసంలో సహేతుకంగా చారిత్రకంగా తెలిపారు. రెండవ వ్యాసంలో విమర్శనం పెక్కు రీతులుగా ఉన్నదని, చారిత్రక విమర్శ, కవిజీవితానికి, కృతికి గల పరస్పర సంబంధంతో విమర్శించడం, తత్త్వ విమర్శ అనేవి ప్రధానమని, విమర్శనం అలంకార శాస్త్రాంతర్భాగం కాదని, విమర్శ దోషారోపణం కాదని, అంత మాత్రాన దోషాలను మరుగు చేయరాదని, రచయిత ఎడల సానుభూతితో ప్రవర్తించాలని సూచించారు. మూడవ వ్యాసంలో, నన్నయ తనకు పూర్వం అస్తవ్యస్తంగా ఉన్న, సంస్కృత పదాలను యథాతథంగా ప్రయోగించే పండితుల పద్ధతిని, కేవలం గేయ ప్రధానమైన దేశ్య పద్ధతిని సంస్కరించి మేళవించి, పండితుల ఆదరం పొందడానికి వీలుగా శిష్టభాషలో భారతరచనకు పూనుకున్నాడని తెలిపారు. నాలుగవ వ్యాసంలో ఆంధ్ర వాఙ్మయాన్ని (1) అజ్ఞాత యుగం - లేక ప్రాఙ్నన్నయ యుగం క్రీస్తు శకం 1-1000 వరకు, (2) భాషాంతరీకరణ యుగం - లేదా కవిత్రయ యుగం - క్రీస్తుశకం 1000-1500, (4) ప్రబంధ యుగం - క్రీ శకం 1500-1700, (5) దక్షిణ దేశ వాఙ్మయ యుగం - స్తుశకం 1700-1800, (6) ఆధునిక యుగం - 1800-19 0 - అని ఆరు యుగాలుగా విభజించి పరిశీలిస్తే పాఠకులకు వాఙ్మయ తత్త్వం గోచరమవుతుందన్నారు. చివరి వ్యాసంలో, ఎఱ్ఱాప్రెగ్గడ భారతారణ్య పర్వశేషాన్ని శిథిల భాగపూరణంగా కాక స్వతంత్ర రచనగానే, నన్నయ రచించి నట్లే పూరించాడని సోపపత్తికంగా నిరూపించారు.

**4. తెలుగు లిటరేచర్ ఔట్‌సైడ్ ది తెలుగు కంట్రీ (తెలుగు దేశానికి వెలుపలి తెలుగు సాహిత్యం):** దక్షిణాంధ్ర వాఙ్మయ యుగంలో దేశి సాహిత్య పునరుద్ధరణ, ఆధునిక తెలుగు సాహిత్య శాఖలుగా పరిణమించిన కొన్ని సాహిత్య శాఖల అభివృద్ధి, తెలుగు దేశానికి వెలిగా ఉన్న రాజ్యాలను పాలించిన తెలుగు రాజుల చలవే. తరువోజ వంటి దేశీ వృత్తాలు ఎంత సులభంగా రాగ యోగ్యాలవుతాయో లేక బహుశా మొదట రాగ తాళలయలతో ఉన్న దేశి వృత్తాలే తర్వాత వృత్తాలుగా ఏర్పడినాయా అనే విషయాలు ఈ గ్రంథంలో నిరూపితాలు. ఇందులో ముసలమ్మలు పాడే పాటలలోను, బిచ్చగాళ్లు వీథులలో పాడే పాటలలోను, గ్రామ సీమలలో తక్కిన పని పాటలలో పాడే పాటలలోను తెలుగులోని పాత దేశీ ఛందస్సు ఇంకా సురక్షితమై ఉందని మనం విశ్వసించ వచ్చు - అని ఈ గ్రంథం మనకు హామీ యిస్తుంది.

**5. కాళిదాసుని కళా ప్రతిభలు:** ఈ పుస్తకం కాళిదాసుని వ్యక్తిత్వాన్ని, నాటక కళా నైపుణ్యాన్ని విశ్లేషిస్తుంది. రామ కృష్ణయ్యగారి తొలి రచనలలో ఒకటయిన ఈ పుస్తకం సాహిత్య విమర్శలో ఆధునిక పద్ధతులను అనుసరించాలని నొక్కి చెబుతుంది.

రామకృష్ణయ్యగారు మద్రాసు విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన సంస్థలోను, తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధన సంస్థలోను పదిహేను ప్రాచీన గ్రంథాలను పరిష్కరించి విపుల పీఠికలతో ప్రచురించారు. నవనాథ చరిత్ర, పరతత్త్వ రసాయనము, వల్లభాభ్యుదయము, నన్నెచోడుని కుమార సంభవము మున్నగునవి ఆ పరిష్కృత గ్రంథాలు. వల్లభాభ్యుదయం కృష్ణా తీరంలోని శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యాన్ని విశేషంగా కీర్తిస్తుంది. అంతేకాక పౌరాణిక విషయాలను ప్రాచీనాంధ్ర రాజుల (సాతవాహనుల) చరిత్రను కూడ తెలుపుతుంది. కుమార సంభవం విచిత్ర మైన సాహిత్య సమయాలు, భాషా విశేషాలు విరజిమ్మే అపూర్వ అత్యుత్తమ కావ్యం. దీనిని రామకృష్ణయ్య గారు విచక్షణతో పరిష్కరించి అత్యంతామూల్యమైన పీఠికను, విచిత్ర పదాల, పలుకుబళ్ల, జాతీయాల, ప్రయోగాల పట్టికలను, పాఠాంతరాలను సంతరించారు. తిరుపతిలో శ్రీ రామకృష్ణయ్య గారు శ్రీనివాస విలాససేవధి (ద్విపద), వేంకటాద్రి మాహాత్మ్యము మున్నగు గ్రంథాలను పరిష్కరించి ప్రచురించారు. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ప్రారంభించిన శ్రీ వేంకటేశ్వర స్తుతి రత్నమాలను శ్రీనివాసాంధ్ర సాహిత్యానికి సంబంధించిన ఇతర గ్రంథాలను అన్నమాచార్యులకు సంబంధించిన వ్యాసాలను పరిష్కరించి ప్రచురించారు. ఒకప్పుడు విశ్వవిద్యాలయంలో పాఠ్య గ్రంథంగా ఉన్న భీమేశ్వర పురాణ భాగాలను విపుల పీఠికతోను, టీకాతాత్పర్యాలతోను ప్రచురించారు. ''ఈ గ్రంథం కేవల భాషాంతరీ కరణము కాకుండుటచే, నిందు గల్పనాస్వాతంత్ర్యము హెచ్చు. భాషా చమత్కారము నాంధ్ర పద సాంద్రత గలిగి పాత్రోచిత సంభాషణలతో గూడి హృదయంగమముగా నున్నది. అతి హృద్యంబగు నీతని శైలిని 15వ శతాబ్ద మందలి కవులందరు ననుకరింప జూచిరని చెప్ప వచ్చును.'' అని పీఠిక చివర అన్నారు.

### 3. సాంస్కృతిక వ్యాసాలు:

రామకృష్ణయ్యగారు మన సంస్కృతికి సంబంధించిన ఎన్నో మౌలిక వ్యాసాలను ప్రచురించారు - తాళిబొట్టు మంగళసూత్రం, ఆంధ్రము - దక్షిణాపథ సంస్కృతి, అక్క మహాదేవి వచనాలు మొదలయినవి. తమిళ కన్నడ సాహిత్యాలకు సంబంధించిన వ్యాసాలు, రేడియో ప్రసంగాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. ఇవి తులనాత్మక పరిశీలన జరిపే విద్యాంసులకు చాల ప్రయోజన కరమైనట్టివి.

వివిధ పత్రికలలో చెదురుగా ఉన్న వ్యాసాలు ఎన్నో పుస్తక రూపం పొందవలసినవి ఉన్నాయి. అలాగే ఇప్పుడు లభించని వారి పుస్తకాలు కూడ పునర్ముద్రణ పొందవలసి ఉంది.

తిరుపతిలో 1940 మార్చిలో జరిగిన ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్సులో తెలుగు విభాగానికి రామకృష్ణయ్యగారు అధ్యక్షత వహించారు. తమ 37 పుటల అధ్యక్షోపన్యాసంలో తెలుగు భాషా సాహిత్యాల చరిత్రను, జరుగుతున్న పరిశోధనను విహంగమ దృష్టితో పరికించి, భావి కర్తవ్యాన్ని సూచించారు. ఇదొక అమూల్య మైన అధ్యక్షోపన్యాసం.

### నిండు గోదావరి జీవితం

రామకృష్ణయ్యగారు నిరాడంబరులు. మితభాషులు. అజాత శత్రువులు. వారి జీవితం నిండు గోదావరి వలె గంభీరంగా, ఏక ధాటిగా సాగింది. ధోవతి, కోటు, తలపాగా - అప్పటి ఉద్యోగుల సాధారణమైన దుస్తులు. వారు దేనికీ తాపత్రయ పడలేదు. ఉద్యోగాల కోసం అంగలార్చలేదు. అవే వారిని వరించాయి. వారు బి.ఎ.లో అభిమాన విషయంగా పార్ట్ II లో సంస్కృతాంధ్రాలు చదివినందున విజయనగరం మహారాజా కళాశాలలో పార్ట్ III బియ్యే పెట్టినప్పుడు లెక్చరర్ గా ఆహూతులయ్యారు. విజయనగరంలో ఉన్నప్పుడు ద్రావిడ భాషా తులనాత్మక పరిశోధన వ్యా ..తులై వ్యాసాలు గ్రంథాలు రచించడం వల్ల మద్రాసు వి .విద్యాలయంలో 1927లో దేశభాషా శాఖలను పునర్వ్యవ ..రించి దక్షి దేశభాషలలో పరిశోధనను ప్రోత్సహించడా కి నిర్ణయించి దానికి తగిన వారిని ఎన్ను కోవలసి వచ్చి నప్పుడు అప్పటి మద్రాసు విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ సర్ రఘుపతి వెంకటరత్నం నాయుడు గారి దృష్టి రామకృష్ణయ్యగారిపై పడడం సహజం కనుక వారు వీరిని ఆహ్వానించారు. తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన సంస్థలో రీడరుగా ఉన్న వేటూరి ప్రభాకరశాస్త్రి గారు 1950లో దివంగతులు కాగా, దేవస్థానం నిర్వహణాధికారి అయిన శ్రీ చెలికాని అన్నారావుగారు శాస్త్రిగారి స్థానానికి రామకృష్ణయ గారిని ఆహ్వానించారు. ఇలా రామకృష్ణయ్య గారిని ఎప్పుడు కప్పుడు అదృష్టమే వరించిం దనవచ్చు.

రామకృష్ణయ్యగారు ఆరోగ్యంగా ఉండేవారు. అనారోగ్య కారణంగా ఎప్పుడూ సెలవు పెట్టలేదు. ఇల్లు ఆఫీసు అ

భేదం లేకుండా ఎప్పుడూ ఏదో పనిచేస్తూనే ఉండే వారు. చూడడానికి వచ్చే వారితో సంభాషించడంలోను భాషా సాహిత్య పరిశోధన విషయాలే ఉండేవి. పూర్వం విద్వాన్, ఎం.ఎ. పరీక్షలకు కళాశాలల్లో తరగతులు లేవు. అభ్యర్థులు ప్రైవేటుగా చదివి పరీక్షకు వెళ్లవలసివచ్చేది. వారు తరచు రామకృష్ణయ్య గారి వద్దకు వచ్చేవారు. వారికి రామకృష్ణయ్య గారు భాషా సంబంధమైన విషయాలు బోధిస్తూ ఉండేవారు.

## కరుకైన క్రమశిక్షణ

వారు పరిశోధన సంస్థలో క్రమ శిక్షణను పూర్తిగా పాటించేవారు. ఒకచోట పనిచేస్తూ మరొక చోట ప్రలోభా లకు లొంగిపోయి అంతరాత్మకు, ఉద్యోగ విధులకు విరుద్ధంగా ప్రవర్తించడం వారు చేసేవారు కారు. అలాటి భావమే వారికి లేదు. ఒక మారు ఒక చిన్న సంఘటన జరిగింది. ఇంగ్లీషు ఏమీరాని ఒక జూనియర్ లెక్చరర్, వారికింద పనిచేసేవారు, కాల్డ్‌వెల్ గ్రంథాన్ని అనువాదః చేస్తానని పట్టుబట్టి విశ్వవిద్యాలయానికి సంబంధం లేని వారితో పొత్తు పెట్టుకొని, వారు విశ్వవిద్యాలయంలో పని చేసే తనకు తోడ్పడేటట్టు లోపాయికారీగా ఒప్పందం చేసుకొని, రామకృష్ణయ్యగారిని అనువాదానికి అనుమతి కోరారు. కాల్డ్‌వెల్ అనువాదానికి ఆంగ్లంలోనే కాక, భాషా శాస్త్రంలోను గంభీరమైన పాండిత్యం ఉండాలి. ఆ అను వాదం విశ్వవిద్యాలయంలో జరిగినప్పుడు వెలుపలి వారి జోక్యం ఉండరాదు. తమకు అర్హత లేనప్పుడు ఒక పనికి పూనుకోడం, ఇతరుల సహాయం పొందడం క్రమశిక్షణకు విరుద్ధమయినవి. కనుక రామకృష్ణయ్యగారు అనుమతి నిరాకరించారు. దానిపై ఆ జూనియర్ లెక్చరర్ వైస్ ఛాన్సలరుకు ఫిర్యాదు చేయగా, రామకృష్ణయ్యగారు వాస్తవ స్థితిని వివరించిన మీదట వైస్ చాన్సలర్ రామకృష్ణయ్యగారి క్రమశిక్షణ పద్ధతిని ప్రశంసించారు.

రామకృష్ణయ్యగారికి తోటలంటే చాల ఇష్టం. కనుక ప్రతి వేసవి సెలవుల్లోనూ అమలాపురానికి సకుటుంబంగా వెళ్లి తమ తోటలను చూచుకొనేవారు. చెట్లకు పాదులు కట్టడం, నీళ్లు పోయడం, కలుపు మొక్కలు తీయడం - అంటే ఎంతో ఆసక్తి వారికి.

ఇదంతా చూచి, పక్కవాళ్లు ''సంవత్సరానికి ఒకసారి వచ్చి, కొన్ని రోజులు ఉండి పోయే వారికి ఈ కష్టం అంతా ఎందుకు?'' అనే వాళ్లు.

తిరుపతిలో ఉద్యోగ విరమణ చేసిన తర్వాత రామకృష్ణ య్యగారు పూర్తిగా ఆధ్యాత్మిక చింతనాయత్తచిత్తులయి, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు పరిశీలిస్తూ ఏవో వ్రాసు కుంటూ మననం చేస్తూ గడిపారు. వేంకటేశ్వర సంస్కృత కళాశాల పండితులు తరచు వచ్చి వారితో ఆధ్యాత్మిక విషయాలు చర్చించేవారు. అప్పుడు వ్రాసుకున్న విషయాలు ఎన్నో ఉన్నాయి.

రామకృష్ణయ్యగారి వైయక్తిక పవిత్ర జీవితం, సత్యనిష్ఠ, శ్రద్ధా సమావిష్టం అయిన సాహిత్య జీవితం నేటి నవయువకు లకు, జిజ్ఞాసువులైన పరిశోధకులకు అనుసరణీయం.

## కుమారుని కృషి

తెలుగులో చారిత్రక వ్యాకరణం, ఆంధ్ర భాషా సాహిత్యత త్త్వాన్ని తెలుసుకొనడానికి ఇంకా ఎంతో పరిశోధన జరగాలని వారు అనే వారు. మన భాషాతత్త్వాన్ని గూర్చి ఇతర దేశాలలో జరుగుతున్న పనిని గూడ మనదేశీయులు శ్రద్ధతో గమనించ వలసి ఉన్నదని చెప్పేవారు. ''తెలుగు భాషా పరిశోధనకు పూనుకొనేవారు చాలతక్కువగా వున్నారు. తెలుగు భాషా పరిణామం వివరించే చారిత్రక వ్యాకరణ రచనకు యువకులు పూనుకోవాలి'' అనే వారు.

ఇలా కొన ఊపిరి వరకు తెలుగు భాషాసాహిత్యాల పరిశోధనే పరమార్థమైన రామకృష్ణయ్యగారు 1962 మార్చి 28 లో కీర్తిశేషులయ్యారు.

తండ్రిగారి సూచనతో ప్రోత్సాహితులయ్యారు వారి ద్వితీయ పుత్రులు ఆచార్య డాక్టర్ మహాదేవ శాస్త్రిగారు. ఆయన ఆర్థిక శాస్త్రంలో ఎం.ఎ. పట్టం పొంది సిమ్లాలో కేంద్ర ప్రభుత్వం కార్మిక శాఖలో పని చేసేవారు. ఆయన ఆ ఉద్యోగం మానుకొని కలకత్తా విశ్వవిద్యాలయంలో రెండు సంవత్సరాలు భాషాశాస్త్రం చదివి ఎం.ఎ. పట్టభద్రులః డాక్టర్ సునీతి కుమార్ చటర్జీ పర్యవేక్షణలో ''ది హి రికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు'' అనే అంశంపై పరిశోధ చేసి డి.లిట్. పట్టం పొందారు. ఆ డిలిట్ సిద్ధాంత వ్యాసాన్ని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రచురించింది. మహాదేవ శాస్త్రిగారు కొంతకాలం జర్మనీలో భాషా శాస్త్రాచార్యులుగా ఉన్నారు. శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో ఆంధ్ర శాఖాచార్యులుగా, అధ్యక్షులుగా ప్రశంసనీయంగా పని చేసి పదవీ విరమణ చేశారు. వీరి సిద్ధాంత వ్యాసం Historical Grammar of Telugu ఎంత ప్రయోజనకరమైందో తెలుపడా నికి ప్రపంచ విఖ్యాత భాషాశాస్త్రజ్ఞులు డాక్టర్ సునీతి కుమార్ చటర్జీ, డాక్టర్ టి. బర్రో, డాక్టర్ సుకుమార్ సేన్ వ్రాసిన ముందు మాటలను ఇక్కడ ఉదాహరిస్తున్నాను:

## Foreword
## by
## Suniti Kumar Chatterji

Emeritus Professor of Comparative Philology,
University of Calcutta;
Ex-Chairman, West Bengal Legislative Council;
National Professor of India in Humanities,
President, Sahitya Akademi

The present monograph unquestionably forms an important contibution to our serious study of Telugu linguistics in particular and of Dravidian in general. In order to arrive at a full and authentic study of the evolution of the Dravidian speech in India, there must be, as a basic preliminary, a series of detailed descriptive studies of all the Dravidian languages and dialects - or at least of the more important among them, important lingusitcally. Then after that there should be another series of historical grammars of these languages, the diachronistic treatment going parallelly with the synchronistic. The Indian scholars who speak the various Dravidian languages have now become quite alive to the importance of Dravidian studies. For a long number of decades, after his pioneer work of Robert Caldwell on the Comparative Grammar of Dravidian Languages of South India first appeared in 1854, Indian scholars were not so very much interested in Dravidian Linguistics particularily, although there were very erudite scholars of their mother-tongues among Tamilian, Keralan, Kannadiga and Andhra people. An eminent scholar of Sanskrit and Tamil like V. Swaminatha Aiyar virtually brought about a revolution in Dravidian Studies by giving through his critical editions nearly the entire mass of the oldest literature in any Dravidian language - the Sangam literature of Tamil, and that was over half a century ago. One by one Dravidian scholars began to make their appearance and take up seriously the histories of their mother-tongues. We have for example K.V. Subbayya, whose first essays on the historical grammar of Dravidian appeared in the Indian Antiquary in 1909. There were here and there isolated scholars like K.Amritha Rao, and there were scholars of the old type like K.Narasimhacharya for Kannada, L.V. Ramaswami Aiyar of Ernakulam had to his credit a great deal of very important work, but his career was cut short very early. We should also mention that veteran scholar of Sanskrit and Tamil Dr. P.S. Subrahmanya Sastri, whose valuable contributions on Tamil grammar are well - known.

But particularly after our Independence a tremendous amount of interest was felt in Indian languages, and a veritable Renaissance of Indian Linguistics made its appearance. Young scholars of Dravidian now came forward and some very important results were arrived at. There are a good number of brilliant scholars for Tamil, Malayalam and Kannada, and for Telugu we have to mention in the first instance Prof. Bh. Krishnamurti. The writer of the present monograph Prof. Dr. K. Mahadeva Sastri is an old pupil of mine, and he studied in Calcutta after taking his degrees in Madras University. I was privileged to know him during his student days with us. His father the late Professor K. Ramakrishnayya was also an erudite scholar of Dravidian Philology, and his very useful book on "Dravidian Cognates" is well - known. Dr. Mahadeva Sastri knows also Hindi and other South Indian languages, and of course Sanskrit, and Telugu is his mother-tongue in which he has done quite a good deal of serious linguistic work. There are two very fine studies of Kannada inscriptions, discussed with regard to their linguistic developments-one on Old Kannada and the other on Middle Kannada. Prof. Mahadeva Sastri has given us a comprehensive study of all Old Telugu and

Middle Telugu Inscriptions beginning with the oldest inscriptions dating from the 6th century A.D. The inscriptions from 6th century to the 10th century number near about 100. He has taken up the story of the development of Telugu, as in these old inscriptions right down to modern Telugu times.

This is a careful bit of work, and it is quite well documented; and while the literary language was having its own line of development as a cultivated speech coming tremendously under the influence of Sanskrit and benefiting as well as suffering from the Sanskrit scholarship of the poets and other writers, the inscriptions give, as contemporary documents, more or less a precise picture of the language as it was used for the understanding of the common masses. Naturally there are colloquialisms and unorthodox developments which are always condemned by the orthodox scholars. But these have their very great importance in understaning the development of the actual living language as it is used by the people in their daily avocations

One can easily judge the value of such a work, and I am sure specialists in Telugu and in Dravidian also will find Prof. Mahadeva Sastri's work exceedingly helpful. I wish him greater and greater success in the line of work in which he is specialising, and I trust he will have his own important place in the history of Dravidian studies.

Calcutta
August 11, 1969 **(Sd.) SUNITI KUMAR CHATTERJI**

**T. BURROW**

Boden Professor of Sanskrit in the
University of Oxford

The literary history of the Telugu language begins in the eleventh century A D. with the work of Nannaya, who not only inaugurated a period of rich productivity in the native medium, but also standardised the literary language in a form that was to last until modern times. It cannot be known for certain whether before this period Telugu was used for literary purposes, but if it was all trace of such productions has disappeared. On the other hand written Telugu had been used for some four centuries before Nannaya for the purpose of engraving inscriptions and during the course of the present century an increasing number of these have come to be known, as a result of which a new chapter in the history of the Telugu language can now be written. This forms the main theme of Mr. Mahadeva Sastri's though he has added to it an outline of the major developments of the language in its later periods.

Of the hundred inscriptions which are here presented the earliest date from the last quarter of the sixth century A.D. Before this only Prakrit or Sanskrit inscriptions are available Prakrit was the language used by the Andhra dynasty and partly by its successors, though these latter turned increasingly to Sanskrit. These were northern invaders of the Telugu country, even language, and they were able to maintain their own Aryan language for some time. By the end of the sixth century, however, it had been ousted as a spoken language by the native Telugu, and it is at this period that inscriptions in the latter language begin to be engraved. At the same time we are not entirely without information about the Telugu of the preceding period, because in Sanskrit and Prakrit inscriptions which are available from the preceding half millennium in this area, there occur names of places and names of persons containing Telugu linguistic elements. Though small in quantity this material is valuable, since it shows that back as far as the beginning of the Christian era the Telugu language existed with its own individuality, and distinct from the neighbouring Dravidian languages. When exactly Telugu became characterised as an indepedent speech is not easy to say, but it

will certainly not be later than the sixth century B.C. which has been tentatively suggested. (p.4)

The early Telugu inscriptions are of great linguistic interest since certain phonetic changes which characterise literary Telugu had not yet taken place. These are the change of -ṇ- and -ḷ- to -n- and -l-, the change of -nṟ- to -ṇḍ- and the change of -ḻ- to -ḍ-. In all these cases the early inscriptions preserve the primitive Dravidian sounds, and the gradual emergence of the standard Telugu forms can be traced in the later pre-Nannaya inscriptions. These differences are of sufficient importance to establish a distinct earlier stage of the language, Old Telugu, represented in the early inscriptions, as opposed to the standard literary dialect, which by contrast has to be known as Middle Telugu. Thus one whole stage of the language is represented only by inscriptions.

Since the phonetic changes referred to above have resulted in the confusion of certain phonemes originally distinct (namely -ṇ- and -n-, -l- and -l, -nṟ- and -nd-) the evidence of the inscriptions, where available, is obviously of great value for etymological purposes, since the inscriptions directly attest the original sound. Thus in DED Supplement 1093 attention was drawn to the fact that the OTe. forms of the verb kalugu sometimes show forms with -l- Although this may be a case of reverse spelling the possibility that the form is genuine has to be taken into account. Conversely the etymology given in DED 1517 for Te. kolucu assumed that in this work -l- was for earlier -l- This is not borne out by the inscriptions, which show invariably -l-, and their evidence should probably be regarded as conclusive on this point. An interesting case is presented by the form *ēlucunṟi* in inscription 14,9. One way of explaining it is to assume that it is a reverse spelling, but this presents difficulty in such an early inscription. Alternatively it can be treated as genuine, and in that case the Te. verb uṇḍu would have to be connected with the items in DED 623, and not, as at present, with those in DED 599.

Inscriptions are valuable in as much as they often give a better picture of linguistic development than literary texts which follow a strict norm. As a result of this the main lines of the development of the Telugu language between 600 and 1000 A.D. can be adequately followed in spite of the paucity of the material. It can be shown that by the end of this period the language had reached the state which was established as the standard by Nannaya. After this period there was a successful attempt to preserve this standard. As a result such developments as were taking place are not normally reflected in the literature, but some idea can be formed about them from the later inscriptions, from statements of the grammarians as to what forms should be avoided as vulgar, and to some extent from certain authors who were less strict in the observance of classical usage. All this material is examined and evaluated by the author, and he has shown how an essentially modern form of Telugu had evolved as the spoken language by the beginning of the seventeenth century even though it had to wait till modern times before being generally adopted for literary purposes In the course of his work Dr Mahadeva Sastri has provided a survey of the entire historical development of the Telugu language from the earliest times to the present day, based on a wide selection of the available material. Students of Comparative Dravidian as well as students of Telugu will be indebted to him.

Oxford
August 8, 1969.

**T. Burrow**

## SUKUMAR SEN

Retired Khaira Professor and Head of the Department of Comparative Philology, Calcutta University

Dr. K.Mahadeva Sastri's Historical Grammar of Old Telugu is one of the most significant of Linguistics works published in recent times in India. It will no doubt be immensely helpful to the workers in the field, but the serious students of Indo-Aryan Linguistics also will receive much benefit. I note here my personal gratification in the fact that Dr. Sastri's grammar is the first systematic contribution to Dravidian Linguistics by a student of the Department of Comparative Philology at the Univeristy of Calcutta. The author's equipment as an Indian Linguistician is well balanced: he is equally at home in the two main branches of linguistic study in India-Dravidian and Indo-Aryan. The work bears the stamp of mature scholarship. I congratulate Dr. Sastri for producing such a neat work.

Calcutta
July 30, 1969. **Sukumar Sen**

శ్రీ మహాదేవ శాస్త్రిగారు భాషాశాస్త్రంలో తండ్రిని మించిన తనయులన్నా తప్పులేదు. తండ్రిగారు తలచిన చారిత్రక వ్యాకరణం రచించారు.

శ్రీ మహాదేవ శాస్త్రిగారు విదేశీయుల కోసం ఆధునిక తెలుగు వ్యవహార భాషా స్వరూపాన్ని వివరిస్తూ, దానిని సులభంగా నేర్చుకోడానికి Descriptive grammar and Hand Book of Modern Telugu (వర్ణనాత్మక ఆధునికాంధ్ర భాషా వ్యాకరణం) - అనే గ్రంథాన్ని ఆంగ్లంలో రచించారు. ఇది జర్మనీలోని కోలోన్ యూనివర్సిటీకి చేరిన ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇండాలజీలో విజిటింగ్ ప్రొఫెసరుగా ఉన్నప్పుడు (1976-78) రచించిన గ్రంథం. "కొలోన్ సరస్వతీ సీరీస్" గ్రంథమాల ఏడవ ప్రచురణగా జర్మన్ రిసర్చి అసోసియేషన్ ఆర్థిక సహాయంతో ముద్రితమైంది.*

ఈ గ్రంథం ప్రచురించిన సంస్థ ప్రకటన పత్రాన్ని బట్టి ఆ పుస్తకం ప్రాశస్త్యం, వివరాలు తెలుస్తాయి. కనుక ఆ ప్రకటన పత్రం ఇక్కడ పొందు పరచడం సమంజసమని భావిస్తున్నాను. అది ఇది:

Subject: Oriental. Already Published.

**Descriptive Grammar and Handbook of Modern Telugu, with key (and Glossary).**

By: Korada Mahadeva Sastri,
Edited by: Klaus L.Janert in collaboration with M. Srimannarayana Murti and P.V.Rani Gandhi.

1985 (Koeln Sarasvati Series, No. 7) DM 84, ISBN 3-515-034444-7.

About this book:

The book, Descriptive Grammar and Handbook of Modern Telugu with Key (and Glossary), opens with a practical and detailed presentation of the special script and pronunciation as well as the Sandhi phenomenon.

This is followed by t e Descriptive Grammar of modern Telugu Lan uage from the Dravidian South India (around 0 million people speak the language). It conforms to the traditional and familiar, systematic progression (declension, pronouns, positive and negative conjugations, participles, verb categories, compounds, syntactical sturcture, etc. The seventy four chapters (called lessons) covering the above mentioned topics contain an adequate number of examples (exercises) in Telugu Script (at the beginning also with the transcriptions).

They are accompanied by translations in English (Key) as the book is written in English. The access to the Telugu language is reall ' made practical and certainly suitable for se f study. In order to smoothen this path, a li of basic vocabulary is prepared and its divisions correspond to seventy four chapters and which is absolutely necessary for this study. This Telugu-English glossary is alphabetically arranged, followed by a Grammatical Index which is the concluding part of the book.

The author whose mother tongue is Telugu and father language Sanskrit, is an

* ఇది ప్రస్తుత ప్రధానమంత్రిగా ఉన్న శ్రీ పి.వి. నరసింహారావుగారికి అంకిత మివ్వబడింది.

acknowledged Dravidologist and linguist. He was Professor for Telugu, in Andhra Pradesh and lives now in Madras.

The Readers:

Orientalists, especially Indologists, Dravidologists, Linguists, Institutes and Libraries.

(Publisher's Note Translated from German)

**Franz Steiner Verlog Wiesbaden GMBH**
**Postfach 347, D-7000, Stuttgart,**
**GERMANY.**

శ్రీ రామకృష్ణయ్యగారి సౌజన్యానికి మరొక తార్కాణం తెలిపి ఈ వ్యాసం ముగిస్తాను.

ఆం ప్రదేశ్ అవతరణోత్సవానికి ఆంధ్రప్రభ దాదాపు వంద టల ప్రత్యేక సంచిక ప్రచురించింది. అప్పుడు నేను ప్ర క బాధ్యతలో కొంత వహించినందున ఆ సంచికలో తెలుగు భాష గురించి ఒక వ్యాసం వ్రాయండని రామకృష్ణయ్యగారిని కోరాను. వారు వ్రాసి యిచ్చారు. అది దాదాపు ఆరు కాలాల పెద్ద వ్యాసం. ఏ వ్యాసమైనా రెండున్నర కాలానికి మించరాదనే నియమం పెట్టుకున్నందున, ఆ వ్యాసం కంపోస్ అయిన పిదప, రెండు మూడు కాలాలకు కుదించి ఇవ్వండని ప్రూఫ్ వారికి ఇచ్చాను. రెండు రోజుల తర్వాత వారి వద్దకు వెళ్లాను వ్యాసం కోసం. "దీనిని కుదించడం నావల్లకాలేదు. ఇది మీ ప కలో దాదాపు ఒక పుట వచ్చేట్టుగా ఉంది. అంత పె ి ఎవరూ సరిగా చదువరు. కనుక మీరే కుదించి వే కోండి" అన్నారు నన్ను చూడగానే వారు. "ఆరు కాలాలను సగానికి తక్కువగా కుదిస్తే మీ భావ ప్రవంతికి భంగం కలుగవచ్చు. మీరే ఆ పనిచేయండి." అని సవినయంగా అన్నాను. "నాకు ఆ పని అసలే కుదరదు. ఆ కోసేదేదో మీరే కోసేయండి" అన్నారు ఆయన.

నాకు ఆ పని తప్పింది కాదు దానిని ఎలాగో కష్టపడి రెండు కాలాలకు కుదించాను. ప్రత్యేక సంచికలో అది పడింది. దానిని వారు చూచి బాగానే కలిపారు అని అన్నారు.

తరా త ఆ పూర్తి వ్యాసాన్ని నేనూ, మిత్రుడు డాక్టర్ తిమ్మా కోదండ రామయ్య సంపాదకులుగా ప్రచురిస్తు 'పరిశోధన'లో ప్రచురించాను. ఈ ప్రచురణ సంగతి వారికి తెలీదు. నేను ఆ వ్యాసం పడిన 'పరిశోధన' సంచికను అందజేసినప్పుడు ఆయన ఆశ్చర్యపడ్డారు. "వ్యాసం పోయిందేమోనని అనుకున్నాను. మంచి పనిచేశారు" అన్నారు.

మరొకరయితే "మీ పత్రికల వారికి ఇదే పని. వ్రాయమంటారు, తగ్గించమంటారు, కోయ మంటారు. తీరా పడిన తర్వాత తప్పుల కుప్పలు" అని రుసరుసలాడే వారే. అలాటి అనుభవము నాకు కొందరివల్ల ఎన్నోసార్లు కలిగింది. రామకృష్ణయ్యగారు ఆంధ్రప్రభలో పడిన తమ వ్యాసంలో జరిగిన కుదింపుకు అసంతృప్తి పడక పోగా, ప్రశంసించారు.

## ఉపసంహారం

రామకృష్ణయ్యగారు సహృదయతలోను, చిత్తశుద్ధిలోను ప్రామాణికతలోను ప్రథములయినట్లే, భాషా సాహిత్యరంగంలోను ప్రథములు. నిరాడంబరులు, కీర్తికాంక్ష లేని వారు.

సాహిత్య వ్యాసంగాన్ని జీవిత పరమార్థాన్ని సాధించే తపస్సుగా కొనసాగించిన ఋషికల్పుడు.

ద్రావిడభాషా కుటుంబాన్ని గురించి కాల్డ్వెల్ సిద్ధాంతాన్ని పురస్కరించుకొని శాస్త్రీయంగా కృషిచేసిన వారిలో ప్రథములు.

జానపద సాహిత్యంపట్ల పండితులకు ఈ శతాబ్దం ప్రారంభం నుంచి అభిమానం పెరిగింది. పద కవితను ఈసడించిన వారు తాళ్లపాకవారి పుణ్యమా అని మనసు మార్చుకున్నారు. జానపద సాహిత్యం సేకరించడం, వ్యాఖ్యానించడం ప్రారంభించారు. వారి కృషి అంతవరకే. దానిలో లోతులకు చొరలేదు. రామకృష్ణయ్యగారు దక్షిణ దేశభాషలయిన తెలుగు కన్నడ తమిళ మలయాళాలకు సమానమైన చంధ స్సాహితీ సంప్రదాయం ఉందని చెప్పి, దానిని నిరూపించడానికి గొప్ప గ్రంథం వ్రాసి లక్షణాలు నిర్వహించిన వారిలో ప్రథములు.

పరిశోధనలో సత్యైక దృష్టితో ఉన్నత ప్రమాణాలు నెలకొల్పిన వారిలో ప్రథములు.

తెలుగు కన్నడ తమిళ మలయాళ భాషలలో లోతైన పాండిత్యం సంపాదించి దక్షిణ దేశభాషా సాహిత్యాల తులనాత్మక అధ్యయనానికి ప్రాతిపదిక వేసిన వారిలో ప్రథములు.

పదాల పుట్టుపూర్వోత్తరాల జ్ఞానంతో సామాజిక చరిత్రను ప్రజాసామ్యంలో ప్రచారం చేసిన వారిలో ప్రథములు.

తిరుపతిలో శ్రీ వెంకటేశ్వరస్వామిని గురించి ఇతర భాషా సారస్వతాలలో కనిపించే ప్రస్తావనలను అన్నిటిని పరిశోధించి ఆ క్షేత్రం ప్రాచీనతను, వైభవాన్ని చాటిన ప్రప్రథమ పరిశోధక విద్వాంసులు.

## శ్రీ కోరాడ లక్ష్మిమనోహరం గారి కుటుంబం



కూర్చున్నవారు, ఎడమపక్కనుంచి : రామకృష్ణయ్యగారు, వారి తండ్రి లక్ష్మిమనోహరం గారు, వారి అనుజులు శేషావధానిగారు.

నించున్నవారు : రామకృష్ణయ్యగారి సతీమణి అన్నపూర్ణమ్మగారు, తల్లి సీతమ్మగారు.

శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి గారు



సంస్కృతాంధ్ర ప్రధానోపాధ్యాయులు
నోబిల్ కళాశాల (1845-1888), బందరు

శ్రీ రామకృష్ణయ్యగారి పితామహులు

## 45 ఏళ్ల వయస్సులో శ్రీ కోరాడ రామకృష్ణయ్య



మద్రాసులో విశ్వవిద్యాలయం తెలుగుశాఖ అధ్యక్షులుగా ఉన్నప్పుడు
కూర్చున్నవారిలో కుడివైపునుంచి రెండవవారు

వంశ వృక్షం :

**మహాదేవ శాస్త్రి**
శ్రీశైల భ్రమరాంబికా వరప్రసాద లబ్ధుడు
సర్వశాస్త్ర పారంగతుడు

**అల్లాడశాస్త్రి**
శతఘంటిక చూడామణి
↓
**జగన్నాథ శాస్త్రి**
↓

**సూరి శాస్త్రి**
కాశీలో అఖండశాస్త్ర పాండిత్యం
సంపాదించినవాడు

**లక్ష్మణ శాస్త్రి**
రామతారక మంత్రోపాసకుడు

**రామచంద్ర శాస్త్రి**
(1816-1900)
రామతారక మంత్రోపాసకుడు
బందరు నోబిల్ కళాశాలలో
సంస్కృతాంధ్ర పండితుడు

**కృష్ణశాస్త్రి**
షట్‌శాస్త్ర పండితుడు
దిగంత విఖ్యాత కీర్తిమంతుడు
కాశీ-ఇండోర్ రాజాస్థాన పండితుడు
అకాల మృత్యు పథగుడు

**లక్ష్మీమనోహరం**
భార్య: సీతమ్మ, అమలాపురం
వాస్తవ్యులు గొడవర్తి నాగేశ్వరా
వధానులగారి కుమార్తె

**రామకృష్ణయ్య**

**దుర్గా నాగేశ్వరం**
ఏక సంథాగ్రాహి
అంతర్ముఖుడు, యోగి
స్థితప్రజ్ఞుడు

**రామకృష్ణయ్య**
(1891 అక్టోబరు 2-1962 మార్చి 28)
భార్య అన్నపూర్ణమ్మ
ముంగండ వాస్తవ్యులు ఖండవిల్లి
రామమూర్తి శాస్త్రిగారి కుమార్తె

**శేషావధాని**
(1899-1989)
భార్య: సూర్యకాంతం
పాలంగి, భమిడివారు

**రామచంద్ర శాస్త్రి**
భార్య: అనసూయ

**మహాదేవశాస్త్రి**
భార్య. సరస్వతి

**సీతాదేవి**
భర్త. సుసర్ల
గోపాల శాస్త్రి

**నాగేశ్వరరావు**
భార్య: లక్ష్మి

**కమలాదేవి**
భర్త భమిడి
విశ్వనాథ శర్మ

శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి* విరచితా

# ఉపమావళీ

## ప్రథమ భాగః

శ్రియం నమస్కృత్య మనోజ్ఞ వాగ్మితా, కృతే చ రామాదిమ చంద్ర సంజ్ఞితః।
కృతిం వితన్వ న్నుపమావళీ మహం, సమర్థయే లోకితు మాదరా ద్బుధాన్॥ 1

నాలం వక్తు మహం మదీరిత కృతౌ దోషా వసన్తీతి నో।
ప్రాచా మప్యధునాతనైః కృతితతౌ తేషాం సముద్ఘాటనాత్।
తద్దోషా నవమత్య సద్గుణ గణా న్గృహ్ణంతు జాతాదరాః।
దుగ్ధం నీర మివాపహృత్య నితరాం స్వీకుర్వతే తేన యః॥ 2

విమర్శకాలే విబుధోత్తమా యే పరం విమృశ్యైవ వదన్తి దోషాన్।
నమామి తా నున్నతమానసోహ మార్యాన్ గురూన్ శిష్య ఇవాప్తభక్తిః॥ 3

విద్యేవ వ్యాసంగా త్సంపదివ నయ ప్రవర్తనా న్నృతతేః।
చాంద్రీవ జలద విరహాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 1

సుమనస ఇవ సౌరభతః స్తనయుగళే నేవ సుందరీ హృదయం।
వైశాల్యే నేవ దృశౌ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 2

విద్యేవాధ్యాపనతః శ్రీరివ దానేన సాధు వినయేన।
కలికేవ వికచభావాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 3

కానన లక్ష్మీ రివ సుమ సమయేన సరోజినీవ సూర్యేణ।
సరసీవ ధౌతగరుతైః తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 4

శరదేవ చంద్రకాంతి ర్ద్యౌరివ చంద్రాతపేన విమలేన।
గేహమివ దీపకాంత్యా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 5

వ్యంగ్యేనేవ సరస్వ త్యుచితారాధన వశేన భక్తి రివ।
ఖ్యాతి రివ సత్ప్రవృత్త్యా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 6

* శ్రీ కోరాడ రామచంద్ర శాస్త్రిగారు (1816-1900) శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి పితామహులు. బందరు నోబిల్ కళాశాలలో సంస్కృతాంధ్ర ప్రధానాచార్యులుగా ఉండేవారు. సంస్కృతాంధ్రాలలో బహుగ్రంథ రచయితలు. ఈ 'ఉపమావళి' వారి సంస్కృత రచనలలో ఒకటి. - సంపాదకులు

ప్రకృతి రివ సంస్కారా చ్ఛ్రుతివిస్రంభేణ సుమతి సంపదివ।
ఉపకృత్యేవ ప్రణయః తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 7

వల్లీవ కుసుమ సంగా త్తత్పాళి స్సౌరభస్య సంసర్గాత్।
తద్గంధా దళిపాళిః తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 8

సస్యాళిరివ సువృష్టే స్తద్విభవే నేవ కర్షకాళి మతిః।
తేన తదాశ్రిత ధిషణా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 9

రాగేణేవ సుమాస్త్రాహవ ఇవ కాదంబినీ తటిద్వీథ్యా।
నియమేన తపస్సంపత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 10

యుక్త్యా వివాదలక్ష్మీ రుత్సాహేనేవ నిపుణ మతిధిషణా।
శ్రుత్యేవ గీత కలనా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 11

రాయ ఇవేప్సిత సిద్ధి ర్వ్యాయత ఇవ సాధుతేవ సత్సక్తేః।
నుతిపాత్ర పాండితీ వా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 12

దీపశిఖేవ తమిస్రా త్కల్యక లన సంగమా త్కమలినీవ।
కోకయుగీ రవ్యుదయాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 13

తప ఇవ హృదయ నియమనా త్సుకృత మివ మహేశ పూజనాభ్యాసాత్।
ముక్తిరివ నృహరి భజనాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 14

జ్ఞానే నానుష్ఠాన మనుష్ఠానేనేవ దేవతాప్రీతిః।
సిద్ధి స్తయోప్సితానాం తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 15

సహనాసక్తి విశేషా ద్విద్యేవ తయా చ సదసతోర్భేదః।
తేన వివేకిషు గణనా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 16

బల మివ పయసా వినయా దివ సాధుత్వం ప్రియోదితా త్ప్రణయః।
మోద ఇవేప్సిత లాభాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 17

సంసదివ సుకవి నికరా త్ప్రబల జలద లాభత స్తమిస్రమివ।
ధర్మవిధినా విభుత్వం తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 18

సద్వర్తన మివ సాధు వ్రజ సంగా ద్దీపవర్తి రివ తైలాత్।
రాగ ఇవ మిథో వచనాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 19

ప్రియ సంగమనా ద్విరహోత్కంఠితమతి రివ విధూదయా త్తాపః।
ఆలోకా దివ సోర్థః తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 20

మణిసంగా దివ భూషా కుల మర్యాదా విశేషత స్స్పర్ధీ।
మైత్రీ రహస్య కథనాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 21

విశద సుధారస లేపా ద్గృహ మివ మాధుర్య విమల తాతిశయా।
ద్వా రివ నౌరివ వేగాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 22

వసతి రివ దీప శిఖయా క్రీడా వసతి ర్మనోజ్ఞ సంభారాత్।
భిత్తి రివ చిత్రమయ్యా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 23

కల్యేన కమలినీవ త్కమలద దేవేన తామస శ్రీవత్।
రజనీవ చంద్రవిభయా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 24

విశద సుధా లేపనతః ప్రాసాద ఇవ ప్రభాత కాలాప్తైః।
శయన వశ జీవలోకః తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 25

బలవ దవగ్రహ విరహో ద్వృష్టి రివ నదీవ కమల సంపత్తేః।
సర ఇవ మరాళ సంగాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 26

సమ్మోద ఇవ సురభిణా సంజ్వర ఇవ శుక్రమాస సంప్రాప్తేః।
సుమనేవ జలధరాప్తేః తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 27

చంద్రోదయేన సింధు ర్బంధుః కుశలానుయోగ సంధానాత్।
అంధురివ వర్ష యోగాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 28

సామ్నేవ కార్యసిద్ధి స్సౌజన్యా త్కీర్తి రీర్ష్యయా రోషః।
ప్రియవచనేవ ప్రియతా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 29

తిలక శ్రియాలపన మివ చికురా ఇవ నైల్య దైర్ఘ్య సంపత్త్యా।
సువిలాసతయా వయసా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 30

యౌవనత ఇవ రిరంసా తద్రాగస్తేన తద్వచన సక్తిః।
తేన కథాసల్లాపః తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 31

అధికారా న్మదభర ఇవ తస్మా దవివేకసంప దివ తస్యాః।
సాధు జన గర్హణా వా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 32

మతి రివ సదిష్టలాభాత్ సన్మంత్రేణేవ సంపదాం లాభః।
తేన జన సేవ్యతా వా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 33

ప్రతిభాశ్రియ ఇవ కవితా తద్రసికానాం ప్రమోదనం మనసః
తత్కీర్తి రనపహార్యా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 34

మేఘేనే వాంబుశ్రీ స్తత్సరసీ తత్కమలినికా తస్యాః।
విశద చ్ఛద నాయక ఇవ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 35

గురు పరిచర్యా వశతో విద్యేవ తతోనవద్య విజ్ఞానం।
తత్పర మర్థావగతిః తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 36

కలయేవ స్వాతంత్ర్యం తేన పరాశ్రయణ కల్పితా బాధా।
తత్త్యక్త వికాసో వా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 37

ఉపకృతిత ఇవ సుహృత్తా తద్విశ్వాసః పరాశయ జ్ఞానమ్।
తదివేహిత ఫలసిద్ధిః తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 38

సింధు రివ కుముదబంధో రుదయా త్సురభి రివ ముకుల పరిణామా।
త్సుమనోద్యానవనీనాం తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 39

గుడ ఇవ పాకవిశేషా ద్దుగ్ధ మివ సితా విశేష సంపర్కా।
త్సంస్కారా దివశాకః తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 40

లావణ్యేన శరీరం వయసేవ వపు ర్లలిత కలిత లక్ష్మ్యా।
యోషేవ కాంత సక్త్యా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 41

సంపద ఇవాభిమాన స్తస్మా ద్ధార్ష్ట్యం తతస్తు నికృతి రివ।
తస్యా అనార్యతా వా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 42

నీ వ్యపనయతో లజ్జా తయేవ లలితోదయః ప్రియ ప్రమదః।
తస్యావిర్భూతే రివ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 43

దూర ప్రియ కుశల కథా శ్రవణా త్సాధ్వీవ సౌరభ సమృద్ధిః।
వికసనజ సంపదా వా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 44

మాధుర్యేవ కృపీటం వీటీవ సుగంధ వస్తు సంబంధాత్।
రాగేణేవ క్రీడా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 45

రాగ ఇవ విజన దేశా ద్రతి రివ శృంగార విహిత హేలాభిః।
మోద ఇవ తనయ వినయాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 46

ప్రతిమేవ మంత్ర విరచిత సంస్కారా త్తేజ ఇవ తపశ్చరణాత్।
మహిమేవ తాపస కృతేః తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 47

మణి మాలయేవ కంఠః కంకణతః కూర్పరా దధో దేశః।
శ్రుతి రివ కుండల సంగాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥ 48

(పిమ్మటం బ్రవేశించుచున్నాడు యథా నిర్దిష్టుం డగు కుంభసంభవుండు.)

కుంభ: ఓ వత్స! జానకీ! బెగడొందక్కు బెగడొందకు! వత్స! రామభద్రుడు సౌమిత్రియు నిచట నిన్నన్వేష్పించుచు న్నారు.

సీత: రామభద్రుంగని యపత్రప నటింప జేయుచున్నది (మనంబున) వీరెట్టులో దిశ లెల్లం జరించిరి. ఆహో! నా భాగధేయంబు!

రాముడు: (సమీపించి) భగవన్! మునిచంద్ర నమస్కరించెద.

అగస్త్యుండు: ఓ వత్సా! చిరంజీవి వగుము.

సీత: ఆర్యపుత్రుండు విజయంబు నొందుగావుత!

మధుకరిక: మహారాజు విజయంబు నొందు గాత!

రాముడు: (సీతం గని) వత్స! సౌమిత్రి! యనవసరంబున నంబరంబునం బొడము సుధాసారం బగుచున్నది జానకీ విలోకనంబు.

లక్ష్మ: ఓ యార్యా! యిది యిట్టుల.

రాముడు: (అగస్త్యునిం గని) ఓ భగవంతుడా! యీ లతా మంటపంబున ముహూర్త మాత్రం బాసన పరిగ్రహం బనుగ్రహింపబడుత!

(అట్లని యందురు నుపవేశించు చున్నారు)

లక్ష్మ: ఓ భగవానా! జానకి యెట్లు గ్రహింపబడె?

అ: వినబడు గాక!

రాముడు: ఓ భగవంతా! జాగరూకులమై యుంటిమి.

అ: తొల్లి యీ వనంబున సకల తాపస కులోత్తంసుం డగు దూర్వాసుండు కతిపయ వాసరంబులం దపం బొనరించె.

మధు: సులభక్రోధుండు గదా యీ తాపస కేసరి.

రాముడు: పదంపడి

అ: అయ్యవసరంబున నయ్యయ్యాశ్రమంబులయందతి తీవ్రంబగు తపంబున భయంపడి బలభేదనుండు పనుప నేతెంచి యచ్చటచ్చట సంచరించు వచ్చర మచ్చెకంటులలో హరిణి యనునది యొకరిత తపోవనంబులోని కరిగి కుసుమంబుల నపచయించె.

రాముడు: అయ్యయో! గొప్పపొరబాటు. పిమ్మట పిమ్మట?

అ: అనంతరం బీ దూర్వాసుండు మజ్జనంబునకు వెడలుచుం దానింగని ''యోసి హరిణీ! యాస్మాకీన దేవతారాధన సమర్థంబులగు కుసుమ బర్హంబులం గోసితివిగానం దావకనామ సదృశంబగు నాకారంబు నొందు'' మని శపియించె. మఱియుం దత్క్షణంబ యీ వనంబు పరిహరించి యంతర్హితుండయ్యె.

మధు: ఆహో! శాపావసానం బతి నిష్ఠురంబు.

**లక్ష్మ:** దీనికా శాపవిమోచనం బెట్లయ్యె?

**అ:** ఆ సురవరారోహ లందఱు హరిణియగు నా హరిణిం జేకొని యస్మదంతికంబున కేతెంచ యతిమాత్ర కరుణంబుగ నాక్రందించుచు నన్నుం బ్రార్థింప నే గరుణామయ హృదయుండనై దూర్వాముష్టి నభిమంత్రించి యిచ్చితి. అయ్యవసరంబున దీనికిం బ్రకృతి ప్రాప్తం బయ్యె.

**రాముడు:** ఇది యేమి యాశ్చర్యము!

గీ. కాఱు చిచ్చులు సెలరేగి కాల్పగ గదు
జెడిన కానల కలిమికి జెలిమి మీర
నెల్లజగములకును లగ్గు లేర్పరించు
మబ్బులకు నిది సాజమౌ మదిదలంప. 41

**లక్ష్మ:** ఈ శాపంబే యిప్పటికియు ననుసరించుచు నజ్ఞానంబున నా వనంబునం గుసుమంబులం గోయు దేవి జానకియు నావేశించె.

**రాముడు:** (సాశ్చర్యంబుగ) ఈ ప్రేయసి యింతతఱియు హరిణియై యుండెనా!

**మధు:** (మనంబున) మా యజాగ్రతవలన రామభద్రునకు నెంత మనోవేదన సంభవిల్లె!

**అ:** నే నస్మదాశ్రమంబున నసహాయయై యిటులటుల దాటులిడుచు నివసించు నీ యదృష్టపూర్వయగు హరిణిని సమాధి దృష్టిం జూచి జానకింగా నిశ్చయించి యప్పు డాశాపంబునం దొలగించి భవదభ్యాశంబునకుం దెచ్చితి.

**రాముడు:** క. పర దుఃఖంబుల నణచుట
పరులకు నుపకారకారి భవ్యాత్మతయున్
గరుణయు దాక్షిణ్యంబును
వరమతులకు సహజ గుణము వరద మునీంద్రా. 42

**అ:** వత్స! యీ జానకి తోడ సౌమిత్రి తోడను గూడి చిరతర దిష్టం బిష్టంబు లనుభవించుచు శిష్టస్తుత చరితుండవై శిపివిష్ట మహిమంబున నీవిష్టపం బెల్ల నేలుచు వర్ధిల్లుము. ఇంతియ కాదు.

గీ. కఠిన కలుషాంధ తమసంబు గసిమసగుచు
విశదశారదకౌముది విభవపూర్తి
రామభద్ర భవత్కీర్తిరమ్యమూర్తి
బ్రహ్మ సబ్రహ్మచారియై పరగు గాత! 43

**రాముడు:** మాహత్తమం బనుగ్రహంబు.

**అ:** నీకుం దిరిగి యేమి మేలొనరింతు?

**రాముడు:** ఇంతకంటె నితరంబగు భవకం బెద్ది గలదు?

**అ:** అట్లైన నీభరత వాక్యంబగు గావుత!

ఉ. వాసవు సస తిన్ సలిలవాహము లర్థదనేహసంగతి
న్యాసిలు వృ నవని భాస్వర సస్య సమృద్ధి సేయుతం
గాసరవృత్తి ంసృతి యగాధ సముద్రమునన్ మునుంగు దు
ర్వాసను లైనవారి కగు బండిత సంగతి నౌక లక్ష్మియై. 44

(ఇట్లని యందరు వెడలిరి.)

ఇది శ్రీ కోరాడ రామచంద్ర కృతిచే నాంధ్ర భాషా గ్రథితంబును
భాస్కరపండిత ప్రణీతంబగు నున్మత్త రాఘవం బను ప్రేక్షణికంబు.

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు

# కాళిదాసుని కళాప్రతిభలు

## (ప్రథమ ముద్రణము - 1930)

### తొలిపలుకు

సాహిత్య విమర్శనము విషయమున మన ప్రాచీనులవలంబించిన పద్ధతులకును నాధునిక పద్ధతులకును గొంత భేదము లేకపోలేదు. ఆయాకావ్యములు తల్లక్షణలక్షితములై యుండుటను గూర్చియు నందలి రీతిరసగుణాలంకార విశేషములను గూర్చియు బరిశీలించి విమర్శించుటయే ప్రధాన కర్తవ్యముగా మన దేశమందలి సాహిత్యవిమర్శకు లెంచియుండిరి. వారొక కవియొక్క పాండితీప్రభావమును, బుద్ధి బలమును కొలతవేయ జూచిరేగాని, ఆతని కవితలో బ్రతిబింబించు నాతని హృదయావేశమును, ఆవేగమును, ఆవేదనను కనిపెట్టి, యాతని జీవితచరిత్రకును దేశకాలస్థితులకును కవితారీతులకును గల సంబంధమును సమన్వయించి దేశకాల పరిస్థితులనుబట్టి యాతని కళా ప్రతిభ లెట్టి పరిణతినిబొందినవో, యాతని సహజశక్తి ప్రత్యేకవ్యక్తిత్వము (individual personality) యెట్లచ్చట గానవచ్చుచున్నదో పరిశీలించి వ్యక్తముచేయుటయం దంత విశేషాదరమును జూపినట్లగపడదు మన దేశమునందలి సాహిత్యవిమర్శన మీ చారిత్రక పద్ధతులను (Historical methods) గూడ ననుసరించి నడుపవలసిన యావశ్యకత యెంతేనియు గలదు.

హైందవ నాటక ప్రపంచమున గాళిదాసునివలెనే పాశ్చాత్య నాటక ప్రపంచమున విశేషప్రఖ్యాతి గాంచియున్న షేక్స్పియర్ మహాకవినిగూర్చియు, నాతని నాటక చక్రమునుగూర్చియు ననేకు లనేకవిధములగు నత్యద్భుత విమర్శనములను జేసియున్నారు. డౌడన్ (Dowden)అను నాంగ్లేయ సాహిత్యవిమర్శకుడు ''షేక్స్పియర్ కళా ప్రతిభలు'' (Shakespeare's mind and art) అను గ్రంథమున నాతని నాటకములను గూర్చి చేసిన విమర్శనరీతియే, కాళిదాసుని నాటకములను గూర్చి యీవిమర్శనమును వ్రాయ నన్ను ప్రేరేపించినది.

సహృదయ విధేయుడు,
**కోరాడ రామకృష్ణయ్య.**

ఆలంకారికులు కావ్యములను దృశ్యకావ్యము లనియు శ్రవ్యకావ్యము లనియు రెండు భాగములుగ విభజింతురు. అందు శ్రవ్యకావ్యములు కేవల శ్రవణయోగ్యములు, గద్యప ద్యోభయమయంబులు నగు మహాప్రబంధ క్షుద్రప్రబంధా దులు. నాట్యప్రధానములు, ప్రదర్శనయోగ్యములు నగునవి దృశ్యకావ్యములు. దృశ్యమైనను, శ్రవ్యమైనను గవితకు బరమ ప్రయోజన మానందమనియు, ముఖ్యాధారము మానవ జీవితంబనియు జెప్పవలసియున్నది. అనవరత మనేక విధముల బరిణామమును బొందుచున్న మానవజీవితము భాషామూలమున మన కనులయెదుట బెట్టబడుచున్నది గనుకనే యే కాలమందైనను కవిత మానవున కంత యాదరపాత్రమగుచున్నది. మానవజీవితమును భాషామూల మున బ్రతిపాదించు సందర్భమున నొకకవి స్వీయాశయము లను ఆత్మీయానుభవములను నొక కావ్యమున బొందుపరప వచ్చును. లేదా లోకవృత్తమును యథాస్థితంబుగ వర్ణించి వాఙ్మయాదర్శంబున బ్రకృతిని బ్రతిబింబింప జేసి మానవజీవి తమందలి పరమ రహస్యములను బ్రకటింప వచ్చును. ఇట్లు కవి తన భావములను స్వయముగా జదువరులకు దెలుప

గడంగినచో నట్టి కవితను (Subjective Poetry) ఆత్మానుభవప్రతిపాదకమగు కవితయనియు, కవిత యందాతడు మఱుగువడియుండి ప్రపంచరూపం బగు నాట్యరంగమున మానవరూపధారులగు నటులచేతనే లోక వ్య ను ప్రదర్శింప జేయుచుండినచో, నట్టి కవితను (O ective Poetry) బాహ్యవృత్త ప్రతిపాదకమగు కవిత యనియు రీతిని సాహిత్యవిమర్శకులు కవితావిభాగ మొనర్తురు. నాటక కవిత్వము ముఖ్యముగా నీ రెండవజాతి కవితలో జేరును. అనగా నిట్టి కవితయందు కవి మన యెదుట బడుటకు గాని, యాతడు తన భావములను స్వయముగా బయలుపఱుచుటకు గాని యెట్టి యవకాశమును లేదనుట. హైందవనాటకములందు నటీసూత్రధారాదుల సంభాషణరూపంబగు ప్రస్తావనామూలమున కవి నామగుణశీల ప్రతిభాదులైనను దెలుపబడుచుండ, నాంగ్లేయ నాటకాదుల నదియు సామాన్యముగ గానరాదు. షేక్స్పియర్ మహాకవి ప్రతిభను గాని, యాతని నాటకరచనా పద్ధతులను గాని యెఱుగక, యొక నాటకమును దీసికొని స్థూలదృష్టితో జదివినంత మాత్రమున నది యాతని దని నిశ్చయించి చెప్పుట సుసాధ్యము గాదు. అయినను సృష్టి స్థితి లయకారకుడగు పరబ్రహ్మ "తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్" అను శ్రుతి జెప్పుచున్నట్లు జగత్తును సృజించి దానియందు లీనమైనట్లే కవిబ్రహ్మయు దాను జేసిన కావ్య సృష్టియం దంతర్లీనుడై యుండకపోడు. ప్రకృతి పరిశోధనము సల్పినకొలది యా పరమాత్ముని మహిమాతిశయము బయలుపడుచుండునట్లే కవితను బరిశోధించినకొలది కవీశ్వరుని ప్రతిభావిశేషమే కాక యాతని మనస్తత్త్వముగూడ బయిలుపడుచుండును. ఏల యనగా: సామాన్యముగ దేశ కాల పరిస్థితు లాయాకాలము లందలి కవితయందు బ్రతిబింబింపక మానవు. ఈ కారణముచేతనే కొంతవఱకైనను ప్రాచీనకవుల కాలనిర్ణయమును జేయ గలుగుచున్నారము. ఒకవేళ యసమానప్రతిభావంతుడగు కవి యొక డీ దేశకాల పరిస్థితులను గూడ నతిక్రమింపగలిగినను ఆత్మగుణముల నతిక్రమింపలేడు గదా! కావున స్వాభిప్రాయ ప్రకటనమున కావంతయు వీలులేని నాటక కవితయందును దత్కథా సూత్రము నాడించుచు దాని నంత వావరించియుండు నా యాంతరశక్తిని మనము సూక్ష్మదృష్టితో బరిశీలించినచో గుర్తింపలేకపోము. ఆ కవి రచించిన యితర గ్రంథములను గూడ నిట్లు పరిశీలించినచో నాతని కవితా ప్రభావ పరిణామమును లోకానుభవపరిపాకమునే కాక తత్కావ్యకళాభివృద్ధికి మనస్తత్త్వమునకు జీవిత చరిత్రమునకును గల పరస్పర సంబంధమును గూడ మనము దెలిసికొని సమన్వయింపగలుగుదుము. పాశ్చాత్య విమర్శకాగ్రేసరు లనేకులు షేక్స్పియర్ మహాకవి నాటకచక్రము నట్లు పరిశోధించియుండుట చేతనే యాతని నాటక కళాభివృద్ధి యందలి యంతరావస్థలను, తత్కళాపరిణామమునకు నాతని జీవితమునకు గల సంబంధము నీ మొదలగు ననేకాపూర్వాంశములను గనిపెట్టి యున్నారు.

ఇట్టి విమర్శనపూర్వకమగు గ్రంథాధ్యయనము మన దేశమున గొంతవఱకు దక్కువనియే చెప్పవలసియున్నది. అనగా గవితావిమర్శనమే యీ దేశమున లేదని చెప్పుట కాదు. కాని యొకగ్రంథమును విమర్శించునప్పు డందలి విషయము లాలంకారికనియమముల ననుసరించి యున్నవా! కవి గ్రంథాదినియమములను పాటించెనా! సూచ్యార్థసూచన గలదా! పాకశయ్యాలంకారకల్పనా చమత్కృతు లేమైన గవి జూపినాడా? వ్యాకరణదోషము లేమైన నున్నవా? రసపోషణము సమంజసమా? అను నీ మొదలగు విషయముల జర్చించి యా గ్రంథమున కింతవఱకు బ్రాచీన కవితా లక్షణములు పట్టుచున్నవని మాత్రము చూపుటకలదు. గ్రంథములను విమర్శించుటలో నిదియు నొకవిధము మాత్రమే యైయున్నది. దీనివలన గ్రంథవిమర్శన విషయమున వీరి దృష్టిలో కేవల గ్రంథమునకు గల ముఖ్యము గ్రంథకర్త విషయమున నేమాత్ర మున్నట్లగ డదు. కవి యెవడైన నేమి; యే కాలమువాడైన నేమి; యాతని బుద్ధివైభవమెట్టిదైన నేమి; యెట్టి పరిణామముల బొందిన నేమి; యాతని జీవిత చరిత మెట్టిదైన నేమి? వానితో నీ విమర్శకుల కేమియు నగత్యము లేదు. అతని గ్రంథమునందలి భాష, కల్పన, రసము మొదలగునవియే వీరికి గావలసినది. ఇవి పూర్వ లాక్షణిక మతానుసారముగ నుండెనా కవిగొప్పవాడే; కావ్య ముత్కృష్టమైనదే. లేక, యొక డెట్టి స్వల్పవిషయమునైనను బ్రాతపుంతను వదలి క్రొత్తమార్గమున ద్రొక్కిన నాతనికి లక్షణము దెలియదు. అతడు లాక్షణికకవులలో జేర్పదగడు. గ్రంథ ముత్కృష్టమైనదే యైనను లక్షణకవులచే నది పరిగ్రాహ్యము కాదు. పోతనామాత్యుని భాగవతమువంటి గ్రంథ మెంతరసవంతమైనదైనను రేఫశకట రేఫముల ప్రాసమైత్రితో గూడిన కతంబుననే కదా లాక్షణికుల యీసడింపులకు బాత్రము గావలసివచ్చినది.

"బమ్మెరపోతరాజకృత భాగవతంబు
సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొదువ యెంతయు
వారసి చూడగాను రే
ఫమ్ములు ఱాలునుం గదిసి ప్రాసము
లైన కతంబునం గదా
యిమ్ముల నాదిలాక్షణికు లెల్లరు
మాని రుదాహరింపగన్."

అని చెప్పుచు నప్పకవియు బూర్వులమార్గమునే యనుసరించెను. కావున గవికి, వానికవితకు నిట్టి లక్షణగ్రంథములు విమర్శనలును బ్రోత్సాహకరము లగుటకు బదులుగా నొకవిధమగు శృంఖలములగుట తటస్థించినది. వీని నతిక్రమించి తన స్వాతంత్ర్యమును వెలయించి యొకడు వ్రాసెనా యాతడు కావ్యరసాస్వాదనిపుణులగు సహృదయులమెప్పు వడయ గలిగినను లాక్షణికులవలన బహిష్కారమునే పొందుచున్నాడు. ఇట్లు మహాకవుల కావ్యములను బరిశీలించి విమర్శించుటవలననే బయలు దేఱిన లక్షణము గొంత కాలమునకు దనపుట్టుకను పూర్వోత్తరములను మఱచిపోయి యా కవితనే శాసించి బంధింప గడంగుచున్నది.

విమర్శనమనునది తజ్జ్ఞుల మదికెక్కిన కవితయందలి విశేషలక్షణముల బరిశీలించి, వానికి గల కారణముల నారసి యాయాదేశకాల పరిస్థితులకును దత్కవితారీతికిని గల సంబంధమును దెలిపి, యా కవీశ్వరుని కవితాశక్తి యిట్టిదనియు, నా కావ్యమందలి యుత్తమగుణము లివ్వియనియు సానుభూతితో నిరూపించుటయ గాని, కొన్ని నిర్దిష్టలక్షణములను, ప్రాక్పరికల్పితపద్ధతులను అనుసరించి యున్నదా? లేదా? యనియు, దక్కిన కావ్యములకంటే నిది గొప్పదా తక్కువదా యనియు విచారించుట మాత్రము గాదు. కవితావిమర్శనమునకు గావ్యమందలి విశేషలక్షణములను గ్రహించుట యెంత యవసరమో యాయాలక్షణములకును దత్కవి మనస్తత్త్వమునకును గల సంబంధము నారసి సమన్వయించుటయు నంత యావశ్యకమే. కావున కవియొక్క దేశకాలపరిస్థితులు, ఆతని మతాభిప్రాయములు, ప్రతిభాశక్తులు మొదలగువాని పరిజ్ఞానము ఆతని కవితాపద్ధతులను దెలిసికొనుటలో నత్యంత సహకారి యగుననుటలో సందేహము లేదు. ఇంతేకాక చరిత్రము తెలియని కవుల జీవిత విషయములను, మనస్తత్త్వమును గూడ గొంతవఱకు వారి గ్రంథములను బరిశీలించుటచే దెలిసికొనుట కవకాశము కూడ కలుగుచున్నది.

ఒక కవీశ్వరుని మనస్తత్త్వమును, కావ్యకళాపరిణామమును గనిపెట్టుట కాతనిగ్రంథముల పౌర్వాపర్యజ్ఞాన మావశ్యకము. ఇట్టి జ్ఞానముతో గూడిన కవితాపరిశీలనమును సానుపూర్వియగు నధ్యయనవిధానము (Chronological Method of Study of Literature) అని యందురు. ఒక కవిచే రచింపబడిన గ్రంథముల నొకదానితో నొకటి బోల్చి చదివి విమర్శించుటచే దత్కవిత్వసారము గ్రహింపబడుచున్నది. ఈ కవిని, వీనికృతులను అంతకు బూర్వులును సమకాలికులు నగు కవులతోడను వారి కృతులతోడను సరిపోల్చిచూచి యాయా కవులకు గృతులకు గలసంబంధమును, పోలికలను, భేదములను విమర్శించుచో నట్టి దానిని తారతమ్య పరిశీలనముతో గూడిన యధ్యయనవిధానము (Comparative Method of Study of Literature) అని యందురు. పౌర్వాపర్యవిచక్షణము లేక యేకవి గ్రంథముల నైనను బ్రత్యేకముగ జదివినప్పుడు దానివలన గలుగు నానందము నంతను బొందగలిగితి మనుటకు వీలులేదు. కవియొక్క భావగాంభీర్యమును సరిగ గొలిచి చూచితి మనలేము. ఆతని కావ్యకళ యేయేమార్గముల వృద్ధినొందినదో, ఆతనికి గాలక్రమమున గలిగిన లోకానుభవ మెట్టిదో, అద్దాని నాత డెట్లుపయోగపఱచుకొనెనో, దాని మూలమున నాతని మనస్తత్త్వమున గలిగిన మార్పు లెట్టివో అను విషయములను గనిపెట్టుట కవకాశముండదు. పారమార్థికచింతాతత్పరులగు మన పూర్వకవులు తమ యైహికచరిత్రను దెలుపువిషయమున విశేషశ్రద్ధ వహించినవారు గాకుండుటచే వారి గ్రంథముల బౌర్వాపర్యముమాట యటుండ నయ్యవి యాయాకవులు రచించినవియే యని నిరూపించుట గూడ నొక్కొక్కప్పుడు కష్టమగుచున్నది. కవుల కాలనిర్ణయ విషయముననే యనేకములగు చిక్కులు, అభిప్రాయభేదములు గలుగుచున్నపుడు ఒక కవిని, వాని గ్రంథములను, వానికి సమకాలికులు, పూర్వులునగు కవులతోడను, వారికృతులతోడను బోల్చి విమర్శించి యాకవియొక్క విశేషగుణములు, ప్రతిభాశక్తి యిట్టివని కనుగొనుట మఱింత కష్టమగుచున్నది. స్థలకాలములు తెలిసిన సుప్రసిద్ధాంగ్ల కవీశ్వరుడగు షేక్స్పియరు విషయముననే నిశ్చయముగ నాటకముల రచించినవాడాత డగునా కాదా యను సందేహమును, దన్మూలకములగు వాదోపవాదములును బయలుదేఱియున్నపుడు స్థలకాల విషయముననే సందేహముతో గూడిన కాళిదాసాది ప్రాచీన దేశీయకవుల విషయము చెప్పెడిదేమి? అయినను షేక్స్పియర్ వలెనే జీవితచరిత మంతనిశ్చయముగా దెలియని హైందవనాటకకర్తయగు కాళిదాసుని కళాప్రతిభలనుగూర్చి తెలిసికొనవలెనన్నచో నాతనిగ్రంథములను బరిశీలించుటయే ముఖ్యమగు మార్గముగా దలంపదగియున్నది.

కాళిదాసుని నాటక కళాచాతుర్యమును, దానిపరిణామమునుగూర్చి తెలిసికొనుట కాతనినాటకములే మనకు ముఖ్యమైన యాధారము లగుచున్నవి. కాళిదాస విరచితము లని ప్రఖ్యాతిజెందిన నాటకములు మూడు గలవు. అందు విశేషప్రసిద్ధి గాంచినది నాటకరాజం బనదగిన యభిజ్ఞానశాకుంతలము. ఇందలి కథ మహాభారత పద్మపురాణముల బ్రసిద్ధమైన కథలలో నొకటి. నీరసములగు చారిత్రక పౌరాణిక కథ లనేకములు షేక్స్పియర్ మహాకవి భావనాశక్తిచే మెఱుగు పెట్టబడి యెట్లు నూతన శోభ కలవయ్యెనో యట్లే దుష్యంతుని పురాణకథయు గాళిదాసుని యసమానంబగు

ప్రతిభావిశేషముచే నూతన జీవనమును బడసి ఖండాంతర పండితప్రకాండులనుగూడ దాండవమాడించినది. కాళిదాసుని యీ నాటకముల జదివినందువలన గలిగిన యానందపారవశ్యముచే జ నీదేశపు పండితుడగు 'గెటి' యనునాతడు దీనినిగూర్చి చె న ప్రశంసావాక్యములు పలువురకు దెలిసినవేయైనను మ యొకమాఱు వాని నిచ్చట స్మరించుట యతిప్రసంగము కాదు.

"Wouldst thou, the young years blossom
and the fruits of its decline,
And all by which the soul is charmed,
enraptured, feasted, fed,
Wouldst thou, the earth and heaven itself in
one sole name combine,
I name thee, O Sakuntala
and all at once is said."

ఉపదేశైకప్రయోజనంబగు నీ వ్యాసుని పురాణ కథ హిందూజనుల కత్యంత మాదరపాత్రంబగు నని యెంచి గ్రహించి రసైకప్రవణంబులగు నాటకపరిస్థితుల కనుగుణంబున మార్పులొనర్చి కథాప్రవృత్తి విషయమునను, స్వభావ పరిపోషణ విషయమునను, రసనిర్వహణమార్గమునను దన యప్రతిమానచాతుర్యమును బ్రకటించి కాళిదాసు దీనిని హైందవ నాటకముల కాదర్శముగ జేసి భారతీయనాటక కళకు వన్నె పెట్టినవాడయ్యెను. ఇట్లే ఋగ్వేదమునను, బురాణములందును మూలబడి కళదక్కియున్న విక్రముని కథనుగూడ బయటికి దీసి జీవముపోసి తన భావనాపటిమచే మెఱుగుపెట్టి శోభాయమానమగునట్లు చేసెను. శాకున్తలమందువలె దీనియం దీతని నాటకకళ పరిపూర్ణప్రకాశావస్థను బొందినట్లు కనబడదు. ఈ రెంటియందును భాసిల్లుచుండెడి భావసౌకుమార్యము, రీతిమాధుర్యము, కల్పనా పటిమ, మొదలగు నుత్తమగుణములు కొన్ని మాళవికాగ్ని మి| మున గనుపడకపోవుట చేతను దీనియందలి కథ కవి క ుతమై సర్వజనీనంబగు ననుభవసంతానంబును (Universal perience), మున్నతమగు ధర్మవృత్తమును (High Morality) జూపునది గాకుండుటచేతను నిది యీ కాళిదాసవిరచితమే కాదని కొందఱు పండితు లభిప్రాయ పడియున్నారు. కాని, యిది కాళిదాసుని తొలిరచనలలోని దగుటచేతనే పరిపక్వంబైన యాతని ప్రతిభకును లోకానుభవోద్దీపితంబగు బుద్ధివిశేషంబునకును నిదర్శనంబగు శాకున్తలముతో దులదూగలేకుండెనని తలంపవలసియున్నది. ఇందలి భావములేకాక పదగుంభనలు గూడ దక్కిన రెండునాటకములలో సమాన సందర్భముల గన్పడుటచే నీ మూడునుగూడ నొకనిచేతనే రచింపబడినవని యీ మూడు నాటకములయందలి కథాంశములను, భావములను, పదబంధములను సరిపోల్చి చూచిన వారికి స్పష్టము గాకమానదు. మఱియు దొలిరచనయందు కంటె నుత్తరోత్తరములగు నాటకములయం దీతని భావనావిలాసము, భావగాంభీర్యము మిన్నయగుటయే కాక యాతని బుద్ధిపరిపాకము, కళానైపుణ్యము ప్రకటితమగుచున్నవని చెప్ప నొప్పును.

కర్ణాలంకారమగు కిసలయమును గ్రహించిన మాళవిక యొక్క పాదాఘాతమును బడసిన యశోకమును ప్రమదవనమున నొకచో వేచియుండి చూచిన యగ్నిమిత్త్రుడు తన కట్టి యదృష్ట మబ్బలేదుగదా యని ''వయస్య! పశ్య,

శ్లో. ''ఆదాయ కర్ణకిసలయ
మస్మా దియ మత్ర చరణ మర్పయతి,
ఉభయో స్సదృశవినిమయా
దాత్మానం వఞ్చితం మన్యే.''

అని చింతింపందొడగెను. అట్లే కణ్వాశ్రమమున వృక్షసేచనము చేయుచు జెలికత్తెలతో గూడిన శకున్తలను బాదపాన్తర్హితుండై చూచుచున్న దుష్యంతుడు శకున్తల ముఖము మీద వ్రాలిన తుమ్మెదను జూచి,

శ్లో. ''చలాపాంగం దృష్టిం స్పృశసి బహుశో వేపథుమతీం,
రహస్యాఖ్యాయీవ స్వనసి మృదు కర్ణాంతికచరః,
కరౌ వ్యాధున్వత్యాః పిబసి రతిసర్వస్వమధరం,
వయం తత్త్వాన్వేషా న్మధుకర! హతా స్త్వం ఖలు కృతీ.''

అని వస్తుతత్త్వాన్వేషణముచే దాను నిరుద్ధప్రవృత్తుడగుచుండ నా తుమ్మెద కృతకృత్యంబగుటను గూర్చి విచారింప దొడగెను. మొదటి పద్యములోని ''ఆత్మానం వంచితం మన్యే'' అనుదానికిని రెండవదానిలోని ''వయం హతాస్త్వం ఖలు కృతీ'' అనుదానికిని గల భావసామ్యము స్పష్టమే. అగ్నిమిత్త్రుని వస్తు వినిమయమును గూర్చిన వర్ణనముకంటె దుష్యంతునిచే శృంగారనాయకుడుగా జేయబడిన మధుకరుని గూర్చిన వర్ణనమే కాళిదాసుని భావనావిలాసమును స్ఫురింపజేయుచున్న దనుటకు సందేహములేదు.

యకుల నేకాంతమున విడువనెంచిన చెలులు హరిణశాబకంబుల నావలకు దోలుమిషచేతనే వారి చెంత నుండి చనుట యీ రెండు నాటకములందును గాననగును.

''విదూషకః- (పరిక్రమ్య ససంభ్రమం) వకుళావళికే! ఏష బాలాశోకవృక్షస్య పల్లవాని లఙ్ఘయతి హరిణః. ఏహి వారయావ ఏనమ్.

వకు–తథా(ప్రస్థితా)-(మాళవికాగ్నిమిత్రమ్)

ప్రియంవదా- (సదృష్టిక్షేపం) అనసూయే! ఇతో దత్త దృష్టిరుత్సుకో మృగపోతకో మాతర మన్విష్యతి. ఏహి! సంయోజయావ ఏనం. (ఇత్యుభే ప్రస్థితే) (శాకుంతలమ్)''

ఇంక నీరెండు నాటకములయందును జెలులతో సంభాషించుచున్న నాయికల పలుకులు వినుచు నామె యెదుటకు జనుటకై తగిన తరుణము నిరీక్షించుచు నాయకులు తీవె పొదలచాటున దాగి యుండుటయు, మాళవికాగ్నిమిత్రమున నిరావతి నిపుణికాద్వితీయయై యగ్నిమిత్రుని రహస్య చర్యలను గనిపెట్టుటకుగా వానిని వెదకుచు నుద్యానవనమున దిరిగినట్లే విక్రమోర్వశీయమున నౌశీనరీదేవి తన పరిచారిక యగు నిపుణికతో జేరి పురూరవుని వెదుకజనుటయు బురూరవాగ్నిమిత్రుల యనురాగశూన్యములగు నాయికోప చారవిధులను గూర్చిన ప్రశంసలును గాననగును.

''అగ్ని- వయస్య, నిసర్గనిపుణాః స్త్రియః. కథం మాం అన్యసంక్రాంతహృదయం ఉపలాలయంత మపి తే సఖీ న లక్షయతి. అతః పశ్యామిః

శ్లో. ''ఉచితః ప్రణయో వరం విహంతుం
బహవః ఖండనహేతవోపి దృష్టాః,
ఉపచారవిధి ర్మనస్వినీనాం
నతు పూర్వాభ్యధికో పి భావశూన్యః.''

పురూ :-
శ్లో. ''ప్రియవచన శతోపి యోషితాం
దయిత జనానునయో రసాదృతే,
ప్రవిశతి హృదయం న తద్విదాం.''

ఈ మొదలగు సమానసందర్భము లనేకము లీ నాటకము లేకకర్తృకములని సాధింపగలవు. ఇంతేకాక:

రాజా- (ఆత్మగతమ్) అహో సర్వాస్వవస్థాసు చారుతా శోభాం పుష్యతి-(మాళవికాగ్నిమిత్రము)

కంచుకీ- (రాజాన మవలోక్య) అహో! సర్వాస్వవస్థాసు రమణీయ మాకృతివిశేషాణామ్-(శాకున్తలమ్)

ఈ మొదలగు వాక్యసరణియు,

నాయికతోడిరహస్యప్రణయము బయలుపడినతోడనే నాయకుడు లోప్త్రహస్తుడగు కుంభీరకునితో బోల్పబడు టయు;

విదూ- (జనాన్తికమ్) ప్రయోజయేదానీం కిమపి కర్మగృహీతేన కుంభీరకేన సంధిచ్ఛేదనే శిక్షితః ఇతి వక్తవ్యమ్ (మాళవికాగ్నమిత్రమ్)

లోప్త్రేన గృహీతస్య కుంభీలకస్య అస్తివా పరివైణం.
-(విక్రమోర్వశీయమ్)

స్వభావముచే భీరువగు విదూషకునకు గలిగిన సర్పభ్రాంతి;

నిపుణికా- ఇమం భుజఙ్గభీరుకం బ్రహ్మబంధుం అనేన భుజఙ్గకుటిలేన దండకాష్ఠేన స్తంభాంతరితా భూత్వా భీష యామి.

(విదూషకస్యోపరి దండకాష్ఠం పాతయతి)

విదూ- (సహసా ప్రబుధ్య) అవిహ అవిహ భోః, దర్వీకరో మే ఉపరి పతితః...కథం, దండకాష్ఠమేతత్!
-(మాళవికాగ్నిమిత్రమ్)

విదూ- అవిద భోః! కిన్న్వేతత్ భుజఙ్గనిర్మోకః? భూర్జ పత్రగతోయ మక్షరవిన్యాసః
-(విక్రమోర్వశీయమ్)

ఈ మొదలగు భావసామ్యములును;
కల విశుద్ధాయాః గీతేః స్వరసంయోగః శ్రూయతే
(శాకుం 6);
అర్యకౌశిక్యాఇవ స్వరసంయోగః -(మాళ-5
వసంతప్రథమావతార సుభగాని -(మాళ-3)
వసంతోదారసూచకం అభిరామత్వం ప్రమదవనస్య
-(విక్ర-3)
మా అత్ర భవతీ ధారిణీ విసంవాదయిష్యతి-(మాళవికా-1)
రమణీయఃఖలు అవధిః విధినా విసంవాదితః -(శా-6)
కిమిదానీం తత్రభవతీ ఊర్వశీ భవతః మనోరథానాం
కుసుమం దర్శయిత్వా ఫలే విసంవదతి -(విక్ర-2)
ఏతావా నేవ మే మతివిభవః -(విక్ర-2)
మృత్పిండ బుద్ధినా మయా -(శాకుం-6)

ఈ మొదలగు ననేకములైన సమానార్థక పదబంధ విశేషములుగూడ నీ నాటకము లేకకర్తృకము లనుటకు మఱింత యుపబలకము లగుచున్నవి. మాళవికాగ్నిమిత్రమున దక్కిన వానియందువలె గాళిదాసుని భావనాశక్తి స్ఫురణయు భావసౌకుమార్యము నంతగా గన్పడకుండినచో నది యాతని నాటకరచనావిషయమున ప్రథమప్రయత్నమగుటచేతనే యైయుండవలయును. కాని యా కారణముచే నాగ్రంథము కాళిదాస కృతము కాదనుట సమంజసముగ గన్పడదు.

ఈ రూపకములయందలి నాందీ ప్రస్తావనాంశములు గూడ నీ పై వాదమునే బలపఱచుచున్నవని చెప్పదగియున్నవి. వీనియందలి నాందీశ్లోకములన్నియు రఘువంశమందలి యాద్యశ్లోకము వలెనే శివస్తుతిపరము లగుటయేకాక మాళవికాగ్నిమిత్రమున.-

''అష్టాభి ర్యస్య కృత్స్నం జగదపి తనుభి ర్బి[భతో నాభిమానః'' అనియు, శాకున్తలమున ''[ప్రత్యక్షాభిః [ప్రపన్న స్తనుభి రవతు వ స్తాభి రష్టాభి రీశః'' అనియు, నాతని యష్టతనువులనుగూడ బేర్కొనుటచే నీ [గ్రంథము లేక కర్తృకములనుట [ధ్రువపడుచున్నది. పూర్వరంగాంగ భూత మగు నాంది యిష్టదేవతాస్మరణపూర్వకమును, ఆశీర్వచనా త్మకమునగు శ్లోకరూపమున నాటక కర్తయే రచించు నాచారము కాళిదాసుని కాలమునుండియే బయలు దేఱి యుండవలయునని తలంపదగియున్నది. ఏలయన, నంతకు బూర్వకాలమున రచింపబడినవిగా దలంపబడుచుండిన భాసుని నాటకములో ''నాంద్యంతే తతః [ప్రవిశతి సూత్ర ధారః'' అని మొట్టమొదటనే కనబడుచుండుటచే రంగ[ప్రసా ధనము, నాంది మొదలగు పూర్వరంగాంగము లన్నియు ముగిసినపిమ్మటనే సూత్రధారుడు లేక సూత్రధారగుణాకృ తులుగల స్థాపకనామకుడు [ప్రవేశించి నాటక వస్తువును, పాత్ర[ప్రవేశమును సూచించి నిష్క్రమించుట యాచారముగ నున్నట్లూహింపదగియున్నది. ఇట్టి భాసుని కాలమునాటి యాచారము కాళిదాసుని కాలమున గొంత మార్పు చెందుటచే గాబోలు కాళిదాసునికి దరువాతి వాడగు బాణుడు భాసనాటకముల కిదియొక విపరీతలక్షణ మైనట్లుగా,-

''శ్లో. సూత్రధారకృతారంభైః నాటకై ర్బహుభూమికైః,
సపతాకై ర్యశో లేభే భాసో దైవకులై రివ.''

''నాందీ శ్లోకము లేకుండగ, సూత్రధారుని చేత [ప్రారంభము చేయబడిన నాటకములచేత భాసుడు [ప్రఖ్యాతిగాంచెను'' అని చెప్పియున్నాడు. వీనియందు వస్తుసూచనము గూడ సామా ముగ నాయానాటకములయందలి [ప్రధాన పాత్రల నామ ముతో గూడిన యొక మంగళశ్లోక మూలముగ జేయబ యుండెనేకాని నాటకముయొక్కయు దత్కర్తయొ క్కయు [బశంస యేమాత్రము గానరాదు. మొదటి నాందీశ్లోకము నాటక కర్త రచించు నాచారము కాళిదాసుని కాలముననే బయలుదేరి యుండవచ్చును. ఒకవేళ కాళిదాసు తనకు బరమదైవతంబగు [ప్రకృతితో గూడిన పరమపురుషుని వర్ణింపదలచి తన [గ్రంథముల మొదట నీశ్లోకములను రచించుటచే నిదియే యొక యాచారమై తరువాతి కవులచే నవలంబింపబడినదేమో! భాసుని నాటకము లన్నియు [బాయికముగా రాజాజ్ఞచే దదాస్థానమునం [బయోగించుట కుగా రచియింపబడియుండుటచే గాబోలు కవి యానాటక ములందు స్వీయనామనిర్దేశాదికమునకు గడంగక మంగళశ్లోక పఠనానన్తరమే పాత్ర[ప్రవేశమును సూచింపుచు స్థాపనమును ముగింపజొచ్చెను. సూత్రధారుడు మంగళశ్లోకమును జదివి ''ఏవ మార్యమిశ్రా న్విజ్ఞాపయామి'' అని యేదో విజ్ఞాపన చేయబోగా నేపథ్యమునుండి యొకశబ్దము వినవచ్చుటయు నాతడు:

''అయే కిన్ను ఖలు మయి విజ్ఞాపనవ్య[గ్రే శబ్ద ఇవ [శూయతే; అంగ, పశ్యామి; (నేపథ్యే) ఉస్సరహ ఉస్సరహ, అయ్యా! ఉస్సరహ.

''సూత్రధారః-భవతు. విజ్ఞాతం'' అని నాటకపాత్ర [ప్రవేశమును సూచించి నిష్క్రమించుటయు నీ నాటకములో (వాసవదత్తా పంచరాత్రము మొదలగు నెనిమిదింటిలో) గానవచ్చుచున్నది. తక్కిన వానిలో నటీసూత్రధార సంభాష ణము ([ప్రతిమానాటకమున శరదృతుగానము) కొంత యున్నను, అది నాటకమునుగూర్చిగాని తత్కర్తను గూర్చి గాని [ప్రశంసించునదిగా గన్పడదు. ఈ నాటకములు రాజాస్థానముననే [ప్రయోగింపబడియుండ వలయు ననుటకు వీనిలో బెక్కింటియందు భరతవాక్యములో రాజసింహుని [ప్రశస్తి గానవచ్చుచుండుటయే [ప్రబలకారణముగ గైకొనదగి యున్నది. భాసుని నాటకములు రాజాజ్ఞచే దదాస్థానమున [బయోగింపబడుటకుగా [వ్రాయబడినవి గావుననే యాతడు స్వీయనామనిర్దేశాదికమును జేయక పాత్ర[ప్రవేశమును సూచించి స్థాపనలను మిగులజిన్నవిగ జేయుచు దుదను భరతవాక్యమునమాత్రము దన[ప్రభువును గీర్తించుచు వచ్చెనని తలంపదగియున్నది. కాళిదాసుకూడ నేదోయొక [ప్రభువరుని యాస్థానము నలంకరించియే యుండెనని కొన్ని కథల మూలమున దెలియవచ్చుచుండినను, ఆతడు తన నాటకము లను రాజాజ్ఞచేగాని, తదాస్థానమున [ప్రయోగింపవలయునను [ప్రధానోద్దేశముతో గాని రచించినట్లు గనబడదు. ఏలయన, మాళవికాగ్నిమిత్ర నాటక [ప్రయోగ సందర్భమున సూత్రధా రుడు పరిషదాజ్ఞచే నా నాటకమును [ప్రయోగించు చున్నట్లుగా జెప్పుచున్నాడు:

''అభిహితోస్మి పరిషదా కాళిదాస[గథిత వస్తు మాళవి కాగ్నిమిత్రంనామ నాటకం అస్మి న్వసంతోత్సవే [ప్రయోక్తవ్య మితి''

దీనివలన గాళిదా సీ నాటకమును సామాజికుల యానం దముకొఱకో, లేక, పండితుల పరితోషము కొఱకుగా (అపరితోషాద్విదుషాం న సాధు మన్యే [ప్రయోగవిజ్ఞానం) రచించియుండును గాని కేవలము రాజాజ్ఞచే గాదనియు, నీతని కాలమున నిట్టి నాటకములు వసంతోత్సవము మొదలగు నుత్సవ స రకే [ప్రబలియున్న నాటక సమాజములచే బహిరంగ [ప్రదేశములయందు బండిత సభలయెదుట [బయోగింప బడుచుండెడివనియు దెలియవ చ్చుచున్నది. ఆ కాలమున నాటక [ప్రయోగవిషయమునను,

దర్దర్శన విషయముననుగూడ జనుల కమితోత్సాహముండెడిది. ఆయా యుత్సవసమయముల యందు నే భాసునిదో, సౌమిల్లునిదో, కవిపుత్రునిదో యేదో యొక నాటకము ప్రయోగింపబడుచుండుటయు, జను లత్యంతోత్సాహముతో నా నాటకములంజూడ నేగుచుండుటయు గలదు. మాళవకాగ్నిమిత్రము నానాడు చూడవచ్చిన పారిషద్యు లింతకుబూర్వము భాసాదుల నాటకముల జూచి యానందించుచున్నట్లు అందు బారిపార్శ్వకుడు సూత్రధారునితో జెప్పిన "మాతావత్ ప్రథిత యశసాం భాస సౌమిల్ల కవిపుత్రాదీనాం ప్రబంధానతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య కథం పరిషదో బహుమానః" అను పలుకులనుబట్టియే తెలియుచున్నది. జనులకు నాటకము లందును, దత్ప్రయోగములందును నభిమానము గలిగినవెంటనే యనేకులు నాటక కర్తలేకాక నాటకముల బ్రయోగించు సమాజములుగూడ పెక్కు బయలుదేఱుచుండును. కాని సామాన్యముగా జనులకు బ్రాచీనకవుల యందును గవితయందును గల యభిమానము వర్తమానకవులయందు లేకుండుట స్వాభావికమే. కావున నా కాలమునందలి పారిషద్యులును భాసాదినాటకములయందువలె దక్కిన సమకాలికులగు వర్తమానకవుల నాటకములయందు దగిన యభిమానము జూపియుండకపోవుటచే నెట్లో కాళిదాసు కొందఱు స్నేహితుల సాహాయ్యముననో, నాటకప్రదర్శకుల తోడ్పాటు వలననో తన తొలిరచనను ప్రయోగింపజేసి, యప్పటి సామాజికులకుగల కేవల పురాణకావ్యాభిమానమును నవ్య కావ్యానాదరణమును ఖండించువాడుబోలె 'పురాణమిత్యేవ న సాధు సర్వం నచాపి కావ్యం నవమిత్యవద్యం' అని సూత్రధారముఖమున తన భావమును వెల్లడించి, భాసాదుల కావ్యములవంటి కావ్యములు వర్తమాన కవులలో గూడ ప్రతిభావంతులగువారు రచింపలేక పోరనియు, నంతకంటె రసవత్తరములగువానినే రచింపగలవారు కలరనియు సూచింపుచు బండితులగు సత్పురుషులైనను పరప్రత్యయనేయబుద్ధులు గాక పురాణకావ్యమును దమ నవ్యకావ్యములతో బోల్చిచూచి గుణవత్తరంబగు దానినిగ్రహింతురు గాక యని, "సంతః పరీక్ష్యాన్యతమద్భజంతే మూఢః పరప్రత్యయనేయబుద్ధిః" అని స్వపదస్థాపనకై యుద్ఘోషించి చెప్పుచున్న వానివలె గన్పడుచున్నాడు. ఇదివఱకు జనుల మనముల నాకర్షించియున్న భాసాదులనాటకముల బ్రచారము నణగ ద్రొక్కి యా స్థానమును వర్తమానకవియగు తానాక్రమింప దలచినవాడు గావుననే యీ ప్రస్తావనయం దీకవికి స్వీయగ్రంథ సమర్థనము, స్వనామనిర్దేశాదికము నవసరమైనవి. ఇట్లు కాళిదాసు ఆతని కాలపరిస్థితులనుబట్టి ప్రత్యేకఫలాపేక్షచే చేసిన నామనిర్దేశాదిక మొక యాచారమై కాలక్రమమున నాటకరచనయం దొక నిబంధన మైనట్లున్నది.

> "తత్ర పూర్వం పూర్వరంగః సభాపూజా తతఃపరమ్,
> కథనం కవిసంజ్ఞాదేః నాటకస్యాప్యథాముఖమ్"

అని నాటకాదులయందు బూర్వరంగాదులు ముగిసిన పిమ్మట గవి నామగోత్రాదులను నాటక నామమును జెప్పవలయునను సాహిత్యదర్పణకారాదుల లక్షణ వాక్యములకు గాళిదాసుని నాటకములే మూలలక్ష్యమై యుండనోపు. భాసుని నాటకముల యందువలె "నాంద్యంతే తతః ప్రవిశతి సూత్రధారః" అని నాంద్యంతమున సూత్రధార ప్రవేశము సూచింపబడక గాళిదాసుని నాటకములలో మొట్టమొదట నాందీశ్లోకము, పిదప "నాంద్యంతే సూత్రధారః- అల మతివిస్తరేణ" అని సూత్రధారుని వాక్యమును గన్పడుచుండుటచే నీ సూత్రధారుడే యా నాందీశ్లోకమును బ్రథమమున జదివి పిదప కవిని గూర్చియు, నాటకమును గూర్చియు బ్రస్తావించు చున్నట్లు కనబడుచున్నది. దీనినిబట్టి కాళిదాసుని కాలమునకే

> "పూర్వరంగం నిధాయాదౌ సూత్రధారే వినిర్గతే,
> ప్రవిశ్య తద్వ దపరః సూత్రధార గుణాకృతిః
> సూచయే ద్వస్తుబీజం"

అను నాచారముగా మారినట్లు కన్పించుచున్నది. "ఇదానీం పూర్వరంగస్య సమ్యక్ప్రయోగాభావాత్ ఏకఏవ సూత్రధారః సర్వం ప్రయోజయతీతి వ్యవహారః" అను సాహిత్య దర్పణకారుని వాక్యమందలి "ఇదానీం" అను వాక్యమున కర్థము కాళిదాసుని కాలమునుండియు నని గ్రహింపవలసి యుండునేమో!

మొత్తము మీద నీ మాళవికాగ్నిమిత్ర మందలి సూత్రధార పారిపార్శ్వకుల సంభాషణమూలమున నాకాలమందలి నాటక ప్రయోగవిషయములగు పరిస్థితులనేకాక లబ్ధప్రతిష్ఠులగు భాసాదులతో గాళిదాసు పోటీకి నిలువబడుట కిదియే మొదలనియు, కావున నీనాటకమే యాతని ప్రథమ ప్రయత్నమనియు గూడ మనము గ్రహింపవచ్చును. ఏలయన సూత్రధారు డా దినమున బూర్వమునందువలెగాక కాళిదాస గ్రథితవస్తువగు నవీననాటకము నొకదానిని బ్రయోగింప వలయుననగా బారిపార్శ్వకుడు భాసాదుల నాటకములను వదలి యీ యాధునికుని నాటకమునందు సభ్యుల కేమి యాదర ముండుననుట జూడగా నాదినమున సూత్రధారుడు తామాడబోవు నాటకమునే కాక నూతనముగా నాటకములను రచింప మొదలు పెట్టిన కాళిదాసునే సామాజికులకు బరిచితునిగా జేయదలచినట్లు తెలియు చున్నది. కాళిదాసుని నాటకముల బ్రయోగించుట కిదియే మొదటిసారియని తెలియవచ్చుచుండుటచే నీ మాళవికాగ్నిమిత్రమే యితని

మొదటి నాటకమని మనము నిశ్చయింపవచ్చును. కవి యాధునికుడై యాతని కావ్యము గ్రొత్తదైనంత మాత్రమున నది గర్హ్యము కాదు. అది సత్పురుషుల కాదరపాత్రము కాకపోదు. వారు గుణవివేచన చేసి రసవత్తరమైనదానినే తప్పక గ్రహింతురు అని సూత్రధారుడు, లేదా సూత్రధార ముఖమున గాళిదాసు చెప్పిన సమాధానము పూర్వనాటకము లకంటె నిది రసవత్తరంబేయను నర్థమును ధ్వనింపజేయుచు న్నదివోలె నున్నది.

ఇక విక్రమోర్వశీయ ప్రదర్శన సమయమున గవి యిదివఱకే సామాజికులకు గొంత పరిచితుడగుటచే నాతని గూర్చి చెప్పవలసిన యవసరము లేకపోయినది. కావున సూత్రధారు డీసారి ప్రదర్శింపబోవు నాటకముయొక్క విశేషగుణములను బ్రశంసింప మొదలిడెను.

మారిషః– 'బహుశస్తు పరిషదా పూర్వేషాం కవీనాం దృష్టః ప్రయోగబన్ధః; సో హ మద్య కాళిదాస గ్రథిత వస్తునా విక్రమోర్వశీయం నామాపూర్వం నాటకం ప్రయోక్ష్యే.'

ఇదివఱలో సామాజికులు పూర్వకవుల నాటకములనేకములు చూచియుండిరి. (కాళిదాసుని మొదటినాటకమగు మాళవికా గ్నిమిత్రము కూడ నా పూర్వనాటక ఫక్కి ననుసరించినదే) కాని యిట్టి నాటకమును జూచియుండరు. అపూర్వతయే దీని విశేషగుణముగా దెల్పబడినది. మొదటిది పూర్వకవు లగు భాసాదుల రచనలనే పోలియుండుటచే నీమాఱు కాళిదాసు నూతనఫక్కి ననుసరించి తన ప్రతిభను మెఱ యింప సమకట్టెను. నాటకవస్తువుగా ఋగ్వేదమందును, మత్స్యవిష్ణుపురాణములందును బ్రఖ్యాతమగు విక్రమునిక థను స్వీకరించెను. ఈ కథయు నగ్నిమిత్రునికథవలెనే నాయకుని యంతఃపురచర్యలనే విశేషముగ తెల్పునదియైనను, ఇందలి నాయకుని ప్రభావాతిశయము, దివ్యసంబంధము నీ నాటకమున దివ్యమర్త్యోభయాంశముల సమ్మేళనమునకు నద్భుతరసంబునకు గారణంబులై దీనికొక యపూర్వత నాపాదించినవి. కావుననే యిది వెనుకటినాటకము వంటిది కాదు; అపూర్వమైనది. ఇందలి సద్వస్తు పురుష బహుమా నము చేతనైనను కాళిదాసుని యీ నాటకమును సావధానులరై చూచి యానందింపుడయ్యా యని సూత్రధారుడు,

"ప్రణయిషు వా దాక్షిణ్యా
దథవా సద్వస్తు పురుష బహుమానాత్,
శృణుత మనోభి రవహితైః
క్రియా మిమాం కాళిదాసస్య."

అని యిట్లార్యమిశ్రులను హెచ్చరింపం దొడంగెను.

కాని యిందిట్టి హెచ్చరింపున కవసర మేమి యను ప్రశ్న కలుగక మానదు. ఇదివఱకు సూత్రధారుడు ప్రాచీన కవుల నాటకములం జూచి యానందించుచుండిన సామాజికుల యెదుట యీ నూత్నకవి ప్రథమకృతి యగు మాళవికాగ్ని మిత్రమును బ్రదర్శించుచు నందలి గుణములను గ్రహించు పనిని సదసద్వివేచనపరులగు పారిషద్యులకే వదలివేసెను. వారా ప్రయోగమును జూచి యానందభరితులయి యుందురు. ప్రాచీనకవుల ప్రతిభతో దులదూగు ప్రతిభాశాలి యాతడని తలంచియుందురు. ఇట్లా సామాజికులకు నీ నూత్నకవి యగు కాళిదాసునియందు గొంత ప్రణయ మేర్పడియుండును. కాని యాతడింకను లబ్ధప్రతిష్ఠుడు కాలేదు. కావుననే యీ మా ఱాతడు తన యప్రతిమానంబగు ప్రతిభావిశేషమును భావనాశక్తిని జూపుట కనువగు వస్తువు లేక యితివృత్తమును గ్రహించి పూర్వకవులను వెనుదన్న యత్నించెను. అందువలననే సూత్రధారు డీమాఱు "ప్రఖ్యా తవస్తువుకలదై యుత్తమనాయకునితో గూడి కాళిదాసుని విశేషప్రజ్ఞను జాటెడి యీ యపూర్వ నాటకము నవహితచిత్తు లరయి చూడుడీ" యని హెచ్చరించుట తటస్థించినది. భాస నాటకాదుల ఫక్కినే యనుసరించి రచించిన మాళవి కాగ్ని మిత్రమువలెగాక కొంత వఱకు నూతనమార్గము ననుసరించి రచింపబడిన యీ విక్రమోర్వశీయముతో నీతడు ప్రకటితవిశేషప్రజ్ఞుడు లబ్ధప్రతిష్ఠుడు నయ్యెను. కావుననే శాకుంతల నాటకప్రయోగ సందర్భమున నానాటి సభ పండితులతో గూడినదైనను సూత్రధారున కెట్టి సంకోచ ములు, హెచ్చరింపులు, విజ్ఞాపనలు నవసరము లేకపోయినవి. ఇదివఱకు రెండు నాటకములు చూడవచ్చిన పారిషద్యులలో బండితులుండిరో లేరో తెలిసికొనుట కవకాశము కలుగలేదు. అనగా నా రెండు నాటకములచేతను తాను పండి తులను గూడ మెప్పింపగల నను నిశ్చయము కాళిదాసున కున్నదో లేదో మనమెఱుగము కాని యీ శాకుంతలనాటక ప్రయోగ మును జూడవచ్చిన సభ పండితులతోడ గూడియున్నది. "అభిరూపభూయిష్ఠా పరిషదియమ్" అని చెప్పుచు అట్టి పండితమండలి యెదుటనుగూడ సంకోచమేమియును లేక "కాళిదాసునిచే రచియింపబడిన యభిజ్ఞాన శాకుంతల మను నూతనమగు నాటక మిపుడు ప్రయోగింపవలసియున్నది." (అద్యఖలు కాళిదాస గ్రథితవస్తునా అభిజ్ఞానశాకుంతల నామధే యేన నవేన నాటకే నోపస్థాతవ్య మస్మాభిః" అని సూత్రధా రుడు పలుకుటచే నీ నాటక మెట్టి హెచ్చరింపులు లేకయే పండితుల మెప్పునుగూడ సులభముగ బడయగలదనుభా వము సూచింపబడుచున్నది వోలె నున్నది. లేదా వెనుకటి రెండు నాటకముల మూలముననే కాళిదాసునికీర్తి నలుగడల వ్యాపించుటచే బండితప్రకాండు లనేకు లీతని నాటకమును

జూచి యానందించుటకు గుతూహలాయత్తచిత్తులై వచ్చి యుందురు భావమైనను దీనివలన వ్యక్తము కాకమానదు. ఇక విశేష మేమనగా నింతకు బూర్వము తాను ప్రయోగించు నాటకము యొక్క గుణములను దెల్పి సామాజికులను హెచ్చరించి నాటకమునం దాదరము గలిగింపజూచిన సూత్రధారుడి శాకుంతలమున, —

''ఆపరితోషా ద్విదుషాం
న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్,
బలవదపి శిక్షితానా
మాత్మ న్యప్రత్యయం చేతః.''

అని తన ప్రయోగవిజ్ఞాన విషయమునసే సంశయగ్రస్త మనస్కుఁడయ్యెను. తగిన శిక్ష నందినను నుత్తమనాటక ప్రదర్శన విషయమున బ్రదర్శకులకు గొంత భయ ముండక పోదు కాబోలును. లేదా కొందఱు పాశ్చాత్యవిమర్శకులు చెప్పినట్లుగా నీ నాటకమందలి భావసౌకుమార్యము, రసోత్కర్షయు బ్రయోగమున కందనివై మిగుల సూక్ష్మములై (Too subtle to be represented on the stage) యుండెనను భావమున కిది సూచకమేమో? లేక, కాళిదాసునకే యిట్టి సంశయము నాపాదింపవచ్చునా? ఇదివఱకే లబ్ధప్రతిష్ఠుండై తన నాటక కళా ప్రావీణ్యము నంతను జూపి దీని నొక యుత్కృష్టమగు నాటకముగ రచియించితి నను నిశ్చయము కలవా డయ్యెను. పండితు లద్దానిం జూచి యౌనని తలయూపువఱకు గవి స్వీయగ్రంథప్రాశస్త్యమును గూర్చి సంశయ మనస్కుఁడు కాకమానడుగదా! ''బలవదపి శిక్షితానా మాత్మ న్యప్రత్యయం చేతః'' అను విషయము సర్వలోక సామాన్యము. వినయశీలుడగు కాళిదాసుకూడ దానికి లోబడియుండును.

ఇంతకు దేలిన దేమనగా బ్రప్రథమమున గాళిదాసు తనకు బూర్వమున బ్రసిద్ధిగాంచిన భాసాది నాటక కర్తల మార్గమునే యనుసరించి మాళవికాగ్నిమిత్రమను నాటకమును రచించి పిమ్మట పూర్వకవులకన్న దాను విశేష ప్రజ్ఞావంతు డనిపించుకొని లబ్ధప్రతిష్ఠు డగుటకు పై కథను బోలిన దానినే ప్రాచీనగాథలనుండి దీసి కథాసన్నివేశ విషయమున నెక్కుఁడు జాగరూకత వహించి విక్రమోర్వశీయమున వస్తువునకు గొంత యపూర్వత గలుగజేసెననియు బిదప దనకవితాశక్తియు లోకానుభవమును నాటకరచనా ప్రావీణ్యమును పరిపక్వావస్థ నొందుటచే, ప్రఖ్యాతేతివృత్తమునే గ్రహించి యున్నతాదర్శములతో గూడిన శాకుంతలమను నుత్తమనాటకంబును రచించెననియు స్పష్టమగుచున్న దనుటయే.

ఇక గథాచమత్కారము, పాత్రపోషణము, కావ్యకళా సౌందర్యము మొదలగువిషయముల నీ నాటకములకుగల తారతమ్యము, వీని గుణవివేచనమూలమున సువ్యక్తం బగుచున్న కాళిదాసుని ప్రతిభావిశేషము, తన్నాటక కళాపరిణామ మందలి యంతరావస్థలనుగూర్చి తెలిసికొనవలసి యున్నది.

పైజెప్పిన కారణములనుబట్టి కాళిదాసుని తొలిరచన యనదగియున్న మాళవికాగ్నిమిత్రమునందలి వస్తువు మాళవి కాగ్నిమిత్రుల ప్రణయ కథ. ఈ యగ్నిమిత్రుడు క్రీస్తునకు బూర్వము సుమారు నూటయేబది సంవత్సరములనాడు. మగధరాజ్యమేలిన శుంగ వంశమునకు మూలపురుషుడగు పుష్యమిత్రుని కుమారుడు. ఈతడు విదర్భ దేశరాజకన్య యగు మాళవికను వివాహమాడగోరగా నామె సోదరుడగు మాధవసేను డామెను దీసికొని య మిత్రుని పట్టణమునకు బ్రయాణమయ్యెను. అప్పుడు విద దేశము నేలుచున్న యజ్ఞసేనునకు నీతనికి దాయాదత్వపు ష ముండుటచే నీ వివాహమూలమున నీతనికి సహాయసంపత్తి కలుగ గలదని యెంచి మార్గమధ్యమున యజ్ఞసేనుడు మాధవసేనుని జెఱ బెట్టుటయు, నాతని విడిపించుటకుగా నగ్నిమిత్రుడు కొంత సైన్యమును బంపి విదర్భేశ్వరు నోడించుటయు, పిదప అగ్నిమిత్రుడు విదర్భయందు ద్వైరాజ్యమును స్థాపించుటయు మొదలగు రాజకీయ విషయములను బ్రాసంగికములు గను, ఇందలి ప్రణయకథ కాధార వస్తువుగను జేసి ముఖ్యముగ నగ్నిమిత్రుని యంతఃపుర చర్యలనే తెలుపుచు గాళిదాసు దీనిని గృహజీవితమును వర్ణించు నాటకముగనే (domestic drama) రచించినాడు. ఈతని నాటకరచనయందు బ్రథమ ప్రయత్న మిట్టిదగుటకు కారణ మాతడు తనకు బూర్వులగు కవుల మార్గ మనుసరింప దలచుటయేకాని వేఱు కానోపదు. షేక్స్పియరు మహాకవి ప్రథమమున మారో మొదలగు పూర్వకవుల పద్ధతులనే యనుసరించి కాలక్రమమున నాతని బుద్ధి పరిపక్వము బొందినకొలది రచనాపద్ధతి యందు స్వాతంత్ర్యమును వహించి స్వీయకళాచాతుర్యమును జూపి నట్లే కాళిదాసుడును మొదట పూర్వకవుల ననుకరించినను గాలక్రమమున బరిణత కళాసౌందర్యమును బ్రకటించి మెఱయించినాడు. ఈతడు మానవజీవితమందలి యసంఖ్యాకములగు దశావిశేషములను, మానవస్వభావ వైచిత్ర్యములను యథాస్థితంబుగ వర్ణించి షేక్స్పియరు మహాకవివలెనే వాఙ్మ యాదర్శంబున విశ్వరూపిణియగు ప్రకృతియొక్క యనంత ములగు రూపవైచిత్ర్యములను జూపకపోయినను హైందవప్ర పంచమునకు బొడగట్టుచున్న యాదేవి పవిత్ర స్వరూపమును మాత్రము తన శాకున్తలము మూలమున సువ్యక్తం బగునట్లు చూపెననుటకు సందేహములేదు. హైందవ

ప్రపంచమున కాదర్శమగు నీ ధర్మస్వరూపమును గనుగొను టకు నాతనికి గొంతకాలము పట్టినది. మఱికొంత ప్రయ త్నము, లోకానుభవము కావలసివచ్చినది.

ప్రథమమున గాళిదాసు భాసాదులనాటకముల బోలిన నాటకమునే యంతకంటె రసవత్తరంబుగ రచియించి సామాజికుల యాదరమును బడయుటకు యత్నించియుం డెను. భారత రామాయణకథ లింతకుబూర్వమే భాసాదులచే నాటకములుగా రచియింపబడియుండుట చేతనో లేక స్వభావముచేతనో అపరిచితవస్తుదశా (Romantic Situations) వర్ణనకౌతుకాయత్తచిత్తుడును, అద్భుత ప్రియుడు నగుటచేతనో, ఈతడా కథలను మొదట గైకొనదలంపలేదు. కాని మిగుల జనప్రీతి కరములై ''ప్రాప్యావంతీ నుదయన కథా కోవిద గ్రామవృద్ధాన్'' అని మేఘసందేశమున జెప్పబడినట్లుగా గ్రామాదులందుగూడ వ్యాప్తిజెందియుండిన ఉదయనుని కథలు నాటకరూపమున భాసరచితములై ప్రదర్శింపబడుచు జనానురంజకముగ వెలయుచుండుట జూచి తాను నట్టికథను నాటకముగ రచింపదలచి యాకాల మున దేశమున మిగుల వ్యాప్తిజెందియుండిన మాళవి కాగ్నిమిత్రుల ప్రణయకథను నాటకవస్తువునుగా గ్రహించెను. అగ్నిమిత్రుని యాస్థానముననేయుండి కాళిదాసీ నాటకమును రచించెననియు గొందఱు తలంతురు.

ఇట్లు భాసాదుల వాసవదత్తాదినాటకములే యాతని ప్రథమ ప్రయత్నమున మార్గదర్శకములైయున్నను, ఈతడు మాళవికాగ్ని మిత్రమున దన ప్రతిభావిశేషమును మెఱయింప కపోలేదు. అగ్నిమిత్రుడు వత్సరాజువలెనే రాజ్యభారమం తయు మంత్రుల కప్పగించి తా నంతఃపురమున గామచర్య లతో గాలము పుచ్చుచు వినోదించుచుండెను. సిద్ధాదేశము నందలి నమ్మకముచే పద్మావతీకరగ్రహణలాభము వత్స రాజ్యలాభమునకు గారణమగునని యౌగంధరాయణుడు లావాణకదాహాదిక కృత్రిమతంత్రములను బన్ని వాసవదత్తను బద్మావతియొద్ద నిక్షేపముగా నుంచెను. ఇందు మాధవ సేనుడు చెఱబెట్టబడుటచే నారణ్యకుల చేతులలో బడి తుదకు ధారిణియొద్ద చేరిన మాళవికను బరివ్రాజికావేషమున నచ్చట జేరిన పండితకౌశికి గుర్తించియు మాళవిక సంవత్సర కాలము ప్రేష్యభావము ననుభవించి పిదప దగిన వరుని బొందగల దనెడు సిద్ధాదేశమందలి నమ్మకముచేతనే తమసం గతి బయలు పఱుపక కాలము ప్రతీక్షించి యుండెను. ఇట్లు సిద్ధాదేశమే యా రెండు నాటకములయందు గథాప్రవృ త్తికి మూలకారణమైనది. కథానాయిక లీ రెండిటియందును గూడ నాయకుల యంతఃపురముల బ్రచ్ఛన్నముగనుండి రక్షింపబడుచు నాయకుని యనురాగాతిశయమునకు బాత్రలై విదూషకుని తంత్రముల మూలమున నాయకునితో రహస్యన మావేశముల బడయుచుండ దుదకు వీరు తమ పుట్టినింట నుండి పంపబడిన జనముచే గుర్తింపబడి నాయకునియొ క్కయు, నాతని మహిషులయొక్కయు మన్ననలకు బాత్రము లగుచు వచ్చిరి. ఈ నాటకములో నాయకుని కామచర్యలే ప్రాధాన్యము వహించినను, ఈ ప్రణయకథారచనకు గొంత రాజకీయ వృత్తాంతము సముచిత సన్నివేశంబై యొప్పినది. మఱియు వాసవదత్తయందు గథాప్రవృత్తియంతయు యౌగన్ధ రాయణుని తంత్రము మీదనే నిలిచియున్నటులే మాళవికాగ్ని మిత్రమున విదూషకుని తంత్రములమీదనే యాధార పడియు న్నది. ఇక మాళవి కాగ్నిమిత్రమునందువలె దక్కిన నాటకములందు భాస నాటకానుకరణ మంతవిశేషముగ గన్పడకపోయినను వానియందు భానునిరచనాభక్కి కొంత లేకపోలేదు.

ఈతని నాటకరాజంబగు శాకున్తలముననే పోలికలు గొన్ని గలవు. అభిషేకనాటకమున నాల్గవయంకమందలి,-

శ్లో. ''యస్యాం న ప్రియమండనాపి మహిషీ
దేవస్య మండోదరీ
స్నేహా ల్లుంపతి పల్లవాన్ న చ పున
ర్వీజంతి యస్యాం భయాత్,
వీజంతో మలయానిలా అపి తరై
రస్ప్రుష్టబాలద్రుమా
సేయం శక్రరిపో రశోకవనికా
భగ్నేతి విజ్ఞాప్యతామ్.''

అను శ్లోకముతో భావసామ్యము రచనాసామ్యము గల

శ్లో. పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం
యుష్మాత్స్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి సతతం
స్నేహేన యాపల్లవం,
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే
యస్యాః భవత్యుత్సవః
సేయం యాతి శకున్తలా పతిగృహం
సర్వైరనుజ్ఞాయతామ్''

అను పద్యము శాకున్తలమున గానవచ్చు చున్నది.

శ్లో. ''విస్రబ్ధం హరిణా శ్చరం త్యచకితా
దేశాగతప్రత్యయా
వృక్షాః పుష్పఫలైః సమృద్ధవిటపాః

సర్వే దయారక్షితాః,
భూయిష్ఠం కపిలాని గోకులధనా
న్యక్షేత్రవత్యో దిశో
నిస్సందిగ్ధమిదం తపోవన మయం
ధూమోపి బహ్వాశ్రయః.''
-స్వప్నవాసవదత్త.

శ్లో. ''నీవారా శ్శుకగర్భకోటరముఖ
భ్రష్టా స్తరూణా మధః
ప్రస్నిగ్ధాః క్వచిదింగుదీఫలభిద
స్సూచ్యంత ఏవోపలాః,
విశ్వాసోపగమా దభిన్నగతయః
శబ్దం సహంతే మృగాః
తోయాధారపథాశ్చ వల్కలశిఖా
నిష్యందరేఖాంకితాః''
-శాకున్తలమ్

''భోః కోనామ ఏతత్ జానాతి తాదృశే వయం అనర్ఘ సలిలావర్తే పునరున్మంత్యామ ఇతి. ఇదానీం ప్రాసాదేషు ఉష్యతే, అంతఃపుర దీర్ఘికాసు స్నాయతే, ప్రకృతి మధుర సుకుమారాణి మోదక ఖాద్యాని ఖాద్యంత ఇత్యనప్సరస్సం వాసో ఉత్తరకురువాసో మయా అనుభూయతే. ఏకః ఖలు మహాన్ దోషః మమ ఆహారః సుష్ఠు న పరిణమతి. సుప్రచ్ఛద నాయాం శయ్యాయాం నిద్రాం న లభే.''
స్వప్నవాసవదత్త.

స్వప్నవాసవదత్త చతుర్థాంకమున నీ విదూషకుని వాక్య ములకును శాకున్తలమున ద్వితీయాంకమునందలి విదూష కుని వాక్యములకును గూడ జాల పోలిక గలదు..

ఇట్లే భవభూతినాటకములను శూద్రకుని మృచ్ఛకటిక మును భాసునినాటకములతో బోల్చి చూచినచో బ్రథితయశ స్కుడగు భాసునిరచనల ననుసరించిన దొక్క కాళిదాసే కాదని తెలియకపోదు.

అగ్నిమిత్రుడు స్వయముగా యుద్ధమునకైన బోక వీరసేనుని బొమ్మని జాబుమాత్రము వ్రాయించి తాను శృంగార విషయముల బ్రొద్దుపుచ్చుచున్నవాడగుటచే నతని పరాక్రమాది రాజపురుషలక్షణము లేవియు నెంత మాత్రము ప్రకటితములు కాలేదు. ఇక విక్రమోర్వశీయమందన్ననో, విక్రముడు కేశి యను రాక్షసునితో యుద్ధము చేసి యూర్వశిని రక్షించుటయు నింద్రునకు రాక్షసులతోడి యుద్ధమున నాతనికి దోడుపడుటయు నాతని పరాక్రమాదిగు ణములను వెల్లడించుచున్నవి. ఆతని పరాక్రమ ప్రదర్శనము నకు ప్రతిఫలమో యనునట్లు రాక్షసునినుండి రక్షింపబడిన దేవవేశ్యయగు ఊర్వశి యాతని సౌందర్య విలాసములచే మోహితయగుటయు, దుదకామె పాం దీతనికి గలుగుటయు సంభవించినది. మాళవికాగ్నిమిత్రమున నాయికానాయకుల యనురాగావిర్భావమునకు గారణ మగు ప్రథమసమావేశ మింతరమణీయముగ లేదు. ఇక శాకున్తలమున దుష్యన్తుని పరాక్రమాదిగుణ ప్రకటనమునకు విక్రమోర్వశీయమందు కేవలయాదృచ్ఛిక ప్రసంగమును కాళిదాసు గ్రహింపలేదు. కణ్వుని యాశ్రమమున యజ్ఞమునకు విఘ్నమాచరించుచున్న రాక్షసులను ధనుష్టంకారముల చేతనే పలాయితులను జేయుట చేతను, నింద్రునకు జయింపశక్యముకాని రాక్షసులను రూపు మాపి యాతని యర్ధాసన మధిష్ఠించి గౌరవింప బడుట చేతను, దుష్యంతుని పరాక్రమము విక్రముని పరాక్రమము కంటె సుప్రకాశిత మగుచున్నది. ఇంతియేకాక వేటయం దాసక్తి శ్రమాదుల నోర్చియుండుటకు వలయు సహసత్త్వాది కము, వీరపురుషులకు సహజమగు దృఢకాయమును గలిగి, యౌవన వంతుడు బలిష్ఠుడునగు నొక సుందర రాజపురుషుని యాకారము నీకవి మనయెదుట బెట్టుచున్నాడు. దుష్యంతుని వేటకై పురికొల్పినది కేవల మృగయాసక్తియే కాదు; వరాహశా ర్దూలాది దుష్టమృగ సంహారముచే దపోధనులగు నాశ్రమవా సుల సంరక్షణయు నీతని కవశ్యకర్తవ్యమై యున్నది. అనసూయ వాని నాతపోవనమునకు వచ్చుటకుగల కారణ మడుగగా ఋషుల తపస్సులు విఘ్నములులేక జరుగు చున్నవా లేవా యని విచారింప వచ్చితిని. ''ధర్మాధి కారే నియుక్తః అవిఘ్నక్రియోపలంభాయ ధర్మారణ్య మిద మాయాతః'' అని బదులు చెప్పెను. అరణ్యములందలి తాపసుల యోగక్షేమములవిషయమై యాతడు వహించిన విశేష శ్రద్ధకు నాఱవయంకమున గాశ్యపసందేశహారులగు ఋషికు మారుల యాగమన కారణమునుగూర్చి,-

శ్లో. కింతావద్వ్రతినా ముపోఢతపసాం
విఘ్నైస్తపోదూషితం
ధర్మారణ్యచరేషు కేనచి దుత
ప్రాణి ష్వసచ్చేష్టితమ్,
ఆహోస్విత్ప్రసవో మమా పచరితై
ర్విష్టంభితో వీరుధాం
ఇత్యారూఢబహుప్రతర్క మపరి
చ్ఛేదాకులం మే మనః''

అని వితర్కించుచు నాతడు పొందిన మనోవ్యాకులత్వమే నిదర్శన మగుచున్నది. రాజ్యమందలి ప్రజల నీతడెంత జాగరూకతతో స్వసంతానమువలెనే పరిపాలించుచున్నదియు

ధనమిత్రుని వృత్తాంతమువలన మనకు దేటపడుచున్నది. ఇట్లు ఇంద్రునకు జయింపశక్యముకాని రాక్షసులను జంపి దేవతలను, రాక్షసులను గ్రూరమృగములను సంహరించి యరణ్యములందు నివసించు తపోధనులను, స్వ సంతానము వలెనే రాజ్యమందలి ప్రజలను నొక్కరీతిగ రక్షించి పాలించు చుండుటచే వ్యక్తమగుచున్న యీతని పరాక్రమము, ఆర్తరక్ష ణపరాయణత్వము, ప్రజాహితైక జీవితత్వము, ధర్మరతి మొదలగు విశేషగుణములచే విక్రమాగ్నిమిత్రులకంటె నితడు హైందవ క్షాత్రధర్మమున కాదర్శభూతుడై వెలయుచున్నాడు.

ఈ నాటకత్రయమందు నాయకుల క్షత్త్రధర్మపరిపాలన విషయముననేకాక నాయికా నాయకుల ప్రణయవిషయమున గూడ గొంత భేదము కలదు. తన కంటబడకుండ దేవిచే రహస్యముగ రక్షింపబడుచుండిన యొక కన్యను మోహించిన వాడగుటచే నగ్నిమిత్రు డితరులకు దెలియకుండగ నా కన్యను దనకు గూర్చుటకుగా విదూషకు నభ్యర్థింపవలసిన వాడయ్యెను. ఈ నాయకుడు చిత్రగతయగు నాయికను జూచి మోహముకలవాడయ్యెనే కాని యాతని కామెను జేపట్టవచ్చునా యను సందేహమైన గలుగలేదు. విదూషకు డీ నాయికానాయకుల సమాగమము సమకూర్చినపుడెల్ల నిరావతి ప్రత్యక్షమగుచు వీరి విస్రంభభాషణములకు భంగము కలిగించుటయు, నీతడామెవలని భయముచే నేదోరీతి నొకబొంకు బొంకి యప్పటికి దప్పించుకొనుటయు దటస్థించుచువచ్చినది. ఇచ్చట నాయిక కేవలము పరతంత్ర యగుటయు, నామెను జేపట్టుటకు నాయకునకు స్వాతంత్ర్యముగాని ధైర్యముగాని లేకుండుటయు, నీతని రహస్యతంత్రములను దేవి తెలిసికొని నాయిక నీతనికంట బడకుండ బంధించియు దుదకు లాభము లేదని యెంచి యామె నీతనికిచ్చి వివాహమొనర్చుటయు, నీనాటకమందలి నాయికా నాయకుల ।ణయపద్ధతియై యున్నది. విక్రముడు గూడ నూర్వశిని మించి యామెతో గూడియుండుటకు దేవివలనిభయము లవాడై తనవిరహవేదన నామెకు దెలియకుండ గప్పిపుచ్చినవాడేయైనను, నాతడు వలచిన స్త్రీ దేవియధీనమందు లేకుండుటచే నామెతోడి సమాగమమునకుగాను రహస్యతంత్రములను బన్నవలసిన యవసరము లేకపోయినది. ఇచ్చట దేవియు నీతని మనం బన్యాసక్తంబని గాలికి గొట్టుకొనివచ్చి తన చేతంబడిన యూర్వశీ లేఖాదులచే నిశ్చయముగ దెలిసికొని రోషకషాయిత మనస్కయై విక్రముని యనునయంబులను లక్ష్యపెట్టక వదలించుకొని పోయినదైనను దుదకు బశ్చాత్తప్తయై ప్రియప్రసాదనవ్రత మను మిషచే మరల నాతని చెంతజేరి ''అద్యప్రభృతి ఆర్యపుత్రో యాం స్త్రియం కామయతే, యా ఆర్యపుత్రసమాగ మప్రణయినీ తయా సహాప్రతిబంధేన వర్తితవ్యమ్'' అని చెప్పిపోయినది. ఇట్లే దేవి తన కోపముచే నాతనిమనమును త్రిప్పలేకుండుటను దెలిసికొని తానే మఱియొక స్త్రీని ప్రేమించుట కాతని కనుమతి నిచ్చి మాట దక్కించుకొన్నది. రాజును నామె యెదుట ''నాహం పున స్తదా త్వయి యథాహి మాం శంకసే భీరు'' అని తా నన్యాసక్తమనస్కుడు కానట్లుగా జెప్పుకొనుచునే యామె తన చెంతనుండి మరలినతోడనే,-

''అపినామోర్వశీ;

శ్లో. గూఢం నూపురశబ్దమాత్రమపి మే
కాంతం శ్రుతౌ పాతయేత్,
పశ్చా దేత్య శనైః కరోత్పలవృతే
కుర్వీత వా లోచనే,
హర్మ్యేస్మిన్నవతీర్య సాధ్వసవశా
న్మందాయమానా బలా
దానీయేత పదాత్పదం చతురయా
సఖ్యా మమోపాంతికమ్.''

అని యూర్వశిరాక కూటలూరుచు గూరుచుండెను.

ఈ నాయికయు బరాధీన యగు కన్యగాని లేక తల్లి దండ్రుల యధీనమందుండిన యొకయువతిగాని కాక స్వైరిణి యగు దేవవేశ్య యగుటచే దనప్రియుని వెదకికొనుచు దానే వచ్చి యీ సమయము కనిపెట్టి వెనుకనుండి యాతని కన్నులు మూసినది. విక్రముడును దేవియెదుట చెప్పిన మాటలను ద్రోసిపుచ్చి తనప్రియురాలిని చల్లనిస్పర్శచే గుర్తించి ప్రియోక్తుల బల్కుచు నంతఃపురము జేర్చినాడు.

ఇక శకున్తలాదుష్యన్తుల ణయమందలి విశేషమేమనగా నది మొదటినుండియు ధ నిష్ఠంబేకాక ధర్మబద్ధంబునై యుండెను. కావుననే వీరియ రాగము హిందూ దాంపత్యమున కాదర్శభూతం బగుచున్నదని చెప్పదగియున్నది. పై రెండుకథలయందును గాళిదాసు నాయికా నాయకుల యనురాగ బంధముయొక్క పటిమను జూపినాడు. అచ్చట ధర్మచింతకే ప్రసక్తి కలుగ లేదు. ఈకథయందన్ననో యట్టి యనురాగము ధర్మబద్ధంబై దాంపత్యనిష్ఠ మగుచో నద్దానికి గలుగు పవిత్రతావిశేష మిట్టిదని వ్యక్తపఱిచినాడు. ధర్మ ప్రేరిత మగు నాత్మనిగ్రహ ప్రకటనమున కవకాశము కల్పించి యున్నాడు. కావుననే యింద్రియలోలత్వమునకు జిక్కి రాజ్యభారమునుగూడ వహింప నిచ్చగింపని నాయకులతో గూడిన తక్కిన నాటకములకంటె నీ శాకున్తలమే కాళిదాసుని బుద్ధిపరిపాకముయొక్క యౌన్నత్యమును సూచించుచున్న

దని చెప్పఁదగి యున్నది. ఆశ్రమవృక్షములకు జెలులతో గూడి నీరువోయుచున్న శకున్తల యవ్యాజమనోహరంబగు శరీరంబును, దల్లావణ్యాదికమును జూచినతోడనే దుష్యన్తుని మనమున నొకవిధమగు నభిలాష పొడమినది. వెంటనే, కణ్వాశ్రమమున నున్నట్టియు నా మహర్షి కుమార్తెయని చెప్పఁబడినట్టియు నీమె బ్రాహ్మణ కన్యయే యై యుండవ లయు గావున క్షత్రియుడగు తనకు బరిగ్రహణయోగ్య గాదని తలంచి యాతడు తనమనోవృత్తి నడ్డగించెను. కాని యార్యంబగు తన మనం బామెయం దభిలాష గలదగుటచే నామె తప్పక క్షత్రపరిగ్రహ యోగ్యయే కావచ్చునని తన యంతఃకరణ ప్రవృత్తిని బట్టి నిశ్చయించెను.

శ్లో. ''అసంశయం క్షత్రపరిగ్రహక్షమా
యదార్య మస్యా మభిలాషి మే మనః,
సతాంహి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మన్తఃకరణ ప్రవృత్తయః.''

పిమ్మట నామె జన్మ వృత్తాన్తమును, ఆజన్మాంతము నీమె బ్రహ్మచర్యవ్రతము జరుపవలసినదో లేక యనురూప వర ప్రదానమున గణ్వున కిష్టముకలదో యను విషయము నాత డీమె చెలికత్తె నడిగి తెలిసికొనెను. అట్లు తెలిసికొనిన పిమ్మటనే తన మనంబు నామెపై లగ్నముచేసెను. తన హృదయ ప్రార్థనము వ్యర్థము కాదని నిశ్చయించుకొనెను. శకున్తలయు నాతని జూచినప్పటినుండియు 'నేమి? నా మన మాశ్రమవాసమునకు విరుద్ధమగు వికారమునకు లోనగుచు న్నది.' ''కింను ఖల్విమం ప్రేక్ష్య తపోవన విరోధినో వికారస్య గమనీయాస్మి సంవృత్తా'' అని సాశ్చర్యముగ వితర్కించుకొన సాగినది. రాజు నెదుట తన చెలికత్తెలు తన వివాహ విషయము ముచ్చటింపగా దాను పోయి వీరి యసంబద్ధ ప్రలాపములను గౌతమి కెఱింగించెద నని బెదరించి పోబోయినది. తాను విరహానలతప్తయై శైత్యోపచారముల నపేక్షించుచున్నను ''హలా! కి మన్తఃపుర విరహ పర్యుత్సుకస్య రాజర్షే రుపరోధేన'' అని యాతని హృదయమును శోధింప జొచ్చినది. రాజునొద్ద నేకాంతముగ విడచిపోయిన చెలుల ననుగమింప నుద్యమించుచున్న యామెను దుష్యన్తుడు నిరోధింప ''పౌరవ! రక్ష వినయం, మదనసంతప్తాపి న ఖ ల్వాత్మనః ప్రభవామి-'' అని యాతని నివారింపుచు తాను దనతంద్రి యధీనములోనున్న దగుటచే నాతని యనుమతి లేకయే స్వతంత్రించుట కొప్పుకొనలేదు. తుదకు రా జామెకు బూర్వ గాథలను దెలిపి క్షత్త్రియ కన్యలకు స్వయంవర స్వాతంత్ర్యమున్నదని నచ్చజెప్పి గాంధర్వ వివాహమున కొడంబఱచెను. ఈ వివాహము వీరి యనురూప దాంపత్య మును గూడ కణ్వమహాముని సమ్మతిని బడయుటయే గాక యాతని యాశీర్వాదమును గూడ బొందినవి. పిదప గణ్వుడే యామెను భర్తయగు దుష్యన్తుని యొద్దకు బంపుటకు గౌతమితోడను మఱియిద్దఱు శిష్యులతోడను బ్రయాణము చేయించెను. కాని యీమె యూర్వశి వలె గురుశాపహతయై యథోలోకమున దన నాయకునితోగూడి యుండుటకుగా ముక్తాభరణ భూషితయై నీలాంశుక పరిగ్రహముకల యభిసా రికా వేషమును ధరించి సంధానకర్త్రియగు చెలికత్తియతోగూడి బయలు దేఱలేదు. శకున్తలా ప్రయాణ సమయమున బరిశుద్ధంబగు నా యాశ్రమమున నామె పవిత్ర జీవితమునకు దగినట్లుగా కణ్వమహాముని ప్రభావాతిశయంబున —

శ్లో. ''క్షౌమం కేనచి దిందుపాణ్డు తరుణా,
మాఙ్గల్య మావిష్కృతం
నిష్ఠ్యూత శ్చరణోపభోగసుభగో
లాక్షారసః కేనచిత్,
అన్యేభ్యో వనదేవతాకరరుహై
రాపర్వ భాగోత్థి తైః
దత్తా న్యాభరణాని తత్కిసలయో
చ్ఛేదప్రతిద్వంద్విభిః.''

ఒక వృక్షము పట్టుబట్ట నిచ్చినది; మఱియొకటి చరణముల కలంకరించుకొనుటకు మాంగల్య సూచకమగు పారాణి నిచ్చినది. ప్రస్తుతమున నీకాలమున బ్రబలుచున్న నవనాగర కత యిప్పటి తెల్లని మల్లుపంచెలును అంతకంటె స్వచ్ఛతరం బులగు జనుల మనంబులును రాగయుక్తంబులై పోవునని కాబోలును యీ లాక్షారసలేపనమును దూరాపాస్తముగా జేయందొడగినట్లున్నను, కాళిదాసు కాలము నుండియు నిది మాంగళ్య సూచకముగనే యెంచబడుచుండుటచే నీ యాచా రము సుమారు రెండువేల యేండ్లనుండి వచ్చుచున్నట్లు మనకు దెలియవచ్చుచున్నది. ఇట్టి వన దేవతా దత్తంబులగు మఙ్గళ వస్తువులను ధరించి ఋషి కుమారులచే ననుగమ్యమా నయై కాశ్యపునిచే నత్తవారింటికి నంపబడుచున్న శకున్తలను, పై జెప్పబడిన రీతి నభిసారికావేషము గ్రహించి సహచరీసహా యయై ప్రియుని వెదకబోవుచున్న యూర్వశిని మన మనోముకురంబున బ్రతిఫలింపజేసి చూచినచో నే నాయిక హైందవ ధర్మంబుల కాదర్శభూతం బగుచున్నదో యే చిత్రము కాళిదాసుని పరిణతబుద్ధిచే జిత్రింపబడియుండునో మనము సులభముగా గ్రహింపగలుగుదుము.

కాళిదాసుని నాటక కళ పరిపక్వము నొందిన కొలది యాతని నాటకముల విదూషకుని చర్యలు నాతడు నాయకుని కామతంత్రమున జేసిన సాహాయ్యమును తగ్గిపోవుచుండుటే కాక నాయకుల ప్రణయతంత్రములకు వీరి పెద్ద భార్య

లొనర్చెడి భంగపాటును తగ్గుచు వచ్చెనని చెప్పదగియు న్నది. అగ్నిమిత్రునివలె విక్రమునకు ప్రియాసమాగము విషయమున నంతగా విదూషకుని మీద నాధారపడవలసిన యవసరము లేకపోయినది. ఇక శాకున్తలము నందు విదూషకుడు నాయికా నాయకుల సమాగమమున కెట్టి సహకారియు గాలేదు సరిగదా! దుష్యంతుడు తన ప్రణయకా ర్యము నాతని యపేక్ష లేకయే నిర్వర్తించుకొనవలసిన వాడయ్యెను. విదూషకుని కీ ప్రణయ వ్యాపారమున ప్రసక్తి లేకుండ జేయుట చేతనే యాతడు కథాప్రవృత్తికి (development of the plot) తోడ్పడునట్లే మహాకవి యిం దేర్పఱచి నాడు. మఱియు నిందు దేవియగు వసుమతి యంగుళీయ కము దొరికినది మొదలు రాజునకుగలిగిన యన్యవ్యస్థతను విని శంకితమనస్కయై యుండి చతురిక రాజుకై తీసికొని పోవుచున్న వన్నెల పెట్టెను దానే తీసుకొని పోయి యిచ్చెదనని బలవంతముగా లాగికొని రాజు చర్యలను గనిపెట్టవలెనని బయలుదేఱినదైనను, ప్రతీహారి చేతనొక కాగితము బట్టుకొని రాజునొద్దకు బోవుచుండుటను జూచి రాజకార్యమునకు భంగము కలుగునేమో యనుభయముచే వెనుకకు మఱలి పోయినది. ఇది వసుమతి సమయజ్ఞతనే కాక దుష్యంతునకు రాజధర్మ నిర్వర్తన మందుగల విశేషాదర మును గూడ సూచించుచున్నది. ఇట్లే నాటకమున దేవి నాయకుని ప్రణయ కార్యములకు గలిగించిన భంగ మేమియు లేకపోగా నాయకుడును నామెకు భయపడి బొంకవలసిన యావశ్యకతయు లేకపోయినది. ఇట్లేశకున్తలా దుష్యంతుల ప్రణయ కథ తక్కిన రెండు కథల కంటె నున్నతా దర్శంబుల నెలకొల్పుచు గాళిదాసుని బుద్ధివికాసము యొక్క పరిపూర్ణతకు దార్కాణంబగుచున్నది.

ఇక నీ శాకుంతల మందే యాతని కళాచాతుర్యము గూడ పరిపూర్ణతను బొందెననుటకు నొకటి రెండు నిదర్శనములు చాలును. మాళవికాగ్నిమిత్రమున గథా ప్రవృత్తి యంతయు జాలవఱకు విదూషకునిమీదనే యాధార పడినట్లు కన్పట్టక మానదు. అగ్నిమిత్రుడు చిత్రగతయగు మాళవికను జూచిన దాది దేవి యనుగ్రహముచే నామెను చేపట్టు వఱకు విదూషకుడు పన్నిన పన్నుగడల కనుకూలం బుగ నడమకొనుచు నాతడు త్రిప్పినట్లెల్ల దిరుగుచు వచ్చెను. విక్రమోర్వశీయమున గథయంతయు నొకడు త్రిప్పినట్లు తిరుగకుండుటయేకాక యందలి కథాసంధులు పై దానిలోని వానికంటె విశేష నైపుణ్యముతో నమర్పబడి యున్నవి. విక్రము డూర్వశిని రక్షించుటచే నింద్రుని బహుమానమునకు బాత్రుడయ్యెను. ఈ సందర్భమున నూర్వశికి విక్రముని యందు గలిగిన యనురాగము భరతముని శాపమునకు గారణముగాగ నింద్రునికి విక్రముని యందు కలిగిన యాదరమే పై శాపమునకు ఊర్వశీ విక్రముల మనోరథ సిద్ధికి గారణ మగునట్లు మార్చి వేసినది. మఱియొక విశేష మేమనగా నీ శాపమునందే, లేక శాపావధియందే యుత్తరకథకు వలయు బీజము లిమిడియు న్నవి. ఎట్లనగా నీ శాపావధిని గూర్చిన జ్ఞానమే యూర్వశి తన కుమారుని చ్యవనఋష్యాశ్రమమున విడచివచ్చుటకు హేతువై పంచమాంకమున యాయువును గూర్చిన కథకు దారి తీసినది. మొత్తముమీద నీ కథాచక్రమంతయు తరువాతి శాకుంతల మందువలెనే యొక శాపమను కీలునందు దిరుగుచున్నదని చెప్పవలసి యున్నది.

శాకున్తలమున గణ్వమహాముని శకున్తలా ప్రతికూల దైవమును శమింప జేయుటకుగా సోమతీర్థమునకుబోదలచి పర్ణశాలయం దామె నతిథిసపర్యకై నియోగించి వెళ్ళుటయే నాయికానాయకుల సమాగమమునకు వారి పరస్పరానురాగ మునకునేకాక తన్మూలమున దుర్వాసుని శాపమునకుగూడ మార్గము నేర్పఱచియే పెట్టినది. ఋష్యాశ్రమములయందు నతిథి సత్కారములకుగల ప్రాముఖ్యము, దుర్వాసునికిగల ముక్కోపితనము, కణ్వునిచే నాశ్రమమున నతిథి సత్కారము నకుగా నియమితయయ్యును ననురాగవిష్టచిత్త యగు శకుంతల తన ధర్మము పట్ల నలసత్వము వహించుటయు నివి యన్నియు శాపమున కనువగు పరిస్థితులను గల్పించినవి. ఈ శాపకీలక మీ కథా చక్రమునకేకాక నాటక చక్రమునకు నట్టనడుమనే (అనగా నేడంకములు గల యీ నాటకమున నాల్గవ యంకము మొదటనే) యమర్చి యీ మహాకవి కథాచక్ర మెంత రమ్యముగనో త్రిప్పియున్నాడు! అయిదంక ముల విక్రమోర్వశీయముననను మూడవ యంకమున నట్టనడు మనే పొందుపఱుపబడినది. దీనియందు గథా ప్రవృత్తి మాత్రమునకే తోడుపడిన యీ శాపము శాకుంతలమున బాత్రపోషణమునకును రసోత్కర్షకును గూడ సాహాయ్యమును జేసినది. లోకమున వ్యాసుని దుష్యంతునకు (ననగా భారతమందలి దుష్యంతునకు) వచ్చిన నిందను దొలగించి యిందలి నాయకుని ధీరోదాత్త లక్షణ సమన్వితుడగు నుత్తమనాయకునిగా జేయుటకుగాను గాళిదాసీశాపసాహాయ్య మును గొనినవాడయ్యెను. దుర్వాసుడు శకుంతలకు నిచ్చిన శాపము దుష్యంతునియందు సంక్రమించి పూర్వగాథా విస్మృతి రూపమున బరిణమించినది. శాపహతుడగుటచే శకుంతల యెడ గావించిన యన్యాయమువలన నీతడు గళంకితుడు కాలేదు. ఇట్లు శాపము నాయకుని స్వభావమును బోషించి సమర్థించుచుండ శాపవిమోచన కారణము గథాప్రవృత్తికి దోడ్పడుచున్నది. ఈ కారణ మభిజ్ఞానాంగుళీయకము.

శకున్తల భర్తృగృహమునకు బోవునపు డామె చెలికత్తెలు శాపవృత్తాంతము చెప్పినచో నామె దుఃఖించుననియో లేక తచ్ఛాపపరిహార కారణం బగు నంగుళీయకమునే భద్రముగా నామెకిచ్చుచున్నపుడు మరల శాపవృత్తాంత ప్రసంగ మనవస రమనియో తలంచి యేమియు జెప్పక భర్త తన్ను గుర్తింపనిచో నీ యంగుళీయకమును జూపుమని యిచ్చిరి.

''యది నామ రాజా ప్రత్యభిజ్ఞామంథరో భవేత్ తదా ఏతదంగుళీయకం దర్శయ.''

కాని విధివశమున నీమె యంగరమును గోల్పోవుటయు నద్దాని గుర్తింపకుండుటయు నిందలి నాయికా నాయకుల వియోగమునకు గారణమై కథాప్రవృత్తికి దోడ్పడుచు రాజు ధర్మశీలత్వమును వెల్లడించినది. ఈ యభిజ్ఞానాంగుళీయ కమే మరల ధీవరుని మూలమున దుష్యంతుని చేతబడినదై శకుంతలాపరిణయ గాథ నాతని స్మృతి పథమునకు దెచ్చి యీ నాటకమున విప్రలంభ శృంగారరసము నుద్వేలము గావించుటకు దోడ్పడినది. మఱియు నీ యభిజ్ఞాన దర్శనమైన పిమ్మట పశ్చాత్తాపదోదూయమానమానసుడగు నాయకునకును, భర్తచే దిరస్కృతయైనను పతిదైవతయేయై ''పరిధూసరిత వస్త్రయు, నియమక్షామముఖియు, నేకవేణి యునై విరహవ్రతమును భరించుచున్న'' నాయికకును మిగుల పవిత్రమును బుణ్యవంతమునై యూర్ధ్వలోకమున నున్న మారీచాశ్రమముననే పునస్సమాగమమును గల్పించి కవి యీ కథా నిర్వహణము నతి హృదయంగమముగ చేసి యద్భుతరసావిష్కరణమును గూడ సాధించినాడు.

విక్రమోర్వశీయ మందలి కథా నిర్వహణము నద్భుత జనకంబేయైనను నింత యున్నత పవిత్ర భావోత్తేజకంబుగ గన్పడదు. కాని వీరి సమాగమమునకు శాకుంతలము నందు వలెనే వీరి కుమారుడే సన్నిహిత కారణమయ్యెను. ఈ కుమారుల సత్త్వోత్కర్షము వారి క్రీడాదికము చేతనే స్పష్టమగుచున్నది. కాని సర్వదమునుని కంటె నాయువు పెద్దవాడగుటచే నీతని బాల్యచేష్టల కంటె భక్తిభావమే మన మనముల నెక్కుడుగ నాకర్షింపగలదు. సర్వదమనుడన్ననో తన బాల్యచేష్టలచేతను అవ్యక్తమధురములగు ముద్దుమాటల చేతను, వాత్సల్య భావోత్కర్షకు గారకుడై యచ్చట దుష్యంతుని హృదయముతోపాటు మన హృదయములగూడ కఱగించి వేయుచున్నాడు.

కావున నిట్లు పరిశీలించి చూడగ నీ మహాకవి కాళిదాసు మాళవికాగ్నిమిత్ర రచనచే పూర్వకవుల మార్గమునే యనుస రించి నాటకకళయందు గొంత యభ్యాసము జేసికొని పిదప విక్రమోర్వశీయమున గొంత యపూర్వత గనబడునట్లుచేసి తన ప్రతిభను సూచించుచు నందు దన్మూలమున నుత్తమ నాటకమునకు వలయు పరికరమునంతను గూర్చి పెట్టుకొని వానినే మరల దీసికొని శాకుంతల కథయం దమర్చి దిద్ది వంకలుదీర్చి సానపెట్టి మెఱుగుతోమి తుదకు దానిని సంపూర్ణ ప్రభాభాసమానంబగున ట్లొనర్చినాడా యని తలంప దగి యున్నది.

సత్యం వద! ధర్మం చర!

— **Upanishad**

Truth alone triumphs, but not falsehood

— **Sivananda**

సత్యమేవ జయతే, నానృతమ్

— (శ్రీ 'కోరాడ' వారి డైరీనుంచి)

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు:

# ద్రావిడ భాషాతత్త్వ విమర్శనము: లింగ వివక్ష

హిందూ దేశమున దక్షిణభాగమందు నివసించుజనులచే మాట్లాడబడు ఆంధ్రము, కన్నడము, అఱవము, మలయాళము, తుళు మొదలగు భాషలను ద్రవిడభాష అందురు. ఆంధ్రద్రవిడభాషలు రెండును బ్రాచీన భాషయొక్క రెండు శాఖలకు జెందినవై కొంతప్రాముఖ్యమును జెందుటచే దక్కినవి వీనిలో నంతర్భూతములుగ గ్రహింప బడుచున్నవి. భాషల కన్నిటికి బరస్పర సంబంధమేమైన గలదా, వీనిలో నొకదానిలో నుండి తక్కినవి పుట్టినవా లేక అ \యు గూడ మరి యొక మాతృభాష నుండి వు నవా, ఆంధ్రభాషకును వీనికి గల సంబంధమెట్టిది, సం ృత భాషకును వీనికి నెట్టిసంబంధముకలదు అను విషయములు భాషాతత్త్వజ్ఞులు కొంతవఱకు జర్చించి యీభాషలన్ని యు నొకకుటుంబమునకే చెందిన సోదరభాషలనియు, నివి ప్రాచీనద్రావిడభాషనుండి బయలు దేరినవనియు, సంస్కృతము మొదలగు నార్యభాషలతో వీనికెట్టి సన్నిహిత సంబంధము లేదనియు నిర్ధారణ చేసియున్నారు. కాని యాంధ్రమందు విశేషపదములు సంస్కృతభాషలోనివియు, లేక తద్భవములునై యుండుటం జేసి ''జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్'' అని కేతనాదులు చెప్పినట్లీభాషకు జనని సంస్కృతంబే యనియు నితరములగు ద్రావిడభాషలకు దీనికినెట్టి సహజసంబంధము లేదనియు నాంధ్రమన్నిటికంటె బ్రాచీనతమమగుటచే నీభాషలన్నియు దీనినుండియే పుట్టియుండ వచ్చుననియు, నీ మొదలగు వాదము లిటీవల బయలు దేరియున్నవి. సంస్కృతాద్యార్యభాషలకు మాతృకయగు ప్రాచీన భాషకును, ప్రాచీనద్రావిడభాషకును సమానములగు విశేషాంశములేమైన గొన్ని యీ జన్యభాషలయందు సం మించిన సంక్రమించియుండువచ్చునుగాని, సంస్కృతాం' ములకు సన్నిహితంబగు సహజసంబంధమున్నదనుట మంజసముగా గన్పట్టదు. ఏదెట్లున్నను భాషలసాజాత్యము నేర్పరుపదలచినప్పుడు కేవలశబ్దజాలమును గూర్చిన విమర్శనము మనకు యథార్థజ్ఞానజనకము కానేరదు. ఆయా కాలానుగుణ్యముగ నొకభాష యనేకభాషల నుండి పదజాలమును సేకరింప వచ్చును. ఆయాపదముల, నాభాష మాట్లాడువారు తమయుచ్చారణ పరిపాటిననుసరించి, యనేక విధముల మార్చి వాడుకొనుచుండుటగాని, లేక యథాస్థితములుగ గ్రహించుటగాని సంభవించుచుండును. మఱియు నొకటేయర్థముగల శబ్ద మొకభాషచే గ్రహింపబడునప్పటి పరిస్థితులను బట్టి యనేక రూపముల జెందుచుండును. సాక్షాత్సంస్కృతమునుండి గ్రహింపబడిన కొన్ని శబ్దములు కేవల మాంధ్రప్రత్యయముల గూడియు మఱికొన్ని కొంత వర్ణవైరూప్యమును బొందియు దెలుగున బ్రయోగింపబడుచున్నవి. కొన్ని పదములు ప్రాకృతభాషాద్వారమున మఱికొన్ని మార్పులను బొంది తెలుగున బ్రవేశించినవి. కావుననె చంద్రుడు- చందురుడు, ఆశ్చర్యము -అచ్చెరువు, రథము-అరదము, పృథివి-పుడమి, ఈ మొదలుగాగల యనేక శబ్దముల కాంధ్రమున ద్వైరూప్యము సిద్ధించుచున్నది. ఏ యే శబ్ద మేయేకాలమున నెట్లు వచ్చినదో యా భాషాచరిత్రను సమగ్రముగ బరిశీలించిన తేలగలదు. ఒక్కొక్కప్పుడు నూతన పదజాలము ప్రాచీనపదముల నణగద్రొక్కి యెక్కువ వాడుకలోనికి వచ్చుచుండుటయు గలదు. ప్రస్తుతకాలమున సంస్కృతపదజాలమున కలవాటుపడుటచే విద్యార్థికులు సహిత మచ్చతెనుగుపదముల కొకప్పుడు వెదకికొనవలసిన వారగుచుండుట మన కనుభవసిద్ధమే. కావున భాషా సాజాత్యమును నిశ్చయింపంబూనుకొనినప్పుడు కేవలపదజాలమందలి సామ్యమునే యాధారముగా దీసికొని విమర్శించుట భాషాతత్త్వశాస్త్ర సమ్మతముకాదు. సామాన్యముగ నే భాష మాట్లాడు వారైనను విశేషభావములను దెలుపబూనినవు డన్యభాషాపద పరికరసహాయమును గోరుదురుగాని సామాన్య వ్యవహారమున స్వభాషాపదములను వీడరు. కావున నిత్యము వాడుకలో నుండు సామాన్యపదముల-అనగా తల్లి అక్క అన్న మొదలగు నంబంధవాచకములు, సంఖ్యావాచకములు, సర్వనామములు, ధాతువులు, క్రియాపదములు మొదలుగువాని - సారూప్యమునకుదోడు వాక్యములందలి పదములకు గల పరస్పర సంబంధాది విశేషలక్షణములన

దెల్పు వ్యాకరణాంశములందలి పోలిక గూడ నిరూపింపబడిన గాని భాషల సాజాత్యము నిర్ధారింప వీలులేదు. ఇందు కుదాహరణముగ నా ద్రావిడ భాషలందలి లింగవివక్షావిషయము నొకదానిని ప్రస్తుతము గమనింపనగును. సంస్కృతము మొదలగు నార్యభాషలలో లింగవివక్ష కేవలవ్యాకరణనిరూపితముగాని, స్త్రీపురుషవాచకత్వమునుబట్టి యేర్పరుపబడియుండ లేదు. అనగా లింగము శబ్దస్వరూపమును బట్టి వచ్చినదిగాని, దాని కర్థభేదముతో నేసంబంధమును లేదనుట. కావున నొక స్త్రీవాచకశబ్దము సంస్కృతమున స్త్రీలింగశబ్దముగనేకాక పున్నపుంసకలింగ రూపములుకూడ గల దైయుండవచ్చును. భార్యాశబ్దము స్త్రీ వాచకమేకాక స్త్రీలింగముగూడ నైయున్నది. కాని తత్సమానార్థకములగు దారాః, కళత్రం అను శబ్దములు స్త్రీ వాచకములేయైనను వ్యాకరణరీతిచే నొకటి పుంలింగశబ్దము, రెండవది నపుంసకలింగశబ్దమునైయున్నవి. జడవాచకంబగు వృక్షశబ్దము పుంలింగము, లతశబ్దము స్త్రీలింగము, ''ధూళి'' శబ్దము జడ వాచకం బైనను స్త్రీలింగము, తత్సమానార్థకంబగు పాంసు శబ్దము పుల్లింగము, రజః నపుంసకలింగము, రేణుః పుంస్త్రీలింగము, కావున నీ భాషలో స్వాభావికమగు లింగమునకును శబ్దముల లింగమునకు నెట్టిసంబంధము లేనట్లు స్పష్టమగుచున్నది.

ఇక నాంధ్రము మొదలుగా గల ద్రావిడభాషలలో నర్థమును బట్టి యే లింగ వివక్ష గలుగు చున్నది. పుంవాచక శబ్దము పుంలింగము, స్త్రీ వాచకశబ్దము స్త్రీలింగము, తిర్యక్జడవాచకములు నపుంసకములగుచున్నవి. మఱియు నామవాచకము లన్నియు మహత్తులని యమహత్తులని రెండు భాగములుగ విభజింపబడినవి. ఆంధ్రమున స్త్రీతిర్యగ్జడవాచకము లమహత్తులు. తద్భిన్నములు మహత్తులు. అఱవమున వివేకహీనములగు జంతువులన్నియు నమహత్తులు. వివేకమహితము లన్నియు మహత్తులుగ బరిగణింపబడుచున్నవి. ఆంధ్రవ్యాకరణకర్తలు స్త్రీలను వివేకహీనులుగ బరిగణించుటచే దద్వాచకశబ్దముల నమహత్తులనుట దటస్థించిన దని తలంపబడుచున్నది. కాని స్త్రీ వాచకములగు నాంధ్రశబ్దములు నపుంసకలింగప్రత్యయమునుబోలిన ప్రత్యయమునే గ్రహించునవగుటచే నీ భేదమును గ్రహింపలేక వారట్లు చేసియుందురనుట సమంజసముగా గన్పడును. ద్రావిడభాషలలో స్త్రీత్వద్యోతకప్రత్యయ మొకటి ''అత్తు'' అనునది కలదు-ఇది పదముల తుది జేర్చినప్పుడు ''అత్తి-లేక తి'' యగుచుండును-ఉదా. అఱవము వెళ్లాళత్తి. కన్నడము -అరసితి. ఈ 'తి' యాంధ్రమున 'ది'గా మాఱినప్పుడు, దీనికి నపుంసకలింగ ప్రత్యయమగు 'అది' లేక 'ది' యనుదానితో సారూప్యముకలుగు చున్నది. లింగద్యోతక ప్రత్యయములయందు గలిగిన యీ సమానరూపత్వమే స్త్రీవాచకములు తిర్యగ్జడములతో పాటు అమహత్తులక్రింద జేర్పబడుటకు గారణమైనది. కాని వివేక మహితలగు స్త్రీలను తిర్యగ్జడములతో సమానముగ మహత్త్వము లేనివారిగ జేయుట కిష్టము లేకయే యాంధ్ర వైయాకరణులు స్త్రీలకు బ్రత్యేకముగా మహతి యను నొక విభాగమును చేయవలసిన వారైరి.

ఈ లింగభేద మీ భాషలయందు స్త్రీ-పురుషుడు అనునర్థముగల శబ్దముల నాయాపదములకు ముందు జేర్చుట సర్వనామములను గాని తదంశములనుగాని తుదిని కలుపుట మాత్రము చేతనే వ్యక్తమగు చున్నది. కాని యీ లింగభేద నిరూపణ విషయమున వ్యాకరణ ప్రక్రియ కేమియు బ్రసక్తిలేదు. 'పిల్ల' యనుశబ్దము కలదు. దీనికి బ్రథమమున లింగవివక్షలేదు. కావుననే ఏమి 'పిల్ల'యను జిజ్ఞాస కలుగగా 'ఆడపిల్లా' 'మగపిల్లా' యనుప్రశ్న బయలుదేరిన సందర్భమున నాపదమునకు స్త్రీపురుషార్థబోధకములగు శబ్దములను ముందు చేర్చి ప్రయోగించుచున్నాము. మఱియు నీ పిల్ల శబ్దము స్త్రీపున్నపుంసక లింగద్యోతకములగు నిర్దిష్టవాచక సర్వనామ తదంశములగు 'అది' లేక 'ది', వాడు లేక 'డు' అను వానితో గూడి యాలింగభేదమును సూచించుచున్నది. ఇట్లె చాకలి, మంగలి, బోయ, మొదలగు శబ్దము లనేకములు ప్రథమమున లింగవివక్షాశూన్యములై యున్నట్లు గన్పడుచున్నవి. ఇట్లె యఱవమునను లింగభేదమును సూచించుటకు స్త్రీపురుషార్థవాచకములగు, 'పెణ్,' 'ఆణ్' అను పదములు లింగశూన్యమగు ''పైదల్'' = పిల్ల అనుపదమునకు ముందు చేర్పగా పెణ్ పైదల్ = ఆడపిల్ల, ఆణ్ పైదల్=మగపిల్ల అను శబ్దము లేర్పడుచున్నవి. సామాన్యలింగశబ్దంబగు 'మగ' యనుదానికి సర్వనామాంశము లగు 'అన్' 'అళ్' ప్రయోగ యములను జేర్చుటచే ''మగన్'' (మగణ్డు) మగళ్ (స్త్రీ) అనుశబ్దములు కలిగినవి. తిర్యక్ జంతువులయందు లింగ భేదము సూచింప వలసివచ్చినప్పుడు గూడ తద్ద్యోతకములగు పదములను ముందు చేర్చుచుందురు. ఉ-గుఱ్ఱము-ఆడగుఱ్ఱము- మగ గుఱ్ఱము. అర-కుదిరై-పెణ్ కుదిరై-ఆణ్కుదిరై. దీని వలన దేలిన విషయ మీ ద్రావిడభాషలయందు సామాన్యముగా శబ్దములు లింగరహితములనియు, గాలక్రమమున నీ భేదము లింగద్యోతకపదము లను గాని ప్రత్యయములనుగాని చేర్చుటచే గలిగినదనియు, నీప్రత్యయములు నిర్దిష్ట వాచక సర్వనామాంశము లనియు దేటపడుచున్నది.

మఱియు లింగభేద మేకవచనముననేగాని బహువచనమున లేదు. ఏ - ఆడపిల్ల - మగపిల్ల; ఉ-పిల్లలు; ఏ-చాకలివాడు- చాకలిది- బ - చాకళ్ళు ;ఏ-ఆడగుఱ్ఱము -మగ గుఱ్ఱము - బ- గుఱ్ఱములు. ఏ; వెళ్ళుచున్నాడు - వెళ్ళుచున్నది. బ- వెళ్లుచున్నారు. కావున నీ బహువచన శబ్దములు స్త్రీపుంలింగ

సమానములగు చున్నవి. ఇట్లు బహుత్వమున స్త్రీలు తిర్యగ్జడములతో జేరక పురుషులతో పాటు మహత్త్వముకల వారే యగుచున్నారు. ఇక సంస్కృతాదిభాషలలో పదములకు లింగభేదము, తద్వాచకములగు విడి పదములను జేర్చుట వలన గాక యర్థవంతములుకాని కొన్ని ప్రత్యయము మూలమున నేర్పడు చుండుటయు, బహువచనమున బ్రత్యేకపదములుండుటయు దటస్థించుటచే నీవిషయమున నార్యభాషలకును నాంధ్రము మొదలగు ద్రావిడభాషలకును సన్నిహితంబగు నెట్టి సహజ సంబంధము లేదని నిశ్చయింప దగియున్నది.

ఇట్టివ్యాకరణ విషయములందేకాక సామాన్యముగ వాడుక లోని పదజాలమును బోల్చిచూచినను ఈరెండుభాషలకును సాజాత్యమేర్పఱచుటకు వీలు గన్పడదు. ఆం[ ]నమునందలి సామాన్యపదముల వ్యుత్పత్త్యర్థములను పూర్వ [ ]రూపము లను బరిశీలించినచో నవి యితరద్రావిడభా పదముల బోలియుండునుగాని సంస్కృత పదముల నంతగా బోలి యుండవు. మన పండితుల కితరద్రావిడ భాషాపరిచయము లేకుండుటచే గాబోలు నాంధ్రశబ్దముల కసంభావ్యములగు వ్యుత్పత్తులు గల్పించుటయు వాని నేదోయొక సంస్కృతశబ్ద ముతో ముడివెట్టుటయు దటస్థించియున్నది-'ప్రొద్దు' శబ్దము 'బ్రధ్న'శబ్దభవముగా జెప్పబడినది. కాని యితరద్రావి డభాషలోగల 'పొళుదు' శబ్దమే దీనికి బ్రకృతియై యుండనో పును. 'బ్రధ్న' శబ్దము ప్రొద్దుగా మారినదనుటకన్న, మరను 'ప్రాను' అయినట్లె 'పొళుదు' 'ప్రొద్దు' అయ్యెననుటయే సంభావ్యముగ గన్పడుచున్నది. ఇట్లే కేలు, కులి శబ్దభవమ నియు కీడు, ఖేట శబ్దభవమనియు కాగితము - కాకలశ [ ]వ మనియు ఇంతి, స్త్రీశబ్దభవమనియు, చిత్రమగు వ్యుత[ ]లు చెప్పబడినవి. ఇట్టిశబ్దము లనేకములు కలవు. కాని [ ]స్తుత మున శుద్ధాంధ్రములగు కొన్నిస్త్రీవాచకశబ్దముల వ్యుత్పత్తి క్రమమున గొంత విచారింతము.

పైజెప్పబడిన లింగభేదసూచకపదములలో దెనుగున 'ఆడది' అఱవమున 'పెణ్' అనునవియు, ప్రత్యయములలో 'అది' లేక 'ది' అఱవమున 'ఆళ్' అనునవియు గలవు. ఈ పైపదములు స్వతంత్రపదములు. వీనికిని ఆయాభాషల లోని ప్రత్యయములకు నెట్టి సంబంధము కనుపడుట లేదు కాని అఱవమున స్త్రీవాచకప్రత్యయమగు 'ఆళ్' అనుదానికిని తెలుగు పదమగు 'ఆడ' అను దానికిని రూపసామ్యము కొంతగలదు. ఏకస్థానోత్పన్న ములగు ళ, డల కభేదము చెప్పబడియుండుటచే ఆళ్ - ఆడ్ - ఆడ కాగా బిదప నీశబ్దమునకు, దెనుగున స్త్రీవాచకప్రత్యయమగు 'ది' చేర్చుటచే ఆడది యను రూపమేర్పడి యుండును. ఈ ''ఆళ్'' అనునది ప్రత్యయముగా నాంధ్రమున బ్రయోగింపబ డకపోయినను దీనినుండి ''ఆలు'' అను ప్రత్యేకశబ్దంబొకటి నిష్పన్నమై ప్రయోగింపబడుచునే యున్నది. ఇల్లాలు, ధీరు రాలు, వెలయాలు మొదలగు శబ్దంబులందు అఱవము మొదలుగాగల భాషలందు దానికిగల 'స్త్రీ' యనునర్థమే కన్పట్టుచున్నను, గాలక్రమమున నిది భార్య యనునర్థమును గ్రహించి యిప్పు డాయర్థముననే వాడబడుచున్నది. ద్రావిడ భాషలలో గ్రియాపదములయందును స్త్రీవాచకప్రత్యయముగ వాడబడుచున్నను (ఉ- వెళ్లుచున్నది - పోగిరాళ్) ఆంధ్ర మున నిది ప్రత్యయావస్థలోనికి దిగలేదు. దీనికి గారణ మాంధ్రమున 'ది' యను మఱియొక ప్రత్యయ ముండుటయె కావచ్చును. ఈ 'ది' యనునది నపుంసకలింగ ప్రత్యయమును బోలియున్నను దానితో నభిన[ ]ముకాదు. ఇది ద్రవిడభాషల యందలి మఱియొక స్త్రీప్రత్[ ] యంబగు 'అత్తు' లేక 'అత్తి' అనుదానినుండి నిష్పన్నంబైన [ ]త్యయము. అఱవమునందలి 'వెళ్ళాళత్తి' 'వణ్ణాత్తి' యనుప ములను 'కాపది' 'చాకలిది' యను సమానార్థకములగు పదములతో బోల్చిచూచినచో నీయుభయభాషలయందలి ప్రత్యయములకు గల సామ్యము కన్పట్టక మానదు. 'అత్తు' లేక అత్తి' అనుదానియందలి 'తి' అనునది యుచ్చారణసౌలభ్యము కారణముగా 'ది' యయియుండును. 'ఇందు కుదాహరణముగ మఱికొన్నిశబ్ద ముల జూడుడు. యువతి - ఉవిద, జాతిః - జాది, ధాత్రి - దాది:రుతం - రొంద; బ్రతుకు-బ్రదుకు, వెతకు-వెదకు, కేతకి-గేదగి, చతురం-చదురు, తీరం-దరి. ఇంతియకాక ఒకతి, ఒకర్తి (=అఱ-ఒరుత్తి), చెలికత్తె, పడతి, ఇంతి మొదలగుశబ్దములయందీ స్త్రీ ప్రత్యయము యొక్క నిజస్వ రూపము గానవచ్చుచునే యున్నది. ఇట్లీ 'ది' యను స్త్రీప్రత్యయమునకు నపుంసకలింగప్రత్యయంబగు 'అది' లేక 'ది' యనుదానితో గలిగినసామ్యమే, మొదట 'అత్తి' యనునది 'అది'గా మారుటకును, పిదప దీనికి గలిగిన ప్రయోగబాహుళ్యమునకునుగూడ కారణమైయుండును. కావున బ్రాచీనద్రావిడ భాషయందలి స్త్రీత్వద్యోతకప్రత్యయ ములగు 'ఆళ్' 'అత్తు' అను రెండు నాంధ్రమునను దదితరభాషల యందునుగూడ వాడుకలో నుండినను, రెండవదాని కాంధ్రమునను, మొదటిదానికి దదితరభాషల యందును బ్రయోగబాహుళ్యము కలిగినట్లు తెలియ వచ్చుచు న్నది.

పెణ్ - అనుశబ్దముగూడ నఱవమున లింగశూన్యములగు శబ్దములను స్త్రీవాచకశబ్దములుగ జేయుట కుపయోగపడుచు న్నదని చెప్పబడినది. 'ఆళ్' అనుదానివలెనే యిదియు బ్రథమమున గేవల స్త్రీత్వద్యోతక శబ్దమైయుండి పిదప (ఒకని) భార్యయను విశేషార్థమును గ్రహించినది. కన్నడమున నిది 'పెణ్ణ యనురూపమును బొంది పైయర్థములయందే వాడబడుచున్నది. దీనికి స్త్రీప్రత్యయంబగు 'తి' చేర్పగా 'పెణ్ణతి' యయినది. భార్యయని దీని కర్థము. ఈయర్థముతో

సంబంధించినవి యాంధ్రమున 'పెండ్లి' 'పెండ్లాము' అను శబ్దములు రెండు గలవు. ఈపదములన్నియు ప్రాచీనద్రావిడ ధాతువగు ''పెణ్'' (=సంధానముచేయు, కలుపు, సాహచర్యము) అనుదానినుండి నిష్పన్నమైనవి. కావున పెండ్లి (పెణ్డ్- ఇల్ - లేక -లి) అనగా స్త్రీ పురుషులకు సంధానముకలుగ జేయు ప్రదేశము లేక కా ము అనియు, పెండ్లాము అనగా (=పెండ్లి ఆమె) పెం ాతురు - ఒకపురుషునకొసంగబడిన స్త్రీ అనియు న ము చెప్పవచ్చును. తిర్యగ్జంతువులలో నాడుదానిని సూచించుటకుగా నుపయోగించెడి - పెంటి, పెట్ట, పెయ్యమొదలగు శబ్దములకన్నిటికి బ్రాతిపదిక యీ 'పెణ్' అను శబ్దమే యయియున్నది. ఈశబ్దమును స్త్రీపరముగా ''మణ్ణాసయు బొన్నాసయు బెణ్ణాసయు లేనివారి పెన్నిధులనుచున్'' అనుచోట కాళహస్తిమాహాత్మ్యమున ధూర్జటికవి ప్రయోగించి యున్నాడు.

ఆంధ్రమున స్త్రీప్రత్యయముగా నుపయోగింపబడుచున్న 'ది' యనుదాని మొదటిరూపమగు 'తి' యను ప్రత్యయముతో గూడిన స్త్రీవాచకశబ్దములు మఱికొన్ని గలవు.

మడతి - ఈశబ్దము 'మడంగు' - అనగా దన కొలువులోనికి దీసికొనుట, తన యనుభవమునకై స్వీకరించుట యనునర్థముగల ధాతువునుండి నిష్పన్నమైనది. పురుషునియధీనమున నుండునదిగావున మడతి (మడంగు +తి) యయినది. ఇందాంధ్రరూపము 'తి'తో గూడియుండ, కన్నడమున నీ'తి' 'ది'యయి యా శబ్దము మడది, మడద్ది యనురూపముల బొందినది. కావున స్త్రీవాచకప్రత్యయంబులగు 'తి' 'ది' లకు భేదములేదనియు, నీ 'ది' యనురూపము కేవలము తెనుగుననేకాక కన్నడము మొదలగు నితర ద్రావిడభాషలందుగూడ గన్పట్టుచున్నదనియు స్పష్టమగుచున్నది. దీనివలన నాంధ్రమున స్త్రీవాచక ప్రత్యయమగు 'ది' యనునది నపుంసకప్రత్యయంబగు 'అది'లో నుండి వచ్చిన 'ది' గాక 'తి' యనునది మాఱగా గలిగిన 'ది' ప్రత్యయమని నిశ్చయింప వచ్చును. ఆంధ్రమున 'ది' యనుప్రత్యయముతో గూడిన స్త్రీవాచకశబ్దము వెలంది యనునది మఱియొకటి కలదు. పడతి శబ్దము మడతియొక్క రూపాంతరమే.

ఇంతి - ఇల్ + తి అనగా-ఇంటి యాడుది లేక ఇంటిది యని యర్థము. కావుననే భార్యాపరముగా నుపయోగింపబడుచున్నది. అటుల కన్నడములలో 'కొల్' అను ధాతువునుండి 'కొండు' అను రూపము గలిగి, ఆంధ్రమున 'కొను' అయినట్లే, 'ఇల్‌తి' లోని 'ల'కారము నకారముగా మాఱి 'ఇన్తి' యయినది. ప్రాచీన ద్రావిడభాషలోని 'ఇల్' అనుదానికి ప్రదేశ మని యర్థము. 'ఇల్' అనుదానిచివర నూతగా 'ఉ' చేర్పగా ఇల్లుఅయినది. అటువమున నీ 'ఇల్' అనునది సప్తమీ విభక్తి ప్రత్యయముగా 'అందు' అనునర్థమున వాడబడు చున్నది ఉదా. -మరత్తిల్' = వృక్షమునందు.

పాలతి- రూపాంతరము పాల్తి - కన్నడమున 'పాలెతి' అను శబ్దమునకు నీచజాతి స్త్రీయని యర్థము. పాలె యనగా ఋతుస్రావము లేక శిశుప్రసవమువలన గలిగిన యశుచిత్వము. అట్టి యశుచిత్వముగల స్త్రీ పాలతి యగుచున్నది.

నాతి- ఈ శబ్దము దేశ్యమని తలంపబడుచున్నను తద్భవశబ్దముగా గన్పడుచున్నది. దీని కితర ద్రవిడభాషలయందు 'నాయతి' 'నాచి' - 'నాయగి' యను రూపములు కలవు. స్వామిని లేక యజమానురాలు అను నర్థములు వీనికి గలవు. 'ని-నయ్'' అను సంస్కృతధాతువునుండి నిష్పన్నంబైన 'నాయకశబ్దమె 'నాయతి' యై దీనిలోని 'య' కారమునకు లోపము రాగా నాతి యయి యుండును.

పైదలి - ఉగ్మలి, తొయ్యలి మొదలగు కొన్ని శబ్దములు స్త్రీత్వద్యోతకముగా కేవల మొక 'ఇ' కారమునే గ్రహించుచున్నవి. పైదల్ అనగా పిల్ల (స్త్రీగాని పురుషుడుగాని) యని అర్థము. స్త్రీవాచకముగు 'ఇ' ప్రత్యయమును గ్రహించి 'పైదలి' యియి యాంధ్రమున స్త్రీపరముగా వాడబడుచున్నది.

ఉగ్మలి- యనుదానికి భయస్వభావముకలది - భీరువు అని యర్థము చెప్పవచ్చును. ఇది కన్నడమున గల 'ఉగి'=భయపడు' అను ధాతువునుండి నిష్పన్న మైనది.

తెఱవ- తెఱవు-అనగా వరుడు వధువు తల్లితండ్రులకిచ్చెడు వెలధనము. అట్లు తనకొఱకై యివ్వబడినధనము కలది, తెఱవ=స్త్రీ.

మగువ - పరిమళయుక్తమగు వాయి కలది. మగు ధాతువునకు పరిమళించు అనియర్థము- కన్నడమున మగమగిసు=పరిమళించు; తెనుగు-గమగమలాడు. మగువ అనగా పద్మినీ జాతి స్త్రీయని చెప్పవచ్చును.

ఇక క్రాల్‌గంటి, వాలుగంటి, కలువగంటి, పూబోడి, చిగురాకుబోడి, తీగెబోడి, మొదలగు స్త్రీ వాచకములగు దేశ్యపుపదములు సమాసపదము లగుటచే వాని వ్యుత్పత్త్యర్థము సులభగ్రాహ్యమె.

ఇట్లేదేశ్యశబ్దముల వ్యుత్పత్త్యర్థములను బరిశీలింపగా నీ శబ్దము లితర ద్రవిడభాషలయందలి శబ్దములను బోలుచు, ద్రావిడధాతువులనుండి నిష్పన్నంబైనట్లు తెలియుచున్నదే గాని సంస్కృతభాషాపదములతో నెట్టి సంబంధమున్నట్లు తేటపడదు.

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు:

# ద్రావిడ భాషా పద చరితము

(ఈ వ్యాసం శ్రీ రామకృష్ణయ్యగారు శ్రీ యు. సుబ్బరాయ భట్టుగారితో కలిసి వ్రాసినది.)

పైఁడి. ద్రావిడ భాషలలోని లోహవాచక పదములు చాల వఱకు కాయా లోహములకుగల రంగుల పేర్లను బట్టియే యేర్పడె ననుట కీ పదము వెండి లోనగువానివలెనే మఱియొక నిదర్శనమగుచున్నది. దీని పూర్వరూపములను గొన్నిటిని గనుగొన్నగాని దీని నిజస్వరూపము వాస్తవార్థము నుగూడఁ దేటపడవు. పైఁడియనునది 'పైఁడిచూలాలు,' 'పైఁడినేలత,' 'పైఁడికంటి' మొదలగు సమస్త పదములలోఁ గూడ గానవచ్చుచున్నది. ఈ పదములన్నిటిలోను 'పైఁడి' యనుదానికి 'పయిఁడి' యను మొదటిరూపము కలదని శబ్దరత్నాకరము సూచించుచున్నది. పయఁట-'పైఁట' పయికొను-పైకొను; పయిరము-పైరము (=పసరము); పయిరు-పైరు; మొదలగు పదములనుబట్టి చూడఁగా 'పయిఁడి' యొక్క తరువాతి రూపమే'పైఁడి' యయ్యెనను టకు సందేహము లేదు. ఇట్లు 'పైఁడి' నుండి దాని పూర్వరూపమగు 'పయిఁడి' యనుదాని యొద్దకు బోయి నను దాని వ్యుత్పత్త్యర్థ మింకను గోచరించుటలేదు. మఱికొంచెము వెనుకకుఁబోయి చూతము. ఈ 'పయిఁడి' యనుదానికి సమానార్థకమై 'పసిఁడి' యను మఱియొక పదము గన్పడుచున్నది.

''చతురవచన విలాసాంగ సౌష్ఠవములఁ
బసిఁడిదా నిచ్చినట్టే యప్పుడఁతి మఱవ,
బతికిఁగైదువు లందిచ్చురతి విధమున
విటున కిత్తురు మఱివారు విరులు పురిని.

ఆముక్త. 2ఆ.

క్రొ రుగ్గుఁదీగె తళుకుల కమ్మ పసిఁడి
కొడు తాఁకుల ఘూర్ణిల్లె ఘోరభంగి
దర్పక ద్దండదండ యాత్రకునుబోలె
భూరితర మేఘమాలిక పేరి భేరి.

భా.రామా.6ఆ.

వీనిలో మొదటి పద్యమున బంగారు రూపమగు 'ధనము' అను నర్థమునను, రెండవదానియందు 'బంగారు వన్నె' యను నర్థమునను 'పసిఁడి' యను శబ్దము ప్రయోగింపఁబడి నది. ఇదియు దీని నిజస్వరూపముగాఁ గన్పడుటలేదు. 'పైఁడి' యను సంక్షిప్తరూపమునగూడ నిలిచియున్న యా యర్ధానుస్వారముయొక్క మూలరూపమును మన మన్వేషింపఁగలిగినచో దీని నిజస్వరూపము బయటపడ వచ్చును.

మండూక మకర కచ్ఛప
గండూపద ధులికులీరకలహంసక కా
రండవ బకముల వెండి బ
సిండిని గావించి గంగఁ జిదుముదురు వ్రతుల్''

కాశీఖండము.

మడతపసిమిడి గింటెముల్ మంజిడిజిగి
దోమతెరమంచములు హసంతులు జవాది
యగులు సిరులు చిన్నెలుగాగ నతఁడు కడపె
జలినెలలు. ------ కళా.7.7

ఇట్లు 'పసిఁడి' యనుదానికి 'పసిండి' యనియు 'పసిమిడి' యనియు రూపములు గానవచ్చుచుండుటచే నిందా యర్ధానుస్వార మూలరూపమునేగాక 'పైఁడి' శబ్దము యొక్క నిజస్వరూపముగూడ మనము కనిపెట్టఁ గలిగి నాము. దీనివలన 'పసిమిడి' లో నుండి 'పసిండి' పసిఁడి, పయిఁడి, పైఁడి యను రూపములు బయలుదేరినట్లు తెలియుచున్నది. 'పైఁడి' లోని యర్ధానుస్వారము మూల రూపములోని 'మ' కారస్థానీయమేయని స్పష్టమగుటచే నీసంక్షిప్తరూపమున నిలిచియున్న యా చిహ్నము, ఈ పద మొక కాలమున నింతకంటె బెద్దదియైయుండెడిదని సూచిం చునదివోలె నున్నది. భాషలోని కొన్ని పదములలో నిలచి యున్న యర్ధానుస్వారాది చిహ్నము లుచ్చారణ సందర్భ మున ననవసరములె యైనను పద చరితమును భాషా చరితమును దెలుపుటలో మనకు విశేషముగ దోడ్పడునను టకు సందేహము లేదు. 'పసిండి' లోని 'స' కారము 'య' కారమగుట మఱియొక విశేషము. ఆంధ్ర కన్నడ రూపములయందలి యా 'స' కారము ప్రాచీన భాషారూప

మందలి 'శ' కారస్థానమున వచ్చినది. 'య' కార 'శ' కారములు రెండును తాలవ్యస్థానీయములె. అందు అంతస్థ మగు 'య' కారోచ్చారణము 'శ' కారముకంటె సులభత రము. కావున నుచ్చారణసౌలభ్యమునకై యత్నించుట స్వాభావిక గుణముగాఁ గలిగిన ద్రావిడభాషలు మాట్లాడు వారు 'శ' కారస్థానమున 'య' కారము పలుకుట సహజముగనె గన్పడుచున్నది. త. పెశర్ - పేయర్ - తె. పేరు. తె. పరిశం, పరియం. సంస్కృ - స్పర్శతి. పసరము-పయిరము - పైరము; కన్న - బిసిల్ - తమి - వెయిల్; కన్న - బసిర్ - తమి - వయిఱు; నేనట్ - తమి. నాయఱు.

ఇట్లు 'పసిమిడి' యని మనచేఁ బలుకబడు చుండెడి 'పశిమిడి' శబ్దమే కాలక్రమమున 'పైడి' యయినట్లు స్పష్టమగుచున్నది. ఇక నీ పసిమిడి శబ్దములో మూలరూ పము లేక ధాతువేదియో దాని యర్థమేమో విచారింప వలసియున్నది. 'పసిమి' యను శబ్దంబొకటి 'ఆకుపచ్చని' యనునర్థమున వాడుకలో నున్నది కావున నీశబ్దము 'పసిమి+మిడి' పసిమి+డి యనిగాని విభాగింపదగియున్నట్లు తోచుచున్నది. కాని యీ 'పసిమి' యనుపదము 'ఏనుగు,' 'ఎలుక' మొదలగు నేకవచన రూపములవలెనే (పసి + మిడి=పసిమి+డి) యనుచిత విభాగము (incorrect-breaking) వలనఁ గలిగిన పదమేమో యను సందేహము కలుగక మానదు. ఏలయన 'పేరిమి,' 'కూరిమి', 'చెలిమి' మొదలగు పదముల సాదృశ్యముచే 'పసిమిడి' శబ్దము 'పసిమి + డి' అని విభాగింపఁ బడియు నుండవచ్చును. ఇట్లైకానిచో పేర్వాదులకు ఇమివర్ణకంబగు (బాల.త.5సూ) అను బాల వ్యాకరణ తద్ధిత సూత్రముచే గలిగిన 'ఇమి' (లేక 'మి') వర్ణకాంతములగు నామవాచక పదములన్నియు నిట్టి 'పసి మిడి' మొదలగు పదముల యనుచిత విభాగముచే నేర్పడిన 'పసిమి' మొదలగు శబ్దముల సాదృశ్యము చేతనైన నేర్పడి యుండవలయును. ఈ విషయము భాషలో 'పసిమి' శబ్దము ముందు వచ్చినదోఁ పసిమిడి శబ్దము ముందో తెలిసినగాని తేలునట్లు లేదు. పసి+మిడి యను రెండుపదముల కూడికచే నేర్పడిన యీ 'పసిమిడి' నుండి 'పసిమి' వచ్చినదని చెప్పిన చెప్పవచ్చుగాని, 'పసిమి' శబ్దమేర్పడిన తరువాత దానికి మరల మఱియొక నామవాచకప్రత్యయము 'డి' చేర్పబడినద నుట (యీ 'డి' యేపదముయొక్క యవశిష్ట భాగమో (remnant) తెలియక పోవుటచే) సమంజసము గా గన్పడు టలేదు. ఒకవేళ 'వెండి' పదసాదృశ్యముచే వచ్చినదను సందేహము కలిగినను, అర్థమును బట్టిచూడ పసి +మిడి యనునవి రెండును ప్రత్యేకపదములుగానె కన్పడుచుండు టచే, నీ 'పసిమి,' 'పసిమిడి' యనుపదములు రెండును భాషలో ప్రత్యేకముగా నేర్పడిన పదములేగాని యొకదాని నుండి మఱియొకటి బయలుదేరలేదనుటయే యుక్తముగా దోచుచున్నది. మొత్తముమీద నీ రెండు పదములందేగాక, 'పసిపాప,' 'పసికూన' కన్న: పసు, తమి: పజా=ఆకుపచ్చని, చిన్న;క:పసు గూను=పసికూన; పసునంజె = పచ్చనిరంగు -అనగా నెరుపు కలిసిన పచ్చని రంగుగల సాయంసమయము; ఈ మొదలగు నితరభాషా సమాసపదములందుగూడ 'పసు' లేక 'పజా' అనురూపమే విశేషముగఁ గన్పడుచుండుటచే నిదియే మూలరూపమని తెలియవచ్చుచున్నది. మఱియు నుకారసహితంబగు తమి. 'పజా', ఇకారాంతములగు తమి మళ: పయి, మై; తె: పయిరు, ఇత్యాది రూపములనుబట్టి చూడగా దీని ప్రాచీనరూపము 'శ' వర్ణసహితముగా నుండి యీ 'పశ్' అనునది-పజా, పసు, పయ్ అని భిన్నభాషలలో భిన్నరూపములఁ బొందినట్లూహింపదగియున్నది. కావున ప్రాచీన భాషారూపము 'పశ్' లేక 'పశు' అనియే చెప్పవలెను. అర్థము విషయమున నీ 'పసు' శబ్దమునకును 'పసిమి,' 'పసిమిడి' శబ్దములకును గొంత భేదముకలిగినది. ఈ భాషలన్నిటిలో నీ 'పసు' అనుదానికి 'మరకతచ్ఛాయ,' 'పసరురంగు' అనియు, దానిని బట్టి పసరు కలవి (ఆకు, కాయ మొదలగునవి) లేతవి, పుట్టుకచే చిన్నవి యగుటచే 'పసు' లేక 'పసి' యనుదానికి 'లేత,' 'చిన్న' అను నర్థముకూడ వచ్చినది. పసరురంగు కలదై లేతవిగా నున్న పుడే యవి క్రొత్తవిగా నుండుటనుజేసి 'పసి' యనగా 'అభినవత్వము' (freshness) అను నర్థము కలిగినది. 'చిన్న'యను నర్థముగల యీపదమునుండి యేర్పడినవే తమి. పశంగళ్ = చంటిపిల్లలు (children); కన్న: పసుళె, పసుళ=పిల్ల (child), తె: పసివాడు, పసికూన యను పదములుకూడ కలవు. తమిళ మళయాళముల 'పైదల్' అనియు, కన్న: 'హైద' యనియు, తె: పైదముపిల్ల, పైదలి=యువతియను నీ పదములు 'పశి,' 'పయి' యై-పై కాఁ గా దానిపైన 'అదు' లేక 'దు' ప్రత్యయమునుగాని 'అల్' అను స్త్రీలింగ ద్యోతక ప్రత్యయమునుగాని చేర్చుటచే నేర్పడి యుండును.

మును-ముందు కొంతకాలమునకు 'ముదురు' ఐనట్లే 'పసు' లేక 'పసి' యనునది ముదిరి 'పచ్చి' యైనది. 'పచ్చి' కాయ కూడ పసరురంగుకలదై పచ్చనిదేయైనను ఆ పదము కేవలము పసరుకాయ (లేక కసుగాయ) కాక కొంచెము ముదిరిన కాయ యను నర్థమున వాడబడుచు న్నది. కావున నీ'పచ్చి' శబ్దము పసరు ముదిరి కొంచెము పచ్చనైన రంగుతో గూడిన దానిని బేర్కొనుచున్నది. యీ

'పచ్చి' 'పచ్చ' శబ్దములు 'పసి,' 'పసు' శబ్దముల రూపాంతరములే. వీనికి అగు, అన మొదలగు పదముల జేర్చినపుడు సంధివశమున నీ రూపము లేర్పడియుండును. 'పచ్చ కర్పూర' మందలి 'పచ్చ' శబ్దమునకు మాత్రము కేవలము పచ్చిరంగని యర్థమైనట్లు తోచదు. పచ్చికూడా ముదిరి-పండినరంగు-అనగా పసువు పచ్చని రంగుకలద నియే యర్థముగా గన్పడుచున్నది. సామాన్యముగా మనము చూచునది తెల్లనిదేయైనను శ్రేష్ఠమై విలువగలది పచ్చనిరంగు కలదైయుండును.

ఇట్టి భాషలన్నిటిలోను, వ్యస్తముగను, సమస్తపదములందును గూడ పసి(పశి) పసు అను రూపములే గన్పడుచున్నవి. కాని కన్నడాంధ్రముల 'పసరు,' 'పసిరు' (పశిరు=పయిర్-పయిరు) హసిరు హసురు మొదలగు రేఫాంత పదములుకూడ గానవచ్చుచున్నవి. ఈ పసరు అనున దాంధ్రమున ఆకు పచ్చని, పసరు రంగు అను నర్థమునేగాక (cf.''పసరొందెందలిరాకులన్ మరకత ప్రత్యగ్రజాగ్రద్యుతిన్.'' ఉ.రా.) ఆకులనుండి తీయబడిన రసము అని విశేష్య వాచకముగ గూడ వ్యవహరింపబడుచున్నది. రేఫాంత మగు నీరూపమునుండియే, ఆద్యచ్చునందు కించిద్భేదముతో నేర్పడిన 'పెసర్'-'పెసరు' అనుపదము కాలక్రమమున 'పెసరై' పసరు రంగుగల కాయధాన్య విశేషమును సూచించునదయ్యెను ఈ 'పెసరు' అను పదములోని తుదిరేఫము బహుత్వద్యోతకమని తలంప బడియుండును. లేదా అనేకములగు గింజలతో గూడిన ధాన్య విశేషము బహువచన ప్రత్యయాంతమగు పదముచే సూచించుట యుక్తమని తలంపబడుటచే ఆంధ్రమున 'లు' ప్రత్యయము బహువచన ప్రత్యయముగా నేర్పడినతరువాత 'పెసరు' లోని 'రు' వర్ణము 'లు' వర్ణముగా మాఱి యుండును. ఈ 'పెసరు' శబ్ద మీ పచ్చని ధాన్య విశేషము (green gram) అను నర్థమున 'పెసఱ్' అని కన్నడమునను, 'పయఱు' అని తమిళ మళయాళములను శకట రేఫాంతముగనే గన్పడుటచే (ఇట్లీభాషలలో రేఫ శకట రేఫములు వ్యత్యస్తము లగుచుండుట నింక ననేక పదములలో గన్పడుచునే యున్నది.) నిందలి రేఫము లకారముగా మాఱుట ఆంధ్రముననే యనియు, నందులో 'లు' అనునది బహువచన ప్రత్యయముగా నేర్పడిన పిదపనే యని చెప్పుటకు మఱింత యవకాశము కలుగుచున్నది. ఆంధ్రమున గూడ నీపదము కొంతకాలము రేఫాంతమై యుండెననుటకు 'పెసలు' అనుపదముతో జేయబడిన సమాస పదములందా రేఫ మగపడుచుండుటయే నిదర్శనమగు చున్నది. పెసల యొక్క పప్పు-పెసరపప్పు - పెసర్పప్పు అనియు, పెసలచేను 'పెసరచేను' అని యందుముగాని పెసలపప్పనియు పెసలచేననియు మనము వాడుటలేదు. 'ఆ చేలో పెసర చల్లినాము' అను సందర్భమున నిది రేఫాంతమై విడిగాకూడ వ్యవహరింపబడుచున్నది. మఱియొక విశేషము: ఈ పెసలు అను ధాన్య విశేషమును సూచించు పదములలోని యాంధ్ర కన్నడ పదములలో 'పసు' అను మూల రూపములోని మొదటి అకారమున కెత్వము రాగా, తమిళరూపమగు 'పయఱు' లో మూలరూపమునందలి 'అ' కారమే కానవచ్చుచున్నది. ఈ తమిళ 'పయఱు' రూపము ద్రావిడ భాషలలో 'శ' కారము 'య' కారమగుననుటకు మఱియొక నిదర్శన మగుచున్నది. ఆంధ్రమున 'పెసర' అనుపద మీకాయధాన్య విశేషమగు పెసలు అను నర్థమిచ్చుచుండ, దాని రూపాంతరమేయగు పయరు (పైరు, లేక పయిరు) అను పదము భూమినుండి ముఖ్యమగుపంట తీయబడిన తరువాత వేయబడు కాయధాన్య విశేషము అను సామాన్యార్థము వ్యవహరింపబడుచున్నది. (cf పంట-పయిరు, పయిరు చల్లుట, పైరుచేలు as against పంటచేలు etc) పండుటచే పచ్చనైన చేలనుండి తీసికొన బడిన పంట తరువాత వేయబడెడి పసరురంగుగల కాయధాన్య విశేషములు గావున నవి పసరులు-పయరులు-పైర్లు అయినట్లు తోచుచున్నది. కన్నడ భాషయందీ భేదములేక పంటలకు పైరులకు గూడ నీ పైరు పదమే వాడుబడుచున్నది. ఈ 'అర్' లేక 'రు' అనునది యిటీవల నామవాచక ప్రత్యయముగా విశేష ముపయోగపడినట్లు కనబడదుగాని, ప్రాచీన కాలమున ననేకములగు విశేష్య పదములు -

కసరు-కసి, కసుగాయ.
ముసురు-మూయు, ముగియు, మొయిలు=మేఘము.
పొగరు-పొంగు, పొంగలి, కన్న: పుగ్గు=గర్వము, తమి: పుడి=పైకిలేచుట (cf. పొడవు) పొంగర్ - పర్వతము.
గిజరు-గింజ, గుంజ.

ఈ మొదలగునవి ఈ ప్రత్యయము చేర్చుటచే నేర్పడినట్లు తెలియవచ్చుచున్నవి. 'పెసలు' వలెనే లాంతమగు 'బచ్చలి' శబ్దమొకటి విశేషమగు నాకు పసరురంగుగల యొకవిధమగు శాకము అను నర్థముకలదై యున్నది. దీని యాకులు సామాన్యముగా తక్కిన యాకులకంటె నెక్కువ పసరుదనము కలవౌటచే దీని కీ పేరు వచ్చియుండును. పదాది 'ప' కారము 'బ' కారంబగుట యిందలి విశేషము. 'పచ్చడి' శబ్దముకూడ పచ్చని యాకులనుగాని కాయలను గాని కొట్టి ముద్దగాజేయుటచే నేర్పడినది యను నర్థమును సూచించుచు నీపదకూటమునకే చేరి యున్నది.

ఈ రేఫాంతమగు 'పసర్' లేక 'పసుర్' అనుదానిపై మఱియొక నామవాచక ప్రత్యయమగు 'పు' వర్ణము చేర్చుటచే 'పసుర్పు' అనియు, ఇందలి రేఫము లోపించుటచే గాని లేక పసు అను మూలరూపమునకె 'పు' వర్ణంబు చేర్చుటచేగాని 'పసుపు' అనియు రెండు పదము లేర్పడుచున్నవి. ఈ పువర్ణాంత రూపము తమిళ కన్నడ భాషలయందు రేఫసహితముగనే కన్పడుచుండుటేగాక 'పస'రురంగు (ఆకు పసఁరు రంగు) అను మూలార్థమునే వహించియున్నది. ఆంధ్రమున మాత్రమెట్లో యిది 'పసుపు' శబ్దమై, (అనగా రేఫమును బోగొట్టుకొని) హరిద్ర పసుపు పచ్చని వర్ణము అను నర్థముకలదైనది. 'పసుపు' అనగా హరిద్ర వర్ణమేగాక హరిద్రము అనికూడ నర్థము వచ్చినది. ఈ శబ్దము హరిద్రము అను నర్థమున రూఢమైనపిదప గాబోలు నర్థవైశద్యముకొఱకు మరకత వర్ణమును సూచించు సందర్భమున నీ పసుపు శబ్దమునకుముందు 'ఆకు' అను పదమునుగూడ చేర్చి 'ఆకుపసుపు' అనియు హరిద్ర వర్ణమును 'పచ్చపసుపు' అనియు వ్యవహరించుచున్నారు. వర్ణవాచకములగు పదము లీ పువర్ణాంతము లాంధ్రమున 'ఎఱుపు, కెంపు, నలుపు, తెలుపు' మొదలగు ననేకములు కలవు. ఇందలి 'కెంపు' శబ్దమును కెం + పొన్-చెం + పొన్ అను పదముల కూడికచే నేర్పడినదిగాఁ జెప్పఁబడిన 'చెంబు' శబ్దముతో బోల్చి దాని రూపనిష్పత్తిని విచారింపగా, నిందలి 'పు' వర్ణముకూడ 'పొన్' యొక్క యవశిష్టభాగమేమో యనియు, నీ 'కెంపొన్' శబ్దమొక కాలమున ఎఱ్ఱని లోహమునకే కాక 'ఎఱ్ఱదనము' నకుగూడ వాచకమై యుండుటచే, కాలక్రమమున నీ 'పు' వర్ణము వర్ణద్యోతక పదములకు నామవాచకప్రత్యయముగా (noun forming Suffix) గలుపబడుచు వచ్చినదేమో యనియు నూహించుట కవకాశ మున్నట్లు తోచుచున్నది.

ఆకులు, కాయలు మొదలగునవి మొదట 'పసరు' రంగుకలవై క్రమక్రమముగా ముదిరినకొలది యా పసరు రంగువదలి 'పచ్చనివి' లేక 'పచ్చి' వియై తుదకు పండిన పిదప 'పసుపు పచ్చని'వి యగురీతిగానే, యీ పసి, లేక పసుశబ్దముయొక్క రూపములతోపాటు అర్థముకూడ నట్లే కాలక్రమమున మాఱి పసరురంగునుండి హరిద్రవర్ణములోనికి దిగినట్లున్నది పసుపు శబ్దము చాల ప్రాచీనకాలముననే 'హరిద్రము' అను వస్తువిశేషమున రూఢమగుటచే గాబోలు, వర్ణవిషయమున నర్థభేదము దీనికి విశేషము కలుగలేదు. దీనికి ఆకుపసరు అను నర్థము కన్నడముననే గాని యాంధ్రమున నసలే కనబడదు. కాని 'పసిమి' శబ్దము విషయమున మాత్ర మట్లుకాదు. ఇది మొదట నాంధ్రమున గూడ ఆకుపసరు (green) రంగు అను నర్థముననే వ్యవహరింపబడి క్రమక్రమముగా నా వర్ణముతోపాటు నర్థభేదమును బొందినట్లున్నది. ''పసిమి వో నెండిన కసవుకట్టయుం బోలె, నరవెంద్రుకలు పర్వు శిరమువలన'' అను కళాపూర్ణోదయ పద్యపాదమునందలి సందర్భమును బట్టి 'కసవు'కుగల యాకు పసరు రంగే యీ 'పసిమి' శబ్దముచే సూచింపబడుచున్నది. ''బాలారుణప్రభ పసిమినూడ్చిన భంగి నిండుకెంజెడతల ద్రిండుకట్టి'' (హరి.ఉ. 7=అ) యను చోటగల బాలారుణ ప్రభ, కెంజెడల సంబంధమును బట్టి యీ 'పసిమి' కిచ్చట గోరోజనపు వన్నెయని యర్థము చెప్పవలసియున్నది.' ''బంగారు పసిమించు పసని పుప్పొడి రేఖ జూపట్టుపాపట సొగసుతోడ'' (కళా.3అ) అనుచోట ఎఱుపు మించిన పసుపు వన్నె సూచితమగుచు నీ పదార్థమును బంగారువన్నెతో సరిదెచ్చుచున్నది. ఇచ్చట 'పసిమి' శబ్దమే లేకున్నను పసి, పసని యను మూలరూపములు రెండుమార్లు ప్రయోగింపబడుట యీ పదముయొక్క మూలార్థమెట్లు మారుచున్నది నూచింపక పోదు.

పై పద్యపాదము చదివినప్పుడు 'పసిమించు' అను నిట్టి సందర్భముల జేయబడిన యనుచిత విభాగముచేతనే యేర్పడినదేమో యని తలంచుట కనకాశము లేకపోలేదు కాని యది యంత సంభావ్యముగా గన్పడదు. పసు లేక పసి అనునది విశేషణముగా ననేకచోట్ల నుపయోగింప బడుచున్నది. ఈ విశేషణ రూపమునుండి నామవాచక రూపమును చేయుటకు అనగా 'పసి' నుండి దానిభావము-పసితనమును నూచించు రూపము నేర్పాటు చేయుట కనేక విధములగు ప్రత్యయములు లేక పదములు చేర్చి చెప్పబడినవి. 'పు' వర్ణంబట్టి వానిలో నొకటియనియు నది చేర్పబడిన తరువాత నా పదముయొక్క అర్థము ఆంధ్రమున నెట్లు మాఱిపోయి రూఢిచెందినదియు పైన జూచియేయున్నాము. ఈ 'పసిమి' లోని 'మి' యనునది (పై 'పు' వర్ణముకూడ నట్టిదె) యొక పదముయొక్క యవశిష్ట భాగమనుటకు సందేహమక్కఱలేదు. దీని కన్నడ భాషారూపము 'పసిమె' యనియు, దమిళరూపము 'పశుమెయ్' అనియు గన్పడుచుండుటచే నిది 'పసు+మెయి' అనుపదములకూడికచే నేర్పడినట్లూహింపదగియున్నది. తనమువలెనే 'మెయి' శబ్దము కూడ నొకకాలమున భావద్యోతక పదముగా నుపయోగింపబడియుండును. 'మెయి' శబ్దమునకు 'శరీరము' లేక స్వరూపము అని యర్థమగుటచే 'పసి' శబ్దముచే సూచితమైన పచ్చని గుణముయొక్క భావము, శరీరము లేక స్వరూపమును చెప్పవలసివచ్చినప్పుడు (పసియొక్క మెయి) మెయి శబ్దము నుజేర్చి పసిమెయియని చెప్పియుందురు. ఈ మెయి శబ్దము 'పసు' శబ్దముపై జేర్పబడినప్పుడు స్వరసామ్యమునుబట్టి (Vowel Harmony) పసు + మెయి=పసిమెయి=పసిమెయ్=పసిమెం పసిమి యనురూపములు గలుగును. ఇట్లె 'పేరు' యొక్క అనగా పెద్దదియైన (దాని) స్వరూపము లేక భావము

పేరుమెయి=పేరిమెయి క్రమముగా పేరిమి, పేర్మి యయినది. పెర్మె, హెమ్మెయని కన్నడమునను, 'పెరుమై' అని తమిళమునను ఆది హ్రస్వముతో గూడిన రూపములును గలవు. ఇంకను కడు - కడిమి, వాడి-వాడిమి, పోడి-పోడిమి, మేలు-మేలిమి, చెలి-చెలిమి మొదలగునవి కలవు. వీనినిబట్టి చూడగా నీ 'మెయి' యను పదము ముఖ్యముగా గుణవాచకములనుండి భావనామములను (abstract nouns) చేయుటకుగా నుపయోగపడినట్లు స్పష్టమగుచు న్నది. ఈ మెయియొక్క యవశిష్టరూపమే యీ పసిమ్యాదు లలో నీ కాలమున గన్పడుచు నొక ప్రత్యయముగా పరిగణింపబడుచున్నది. ఇట్లు గుణవాచకములపై గనుపడు చున్న యీ 'మి' ప్రత్యయము కాలాంతరమున నీ పదముల సాదృశ్యముచే ధాతువులపైగూడ జేర్పబడుటచే కలిమి, ఓరిమి, నేరిమి, బ్రదిమి, తాలిమి మొదలగు (కృదంతములని చెప్పఁబడెడు) రూపము లేర్పడినవి. ఇట్లేర్పడిన యీ 'మి' ప్రత్యయమునే యాంధ్ర వైయాకరణులు ''ఇమి'' ప్రత్యయ ముగా । హించి ''పేర్వాదుల కిమివర్ణకం బగు'' (బాల. వ్యా. త 5) అని యొకటి తద్ధిత 'ఇమి' ప్రత్యయముగాను ''ఇమి ర్ణకంబు కలుగ్వాదులకగు'' (బాల.వ్యా.కృదం.4) అని మఱియొకటి కృదంత ప్రత్యయముగను వేఱువఱచి విధించియున్నారు. 'పసిమి' శబ్దరూప నిష్పత్తి క్రమవిచారణ సందర్భమున నిది 'మి' వర్ణమేకాని 'ఇమి' వర్ణముకాదనియు నా 'ఇ' కారము స్వరసామ్య విధిచే (Vowel Harmony) గలిగినదనియు మనము తెలిసికొనియే యున్నాము.

పైనుదాహరించిన ''బంగారు పసిమించు పసని పుప్పొడి రేఖ'' యను కళా పూర్ణోదయ పద్యపాదమున బ్రయోగింపబ డిన పసను శబ్దముకూడ 'పసు' అను మూలరూపమునుం డియే బయలుదేరి 'పసిమి' వలెనె యర్థభేదము కలదయ్యెను.

కుసుమంబద్దిన విధమున
పసుపున హత్తించినట్లు బంగారమునన్
పసనిచ్చినగతి సంధ్యా
వసరంబున నింగి యరుణవర్ణంబయ్యెన్ (నైష. 8 ఆ)

అను శ్రీనాథుని నైషధ ప్రయోగ సందర్భమునుబట్టి యీ 'పసను' అనగా ఎఱుపుమించిన బంగారపు పసుపువన్నెయని తెలియుచున్నది. ఈ 'పసను' అనుదానికి నపుంసకలింగద్యో తకంబగు 'దు' ప్రత్యయము చేర 'పసనుదు'-'పసందు' అను పద మేర్పడినది. ఇది విశేష్యవాచకంబై 'సొగసు' అను నర్థము కలదయ్యెను. ప్రకాశమానంబగు పచ్చని బంగారు వన్నె సొగసుగానుండి మనములు నాకర్షించునదగుటచే, నా వర్ణముయొక్క ఫలరూప (effect) మగు సామాన్య భావమైన 'అందము' అను నర్థమును మాత్ర మీపదము సూచించునద య్యెను.

ఇక మనము పైన జెప్పిన 'పసిమి' శబ్ద నిర్వచనమే గనుక యథార్థమైనట్టయితే యిది 'పసిమిడి' శబ్దములోని 'డి' లోపముచే వచ్చినదని చెప్పుట కవకాశములేదు. మఱియు 'పసిమి' శబ్దమునకు అర్థము, మూలము తెలియని 'డి' వర్ణకము చేర్చుటచే 'పసిమిడి' యైనదని చెప్పుటలో విశేషమును లేదు. మఱి యేదోయొక పదసాదృశ్యముచే నీపద మేర్పడినదనుటకంటె, పసి+మిడి అనుపదముల కూడికచే నేర్పడిన యిట్టి పదముల సాదృశ్యము చేతనే తక్కినవి కొన్ని చలిమిడి, వ్రెల్మిడి మొదలగునవి యేర్పడియుండును నుట సంభావ్యముగా నున్నది. కావుననే యీ పదము పై 'పసిమి' శబ్దముకంటే భిన్నమగురీతి నేర్పడియుండునని తలంపబడినది. పసి+మిడి యనగా పసి (మి) యొక్క -పసరుగుణము యొక్క ముద్ద (mass)-అతిశయము -సమూహము లేక ఔన్నత్యము మిక్కిలి పసరు (పచ్చద నము) గలిగియుండుటయని యర్థము. పసిమి శబ్దములోని 'మేయి' శబ్దము దానియొక్క స్వరూపము లేక భావమును సూచింప నీ పసిమిడిలోని రెండవపదము ఆ పచ్చదనముయొ క్కగరిమ (intensity) తో గూడిన వస్తువును సూచించుచు న్నది. 'మిడి' శబ్దమున కాంధ్రముననే గాక తక్కిన ద్రావిడ భాషలయందును, సమూహము, ఔన్నత్యము, గర్వము, అతిశయము అనునర్థములు కలవు ఇది 'మిట్టు' కన్న-మిడి, మీఱు (=అనగా ఎగురు, మిట్టించు, సంచరించు) అను ధాతువునుండి యేర్పడినది. మిడిపళ్లు, మిడిమధ్యాహ్నము అనుచోట్ల ఉన్నతములు, తీక్ష్ణము అనునర్థములు కూడ కలవు. దీనినుండియే మిట్ట, మిఱ్ఱు; కన్న-మిట్టు, మేడు మిట్టి, తమి-మేధై; మొదలగు పదము లేర్పడినవి. మిడిసి పాటు, మిట్టిపాటు, మిటారము=నిక్కు; మిటారి=మదము గల యాడుది; మిడుగు=కఠినమైన శిల (cf. మిడుగురాళ్లమిట్ట ఇత్యాదులు దీనికి సంబంధించినవే. ఇంకను, తు- మిత్తు; కన్న -మేలే; త-మేలై) తెలు-మేలు = ఎత్తైన, ఉపరిభాగము -మేలుకట్టు-మేల్కట్టు = చాందినీ; (వీనిలో డలయోరభే దము) మేలు = మంచిది, శుభము-పైది-ఉత్కృష్టమైనది గనుక; మిద్దె; మీఱు=అతిక్రమించు; ఇవియన్నియు నొక కూటమునకు జేరిన పదములేయని గ్రహింపదగియున్నది.

కావున 'పసిమిడి' యనగా పసిమియొక్క లేక పచ్చదనము యొక్క గరిమయైనది. పసియనుదానికి పసుపు పచ్చనిరంగు అను నర్థము వచ్చినతరువాత నీ 'పసిమిడి' యేర్పడి, యా పచ్చని వన్నెయొక్క గరిమ బంగారమునకుండుటచే నది స్వర్ణవాచకమై కాలక్రమమున నాయర్థమున రూఢమైనది. ఇది యర్థముచే వర్ణగరిమను సూచించునదైనను, కాలము గడిచిన కొలది నైజస్వరూపమున దీనికి వర్ణలోపము తప్పినది కాదు. కాలగతిని గలుగు నవస్థల నెవరు తప్పింపగలరు? కాలము గడిచినకొలది పసిమిడి-పసిండియై, పసిఁడియై, పయిఁడియై, యింకను గృశించి 'పైఁడి' యనురూపమున నర్థప్రాణములను బిగపట్టుకొని భాషా ప్రపంచమున నిలచియున్నది.

# ప్రథమాంధ్ర కవితాశిల్పి - నన్నయభట్టు

ఆంధ్రశిల్పి యను పత్రిక యొక వ్యాసము వ్రాయుమని తత్సంపాదకులు నాకు వ్రాసినపుడు ఆంధ్రదేశములోని శిల్పములను గూర్చి నేను వ్రాయుట యేమి, నన్నెందుకు వ్రాయమన్నారు, అని ప్రశ్నించుకో వలసివచ్చినది. కాని శిల్ప శబ్దానికి ఏ బొమ్మలు చెక్కుటయో అనే అర్థ మొక్కటియే కాక అనేకార్థా లున్న వనియు, సామాన్యముగా చేతిపనులు మొదలగు వానితోపాటు కళలన్నియు గూడ శిల్పశబ్దవాచ్యములే యనియు తెలిసికొన్నాను. అరువదినా లుగు బాహ్యకళలు, మరి అరువదినాలుగు అభ్యంతర కళలు ఇవన్నియుగూడ శిల్పశబ్ద వాచ్యములే. ఆలింగనచుంబనా దులు అభ్యంతర కళలలోనివి. వడ్రంగము, కంసాలిపని, నాట్యము, సంగీతము మొదలగునవి బాహ్య కళలలోనివి. ఇట్లు లలిత కళలనబడు నాట్యము, సంగీతము, కవిత్వము మొదలగునవి కూడా శిల్పములలో జేరినవే కావున నీ ''యాంధ్రశిల్పి'' పత్రికలో, ప్రథమాంధ్ర కవితా శిల్పియగు నన్నయభట్టు శిల్పమును గూర్చి యించుక వ్రాయుట యప్రసక్తము కాబోదని యట్లు చేయదలచితిని.

ఏవిధమైన శిల్పమును సాధించుటకైనను శిల్పికి కొన్ని సాధనములు - అనగా పనిముట్లు వాని నుపయోగించు పరిజ్ఞానము నావశ్యకము గదా. ప్రథమాంధ్ర కవితారచనను సాగించిన నన్నయకు గలిగిన సాధనములేవో, వాని నుపయో గించుట కాతనికి గల పరిజ్ఞానమెట్టిదో మనము పరిశీలింపవల సియున్నది. నన్నయకు పూర్వ మాంధ్రకవితా శిల్పము విశేషాభివృద్ధి గాంచియుండలేదు. సుప్రసిద్ధుడగు నొక శిల్పకారుని పేరైనను మన మెరుగము. ప్రసిద్ధములైన కవితా శిల్పములు కూడ విశేషము లేవు. నాటుపనితో కూడిన కొన్ని దేశీయరచనలు మాత్ర మగపడుచున్నవి. ఈ నాటు పనివాని తనమునకు దోడు మరికొంత సాధన సామగ్రి నేర్పరచుకొని వాని నుపయోగించుటలో తన యసమాన చాతుర్యమును వ్యక్తీకరించుచు నపూర్వంబగు ప్రథమాంధ్ర కవితా శిల్పము నీ భాషలో నెలకొల్పినాడు నన్నపార్యుడు. నన్నపార్యుడు తలపెట్టిన ప్రథమాంధ్ర కవితా శిల్పము ఆంధ్ర భారత స్వరూపమున మూర్తీభవించినది. ఈమూర్తికి రూపకల్పనము చేసిన యాంధ్రభాషా స్వరూపము నీతడు తీర్చిదిద్దినాడు. కనుకనే యాత డాంధ్రభాషావాగనుశాసను డైనాడు. అంతకు పూర్వ మాంధ్రభాష లేకపోలేదు. అందు కవితారచనము లేకపోలేదు. ఆ కవితా రచనకు వలయు ఛందఃపరికరము లేకపోలేదు. కాని యివన్నియు దేశిపద్ధతిని - అనగా నాటుమార్గము నవలంబించినవై యున్నవి. నన్నయకు పూర్వమున నన్నయ రచించిన భారతమువంటి యే గ్రంథము రచింపబడియుండ లేదని చెప్పుటకు వెనుదీయవలసిన పనిలేదు. అట్లనుటచే దెనుగున కవితా రచనమే లేదనుట కాదు. దేశిరచన లనేకములుండి యుండును. కాని యీ భాషలో జైనమతప్రాద్బలముచే నైనను కన్నడమున పంపాదులు రచించిన కవితా రచనల వంటివి బయలుదేరి యుండలేదని ఊహించి చెప్పవచ్చును. నన్న యకు పూర మొక శతాబ్ది కాలమున పంపాదులు కన్నడమున దేశిమార్గ ప లను రెంటిని జోడించి భారతము ఆదిపురా ణము వం , అనగా నన్నయ భారత రచనబోలిన రచనలను సాగించుచుండగా, తెనుగున తెలుగు దేశమున నాకాలమున కేవల దేశీయ పద్ధతి నవలంబించిన రచనలే ప్రచారములో నుండియుండెననుటకు ఆ కాలపుదేయగు యుద్ధమల్లుని బెజవాడ శాసనరచనయే మనకు నిదర్శనమగు చున్నది. అందలి భాష, ఛందస్సు, రచనారీతి అన్నియు దేశీయపద్ధతినే సూచించుచు, నన్నయ కాలమున వానికి కలిగిన సంస్కార మింకను రాలేదని వ్యక్తము చేయుచున్నవి. కన్నడ దేశమున కన్నడ భాషలో నట్టి కవితా సంస్కారము క్రీ.శ. 9వ శతాబ్దికి పూర్వమే కలిగినట్లు స్పష్టము. ఏలయనగా భాషాచ్ఛంద స్సంస్కారములతో గూడిన మార్గపద్ధతి నవలం బించిన కవితా రచన ఆ భాషలో నెనిమిదవ శతాబ్దిలోనే శాసనములందు గానవచ్చుచుండుటయే గాక, 9వ శతాబ్ది మ భాగమున రాష్ట్రకూటరాజగు నృపతుంగునిచే 'కవిరాజ మా ్ను' లక్షణ గ్రంథమూలముగా ప్రతిపాదింపబడియు న్న . ఈతని తరువాత నేబది, ఆరువది సంవత్సరములకే పంప కవి యాతని పద్ధతుల నవలంబించి యా భాషలో నుద్గ్రంథములను రచించి ''యాదికవి పంప''డైనాడు. కన్నడ భాషలో నృపతుంగుని కాలముననో- ఇంక నంతకు పూర్వము నుండియో బయలుదేరి పంప, పొన్న, రన్నలను

కవిరత్నముచే నాదరింపబడి సాపుతేరిన- కన్నడ కవిరాజుల మార్గము ననుసరించియే, ఆంధ్రదేశీయ సంప్రదాయానుసార ముగా నన్నపార్యుడును నీ వాఙ్మయ పథమును తీర్చిదిద్దిన వాడైనాడు.

కవితా పథమును సాగించుటకు, రైలుకు పట్టాలవంటిది ఛందస్సు. ఇంతకు పూర్వము తెనుగు కవిత నడచిన మార్గము కేవలము నాటుమార్గము. అది నన్నయ కవితా ధాటి కాగునది కాదు. దానిని దృఢతరంబుగ జేయుటకై కన్నడ కవులవలెనే సంస్కృత ఛందోరీతులను గూడ గ్రహించి వాని నాంధ్రదేశీయ సంప్రదాయ బద్ధములుగ జేసి మరింత దిట్ట పరచినాడు. ఇంతకు పూర్వమే పాదనియమము లేని దేశీయ ఛందములలోనివగు, ద్విపదాదులు, చతుష్పాద నియమము గలిగి తరువోజ, అక్కర, సీసము, గీతము, ఆటవెలది అను వృత్తమును బోలిన పద్యములైనవి. ఇందు మూడింట వడి మాత్రమేయున్నను, తొలి రెంటను ప్రాసవళ్లు ప్రాధాన్యమును వహించినవి. నన్నయకు పూర్వమే దేశి కవులు తెలుగు దేశికవిత నీప్రాసవళ్లను రెండు పట్టాలపై నడిపించు చుండుటను జూచి నన్నపార్యు డీ మార్గమును వదలక, దీనినే సంస్కృత ఛందోమార్గమును జోడించి వెనుకటి సంకుచిత మార్గమునకు విశాలముగను దృఢతరం బుగను జేసి తన కవిత వానిపై ధారాళముగను, అప్రతిహత ముగ నడచున ట్లొనర్చినాడు. కన్నడమున లేని యక్షర సామ్యరూపమగు యతిని-లేదా వడిని-పాటించుటచే సంస్కృత వృత్తములకు గూడ దేశీయ పద్యములకు వలెనే యొక వింతసొబగు కలిగినట్లైనది. ఇంతేగాక సంస్కృత వృత్తములను గ్రహించినప్పుడు కూడ కొన్నిటి విషయములో తెనుగున నడక కనుకూలమగునని కాబోలు యతి స్థానము లను మార్చి వడి ప్రయోగించినాడు, అట్టివానిలో కొన్ని:-

పృథ్వీ – వృత్తమునకు సంస్కృతమున 8 వ యక్షరము తర్వాత యతి చెప్పబడినది. కన్నడమున నాగవర్మ కూడ అట్లే చెప్పినాడు. కాని నన్నయ తెలుగులో వడి 11 వ అక్షరము తరువాత నుంచినాడు.

**శిఖరిణి** – సంస్కృతమందు - కన్నడ మందును గూడ, 6 వ యక్షరము తర్వాత యతి యున్నది. కాని నన్నయ తెలుగులో 12 వ అక్షరము తరువాత వడి నిలిపినాడు.

**భుజంగప్రయాతము**నకు సంస్కృతమున 6 వ అక్షరము తరువాత యతి. కన్నడమున 8 అక్షరముల తరువాత (దిశ). కాని తెలుగున 7 అక్షరముల తరువాత వడి పాటింపబడినది.

పంచచామరమునకు సంస్కృతమున 8 తర్వాత యతి, తెలుగున 9 తర్వాత పాటింపబడినది.

మహాస్రగ్ధరకు – కన్నడమున 15 తర్వాత యతి. తెలుగులో 8 వ యక్షరము తర్వాత, 15 వ అక్షరము తర్వాత వడి పాటింపబడినది.

తరళ – వృత్తమునకు కన్నడమున 8 వ అక్షరము తర్వాత యతి పాటింపబడినది. కాని తెలుగులో 11 అక్షరముల తరువాత వడి.

ఈ రీతిగా నన్నపార్యుడు సంస్కృత వృత్తములను దెనుగు కవితలో నవలంబించినపుడు, ఈ భాష కనుగుణములగు మార్పులను జేసియే గ్రహించినాడని చెప్పవలసియున్నది. ఇంతేగాక సంస్కృతమున విశేష ప్రచారములేక ఇంతకు ముందు కన్నడ కవులచే దేశిభాషా కవిత్వములో వాడుకలోనికి దేబడిన చంపకమాల ఉత్పలమాలాది వృత్తములను గూడ గ్రహించి యతిస్థానముల వడిని గూడ పాటించి తెలుగు కవిత్వమున విశేష ప్రచారములోనికి దెచ్చినాడు. ఈతనికి పూర్వమునగల దేశిపద్యములలో తరువోజ. అక్కర, సీసము, గీతములను గ్రహించినాడుగాని, తరువోజ - చతుష్పాద నియమము కలదిగా జేయబడిన ద్విపద వంటిదేగదా యని గాబోలు - ద్విపద రచనకు బూనుకొనలేదు. సీసములలో తరువాతి కాలమున క్రమముగా నంతరించిన, సర్వప్రాసాది నియమములను మాత్రము జాగ్రత్తగా పాటించినాడు. ఈతనికి బూర్వపు శాసనములలోను, కన్నడ కవిత్వములోను గూడ వాడుకలో నుండిన అక్కరకు, వెనుకటి సంప్రదాయము ప్రకారమే వడి పాటించి యీతడు రచించినాడు గాని, తద్రచనయగా నారణ్య పర్వశేషమును రచించిన యెఱ్ఱాప్రగ డకు తప్ప తక్కినవారెవరికిని నన్నెచోడ తిక్కనాదులకు గూడ, నీయక్కర అక్కరయే లేకపోయినది. యుద్ధమల్లుని బెజవాడ శాసనాక్కరలందు వలెనే ఈతడు 5వ గణము తొలియక్షరము మీదనే వడి పాటించినాడు. కాని కన్నడ అక్కరలలో యతి నియమమే లేదు. కావున నన్నయ యీ విషయమున నాంధ్రదేశీయ సంప్రదాయమునే యనుసరించినా డనక తప్పదు.

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు:

# కవిరాజ శిఖామణి - కావ్యకథా సూత్రము

కవిరాజ శిఖామణియగు నన్నెచోడుని 'కుమార సంభవ'మందలి దివ్యకథ కాళిదాసాదుల కావ్యములందువలె నసమగ్రము గాక, ''సకలావయవంబులం బరిపూర్ణంబైన దివ్యకావ్యాంగనా సృష్టి''వంటిదని అతడే వ్యక్తము చేసినాడు. దానికి దగినట్లే తత్సృష్టికి మూలమైన యా''కథా సూత్రమును''గూడ నిచ్చినాడు. దీని మూలముగా నీకథ శివపురాణము నాధారముచేసి కొన్న కథయైనను, ఇందేకత్వం (Unity) లేకపోలేదని, ప్రబంధ లక్షణమునకు విరుద్ధముకాలేదని సూచించుచున్నవాడువలె నున్నాడు. దానినిం దీతడెంత చక్కగా సాధించినాడో చూడవలసియున్నది - అది మనపని. అతని కిదియొక దివ్యకథ. దివ్య కావ్యాంగనా సృష్టి. దానినాతడెట్లు సృష్టింపగలిగినాడో మనము పరిశీలింపవలసి యున్నది. కావున నీతడు దానినెట్లు నడిపినాడో మనము గమనింతము.

నన్నెచోడుడు తన కావ్య సృష్టిని విధియొక్క విశ్వసృష్టితోడనే బోల్చి తన కథను ప్రారంభించినాడు. ఈ కారణముచే తనకా సృష్టికర్తతో నభేదమును సాధించుకొన్నవాడుకూడనైనాడు. తన కావ్యాంగనవలెనే ఆ దివ్యాంగనయు సకలావయవంబుల సంపూర్ణంబైనగాని, ఆదికవి నన్నయభట్టు చెప్పినట్లు ''స్త్రీ పుంసయోగోద్భవమ''గు నీవిశ్వసృష్టియు నాసృష్టికర్తకు సాధ్యముకాలేదు. కావుననే ఆ విధి నియమంబున విశ్వంబు సృజియింపదలంచి, దక్షప్రజాపతి కేవల ప్రకృతి స్వరూపమైయున్న యామహామాయ నారాధించి, ఆవాహింపగా, మూలాధార శక్తియగు నామహామాయ, లోకమాత-ఆ దక్షునికి బ్రత్యక్షమై, నీకేమి కావలయునని యడుగుటయు, నాతడామె తనకు బుత్రియై నిర్లిప్తుడైయున్న యీశ్వరునకు బత్నియై మిథునచరిత దగిలి లోకసృష్టికి బీజశక్తి కావలయుననియు వరమడిగినాడు. ఆమెయు నాతనికా వరమిచ్చినది. పుష్కరపలాశవ న్నిర్లిప్తుడగు నీశ్వరునకా విషయము తెలుపవలెగదా! అనేక విధ జపధ్యానస్తోత్రాదుల నీశ్వరుని నాతడు ప్రత్యక్షముచేసికొని,

> **''దేవాధీశ సమస్తముం బడయనుద్దేశించి మున్ భక్తి నీ**
> **దేవిన్ సర్వపదార్థమూర్తి నిఖిల స్త్రీ రత్నమున్ నీకు నే**
> **నావాహించితి, మీరు సన్మిథునచర్యాసక్తి గైకొన్ననా**
> **కీ విశ్వోదయకార్య సిద్ధియగు వాణీంద్రామరేంద్రార్చితా.''**

అని ప్రార్థించినాడు. పరమేశ్వరుండును దక్షుని సద్భక్తియుక్తికనురక్తుండై సతీరత్నంబగు సతీదేవిని బరిగ్రహించి, దక్షప్రజాపతికి చతుర్విధ భూతగ్రామ సృష్టికర్తగా వరంబొసగినాడట. ఇట్లు దివ్యకావ్యాంగనా సృష్టి చేయదలచిన నన్నెచోడ కవి తన కావ్యసృష్టిని ''జగతః పితరుల''గు సతీపరమేశ్వరుల యనుగ్రహమున బ్రారంభమైన విశ్వసృష్టితో బ్రారంభించినవాడైనాడు. మరియు నీకథకు పరమేశ్వరునే కథానాయకునిగా జేయుటచే తన గురువగు జంగమ మల్లికార్జును నాతనితో నభేదము కల్పించి వర్ణించుటకుగూడ నీతనికి చక్కని యవకాశము లభించినది.

అట్లు పరమేశ్వరునివలన వరమును బొందిన దక్షుడు జగత్సృష్టికి యేబండ్ర సుతల బడసి, అందు బదుముగ్గురను కశ్యపునకు, పదిమందిని యమునకు, 27 గురను చంద్రునకు నిచ్చి పరిణయ మొనర్చి, సృష్టిలో దన్నుగన్నధాతకంటెను గొప్పవాడుగా దలంచుకొన్నాడు.

అంతనీశ్వరుడా దాక్షాయణి యౌవన హావభావ విలాస సౌందర్యములకు జిక్కి కామకేళీలాలసుడగుచు నామెతోగూడి కైలాసనగముపై విహరింపదొడంగెను. అచ్చట నొకచో మదనాసక్తి బెనంగుచున్న కరికరేణువుల శృంగారలీలలను జూచి సతీదేవి కౌతుకాయత్తచిత్తయై కనుగీటగా శివుడందులకు సమ్మతించెను. అంత-నాయాదిమూర్తులగు శివ శక్తులా మృగరూపముల దాల్చి సామజ కేళీలాలసులై విహరింపగా, సద్యోగర్భమున సతీదేవికి గజాననుం డుదయించెను. ఇంతలో హరిపరమేష్ఠి పురందరాదులందరు నారజతాచలమునకు వచ్చి, మహోత్సవముతో నుండగా, వారిచే బ్రార్థితుండై పరమేశ్వరుండా గజాననునకు శివగణ, సురగణాధిపత్యంబుతో యువరాజపట్టంబు గట్టెను. దేవతలందరు నానందంబున నోలలాడిరి.

పిదప నొకనాడు దక్షుడు సంతానవతులైయున్న తన పుత్రికలను జూడదలచి, కశ్యప యమ చంద్రుల యిండ్లకు బోయి, యాయల్లుండ్ర వలన విశేషార్చనల నందుకొని, సతీ పరమేశ్వరావలోక నార్థియై వెండికొండ కరిగెను.

అచ్చట నా సమయమున గజానను నెత్తికొని సతిని నవ్వించుచు తానట్టహాసము చేయుచున్న సర్వేశ్వరుని జూచినాడు. ఆయీశ్వరుడు తక్కిన యల్లుండ్రవలె నెదురు వచ్చి ప్రణామ సంస్తోత్రాది సత్కారములు చేయునని యతడు తలంచెను. కాని శివుడట్లు చేయమికి దక్షుం డహంకరించి, మనమున క్షోభనంది తిరిగి నిజనివాసమునకు బోయి యా విషయమును భార్యతో జెప్పెను అమె కొన్ని యోదార్పు మాటలచే నాతని శాంతింపజేయ యత్నించినది కాని యాతడా యవమానమును సహింపనోపక ఆయపకారంబు నకు బ్రత్యపకారంబు సేయదలంచి, తాను తనయిల్లును జేరి యాశివు నాగమ బాహ్యగా జేయ నిశ్చయించి, మహాధ్వర మొకదానిని ప్రారంభించి, చతుర్దశ భువనాంతరా నేక జనంబుల రావించి, యాయాగ మంటపంబునకు బరమేశ్వరుని బిలువక, సతీదేవిని మాత్రము దోడ్కొనిరా గొందర వనితల బంపెను. వారామెనట్లు తీసికొనిరాగా, సభాసదులెల్ల నామెను స్తుతించిరి అంత నామె పరమేశ్వరు రావింపనైతివని తండ్రితో బలుకగా, నాతడాక్షేపించి యా భస్మాంగి యచ్చటకు రానర్హుండు కాడనెను. దాక్షాయణియు బరమేశ్వరపారమ్యమును విశదీకరించి వాదింప, దక్షుండు సహింపక నీమగని పక్షము పల్కెదవేగాని, యీజగజ్జనులట్టి వ్రాత్యుని పూజ్యుడందురా యని దట్టించి పలుకగా, బ్రహ్మ, విష్ణువులీశ్వరునే కర్మఫలప్రదాతగా బ్రతిష్ఠించుచు బలికిరి. కాని దక్షుడు వీరు చెప్పినంతమాత్రమున పాషండుడు పూజ్యుండగునా యని వారి పల్కులను ద్రోసిపుచ్చి, యీశ్వరుని నిందింప - సతీదేవి కోపోద్దీపిత యగుటయు, నాకోపాగ్నిచే నామె యొడలు లక్కబొమ్మవలె గాలిపోయెను ఆ యజ్ఞశాలలో హాహారవములు సెలంగెను. ఈ వృత్తాంత మును కృతాంతకుడు నారదువలన విని కాలాగ్ని రుద్రుడ య్యెను. అంత నందికేశ్వరుడు పుష్పదంత భృంగిరిట్యా దులు వచ్చి, తాముపోయి దక్షుని బట్టి తెత్తుమనుచుండగా, గణాధీశ్వరుడు తన జననికి జరిగిన పరాభవంబుగాన దానె పోవలయునని బలికి, పరమేశ్వరుననుజ్ఞ వడసి, దక్షప్రజాప తిపై బరిగొని, నిజగణంబులకు జేయి వీచిన, వారాదక్షాధ్వర మును ధ్వంసముగావించి, గోమేధిక సదనంబులో దాగి యున్న దక్షుని బట్టికొని కాలుచేయు బడియగావడించి శంభునొద్దకు దెచ్చిరి. అంత దక్షుని ధర్మపత్ని యేడ్చుచు వచ్చి పురుషభైక్షంబువేడ కారుణ్యదృష్టిం జూచు పరమేశ్వ రుని, హరికమలాసనాదులు స్తుతియించి, ఎంతద్రోహుడ య్యును, 'బ్రాహ్మణో న హంతవ్య' యను పలుకును తానే పాటింపకున్న యిక యెట్లు-అని చెప్పి ప్రార్థించి, దక్షునియా తని పాదములపై బడవేసిన, తదీయస్పర్శనంబున దక్షుడు సచేతనుండై, భక్త్యావేశముచే నాతని స్తుతించెను. అంత శివుడాతనికి ప్రత్యక్షమై ఆతని యధ్వరము సఫలంబుగా బ్రసాదించి, దక్షుని మరల బ్రజాపతిగా నియమించి, తాను రజతగిరిపై మణిరమ్యహర్మ్యతలాలంకృతోత్తుంగ సింహాసనా సీనుడై హరిపురందరాదులచే పరివృతుండై పరమానందమున నుండెను

అంత హిమవన్నగ చక్రవర్తి మేనక నిజాగ్ర మహిషిగా బరమ సుఖలీల బ్రవర్తిల్లుచుండ వారికి, మైనాకుడు పుట్టి కులిశపాత భీతిచే పయోనిధి మగ్నుడైనాడు. పిదప వారిరు వురు సతీదేవి తమకు గూతురై జన్మింపవలయునని శక్తి నారాధింప వారికి గరుణించి, దాక్షాయణి ప్రత్యక్షంబై, వారు కోరినవరం బిచ్చి, మేనకాదేవి గర్భంబునం దవతరించి, యొక శుభముహూర్తంబున శైలరాజ కన్యయై యుదయించి శరచ్చంద్రిక బోలె దినదిన ప్రవర్ధమాన యగుచుండెను. బాల్యమునుండియు నామె హృదయము శివునియందె లగ్నమై యుండెను. శైవక్రీడా వినోదములలోనే శివార్చనచేయ మొదలిడెను. యౌవనమున నిఖిల లావణ్య పుణ్యాధి దేవతయై హిమవంతుని ననంత సంతోష రసాపూరితాంతరంగుని గావించినది. ఈమెకు దగిన వరుడెవ్వడోయని హిమవంతుడు డోలాయమాన మానసుడగుచున్న సమయమున నారదుడు హిమవంతుని యొద్దకు వచ్చి హితోపదేశంబు సేయుచు, పార్వతీ పూర్వప్రపంచంబు విశేషించి యెఱింగించి, యాదేవి లోకజననియని, మహాదేవుని కగ్ర మహిషి యగుననియు నాదేశించి వెడలెను ఇంతలో నీశ్వరుడు తపముసేయదలచి హిమగిరికి వచ్చి యచ్చట తపోవేషమును ధరించి నిరతిశయ సమాధిని నుండెను. అంతకు బూర్వమే హిమవంతుడు కళత్రపు సమేతుడై వచ్చి, నిజదేహాది సమస్త రాజ్యవిభవం బులు నీ ్వరుపాదంబులకు నివేదించి యాతని యనుగ్రహంబు వడసి పార్వతి యాతని సేవచేయుచుండుట కాతని సమ్మతిని బడసి, శివుని బ్రత్యక్షంబుగా గొలుచుచుండుమని చెప్పి, యామె నచ్చట నునిచి నిజపురంబున కరిగెను. పార్వతియు శివుని పరమభక్తియుక్తిం దగిలి, నిరంతర శుశ్రూషాతత్పరయై యుండెను

పరమేశ్వరుడట్లు తపోవృత్తిం దగిలి జగద్వ్యాపారంబులం జూడ కుండుట కారణముగా నట-లోకమున తారకాసురుని వలన బాధలు హెచ్చయ్యెను ఇంద్రాది దేవతలు బ్రహ్మయొ ద్దకు బోయి వారిబాధలను దెల్పి రక్షింపుమని మొరవెట్టికొ నిరి అతడును తద్వధోపాయంబు విచారించి కని, ఉమామహే శ్వరుల వీర్యమునందుదయించిన వాడుగాని తారకాసురుని బోరిలో గెలువలేడు. కావున నీశ్వరుని తపశ్చలనముజేసి వారికి సంగమము గల్పింప, మకరకేతనుని బురికొల్పుటయే యిప్పుడు చేయదగిన పనియని వారికి బోధించెను. ఇంద్రుడును వెంటనే పచ్చవిలుతుని రావించి, తారకాసురుని వలన గలుగుచున్న బాధలను, తద్వధ కుపాయంబుగా విధి చూపిన మార్గంబును వివరించి, హరగిరిజలు నైష్ఠికానుష్ఠాన

మున హిమవంతంబున నున్నవారు, వారికి సంగమంబుచేసి జగద్ధితంబు సేయుము. ఇది యనన్యవిషయంబు, నీవలన గాని యిది సాధ్యంబుకాదని ప్రార్థించెను. అట్లు తన్నగ్గించు చున్న సురవల్లభునితో రతీవల్లభు డిదియేమి గొప్పపని, నాకుదగిన పని గంటిని నాకు దాంబూలంబు దయసేయు మని, యాతడుచేసిన సత్కారములనంది, రతీసమేతుడై, యామెచే రానున్న ప్రమాదమునుగూర్చి ప్రబోధింపబ డియు, నామెమాటల లక్ష్యపెట్టక, నిజసామ్రాజ్య విభవం బుతో, హిమవంతంబున కరిగి పరమేశ్వర తపోవనంబు సొత్తెంచెను.

అంతనా తపోవనంబున వసంతోదయంబగుటయు, నావ నమతిరమణీయము, సకలజనానంద కరంబునై వెలసినది. అచ్చట దపోనిష్ఠచే నాత్మయోగమున జలింపకున్న శివుని దవుదవ్వుల గాంచి, త్రినయను సమాధి వైకల్యము సేయ నిజమూల బలంబు నవలోకించిన, నవి ఝంకారము, కోకిల నినాదము, కేకీ నినాదంబులు, గంధర్వ గీతంబులు భోరన మ్రోయగా వాని నన్నిటిని, నందికేశ్వరుడు హస్తసంజ్ఞచే నదల్చెను. అంతలో వానికి జిహ్వాస్తంభ, గతి స్తంభ, మనఃస్తంభము గలుగ నావనము చిత్రితాటవివలెనయ్యెను. అంత మన్మథుడు త్రినయనాభిముఖుండై తక్కుచు, తారుచు జని, దహనాంబకు దృష్టి దప్పించి యొకయశోకము చాటుగ నిలిచి, గౌరి రాకను బ్రతీక్షించుచుండెను. ఆమె పుష్పపత్రా దులు గొని త్రిజగత్పతి నర్చింప సమీపించుటయు బరమేశ్వరుడు జాగ్రదవస్థనుబొంది, సుప్రసన్నుండుకాగా, నామె హరచరణ సరసీరుహంబులకుం బుష్పాంజలియిచ్చి కృతాంజలియై యున్న సమయమున, కంతుడు నిజవశ్యాధి దేవత ప్రసన్నంబైనట్లు సంతోషించి, గౌరి హృదయమును మదనాస్త్రంబున భేదించి, మదన ప్రేరితయైన యామె రాగ రసలోల దృష్టి హరుని త్రిప్పుల బెట్టుటంగాంచి, యీశుపై గూడ నలరమ్ములనేయం దొడంగెను. అప్పుడీశ్వరుని యోగభావమెడలి కన్ను, మనము, గౌరి యందు నిలుచుటచే నాతని మనంబు వికలంబయ్యె. అప్పుడా యచలాత్ముండు చంచలాకులిత హృదయుండై నిర్నిమిత్తంబ మనోవికారంబగు టకు కారణంబేమోయని నలుగడలుం బరికించి చూచెను. అప్పుడు మన్మథుడు దృష్టిగోచరుండగుటయు, నంతకాంత కుండు కంతుంగని కోపించి దహనాంబకంబు విచ్చి చూచెను. ఆ నిటలాక్ష వహ్ని తరతరమ మీద గప్పగా, మదనుం డిటు నటు మెదలగలేక యున్నచోటనే కాలిపోయి భస్మమయ్యెను. ''అభయంబభయం'' బను నింద్రాది దేవతల యార్పు లాకాశమున జెలంగునంతలోనే యీశ్వరుని కంటిమంట మనోభవుని నీరుచేసి పోయినది. శివుడును తపముడిగి యచ్చోటు వదలిపోయెను. నేలను మూర్ఛవడి యున్న పార్వతిని హిమవంతుడు తన పురమున కెత్తుకొని పోయెను.

అంత రతి యచ్చట బురుషాకృతినున్న భస్మపుంజమును గాంచి దుఃఖముతో వాపోవసాగెను. వసంతాదులు వచ్చి యామె నోదార్పయత్నించిరి. అగ్నిప్రవేశము చేయదలచిన రతి కాకాశవాణి ''త్రిలోచను డంగజుని మరల నీకిచ్చువాడు'' అని చెప్పి యూరట గల్పించి యాకార్యమునుండి మరల్చెను.

అచ్చట మన్మథతాపభరమ్మున దురపిల్లు నగజకు చెలులు శిశిరోపచారములు చేసిరి. తుదకు గిరిజ కడలేని యావిరహవే దనను భరించుటకంటె, నుగ్రాటవులలో దపోవర్తననుండి శివుని బడయుట యుక్తమని తలంచి, తనవారికందరకు నచ్చచెప్పి, నారదునాదేశంబు దలంచి హిమవంతుడు నందు లకు సమ్మతింపగా, తపోవనంబున కుం బోయెను. అచ్చటి యాటవికజనంబులీమెకు గానుకలం దెచ్చి యిచ్చిరి. ఒక్కచో పటికంపు రోటియందు వెదురుబ్రాలనుబోసి గౌరుకొమ్ము రోకటితో దంచుచుండెడి శబరకామిను లాయరణ్యమున మనుష్యరూప ధూర్జటి, ముని లోక గురువునగు జంగమ మల్లికార్జునుగూర్చి పాడుచుండిరట. అచ్చట నొక మునీశ్వ రాశ్రమములో వేదశాస్త్ర పురాణాగమ రహస్యములను, శిష్యగణంబునకు వ్యాఖ్యానంబు సేయుచున్న ముని ముఖ్యు లలో, శివాగమము, వేదార్థములు శిష్యులకు దెలుపుచు నిష్కలాభ్యాసమున వెలుంగుచున్న విప్రముని పుంగవుడగు జంగమ మల్లికార్జునుని జూచి ప్రణమిల్లి యాతని గురుస్థాన ముగా స్వీకరించి, అతని వలన శైవాగమదీక్షగొని, పరమేశ్వ రుండు రయంబున బ్రసన్నుడగు మంత్రాదికమును పార్వతి యుపదేశంబుగొన్నదట!

పిదప తపోవేషంబు దాల్చి గురునాజ్ఞానుసారంబుగా గౌరి-నగంబున పరమేశ్వరుంగోరి ఘోరతపంబు సల్పు చుండ, వర్షశరత్తులు, హేమంత శిశిరంబులు, వసంతనిదాఘ ములు గడచెను. ఇంకను పరమేశ్వరుడు ప్రసన్నుండు గాకుండుటకు నగజ యుద్వేగించుచు పరమేశ్వరధ్యానలీయ మానమానసయై ఘోర తపంబు సలుప, ధర కంపించినది. శరధు లింకినవి. పరమేష్ఠి చలించెను. హరి చిత్తమున వందెను. త్రిలోచనుడును రణరణక వ్యథాకులిత హృదయుండై బలా త్కారంబున నాకర్షింపంబడి పార్వతికి బ్రత్యక్షంబుగాదలంచి యొక మునికుమారుని వేషంబున మహీతలంబున కవతరిం చెను.

అట్లు తేజోమూర్తియై చనుదెంచు నా మునికుమారున కతిథి మాహేశ్వర రూపంబను బుద్ధితో, నా పార్వతియు నతిథిపూజ సల్పినది. ఆ కృతక మునికుమారుడును నగజరూప సౌందర్య విలాసములకు మెచ్చి, చతురికవలన

నామె హిమవంతుని కూతురు, గౌరియని తెలిసికొని యామె తపఃప్రభావంబును గొనియాడి యెవరికై యిట్టి తపంబు సల్పుచున్నదని ప్రశ్నించినాడు. శంభుని దనకు బ్రాణేశుగా గౌరి యట్టి తపంబు సేయుచున్నదని యామెవలన విన్నతోడనె, ఆ పాఱుడు ప్రక్కలు విరుగనగుచు, నీవంటి దానవు, ఆ భిక్షుకుని కొరకా తపము సేయుట యని, యాతని పలువిధముల నిందించి పలికెను. అట్లు పలుకుచున్న యా కృతక విప్రుని గౌరి యాక్షేపించి యీశు మహిమలను బొగడుచు, దగు సమాధానములను జెప్పినను, వాయొడక పెక్కు దెరంగుల నీశు దూషించుచున్న యాతని జూచి ''నీ ప్రేలరితనమంగజహరు ఫాలాంబక వహ్నిపాల బడుగాక'' యని దూరబలికి మారాడక యూరకుండెను. అంత నామె చెలు లాతని దూయబట్టికొనిరి. వీనితో వాదులాటయేమి యని కోపావేశంబుతో నావలకు బోవనున్న యామె నిశ్చలభక్తికి మెచ్చి, యీశ్వరుడును నిజరూపమును జూపెను; అంత పార్వతి శంభుంగని యాశ్చర్యముతో వణకుచు నానందాశ్రువులు గ్రమ్మ బతిని బ్రీతితో చూచెను. శివుడు నామె సౌందర్యాతి శయమును గీర్తించుచుండ, హరగిరిజల ప్రణయ రసమభిమాన శీలముల నతిక్రమించు చుండుట నచ్చట చతురిక కనిపెట్టి కృతాంజలియై గిరిసుతను బరిణయపూర్వకముగ బరిగ్రహించి హిమవంతుని గృతార్థుంజేయవలయునని యీశ్వరునికి విన్నవింప హరగిరిజలొండొరుల చిత్తంబుల విడి జట్లుగొని తారనీహారా చలంబుల కరిగిరి.

అంత హిమవంతుండు తనయ తపోవేషంబు మాన్పించి, సుగంధతైలాభ్యంజనంబు గావించిన, గిరిజయు గనకంపుబ్రతిమవోలె నొప్పెను. అట గిరీశుండును రజతగిరికరిగి సప్తర్షులందలచి ''గిరిజ తపమునకు, భక్తికిని మెచ్చి వరము నిచ్చితి, వివాహము గావింపవలయు. హిమవంతుని పాలికేగి మత్పరిణయకార్యమును జెప్పిరం''డని నియమించిన, వారును శుభశకునంబులం గనుచు, నోషధీప్రస్థపురంబునకుం బోయి యా పట్టణ రామణీయకంబును, అందలి వస్తుసమృద్ధిని మెచ్చుకొనుచు బోవుచుండ, నామునీంద్రుల నచలేంద్రుం డెదుర్కొని నిజమందిరమునకు దోడ్కొనిపోయి విధియుక్తముగ నర్చించి కర్పూర పాళీవిరాజితములగు విడియంబులిచ్చి వారువచ్చిన కార్యంబు దెలిసికొని ''మిమ్మిట్లు వరదుండు బంపుట నా కుంకువ నిచ్చుట. ఇది మొదలు నన్ను నే నరణమిచ్చికొంటి''నని చెప్పి గిరిజను రప్పించి వారికి గానిపింప, వారును శుభలక్షణలక్షితయగు నామెను గాంచి, పరమేశ్వరున కగ్ర మహిషి కాగలదని నిశ్చయించి పార్వతి ముద్రారోహణంబు సేసి నగపతి వీడ్కొని కైలాసపురంబునకు జనిరి.

అచ్చట రాజ మార్గంబు గడచి సదాశివద్వారంబుదూరి మహాద్వారంబునకుం జని పరమేశ్వరు నవసరంబు వడసి, సభామండపంబున తన్మధ్య మణివేదికాతలమ్మున ధర్మాదృష్ట దళాంబుజైశ్వర్య పరిశోభితోత్తుంగ సింహాసనాసీనుడై యున్న త్రిలోచనునిం గని, తమ పోయివచ్చిన కార్యసిద్ధి క్రమంబు సవిస్తరంబుగా విన్నపంబుచేసి, పార్వతి సౌందర్య లక్షణంబులాతని యెదుట వర్ణించి చెప్పిరి. అంత నా పరమేశ్వరుండును హిమవన్నగమునకు సపరివారంబుగా బ్రయాణమై దినశుభప్రయాణంబుల హిమవంతంబు సేరె.

హిమవంతుండును అనంత సామ్రాజ్య విభవాన్వితుండై, పరమేశ్వరున కెదురుజని సర్వాంగీణ ప్రణాముండై నిజపురంబునకు దోడ్కొని వచ్చుటయు నాశివుడు రాజమందిరమున నంతఃపురాంగనాదత్త పంచమణి శేషాక్షతాకలితోత్తమాంగుండగుచు రమ్యహర్మ్యమణి భద్రమున వృషభేంద్రుం జేర్చి డిగి నగపతి దత్తసముత్తుంగ మణి సింహాసనాసీనుండయ్యె. అంత హిమవంతుండు మృదునడుగులు గడికి, తదీయామల జల పవిత్రీకృతాత్మీయ మందిరాభ్యంతరుండై, పరమానందభరితుండైయుండ, తత్పురజనులును పరమానందరస ప్రవాహంబున దేలిరి. మరునా డుదయమున హరిపరమేష్ఠి పురందరాది సహితుండైన యీశ్వరుని హిమవంతుడు సుప్రభాతార్చనావిధి నభ్యర్చితుం జేసి, వివాహ మండపంబు నిర్మించి, పార్వతిని విదగ్ధాంగనలచే గైసేయింపించి వివాహమండపంబునకు రావించిన, నాపె వచ్చి తండ్రియొడిలో గూరుచుండెను. అంత నీశ్వరుడును నభ్యంజనోద్వర్తన స్నానానంతరంబున గైసేసి వచ్చి యుండ, బృహస్పతి ''దేవా! లగ్నంబాసన్నంబయ్యె విజయంచేయు''డన నాతని గరుణాదృష్టి జూచుచు చనుదెంచి వివాహవేదికాతలోపరి దుకూలాంబరాలంకృత మణిపీఠాసనుండై బృహస్పతి దత్త ముహూర్తంబున, బరమేష్ఠి యొనర్చిన హోమపురస్సరంబుగా గిరీశుండు గిరిజను బరిణయంబయ్యె. అప్పుడు తుంబురు నారదగాన రస మాసభను ముంచెత్తెను. రంభాదులు నాట్యంబు సలిపిరి.

పరమేశ్వరుడు పార్వతీ సమేతుడై సుఖమున్న ఆసమయమున గామోత్పత్తి కిదియ యదనని, సురగురుండు సంస్తుతి పూర్వకంబుగ భవు నభిముఖుంజేసికొని, మదను దయసేయవలయునని మ్రొక్కిన వరదుండు గరుణించి, యంగజుండు జగంబుల కనంగుడయ్యెను. రతికి బ్రాక్తన స్వరూపుండై వర్తించునని వరంబిచ్చె. అంత నుమామహేశ రుల వివాహ మహోత్సవంబుతోడ మనసిజునరవతరణో త్సవంబు నగుటచే, నఖిలజనులు, మృగమదకాశ్మీరచందన ప్రమాదులతో వసంతోత్సవంబు సల్పిరి. తదుత్సవావలోకన పరులై హరగిరిజలుగూడ నచ్చటికి జనుదెంచి యనేక ప్రకారంబుల

దక్రీడాసక్తులై విహరించిరి. ఆరామక్రీడా విలోకనాసక్తులై లీలోద్యానంబున విహరించి, యాపురజనుల నర్ధరీతిని సత్కరించి, హరుడు నగరికిం జనుదెంచి గౌరీసహితుడై పరమసుఖలీల నుండెను. పిదప గిరీశుండు గిరిపతి యిచ్చిన యరణంబుగొని హరిపురందరాదులతో గౌరీ సమన్వితుండై హిమవంతుని వీడుకొలిపి, రజతగిరి జేరుకొనెను. అచ్చట లీలోద్యానంబులను కేళీసదనంబులను, నిజేచ్ఛావిహారంబు సలుపుచు, నీశ్వరుడు క్రమంబున గౌరిని రతికి మేకొలిపెను.

ఇట్లఖిల భువనాధీశ్వరుండు జగద్వ్యాపారంబుమాని యన వరత రతినిరతుండగుటకు దేవత లుద్వేగించి, విరించి యొద్దకుబోయి మొరవెట్టగా, నాత డుపాయంబున ననలాం బకు పాలికి ననలుం బంపిన, నతండును దహనాంబకు దలచి సంచరించుచునే కైలాసపర్వతంబునకుంజని, పరమే శ్వరు రతిక్రీడా ప్రదేశంబున నిజరూపంబు జూపిన, నయ్యుమామహేశ్వరు లాతనిం గని లజ్జాకలితహృదయులైరి. రతి విఘ్నంబగుటకు గోపించి, యాశ్వరుడు నిజవీర్యం బెత్తికొని యగ్నిపై జల్ల నాత డపహృతచేతస్కుండై మూర్ఛిల్లి, ఎట్టకేలకు దెప్పిరిలి, తదీయాతిభరంబు దాల్పనో పక పితామహు పాలికిం జని, తద్వృత్తాంతం బెఱింగించిన వరదుండు కుమారోత్పత్తికి బ్రసాదించెనని బ్రహ్మ సంతసించి ''పురహరుని యమోఘ వీర్యంబు సురనదితాల్చు నందు బెట్టు''మన నాతడట్లు చేయుటయు, నానదియు దానిని భరింపలేక మరల నాతనియొద్ద బెట్టిన, నాతడద్దానిని విరించియనుమతంబున శరవణసరసున బెట్టబోయి యచ్చట నిరంబరులై జలక్రీడలాడుచున్న సప్తర్షుల ధర్మప త్నులం గని, కామపరవశుడు కాగా, నరుంధతి వానిం గని పరపురుషుండని తొలంగి చనియెను. తక్కిన యార్వురు నెఱుంగక నిక్కము వహ్నియని తలంచి శీతాతురులై చనుదెంచి ముగ్ధభావంబున దన్నుబలసిన గని వహ్ని వారితో సురతసుఖంబు నొందెనట. తదవసరమున వహ్నియందంత స్థితంబైన హరుని వీర్యం బామానవతులందు ప్రవేశించి వారికి సద్యోగర్భము లయ్యె. అంత వారు వెలవెల బోవుచు, నిదియేమి మాయయోయని చింతించుచు, నరుంధతి వలన గల రూపెరింగి, మునివరులెఱుంగకుండ గర్భపిండంబులు పుచ్చి పద్మపత్ర సమూహంబున బొదిగి నిర్దోషులుంబోలె నిజేశ్వరులకుం బరిచర్య సేయందొడగిరి. కాని యామునులా రమణుల దోషయుతాకారముల గాంచి వారిని విసర్జించిరి. వారు మారుపలుకలేక బ్రహ్మయొద్దకుం బోయి పతులచేత పరిభవింపబడితిమని విజ్ఞాపింప, పతివ్రతా వృత్తియందు వ్రతభ్రష్టులైనను, ఈశ్వర వీర్యంబు ధరించిన పుణ్యంబున జ్యోతిర్లోకంబున గృత్తికలనం బ్రవర్తింపుడని వరంబొసగిన వారట్లు పుణ్యగతిని బడసిరి.

కమలలక్ష్మిగర్భంబుననున్న పిండంబులన్నియునొక్కండై పక్వంబునకు వచ్చి యీశ్వరు గురులింగాకారంబు పురుషాకా రంబు దాల్చినట్లు షడ్వక్త్రుండును ద్వాదశకరశోభితుండు నగు కుమారస్వామి యుద్భవించి కమలనిలయుడై వెలుగుచుం డెను. అంత నారదుడు వచ్చి యనంతతేజో విరాజితుండగు నాకుమారుంజూచి, యింద్రు నాతనిపై యుద్ధమునకు బురికొ ల్పెను. ఆ యింద్రుడును, దనవజ్రాయుధ మాతనియెడల వమ్మగుటయు కుమారుచేతి బిసప్రహతికి దాను నిలువలేక, ఎచ్చోటను శరణుగానక ''మహా దేవా! నీ వ శరణ'' మని పరమేశ్వరు మఱువు సొచ్చెను కుమారుండు నాతనివెంబ డించి చనెను. ఇట్లు తనయొద్దకు నింద్రుని వెనువెంట పరతెంచి వచ్చిన కుమారుని, శివుడు పార్వతికి జూపి నీ సుతుడని తద్వృత్తాంత మెఱింగించి, సురేంద్రున కభయ మిచ్చి కుమారుం జూచి కరతలాస్ఫాలనంబు సేయగా, తల్లి దండ్రులయొద్ద కింద్రుని విడిచి, యాగుహుడు స్నేహంబున బారు దెంచెను. పతిచేతనున్న సుతునందుకొని గిరిసుత గౌగలించి లాలించెను. ఇంద్రుడు ఆకుమారుండు దన్నేలిసవా డని తెలియక యజ్ఞానంబున జేసిన యపరాధంబు సహింపవల యునని వేడగా నాతనికి శివుడు అభయహస్తం బిచ్చెను. బ్రహ్మ విష్ణువులు నిఖిల భువనాధీశ్వరులు వచ్చి పుత్రోత్స వంబు సల్పిరి.

అంత సుర గురుండు జగద్గురునకు గృతాంజలియై దారిద్ర్య విద్రావణ స్తవము గావించి, యనేక ప్రకారంబుల దారకాపరాధంబుల విజ్ఞాపించి, తన్నిమిత్తంబుగా నుదయిం చిన కుమారునకు అమరసేనాధీశ్వరుగా బట్టంబు గట్టి, తారకు నిర్జింపవలయునని విన్నవింప, నీశ్వరుండును గిరిజా నుమతంబునవారికోరికను బ్రసాదించెను. అంత విష్ణుప్రముఖా ఖిల సురలు కుమారుని యువరాజు పట్టాభిషిక్తుని జేసిరి. తదవసరంబున పరమేశ్వరుండు శక్త్యాద్యనేక రాజచిహ్నం బులు దయచేసి, లక్ష్మీశ్వర, గణేశ్వరుల సహాయులంగా నియమించి తారకు నిర్జించి సురల రక్షింపుమని కుమారుని వీడుకొల్పెను.

అంత కుమారుండు చతుర్దశ భువనాధీశ్వరుండు, చతుర్దశభువనముల వారికిం బడిసేసి కూర్చుకొనుచు, సురగురు ప్రేరణంబున క్రౌంచాసురుని భేదించి తారకాసు రుపై నెత్తిపోవ దలంచి, యంతకు బూర్వమున రాయబార మంపుట యుక్తమని తలంచి సుమతిని రాయబారిగా బంపెను. అతడును తారకాసురు దురాలాపంబులు విని కోపించి తారకు నిరాకరింపగా, దనుజనాయకు లాతని వధింపనుద్యోగించిన శుక్రుడు వక్రంబై వారింపగా, నా దనుజగురు వచనంబులు మన్నించి తుదకాతని నావలకు వెడల ద్రోపించిరి.

అంత తారకాసురుండును హిమవంతంబు నుత్తర దిగ్భాగంబునం గలనుసెప్పి రమ్మని నిజాప్తచరుని బంపిన, నాతడు త్రిణయన సుతుం దృణీకరించి దనుజేశ్వరుడగు తారకు బలంబు వర్ణించి హిమవంతంబు నుత్తరము గలనుసెప్పిచని, దనుజాధీశ్వరుతో, మహాదేవుని యోగంబున మహాసేనుండు సేనానియై తెరలనెత్తు దెంచుచున్నాడని చెప్పెను కుమారుండును విజృంభించి కోపావేశంబున ప్రస్థానభేరి సరవంబంచి దూత తొలుత చెప్పిన యుద్ధావనిలో మహా నదీతీరంబున విడిసెను.

ఆరాత్రి యంతయు నా స్కంధావారంబున వీరభటోత్తముల వీరాలాపములు వీర రసమును వెల్లిగొలుపుచుండెను.

సూర్యోదయము కాగానే కుమారుండు ప్రభాతోచిత క్రియలు నిర్వర్తించి సన్నాహభేరి సరవంబంచి ఉమామహేశ్వర చరణస్మరణ పరిణతాంతః కరణుండై రణజాయాభీష్ట చేష్టలందనరు భద్రగజంబెక్కి సురాంగనాదత్త పంచమణి శేషాక్ష తాకలితోత్తమాంగుడై చతురంగ బలముతో దెరలనెత్తివచ్చిన నుభయబలంబులును బన్ని ఘూర్ణిల్లుచుండె. అంత తారకాసురుండే పన్ని నిలిచిన గీర్వాణానంత సామంతు లెవ్వరెవ్వరని, కుమారుం డెవ్వడని దనుజ గురు నడిగిన, నాతడు వారిని వేర్వేరు లక్షించి చెప్పెను. అట్లే యమర గురుండును కుమారునకు బ్రతివీరులను దారకాసురు నెఱింగించినంత, తారక కుమారు లొండొరులంగని కోపరసాపూరితాంతరంగులై విజృంభించి తమతమ బలంబులకు జేతులు వీచిన చతురంగ బలంబు లొండొరుల సంక్షోభించి ఘోరయుద్ధంబు సేయందొడంగినవి.

అట్లు సురబలంబు నసుర బలమును పెనగిపొడువ పీనుగులు (కెడ్పైరస్సై) పడువు పేకగా బడియుండెను. పిదప గజఘటలు, తురంగ దళంబులు రథములు నుగ్గునూచగా బడెను భూతవేతాళ శాకినీఢాకిన్యాది పిశాచగణంబులు రణరంగంబు సొచ్చి కీలాలజలంబుల దనియం ద్రావి అరుణజల పూర్ణసరోవరంబుచేసిరి. అంత దిననాథుం డపరజలనిధికి జనుటయు, నుభయబలంబులు కైవీగి నిజ శిబిరంబుల కరిగి దివ్యౌషధ మంత్రతంత్ర ప్రకారంబుల రాత్రియంతయు విక్షత వేదనా విముక్తు లగుచుండిరి

మరునాడుదయమున కుమారుండు తత్కాలోచిత క్రియా ప్రవర్తితుండై పరమేశ్వరు నతులభక్తి నారాధించి సమరోద్యుక్తుండై సన్నాహభేరి సరవంబంచుటయు, సురాసుర బలంబు లొండొండపెరిగి, సంక్షోభించె. వారొండొరుల దాకి మహాయుద్ధంబుసేయు నవసరంబున నమరవీరకర యంత్ర ముక్తాద్యాయుధ ప్రహతి కసురబలంబులు తాళలేక సురలకు వెన్నిచ్చి బరతెంచుచున్న జూచి, కుంజరాక్షుండు సురబలంబుల నుగ్రబాణాసారంబుల ముంచినైవ, వాని ననలాక్షుండు మార్కొని ఈశానదత్త మహాత్రిశూలాయుధం బెత్తికొని, కుంజరాక్ష కంధరంబుచ్చిపోవం బొడిచియెత్తెను. ఇట్లిరువైపుల మహాయోధ వీరులొండొరులతో విలయకాల రుద్రోద్రేకంబున బోరి రణ నిహతులైరి.

అంత తారకుండు విలయకాల ఘనాఘనంబుంబోలె నతి నిశిత శరవర్షంబు గురిసి బృందారకబృందంబు గాందిశీకులం జేసి, సంక్రందను నాక్రందనుజేసి, నారాయణుని పలాయన పరాయణుంజేసిన, కుమారుండు విలయకాలోదిత ద్వాదశఖర కరోగ్రశర ప్రకరంబుగ విజృంభించి తారకుందాడాకె. వీరలొండొరుపై సంతతశరవర్షంబుల గురియుచు భౌమవైహాయస చిత్రయుద్ధ విషయజ్ఞత చూపఱులు చూచి మెచ్చునట్లు యుద్ధముచేసిరి. తుదకు కుమారుడనంత శరసంధాన వేగంబున దారకాసురు శరనికరముచే రథరథ్యసారథుల నొక్కట దెగవేసి, యర్థచంద్రాస్త్రంబు దొడిగి యేసిన, దారకునివింటి శింజిని దెగియె. అతని విల్లు విరిగె. దానవసేనలును విరిగి పారిరి. కడిది సామంతులెల్ల నస్తమించిరి. రవియు నస్తమించెను.

మరునాడు తారక కుమారులు సమర సన్నాహంబుతో గజేంద్రంబుల నెక్కి గజఘటలతో యుద్ధంబు సలిపిన, దనుజానంతదంతి సంతానంబును దనుజ బలంబునం దారకుడు దనసర్వశక్తియు నెరసి యుద్ధంబుసేయ, హరసుతుడు ద్వాదశకరముల జక్రముల నైచిన దారకుని ద్విరద మరదమయ్యె. తారకుండు రాక్షసమాయా బలంబుచే పగర ని పదొడంగిన కుమారుండు పరమేశ్వర ప్రదత్తంబైన దివ్య శ నభిమంత్రించి నైచిన నది యా యసురహృదయము ( చ్చి మగిడివచ్చి కుమారుం జేరెను. శక్తిధరుని విజయప్రశ యు శాసనలిఖితాక్షరంబులయ్యె. అట్లు తారకుం డంతరించుటతోడనే సిద్ధాంగనలు సేసలు చల్లిరి. కమ్మదెమ్మరలు వీచె, దేవదుందుభులు ధ్వనించె. పుష్పవృష్టి గురిసె. మురహర పద్మజాదులు త్రిజగజ్జనులును వచ్చి చూచి తారక మారకుడగు నాకుమారు నత్యంతాదరమున మెచ్చుకొనిరి.

ఇట్లు దనుజనోర్చి లోకములను గాచిన యర్భకుని ఇందు ధరుడు యువరాజుగా జేసె. చక్రి శక్రాద్యమరవరులు దన్ను స్తుతిశతంబుల బ్రస్తుతించుచుండ నిఖిల జనానందకారుడైన కుమారుండు రజతగిరికి వచ్చి శివపురప్రవేశంబుచేసి యచ్చట శివశక్తులేకమై యర్ధనారియైయున్న సర్వాత్ముని గనియెను. అట్లున్న యీశ్వరుడు సర్వామరులను గరుణార సంబున నోలలార్చు మహాసేనుం గ్రుచ్చి యెత్తి రణశ్రమమెల్ల వాయ కవుగలించుకొని హర్షాశ్రుధారలం దేల్చెను. పిదప హరిపరమేష్ఠి, పురందరాదులకు వరంబులొసగి సకలభువన

సామ్రాజ్య పదవులందు ప్రతిష్ఠించి యుమామహేశ్వరులా కుమారునకు ననేక వేదశాస్త్రాగమ పురాణేతిహాస బృహత్కథా ద్యఖిల విద్యావేదికలయందు బారంగతుని జేసిరి. పిదప మహేశ్వరుం డాతనికి పరమాత్మజ్ఞాన విధానంబు లిట్లుపదే శించెను:

''సుజ్ఞానమును బడసి యోగతత్త్వ విధానమును దెలిసిన ప్రాజ్ఞులు భవబంధములను ద్రెంచి అచల భావనతో శివునే గొల్చుచుందురు. ఈశ్వరుని మనమార గొలుచుటయే అరుదు. అట్లు గొలిచినవా డెప్పుడును భంగమునొందడు. భూరిభోగ పరభూతి విభాత్వమును బొంది, పరజనదార ణోక్తి శరపాతము వలన భంగమునొందక వానినోర్చికొని, ఆత్మలో భూతగణేశ్వరునే నిలిపికొని, యాతనింబొందును. సరసాహారము రాగహేతువు గాబోదు. మనోహర విజ్ఞానయు క్తునకు రాగరసమందాహార నివృత్తితో పనియేమి? స్థూలము లగు బాహ్యకరణములు సూక్ష్మమగు నంతఃకరణమున లీనముచేసి, ఆత్మయందాత్మైక దృష్టి కలిగి, సర్వాత్ముడగు పరమశివుని గాంచుటె పరమపదవి. ఇదియే పరమేశ్వర తత్త్వ రహస్యంబని'' యుపదేశించెను. అట్లుపదేశించి లోకోపకారియైన కుమారుని కుమార పదవీసుప్రతిష్ఠుంజేసి పరమేశ్వరుండు సకల నిష్కల స్వరూప సదాశివుండు - స్వయంప్రకాశభావుండై తేజరిల్లుచు పరమ సుఖలీల బ్రవర్తిల్లు చుండె నుట!

ఇదియే కవిరాజశిఖామణి గ్రహించిన దివ్యకథా సూత్రము. ఈ కథాసూత్రము నందలి దివ్యాంగన - ప్రకృతి - మహామాయ, సర్వపదార్థమూర్తియగు సతీరత్నము - పార్వతి. ఈమె సకలావయవములం బరిపూర్ణ. ఆ బీజశక్తులు మిథునచర్యాసక్తి మైకొన్నగాని విశో దయకార్య సిద్ధి కాదు. ఇట్లు బీజశక్తుల విశ్వసృష్టితో ' రంభమైన యీకథా సూత్రమును, తుదకాశివశక్తుల యే భావముతో - అనగా సర్వాత్మకుని యర్ధనారీ రూప ప్రదర్శనముతో నంతముచేసి నాడీ కవి. ఆ శివశక్తుల సృష్టికి విషయభూతుడగు కుమారుడుకూడ యోగపద్ధతిని మరల శివుని రూపమున ఆత్మ స్వరూపమును గాంచి, పరమపదమును బొందురీతిని గూడ శివుడు కుమారున కుపదేశించిన రీతిగా, నీ గ్రంథము వ్యక్తముచేయుటచే, నీ సృష్టికి పరమావధిని దానిని సాధించు మార్గమునుగూడ దెలిపి, యీ కావ్యకథాసూత్రమును సకలావయవ పరిపూర్ణంబగునట్లీకవి యొనర్చినవాడైనాడు. సకల నిష్కల స్వరూపసదాశివుండు స్వయంప్రకాశభావుండై పరమసుఖలీల బ్రవర్తింపుచుండెనని ముగించుటచే, కలాసహితుడై సృష్టికి గారణభూతుడైన యీ యీశ్వరుడు నిష్కల రూపుడైన సచ్చిదానంద రూపమున వెలయుచుండ వాడెయని గూడసూచించినాడు.

ఈ విధముగా నీకావ్యకథా సూత్రము నిర్దిష్టమై ఆద్యంతములు గలదై సకలావయవంబుల బరిపూర్ణమై నెగడ నది. ఈ విషయమును నిరూపించుటకై పై కథాభాగము తయు నిచ్చట వివరింపబడుటయు దటస్థించినది. కాళిదాస దుల కావ్యములలోని కథాభాగములకును దీనికిని గల భేదమిదె. అది యీవిధముగా పరిపూర్ణమని చెప్పుటకు వీలులేదు. ఈ విషయమును సూచించుటకె గావలయు నీతడు నాచే చెప్పంబూనిన దివ్యకథ సూత్రం బెట్టిదనిన అని ప్రత్యేకముగాజెప్పి సతిజన్మంబున్ ఇత్యాదిపద్యమును రచించినాడు. ఈ దివ్యకథారంభమున కవిముఖుడైనప్పుడే సత్కవికావ్యము లోనుజూడగా బొరపడు చిత్రరూపమును బోలక సువర్ణచ్ఛంద మృదుభావము గల్గి లోన వెల్పటన్ సరియగు రత్నపుత్రికను బోలియుండు''నని చెప్పినాడు.

దేశిమార్గము నీ రీతిగా దేశీయముగ చేయ యత్నించి నాడు. సోమనాథుని కవితలో దేశిపాలు పెచ్చుపెరిగి, అతని మతప్రచార కార్యమునకు దోడ్పడినదేగాని, ఆంధ్ర సాహిత్య మున బ్రామాణికత్వ లక్షణమును సంపాదించుకొనలేకపోయి నది. అట్టి ప్రామాణికత్వము తిక్కన భారతరచనకే రావలసి యున్నది. మార్గదేశి లక్షణము లాతని కవితలో చక్కని సమ్మేళనము బొందుటచే - నాతని తరువాత నాపెళ్ల నెత్తుటకె యెవరికి నవసరమే లేకపోయినది. నన్నెచోడుని కవితలోని యుత్తమలక్షణములను గ్రహించి, అనవసర విశేషలక్షణములను - వికారలక్షణములను - పరిహరించి, సహజమైన దేశీయలక్షణముతో గూడిన భాషా రచనలో కావ్యకళాసౌందర్యమును, బ్రదర్శించి- ఆంధ్రావళికి మోద ముంగూర్చిన వాడు తిక్కన. ఏమైననుకొన్ని ప్రబంధలక్షణ ములలోను, దేశి రచనావిషయముననను, యుద్ధాదివర్ణనల లోను, మన నన్నెచోడుడు తిక్కనార్యునకు గూడ మార్గదర్శ కుడు కాకపోలేదు. అయినను పాల్కురికి సోమన వలె అతని భాషా వ్యాకరణచ్ఛందో రీతులను తిక్కనార్యు డవలంబింపక, నన్నయ రీతినే యవలంబించియు నెక్కుడు దేశీయతను మాత్రము పొందుపఱచి, భారతరచనకు, కవిత్రయ రీతికి బ్రామాణికత్వమును సిద్ధింపజేసినాడు.

ఈరీతిగా భారతీయ ప్రామాణిక గ్రంథమే - నన్నెచోడుని గ్రంథము. నన్నయ భారతకవితాభిమానులచే నాదరింప బడక, కాలగర్భమున మరుగుపడిపోవలసి వచ్చినది. ప్రబంధ పరమేశ్వర బిరుదము ఎఱ్ఱాప్రగడకు దక్కినది.

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు:

# బంగారమునకు మెఱుగు
# నన్నిచోడదేవుని కుమారసంభవం

కుమార సంభవమను పేరు చెప్పుట తోడనే ఏ మాత్రము సాహిత్య జ్ఞానమున్న వాడికైనా, కవికులతిలకుడగు కాళిదాసుని కావ్యము జ్ఞాపకము రాకమానదు. ఏమంటే గురుకుల పద్ధతిని మొన్నమొన్నటి వరకు సంస్కృతంలో సాహిత్య జ్ఞానం కలుగవలెననుకున్న వాడు పంచకావ్యాలను గురువు దగ్గర చదువుకునే వాడు. మొదట రఘువంశంలో కొన్ని సర్గలైనా చదివిన తరువాత, రెండవదీ కుమారసంభవమునే మొదలుపెట్టేవారు. కాబట్టే దీనికా ప్రసిద్ధి కలిగినది. అయితే మన తెలుగులో 'కవిరాజశిఖామణి' యగు నన్నిచోడుడు రచించిన 'కుమార సంభవమున'కు ప్రసిద్ధి కలుగలేదు గాని, వాస్తవముగా, ఆ బంగారమునకు మెరుగుపెట్టి తీర్చిదిద్దినదా యనిపించునంతటి చక్కని కావ్యమిది. మరియొక విశేషమేమంటే ఇది సుమారు 8 శతాబ్దములకు పూర్వమే రచింపబడిన దైనా, చక్కటి కావ్యమైనా మొన్నమొన్నటి దాకా ఆంధ్రలోకంలో దీని నామ రూపాలే ఎవరికీ తెలియకపోవడం, చాల ఆశ్చర్యకరమైన విషయం. ఆంధ్ర దేశానికి వెలుపల ఏ మారుమూలానో దాగియున్న ఒక తాళపత్ర ప్రతిని సంపాదించి, ఈ గ్రంథమును మొదట ముద్రించి యాంధ్రలోకమున కందించిన వారు శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు. ఈ గ్రంథము మొదటి భాగము 1909లోను, రెండవ భాగమును 1914లోను ప్రకటించి, యందీకవి క్రీ.శ. 10వ శతాబ్ది వాడని నిర్ణయించుటచే అంతకు పూర్వ మాంధ్రవాఙ్మయమున కాదికవియని తలంప బడుచుండిన నన్నయను త్రోసిరాజని, నన్నిచోడుని, ఆ స్థానమున నిలుపయత్నించిన వారైనారు. ఈ మూలముగా నీ గ్రంథమునకొక విశిష్టమైన అపూర్వత యేర్పడి పలువురు పండితుల యొక్క విమర్శకుల యొక్క దృష్టి నాకర్షించి వాదోపవాదములకు మూలమైనది. పలువురు పండితు లీతడు నన్నయ తరువాతి వాడనియే యభిప్రాయపడినారు. నన్నయ తన స్థానమును నిలుపుకొని తొలికవిగానే యేర్పడిన ప్పటికీ, నన్నిచోడుని రచన యందలి యపూర్వ విషయము లాతని కాంధ్ర సాహిత్యములో నొక విశిష్ట స్థానమును గలిగింప గలవనుటలో సందేహములేదు. ఆంధ్ర సాహిత్యములో తొలి యుగము పురాణేతిహాసముల భాషాంతరీకరణ యుగమని తలంప బడుచుండగా, నన్నయ తరువాత నచిరకాలమునకే యీ నన్నిచోడ కవి - తానే చెప్పికొన్నట్లుగా నీకుమార సంభవమును 'సద్రసబంధురంబగు ప్రబంధముగా, రచియించియుండుటచేత - తిక్కనార్యునకు పూర్వమే బయలుదేరిన యీ ప్రబంధ శాఖ పురాణశాఖతో మిళితమై యా యుగరచనలకు వన్నెపెట్టునది వలె నున్నది. అట్టిదైనను ఈ కవి నన్నయ తిక్కనలకు నడిమి వాడే యైయుండినను, ఈ కవిని గూర్చిగాని ఆతని గ్రంథమును గూర్చి గాని తరువాతి తెలుగు కవులెవ్వరును, తుదకాతని గ్రంథము నుండి యనేక భావములను గ్రహించిన పాల్కురికి సోమనాథాదులైనను అతని పేరు స్మరించియైన నుండకపోవుట అతి విచిత్రమైన విషయము.

ఇదియే యీ కవిని గూర్చిన యపూర్వములలో నపూర్వత. ఈ కవియు సామాన్యుడు కాడు పాకనాటి యందిరువది యొక్క వేయిటి కధీశుడగు చోడబల్లికిని, హైహయాన్వయాంబర శశిరేఖయగు శ్రీ సతికిని బుత్రుడు కరికాల చోడాది సూర్యవంశపురాజుల కెనవచ్చువాడు కవిరాజ శిఖామణి. శ్రీశైలమందలి కాలాముఖ మఠాధిపతి యగు శ్రీ జంగమ మల్లికార్జునయోగికి ప్రియశిష్యుడు. గురుభక్తి సూచకముగ నాతని పేర సప్త సంతానములను వెలయింపదలచి యందుత్కృష్ట మగునది 'కావ్యమే, గావున, శివుని పారమ్యమును వ్యక్తము జేయు 'శివపురాణ' కథను కుమార సంభవమను పేర నొక కావ్యముగా రచించి, యాతనికి గృతి యిచ్చెను. శ్రీశైలమందలి మల్లికార్జునదేవుడాతని కిష్టదైవము. గురువును అందలి మఠాధిపతి జంగమ

మల్లికార్జునుడే. తాను రచింపదలచిన కావ్య కథా నాయకుడు తన కిష్టదైవమగు శివుడే. ఇట్లే ముగ్గురకు నభేదమేకుదురుట యాతని యపూర్వాదృష్టమని చెప్పుకొన్నాడు.

''గురువున కిష్ట దైవమునకుం
గృతి చెప్పి పుణ్యమున్
వరమును దేజముం బడయ
వచ్చు జగంబుల నిశ్చయంబు మ
ద్గురువును నిష్ట దైవమును
గూర్చునిజేశుడు దాన నాకుగా
కొరునకు నిట్లు సేకురునె
యొక్కట లాభము లెన్నియన్నియున్''

వాస్తవముగా మార్గకవితారీతి ననుసరించిన నన్నయాదుల ''గద్య పద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠ రచనలు'' - పండిత లోకమున ప్రబలిన తరువాత, సర్వజన సామాన్యములగు ద్విపద, షట్పద, రగడో, దాహరణ, యక్షగానాది దేశిరచనలు దేశమునం దడుగంటియే పోయి నవి. ఈ దేశి ఫక్కిని స్మరించి కొంత యవలంబించుటచేతనే గాబోలీతని జాడయే లేకపోయినది. పాల్కురికి సోమనయు వెనుకబడి పోయినాడు.

ప్రాచీన కవులగు వ్యాస వాల్మీకాదులను నుతియించి ఇంతకు పూర్వము కుమార సంభవ కావ్యములను రచించిన కాళిదాసోద్భటులను గూడ నీతడు స్మరించినాడు. పిదప మార్గదేశి సత్కవులను స్మరించి దేశి మార్గములను దేశీయము లుగా జేసి సత్కవీశ్వరులు ''నూత్న రుచిర కావ్య''ములను రచింపవలదా యని ప్రశ్నించినాడు. ఆంధ్ర సాహిత్యములో దేశి, మార్గ కవితా భేదమును సూచించి దేశికవితా రీతినిగూర్చి ప్రశంసించి వాడీ కవి యొక్కడే కనబడుచు న్నాడు. నన్నిచోడుడు పూర్వులగు కుమార సంభవ కావ్యకర్తల పేళ్ళు స్మరించి యుండుట చేతను, నామ సామ్యము చేతను ఈతని కుమార సంభవము కాళిదాసు కావ్యమున కనువాదమేయని మొదట స్ఫురింపకమానదు. కాని, పరిశీలించినచో నిది దానికి కేవల మనువాదము మాత్రముకాదనియు, కాళిదాస గ్రంథమునకు గూడ మూల మని చెప్పదగియున్న శివపురాణ కథయే దీనికిని మూలమ నియు, తలంపవలసియున్నది. అట్లే యైనను ఆయా కథా సందర్భములయందు కాళిదాసోద్భటుల రచనలలోని పెక్కు భావములను గ్రహించి వానికి చక్కగా మెరుగు పెట్టి ఈ కవి తన కావ్య కన్యకకు అలంకారము చేసికోక పోలేదు. కాళిదాసుని కావ్యమున కేవలరస దృష్టియే ప్రధానము. ఉద్భటుని కావ్యమును గూర్చి ఆతడలంకారములకిచ్చిన యుదాహరణ పద్యములు మాయావటుని వేషమున బార్వ తితో సంభాషించుట తక్క మనకు తెలియదు. నన్నిచోడుడును

మృదురీతి సూక్తులింపొదవింప మేలిల్లు
భావమ్ము నెలమి ప్రీత్యావహముగ
మెరుగుల గన్నులు మిరుమిట్లు వోవంగ,
గాంతి సుధాసూతికాంతి జెనయ,
వర్ణన లెల్లచో వర్ణన కెక్కంగ,
రసములు దలుకొత్తి రాలువార
దేశిమార్గములు దేశీయములుగా న
లంకారములు దానలంకరింప
నాదరించి, విని, సదర్థాతిశయమున,
బుధులు నెమ్మనముల నిధులు నిలుప''
జంగమ మల్లికార్జునుని కరుణకేనము
లేకనురక్తయైన భాషాంగనc దక్కనేలిన మ
హత్త్వములోకమునంబ్రసిద్ధిగా,
భంగిగ విస్తరించెద ప్రబంధము సద్రస బంధురంబుగాన్''

అని ప్రతిజ్ఞ చేసియే - నవరస భావభరితంబై, షట్త్రింశ దలంకారాలంకృతంబై రమణీయం బైనట్టి'' దిన కథారంభం బున కభిముఖుడైనాడు. అనగా కేవల రసాదిదృ ి కాక, యిష్టదైవమగు శివుని పారమ్యమునుద్ఘాటించు ను మునం దప్రమత్తతయు నీతనికి కలదన్న మాట. కావున యిది యాతనికి ''దివ్యకథ'' యైనది. తిక్కనార్యునికి భారతము ''సంహిత''యైనట్లే. 'భారత సంహిత చెప్పగంటి నాపుట్టు కృతార్థతం బొరసె'' అది కథా సూత్రమును ''సతిజన్మం బున్, గణాధీశ్వరుజననము - దక్షక్రతు ధ్వంసము ''నిట్లు సూత్రించినాడు. మరల కవి బార్వతి జన్మంబు, భవోగ్ర వ్రత చరితము... కుమారోదయము నీత డనిం దారకున్ బోర గెల్చున్'' - అని యిట్లు తెలిపి విధి విశ్వము సృజియించుట కాది శక్తి పరమేశ్వరుల నారాధించుట మూలముగా శివపారమ్యమును సూచించు వృత్తాంత రూప మగు, సతీ జన్మవృత్తాంతముతో కథను ప్రారంభించెను. ఇది యంతయు శివపురాణాంతర్గతమే. తుదిని గల తారకా సుర వధయు శివపురాణములోనిదే. ఇట్లు శివపురాణ కథనే యనుసరించి శివ పారమ్యమును స్థాపించు నుద్దేశముతో రచించినను, సందర్భానుసారముగ ననేకములగు మార్పులను జేసియు, ఆయా ఘట్టముల కాళిదాసాదుల భావములను గ్రహించి మెరుగు బెట్టుచు, కథా సందర్భముల విషయముననే గాక, భాషా జాతీయ సంప్రదాయ విషయముల యందును తన దేశీయతాభిమానమును సన్నిహితములగు తమిళ కన్నడ భాషా కావ్యజ్ఞాన సంప్రదాయజ్ఞతను వ్యక్తపరచుచు దన

ప్రబంధమున కపూర్వ రామణీయకమును సంపాదింపగలిగిన వాడైనాడు.

కథా విషయమున నతడు తెచ్చిన మెరుగుల నించుక పరిశీలింతము. కరి కరేణు రూపములు దాల్చి క్రీడించిన శివదంపతులకు జన్మించిన గజాననుని, పరమేశ్వరుడెత్తికొని యాడించుచు సతిని నవ్వించుచు దానునవ్వుచున్న సమయ మున దక్షుడల్లుని జూడవచ్చి శివుడల్లుడు గదాయని గాబోలు నాతనికి నమస్కరింపకుండుట, ఆవల శివుడాతనియెడ పరాఙ్ముఖుడై తక్కిన యల్లుళ్ల వలె గౌరవింపకుండుటచే - దక్షుడు మనమున క్షుబ్ధుడై పరమేశ్వరుని బిలువకుండ యాగము సేయ దలపెట్టి తన వైభవముల జూచుటకు సతిని మాత్రము బిలిపించుటయు, సతీదేవి పితృకృత నిజపతి దూషణమున యోగాగ్నిచే దగ్ధముకాగా, దక్షాధ్వర ధ్వంసమును, దక్షునిబంధమును గూడ సతీసుతుడగు గజాననుడే గావించినట్లును వర్ణించి శివపురాణకథకే మనకవి నన్నిచోడుడు వన్నె పెట్టినవాడైనాడు. కాళిదాసు కావ్యమున నీకథ లేనేలేదు. శివపురాణమున పార్వతి కొడుకే గజాన నుడు. నలుగు పిండి బొమ్మకథయే వేరొక చోట నెచ్చటనో చెప్పబడియున్నది గాని యిచ్చట లేదు.

ఇంతవరకు శివపురాణములోని రుద్రసంహిత యందలి సృష్టి ఖండ, దక్షఖండ అను వాని కథ ననుసరించినాడు. దక్షాధ్వరము ధ్వంసముచేసి దక్షుని శిరము ప్రమథగణములు త్రుంపి వేయగా, శివునియనుగ్రహముచే యాగపశుశిర మతుకుటచే దక్షుడు పునరుజ్జీవితుడైనట్లున్నది. ఇక మూడవ యాశ్వాసమున పార్వతీ జన్మకథ మొదలుకొని కాళిదాస కావ్య కథతో నిది పోలిక గలిగియున్నదనవచ్చును. శివపురాణమున పార్వతీఖండ, కుమార ఖండాలలో నీ కథయే చెప్పబడియున్నది. కొన్నిచోట్ల నీరెంటికిని భావములందే గాక శబ్దరచనయందును పోలికలు గలవు. కాళిదాసే శివపురాణమునుండి సంగ్రహించినాడో, శివపురాణముననే కాళిదాసు రచన చేర్చబడినదో చెప్పుటకు వీలులేదు. కాని మన నన్నిచోడుని రచన యీ సందర్భమున రెంటిని మించి దేశీయతా గుణ రమణీయంబై యొప్పుచున్నదని మాత్రము చెప్పవలసియున్నది. ఒక్కటే పట్టు చూపెదను. చిత్తగిం చండి. పార్వతి శైశవక్రీడ

''కందుకైఃకృత్రిమైఃపుత్రైః సఖీమధ్యగతాచ సా
గంగాసైకత వేదీభిః బాల్యే రేమే ముహుర్ముహుః''

అని శివపురాణము-

''మందాకినీ సైకత వేదికాభిః
సా కందుకైః కృత్రిమపుత్రికైశ్చ,
రేమే ముహుర్మధ్యగతాసఖీనాం
క్రీ డారసం నిర్విశతీవ బాల్యే''

ఇది కాళిదాసు రచన.

పుష్పితాగ్ర వృత్తములో రమ్యముగానె యున్నది. కాని మందాకినీ సైకతవేదిక లెట్లుండునో మనకు తెలియదని గాబోలు మనకవి పార్వతి, చెలికత్తెలచే బొమ్మల పెండ్లిండ్లు చేయించి గుజ్జన గూళ్ళు వండిపించినాడు.

తరుణులు చిల్కబొమ్మలును,
దంతపు బొమ్మలు మేలిగాజుల
న్నరులును, మ్రాని చొప్పికలు,
నల్లడ నోలిన పేర్చి లీలజో
కుర బొమరిండ్లఁజేయనగు
గూళ్లును వండుచు బొమ్మపెండ్లి మా
నరముగ జేసి యాడ,
నగజాత శివార్చన సేయు నయ్యెడన్'

చెలికత్తెలు బొమ్మల పెండ్లిళ్లు చేను కొనుచుండగా - పార్వతి శివార్చనయే చేయుచుండెనట. ఇచ్చట నన్నిచోడుని శివపారమ్య దృష్టి గమనింపదగినది.

కాళిదాసు భావము ననుసరించియు - దానికి మెరుగువె ట్టిన పట్టులు లేకపోలేదు.

మధ్యేన సావేది విలగ్న మధ్యా,
వళిత్రయం చారు బభార బాలా
ఆరోహణార్థం నవయౌవనేన
కామస్య సోపాన మివ ప్రయుక్తమ్

అని కాళిదాసా పార్వతినడుమును, వళులగు వేదిమధ్యమునకు సోపానమునకు బోల్పగా నీతడు

''మారు మఘవేది మధ్యమొ,
యారతి యుద్ధంపుఁ బిడియొ
యన నెంతయు బొ
ల్పార గడునలికమై, సుకు
మారికి మధ్యంబు సింహమధ్యము పోలెన్''

పారిదలముగొని జవ్వనమున్,
సిరికుచముల కెక్క వడవజేసిన కార్త
స్వరసోపానములన ము,
త్తరగలు దగు నంగజాబ్ధి తరగలు వోలెన్.''

మన కవి పార్వతి కాంధ్రత్వముతో గూడ కొంత సంబంధము కల్పించి నాడవయవ వర్ణనములో

''ఆంధ్రీ స్తనాపహాసలు,
సంభృత మధుపాల్లముకుళ సదృశము లతినీ,
రంధ్రములు గుచములఖిల పు
రంధ్రీజనతిలక మచల రాజాత్మజకున్''

ఆంధ్రస్తనాపహాసలట పార్వతికుచములు. - కన్నడకవి యగు పంపయు తన భారతమున ''నాంధ్రీ నీరంధ్ర బంధురస్త 'నహార నుదారం సరస్వతీ మణిహారం,'' అని వర్ణించుటయు మనకవికి సుపరిచితమే యైయుండును. ఇవి కాళిదాసోద్భటుల భావములను జోడించి పోషించి రచించిన చోటులును కనబడుచున్నవి. వటురూపధారి యగు శివుడు తపోవ్యగ్రయగు పార్వతితో నెవరికొరకీ తపము ''త్వత్కృతే సోపి వైకుంఠః మన్యే త్యజతి తాం శ్రియం. రూపేణ తే యువా సర్వః పాదబద్ధో హి కింకరః'' - విష్ణువైనా నీ కొరకై లక్ష్మిని వదలి వేసి వచ్చును. ప్రతి యువకుడు నీ రూపమును జూచి నీకు కింకరుడే యగును గదా అని యుద్భటుడందించిన భావమును గ్రహించి ఎట్లు పెంచినాడో చూడుడు.

వారిరుహానన నీరూపుగనుగొన్న
  నలకూబరుండైన వలచివచ్చు,
బాలతిగ నీభోగోపభోగముల్ చూచి
  జంభారాతియైనను గోరివచ్చు,
గోమలి నీ కళాకుశలత విని శత
  దళ సంభవుండైన దగిలివచ్చు,
లలితాంగి నీశుభలక్ష ణోన్నతి జూచి
  పురుషోత్తముండైన మరిగివచ్చు,

నిన్ను గోరి తపము నిష్ఠనొరులు
సేయ గోరుచో దపమీవు సేయుదఖిల
రత్నములు గోరి విని జనుల్ రాక జనుల
రత్నములు గోరి పై వడి రాక బోలు''

ఇచ్చట ఉద్భటుని భావమును పెంచిరచించి దుదిపాద మున కాళిదాసుని 'నరత్నమన్విష్యతి మృగ్యతేహితత్'' అను భావరత్నము చక్కగా పాదిగినాడు.

కాళిదాసు భావమును సరిగా ననుసరించిన పట్టును లేకపోలేదు

సా మంగళ స్నా న విశుద్ధగాత్రి
గృహీత పత్యు మనీయవస్త్రా,
నిర్వృత్త వ జలాభిషేక -
ప్రఫుల్ల కాశా వసుధేవ రేజే.

మజ్జనం బొప్ప నాడి నిర్మలిన మగుడు,
కూలములు గట్టి పొల్చె కుత్కీల తనయ
వర్ష సమయము పన శరద్వ్యాప్తి వెలుగు
కాశ సంకాశ మగు మహీకాంత వోలె.

ఇక్కడ శివ పార్వతుల పెండిలి పసదనంబులను దేశి పద్ధతిని చక్కగా వర్ణించాడు. అభ్యంజనో ద్వర్తన స్నానాదులు పసిడి యాయగంబున సురియ సురంగంబుగా దొంగలి పట్టియం గట్టి చెన్నుమిగుల గై సేయుట అనగా రాచకుమా రుని వలె కత్తి వ్రేలాడ గైసేసినాడు బృహస్పతి ''దేవా లగ్నం బాసన్నంబయ్యె విజయం చేయుమనుట - వివాహవే దికా తలోపరిదు కూలాంబరాలంకృత మణిపీఠాసనుండై యుండ హైమవతి దేహార్థంబు గైకొనునట్లు తత్ప్రీతార్థంబున లంకరించుట, వేదఘోషములు, మంగళ గానములు, జయ ఘంట కాహళీ వేణువీణానినాదములు తుంబురునారదుల గానము, రంభనాట్యము. వసంతోత్సవము, విట ఘనకర యంత్రచ్యుత ధారాపాత సిక్త సుందరికలు. స్త్రీల జల క్రీడలు, చల్లు పోరాటలు వెల్లీతలు, ఆరామ క్రీడలు, మధుపాన గోష్ఠులు మొదలగు వివాహ సందర్భ వినోదము లెన్నో వర్ణింపబడినవి. తద్వినోద ప్రవర్తకాది జనంబులకు పరమేశ్వరు డంబరాభరణ దానాదులు చేసినాడట. గిరిపతి గిరిశునకు దన్నరణముగా నిచ్చుకొని అంపకములు జేసెను. ఈ వర్ణనలన్నియు నేమూల గ్రంథమునుండి గ్రహించినవి కావు. నన్నిచోడుని దేశీయతా గుణ స్ఫోరకములు. తరువాతి కథలో పురాణానుసరణమే గాని కావ్యానుసరణ మంతగా కానరాదు. కుమారోత్పత్తికి ఋషిపత్నులు గూడ కారణమగుట కావ్యమున లేదు. వారు ఋతుస్నాతలై శీతాపనోదార్థమగ్నిని దరియజొచ్చుట యగ్నిమూలమున శివుని వీర్యము వారి యందు సంక్రమిం చుట మొదలగు విషయములు నన్నిచోడుడు చక్కగా వర్ణించినాడు. నారదుడింద్రుని కుమారునిపై యుద్ధమునకు బురికొల్పుట, ఇంద్రుడా బాలుని కోడి పారుట, కుమారుడు వెంబడింప మరువు జొచ్చుట, శివపార్వతులతో కుమారుని సమాగమమునకు చక్కని యవకాశము కల్పించుటే గాక బాలుని వీరత్వమును చాటినది. తారకవధాంతమగు తరువాతి కథా భాగమునను నన్నిచోడుడు చేసిన మార్పులు మూల కథకు వన్నె పెట్టు నవిగానే యున్నవి. కుమారుని ఇంద్రాదుల ప్రార్థన ననుసరించి దేవ నాయకత్వమునందభిషిక్తు గావిం చుట, దేవసేనలు దండు వెడలుట, హిమాచల ప్రాంతమున విడిది, యోధవీరుల వీరాలాపములందలి చమత్కారములు, సుమతి రాయబారము, తారకుని ప్రత్యుత్తరము, యుద్ధ ప్రారంభమునకు పూర్వము కుమారునకు, తారకునకు శుక్ర బృహస్పతులు ఎదుటి సేనలలోని ప్రతి వీరుల నెరింగించుట, తొలినాటి రథ గజ, తురగ పదాతుల యుద్ధము, రాత్రుల

యందు క్షతగాత్రుల చికిత్సా విధానములు. మరునాటి యోధవీరుల యుద్ధము - మూడవ నాటి కుమార తారకుల వీరాలాపములు - తారకవధ, యుద్ధభూమి వర్ణనలు, మొదలగునవి నతిరమ్యములు. వీరబీభత్సరసోద్బోధములునై యున్నవి. ఈ రీతి మూలమున గానరాదు. స్వానుభవము నుండియు భారత యుద్ధ ఫక్కినుండియు గ్రహించి యుండును. తారక వధానంతరము కుమారుండు శివపురంబు నకువచ్చి యర్ధనారీశ్వరుండై యున్న యాశ్వరుని యాలింగనంబు బడసి యాతనివలన పరమాత్మ జ్ఞానధ్యాన విధానంబులు, పరమేశ్వర తత్త్వరహస్యంబులు నుపదేశంబు గొనినట్లు వర్ణించినాడు.

ఈ కుమార సంభవమాంధ్ర సాహిత్యములో నపూర్వమైన కావ్యము. ఆంధ్ర సాహిత్యలోక మెరుగని విషయములు రచనా రీతు లనేకము లిందు గలవు. ఇది సాహితీ వినోదముల గని. ఇంత కాలమునకైన నిది మరల బయలువడుట ఆంధ్రుల మహాపుణ్యము. ఇప్పటికైన నిది ముద్రణ భాగ్యమునందినది. కవి గ్రంథాంతమున నాశించినట్లు మనము నాశింతము:

ధ్రువమై జంగమమల్లికార్జున మునీం
ద్రుం బేర్మి బేర్కొన్న సంభవ మహా
కావ్యంబు భూభూధరా
ర్ణవ వేదానిల తారకాం బర సదా
నం తాంత దిక్కాలముల్
సవిలాసస్థితి నుండునంత కిల నా
చంద్రార్కమై యుండెడున్.

''యం లబ్ధ్వాచాపరం లాభం - మన్యంతే నాధికం తతః।
యస్మిన్ స్థితో న దుఃఖేన - గురుణాపి విచాల్యతే॥
తం విద్యా ద్దుఃఖ సంయోగ - వియోగం యోగ సంజ్ఞితమ్।
స నిశ్చయేన యోక్తవ్యో - యోగో నిర్విణ్ణ చేతసా''॥

— భగవద్గీత

Having realised the true freedom of Atma, a person does not think of anything else more profitable to achieve. A person in that state of realisation, is least bothered by even the greatest of what appear as calamities. That state of perfection which is cutting away from attachment of sorrow is known as the term 'Yoga'. This Yoga has to be practised with a determination of purpose and a steady mind.

– శ్రీ 'కోరాడ' వారి డైరీనుంచి

# నన్నిచోడుడు : కన్నడ కవిత

ప్రాచీనాంధ్ర సాహిత్యమున పురాణము, ప్రబంధము అనునవి రెండు ప్రధాన శాఖలుగా నేర్పడిన వనుట సుప్రసిద్ధమే. ఆధునికయుగమున ఖండకావ్యము గద్య రచన యనునవి ప్రధాన శాఖలు కావచ్చును. అనగా నాయాకాలము లందు వేరు రచనలు లేవని కాదు. ప్రాచీన కాలమున అనేక విధములగు దేశిరచనలు బయలుదేరినట్లే ఇటీవలి కాలమున కొన్ని ప్రబంధాదులు నింక భిన్న రీతి రచనలు బయలుదేరి నను, ఆయా కాలములందు సాహిత్య చరిత్రలో నాయాశాఖల ప్రాధాన్యమును వహించునవని సూచించుటయే యిందలి తాత్పర్యము. ఆంధ్ర వాఙ్మయమున తొలియుగము పురాణ యుగమనియు, నది పురాణ ఫక్కిని రచింపబడిన గ్రంథముల తోడనే ప్రారంభమైనదనియు, దానికి నన్నపార్యుడే మూల పురుషుడనియు, సామాన్యముగా జెప్పబడుచుండును గదా! ''ఈ బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునకు వాగనుశాసనుడై సృజియించిన'' నన్నయభట్టు జగద్ధితంబుగా ''దెనుంగునన్ మహాభారత సంహితారచన బంధురుడై'' నప్పుడే తద్రచనా విషయమగు నాతని యాశయమును వ్యక్తము చేసినవాడై నాడు. ''సారమతిన్ గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థయుక్తి''లోనా రసి మేలందురనియు, నితరు లక్షర రమ్యత నాదరింతురనియు. ''నానారుచిరార్థ సూక్తినిధి''యగు నాత డాశించినది. ఇట్లు రుచిరార్థ సూక్తులలో ప్రసన్నమగు రీతిని కథను నడిపించుటయనునదే పురాణఫక్కికి మూలము. తత్సంప్రదాయానుయాయులగు తరువాతి కవులీ మార్గమునే కొంతవర కవలంబించినారు కాని తిక్కనార్యుడు ఆది దొడంగి మూడు కృతులొనర్చిన ఆంధ్ర కవిత్వ విశారదుండు, విద్యాదయితుండు మహితాత్ముడు నగు నన్నయ భట్టు మార్గమునే యవలంబించి, భారతమును దుదిముట్టన్ రచియింపదలచినను ఇతనికి సహజంబగు రచనా కౌతుకము కళాకౌశలము ఆతని మనం బలరగజేసి యూర్జిత కథోపేతంబు, నానారసాభ్యుదయోల్లాసియగు విరాటపర్వమును అట 'యుద్యోగాదులం గూడి' ప్రబంధ మండలి యగునట్లుగా జేసినది. దీనిని బట్టి రచనా ప్రౌఢిమ ఊర్జిత కథోపేతత్వము, నానా రసాభ్యంచితత్వమునే ప్రబంధ కవితకు ముఖ్యలక్షణముగా దెలియవచ్చుచున్నది.

## ప్రబంధ పరమేశ్వరు డెవ్వరు?

ఈ విషయముననే నన్నిచోడుడును తన కుమార సంభవమున ''భంగిగ విస్తరించెద బ్రబంధము సద్రసబంధురంబుగాన్'' అని చెప్పుటచే వ్యక్తపరిచినాడు. ఈ తొలి యుగమున సామాన్యముగా కవులందరు నన్నయ చూపిన పురాణఫక్కి నవలంబించినవారే, కాని రసవత్ప్ర బంధమును విస్తరించెద నని కంఠోక్తిగా జెప్పికొనిన వాడీ నన్నిచోడు డొక్కడే. తిక్కన తొలుత రచించిన నిర్వచనోత్తర రామాయణమును గూడ ప్రబంధమని చెప్పుకొనలేదు. భారత కథలను భంగ్యంతరముగా మాత్రము 'ప్రబంధ మండలి' యని ప్రబంధ శబ్దముచే సూచించినాడు. కాని అది కవులిద్దరు వదలివేసిన ఆరణ్య పర్వశేషమును బూరించిన ఎఱ్ఱాప్రెగ్గడకు 'ప్రబంధపరమేశ్వరు'డను బిరుదమబ్బుట యాశ్చర్యకరము. వాస్తవముగా ఆంధ్ర వాఙ్మయ పథమున నీతనికి బూర్వమే ప్రబంధ మార్గమును దీర్చి చక్కజేసిన కవిరాజ శిఖామణి యగు నన్నిచోడునకే ఈ బిరుద మబ్బవలసినది. కాని యాకాలమున వైదిక మతాభిమానము గల చాళుక్య ప్రభువగు రాజనరేంద్రుని ప్రోద్బలమునను, ఆతని యాస్థానమున ప్రబలిన మత భాషా సాహిత్య సంప్రదాయములకే తరువాత దేశమున ప్రాధాన్యము కలుగుటచేతను, నన్నిటను వానికంటె భిన్నములగు సంప్రదాయముల నవలంబించిన కవిరాజశిఖామణి ప్రబంధ మార్గము కొంత మరుగుపడి తగినంత ప్రసిద్ధిలోనికి రాలేక పోయినది. కావుననే యాంధ్ర ప్రబంధ మా పేరుతో పైకివచ్చి వాఙ్మయశాఖగా నేర్పడుటకు మరికొన్ని శతాబ్దముల కాలము పట్టుట తటస్థించినది. దీనిని బట్టి మనము ముఖ్యముగ గమనింపదగిన విషయమొకటి కలదు.

## ప్రబంధావతరణము

ఆంధ్ర ప్రబంధమనునది తొలియుగమున పురాణ ఫక్కిని రచింపబడి యాంధ్రభారతాదొ గ్రంథములనుండి క్రమ

పరిణామమున నేర్పడినదిగాక, తొలియుగమున వానితో సమకాలిక మేయై, భిన్న సంప్రదాయముల నలవరచికొని నూతన ఫక్కిని సాధింపబడిన ప్రత్యేక రచనయని మనమి ప్పుడు తెలిసికొన వలసియున్నది. ఆంధ్ర వాఙ్మయమున పురాణ ప్రబంధము లనునవి కొంచెము హెచ్చుతగ్గుగా సమకాలికములే యనదగు రెండు భిన్న శాఖలు. పురాణ శాఖకు వాగను శాసనుడే సృష్టికర్తయని తలంపబడినచో, ప్రబంధ శాఖకు కవిరాజ శిఖామణియే మూల మనియు దలంపవలసియుండును. కాని యొక జాతి జీవితచరిత్రయం దువలెనే, తజ్జాతికి చెందిన భాషా సాహిత్య చరిత్ర మందును పూర్వోత్తర సంబంధములేని హఠాత్సంభవములు కలుగుట సహజము కాదు. ఆయా కాలములందలి సాహిత్య చరిత్రను అప్పటి తజ్జాతీయ జీవిత చరిత్రను బట్టి పరిశీలించి తెలిసికొనవలసియుండును. ఆంధ్రుల జీవిత చరిత్రమందు వలె సాహిత్య చరిత్రమందును రాజనరేంద్రుని ప్రోత్సాహ మున నన్నపార్యుడు రచించిన ఆంధ్రమహాభారత మొక ప్రత్యేక ఘట్టమును స్థాపించి కొంత కాలము వారి జీవితచరిత్రను సాహిత్యమును గూడ నొక్క మార్గముననే నడిపినది. కావున ప్రక్క మార్గములు గిట్టక పోవుట చేతను, అంతకు బూర్వస్థితిని దెలుసుకొన నాస్థయే లేకపోవుట చేతను, ప్రక్కనున్న శైవ వాఙ్మయముగాని, నన్నయకు పూర్వమున గల పరిస్థితులు గాని వారిని దగినంత బలముతో నాకర్షించినవి గావు.

## తెలుగు కన్నడముల సంబంధము

భారత కవుల కాలమునాటి దేశీయ సాహిత్య పరిస్థితులను దెలిసికొనుటకు ఆకాలపు శైవ వాఙ్మయమును మన మాదరించి పరిశీలింప వలసినట్లే, నన్నయకు బూర్వపు సాహితీ రీతులను, నన్నయాదుల సాహిత్య మట్టిదగుటకు గల కారణములను దెలిసికొనుట కంతకు బూర్వపు శాసనాదులకు సన్నిహితంబగు కన్నడ భాషయందలి సాహిత్య రీతులను పరిశీలింపవలసియుండును. మన భాషలో నా కాలమున బయదేరిన శైవ వాఙ్మయమును బరిశీలించిన తేలున దేమనగా: భారత కవుల శిష్టకవితా మార్గమునకు భాషాచ్ఛంద స్సాహితీరీతుల భిన్నమైన దేశీయ కవిత జనసామాన్యమున విశేష వ్యాప్తి జెందియుండెననునదియే. కాలక్రమమున దాని కాదరము, పోషణము తగ్గుటచే నది యంతరించుట తటస్థించినది. ఇది శిష్టజనాదృతము కాకపో వుటచే లాక్షణికులును దీని జూడనొల్లరైరి. కాని దీనిని గూర్చి మనకు దెలిపిన వాడు నన్నియచోడు డొక్కడే. ఈతడైనను దీనిని గూర్చి తెలుపుటకుగల ప్రధాన కారణ మాతనికి దానియందుగల యాదరమే కాదు. ఈతడు ప్రాచీన కన్నడ సాహితీరీతుల నవలంబించి రచించిన వాడగుటయే. నన్న యకు పూర్వమున మనదేశము నందలి చారిత్రక పరిస్థితులను పరిశీలించినచో రాజకీయ విషయములందేగాక, భాషా సాహిత్య విషయములందు గూడ కన్నడ దేశముతో నాంధ్రదేశమునకు గల సంబంధము వ్యక్తము కాగలదు. ఈ రెండు దేశములును కొన్ని శతాబ్దములపాటు చాళుక్యరాజుల పరిపాలనము క్రింద నుండినవి. వీరికి పూర్వము నుండియు కన్నడ దేశమున దేశ భాషా కవిత - అనగా కన్నడ భాషా కవిత పెంపొంది క్రమముగ రాజాస్థానములందు సంస్కృత భాషా పండితులగు జైనకవుల మూలముగా లక్షణ యుక్తమగు శిష్ట కవిత బయలుదేరుటచే, క్రీ॥ శ॥ 9 వ శతాబ్ది నాటికే కవిరాజమార్గాది లక్షణ గ్రంథము లాభాషలో వెలసినవి. ఆ లక్షణ పద్ధతినే పంపాది కవులు 10వ శతాబ్దిని భారతాద్యుత్తమ కావ్యములను రచించిరి.

## దేశికవితయే ప్రాచీనతమము

సుప్రసిద్ధ కన్నడ కవులవలంబించిన పద్ధతినే మఱికొన్ని సంస్కారములతో నన్నపార్యుడు తెలుగున బ్రవేశపెట్టి, తన భారత రచనను సాగించినాడు. నన్నపార్యునిచే సంస్కరింపబ డక పూర్వము అనగా నన్నయకు పూర్వము తెలుగుకవిత దేశీయకవితగా మాత్రమే యుండెడిది. అనగా సంస్కృత భాషాచ్ఛంద స్సాహితీ లక్షణ లక్షితమై యుండెడిది కాదన్న మాట. అట్టి సంస్కారమును నన్నయ తెనుగుకవితకు కలిగించి నాడు. సంస్కృత వృత్తములకు ప్రావళ్ళను గూర్చి తెలుగుకవితలో బ్రవేశపెట్టుట, అరిసమాసములు మిశ్ర సమాసములు మొదలగువానిని బరిహరించుట, శిష్ట వ్యవహార ములో నంతరించుచుండిన యీ భాషలోని 'ళ' కారధ్వనిని ద్రోసి పుచ్చి, దాని స్థానమున వాడుకలోనికి వచ్చి 'డ' కారాదులతో గూడిన రూపములనే గ్రహించుట, ఈ మొదలగు సంస్కారమును జేసి యాంధ్రభాషా వాగనుశాసను డైనాడు.

ఈతనికి బూర్వము దేశమున నెలకొని యున్నది 'దేశి కవిత'. ప్రత్యేక సంస్కారములేక దేశమున వ్యవహారములోగల భాషలో ఇది పాటలు పదముల రూపమున దేశీయ చ్ఛందములలో రచింపబడినదై యుండి యుండును చాళు క్యులకు పూర్వ మీ దేశమున ప్రాకృతమునకు, సంస్కృతము నకు కలిగిన ప్రాధాన్యము దేశభాషకు కలుగలేదు. చాళుక్య రాజు లీ దేశమును జయించిన పిదప కన్నడ దేశ సామ్యమును బట్టి యీ దేశమున 'దేశి' కవితకు ప్రోత్సాహమిచ్చి సంస్కృత ప్రాకృతముల ధాటి కాగలేక వెనుకబడుచున్న తెలుగు నీదేశమున నిలువబెట్టినవారైనారు. ఈ విషయమునే నన్నిచో డుడు కుమార సంభవము నందలి -

మును మార్గ కవిత లోకం
బున వెలయగ దేశికవిత పుట్టించి తెలుం
గున నిలిపి రంధ్రవిషయం
బున జన చాళుక్యరాజు మొదలగు పల్వుర్

అను పద్యమున మనకు తెలియజెప్పినాడు.

## దేశికవిత అంటే ఏమిటి?

ఇచ్చట మార్గకవితకు సంస్కృత భాషా కవిత యనియు, దేశకవితకు దేశభాషాకవిత యనియు నర్థము చెప్పినచో తొలుత కవితావిషయమున నీ మార్గ దేశి విభాగమును దెనుగున కన్వయించి చెప్పగడంగిన నన్నిచోడుని భావమును మనము సరిగ గ్రహింపగలిగితిమా యను సందేహము కలుగక మానదు. ఈతడీ శబ్దములను ఈ విభాగమును తన గ్రంథమున రెండు మూడు సందర్భములలో బేర్కొన్నాడు. వానిని పరిశీలించి సమన్వయించుకొనినగాని యాతని భావము వ్యక్తముకాదు. ఇంతేగాక యీ భాషలో నీతడొక్కడే కవిత కన్వయించి యీ విషయమును దెలిపిన వాడగుటచే నితర కవుల ప్రయోగరీతిని బట్టి దీని యర్థనిర్ణయము చేసికొనుటకైన నవకాశము లేదు. కావున నితర సన్నిహిత భాషలలో దీని ప్రయోగరీతికి అర్థమును గ్రహించి సమన్వ యించుకొన వలెను.

నన్నయకు పూర్వమున గల కన్నడకవులు మాత్రమే కవిత్వమున కన్వయించుచు నీ మార్గ దేశి భేదమును గూర్చి ప్రశంసించి యున్నారు. అనేక విషయముల కన్నడ కవుల రచనలనే యాదర్శముగా గ్రహించి రచించిన నన్నిచోడు డీమార్గదేశి విషయమును తెనుగు కవితలో బేర్కొనినపుడు వారి భావములనే యనుకరించెననుటలో సందేహింప నక్కర లేదు. ఈ విషయ మొక్కదానిలోనే కాదు, ఆంధ్ర భాషా కావ్య పథమును తీర్చిదిద్దిన నన్నపార్యునకు, ఆంధ్ర ప్రబంధ రాజమార్గమును దృఢమైన పునాదితో నెలకొల్పిన నన్నిచో డునకును గూడ ప్రాచీన కన్నడ కవితయే మేలుబంతి యని చెప్పవలసియున్నది. మత విషయమున వైషమ్యము, భేదభావముచేత నాకన్నడ కవులను వీరు పేర్కొనకున్నను, భాషాసాహిత్య సంస్కారముల విషయమున నా భాషలో నవలంబింప బడిన పద్ధతులనే తమ కనుకూల మగురీతిని వీరును గ్రహించి పెంపొందించిరి. ఈ విషయమును వ్యక్తము చేయుటలో నన్నయరచన కంటెను నన్నిచోడుని రచనయే మనకు విశేషముగా దోడ్పడ గలదు.

పై పద్యమునందలి 'మార్గ' 'దేశి' పదముల యర్థ మాతని మరి రెండు సందర్భములను బట్టి కూడ పరిశీలించిన గాని వ్యక్తము కాదు. కుకవినిందలో 'మార్గ కుమార్గము దేశి యమార్గము' అనియు, వరకవీశ్వరుడవలంబింపవలసిన రీతిని దెలుపుచు ''దేశిమార్గములు దేశీయములుగ నలంకార ములుగా నలంకరింప'' అనియు జెప్పియున్నాడు. 'మును మార్గ' కవిత లోకంబున వెలయగ' అను నప్పుడు 'మార్గ' కవిత సంస్కృత కవితయే యని మనము భావించినచో 'మార్గ' కుమార్గ మెట్లగును? తెలుగు కావ్యరచనమును గూర్చి వచించు సందర్భములో 'సంస్కృత కావ్య రచనాప ద్ధతి కుమార్గ మనుటలో నౌచితి యేమి? మార్గకు మార్గము - దేశీయ అని యన్వయించినను సంస్కృత కవిత్వము దేశి పద్ధతికి చెప్పుమనుట యేమి? కవులను గూర్చి గదా యీ చెప్పినది - అన్నను కుకవులకు సంస్కృత కవిత్వము చెప్పుట తెలియదు. అది వారికి 'కుమార్గము' దేశి వారికి 'అమార్గము' తెలియని మార్గము. అట్లు అయినను సంస్కృత కవిత్వము చెప్పుటయందభినివేశము వదలని దుర్మార్గకవులు వీరు - అని యీ పద్యమున కర్థము చెప్పినను ఇక్కడ సంస్కృత కవితా ప్రశంసయే యేల? కావుననే సంస్కృత కవితా రచనను గూర్చి కాదనియు, సంస్కృతముతో దేశభాషను గలిపి మణి ప్రవాళపద్ధతిని జెప్పు కవితను యనుటను బట్టి 'మార్గ' కవిత యాతడట్టి కవితను జెప్పు కవులను నిందించుచున్నాడేమో యని తలంపబడినది. కావుననే ''దేశిమార్గములు దేశీ యములు''గన్ జేసి రచింపదలచినాడు. అనగా మణి ప్రవాళపద్ధతిని వదలి సంస్కృత శబ్దములను తత్సమ రూపములుగా జేసి కావ్య నిర్మాణమును దేశభాషా పద్ధతిని చేయవలసినదని యాతని తాత్పర్యమై యుండునని సరిపెట్టుకొనవలసియున్నది.

ఇట్లొక విధముగా సరిపోవచ్చును గాని మును లోకమున వెలసిన దిట్టి మార్గ కవితయేనా? యను ప్రశ్న కలుగును. ఇప్పటికిని మలయాళమున నిలిచియున్నట్లే తెలుగు, కన్నడ ములందు గూడ నొక కాలమున నీ మణి ప్రవాళకవిత సాగియుండవచ్చుననియు, నట్టివారి నత దుద్దేశించెననియు దలంపవచ్చును. ఈ యూహకుగల ప్రధాన కారణమేమనగా కన్నడమున కవిరాజ మార్గకర్తయు, తెనుగున కేతనాదులును, సంస్కృత భాషలోని విభక్త్యంత రూపములు, క్త్వాంతాది శబ్దములు, అవ్యయములు, అరి సమాసములు ఈ భాషలో చొరవని ప్రత్యేకముగా నిషేధించుటయే. దీనివలన వాక్య నిర్మాణము కేవలము దేశీయమే కావలెను గాని మణిప్రవాళ పద్ధతి కుదురదు. ఇట్టి వంతకు పూర్వము ప్రచారములో నుండుట చేతనే యీ లాక్షణికులు నిషేధింపవలసి వచ్చిన దేమో యని ఊహించుట కవకాశము కలిగినది. కాని యిది యొక పద్ధతి.

ఇక కన్నడకవులు దీనిని బ్రయోగించిన రీతిని బట్టియు,

నన్నిచోడుడీ విషయము లందు విశేషముగా కన్నడకవుల ననుకరించెననుట ఎక్కువ సంభావ్యంబగుటను బట్టియు, మార్గ దేశి యనునని రెండును దేశభాషా కవితలలోని రీతి భేదములే గాని, సంస్కృత భాషకు గాని, తత్ప్రయోగమునకు గాని సంబంధించినవి కావని సందేహము వచ్చుచున్నది. ఈ భేదము కవితా విషయముననే గాక సంగీత వైద్య విషయములందు గూడ బ్రయోగింపబడుచున్నట్లు ప్రసిద్ధమే. భరతాది లాక్షణికులచే నేర్పరుపబడిన లక్షణముచే లక్షితమై తల్లక్షణయుక్తమైన సంగీతము నాట్యము మార్గ సంగీతము నాట్యముననియు, నాయా దేశములందు భిన్న భిన్న రీతులు గలవై తత్తద్దేశీయుల కింపుగొలుపుచు, పాడబడుచు, వాడబడుచుండెడి సంగీత నాట్యములు 'దేశి' యనియు నొక విభాగము సంగీత సంప్రదాయ సిద్ధమై యున్నది.

> ''మార్గో దేశీతి తద్ద్వేధా తత్ర మార్గ స్స ఉచ్యతే,
> యో మార్గితో విరించాద్యైః ప్రయుక్తో భరతాదిభిః,
> దేశే దేశే జనానాం యత్ రుచ్యా హృదయరంజకమ్,
> గానం చ, వాదనం, నృత్యం తద్దేశీ త్యభిధీయతే,
> నానా దేశ గతచ్ఛాయా దేశరాగాస్తు తే మతాః,
> కామచార ప్రవర్తిత్వం దేశిరాగత్వ లక్షణం,
> నియమే సతి చేత్తత్ర మార్గత్వ మనులక్షితమ్.''

తోడి, ముఖారి మొదలగు రాగములు శాస్త్రజ్ఞులు శాస్త్రకట్టుగా పాడురీతి గ్రామాదులలో వీధిభాగవతులు, లేదా కీర్తనపరులు మొదలగువారు పాడురీతి కంటె భిన్నమై యుండును. ఇట్లు పాడుటలో గలిగిన రీతి భేదములను బట్టి తోడి, దేశితోడి ఇత్యాదిభేదము లేర్పడియుండును. కేవల శాస్త్రపద్ధతిని పాడు పాటకంటె దేశీయ ఫక్కిని పాడిన పాటయే ఆయా దేశీయులకు ఎక్కువ రంజకంబై యానంద దాయకము కావచ్చును. కావుననే 'దేశి' శబ్దభవమే యనదగు 'దేసి' యను దానికి అందమైన, సొగసైన అను నర్థముకూడ కలిగియుండును.

## దేశి మార్గల నిర్వచనము

ఈ పద్ధతి కవితా విషయమున కన్వయించినచో 'మార్గ' కవిత యనునది లక్షణ యుక్తమైన కవిత యనియు, 'దేశి' యనునది తత్తద్దేశీయ సంప్రదాయ లక్షితమైన కవిత యనియు జెప్పనగును. దేశభాషా కవితను గూర్చి ప్రసంగించునపుడు 'మార్గ కవిత' యను దానికి సలక్షణత్వ మెట్లు కలిగినది అని పరిశీలించినచో, సంస్కృత భాషా సాహిత్య లక్షణానుసారముగ సమకూర్చబడిన లక్షణముచే లక్షితమైన దేశభాషా కవిత్వమని చెప్పవలసియుండును. సంస్కృత భాషా సాహిత్య లక్షణములను బట్టియే, తదప భ్రంశములగు - ప్రాకృత భాషా సాహిత్యములకును లక్షణము లేర్పడినవి.

ఇక దేశ భాషల విషయమన్నచో ఇందు కొంత భేదము కలదనక తప్పదు. ఇవి సహజముగ సంస్కృత ప్రాకృతముల కంటె భిన్నములగుటచే వీనికి భాషా సాహిత్యచ్ఛందస్సంప్రదాయములందును కొంత ప్రత్యేకత, వైలక్షణ్యము కలదు. కాని దేశమున సంస్కృత భాషా సాహిత్యములకు గలిగిన ప్రాబల్యముచేత, సంస్కృత పండితులచే తత్సంప్రదాయములే దేశభాషా సాహిత్యములందును సంక్రమింప జేయబడినవి. ఈ ఉద్యమము, లేదా ప్రయత్నము తొలుత కన్నడ భాషా విషయమున జరిగినది. ప్రాచీనులగు విమలోదయ నాగార్జున సునీతి జయబంధు శ్రీ విజయపూజ్య పాదాదులందరు సంస్కృత భాషా పండితులే. వీరే కన్నడమున దొలుత గద్యపద్య రచనలు చేసినట్లు కవిరాజ మార్గకర్త తెలిపియున్నాడు. వారి పద్ధతి ననుసరించియే కవిరాజమార్గకర్త తద్గ్రంథమును కన్నడమున రచించెను. దండి భామహాదుల ననుసరించి కావ్యలక్షణము, దోషాలంకారరీతీ లక్షణములు కన్నడ భాషలో రచింపబడినవి. అనగా దేశ భాషలోని కవిత సహజ సంప్రదాయములతో నంతకు పూర్వమెట్లున్నను ఆకాలమునకు దండి భామహాద్యాలంకారికులు నిర్వచించిన లక్షణము ననుసరించినదై యుండె నన్న మాట.

మరికొంత కాలమునకు నాగవర్మ సంస్కృత చ్ఛందస్సు నంతను కన్నడ భాషలోనికి దింపినాడు. దేశీయ చ్ఛందమడుగున బడిపోయి, కన్నడమునందలి విశిష్టకవిత్వమంతయు సంస్కృత చ్ఛందోమార్గమును బట్టి శిష్టత్వమును సంపాదించికొనగలిగినది. కథా విషయములు; భారత రామాయణములు, జైన పురాణములు, లేదా సంస్కృత కావ్యముల యనుకరణములు భాష తత్సమబహుళము; దీర్ఘ సంస్కృత సమాసయుక్తము. ఇట్టి భాషాచ్ఛంద స్సాహితీ సంప్రదాయములతో గూడిన (కన్నడ) దేశ భాషాకవితయే ''మార్గకవిత'' యై నెగడినది. అనగా కేవల సంస్కృత భాషా రచితమగు కవిత గాక, తత్సంప్రదాయానుసారమగు కన్నడ భాషా కవిత ఇట్టిదే. పంపాదులు రచించినది ఏతత్సంప్రయానుకరణమననే. తెనుగు కవిత నన్నపార్యునిచే మార్గకవిత యనుమాట ఆంధ్రదేశమున నెలకొల్పబడినది. దానిం బురస్కరించుకొనియే కవిజనాశ్రయచ్ఛందస్సు, కావ్యాలంకార చూడామణి మొదలగు ఛందోలంకార గ్రంథములు తెలుగునను బయలుదేరినవి.

ఇంతకుపూర్వముననో, పరముననో తత్సమ భాషకై ప్రత్యేకముగా రచింపబడినదని చెప్పబడుచున్న ''ఆంధ్రశబ్ద చింతామణి'' సంస్కృత భాషలోనే రచింపబడినది గదా

ఇట్టి 'మార్గకవిత'లో దేశీయ సంప్రదాయములను గూడ పొదిగి 'దేసిగా' చేయడమే దేశి మార్గములను దేశీయములుగా జేయుట యనుటలో నన్నిచోడుని తాత్పర్యమని మనము గ్రహింపవలసియున్నది. ఏలయనగా కన్నడమున పంపకవి కూడ రచనలో దేశి మార్గములను రెంటిని కలిపినచో కావ్యబంధ మొప్పగునని తెలిపియున్నాడు.

''జగపొసదప్పుదాగి మృదు
బంధదొ ళొందువు దొంద దేసియొళ్,
పుగువుదు పొక్క మార్గదొళె
తళ్వుదు తళ్తొడ కావ్యబంధమొ ప్పగుం''—

ఇంతేగాక ఈ 'మార్గ దేసి' పద్ధతులు నాట్య విషయమున నెట్లన్వయించబడు చుండెనో తన గ్రంథముననే మఱియొక చోట చూపినాడు. విక్రమార్జునుని తపస్సును భంగము చేయుటకు వచ్చిన తిలోత్తమ నృత్యమును వర్ణించుచు, నామె నృత్యము (భరతశాస్త్ర) లక్షణానుసారమైన అంగచలన ముతో గూడినది గాకుండుటచే 'దేశి' నర్తనమువలె నతిమనోహరమైనదైనది గాని 'మార్గ' పద్ధతితో చేయికలిపినది కాలేదని 'నరేంద్రతాపసుడు తలంచి'నాడని, కవి యొకచో చెప్పినాడు.

''ఆడద మెయ్‌గలిల్ల నిడుమెయ్‌గళు
మాడిదు వెంతె మెట్టువళ్
నోడిద రెల్లరం పిడిదు మెట్టిద
లిట్టిళమాయ్‌త్తు సిందేని కె,
యూడిదురిల్ల మార్గమెనె
విస్మయమాగిరె తన్నముందెంభం
దాడిద ళా తిలోత్తమె యనొల్దను
మిల్ల నరేంద్ర తాపసం॥

దీనినిబట్టి 'మార్గపద్ధతి' ప్రాచీన లక్షణ లక్షితమైన మార్గమనియు, అది యితర కళలకు గూడ నన్వయింప వచ్చునని తేలుచున్నది.

ఆంధ్రదేశమున తెనుంగు విషయమున చాళుక్యరాజు మొదలగు పలువురు చేసిన దేమి అని విచారించగా, మునుమార్గ కవిత (అనగా సంస్కృతచ్ఛందోలంకార లక్షణ ముతో గూడిన కవిత) లోకంబున వెలయగ 'దేశికవిత పుట్టించి' ఆంధ్ర విషయమున తెనుంగున నిలిపినారని తెలియవచ్చుచున్నది. ఈ చాళుక్యరాజు కొందరు తలంచి నట్లు రాజనరేంద్రుడే యైనచో నాతనికి పూర్వమే ఈ దేశమున సలక్షణమగు తెలుగు కవిత యుండెడి దనియు, నన్నయచే నీతడు వ్రాయించినది దేశికవితయనియు నర్థమ గును. కాని నన్నయ ఆంధ్రభాషా వాగనుశాసనుడై సలక్షణ మగు తెనుగు కవితను భారతమున రచించి చూపినాడని తలంచుచున్న ఆంధ్రలోకము యొక్కయు, తరువాతి యాంధ్రకవుల యొక్కయు భావముల కిది విరుద్ధంబగును. నన్నయ భారత కవితనే 'మార్గ' కవితగా గ్రహించినచో 'దేశి' కవితను అతని తరువాత చాళుక్య రాజులెవరో పు ంచిరనవలె. రాజనరేంద్రుని పిదప 'దేశి' కవితను పు ంచిన చాళుక్యరాజులు కనబడరు. కావున నన్నయకు పూ ్వస్థితినే తెలుపు ఉద్దేశ్యముతో నన్నిచోడుడు వ్రాసెనని తలంపవలసియున్నది. మన మార్గకవిత (కన్నడాదుల యందు) లోకంబున పశ్చిమ దేశమున లేదా ప్రాకృత భాషాలోకమున వెలయగా, ఆంధ్రదేశమునకు బూర్వ చాళుక్యులు వచ్చి స్థిరపడిన పిమ్మట, నాచాళుక్య రాజులు పలువురు దేశికవితను దేశీయ సంప్రదాయ సిద్ధమగు కవితకే రాజావలం బనము పోషణము లేకుండుటచేత దానిని ప్రోత్సహించి, శాసనాదులలో దేశీయ ఛ్ఛందో బద్ధములగు పద్యములను వ్రాయించి చెక్కించి ఆంధ్ర విషయమున తెలుగు భాషను నిలబెట్టిన వారైనారని చెప్పవలసి యుండును.

## నన్నిచోడుని భావము

నన్నయకు పూర్వమున సంస్కృత సాహితీ లక్షణ లక్షితమని చెప్పదగిన తెలుగు కవిత కానరాదు. దేశీయ ఛ్ఛందమున నియమరహితమైన భాషలో కొన్ని శాసన పద్యములేగాని, సంస్కృత వృత్తముల వాడుకగాని, సంస్కృత భాషా సాహిత్య లక్షణములతో గూడిన కావ్యరచన గాని కానరాదు. కావున నీమాత్రపు దేశి కవితను పుట్టించి, దానికి చేయూత నొసగి చాళుక్యరాజులే తెలుగును నిలువబెట్టినారని యాతని భావముగా గ్రహింప వచ్చును.

ఇట్టి లక్షణ సహితమగు తెలుగు కవిత మార్గకవుల కుమార్గము. కష్టమైన మార్గము. దేశి, అనేక రీతులగు సంప్రదాయములు కలదనుటచే అమార్గము. తమకు అయి నను తమకు ఈ రెండు పద్ధతులు కూడ తెలియక పోయినను, మదివదలక, కవిత చెప్పదలచినవారు దుర్మార్గపదవర్తు లనదగుదురు. వారిని స్మరింపకూడదు-అని కవుల నిందించి నాడనవచ్చును. ఉత్తమ మార్గ సత్కవీశ్వరులనగా రెండు పద్ధతులను జోడించినవారని నన్నిచోడుని యభిప్రాయమై యుండును. ఇక నన్నయాదుల కవితలో సంస్కృతభాషా సంప్రదాయములు హెచ్చయి దేశీయ సంప్రదాయములు తగ్గుదల చూపినవను భావముతో గాబోలు - వరకవీశ్వరుడు 'దేశిమార్గములను దేశీయములుగ' జేయవలయునని హెచ్చ రించినాడు. ఈతడు తన కావ్యమున మార్గపద్ధతి నెంత యుత్సాహముతో పోషించి వాడో, 'దేశి' పద్ధతినిగూడ నంత

పట్టుదలతో నెలకొల్పినవాడే. ఈ కారణము చేతనే నన్నయాదుల మార్గముకంటె నన్నెచోడుని మార్గము కొంత వరకు వేరగుట. ఆంధ్ర ప్రబంధ నిర్మాణమునకు, ననేకము లగు నాంధ్ర కవితా సంప్రదాయములకు నీతడే మూలపురుషు డైనను, లాక్షణికులీతనిని గ్రహింపకుండుట, యీ గ్రంథము నకు దేశమున విశేష ప్రచారము లేకపోవుట తటస్థించి యుండును.

## మార్గపద్ధతిలో నిష్ఠ

మార్గపద్ధతి నీతడు నన్నయాదులకంటెను పట్టుదలతో పోషింపదలంచినాడనుట కీతడు కృత్యారంభమున కవితా లక్షణమును గూర్చి, సుకవిలక్షణములను గూర్చి చెప్పిన విషయములే తార్కాణము. అరువది నాలుగు విద్యలను నేర్పు నైసర్గికమై, వాలిన సుకవులకుంగాక కృతులు చెప్పత రము కాదన్నాడు. వన్య కేళీత్యాద్యష్టాదశ వర్ణనల బరిపూ ర్ణంబై దశప్రాణంబుల సప్రాణంబై నవరస భావభరితంబై షట్త్రింశదలంకారాలంకృతంబై రమణీయంబైన దివ్యక థారంభ మున కభిముఖుండై ప్రబంధము సద్రసబంధురంబుగా విస్తరించెదనని ప్రతిజ్ఞ చేసినాడు తత్ప్రతిజ్ఞానుసారముగా నా యా కథా సందర్భములందు నాయా కళల యొక్కయు, శాస్త్రముల యొక్కయు పరిచితిని సలక్షణ సంప్రదాయ సిద్ధంబగు జ్ఞానమును స్వీయ రచనామూలముగా వ్యక్తముచేసి నాడు. కవిత్రయమువారు తమ కవిత యందు ముట్టని బంధగర్భకవిత్వరీతులను గూడ తన ప్రబంధమునందు పొందుపరచినాడు. ఇవి ప్రాచీన సంస్కృత కావ్యములందు ప్రసిద్ధములైయున్నను, తెలుగునందలి కవిత్రయమువారి వలెనే అంతకు పూర్వమున్న కన్నడ భాషా సాహిత్యమున రత్నత్రయమని ప్రసిద్ధిగాంచిన పంప, పొన్న, రన్నకవులు గూడ నీబంధగర్భ కవిత్వమును రచియించినట్లగపడదు. కాని వారికిని పూర్వుడై కన్నడ భాషలో తొలి యాలంకారికు డగు 'కవిరాజ మార్గకర్త' యీ గ్రంథమున చిత్రగూఢ బంధాది కవితారీతులను వివరించి ఉన్నాడు. సంస్కృతాలం కారికులతోను, కావ్యకర్తలతోను నతనికి పరిచయమున్నను కన్నడ లాక్షణిక సంప్రదాయమే ప్రౌఢప్రబంధ రచనా ధురీణుడగు నీతని నాడు చిత్రబంధకవిత్వ రచనకు ప్రోత్సహించి ఉండును.

## వస్తువులో దేశితనము

ఇట్టి నూతన మార్గ పద్ధతులవలంబించినను ఈ దేశి మార్గములను దేశీయములుగా జేయుట కీతడెట్లు యత్నించి నాడు అని మనము పరిశీలింపవలసి ఉన్నది. కథావస్తువు విషయమున కొన్ని విషయముల శివపురాణ కథలను అనుసరించినను, గజాననోత్పత్తి మొదలగు కొన్ని సందర్భ ముల దేశీయ సాంప్రదాయిక కథాసరళి ననుసరించినాడు. వర్ణన సందర్భమున గజకేళి, దక్షుని ధర్మపత్ని యాతని నోదార్చిన విధము (2-4) గణాధీశ్వరులముందు సురవరులు (ఉప్పు పెటిక పోలెలు) పఱచిన విధము, తోళు లెత్తగా మోదుట, గానువున బెట్టి యార్చుట, ముందలకట్టులు కట్టికొట్టుట మొదలగునవి, గౌరి వర్ణనములలోని ''యాంధ్రీ స్తవా పహాసిత్వము'' గౌరీ కపటవటులయు, రతిమన్మథు లయు సంభాషణలు, ఎఱుకుల రేడు-ఆటవికుల జీవనము, విటవిటీయుల చర్యలు అత్తగంతు అల్లరులు, మండలార్చన, మద్యపానము మాంసోపదంశకములు వసంతోత్సవములు, జపక్రీడలు యుద్ధ ప్రయాణములం దన్యుల తిన్నని నవ్వులు, స్కంధావారంబుల వనితల నిట్టూర్పులు, మొదలగు వాని వర్ణనల రచనలో దేశితనమును వ్యక్తము చేసినాడు

## భాషలో దేశీయత

ఇక భాషా ప్రయోగ విషయమున నీతని దేశీయత మరింత ప్రస్ఫుట మయ్యెననుటకు సందేహములేదు. దేశీయపు పలుకుబళ్లు, సామెతలు, జాతీయ ప్రయోగములు, పదబంధ ములు మొదలగు వానిని విశేషముగా బ్రయోగించుటేగాక తన రచనకు దేశీయత్వమును విశేషముగా నాపాదించు తలంపుతో గాబోలును దేశవ్యవహారములో నుండి యప్పటి లాక్షణికులచే గ్రహింపబడని యనేక భాషా రూపములను ప్రయోగించినాడు. వీనిలో కొన్ని వాగనుశాసనుని మార్గపద్ధ తికి భిన్నములై యుండినను దేశీయ వ్యవహార సంప్రదాయ సిద్ధములై ఉండుటచే, దానియందాదరముగల తరువాతి శైవకవులు వాని నవలంబించుచుటచే నిట్టివి శైవకవితా విశేష లక్షణములుగా బరిగణింపబడుచూ వచ్చినవి.

ఆరము, అంజలు, అచ్చరువు, సురంగముగా, అరుణాం బువులు, కలుహారగంధి, హరుషాశ్రుధారలు, పుడమిపుడు, కంటభెటము, కీల్చు, మలరు, సండరంబు, సెరవు, ముడిగలపుట, రాగదీవియలు, కేనము మొదలగు పదముల ప్రయోగము, విశేషణ విశేష్యములకు లింగభేదము, వచన భేదము, కారకమున, అన్వయమున క్రొత్త రీతులుగా గనపడునవియు నీతని రచనలో ననేకములు కలవు. ఇవి యన్నియు నాకాలపు దేశీయ వ్యవహారములోనివై యీతని రచనకు దేశీయతను గలుగజేసినవి.

ఇట్లే దేశి-మార్గ కవితాభేదము నన్నిచోడుడు కన్నడ భాషా సాహిత్య సంప్రదాయ పరిచయముచేతనే తెనుగు కవితలో దెచ్చిపెట్టిన వాడని పై విమర్శవలన తెలియుచున్నది గదా.

ఇంకను కన్నడ సాహిత్య పరిచయము వలన నీతని కవితలో సంక్రమించిన మరికొన్ని విశేష లక్షణములను బరిశీలింతము.

ఈతని ప్రబంధమునందలి యవతారికావిశేష లక్షణము లలో పెక్కు ఈతడు కన్నడ సాహిత్యమునుండి సంగ్రహించి నవే.

1. రచనా పద్ధతి: రెండు భాషలలోను చంపూపద్ధతియే కదా. 2. గ్రంథా రంభమున దేవతాస్తుతి: పంపకవి విక్రమార్జున విజయములో నారాయణ మహేశ్వర, మార్తాండ, మనోజ, సరస్వతీ, దుర్గా, వినాయకులు, రన్నకవి గదాయుద్ధమున - నారాయణ, శంకర, కంజాసన, మార్తాండ, దుర్గా కందర్ప, సరస్వతీ గణనాథులను, నన్నయ హరిహర, గజానన, అర్క, షడాస్య, మాతృసర స్వతీ స్తుతులను, నన్నిచోడుడు - హర, హరి, వాగ్విభు, రవి, గణనాథ, షణ్ముఖ, మార, నగజాత, భారతులను స్తుతించినారు. నన్నిచోడుని కుమార సంభవమున నొక కుమారస్తుతి యధికమైనను ప్రాచీన కన్నడ కవుల దేవతాస్తు తితో సరిపోవుచునే ఉన్నది. నన్నయతో షణ్ముఖస్తుతి సమానముగా ఉన్నను మారమాతృభేదము కలిగినది. వీనిలో స్వల్ప భేధములున్నను ఇందలి విశేషసామ్యము కన్నడకవితా సంప్రదాయానుకారిత్వమును తెలుపకపోదు.

3. పూర్వకవి స్తుతి విషయము: వాల్మీకి వ్యాసులను, బాణకాళిదాసులను రన్నకవి స్తుతించినాడు.

నన్నిచోడుడును వాల్మీకి వ్యాసులను, బాణకాళిదాసులనే గాక, 'కుమార సంభవమ్ము'న హరులీల చెప్పి హరు మెప్పించిన ఉద్భటుని, కిరాతార్జునీయ రచనా రూపమున హరుని మరియొకలీల చెప్పిన భారవిని గూడ స్మరించినాడు. ఇట్లు పురాణకవి సంఘమును స్మరించి, యుత్తమమార్గ సత్కవులను దేశిసత్కవులను సందర్భాను సారముగా సంస్తుతి చేసినాడు.

## 4. కుకవినింద, సుకవి కావ్య ప్రశంస

దీనిని విశేషముగా 'కవిరాజమార్గ' కర్త తొలుత పొందుపర చినాడు. పంప రన్న కవులును తాము రచింపదలచిన కావ్యములందలి విశేష లక్షణములను ప్రశంసించుకొనుచు, గుణదోష వివేచనము చేయజాలని అపండిత - కుకవి జనంబును ఆక్షేపించి యున్నారు.

''అందులోన నొక్కొక్కడు సక్కనైనకృతియుం గృతి యందురే వాని మెత్తురే''

లలితపదం ప్రసన్న కవి
    తాగుణ మిల్లదె పాణ్డుపేల్ద బె
ళ్గళ కృతిబంధమం బరహ
    కాఅర కైగళకేదు, నుణ్ణ
నెగళ్దెప్పళ కదకేదు పేటసిదా
    దర్థదకేడెన పేటుబీగి పా
ట్టలిపి గాకుసువ
    దుష్కవినం కవియెంబలెక్కమే.    (పంపకవి).

''తజ్ఞ్నసంర్గసగు గవితావిశేష
మజ్ఞనందేమి యొఱుగంగనగు సమస్త
కనకవర్ణోత్కరంబొరగంట నొరసి
కాచి కాకెర్గ వచ్చునె సుద్దరాతా''.

''భాషెంగన దక్కనేలిన మహత్వము లోకమునం బ్రసి ద్ధిగా భంగిగ విస్తరించెద బ్రబంధము సద్రస బంధురంబుగాన్''

''పంపనె పేళ్గు మెందు పండిత రెతగుళ్తు బిచ్చటిపెపేటి లొటర్చిదమం''    (పంపకవి)

## 5. కృతిపతి - కృతి సమర్పణము

కన్నడకవులు తమ ప్రభువునకు కృతి యిచ్చినారు. కృతియిచ్చుటయను సంప్రదాయము ప్రాచీన సంస్కృత కావ్య ప్రపంచమున నున్నట్లగపడదు. నన్నయ కూడ భారతమును రాజనరేంద్రునకు కృతి ఇవ్వలేదు. భారత శ్రవణము నందాతనికి గల తాత్పర్యముచే నన్నయ్యను దెనుగున రచియింపు మనగా నాతడా దానిని రచించి ఆతనికి వినిపించెను.

కన్నడకవి పంప సర్వలక్షణ లక్షితయగు కావ్యకన్యకను తన కూతురుగా భావించి కృతిపతికి అరికేసరి కీయదలంచి నట్లు చెప్పినాడు. ఇట్లే తిక్కన తన్ను మామయని పిలిచిన మనుమసిద్ధికి కృతికన్యకన్య నిచ్చినాడు. రన్నకవియు తన ప్రభువగు సత్యాశ్రయ వల్లభుని ఈశ్వరునిగా భావించి యాతనికి గృతి నిచ్చినాడు.

''కృతినెగర్ద గదా యుద్ధం,
కృతిగీశ్వర చక్రవర్తి సాహసభీమం,
కృతియం విరచిసిదనలం,
కృతియం కవిరన్న నెందొడే వర్ణిపుదో''

ఆ సకలార్థ సంయుతమలంకృతి యుక్తముదాత్తకీర్తివి
న్యాసమనేక లక్షణ గుణప్రభవం మృదుపాదమాద వాక్

శ్రీ సుభగం కళాకలిత మొందనెగర్తె యవార్థ కబ్బమం
కూసుమ నీవు దీవుదరికేసరిగల్లద వస్తువుదే.

ఇట్లు కన్నడ కవులు తమ కృతులను కన్యకాభావముతో పతికిచ్చుచుండిరే గాని వారి కాలమునకు సప్తసంతాన ప్రతిష్ఠలు, కృతి వానిలో నొకటియను భావము వ్యాపించి యున్నట్లగపడదు. దేవాలయ తటా కారామా గ్రహారాది పంచవిధ ప్రతిష్ఠలు ఇష్టాపూర్తములలో జేరియున్నవి. వానికి కృతి, పుత్రుడు చేర్చబడుటచే నవి సప్త సంతానములై వెలసినవి. ఇవి నన్నెచోడుని కాలమునకు వ్యాప్తిలోనికి వచ్చియుండుటచే గాబోలు సప్తసంతానములలో కృతి గొప్పదని చెప్పి గురువగు జంగమ మల్లయ పేర కృతి చెప్పి పుణ్యమున్, వరమును దేజమున్ బడయదలచినాడు. తిక్కనార్యుడిట్లే తొలుత తనను మామయని పిలుచు మనుమసిద్ధికి తన కృతికన్యక నిచ్చినాడు. పిదప హరిహరనా థారాధన తత్పరుడై కృతిని సమర్పణ చేసినాడు.

**6.** ఈ కృతి నిచ్చుటలో మరియొక విశేషము: కృతిపతిని కథానాయకునితో నభేదము చేయుట కన్నడ కవితా సంప్రదాయము. పంప రన్న కవులిద్దరు నట్లే చేసిరి. నన్నిచోడుడును వారి ననుసరించెను.

''గురువును నిష్టదైవమును గూర్చి విజేశుడు దాన నాకు'' సకల భువనావతార కారణుడైన పరమేశ్వరు నవతారం బగుటయుం దదంశావతారంబుగా వ్యావర్ణించి నా చెప్పంబూనినకథ' కథ ఈశ్వరుని గూర్చిన కథగావున నీతని గురువీశ్వరాంశావతారంబుగా వ్యావర్ణింపబడినాడు వీరి కభిన్నత్వము చక్కగా కుదిరినది. పంప కథా వస్తువు భారత కథ ఇతిహాసము. కావున ''నీకదెఘోళ్‌తగుళ్చి పొలిపాడె నెగత్తియాడుదు గుణార్ణవ భూభుజనం కిరీటి యోళ్.'' ఈ కథలోని నాయకుడగు కిరీటితో తన ప్రభువగు కృతిపతికి అభేదముచేసి కథ నడుపుదునని చెప్పినాడు. ఆతని వంశ క్రమమును అతని గుణగణమును వర్ణించిన పిమ్మట - నట్టి గుణార్ణవుడగు నాత డర్జునునితో సమానుడే కనుక నాతని కథానాయకుని చేసి కథను నడుపుట కెత్తికొన్నాడు

''ఎనసెందుం పీరవైరి క్షితిపగజఘటా
టోప కుంభస్థలీ భే
దనసుగ్రోద్యాసిభాస్వద్భుజ
పరిఘునారూఢ సర్వజ్ఞనంవై
రినరేంద్రోద్దామ దర్పోద్దళన ఘటననం
నాయకం మాడినంద
ర్జుననోళ్పోల్వీ కథా క్షిత్తియ నమ నయదిం
పేళ లెందెత్తికొండం.''

రన్నకవియు నట్లే 'ఎనిసిదు' అను దానితోనే ప్రారంభించి కథానాయకుని భీమునిగాచేసి తన కృపతిలో నభేదము చేసినాడు.

ఎనిసిద సత్యాశ్రయదే
వనె పృథ్వీవల్లభం కథానాయకనా
గనిలజనోళ్పొలిసి పే
ట్టేనీగ దాయుద్ధమం మహాకవి రన్నం.

ఇట్లే కన్నడ కవులు తమ నాదరించి పోషించిన చాళుక్య ప్రభువుల పరాక్రమాది గుణవిశేషములను గీర్తించి కావ్యరూప మున చిరస్థాయి చేయవలయునను తలంపుతో పూర్వప్రసిద్ధి గల పురాణకథనే గ్రహించి అందలి నాయకులతో వీరికి నభేదము కల్పించి యా పురాణకథనే వీరికథవలె నడిపించి నారు.

చారిత్రకేతిహాస పురుషుల నొక కథలో ముడిపెట్టి నడిపింపబడిన యీ కన్నడ సాహితీ ఫక్కియే తెలుగు సాహిత్యమున మహేశ్వరునకు, మతగురువునకు నభేదము కల్పింపదలచి నన్నిచోడ ప్రభువుచే నవలంబింప బడినది.

ఇట్లే కథానాయక కృతిపతుల యభేద కల్పనము మూలమున నీ సాహిత్య రచనలలో మరియొక విశేషముకూడా నేర్పడినది.

**7.** ఈ ప్రబంధములో తొలి అశ్వాసములోని తుది పద్యమునందలి విశేషణపదములకును మలి యాశ్వాసము లోని తొలి పద్యమునందలి విశేషణమునకును సమాన విభక్తికత్వము సమకూడు చుండుటయే యీ విశేషము. తెలుగు గ్రంథములలో నిట్లు లేక కృతిపతి సంబోధన లుండుట యాచారమగుటచే అనగా గ్రంథము నా కృతిపతికి నన్నయ రాజనరేంద్రునకి వినిపించినట్లుగా రచించుటయే సామాన్యాచారమగుట నిదియొక విపరీత పద్ధతిగను, విశేషము గను గ్రహింపబడినది. కాని కృతిపతికిని కథా పురుషునకు నభేదమే కల్పించినపుడు, సౌకర్యమున కాశ్వాస విభాగము చేయబడినను కథను వినిపించువాడు, వినువాడు లేడు గనుక కృతిపతి కథవలెనే కథాభాగమంతయు నడువవలె గదా. కావుననే కథా భాగము నందలి యానుపూర్వికి విచ్ఛేదము లేకుండుటకుగా వెనుకటి యాశ్వాసాది పద్యము నుండి కథ ముందటి యాశ్వాసాది పద్య విషయముతో గలిసియే సాగుచుండునట్లు రచింపవలసినదైనది. ఆ దృష్టి ఇదివరలో మన కంతగా లేకపోవుటచే నిదియొక క్రొత్త ఫక్కీగా పొడకట్ట

సాగినది. కాని నన్నయకు పూర్వమున గల కన్నడ సాహిత్యరీతులను బరిశీలించినచో నిది దాని యనుకరణమే యని తెలియకపోదు. తిక్కనా చార్యుడీ పద్ధతినే తన తొలి గ్రంథమగు 'నిర్వచనోత్తర రామాయణమున' నవలంబించి నాడు. కాని యాతడిద్దాని నేయుద్దేశముతో నవలంబించినాడో తెలియరాదు.

## తిక్కన భావము

''దినకరాన్వయ తిలకంబగు మనుమనృప వీర్యవితరణ రూప వివేక మహిమ'' గుర్తింప దలచిన దగుటచే నీతనికి దినకరాన్వయతిలకంబే యగు ధీరోదాత్తనృపోత్తముండగు రామనరపాలునితో సామ్యమునుద్దేశించియే యా కథ గ్రహించి నాడనియు దలంపవచ్చును. 8, 9, 10 అశ్వాసాదులందలి పద్యములలో మనుమ భూమీశుని ప్రథమాంత విశేషణము లలో వర్ణించి తరువాతి కథాభాగమున శ్రీరామచంద్రుడిట్లు మహారాజ పదస్థుడైన అని కథానాయకుని ప్రథమాంతముననే యెత్తికొనుటచే తిక్కనార్యునుద్దేశ మూహింపదగినదగుచు న్నది మరల గ్రంథాంతమున రామచంద్రుడు పుత్రసహి తుండై నిజనగరంబు జొచ్చు సందర్భమునందలి కథాభాగవ ర్ణనమంతయు మనుమసిద్ధి రాజ్యభ్రష్టుడై తిరిగి రాజ్యంబు జొచ్చుటను మనమున నిడుకొనియే చేసెనా యనిపించును. ఈతడు రామచంద్రుని వలెనే ''తన కన్నప్రజయకాం గైకొని భూప్రజనెల్లనొక్క కొఱతయులేకుండ నడిపి పాలించుచు నమ్మనుజేంద్రుడు పూజ్యరాజ్యమహిమాన్వితుడై'' యుండును. ''కుమార సంభవమున నుమామహేశ్వరులు కుమారున కనేక వేదశాస్త్రాగమ పురాణేతిహాస కథా బృహత్క థావేదికలందు బారంగతుని జేసినట్లే'' రాముడు నిచ్చట కుశలవులను భరత వాత్స్యాయనాది నాగరికశాస్త్ర కళాభ్యాస ముల యెడల బ్రాశస్త్యము వహింపజేసి 'శస్త్రాద్యుత్తమ' బాణవిధములుపదేశించెనట. 'రాఘవుడు మహోన్నతిన్' ధారుణి నేలినట్లే మనుమ సిద్ధియు 'పండిత నిత్యస్తుత్య లక్ష్మీశుడుర్విన్' యేలెనని చెప్పుటే యాతని యుద్దేశమను టకు సందేహము లేదు. కాని కుమార సంభవమందు వలె అతుకు మాత్రము అంతసరిగా కుదుర లేదు.

మనుమసిద్ధియెడ నీతనికి ప్రభుభావము లేదు. గురుభా వము లేదు. అతడీతనిని మామవరుసతో బిలుచు చుండు టను పట్టి యాచనవుచే ''భారతీకన్యక'' నాతని కిచ్చెను. కావున నీ కృతిపతిని రామాయణ కథానాయకునిచో నభేదముచేసి కథ సాగింపవలసిన యావశ్యకత యాతనికి గలుగలేదు. అట్లు చేయదలచినట్లు చెప్పనూలేదు. కావున ఈ నియమము అతడు రచనయందు కన్నడ కవుల రీతినో, నన్నెచోడుని రీతినో చూచి యవలంబించినదై యుండును.

## కేతన పద్ధతి

వారివలె కృతిపతిని కథానాయకునితో నభేదము చేసినట్లు చెప్పక పోయినను, ఈ తిక్కనార్యునకు గృతియిచ్చిన కేతనయు దశకుమార చరిత్రలో నీ నియమమును బాటించి నాడు. కాని, యాగ్రంథమునకు దీనికి ప్రత్యేక ప్రయోజనము గాని, ఉద్దేశముగాని యున్నట్లగపడదు. దేవతాస్తుతి విషయ మున హరి, హరా, జ, గజాన, నార్క, షడాస్య, మార, భైరవీమాతలను గొల్చు నాచారము వలెనే యీ నియమము నొక యాచారముగా బాటింపబడినట్లున్నది. కథ దశకుమా రుల చరిత్ర. రాజవాహనుడు నాయకుడు. ఆ నాయకునికి నీతనికి నభేదకల్పన కవకాశమూ లేదు. అట్లీతడు చేయనూ లేదు. తొలియాశ్వాసమున బ్రబంధ ముఖమండనంబుగా నమ్మహాత్ము (తిక్కన) వంశావతారము వర్ణించి, తుదకాతని గుణములను షష్ఠ్యంత పద్యములతో గీర్తించుచు నాశ్వాస మును ముగించినాడు. రెండవ యాశ్వాసమును షష్ఠ్యంత కందపద్యముతో ప్రారంభించి, 'అట్టి తిక్కనా మాత్యునకు అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా చెప్పంబూనిన' కథాని కాయ బను సురలతా జాలం బెట్టిదనినో అని తన కథానికాయమును సురలతా జాలంబుతో బోల్చికొని, ఆ సురలతా జాలంబునకు కందంబైన కుసుమ పురంబున కధీశ్వరుడు రాజహంస మహీవల్లభుడని అతని వృత్తాంతము మొదలు గాగల దశకుమారుల చరిత్రను గూర్చిన కథా ప్రణాళిక నంతను చెప్పి, ''యా కథ నాకర్ణనీయంబుగా నభివర్ణించెద'' అని కథా కథనము లోనికి దిగినాడు. ఇట్లే ప్రథమ ద్వితీయాశ్వాసములలో మాత్రము తిక్కనామాత్యున కభ్యుదయ పరంపరాభివృద్ధిగా నీ కథ నభివర్ణించెదనని చెప్పుట మూలముగా షష్ఠ్యంత విభక్తులకు సందర్భము కల్పించిన వాడైనను, తరువాతి యాశ్వాసములలో నట్టి సందర్భ మేమియు కుదిరియుండలేదు. ఐనను విభక్తి నియమమును మాత్రము పాటించుచు నా కథా సందర్భమున కావశ్యకములైన విభక్తులలోనే తిక్కనామాత్యుని గుణవర్ణన మును చేయదొడంగినాడు.

ఈ నియమమును పాటించిన తరువాతి కవులలో మంచన, కొరవి గోపరాజు అనువారు కలరు. గోపరాజు తన ''సింహాసనద్వాత్రింశిక''ను తిక్కనవలె హరహరనాథునకు అంకితము చేసెను. ఇట్లు చేయుట కొక కారణము కలదు. పై కథలకు గారణము - అనగా వానిని చెప్పినవాడు - అంబికారమణుడు, తనకు కవితా సంపత్తి సంధాయకుడు లక్ష్మీనాయకుడు. వీరిలో ఒకరిని దలంచుకొనుచు భోజుడు

సింహాసన మెక్కఁబోయినట్లు వర్ణించుటచే నాశ్వాసాంతముల ద్వితీయాంత విశేషణ రచన మావశ్యకమైనదీ కవికి.

ఇట్టి నియమము యొక్కఁ మతాల తత్త్వము తెలిసియో తెలియకయో కొందరు తొలికవులు దీనిని పాటించిరిగాని, తరువాత కవులు దీనిని పాటింపలేదు. ఆశ్వాసాద్యంతముల సంబోధనాంతముల రచనయే యాచారమైనది.

## నన్నిచోడుని నియమము

8. ఈ సందర్భమున ''నా చెప్పంబూనిన కథా మాత్రం బెట్టిదనిన'' అని ''సతిజన్మంబున్ గణాధీశ్వర జననము ఇత్యాది (1-68) కథాంశమునే కరువుపెట్టుటకూడా పంపాదుల రచననుండి గ్రహించినదే కావచ్చును. కాని 'పంప' యీ పట్టికను గ్రంథాంతమున నిచ్చినాడు''. ''ఈ దివ్య కావ్యాంగనా సృష్టికి సృష్టికర్తయైన'' - ''దక్ష ప్రజాపతి'' అని నన్ని చోడుడు కథ ప్రారంభింపగా, కేతన 'కథానికాయం బును సురలతాజాలంబుతో బోల్చి - - దానికి మూలకందం బగు కుసుమ పురంబె' అని యీ రీతిని కథా ప్రణాళికనంతను తెలిపియున్నాడు. నన్ని చోడునిరీతి ననుకరించు దృష్టిమాత్ర మిందు పొడకట్టు చున్నది.

## కృతిపతి గుణవర్ణనము

9. కృతిపతి గుణవర్ణనము కన్నడ కావ్యములలో విశేషముగా గలదు. కావ్యరచనలో వారి ప్రధానోద్దేశమే యిది. కథానాయకునితో నభేదము చేసినప్పుడు అతని యందలి గుణముల న్నియు నీతని కారోపించి వర్ణించుటే గాక గ్రంథనామముననే అతని ప్రధాన గుణమును దెలుపుచు ''విక్రమార్జున విజయ''మని ''సాహసభీమ విజయ''మని రచించిరి. నన్ని చోడు డిట్లే కథానాయకుడు శ్రీశైల మల్లికార్జున రూపుడు నగు నీశ్వరుని గుణములు జంగమ మల్లికార్జున గురువు నం దారోపించి శ్లేషచే వారి యభేదమును సాధించి, యా గురు గుణవర్ణనమును షష్ఠ్యంత కందపద్యాష్టకముచే ఒనర్చి అతనికి పరమభక్తి యుక్తి నావర్జిత హృదయుడై, కథను వర్ణించినాడు. ఇట్లు అతనికి 'భక్తియుక్తి నావర్జిత హృదయు డైన' సందర్భముననే షష్ఠ్యంత పద్య రచన మావశ్యకమైనది. ఈ పద్ధతినే భారతమున తిక్కనార్యుడు నవలంబించినాడు. ''అతనికినది యారాధన విశేషం మగుటచే నామావళీపూజ వలె నావశ్యకమైనది. ఇదియే 'తరువాతి కవుల రచనలలో నొక యాచారముగా బరిణమించినది. నన్నిచోడు డెనిమిది కంద పద్యములు రచించినాడు. దేశీయములగు నుదాహరణ గ్రంథములలో నెనిమిది విభక్తులలో బద్యములు రచించు సంప్రదాయముకూడ దీనికి ప్రోత్సాహకమేమో!

## కవివంశ వర్ణన

కృతికర్త వంశవర్ణనాదికము ప్రాచీన సంస్కృత కావ్యము లలో దరచుగా గానరాదు. కన్నడకవుల రచనయే తెలుగుకవు లకు మార్గదర్శి కానోపును. పంపకవి యీ స్వీయవంశ చరిత్రాదికమును కథావిషయముల బట్టికయు గ్రంథాంతిమభా గమున జేర్చినాడు. తాను వెంగిపఱునందలి విక్రమపురా గ్రహారమునందలి శిష్టకులమున జనించినవాడననియు, జినధ ర్మమును గ్రహించితిననియు అరికేసరి తనకు ధర్మపురమున అగ్రహారముగా నిచ్చెననియు మొదలగు విషయములను జెప్పినాడు. తెలుగుకవులు అవతారికలోనే తమను కృతిపతి కర్పూర తాంబూలాదుల నిచ్చి బహూకరించి తనకు గృతియిమ్మని యడిగినట్లు వ్రాయుచుందురు. గ్రంథాంత మున తనవంశాదికమును జెప్పికొని, పంపకవి తాను రాజధాని పట్టణమగు పులిగెఱె తిరుళ కన్నడమున కవిత చెప్పుచున్నా నని, తన యీ సమస్త భారతము, ఆదిపురాణము అను గ్రంథములు పూర్వకావ్యముల నన్నిటిని తొక్కివేయునని చెప్పికొన్నట్లే, కవిరాజ శిఖామణియు ''పాత్రుడ...వివేకాబ్జ జున్'' అని తనవిశిష్ట గుణములను జెప్పికొని ''సరళముగాగ భావములు జానుదెనుంగున నింపు బెంపుతో బిరిగొన''వర్ణనలె ల్లచో వర్ణన కెక్కఁగ, దేశి మార్గముల దేశమార్గములగా నాదరించి, విని బుధులు నెమ్మనముల నిధులు నిలుపవలవదే అని తన కావ్యమును ప్రశంసించుకున్నాడు గ్రంథాంతమున స్వస్తి వాచకమున.

## గ్రంథాంత విశేషములు

కుమారసంభవ గ్రంథాంతమున సామాన్యముగా నితర తెలుగు ప్రబంధములలో గానరాని విశేషములుకొన్ని గలవు. గ్రంథమాచంద్రార్కఁముగా నిలచుండుగాక యనునాశంసన యుండును. దీనిని నన్ని చోడుడును అనుకరించినాడు.

ధ్రువమై జంగము మల్లికార్జున మునీం
    ద్రుం బేర్మి బేర్కొన్న స
త్కవిరాజోక్త కుమార సంభవ మహా
    కావ్యంబు భూభూధరా
సవిలాసస్థితి నుందు నంతనిల నా
    చంద్రార్కమై యుండెడున్.

మఱియు, ధీరతభూమి గభీరతవారిధి తేజమువహ్ని బలంబనిలం.

...... సదాశివు నెన్మిది మూర్తులు జెల్వారగ నిచ్చుచు నుండెడు మర్థి నహర్నిశముం శివ భక్తులకున్''

ఈరీతి రచనయే పంప భారతము తుదిని గలదు.

''......మార్గిగళీశ్వర నుదారగుణ కవితానకళావనీతళ, కద పెనఖుక్కెన్ భృత్య నివహక్కె చతుర్గణికా జనక్కె కుంద దెనలే పెలసుగె భువనక్కె మేదిని యకృతి బంధ''

''చలదోళ్ దుర్యోధనం, నం నియెళిన తనయం, గండినొళ్ భీమసేనం.

...... నిర్మలచిత్తం ధర్మపుత్రం మిగిలి వర్గళి నీ భారతంలోక పూజ్యం''

ఇక నీ గ్రంథము వ్రాసిన వారికి చదివిన వారికి విన్న వారికి ఫలము-

జ్ఞానదీపంబు, హృత్సదనంబులో దాన, దీవియగా నెత్త, దివురువారు.........

వెలయ చమత్కృతి సదువుదు, వినుదు వ్రాయు డీశ్వరాంబికా గుహు లిత్తు రీప్సితములు...... .''

ఇదియు పంపకవి చూపిన మార్గమే.

''కరమట్కిర్తున్ సమస్త భారతకథా
సంబంధ మంబాజిస
ల్ప రెయల్ కేళతోడ చ్చుర్ వంగమిద
తెళ్తన్నిష్టవప్పం నము
త్తర మక్కుంధృతితుష్టిపుష్టి విభవం
సౌభాగ్య మిష్టాంగనా
సురతం కాంతియగుంతి శాంతి విభవం
భద్రం శుభం మంగళం''

ఇది యాతని గ్రంథమున తుదిపద్యము. మంగళశబ్ద ముతో గ్రంథము ముగించినాడు. మన నన్నిచోడుడును 'మంగళ మహాశ్రీ' శబ్దముతో గ్రంథమును ముగించుచు, 'మంగళమహా శ్రీ శబ్దముతో నా పద్యమును గూడ ముగించినాడు.

''భూవినుతుడార్యజన పూజితుడు... యీా వసుధ కిష్టతతి కిష్టఫలయక్తముగ నిచ్చు దయ మంగళ మహాశ్రీ.''

తరువాతి ప్రబంధములలోన గానరాకున్నను తొలియుగ కావ్యముల గొన్నింట నీ ఫలశ్రుతి గానవచ్చుచున్నది. భాస్కర రామాయణమున యుద్ధకాండ చివర ''ఈ రామాయణ సంహిత, సారమతిన్ వినిన వ్రాయ చదివిన దురితా, పారజలరాశి గడతురు, ధీరులు ధర్మార్థ కామ దీపితవృత్తిన్.'' ''ఎవ్వడెర్ధిగోరి యిక్కథవిను వ్రాయు, నతడదియ పడయు నర్థితోడ'' అమర హుళుక్కి భాస్కర మహాకవి చెప్పగ నున్న యుద్ధ కాండము తరువాయి చెప్పె.......'' అయ్యలార్యుడు గృతస్థితి నార్యులు మెచ్చున ట్లుగా హిమకర తారకారవి మహీవలయస్థిర లక్ష్మి చేకురన్.''

తిక్కనార్యుడే కర్ణ పర్వాంతమున ''ఈ క్రతువు విష్ణుమ యంబిది నిర్వహించి రర్జునుడును గర్ణుడును సమర రూపము. నందగ నీ ప్రబంధ మింపానర బఠించినన్ వినిన నొందు నరుండు జిర సౌఖ్య సంపదల్'' అని ఈ కర్ణపర్వము నొక ప్రబంధముగా దెల్పి, ఫలశ్రుతి కూడ జెప్పినాడు. ఇంకను భారత కథ యుండగా నిచ్చట ఫలశ్రుతి చెప్పుటకు గారణమేమో! భారత శేషమును ప్రబంధముగా రచింప బూనినట్లు తొలుత జెప్పినాడు. కనుక యీ ఘట్టము నొక ప్రత్యేక ప్రబంధముగా నెంచి యట్లు రచించినాడన వచ్చు నేమో.

శృంగార నైషధము తుది శ్రీనాథుడును ఫలశ్రుతి దెలిపినాడు. ''ఈ భాషా నైషధ కావ్యంబు సింగనామాత్య నీవు కృతి నాయ కుండవుగా పుణ్య శ్లోకుండు నలుండు కథానాయకుడుగా విలసిల్లు నాచంద్ర తారార్కంబు.

''నైషధ శృంగార కావ్యంబు, దెలియ జెప్పితి నాంధ్ర, దేశ భాష నిమ్మహా కృతి బఠియించు నెవ్వడేని ఆత డపగత కలి దోషుడగుచు గాంచు నాయు రారోగ్య విమల విద్యా వివేక భాగ్య సౌభాగ్య వైభవ ప్రాభవములు.

తిక్కన శ్రీనాథులు గ్రంథమును పఠించుటయే గాని వ్రాయుటలో గల ఫలమును గూర్చి పేర్కొన లేదు. మొత్తము మీద నీ సంప్రదాయము దేశ భాషలలో కన్నడ కవుల కాలమునుండి వచ్చుచున్నదనియు, నన్నిచోడుడు వారి కవితలను జూచియే రచించి ఉండుననియు తలంప వలసి ఉన్నది.

# ఆంధ్రకవుల అవతారికలు

ఆంధ్రకవుల గ్రంథములలో అవతారికారచన మొక విశేషలక్షణముగా గనబడుచున్నది. మంగళ శ్లోకము, లేదా పద్యము, దేవతాస్తుతి, పూర్వకవిస్తుతి, కవితాలక్షణము, కుకవి నింద, సుకవి ప్రశంసం, కృతిపతి ప్రశంస, షష్ఠ్యంతములు మొదలగునవి ఆయాకవుల కవితాలక్షణోద్దేశాదులను, దేశకాలపరిస్థితులను, చారిత్రకాంశములను గూడ కొంతవరకు దెలుపగల విశేషములతో గూడినవై యుండుట సామాన్యముగా గాననగును. సుప్రసిద్ధములగు ప్రాచీన సంస్కృత కవుల కావ్యములలో నిట్టివి విశేషముగా గనబడకపోవుటనుబట్టియే యాంధ్ర కవుల రచనలలో వీనిని విశేషలక్షణములుగా గ్రహింపవలసివచ్చుచున్నది. ఆదికవియగు వాల్మీకిగాని, ప్రాచీనకవులగు కాళిదాసాదులుగాని యట్టి గ్రంథావతారికలను రచించినట్లగపడదు. ఆదికావ్యమగు రామాయణము -

''తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరం,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవం.''

అను వస్తునిర్దేశపూర్వకమగు శ్లోకముతోడనే ప్రారంభింపబడిన ట్టగపడుచున్నది కాని యిది వాస్తవముగా వాల్మీకి రచించిన ప్రారంభశ్లోకమేనా, లేక తరువాతివారెవరైన చేర్చిన యవతారికాభాగశ్లోకమా యను సందేహమునకు తావు లేకపోలేదు. ఏలయనగా నిది గ్రంథరచనా ప్రారంభమునకు బూర్వము జరిగిన విషయమునుగూర్చి-అనగా వాల్మీకికి నారదుడు రామాయణ సంక్షేప కథను దెలుపుటను గూర్చి- చెప్పుచున్నది. వాల్మీకి నారదుని నడిగినట్లు ప్రథమపురుషలో రచింపబడియున్నది. తెనుగున భారతమును రచించిన నన్నయభట్టు ''తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుడయ్యె''నని ప్రథమపురుషలో జెప్పకొనలేదా యనియు, అతడు దీనిని చూచియే యట్లు చేసెనేమో యనియు దలంపవచ్చును. కాని మొదటి యీ నాలుగుసర్గలలో జెప్పబడిన వృత్తాంతమంతయు రామాయణ రచనా ప్రారంభమునకు బూర్వము వాల్మీకి జీవితమున జరిగిన విషయములను గూర్చి చెప్పుచున్నది. నారదనిర్గమనానంతరము వాల్మీకి తమసాతీరమునకు బోవుట, క్రౌంచదర్శనము, భర్తకై యేడ్చుచున్న క్రౌంచ పక్షిని జూచి 'మా నిషాద' శ్లోకరచనము, బ్రహ్మ ప్రత్యక్షమై శోకము 'శ్లోకబద్ధ' మైనదని చెప్పి రామచరితమును చెప్పుమని హెచ్చరించుట, అతని ప్రభావముచే రామాయణకథ నంతను ఆగతానాగతములను యోగశక్తివలన ప్రత్యక్షముగ దర్శించుట, చతుర్వింశ సహస్ర శ్లోకములు, 500 సర్గలు, ఆరు కాండలు గల గ్రంథమును 'సభవిష్యం సహోత్తరం'గా రచియించుట, వేదోపబృంహణార్థమై దీనిని కుశీలవులచే గ్రహింపజేసి రాముని యెదుట తంత్రీలయ సమన్వితముగా పాడించుట మొదలగు విషయములతో గూడిన తొలి నాలుగుసర్గలును రామాయణకథావతారికగా తరువాతి కాలమున రచింపబడినవై యుండవచ్చును. అట్లే యైనచో తొలుత వ్యాసులు వ్రాసిన 'జయ' మను మూల భారత గ్రంథము తరువాత చేర్పుకూర్పులతో మహాభారతమైనట్లే రామాయణమునకు గూడ నీ యవతారిక తరువాతికాలమున జేరిన దనవలసియుండును మొదటి 4 సర్గలలోను కవిని గూర్చి చెప్పబడిన విశేషణములు-''ఏవ ముక్తో భరద్వాజో వాల్మీకేన మహాత్మనా''; ''దదర్శ భగవాం స్తత్ర క్రౌంచయో శ్చారునిస్వనం''; ''స మునిపుంగవః''; ''వాల్మీక యే మహర్షయే సందిదే శాసనం తతః;'' ''అనాగతంచ యత్కించి ద్రామస్య వసుధాతలే, తచ్చకారో త్తరే కావ్యే వాల్మీకి ర్భగవాన్ ఋషిః'' ఇత్యాదులు - వాల్మీకి స్వయముగా రచించినవేనా యను విషయమున సందేహము కలిగించక మానవు ఐదవ సర్గలో ''ఇక్ష్వాకూణా మిదం తేషాం రాజ్ఞాం వంశే మహాత్మనాం, మహదుత్పన్న మాఖ్యాతం రామాయణ మితి శ్రుతం.... కోసలోనామ ముదితః స్ఫీతో జనపదో మహాన్, అయోధ్యానామ నగరీ తత్రాసీ ల్లోకవిశ్రుతా'' అను శ్లోకములతో రామాయణ కథాప్రారంభము జరిగినది. ఇక్కడనుండియే వాల్మీకి రచన ప్రారంభమగు ననదగునేమో. ఎట్లయినను ఆదికావ్యమగుటచేతనేమో, మంగళశ్లోకాదికము కూడ లేకయే వస్తునిర్దేశపూర్వకముగనే యీ గ్రంథము ప్రారంభమైన దని చెప్పనొప్పును.

ఇక కాళిదాసు కుమారసంభవ మేఘసందేశములను వస్తునిర్దేశముతోడనే ప్రారంభించినాడు. రఘువంశమున మాత్రము పార్వతీ పరమేశ్వరులకు మ్రొక్కి ''పూర్వసూరి కృతమార్గమున'' ''రఘూణాం అన్వయం వక్ష్యే తనువాగ్విభ

వొపి సన్'' అని తన వినయమును దెలుపుకొన్నాడు. భారవి, మాఘకవులుగూడ వస్తునిర్దేశముతోడనే తమ గ్రంథములను బ్రారంభించినారు మంగళాచరణావతారికలు లేవు.

ఇట్లు ప్రసిద్ధులగు ప్రాచీన సంస్కృత కావ్యకర్తల గ్రంథము లలో-ప్రధానముగా పంచకావ్యములని ప్రసిద్ధిజెందిన వానిలో నాల్గింట అవతారికా రచనావిశేషములు లేక యుండగా, పెక్కువిషయముల వాని ననుకరింప యత్నించినవా రనదగిన ఆంధ్రకవుల రచనలలో నివి యెట్లు పొడసూపి పెరుగుచువ చ్చిన వను విషయ మాంధ్రసాహితీ పరులకు పరిశీలింపదగి నది కాకపోదు. ఇంతేకాక ప్రాచీనకావ్యములు కేవల పద్య కావ్యములై యుండగా తెలుగుభాషలోని తొలికవిత గద్యపద్య సంమిశ్రితమైన దగుట కూడ మరియొక విశేష మనదగును! నన్నయకు బూర్వ మాంధ్రకవితారచనలు మనకు విశేష ముగా గోచరింపకుండుటచేత నాంధ్రమున నాదికవులుగా నెన్నబడుచున్న నన్నయాదుల రచనామార్గము లెట్లేర్పడి నవో తెలిసికొనుట కాధారములు కానవచ్చుటలేదు. ఇటీవల బయలువడిన ప్రాఙ్నన్నపార్యయగమునందలి శాసనాదులను బట్టి భాషాపరిణామ రీతులు, పద్యరచనా పద్ధతులు, ఛందోవిశేషములు మొదలగువాని విషయమున కొంత విశేషజ్ఞానము లభించుచున్నను, సాహిత్యలక్షణములను గురించి తెలుపు నాధారము లేమియు బయలువడ లేదు. కావున సన్నిహితభాషాసాహిత్య లక్షణములను బరిశీలించి వానితో బోల్చిచూచుటయే మన మవలంబింప దగిన ముఖ్యమార్గము. సాహితీమార్గముల విషయమున మనకు విశేషముగ దోడ్పడగలయది మన దేశమునకు సమీపమందు గల కన్నడదేశ భాషాసాహిత్యమే

కన్నడాంధ్రములకు చిరకాలమునుండి విశేషముగా పొత్తు కలదు ఇవి హిందూ దేశ మధ్యభాగ మనదగు 'దక్షిణాపథ' భాగము నాశ్రయించిన వగుటచే నింకను దిగువనున్న తమిళభాషకంటె నెక్కువగా నార్యభాషాప్రభావమునకు లోనై నవి. క్రీస్తు శకారంభకాలమున నాంధ్రసామ్రాజ్యమునకు స్థానములై వారి యేలుబడిలో నుండుటయేకాక, తరువాతి కాలమునగూడ రాజకీయార్థిక వ్యావహారిక విషయములలో పరస్పరసంబంధము కలవైయుండినవి. పడమటి దేశపు కొండలలో పుట్టి దేశమధ్యభాగమున బ్రవహించి తూర్పున రత్నాకరుని జేపట్టవచ్చిన కృష్ణాగోదావరీ తరంగిణులే యీ రెండు దేశముల సంబంధమునకును గారణములైన వనవ చ్చును. చాళుక్యరాజుల కీదేశములతో గలిగిన రాజకీయసం బంధము సాహితీరంగమునందలి సంబంధమునకుగూడ దోడ్పడినది. ఆకాలమున నాంధ్రదేశ మార్యభాషా మతవిజ్ఞాన ములను విశేషముగ నాదరించిన దగుటచే జైన బౌద్ధ మతాభిమానులగు కవులు, పండితులు కన్నడ రాజ్యము నాశ్రయించినవా రైనారు. ఆర్యమత విజ్ఞానములకు సంస్కృత భాష మూలస్తంభముగావున, తద్భాషాసాహిత్యముల నభ్యసిం చియు, తద్భిన్నమతావలంబులగుటచే జైనులు బౌద్ధుల దేశభాషాసాహిత్య మార్గముల నవలంబించి రచనలు గావించి దేశీయుల యాదరమును బడయజూచుటలో నాశ్చర్యము లేదు. కావుననే దక్షిణాపథమున తూర్పుదేశభాగమగు నాంధ్రదేశమునందు కంటె పశ్చిమదేశభాగమగు కన్నడదేశ మున తొలుత దేశికవితకు ఎక్కువ ప్రోత్సాహము లభించినట్లు న్నది. ఆ భాషలో తొలికవులని కీర్తింపబడు పూజ్యపాద సమంతభద్ర కవిపరమేష్ఠి దుర్వినీతాదులు జైనమతావలంబ కులు. వీరికి నాశ్రయభూతులైన కదంబ రాష్ట్రకూటరాజులు కూడ జైనమతావలంబకులే. ఆంధ్రదేశమున శాలంకాయన విష్ణుకుండిన వంశీయుల కాలమున-అనగా చాళుక్యరాజుల పరిపాలనకు బూర్వము రాజాస్థానములందు సంస్కృత ప్రాకృతములకు గల గౌరవము దేశభాషయగు తెలుగునకు గలుగలేదు. కుమారిలాదుల ప్రచారమువలన రాజాస్థానము లందు వైదికమతమందు గల యభిమానము జైనబౌద్ధము లందు లేకయుండును. కావుననే యీ దేశభాషయందు రచనలను సాగింపబూనుకొనిన కవులును లేకపోయిరి. కన్నడదేశమున తొలుత దేశభాషలో గవితారచనకు గలిగిన ప్రోత్సాహమునుబట్టి, చాళుక్య రాజులు తూర్పుదేశము నాక్రమించి నెలకొనిన పిదప, నీ దేశమున గూడ దేశభాషాకవి తను ప్రోత్సహించి కొన్ని శాసనముల నందు వెలయింప మొదలిడిరి. ఆ తొలికాలమునందలివి మన కిప్పటికి లభించినవానిలో నన్నియు గద్య మయములే. తెలుగులో పద్యమయశాసనములు రచింపబడిన కాలమునకు పూర్వమే దుర్వినీతాదుల కన్నడకాదంబర్యాది గ్రంథములే రచింపబడి నట్లు తెలియుచుండుటేకాక, సంస్కృతవృత్తములలో దీర్ఘ సమాసములతో గూడిన భాషలో రచింపబడిన శాసనములే మన కిప్పుడు గానవచ్చుచున్నవి సుమారు క్రీ.శ. 650 ప్రాంతపు కన్నడశాసనము-

''శ్రీ భద్రవాహుసచంద్రగుప్త
మునీంద్రయుగ్మది నొప్పెవల్
భద్రమాగిద ధర్మమందు
మళిక్కె నందినిసల్కలో'' (ఎపి. కర్నా ॥ 31)

క్రీ.శ. 700 ప్రాంతము-

''సురచాపంబోలె విద్యుల్లత గళ
తెఅవోల్ మంజువోల్ తోఱిబేగం
పిరిగుం శ్రీరూపలీలాధనవిభవ
మహోరాశిగళ్ నిల్లవార్గం''

దీనికి సుమారు నూరు నూటయేబది సం.ల తరువాత గాని యింతవరకు దెలియవచ్చిన మొదటి తెలుగుపద్యశాసనము బయలుదేరినట్లు లేదు. అదియు దేశీయచ్ఛందమగు తరువోజలోను, సీసమునను రచింపబడినదేగాని సంస్కృత వృత్తము కాదు. తత్సమసమాసములు వాడుకలోనికి వచ్చినట్లు మాత్రము ''శ్రీ నిరవద్యుండు, చిత్తజాతసముండు'' వంటి వానివలన దెలియవచ్చుచున్నది. ఈ కాలముననే- అనగా నీ శాసనములు వెలువడిన తొమ్మిదవ శతాబ్దినాటికే - కన్నడమున సాహిత్యలక్షణమార్గము లేర్పడి దండ్యాదుల కావ్యాదర్శ పద్ధతుల ననుసరించి రచింపబడిన 'కవిరాజమార్గ' మను సాహిత్య లక్షణగ్రంథము రచింపబడినది. ఇది తరువాతి కన్నడకావ్యములవలె గద్యపద్యసమ్మిశ్రితముకాక కేవల పద్య కావ్యమే యైనను, ఇది ఆదిని మంగళాచరణము. పూర్వకవి స్తుతి, సభావర్ణనము, సుకవిత్వ ప్రాప్తి విధానము, అపండిత నింద, కుకవినింద, సుకవికావ్య ప్రశంస మొదలగు విషయములతో గూడిన అవతారికాభాగము గలదై యున్నది. కావున దేశీయభాషా కవితలలో నవతారికారచన కిదియే మొదటిదిగా గనబడుచున్నది. తరువాతి కన్నడకవులీతని సాహిత్యపద్ధతినే యవలంబించినను తమ కావ్యములను గద్యపద్యమయములుగా జేసినారు. తెలుగున తొమ్మిదవ శతాబ్దినాటి శాసనముల లోనే యీ గద్యపద్య సమ్మిశ్రితత్వము పొడసూపినది కాని కేవలపద్యమయములగు యుద్ధమల్లుని బెజవాడశాసనమువంటివి లేకపోనూ లేదు, అయినను కన్నడాంధ్ర సాహిత్యముల నీ చంపూపద్ధతి ప్రాధాన్యమును వహించినది.

ఈ చంపూపద్ధతి రచన తొలుత పేర్కొనిన యాలంకారికుడు దండ్యాచార్యుడుగా గనబడుచున్నాడు. ''గద్య పద్య మయం కావ్యం చంపూ రిత్యభిధీయతే.'' ఈతనికి బూర్వపు దనియే చెప్పవచ్చునేమో - అగ్ని పురాణములోగూడ నిది మిశ్రకావ్యముగా బేర్కొనబడినది. ''మిశ్రం చంపూ రితి ఖ్యాతం ప్రకీర్ణమితి చ ద్విధా'' అని మిశ్రకావ్యము చంపువుగా గ్రహింపబడినది. పంచతంత్రాదులలో గద్య పద్యములున్నను ఇట్టి వానికి చంపూకావ్యము లను ప్రసిద్ధి యున్నట్లగపడదు. దండి తాను పేర్కొనిన చంపూకావ్యమునకుదాహరణముగా వీనిని బేర్కొనలేదు. ఇక 'తథా యది గద్యపద్యమయీ రాజస్తుతి ర్భవేత్-తదా సా 'బిరుద' శబ్దేన వ్యవహర్తవ్యా'' అని చంపూకావ్యములలో బిరుద భేద మొకటి కలదనియు సూచించి నాడు. ఇట్టివి దేశభాషాకావ్యములలో బ్రసిద్ధములై యుండెనేమో. హేమచంద్రుడు ''గద్యపద్యమయీ సాంకా సోచ్ఛ్వాసా చంపూః'' అని చెప్పి సుబంధు విరచిత వాసవదత్త నుదాహరణముగా నిచ్చినాడు. కాని దాని కాప్రసిద్ధి లేదు. బాణుడు భట్టార హరిచంద్రుని గద్యబంధమును ప్రశంసించినాడుగాని యాతడు జీవంధరచంపువును గూడ రచించిన ట్లగపడుచున్నది. ఇది జైనకావ్యము. జైనులే యీ చంపూపద్ధతిని కావ్యరచనమున చేపట్టియుందురని తలంపనగును. త్రివిక్రమభట్ట విరచితమగు 'నలచంపు'వే లభ్యములగు చంపూకావ్యములలో ప్రాచీనముగా నున్నది. ఇదియు జైనమతాభిమాని, మాన్యఖేటాధీశ్వరుడు, రాష్ట్రకూటరాజు నగు ఇంద్రరాజు ప్రోద్బలమున తదాస్థాన పండితుడగు త్రివిక్రమభట్టు రచించినది. ఇంద్రరాజు క్రీ.శ. పదవ శతాబ్దివాడగుటచే (914-916) త్రివిక్రమభట్టు నాకాలము వాడే యగును. ఈ సమీపకాలముననే (క్రీ.శ. 941) పంపకవి కన్నడమున 'విక్రమార్జున విజయ' మనుపేర వ్యాసభారత కథను, 'ఆదిపురాణ'మను జైనతీర్థంకరుని కథను చంపూకావ్యములుగా రచించియున్నాడు.

ఇట్టి రచనాపద్ధతి దేశీయమే యని-దక్షిణ దేశీయమే యని తలంచుటకుగూడ నవకాశము లేకపోలేదు. ఏల యనగా క్రీస్తు శకారంభకాలమునందలి తమిళవ్యాకరణమగు 'తొల్కాప్పియ' మనుదానియందే యీ మిశ్రకావ్య ప్రశంస గానబడుచున్నది. అందు పద్యములేకాక గద్యముతో గూడ జేర్చిచెప్పబడిన ప్రాచీనేతివృత్తము గల కావ్యము 'తొన్మై' అని చెప్పబడుచున్నది. దీనినిబట్టి గద్యపద్య సమ్మిశ్రితమగు కావ్య మానాటికే తమిళభాషలో వెలయుచుండె నని తలంపవలసి యున్నది. అట్టికావ్యము లా భాషలో నిటీవల విశేషముగా రచింపబడిన ట్లగపడదు. కాని ప్రాచీనకావ్యములలో నొకటగు శిలప్పదికారమున క్వాచిత్కముగానైనను గద్యరచనలుగూడ కలవు. ఇటీవల, అనగా క్రీ.శ. 10వ శతాబ్ది ప్రాంతముననే పెరుందేవనార్ అను తమిళకవిచే రచింపబడిన భారతము చంపూపద్ధతినే యున్నది. ఇట్లే దక్షిణ దేశీయ భాషలోని తొలి లక్షణగ్రంథములో క్రీస్తుశక ప్రారంభకాలముననే యీ మిశ్రకావ్య రచనా పద్ధతి చెప్పబడియుండుటయే కాక క్రీ.శ. 10వ శతాబ్ది ప్రాంతమున కన్నడమందువలెనే తమిళమున గూడ భారతము చంపూకావ్యముగానే రచింపబడుట నొక విశేష విషయముగా మనము గ్రహించవలసి యున్నది.

ఈ కాలముననే భోజుడు రామాయణమును చంపువుగా రచించుచు తద్రచనాపద్ధతిలోని హృద్యత నీక్రింది రీతిని సమర్థించినాడు:

''గద్యానుబంధ రసమిశ్రితపద్యసూక్తి
హృద్యా హి వాద్యకలయా కలితేవ గీతిః,
తస్మా ద్దధాతు కవిమార్గజుషాం సుఖాయ
చంపూప్రబంధరచనాం రసనా మదీయా.''

అనగా జైనకవులచేతను, దేశభాషలలోను అదరింపబడు చుండిన యీ చంపూరచనాపద్ధతి సంస్కృతమున బాహాట ముగా నవలంబింపబడకుండుటచే గాబోలు నీ సమర్థన మావశ్యకమైన దతనికి. మొత్తము మీద క్రీ.శ. 10వ శతాబ్ది ప్రాంతము చంపూరచనయం దభిమానము పెరుగు చున్న కాలమని తలంపవచ్చును. దేశభాషలో కన్నడకవులు పంపాదులు కవిరాజమార్గకర్తపద్ధతిని వదలి దీని నవలంబించి నారు. ఈ పద్ధతినే తెలుగు కవులును అనుసరించినారు. తిక్కన తొలుత ''గద్యముతోడుత జెప్పిపెట్ట''నని తెలు పుచు నుత్తరరామాయణమును 'నిర్వచనము'గా రచించుట యనుదాని నొక గొప్ప విశేషముగా చెప్పుకొనినను, తరువాత భారత రచనాకాలమున ''మహాకవిత్వదీక్షావిధినొంది'' కవి త్వతత్వ నిరతిశయానంద భావితాంతఃకరణుడగుటచేతను గాబోలు నన్నయాదు లవలంబించిన చంపూపద్ధతినే గ్రహించి ''గద్యముల పద్యములన్ రచియించెదన్ గృతుల్'' అని ముక్తకంఠముగా జెప్పికొనినాడు. ఇట్లే చంపూరచనాపద్ధతి దేశీయముగా ముందు తమిళ కన్నడసాహిత్యములు ప్రబలి, క్రీ.శ. పదునొకండవ శతాబ్ది నాంధ్రసాహిత్యమునగూడ వ్యాపించి స్థిరపడినది. ఇదంతయు రాజాదరణ గలిగి రాజసభలలోని పండితుల యాదరణ పొందదగిన శిష్టకవితావి షయము కాని దేశీయచ్ఛందములో రచింపబడిన కవితావిష యము కాదు. అది ద్విపద, రగడ, షట్పది, గీతిక, సీసము మొదలగు దేశీయచ్ఛందములలో సామాన్యముగా పాదనియ మము కూడ లేకయే రచింపబడుచుండెడిది. రాజాస్థానము లందలి పండిత కవులు సంస్కృత వృత్తాదులం దభిమాన ముచే దీనిని చేపట్టకపోవుటచేతను, రాజాదరణముగాని, శిష్టకవి పండితా దరముగాని లేని యీ రచనలు జనసామాన్య మున నాకాలమున వ్యాప్తిలోనున్నను. గ్రంథస్థము లగుటకు దగిన యవకాశము లేక కాలక్రమమున నంతరించినవి. కాని యీ దేశీయచ్ఛందములు మతాభిప్రాయములందలి వైరు ధ్యము చేతను, జనసామాన్యమున సులభముగ మతవ్యాప్తి కలిగించుటకనువుగా గనబడుటచేతను, శైవకవులచే తరువాతి కాలమున నాదరింపబడియుండెననుట సుప్రసిద్ధమే. కన్నడ మునగూడ పంపాదు లవలంబించుటవలన సంస్కృతవృత్త ప్రాబల్యముతో గూడిన యీ చంపూపద్ధతికి ప్రాధాన్యము కలుగుటచేతనే, వీరికి పూర్వమే నాగవర్మ తన ఛందోంబు ధిలో కన్నడదేశీయచ్ఛందములని పేర్కొనిన రగళె, షట్పది మొదలగునవి వెనుకనే పడిపోయినవి. శైవకవుల కాలములో తెలుగున ద్విపదవలెనే మరల పదునాలుగవ శతాబ్ది ప్రాంత మున కన్నడమున షట్పది తలయెత్తి షట్పదికావ్యములే యాభాషలో నంతటినుండి ప్రబలము కాజొచ్చినవి. తెలు గున చంపూకావ్యములతో పాటు ద్విపదరచనలు విశేషము గనే రచింపబడినవి. కాని చంపూరచన కాలక్రమమున ప్రకృష్టబంధము కలదై ప్రబంధరూపమును బొంది నవ్యయుగ ప్రారంభమువరకు నీభాషలో సాగుచునే వచ్చినది.

ఇక ''ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశోవాపి తన్ముఖమ్'' అని ఆలంకారికులు చెప్పినట్లు వాల్మీకి కాళిదాసాదుల రచనలు కొన్ని వస్తునిర్దేశముతోడనే ప్రారంభింపబడిన వైనను, మఱి కొన్ని దేవతానమస్క్రియాదులతో బ్రారంభింపబడినవియు గలవు. కావున నిదియే యవతారికాభాగమునకు మూలభూత మని తలపవచ్చును. కావ్యాదియం దీ దేవతా నమస్కార మా యా కవుల మతభావరీతుల ననుసరించియే యుండును గావున, నా యా కవుల మతభావము లెట్టివో మనము తెలిసికొనుట కవకాశము కల్పించు చున్నది. కాళిదాసు శివుని యందు భక్తి కలవాడని రఘువంశాదిని, నాటకాదులందును చేసిన శివపరమగు స్తుతులనుబట్టి వ్యక్తమగుచున్నది గదా. ఉజ్జయినిలోని మహాకాలశివుడే యీతని హృదయమందుండిన శివుడనియు జెప్పువారు కలరు. సంస్కృత పంచ కావ్యకర్త లలో తక్కినవారు వస్తునిర్దేశముతోడనే గ్రంథారంభము చేయుటచే వారి యభిమాన దేవతలను గురించి తన్మూల ముగా దెలిసికొనుట కవకాశ మేమియు గలుగుటలేదు. ఇక దేశభాషలలోని కవితలలో తమిళమునందలి ప్రాచీన వాఙ్మ యము సంఘ వాఙ్మయ మనబడునది ఖండకావ్యము లనదగిన యేకైకపద్యములయొక్క సంపుటి. తరువాత ప్రత్యేకము మహాకావ్య మనదగినవి శిలప్పదికారము, మణిమేఖల అనునవి. ఈ రెండవదానిలో మంగళాచరణాదికము లేదు తొలిదానిలో మాత్రము కొంత కలదు. అందు బ్రశంసింపబడిన ప్రభువుప్ర భుత్వము చల్లగా వెన్నెల వలె నున్నదిగావున మొదట నెల-చంద్రుని-ప్రశంస చేయబడినది. పిదప మేఘము, సూర్యుడు ప్రశంసింపబడినారు. ఇది తొలి కావ్యపద్ధతి. ఇక తరువాతి శైవవైష్ణవ సంప్రదాయ గ్రంథములలో నా యా మతగురువుల ప్రశంసలు కలవు. జీవకచింతామణి బౌద్ధకథతో గూడిన గ్రంథము కావున బుద్ధుని ప్రశంసతో గూడినది.

ఇక కన్నడమున నిప్పటికి లభించినవానిలో తొలి గ్రంథ మనదగిన కవిరాజమార్గములో మొదట విష్ణుస్తుతి రూపముగా చేయబడిన నృపతుంగప్రశంస గల రెండు పద్యములు కలవు. పిదప సరస్వతీప్రశంస. ఇది మంగళాచరణము. పిదప పూర్వాచార్యప్రశంస-అనగా పూర్వకవిస్తుతి చేసి, అతిశయధ వళుని (నృపతుంగుని) సభావర్ణనము చేసినాడు.

రాజాస్థానములయందలి యిట్టి సభలలోని పండిత ప్రవ రుల యాదరమును, ప్రశంసను బొందగలిగిన రచనలను సాగించు బాధ్యత యాకాలపు కవులకు గలదని తలంప

నగును. ఆంధ్రమున నాదికవియగు నన్నపార్యుడు కూడ నిట్టి సభల నీ సంప్రదాయానుగుణముగ కొనియాడియే ''దెనుంగునన్ మహా భారతసంహితారచన బంధురు''డై నాడు గదా.

**''పరమవివేకసౌరభ విభాసితసద్గుణపుంజవారిజో**
**త్కరరుచిరంబులై సకలగమ్యసుతీర్థములై మహామనో**
**హర సుచరిత్రపావన పయఃపరిపూర్ణములైన సత్సభాం**
**తరసరసీవనంబుల ముదంబొనరం గొనియాడి**
**వేడుకన్.''**

రాజమహేంద్రపురమునందలి రాజనరేంద్రుని సభలో నాతని పరివేష్టించియున్న విద్వజ్జనులలో ''అపారశబ్ద శాస్త్రపారగులైన వైయాకరణులును, భారతరామాయణాద్య నేక పురాణప్రవీణులైన పౌరాణికులును, మృదుమధుర రసభావభాసురనవార్థ (వచన) రచనావిశారదులయిన మహాక వులును, వివిధతర్కవిగాహిత సమస్త శాస్త్రసాగరగరీయఃప్ర తిభులైన తార్కికులు నాదిగా గల''వా రున్నట్లు తరువాత తెలిపియున్నాడు. వీరి యనుగ్రహము, అంగీకారము, మెప్పు నీభాషలో నూతనపద్ధతిని కావ్యరచన చేయగడంగిన యాతని కెంతయు నావశ్యకమే యైయుండును.

కవిరాజమార్గకర్త తరువాత ఛందోంబుధికర్తయగు నాగ వర్మ శ్రీవిష్ణు, పినాకి, వినాయక, భగవతి, దివాకరులను, సరస్వతిని తన కావ్యాదిని స్తుతియించినాడు. అనగా ''ఆదిత్యం, అంబికాం, విష్ణుం, గణనాథం, మహేశ్వరం'' అను పంచాయతనదైవములను స్తోత్రముచేసి వారితో సరస్వతి నిగూడ చేర్చిన ట్లగపడుచున్నది. ఈ పంచాయతన పూజాపద్ధతి వైదిక సంప్రదాయ సిద్ధ మగుటచేతను, ఈ నాగవర్మ వైదికమతాభిమానియే యగుటచేతను నిట్లు చేసియుండుననుటయు సమంజసమే. ఈ వైదికసంప్రదాయ మునే తరువాతి కవులు సందర్భానుసారముగా ననుసరించి యుందురు. ఇక పంపకవి జైనమతాభిమానము కలవాడు. అయినను తన ప్రభువగు చాళుక్యరాజు అరికేసరి వైదికమతప క్షపాతము కలవాడగుటచే గాబోలు నాతని నర్జుననితో సరిపోల్చి నాయకునిగా చెప్పిన భారత కథలో, అనగా విక్రమార్జున విజయములో నీ పంచాయతన దైవములనే స్తుతించి వీరికి మరియిద్దరిని మన్మథుని, సరస్వతినిగూడ జేర్చినాడు. అందలి వరుస యిది: ఉదాత్త నారాయణ, ఉదారమహేశ్వర, ప్రచండమార్తండ, సహజ మనోజ, సర స్వతి, దుర్గాదేవి, వినాయక. ఇందు పంచాయతన దేవతలు గాక పూర్వచంపూకవులనుండి వచ్చిన సరస్వతియు, మనోజుడు నధికముగా జేర్పబడినారు.

ఈతడు జైనమతావలంబుడైనను తనకు ప్రభువగు చాళు క్యరాజు వైదికమతాభిమానము కలవాడగుటచే నీ గ్రంథమును లౌకికపద్ధతిని రచియించి, స్వీయమతాభినివేశమును సూచిం చుటకై మఱియొకగ్రంథమును - ఆదిపురాణమును రచించి నాడు. అం దీపంచాయతన దైవతముల ప్రశంస లేదు. దీనికి బదులుగా జైనమతసంప్రదాయానుకూలముగా అర్హత్సిద్ధ, ఉపాధ్యాయ, ఆచార్య, సాధు, యక్ష, యక్షి, సరస్వతుల ప్రశంస కలదు. సరస్వతిమాత్రము జైన వైదికమతములకు రెంటికిని సామాన్యమగు దేవతగా గ్రహింపబడిన ట్లగపడు చున్నది.

ఈతని తరువాత 'గదాయుద్ధ'మును రచించిన రన్న కవియు పురుషోత్తమ, శంకర, బ్రహ్మ, మార్తాండ, కంఠీర వాహన, కందర్ప, వాక్సుందరి, గణనాయక దేవతలను స్తుతించినాడు. అనగా పంపకవిమార్గమునే యనుసరించినవాడై నాడు.

ఈ కన్నడ కవులు స్తుతించిన దేవతాగణములో కందర్పు నికి స్థాన మెట్లు వచ్చినదో వేరువిధముగా సమర్థించుట కవకాశము కనబడదు. కాని యాకాలపు సంస్కృత చంపూ కావ్యకర్తలలో బ్రధానుడైన త్రివిక్రమభట్టు రచించిన నల చంపూగ్రంథములో నీ కందర్పదేవుని స్తుతి కానవచ్చుచు న్నది. మొదట -

**''జయతి గిరిసుతాయాః కామసంతాపవాహి**
**న్యురసి రసనిషేక శ్చానన శ్చంద్రమౌళేః''**
అని యాశ్వరుని స్తుతించి, పిదప -
**''జయతి మధుసహాయః సర్వసంసారవల్లీ**
**జననజరఠకందః కోపి కందర్ప దేవః,**
**తదను పున రపాంగోత్సంగ సంచారితానాం**
**జయతి తరుణయోషిల్లోచనానాం విలాసః.''**

అని మన్మథుని స్మరించినాడు. క్రీ.శ. 10వ శతాబ్ది ప్రారంభమున సంస్కృతమున నతిప్రౌఢములగు శ్లేషరచనలతో గూడిన యాతని నలచంపూకావ్య మాకాలమునందలి కన్నడక వులనేకాక, తరువాతి కాలమున నన్నిచోడునివంటి తెలుగుక వులనుగూడ నాకర్షించిన దనుటకు సందేహము లేదు. ఏలయనగా నీకన్నడకవులవలెనే కృత్యాదిదేవతా ప్రశంసలో మన్మథునిగూడ జేర్చిన మొదటి తెలుగుకవి నన్నిచోడుడు గానే కనబడుచున్నాడు. ఇంతేకాక ఆతని కృత్యాది రచనతో పాటు ఆతని శ్లేషభంగులు, వర్ణనారీతులు మొదలగు నవికూడ నీ త్రివిక్రమ భట్టురచనను దలపింపకపోవు. చూడుడు:-

"కింకవే స్తస్య కావ్యేన కింకాండేన ధనుష్మతః,
పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి యచ్ఛిరః."
(నలచం. 5)

"ముదమున సత్కవికావ్యము
నదరగ విలుకాని పట్టినమ్ము ను బరహృ
ద్భిదమై తలయూపింపని
యది కావ్యమె మలరి పట్టినదియున్ గ(శ?) రమే."
(కు.సం. 4)

"సంత్యేకే బహుళాలాపాః 'కవయో బాలకా ఇవ'"

"నోరుగొలదుల్ పురికొల్పగ నందులోన నా
క్కొక్కడు సక్కనైన గృతియుం గృతియందురె"

ఆతని శ్లేషపద్ధతినే నన్నిచోడు డవలంబించినాడా యని తోచును!-

"ప్రసన్నాః కాంతిహారిణ్యో నానాశ్లేషవిచక్షణాః,
భవంతి కస్యచి త్పుణ్యై ర్ముఖే వాచో గృహే స్త్రియః."

"చతురోక్తుల నుతపదబహు
గతుల నలంకారభావ కాంతిరసార్ధో
న్నతి గృతి నతిరసికులు వర
సతిగతి నెఱిగింపవలదె సౌభాగ్యమునన్."

"అక్షమాలాపవృత్తిజ్ఞా కుశాసనపరిగ్రహో,
బ్రాహ్మీవ దౌర్జనీ సంస ద్వందనీయా సమేఖలా."
దుర్జనసంసత్తకు బ్రాహ్మితో నుపమానము.

"సత్కృతి జగన్మాన్యప్రభావంబునన్, మదనాగం బును బోలె గ్రాలవలదా"(కు.సం)-సత్కృతికి మదనాగముతో బోలిక.

"వాచః కాఠిన్య మాయాంతి భంగశ్లేషవిశేషతః,
నోద్వేగ స్తత్ర కర్తవ్యో యస్మాన్నైకో రసః కవేః"

అని త్రివిక్రమభట్టు తన శ్లేషకవిత్వమును సమర్థించి కొనినాడు.

ఈ శ్లేషవిషయ మట్లుండ కన్నడాంధ్రములయందు చంపూపద్ధతిని ప్రౌఢకావ్యనిర్మాతలగు పంపాదికవులును, నన్నిచోడుడును వారి గ్రంథములలోని దేవతాప్రశంసలో మన్మథుని చేర్చుట కీతడే మార్గదర్శియై యుండవచ్చు నని తోచుచున్నది. అయితే ఆంధ్రమున నాదికవి యని చెప్పదగిన నన్నయభట్టారకుడు కన్నడభాష సాహిత్య పరిచయము కలవాడగుటయేకాక, అష్టభాషాకవీశ్వరుడని ప్రసిద్ధిగాంచిన నారాయణభట్టుతోడ్పాటుకూడ గలిగినవాడ గుటచే, నంతకు పూర్వము చంపూకావ్యరచన ప్రసిద్ధిగాంచిన పంపాదుల మార్గమునే యనుసరించి, చాళుక్యప్రభువే యగు రాజనరేంద్రుని యాజ్ఞానుసారముగా భారతమును దెనిగింప బూనినపుడు, ఆ కన్నడభారతకవుల రచనా సంప్రదాయము లను తెలిసినవా డగుటచే, వానిలో దనకు హితవైనవానిని గైకొనియుండు ననుటకు సందేహములేదు. ఆ కారణముననే వేదమతాభిమాని యగు నీతడును వారివలెనే పంచాయతన మండలి దేవతలనుస్మరించినా డనవచ్చును. కాని ప్రస్తుతము లభించిన భారతపాఠములను బట్టి చూడగా కన్నడ కవులును, నన్నిచోడుడును స్మరించిన మన్మథు నీతడు స్మరింపక పోగా, కుమారస్వామిని, మాతృకలను నధికముగా స్మరించినట్లు తెలియుచున్నది.

"హరిహరాజ గజాననార్కషడాస్యమాతృసరస్వతీ
గిరిసుతాదిక దేవతాతతికి న్నమస్కృతి సేసి"

అనంతరము వాల్మీకివ్యాసులను, సత్ప్రభాంతర సరసీ వనంబు లను గొనియాడి, నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితారచనబంధురుడైనట్లు చెప్పినాడు. మొట్టమొదట "శ్రీ వాణీగిరిజా"యను సంస్కృతశ్లోకమున హరిహర హిరణ్యగర్భపద్మామావాణీసతులను స్తుతించిన వాడు అఖిలజ గజ్జేగీయమాన నానాగుణరత్న రత్నాకరుండగు రాజరాజన రేంద్రుడు కాని నన్నయభట్టు కాడు. "భారతము తెనుగున రచియింపు మని యాత డానతిచ్చిన విని యాతని యనుమతంబునను, విద్వజ్జనంబుల యనుగ్రహంబునను నా నేర్చినవిధంబున నిక్కావ్యంబు రచించెద"నని చెప్పి తరువాత తాను "హరహరాజ గజాననాదుల"కు మ్రొక్కిన వాడ య్యెను. వైదికమతాభిమానియగు రాజనరేంద్రునిచే తొలుత మూర్తిత్రయ స్తవము నన్నయ చేయించుట యుక్తమే. అట్లు మొదట హరిహరపద్మగర్భుల స్తుతివచ్చుటచే నిచ్చటగూడ బ్రహ్మను జేర్చియుండునేమో. కాని పంచాయతనములోగాని, కన్నడకవుల స్తుతులలోగాని బ్రహ్మస్తుతి కానరాదు. వారి యవతారికలలో లేని షడాస్యమాతృక లిందు హెచ్చుగా జేరినారు. 'మాతృ'అనునది 'మార'శబ్దమున కపపాఠమేమో యని తలచినవారును గలరు. నన్నిచోడుడు నన్నయకు బూర్వు డనియు, నాతని నీవిషయమున నన్నయ యనుకరిం చియుండు నను భావమే యిట్టి తలంపు కలుగుటకు గారణము. కాని వ్రాతప్రతులలో నింతవర కెచ్చట నాపాఠము కానవచ్చుట లేదు. కుమార స్వామియు, మాతృకలును తూర్పుచాళుక్యుల కులదైవతములను ప్రసిద్ధి యొకటి కలదు. ఆ కారణముచే నన్నయ యా దేవతలను స్మరించియుండవ చ్చును. బెజవాడ యుద్ధమల్లుని శాసనములో గొమరస్వామికి గుడిగోపురము నెత్తించుట, జాతర జరుపుట మొదలగునవి పేర్కొనబడి యున్నవి గదా.

నన్నిచోడుడు కుమారసంభవకథారచనకు గడంగినవా డగుటచే షణ్ముఖుని, మారుని బేర్కొనినా డనవచ్చును. ఇక శివపారమ్యమునుగూడ బ్రతిపాదింపదలచినవాడగుటచే తొలి మూడుపద్యములలోను మహాదేవుడని, అంబికాధవు డని, పరమేశ్వరుడని ఆతని స్తుతించుటేకాక, తరువాతి పద్యములలో ఆతని వామాంగమునందు బుట్టి నియమస్థితి గొల్చి యఖిల లోకములను గాచుచున్నట్లు వర్ణించిన విష్ణువుతోపాటు పరమేశు దక్షిణాంగమున జనించి యాతని జిరకాలము గొల్చి తత్ప్రసాదమున విశ్వము సృజియించి పొల్చినట్లు బ్రహ్మనుగూడ స్తుతించినాడు. ఇట్లు బ్రహ్మవి ష్ణుల బేర్కొనుట అవశ్యకమైనది. ఇక రవి భవుని యష్టమూర్తులలో నొకమూర్తి; త్రిలోచనములలో నాదిలోచ నము. గణనాథు డభీష్టఫలప్రదాత. షణ్ముఖుడు అపర్ణాస్థాణు వులు జననీజనకులుగా గలవాడు. హరుని కామాతురునిగ వశము జేసికొన్నవాడు మరుడు. వీతరాగి నర్ధనారిం జేసినది నగజాత. వేదాగమరూపమున మహాదేవు నపారగుణమహా స్తుతి సంపాదిత భారతి. ఇట్లు శివపారమ్యమును స్థిరపరచి య శివునితో దన గురువును, కృతిపతియు నగు జంగమ మ ర్జునున కభేదము కల్పించినాడు. సహజమగు దేశికవి తా మానమునే వెల్లడించుకొనుటకో యన్న ట్లీతడీ గ్రంథ మున తొలిపద్యమును దెనుగుననే రచించినాడు. న యమా త్రము రాజనరేంద్రుని వైదిక మతాభిమానమును క్షపరచు టకో, లేదా ఆతని యాస్థానమం దున్నట్లు వర్ణించి వివిధ శాస్త్రపండితులను, కవులను సంతృప్తిపరచుటకో, భార తీయ విజ్ఞానమునకు, తాను తెనిగింపదలచిన భారతమునకు మూలము సంస్కృతభాష యగుటచేతనో గ్రంథాదిని రాజ నరేంద్రునిచే జేయించిన త్రిమూర్తిస్వరూప మంగళము సంస్కృత భాషలో రచించెను. ఈయాచారము కన్నడకవుల లోను గానరాదు. ఇట్లు తెలుగున రెండువిధముల భిన్నరీతు లగు కవితలకు మూలపురుషులని చెప్పదగిన యీనన్నయ నన్నిచోడులు వారికి బూర్వమున, అనగా పదవ శతా కన్నడదేశమున బ్రసిద్ధిగాంచిన దేశీయ కవితాసాహి సంప్రదాయములను గుర్తించి వానిని వారివారి కనువైన రీతి గ్రహించి తమ గ్రంథరచనను సాగించిరని తెలియుచున్నది.

చంపూ రచనాపద్ధతి, సంస్కృతవృత్త సంగ్రహణము, వీనితో జాతీయములు-లేదా తెలుగుదేశీయములగు పద్యము లను జేర్చి చెప్పుట, సంస్కృత వృత్తములలో దేశీయములగు ప్రాస (వడి) నియమములను పాటించుట, సంస్కృత విభక్తి క్రియారూపావ్యయాదులను తెలుగు (దేశి) రచనయందు జొనుపకుండుట, సంస్కృతశబ్దములను దీర్ఘ సమాసములనై నను తెలుగుగా జేసి తత్సమబహుళమగు భాషను విశేషముగా బ్రయోగించుట, కృత్యాది దేవతాసంస్తుతులలో పంచాయతన దేవతలను గ్రహించుట, రాజాస్థానములయందలి పండితసభా వర్ణనము, కృతిపతిని కథానాయకునితోడనో ఇష్టదైవము తోడనో అభేదముచేసి వర్ణించుట, కథాభాగముననో లేదా ఆశ్వాసాద్యంతములందో కృతిపతిగుణవిశేషములను కథానంద ర్భానుసారముగ నాయకుని గుణగణముగ వర్ణించుట, ఏకవిభక్త్యంత విశేషణములతో కృతిపతిని పొగడి ఆతనికి నాయకునితో నభేదము చెప్పుట, లేదా అతనికి గృతియి చ్చుట, ఉత్తమ కవితాలక్షణ ప్రశంస, కుకవినింద, సుకవిస్తుతి, స్వీయకవితావిశేష లక్షణప్రశంస ఈ మొదలగు ఆంధ్ర కావ్య (ప్రబంధ) విశేషలక్షణములుగా బరిగణింప బడుచుండిన వన్నియు నంతకు పూర్వమున మనకు సన్నిహితులగు కన్నడకవులు తమ దేశికవితయం దవలంబించినవే యని తత్సాహిత్యలక్షణముల నించుక పరిశీలించినచో మనకు దెలియకపోదు.

ఈ లక్షణములు కన్నడసాహిత్యము నుండి నన్నయా దులు గ్రహించి రననేల, నన్నయకుపూర్వము తెలుగు సాహిత్యముననే యుండియుండకూడదా యను ప్రశ్న కలుగ వచ్చును. నన్నయకు పూర్వము గల తెలుగు కవులు నీపద్ధతుల నవ లంబించినను అవలంబించియుండవచ్చును గాని పైనిదెలిపిన కావ్యపద్ధతులు తెలుగుకవితలోనికి వచ్చిన వని చెప్పుట కాధారము లేదు. ఇప్పటికి లభించిన శాసన వాఙ్మయముబట్టి పరిశీలించినచో, నాకాలపు తెలుగుకవితలో సంస్కృతవృత్తములు చేరిన ట్లగపడదు. అక్కర, సీసము, తరువోజ, గీతము మొదలగు దేశీయచ్ఛందోరీతులు మాత్రమే ప్రచారమునం దున్న ట్లూహింపదగియున్నది. కన్నడమున నప్పటికి గానరాని సీసపద్యములలో ప్రాసయ తులు, సర్వ ప్రాససీసములు వాడుకలోనికి వచ్చియున్నవి. రచనలో దీర్ఘ సమాసబహుళమగు తత్సమభాష ప్రయోగింపబ డుచునే యున్నది. కాని శాసనరచనలో తెలుగు పదములు సంస్కృత విభక్త్యంతములతో బులిమిపుచ్చబడుచుండిన ట్లగపడదు. అట్టి మణిప్రవాళరచనల నంతకుపూర్వమే కన్నడలాక్షణికులు నిషేధించి తత్సమభాషారచననే ప్రోత్స హించియుండుట కవిరాజమార్గాది గ్రంథములను బట్టి వ్యక్తమగుచునే యున్నది. ప్రస్తుతము లభ్యములగు శాసనము లబట్టి యింతవరకే చెప్పదగియున్నను, తరువాతి శైవకవుల గ్రంథముల లోని సూచనలను (references) బట్టి యాకాల మున తెలుగుకవితలో ద్విపదలు, రగడలు, ఉదాహరణలు, అనేక రీతులుగల పదములు, ఏలలు, జోలలు, అంకమాలికలు మొదలగు ననేక రీతులు గల దేశిరచనలు ప్రచారములో నుండెడి వని యూహించుట కవకాశము కలదు. ఇట్టి దేశిరచన లన్నియు దేశీయులలో కంఠస్థములై యుండినవే గాని, రాజావలంబనము, పండితాదరణము, శిష్టుల సాను భూతి వీని యెడల కలుగకపోవుటచే నివి వ్రాతలోని కెక్కియుండవు. ఒకవేళ ఏకొన్నిటికో అట్టి భాగ్యము

లభించినను పండితులకు, శిష్టులకు వానియెడల గల నిర్లక్ష్యభావముచే వాని నాదరించువారు లేక ఆ వ్రాతగ్రంథము లచిరకాలముననే యంతరించియుండును. అటులనే యెప్పుడో వ్రాయబడి యిప్పటికిని ఏ ప్రాచ్య లిఖిత పుస్తకభాండారముననో యెట్లో కీటదష్టమై పోకుండ సంరక్షిం పబడుచున్న పాటలు, పదములు మొదలగు దేశిరచనలతో గూడిన తాటియాకుగ్రంథము లీకాలమున నెట్టియాదర మును బడయు చున్నవో మన మెరుగనిది కాదు. అందులో నన్నయవంటి మహాకవి బయలుదేరి రాజనరేంద్రునివంటి ప్రభువునాదరణమున నాతని మహాసభయందలి పండితవర్యు లను మెప్పింపగలిగిన మహాభారతమువంటి యుద్గ్రంథము రచించి శిష్ట లోకమునంతను సంతృప్తినొందింపగలిగిన పిదప నీ దేశీయ రచనలను శిష్ట లోకమున దలచువా రెవ్వరుం దురు? మతవిషయమున గలిగిన యభిప్రాయ భేదమునుబట్టి తరువాతి శైవకవులు జనసామాన్యమున బ్రచారములోనున్న దేశీయకవితారచనాపద్ధతిని కొంతవరకవలంబింప వలసినవారై నారు. జనసామాన్యమున నింకను ప్రచారములోనుండి కాలగతి నంతరింపకుండుట చేతనే తరువాతి లాక్షణికులు వీనికి- అనగా రగడలు, షట్పదులు, ఉదాహరణములు, యక్షగానములు మొదలగువానికి దమ గ్రంథముల లక్షణము కల్పింపవలసినవా రైనారు. నన్నయకు పూర్వకాలమున నీదేశమున సంస్కృత భాషకు, నందలి కవితకు గలిగిన ప్రాధాన్యము, పలుకుబడి దేశభాష యగు తెలుగునకు, అందు దేశీయచ్ఛందములో రచింపబడిన పదముల, పాటలరూపమున నున్న దేశికవితకును లేకపో వుట తటస్థించుట చేతనే, కన్నడమున నాకాలమున బయలు దేరిన కవితాసంప్రదాయముల ననుసరించి చాళుక్యప్రభువులు తెలుగు దేశమునగూడ తత్సమభాషాబహుళమగు దేశికవి తను ప్రోత్సహించినారు. ఈ విషయమునే తరువాతి నన్నిచోడుడు తన యవతారికలో -

''మును మార్గకవిత లోకం
బున వెలయగ దేశికవిత బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయం
బున జన చాళుక్యరాజు మొదలగు పలువుర్.''

అను పద్యమున మన కెరిగించినాడు.

నన్నయ రచించిన భారతమువిషయమున సంస్కృత ప్రాకృతకర్ణాట సాహిత్య సంప్రదాయము లెంతవరకు సాయప డినవో వ్యక్తముగా జెప్పలేదుగాని అష్టభాషాకవీశ్వరు డని ప్రసిద్ధిగాంచిన నారాయణభట్టు తన ''కభిమతంబుగ దోడయి నిర్వహించె''నని చెప్పుటచే మనము కొంతవర కూహించుకొన వచ్చును. అయినను ఈతడు భారతరచనలో నవలంబించినది పురాణ రచనాపద్ధతి, సంహితారచనాదృష్టి యగుటచేత కవితా శిల్ప దృష్టితో కావ్యలక్షణముల నందు మనము పరిశీలింప జాలము. మన మాతని కవిత నెట్లు చూచి యాదరింపవలెనో ఆతడే చెప్పినాడు. ఇందాతని సౌమ్యస్వభావముకూడ నెట్లు వ్యక్తమగుచున్నదో గమనిం పుడు:

''సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురు డయ్యె జగద్ధితంబుగన్.''

తెనుగున భారత రచన చేయునపు డద్దానిని సంహితయను దృష్టితో జూచియే నన్నయ రచించినాడు. ఫలము జగత్తునకు హిత మొనగూర్చుట. ఆ హితమనునది బహుయాగఫలరూప మైన పరమార్థము. అది -

''బహుభాషల బహువిధముల
బహుజనములవలన వినుచు భారతబద్ధ
స్పృహులగువారికి నెప్పుడు''

గలుగుచుండునని రాజనరేంద్రుడు చెప్పియేయున్నాడు గదా. భారతశ్రవణాభిరతి కపిలంబగు గోశతంబు నుత్తములగు వేదవి `లకు దానముచేసిన ఫలంబును సమకూర్ప గలదు. ఆం` జగత్తున కిట్టి హితము గలుగుటకై వారిని భారతబద్ధ స్పృ అగువారినిగా జేయగోరియే నన్నయ తెనుంగున మహాభారతసంహితారచనబంధురు డైనాడు. ఈ యాంధ్రజ గత్తున కవీంద్రులు కొందరున్నారు. ఇతరులు నున్నారు. అందు కవీంద్రులు తమ రచనలలోని ప్రసన్న కథాకలితమగు నర్థయుక్తి లోనారసి యది మేలని యాదరింతు రనియు, నితరులు అక్షరరమ్యత* నాదరింతురనియునే యాత డాశించి నది. ఏలయనగా తాను నానారుచిరార్థములకును, సూక్తుల కును నిధి యని యాతడే యెరుగును. ఇట్లీతడు వ్యాసభారతా ర్థమును ప్రసన్నగంభీరములగు తెనుగు సూక్తులలో రచించి జగద్ధితం బొనగూర్చినవా డయ్యెను. అంతే కాని నన్నిచోడు నివలె ''కేనములే కనురక్తయైన భాషాంగన దక్క నేలిన మహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా భంగిగ విస్తరించెద ప్రబంధము సద్రసబంధురంబుగాన్'' అనికాని, ''నాకుగా కొరునకు నిట్లు సేకురునె నొక్కట లాభము లెన్ని యన్నియున్'' ''అరువదినాలుగు విద్యలను నేర్పు నైసర్గికమై వాలిన (తనవంటి?) సుకవులకుంగాక కృతులు సెప్ప నెవ్వరికైనన్ దరమే'' అని కాని, తిక్కనార్యునివలె ''నే నుభయకావ్యప్రౌఢి పాటించు శిల్పమునన్ పారగుడన్ కళావి దుడ'' నని కాని ప్రగల్భరీతి నేమియు జెప్పికొనియుండలేదు. అనగా వీరియం దిది యొక దోష మను నభిప్రాయముతో జెప్పుట కాదు. అది నన్నపార్యుని సౌమ్యస్వభావమును

జాటినట్లే యిది వీరి ప్రౌఢిమకు దార్ఖాణము కాగలదు. ముఖ్యముగా నాయా కవుల కవితారచనలలోని వారివారి దృక్పథములను గనిపట్టి, వాని సహాయమున నా యా రచనలలోని కవిహృదయమును గాంచగలిగినచో తత్కవితార సానుభవమున కది విశేషముగ దోడ్పడగల దను విషయ మును మనము గుర్తింపవలసియున్నది. నన్నపార్యుని ప్రసన్నత, అర్థయుక్తి, అక్షర రమ్యత తిక్కనలో ప్రధానముగా మనకు గనపడకపోవచ్చును. తిక్కన తాను చెప్పుకొనిన ప్రౌఢిమ, కవితాశిల్పము, కళావేత్తృత్వము నన్నయలో లేకపోవచ్చును. నన్నిచోడుడు వాచ్యముగ జెప్పికొనిన యష్టాదశవర్ణనలు, దశప్రాణంబులు, షట్త్రింశ దలంకారములు మొదలగువానికై నన్నయతిక్కనల రచనలలో వెదకుకొనుట యుక్తమైన పని కాకపోవచ్చును. అంతమాత్రముచే నొకరి కొకరు తీసిపోవుదు రనికాని, ఒకరికంటె నొకరు గొప్పవా రనికాని చెప్పజూచుట కేవలసాహస మనిపించకపోదు. సామ్య లక్షణములు కొన్ని యుండవచ్చును. కాని ఆయాకవులకు గల ప్రత్యేక లక్షణములను గనిపట్టి వానిని దేశకాలపరిస్థితుల తోడను, ఆయాకవుల జీవిత చరిత్రల తోడను సమన్వయించి యాకవుల హృదయమును గ్రహించినగాని సరియగు కావ్యా నంద రసానుభవము కలుగబోదు. ఈ యాంధ్రకవుల యవతారికలే వారి కవితాదృక్పథములను గనిపట్టుటకుగూడ గొంత వరకు మనకు సహాయకారులు కాగలవనుటకు సందేహము లేదు.

* నన్నపార్యుని అక్షరరమ్యత విషయమున నభిప్రాయభేద మున్నట్లగపడును. కొందరు తలచినట్లు అక్షర రమ్యత యనగా నన్నయకాలమునందలి యాంధ్రాక్షరముల పొంకము అనుట హాస్యాస్పదము. నందంపూడి శాసనాక్షర ములు అంతకువూ [illegible] కము, కుదురు కలవైయున్న వను భావముతో గొందరిట్లు తలచియుందురు. కాని కవితాలక్షణమును గూర్చి ప్రశంసించుచున్న నన్నయ్య లిపిలోని అక్షరముల పొంకమునుగూర్చి చెప్పునని తోచదు. సంస్కృతాంధ్రభాషలకు చక్కని సమ్మేళనమును గల్పించి ప్రసన్నగంభీరము, హృదయంగమము, ధారాళము నగు శైలిలో నాతడు చేసిన రచనాసౌభాగ్యమునే అక్షరరమ్యతయని యాతడు పేర్కొనెను. కొంకు, మరుగు, కుంటు, అన్వయకాఠిన్యము మొదలగునవి లేక విశిష్టపదరచనారూపమగు రీతిమాధుర్యముతో గూడినదే యాతని 'యక్షరరమ్యత.'

''దుర్లభం త్రయమే వైతత్ - దైవానుగ్రహ హేతుకమ్,
మనుష్యత్వం ముముక్షుత్వం - మహాపురుష సంశ్రయః.''

— వివేక చూడామణి

(శ్రీ 'కోరాడ' వారి డైరీనుంచి)

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు :

# తెలుగు ... క ళ్ల పుట్టుక

దేశీయంబగు తెలుగుభాషలోని పలుకుబళ్లు, పదబంధాలు ఏర్పడిన రీతిని పరిశీలించినట్లయితే, ఇవి యీ భాషలోని తత్సమతద్భవశబ్దము లేర్పడిన రీతినే యేర్పడి యుండునా, లేదా యవి, వేరు విధాన నేర్పడియుండునట్లు తోచునా యను విషయమును కనిపట్టి నిర్ధారణ చేయుట కవకాశమే మైన కనబడునేమో యను నాశతోనే యిదివరలో పలుకు బళ్లు, పదబంధములను గూర్చిన పరిశీలనము కొంత చేయబడినది. దీనినిబట్టి చూడగా నీ భాషలో ముఖ్యముగా అర్థభేదమును సూచించుటకై ధాతువుపై ధాతువునో, శబ్దముపై శబ్దమునో చేర్చి, ధాతుపల్లవము లను వానినో శబ్ద పల్లవము లనబడు వానినో కల్పించుట యతిప్రాచీన పద్ధతియని తెలియ వచ్చుచున్నది. ఒక ధాతువుపై మరియొక ధాతువు చేరినప్పుడు కాలక్రమమున వాని స్వరూపములో ననేక విధములగు మార్పులు కలుగుచుండుటయు కద్దు. ఏయే యర్థమునం దే ధాతువు దేనితో జేరి యెట్టి రూపము నొందినదో పరిశీలించి కనిపెట్ట గలిగినచో, నీ భాషలోని ధాతువుల మూలరూపములను గూడ కనిపట్ట నవకాశ మేర్పడును. కొన్ని సందర్భములలో నీ భాషారూపములతో పోల్చి చూచినంత మాత్రమున దాని మూలరూపము లేవో కనిపట్టుటకు సాధ్యము కాకపోవచ్చును. అట్టి సమయము లలో సన్నిహిత భాషలలోని రూపములతో బోల్చి చూచి నచో వాని పరిణామ క్రమము సుబోధం బై మూల ధాతు స్వరూపమును కనిపట్టు నవకాశ మేర్పడవచ్చును. ఇట్లు పరిశీలించుట చేతనే తెలుగు భాషలో నిప్పుడు మనము ధాతువులని వాడుకొనుచున్న రూపము లనేకములు మూల ధాతు రూపములు కావనిన్నీ, ధాత్వంతర సంయోగము చేతనో, భృశార్థాదులందు ఒకే ధాతువు యొక్క భిన్న రూపముల కూడికచేతనో యేర్పడిన ధాతుపల్లవములనిన్నీ, తెలిసికొన గలుగుచున్నాము.

''యథా యోగంబుగ గ్రాహ్యము'' లని వైయాకరణులు చెప్పిన 'ఇ ంకులు, తొఱుద్రొక్కులు, వఱువట్లు' వంటి రూపముల ౧ ఆయా ధాతువుల ప్రాచీన నవీన రూపముల కలయికచే ్పడినవని తెలిసికొనగలుగుచున్నాము. దీనిని పట్టి - ఇప్పటి - 'ఇంకు' ధాతువునకు ఇఱుంకు-ఇఱుకు అనునది ప్రాచీన రూపముగా నేర్పడుచున్నది. ఇట్లే త్రొక్కు- అను దానికి తుళి 'తుళిక్కు' అనునది వట్టు-వట్టి పోవు- అనుదానికి 'వఱు' (వఱుగు); పీఁకు - అనుదానికి 'పెఱుకు' ప్రాచీన రూపము లైనట్లు తెలియ వచ్చుచున్నది. ఇట్లే-బిఱ్ఱు-బిగియు-లకు, విఱుగు-వీఁగు-లకు నిలు-కు, నిక్కు - లకు, దగ్గిర సంబంధమే కలదు. ఇక ననేక ధాతువులలోని రేఫములు తరువాత చేర్పబడిన ధాతువులో కలిసిపోవుటచే మూలధాతుస్వరూపము తెలియకుండనే పోవుట తటస్థించినది. ఉదా: వర్-వచ్చు, తర్-తెర్ -తెచ్చు, పుర్-పుచ్చు, మెఱ్-మెచ్చు, మొదలగు వాని సరిపోల్చి చూచిన గాని, కేవలము ధాతువులుగానే పరిగణింప బడుచున్న 'వచ్చు, పుచ్చు, మెచ్చు' అను వానిని బట్టి చూచినచో, వీని పూర్వరూపములలో నొక రేఫముకూడ నుండెనని యూహించుటకే అవకాశము కలుగదు. ఈ భాషలో వీనికి సంబంధించిన కొన్ని యితర రూపములతో గాని, ఇతర సన్నిహిత భాషలలోని ధాతురూపములతోగాని, పోల్చిచూచినట్లయితే ఇవి వాస్తవముగా ధాతుపల్లవములే కాని మూలధాతువులు కానే కాదని మనకు తెలియకపోదు.

ఇట్లే తెలుగున రేఫసంయుక్త హల్వర్ణ రూపమగు సంయుక్తాక్షరము తొలి వర్ణముగా గలిగిన యనేక ధాతువులు - శబ్దములును గూడ, నీ భాషలలోని మూల ధాతువులు లేదా శబ్దములు కావనియు, పదాదియందు సంయుక్తాక్షరముం డుట ద్రావిడ భాషా సంప్రదాయ సిద్ధమే కాకపోవుట చేత - నీ భాషలోని రూపములన్నీ స్వరవ్యత్యయాది సంస్కార ఫలితముగా నీ భాషలో నొక కాలమున నేర్పడినవేగాని, మూల భాషా స్వరూపమునకు జెందినవి మాత్రము కాదని గ్రహింపవలసియుండును. అట్టి యప్పుడు మన భాషలోని త్రొక్కు, త్రోయు, మ్రోగు, వ్రాయు, క్రుంగు, క్రోలు మొదలగు ధాతువులయు; మ్రాను, వ్రేలు, ప్రాలు, పోలు మొదలగు శబ్దములయు రూపములు- మూలరూపములు కావనియు - అవి తుళిక్కు తొరె-యు, ముళ (.గు), వఱై, అను మూలధాతువుల నుండియు; మరన్, విరల్, పరె, పుళల్ - అను మూల శబ్దముల నుండి కాలక్రమమున నేర్పడిన రూపములనియు నిశ్చయింపవలసియుండును.

ఇట్లే పరిశీలించినచో పదాదియందు రేఫ సంయుక్తాక్షరముతో గూడిన తెలుగు భాషా రూపము లన్నియు నీ భాషలో నేదోయొక కాలమున స్వరవ్యత్యయము మూలముగా గలిగిన వర్ణ వ్యత్యయమువలన నేర్పడినవేయని వ్యక్తము కాకపోదు. ఈ వెనుకటి రూపములకు తెలుగు భాషలో వాడుకపోయి, వాని రూప మతిప్రాచీన కాలముననే మారిపోయి యుండుట చేత - (ఎప్పుడు మారినదో చెప్పుట కష్టమే కాని, తెనుగుభాష చరిత్రలోని ప్రాచీన శాసనయుగమునకు పూర్వ మేయని సూత్రము - అనగా క్రీస్తుశకారంభమునకు పూర్వమేయని మాత్రము చెప్పవచ్చును) ఈ తెలుగురూప ముల నితర సన్నిహిత భాషా రూపములతో బోల్చుటచేకాని, వీని పూర్వ రూపములను- మూలధాతు రూపములను కనుగొన శక్యమగుట లేదు. అనగా నీ రూపములు శాసన యుగమునకు బూర్వమే యేర్పడి యుండునని తలంపవలసి యున్నది. ఏలయనగా తెలుగు భాషలో రచింపబడిన తొలి శాసనములు లభించిన కాలమునకే- లేదా - ఇంకను పూర్వమున, ప్రాకృత సంస్కృత శాసనములలో తెలుగు పదములు లభించిన కాలముననే యిట్టి మార్పులు కొన్ని కలిగినట్లు తెలియ వచ్చుచుండుటచేత, శాసనకాలమునకు పూర్వమే, తెలుగుభాష తక్కిన ద్రావిడ భాషలనుండి విడివడిన తరువాత గల అజ్ఞాత యుగములోని మార్పుల న్నియు గలిగియుండవలెనని యూహింపదగి యున్నది. తమిళ కన్నడములలో నీ తెలుగు శబ్దముల తొలిరూపము లిప్పటికి నట్లే నిలిచియుండుటచేతనే, తెలుగుభాష కా యజ్ఞాత యుగమున గలిగిన ఏదో యొక విధమగు సంస్కారము మూలముగా నిట్టి మార్పు లేర్పడినవని తలంపవలసి యున్నది.

పైని తెలిపిన స్వరవ్యత్యయ మూలకమై వర్ణవ్యత్యయ రూపమగు మార్పు పదాదిని సంయుక్తాక్షరమును దెచ్చి పెట్టుటలోనే కాక ఇంక నితరవిధముల గూడ మూలభాషా రూపము లీ భాషలో మారిపోయినవి. మూల భాషలోని యనేకములగు నజాది శబ్దముల నీ భాషలో హలాదులనుగా భాసింప జేయుట కీ మార్పే కారణము. ప్రథమ పురుష సర్వనామమునందలి ప్రాచీన రూపములగు అవన్, ఇవన్, ఎవన్ - అనునవి వాండు, వీండు, ఎవణ్డు-అగుటకు, అదిని - దాని, ఇదిని - దీని, ఎవని- వేని యగుటకును ఈ పరిణామమే కారణము. అవన్, ఇవన్ మొదలగు రూపము లట్లే యితర సన్నిహిత భాషలలో నిలిచియున్నవి. కావున నా భాషల నుండి తెలుగు విడివడిన తరువాతనే, యీ మార్పీ భాషలో ప్రత్యేకముగా గలిగినదని యూహింపగలుగు చున్నాము. ఈ మార్పునకు లోనైన యితర శబ్దము లనేకములు కలవు. కొన్నింటి మార్పు ఈ భాషలోనే - అనగా జ్ఞాతయుగముననే జరిగినట్లు కూడా తెలియును. ఏమనగా రెండు రూపములకు గూడ నీ భాషలో ప్రయోగము - వాడుక - గానవచ్చుచుండుటయే దీనికి కారణము.

అళుచు, ళచ్చు - డచ్చు, అడగు డాగు ఆళిసిన పాపంబు - దీని ళచ్చు వ్రాష్టు.

త. అట్టైతె ఱా-ఱాయి = శిల.
త. ఇరా-తెరేయి.
త. ఇఱక్కై-తె-ఎఱక, ఱెక్క.
క. ఇఱయన్- తె-ఱే-ఱేడు.
త. ఉగిర్ ఉగురు-తె.గోరు
త. ఉళ్-తె.లో-లోంతు, లోపల మొదలగునవి.
త. ఇళై-ఎళె-తె.లేత; ఎలమాని లేమా;
త. ఇళంగు-తె.డిగ్గు, డిగు దిగు
త. ఇరండు-తె-రెండు.
త. ఉరల్-తె-రోలు.
త. తె-రుద్దు = ఉరుబు-తె-రుబ్బు
త. ఉరోంగల్ = తె-రోc కలి.

పై వానిలో ఎఱక ఱెక్క, ఎళ లే, అడగు డాగు అనునవి భాషలో కనబడనే కనబడవు. కావుననే వీని పరిణామ మజ్ఞాత యుగముననే గలిగినదని చెప్పవచ్చును. ఏమనగా, నీ తుది రూపమును జూడుడు. ఇది-ఉరు(బు) +కల్ అను రెండు శబ్దముల కలయికచే నేర్పడిన శబ్దపల్లవము - లేదా సమాసము, తమిళమున నీ శబ్దము హలంతము (ఉరోంగల్), తెలుగున నిది 'రోంకలి-రోcకలి - అని ఇకారాంతమైనది. 'రోకల్' అని దీనికి భాషలో ప్రయోగమును గానము. తిరుగలి కూడ ఇట్టిదియే. తిరు(గు)కల్ (కల్లు) తుదిని ఇకారము చేరినది, తిరుగలియైనది. పిండి మొదలగు వానిని ''విసురు'' కొనుట కుపయోగించునది ఇప్పటికిని 'తిరుగుకల్లు' తిరుగలియేయైనా, ఆ కల్లును (రాతిని) విసిరి (విసురుగా) త్రిప్పుటవల్లనే యిప్పటికిని మనము పిండి, పప్పు మొదలగు వానిని తయారుచేసుకొనుచున్నాము (ఈ కల్లును, రాతిని విసురుగా త్రిప్పుట వలననే - పిండి విసురుట - అను పలుకుబడి యేర్పడినదనుట స్పష్టము). ప్రస్తుత కాలమున మనము దంపుట కుపయోగించు ''రోc కలి''లో మాత్రము ''కల్లు'' రాయి కానవచ్చుట లేదు. ఈ కాలమున చాలవర కుపయోగములో నున్న ''రోకళ్లు'' కొయ్యరోకళ్లే. దేశమున గొన్ని ప్రాంతముల నెచ్చటనైనా - కొండ ప్రదేశములో - రాతి రోకళ్లు కూడ వాడుకలో నున్నవేమో కాని తొలుతటి కాలములో రుబ్బు - రోలు వలెనే 'రోకలి'

కూడా కొయ్యతో చేయబడినది గాక 'కల్లు'-రాతితో జేయబడినది గానే యుండుననుటకు సందేహము లేదు. రాతి రోకళ్లు ఎత్తి దంపుటకు బరువుగానుండును గనుక - కొయ్య రోకళ్లు వాడుకలోనికి వచ్చి యుండును. రుబ్బు, రోలు-శబ్దములు రెండును గూడ ప్రత్యేకముగా, తెలుగుభాష తక్కిన జాతీయ భాషల నుండి విడివడిన తరువాత నేర్పడినవే. ఏమనగా పదాదిని రేఫము గాని శకటరేఫము గాని లకారముగాని వచ్చుట ద్రావిడ భాషా సంప్రదాయమే కాదు. కాబట్టే - సంస్కృత శబ్దము తమిళ కన్నడములలోనికి వచ్చునపుడు, పదాది రేఫ ల కారములముందు 'అ, ఇ, ఉ' అను వర్ణములు చేరుచున్నవి. వీనిని Prothetic vowels అని ఆధునిక భాషా తత్వజ్ఞు లందురు. కావుననే సం. రాజన్ త. అరశన్, క. అరసు (cf అరసుమనె) త. (అరసాంగం < రాజ్యాంగం), సం. లోకం ⟶ త. క. ఉలగం - ఈ రీతిగా మార్పునొందుచున్నవి. ఆంగ్లభాషలోని 'స్కూలు' అను శబ్దమును పలుకలేని - అనగా సంయుక్తాక్షరమును పదాదిని పలుకలేని - సామాన్యజనులు, దాని ముందొక 'ఇ' కారము నూతగా జేర్చికొని 'ఇస్కూలు' అని పలుకుచుండుట మనమందర మెరిగినదే. అయితే తెలుగుభాషాజనులు చిరకాలము క్రిందటనే సంస్కృత భాషా వర్ణోచ్చారణ రీతుల కలవడి పోవుట చేతను గాబోలు, పదాదియందు రేఫలకారోచ్చారము విషయమున వీరికి కష్టము తోచినట్లు కనబడదు. రాజు, లోకము మొదలగు వానినట్లే గ్రహించి పలుకగలుగుటయే గాక, మూల భాషలో నజాదులైయున్న పెక్కు శబ్దములను వర్ణవ్యత్యయముచే, రేఫలకారాది శబ్దముల నుగా జేసి పలుకు సంప్రదాయమున కలవాటుపడిన వారుగా కూడ నైరి. ఈ కారణము చేతనే - త. అఱై అనగా అరగదీయు - అనునర్థముగల ప్రాచీన భాషలోని ధాతువు నుండి తెలుగులో ''ఱాయి'' అను నామ వాచక శబ్దము, పదాదిని శకటరేఫము నేర్పడి వ్యవహారములోనికి వచ్చినది. అట్లే - త. క. ఉఱై - ఉరు (to rub) అను ప్రాచీన ధాతువునుండి - తెలుగులో వర్ణవ్యత్యయము మూలముగా ''రుబ్బు'' అను ధాతువున్ను, త. ఉరల్. క. ఉరులు - దొర్లు (to roll) అను మూలధాతువు నుండి 'రోలు-' అను ధాతువును తెలుగులో నేర్పడినవి. పిండి మొదలగు వానికి రుబ్బుకొనుటకు, ధాన్యాదులను దంచుకొనుటకు నుపయోగపడు పెద్ద రాతిని గుండ్రముగాజేసి దొర్లించుటయే సుకరము గావునట్లు దానికి 'రోలు' అను పేరు వచ్చినట్లున్నది. కాని వాస్తవముగా దొర్లింపబడు కల్లు-రాయి-ఇదే గావున దీనికే- ''ఉరోంగల్'' అను పేరు వచ్చియుండవలసినది. ఒకవేళ ప్రాచీనకాలమున నట్లే యుండి, ''రోలు'' అను పేరు దీనికి స్థిరపడిన తరువాత, ఉరోంగల్ - 'రోకలి' అనుపదము దంచే సాధనమును సూచించునదైనదేమో! ఎట్లయినను నన్నిచోడుడు కుమార సంభవము రచించునాటికే ఆటవికులగు శబర కామినులు ముత్యేదురుఁ బ్రాలు దంచుకొనుటకు పటికపుఱోళ్లు, గౌరుకొమ్ము రోకళ్లు వాడుచువచ్చినట్లు తెలియవచ్చుచున్నది (కు. సం. 6 అ. 47). కాబట్టే అప్పటికే 'ఉరోంగల్' - రోకలిలోని ''కల్లు'' స్థానమును గౌరుకొమ్మో, కొయ్యో, ఆక్రమించుట తటస్థించినట్లగుపడుచున్నది. ఇక నీ రోకలి-తిరుగలి-శబ్దములవలెనే - కల్లు శబ్దముతో గూడిన 'వడగల్లు-ఓరుగల్లు-చెంగల్లు' మొదలగు వానిలో నీ పదబంధము ఇకారాంతము కాలేదు. 'కల్' అను హలంతపదము ఊతగా తుదినొక ఉకారమును గ్రహించి 'కల్లు'- అని మాత్రము అయినది. మరికొన్ని పదబంధములలో - లేదా తెలుగు సమాసములనదగిన వానిలో నీ తుది ఇకారము కనబడుచున్నది. 'వాకిలి-' అనునదొకటి- ఇది-'వా+ఇల్'' అను శబ్దముల కూడికచే నేర్పడినది. వాశబ్దము వాయ్-వాయి అనుదాని యవశిష్ట భాగంబై 'నోరు' అను నర్థము కలదు కావున 'వాయిల్' అనగా - వాయ్ + ఇల్ = ఇంటి యొక్క వాయి (నోరు) అనగా ప్రవేశ మార్గము అనునర్థమున, వాయిల్ - అనునదే తమిళమున 'వాశిల్ - వాశల్' అను రూపమున గానవచ్చుచున్నది. కాని తెలుగులో 'వాకిలి' అని 'క' కారము మధ్య వచ్చుటకు గారణ మగపడదు. 'వాయి' శబ్దము శ.ర. కారుడన్నట్లు వైకృతమనుటకు గారణమగపడదు. వాకట్టులో 'వా' వైకృతమే కావచ్చును. ఇంతకూ 'వాకిలి'లోని 'ఇ' సంబంధార్థ ద్యోతకమేమో. 'వాయిల్' లేదా 'వాకిల్' యొక్క తలుపు వాయిలి తలుపు-వాకిలి తలుపు కావచ్చును. ఇట్లు విశేషణత్వ ద్యోతకములైన రూపములే విశేష్యములుగా కూడ వ్యవహారములోనికి వచ్చుట కద్దు. 'ఒకడు' నుండి 'ఒకటి' ఔపవిభక్తిక రూపములు కాగా ఆ 'ఒకటి'యే మరల అమహద్వాచక విశేష్యముగా వ్యవహారములోనికి వచ్చినది. ఇట్లే మూడుకన్నులు కలవాడు ''మూక్కణ్'' ముక్కణ్. మూక్కణ్ - మూడు కన్నులు గలవాడైన - దొర ప్రభువు - దేవర = ముక్కంటి దొర, ముక్కంటి దేవర - అయినది కాని 'ముక్కంటి' యను నీ యౌప విభక్తిక రూపమే - విశేష్యముగా వ్యవహరింపబడుచు శివుడు అను నర్థమిచ్చుచున్నది. ఇందలి తుది ఇకారమును సమాసాంత విధిగా గూడ వైయాకరణులు గ్రహించుటకు వెనుదీయరు. అట్లే ''అలరు విల్తుడు'' - అలరు విల్లుగా గలవాడు అలరువిల్ 'విల్లు-కలవాడు-విల్తుడు? తలవరి తమి- తలైవర్, (Head-man) తె-తలవరి > తలారి. ''మహాతలవర'' అనునది ఇక్ష్వాకు రాజుల శాసనములలో 'మహాదండనాయక' అను బిరుదముతో సమానమైన యొక బిరుదముగా పేర్కొనబడియున్నది. దేశ్య శబ్దమైనను

బిరుదముగో గ్రహింపబడుటచే గాబోలు సంస్కృత శబ్దముతో సమసించినది. ''అవర్'' అనుదాని నుండి యేర్పడిన 'వరి' అను దానినుండి ఒక ప్రత్యయముగా విడదీయబడిన 'అరి' అను దానితో గూడినవే కావచ్చును - నేర్పరి, కూర్పరి, వెరవరి, మేపరి, కాపరి, నీరు ద్రిమ్మరి, నుడువరి, పొదుపరి మొదలగు శబ్దములు మోవి అనునది మో + వాయ్ అను శబ్దముల కూడికచే నేర్పడియుండును. ముఖమునకు ద్వారము వంటిది గావున ''మోవి'' ఇక్కడ 'వాయ్' అనునది 'వి' అయినది. మరికొన్ని పదబంధములలో నిది 'వ' కారముగనే నిలిచినది. చిలువ - చిలుము (కిలుము) = విషము - వాయియందు గలది. ఆశీవిషము- పాము. పలవ = పలు + వాయ్ = బహుముఖములు గలది. నలువ = బ్రహ్మ - నలు + వాయ్ = నాలుగు ముఖములు కలవాడు, నడవ = నడు + వాయ్ నడుచుటకు మార్గము (మధ్య మార్గము), కడవ = కడు + వాయ్ = పెద్ద (వెడలుపైన) నోరు గలది = బాన, తెఱవ = తెఱ + వా = తెఱపియైన నోరు కలది - స్త్రీ. ఇట్లే పద బంధములలో 'వాయ్' శబ్దము 'వ' కారమై నిలిచినది. ప్రాచీన భాషలో హలంతమగు నీ 'వాయ్' - తెలుగులో 'వాయి' - అని ఇకారాంతమైనట్లే ఇంక ననేకములగు హలంత శబ్దము లీ భాషలో ఇకారాంతములైనవి. ఉ. త. క. కడల్ = సముద్రము - కడలి, త. కాల్. కాట్టు = గాలి, త.వే-వెయ్-వేయి = సహస్రము, నో-నోయ్ = కన్ను. నోవు = pain నొప్పి, త, నాయ్ = dog, నాయి, cf-కాక-కాకి = crow. సర్వనామములలోని అదు, ఇదు, ఎద- తె. అది, ఇది, ఎది. ఇట్లే భాషలోని పెక్కు పదముల యొక్కయు పదబంధముల యొక్కయు తుదిని ఇకారము బహుళముగా గానవచ్చుచున్నది.

మరియొక విశేషమేమనగా నీ భాషలోని ప్రాచీన పదబంధములు సామాన్యముగా రెండింటి కంటె హెచ్చుపదములతో గూడినవిగా గానరావు, అచ్చ తెనుగు భాషారచనా సంప్రదాయము ప్రబలిన వెనుకనె దీర్ఘములైన దేశ్య సమాసములు వాడుకలోనికి వచ్చినట్లుగ పడుచున్నది.

''సర్వ వ్యాపీ స భగవాన్
తస్మాత్ సర్వగతః శివః''

"The supreme being is all-pervasive, therefore, He is the innate Good in all."

"To be truly united in knowledge, love and service with all beings, and thus to realise one's self in the all-pervading God, is the essence of Goodness, and this is the key note of the Upanishads."

"Life is Immense' — ప్రాణో విరాట్ శ్రీ 'కోరాడ' వారి డైరీనుంచి

# క ళ్లు-ద ంలు

ఈ నడుమ అన్నమాచార్యుల లఘుకృతులలో నొకటగు 'శృంగార మంజరి' యను ద్విపద రచనను చదువుచుండగా నందొకచో, ''తొలగక పులకలు తోఁద్రోపులాడ'' యను పాదమున ''తోఁద్రోపులు'' అను పదమొకటి కనబడినది. దీనికి పుట క్రింద నీయబడిన టిప్పణిలో 'తో'=వెంబడిగా' అని అర్థము చెప్పబడియున్నది. ''తోఁద్రోపులాడు'' అనునట్టి పలుకుబడి, లేదా పదబంధము- తెలుగు భాషలో కలదా యను సందేహము కలిగి శబ్దరత్నాకరమున జూడగా అందు ''త్రోద్రోపు'' అను రూపములే గాని 'తోఁద్రోపులాడు' అను రూపము గ్రహింపబడి యుండలేదు. ఆ ''త్రోద్రోపు''- అనునది త్రోపు+ త్రోపు-శబ్దముల కూండికచే నేర్పడినట్లును, దానికి ''మిక్కిలి త్రోపు''-అని యర్థ మైనట్లును, త్రోద్రోపు లాడు-అనుదానికి 'మిక్కిలి త్రోయు, (బలాత్కారము చేసి త్రోయు)' అని యర్థమైనట్లును దెలుపబడియున్నది. ఒకవేళ పదాదియందలి రేఫ సంయుక్తాక్షరములలో రేఫ మొక్కొక పుడు జారవిడువబడుచుండుట యిటీవలి సంప్రదాయముగా తెలుగుభాషలో గానవచ్చు చుండినను (cf మ్రాను-మాను, వ్రేలు-వేలు, క్రిందు-కిందు, మ్రోగు-మోగు, క్రొవ్వు-కొవ్వు, త్రోయు-తోయు ఇత్యాదులనేకములు గలవు) ''త్రోద్రోపు'' అను పదబంధములో తొలి యక్షరమునందలి రేఫ జారవిడువ బడిన ట్లగపడదు. ఒకవేళ పై శబ్దములలో వలెనే యీ పదబంధమునగూడ జారవిడువబడిన రూపమునే అన్నమాచార్యులు వాడెనేమో యనుకొన్నాను. అప్పుడది 'తోద్రోపు' కావలెనేగాని 'తో' తరువాత నరసున్న వచ్చుటకు కారణము లేదు. ఈ శబ్దము 'త్రోద్రోపు' అని కాక 'తోఁద్రోపు' అని తలంపబడుటచేతనే-అనగా నా తెలుగు పలుకుబడి గుర్తింపబడక పోవుటచేతనే - తొలివర్ణము 'సహార్థకం'బగు తోడ శబ్ద రూపంబగు'తో' అని తలంపబడుటయు, తరువాతి 'ద్రోపు' అను దానిలోని సరళ 'ద' కారమును సమర్థించుటకుగా నర్ధానుస్వారమును దాని పూర్వమున జేర్చి, తోన్-వెంబడిగా అని యర్థము వ్రాయుటయు దటస్థించి యుండునని తోచినది. 'త్రోయు' ధాతువునకు 'తోయు' అను రూపము వ్యవహారములో నున్నను, ప్రామాణిక ప్రయోగము లం దగపడకుండుటచేతనే గావలయు శబ్దరత్నాకరమున తోయు గ్రహింప బడనే లేదు. కావున 'తోఁద్రోపు' అను రూపము గాని ఆ పలుకుబడి గాని తెలుగుభాషలో ప్రసిద్ధము కానే కాదని తలంప వలసియున్నది. అయితే యీ పదబంధమును గూర్చి యింతగా బరిశీలింప వలసిన పని యెందుకు గలిగినది యను ప్రశ్న కలుగవచ్చును. ఈ పదబంధము మూలముగా దేశీయ మగు తెలుగు పలుకుబడులలో గానవచ్చునొక సంప్రదాయమును మనము గుర్తింపవలసియున్న దని సూచించుటకే. ఈ సంప్రదాయ మేమనగా-అతిశయార్థమును సూచించుటకుగా ధాతువునకు లేదా శబ్దమునకు ద్విరుక్తి కల్పించి చెప్పుట. కావుననే 'త్రోచు' ధాతువునకు అతిశయముగా త్రోచు, మిక్కిలి త్రోచు, బలాత్కారముగా త్రోచు-అను నర్థమున-నా ధాతువునకు ద్విరుక్తి కలిగి - త్రోద్రోఁపు అయినది. దాని పై సహాయ ధాతువుగా ఆడు-చేరి 'త్రోద్రోఁపులాడు'-అను పద బంధమేర్పడినది. ఇట్టి పదబంధము లనేకము లీభాషలో నేర్పడియుండుటే గాక, వీనిలో గొన్ని యాధాతువులయొక్క ప్రాచీన నవీన రూపముల కలయికచే నేర్పడినవిగా గూడ నుండుటచే, నాయా ధాతురూపముల పరిణామ రీతిని తెలుగు భాషయొక్క పరిణామక్రమమును గూడ గనిపట్టుట కవకాశము వీనిమూలముగా నేర్పడగల దని తోచుచున్నది. ఈ 'త్రోయు' ధాతువు కన్నడమున 'తొరె' అను రూపమున నున్నది. (Milk to form, to come with the breast, to be filled with milk) తొరగు = to flow down త్రోసుకొని వచ్చు అని యర్థము. తమి, చొరి, మళ, చురి = to gush out ఈ ''తొరెయు'' - నుండియే 'త్రోయు' అను తెలుగు ధాతువేర్పడియుండును. ఇక నీ 'త్రోద్రోపులాడు' అను శబ్దమునకు బ్రయోగమును జూపుచు శబ్దరత్నాకరమున రామాభ్యుదయములోని యీ క్రింది పద్యమీయబడినది:

గీ. సిగ్గు వెనుకకు దిగియంగ నగ్గలంపు
రాగరజ్జువుముంగల సాగ దివియ
నందులకుఁ దోడు త్రోద్రోపులాడ జెలుల
నడుమ బిరువీఁకు లయ్యె నప్పడతి కపుడు.

(రామా. 4. ఆ)

ఈ రామభ్యుదయ పద్యమునందు, ''త్రోద్రోపులాడు'' అను పదబంధమునకు తోడు ''పిరువీకులయ్యె'' అను మఱియొక పదబంధము కూడ నట్టిదే లభించినది. ఈ ''పిరువీకు''- శబ్దము (పీకు+పీకు) అని పీకు ధాతువు ద్విరుక్తి వలన నేర్పడినట్లును, 'పీకులాట' అని దీని కర్థమైనట్లును, ఇట్లే-పిరువీకులాడు, పిరువీకు సేయు అను పదబంధములకు 'పెనగులాడుట' అని యర్థ మగుననియు శ.ర.న దెలుప బడినది. కాని యిచ్చట 'పీకు+పీకు='పీపీకు' అనియైన గాక 'పిరువీకు' యెందుల కయ్యెనో, మధ్య రేఫ మెట్లు వచ్చెనో తెలియవచ్చుట లేదు. ఈ 'పిరువీకు' శబ్దమునకు 'పెనగులాడు' అనుటకంటె 'పీకులాడు' అనియే అర్థము చెప్పినచో నది యా శబ్దార్థమునకు మరింత సన్నిహితమగునని తోచుచున్నది ఏమనగా 'పిరువీకు'లోని 'వీకు' అనునది 'పీకు' శబ్దరూపాంతరమే యనవచ్చును. ఈ 'పీకు' శబ్ద మేమిటి-అదెట్లు వచ్చినది అనునది మరొక ప్రశ్న. ఈ పీకులాట తీరుటకు మనము దాని ముందున్న 'పిరు' శబ్దసహాయమునే పొందవలసి నట్లున్నది. 'పీకు' ధాతువు కన్నడభాషలో గూడ కలదు. కిట్టెల్ నిఘంటువులో 'పీకు' తెలుగు ధాతువుతో సమానార్థకముగనే యున్నట్లు తెలుపబడినది. "to pull out, to pluck up" పెకలించుట, పెఱుకుట అను నర్థము గలదై యున్నది. దీనినిబట్టి 'పెఱుకుట'కు 'పీకు'టకు దగ్గర సంబంధమే యున్నట్లు తోచకపోదు. సంబంధమే కాదు, అభేదమే చెప్పవచ్చు ననిపించక పోదు. మళయాళమున 'పిళు' అను ధాతువు, తమిళమున 'పిడుంగు', 'పియర్' అను ధాతువులుకూడ సమానార్థకములుగ గ్రహింపబడినవి. దీనినిబట్టి ప్రాచీన ద్రావిడభాషలోని 'పిళు' ధాతువు-పిళుకు పిళుకు పెఱుకు పీకు అను రీతిని పరిణామము నుబొంది-తెలుగు కన్నడములలో-పెఱుకు పీకు రూపము లలో నిలిచిన దని తలంపవలసియున్నది. ఇట్లు పెఱుకు -పీకులకు సన్నిహితసంబంధమే గాక 'పీకు'లోని యర సున్న-దీని పూర్వరూప మగు 'పిఱుకు-పెఱుకు' అను దాని లోని శకట రేఫము లోపించుటచే దాని స్థానమున నడుమజేరినదని నిశ్చయింపవచ్చును. దీనిని బట్టి యా 'పిరువీకు' అను పదబంధములోని తొలి పదము 'పిఱు కు'కు సంబంధించిన దని తెలియుచున్నది. కావున నిది పీకు+పీకు-అని పీకు శబ్దద్విరుక్తిచే నేర్పడినది కాక 'పిరుకు+పీకు అను ప్రాచీన నవీనరూపముల చేరికచే నేర్పడిన ట్లూహింపదగియున్నది. ఈ పదబంధములో 'కు' వర్ణలో పము రెండవ దానిలోని 'పరుష 'ప' వర్ణమునకు-'వ' కారాదేశము (గ-స-డ-దవాదేశము) గల్గి ''పిరువీకు''- అను శబ్ద మేర్పడినది. దీనికి పై పద్య సందర్భములోగూడ పెనగులాడుట అనుట కంటె 'పీకులాడుట' అని అర్థము చెప్పుకొనుటయే యుక్తమగును. ఏమనగా సిగ్గు వెనుకకు, రాగము ముందుకు త్రోయుచుండగా, చెలులు ఒకరటు ఒకరిటు త్రోద్రోపులాడుచుండగా పడతి వారినుండి పెకలిం చుకొని-తన్ను ఈవలకో ఆవలకో వారినుండి పెఱికికొనవల సిన స్థితి గలిగిన దని చెప్పుటయే యుక్తముకాని వారితో ''పెనవేసికొని'' - పెనగులాడుచునే యుండు స్థితి గలిగిన దని చెప్పుట యుక్తముగా గనబడదు. 'పెనగు' - ధాతువు పెనవేయు - పేనుట - మెలివేసికొనుట అనుదానితో సంబంధించినది. ఈ విధముగా 'పిరువీకులాడు' అను తెలుగు పదబంధములో ప్రాచీన భాషలోని 'పిఱు' ధాతువు నుండి యేర్పడిన రెండు రూపము లెట్లొండొంటితో పెనవేసికొని కాలక్రమమున నొక క్రొత్త పలుకుబడిగా నేర్పడి యా తెలుగుభాషలో నెట్టి భావస్ఫురణకు దోడ్పడినవో యను విషయమును గమనించినచో నది యాశ్చ మును గొలుపక మానదు. ఇది యొక్కటే గాదు- ఇ వింక ననేకము లీ భాషలో గలవు. ఇట్టివానికి ధాతుప- ములని, శబ్దపల్లవములని లాక్షణికులు పేరుపెట్టిరి. ధాతు, పదసం యోగ రూపములగు నిట్టి పల్లవముల నపారముగా బెట్టుట చేతనే యీ దేశభాషావృక్షము చక్కగా పెంపొంది గుబురుకొ న్నది. ఈ పదబంధ రీతులలోని అర్థములలోని చమత్కారము లును గమనింపదగినవే. కాలక్రమమున నీ 'పిరువీకు' అను శబ్దస్వరూపము వలెనే అర్థమును మారి-పీకులాడు, బాధించు అను నర్థ మేర్పడినది.

''కని చుట్టువారుకొని యుట్టుపడుం బిరువీకు సేయుదు'' - (పరత. 5. ఆ.)

''ఇట్లు బహువిధంబుల బొదివి కాలకాళికునిం 'బిరువీకు సేయు' బ్రహ్మచారులకు బ్రియంబున వందనం బొనర్చి'' - (హరిశ్చం. 1 భా) ''అనహ్యావర్తనలం బిర్వీకులం బెట్టు దుర్జాతున్'' (పాండు, 4, ఆ) ఇత్యాది ప్రయోగములందు ''పిరువీకులాడు'' 'ఆడు' ధాతు సహాయమున గాక, చేయు, పెట్టు- ధాతువుల సహాయమును బడసి యాపదబంధమే -బాధించు అను నర్థమును వ్యక్తము చేసినది.

ఇట్లు - త్రోపు + త్రోపు = త్రోద్రోపు -, (పిరుకు) పీకు+పీకు=పిరువీకు అయినట్లే- త్రొక్కు + త్రొక్కు = తొఱుద్రొక్కు, తొఱుద్రొక్కులాడు. త్రొక్కు-తొక్కు, పీకు- వీకు వలెనె-'త్రొక్కు' అనునది కూడ ప్రాచీనంబగు నొక మూలధాతువు యొక్క పరిణతరూపమే. మూలధా తువు కన్నడమున -తుళిక్కు (to tread upon, to trample) అను రూపమున నున్నది. 'తుళిక్కు' - అనునదె - దానికి

గలిగిన వర్ణ వ్యత్యయము చేత - తుళిక్కు-తొళిక్కు-త్రొక్కు-అయినది. తెలుగు భాషలో ప్రాచీన రూపములోని 'ళ' కారము శకటరేఫమై, తుళిక్కు - తొళిక్కు - అని యుండగా తొళిక్కు+త్రొక్కు=తొఱత్రొక్కు అని యైనది. మిక్కిలి త్రొక్కుట అని యర్థము కలిగినది. ఇట్టివింకను ఈ భాషలో ననేకములు.

వఱువట్లు=మిక్కిలి వట్టిపోవుటలు. 'అది వట్టిది-అనగా అబద్ధము - నిజము కానిది, అని యిప్పుడు అర్థము వచ్చినది. 'వట్టికుండ'= 'కుండలో ఏమియు లేదు' అని అర్థము-కాని యివి లాక్షణికార్థములు. అసలు ఈ ధాత్వర్థము -'ఆవు వట్టి పోయినది-పాలిచ్చుట లేదు'- అను సందర్భమున 'ఎండిపోయినది.' అని వ్యక్తమగుచు ౦ది. ''వట్టి గడ్డి''-అన్నప్పుడు కూడా ఎండిపోయిన గ అని దీని సహజమైన అర్థము తెలియుచున్నది. కాని ''వ '' అనునది మాత్రము మూలరూపము కాదు. 'వఱు' అనునదే దీని మూలరూపము. 'వఱు' అనునది విశేషణముగా నున్నప్పుడిందలి 'ఱ' ద్విత్వమును బొందుట ద్రావిడభాషా సహజ లక్షణము. కావుననే-వఱు-వఱ్ఱు-అయి-వట్టు వట్టు-'వట్టి' అనువ వేర్పడినవి. (cf చిఱు-చిఱ్ఱు-చిట్టు-చిట్టి-చిటి; ఏఱు-ఏఱ్ఱు-ఏట్టు-ఏటిగట్టు. మాఱు-మాఱ్ఱు-మాట) అత్యంతము వట్టి పోవుట = వఱువట్లు వట్టుట. నన్నిచోడుడు తిక్కనగూడ దీనిని ప్రయోగించినారు. పంచమాశ్వాసమున నగజచెలులు ''వలవంత వఱువట్లు వట్టిన నాలుకతల ముద్దుమాటలు మెలగియాడ, పరము డెన్నడొక్కో ప్రత్యక్షమైన తనరూపు శైలసుతకు జూపు నెలమి''-అని యందురు. వలవంతచేత నగజనాలుక వఱువట్లు వట్టినదట. అనగా మిక్కిలి వట్టిపోయిన దయినది. తడిలేక యెండిపోయిన దయినది. ఇట్లు తడిలేక యెండిపోయిననే 'వరుగులు' - 'ఎండి వరుగై పోయినది' అందురు. భారతములో విరాట పర్వమున బాంచాలి రావించి సుధేష్ణ తృష్ణ భావించుచు నిట్లనియె:

క. ''ఒదవెదుతృష పెల్లిదమున
వదనము వఱువట్లు వట్టె, వాసితరాజ
న్మదిరారస మానగ నా
హృదయంబున వేడ్కయెసఁక మెసఁగెడుఁదరుణీ.

క. కీచకుని యింట నెప్పుడు,
వాచవి యగు బహువిధముల వారుణి గలుగున్
వే చని యుచటికిఁ గొనిర
మ్మా, చూతము గాని నీ గమనవేగంబున్''

అని పంపినది.

ఇచ్చట సుధేష్ణ కొదవెదు తృష పెల్లిదమున నామె వదనము 'వఱువట్లు' వట్టినదట-మిక్కిలి యెండి తడియారి పోయినదని యర్థము. ఇట్టి సందర్భములో మిక్కిలి యెండి వట్టిపోయెననుటకు నీ వఱుధాతువు యొక్క తొలిరూపము మలిరూపము రెండును గలిసిన పదబంధ మాయర్థమును ఎంత చక్కగా వ్యక్తము చేసినది! ఈ పదబంధమునకు దుదినజేర్పబడు సహాయధాతు భేదము చేత నీ తెలుగు పలుకుబడికి అర్థమునందు కొంత భేదము క్రొత్త అందము కూడా కలుగుచున్నవి. ''వఱువట్లువట్టు'' - వఱువట్లు వారు, వట్టిపోవు-ఇట్లే- పిరువీకులాడు = పెనగులాడు, పిరువీకు సేయు, (బాధించు) మొదలగునవి.

ఇట్టిదే మరొక తెలుగు పలుకుబడి-ఇఱ్ఱింకు లింకుట. మిక్కిలి శుష్కించు, క్షీణించు మిక్కిలి ఇంకిపోవుట - అనునది మూలార్థము. ఇఱ్ఱింకులు-(ఇంకులు+ఇంకులు) మిక్కిలి ఇంకిపోవుటలు-అని శ ర. ఇంకులు+ఇంకులు కలసి 'ఇ ంకు లగుట' సందర్భముగా లేదు కావున 'ఇంకు' ధా తువునకు బూర్వరూపములో నొక 'ఱ' కార ముండవలె. అది 'ఇఱుకు'ధాతువై యుండును. తమిళమున 'ఇఱంకు' అనునది కలదు. దాకిని 'ఇఱుకు' కొనుట, అడగిపోవుట అనియే అర్థము. నీరు క్రమముగా అల్పదేశములో నిఱుకుకొని పోయియే 'ఇంకి' పోవుటయు దటస్థించును. కావున 'ఇఱంకు' ధాతువే నీటికి సంబంధించి - ప్రత్యేకార్థమున 'ఇంకు' ధాతువైనది కాబట్టి అత్యంతము 'ఇఱుకు' కొనుట లేక-'ఇంకులు'-'ఇఱ్ఱింకులు' యైనది.-

సీ. ఇఱ్ఱింకు లింకి బీరెండఁ బెన్ బీటికల్
గాతంబులై తటాకములు బలసె.''
(శ్రీ ర.మా. 4 ఆ)

ఇచ్చట - తటాకమునందు నీరు అత్యంతము ఇంకిపోయి, అనునర్థముననే ప్రయోగింపబడి క్రమముగా లాక్షణికార్థమున-పస్తుండు, కృశించు అను నర్థముకూడ వచ్చినది.

సీ. ''భానువారపు వీరభద్రపళ్లెర మిదు
గృహదైవతంబు లిఱ్ఱింకు లింక''-
(ఆము.4 ఆ)

నీరింకుట, కృశించుట-అనుదానినుండి క్రుంగబడు అను నర్థముకూడ వచ్చినది.

సీ. ''ఎవ్వాఁడు వింధ్యాద్రి నిఱ్ఱింకులింకించె
గంభీర హుంకార గర్జనమున.''
(భీమ. 2 ఆ)

'ఇఱ్ఱింకు లింకుట, ఇంకించుటయే గాక-ఇఱ్ఱింకులు చేయు (=అడచు) అను పలుకుబడిగూడ కవిప్రయుక్తమైనది. శ్రీనాథుడు నైషధములో:

ఉ. ''మంకెనపువ్వుమీఁది యలి
మాడ్కి నృపాధరపల్లవోదరా
లంకృతి యైన దంతపద
లాంఛనముం గని కన్నుగోనలం
దంకురితంబు లైన దర
హాసలవంబులు పద్మనేత్ర యి
ఱ్ఱింకులు సేసెఁ బక్ష్మముల
యాఱమి గాటుక చిమ్మచీకటిన్.''

దీనినిబట్టి 'ఇనుకు-ఇంకు ధాతువు-ఇఱుకు-ఇఱుంకు- ధాతువుయొక్క పరిణతరూపమే గాని మూలధాతువు కాదని స్పష్ట మగుచున్నది.

''ఇఱ్ఱింకులు'' లాంటిదే 'ఇల్లిగ్గులు' కూడాను. ఇగ్గు+ఇగ్గు= మిక్కిలి ఒఱగుటలు అని అర్థము. ఇగ్గు-ధాతువునకు = వెనుక కొఱగుట యని అర్థము కావచ్చు గాని-ఇగ్గు-ఇగ్గు కలసి 'ఇల్లిగ్గగుట' యేమి యనునది ప్రశ్న.

తమిళ కన్నడాలలో ఇఱిగు=లాగు, జాఱు, ఒఱుగు-అను నర్థముగల ప్రాచీనధాతువు కలదు ఇఱిగు ఇగ్గు అయి యుండును - ఇఱిగు అను ప్రాచీన ధాతుస్వరూపమే యా 'ఇల్లిగ్గులు'' అనుపద బంధములో బొడసూపుచున్నట్లున్నది.

''లొల్లి యగు వగలఁద్రొక్కన,
నిల్లిగ్గులు గానవచ్చు హృదయములోనన్,
మల్లామడి యగుమదనుడు,
మెల్లన కూర్చుండెఁ దాల్మి మినుమినుకనఁగన్.''
(ఉ. హరి. 5 ఆ)

ఈ ఉత్తర హరిశంశ పద్యములో 'మల్లామడి'- 'మినుమినుకు' అను మఱి రెండు పదబంధములీ జాతికి జెందినవే కానవచ్చుచున్నవి. 'మల్లామడి'-శబ్దమునకు 'పీడితుఁడు' అని అర్థము మాత్రమే శబ్దరత్నాకరకారు డిచ్చి యూరకున్నాడు గాని అతిశయార్థ మందున్నట్లు సూచింపలేదు. కాని 'మల్లామడి'-అనుదానికి-మిక్కిలి మడగిపోయి-అని యర్థమేమో యని తోచును. మిక్కిలి మణగిపోయినవాడే పీడితుడును కాక మానడు గదా! కాని 'మడగు'-ధాతువునకు - 'మల్ల' శబ్దమునకు గల సంబంధము స్ఫురించుట లేదు. మినుకు+మినుకు='మినుమినుకయ్యె ననుటకు సందేహము లేదు. ఇట్టి ద్విరుక్తి మూలముగా నొక యనుకరణమును లేదా అనుకరణధ్వనిని లేదా రీతిని సూచించు శబ్దము లపారముగా తెలుగుభాషలో కలవు వీనిని గూర్చి తరువాత వ్రాసెదను.

ఇఱ్ఱింకులవంటిదే - ఉఱ్ఱూతలూగు అనునదొక పద బంధము. దీనికి 'మిక్కిలి యూగు' అని అర్థము. (ఊఁగు+ఊఁగు)

''ఉఱ్ఱూత లూగెడు నుదయాస్తగిరులచే నాకాశలక్ష్మి కోలాటమాడ.'' (అని ఉత్తర హరివంశము, 4-ఆ). దీనికే ''ఉఱ్ఱటలూగు'' అనునది మఱియొక రూపముగా గనబడు చున్నది. ''ఉఱ్ఱూత''లే ''ఉఱ్ఱట'' లై యుండును. దీనిని బట్టి 'ఊఁగు' ధాతువునకు బూర్వరూపము 'ఉఱుగు' అనునదై యుండునని తోచుచున్నది. 'ఉఱుకు'-అనునది 'దుముకు' అను నర్థమున గలదు. కాని యిందు చలన మున్నను-ఊఁగుట యను నర్థమున్నట్లు కానరాదు. రేఫ ముతో గూడిన 'ఉరియు' ధాతువునకు చలించు నను నర్థము కలదు. దీనినుండి 'ఉరియాడు' ఊఁగులాడు, ఉరియాట=ఊఁగులాట అను శబ్దములు వాడుకలో గలవు. కాని శకటరేఫ మైనగాని యిట్లు ద్విత్వమునుజెంది 'ఉఱ్ఱూతలూగు' వంటి పదబంధమునకు మూలము కాదేమో యని సందేహము. ఒకవేళ ఉరియాడు-లో గూడ తొలుత శకటరేఫమే కలదేమో. తొలుత శకటరేఫము - రేఫముగా మార్పు నొందుట పెక్కు సందర్భములలో గాననగును. ఉఱుగు+ఉఱుగు=ఉఱ్ఱూఁగు, అయి యుండును. ఊఁగు ధాతువులోని యరసున్న శకటరేఫ స్థానీయము గావచ్చును. లేదా 'ఇఱుంకు'-ఇంకులో వలెనే 'ఉఱుంగు ఊంగు ఊఁగు - అయి యుండును. ఈ 'ఊఁగు' ధాతువునుండియే తమిళమున 'ఊంజల్' = ఊంజెల తెలుగు ఊయెల శబ్దము లేర్పడియుండును. ఊఁగు నుండి నామవాచకరూపము - ఊంత - ఊత - ఉఱ్ఱూగుట=ఉఱ్ఱూత. ఉఱ్ఱూతలుగా ఊఁగుట= ఉఱ్ఱూత లూగుట-యగును.

బిఱ్ఱబిగియు=మిక్కిలి బిగిసికొను (బిగియు+బిగియు)

''పెద్ద లయ్యును కడు బిఱ్ఱబిగిసి యుంద్రు
వట్టి యభిమానములను గర్వములబట్టి.''
(కాశీ. 7 ఆ)

''బిఱ్ఱు'' ధాతువునకే 'బిరుసగు' అని యర్థము కలదు. బిరుసు=అనగా కాఠిన్యము. ''నెత్తుటన్ బేరిన కోరమీసములు, బిఱ్ఱిన వెంట్రుకలున్'' (భో. 4 ఆ)- బిఱ్ఱిన=బిరుసెక్కిన, కఠినత వహించిన, బిగియుటయు -బిరుసై కఠినత వహించుటయే యగును. కావున 'బిఱ్ఱగుట'

యే ''బిగియుట'' అని చెప్పవచ్చును. బిఱు+అగు=బిగు వగు. మిక్కిలిబిగియుట బిట్టుబిగియుట. 'బిరడా' - శబ్దములోని రేఫముకూడ-నీ బిట్టు శబ్దములోని శకటరేఫస్థానీ యమే యనవలె. బిగు వగుటకుగా త్రిప్పునపుడు గలుగు ధ్వన్యనుకరణమును బట్టియే యీ 'బిరబిర' బిట్టు, బిఱడా మొదలగు శబ్దములు బయలుదేరి యుండును. ఈ బిట్టు -నుండియే ''బెట్టు'' ''బెట్టుసరి''- వచ్చియుండును.

చ. ''బిరబిర ద్రిప్పి వైచుటయు
బెట్టుగ నెత్తురు నోర గ్రక్కుచున్
ధరణీతలంబునం బడియె''
(వి. వ. 7 ఆ)

చ. ''దంపతుల్ బిఱుబిఱు జుట్టుచున్
బికిలిపిట్టల క్రైవడి బోరి రెంతయున్
(చంద్రాం.)

ఈ 'బిట్టు' నుండియే ద్విర్భావంబున 'బిట్టబిట్టు' శబ్దము కూడ నేర్పడినది. (బిట్టు+బిట్టు) = మిక్కిలిబిగువు.

చ. ''అనవుడు నట్ల కాక యని
యా సతి విప్రుని యింటి కేగి య
ల్లన నత డొంటి యున్కి పది
లంబుగ జూచి సమీపమందు ని
ల్చిన గని బిట్టబిట్టు దన
చిత్తము జల్లన మోము దేరుకో
గనుగొని యింతప్రొద్దిటకు
గామిని రా గత మేమి నావుడున్.''
(భోజరా. 4 ఆ)

ఇట్లు బిట్టబిట్టు అనుదానికి మిక్కిలి బిగిసిన-అని యర్థ మగుచున్నది. విశేషణముగా నిలిచినపుడు బిట్టు-బిట్రుగా పలుకబడు నను ద్రావిడ భాషలలో సుప్రసిద్ధమే.

విట్టువీగు-(వీగు+వీగు) మిక్కిలివీగు-నిక్కు. దీనిలోని 'వీగు' ధాతువున కిప్పుడు 'నిక్కు' అని యర్థము. ఈ 'నిక్కు' ధాతువుకూడ ''నిల్+కు''=నిక్కు అనగా ''నిలచు, నిలబడు'' అను దానినుండి యేర్పడినదే. ''నిటాక్క నిలబడినా''డని చెప్పుటయు కలదు. నిట్ట=నిక్కు, నిట్టనిలు చు=సరిగా నిలుచు, నిట్టరాడు=నిలువు కంబము మొదలగు శబ్దములలో నీ 'నిట్ట'=నిలువు, శబ్దము గానవచ్చుచునే యున్నది. కాని 'వీగు' - అనుదానికి 'నిక్కు'ట - నిలబడుట అను నర్థ మెట్లు గలిగినదని మాత్రము సందేహము కలుగవచ్చును. ఈ 'వీగు' అనునది 'విఱుగు' ధాతువునుండి యేర్పడిన దని గ్రహించినచో నీ సందేహము పోవచ్చును. విఱుగు అనుదానికి తునుగు అను నర్థము కలదు గాని, విఱుగబడు, గర్వించు, ఒడలు విఱుచుకొనుట, విక్కు=విజృంభించు, గర్వించు, విక్కవిరియు మొదలగు సందర్భములలో- విజృంభణ-గర్వప్రదర్శనార్థమై ఒడలు నిగుడించి-విఱుచుకొని 'నిక్కు'చూపుట యను నర్థము సిద్ధించుచునే యున్నది. ఇట్లు 'నిట్టువీగు' అనునది విఱుగు వీగు శబ్దముల కలయికచే నేర్పడిన దని తలంపవ లసి యున్నది.

ఇక 'నిట్టనిలుచు', 'నిట్టకనిలుచు' అను పదబంధములు కలవు. ఇవి(నిలు+నిలు) అనుదాని చేరికవలన నేర్పడినట్లు చెప్పబడి యుండలేదు. కాని నిట్ట-శబ్దము వాస్తవముగా 'నిడు'-నిడుపు-శబ్దమునకు సంబంధించినదై-నిడుపుగా నిలుచు = నిట్టనిలుచు అనియే యేర్పడెనని చెప్పదగియు న్నను- పరిశీలించినచో నిడు-నిలు-రూపము లేక ధాతుజన్య ములే యని తోచకపోదు. నిడుద, నిడుపు, నిడివి అనువానికి 'దైర్ఘ్యము' అని యర్థము. వీనికిని 'నిలువు'-నిలుచుటకును సంబంధము సన్నిహితమే యనిపించును. 'నిల్'+కు=నిక్కు కాగా-'నిక్కు'-అనునదే మరల ధాతువుగా బరిగణింపబడుచు న్నపుడు నిల్+తు=నిడు-నిట్టు-అనునదికూడ మఱియొక ధాతువై యేర్పడియుండవచ్చును. నిడు-విశేషణముగా నిలిచి నపుడు-నిట్ట-యగును. ఇట్లే నడు-నట్టయగును. కావుననే - నడుము + నడుము = 'నట్టనడుమ' యైనది. 'నరినడుము'-అని యర్థ మగును. నడు+అడవి=నట్టడవియై నది. కాని 'నట్టనడు'మనియే గాక 'నట్టకనడుమ'నియు నొక రూప మదే యర్థమున గానవచ్చుచున్నది. 'నట్టక నడురేయి' అని వేంకటనాథుని పంచతంత్రమునంది యొక్కటే ప్రయోగముగలదని శ.ర.లో తెలుప బడినది. ఈ 'నట్టనడుమ' లాంటి శబ్దములనేకములు కలవు. కాని యిందు పెక్కింటిలో నీ నడుమ వచ్చు 'ద్విరుక్త టకారాగమము' సహేతుకముగా లేదా సమర్థనీయముగా గనబడదు. శకటరేఫముతో గూడిన శబ్దములు విశేషణము లైనప్పుడు ద్విత్వమును బొంది ఆ ద్విత్వ రూపము 'ట్ర' కారోచ్చారణము గలదగుటచే నందలి రేఫోచ్చారణము వదలిపోయిన ప్పుడా శబ్దము ద్విరుక్త టకారముతో బలుకబడి నట్లే-కడు, నడు, నిడువంటి 'డు' వర్ణాంతశబ్దములును విశేషణములై నిలచినపుడు వీనియందలి 'డ' కారము ద్విరుక్త టకారముగా బలుకబడుట ప్రాచీన ద్రావిడభాషా సంప్రదాయ మగుటచే (ఇప్పటికిని తమిళభాషా సంప్రదాయ మదే) నట్టి 'డు' వర్ణాంత శబ్దములపై ద్విరుక్త టకారాగమము సమర్థనీ యమే యగుచున్నది. కావుననే నట్టిల్లు, కట్టలుక, నిట్టూ రుపు మొదలగు పదబంధములు, చిట్టెలుక (చిఱు+ఎలుక),

కుట్టునురు (కుటు+ ఉసురు), నిట్టుపానము (నిఱు+ఉపా నము), మిట్టమిట్టు (మిట్టు+మిట్టు)-మొదలగు వానివలెనే ద్రావిడధ్వని సంప్రదాయానుకూలములై సమర్థనీయములే యగుచున్నవి. కాని మఱికొన్ని.-

పట్టపగలు = (పగలు+పగలు) = మట్ట మధ్యాహ్నము.
చిట్టచివర=(చివర+చివర)=అన్నిటికి చివర.
కొట్టకొన=(కొన+కొన)=అన్నిటికి కొన.
తుట్టతుద=(తుద+తుద) = కేవలము తుద.
మొట్టమొదట=(మొదలు+మొదలు) = అన్నిటికి మొదలు.

తెట్టతెరువు, తెట్టతెన్ను, ఎట్టయెదురు, కట్టకడ = (కడ+కడ) వంటి పదబంధములలో నీ ద్విరుక్త టకారాగమ మునకు కారణము గానిపించుట లేదు. ఇట్టి రూపము అన్నియు పై రూపముల సామ్యము చేతనే (Analogy) భాషలో నేర్పడిన వని తలంపవలసియున్నది.

ఇట్లే పదముల ద్విరుక్తిచే నేర్పడిన పదబంధములు మఱికొన్ని కలవు. కాని వీనిలో దొలిపదమున జేరిన వర్ణము లెట్లచ్చుట చేరినవో సులభముగా గ్రహించుట కనువుగా లేదు. మూలశబ్దములకంటె భిన్నములగు శబ్దముల కలయిక గలిగినట్లూహింపవలసి యుండును. అట్టి వానిలో గొన్ని:-

తెకతేర=(తేర+తేర)=బొత్తిగా సంబంధము లేనిది.

పారిజాతాపహరణము. 4 ఆ.లో దీని ప్రయోగము కలదు.

సీ. ''వినుదు సురేశ్వరు వనపాలకులు వార్దిఁ
బొడమిన యాదివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె? యింద్రుడు నెవ్వండు
తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ
ధధిపుడై ధరియించె నతండె చేకొనుగాక
తెకతేర యిది యేమి యొకరి సొమ్మె.''

'ఇది యేమి తేరగా వచ్చిన సొమ్మా-తీసికొనుటకు'-అను నర్థమున 'తెకతేర' ప్రయోగింపబడినది. తేర+తేర=తేతేర గావచ్చును గాని 'తెకతేర' యెట్లయ్యెనో తెలియవచ్చుట లేదు. 'తేరగా' అనునది 'తేటతేరు'-పైకి దానంతట అది తేరివచ్చు' అను నర్థమున- 'తేటతేరు' అని కావచ్చునేమో గాని 'తెకతేరు' కాదు. తుడుకు+తుడుకు=తుందుడుకు అయినది. అట్లే తునుకలు + తునకలు = తుందునుకలు (=చిన్న చిన్న ఖండములు); తుమురు+తుమురు=తుత్తు మురు (=మిక్కిలి తుమురు-అనగా పొడి) అయినవి. కావున తేరు+తేరు=తేతేరు- తెత్తేరు కావచ్చును. కాని మఱియొక పదబంధము 'తేరకుదేర' (తేరకున్+తేర) అనునది మిక్కిలి అనాయాసముగా నను నర్థమున గానవచ్చుచున్నది.

'బళిరా తేరకుదేర చిక్కె నిటులీ బంగారు కుండంచు' అని పాండురంగ మాహాత్మ్యమున తెనాలి రామలింగని ప్రయోగ మొకటి కానవచ్చు చున్నది. దీనినిబట్టి 'తేరకుదేర'- 'తెకతేర' అయిన దేమో యని యూహింపదగియున్నది.

ఇట్టివి మఱికొన్ని గలవు. వీనిలోను మూలధాతువున లేని క్రొత్తయక్షరములు తొలిపదమున జేరుచున్నవి. ఇవి భిన్నశబ్దములతో జేసిన పదబంధము లేమో!

తొప్పదోఁగు ( = తోఁగు+తోఁగు)=మిక్కిలి తోఁగు.

తుప్పలుదూలు (తూలు+తూలు)=మిక్కిలి చలించు.

చుబ్బనచూర(చూఱ + చూఱ) = పెద్ద కొల్ల.

తెట్టతెరువు (తెరువు+తెరువు)=నడివీధి.
తొప్పలు దోరలు=కోటానకోటులు.
కుప్పనగూర=కుప్పవడుట.
చెల్లాచెదరు-చెల్ల చెదరు (చెదరు+చెదరు)=మిక్కిలి చెదరి నది మొదలగువి.

ఇంక భిన్నపదములతో గూర్పబడిన మఱి కొన్ని పదబంధములు:-

తికమకలాడు=తొట్రుపడు.
తట్టుముట్టాడు=చుట్టుకొను. 'తట్టుముట్టాడు నిట్టి పేదరికము' (భాగ. 10 స్కం)

తకపికలాడు=ఇట్టట్టు చలించు. 'నవరత్నపు పాపటబొట్టు మోమునం దకపికలాడ'

తాఱుమాఱుపడు=వ్యత్యస్తమగు
తఱతఱలాడు=తత్తరపడు.
తలకొనుదెంచు=కలుగు
తరితీపుసేయు=ఉపేక్షించు
తరితీపులాడు=పెనగులాడు
తీన్‌తేరగా=తారుమారుగా
తుంపెనలాడు=చలించు.

తుంపెనలు గునియు=చలించు. 'నొసటిపై గురులు తుంపెనలు గునియ' (భాగ)

మాటుమడగు=నిశ్శబ్దమగు. 'అంత నక్కేశవుం డూరి యలబలంబు మట్టుపడ జూచి యిదె మాటు మడగె నమచు' (శుక. 2 ఆ)

ముచ్చుముడుగు=మిక్కిలిముడుగు. 'ముచ్చుముడింగి వ్రాలె వెడ మూర్ఛతనున్ బొదవెన్ రథంబుపై' (జై.భా.)

సదమద మగు=నలగినది అగు. సదమదము సేయు= నలపు, చంపు.

నగ్గినముగ్గినలు = ఉద్దగుడుపులు = ఊపిరి త్రిప్పలేక బాధ పడుట.

కకావికలు=యథాయథలు, చెల్లాచెదరు.

"సిగ్గునకుం గకావికలు,
చిత్తసమున్నతి పేరివార్తకున్
గగ్గుల కాడు, శంకలకు గన్కని
యెగ్గుకుఁ బట్టు డక్కకున్
నగ్గినముగ్గినల్, నిలుపు
సైరణకుం గననీని యెత్తికో
ళ్లగ్గజయానకుం బలికి
నయ్యె యథేష్టరహఃప్రసంగముల్."
(కవిక. 4 ఆ)

వికావికలు=చెల్లాచెదరు.
గగ్గులకాడు = ధాన్యము రాల్చిన కంకుల సమూహము.

క. "సిగ్గువడి విరియ బాఱిరి
బగ్గన బొరివుచ్చు వీరభద్రునిధాటిన్,
నుగ్గులయి యువురునవురయి,
గగ్గుల కాడై వికావిక లయి యమర్త్యుల్."
(కాశీ. 7 ఆ)

కక్కిరిబిక్కిరి=తాఱుమాఱు.
ఇవురునవురగు=ఎండిపోయి చదునగు.
హల్లకల్లోలము=తాఱుమాఱు.
ఒంటర మింటరములు = విరోధము, సంకటము.

క. ఒంటమి లేనివి యొంటర
మింటరములు పలుకు టుచితమే.'
(భార. ఉద్యో. 4 ఆ)

ఆలగోడు బాలగోడు=పెడబొబ్బలు.
ఇంచుమించు=న్యూనాధిక్యము.
అఱగొఱ=న్యూనత
అల్లిబిల్లిగొను = పెనగొను - 'మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాంతారంబునందు' (స్వా.మ. 2 ఆ)
అఙ్ఞాకలి=(ఆకలి+ఆకలి)? = మిక్కిలిక్షుత్తు.

అమ్మకచెల్ల = ఔరా!-'అమ్మకచెల్ల నా హృదయ మమ్మక చెల్లదు వీని కియ్యెడన్.' (విజ. వి.)

అదవదపడు=కలతపడు.
ఉవ్విళ్లూరు=త్వరపడు.
ఈఱతాఱలు=వక్రము.

"వంక యైనతలంపెల్ల వసుమతీశ
యరయ మృత్యుపదం బగు నార్జవాన్వి
తంబు బ్రహ్మపదం బింత తథ్య మేల
యీఱతాఱ తలంపుల బీఱువాఱ."
(భార. అశ్వ. 1 ఆ)

కంచుమించు=అగోచరము.
కాందారిమాందారిప్రొద్దు=అర్ధరాత్రము.

గానట బీనట, చికమక, చిందఱ వందఱ, చీకిలిమాకిలి, చిఱ్ఱుముఱ్ఱాడు.

ఇట్టి వనేకములు దేశీయపు తెలుగుపలుకుబళ్లు ఇంకను గలవు. కాని యివి చాలవఱకు ప్రాచీనసాహిత్యమునందే నిలిచిపోయినట్లున్నవి. సమానార్థకములకు సంస్కృత పదములను ప్రయోగించు నలవా టెక్కువ యగుటచే-క్రమముగా నట్టివి సామాన్యవ్యవహారమునందుండి జారిపోయి కోశములందు మాత్రమే వెదకుకొన దగినస్థితికి వచ్చినవి. దీనినిబట్టి సంయోగాత్మకమైన ద్రావిడభాషలలో నొకటి యగు దేశి తెలుగున-ధాతుపద సంయోగముచే నెట్టి శబ్ద పల్లవముల కల్పింపబడుచు వచ్చెనో, యర్థభేదములను, భావచ్ఛాయలను సూచించుట కేదేశి శబ్ద పల్లవరచన యెన్ని విధములుగా నుపయోగపఱుప బడుచుండెనో వ్యక్త మగుచుండుటే గాక దేశి తెనుగు సామాన్య భావ ప్రకటనమునకు చాలదను వాద మెంత బలహీనమో తెలియవచ్చు చున్నది. సంస్కృత శబ్దజాల ప్రయోగమున కలవాటుపడి దేశిపదజాలము నొప్పరికించుటం జేసి యెంత దేశి శబ్దజాల మంతరించినదో యూహించుట కూడ కష్టమే.

ఒక్కొక ధాతువు మూలముగా నేర్పడు శబ్దకూటమపారముగా నుండి అనేక విధముల భావచ్ఛాయలను వ్యక్తీకరించుచుండును. అట్లే ఒక్కొక శబ్దమున కనేక విధములగు ధాతువులు చేరి అనేకవిధములగు భావచ్ఛాయలను సూచించును. ఆడు, కొను, తెంచు మొదలగు ధాతువుల మూలముగా నేర్పడు పలుకుబళ్లు ఎన్ని విధములో చూడుడు:-

ఆడు-మాటాడు, వేటాడు, కొట్లాడు, కొండాడు, కొనియాడు, చెండాడు, తూఁటాడు, ఈడాడు, ఈదులాడు, తీర్థం బాడు, నోనాడు, సరసమాడు, నవ్వులాడు, పంతాలాడు, అఱ్ఱాడు, పీగియాడు, మిట్టాడు, పోరాడు, పొరలాడు, నీళ్లాడు, తునుమాడు, తుంపెనలాడు, చిట్టాడు, చిటచిట

లాడుకొక్రోడాడు, కోరాడు, ఎగురులాడు, దుముకులాడు, పెనగులాడు, ఎక్కాడు, నడయాడు.

తెంచు--ఏతెంచు, చనుదెంచు, తోతెంచు, తాకుదెంచు, వీతెంచు, నడతెంచు.

కొను-మార్కొను, చేకొను, కొనగొను, మేల్కొను, పసికొను, తీసికొను, పట్టుకొను, తగుల్కొను, ప్రోదిగొను, ప్రోవుగొను, నమకొను, వ్రేటుగొను, వేడుకొను, వడిగొను (మెలిగొను), మురికొను = ఖండించు. మునుకొను, ముంపుకొను (గుంపుగూడు), మరులుకొను, గుబులుకొను,పాదిగొను, పగగొను, పైకొను, రగులుకొను, కారుకొను =నల్లబాఱు. కలగొను, కయికొను, కడుకొను — (అతిశయించు) మున్నగునవి.

కొను-తొలిపదముగా నేర్పడిన పదబంధములు:-
కొనిపోవు, కొనియాడు, కొనివచ్చు, కొనుగోలు, కొనుబడి మొదలైనవి.

ఇట్లే-వెను: వెనుబాటు, వెనుబడు, వెనుదీయు, వెనుకద్రొక్కు, వెనుకవేయు, వెనుచఱచు, వెనుతవులు, వెన్నంటు, వెన్నడించు, వెంబడి, వెన్నిచ్చు, వెన్నాడు, వెన్నుదన్ను.

ధ్వన్యనుకరణమును సూచించుచు పదద్విరుక్తిచే నేర్పడిన పలుకుబళ్లనేకము లీ భాషలో గలవు. ఇతర భాషలలోని ట్లేర్పడిన పదబంధము లిన్ని గలవా యను సందేహము కలుగకమానదు.

ఇంతకు బూర్వము తెలిపిన 'కకావికలు', వికావికలు' గూడ నిట్టివే. పికపికలు=చెల్లా చెదురు.

''ఒకమటి విరిగినయమరులు
పికపికలై పోవ''
తకపికలాడు, తఱతఱలాడు, బుగులుబుగులన
''...నా గేం ద్రుడ
భృగువున మొగంబు లదరుట
బొగ లెగయగ విషము బుగులు బుగులున గ్రక్కెన్.''
(భీమ-4 ఆ)

బుడిబుడి-తొట్రుపాటు. బుడిబుడి మాట లాడుటయు (భార. ఉద్యో. 3 ఆ)
బుసబుసలాడు=బుసగొట్టు
బెకబెకలాడు = కప్పలకూత యందలి ధ్వన్యనుకరణమును సూచించును.
బొడబొడ - కాఱుటయందలి ధ్వన్యనుకరణము.
'నోటను బొడబొడ రక్తముందొరుగ'
బొనబొన-'వెడలుప్రేవుల ప్రోవు లదిమి'
బొళుకు బొళుకు=క్రక్కుట.
మట మటలాడు=మండు, మలమల=మాడు.
మిటమిట=మండువేసవి. 'మిటమిటని కటికి యెండన్'
మిడుమిడుకను=పరితపించు.

'పాలేటిరాచకన్నియ
మేలారెడు చూపులేక
మిడుమిడుకంచున్' (భాగ. 8 స్కం.)

మినమినలాడు=తళతళ
'మినమిన లీనెడు నునుమేనున'
మినుకు మినుకని మెఱయు,
మిలమిల, మినమిన,
'మిలమిలని ప్రొద్దుపొడుపున'
మిఱుమిట్లు. 'మిగులకన్నులు మిఱుమిట్లు గొనగ',
మురమర = మూల్గుట, అణగుట,
'మనుకొని మురమర మూల్గువారు' (రా.యు.కాం)

క. 'దురదుర బరువిడి బిరుసున
హరిహరి నిలు నిలువుమనుచు నసురయు గదిసెన్
మురమురు దివిజుల హృదయము
మెరమెర యిదే యణగుననుచు మెఱసెన్ హరియున్'
(భాగ.ద.)

మునమున- గోపమునగల్గు 'చిఱచిఱ'
ముసిముసి-నవ్వులు=చిఱునగవు.
మెక మెకపడు=ఉద్ధతినొందు.
మెయిమెయి నుండు.
మెరమెర =మనోవ్యథ. మెరమెరపడు=సందేహపడు.

మొఱమొఱలాడు - వస్త్రముల మ్రోత; రవరవ - మొరయుటయందలి ధ్వన్యనుకరణము. 'మొరసెన్-రవరవ మురజ రవంబులు (స్వా. 4 ఆ). రెపరెప=నిప్పుమంట మ్రోత, గాలి వీచుట. 'గాలి రెపరెప వీచుచున్నది.' లివలివ=దంతములు కదలుట-'కుదురు పట్టెడలి లివలివంగదలు రదనపంక్తులును' (కవి.క. 5 ఆ).
లుకలుక= పరిగెత్తుట యందలి ధ్వన్యనుకరణము.
పకపక=నగుట
తికమక=తాఱుమాఱు

క. ''ఒక మొగముగాక దివిజులు
తికమకగొని వైరులెల్ల దీకొని తమ్ముం
బకపక నగ, పకపకలై
లుకలుక బరువెత్తి రోడి లోగొనుభీతిన్''
(భాగ. 6 స్కం)

లొటలొట-'లొటలొట జని'
'తొటతొట పుర్వులు దొరగగ
లొటలొట మనుకొంచు నిండ్లలొనికిఁజన',
(భల్లా. 2 ఆ)

లొడలొడ-కాటుట.
తొటతొట-పువ్వులు పండ్లు రాలుట.
'వాని పువ్వులు ఫలాళులుండి
తొటతొట దఱుముగా నుర్వి రాలిపడగ

సొటసొట-సోలు.

క. 'కటపెట తొటతొట రాలెదు
పొటపొట చినుకుల ధరిత్రి పొడనట్టు వడన్
సొటసొట నాకట సోలుచు
దటతటపడు చాతకముల దైన్యముఁవాపెన్'
(వైజ. 3 ఆ)

తటతట-'తటతట గుండియలదరగ'
'ఱెక్కలు తటతట గొట్టుకొనుచు'.
(ప్రభా. 3 ఆ)

తొటుక్కు- తొటుక్కు-గుండె అదరుట.
'విలుకై గదలింపనోడి గుండియల్
తొటుకు తొటుక్కనన్ దిగులు
దొట్టిన భూభుజుడయ్యె నయ్యెడన్'
(పాంచాలీ. 2 ఆ)

వంకర టింకర,
వకవకలు-వకావకలు=చెదరుట.

వడవడ-వణకుట, వలవల-ఏడ్చుట, వలవల వ్రాలుట 'నేలపై వలవలవ్రాలె, కీ లెడలి వ్రాలిన పుత్తడిబొమ్మకైవడిన్. (భాగ-10ఆ) వికవిక-నవ్వుట, విర విర-విరియుట-(తొవలు విరవిర విరిసెన్) విలవిల-తన్నుకొనుట, (విలవిల దన్నుక విడిచె బ్రాణములు); విసవిస-త్రిప్పుట, విసవిస నగుచు; వెడవెడ = (అత్యల్పము)-వెడవెడ నడుములు; వెలవెల బాఱు, వెలవెల నగుట; వెలవెల బోవుట; సలసల కాగుట; సరసర-(శీఘ్రము)-సరసర గొనివచ్చుట; సురసుర స్రుక్కుట, సొటసొట పోవుట (కృశించుట), హళాహళి=కలకల ధ్వని. హుటాహుటి=వే గము, హోరాహోరీ=అవిరామము; అటమట, ఆదవద, అఱకొఱ, కివకివ, కిసమస, కుఱకుఱ (అల్పము), కొఱకొఱ=(కోపము), గలగల, గమగమ (వాసన), గలిబిలి, గిలిగిలి, గుసగుస, అచ్చికబుచ్చిక=(కలుపుకోలుతనము), అంజలి గుంజలి, అకటా వికటము, అడ్డదిడ్డము, అరవఱలు, ఆఱిముఱి, ఆందదుకు, ఉక్కిరిబిక్కిరి, ఉస్సురుస్సురు, చిటుకుపొటుకు, చిమచిమ, గోలుగోలు (న-ఏడ్చుట) చిలచిల-(కారుట); చివచివ-నడచుట, జలజల-ప్రవహించు.

ఇట్టి వింక ననేకము లుండును. వీనినిబట్టి యీ భాషలోని పలుకుబడి రీతులు పదబంధములందలి సంప్రదాయములు తెలియవచ్చుచునే యున్నవి గదా. సంస్కృత భాషలో నిట్టి పదరచనా సంప్రదాయములు ధాతుపల్లవ శబ్దపల్లవ కల్పనా పద్ధతులు గలవా? ఇవియన్నియు సంస్కృత సంప్రదాయాను సారములే యనదగియున్నచో నీ భాషల సమైక్య మేర్పడగ లదు. కాని ద్రావిడ భాషలలోని ధాతుస్వరూప లక్షణములు, తత్పరిణామవైచిత్రి సంస్కృతభాషా ధాతువులలో గానవచ్చు టలేదు. వానిని గూర్చి మఱియొక మాటు.

''న కర్మణా న ప్రజయా ధనేన
త్యాగే నైకే అమృతత్వ మానశుః।
పరేణ నాకం నిహితం గుహాయామ్
విభ్రాజతే యద్యతయో విశంతి॥

– శ్రీ 'కోరాడ' వారి డైరీనుంచి

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు:

# తాలిబొట్టు-మంగళసూత్రము

ఒక భాషలోని కవిత-సారస్వతము ఆ భాషను వ్యవహరించు జనులయొక్క, అనగా ఆ జాతి యొక్క జీవితచరిత్రను, సంస్కృతిని ఎట్లు తెలుపుచుండునో, అట్లే ఆ భాషలో నాయా కాలములందు వ్యవహారములో నున్న పదసముదాయము కూడ ఆజాతిజీవితపద్ధతికి, ఆచారవ్యవహారములు మొదలగు వానికి చిహ్నము కాగలదని సాహిత్యతత్వవేత్తలు చెప్పుదురు. ఈ భావము ననుసరించి పైపదముల స్వరూపలక్షణములు, చరిత్రము వానిని వ్యవహరించు జనుల జీవితాచార సంప్రదాయ ముల నెంతవరకు సూచించునో యించుక విచారింతము.

ఆంధ్రుల కవితావిషయములోను, వారి యాచార విషయ ములోను గూడ విశేషలక్షణములుగా గ్రహింపబడదగినవానిని గూర్చి కొరవి గోపరాజను నాంధ్రకవి ఆతడు రచించిన 'ద్వాత్రింశత్సాలభంజికల కథలు' అను గ్రంథములో కొంత ముచ్చటించినాడు. ఆ సందర్భమును ఇచ్చట అనువదించుట అప్రసక్తము కాదు.

విక్రమార్కుడను నొక రాజు కలడు. అతని పురోహితుడు త్రివిక్రముడు. ఈతని కుమారుడు కమలాకరుడు. ఈతడు చిన్న వయస్సున విద్యోపార్జనమునందాదరము లేక తిరుగు చుండగా తండ్రి యది సహింపక యాతని నింటినుండి వెడలగొట్టెను. కమలాకరు డిల్లు విడిచి దేశాటనము చేసి, అనేక పట్టణములను దర్శించి అచ్చటి పండితులయొద్ద ననేకవిద్యల నభ్యసించి పండితుడై కొన్ని సంవత్సరములకు మరల ని చేరెను. విద్యలను గడించి వచ్చిన కొమరుని జూచి తం సంతసించి రాజునొద్ద కాతనిని దీసికొనిపోయెను. కమలాక డా విక్రమార్కునకు దాను జూచివచ్చిన దేశములందలి విశే షము లన్నిటిని దెలుపుచు నాయా దేశములందలి కవితాలక్షణ ములను గూర్చి ప్రసంగించి అందాంధ్రదేశమునందలి కవితలో గల యపూర్వ లక్షణములను గూర్చి చెప్పదొడంగెను. ఆతడు జూచిన దేశములలో గణములు, గణజాతులు మొదల గునవన్నియు 'నొక్కవిధమ కవితల కెల్లన్.' ''ఇట్టి విధం బయ్యు నంధ్రమండలంబునం గోణదేశంబున దెలుంగు కవి తకు ప్రాలు వళ్లు నను నియమంబులు సూచినాడ నవి యెయ్యెడం దఱచు గాకుంట నపూర్వం బవధరింపుము-'

పుణ్యస్త్రీకి గుణంబు మంగళగుణం
 బు న్సొమ్ములై యొప్పఁగా
బణ్యస్త్రీకి సువర్ణ మౌ క్తిక సురూ
 పవ్యక్తి భూషాకృతుల్
గణ్యంబౌగతి సంస్కృతంబునకు వా
 గ్భావంబు శబ్దంబు లా
వణ్యాకారములౌc, దెనుంగునకుc బ్రా
 ల్వళ్లుం గడున్ వన్నియల్.

పలుదెఱంగులైన పలుకులు గలిగియుం
బ్రాలు వళ్లు లేని బేలుగవిత
వన్నె లెల్లc గూర్చి వ్రాయుచో గాటుక
వన్నె లేని ప్రతిమ వ్రాతc బోలు''

అని పుణ్యస్త్రీకి గుణంబు, మంగళగుణంబు (మంగళసూ త్రము) సొమ్ములై యొప్పినట్లుగా దెనుంగునకు (తెనుగుకవి తకు) ప్రాలు, వళ్లు అనునవి కడున్ వన్నె దెచ్చు సొమ్ములగు నని తెలిపినాడు. ఇంతేకాక సంస్కృతకవితను బణ్యస్త్రీతో బోల్చినట్లుగూడ నగపడుచున్నది. పుణ్యస్త్రీకి సువర్ణమౌక్తిక సురూపవ్యక్తి భూషాకృతులు గణ్యంబైనరీతినే, సంస్కృతము నకు వాగ్భావము, శబ్దము లావణ్యాకారము లగునట. ఎట్లన్న నను పుణ్యస్త్రీకి గుణమును, మంగళసూత్రము నెట్టివో తెలు గుకవితకు ప్రాస, వడి అట్టివేయై వన్నె గూర్చుచున్నవని తేల్చినాడు.

ఇట్లీరీతిని గోపరా జాంధ్రకవితాసతికి వన్నె దెచ్చిన విశేష లక్షణములను గూర్చి చెప్పుచు నాంధ్ర సతీలలామజీవితము నకు వన్నె దెచ్చు ప్రధానలక్షణములను గూడ జమత్కారముగ దెలిపినవాడైనాడు. ఆంధ్రకవితలో నొక్కొక పద్యమునందలి భిన్న పాదములను, పాదములలోని దళములను యతిప్రాస లెట్లొక సూత్రమున బంధించి యా పద్యమునకు వన్నె గూర్చు చున్న వో, అట్లే మంగళసూత్రమనునది ఆంధ్రసతి జీవిత మును తత్పాణి గ్రహీతృ జీవితముతో ననుసంధించి యామె జీవితమునకు వన్నె దెచ్చుచున్నది. సంస్కృత కవితలోని యనుప్రాసాదికము బాహ్యాలంకారసదృశమై వాగాడంబరము నకు మూలమగుటచే గాబోలు నీకవిత పణ్యస్త్రీకి బోల్చబడి

నది. పలుదెరంగులైన పలుకులు గలిగియు కాటుకవన్నె లేని ప్రతిమను బోలినదైనదని సూచించినాడు.

ఇచ్చట మనము గమనింపదగిన విషయ మొకటి కలదు. తెనుగుకవిత కిట్టి వన్నెదెచ్చిన ప్రావళ్లు, శార్దూల మత్తేభాది వృత్తములవలె సంస్కృత కవితా సంప్రదాయమును బట్టి తెలుగున సంక్రమించినవి కాదనుట ప్రసిద్ధమే. కాని, యవి కేవల మాంధ్రదేశ సంప్రదాయ సిద్ధములు మాత్రమేనా, లేక దక్షిణదేశీయ కవితా సంప్రదాయ సిద్ధములా యను విషయము విచారింప వలసి యున్నది. కమలాకరుడు అనేక దేశములు తిరిగి అచ్చటి కవితారీతులను, ఆచారవ్యవహారములను దెలిసి కొన్నట్లు గోపరాజు చెప్పినాడు కాని, అతడితర దక్షిణ దేశభాషాకవితలను బోల్చి పరిశీలించి చెప్పినట్లగపడదు. అట్లు పరిశీలించినట్లయితే తెలుగుకవితకు వన్నెదెచ్చిన ప్రావళ్లు ఆంధ్రదేశీయ సంప్రదాయ సిద్ధములు మాత్రమేకాక, దక్షిణ దేశీయ కవితా సంప్రదాయ సిద్ధములే యనియు, ఇంతేకాక దీనితో పాటు ఆంధ్ర దేశమున పుణ్యస్త్రీ చిహ్నమైయొప్పిన మంగళసూత్రము కూడ నాంధ్రదేశీయము మాత్రమే కాక దక్షిణదేశీయ సంప్రదాయసిద్ధమేయనియు గూడ గ్రహించి యుండును. తెలుగుకవితయందలి ప్రావళ్లు ప్రాచీన తమిళ కవితా సంప్రదాయసిద్ధములగు మోనై ఎదుగై లనువానికి సంబంధించినవనియు, కన్నడకవిత ప్రాసనుమాత్రము గ్రహించి యతివిలంఘున మొనర్చిన దనియు, ఛందోవిషయ మున కూడ నీభాషలలోని దేశికవితారీతులను సరిపోల్చి పరిశీ లించినచో ప్రాచీన దక్షిణ దేశీయ సంప్రదాయ లక్షణములను మనము గుర్తింపవచ్చుననియు నిదివరకే నే నీ పత్రికా ముఖ మున సూచించి యున్నాను. కావున నిప్పుడీ దేశమున పుణ్య స్త్రీకి ముఖ్యచిహ్నముగా గ్రహింపబడుచున్న యీ మంగళ సూత్ర మనునది ఆంధ్రదేశీయ సంప్రదాయమాత్ర సిద్ధమా, అంతకంటె విపులమగు ప్రాచీన దక్షిణ దేశీయ సంప్రదాయ సిద్ధమా యను విషయము నించుక పరిశీలింతము. ప్రాచీనాంధ్ర దేశీయ సంప్రదాయసిద్ధ మన్నపుడు ప్రాచీన దక్షిణదేశీయ సంప్రదాయ సిద్ధము కాకూడదా, ఈ కాకదంతపరీక్ష యేల అను ప్రశ్న కలుగ వచ్చును. కాని ప్రాచీన దక్షిణదేశీయమగు సహజసామాన్య సంప్రదాయ మొకటి కలదనియు, నది యీ దక్షిణదేశీయ జాతులలో దేశకాలానుగుణములగు మార్పులకు లోనై యనుసరింపబడు చున్నదనియు చెప్పుటలో ఏకదేశీయ మగు నొక సంప్రదాయ మితర దేశముల సంక్రమించినదని చెప్పుటలోను గల భేదము పరిశీలించినవారికి తెలియక పోదు. ఆంధ్రభాషా సాహిత్యముల ప్రాచీన చరిత్ర నన్వేషించు సందర్భ మునకేకాక ఆంధ్రదేశీయాచార సంప్రదాయముల చరిత్ర నన్వే షించుపట్ల కూడ నిట్టి పరిశీలనదృష్టి యావశ్యక మేమో యని తోచు చున్నది. పుణ్యస్త్రీ వివాహచిహ్నముగా మంగళసూత్ర మును ధరించు నాచారము కేవలాంధ్రదేశీయమా, లేక దక్షిణదే శసామాన్య సంప్రదాయసిద్ధమా యను విషయము మన కిచ్చట ప్రసక్తము. 'మంగళ సూత్ర' మను శబ్దము సంస్కృతీయమై నను, తద్ధారణ మార్యవివాహతంత్రములో జేరినది గాదు. గావున తత్స        వించునది కాబోదు. ఇక నది దక్షిణ దేశీయమగు ననార్యసంప్రదాయమును సూచించు శబ్ద మునకు సంస్కృతీకరణము గావచ్చును. ఆ సంప్రదాయ మీదక్షిణదేశభాష లన్నిటిలోను 'తాలి' శబ్దముచే సూచింపబ డుచున్నది. 'తాలి' అనగా మంగళసూత్రము. తాలికట్టుట= మంగళసూత్రమును గట్టుట- అనగా వివాహమగుట అనియు, తాలి కట్టు=వివాహము అనియు దెనుగున వాడుక కలదు. ఇచ్చట 'కట్టుట' అను శబ్దము తోడి సాహచర్యముచేత 'తాలి' శబ్దము సూత్రపర్యాయమా యను భావము స్ఫురింపక మానదు. మంగళసూత్రమును గూడ కట్టుటయనియే చెప్ప దురు. ఆంధ్రకవితా పితామహుడగు పెద్దనార్యుడు స్వరోచిచే మనోరమకు మంగళ సూత్రమును గట్టించినాడు చూడుడు:

''కట్టెన్ మంగళసూత్రమున్ శరధి శం
    ఖశ్రీలకుం బొమ్మలన్
గట్టన్ జాలెడు కంఠపీఠి నిఖిల
    క్ష్మాభర్త శోణద్యుతుల్
దట్టంబై నఖకోరకోత్కరము త
    ద్గ్రైవేయహైమస్ఫుర
త్పట్టస్థాపిత పద్మరాగముల పం
    తంబుల్ విడంబింపగాన్.''

ఆంధ్రసారస్వతమునందలి వివాహవర్ణనల సందర్భమున మంగళసూత్రమును గట్టించినవారిలో పెద్దనార్యుడే మొదటి వాడుగా గనబడుచున్నాడు. ఆ కాలముననే ఆముక్తమాల్యదాకా రుడుగూడ రంగనాథునిచే గోదాదేవికి మంగళసూత్రమును గట్టించినాడు. ''గళమున గట్టెను హరి మంగళసూత్రము పులక లతివగాత్రము బొదువన్'' (ఆము. 5-70). కాని యింతకు బూర్వులగు తెలుగుకవుల వివాహవర్ణనములలో మంగళసూత్రధారణము వర్ణింపబడినట్లగపడదు. ఇక 'తాలి కట్టు' అనుదానిలోని 'కట్టు' అనుదాని సాహచర్యమును బట్టి 'తాలి' శబ్దము 'సూత్ర' పర్యాయమైయుండునని మన మూహించవచ్చును. మంగళసూత్రమును గూడ కట్టుట యనియే కదా చెప్పుదురు. సామాన్యముగా దీనిలో రెండు వస్తువు లుండును. బొందుదారము-లేదా సూత్రము ఒకటి. ఈ దారమునకు గ్రుచ్చబడు బంగారు మొదలగువానితో జేయ బడిన బిళ్లలు రెండు. ఇవి దేశాచారమునుబట్టి ఆకారమునం దును, సంఖ్యయందునుగూడ భిన్నముగా నుండవచ్చును.

ఆంధ్రదేశమున సామాన్యముగా రెండు. దక్షిణదేశమున మూడు. మలయాళ దేశమున నొకటి. దీనిని బట్టి చూడగా మాంగళ్యము - బంగారము మొదలగువానిచే జేయబడినది; దీనినే 'బొట్టు' అని చెప్పుటయు గలదు -, దీనికి గ్రుచ్చబడిన యొక దారము - సూత్రము కలిసి మంగళసూత్ర మనేది ఏర్పడినట్లు తెలియవచ్చుచున్నది. కాని యిటీవలి సామాన్య వ్యవహారములో బంగారు ఆభరణమునకు మాత్రమే 'మంగళ సూత్రాలు చేయించినారా' అని ప్రశ్నించుట కలదు. ఇచ్చట 'మంగళసూత్రా' లనుదానికి దారమునకు గుచ్చబడిన 'బొట్టు' వంటి ఆభరణమునకే గ్రహణము గదా. 'మాంగళ్యము' అను సంస్కృతపదము మంగళవాచకమే కాని, ఆశబ్దమును బట్టి ఆసూత్రమున గ్రుచ్చబడు ఆభరణముయొక్క స్వరూప మెట్టిదో తెలిసికొను నవకాశము కలుగుట లేదు. వివాహమున నీ మంగళసూత్రధారణ మనునది ఆర్యాచార ప్రసిద్ధమైనది గాక, కేవల దక్షిణ దేశీయాచారమే యగుటచే నీశబ్దము తత్సంప్రదాయ సూచకమై యర్వాచీనముగా నేర్పడియుం డును. కావుననే యావస్తుస్వరూపము నిది మనకు తెలుపజా లదు. ఇక దేశీయమగు 'తాలిబొట్టు' అనుదానినిబట్టి గ్రహింప గలమేమో చూతము. 'తాలిబొట్టు' అనునది తొలికాలమున 'తాలి' శబ్ద మాత్రముచేతనే సూచింపబడినట్లున్నది. ఆంధ్ర వాఙ్మయమున నీ 'తాలి' శబ్ద ప్రత్యేక ప్రయోగము పాండురంగ మాహాత్మ్యమున 8-వ ఆశ్వాసమున సుశీలచరిత్రలో నీక్రింది పద్యమున గానవచ్చుచున్నది:

''తాళి విభుండు గట్టిన మొ
దల్ పతిదేవత యా సుశీల పెన్
గోలతనంబునన్ మగడు
కొట్టిన దిట్టిన రట్టుచేసినం
దాళి దినంబు దచ్చరణ
తామరసంబులు గొల్చు నేలయున్
బోలునె యీపెకంచు గృత
బుద్ధులు వృద్ధులు ప్రస్తుతింపగన్''[1]

ఇది ముద్రితప్రతిలో 'తాళి' అని అలఘులకారముతోనే ముద్రింపబడియున్నను గోల, బోలు మొదలగు ప్రాసవర్ణము లను బట్టి దీనిని లఘులకారముతో గూడిన 'తాలి' శబ్దముగానే కాని 'తాళి' శబ్దముగా గ్రహించుట యుక్తముగా గనబడదు. దీనిని శబ్దరత్నాకరకారుడు మంగళసూత్రార్థమున 'తాలి' శబ్దమునే గ్రహించి 'తాళి' శబ్దమును వేరుగా గ్రహించి దానికి పతకము, హారవిశేషము అను నర్థముల నిచ్చినాడు. కాని సూర్యరాయనిఘంటువులో నిది 'తాళి' యని అలఘులకార ముతోనే గ్రహింపబడినది. ప్రయోగము పాండురంగమాహా త్మ్యములోనిదే కాని యంతకంటె ప్రాచీనమగునది చూపబడి యుండలేదు. ' సస్థానమును జూపు ప్రయోగము నిదియొ క్కటే. ఇందు ' సస్థానమున రెండు పాదములందు 'ల' కారమే కనబడుచున్న . ఇది తెనుగుననేకాక యితర దక్షిణ దేశభాష లందుగూడ 'తాలి' యని లఘులకారముతోనే కానవచ్చుచు న్నది. సామాన్యవ్యవహారమున తెలుగునందువలెనే తమిళకన్న డములందును 'తాలి' యనునది 'మాంగళ్యము' అనునర్థము ననే వ్యవహరింపబడుచున్నట్లు తమిళ కన్నడకోశములు తెలుపు చున్నవి. తమిళకోశమున "The central piece of a neck - ornament solemnly tied by the bridegroom around the bride's neck as a marriage - badge." అనియు, కిట్టెలు కన్నడ నిఘంటువున " A small round plate of gold worn as a marriage-badge." అనియు గలదు. దీని వలన తాలిశబ్దము నడుమనుండు బంగారపు బిళ్లనే సూచించునదైనది.

ఇక తెలుగున 'తాలిబొట్టు' అనుదానితో సమానార్థకమైన 'తాలిప్పొట్టు' అను తమిళశబ్దమునకు గూడ "Discshaped tali- వట్టమాగ చ్చైద తాలియురు'' వర్తులముగా జేయబడిన తాలి యనునర్థము చెప్పబడుటచే, 'తాలి' అనుదాని మూలా ర్థము విస్మృతప్రాయమై 'బిళ్ల' అనునర్థము మాత్రమే నిలిచినట్లు స్పష్టము. కాని 'తాలి పెరుగుదల్-త్రాడు తెగినది - మంగళ సూత్రములు తెగినవి' అనునపుడు ఈ 'తెగుట' సూత్రములకే అన్వయింపవలసి యుండుటచే 'తాలి' మొదట సూత్రపర్యా యమే యైయుండెననుట నిశ్చయము. ఇది 'తాల్చు=ధరించు' అను ధాతువునుండికాక 'తాలుచు=పేరివెట్టు, పేను' అను ధాతువు నుండి యేర్పడి సూత్రపర్యాయమైనది. యజ్ఞోప వీతములు మొదలగువానిని తాల్చుట - పిరియెక్కించుట ప్రసిద్ధమే గదా, ఈ తాల్చుటను గూర్చి కేతన విజ్ఞానేశ్వరీ యము నుండి చక్కని ప్రయోగము:

''గాయత్రి చదువుచు గడగి మున్నూలొడ్డి
వలచెయి యెక్కంగ వలనుదాల్చి
మున్మడుం గెగదాల్చి క్రమ్మఱ దిగదాల్చి
స్రుక్కులు వుచ్చి ముచ్చుట్లు చుట్టి''

మన స్త్రీలు మంగళ సూత్రముల నిల్లే పురియెక్కింతురు గదా.

దీపపువత్తిని తాల్చుటయు గలదు.

''ఎసగు సంతాపభరమున నిట్టు నట్టు
బొరలు శయ్యాతలంబున బువ్వుబోడి
తిపురు విరహానలంబున దివ్వె యెత్త
చిత్తజాతుండు వత్తి దాల్చినవిధమున.''

'తాలిక' అను మఱియొక శబ్దము 'మెలిక' అను నర్థమున గలదు. ''నడినెత్తి మట్టిపా లిడి తాలిక లొనర్చి కడలుకొల్పిన గొప్ప జడలద్రిండు.'' (శుక. ఆ)

ఇట్లు 'తాల్చు' ధాతువునుండియే 'తాలి' శబ్ద మేర్పడి యుండును. తాల్పబడినది 'తాలి'. అనగా 'పేనిన దారము' అని యర్థమగును. దీనికి గట్టబడిన' లేదా గ్రుచ్చబడిన 'బొట్టు' తాలిబొట్టు.

ఈ 'తాల్చు' ధాతువు తెలుగుననే నిలిచియున్నది గాని తమిళ కన్నడములం దగపడదు. తమిళమున 'తాలి' అనుదాని కిని, కన్నడమున 'తాళి' శబ్దమునకును వ్యవహారప్రాచుర్యము కలదు. కన్న. గిళిదాళి (చిలుక చిహ్నము గల తాళిబొట్టు), గుళదాళి, అయర్ దాళి, తాళిబొట్టు (A small kind of tali) మొదలగు వానిలో నలఘులకారమే కనబడుచున్నది. తెలుగు లోను చిలుకతాళి, తుమ్మెదతాళియు గలవు. ఇట్లే తెలుగున గూడ నిది యలఘులకారముతో గూడినదిగా గ్రహింపబడుట చేతనే కాబోలు దీనికి వృక్షభేదమును సూచించు 'తాళ' శబ్దముతో సంబంధము కల్పించి, తాటియాకును జుట్టగా జుట్టి దారమునకు గట్టి మంగళ సూత్రముగా ధరించు నాచార మాంధ్రదేశమున గలదనియు, దానినిబట్టియే దీనికి 'తాళి' యను పేరు కలిగిన దనియు, 'తాటంక' శబ్దము 'తాటి యాకు' శబ్దసంస్కృతీకరణమే కావచ్చుననియు గొందరు తలచుట కూడ తటస్థించినది. సంస్కృతమునగూడ 'లళ యోరభేద'పక్షమున తాళ, తాలశబ్దములు రెండు నుండ వచ్చును. 'తాల' శబ్దము తాడిచెట్టు అనునర్థమున ఋగ్వేదముననే ప్రయోగింపబడినట్లు కోశములనుబట్టి తెలియుచు న్నది. తాళీ, తాడీ, తాటంకశబ్దములు సంస్కృతమున కర్ణాభ రణ పర్యాయములుగనే యున్నట్లును, నిఘంటువులనుండి గ్రహింపబడినట్లును మానియర్ విలియమ్సు పండితుడు తన కోశమున దెలిపియున్నాడు. ''తాళీదళాబద్ధ తాటంకభూషావి శేషాన్వితే'' అని కాళిదాస విరచితమగు శ్యామలాదండకములో నిదని చెప్పబడు వాక్యమునుబట్టి కాళిదాసు కాలము నాటికే 'తాటంక' మనునది తాళీదళా బద్ధమయిన కర్ణాభరణ మని తెలియుచున్నది. ఈ కాళిదాసెప్పటివాడో. కన్నడ శబ్దమణి దర్పణ కారుడు 'తాల' శబ్దములోని 'ల' కారమునకు ద్రావిడా క్షరమగు 'ఱ' కారము గలుగునని చెప్పినాడు. కాని కిట్టెల్ పండితుడు దీనిని 'ట' కారయుక్తమగు దేశీయశబ్దముగనే గ్రహించినాడు. 'తాట్' అనునది ప్రాచీనదేశీయశబ్దమైనచో నిది కన్నడమున 'తాళి' యనియు, తెనుగునతాడు, తాడి యనియు నగుట యీ భాషా సంప్రదాయమున కనుగుణము గనే యున్నది. తెలుగున వృక్షపర్యాయమైనది 'తాడు' - 'తాడి' శబ్దమేగదా. కావుననే తాటి, తాటియాకు అను నౌపవిభ క్తికరూపము సిద్ధించినది. తాళపత్రమును కర్ణాభరణముగా ధరించు నాచారము దక్షిణ దేశమం దంతటను గలదు గాని, దానిని బట్టి తెలుగు 'తాటియాకే' 'తాటంక' మైనదని చెప్ప గలమా? అట్లే యైనచో నీ తెలుగుపదము కాళిదాసునకు బూర్వముననే కల తెలుగుభాషస్వరూపమును మనకు దెలుపు చున్న దనవలసియుండును. ఇక నీ తాటియాకు చుట్టను మంగళసూత్రమున గూర్చునాచారము కొన్ని ప్రాంతము లందు గలదేమో కాని ఇటీవలి కాలమున మామిడాకు నందుల కుపయోగించుట కలదు. చేతి కంకణములకు గూడ మామిడా కునే యుపయోగింతురు. మలయాళ దేశమున రావియాకు నుపయోగింతురట! కావుననే వారి మంగళసూత్రము రావియా కును బోలి కొంచెము కోలగా నుండును కాని మన తాలి 'బొట్టు' వలె గుం ముగా నుండదు. ఆంధ్ర తమిళ దేశము లలో నిది సామా ముగా స్వర్ణ రచితమైనపుడు వర్తులమై యుండుటచేతనే దీ కి 'బొట్టు' అను పేరు కలిగినట్లగపడుచు న్నది. వర్తుల లేక వృత్త శబ్దభవమే 'బొట్టు' అనియు, నిది వైకృతమే యనియు పండితుల యభిప్రాయము. దీనికి నీటి బొట్టు-బిందువు అనియు, అనుస్వార చిహ్నము వర్తులాకా రము కలదగుటచే అనుస్వార మనియు, ముఖమున దీర్చు తిలకము గుండ్రముగా నుండును గావున 'తిలక' మనియు గూడ నర్థములు గలిగినవి. దీనినిబట్టి దేశ్యమగు 'తాలి' శబ్దము కంటె వైకృతమగు 'బొట్టు' శబ్ద మర్వాచీనమనియు, తాలిబొం దుకు గ్రుచ్చబడు గుండ్రని సువర్ణ రచిత మాంగల్యము 'తాలి బొట్టు' అయిన దనియు వ్యక్త మగుచున్నది.

చేమకూర వెంకటకవి విజయవిలాసములో సుభద్రా వివాహ సందర్భమున నర్జునునిచే నాతడు మంగళసూత్రమునే కట్టిం చెను గాని, ఆ సందర్భమున గలిగిన చంద్రోదయమును వర్ణించుచు 'తాలిబొట్టు' స్వరూపమును మాత్రము మనకు దెలిపియున్నాడు.

''నందకుమారానుజ యఱు
తం దన నందనుడు గట్ట దైవతపతి వే
డ్కం దెచ్చు తాలిబొట్టన
జందురుఁ డరుణరుచిం బ్రాగ్దిశ గననయ్యెన్.''
(వి.వి. 3-93)

తాలికి గట్టు బొట్టు సూర్యాస్తమయ మైనంతనే యుదయిం చిన యరుణరుచి గల పున్నమచంద్రునితో బోల్చుటనుబట్టి 'తాలిబొట్టు' స్వరూపము మనకు దెలియ వచ్చుచున్నది.

వివాహమునకు 'తాలికట్టు' అనియే యాదక్షిణ దేశభాష లన్నిటిలోను వ్యవహారము కలదు. కావున నిది యాంధ్రదేశము నకు మాత్రమే ప్రత్యేకమగు నాచారమని కాని, ఆంధ్రదేశీయాచా

రమే యితరదేశములకు సంక్రమించినదనికాని చెప్పుటకు వీలులేదు. ఈ 'తాలి', అనగా పేనినదారము తొలికాలమున వివాహచిహ్నముగా నొక కన్యకు గట్టబడు నపుడు ఒక పచ్చని యాకు-తాటియాకో, మామిడాకో, రావియాకో చుట్టగా జుట్టి దానికే త్రాడుకట్టి, దానిని కన్యమెడలో గట్టు నాచార మేర్పడి యుండును. కాలక్రమమున నాగరకత పెరిగినకొలది బంగారుతో జేయబడిన బొట్టు[2] వంటి యాకారము గల చిహ్నము ఆ పచ్చియాకు స్థానమును వహించియుండును. వివాహోదులలో జేతికి గట్టబడు కంకణములు, రక్షాబంధనములు మొదలగునవి యిప్పటికిని మామిడాకుచుట్టకు గట్టబడిన తాడుతో గూడియుండునుగదా. ఈ 'తాలి' యనునదిగూడ తొలుత రక్షాబంధనముగనే యుండి కాలక్రమమున వివాహచిహ్నముగ నేర్పడినదేమో. ఏలయనగా నీ 'తాలి' శబ్దమునకు ప్రాచీన ప్రయోగము తమిళసంఘ వాఙ్మయములోని 'పురనానూరు' అను గ్రంథములో గనబడుచున్నది. అక్కడ 'పులిప్పల్తాలి' అను ప్రయోగము కలదు. దీనికి 'పెద్ద పులిపళ్లతో గూడిన తాలి' యని యర్థము. పులి + పల్ + తాలి అను పదములు చేరి తమిళములో సంధివశమున 'పులిప్పల్తాలి' యగును. ఇప్పుడు పులిగోరుపతకమును పిల్లలు ధరించుచున్నట్లే ఆ కాలమునను పిల్లలకు 'పులిగోళ్ల తాలి' ఒక దానిని కట్టు నాచారము కలదు. పిల్లల కిది రక్షాబంధనము వంటిదే. కాని 'కురింజి' అను కొండలప్రదేశములో ధైర్యశాలురగు యువకులు పులిని జంపి దాని గోళ్లను దెచ్చి తాము ప్రేమించిన యువతుల కిచ్చుట, వారు వానినొక 'తాలి'కి గట్టి యా తాలిని ప్రేమచిహ్నముగా మెడలో ధరించుట అను నాచారము ట్లు ప్రాచీన తమిళ సంఘసాహిత్య సంప్రదాయములను బ తెలియుచున్నది.[3] ఇట్లు రక్షాబంధనముగనో, వివాహ చి న్నము గనో 'తాలి' కట్టు నాచారము క్రీస్తుశకారంభమునుండి కలదనియు, నిదియే కాలక్రమమున సువర్ణకలితమగు మంగళసూత్రధారణముగ బరిణమించిన దనియు మనము నిశ్చయింప వచ్చును.

ఇది దక్షిణదేశీయమే యనుటకు ఇది తద్దేశీయ వాఙ్మయ సంప్రదాయసిద్ధమగుటయే కాక, ఆర్య వివాహ పద్ధతియం దీ మంగళసూత్రధారణ మనునది లేకుండుట కూడ నొక ప్రబల నిదర్శనమగుచున్నది. ఈ దేశమందలి హైందవనాగరకత, భాషాసాహిత్యములు, జీవిత పద్ధతులు, ఆచారవ్యవహారములు మొదలగువాని సంప్రదాయములన్నియు ప్రాచీనార్య సంప్రదాయములకును, అనాదియగు దేశీయ సంప్రదాయములకును కాలగతిని గలిగిన సహజ సమ్మేళనముచే నేర్పడినవిగా నున్నవి. ఉత్తరదేశమునం దీసంప్రదాయములను వేరుపరచి పరిశీలించుటకు దగిన యవకాశము లేకపోయినను, దక్షిణమునకు వచ్చినకొలది యీదేశీయ సంప్రదాయముల జాడలను కనిపట్టు నవకాశము లేకపోదు. మానవుని జీవితమున నొక ప్రధానవిషయముగ గ్రహింపబడుచున్న యీ వివాహ పద్ధతిని గురించి విచారించినపుడు ప్రస్తుతము మన దేశమున ప్రచారములో నున్న పద్ధతిలో ప్రాచీనార్య సంప్రదాయములు, దక్షిణదేశీయ సంప్రదాయములు సమ్మేళనము పొందినవిధము తెలియకపోదు. ఆంధ్రదేశ ముత్తర దేశీయమగు నార్యసంపర్కమున కెక్కువగా లోనైయుండుటచేత నిందు కేవల దక్షిణదేశీయ సంప్రదాయములు కొన్ని యంతరించినవి. కావున నింకను దక్షిణదేశమందలి సంప్రదాయములతో వీనిని పోల్చి పరిశీలింపవలసియుండును. ఆర్య సంప్రదాయమున నష్టవిధ వివాహములు కలవు. కాని వీనికి దేశవిభాగముతో నెట్టి సంబంధము నున్నట్లగపడదు. కాని దక్షిణదేశమందలి ప్రాచీనతమిళ సాహిత్యమును, లక్షణగ్రంథములను బరిశీలించినచో నీ వివాహ ప దేశవిభాగము, తత్తత్పరిస్థితులనుబట్టి భిన్నరీతులు గల యున్నట్లగపడుచున్నది. దేశ మైదుభాగములుగ గ్రహింపబ నది. కురింజి, ముల్లై, పాలై, మురుదం, నెయ్దల్ అని. ఆయా దేశపరిస్థితుల కనుగుణ మగునట్లుగనే వివాహ సంప్రదాయములును ప్రాచీన తమిళసాహిత్యమున వర్ణింపబడియున్నవి. కొండప్రదేశమునందలి జీవితమును, ప్రణయపద్ధతిని వర్ణించు భాగమునకు కురింజిత్తిణై అని పేరు. ఇందు నాయికానాయకుల ప్రథమ దర్శనముననే ప్రణయము. నాయకుడు 'తళై ఉడై'- అనగా 'తలిరుడుపులు' - పులిగోళ్లు మొదలగువానిని కన్యక కిచ్చు గాంధర్వపద్ధతిని వివాహము. దీనిని 'కళవు' అని చెప్పుదురు. ఇక తల్లిదండ్రులు కన్యావరులకు వివాహము చేసిన పిదప వారి ప్రణయమును 'కర్పు' అని అందురు. ఇది 'మురుదం' అనగా నదులు ప్రవహించు పంటభూములు గల దేశము నందలి జనుల జీవితమునకు సంబంధించినది. వివాహము, దంపతుల ప్రణయము, పరస్త్రీమూలమున దీనికి భంగము, గృహకలహములు, మరల దంపతులు సమాధానపడుట మొదలగు రీతి గలది. వ్యవసాయము, నాగరకత పెరిగినకొలది ఆ దేశములలో గాంధర్వపద్ధతి అంతరించియుండును. ఆకాలపు దక్షిణదేశ వివాహ పద్ధతియందలి ముఖ్యవిషయములను కొన్నిటినిప్పటి వాఙ్మయమునుండి గ్రహింపవచ్చును. మొదట కల్యాణవేది నిర్మాణము (మణవఱై). దీనిపై వధూవరులను గూర్చుండ బెట్టి వివాహము జరుపుదురు. గృహాద్యలంకరణము, లగ్ననిశ్చయము, నూతనవస్త్రము నొసంగుట, వధువుకు పుష్పమాల నిచ్చుట (మణమాలై), పుణ్యతీర్థములను గొనివచ్చుట, రక్షాబంధనము, దీపారాధనము, యువతులు కలశములను గొనివచ్చుట, వాద్యములు మ్రోగుచుండ వివాహమండపముక్రింద వరుడు వధువుపాణిగ్రహణము చేయుట, అగ్నిహోత్రునకు ప్రదక్షిణము, సప్తపది, లాజహోమము, కుంకుమ చందనాలంక

రణము, ఊరేగింపు, స్నానము. 'అగనానూరు' అను ప్రాచీన తమిళగ్రంథమునుబట్టి యీవిషయములు తెలియవచ్చుచు న్నవి. ఇందు తాలి కట్టుట ప్రత్యేకముగా జెప్పబడలేదు. కాని 'పురనానూరు' అను గ్రంథములోని 'ఈగై అరియఇళై' '(ఇత రులకు) ఇచ్చుటకు వీలుగాని తాడు' అను సందర్భములను బట్టి చూడగా మొదట (పిల్లలకుగూడ కట్టబడుచుండుటచే) రక్షాబంధనముగా నుండిన యీ 'తాలి' అనునది కాలక్రమ మున వివాహచిహ్నమయినదా యని తలంపవలసి వచ్చుచు న్నది. క్రీ.శ 10, 12 శతాబ్దములందలి జీవకచింతామణి, నన్నూల్ మొదలగు గ్రంథములలో 'తాలి' యనునది వివాహ చిహ్నముగనే గ్రహింపబడుచు వచ్చినది. ఇంతకు ప్రాచీనమే యగు 'శిలప్పదికారము' అనే తమిళకావ్యములో 'తాలి' శబ్దము లేదు గాని దీనికి పర్యాయ మనదగిన 'మంగళఅణి' శబ్దము కలదు. ఇది మంగళసూత్రపర్యాయమే. వివాహ విషయ మున దక్షిణదేశీయు లవలంబించుచున్నది బోధాయ నాపస్తం బాదుల గృహ్యసూత్రపద్ధతి యని సామాన్యముగా జెప్పబడు చున్నను, అందు జెప్పబడిన విషయములలో దక్షిణదేశీయ సంప్రదాయము లేవైన చేరినవో లేదో కనుగొనుట సుసాధ్య ముగ లేదు. కాని వీరి పద్ధతిలో ప్రధానవిషయములు అర్ఘ్యము, మధుపర్కము[4], అగ్నిముఖము, పాణిగ్రహణము, హోమము, అశ్మస్థాపన, లాజహోమములు, పిదప ఉద్వాహము[5], స్వగృ హప్రవేశము, వాగ్యమ' వారుంధతీదర్శనము, వ్రతస్వీకా రము, పక్వహోమము, శేపాకము, పంచమదినమందు నాపి తకర్మ, గర్భాధానము-ఇ యే బోధాయనాపస్తంబుల వివాహ పద్ధతి. దీనిలో నెచ్చటను మంగళసూత్రధారణముగాని, వధూవరుల నడుమ తెరపట్టుట, తలంబ్రాలు పోయుట, నాకబలి మొదలగునవిగాని లేవు. ఇవన్నియు దేశీయాచార ములే కావచ్చును. మంగళసూత్రధారణము, తెరపట్టుట దక్షి ణదేశమం దంతట నున్నట్లున్నది. వధూవరులొండొరులు శిరముల తలంబ్రాలు పోయుట ఆంధ్రదేశీయాచారము మాత్రము కావచ్చును. కాని వధూవరుల శిరస్సులపైని వృద్ధ స్త్రీ పురుష లాద్రాక్షత లుంచుట దక్షిణదేశమం దంతటను కలదు. అక్షతలేకాక దోసెళ్లతో బియ్యమును పెండ్లికి వచ్చిన ముత్తైదువ లందరు వధూవరుల శిరస్సులపై బోయుటయు కలదట. ఆర్ద్రాక్షతారోపణమును శ్రీనాథుడు దమయంతీ వివాహసందర్భమున వర్ణించియున్నాడు. కాని యిది కాళిదాస కుమారసంభవ కథలోనే వర్ణింపబడియున్నది. విధి విహితపా ణిగ్రహణోపచారము లైనవెనుక నా పార్వతీ పరమేశ్వరులు వృద్ధజనాభివాద ప్రత్యభివాదనానంతరము-

''క్లుప్తోపచారాం చతురంత వేదిం
తా వేత్య పశ్చాత్ కనకాసనస్థౌ,
జాయాపతీ లౌకిక మేషితవ్యం
ఆర్ద్రాక్షతారోపణ మన్వభూతాం.''

చతురశ్రమండపమునకు వచ్చి కనకాసనమున గూర్చుండి, లోకాచారసిద్ధమును, కావుననే బంధువులచే నభిలషణీయము నైన అర్ద్రాక్షతారోపణము ననుభవించిరట. దీనినిబట్టి యిది వైదికాచారసిద్ధము కాదనియు, లౌకికాచారమే యనియు వ్యక్తమ గుచున్నది. ఇందలి మండపనిర్మాణముకూడ లోకాచార సిద్ధమే యని 'క్లుప్తోపచారాం' అను విశేషణవ్యాఖ్యాన సందర్భ మున 'వివరణ'కారు డిట్లు వ్యక్తము చేసినాడు: ''క్లుప్తా రచితా ఉపచారాః పూర్ణకుంభాదయః యస్యాం, గంధోదకప్రోక్షణ పుష్పమాలాలంబన పూర్ణకలశాదిభి రలంకృతే చతుష్కోణమం డపే.'' దీనినిబట్టి చతుష్కోణమండప రచన, అందు పూర్ణకుం భాదుల నుంచుట, అందాసీనులగు వధూవరులపై నార్ద్రాక్షతా రోపణము లౌకికాచారసిద్ధము లని కాళిదాసునాటికే తలంప బడుచున్న వని తెలియుచున్నది. పెండ్లికి ప్రత్యేకముగా పచ్చని యాకుల పందిరిమండపము రచించుట, అందు ఐరేని (పూజ) కుండ లుంచుట, వృద్ధస్త్రీలు వధూవరుల తలలపై పుణ్యోదక ములను జల్లి అక్షతల నుంచుట మొదలగు నాచారములు వైదికేతరములుగా గనబడుటచేతను, తాలి కట్టుటతోపాటు దక్షిణదేశముననే ఎక్కుడు ప్రచారములో నున్నట్లగపడుట చేతను ఇవి దేశీయములేకాక దక్షిణదేశీయములుగూడ కావ చ్చునని తలంపదగియున్నది. మండప రచనాదికముతోపాటు ఆర్ద్రాక్షతారోపణము శ్రీనాథుడు దమయంతీ వివాహసందర్భ మున వర్ణించినను కొన్ని విషయముల కాళిదాసు ననుకరించిన నన్నిచోడుడు పార్వతీ వివాహ సందర్భమున వీనిని తన కుమారసంభవకథలో వర్ణించియుండలేదు. పరమేశ్వరునిపై నితరులచే నక్షతల వేయించుటుచితము కాదని యేమో. ఈశ్వర పారమ్యమును బ్రతిపాదింపదలచినవాడగుటచే నతడు కాళిదాసువలె వధూవరులచే బ్రహ్మకు మ్రొక్కించుట (ప్రణే మతు స్తౌ పితరౌ ప్రజానాం పద్మాసనస్థాయ పితామహాయ), ఆతనివలన ''కల్యాణి, వీరప్రసవా భవ'' అను నాశీర్వాదమును చేయించుట మొదలగు విషయములను వర్ణించియుండకపోవ చ్చును. కాళిదాసు చెప్పిన ఈ లౌకికాచారముల నతడు వర్ణింపక పోయినను మన్మథోత్సవమును, వసంతోత్సవము నతి చమ త్కారముగా వర్ణించినాడు. ఇది పెండ్లియైదవనాటి యాచార ముగా మన దేశమున నున్నను తరువాతి కవులెవ్వరు వర్ణించిన ట్లగపడదు. మఱియు వధూవరుల నడుమ తెరపట్టుట, లగ్న సమయమున బరస్పరావలోకనమునకై దానిని దించుట యను నాచారము నీతడు ప్రత్యేకముగా వివాహసందర్భమున దెలుపక పోయినను పార్వతి యలంకరించుకొని వివాహమండపమునకు వచ్చు సందర్భమున కండవడము వెల్వడివచ్చినట్లు వర్ణించి నాడు.

''ననిచిన కల్పవల్లి మద
నాగగతిన్ నడపాడజొచ్చెనో

యన జనుదెంచె గండవడ
మల్లన వెల్వడి బాలికాలితో
ఘనపటలంబు వెల్వడు వి
కాసితతారక సంభృతేందులే
ఖనయము గ్రేణిసేయుచు న
గప్రియనందన చెన్ను వింతగాన్.''

తిక్కన భారతమున నుత్తరా వివాహసందర్భముననను, రంగనాథరామాయణమున సీతావివాహసందర్భముననను తెర బట్టుట, తలంబ్రాలుపోయుట మొదలగు దేశీయాచారములు వర్ణింపబడియున్నవి. కాని వీరెవ్వరు మంగళసూత్రములను మాత్రము వారు వర్ణించిన వివాహములలో గట్టించలేదు. వీరి కాలమునకు మనదేశమున నీయాచారము లేదనవచ్చునా? గౌరనకాలమునకు చంద్రమతి కుత్తుకను మినుకున్నట్లు తెలిసికొనియున్నాము. శ్రీనాథుడు దమయంతి పెండ్లిలో వివాహ దీక్షాకంకణము చేతులకు గట్టించినాడు గాని, ఆమె కుత్తుకకు మంగళసూత్రము గట్టించలేదు. కాని కాశీఖండములో ( 3 ఆ )

''పంచవదనుని కను జేవురించెనేని
తక్షణమునందు తమయాంధ్ర త్రాళ్లు తెగవె''

అని ''యాంధ్ర తాళ్లు తెగుటను'' గూర్చి చెప్పియుండుటచే నా కాలపు టాంధ్రకు మంగళసూత్రధారణ మాచారమే యనుట నిశ్చయము. కావున నాంధ్రసారస్వతములో గల వివాహవర్ణనలలో దాలుత మంగళసూత్రములను గట్టించిన వాడు పెద్దనయే యనవలసియున్నను, ఈ యాచార మంతకు చిరపూర్వమే దేశమున వ్యాప్తియందుండె ననుటకు మాత్రము సందేహములేదు. దీనినిబట్టి ఆయాకాలములందలి జనుల జీవిత పద్ధతులు, ఆచార వ్యవహారములు మొదలగునవి యిప్పటి కవుల కవితాదృక్పథములకు గోచరించిన రీతినే సారస్వత ప్రపంచమున వెలయుచుండు నను విషయమును గూడ మనము మెలకువతో గుర్తింపవలసియున్నది. తదనుగుణముగనే యా సారస్వతమున బ్రతిఫలించిన జాతీయ జీవిత చరిత్రమునుగూడ బరిశీలించి తెలిసికొన వలసియుండును.

## సూచికలు

1. ఆంధ్రసారస్వతమునందలి వివాహవర్ణనములలో తాళిగట్టించినవారిలో మఱి యొకరు 'యయాతి చరిత్ర

''తాళిగట్టె నపుడె తలిరాకుబోడికి
పుడమిఱేడు వేడ్క గడలుకొనగ
దనరు పెక్కు వాయిదమ్ముల మ్రోతలు
చెలగి ముజ్జగములు చెవుడువరుప.'' (య.చ.4.ఆ)

2. ఈ 'తాళిబొట్టు' స్వర్ణరచిత మైనపిదపనే దానికి 'మినుకు' అను పేరుకూడ వచ్చియుండును. ఇది ప్రకాశమాన మైనది అను అర్థమున 'మిన్' ధాతువు నుండి యేర్పడినది. ''మినుకు-'తాళిబొట్టు', బంగారువాణెము'' అని శ.రత్నా. తాళిబొట్టు అను వర్థ మాంధ్రవాఙ్మయమున పోతనగారి కాలమునకే యున్నట్లే భాగవతప్రయోగమును బట్టి తెలియుచున్నది. శ్రీరాము డధ్వర ముల జేసి తన రాజ్యమును, సొమ్ములను భూసురుల కొసంగి,

''తనరు రెండు పుస్తెంబులు దనకు నయిన
శ్రీ
వినతుడై యుండె'' (భాగ. 9-342)

నట. దీనినిబట్టి మిన కనునది స్వర్ణవికారమగు మాంగల్య మనుటయేకాక అది ఽడిన దనుటయు వ్యక్తము. ఇంతేకాక స్త్రీల కీ మంగళ సూత్రధారణము పో ధ్రదేశమున మత్రసిద్ధా చార న్నది. ఇంతకు పూర్వులగు కవుల వివాహ వర్ణనమ ఏనవారగపడరు.

ఈ 'మినుకు' శబ్దము గౌరనహరిశ్చంద్రద్విపదలో గానవచ్చుచున్నది. చంద్రమతికుత్తుక నంటియున్న 'మినుకు'ను మంకముగా దెమ్మనుట చేతనే యాతడు తన భర్తయగు హరిశ్చ ు వర్ణించినాడు. గౌరన శ్రీనాథపోతనలకింయుక సమకాలికుడే యగుటచే మంగళ సూత్రముల నడుమ స్వర్ణరచితమగు 'మినుకు' గట్టు నాచార మప్పటికి సుప్రసిద్ధమైయున్న దనుటకు సందేహము లేదు. కాని యంతకు గొంత పూర్వుడగు మారన రచించిన మార్కండేయ పురాణాంతర్గత హరిశ్చంద్రకథలో నీ 'మినుకు' వృత్తాంతమే లేదు.

''అక్కట దైవము రాజ్యము
ద్రెక్కొని యాలిం దనూజు దెగనమ్మంగా
నెక్కొలిపె హరిశ్చంద్రుని
నిక్కడ గాడ్పఱిచె నింక నేగతిc బోదున్.''

''అని పలుకన్ విభుండు విని
యప్పుడు దా మది వారల న్నిజాం
గనయు సుతుండుగా నెఱిగి''

నట్లు మారన వర్ణించినాడు. మూలమగు సంస్కృతమార్కండేయ పురాణములో నట్లుండుటచే మారన యట్లే రచించియుండును. కాని హరిశ్చంద్రకథలో నీమార్పెప్పటినుండి కలిగినదో పరిశీలింపవ సియున్నది. దక్షిణ దేశమం దంత టను నీ మినుకు వృత్తాంత మీకథలో నున్న యగపడుచున్నది. దేశీయాచార ములను విశేషముగా వర్ణించిన తిక్కన ।నాథుల వంటివారుగూడ వారి వివాహవర్ణనల ఏలనో అప్పటి కీయాచారము ప్రబలియుండ నవలెనా?

3. "" hen Poetry first arose among the Kuravar the bards n 'rally sang about the pre-nuptial loves of hill chieftai a their presenting their mistresses with leaf garme (ta ai udai) and the teeth of the tigers which the hill chi killed in the chase, these teeth were strung together a worn hanging from the neck and called 'Pulipparrali" fro . which in later times was evolved the 'Gold tali'.

'Culture of the Tamils' by P T Sreenivasa Iyengar

4. ఆకాలమున 'గోసహితముకూడ గాబోలును. ''వివాహే గౌః సన్నిధాప్యా. గృహేషు అవ్యా సన్నిధాప్యా. పితన్మధుపర్కాద్వయమపి వివాహాంగతయా వర మతిథివ దర్హయేత్. పితావ ధ్గోరాలంభనస్థాన మతిథిః పితరో వివాహశ్చ్రుతి -''

5. ఇదియే వివాహమైనది. అనగా (ఉద్-వహనము = వివాహము) పితృగృహము నుండి తనయింటికి రథముమీద నెక్కించి తీసికొనిపోవుట. (అథ వివాం పితురంకా దుద్వహతి, హస్తేన గృహీత్వా స్వరథ మారోప్య స్వాన్ గృహా వానయతి.-బోధా.)

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు:

# వైదిక-దేశీయాచారములు

వివాహ వర్ణనసందర్భము నాధారము చేసికొని యాంధ్రసార స్వతము దేశీయాచారముల నెంతవరకు సూచించుచున్నదో మన మించుక పరిశీలించుట యుక్తము కాకపోదు.

ఆంధ్రసారస్వతమున కాదిగ్రంథముగా గ్రహింప బడు చున్న భారత మాదిపర్వమున నన్నయ ద్రౌపదీ వివాహమును వర్ణించుచు, పాండవు లలంకృత వివాహమండపమునకు వచ్చుట, కాంతాసహస్రంబుతో ద్రౌపది యాగమనము, ధౌమ్యుడు దీప్తశిఖానలమున వివాహమంత్రాహుతులను వేల్చుట, ముందుగ ధర్మపుత్రునకు, గ్రమంబున తక్కిన సోదరులకు ద్రౌపది పాణిగ్రహణంబు సేయించుట, జనుల యాశీర్వాదము, చదల కుసుమవృష్టి విస్తరిల్లుట - వీనిని మాత్రమే వర్ణించెను. ఇది హోమము, పాణిగ్రహణము ప్రధాన ముగా వర్ణితమైన వైదికవివాహ మనుట సాహసము కాదు గదా. కావుననే నన్నయదృష్టి ప్రధానముగా వైదికదృష్టియనుట. లేదా నన్నయనాటికి దరువాతి కవులు వివాహసంద్భమున వర్ణించిన కొన్ని యాచారములు వాడుకలోని కింకను రాలేదనవ లయును.

ఇక నన్నిచోడుడు కుమార సంభవమున నీశ్వరుని వివాహ మును వర్ణించెను. శివుడు రజతగిరినుండి పరివారముతో హిమగిరికి శుభప్రయాణముల జనుదేరగా హిమవంతు డాతని రాక యెఱిగి మహి హేమతోరణములు, వస్త్రతోరణములు, మకరతోరణములు, వాతపూరణములు, కేతనానీకములు, కలువతీగలు మొదలగువానితో బురము నలంకరింపించి, పర మేశ్వరున కెదురుసని, నమస్కరించి, తోడ్కొనివచ్చి పురప్ర వేశంబు చేయించెను. మరునా డుదయమున నీశ్వరునకు హిమవంతుడు సుప్రభాతార్చనావిధి నభ్యర్చితుం జేసి 'వివాహ మండపంబును' నిర్మింప నుద్యుక్తుండు కాగా, కల్ప వృక్ష ములు కంబంబులుగా, కనకాచలంబు నేలకట్టుగా, నవరత్నవ ర్గంబు రంగవల్లులుగా సుందరంబగు పచ్చ పందిరి, తోరణం బులు, మేలుకట్లు, అమృతరస రసాయనాబ్ధిరూపం బగు పూర్ణకుంభంబులు భానుమండలరూప దర్పణంబులతో గూడి సిద్ధమయ్యెనట. వేదవేది హోమకుండమై యుండెను. అంత హిమవంతుడు హైమవతిని మంగళస్నానంబుచేయించి కైసేయ నియమించి యుద్వాహమండపంబునకు రావించిన నామెవచ్చి నిజజనకు నూరుపీఠంబున నుండెనట.[1] అంత నీశ్వరుండును అభ్యంగనోద్వర్తన స్నానానంతరంబున నలంక రించికొని రాగా బృహస్పతి ''దేవా, లగ్నం బాసన్నం బయ్యె విజయం చేయు'' డని చెప్ప హోమద్రవ్యముల బట్టుకొని బ్రహ్మయును, హేమదండ చామరములతో ఇంద్రుడు, విష్ణు వును, దిగధీశులు, యక్ష కిన్నరాదులు వెంటరా వివాహమంట పమునకు వచ్చి ''వేదికాతలోపరి దుకూలాంబరాలంకృత మణి పీఠాసనాసీనుండై యున్నంత హైమవతియు దదర్ధంబు నలంక రించినది. అంత బృహస్పతిదత్త సుముహూర్తంబున బరమేష్ఠి కృత హోమపురస్సరంబుగా విధివిహిత విధానంబున గిరీ శుండు గిరిజను బరిణయం బయ్యె. విప్ర ఘోషణంబులు, గంధర్వగానము, వేణువీణానిస్వనము మొదలగునవి చెలరే గెను. సురభు లభివాంఛితవస్తువు లెల్ల వారికి గురిసినవి. తుంబురు, నారదగాన మా యోలగంబున బర్వినది. నందికేశ్వ రాది వాద్యనికరంబు లాతోద్యంబులై చెలంగ రంభ నాట్యము సల్పినది. పరమేశ్వరుండు పార్వతీసమేతుండై యుండ, దేవ తలు శివుని బ్రార్థించి మన్మథుని తిరిగి బడయగా, మహేశ్వర వివాహోత్సవముతో మనసిజ పునరవతరణోత్సవము కూడ నాపట్టణవాసు లమితోత్సాహముతో జరిపినట్లు చెప్పుచు వసం తోత్సవము నతిచమత్కారముగా కవి వర్ణించినాడు. ఆంధ్రవా ఙ్మయమున వసంతోత్సవము నింత విపులముగా, చమత్కార ముగా మరి యే కవియు వర్ణించినట్లగపడదు. శివుని వివాహము మన్మథుని పునరవతరణమునకు గారణమగుటచే నీ వర్ణనమున కిచ్చుట ప్రసక్తి గలిగినది. కాని మన దేశములో పెండ్లి యైదవ నాడు బుక్కావసంతము (కాశ్మీరజలము) మొదలగువానితో జరుపబడు వసంతోత్సవమున కిదియే మూలమగు నేమో విచారింపవలసియున్నది. ఇప్పటికి నీ దేశమున నాచారమై యున్న ఈ వసంతోత్సవము నాంధ్రప్రబంధకవు లేల వర్ణింప లేదో!

నన్నెచోడుడు ఈ శివుని వివాహవర్ణన సందర్భమున ప్రత్యేక వివాహమండప నిర్మాణమును వర్ణించినట్లే రంగనాథరామాయ ణకర్తయు వర్ణించినాడు. సీతా కల్యాణ సందర్భమున జనకుడు లగ్న నిశ్చయము గావించి పురమును, దన యంతిపురమును

గ్రసేయ బరిచారకుల వేగ బంపగా వారు పురమెల్లెడల గ్రసేసి, యంతఃపురంబంత గరంబొప్ప గ్రసేయ, ''కల్యాణవేది విర
ఎంపు డన'' శిల్పవేదు లెంతయును

''బచ్చరాజగలిపై బసిడికంబములు
మెచ్చుగా నిల్పి యామీద నీలంపు
బోదెలు గురువిందముల దూలములును
బాదుగా నిడి -
హాటక మణిమయాయతకవాటముల
వాటంబుగా నాల్గు వాకిండ్లమర్చి
ఆలోన నేకాండమౌ బలుపచ్చ
మేలి పెండ్లి యరుంగు మృగనాభి నలికి
ముత్తెంపు నిగ్గుల ముగ్గు లేర్పరచిరి.''

అంత దశరథ జననాథచంద్రు డాభ్యుదయికము జేసి ఒక్కొక సుతున కభ్యుదయముకొరకు నన్నూరు వేల చొప్పున బదారులక్షల ధేనువుల భూసురోత్తముల కిచ్చి, వసిష్ఠసంయమి లగ్నసమయమ్ముం దెలుపగా నర్థయానముల గొడుకులు నడువ, క్రంతలుగొని పుణ్యకాంతలు నడవ, కైసేసి గణికానికాయముల్ నడవ, వేదనాదములతో విప్రులు నడవ, పుడమిరే డప్పుడు పుత్రులు దాను, వనజలోచనలు నివాళిక లొసగ ఖచితోరునవరత్నంబగు నాకల్యాణవేది నుచితపీఠం బుల నుండిరట. అప్పుడు ''జనకుడు మధుపర్కసమయము దీర్చి, కోమలి దెరమరగున వేడ్క నిలిపి'' అగ్ని సాక్షిగా గొనుమనుచు రామచంద్రునకు ధారవోసెను. అంత సుమూ హూర్త మని తెరదీయుట, వధూవరుల పరస్పరావలోకనము, రఘువీరుడు చెలికేలుపట్టుట (పాణి గ్రహణము), ఒండొరు లొక్కపీఠమున నుండి హోమము సేయుట, తలబ్రాలు, లాజహోమము, మునుల దీవనలు, పుష్పవృష్టి, ఆటపాటలు మొదలగువానితో పెండ్లి నాలుగుదినములు నుండినట్లు వర్ణింప బడినది. కూతులకు బుద్ధులు గరపి భూషణాంబరము లిచ్చి, యల్లున కరణ మిచ్చి, తక్కినవారి కర్థసత్కారములు చేసి యనుపుటయు నిందు గలదు.

'పరిణయాగార' వర్ణనమును తిక్కనార్యుడును అభిమన్యు వివాహోత్సవవర్ణన సందర్భమున జేసినాడు. విరాటుడు పురం బున నుత్సవంబు సాటించి, నిజమందిరంబునందు రత్నప్రదీ పావళి, మణిస్తంభపంక్తి, విచిత్రవితానములు, ముక్తాదామ ములు, కుసుమమాలికలు, మంగళభూరుహ పల్లవ తోరణ ములు మొదలగు వానితో గూడిన పరిణయాగారమును చంద నముతో నలికించి ఆణిముత్తియముల ముగ్గులు వెట్టించెనట. అందు వైదిక లౌకిక వివిధార్థవస్తుభరముచే వేదిక పొలుపొందు నట్లు పురోహితుడు చేసినాడు. లగ్నం బాసన్నం బగుచువచ్చె నని ధర్మతనయున కెఱింగింప నాత డభిమన్యునకు శృంగా రంబు సేయించి, భద్రగజారూఢుం జేసికొని, యోగ్యవస్తువుల విస్తరిల్లిన క్రంత నడువగా, విప్రాశీర్వాదంబులు మాగధగానం బులు సెలంగ చొత్తెంచిన, విహిత పరిపాటితో విప్రవృద్ధజనులు తెరయెద్ద వధూవరుల నిలిపి ''సాంవత్సరికదత్త కాలకలావిశే షంబుల'' తెర యెత్తించుటయు, నమ్మానినియుం గుమారు డును మారవికారము అంకురింపగా నన్యోన్యావలోకనంబు సేసిరి. పిదప తలబ్రాలుపోయుట, దీగబోడి మృదులపాణి పల్లవమును గుమారుండు మెలపుమై గ్రహించుట[2], ఏకాసన మున నుండి హోమముచేయుటతో వివాహము నిర్వహింపబ డెను. పిదప మత్స్యమహీనాథుండు మణిభూషణంబులు, తాంబూలంబులతోడి పళ్లెరంబుల బచరించి పాండవులను గట్న నిచ్చి సౌభద్రునకు నరణంబిచ్చె. నృత్తగీతాదులతోడను, పరిహా సాదివిలాసముల తోడను రాజ మందిరము పరమసంపద్భరితం బయ్యెనని వర్ణించినాడు.

ఇందు పరిణయాగార నిర్మాణమేకాక, క్రంతనడచుట, వధూవరుల నడుమ తెఱపట్టుట-యెత్తుట, తలబ్రాలు పోయుట, బంధువులకు గట్నమిచ్చుట, అల్లున కరణమిచ్చుట మొదలగు దేశీయాచారములు గమనింపదగినవి. నన్నిచోడుని రచనలో నివి లేవు. కాని తిక్కనార్యుని రచనలోను, రంగనాథరా మాయణ రచనలోను నివి సమానముగనే కనబడుచున్నవి. రంగనాథరామాయణమున దేశీయములగు గాథలుగూడ కొన్ని చేరియుండుటచే వివాహ విషయమున దేశీయములగు నాచారములుకూడ నందు బొందుపరుపబడియుండు ననుట సంభావ్యమే. తిక్కనార్యుడు ద్విపదరామాయణకర్తకు బూర్వుడా, పరుడా యను విషయము సందిగ్ధమే యైనను, ఆతనికి సహజముగ గలిగిన జాతీయతాదృష్టియే భాషవిషయ మునవలె సంప్రదాయవర్ణన విషయమున గూడ దేశీయత నాదరించునట్లు చేయుటచే నాతడు దేశీయములగు నీ వివాహ సంప్రదాయములను వర్ణించియుండును. కాని దేశీయసంప్రదా యముల నాదరించిన వీరిద్దరి వర్ణనలలోను గూడ మంగళసూ త్రధారణము చేరనేలేదు. కొన్నివిషయములందు రంగనాథరా మాయణము ననుసరించినట్లున్న భాస్కరరామాయణ మేకార ణముచేతనో సీతవివాహసందర్భమున నీ దేశీయాచారములను వర్ణింపలేదు. కాని యా రెండింటను దశరథుడు సుతుల యభ్యుదయార్థము గోదానము చేయుటనుగూర్చిన వర్ణన మాత్ర మొక్కతీరుననే యున్నది. చూడుడు:

''ఆయతశుభయుక్తి నాభ్యుదయికము
జేయింప నర్థితో జేసి యావిభుడు
ఒక్కొక సుతున కభ్యుదయంబుకొఱకు
వెలయంగ నన్నూఱువేల యా లెక్క

గలయ బదాఋలక్షల ధేనువులను
గలధౌతఖురములు కనకశృంగములు
దలకొని చెలువొందు తామ్రపుచ్ఛములు
వరుస వేష్టించిన కర మొప్పువాని
లలి భూసురోత్తములకు భక్తి నిచ్చి''

(రం.రా. బాల)

ఇట్లే భాస్కర రామాయణమున:
''అనురక్తి దశరథుం డభ్యుదయార్థమై
నలువురు సుతులకు వాలుగేసి
లక్షలుగా బదార్లక్షల సంఖ్యల
గోవుల గలధౌతఖురము లలర
గనకశృంగమ్ముల గనకపట్టమ్ముల
దామ్రవృష్ఠంబుల దనరజేసి
గంధమాల్యాంబరకలితలగా జేసి
వత్సలతోగూడ వరుస గూర్చి
కాంస్యదోహలములతోడ గరుణ భూసు
రోత్తముల కిచ్చి శోభనాయత్తమతిని
మఱియు బెక్కుసువర్ణముల్ మహిమతోడ
వేదువారల కందంద వేడ్క నొసగి''

(భా.రా. బాల 734)

కాని రం.రా.మున ''కల్యాణి సీతఁ గోమలిఁ దెరమఱుం గున వేడ్క నిలిపి, శ్రీరామ నాపుత్రి సీత సద్ధర్మచారిణి గొనుమగ్నిసాక్షిగా ననుచు ధారపోసెను. అంతట సుముహూర్తమని తెరదీయ గాంతనెమ్మోము మున్ననుగొని యలరె'' అని కలదు.

భాస్కర రా.న ''కనక వితర్ది కాతలంబున రాఘవుం బ్రాఙ్ముఖంబుగా నునిచి జనకుండు సీతం దోడ్కొని తెచ్చి రామున కభిముఖంబుగా దనముందరం గూర్చుండబెట్టికొని యిట్టనియె: 'రామా, యిక్కన్య మహాగుణశోభిత; నీకుం బరతంత్ర' యని చెప్పి సువర్ణ యక్తంబుగా ధారపోసి పాణిగ్రహణంబు సేయించి యిచ్చిన తదనంతరంబ వధూవరు లగ్నికిం బ్రదక్షిణంబు సేసిరి'' అని కలదు. తెర మరుగు భాస్కరుడు తీసివేసినాడు.

అనంతామాత్యుడు భోజరాజీయమున పుష్పగంధి రత్నమండనుల వివాహమును వర్ణించినాడు. వరుడు సుస్నాతుడై యలంకరించుకొని కల్యాణచిహ్నములు కొమరు మిగుల పౌరోహితాదులతో, జయభేరీ ఘంటాదిమహారావముతో ''నరుదెంచె వివాహవేదికిన్.'' అప్పుడు బిట్టుబిల్లు విభు డాతరుణిం గనుగొన్న ''కాముడేమి చేయునో యని తెరయెత్తిరట.'' పుష్పజాతులు ప్రాలు నాదిగ బైడిపళ్లెరంబుల నించుకొనిన పుణ్యసతీనివహంబు కరతలాక్షతపాత్రిక లొప్ప అటు చేరి సేసలిడిరి. అంత శుభలగ్నోదయ సూచకంబగుచు జలంబు లందు మునుగు తామ్రఘటికాపాత్ర నిరీక్షించి మంగళాశీర్వాద పురస్సరంబుగా సుముహూర్తం బనుచు మౌహూర్తికుండు జయఘంటపై నక్షతలు చల్లిన-

''కంగున ఘంటపై గొదువు
గ్రక్కున నైమడు దూర్యనాదముల్
నింగియు దిక్తటంబులును
నిండగ విప్రుల వేదనాదము
పొంగి చెలంగుచుండ దెర
వచ్చినో ముచ్చట పోవజూచి ర
య్యంగజు దార్వ నొందొరుల
యాననపద్మము లావధూవరుల్''

''అంత బురోహితానుమతి
నక్షతపాత్రలు సేరదేర న
క్కాంతయు గాంతుడున్ ముఖవి
కాసము లొప్పగ దోయిలించి య
త్యంతపు బ్రీతి నొందొరుల
యౌదలలం దలబ్రాలు పోసి రం
తంతకు మేనులందు బుల
కాంకురజాలము ల్లసిల్లగన్.''

పిదప నాత డాపల్లవపాణిం బాణిగ్రహణంబుచేసి, మణిఖచితకనకాసనాసీనుండై హోమతంత్రంబు దీర్చి విప్రజనంబుల యాశీర్వచననిచయంబు వడసియుండ నుభయపక్షబంధువులు నాదంపతులకు నంబరాభరణాదుల నిచ్చిరట. పిదప ''జామాతృప్రముఖ ప్రభూత్తమజనుల్, హేమపాత్రములం జతుర్విధములై యుంపారు నాహారము''లను భుజించిరి.

ఈ వివాహమునను తెరపట్టుట, పుణ్యస్త్రీ నివహంబు కరతలాక్షతపాత్రిక లొప్ప సేసలిడుట, వధూ వరుల తలంబ్రాలు, పాణిగ్రహణము, హోమము అనునవి ప్రధానములైనవి. కాని యిందు మఱియొక విశేషము మాత్రము గమనింపదగియున్నది. పూర్వకవుల రచనలలో ''దేవ, లగ్నం బాసన్నంబయ్యె''నని పురోహితుడు తెలుపుటయేకాని, సుముహూర్తంబును దెలుపగల యంత్రములున్న ట్లెవరును వర్ణించలేదు. అనంతామాత్యుని కాలమునకు గాలమును దెలుపు జలఘటికా యంత్రమొకటి వాడుకలో నున్నట్లు తెలియుచున్నది. ''తదుత్పవానందరసనిమగ్నంబగు తద్వధూ వరుల వియోగాగ్నిపుంజంబునంబోలె శుభలగ్నోదయ సమయసూచకంబగుచు, జలంబులందు మునుంగు తామ్రఘటికాపాత్రను నిరీక్షించి మంగళాశీర్వాద పురస్సరంబుగా సుముహూర్తం బనుచు

మౌహూర్తికుండు జయఘంటపై నక్షతలు చల్లె''నట. అప్పుడు ఘంటపై కంగున గొదువు నైవినారట. దీనినిబట్టి వివాహములందు నుమువార్తుడియను దెలుపు జలయంత్ర విశేష మొకటి కలదనియు, (రంధ్రముగల) తామ్రపాత్ర మొకటి జలమందు మునుగుటచే గడియలు సూచింపబడు చుండె ననియు దెలియుచున్నది. క్రీడాభిరామమునందలి ''యంత్రాధీశు మోసాలపై'' నుండిన గడియారము సుప్రసి ద్ధమే గదా. దానివెనుక నున్న యంత్రమెట్టిదో తెలియదు. మఱియొకచో సుశీల యను నామె యొక పిచ్చుకుంటును వివాహమైన సందర్భమున నామె వరుని మెడను హారమువైచి తలపై బ్రాలు పోసినట్లు చెప్పినాడు:

''గ్రక్కున వెలువడి తనచే
జక్కల గుదివోలె నున్న సుచిరహారం
బక్కడిపి యఱుతనైచుచు
దక్కక చేతండ్ల బ్రాలు తలపై బోసెన్''
(భో.రా. 5-341)

ఇక్కడ హారసమర్పణము, తలబ్రాలు వివాహకృత్యము లైనవి. కాని వెనుక తల్లిదండ్రులు చేసిన వివాహవిషయమున గూడ 'మంగళసూత్రధారణము' వర్ణింపబడియుండలేదు.

ఇక శ్రీనాథుని దమయంతీవివాహవర్ణన మతివిపుల మగు టయే కాక విశేష దేశాచార సంఘటితము నైయున్నది. విదర్భ మహీవల్లభుడు ''సర్వలక్షణ కళాసంపూర్ణమై యుదయాస్త నిర్దోషమై యతిశయిల్లు శోభనాంశము మీరు శోధించి చెప్పుడా''యని పల్క వారు నట్టే లగ్న మరసి చేపట్టి ''యాస న్నమయ్యె దేవ శుభముహూర్త'' మని చెప్పిరట. కాని వారాస మయము నెట్టే జలఘటికా యంత్రసహాయమున నరసి చేపట్టే నట్లు నగపడదు. విదర్భరాజింట ఘటికాయంత్రము లేదేమో. కుమారుని బిలువనంపుట, దమయంతికి వివాహనేపథ్యము గావించుట, అట నలుడును వివాహోచిత శృంగారం బంగీక రించి రథం బెక్కి వివాహమండపంబునకు వచ్చునప్పుడు

''నృపగృహ ద్వారభూమి తరుణియునుబోలె
పేరటాం డ్రురుహస్త పంకేరుహముల
బూని యెత్తిన కనకంపు బూజకుండ
లున్నత స్తనములుగాగ నొప్పు మిగిలె''నట.

ఇచ్చట పూజకుండలు - ఐరేనికుండలు - నృప గృహద్వా రముననే యుంచబడినట్లు వర్ణింపబడినది. ఇవి వివాహమండప మున నాలుగు వైపుల నుంచుట దక్షిణదేశాచారముగా గనబడు చున్నది. ''నాల్గువంకల నుప్పొంగుచు బూజకుండ లమరెన్ గన్గొంటె'' అని యయాతి చరిత్ర (4 అ). అనంతరంబ వివాహమంటపంబు చేరి సమున్నత కనకాసనంబున నాసీ నుండై మధుపర్కవు దేనియ బారణచేసి, 'పావన కౌతుక సూత్రరక్ష' గ్రహించ నెలత చేయి పట్టెను. అంత మామ యల్లునకు మండలాగ్రము, కటారి, కత్తలాని తేజీహయము, వీటికాపేటి, గారుత్మతభుక్తి పాత్రము, మణి కాంచన ముఖ్యవ స్తువులను పరిణయ దక్షిణార్థమయి యొసగెను. వధూవరు లగ్నికి బ్రదక్షిణ మొనర్చుట, అంశుకగ్రంథిక్రియాచారము, ఔత్తానపాది నక్షత్రిమాచుట, యరుంధతిని గనుట, పురపు రంధ్రి మంగళాశీర్వచోయుక్త మహిత శోభనాక్షతారోపణము, లాజలను దోయిలించి వేల్చుట, ఒక్క పురంధ్రి నృపాలు చెట్టబట్టించుట మొదలగునవి జరిగిన పిదప ''పురంధ్రీజనవి లోకనార్థంబు సహస్రరంధ్రీ కృతంబుగా జేయబడిన కౌతుకాగా రమును'' బ్రవేశపెట్టినా డీ దంపతులను శ్రీనాథుడు. అప్పుడు-

''దళశతాక్షుండు దొడుగు కుందనపు బైడి
కంటకముబోని వేజాలకముల యింటి
మధ్యభాగంబునందు శ్రీమంచ మెక్కి
రంబుజాక్షియు నిషధదేశాధిపతియు.''

పురంధ్రీజన విలోకనార్థమట యా దంపతులు మంచమె క్కుట. వివాహసందర్భమున నీ పురంధ్రులు వధూవరులను జూచియుండరా? ఇట్టి ప్రత్యేకపుటేర్పాటుకు -జాలకములయింట మంచమెక్కియుండగా జూచుటకు గార ణమేమో. అప్పటికే భీమరాజు గారియింట స్త్రీలకు ఘోషాప ద్ధతి ప్రబలినదని తలంపవలయునా? లేక యిది రెడ్డిరాజుల యిండ్లలోని యాచారమేమో! పిదప నిరువంక పెండ్లిమూట్టంబు లకు భోజనంబులు.

''వెండియెడ్డెనలపై వెలచి తెచ్చిన పైడిపళ్లెంబు''లలో ''రంకుమృగరోమకృత నూత్నరత్నకంబళాది నానావిధాభ్యర్హి తాసనముల'' గూర్చుండి వియ్యంపుమేలంబుల నుభయవిధ బాంధవులు నాడుచు జతుర్విధాహారంబులు భుజియింప దొడంగిరి. అందోదనమునుగూర్చిన వర్ణనము పిండివంటక ములు, కూరలు, పాసెము, బూరియలు, లడ్డువంబులు, ఆజ్యఖండశర్కరాదులు, శశిలాంఛనద్రవ్యతేమనంబు, నసమశ రకేతన వ్యంజనామృతంబు, జంబీరరసముతో నూనియతో నావంబెట్టిన కిటిముద్రావలయములు, దధిపిండఖండములు, పుల్లపెరుగుతో మిళితమైన యావ పచ్చళ్లు, పానకములు, మాఱువడ్డనలలోని హాస్యములు మొదలగువాని సూక్ష్మవర్ణ నము లాంధ్రదేశీయాచారములను, నాకాలపు రెడ్డిరాజుల వైభవ మునేకాక శ్రీనాథుని భోజన ప్రియత్వమునుగూడ సూచించు నవివలె నున్నవి. కాని వీనిలో గొన్ని సంస్కృత నైషధముననే

లేకపోలేదు. పిదప సంపకములు, సుతకు హితవులు సెప్పుట, బసవుకు నూరుగ్రామముల నొసంగుటలతో సంపకములైనవి.

ఇందు కౌతుకాగారమున వధూవరులు మంచముపై గూర్చుండుట, బూజముబంతి, భోజనాది వర్ణనలు, అంపకములు మొదలగు విశేషవర్ణనలున్నను, వెనుకటి కవులు వర్ణించిన తలంబ్రాలు లేవు. మంగళ సూత్రమును గట్టించలేదు. శ్రీనాథుని కాలమున నీమంగళ సూత్రధారణ మాచారముగ లేకపోలేదు. ఈతని కాశీఖండములో అనిమిషేంద్రాది దేవతల యాండ్రకే మంగళసూత్రము లున్నట్లు సూచించినాడు. దక్షాధ్వర సందర్భమున దధీచి యను విప్రర్షి యచ్చటి సభవారిని జూచి,

"ఏమి గుడువంగవచ్చి నా రిండ్లు విడిచి
హరువి వెలివెట్టినట్టి యీ యాగమునకు
బంచవదమని కను జేవురించెనేని
తత్ క్షణమునంద తమ యాండ్ర త్రాళ్లు దెగవె"

అని చెప్పినాడు. దీనిని బట్టి యప్పటి యాండ్రకు త్రాళ్లుండుటయేకాక "యాండ్ర త్రాళ్లు దెగుట" పురుషుల కనర్థసూచకమను విషయము కూడ బ్రసిద్ధమై యున్నట్లు తెలియుచున్నది. శివుని హాలాహలభక్షణము నంగీకరించిన అగజమంగళ సూత్రము యొక్క గట్టి తనమును గూర్చి పోతనామాత్యుడు తన భాగవతమున నిట్లు వ్రాసియున్నాడు:

"మ్రింగెడు వాడు విభుం డని
మ్రింగెడిదియు గరళ మనియు మేలని ప్రజకున్
మ్రింగు మనె సర్వమంగళ
మంగళ సూత్రంబు నెంత మది నమ్మెనదో"
(భాగ. 8-241)

ఇట్లా కాలమున నాండ్ర త్రాళ్ళు దెగుననుట యశుభసూచకమనియు, వారి యైదువతనము వారు ధరించిన మంగళ సూత్రముపై నాధారపడి యుండుననియు నమ్మకము వ్యాపించి యుండె నని తెలియుచున్నది.

కాని పోతనామాత్యుడు కూడ రుక్మిణీ పరిణయ సందర్భమున నామెకు మంగళసూత్రము కట్టించనే లేదు. అయ్యాదవేంద్రుని నగరంబు సమారబ్ధ వివాహకృత్యంబై సముచితరీతి నలంకృతంబై యుండ "ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజచేతోహారిణిన్ రుక్మిణిన్"

శ్రీనాథ పోతనల తరువాత నాంధ్రప్రబంధ రచనా ఫక్కి వాడుకలోనికి వచ్చిన పిదపనే వివాహవర్ణనలలో మంగళ సూత్రధారణము కూడ చేర్చబడుచువచ్చిన ట్లగపడుచున్నది. పెద్దనార్యుడు స్వరోచిచే మనోరమకు మంగళసూత్రమును గట్టించిన ట్లిదివరకే తెలుపబడినది గదా. ఆముక్తమాల్యదాకారుడు గూడ రంగనాథునిచే గోదాదేవికి మంగళసూత్రము కట్టించెను.

"గళమున గట్టెను హరి మం
గళసూత్రము పులక లతివగాత్రము బొదువన్
నెలతయు బతియును గరముల
నలవరిచిరి కంకణంబు లన్యోన్యంబున్"

ఇందు మఱికొన్ని దేశీయాచారములు పూర్వకవుల వర్ణనలలో లేనివియు దెలుపబడినవి. గోదాదేవికి "యావకద్రవమున నరుణాంఘ్రినఖపంక్తు లభ్యక్తములు సేసె నతివ యోర్తు; నలయక వ్రేళ్ల మట్టియలు బిల్లాండ్లిడి పాయవట్టము బెట్టె పైనొకర్తు; కటకములు హస్తసరము లంగదము లంగుళీయకములును బాహువల్లికల వ్రేళ్ల నిలిపి, తాటంక నాసామణుల నమర్చి, చౌనిపె; సీమంతవీథి జేర్చుక్క యోర్తు." ఇందు గోదాదేవి కలంకరించిన లత్తుక, మట్టెలు, పిల్లాళ్లు, తాటంకములు మొదలగునవి దక్షిణ దేశీయాచార ప్రసిద్ధము లనవచ్చును. అంత మధుపర్కం బొసంగి, యయ్యాళ్వారు దేవేరియుం దాను ధారవోయ నాకన్యకారత్నంబు బరిగ్రహించిన యనంతరంబు -

"కలధౌతద్రవచిత్రము లైమఱయ ము
క్తాస్యూతమౌ మేచకాం
చలపుం బెందెఱ వారి, లగ్నము సమా
సన్నంబుగా వేల్పుఁ బె
ద్దలు పంపన్ గుడజీరకంబులు సము
ద్యత్ప్రేమ నన్యోన్యమం
జులమస్తంబుల నుంచి రర్థిగను మిం
చు ల్చిల్కుముల్లాడగన్"

వనమాలి చూడమున మానిని ముత్తెపు బ్రాలుపోసినది. అప్పుడతివగళమున గట్టెను హరి మంగళ సూత్రము, పిదప లాజహోమము, సప్తపదులు, అరుంధతీ దర్శనము కాగా బ్రహ్మరుద్రాదు లర్పించునుడుగరలు గైకొని, యతివం దోడ్కొని రంగనాథుడాత్మ పట్టణమునకు విజయము చేసెనట.

ఇందు గుడజీరకంబు లన్యోన్యమస్తంబుల నుంచుట మఱియొక విశేషము.

ఇక స్వరోచి వివాహమున మఱికొన్ని చిల్లర యాచారములు గూడ వర్ణింపబడినవి. మహీకాంతునొక దొర నగర విడియించుట, లగ్న నిశ్చయము, విత్తాధిపతికి విజ్ఞానపత్రిక లిఖించి నిజప్రధానుల బంచి నలకూబరు రావించుట, పేరటాండ్రు

పాటలు పాడగా ఐదువలు రాజునకు పసుపుల నలుగులిడుట, గొజ్జగి నీట మజ్జనము, చంచజ్జరతాహి కంచుకము చాయ మడుంగుల నొత్తుట, అలంకారము, కదిసెన్ లగ్నమటంచు మంత్రులు దెలుప చౌదంతిపై నారూఢుడై పట్టణంబు వికచాం బురుహాక్షు లుబ్బున జూచుచుండ, వేత్రహస్తుల ప్రశస్తతర సాహోనినాదంబు పెంపొలయ నిరంతరగతి క్రంత నడవ రాజభవనాంగణంబునకు వచ్చుట, ఇందీవరాక్షు డెదురుసని తోడ్కొని రా, వైవాహిక క్రియారంభ సంరంభముతో గొలగొల మను కౌతుకాగారము సొచ్చి విద్రుమ పాదసువర్ణపీఠిపై గూర్చుండ, పసిడి హరివాణమున మధుపర్కము, జామాత నర్చించి ధారవోయుట, అనంతరము మెట్టుబ్రాల పుట్టికల యెడం గదియంబట్టిన పెండెరను తూర్యములు మొరయ వంచుట, వధూవరుల పరస్పరావలోకనము, తలబ్రాలు, ''కట్టెన్ మంగళసూత్రమున్.'' మణిపీఠి సురీపట్టముపై బలిచి సతీ పతుల నందు గూర్చుండ బెట్టిరి. వారాహుతులను వేల్చుట, లాజహోమము, సనెకల్ మట్టించుట, పేరటాండ్రు చెఱగులు ముడిపెట్టుట, ధ్రువారుంధతీ దర్శనము, కూరిమి మంత్రితోడ నలకూబరుడేకతమాడి చీరలు హారవిభూషణా వళి నారదమౌని చేత కుబేరుపేరుగా నమ్మిథునమ్మునకుం జదివించుట, బాంధవులు వధూవరుల కుడుగర లొసగుట, మామ అల్లునికి గానుకలిచ్చి, కూతు కరణంబిచ్చి, పసుపునకు గొన్ని గ్రామముల నొసంగుట, వచ్చిన బంధువుల కుడుగర లిచ్చి పంపుట - ఈ మొదలగు వైదిక లౌకికాచార సంపన్నం బై పెద్దనార్యుని స్వరోచీ మనోరమా వివాహవర్ణన మిప్పటి యాంధ్రదేశ సంప్రదాయమును సంపూర్ణముగా సూచించు చున్నది.

సామాన్యముగా దరువాతి ప్రబంధములందలి 'పరిణయ' వర్ణనములు దీనిని బోలియే యున్న వనవచ్చునుగాని అచ్చదె నుంగు భాషను రచింపవొడంగిన యయాతి చరిత్రకారుని రచనలో మాత్రము మఱికొన్ని దేశీయాచార విశేషములు ముఖ్యముగా గమనింపదగియున్నవి.

శుక్రుడు యయాతిం జూచి నీకు నిద్దేవయానిం జేకొన వచ్చు నని యొడంబరచి రాజునుం గూతును దోడ్కొని పీటికిం జనుదెంచునప్పుడు వృషపర్వు డెదురువచ్చి యయా తికి.

''పాలుపొ కన్నవనంట్లు కస్తురి మెకం
బుల్ మేలిజవ్వాదిపి
ల్లులు రాచిల్కలు మానికంబులును జీ
లుల్ మంచిముత్యాలపే
రులు మేల్ బోగపు రెంటెముల్ పసిడితే
రుల్ పల్లకుల్ లోనుగా
నులుపాచేసె''నట.

వివాహనిశ్చయ మైనతోడనే యిట్లు 'ఉలుపా' కానుకల నొసంగుట ప్రస్తుతము దక్షిణదేశమున నాచరింపబడుచున్న 'నిశ్చితార్థము' అనుదానిం బోలియున్నట్లగపడుచున్నది.

అంత శుక్రుని పసుపున వృషపర్వుడు వీడు గ్రాసేయ బనుచుట, ఊరిలోనివారికి పెండ్లి (పేరంటము) పిలుపు. దీనిని వెనుకటి కవు లెవరును వర్ణించలేదు.

''ఎల్లియ సోకుటొజ్జ యత
దేపున జేయును కూతు పెండ్లియం
చల్లన పైడిపళ్లెరము
లందును గందము బూలు బచ్చబ్రాల్
పెల్లుగ నించి పొల్తుకలు
పేరటముల్ దగ జెప్ప పీటిలో
నెల్లెడ ద్రిమ్మరం దొడగి
రింపుగ వాయిదముల్ చెలంగగన్''

వధువున కలంకరణము. మట్టెలు, పిల్లాండ్లు, వీరమద్దె యలు, బన్నసరములు, పంజాల కమ్మదోయి, బవిరలు మొద లగు నాభరణము లిప్పుడు వెనుకబడినవి. యయాతిస్నానము, అలంకరణము. ''ఎడలేదు లగన మనుచున్ - బడిబడి బిలు వంగ నపుడు బలువాయిదముల్, గడలుకొనంగా నచ్చర- పడతులు ధవళములు పెండ్లిపాటలు'' పాడిరట. ఈ సందర్భ మున ధవళములు, పెండ్లిపాటలు పాడుట దక్షిణ దేశీయాచా రమే. ప్రబంధరచనలలో నంతరించినను నాయకరాజులనాటి దక్షిణదేశవాఙ్మయమున - ముఖ్యముగా రంగాజమ్మ మన్నారు దాస విలాసనాటకము మొదలగువానిలో దేశీయములగు నీ ధవళములు, పాటలు విశేషముగా నిలిచియున్నవి. వెలియేనుగు నెక్కివచ్చి రాజు వాకిట దిగగా నాతనికి గాళ్లు గడిగి ''నెలంత లంత బంగారుపుబళ్లెరంబుల వగన్ నునుముత్తెపు ముగ్గులోన నింపారెడు కెంపుదివ్వియల నారతు లిచ్చి''రట. వాకిట వరుడు నిలిచియుండ నారతులిచ్చుటయు దక్షిణదేశాచారము గనే యున్నది. ఇక కన్యాదానపు తంతంతయు నీకవి ''ముక్కలి పీటమీదటన్ గోమలు లంత బెండ్లికొడుకుం దగ నుంచిన బొల్చుమీరగా, బ్రామినుకుందెలంగునను రక్కసియొజ్జ యొసంగె గూతునున్'' అను నొక్కమాటతో ముగింపుచేసి నాడు. ఇచ్చట మధుపర్కము చెప్పబడలేదు. అంత దేవ యానను తెరమరుగున నిడి, తెరదిగిచిన సమయంబున ''తాళి గట్టె నపుడె తలిరాకుబోడికి పుడమిరేడు వేడ్క గడలుకొనగ.'' వివాహవర్ణనమున తాళిగట్టించిన తెలుగు కవులలో తెలగనా ర్యుడే మొదటివాడుగా గనబడుచున్నాడు. తెరదించినతోడనే యన్యోన్యావలోకనాది వర్ణనలను బెంచక తాళికట్టునకు ప్రాధాన్య మొసగినాడు. భాషావిషయమున నచ్చదెనుంగు నీత డాదరించినట్లే యాచారవర్ణన విషయమునగూడ నచ్చతెనుగు దేశపుటాచారములనే యాదరింపజొచ్చెనేమో యని తోచుచు

న్నది. లేదా అచ్చతెనుంగునియమమే యాతని నట్లొనరింపజేసినదా!

పిదప ముత్తియంపు తలంబ్రాలు. వేల్పుట. వేల్పులకు మ్రొక్కించుట.

"తగ బ్రాకెనయును దీఱిచి
నగవుల పసులైన వెనుక నాలవనా డా
ప్పుగ నాగవల్లి సేయగ
బగడపు టుప్పరిగలోన బడతులవెల్లన్"

పాలుపుదీర్చిరట.

అందు నాల్గు పూజకుండల మీదుగా గలయం జుట్టిన నూలితోడ దివియల్ గన్పట్టుచున్ జుట్టిరా, నెలతుక లిట్లు ప్రోలు తగ నేర్పు చెలంగగ జేర్చి తీర్చిరట. పిదప గొజ్జగి మేడలోపల కెంపుగోళ్ల సిరిమంచముపై వధూవరుల నునిచి తెలనాకులు బాగాలును పెనిమిటులగూర్చి యైదువయెలనాగలకెల్ల వీడ్యమ్ము లిడిరి. పిదప నేలరేండ్లు యయాతికి చదివింపులు. వృషపర్వు డింతికి బసుపున కిచ్చుట. శుక్రు డల్లునకు గానుకలు. కూతునంపకములు. తల్లి బుద్ధులుసెప్పుట లాలించి యనుపుట. శుక్రుని యప్పగింతలు. రాజు కదలుట.తన పీదు సొచ్చి యేనుగు డిగి పైదలియుందాను బైడిపల్లెరముల ముత్తైదువ లారతు లీగా దన నగరు సొచ్చెను.

ఇట్లే తెలగనార్యుని వివాహవర్ణనములో మధుపర్కమేకాక లాజహోమము, ధ్రువారుంధతీదర్శనము, సప్తపది మొదలగు వైదికాచారము లేమియు వర్ణింపబడలేదు. వీనినన్నిటిని "తాలి వేల్పుమిన్నుల తెఱంగున వేల్పించి" యను వాక్యముతో సరిపెట్టినాడు. పెండ్లికి పేరంటము పిలుచుట, ప్రాకెవ, నాగవల్లి, ప్రోలు, మంచముపై మిథునవీడ్యములు మొదలగు తెలుగు దేశపు టాచారములను ప్రత్యేకముగా వర్ణించుటచే నీకావ్యపు 'టచ్చతెనుగు'దనమును నిలువబెట్టదలచినాడా యని తలంప వలసియున్నది. మఱియు నిచ్చటి వివాహపు గృత్యము లన్నియు బొలతులచేతనే నిర్వహింపబడిన ట్లగపడుచున్నది గాని పౌరోహితుని ప్రసక్తి కానరాదు.

ఇట్లు ఆంధ్రసారస్వతమునందలి వివాహవర్ణనాచార సంప్రదాయపరిశీలన సందర్భమున నన్నపార్యుని ద్రౌపదీ వివాహవర్ణనము మొదలుకొని తెలగనార్యుని దేవయానీవివాహవర్ణనము వరకు నాయాకవుల వర్ణనరీతులు, అందలి చేర్పులు కూర్పులు మొదలగువానిని గమనించియున్నాము గదా. నన్నపార్యుని వైదికాచారసంపత్తికి దగినట్లే ద్రౌపదీవివాహవర్ణనమును వైదికాచారబహుళంబై యున్నదనుట సాహసము కాదు. "ఆంధ్రావళి మోదముం బొరయునట్లు"గా భారతమును "ప్రబంధమండలి"గా రచింపదొరకొనిన 'కళావిదు'డైన తిక్కన భాషాజాతీయవిషయముల దేశీయత నెక్కువగ నవలంబించినట్లే ఉత్తరా వివాహ వర్ణనవిషయమున వైదికాచారములతోపాటు దేశీయ సంప్రదాయములనుగూడ జేర్చి రచియించినాడనుటయు దబ్బఱ కాబోదు. తరువాతికవు లనేకు లీపద్ధతినే సాగించుచు వచ్చిరి. కాని కాలక్రమమున నాంధ్రసారస్వతమున నచ్చతెనుగు రచనయం దాదరము ప్రబలినట్లే అందలి కవుల వివాహవర్ణన రీతులలో వైదికాచారవర్ణనముకంటె నచ్చతెనుగుదేశపుటాచారములను వర్ణించుటయం దభిరుచి పెరుగుచువచ్చిన ట్లగపడుచున్నది. యయాతిచరిత్రకారుని రచనలో వైదికాచారములు కేవలస్మరణ మాత్రముచేతనే యెట్లాదరింపబడినవో మనము చూచియే యున్నాము గదా.

ఇంతకంటెను కొంచెము తరువాతివాడగు చేమకూర వెంకటకవి విజయవిలాసమునందలి వివాహవర్ణనములను పరికింతము. వెంకటకవి తరువాతివాడగుటయే కాక తంజావూరి రఘునాథరాయల యాస్థానమున నుండి యాగ్రంథ మ్మాతనికి గృతిగా రచియించుటచే నింకను దక్షిణ దేశీయసంప్రదాయము లిందు మనకు బొడగట్టవచ్చును. ఈ విజయవిలాసమున రెండు వివాహముల వర్ణనలు గలవు. మొదటిది పాండ్యరాజు కూతురు చిత్రాంగదకు, నర్జునునకు జరిగిన వివాహము. రెండవది సుభద్రావివాహము. మొదటిదానిలో తొలుత వివాహార్థమై రాయబారము, ముహూర్త నిశ్చయము, చిత్రాంగదను కాంతలు పెండ్లికూతు జేయుట, ముత్తియపు సేసల్ జవ్వనుల్ సల్ల, విప్రవధూశుభగావళీల శోభిల్లగ వివాహవేదికకు పెండ్లికుమారుడు వచ్చుట, ఆవల వల పెండ్లికూతురును రాగా పేరటాండ్రు కొందరు తెరవంచిన నర్జును డతివను జూచుట. అంత

"అంగజరాజ్యం బేలుట
కుం గట్టిన తోరణంబొకో యన నత డా
శృంగారవతికి గట్టెన్
మంగళసూత్రంబు చతురిమన్ గళసీమన్."

పిదప ముత్యాల్ దోయిటన్ ముంచి యనురక్తిన్ దలబ్రాలు వోయుట. ఈచందంబున గళ్యాణోచితకృత్యంబు లెల్ల నొనరిచిరట. ఇది చిత్రాంగద వివాహము. ఇక సుభద్రావివాహసందర్భమున నర్జును, సుభద్రను బెండ్లికొడుకు బెండ్లికూతును జేయ నపేక్ష జెలగి, మంచిలగ్నమున కరపంకజముల గంకణముల గట్టిరట. మేనుల్ మేలిమృగీమదకుంకుమంబులన్ నలుగిడిరి. పేరటాండ్రు ధవళంబుల బాడుచు వల్లభంబులన్ బట్టిరట. అంతర్వాణి పురోహితు డొక డచట జేరియుండ, కిరీటి కొక శంపాంగి సంపంగినూనె యంటి జలకం బార్చి యలంకృతుని జేసెను. అట్లే కన్యకారత్నముగూడ మజ్జనంబొనర్చి యలంకృతయైయుండ -

"నందకుమారానుజయటు
తం దన వందనుడు గట్టె దైవతపతి వే
డ్కం దెచ్చు తాళిబొట్టన
జందురు డరుణరుచిం బ్రాగ్దిశగననయ్యెన్"

"కులదేవతను దెచ్చి విలిపిరి మాణిక్య
చకచకల్ గల పెండ్లి చవికెదండ,
ఐరేని గొనివచ్చి రైదువల్ పాటలు
పాడుచు శుభవేళ వేదుకలర,
బులుగడిగిన ముత్తెముల బాసికంబులు
సరవి గట్టిరి నేర్పు సంఘటిల్ల
దలబ్రాల కేర్చి ముక్తామణుల్ నించిరి
పసిడిపళ్లెముల సంభ్రమము మీఱ"

ఇట్లంతిపురమున నుత్సవ మయ్యెనట. ముహూర్తము దగ్గఱించెను. మాటలోపలనే మాధవుడును వచ్చెను. అంతలో మహర్షీశ్వరులు, నరుంధతి, శచియును వచ్చిరి. సుము హూర్తం బిది లెం డటంచు గురు డచ్చో దెల్ప దేవేంద్రుడు తమ దేశము నుండి తెచ్చిన 'బాసికము'ను సింగారించి, మందార దామము కంఠంబున జేర్చి పెం ొడుకుం బ్రాగ్దంతి నెక్కించుటయు, వాతడు రుక్మిణీదేవి హంగణంబున నైరా వంబుం దిగి ద్విజపురంధ్రులు ముత్తెపు లు జల్లగా, కుడిప దము మున్నుగా నిడి గడపదాటి, యారతులొసంగ గల్యాణవే దికడకు నేగెను. అప్పుడు గన్యారత్నమును జనానందంబుగా బాడుచు బేరటాండ్రు పెండ్లి చవికకు తోడితెచ్చిరి. కొందరు మధుకరవేణులు దెరనమర్చిరి. మధుపర్కం బొసంగి వసుదే వుడు పైడిపళ్లెములో బదాబ్జములు గడిగి తన మేనల్లునకు గన్యను ధారవోసెను. అంత వధూవరులను గడానిబంగారపు మెట్టు బ్రాలపుటికలలో గదియించి కొంద రైదువలు తెరవం పగా బడతుకమోము గానంబడియె. అంత "సిగ్గుదొట్రిలిన ముఖాబ్జ మెత్తి, మెడక్రిందికి హస్తయుగంబు సాచి, వేనలిం దెమలించి, సౌఖ్యకలనస్థితి గట్టిగ బట్టి కట్టె నవ్వెలదుక కంఠసీను గురువీరుడు మంగళసూత్ర మయ్యెడన్" సుభద్రప యినర్జును, డర్జునుపై సుభద్రయున్ దమి దలబ్రాలు పోసిరి. బంగారుపీటమీద గూర్చిండిన వధూవరులకు పాకశాసని దీవించి, సేసలిడె నట. పౌలోమీమఘవంతులకు వధూవరుల వందనములు. "వియ్యంపు మర్యాద వేగుజామున శచీజాని బువ్వాన భోజనము చేసె" నట. అంత ఇంద్రాదులకు గట్టనిచ్చి సాగనంపుట.

"ఏల యాలస్యమిక నిందు? బ్రోలు సొచ్చి
నాగవలి సేయుదురు గాక, వేగ గదలి
పొందు దంపతులని ధనుష్కాండ రథహ
యంబుల నొసంగి న

కృష్ణుడు ధగ జునకు శుభలేఖ వ్రాసి చారులచే బంపెను. దేవకియు గుమా కు ధైర్యము చెప్పి యత్తవారింటికి బంపినది. ఇచ్చట వైవాహి త్సవము ఐదు నాళ్లును మహామహిమన్ జరిపిరి. ఇట్లే వివాహములలోను లాజహోమారుంధతీ దర్శన సప్తపద్యాచారముల ప్రశంసయే కానరాదు. కాని మంగళ సూత్ర ధారణము, ధవళములు మొదలగు పెండ్లి పాటలతోపాటు బాసికములు, ఐరేని కుండల నమర్చుట, కుడిపదంబు మున్నుగా నిడి గడపదాటుట, బంగారపు మెట్టుబ్రాల పుట్టిక లలో వధూవరుల నుంచుట, ప్రోలు (ఇంద్రప్రస్థము) సొచ్చి నాగవలి సేయుట మొదలగు విశేషాచారములు మఱికొన్ని వర్ణింపబడినవి.

ఇట్లే దేశమున ప్రాచీనములగు నార్యాచారములతో దేశీయా చారములు సమ్మేళనము బొందుటచే నేది యెప్పటి నుండి ప్రారంభించి యెట్టి మార్పులను బొందినదో తెలిసికొనుటకు వీలులేని స్థితి యేర్పడినను, ఆయా దేశ భాగములందలి వాఙ్మయాదర్శంబున బ్రతిఫలించిన ఆయా కాలపు జనుల జీవిత పద్ధతులను ఆచార వ్యవహారములను బట్టి పరిశీలించి నచో ప్రాచీనార్య సంప్రదాయములకు భిన్నమగు దక్షిణ దేశీయ సంప్రదాయములు కొన్ని గలవని మనకు దోచకమానదు. ఇట్లు గ్రహింపదగిన యీ దక్షిణ దేశీయములగు వైవాహిక సంప్రదా యములలో నీ తాళికట్టు, లేదా మంగళ సూత్రధారణ మను దానికి విశేష ప్రాధాన్యము కలదని వ్యక్తమగుచున్నది

## సూచికలు

1. వివాహమునకుబూర్వ మలంకృతయగు వధువు జనకు నూరుపీఠంబున నుండెనని వర్ణించినవాడు నన్నెచోడు డొక్కడే కానబడుచున్నాడు. ఇది "అథైనాం పితురంకా దుద్వహతి, గురోర్వా. అథైనాం దక్షిణేహస్తే గృహీత్వా న్వరథమారోప్య స్వాన్ గృహా నానయతి" యను బోధాయన సూత్రమున ఎది. వధువు పితురంక మునుండి వరునిచే నుద్వాహము చేయబడుచున్నది గావుననే దీని కుద్వా హము - వివాహము అను పేరు గలిగినది.

2. కన్నడపంపకవి విక్రమా పాణిపల్లవమును గ్రహించినరీతి నిట్లు వర్ణించినాడు:

"ఇడిడి రెమంజిప్ రో
ళ్న దుగువశోకపల్లరియ పల్లవవొళ్న వమాతపల్లవం
తొడదన్ వొలాగిపుర్మ జల దివదుపొకెయ పాణిపల్లవం
బిడిదుబెడంగ వాళ్దుదుగు ణాణ్‌వొప్పువ పాణిపల్లవం"

3. వావిళ్లవారి ముద్రితప్రతిలో 'దెరవచ్చిన' యని కలదు. కాని యది 'తెరవ చ్చిన' అనుదానికి అచ్చుపొరపాటని తోచుచున్నది.

# ఆంధ్ర భారత పాఠ నిర్ణయ పద్ధతి

This is an article on textual criticism of Nannaya's Bhārata based on the readings offered by the various manuscripts and printed editions of the work available. Nannaya's Bhārata is considered the earliest work in Telugu Literature, and it is admitted on all hands that its text has been tampered with in various ways by copyists, grammarians, editors etc. in course of time The available manuscripts give various readings and unless Nannaya's text is fixed or restored, its value for the history of Telugu Language is so far lessened. An attempt is therefore made here to show by means of a few illustrations, how the text has been tampered with even long before the time of Appakavi (1650 A.D.) and how the original readings can be sifted out, with the help of internal and contemporary inscriptional evidence, from the mass of readings offered by the various manuscripts, thus indicating the necessity for a more careful edition of Nannaya's text.

ఏ భాష యొక్కఁ గాని పూర్వ స్వరూపము నన్వేషించి తద్భాషా చరిత్రమును దెలిసికొనఁదలచినవా రా భాషలోని ప్రాచీన గ్రంథ సమితిని శాసనాదులను బరిశీలించి యందలి పదపదార్థములకుఁ గాలక్రమమునఁగలిగిన పరిణామమును బట్టువఱచుకొని, ప్రాచీనార్వాచీన రూపము లందలి భేదములను వానికిఁ గల కారణములను దద్భాషాసంప్రదాయానుసారముగా సమర్థించుకొనఁగలిగిన గాని, తమ కోరికను గొనసాగించుకొనలేరనుట నిశ్చయము. ఆంధ్రభాషా చరిత్రమునుగాని యాంధ్ర వాఙ్మయ చరిత్రమును గాని పరిశీలింపఁ దలఁచినపుడు, ఇప్పటికి లభ్యములగు గ్రంథములలో నాదిమమగు నన్నయ రచిత భారతమును, దత్పూర్వమందు బయలు వెడలిన శాసనములను బ్రమాణ గ్రంథములుగా గ్రహింపవలసియుండును గదా. వీని ప్రామాణ్యమును గ్రహించుట యెంతయావశ్యకమో అంతకుఁ బూర్వ మీ గ్రంథముల పాఠ నిర్ణయము చేసికొనుట గూడ నంత యావశ్యకముగనే కనఁబడుచున్నది.

శాసనములు మొదట నెట్లు చెక్కఁబడినవో యట్లే యెల్లకాలము నుండునుగాని మార్పును జెందవు కావున నవి తక్కిన వాఙ్మయ భాగముల కంటె నెక్కుడు ప్రమాణములుగా గ్రహింపదగినవని చెప్పుదురు. కాని వానిలోఁగూడ ననేక విధములగు ప్రయోగములుండుటేగాక, కొన్ని పరస్పర విరుద్ధములుగాఁగూడఁ గనఁబడుచున్నవి. ప్రయోగ విశేషములను బట్టి కొన్నిటికి వైకల్పికత్వమును గొన్నిటికి బాహుళకత్వము నంగీకరించినను, దుష్టములని చెప్పక తప్పని ప్రయోగములు కొన్ని వానిలో లేకపోలేదు. అట్టి వాని గుర్తెఱింగి వానిలోని విశేషములను బరిశీలించి పాఠ నిర్ణయము చేసికొనినఁ గాని యవి భాషా చరిత్ర జ్ఞానమున కుపయోగపడవు. ప్రాచీన శాసనములందలి గద్య పద్యాదులను రచించిన వారు వేఱు. వానిని లిఖించిన వారు వేఱు. నందంపూడి శాసనము నన్నయ రచితమే. కాని దానిని లిఖించిన వాఁడు గండాచార్యుఁడు. శ్రీనాథరచితములగు శాసనములనేకములు పెద్ద నార్యలిఖితములు శాసనములకే కాక ప్రబంధాదులకును రచయితలు వేఱు లేఖకులు వేఱుగా నున్న ట్లగపడుచున్నది. కావ్యమీమాంసాకారుఁడగు రాజశేఖరుఁడు కవితా సామగ్రిలో మంచి లేఖకునిఁగూడఁ బేర్కొనియున్నాఁడు. వ్యాసులు సంస్కృత భారతమును రచించినపుడు గణపతి లేఖకుడయ్యెనట. తిక్కనకు లేఖకుఁడు కుమ్మరి గురునాథుఁడని చెప్పుదురు. ఆంధ్రకవితా పితామహుఁడు లేఖకులు' లేకున్నఁ గృతులు రచింపశక్యమే యని యన్నాఁడు. ఇట్లు గ్రంథముల మొట్టమొదటి ప్రతియే రచయితలది కానపుడు తరువాతి ప్రతులనుగూర్చి చెప్పెడిదేమి. ఇంక లేఖకులు లిఖించునపుడు వారితరులు చెప్పుదానిని విని లిఖించుట యొక పద్ధతి. ఇతరులు వ్రాసిన

దానిని జూచి తిరిగి లిఖించుట మఱియొక పద్ధతి. వినియో చూచియో తిరిగి శిలలపైనో, తామ్రఫలకములపైనో చెక్కున పుడా చెక్కడపుఁబనివాని సంస్కారమును బట్టి దోషములు దొరలుచుండవచ్చును. ఆయా కాలములందున్న వ్రాఁత పరిపాటిని బట్టి చెవులతో విను దానినే వ్రాయక దాని మాఱురూపములను వ్రాయుటకూడ సంభవించు చుండును. 'వ్రాసిన' అనుదాని నట్లె పలుకుచు వ్రాయున పుడు 'వ్రాస్ని' అనియు, తమరు-అనుదానిని 'త్మరు' అనియు వ్రాయుట యీ కాలమునను గొందఱ కలవాటై యుండుట యందఱు నెఱింగినదే గదా. ఇట్లే యనేక విధములుగ మార్పులు గలిగి పాఠభేదములు బయలుదేరి నపుడు కవియుద్దేశించిన దేదో వ్రాయసగాఁడు కల్పించిన దేదో మనము జాగరూకతతోఁ గనిపట్టవలసియుండును. అట్టి చోటుల యథార్థ ప్రయోగమును దెలిసికొనుటకై కవి యితరత్ర ప్రయోగించిన ప్రయోగములే యాధారములగును. తత్ప్రామాణ్యమును బట్టి కవ్యుద్దిష్ట పాఠమును గ్రహింపవలసి యుండును.

ఇఁక భారతాది గ్రంథముల విషయమున మఱికొన్ని చిక్కులుగూడఁ గలవు ఈ గ్రంథములు తాళ పత్రముల పైని వ్రాయఁబడుచుండెడివి. శిలలవలెను రాగి రేకులవలెను దాళపత్రములు చిరకాలము నిలిచియుండునవి కావు గదా. అవి స్వయముగానే శిథిల స్వభావములు. అట్టివానికి రామబాణములను పురుగులు వాని నాశమునకు రామబాణ ములవలె నమోఘములే. వీని మూలమున గ్రంథమున నచ్చటచ్చట శిథిలములై లుప్తములైన భాగములను లేఖకులు దమకుఁదోచిన రీతిని బూరించి వ్రాయుచుండుటయు సంభవించును. ఇప్పటికి సుమారు మున్నూఱేండ్లకుఁ బూర్వము వ్రాయఁబడిన ప్రతులే మనకు లభించుట కష్టము గదా. అప్పటి కించుమించుగా నేడెనిమిది నూఱేండ్లకుఁ బ్రాంతమున రచింపఁబడిన నన్నయాదుల గ్రంథము లెన్ని పరివర్తనములఁ బొందియుండునో యూహించుకొనవలసి నదే. ఇప్పుడు మనకు లభించునవి మొదటి ప్రతికి బహుదీర్ఘ కాలమున బయలుదేఱిన పరంపరా పుత్రికలు కావున బహుభేదముగల పాఠములతోఁ గూడి యుండు ననుటకు సందేహము లేదు.

ఈ ప్రతులలోఁ బాఠభేదములు బయలుదేఱుటకు మఱికొన్ని కారణములు గూడఁగలవు. మొట్టమొదటఁ దాళ పత్రముల పయిని గంటములతో వ్రాసినపుడు హల్లులతోఁ గూడిన ఈ, ఏ, ఓ మొదలగు వానికి సరియగు లిపులు వ్రాయుట కష్టమును అనభ్యస్తమునయి యుండియుండును. కావుననే యిప్పటికి గొన్ని వ్రాఁతప్రతులలో 'నెల' అమనది 'నెల' 'నేల' అను పదములకు గుర్తుగా వ్రాయఁబడియుండుట కాన నగును. ఇట్టి దానిని బట్టి ప్రత్యంతరము వ్రాయు సందర్భమున వ్రాయసగాఁడు తనకుఁగల సంస్కారమును బట్టి దానిని కొన్నిచోట్ల నెలగాను, గొన్నిచోట్ల నేలగాను చదువుకొనుటయు నది యన్వయింపనిచో దాని స్థానమున మఱియొక పద మేదేనిఁ బ్రవేశపెట్టుటయు సంభవించుచుం డును. సంస్కార శూన్యులు వ్రాసినపుడు మాతృకలలోని శబ్దముల యథార్థ స్వరూపమును గ్రహింపనేరక తోఁచినరీతిని వ్రాయుటచే నర్థశూన్యములగు భాగములు కొన్ని యేర్ప డును. అల్పసంస్కారము గలవారు వ్రాసినపుడు వారందలి పదపదార్థములను గుర్తెఱుంగలేక సందర్భానుసారముగా నప్ప టికి వాడుకలోనున్న పదములను మాతృకలోని పదముల స్థానమునఁ బ్రయోగించి వ్రాయుటచే మాఱిపోయిన స్థలములు కొన్ని యేర్పడును. సంస్కారవంతులగు వారును, అందు లాక్షణికులును దమ తమ కాలమునఁగల ప్రయోగములను బట్టి సంస్కరించి యట్టి వానిని దమగ్రంథములలో లక్ష్యము లుగా నిచ్చుటచే నేర్పడు పాఠములు కొన్ని యుండును. ముద్రాపకులట్టి తాళపత్ర గ్రంథములను దమకాలమున బయలుదేఱిన వ్యాకరణమున కనుకూలముగాఁ బరిష్కరిం పించి ముద్రించుటచే స్థిరపడిన పాఠములు కొన్నియుఁ గాన నగుచున్నవి. ఇట్లు కాలక్రమమునఁ గలుగుచు వచ్చిన మార్పులను బట్టి యిప్పటికి సుమారు తొమ్మిదివందల సంవత్సరములకుఁ బూర్వమున నన్నయచే రచింపబడిన గ్రంథము పెక్కుచోట్ల నిప్పుడు మనకు లభ్యములగుచున్న గ్రంథముల కంటె మిగుల భిన్నం బైన పాఠములతోఁ గూడియుండునని నిశ్చయింపవలసియున్నది ఇటీవలఁ గొందఱు తాళపత్ర గ్రంథములలోని పాఠములను సరిచూచి వెనుకటి పాఠములను గొంత సవరించి పునస్సంస్కారముఁ గావింప యత్నించినారు. అట్టి వారిలో బ్రాచీనుఁడు అప్పకవియని చెప్పవచ్చును. ఈతని కాలమున కనఁగా నిప్పటికి మూఁడు నాలుగు శతాబ్దులకుఁ బూర్వమే భారతాది గ్రంథముల నపపాఠములు చేరినట్లును గొందఱు లాక్షణికులు గూడ వాని గనిపట్టలేక యా యపపాఠములనే గ్రహించినట్లును అప్పకవీయమును బట్టి తెలియవచ్చుచు న్నది.

అప్పకవీయమునఁ దృతీయాశ్వాసమందు దేశ్య నిత్య సమాస విశ్రాంతులను దెలుపు సందర్భమున లక్షణసార సంగ్రహమునుండి

"తే. అచ్చు హల్లును దేశీయ మనియెడి వడి
యెన్న నొక్కొక్కచోటఁ గ్రిక్కిఱిసెఁ గృతుల

సరసలక్షణకవులు గ్రచ్ఛఅ న్నొనర్చ
భంజితాసురసముదాయ యాంజనేయ.''

అను లక్షణమును గ్రహించి వాని కుదాహరణముల నిచ్చిన పిదప నీ క్రింది విధమున రచించెను.

''ఉ. నన్నయ ముఖ్య సత్కవి జ
నంబుల కా ములందు లేఖకుల్
గొన్నియుఁ బా కాధములు
గొన్నియుఁ బోకడఁబెట్టి తక్కువై
యున్నెడఁ గాంచి జానపదు
లోడక దిద్దిన తప్పు త్రోవలె
ల్లన్నిజ మంచుఁ గైకొనిన
లక్షణవేత్తలు సమ్మతింతురే.''

వ. అది యెట్లనిన సులక్షణ సారంబునందు లింగము గుంట తిమ్మన వ్రాసిన యప్రశస్తంబులగు లక్ష్యంబులకు నాశ్చర్యంబు నొంది బహుపుస్తకములు నిరీక్షించి వాని నెల్లను బ్రక్షిప్తంబులుగా నెఱింగిన వాఁడనై లక్షణవంతంబులగు పురాతన ప్రోక్తంబులు వివరించెద.''

పయి నప్పకవి చెప్పిన దానివలన నాతని కాలమునకే అనఁగా బదునేడవ శతాబ్దినాఁటికే భారత పాఠములు లేఖక పాఠకులు పాడుచేయుటయు వానిని జానపదులు తమకుఁ దోఁచిన రీతిని గొన్ని దిద్దుటయు నట్టి వానినెల్లఁ గొందఱు లాక్షణికులు ప్రమాణములుగాఁ గొని లక్ష్యములుగా నిచ్చు టయు సంభవించియుండెననియు అప్పకవి బహు పుస్తక ములు నిరీక్షించి వానినెల్లను బ్రక్షిప్తములుగా నెఱింగిన వాఁడై పురాతనకవి ప్రోక్తంబులు వివరించెననియు స్పష్టముగాఁ దెలియుచున్నది.

అతఁడట్లు చెప్పి తాను బ్రశస్త పాఠములని పేర్కొనుచు నిచ్చిన వానిలోఁగొన్నిటిని బరిశీలింతము.

అది పర్వమునందు:

''క. నా వచనమున నపత్యము
గావించుము నీకు గొంతి కడునెయ్యమునన్
నీ వగచిన యాయర్థము
నూనె మనంబునఁ దలంతు సుందరి యెపుడున్.''

ఈ పద్యమున నుండిన యప్రశస్త పాఠమేదో యాతఁడు చూపలేదుగాని యానంద రంగరాట్ఛందమున నఖండయ తికి లక్ష్యముగాఁ బయి పద్యము గ్రహింపఁబడినది. అందుఁ జివరపాదమున ''నూనె మనంబునను దలఁచుచుండుదు నేనున్'' అని యున్నది. ఈ పాఠము మద్రాసు దొరతనము వారి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున 11-15-2; 25-13-1. అను పుస్తక సంఖ్యగల తాళపత్ర గ్రంథములలోఁ గలదు. ముద్రితములందు ''మూనె మనంబునఁ దలంతుఁ జాలయక యేనున్'' అని పరిష్కర్తలు పాఠమును నిర్ణయిం చిరి. ఈ రీతిగఁ గొన్ని ప్రతులలోఁ గలదు. అప్పకవి పాఠముగూడ నే ప్రతిలోనయినఁ గలదేమో. ఏమయినను అఖండయతి అందులేకుండగఁ జేయఁబడినది.

మఱొకటి చూతము. ఉద్యోగపర్వమునందు (2-12)

''క. తమ తండ్రి భంగి నీకును
సముచితముగ భక్తిజేసి సజ్జనసుత మా
ర్గమునను జరియింపంగా
నమలమతీ కన్న కొడుకు లట్లరయఁజనున్''

ఇది యప్పకవి యుదాహరించిన పద్యము. ఇందును నప్రశస్త పాఠమాతడీయకున్నను రంగరాట్ఛందమున నఖండ యతి సహితపాఠము గననగుచున్నది. అందు:

''మార్గమునఁ జరింపంగా విమ
లమతీ నీ కొడుకులట్టుల యరయంగనగున్''

అని యున్నది. ఇం దఖండయతిసహితపాఠమునకే యప్పకవి వేఱు పాఠము నిచ్చియుండును.

ఇప్పటి ముద్రితములలో, ''మా, ర్గమున నడుమ వారల నీ, వమలమతింగన్న కొడుకులట్లరయఁదగున్'' అని యున్నది.

రామాయణము నుండి మఱొక పద్యము గ్రహింపబడినది. అది యప్పకవి పాఠమున నిట్లున్నది:

ఉ. ''అన్నవు తండ్రియట్ల విను
మంతియకా దటమీద రాజ వే
మన్నఁ గొఱంత లేదు మణి
హారములాదిగఁబెక్కు కానుకల్
మున్నుగ సీతనిచ్చి జన
లోకపతిం గని మమ్ముఁ బ్రోవుమీ
సన్నపుకార్యము ల్వలదు
సంధియ మే లటు గాక తక్కినన్''

పయిపద్యము రెండవ పాదము రంగరాట్ఛందమున ''రాజవే, మన్నను లెన్సయౌను మణిమండన ముఖ్యములైన కానుకల్'' అనియున్నది. ఈయఖండయతి పాఠమే యప్ప కవి పరిహరించి యుండును. ఆతఁడప్పటి యప్రశస్తపాఠ మని చెప్పినది చూపలేదు గదా.

మొత్తము మీఁద నప్పకవికాలమునకే యప్రశస్తములని లాక్షణికు లెంచిన పాఠములు దొర్లినవి. లాక్షణికులలోఁ గొందఱు వానిని బ్రమాణములుగా గ్రహించుటయు సంభవించినది. ఆ లాక్షణికులను నధిక్షేపించి బహుపుస్తకములు నిరీక్షించి పురాతన కవిప్రోక్తములను నిర్ణయించితినని యప్ప కవి యిచ్చిన నన్నయ్య లక్ష్యములలోఁ గొన్ని నన్నయ్య నియమములకే వ్యతిరిక్తముగాఁ గనఁబడుచున్నవి.

ఒండు రెం డుదాహరణములు చూతము.

అప్పకవి స్వవర్గజప్రాసమున కుదాహరణముగా నిచ్చిన పద్యములలో నన్నయ దిది:

చ. "కాదన కిట్టిపాటి యప
కారము తక్షకుఁ డేకవిప్ర సం
బోధనఁజేసి చేసె నృప
పుంగవ నీవు ననేక భూసురా
పాదిత సర్పయాగమున
భస్మము సేయుము తక్షకాది కా
కోదర సంహతిన్ హుతవ
హోగ్ర మహోగ్ర శిఖాచయంబులన్."

ఇందు "సం, బోధనచేసి చేసె నృపపుంగవ" అనుచోట "సం, చోదనఁజేసి చేసె నరిసూదన" అనియు, "సం, పాదన, అనియుఁ బాఠభేదములు తాళ పత్రపుఁ బ్రతులలోఁ గలవు. నన్నయ కవిత్వములోఁ దదితర స్థలముల వర్గజ ప్రాసము గానరానందునను నన్నయ్యయే యీ సంద ములన (2-194) తక్షకుండు విప్రవచన చోదితుండై య యు, మఱొకచోట (1-20) 'అరిసూదన' అనియుఁ బ్రయోగించి యుండుట చేతను 'సం, చోదనఁజేసి చేసె నరిసూదన' అనుపాఠమే నన్నయ్య ప్రయోగించియుండు ననుట సయుక్తి కమని తోఁచుచున్నది.

అప్పకవి స్వవర్గజ ప్రాసమున కిచ్చిన నన్నయేతర కవిలక్ష్యములు గూడ నిలుచునవి గావు. అందు, విరాట పర్వమునందు.

"క. ముదమొదవ రమ్యహర్మ్యము
తుదినిలువున నిష్టసఖులతోడ విహారా
స్పదమగు నెలవున మెలఁగెడు
సుధేష్ణ తఙ్జాలకములఁ జూచెం బ్రీతిన్".

ఇందున్న సుధేష్ణ అనుదానికిఁ బెక్కు ప్రతులలో సుదేష్ణయనియే కలదు. సంస్కృత భారతాదులలోను సుదేష్ణ యనియే యున్నది. కావున నిది ప్రమాణార్హము గాదని తోఁచెడిని.

ద్రోణపర్వమునుండి

క. వింధ్యాద్రివోలె నా ప్రతి
వింధ్యుం డచలితోగ్రమూర్తి వెలయ నిలిచి గ,
ర్వాంధ్య మలరగ సుదీప్తా
వంధ్యాస్త్రము లక్కుమారవరుపైఁ బఱపెన్.

యని యప్పకవి యుదాహరించెను. ఇందును ప్రాఁత ప్రతులలో "ప్రతి వింధ్యుఁ' డనియె కలదు. వింధ్యమునకుఁ బ్రతియైన వాఁడను వ్యుత్పత్తి గ్రహించినను ప్రతివింధ్యుఁడ నియె యుండును. సంజ్ఞావాచకమన్నచో నెట్లుండుటకును వినిగమక కారణము కనఁబడదు.

విరాటపర్వము నుండి స్వవర్గజప్రాసమున కప్పకవి మఱొక యుదాహరణ మిచ్చెను. అది చూతము:

"ఎండకు వాన కోర్చి తన
యిల్లు ప్రవాసపుఁజోటు నాక నాఁ
కొంటి నలంగితి న్నిదుర
కుం దఱి తప్పెను దప్పిపుట్టె నా
క్కండను నెట్లొకో యనక
కార్యముగల్గిన వేళ నేలినా
తండొక చాయఁజూపినను
దత్పరతం బనిసేయు టొప్పగున్."

ఈ పద్యమున "అఁ, కొందు నలంగుదు న్నిదురకుం దఱి దప్పెను" అనుపాఠము పెక్కుప్రతులలోఁ గలదు. అఁకొందు (= అఁకొందును) అని కవి ప్రయోగించి యుండును. అఁకొంటిని అని భూతకాలిక ప్రయోగమును ప్రయోగించె ననుకొనుటచే నట్టి ప్రమాదము గలిగియుండును. నన్నయ తిక్కనల గ్రంథములందు స్వవర్గజ ప్రాసము ధ్రువపఱచు ప్రయోగములు లేమింజేసియు నప్పకవి యిచ్చిన చోట్లఁ బాఠాంతరము లుండుటం జేసియు స్వవర్గజ ప్రాసము నన్నయ సమ్మతమన నవకాశము కానరాదు. కావున "సంబోధన" పాఠము నన్నయచే ననుద్దిష్టము. అప్పకవి యీ విషయమున నన్నయ మార్గమునకు దూరుఁడై నాఁడని చెప్పక తప్పదు.

మఱియొక విషయము పరిశీలింతము.

అభేదవిరతుల కుదాహరణముగా నప్పకవి యీక్రింది పద్యము నిచ్చెను.

ఆదిపర్వమునందు:

చ. "నుతజల పూరితంబులగు
నూతులు నూఱిటికంటె సూనృత

వ్రత యొక బావిమేలు మఱి
బావులు నూఱిటి కంటె నొక్క స
త్క్రతువది మేలు తత్క్రతుశ
తంబున కంటె సుతుండు మేలు త
త్సుతశతకంబు కంటె నొక
సూనృత వాక్యము మేలు చూడగన్.''

ఇందు రెండవ పాదమున 'వ' 'బ' కారములకు యతి. ఇచ్చటఁ బ్రాఁత వ్రాఁత ప్రతులలోఁ గొన్నిట భావులని కలదు.

కొన్నిట వాపి, వాపుల, అని యున్నది. దీనికి మూలమగు సంస్కృతమున

'వరం కూపశతా ద్వాపీ వరం వాపీశతా త్క్రతుః,
వరం క్రతుశతా త్పుత్రః సత్యం పుత్రశతా ద్వరమ్'

అని యుండుటచేతను నన్నయ్య పై శ్లోకములోని భావము సరిగా గ్రహించి యుండుట చేతను వాపీశబ్దమే నన్నయ్య ప్రయోగించి యుండునని చెప్పఁదగును.

ఆరణ్యపర్వమునుండి మరియొక యుదాహరణ మప్పకవి యిచ్చియుండెను. అదియును బరిశీలింపఁదగును.

''ప్రతి బలదర్పభంజనుఁడు
పార్థుఁడు దారుణ బాణవర్షము
న్నతి నతిధీరుఁడై కురిసి
నం బరముండు మహాంబువృష్టి ప
ర్వతము గ్రసించినట్లు తన
బాహుల వాని గ్రహించి పోరన
క్షతతనుఁడయ్యె వాని నతి
గర్వితుఁ బార్థుడు చూచి యాత్మలోన్.''

ఇందు గ్రసించు అనుచోట గ్రహించు అను పాఠాంతరము ముద్రితముననే చూపఁబడినది.

''ప్రతిబల ... ... ... మహాంబు వృష్టిఁబర్వతము గ్రహించునట్లు బలవంతుఁడు దాని గ్రహించి ....'' అని పాఠాంతరము ముద్రితములఁ గొన్నిటను తాళపత్ర గ్రంథములలో జూచిన వానిలోఁ బెక్కింటను గలదు. పయిరెండు చోట్లను బాఠాంతరములుండుట చేతను, ఇతరత్ర బవలకు యతిలేక పోవుటచేతను నన్నయ్య 'వాపి, వాపుల, బలవంతుడు' అనియే యాయా స్థలములఁ బ్రయోగించి యుండునని నమ్మిక గలుగుచున్నది. అప్పకవి పాఠములలో నన్నయ్య నియమముల నుల్లంఘించినవి మఱికొన్ని కలవు. వానినింకను విమర్శించి నిర్ణయింపవలసియున్నది.

అప్పకవినాటికే అనఁగా మున్నూఱు వర్షములకుఁ బూర్వమే యట్టి దోషములు భారతాది గ్రంథములలోఁ జేరినపుడు అప్పటి నుండియు నేఁటివఱకు నా గ్రంథము లెంతంత తప్పుల తడికలుగా బరిణమించి యుండునో యూహించుకొనవలసినదే. మఱియుఁ దనకుఁ బూర్వము పాఠకాధము లపపాఠములను భారతాదులలోఁ జొనిపి రనియు, జానపదులు దిద్దివేసినయట్టి యపపాఠములనే లాక్షణికులు గ్రహించిరనియు వారి నాక్షేపించుచుఁ దాను పెక్కు ప్రతులను బరిశీలించి సరియైన పాఠములను గ్రహించినట్లుగాఁ జెప్పికొనిన అప్పకవి పాఠములే కవ్యుద్దిష్ట పాఠములుగా గ్రహించుటకు అవకాశము కలుగనప్పుడీ ప్రాచీన తాళపత్రపుఁబ్రతుల పాఠములనుండి కవ్యుద్దిష్ట పాఠమును నిర్ణయించుట యెట్టి చిక్కులతోఁ గూడిన కార్యమో విశదమగుచునే యున్నది. అయినను తరువాతి కవుల కవిత్వమువలెఁ గాక నన్నయ కవిత్వము కొన్ని విశేష నియమములతోఁ గూడిన దగుటచే వాని సహాయము చేతను నాకాలపు సంప్రదాయముల సాహాయ్యముచేతను నన్నయోద్దిష్ట పాఠములను గొంతవఱకు నిర్ణయింపవచ్చునని తోఁచు చున్నది. అట్టివాని మచ్చునకుఁ గొన్నింటిని బరిశీలింతము.

### అందుల - అందలి

భారతమునం దాదిపర్వమున (1-11) ''శ్రీమహాభారతము నందలి యభిప్రాయము విన నభిలాష పెద్దయై యుండు'' అని ముద్రితములలోను దొరతనము వారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమందున్న ప్రతులలో 25-13-1 సంఖ్యగల ప్రతిలోను గనఁబడుచున్నది. ఆ భాండాగారమున నున్న కొన్ని తాళ పత్రపుఁ బ్రతులలో (11-15-2) ''శ్రీమహాభారతంబునందుల యభిప్రాయ'' మను పాఠము కలదు. నన్నయ ఆది. 6. 244 లో ''క. ఇం, దుల జీవన మేల నమ్మెదురు తత్త్వజ్ఞుల్'' అని యతిస్థానమునందు 'ఇందుల' వచ్చునట్లు ప్రయోగించెను. దానిని బట్టి నన్నయ పై వాక్యమున 'భారత మందుల' అని ప్రయోగించెననియే నిర్ణయింపవలయును. ఆభావమును కొన్ని శాసనములలోని ప్రయోగములును ధ్రువపఱచుచున్నవి. దక్షిణ హిందూదేశ శాసనములలో (South Indian Inscriptions vol. IV No. 970) నాల్గవ సంపుటమున 970 సంఖ్యగల శాసనమున 'అందుల లాభన[గా]లు పాడ్డవెరవున [ను] నడుపు కొనువారు'' అని యున్నది. అందే 1021

సంఖ్యగల శాసనమున, ఇందుల భోగముగొని, అనియు 1019 సం. శాసనమున ''ఇందుల పహిండి'' అనియుఁ గలవు.

'జరలిః' అను సూత్రమున నన్నయ్య భట్టే 'అందలి' అనురూపమును వ్యాకరించి యున్నాడే యని కొంద అన వచ్చును. అతఁడు ప్రయోగించినఁ ఇం, దుల జీవన మేల నమ్మెదురు తత్త్వజ్ఞుల్'' అను ప్రయోగమున కతఁడు వ్యతిరేకముగా సూత్రించియుండునా? ఇంతకు ''జరలిః'' అనునది నన్నయ్య నోటవచ్చిన దను విషయము వివాద గ్రస్తమేకాని నిర్వివాదము గాదు గదా! నన్నయ ప్రయోగ మును, బెక్కు తాళపత్రగ్రంథములును శాసనములును ధ్రువపఱచుచున్న 'అందుల' పాఠమే మనకు గ్రాహ్యమని నిర్ణయింపవచ్చును.

**అపభ్రంశములు చేరిన పాఠములు:**
**భారతమం దాది పర్వమున 2-131 పద్యమందు:**

సీ. ''జనమేజయుని చేయు సర్పయాగమునకు
విఘ్నమందఱుము గావింతమతఁడు
ధర్మార్థి గావున ధారుణీసురులమై
యడుగుద మీక్రతు వుడుగుమనియుఁ
గొందఱ మతనికిఁ గూర్చుమంత్రులమునై
యీ క్రతుక్రియఁజేసి యిహపరముల
కగుఁ బెక్కు దోషంబు లని హేతువులు సూపి
యుడిగింత మందఱు నొక్క మొగిన

అ. భక్ష్యభోజ్య లేహ్యపానీయముల మీఁద
సదములోని విప్రజనుల మీఁద
వెగడుపడఁగఁ బాఱ వెఱపింత మెజ్జులు
తత్ప్రయోగ విధులు దప్పి పఱవ.''

ఈ పద్యము సర్వయతిసీసము. కాని మూఁడవ పాదములో రెండవ దళము 'అడుగుద మీ క్రతువుడుగు మనియు' అని ప్రాసయతితో నున్నది. కొన్ని వ్రాత ప్రతులఁజూడఁగా,

I. ''అడుగుద మిష్టి సేయకు మటనియు''
II. ''అడుగుదము క్రతువు సేయకుము యనియు''
III. ''అడుగుదము క్రతువు సేయకుము ననియు''
IV. ''అడుగుదమిదియు సే(జే) యకుడు యనుచు.

అను పాఠములు గనఁబడినవి. వానిలో మొదటిది ముద్రాప కుల చేత నధోరేఖమునఁ జూపబడెను. మిగిలిన వానిలో 'అడుగుదము'' అనియుంచినచో ఛందోభంగము వాటిల్లును 'అడ్గుదం' అని గాని 'అడుగుదాం' అని గాని యపభ్రష్ట రూపముగా గ్రహించినచో ఛందస్సు సరిపడునుగాని యట్టి ప్రయోగమే యీ పాఠము పాఠకదోషమునఁగలిగిన దని చాటుచున్నది. అట్టి దోషము గ్రహించినవారు దాని క్రింది పాఠముననున్న 'ఉడిగింత' మను పదమును బట్టి 'అడుగుద మీ క్రతువుడుగు మనియు'' అను పాఠము కల్పించి యుందురు. అది సరసమైనను నన్నయ్య నియమమునకు దూరమైనదిగాన గ్రాహ్యముగాదు. I, IV పాఠములలో నొకటి గ్రాహ్యమని తోఁచెడిని. ఇట్టివి యింకను గొన్ని ప్రతులలోని పాఠములఁ జూచి ధ్రువపఱుపవలసియున్నది.

## పర్యాయపదములు గూర్చుట

ఇది ప్రాయికముగాఁ గనఁబడు దోషము. దానివలనఁ గవికాలమున నుండినదేదో తర్వాత వచ్చినదేదో తెలిసికొ నుట కవకాశము లేకపోవును. సూక్ష్మదృష్టితోఁ బరిశీలించిన వారి కందుల యాథార్థ్యము పొడగట్టక మానదు.

ఆది. 1-3

''జనమేజయునొద్దకు వచ్చి'' అనుచోట 'ఒద్ద' అనుదాని స్థానమున 'వద్ద' అన్న 'పాలికి'యు, అనియు, 'కడకు' అనియు వేఱువేఱు ప్రతులలో గనఁబడుచున్నది. వ్రాయు వారో, వ్రాయువారికిఁ జెప్పువారో వారికిఁ దోఁచిన పర్యాయ ములు దొర్లించి రనుట స్పష్టము ఆ పాఠములలో 'వద్ద' అనునది ఒద్ద అనుదాని యపభ్రష్ట వ్యావహారిక మనుట నిర్వివాదము. అది నన్నయ ప్రయుక్త మనఁజాలము. 'కడకు' అని గాని 'పాలికి' అనిగాని నన్నయ్య ప్రయోగించును. వానికంటె 'ఒద్దకు' అనునది పెక్కు ప్రతులలో నుండుటచే 'ఒద్దకు' గ్రహింపవచ్చును. మిగిలినవి పాఠభేదములుగాఁ జూపఁ దగును.

### ప్రాసయతులు

సీ. ''బ్రహ్మణ్యుఁడగు కశ్యపబ్రహ్మ వరమున
వినతకుఁ బుట్టిన యనఘమూర్తి
వాలఖిల్యులదయ వరపక్షికులమున
నింద్రుఁడై పుట్టిన యుద్ధతేజుఁ
డుదధిలోనున్న యత్యుగ్రనిషాదుల
నారంగ మ్రింగిన ఘోర వీరుఁ
డిభకచ్ఛపముల రోహిణశాఖతో నెత్తి
కొని దివిఁబఱచిన యనిలవేగి

తే. వీఁగి తన తల్లి దాస్యంబు వీఁగఁబాని
తడయ కమృతంబుఁగొని పోవఁగడఁగి వచ్చెఁ
గామరూప సంపన్నుండు గామగమనుఁ
డతఁడు నీకు నసాధ్యుండు శతముఖుండ

భార. ఆది 2-83

ఈ పద్యమునఁ బ్రతిపాదమునను మొదటి దళమున యతియును రెండవ దళమునఁ బ్రాసయతియును గలవుకాని రెండవ పాదము రెండవ దళమున యతి పడినది. అది మిగిలిన పాదములలోఁ గల నియమమునకు వ్యతిరిక్తముగా నున్నది.

తాళపత్ర గ్రంథములలో గొన్నింట 'ఇంద్రుఁడై పుట్టిన యిద్ధతేజుఁడు' అనియే కలదు. కొన్నిట అందును బ్రౌనుదొరగారు వ్రాయించిన ప్రతులలో 'ఇంద్రుఁ  పుట్టిన సాంద్ర తేజ' అని యున్నది. ఆ పాఠమును ' ంది గీఁతక్రింద ముద్రాపకులును జూపిరి. మఱొక ప్ర లో 'ఇంద్రుఁడై పుట్టినరేంద్రతేజ' అనియున్నది. బళ్లారి నుండి తెప్పించిన ప్రాఁత తాళపత్రపుఁ బ్రతిలో 'ఇంద్రుఁడై పుట్టిన రుంద్రతేజ' అని యున్నది.

వీనిలో 'ఇంద్రుఁడై పుట్టిన రుంద్రతేజుఁడు' అను పాఠమే న య్యపాఠమని తోఁచెడిని. ఏలయన నన్నయ్యకుఁ బూ ్రము కన్నడమున భారతము రచించిన పంపకవి ప్రాస నములఁ బెక్కింట రుంద్ర శబ్దముప్రయోగించి యుం ను. పంపభారతమున వాడిన కొన్ని పదములు సమాసములును నన్నయ్య వాడినట్లు కొన్ని నిదర్శనములు గలవు. ఇంద్రశబ్ద ప్రాసయతికిఁ 'సాంద్ర' శబ్దముకంటె రుంద్రశబ్దమే యుచితముగా నుండును. ఇది యాంధ్ర రచయితలలోఁగూడ నభ్యస్తమైన పదమే యని దక్షిణ హిందూ శాసనములలోని యొక పద్యము చాటుచున్నది.

"..... అఖండ దీపంబు నిల్పినా,
చంద్రతారకముగ రుంద్రయశుణ్డు"
**South Indian Inscriptions, Vol. VI, No. 117.**

అని యున్నది. ఈ శాసనము 'శక సం. 1040 అగు నేంటిది.' యతిసహితపాఠము నన్నయ్య నియమమునకు వ్యతిరిక్తమే కదా. మిగలిన పాఠములలో 'రుంద్రయశుఁడు' అన్న పాఠమే నన్నయ్య రచితమని తోఁచుచున్నది.

## యతులు

భారతమున ఆరణ్యపర్వమందు 1-217 పద్యమున

"క్షమయ తాల్చియుండఁ జన దెల్లప్రొద్దు తే,
జంబ తాల్చియుండఁ జనదు పతికి"

అని ముద్రితము. ఇందు మొదటి పాదమున 'క్ష' కారములోనున్న ష కారమునకు మైత్రిగల జకారము యతిస్థానమునఁ బడినది. నన్నయ్య కవితలో 'క్ష' కారమునకు యతిస్థానమునఁ 'క' కారమునకు మైత్రిగల యక్షరమే కాని షకారమైత్రిగల యక్షర ముపయుక్తము కాలేదు. ఆ నియమ మెఱుఁగనివా రెవరో 'జనదెల్లప్రొద్దు' అని సవరించి యుందురు. కొన్ని ప్రాఁత ప్రతులలో 'క్షమయ తాల్చి యుండఁగాదెల్ల ప్రొద్దు' అను పాఠము కలదు. ఇది నన్నయ నియమానుసారమని స్పష్టమే. మఱియు దాని తర్వాతి పాదమున, 'చనదు పతికి'' అని యుపయోగించిన నన్నయ యా పాదమునఁగూడ 'జనదు' అని యుపయోగించి యుండఁ డనియు గ్రహింపనగును.

పయి యుదాహరణములు దిఙ్మాత్రముగాఁ బ్రదర్శింపబడినవి. ఆంధ్ర భాషా స్వరూపజ్ఞానమునకై నన్నయ భాషను బరిశోధించు సందర్భమున నిట్టి వనేకములు గనఁబడినవి. నన్నయకుఁ బూర్వాపరకాలములందు రచింపఁబడిన వానిలో లభ్యములగు శాసన భాగములను బట్టియు నన్నయ నియమములను బట్టియు నొక నిర్ణయమునకు వచ్చుటయే యుక్తముగాఁ గనఁబడుచున్నది.

పాఠ నిర్ణాయకులు తాము నిర్ణయించిన పాఠములను బ్రధాన గ్రంథమునఁజేర్చి మిగిలిన పాఠముల నన్నింటిని బత్రాధోభాగమునఁ జూపుట భావ్యము. ప్రాఁత వ్రాఁతప్రతులు శిథిలతరము లగుచున్నవి. అవి పోయినచో వానిలో నున్న పాఠము లంతరించి పోవును. ఒకరు నిర్ణయించిన వాని కేకారణముననైనఁ బ్రతిరోధమెప్పుడయినఁ గలిగినను ఆయా స్థానములఁగల పాఠభేదములఁ జూచుట కవకాశము గల్పించుటకై యాపాఠములను గూడ సంరక్షించుకొనవలసిన యావశ్యకత కనబడుచున్నది.

అట్లు గ్రహింపఁదగిన పాఠములనన్నిటిని గూర్చుకొని భారతమును లేదా నన్నయ్య భాగమునయినను ముద్రించిన బాగుగా నుండునని తోఁచుట చేత వెనుకనట్టి యత్నము కొంత చేయబడినది గాని యానడుమ నము' త ప్రాచీన గ్రంథ ప్రకటనమునకేకాని ముద్రిత గ్రంథ ప్ర టనమునకు బ్రోత్సాహము విశ్వవిద్యాలయమువారు చూపరేమోయని సందేహము గలుగుటచే నది యప్పుడు కొనసాగలేదు. ఈ మధ్యకాలమునఁ బ్రాచీన ప్రబంధములు ప్రశస్త పాఠములతోను జక్కని వివరణాది విశేషములతోను బ్రకటించుటయు విశ్వవిద్యాలయ పరిశోధన సంస్థవారి కర్తవ్యములలో నొకటి యని నిర్ణయింపబడినది. కావున ముందు నన్నయ్య భారత భాగము పరిష్కరించి ప్రకటింపఁదలంపు ధ్రువపడినది. పరిష్కరణ పద్ధతులును వాని స్వరూపమును జూపుట కీ వ్యాసము ప్రకటింపఁబడినది.

(శ్రీ శ్రీ పాద లక్ష్మీపతి శాస్త్రిగారితో కలిసి)

కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు:

# తెలుగు శబ్దము - దాని వ్యుత్పత్తి

తెలుగు శబ్దము భాషాపరముగాను, జనపరముగాను, దేశపరముగాను కూడా వాడుకలో ఉన్నది. మనమంతా తెలుగువాము. వర్ణభేదాన్నిబట్టి తెలగాణ్యులు-తెలగాలు అనే పేర్లు కూడా ఉన్నవి. మనము మాట్లాడేది తెలుగుభాష. మనము నివసించు దేశము తెలుగుదేశము. అందొక భాగాన్ని తెలంగాణా అనికూడా అంటారు. వీటన్నిటిలో తెలంగు, తెలుగు అనేది మూలరూపంగా కనబడుతూ ఉంది. ఈ తెలంగు' అనేపదం ఎట్లేర్పడిందో, దాని వ్యుత్పత్తి, అర్థము-ఏమిటో తెలిసికోవాలని మనప్రయత్నం. దీని ప్రాచీనతను గూర్చి తెలుసుకుంటే, దీని అర్థంకూడా ఏమైనా తెలుసుకోగలుగుతామేమో అని నా ఆశ. అయితే తెనుంగున్ భారతసంహితా రచన బంధురుడైన నన్నయభట్టే దీనిని మొదట ప్రయోగించినవాడు. అంతకు పూర్వం దీని ప్రశంస కానరాదంటారు. అదీ వాస్తవమే కావచ్చును. కాని అంతమాత్రంచేత నన్నయకు పూర్వం ఈజనులు ఈభాష లేవనలేముగదా. అంతకుపూర్వపు శాసనాల్లో ఈభాషలో పద్యాలు కూడా కనబడుతూనే ఉన్నాయి. అయితే ఈభాషను పేరుపెట్టి ఎవరూ ఉదాహరించినట్లు మాత్ర మగపడదు. క్రీస్తు శకారంభకాలాన ఆంధ్ర శాతవాహనుల తరువాత, ఇక్ష్వాకులు, ఆనందగోత్రజులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు, చాళుక్యులు క్రమంగా ఈ తెలుగుదేశా న్నేలినారు. వారి కాలాల్లో ఈదేశంలో తెలుగుభాష వ్యవహారంలో లేదనగలమా? లేకపోతే మరేభాష వాడుకలో ఉండేది? అయితే క్రీ.శ. 4వ శతాబ్దివరకు ఆరాజుల శాసనాలు ప్రాకృతంలోను, తరువాత సంస్కృతంలోను ఉన్నాయి. 7వ శతాబ్దంనుండి గాని యింతవరకు తెలుగులో శాసనాలు కనబడడంలేదు. కాని ఆ ప్రాచీన ప్రాకృత శాసనాల్లోను తరువాతి సంస్కృత శాసనాల్లోనూ కూడా, దేశీయములైన తెలుగుపదాలు, దానిలో తెలుగుభాషకుగల విలక్షణ సంప్రదాయాలూ కూడా కనబడుతూనే ఉన్నాయి. కాని తెలుగుభాష పేరుమాత్రం నన్నయదాకా ఎక్కడా కనబడదు. దీనికి ప్రబలకారణమేదో ఉండక తప్పదుగదా! ఆంధ్రు లీదేశానికి వచ్చి నెలకొనిన తర్వాత, రాజకీయంగాను వైజ్ఞానికంగాను వారి కీదేశముపై గలిగిన ప్రాభవమే ఈదేశభాషల కాంధ్రమను పేరు కలగడానికీ, తెలుగుభాష పేరు ఇంతకాలం లేకపోవడానికీ ముఖ్యకారణమని మనము తలంపవలసి యున్నది. దేశంలో రాజులు ఆయాకాలాల్లో ఆయాభాషలకు గలిగిన గౌరవాన్నిబట్టి, తమశాసనాలను ప్రాకృతంలోగాని, సంస్కృతంలోగాని వ్రాయించినా, దేశంలోని జనులంతా ఆ భాషలనే మాటాడేవారని చెప్పడం సాధ్యంకాదు. ఈ దేశంలోని రాజులంతా ప్రజలూకూడా వ్యవహరించింది తెలుగేకాని - సంస్కృత ప్రాకృతాలు కావు. ఇప్పటికీ వైదికమంతా - వివాహోపనయనాదులు - అర్థం తెలియకపోయినా ''మమ'' అనుకొని వేదభాషలోనే జరుపుకొనడం లేదూ-మనము? ఆకాలంలో శాసనాల నాభాషలలో వ్రాయించడం ఒక సంప్రదాయం-గౌరవహేతువు. ఇటీవల మనము దేశభాషల నీసడించి ఇంగ్లీషులోనే దస్తావేజులన్నీ వ్రాసుకుంటూ -మాటాడుకుంటూ ఉన్నట్లే, అప్పుడుకూడా రాజులు, వారి ఆస్థానపండితులూ, తరువాత చిన్న కోట పెద్దన్న చెప్పినట్లుగా-''విలసద్భావరసాద్యలంకృతులచే విప్పారి, గీర్వాణ భాషా కావ్యంబుల కెన్ని మంచితనముల్ సంధిల్లె నాచందమై వలియుంబ్రాసయు నంత కగ్గలములై వర్తిల్లు'' సత్కావ్యములను ''తెలుగంచుం జెవి బెట్టలేక'' ఈసడించి అడుగునకు త్రొక్కివేశారు. అలాగే పేరు పెంపులేక పడిఉండగా, ''దానిలోనే దేశికవిత పుట్టించి తెనుంగు నిలిపిరంధ్రవిషయంబున జన చాళుక్యరాజు మొదలగు పలువుర్.'' ఈరీతిగా ఆంధ్ర విషయమున నాంధ్రమైపోయిన 'తెలుగు'భాష చాళుక్యుల కాలంలో మరల తన స్వరూపాన్ని నిలుపుకొని, నన్నయ రచనలో ''తెనుగునన్ మహాభారత సంహితను'' వెలువరించి, తెనుగురూపం బయటపడింది.

ఇదంతా ఎందుకు చెప్పవలసివచ్చిందీ అంటే - ఈ రూపాలు నన్నయకాలంనుండీ మరల వాడుకలోనికి వచ్చిన తర్వాతనే, పండితులు వీనికి వ్యుత్పత్తులను కల్పించడానికి ప్రయత్నించారుకాని, అంతకు పూర్వము దీనిఊసే ఎవరికీ అక్కర లేకపోయిందనీ, తెలుగు శ వ్యుత్పత్తిని త్రిలింగ, త్రికళింగ, శబ్దాలనుండి తెనుగును నగాది శబ్దములనుండి సాధించడానికి చేయబడిన యత్నాల _, నన్నయ తర్వాత పండితులు చేసిన సాము కసరత్తేగాని, మరేమీ కాదని

సూచించుటకే. దక్షిణదేశీయములైన, ఈ వేశ్యభాషా పదాలకు దేశీయ పదములనుండియైనా ఏవో వ్యుత్పత్తులు కల్పించుట యుక్తముగాని-సంస్కృత శబ్దముతో ముడివెట్టుట కేవలము సాహసము కాకపోదు.

ఇటీవల ఈ 'దేశీయవాదం' వచ్చిన తరువాత ఆ ప్రయత్నాలూ జరిగినాయి. దక్షిణ దేశీయభాషలన్నీ ఏక కుటుంబమునకు చెందినవి అనుకుంటూ ఉన్న ఈ కాలంలో కొందరు పండితులు ద్రావిడ శబ్దమగు 'తెన్' నుండి 'తెనుగు' వచ్చినదనీ, దానికి దక్షిణదేశపు భాష అని అర్థమనీ ''తమను పాలించు ఆంధ్రులు ఉత్తరాదివారు గనుక, పాలితులైన ''తెనుగు''వారు తమ్ము 'తెనుగు వారని పిలుచుకొన మొదలుపెట్టినారనీ' తెనుగు శబ్దానికి వ్యుత్పత్తి చెప్పినారు. అట్లయైతే, ఆంధ్రులీ దేశమునకు వచ్చువరకు ఇచ్చటివారికి పేరేలేదన్నమాట. అంతవరకు వీ రనామకులై యుండి-తరువాత 'తెనుగు'వారు కావాలి-ఆ తరువాతనే 'తెనుగు' శబ్దమేర్పడినది కాబోలు.

ఇంతకూ నన్నయ 'తెనుగు' శబ్దాన్నేవాడినా, జనపరంగాను, దేశపరంగాను 'తెలుగు' శబ్దమే ప్రాచుర్యమును వహిస్తోంది. తెలగాలు, తెలగాణ్యులు అనువారేగాక, క్రీ.శ. తొలి శతాబ్దములలోనే కృష్ణా, గోదావరీ ప్రాంత తీరమునుండి బర్మాకు వలసపోయి అచ్చట 'పెగు' పరగణాలో కొన్ని శతాబ్దములు రాజ్యపాలకులై యుండిన 'తెలాంగు'లను జాతివారిని బట్టికూడ చూడగా 'తెలుగు' శబ్దమే 'తెనుగు' శబ్దముకంటే ప్రాచీనమని-అది తొలుత జాతి వాచకమే నని తెలుస్తుంది. కాబట్టి 'తెలుగు' జాతివాచక మనక తప్పదు. ప్రాచీనములు దేశీయములు అగుజాతుల పేళ్లకు వ్యుత్పత్తులను కల్పించుట సాహసమేమో అని అనిపిస్తుంది. జాతుల పేళ్లే దేశానికి భాషకు కలుగవచ్చును. వేరువిధమున గలిగినట్లు చారిత్రకముగా ప్రబలనిదర్శన మున్నప్పుడు వాటిని గ్రహింపవచ్చును. కళునాడు-కన్నడము మలై-ఆళం = మలయాళం - ఇత్యాదు లను గ్రహింపవచ్చునేమో. ఆంగిర్‌సు, సాక్సన్, జర్మన్, రస్సు, చిన్, పాండ్య, చేర, చోళ - మొదలైన జాతివాచక శబ్దములకు వ్యుత్పత్తులను చెప్పుట సాధ్యముకాదు. అట్లే 'తెలంగు' - శబ్దము జాతివాచకము గనుక దాని వ్యుత్పత్తి మనకు తెలియదనుటయే యుక్తము. పాణిన్యాదులవంటి వైయాకరణులకే ఆ సంస్కృతభాషలో అవ్యుత్పన్న ప్రాతిపదికలుకూడా ఉన్నవని ఒప్పుకోక తప్పినదికాదు. ఇక దేశ భాషాశబ్దాలను గురించి చెప్పేదేమిటి? కాబట్టి 'తెలుగు' శబ్దము భాషాశాస్త్రరీత్యా అవ్యుత్పన్నమని చెపితే దోషంలేదు. అనగా సహజమైన దాని వ్యుత్పత్తి ఈకాలంలో మనకు తెలియదన్నమాట. పండితులాయా కాలాల్లో వారి వారికితోచిన రీతుల వ్యుత్పత్తులను కల్పించవచ్చును. వాని కంతేమిటి?

**మణిసంగా దివ భూషా కులమర్యాదా విశేషత స్సాధ్వీ।**
**మైత్రీ రహస్య కథనాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥**

రత్నాలు పొదగడంవల్ల నగలాగ, కుల మర్యాదలు పాటించడం వల్ల ఉత్తమురాలు లాగ, రహస్యాలు చెప్పుకోవడంవల్ల స్నేహంలాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— **'ఉపమావళి' నుండి**

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు :

# లిపి సంస్కరణము

'లిపి' - అనే దానిని గూర్చి ప్రస్తావించడానికి పూర్వం, దానికి పూర్వరూపమైన భాషను గూర్చి కొంచెము చెప్పవలసి యుంటుంది. మన మనస్సులలో పుట్టే భావాలను ఇతరులకు తెలియజేసే సాధనాల్లో ముఖ్యమైనది భాష గదా! ఈ భాష అనేది ధ్వన్యాత్మకం, అంటే మన కంఠతాల్వాది అవయవముల మూలముగా మనంచేసే ధ్వనులచేత సూచింపబడేది అన్న మాట. ఇట్టి ధ్వనులను, కేకలను ఇతర జంతువులు కూడా చేయవచ్చును గాని, జ్ఞాన సంపన్నుడు, స్మృతి ప్రజ్ఞలు కలవాడు అగు మానవుడు కల్పించుకొన్న ఈ ధ్వన్యాత్మక సాధనానికే భాష అని పేరు వచ్చింది. ధ్వన్యాత్మకమైన ఈ భావద్యోతక సాధనం ఒకసారి ఉచ్చరింపబడుట తోడనే, ఎదుటివాని చెవులలో బడి, వాని కీభావం ద్యోతకమైనా - ఈ ధ్వని మాత్రం వెంటనే నశిస్తుంది. అల్లా నశించకుండా తన భావాలను, తన భాషను స్థిర రూపాన్ని పొందించాలనే ఉద్దేశ ముతో కొన్ని చిత్రముల మూలంగాను, చిహ్నముల మూలం గాను వ్రాతలోని కెక్కించడానికి ప్రయత్నం చేశాడు మాన వుడు. వీనినుండి క్రమపరిణామంచేత ఏర్పడినదే 'లిపి' అనేది. ఈ విధంగా సంఘజీవియగు మానవుడు తన భావాలను ఇతరులకు తెలియజేయుటకుగాను భాషను, లిపిని సృష్టించు కున్నాడు. అయితే ఈ భాష అనేది ఏకాలంలో ఎప్పుడు ఏవిధంగా బయలుదేరిందీ అనేది ఎంత విషమ సమస్యగా ఉందో, లిపి విషయం కూడా అంత దుర్భేద్యంగానే ఉన్నది. అయినా; మనకాలంలో జరిగే భాషాపరిణామములనుబట్టి సంస్కరణ మేవిధంగా ఆవశ్యకమవుతున్నదో, దేశకాల పరిస్థి తుల కనుకూల మగునట్లుగా లిపి సంస్కరణ విషయము కూడా పరిశీలనార్హమే అవుతుందనుటకు సందేహ మేమీ లేదు. అందులో భిన్నలిపులు, భిన్న సంప్రదాయములతో గూడిన మన భారతదేశ మేకరాజ్యమై, ఆ అనేకత్వంలో నుండి యేక త్వాన్ని సాధించాలని ప్రయత్నం చేస్తూండే సమయంలో, భాషా లిపుల మూలంగా కూడా దేశమున నేకత్వము లేదా సన్నిహితత్వమునైనా సాధించు మార్గాల నన్వేషించడం అత్యా వశ్యకమే. అయితే ఈ లిపి సంస్కరణ విధానాల నాలోచించు టకు పూర్వము- ప్రస్తుతం ఈ లిపి అనేదాని పుట్టుపూర్వోత్త రాలను గూర్చి కొంత తెలుసుకుందాం.

లిపి అంటే - వ్రాయబడే అక్షరాలు అని తెలుసుకున్నాము గదా. కాని దాని కాపేరెట్లు వచ్చింది, అక్షరాలను 'లిపి' అని ఎందుకన్నారు అనే ప్రశ్నకూడా రాకపోదు. ఈ దేశంలో 'లిపి' అనేది సహజంగా బయలుదేరినది కాదనీ, ఆసియా పశ్చిమ ప్రాంత దేశములనుండి ఎరువు తెచ్చుకొనబడినదనీ తలంచిన కొందరు పాశ్చాత్య విమర్శకులు, ఈ లిపి శబ్దము పారశీక భాషలోని 'డిపి' శబ్దమునుండి యేర్పడినదని చెప్ప సాహసించి నారు. కాని పారశీకులీ దేశముపై దండెత్తుటకు చిరపూర్వమే, 'లిపి' శబ్దము, 'లిప్' ధాతువు, లేపనాది శబ్దములు సంస్కృత భాషా ప్రసిద్ధములే యయియుండుట చేత, నిది పారశీక 'డిపి' శబ్దభవమనుట అవిచారిత మనక తప్పదు. పాణిని వ్యాకరణ సూత్రములలో ''యవనాల్లిప్యామ్'' - అని 'యవనానీ' శబ్దము లిపి పరమని చెప్పినాడు. అంతకుపూర్వపు వైయాకరణులును దీనిని స్మరించినారు. 'లిపి' - శబ్దమునకు లేపనమర్థము. అనగా పూయడం అన్నమాట. మొదట చెట్ల పట్టల మీదనూ పలకల మీదనూ, ఆకులమీదనూ, బట్టలమీదనూ, ఏదో ఒక రంగు తోనో, మసితోనో - చిత్రములను లేదా అక్షరములు వ్రాసేవార న్నమాట. లేదా ఆకులమీద పట్టలమీద గంటములవంటి లేఖినులతో లిఖించి, అవి స్పష్టముగా కనబడుటకుగాను, ఏ బొగ్గునో, మసినో, పసరునో పూసేవారు. ఆ కారణం చేతనే ఆ వ్రాతకు 'లిపి' అనే పేరు వచ్చింది. అక్షరాలు ''వర్ణము'' లగుటకు కూడా ఇదే కారణం. ఏదో ఒక వర్ణముతో - అనగా రంగుమూలంగా గుర్తింపబడు చుండుటచేతనే. తెల్లని పలక మీద నలుపురంగుతో వ్రాయబడుట చేతగాని లేదా నల్లటి బోర్డువంటి దానిమీద తెల్లని సున్నపుముక్కతో వ్రాయబడుట చేతగాని గుర్తింపబడుతాయి. ఎర్రటి సిరాతో కూడా వ్రాస్తారు గదా! ఆంధ్ర శాతవాహన రాజుల కాలంలో పైశాచీ భాషలో బృహత్కథను రచించిన గుణాఢ్యుడు అరణ్యంలో దాన్ని వ్రాయవలసివచ్చినపుడు. ''శోణితేనాలిఖత్ క్షిప్రం'' అన్న కాణభూతి మాటను బట్టి - ఎర్రసిరాతో వ్రాసినట్లు తన రక్తంతోనే వ్రాసేసినాడట. ఈ విధంగా 'లిపి' 'వర్ణ మాల ఏర్పడి, క్షరములైన భాషాధ్వనులను ''అక్షరాలుగా'' చేయగలి గాయని తెలుస్తోంది. ఈ సామ్యాన్నే వైదిక ఋషి 'ఓమిత్యేకా క్షరం బ్రహ్మ'' అన్న వాక్యంలో ఉపయోగించుకొని, నిత్యమైన

బ్రహ్మస్వరూపము యొక్క అక్షరత్వాన్ని నిరూపించడానికి యత్నించాడు.

ఉత్తర దేశంలో భూర్జ పత్రాలు, దక్షిణ దేశంలో తాళపత్రాలు, ఈ వ్రాత కెక్కువగా ఉపయోగింపబడుతూ వచ్చాయి. పట్టమీద, బట్టలమీద, ఆకులమీద వ్రాసిన వ్రాతలు చిరకాలముండేవిగాక నశించుచుండుటచేత, వాటినింకా అక్షరములుగా చేయాలనే ఉద్దేశంతో రాతిబండలమీద, రాగిరేకుల మీదా, కుండపలకలమీదా చెక్కించేవారు. అవి కూడా కాలగర్భంలో పడి అంతరించినా, మరల ఏదోవిధమైన కాలపరివర్తనంలో, బయలు పడటానికవకాశం ఏర్పడుతోంది. కాబట్టే ఎప్పుడో ఇక్ష్వాకులనాడు రాళ్లమీద రప్పలమీద చెక్కబడిన శాసనాలను భూగర్భంలో నుండి యీకాలంలో త్రవ్వి బయటకు తీసి, వాటి మీద ఇంతకాలం నుండి అక్షరములై యుండిన అక్షరాలను గుర్తించి, ఆ కాలపు రాజుల యొక్క దేశముయొక్క స్థితి తులను చరిత్రను తిరుగదోడగలుగుతున్నాము. ఈ రా బండలు, అనేవి ఎక్కడివి అక్కడ ఉండవలసినదే స్థి ంగా. కాని ఇతరుల కివ్వవలసివచ్చినపుడు, పంపవలసివచ్చినపుడు, ఈ శాసనాలను రాగి రేకుల మీద, వెండి రేకులమీద, బంగారు రేకుల మీద కూడా చెక్కించేవారట పూర్వకాలంలో. రాగిరేకుల మీద దానశాసనాలు స్థిరంగా ఉండేటట్లుగా వెనుకటిరాజులు వ్రాయించిస్తూండేవారని అందరికీ తెలిసిందే. యాన్ - చీనా యాత్రికుడు వ్రాసిన దానిని బట్టి తెలుస్తోంది. ఇప్పటికీ గ్రామాదుల్లో కొందరి ఇళ్లల్లో కొన్ని బయలుపడుతూనే ఉన్నాయి. తిరుపతి వేంకటేశ్వరుల దేవాలయంలో తాళ్లపాక వారి సంకీర్తనలన్నీ వేలకొలది రాగిరేకుల మీద వ్రాయబడి యున్నవి. వెండిరేకుల మీద వ్రాయబడిన పాళీ గ్రంథమొకటి బ్రిటిష్ మ్యూజియములో నున్నదట 16 వ శతాబ్దిలో కృష్ణదేవరాయలు పోర్చుగీసు అధికారికి బంగారు రేకుమీద ఉత్తరం వ్రాయించి పంపినాడట. తంజావూరి విజయ రాఘవనాయకుడు డచ్చి వారికి నాగపట్టణమిచ్చినట్లు వెండి రేకులమీద దానశాసనం వ్రాయించి యిచ్చినాడట. వీటన్నింటి కంటెను గూడ పురాతనములై అక్షరములై నిలిచినవి కుండ పెంకుల మీది వ్రాతలుగా కనబడుతున్నాయి. అట్టివి ఇటీవలనే సింధునదీ తీర భాగములగు మొహెంజోదారో, హరప్ప యను ప్రదేశములందు త్రవ్వితీయగా బయలుపడినవి. 5000 సంవత్సరములనాటివిగా దలంపబడుచుండిన ప్రాచీన పట్టణ భాగముల శిథిలములలో దొరకిన ఆ కుండ పెంకులమీద ముద్రికలమీద చిత్రలిపులు, వ్రాతలు మొదలైనవి కలవు. కొన్నిటిమీద పెద్దగంగడోలు గల వృషభములు, ఏనుగులు మొదలగు జంతువుల యాకారములు, వానిపైభాగమున వ్రాయబడిన యేవో లిపులతో గూడియున్నవి. వీని తత్త్వమును పరిశోధించి, వీని యర్థమును గ్రహించుటకనేకులు ప్రయత్నాలు చేసినారు. ఇంకా చేస్తున్నారు.

అయితే, ఈ మొహెంజోదారో విషయములో ప్రస్తుతం మనం గమనింపదగినది ఒకటుంది. అదేమంటే, అక్షరలిపి పరిణామ విషయంలో చిత్రలిపి ప్రాముఖ్యానికి సంబంధించింది. అక్షర లిపి పరిణామ విషయంలో తజ్ఞులు చెప్పేదేమిటంటే, ఈ అక్షర లిపి మొదట చిత్ర లిపి నుండియే పుట్టినదని. మానవుడు మొదట తన భావమును తెలుపుటకు బొమ్మలను వ్రాసేవాడని. మనుష్యుడు అని తెలుపుటకు మనిషిబొమ్మ, లేడి, చెట్టు, సూర్యుడు - అనడానికి ఆయా బొమ్మలు. సూర్యునికి బదులుగా ఒకసున్న. చంద్రునికి చంద్రవంకలాగు అరసున్న. ఈ విధంగానే అతి ప్రాచీనమగు ఈజిప్టు దేశపు లిపి ఉన్నదట. దానిని చిత్రలిపి లేదా (Hieroglyphic) అని అంటారు. క్రమంగా ఈ చిత్రాల కర్థబేదాలేర్పడినాయి. మరికొంత కాలాని కాయావస్తువులను సూచించుగుర్తులు ఆ వస్తువులను దెలుపు శబ్దముల ప్రథమాక్షరాలను సూచించునవిగా మారిపోయినవి. ఈజిప్టు భాషలో 'రు' అనగా 'నోరు' అని అర్థమట - మొదట దానికి సూచించుటకుగా వ్రాసిన నోరు బొమ్మయే 'ర' కారానికి సూచకమైనదట. ఈ విధంగానే ఆయాదేశాల్లో అక్షరమాలలేర్పడియుండవచ్చును. మనదేశంలో మంత్రశాస్త్రవేత్తలు వర్ణమాల అంతా శక్తిరూపిణియగు జగన్మాత యొక్క అవయవరూపంగా భావించుట కద్దు. ''భజంతే వర్ణా స్తే తవజనని నామావయవతామ్'' అని సౌందర్య లహరిలో శంకరాచార్యులవారు స్తుతించారు.

మనదేశంలో ఈ అక్షరాలకు శక్తి, బీజం, దేవత మొదలైనవి చెప్పబడియుండడాన్ని బట్టి ఇవి అతి ప్రాచీనకాలంలోనే ఏవో తాంత్రిక చిత్రలిపులనుండి యేర్పడియుండునని తోస్తుంది. మొహెంజోదారో ప్రాంతములో దొరకిన మట్టి ముద్రికల మీది బొమ్మలు, వానిపైని లిఖించబడిన బాణాకారములు గలిగిన చిత్రలిపులను బట్టి చూస్తే ఇవేదో మంత్రశాస్త్రమునకు సంబంధించినవా అనే సందేహము వాటిని బయటకు దీసి ప్రకటించిన మార్షల్ దొరగారికే కలిగినది. ఇట్టి సందర్భంలో అశోకశాసనపు లిపి కంటె ప్రాచీన లిపి శాసనము లీ దేశమున కనబడుట లేదు గనుక, నీ లిపి ఆసియాపశ్చిమ భాగములతో వ్యాపారము చేసిన హిందూదేశపు వర్తకుల ద్వారాగాని లేదా ఆ ప్రాంతముల నుండి వచ్చిన ఫియనీషియన్ వర్తకుల ద్వారాగాని వచ్చిన సెమిటిక్ వర్ణమాల నుండి యేర్పడి, దేశ పండితులచే మార్పుల నొందింపబడి యాస్థితికి వచ్చినదేగాని, యీ దేశీయులకంతకుపూర్వము లిపి జ్ఞానమే

లేదను పాశ్చాత్య పండితుల వాదమెంత యసందర్భమైనదిగా కనబడుతోందో చూడండి. పాశ్చాత్య పండితులలో కూడ కన్నింగుహాం మొదలగువారు కొంద రీ యశోకలిపి యీ దేశమునే బుట్టి యుండునని తలంచినవారు లేకపోలేదు. హిందూదేశపు వాయవ్యదిగ్భాగము నందు వ్యాప్తిగాంచి ఉర్దూవలె కుడినుండి ఎడమవైపునకు వ్రాయబడే ఖరోష్ఠిలిపి ఆ సెమిటిక్ వర్ణమాల నుండి యేర్పడి యుండవచ్చునేమో గాని, తక్కిన హిందూదేశపు లిపులన్నిటివలె ఎడమవైపు నుండి కుడివైపుకు వ్రాయబడిన అశోక శాసనముల బ్రాహ్మి లిపి చిరకాలానుగతమైన దేశీయలిపియేయని చెప్పవలసినట్లగ పడుచున్నది. ఇంతేగాక మోహెంజోదారో ప్రాంతపు హైందవ నాగరకత బయలువడిన తరువాత, మసపటోమియా, సిరియా, హిట్టైటు ప్రాంతపు టేలికల నామములు కొన్ని ప్రాచీన హైందవ ప్రభువంశీయుల నామములతో సరిపోవుచుండుటచే నీ దేశపు ప్రభువులే కొందరచ్చట నేలికలై యుండవచ్చుననియు, నిచ్చటి ప్రాచీనలిపులే యచ్చట వ్యాపించి యుండవచ్చుననియు గూడ దలంచు ప్రాచ్య పాశ్చాత్య పురాతత్త్వ పరిశోధకులును గొందరు లేకపోలేదు. మొత్తము మీద భారతదేశీయములగు లిపులతో పాటు - ఈ లిపి శబ్దము కూడా దేశీయమేగాని ఇతర భాషా జన్యము కాదు.

ఈ అశోకుని శాసనములలోని బ్రాహ్మి లిపియే యించుక భేదములతో దాక్షిణాత్య లిపియై క్రీస్తు శకారంభమునాటి ఆంధ్ర రాజుల నాసిక్, కన్‌హేరి మొదలగు గుహలలోని శాసనముల మూలముగా, గుహా లిపియై, తరువాతి వేంగి చాళుక్య లిపికి మూలమై, క్రమముగా తెలుగు, కన్నడ లిపులుగా పరిణతి చెందినది. ఉత్తర దేశమున నా బ్రాహ్మి లిపి కాలక్రమమున మారుచు వచ్చి గుప్త రాజుల కాలమున నాగరీ లిపి స్వరూపమును వహించి నేటికి నుత్తర దేశమున తక్కిన లిపుల కంటె విశేష ప్రచారము గలదై యున్నది.

ఇక దక్షిణ దేశమున, భాషల విషయమున వలెనే లిపి విషయమును కొంత భేద మేర్పడినది. దక్షిణ దేశ భాషలకు సంస్కృత ప్రాకృత భాషా సంపర్కము, ప్రాబల్యము ఎంత గలిగినను, దేశీయములగు ననార్యలక్షణములు కొన్ని భాషా విషయముననే గాక లిపి విషయమునను కనబడుచునే యున్నవి. వీనిని కాదని యొప్పరికించుటగాని, అవియు నేదో విధముగా సంస్కృత ప్రాకృత జన్యములేయని సాధింప జూచుట గాని, అంత యుక్తి సహముగా కనబడదు. తెలుగు కన్నడములలోను, ఒక విధముగ మళయాళమునను, తత్సమ భాషలో సంస్కృత వర్ణమాల నంతను గ్రహింప వలసివచ్చినా, అఱవమునకు వలె అచ్చతెలుగు అచ్చ కన్నడములకు వర్ణమాల వేరుగా చెప్పుకొనవలసి వస్తున్నది. అరవమునందలి వర్ణమాలకు దగినట్టుగానే 'వట్టెళత్తు' అను వేరు లిపి యొకటి యా భాష కాదేశమున వ్యాప్తిలో నున్నది. ఇది దేశము నందలి తక్కిన లిపులతో సంబంధించినది కాదని, సిరియా దేశపు వర్తకులు దక్షిణ దేశమున క్రీ.పూ. 8 వ శతాబ్ది ప్రాంతమున బ్రవేశపె న లిపి నుండి పరిణతి బొందినదని బర్నెల్ పండితు డభి' యపడినాడు. ఏమైనా ఈ భాషా లక్షణాలకు తగినట్టుగా ఈ లిపిలో కొన్ని విశేష లక్షణాలు లేకపోలేదు. ఇందు సరళాక్షరాలకు గాని, ఒత్తక్షరాలకు గాని గుర్తులు లేవు. ఋ, ౠ, ఌ ౡ లకు శ, ష, స లకు కూడా లేవు. కాని శకట రేఫ, ళ కారము, పదాంత నకారము - అనే వాటికి ప్రత్యేక లిపులున్నాయి. ఇంకో విశేషమేమంటే - ఇవి కూడా చాలా ప్రాచీనంగానే కనబడతాయి. క్రీ.శ. 4, 5 శతాబ్దాల నాటివే 'వట్టెళుత్తు' లిపిలో వ్రాయబడిన శాసనాలు ఉన్నట్లు చెపుతారు. ''తిరునాథక్కున్రు'' శాసన మతిప్రాచీనమని కొందరిమతము. అది అలా ఉండగా, తెలుగుదేశంలో బయలుదేరిన క్రీ.శ. 5, 6 శతాబ్దాల నాటి తెలుగువంశపు రాజుల సంస్కృత శాసనములలో తెలుగుదేశపు గ్రామనామాలు పేర్కొనవలసివచ్చినపుడు, ఆ దేశీయపు తెలుగు శబ్దాల్లో నీ శకటరేఫ, ళకారాలు వస్తే, ఆ బ్రాహ్మిలిపిలో నీయక్షరాలు లేకపోవడంచేత, ఈ దేశీయాక్షరాల నూతన లిపులనే ఆయాచోట్ల వ్రాసేవారు. క్రీ.శ నాలుగోశతాబ్దం అత్తివర్మ గోరంట్ల శాసనంలో ''తానికొని'' గ్రామే అన్నప్పుడు ని కింద న కింద ళకారం రాశి ఉంది. మన ఇప్పటి శకటరేఫలో నడుమ అడ్డుగీత తీసేస్తే - అప్పటి 'ళ'కారమవుతుంది. ఇది ఇప్పటి అరవలిపి కంటె భిన్నమే. కాబట్టి ఆకాలంలో తెలుగువారు కల్పించుకొన్న లిపిగా కనబడుతుంది. ఆ కాలపుదే పల్లవరాజు సింహవర్మ ఒంగోదు శాసనంలో 'కర్మఱాష్ట్రే' - నఱా చెదుగ్రామో, పెఱుకపట్టు గ్రామః'' - అనువానిలో రాష్ట్రే అన్నపుడు కూడా శకట రేఫ వ్రాశాడు. నఱాచెదు, పఱ్ఱు, అన్నప్పుడు శకట రేఫలే వ్రాసి ఉన్నవి. విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల శాసనంలో ''విజయ ళెందుళూరవాసకాత్'' - అని 'ళ' కారము వ్రాసినారు. ఇదే మన ఏలూరు దగ్గిర ''దెందులూరు, డెందులూరు-అయినదిప్పుడు''. ఇల్లాగే - ''విప్పఱ్ఱు, చెంచెఱువే, కంబురాంచెఱువే'' అనువాటిలో శకటరేఫలున్న వనేకముగా కనబడతాయి.

ఆ కాలపు తెలుగులిపిలో దేశీయ సంప్రదాయ మొక్కటి చూపిస్తాను. అప్పటి సంస్కృత భాషా సంప్రదాయాని అనుస్వారపు గుర్తు ఆ అక్షరం నెత్తి మీద ఒక బొ

పెట్టడం. కాని అప్పటి సంస్కృత శాసనాల్లో వచ్చిన తెలుగుపదాల్లో తరువాత వచ్చే అక్షరం నెత్తిమీద పెట్టబడుతూ ఉండేది పనుపుంబల్లు అన్నప్పుడు పువర్ణము మీద పెట్టడానికిబదులు, బనెత్తి మీద పెట్టేవారు. కాబట్టే-వీటిని కొందరు. పసుపుబంరు, దిగుబంరు, అని చదువుట కూడా తటస్థించింది. ద్రావిడ సంప్రదాయంలో అనుసార్వం లేక అనునాసిక సంయుక్తాక్షరమే వ్రాయబడుట ఆచారం గనుక - ఆ అనునాసిక స్థానంలో వీరు బొట్టు పెట్టుటచేత, అది పరాక్షరం నెత్తిమీదకు జేరుట తటస్థించిందన్నమాట. ఈ విధంగా భాషా విషయములో వలెనే లిపి పరిణామస్థితిలో కూడా భిన్నములగు ఉత్తర దక్షిణ దేశీయ సంప్రదాయ సమ్మేళనము, సాంకర్యము ఈ దక్షిణ దేశంలో కనబడుతుంది భిన్న భిన్న భాషలులాగే, భిన్నభిన్నలిపులు, వానిలో స్వతంత్రములైన సాహిత్యాలు ఏర్పడివున్నాయి, దేశంలో. ఇవన్నీ భారత జాతీయతా పోషితాలు, పోషకాలు కూడాను అనిచెప్ప వచ్చు. కాని ఏకత్వాన్ని సాధించడానికి హిందీతో పాటు నాగరలిపిని తెచ్చికోవడమా, లేదా ఇంగ్లీషును తొలగిద్దామనుకుంటూ రోమను లిపి నవలంబించడమా - అనేది ఒక సమస్య.

''శైశవేభ్యస్త విద్యానాం - యౌవనే విషయైషిణామ్।
వార్ధకే ముని వృత్తీనాం - యోగేనాంతే తనుత్యజామ్॥

– కాళిదాస కవి 'రఘువంశం' నుంచి

It is only through a process of discipline that the mind can be cleansed of all impurities and trained to be steady and to develop the capacity of single-pointed concentration. That every person through proper education and discipline attain the state of 'Yoga' before the soul departs from the body is indicated by kalidasa in his Raghuvamsa. We must be able to die with a smile on our lips. For if we die without weeping we will not have to weep after we die, i.e. we will have no re-birth thereafter.

– (శ్రీ 'కోరాడ' వారి డైరీనుంచి)

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు :

# ఇతిహాస పరిశీలనము - ఘటన చిత్రణ

"ఇతిహాసము" - అనగా పూర్వకథ. ఇతిహాసః పురావృత్తం అని అమరసింహుడు చెప్పినాడు. ఇతి-హ-ఆస. ఈ రీతిగా జరిగినదని మా తాతలు చెప్పుకుంటూ ఉండే వాళ్లు - అని పారంపర్యంగా వచ్చిన కథలను గాథలను ఇతిహాసమని అంటారు. అనగా ఒక జాతి వారు వారి పూర్వులు చూపిన సాహసౌదార్య పరాక్రమాదులను గూర్చి గాని, సల్పిన వీరకృత్యములను గూర్చి గాని, సాధించిన జీవిత పరమార్థము లను గూర్చి గాని, పాడుకొన్న పాటలు, చేసిన రచనలు, కావించిన కవితలు మొదలగునవన్నీ - ఆ జాతికి సంబంధించిన యితిహాసమేయని చెప్పవలసి యుంటుంది. ఒక్కొక్క జాతికి సంబంధించిన జీవిత సాధన యంతయు ఆ జాతి యొక్క ఇతిహాసమే యనవచ్చును. దాని యందే ఆ జాతి నాగరకత, సంస్కృతి, సాధన అంతయు నిమిడి యుంటుందంటే ఆశ్చర్యము లేదు. ప్రపంచంలో ప్రాచీనమైన ఇతిహాసము, చరిత్ర గలిగిన జాతులలో హైందవ జాతి యొకటి ప్రధానమైనది కూడాను ఆధ్యాత్మికముగా గాని, ఆదిభౌతికముగా గాని యీ జాతి వారు సాధించిన జీవిత సాధనలను (Life achievements) మరియే ప్రపంచ జాతి కూడా సాధించి యుండలేదు. ఇదియే మన యితిహాసమునకు గల విశిష్టత.

"ఊర్ధ్వమూల మధశ్శాఖం, అశ్వత్థ ప్రాహు రవ్యయమ్" అని గీతాచార్యుడు చెప్పినట్లుగా, ఆద్యంతము లెరుగని జగద్రూపమగు నీ సంసార మహా వృక్షమునకు - మామూలుగా మన మీ భూమిపై చూచే వృక్షములకు వలె గాక - దీనికి వేళ్లు మూలము గమునను, కొమ్మలు క్రింది భాగమునను ప్రసరించియు వట. అనగా భూమి మీదనే పుట్టి పైకి పెరిగి నశించే క్షముల వంటిది ఇది కాదన్నమాట. దీని మూల మెక్కడ సూక్ష్మాతి సూక్ష్మమై మనకు గోచరింపని యాధ్యాత్మికమగు నూర్ధ్వ లోకమున నెలకొని యున్నదని, శాఖలు మాత్రమే క్రిందకు పెరుగు చుండుటచే మనకు గోచరించుచున్నవని - దీని భావము. కాని దీని యగ్రములు గాని అంతముగాని మనకు గోచరింపదు. ఇట్లీ సృష్టి - సంసారము అనునది ఆధ్యాత్మిక ములగు సూక్ష్మతత్త్వముల నుండి యేర్పడినదని, ఆంతరంగి కమగు తపశ్శక్తి చేతనే గ్రహించి, మానవుని జీవిత పద్ధతి ఆతడు జీవితమున సాధింపవలసిన పరమార్థమును గూర్చిన విశేషములను లోకమునకు వెల్లడించిన మహాపురుషులలో భారతీయ మహర్షుల కంటె మిన్నలని చెప్పదగిన వారు వేరొకరు లేరు. ప్రపంచమునందలి ప్రాచీనేతిహాసములలో భారతీయేతిహాసము వంటిది కూడా మరొకటి లేదు. మిగిలిన ప్రాచీనాధునాతన జాతులకు నాధ్యాత్మిక దృష్టి యంత తీవ్రముగా నలవడకపోవుటచే గాబోలును, వీరీ భౌతిక సృష్టి నంతను భౌతిక దృష్టితోనే పరిశీలించి, ప్రయోగ పద్ధతిని కూడా పరిశోధించి భౌతిక శాస్త్రముల నత్యద్భుతముగా పెంపొందించి ప్రకృతితత్త్వ జ్ఞానమును సాధింప యత్నించు చున్నప్పటికీ వీరు మాత్రము ప్రకృతి కతీతులై దానిని స్వాధీనము చేసికొనగలిగిన వారగుచున్నట్లు లేదు. ఇదియే ప్రాచీన హైందవ విజ్ఞానమునకును ఆధునిక ప్రపంచమున ప్రకృతి శాస్త్రాభివృద్ధి వలన గలుగుచున్న పరిణామములకును గల భేదము. భారతీయేతిహాస పరిశీలనము మూలముగా మనము గ్రహింపవలసిన ప్రధాన విషయము కూడా ఇదియే యనుటకు సందేహము లేదు.

భారతీయేతిహాసమునకు మూలభూతములు, భారతీయ విజ్ఞానమునకు సారభూతములు, భారతీయ సాహిత్యములకు జీవ భూతములు, భారతీయ జీవితమున కంతకు గూడ పిండీభూతములు - లేదా ఆదర్శ భూతములు అని చెప్పదగినవి మన భారత భాగవత రామాయణములే. వీనిని భారతీయేతిహాస శబ్దముచే బేర్కొనినంతమాత్రమున భార తీయ చరిత్రలో వీనికి గల ప్రాముఖ్యమునంతను చెప్పిన వారము కూడా కాలేము. ఏమనగా, వాస్తవముగా భారతీ యేతిహాసము, అనాదులని విశ్వసించబడుచున్న వేదములతో ప్రారంభమైనది. భారతీయేతిహాసము అనగా భారతీయ విజ్ఞాన పరిణామ చరిత్ర, వేదములతోనే ప్రారంభమైనను వేదాగ్రశాఖ లనబడు నుపనిషత్తుల విజృంభణముతో కొనలు సాగి మిన్నుముట్టి, స్మృతి పురాణేతిహాసముల మూలముగా విస్తృతిగాంచి దేశము నాలుగు మూలలను అలముకొని, వట వృక్షము వలె నెక్కడికక్కడ నాటుకొని పోయి, దేశీయులనే గాక విదేశీయులను గూడ చల్లని తన విజ్ఞానచ్ఛాయచే

నలరింపజొచ్చినది. ఇట్లు నాలుగు వేదముల సారమును గ్రహించిన దగుట చేతనే భారతము పంచమ వేదంబన బరగినది. దీనిని దెనిగించిన కవిత్రయము వార్తును, దీనిని కేవల సంహితా దృష్టితోడనే దెనిగించి, ఆంధ్ర జనుల వైదిక మార్గ తత్పరత్వమును చాటుచు, ఆంధ్రావళికి మోదమూం గూర్చుటయే గాక, యది సర్వశాస్త్ర సముచ్చయమని కూడ వెల్లడించినారు:

''ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని,
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని,
కవి వృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు
బరమ పౌరాణికుల్ బహు పురాణ సముచ్ఛ
యంబని మహిగొనియాడుచుండ
వివిధ వేదతత్త్వ వేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతంబు.''

అని యీ భారత మనునది విశ్వజనీనమే యని వ్యక్తము చేసినాడు నన్నయభట్టారకుడు. వీనిని తొలుత రచించిన వారును సామాన్యులు కారు. ఆదిమునియగు పరాశరాత్మజుండు - వేద వ్యాసుడు వివిధ వేదతత్త్వ వేది. రామాయణ కర్తయగు వాల్మీకి మొదలగు వారు అపార తపోనిష్ఠాగరిష్ఠులు, ఆధ్యాత్మిక విద్యా సంపన్నులు ఆగతానాగతవేత్తలునగు ఋషిపుంగవులు. వీరిని బట్టియే కావలయు, తరువాత 'నానృషిః కురుతే కావ్యం' అను నానుడి కూడ సాహిత్య లోకమున వెలసినది. వేదవ్యాసులు పురాణేతిహాస కర్త కాగా ఋషి పుంగవుడగు వాల్మీకి ఆదికావ్య కర్తయైనాడు.

ఈ ఆదికవి గావించిన కావ్యసంఘటనా రీతిని మనము బాగుగా గమనించినట్లయితే, వ్యాసాదుల రచన కంటె వాల్మీకి రచన మిగుల పూర్వమేయై యుండునని వ్యక్తము కాక మానదు. ఏమనగా, అంతకు పూర్వము గాయత్రి, జగతి, ఉష్ణిక్ మొదలగు వైదిక ఛందస్సులేగాని, లౌకికచ్ఛందమను నది లోకములో నేర్పడి యుండనే లేదు. అనుష్టుప్పు రూపమగు లౌకికచ్ఛందమును మొదట కల్పించినవాడు వాల్మీకి మహర్షి. ఈ నూతన చ్ఛందావతరణ రీతిని సూచించుటకై కల్పింపబడిన సంఘటనము కూడ నత్యద్భుతము నతి రమణీయమునైయున్నది. రామాయణ రచన మందు వాల్మీకి మహర్షి తొలుదొల్త చూపిన ఘటనావైచిత్రి యీ నూతనచ్ఛందోవతరణ ఘట్టమునందే మనకు ప్రత్యక్షమ గుచున్నదనుటకు సందేహము లేదు. వేద వే డగు పరమపురుషుడు దశరథాత్మజుడై పుట్టగా, వేదము ' చేత సుని మూలముగా రామాయణమై వెలసినదట. దము వైదికచ్ఛందోబద్ధము. ఆదికావ్యమగు రామాయణము రచనక నువైన లౌకికచ్ఛందోవతరణమునకుగా క్రౌంచ మిథున కథా సంఘటనము విచిత్రావకాశమును కల్పించినది. వాల్మీకి అవతార పురుషుడుగా గ్రహింప బడుచుండిన రామునికి సమకాలికుడు. నారదునివలన సంక్షేపముగ వాక్య రూపమున రామాయణ కథను విని, ఆగతానాగత విషయముల నామూలాగ్రముగ దెలిసికొను శక్తి బ్రహ్మ వలన బడసి, కావ్య నిర్మాణమునకై యనుసంధించుచున్న వాల్మీకి యొకనాడు తమసాతీరమున వ్యాధవిద్ధ క్రౌంచ మిథునమును జూచి శోకతప్తు డైనాడట. అప్పు డాతని నోటను ''మా నిషాద ప్రతిష్ఠాం త్వ'' మిత్యాది అనుష్టుప్ శ్లోకము అవశముగా వెలువడినదట. అంత బ్రహ్మ ప్రత్యక్షమై 'నాశక్తి వలననే నిదియంతయు జరిగినది. పద్య రూపముననే రామాయణమును రచింపు'మని చెప్పగా, చతుర్వింశతి గాయత్ర్యాఖ్య పరబ్రహ్మ విద్యా విలాస భూతమగు రామాయణమును చతుర్వింశతి సహస్ర శ్లోకములుగా రచించుట, ఆ సమయమున దనయాశ్రమమున పుట్టి పెరుగుచుండిన శ్రీరాముని పుత్రులేయగు కుశలవులను కుశీలవులచే నభ్యసింపజేసి, యా రామ చరితమును శ్రీరాముని యెదుటనే గానము సల్పునట్లు చేయుట, తన్మూలముగా రాముడు తన పూర్వ వృత్తాంతమునే గాక, నిండు చూలాలగు సీత నడవికి బంపిన పిదప జరిగిన కుశలవ జన్మ ప్రకారాదికము దెలిసికొనగల్గుట, ఈ రీతిగా సీతారాముల పాతివ్రత్య మాహాత్మ్యదులు ప్రపంచమున వ్యక్తమగుట దటస్థించినది. ఇట్లీ రామాయణ కథా సంఘటనా వైచిత్రి యంతయు నాటకీయ వైఖరి గలదై, వాల్మీకి మహర్షి యొక్క అసమాన శేముషీ వైభవమును వ్యక్త పఱచుచున్న దనుటకు సందేహము లేదు గదా!

హైందవ జీవితమున కన్నివిధములా ఆదర్శ స్త్రీ పురుషులనదగిన సీతారాముల పావన చరిత్రమును వర్ణించు రామాయణము తరువాత పరిగణింపదగినది పంచమ వేదమన బరగుచున్న మహాభారతమే. ఇది పంచమ వేదమే యనబడుచున్నను దీని రచనయందు వేదవ్యాసు లవలంబించినది వాల్మీకి ప్రోక్తమై లౌకికచ్ఛందమన బరగిన అనుష్టుప్ శ్లోక రచనమే గాని, వైదికచ్ఛందము మాత్రము కాదు. కావున రామాయణ రచన కంటె భారత రచన మర్వాచీనము. కాల భేదము యుగ భేదమును బట్టి చూచినను ఒకటి త్రేతాయుగమునకు, రెండవది ద్వాపరయుగమునకు జెందె

నది. ఒకటి సత్యపరాక్రముడగు శ్రీరాముని గాథ, రెండవది లీలా మానుష విగ్రహుడగు శ్రీకృష్ణుని గాథ. ద్వాపరాంత మున కలియుగ ప్రారంభమున హైందవ జీవిత ప్రవాహ మెట్లు కలుషీభూతమై ప్రవహింప జొచ్చినదో, వైదిక ధర్మమెట్లు పునరుద్ధరింపబడి, యా కాలుష్యము నడంచి యా జీవిత ప్రవాహమును నిర్మలం బొనర్పగడంగినదో, యీ మహాభారత కథ మనకు వ్యక్తము చేయగలదు. పరమార్థమునకు సాధనముగ గ్రహింపదగిన వైదిక కర్మానుష్ఠానమునే పరమ ప్రాప్యముగా నెంచి కర్మబద్ధమై సంసార సాగరమును తరింపలేక కొట్టుకొనుచున్న హైందవ లోకము నకు 'కర్మ ణ్యకర్మ యః పశ్యేత్'' అని నిష్కామకర్మ మార్గమును జూపి దాని నాకాలము నాచరింప జేయ సమకట్టినవాడు జగన్నాటక సూత్రధారుడగు శ్రీకృష్ణుడే. ఈతడే కురుపాండవ యుద్ధ రూపమగు భారత కథా నాటకమును నడిపించిన సూత్రధారుడు కూడాను భారత కథ అంతా ఒక నాటకమనియే యితడు సూచించినాడు. ఏమనగా, అహంకార మమకారాభి భూతుడైన అర్జునుడు యుద్ధ రంగమున శత్రువును జయించి కురు రాజ్యము ననుభవింపవలెనను తలంపుతో వచ్చి నిలబడి, ఎదుట తనతోడి యుద్ధమునకై నిలబడియున్న బంధువుల నందర జూచినంతనే వారియందు తనకు గలిగిన మమకారముచేత వారినెట్లు చంపుట యనుభావమున విషాద గ్రస్తుడై యుద్ధ విముఖుడగుటను జూచి, మానవేంద్రియములనే హయము లను నడుపుచు ముందు కూర్చున్న యాజగన్నాటక సూత్రధారుడు, ఈ భారత కథ యుద్ధము మొదలైనదంతా ఈ జగన్నాటకముతో పాటు దానిలోని ఒక అంతర్నాటకమే కాని వేరు కాదనియు, దానిని తొలినుండి తుదివరకు నడిపించుచున్న వాడు తానేననియు, తన ధర్మమ్ము తాను నిర్వర్తించవలసినదే గాని, తాను ధనుస్సు పారవేసి అచ్చట చేరి చేతులు ముడుచుకొని కూర్చున్నా, కావలసిన కలాపమంతయు కాక మానదనియు, దానికి వారందరు కూడ నిమిత్తమాత్రులే కాని ఇదివరకే అదియంతయు తనచే నిర్దిష్టమైయే యుండెననియు జెప్పి తాను విశ్వరూపుడే యగుటచే, తత్సందర్భాను కూలముగ నాతనికి దివ్య దృష్టి నిచ్చి తన విశ్వరూపమును జూపి భావి విషయములను గుర్తెరుంగ జేసి, అహంకారము నడంచి, భక్తిభావమును పురిగొల్పి తుదకు నష్టమోహుడు - లబ్ధజ్ఞానుడునగు అర్జునునిచే స్వధర్మమును నిర్వర్తింపజేసినాడు. భారత కథలోని విచిత్ర సంఘటనలలో పరాంకోటి నధిష్ఠించిన సంఘటన మిదియేయని చెప్పవచ్చు. ఇం దీ సూత్రధారుడు కల్పించిన విచిత్ర సంఘటనలకు లెక్కయే లేదు. వానిని తడవుట కవకాశమును లేదు. కాని అహంకార మమకార (రాగద్వేషాది) చోదితమైన యీ లౌకిక ప్రపంచమున ధర్మాధర్మములకు, న్యాయాన్యాయములకు అమాయకత్వమునకు అసూయా పిశాచమునకు నిత్యము జరుగుచుండు పోరాటము లోని అసంఖ్యాకములగు సంఘటనలలో కొన్ని మాత్రమే యిందు పొందుపరుపబడినవి. అసూయాగ్రస్తులగు దుర్యోధనాదు లమాయకులు సత్యకాములునగు పాండవుల నెట్టి బాధలను బెట్టినను వెనుకనుండి యీ నాటకము నాడించు సూత్రధారుడు - వస్త్రాపహరణ, సైంధవ వధ, రాయబారాద్యనేక సందర్భములందు విచిత్ర సంఘటనలను కల్పించి, ఈ జీవితపు పోరాటమున తానే పై నుండి ఇంద్రియ హయము లను గూర్చిన రథమును నడపుచు, వారి వారి చిత్త సంస్కారమునకు దగినట్లు ఫలముల నందజేసి తుదకు సత్యమునకు విజయము చేకూర్చినాడు. ఈ చిత్త సంస్కార మనునది మానవులకు పూర్వాపూర్వ జన్మఫలితము కొంతవరకు సాధనాలబ్ధముగూడ నైనను, సృష్టి పరిణామములో భూమిపై గలిగిన ప్రజాభివృద్ధి దేవ దైత్యాంశములతో నవతరించిన జనులలో జరుగు యుద్ధముల మూలముగా బరిహరింపబడు చుండునని యీ భారత కథా పురుషులయవతరణ కథ మనకు దెలుపుచున్నది. కృష్ణుడు కూడ శిశుపాలాదులను సంహరించి భారత యుద్ధమును నడిపించి భూభారమును దీర్చుట కట్లవతరించిన వాడే. జగత్పరిణామములో నీ వృద్ధి క్షయము లిట్లు జరుగు చుండవలసినవే.

సాంఘిక దృష్టితో జగత్పరిణామమునకు మానవుడు ఆత్మోద్ధరణకు పరమపురుషార్థమును బడయు మార్గము నన్వేషించుచునే యుండును భారత కథా కాలమున కింకను కలి ప్రవేశించలేదు. కర్మాచరణమున మోహావిష్ట చిత్తుడగు నర్జునునికి జ్ఞానోపదేశముచే ఆ మోహమును బోగొట్టి, స్మృతిని వివేకమును గల్గించినాడు కృష్ణుడు. ఈ వివేకము కల్గించుటకు సాధనముగా విశ్వరూప దర్శనముచే భక్తి భావమును పురికొల్పి 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ'' అని శరణాగతతత్త్వము నుద్బోధించినన్నూ, ఇదియు కార్యా కార్య వివేచన జ్ఞానమునకే సాధనముగా నెంచబడినదిగాని, కేవల ప్రపత్తి మార్గోపదేశముగా నుద్దేశింపబడిన ట్లగుపడదు. ఈ ప్రపత్తి మార్గము కలి ప్రవేశించిన పిదప ప్రాధాన్యమును జెందిన ట్లగపడుచున్నది. జ్ఞానమార్గమున బుద్ధికి దృఢత్వము కల్గుట కష్టసాధ్యమని తలపబడుటచేతను, తపస్సాధనలచే జ్ఞాన సంపాదన మీకాలపు మానవునకు దుర్లభ మగుచుండుట చేతను, సర్వము నీవే యను దృఢచిత్తతతో (అహంకార మమకారములను విడిచి) శరణాగతిని జేయుటయే కర్తవ్యముగా సూచించు భక్తి మార్గమునకీ కాలమున ప్రాధాన్యము కలిగినది. ఈ భక్తి మార్గమును

ప్రతిపాదించు ప్రధాన గ్రంథము భాగవతము. భారతమున శ్రీకృష్ణుడు కర్తవ్య జ్ఞానోపదేశకుడు. భాగవతమున కృష్ణుడు లీలామానుష విగ్రహుడు, దీన జనావనుడు ఆర్తత్రాణపరాయణుడు

ఈ భాగవతమున అవతారముల ప్రాధాన్యము భగవల్లీలా విలాసముల వర్ణనము. కర్తవ్యా కర్తవ్యములను గూర్చిన వివేకమెట్లున్నను, నామస్మరణము, ఏకాంత భక్తి భగవత్కృపకు జీవుని పాత్రునిగా జేయునను దృఢ విశ్వాసము మొదలగునవి ముఖ్యముగా ప్రతిపాదింపబడినవి. వీనిని సమర్థించుటకే వామనావతార నృసింహావతార ఘట్టములందలి విచిత్ర సంఘటనలు, కృష్ణావతారమందలి బాల్యక్రీడ, రాసక్రీడాదులు, గజేంద్రమోక్షమాది కథలు - వర్ణింపబడినవి. కలియుగమునందు మానవులకు సులభమగు మోక్షోపాయమును సూచించుటయే యీ భాగవతము యొక్క ముఖ్యోద్దేశము.

అల్పబుద్ధులు, అల్పాయువులు నగువారికొరకు మేలగునని భారతమురచించియు, నాత్మ తృప్తినొందక వ్యాసుడు భాగవత విధంబు బలుకనైతి నని విచారించుచు గూరుచుండ, నారదుడువచ్చి, 'నిర్గతకర్మంబై నిరుపాధికంబగు జ్ఞానంబు హరిభక్తి లేకున్న శోభితము గాదు. భక్తిహీనంబులైన జ్ఞానవాచాకర్మకౌశలంబులు నిరర్థకంబులగునని చెప్పి, వాసుదేవుని లీలలను వర్ణింపుమని చెప్పిపోయెనట.' అంత బాదరాయణుడు భక్తియుక్తంబయిన చిత్తంబున యీశ్వరుంగాంచి, జీవుని మాయాసంసారము నారాయణ భక్తియోగంబునంగాని యుపశమింపదని నిశ్చయించి మాధవునిపై భక్తివిశేషంబు జనించునట్టి భువనక్షేమంకరంబైన భాగవతామ్నాయమును' గల్పించెనట. దీనినిబట్టి కలియుగావిర్భావమున మందబుద్ధులై జనులు, కర్మజ్ఞాన మార్గము నవలంబింపలేనివారగుటచే - నామస్మరణము హరిభజన రూపమునగు భక్తిమార్గము బాదరాయణునితో కల్పింపబడినదని తెలియుచున్నది. నారదు డీ భక్తి మార్గోపదేశకుడని సుప్రసిద్ధమే. ఈ తిని కాలక్రమమున యుగభేదమునుబట్టి హైందవజీవితమునందలి పరిణామమున కనుకూలముగా వెలసిన రామాయణ, భారత, భాగవతములు, అనాదియగు భారతీయేతిహాస చరిత్రమును విజ్ఞాన మహత్వమును వేనోళ్ల చాటుచున్నవనక తప్పదు

''ఏకో దేవః సర్వభూతేషు గూఢః
సర్వ వ్యాపీ సర్వ భూతాంతరా త్మా।
కర్మాధ్యక్షః సర్వ భూతాధివాసః
సాక్షీ చేతః కేవలో నిర్గుణస్తు॥

— శ్వేతాశ్వ తరోపనిషత్

**A formula very often meditated upon by vedantic students, through which you can feel the nearness of God.**

– (శ్రీ 'కోరాడ' వారి డైరీనుంచి)

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు :

# భాగవతకృష్ణుడు - భారతకృష్ణుడు: పాత్రపరిశీలన

(శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారితో రేడియోలో జరిపిన చర్చా ప్రసంగం)

శర్మ: అయ్యా! నమస్కారమండి. రామకృష్ణయ్యగారూ.

రామ: నమస్కారము శర్మగారూ. ఈదినం శ్రీకృష్ణ జయంతి గదా. అవతారపురుషుడైన ఆతనిని హిందువులందరూ పూజించే పుణ్యదినం. మనకు విశేషంగా ఆ పురుషోత్తముని లీలా విలాసములను ఈవిధంగా స్మరించుకొనే అవకాశం నేడు లభించింది.

శర్మ: అవునండీ, ఇందులో ఒక వింత సందర్భంకూడా చేరింది. మన యిద్దరి పేర్లలోను కృష్ణ శబ్దం స్థిరంగా అతుకుకొన్నదిగదా.

రామ: నిజం సుమండీ. ఈ మహావిషయాన్ని చర్చించేందుకు మన కిద్దరికీ ఉండే ఆమాత్రపు అధికారాన్నైనా కాదనేవారుండరులెండి.

శర్మ: సరే. అయితే ఇప్పుడు మనం అందులో ఏ విషయాలను తవ్వుకొందా మంటారు? కాలం చాలా స్వల్పంగదా.

రామ: అయ్యా-శ్రీకృష్ణుని జీవితాన్ని పట్టి చూస్తే భారతానికంటే మొదట భాగవతాన్నే వ్యాసుడు రచించి వుండడం న్యాయ మనిపిస్తుందండీ. శ్రీకృష్ణుని జననం మొదలు బాల్యకౌమార క్రీడ లన్నీ భాగవతంలోనే వర్ణింపబడి వున్నవి. భారతంలో, కృష్ణుని జీవితంలోని ఉత్తరభాగానికి చేరిన విషయా లున్నవి. ఐనా భారతం తర్వాతనే భాగవతాన్ని వ్యాసుడు రచించినట్లుగానే భాగవతపీఠికలో కనబడుతుంది. ఈరెంటికీ వ్యాసుడేకర్త అయినప్పుడు ఈ పౌర్వాపర్యం ఎందుకు వచ్చిందంటారు?

శర్మ: గొప్ప చిక్కు ప్రశ్న వేసినారు. దీనిని మరింత చిక్కుగా మాత్రమే నేను చేయగలను. ఏమంటారా? భారతం కడపటి భాగం కదండీ హరివంశం? దానిలో శ్రీకృష్ణ జన్మమొదలుగా భాగవతం కథ లన్నీ ఇంచుమించుగా ఉన్నవి. మరి ఈ భారతభాగవతాలకు మొదలే వ్యాసుని తండ్రి పరాశరమహర్షి విష్ణుపురాణం రచించినాడుగదా! అందలి విషయాలన్నీ భాగవత కృష్ణలీలలే మరి!

రామ: ఓహో కనుకనే గాబోలునండీ - కొందరు భాగవతం వ్యాసుడు రచించింది కాదనీ, ఎవడో బోపదేవుడుచేసి ప్రఖ్యాతికై వ్యాసుని పేరుపెట్టినాడనీ అనుకుంటూ ఉంటారు.

శర్మ: కాని బోపదేవుడు రచించినాడనేది అర్థంలేని మాట. వాని కాలం 13వ శతకం. అంతకంటేముందే భాగవతం ప్రమాణగ్రంథంగా మధ్వాచార్యులు మొదలైనవారు గ్రహించినారు. అయితే భారతకర్త వ్యాసుడే దీన్ని రచించినవాడు కాడేమో అని ఊహించడానికి శైలిలో గల గొప్పతారతమ్యం అవకాశమిస్తుంది. అదట్లుండగా దాని ఉపోద్ఘాతంలో భాగవత రచనకు కొంతకారణం చూపబడింది.

రామ: నిజమే. "భారతమిషమున బలికితి వేదార్థభావమెల్ల మునుకొని స్త్రీ శూద్రముఖర ధర్మములందు, దెలిపితినే జెల్ల! దీనిజేసి యాత్మ సంతసమంద దాత్మలో నీశుండు సంతసింపక యున్నజాడదోచె, హరికి యోగివరుల కభిలషితంబైన భాగవత విధంబు బలుకనైతి, మోసమయ్యె" అని వ్యాసుడు తృప్తిలేక శోకిస్తూవుంటే నారదమహర్షి వచ్చి, ఓదార్చి భాగవతం వ్రాయమని ప్రోత్సహించినాడట. కాని హరివంశంలోనే, ఇదివరకే, కృష్ణుడు శ్రీమహావిష్ణువు అవతారమనేమాట, ఆజన్మంగా అతడు చేసి చూపిన అమానుష చర్యలు అన్నీ, వివరించి వున్న వ్యాసునికి, ఈ అతృప్తీ శోకమూ ఎందుకు వచ్చిందో అర్థంకాదండీ!

శర్మ: ఇంతేకాదండీ. నిజం చూడబోతే భారత హరివంశ గ్రంథాలలో శ్రీకృష్ణుని మహత్వమంతా ఉంది. కాని భక్తి భావన అంత తీవ్రంగా వాటిలో కానరాదు. భాగవతంలో ఆ రసానుభవం తీవ్రంగా నిర్వహింపబడింది. ఇంకొక్క విషయం. అవకాశం ఉన్నప్పుడంతా శివకేశవుల అభేదాన్నే భారత హరివంశాలు వివరించినవి. హరివంశంలో ముఖ్యంగా శ్రీకృష్ణుడు సంతానాపేక్షతో శివునిగూర్చి తపస్సుచేసే ఘట్టంలో హరిహరాభేదం కంఠోక్తంగా చెప్పబడింది. భాగవతంలో ఈ కథ లేదు. కనుక కృష్ణుడే పరబ్రహ్మమనే భాగవత తత్త్వాన్ని ఒత్తి చెప్పడానికీగ్రంథం వ్యాసుడు రచించవలసి వచ్చిందనవచ్చును.

రామ: అప్పటికైనా ఇదంతా తండ్రి రచించిన విష్ణుపురాణంలోనే వున్నది. మరి శ్రీకృష్ణుడు శివునిగూర్చి తపస్సుచేసిన కథ అందులోనూ లేదుగదా.

శర్మ: సత్యమే. అందుకనే ఈ చిక్కు విడిపోయేది కాదన్నాను. పోనియ్యండి. ఎవరు రచించినా, ఎందుకు రచించినా, భాగవతం శ్రీకృష్ణునియందు అనన్య సామాన్యమైన భక్తిని మనదేశంలో వ్యాపింపజేయడంలో ఇతర గ్రంథములకంటే ఎంతో ఎక్కువ పనిచేసింది. మరిదాన్ని అసాధారణమైనధారతో, మాటకారితనంతో తెలిగించిన పోతన్న తలపాలం దాకా యీడ్చి పెట్టినాడు. ఆధ్యాత్మిక విషయాలలో మనకు ముఖ్యమైనది భావన. దాన్ని బోధించే గ్రంథం ఎవరు రచించినదైనా పరిగ్రాహ్యమే. చారిత్రక దృష్టికి ఇందులో అంత ప్రాముఖ్యం ఉండదు. శ్రీకృష్ణుడు సాక్షాత్ పరబ్రహ్మయొక్క అవతారమనీ, అతనిని పూజించేదీ అతని చర్యలను మననం చేసేదీ మోక్షసాధనమనీ, ధర్మమార్గమనీ నమ్మకం కలిగించిం దీగ్రంథం.

రామ: నిజమే. కృష్ణభక్తిని భాగవతం సాధించినంతగా భారతం సాధించలేకపోవచ్చును. శ్రీకృష్ణుని బాలలీలలు, యౌవన విలాసాలు భారతంలో లేవుగాని, ఆయనయొక్క అసాధారణప్రజ్ఞ, ఆశ్రిత వాత్సల్యం, ధర్మదృష్టి, నీతి పాండిత్యం, స్వార్థంలేని లోకకల్యాణదృష్టి, స్వభావంలో అందరినీ ఆకర్షించే ధీర లలితశాంతత్వం, ఎంతపెద్ద చిక్కులు సంభవించినా చెడని మనోబలం, ఇత్యాదిమహాగుణాలు భారతకథలో ప్రకాశించినట్లు భాగవత కథలో ప్రకాశించలేదు.

శర్మ: సత్యమే. శ్రీకృష్ణుడు లోకానికి సార్వకాలికంగా అందజేసిన మహాసందేశమైన భగవద్గీతలో స్థితప్రజ్ఞత్వాన్ని మహోదాత్త గుణంగా చెప్పినాడు. గాంధీమహాత్ముడు నిత్యపారాయణంలో ఉంచుకొని ప్రచారంచేసిన ఆ శ్లోకాలు, అన్నిదేశాల-అన్ని కాలాల మనుష్యులందరు మననంచేస్తూ ఉండవలసినవి. ఆ స్థితప్రజ్ఞత్వాన్ని పూర్తిగా మహాభారతకృష్ణుని జీవితంలో మనం గమనించవచ్చు. శ్రీకృష్ణుడు భగవదవతారమని భావించడానికి ఆ గుణాలు చాలు.

రామ: సందేహమేమండీ! లోక కల్యాణానికీ, ఆత్మానందానికీ సాధకంగా ఉండే ఆ గుణాలు ఎంత ఎక్కువగావుంటే అంత దివ్యత్వం ఆ వ్యక్తియందున్నట్లు మనం భావిస్తాము. అంతేకాని సర్వశక్తుడై భగవంతుని అవతారమని భావింపబడిన వ్యక్తి విషయంలో పూతనా సంహారం, కాళియమర్దనం, గోవర్ధన పర్వతాన్ని ఎత్తి పట్టడం మొదలైనవి చాలా చిల్లర పనులుగానే వివేకులందరూ భావిస్తారు. ఇకమరి అవతారమంటే శ్రీ మహావిష్ణువు శ్రీవైకుంఠం తలుపు తాళాలు బిగించి, క్రిందికి దిగి మనుష్యుడుగా పుట్టినాడని కాని, అక్కడా ఇక్కడా రెండు శరీరాలతో ఏకకాలంలో వర్తించినాడనికాని భావించేది అవిచార రమణీయం కాదా.

శర్మ: అవిచారమైనా రమణీయమైనదని మీరంగీకరించి భక్తులను బతికించినారు. ఆ రమణీయతాగుణమే సామాన్య భక్తులకు జీవనం. ఆధ్యాత్మికమైన అతీంద్రియ తత్త్వాన్ని ఆధిభౌతికంగా భావించి అనుభవించడమే కదండీ భక్తి స్వరూపం. కనుకనే శ్రీకృష్ణుని బాల తరుణ లీలలు ఇంతగా ప్రపంచాన్ని ఆకర్షిస్తున్నవి.

రామ: కాని, ఆ ఆధిభౌతిక భావనలను క్రమంగా ఆధ్యాత్మికంగా సంస్కరించుకొనకపోతే అవి మరీ సంకుచితమైపోక తప్పదు. శ్రీ కృష్ణభక్తులలో చాలామంది ఆయనయొక్క జారచోర లీలల ఘట్టాన్నిదాటి మీదికెక్కలేక అంతటితోనే చరితార్థులమైనా మని నమ్ముతూ ఉంటారని నాభావం. పరలోక వ్యవహారాలెట్లున్నా, ఇహలోకంలో మనముపాసించే దేవతాలీలలు మన ధర్మార్థకామాల సంస్కరణకు సాధకంకాకపోతే ఆభక్తివల్ల లాభానికంటే నష్టమే యెక్కువ

శర్మ: అంటే భారతంలో ప్రత్యక్షమయ్యే శ్రీకృష్ణుని మహత్త్వాల్ని అర్థంచేసుకొని ఉపాసించడానికి పూర్వరంగంగా భాగవతంలోని కృష్ణమూర్తి చిత్రింపబడినాడంటారు మీరు?

రామ: అంతేనండీ. గ్రంథకర్త ఉద్దేశమేమైనా ఆ గ్రంథాన్ని ఆ రీతిగా ఉపయోగించుకొనేది మన ధర్మమని నా భావం.

శర్మ: నా పరాయణంకూడా అంతేనండీ. ఇదే దృష్టితోనే కదండీ ప్రాచీనులెందరో శ్రీకృష్ణుని జారచోరత్వాది లీలలని రూపకాతిశయోక్తిగా మరుగు పెట్టి రచించిన ఆధ్యా కతత్త్వాలే అని వ్యాఖ్యానం చేసినారు! కాని నా దృ ో ఈ రూపణ పద్ధతి మనలను రెంటికీ చెడిన వణలనుగా చేసిపెట్టుతుం దనిపిస్తుంది. తక్కిన ఆధ్యాత్మిక విచారాలెట్లున్నా భాగవతంలోని మూర్తికంటె భారతంలోని కృష్ణమూర్తే ఎక్కువ గంభీరంగా గోచరిస్తాడు. ధర్మము, నీతి రెంటినీ నిర్వహించి, భోగయోగములు రెండూ పరస్పరోపకారకంగా నడిపిన మహావ్యక్తి భారతకృష్ణుడే. ద్రౌపదీ స్వయంవర కాలంలో మనకు మొట్టమొదట గోచరించిన ఆమూర్తి, యుద్ధము, రాయబారము, వినోదము, తత్త్వచర్చ మొదలైన అన్ని సన్నివేశాలలోను ''అత్యతిష్ఠద్దశాంగుళం'' అని వేదం చెప్పినట్లు, అందరిని మించి, అందరితోనుచేరి నవ్వుతూ జీవితాన్ని నడిపినాడు.

రామ: కాబట్టేనండీ

''సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ, అహంత్వాం సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః.

''క్రందుకొను సర్వధర్మ వికల్పములను
నెడల విడిచి, దృఢంబుగ నేనొకండ
శరణముగ నాశ్రయింపుము సకలదురిత
ములకు దొలగింతు నిన్ను బ్రమోదమొంద''

అని అర్జునునికి ఆయన నిర్భయంగా నిస్సంశయంగా చేసిన ఉపదేశం మన దేశంలో మహామంత్రంగా జపం చేస్తారు.

శర్మ: సందేహమేమండీ. దానికి మించిన సదుపదేశమేది? శ్రీకృష్ణుని విడిస్తే దాన్ని చేయగల ఇంకొక వ్యక్తి యెవడున్నాడు!

★ ★ ★

చంద్రోదయేన సింధుః బంధుః కుశలానుయోగ సంధానాత్।
అంధురివ వర్షయోగాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

చంద్రోదయంతో సముద్రంలాగా, కుశల ప్రశ్నలతో ఆదరించడంవల్ల చట్టంలాగ, వర్షాలు పడడంవల్ల బావిలాగ ఓ సుందరీ! నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— 'ఉపమావళి' నుండి

★ ★ ★

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు:

# ఎఱ్ఱన్న సోమన్నల హరివంశాలు

(శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ గారితో రేడియోలో జరిగిన చర్చాప్రసంగం)

శర్మ: అయ్యా రామకృష్ణయ్యగారూ నమస్కారం.

రామ: అయ్యా శర్మగారూ నమస్కారమండీ.

శర్మ: మరి యీనాటి రసమయి విషయంగా మీరు తీవ్రంగా ఆలోచించి వుంటారు. కొత్తవిషయాలేమైనా సంగ్రహించితిరా?

రామ: అబ్బేయేమీ లేదండీ. ఇంకా ఆవిషయం మీరే యెక్కువగా చర్చించినవారు. మీ దృష్టికే యేమైనా కొత్త అంశాలు తట్టివుండవచ్చునని ఆశిస్తున్నాను.

శర్మ: నేను కొంతవరకు రెండు హరివంశాల కావ్యగుణచర్చకు అంకురార్పణం చేసినమాట నిజమే. కాని దానికీ స్వస్తిచెప్పి యెంతోకాలమైపోయింది. మరి చరిత్రదృష్టితో ఏర్పడే సమస్యలను నేను తలపెట్టనే లేదనవచ్చును. నాకంటె ఉత్తమాధికారులెందరో ఆ చర్చ చేసినారు. కాని-అదిగూడా నిలిచిపోయి ఏండ్లు గడచినవి.

రామ: నిజమేలెండి. ఐతే ఆ వ్యవహారంలోని ముఖ్య విషయాలనే మళ్లీ యిప్పుడు పునశ్చరణ చేతాం. ఈ విధంగా కొంత విషయస్పష్టతకైనా దారిచూపినవారమౌతాం. సందిగ్ధ సమస్యలను స్పష్టంగా అర్థంచేసుకోగలిగితే సగానికి పైబడి సమాధానం లభించినట్టే అంటారు విమర్శకులు.

శర్మ: ఆహా. కావచ్చు. ఇందులో మొదటిప్రశ్న ఎఱ్ఱాపగడ సోమన్నల కాలనిర్ణయాన్ని గురించింది. అది నిర్ణయమైతే తరువాతి చిక్కులు చాలవరకూ విడిపోగలవు.

రామ: అవునండీ. కాని ఆ విషయం నిర్ణయంచేయడం కూడా అంత సులభంగా కనబడటంలేదు. ఎఱ్ఱన్న కాలాన్ని నిర్ణయించేది, ఆయన హరివంశాన్ని అంకితం చేసుకొన్న ప్రోలయవేమారెడ్డి కాలమొకటే. వేమారెడ్డి రాజ్యం 1320-1349 క్రీస్తుశతాబ్దాల నడుమ జరిగింది. ఈ ముప్పది సంవత్సరాలలో హరివంశరచన, పరిగ్రహం ఎప్పుడు జరిగిందో నికరంగా తెలియదు.

శర్మ: వాస్తవమే కాని హరివంశ రచనాకాలంలో ఎఱ్ఱన మధ్య వయస్సును దాటి వుంటాడని, ఊహించడానికి మాత్రం అవకాశం ఉంది నాదృష్టిలో హరివంశమే శంభుదాసుని కడపటి రచనగా తోస్తుంది.

రామ: ఇక నాచన సోమనాథుని కాలాన్ని తెలిపేది బుక్కరాయల దానశాసనమొకటే. బుక్కరాయల రాజ్యకాలం 1355 మొదలు 1377 వరకు. అంటే వేమారెడ్డి రాజ్యంముగిసిన తర్వాత ఆరేండ్లకు మొదలై తరువాత 22 సంవత్సరాలు సాగిందని ఎన్నో ఇతర చరిత్రాధారాలు నిర్ణయిస్తున్నవి. కాని బుక్కరాయలు 'పెంచుకలదిన్నె' అనే అగ్రహారాన్ని సోమనాథునికి దానంచేసిన శాసనంలోని శకసంవత్సరాలు రాయల రాజ్యకాలానికి చాలాముందే గడచిపోతున్నవి.

శర్మ: కనుకనే చరిత్ర పరిశోధకులు అందలి 'రసభూనయనేందుభిః' అన్నవాక్యాన్ని తలకొకరీతిగా దిద్ది సవరించే సాహసం చేసినారు.

రామ: అంతేకాదులెండి. అసలు శాసనం రెండు ప్రతులలోనే భిన్నపాఠాలు కనబడుతున్నవి. మొత్తంమీద ఏమిచేసినా ఎట్లు దిద్దినా ఆ చిక్కు తెగలేదు. కాబట్టి శాసనంలో ఏదో పొరబాటున్నదనుకొని, బుక్కరాయలకాలంలో సోమనాథుడుండిన వాడని మాత్రమే నిశ్చయించుకుంటే, ఎఱ్ఱన్న వృద్ధుడుగాను, సోమనాథుడు ప్రాయపువాడుగాను పద్నాలుగో శతకం మధ్యభాగంలో సమకాలికులుగా ఉండిరని స్థూలంగా ఇప్పటికి మనం నమ్మవచ్చుగదా. ఏమంటారు శర్మగారూ?

శర్మ: అంతే నండీ. ఎఱ్ఱన్న హరివంశం చూచిన తరువాతనే, దానికంటే మెరుగుగా రచింపవలెననే, సోమన సంకల్పించినాడని, వీరేశలింగం పంతులుగారు మొదలుగా

ఎందరో తలచిరి. నేనూ అదేమాటే నమ్మినాను. రెండు హరివంశాలూ పోల్చిచూస్తే, పెద్దన్న మనుచరిత్రకంటె చమత్కారంగా రచింపవలెనని, రామరాజ భూషణుడు స్పర్ధతో వసుచరిత్ర రచించినట్లే ఎఱ్ఱన్నపై స్పర్ధతో సోముడు ఉత్తరహరివంశం వ్రాసినాడనే నాకు తోచింది. మరి రెడ్డి రాజ్యానికి కొత్తగా పుట్టి పెరుగుతూ వుండే కర్నాటక రాజ్యానికీ రాజకీయంగా ఉండిన స్పర్ధకూడా ఇద్దరు కవుల స్పర్ధకూ దోహదం చేసిందేమో కూడా! కాని సోమన పక్షపాతులు కొందరు దాన్ని అంగీకరించే యిష్టంలేక ఎఱ్ఱన్నకంటె సోముడే ప్రాచీనుడనే వాదాన్ని లేవదీసినారు. సోముడు ఎఱ్ఱన్నను అనుకరించినాడంటే అతని గొప్పతనానికేదో లోపం సంభవిస్తుందనే భయమున్నట్టుంది వారికి.

రామ: అంతేకాదులెండి - సోముని రచనలోని చమత్కారాలకు గద్యంలో అతడు వేసికొన్న బిరుదులకు ముగ్ధులైపోయి - కవిత్రయం వారికంటెమా ఈతని రచనలో ఏదో గొప్పతనం ఉన్నదనే భావంలో పడిపోయారులెండి వారు. అయితే సోముడు ఎఱ్ఱన్ననుకరించేవుంటే ఉత్తర హరివంశాన్ని మాత్రమే ఎందుకు వ్రాశాడంటారు మీరు?

శర్మ: అదే రెండవ సమస్య ఈ చర్చలో. సులభంగా విడిపోయే చిక్కు కాదు. అసలు సోముడు పూర్వహరివంశాన్ని రచించనే లేదని నికరంగా ఎట్లు చెప్పగలము? సోముని హరివంశం ఏదో అనిర్వచనీయ కారణాలతో దేశంలో వ్యాప్తికి చాలినంతగా రాలేదు. మనకు దొరకినవంతా ఒకటి రెండు శిథిలప్రతులే. ఎఱ్ఱన హరివంశం వ్రాత ప్రతులిప్పటికీ ఎన్నో దొరకగలవు. కనుక సోముని పూర్ణగ్రంథం మనకింకా లభింపలేదనడం కూడా అసంభావ్యంకాదు.

రామ: కాని-శర్మగారూ! సోముడు హరివంశాన్ని పూర్తిగా ఆంధ్రీకరించే ఉండవలెననే నిర్బంధమేమున్నది? ఎఱ్ఱన రచనకంటే ప్రౌఢంగా కనబడాలనే భావంతో రసవంతములైన కొన్ని ఘట్టాలనే గ్రహించి సాహిత్య రస పోషణం చేయాలని అనుకొని రచించినాడేమో!

శర్మ: నిర్బంధమేమీ లేదుగాని, ప్రతి ఆశ్వాసాంతగద్యలో ''తిక్కన సోమయాజి ప్రణీతంబైన మహాభారత కథానంతరమున'' అని సోముడు వ్రాసినమాట పరిశీలిస్తే మహాభారత పరిశిష్టమైన హరివంశాన్ని పూర్తిగా తెలుగు వ్రాయవలెనని అతని ఉద్దేశమైనట్టు ఊహింపవలసి ఉంటుంది. మరి ఇప్పుడు దొరికిన గ్రంథంలో కృత్యాది పద్యాలులేవు. వట్టి సామాన్యపు ఆశ్వాసాదిలో ఉన్నట్టు కృతిపతిని సంబోధించే కందమున్నది. తరువాత ''దేవావైశంపాయనుండు జనమేజయునకిట్లు నియె'' అనే మామూలు వాక్యమున్నది.

రామ: కృత్యాదియేమీ లేకుండానే ఎఱ్ఱన అరణ్యపర్వశేషం పూరించలేదా? సోముడుకూడా అట్లేచేసి యుండవచ్చుగదా? తిక్కన పూర్తిచేసిన భారత కథానంతరమున తత్పరిశిష్టమయిన హరివంశ కథలను, తిక్కనవలెనే హరిహరనాథుని కంకితముగా ప్రౌఢంగా వ్రాయుటయే అతని ఉద్దేశం కావచ్చు. భారత పరిశిష్టమన్నంత మాత్రాన హరివంశ మంతావ్రాయాలని నిర్బంధమేమున్నదీ?

శర్మ: ఎఱ్ఱన్న మహాభారతంలో ముగింపుకురాని చిన్న తునుకను నన్నయగారి పేరుతోనే, ఆయన కవితారీతినే ముగించినాడు. అంకితంకూడా రాజరాజ నరేంద్రునికే యిచ్చినాడు. సోముడు అట్లు చేయలేదు. ప్రత్యాశ్వాసాంతమందు, తన కర్తృత్వాన్ని నిస్సందేహంగా చాటినాడు. శ్రీమత్సకల భాషాభూషణ-సాహిత్య రసపోషణ-సంవిధాన చక్రవర్తి -సంపూర్ణకీర్తి - నవీన గుణసనాథ - నాచనసోమనాథ' అని తన్నుగూర్చి స్పష్టంగా గొప్పగా చెప్పుకొన్నవాడు. కృత్యాదిగా తన్నుగూర్చి యేమీ చెప్పక వినయంతో గ్రంథారంభం చేస్తాడని నేను నమ్మజాలను.

రామ: ఏమోలెండి. ఎఱ్ఱనతోపోటీ కొరకే అట్లు చేసిననూ చేసియుండవచ్చునేమో? ఇంతెకాక-పూర్వహరివంశానికంటె ఉత్తర హరివంశంలోని కథలు ఎక్కువ రసవంతంగా ఉండటం కారణంగా సోముడు ఉత్తరభాగాన్ని మాత్రమే తన కవితాశక్తి ప్రకటనానికై పరిగ్రహించి రచించినాడనే ఊహకూడా కొందరు చేసినారు గదా.

శర్మ: అది వట్టిదుర్బలమైన ఊహ. శ్రీకృష్ణుని బాలక్రీడలు, గోపికా సమ్మోహనం, కంసాదుల సంహారం-మొదలైన విషయాలలో లేని అవకాశం, ఉషాపరిణయాది కథలలో కవిత్వానికి ఊడి పడుతుందా? అసలు సోమనాథుని కవితాకళ కల్పనాప్రధానమై అర్థశబ్ద చమత్కార రచనలో ఎక్కువగా వెలసేది. కనుక దానికి కథ అంతప్రధానం కానే కాదేమో?

రామ: మరి దీనితో మనం ఈచర్చకంతా ప్రధానమైన ముఖ్యవిషయానికి వస్తున్నాము. ఎందుకంటే సోమనా

థుని కవిత కవిత్రయం వారి కవితకంటె ఉదాత్తమైన దని కొందరు పెద్దలు చెప్పడం, కాదని మీరు వాదించడం-ఈ మూలంగా కొంత ఈ వ్యవహారం పెరిగింది
కాదూ?

శర్మ: నిజమేనండీ. పెద్దలతో కొంత ఈ విషయంలో అభిప్రాయభేదం ప్రకటించే అపరాథమనండి- సాహసమనండి - చేసిన లోపంనాది.

రామ: అబ్బే-అలాంటిదేమిటి? ఇందులో అపరాధం ఏముం దండీ. సాహిత్యం ప్రకృతి శాస్త్రముకాదు. ధర్మశా స్త్రమూ కాదు గదా. ప్రకృతి శాస్త్రంలో భిన్నాభిప్రా యాలు ప్రయోగంచేసి చూపి సమర్థింప వలసినవి. ధర్మశాస్త్రంలో వాటిమూలాన కలిగే సదసత్పరిణా మాలు, లోక కళ్యాణదృష్టే ప్రధానంగా గమనించి, అభిప్రాయభేదాలు ప్రకటించడమో, దాచిపెట్టుకోవ డమో చేయక తప్పదు. మరి సాహిత్యం కళాప్ర పంచం. ఇందు స్వతంత్రమార్గాలకూ భిన్నాభిప్రాయా లకూ సమృద్ధిగా అవకాశం ఈయకపోతే రచనలన్నీ అచ్చుకొట్టిన బొమ్మలై నిర్జీవంగా కొయ్యబారి పోకతప్పదు. మరి నాకు గూడా సోమనాథుని కవిత్వంలో అభిమానమున్నది. రుచీ ఉన్నది. అందులోని తళుకుబెళుకులు, నిగనిగలు, గడుసుపోక డలు, వింత నడకలు, చమత్కార సంభాషణములు, ప్రౌఢరచనలు, వీనికి లొంగిపోని రసికుడుండడు, ఐతే కవిత్రయంవారి పంక్తికి మాత్రం ఇతడు రాలేడు. ఆంధ్ర మహాభారతాన్ని అనుభవించిన వారంతా ఈ అభిప్రాయానికి రాకతీరదని నా నమ్మిక.

శర్మ: నావాదం కూడా అంతేనండి రామకృష్ణయ్యగారూ! నాచనసోముని కవితలో మనకు కలిగే-కలుగవలసిన - అతృప్తి, కవిత్రయం వారి కవితాకళతో పోల్చిన ప్పుడే. అట్లు చేయక స్వతంత్రంగా పరీక్షించినప్పుడు సోముని రచన రసమయమే - ప్రాయశః ప్రతి మహాకవీ మనకేదో ఒక విధమైన రుచి తప్పక ప్రసాదిస్తాడు.

రామ: మహాకవులను పరస్పరంగా పోల్చి గుణదోషాలు నిర్ణయించడం, సమంజసమైన విమర్శ పద్ధతికాదని కొందరి వాదం. ఏ కవి ఏ సన్నివేశంలో ఏయే సంస్కారాలకు, సంకేతాలకు లోబడి, ఏ ఉద్దేశాలతో రచన సాగించాడో, ఆయా విషయాల దృష్ట్యా, అతని కవితలోని గుణదోషాలను చర్చించేది మంచి పద్ధతి అని అంటారు ఈ మతంవారు.

శర్మ: కాని అది మొత్తంమీద చారిత్రక దృష్టి అవుతుందేకాని సాహిత్యమనే విశ్వజనీన కళకు చాలదు. సాహిత్యరచ నలు వ వ్యక్తుల అసంబద్ధ సృష్టులుకావు. పూర్వోత్తర బాం ం వాటికెప్పుడూ తప్పదు. కనుక మొత్తంగా జాతి హిత్యం సాధించిన సిద్ధుల గొప్పతనాన్నీ చిన్నతనాన్నీ నిర్ణయించవలసివస్తే సాధకుల పద్ధతు లను పరస్పరం పోల్చిచూడక తప్పదు.

రామ: అట్లు పోల్చి చూచినపుడు, కవిత్రయం వారి రచనలో ఉన్నంత సాత్వికదృష్టి - సత్యశుద్ధి, ఇతరులలో కానరాదనేమాట సత్యం సుమండీ. కథను సంగ్రహ విస్తరాలు మితిదాటకుండా నడిపే కుశలత, పాత్రలు ఎట్టివైనా సౌమన ం, ఉదాత్తత, అనే మహాగుణాలు చెదరకుండా చి ంచే భావనా సంయమం, ఆడే మాటలలో ఆడిం మాటలలో పూర్వోత్తర సందర్భ శుద్ధి, అభిప్రాయాలలో సిద్ధాంతాలలో ఆర్జవం, శయ్యలో ధారాళత, వట్టి ఉద్రేకంకాక లోక క్షేమాన్ని సంపాదించే సంకల్పము, ఇత్యాది సత్యశుద్ధి గుణాలు తెలుగు సారస్వతంలో కవిత్రయం వారు పెట్టిన భిక్షలు.

శర్మ: చాలా విలువైన మాటలు చెప్పితిరి. నాచన సోముని యందు, ఆ సాత్వికత్వమనే మహాగుణమే చాలనిది. అతడు వీరధర్మాన్ని కవితా ప్రపంచంలో తెచ్చిపెట్టి, రచనను రాజసంగా మార్చినాడు. అందుకనే అందులో ఆకర్షణశక్తి ప్రబలం. తరువాతి తెలుగు సారస్వతంలో అంతా ముఖ్యమైన ఈవీరధర్మమైన రాజసమే వ్యాపించి, దాని పరిణామంగా, ప్రబంధ కవిత్వమనబడే తామస కవిత్వానికే మార్గముతీసింది. కాని తిక్కన గారిని అచ్చిన్న భక్తుడై కొలిచిన మహాపండిత కవి గనుక, సోముని రచనలో ఆ ప్రాచీన కావ్యధర్మాలు ఎన్నోచోట్ల స్పష్టంగానే-కనబడుతూ ఆతని కవి త్వాన్ని రస మయంగా చేసినవి.

రామ: నిజమేనండీ-శర్మగారు. ఆతని యితర రచనలేవీ ఆస్వాదించే భాగ్యం మనకీవరకూ కలగకపోవడం, ఒక గొప్పకొరతండీ.

శర్మ: ఆహా! సందేహమేమి?

# వాణీ విలాసము - తాళపత్ర గ్రంథము

## తేకుమళ్ల రంగశాయి ప్రణీతము

గితము - అచ్చు, వచ్చిన తరువాత తాళపత్ర గ్రంథాలు వరకు మూలనపడ్డాయి. కొన్ని అంతరించిపోయినాయి డాను. మిగిలిన వాటిని సేకరించి సుప్రసిద్ధ గ్రంథాల ల్లో చేర్చి భద్రపరచడానికి కొందరు పండితులు, ుత్వంవారూ కూడా చాల ప్రయత్నాలు చేశారు. ానూ వున్నారు. అయితే ఇంకా అలా గ్రంథాలయాల్లో )బడకుండా ప్రత్యేక వ్యక్తుల యిండ్లలో జాగ్రత్త పెట్టబడి వాటి విలువ తెలియని కొందరి యజమానుల యిండ్లలో ికలమీద పడియుండినవీ, మనదేశంలో ఇంకా కొన్ని ాయనడానికి సందేహం లేదు. అట్టివికూడా ఏ ులుపాలో కాకుండా ఏ ప్రసిద్ధ గ్రంథాలయానికో చేర్చడం ా ఉత్తమమైన పని. అదొక పుణ్యకార్యంగా కూడా ములు భావించాలి. లేదా 'యశసే అర్థకృతే' అన్నారు . వాటిని కొనగలిగిన యే గ్రంథాలయానికో అమ్మివేసినా ుత సార్థకత్వం కలుగుతుంది. ప్రస్తుతం మనదేశంలో ిన గ్రంథం సంపాదన మొక వ్యసనంగా నేర్పడి అనేక ర్వ గ్రంథాలను చాల సొమ్ము వెచ్చించి సంపాదించి కుకున్న మహావ్యక్తులలో శ్రీయుతులు మానవల్లి రామ ు కవిగారొకరు.

వారి యొద్ద సుమారు రెండు మూడు వందల అపూర్వ థాలుంటాయని వినికిడి. వారు కూడా ఆ గ్రంథ సమితిని ుపతిలోని శ్రీ వేంకటేశ్వర గ్రంథాలయమునకు చేర్చవలె నిశ్చయించుకున్నట్లు తెలుస్తుంది. మద్రాసులోని ప్రాచ్య ుత పుస్తకాలయంలో, తంజావూరు సరస్వతీ భాండారం ు గల గ్రంథాలకు పరిచయ వాక్యాలతో గూడిన పట్టికలు ుటితములై యున్నవి కాని, మన దేశంలో ఇతర ప్రసిద్ధ థాలయాలలోని వాని కట్టివి బయలువడినట్లగపడదు. థ ప్రకటనము మాటయెట్లున్నా, ఆయా గ్రంథాలయాల ు, ఇతర చోటులను లభ్యములగు తెలుగు గ్రంథములక ుకిని పరిచయ వాక్యములతో గూడిన యొక సమగ్రమైన క యైనను ప్రకటిత మగుట మిక్కిలి వాంఛనీయమనక తప్పదు. ఇది ఆంధ్ర సాహిత్య చరిత్రకు మిగుల నుపకారకము కాగలదు. చర్విత చర్వణగా నుండి శబ్ద చిత్రములతోను వర్ణనలతోను నిండిన యిటీవలి ప్రబంధములను, రామాయణ భారత పురాణకథలతో గూడిన కావ్యములను వదలివేసి, కొంతవరకు శాస్త్రీయ సాంకేతిక విషయములతో గూడిన గ్రంథములనే ప్రభుత్వమువా రీమధ్య ప్రకటింప యత్నించు చుండుట మిక్కిలి ప్రశంసనీయమైన విషయము. అట్టి తెగకే చెందినది, చాల వరకు శాస్త్రీయ సాంకేతిక విషయములను గూర్చి, ప్రాచీన దేశీయ సంప్రదాయములను గూర్చి వివరించు బృహద్గ్రంథములలో నొకటి ఈ 'వాణీ విలాసము'.

వాణీవిలాసమునకు తేకుమళ్ల రంగశాయి కర్త. ఈ ' ంథము వ్రాతప్రతి యొకటి తిరుపతి - శ్రీ వేంకటేశ్వర ' ాచ్య పరిశోధనాలయ పుస్తక భాండారములో నున్నది. ంగశాయి కవిది శ్రీవత్స గోత్రం. తండ్రి పేరు కప్రయామాత్యుడు. తల్లి - తిమ్మమ్మ ''వామనదేవ పుత్రుడు ధర్మపురి శ్రీ నృసింహవరప్రసాది రామభద్రగురు శేఖరుని భజించి'' అని చెప్పడం చేత - రామభద్రుడనే ఆయన ఈతని గురువని, ఈతడును ధర్మపుర నివాసి యని తలంపదగి యున్నది. ఇది ఒక చిన్న 'ఎన్‌సైక్లోపీడియా' వంటిది. సర్వ విషయ సంగ్రహ మనదగిన యొక బృహద్గ్రంథము. శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి కంకితము చేయబడినది. ఈ రంగశాయి కవి తొలుత నన్నయ, తిక్కనల, శ్రీనాథ గౌరనలవరకు స్మరించి నెమ్మితో నొకకృతి రచింపదలచి యుండగా, కల్యాణ వేంకటాచల విభుండు ఉషఃకాలంబున స్వప్నంబున దృగ్గోచరుండై 'నీతల చిన కృతి' 'వాణీ విలాస' మాలికయును మధ్వనమాలిక భాతి మెరయుచు మామకాలంకారం బగు, నగణిత సుగుణుం డగు మద్దాసుండొకడు సహాయుండుగా నేతత్కృతి మత్సమ ర్పణంబు సేయు, మని యానతిచ్చెనట. ఈ విషయము వెంటనే తన బంధుమిత్రులతో జెప్పగా వారన్నారట:-

''ఉరుశుభ సన్మతిన్ తిరువళూరు పురాధిప వీరరాఘవ స్థిరశతకంబు, కృష్ణగుణదీపిత దండకమొప్ప, జానకీ పరిణయ యక్షగానమును, భాగవత ద్విపద ప్రబంధమున్ విరచన చేసినట్లు యిది వేడ్కనొనర్పుము రంగధీనిధీ''

గీ. వరకవి, బహుశ్రుతుడు శేషగిరి నివాస
భక్తుడు వివేకి బహుప్రబంధకర్త
విశదమతి శ్రీ మహంకాళి వెంకటపతి,
చెలిమి కాడౌటదగు కార్యసిద్ధి నీకు
ప్రచురలీలచతుర్విధ కవిత లెరుగు,
నెమ్మినాతడు నీకృతి నిర్వహించు''

అని చెప్పగా -

''ఏకకథా ప్రసంగతి రహిన్
కవులాద్యులు సత్ర బంధముల్
ప్రాకట మాధురీస శుభ
జేసిరి, వారి సత్కృ న్
శ్రీకర సత్పురాణము
లశేషతరాగమ సంసితైకబో
ధాకలితార్థముల్ వినిన
యంతయు గూర్తు ప్రబంధ సంగతిన్''

అని నిశ్చయించి అట్లు అశేష పురాణాగమ సంహితైక బోధాకలితార్థములనొక ప్రబంధముగా గూర్చి ఫణిరాజ శైలనిలయుని కంకిత మిచ్చినాడు. ఈ వాణీ విలాసమాలి కయు, ఆ ప్రభుని కంఠమున నొక వనమాలికయై సొంపు గూర్చినది. దీనిని బట్టి 'వీర-రాఘవ శతకం, కృష్ణదండకం, జానకీపరిణయ యక్షగానం, భాగవత ద్విపద అను దేశిరచనలను గావించినాడనీ, ఈ వాణీ విలాసరచనములో నీతనికి మహంకాళి వెంకటపతి అను స్నేహితుడు తోడ్పడి నాడని తెలుస్తోంది. ఆశ్వాసాంత గద్యంలో కూడా తన స్నేహితుని పేర్కొన్నాడీ కవి.

ఇక కథా విషయం - ఎప్పటిలాగానే నైమిశారణ్యంలో శౌనకాది మహామునులు. వీరు సూతునడుగుతారు:

''వింటి మఖిల పురాణములు వేరు వేర,
నిశ్చితా బు తెలియంగ నేరమింక
'సం తి విస్పష్టముగా,
సన్ను రార్థమెల్ల చతురత చెపుమా'

అని అడుగగా ''హరి గౌరవమున్ననలు తేటగా బలుకబ డున్'' అని -

''ఆరోగ్యేచ్ఛన్ భాస్కరు,
సారజ్ఞానంబుకొరకు శంకరు, ధనధా
న్యారూఢికగ్ని, ముక్తికి
నారాయణు గొల్వదగు జనంబుల కెల్లన్''

అని సూత్ర ప్రాయంబుగా దెలిపి, పిదప వేదశాస్త్ర పురాణాగమ సంహిత గణనయు, బ్రహ్మ స్వరూపానంద తారతమ్యము, సృష్టి ప్రకారము, శబ్ద బ్రహ్మ నిరూపణము, మిథున సృష్టి, సకల భూత వంశావతారము, జంబూద్వీపాది ప్రమాణము, పాతాళ లోక ప్రమాణము, శింశుమార జ్యోతిశ్చక్ర విధంబు, భూలోక విభాగము మొదలగు విషయములను ప్రథమాశ్వాసములో వివరించినాడు.

ఇక రెండవ యాశ్వాసములో, భరత ఖండస్థిత పుణ్యస్థల నదనదీ తీర్థ ప్రభావాదులను వర్ణిస్తూ, బదరికాశ్రమమున నారాయణ స్థానముతో మొదలు పెట్టి, కేదారం, నైమిశం, చక్రతీర్థం, అయోధ్య, మధుర, మాయా, కాశి, ప్రయాగ, గోదావరి, కోటిలింగస్థానం, కాళేశ్వరం, శబరి తీర్థం, ధర్మపురి నృసింహ తీర్థం - శ్రీకాకుళం - అంధాంధ్రనాయ కునిట్లు స్మరించినాడు.

'లలితాంధ్రభూమి శ్రీకా
కుళమున నాంధ్రపతియనగ గోవిందుడు ని
ర్మలచర్య దనరు తైర్థిక,
ఫలరూపంబగుచు భువన భాసుర మహిమన్'

పిదప వెంకట శైలమందలి తీర్థాదుల ప్రభావమును దెలిపి, భక్తనికర సౌఖ్యదాయి యగు కల్యాణ వేంకట నాథునిట్లు వర్ణించినాడు.

క్షీరాంభోధి జనించి యంచిత తపశ్శ్రీ వేంకటాధీశ్వరున్
గారాబంబున బెండ్లి యాడుటకునై కల్యాణ పద్మాకరో
దారాంచత్తట కుంజపుంజ విలసత్సౌటీర వాటీ కుటీ
వారాధారసుగంధ బంధురతను వ్యాపార హేలా గతిన్'

''వలనగు నలమేల్మంగన్,
కలుముల చెలి బెండ్లియాడి కంజదళాక్షుం
డలరుం చెలువగు సొబగున
నిలపై కల్యాణ వేంకటేశ్వరుడనగన్''

పిద శ్రీరంగం, కుంభకోణం, అనంత శయనం మొద లగు అ త్తర శతవి స్థలముల మహత్త్వమును, శివస్థల మహ త్త్వము , లింగాకా పూజా ఫలమును చెప్పి, బ్రాహ్మణ వంశగణగోత్ర నిరూ ణ వర్ణాశ్రమ సదాచార విధులు, దేవ పూజా విధులు, భోజన ప్రకరణం - అందు

'దంత శోధనమున, దాన మొనర్చుచో;
భోజనమున, దేవపూజతరిని,
జపము సలుపునెడల, స్మరకేళియప్పుడు,
మౌననియతివలయు మహిసురులకు.''

గీ. ''ఆర్ద్ర వస్త్రంబు సడలించునపుడు కటికి,
నూర్ధ్వ భాగంబునం దిగిచుర్వినిడగ,
వలయు దిగజార విడిచిన కలుష మొదవు,
జలము దరిజల్ల భూతత్పపులు ఘటిల్లు.''

క. ''ఉల్లియు తిలపిష్టంబును
ముల్లంగి యలాబు, హేయభూజనితంబుల్
పెల్లగు బచ్చలి తామస,
మెల్ల విడి త్యజింపవలయు నింగిత బుద్ధిన్''

క, జాతి ధర్మాలు, పతివ్రతాధర్మాలు, హరిపూజా వైభవం
ుదలగు వాని గూర్చి ద్వితీయాశ్వాసమున జెప్పినాడు-

మూడవ యాశ్వాసమున - తులసీ పూజా మహత్వం-
సందర్భంలో 'జలంధరోపాఖ్యానమును వర్ణించినాడు.
నపాత్ర ఫలనిరూపణం, కన్యాదానాన్నదానాది ఫలంవి
ము చెపుతూ

''సారమంతయు శుక్లమై మారి జన్మ,
హేతుకరమగునది సృష్టి హేతువగుట
అన్నమే బ్రహ్మమనుచు వేదార్థ విదులు
పలుకుదురు గాన తద్దాన పటిమ మేలు''

పిదప హరి వాసర వ్రత సందర్భమున - రుక్మాంగద
రిత్ర వర్ణింపబడినది. ఆపైన

''వేదోపనిషత్ స్మృతి సం
పాదిత ధర్మములు కర్మ పద్ధతులున్ మ
ర్యాదలు దెల్పితినింక న,
వోదిత శాస్త్రార్థ వృత్తు లురుమతి వినుడీ.''

ి, శిక్షావ్యాకరణ ఛందో లక్షణాలు, నిరుక్త, జ్యోతిషకల్ప
ాన వివరణముతో తృతీయాశ్వాసము ముగిసినది.

ఇక నావలి యాశ్వాసమున నక్కథకుండు ఆయుర్వేద,
ంథర్వవేద, ధనుర్వేదం బులగు నుపవేదంబులను వివరింప
ిడగినాడు. బ్రహ్మ మానస మిథునరూప సృష్టి పెరిగి
పుటచేత, భూమి భారమోర్వలేక బ్రహ్మను ప్రార్థించిన
ట. ఆతడొక తరుణిని సృష్టించి దానికి మృత్యువని
రుపెట్టి లోకులను చంపుకు తినమన్నాడట. ఆమాటలు
హింపలేక ఆమె కన్నీరు పెట్టుకొని యేడుస్తూ ఉంటే

''నేత్రవారి బిందునివహంబు మున్నూట నరుబదియు
మహారుగాకృతులును జనుల దునుము నీకు నడి లేదు
పొమ్మని'', జలజసంభవుడు ఆ రోగములతో నన్నాడట
'మీరు లోకులను వారి వారి కర్మకు దగినట్లు పట్టి ఘాత
సేయుచు, నాయువు దీరన్ దునుముడు, దురితులను,
డాంభికులను, అసత్యవాదులను, హరిహర దూషకులను
బాధింపుడు' అని చెప్పిపంపినాడట. కొంత కాలానికి వీని
బాధ సహింపలేక - ''సురలు న్మౌనులు విష్ణు విశ్వవిభునిన్
స్తోత్రంబుగావింప శ్రీ హరితద్భావమెరింగి ధన్వంతరి
నామముతో క్షీరాబ్ధి నుండి అవిర్భవించినాడట.

'వాతంబులేని శూలయు
భాతిగత్తంబు లేవి భ్రమయున్ శ్లేష్మో
ద్భూతంబుగాని తీట వ్ర
జాతతికి నజీర్తిలేని జ్వరమును గలదే'
అని ఔషధములలోను రసౌషధములు, మేటి యగుట వాటి
మిశ్రగతులు గంధకంబు రసంబు కలిత పాషాణముల్,
శుద్ధులెరుగవలె బ్రసిద్ధి గాగ.

'' ల్లకోడియైన పెట్ట పావురమైన,
తి గ జేసి వెడలదీసినట్టి
ర ము శుద్ధియగుచు పొసగునౌషధముల,
గలసి గుణ మొనంగు మెలపుమీర.''

నిమ్మపంటి రసంబుతో నొక్క దినముండెనేని నేపాళము
నకు శుద్ధి అని వివరిస్తూ పిదప స్వప్నఫలములు, గాంధ
ర్వము, ధనుర్వేదము, షట్శాస్త్రములు, దండనీతి -
సాక్ష్యములు, సత్యాసత్య పరీక్షణము, దాయభాగము వివరిం
చుచు ''జనకుడీల్లు వెనుక జనియించిన తదంశ, ధనములేమి
భ్రాతృజనులు భాగగతుల ధనము గూర్చి యతనికి పాలిచ్చు,
టర్హమగుట, పుత్రికదియె తగవు అని వివరించాడు. రాజ
కప్పములు - శిక్షణము - రాజయోగ లక్షణము చెప్పుచు-

''దిట్టగ సిద్ధాసనమున,
గట్టిగ గుహ్యముల కాళ్లు గదియించి కదు
న్నెట్టుగ భ్రూమధ్య స్థితి,
బట్టగు చూపమర సిద్ధపటిమ దనర్చున్''

''ఒదవునైష్ఠికమున యోగంబు సిద్ధించు,
న్ను ధానెతెలియు దానజేసి
మరకీట సరణి భావనచే బ్రహ్మ,
హిత చిత్తశుద్ధి మహిమ బొసగు''

''దేహబుద్ధి జూడ దేవుని దాసుదు,
జీవబుద్ధి నట్టే దివ్యనంశ,

మాత్మబుద్ధి జూడ నా దేవుడే తాను,
మతుల కొలది నిట్టి ధృతి బొసంగు.''

''ఎన్ని యత్నంబులచేనైన బ్రహ్మ విచారంబు సేయవ లయు'' నని చెప్పి

''భరత కళాలంకార శిల్పిగజాశ్వపశు రత్న సాముద్రిక గణిత శాస్త్రములను వినుడని - భరతశాస్త్ర గ్రంథములను గొన్నిటిని చెప్పినాడు.

''రత్నాకర చూడామణి. తాలకళా విలాస, సంగీతమణి దర్పణ, చతుర సభావిలాస, కాత్యాయన జైమినిమత, మారుతీయాదినామంబుల చాతుర్లక్ష గ్రంథ విశ్రుతంబై, భరతశాస్త్రము, సురముఖ్య సభలయందు అప్సరోమనోజ్ఞమ గుచు, ధరణినర్తునాది కల్పనా రూఢి జెలువొందె, నాట్యలక్ష ణముల నవ్యమగుచు''

''పరగ భకారము భావం,
బరయన్ రేఫమది రాగమమరు తకారం,
బిరవొందు తాలసంజ్ఞం,
బరువడి నివి మూడుగూడి భరతంబయ్యెన్''

పిదప - నాట్యక్రమము. త్రయోదశ తానకంబులు, కళాశా స్త్రము, నాయికా నాయక భేదములు, స్త్రీపురుష లక్షణ ములు, సాముద్రికము, రత్న, గణిత, ఉష్ట్రవాజి శాస్త్రములు.

''ధర త్రింశత్సంవత్సర,
పరిమితమున్ దంతవృద్ధి బాటిలు ధైర్య
స్ఫురణంబాయుర్దాయము,
బెరుగున్ గజములకు నెల్లపేర్మి దలిర్పన్''.

''అనికిన్ వేటకు వేడుక,
కును వాహన మెద్దియేని గుర్రము బోల్పన్,
జనునే, బహుగజములుగల,
మనుజేశుండశ్వవిభుని మాడ్కిందగునే''

''విదితంబుగా నూటపది సుళ్లు గలవు తు,
రంగములకును దత్క్రమము లెన్నదగు.

''నరులకు నాడియు గజముల,
కరయగదగు గతి విశేష మశ్వంబులకున్,
పరికింప నేత్రవర్ణము,
లిరవగు రోగముల దెలియ నివి లక్షణముల్.''

పిదప-సహదేవ శాస్త్ర విషయము - పశువుల రోగ చికి త్సలు చాలగా చెప్పినాడు.

''దూడ నొల్లని దానికి వేడుకలర,
నేన్గునల్లేరు వెల్లుల్లి వెనయ వసయు
మిరియమున్, తక్రమును నిడ మేల్మి దయను,
వత్సములకిచ్చు పాలు నవ్వారిగాగ.

గణితశాస్త్రము - దశవిధ గణితంబులు - ఛాయా ప్రమాణ గణనము-

''గణితములు దశవిధంబులు,
ప్రణుత స్థితిస్పష్ట సంఖ్య పరికర్మములన్
గణుతించి వేరువేరగు,
జిలిన్ సంక్షేపరీతి బలికెద తెలియన్.''

తుదకు వాస్తుశాస్త్రము - శిల్ప శాస్త్రము.

''హరిహరమందిర రథస,
త్వర విగ్రహ చిత్రకర్మ వాస్తు విధంబుల్
ధర గృహ గోపుర నిర్ణయ,
సరణిన్ వివరింతు శిల్పశాస్త్రము వెలయన్.''

''భాద్రపదము మొదలు ప్రాగాది మూడేసి,
నెలలు వాస్తు పురుషుడలరు నాల్గు
దిశల నతని చరణదిశ సూర్యుడుండును,
నెరిగి విడివి వాస్తు విడగవలయు.''
''గృహమునకు వలయు ధారుణి,
వహి నిర్పదెనిమిది పాళ్లు వాస్తు పురుషుడా
రహిపదు నొందూర్ధ్వాంగము,
విహితత పదియారు క్రిందు పీటికి నడుమన్''

''ఓడల బండ్లున్ తీవెల,
జాడలునవి యూర్ధ్వముల ప్రశస్తము సస్య
క్రీడారామ గృహక్రియ,
లోడక నిమ్నాడ్కి-సేయ నురుశుభములగున్''

ఈ విధముగా ననేక విషయములతో గూడిన యైదాశ్వాస ముల ప్రబంధమిది. ఇట్లు చక్కని ధారాళమైన శైలిలో నన్నిశాస్త్ర విషయములను, దేశీయ సంప్రదాయ రీతులను వివరించుచు ఐహికాముష్మికములను రెంటిని సాధించుటకు దోడ్పడు గ్రంథములు మన భాషలో చాల తక్కువ.

'గోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు :

# ఆంధ్ర మహాభారతము : ఆశ్రమ జీవితవ

ఆశ్రమ జీవితము అంటే - అరణ్యాల్లో ఆశ్రమాలేర్పరచు కొని అచ్చట నివసించే వారి జీవితము - అన్నమాట. ఈ ఆశ్రమ శబ్దము రెండు విధాలుగా ఉపయోగింపబడు తుంది. ఒకటి - వర్ణాశ్రమ ధర్మములు - అన్న సందర్భంలో. వర్ణములు- నాలుగు - బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములు. ఇవి పుట్టుకతో నేర్పడేవి. అల్లాగే ఆశ్రమములు కూడా నాలుగు - బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము అని. ఇవి ఒక జన్మలోనే లేదా జీవితంలోనే నాలుగు భిన్నావస్థలు. ప్రస్తుతం మనం పరిశీలింప దలచుకొన్నది ఈ ఆశ్రమాలను గురించి కాదు. ప్రాచీన కాలంలో మనదేశంలో మనకు మహత్తర విజ్ఞానాన్ని అందజేసిన మహర్షులు అరణ్యాల్లో అనువైన చోట్ల నివాసాలేర్పరచుకొని, కుటుంబాలతో శిష్యవర్గంతో అక్కడే నివసిస్తూ ఉండేవారు. అచ్చటి ఆ మహర్షుల నివాసాలకు కూడా ఆశ్రమాలని పేరు. మహాభారత కాలంలో ఈ ఆశ్రమా లెట్లుండేవో అందు నివసించు మహర్షుల జీవితా లెట్లుండేవో కొంచెము తెలుసుకుందాం.

అసలు హైందవ విజ్ఞానం - సంస్కృతి అనే వాటికి ఆరణ్యక విజ్ఞానము సంస్కృతి అనే ప్రసిద్ధి ఒకటి ఉన్నది. హిందుచేతనంటే ఇదంతా అరణ్యాల్లోని ఆశ్రమాల్లో నివసించిన భారతీయ మహర్షుల మూలంగా ఏర్పడి పెంపొందినది గనుకనే. మొదట చిరకాలము క్రితము ప్రాచీనార్యు లీదేశంలో ప్రవేశించినపుడు అది అంతా అరణ్యమయంగా ఉండేదిట. ఎవరో కొందరు ఆటవిక జనం, దస్యులు, నిషాదులు అనే వారచ్చటచ్చట ఉండి, పైనుండి వచ్చిన ఆర్యులతో పోరాడుతూ వారి స్థావరాలకు, పురోగమనానికి అడ్డంకులు కలిగిస్తూ వచ్చినా, కొంత కాలానికి ఈ ఆర్యులు వారికన్నా బలవంతులు, నాగరికులు అగుటచేత, వారిని లోబరచుకొని, తమ సంఘంలో నాల్గవ జాతి వారినిగా జేర్చికొని, వారితో ఐక్యపడి, తమ నాగరికత నీదేశమున వ్యాప్తి గావించుచూ వచ్చారు. క్రమంగా నా యార్య మహర్షులు అచ్చటి ఆటవిక జనాన్నే గాక, ప్రకృతిలోని విశ్వమును గూడ ఆత్మ భావముతోనే చూడగలిగినారు గనుక, అచ్చటి జంతుజాలమును వృక్షజాతులను గూడ ఎంతో సానుభూతితో ప్రేమతో జూచుచు తమకు స్వాధీనమగునట్లు చేసుకోగలిగినారు. అచ్చటి జంతువులు తమ సహజ వైరభావమును గూడ మరచి వారిని సేవిస్తూ ఉండేవి. కాబట్టే అరణ్యాల్లోని ఆ ఆశ్రమాలు శాంతి భద్రతలు గలిగి పుష్పఫలమూలాదిభరిత ములై, మహర్షుల తపోవనాలుగాను, భారతీయ విద్యా కేంద్రాలుగాను, ఆధ్యాత్మిక సాధన స్థానాలుగాను, అనాథ శరణాలయాలుగాను ఉపయోగిస్తూ ఉండేవి. పట్టణా లేర్పడి క్షత్రియ ప్రభువులు ధర్మపరిపాలన సాగించుచున్నప్పుడు కూడా, అరణ్యాల్లోని ఈ ఆశ్రమాలకు దుష్ట మృగములవలన బాధ లేమీ కలుగకుండా చూచుకుంటూ, తమ కేమైన బాధలు కలిగినపు డాయాశ్రమాల్లోని మహర్షుల సలహాలను సహాయమును పొందుతూ ఉండేవారు. పాశ్చాత్య దేశాల్లో ప్రకృతితో మానవుని కిట్టి సానుభూతి ఉన్నట్లు కనబడదు. దీనికొక చక్కని ఉదాహరణం చూపినారు రబీంద్రనాత్ టాగోరు. ప్రాచీన కాలంలో ఆర్యుల వలెనే ఇటీవలి కాలంలో యూరోపియనులు కొందరు అమెరికా అరణ్య భాగాల్లో ప్రవేశించారు. వారికి కూడా దేశీయులగు అనాగరిక జాతుల తోను ప్రకృతితోను పోరాటము కలిగింది. కాని అది తుదివరకు సాగుచునే వచ్చినది. అతడక్కడ ప్రకృతితో పోరాడి స్వాధీనం చేసికొని, దాని మూలంగా తన ఐహికానుభ వములను, ప్రాభవమును పెంపొందించుకొన గలిగినాడే కాని, దానితో తన సానుభూతినిగాని, ఆత్మభావమును గాని వ్యక్తపరుపలేకపోయినాడు. కాబట్టే ప్రాచీన హిందూదేశము నందలి యడవులట్టి మహర్షుల యాశ్రమములకు స్థానములై నవి. హైందవ నాగరకత, సంస్కృతి యచ్చటినుండియె పెంపొందినవగుటచేత ఆరణ్యక నాగరకత - సంస్కృతియని పేరొందింది.

పట్టణాల్లోని ప్రభువులు మృగయాసక్తులై అరణ్యాల్లో సంచరించినా, సామాన్యంగా ఆశ్రమాల కవరోధమేమి కలుగ కుండా చూచుకొనేవారు. మృగయాసక్తుడై సేనలతో నరణ్యమునకు పోయిన దుష్యంతునకు పదక్రమ వేదధ్వనులు, అవిచ్ఛిన్న హూయమా నాగ్నిహోత్ర స్వాహాశబ్దములు, విద్వత్సభా సంభాషణ ఘోషణంబులు, వేదార్థ మీమాంసక గోష్ఠీ వివాద నాదంబులు ఇవన్నీ దూరమునుండే వినబడ్డాయి.

పీనిని బట్టే అది ఒక ముని ఆశ్రమమని నిశ్చయించా డతడు. అరణ్యాల మధ్య మునుల ఆశ్రమాలరిలే ఇలా ఉండేవన్న మాట. ఆ తపోవన వృక్షముల రామణీయకమును జూచుచు దగ్గర పోయేసరికి, అక్కడ చెట్లమీద చిలుకలు సామగానం చేస్తున్నాయట. ఆ గానాన్ని వినుచు నిలబడిన ఏనుగుల శీతలచ్ఛాయలో సింహాలు పడుకున్నాయట. ఎలుకలు పిల్లులు కలసి సహజ వైరాన్ని మరచి, ఆ ఆశ్రమవాసులు పెట్టు నీవారాన్న పిండాలను తింటున్నాయట. ఇదంతా చూచి ఆ కణ్వ మహాముని తపః ప్రభావమే గదా అని ఆశ్చర్యపడి, ఆశ్రమవాసులకేమీ బాధ కలుగకుండా తన సేనను అమాత్యు లను దూరముగా నిలిపి, తానొక్కడే ఆ మునీంద్రునకు నమస్కరించి రాబోయినాడు. ఆ అరణ్యంలోని కందమూల ఫలాదులే ఆ యాశ్రమవాసులకాహారం. వచ్చిన అతిథులను ఆసనార్ఘ్యపాద్యాది విధులతో పూజించి, ఆ ఫలమూలాదుల తోనే తృప్తి పొదించేవారు.

వాల్మీకి మహర్షి తన ఆశ్రమ సమీపము నందలి యరణ్యములో విడువబడిన సీతను, తన యాశ్రమమునకు దీసికొని వచ్చి శరణమిచ్చినట్లే, తల్లిదండ్రులచే విడువబడి, పక్షులచే పెంచబడుచున్న అనాథశిశువగు శకుంతలను తన యాశ్రమమునకు దెచ్చి తన కుమారికగా పెంచి పెద్దదాన్ని చేసినాడు. దుష్యంతుడామెను గాంధర్వ విధిని వివాహం చేసుకొన్నాడు. ఇట్లే ఆశ్రమాలు బహుళార్థసాధకములైన తపోవనాలుగా ఉండేవి. కొన్ని ఆశ్రమాల్లో మహర్షులు లోక కళ్యాణాన్ని సాధించడానికిగాను సత్రయాగాలు జరుపుతూ ఉండేవారు. నైమిశారణ్య పుణ్యక్షేత్రంలో శౌనక మహాముని ఒకసారి ద్వాదశ వార్షిక సత్రయాగం చేసినాడట. అనగా పంద్రెండేళ్లు అవిచ్ఛిన్నంగా జరిగే యాగమన్న మాట. ఈ శౌనక మహాముని ఒక కులపతి. కులపతి అనగా పదివేలమంది మునుల కన్న వస్త్రము లిచ్చి వేదాధ్యయనము చేయించేవాణ్ణి కులపతి అంటారు. అంటే ఆతని ఆశ్రమం ఒక పెద్ద విశ్వవిద్యాలయం వంటిదన్న మాట. ఇంతేగాక ఆతడు బ్రహ్మర్షి గణ సముపాశ్రితుడై యుండి ద్వాదశ వర్ష సత్రయాగాన్ని మొదలుపెట్టినాడు. ఆ యాగము జరుగుతూ ఉంటే అక్కడ చేరిన మునులకందరికి సూతుని వంటి పౌరాణికులు వచ్చి అనేక పుణ్య కథలను వినిపిస్తూ ఉండేవారు.

ఈ భారత కథ కూడా ఆ సత్రయాగం జరుగుతూ ఉంటే, పుణ్యకథా కథన దక్షుడైన రౌమహర్షణి చేత అలా చెప్పబడినదే. భారత కథా నాయకులగు పాండవులు 12 ఏండ్లు అరణ్యావాసము చేయవలసి వచ్చినప్పుడు, ఆయా అరణ్యాలలో ఉండే తపోవనాలు, అందలి మహర్షులతోడి సాంగత్యము, వారు చేసిన బోధనలు, వారివలన విన్న పుణ్యకథలు, వారికి చిత్తశాంతికి, కార్యసాధనకు చాలా ఉపకరించినవి. కొన్నాళ్లు ద్వైత వనంలో ఉన్నారు. అది సకల కాల కుసుమ ఫల భరితము. మయూర కోకిలాలాప మధురము. విమల శీతలజలప్రవాహ నదీశోభితము. మహర్షి గణ సేవితమై యుండినది. పిదప కామ్యకవనమున మునులచే నభినందితుడై ధర్మజాడుండగా కృష్ణుడు సత్యభామాదులతో గూడి చూడవచ్చాడు. నారదుడు, మార్కండేయుడు వచ్చి అనేక పుణ్యకథలు చెప్పి వారికి దుఃఖోపశమనము చేసినారు. తార్యుడనే మహామునీంద్రుని ఆశ్రమ మొకటున్నది. ఆ ముని యొక్క ఆ ఆశ్రమము యొక్క ప్రభావ మెట్టిదో చూడండి - ఆతడంటాడు. ''విను మెన్నడు మా యాశ్రమమున నెవ్వారలకు లేవు భూరిభయ వ్యా ధి నిరోధ మృత్యు దోషాద్యనేక దోషములు త్రిజగదాశ్చ ర్యముగన్.''

ఇది నిజంగా ఆశ్చర్యకరమైన విషయం కాదూ మరి. కారణ మేమంటే ఇది అస్మదీయ ప్రభావ మూలం బన్నాడు ఆ ఋషి. హైహయుడను రాజు అచ్చటి బ్రాహ్మణ బాలుని మృగమనుకొని కొట్టినాడు. కొట్టి పశ్చాత్తాపుడై ఆ ఋషి యొద్దకు వచ్చి పాప పరిహారమును వేడినాడు. కాని ఆ బాలుడు చావనే లేదట. కారణం ఆ ఆశ్రమంలోని ధర్మ జీవన ప్రభావమేనంటాడు. ఆ జీవనమెట్టి దయ్యా అంటే - ''ఆలస్యం బొక యింత లేదు శుచి యాహారంబు, నిత్యక్రియాజాలం బేమర, మర్చనీయులతిథుల్ సత్యంబ పల్కం బడున్ మేలై శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిం దాల్తు మట్లౌటనె క్కాలంబున్ బటు మృత్యురోగ భయ శంకం బొందమే మిమ్ములన్'' అన్నాడు.

ఇట్లే యాశ్రమాలు అనేక విద్యలు, మహిమలు, శక్తులు గలిగిన అనేక తాపసులకు ఋషులకేగాక, వానప్రస్థాశ్రమ మవలంబింప దలచిన రాజర్షులకు గూడ ఆవాస స్థానముల య్యేవి. చిరకాలము ధర్మ పరిపాలనము చేసి వృద్ధులైన రాజులు రాా ము కుమారుల కప్పగించి, మోక్షకాంక్షులై తుదికాల ము తపోనుష్ఠానములతో గడపుట కీయాశ్రమాలను చేరే వా . యయాతి ప్రకృతి జనంబుల నొడబఱిచి కుమారుడగు పూరునకు రాజ్య మిచ్చి తపోవనంబున కరిగి నియతాత్ముండై అనేక వర్షంబులు తపంబు సల్పి, దేవలోకంబునకు, బ్రహ్మలో కంబునకు వెళ్ళినాడట. అట్లే దుష్యంతుడు పెద్దకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి రాజ్యంబు భరతునకిచ్చి తపోవనం బున కరిగినాడు. భారత యుద్ధానంతరము ధర్మరాజు రాజై రాజ్యము సేయుచుండగా, ధృతరాష్ట్రుడు ధర్మజాని యొక్క, పౌర జానపదుల యొక్క అనుమతిని బడసి, గాంధారియు తుడై, కుంతీ విదుర సంజయులు కూడ తోడరాగా

హస్తినాపురము వీడి, గంగానది దాటి యొక పుణ్యాశ్రమమున నుండగా, అచ్చట తపస్సు చేయుచున్న శతయూపుడను రాజర్షి వీరిని తన యాశ్రమమునకు దోడ్కొనిపోయి ఆతిథ్యమిచ్చి తన యాశ్రమ సమీపమున పర్ణశాలలు వేయించి వారినందు నివసింపగోరెను. అది చాల పుణ్య ప్రదేశమని ఆయాశ్రమములో శతయూపుని తండ్రి తాతలు తపస్సు సలిపి యింద్రలోకమును బొందినారని, ధృతరాష్ట్రాదులు నుత్తమగతి పొందుదురని నారదుడు వచ్చి చెప్పినాడు. పిదప కొంతకాలంబునకు దమ్ముచూడవచ్చిన ధర్మజాదులకు ధృతరాష్ట్రుడు తానుపయోగించు వన్య ఫలమూలాదులనె యాహారముగా బెట్టగా వారు వానినె గ్రహించి భూమిపైనే శయనించి నిద్రించి అట్లు కొంతకాలముండి వీరతి కష్టముతో హస్తినాపురమునకు బోయిన పిదప ధృతరాష్ట్రాదులు వాయుభక్షణ జలభక్షణాది తీవ్రవ్రతములాచరించుచు తుద కరణ్యామార్గముల సంచరించుచు కార్చిచ్చు తమ్ము చుట్టుకొనగ యోగ మార్గమున తనువుల వీడి సద్గతిని బొందిరి. అరణ్యములలోని ఆశ్రమము లీ విధముగా భారతీయ మహర్షుల జీవితములకు, సంస్కృతికి పట్టు కొమ్మలై యొప్పినవి.

''న వా అరే పుత్రస్య కామాయ పుత్రః ప్రియో భవతి,
ఆత్మనః కామాయ పుత్రః ప్రియో భవతి''

"It is not that thou lovest thy son, because thou desirest him, but thou lovest thy son, because thou desirest thine own self."

"Whomsoever we love, in him we find our own soul in the highest sense. The final truth of our existence lies in this. Paramatman, the supreme soul is in me, as well as myson, and my joy in my son is the realisation of this truth."

— Tagore's SADHANA. (శ్రీ 'కోరాడ' వారి డైరీనుంచి)

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు:

# ఆంధ్రమహాభారతము : సాంఘిక జీవిత

వెనుకటి కాలంలో కంటే ఈ కాలంలో రోజులు త్వరగా మారిపోతున్నట్లున్నాయి. ఈ విషయం చిన్న వాళ్లగు విద్యార్థులంతగా గుర్తింప లేక పోవచ్చుగాని, పెద్ద వాళ్లంతా బాగా గుర్తిస్తారు. రోజులు మారినాయనేది సినీమాలో కూడా ప్రసిద్ధి కెక్కింది. వెనుకటి కాలంలో మార్పింత త్వరితంగా జరుగుతున్నట్లుగా కనబడేదికాదు. మార్పులకు కారణమే మిటీ అంటే "సర్వాధారః కాలః" అని, అన్ని మార్పులకు కారణము కాలమేనని పెద్దలంటారు. కాని కాలాన్నిబట్టి కలిగే ఆ మార్పులకు కూడా రాజే కారణమని "రాజా కాలస్య 'కారణం" అని చెప్పే వారు కూడా కొందరు లేకపోలేదు. ఏమయినా మహా భారత కథా కాలంనాటి అనగా పాండవదుర్యోధనాదుల కాలం నాటి సాంఘిక జీవితానికి, ఈ నాటి సాంఘిక జీవితానికి చాల తేడాలు మాత్రం కనబడతాయి.

కాని యీ మార్పులనేక మిటీవలి కాలమున పెరుగుతూ వచ్చినవేకాని, ఆంధ్ర భారత రచనా కాలం నాటికీ-అనగా చాళుక్య ప్రభువగు రాజనరేంద్రుని కాలంనాటికి కూడా అంతగా పెరుగలేదనీ, సంఘస్థితి ప్రాచీనాదర్శాలు వెనుకటివే అప్పటికింకా నిలిచియున్నాయని, రాజనరేంద్రు గూర్చి నన్నయ చెప్పిన మాటలే నిదర్శనమౌతాయి. రాజనరేంద్రు డెట్టివాడో చూడండి. త్రిమూర్తులను పూజించి తత్ప్రసాద ముచే మహీరాజ్య విభవమును పొందినవాడు. దానగుణాభిరతి గలవాడు. సమస్త వర్ణాశ్రమ ధర్మ రక్షణ మహామహిమన్ మహినొప్పు సర్వలోకాశ్రయుడు. ఆదిరాజ నిభుడు, మను మార్గవర్తనుడు. విప్రకులము నెల్ల బ్రోచుచు దేవభోగముల దనరజేయువాడు. ఇట్లు దైవ బ్రాహ్మణభక్తి, వర్ణాశ్రమ ధర్మరక్షణము, దాన గుణాభిరతి మొదలగునవి భారతదే శంలో మనుమార్గ వర్తనులగు నాదిరాజుల చరిత్రకు సంబం ధించిన లక్షణాలు. యయాతి వర్ణ ధర్మముల్ గాచుచు వసుధ యెల్ల ననఘచరితుడై యేలినాడు. దుష్యంతు డుర్వీతలము ప్రజాసమృద్ధి వెలసి ధర్మ చరిత వెలుగుచు నుండన్ ఆదిక్షత్ర చరిత్ర నేలినాడు. పరీక్షిత్తు- అతని కొడుకు జనమేజయుడు ధరణి యెల్ల రక్షించిన ధర్మచరి తులు. రాజర్షులై ప్రజల ధర్మ చరితను గాపాడుచు పాలించుటయే ఆ కాలపు-ఆదిక్షత్ర చరిత్ర. ఇవి కేవలము కులబ్రాహ్మణుల స్తోత్రపాఠాలేమో అని ఇప్పుడు అందరకు తోచవచ్చును గాని, చాల కాలము వరకు ధర్మ రక్షణమే క్షత్రియ ధర్మముగా పరిగణింపబడినదనుటకు సందేహము లేదు.

ఈ వర్ణాశ్రమ ధర్మములు పూర్వ జన్మ సంస్కార ఫలితములే యని సామాన్య జనులలో గూడ గట్టి నమ్మకముండుట చేత, వర్ణాశ్రమ ధర్మతత్త్వము హైందవ సంస్కృతికి మూలాధారము వంటిదైనది. పాశ్చాత్య సంసర్గ ప్రభావము కూడా దీనిని కూలద్రోయలేక పోయినది. ఆధునిక నాగరికత ప్రభావము, ప్రపంచ పరిస్థితులను బట్టి ఇది రూపుమాసి పోవచ్చును. కాని గుణకర్మ విభాగము వలన గలుగు భేద మెల్లపుడు నుండునదే. ఎట్టి సామ్యవాదమైనా దీనిని త్రోసిపుచ్చ జాలదు. సంస్కార భేదము వలన గలిగిన యీ వర్ణాశ్రమవ్యవస్థ సంకరము గాకుండ ధర్మ మార్గమున ప్రజలను నడుపుచు పాలించుటయే ఆ కాలపు రాజులు తమ ధర్మముగా గ్రహించెడివారు. సామాన్య ప్రజలును తమ ధర్మములను నిర ర్తించుచు తమ వృత్తులను నడుపుచుండెడి వారు. ఈ దేశ జలకు జన్మాంతరములందు లోకాంతరము లందుగల యీ మ్మకమును బట్టియే, దేవాంశ సంభూతులు కొందరప్పుడప్పుడు లోక కార్యములను నడుపుట కవతరిం తురను నమ్మకము కూడ నుండెడిది. భీష్మాది భారత వీరులందరు దేవదానవుల యంశమున బుట్టినవారు. కలి-దానవుల యంశమున దుర్యోధనాదులు యమేంద్రాదుల యంశమున ధర్మరాజాదులు పుట్టిరి. కావుననే వీరికి పోరు తప్పలేదు. కొందరి జన్మలు విచిత్రమైనవి. ఈ కాలమునకు వికృతములె. ద్రోణుడు కుంభమునందు పుట్టినాడు. ద్రౌపది, ధృష్టద్యుమ్నుడు అగ్నికుండమున, భీష్ముడు గంగకు పుట్టి నారు. వ్యాసుడు ఓడనడుపు పల్లెదానికి పుట్టినాడు. ఇంతెగాక సంతానము లేని వంశములను నిలబెట్టుటకు నియోగమను పద్ధతి యొక టుండెడిది మునులు క్షత్రియ స్త్రీలకు సంతానమును గల్గించెడివారు. ఆ విధముగ వేదవ్యాసుని గడ్డము జడలు చూచి కన్నులు మూసుకొన్న స్త్రీకి

ధృతరాష్ట్రుడు గుడ్డివాడుగా జన్మించినాడు. మరియొకమారు వెలవెలబోవుటచే తెల్లని రంగుగల పాండురాజుదయించి నాడు. రాక్షస స్త్రీకి భీముని వలన ఘటోత్కచుడను రాక్షసుడె కలిగినాడు.

క్షత్రియు లనేక కన్యలను వివాహమాడుట కలదు గాని, ఒక స్త్రీకనేకులు పతులగుట హైందవ సంప్రదాయముగా గానరాదు. భిన్నదేశీయమో జాతీయమో కావచ్చు. కాబట్టే తండ్రి ద్రుపదుడుకూడా దీనిని శంకించడం, మహర్షులువచ్చి జన్మాంతర కథలతో దీనిని సమర్థింపవలసి రావడం తటస్థించింది. క్షత్రియస్త్రీలకు స్వయంవరం అని ఉండేది. అనగా తండ్రిచేసిన ప్రకటనను బట్టి అచ్చటకూడిన రాజలోక మునుండి తానుకోరిన వరుని వరించి వివాహమాడుట. ఈ సందర్భములో హతాశులైనవారు యుద్ధమునకు దిగుటో లేదా మరొక విధముగా సాధించుటోకూడ కలదు. ద్రౌపదీ స్వయంవరంలో కర్ణదుర్యోధనాదులు యుద్ధమునకే దిగి నారు. దమయంతీస్వయంవర సందర్భంలో కలిపురుషుడు దంపతులకు వియోగము కల్పించి చాలా బాధలకు లోను చేసినాడు గాంధర్వము రాక్షసములను వివాహరీతులుకూడా క్షత్రియులలో ఉండేవి. శకుంతలను దుష్యంతుడు గాంధర్వవి ధిని పెండ్లాడినాడు. కృష్ణుడు రుక్మిణిని రాక్షసవిధి నెత్తుకు పోయి పెండ్లి చేసుకొన్నాడు. సామాన్యముగా కన్యలు తాము వరించినవారినైనా పితృదత్తలై వారి యంగీకారముతోగాని భర్తలను బడసేవారుకారు. సుభద్ర అర్జునుని వరించినా, అతడు గాంధర్వరాక్షసములు క్షత్రియుల కుత్తమ వివాహంబు లని చెప్పినా - ''నన్ను నీనర్థు లెల్ల నిందున్నవారు వార యెరిగి చేయుదురన్నదిగాని' అతనిమాటల కిష్టపడలేదు. హిందూధర్మములో అగ్నిసాక్షిగా జరుగు వివాహవిధి చాలా ముఖ్యమైనది. ద్రౌపది వివాహమును భూసురేంద్ర పుణ్యాహ రవ-వివిధ తూర్యవేణువీణారవములతోను, మంత్రాహుతుల వ్రేల్చుటతోను - పాణిగ్రహణముతోను - సరిపెట్టగా, తిక్కన ఉత్తరావివాహమును క్రంత నడవడం, వధూవరుల మధ్య తెరయెత్తడం, వారు తలంబ్రాలు పోసుకొనడం, పాండవాదులకు కట్టనిచ్చి, అల్లున కరణమివ్వడం మొదలైన వాటిని వర్ణించాడు. వీనిలో కొన్ని ఆంధ్రదేశీయాచారాలుగా కనబడుతాయి.

ఏమైనా ఆ కాలంలో స్త్రీకి సంఘంలో ప్రబలమైన స్థానమే ఉండేది. తమ పాతివ్రత్యమాహాత్మ్యంచేత వారాస్థానానికి మరింత శోభ కల్పించుకున్నారు కూడా. తన భార్య ఎక్కడో పౌష్య మహారాజు ధరించిన కుండలాలు కావాలని కోరిందని, ఉదంకుని గురు వామె కోరిక తీర్చడమే గురు దక్షిణగా అతనికి నియమించాడు. ఉదంకుడూ సమయం తప్పకుండా ఎన్ని కష్టాలైనా పడి తీసికొనివచ్చి ఆమెకిచ్చి గురువుగారి ఋణం తీర్చుకున్నాడు. ద్రౌపది కౌరవసభలో వేసిన ప్రశ్నలు, అరణ్యవాసంలో పాండవులస్థితి చూచి దుఃఖముతో ధర్మజుని యుద్ధమునకు ప్రేరేపించు వాక్యములు, సంధిరాయబారమునకు బోవుచున్న కృష్ణునితో నామెయాడిన తీవ్రపుమాటలు, కీచకవధకై భీముని ప్రేరేపించిన విధము, పుత్రఘాతియగు నశ్వత్థామను విడిచిపుచ్చిన హృదయరీతి, రాయబారమునకు వచ్చి తనను జూడవచ్చిన కృష్ణునితో కుంతి తన కొడుకులను గూర్చిచెప్పిన యుద్ధప్రేరకములైన మాటలు - మొదలగునవాకాలములో స్త్రీలకార్యదక్షతను కొంతవరకు సూచింపగలవు. గాంధారి మహాపతివ్రత. తనను ధృతరాష్ట్రుని కివ్వదలచాడు తండ్రిఅని విన్నంతనే తానుకూడా కన్నులకు అడ్డము కట్టుకొనినదట. పతివ్రతయగు భృగు పత్ని నెత్తుకుపోయిన రాక్షసుడు, గర్భచ్యుతుడగు చ్యవనుని చూచినంతనే భస్మమైపోయాడు. దమయంతి తన పాతివ్రత్య మహిమచేతనే అరణ్యమున తనవెంటదగిలిన కిరాతుని భస్మముచేసినది. సావిత్రి భర్తజీవములను గొంపోవుచున్న యమునివెంట దగిలి తన భర్తను మృత్యువునుండి కాపాడి నది. ఒకసారి ద్రౌపదిని చూడవచ్చి సత్యభామ అడిగిందా మెను - నీ కైదుగురు భర్తలుగదా! వారందరు నీయందనుర క్తులై ఉండేటట్లు ఎలా ఉంటున్నావో, వ్రతము ంపా, మం షధ వైభవమా, నేపథ్య కర్మకౌశలమా - మిటి కార ం అంటే - నన్నిట్టి దుష్టవనితగా జనునే లపన్ - నీ పురుషోత్తమ వనితవు కాదగవు - అని మందలించి - ''ఎ రి యిచ్చవచ్చినట్లు మెలంగుటయేగాని మగువ నీవు సెప్పు నింద్రజాలములును నేనెఱుంగ'' అని చెప్పగా సిగ్గుపడి, ''ఎరుగక అట్లడిగినాను, నా నేరముసైపవలయు నగవుగ గనుమీ'' అని సర్దుకొన్నది. ద్రౌపది సైరంధ్రీవేషము కుదుర్చుకొనుటకు 'నిజదేశాచారముపై నల్లియున్న జడ యగు కబరీభారంబువిచ్చి - వలపల దిక్కున కించుక మల గంగా తుఱుమిడినదట. ఆమెకు పుష్పదామరచన గంధకారి తనము మొదలగు శిల్పములలో ప్రావీణ్యము కలదు. ఆ కాలపు స్త్రీల విద్యలో నృత్తమొకటి ప్రధానము. విరటు డుత్తరను నాట్యాచార్యుడగు బృహన్నలకు ''కర్పూరతాం బూలంబువెట్టి చీనాంబరంబులు'' ఆభరణంబులు ఇచ్చి మరీ ఒప్పగించాడు. అనేక సందర్భాలలో నీ తాంబూల ప్రదాన మొక సాంఘికాచారంగా కనబడుతుంది. పాండవులయొద్ద నుండి సంధిమాటలకై వచ్చిన బ్రాహ్మణునకు ధృతరాష్ట్రుడు భూషణాంబరంబులతో తమ్ములంబువెట్టి వీడుకోలిచ్చి పుచ్చి నాడు. తుదకు దుర్యోధనుని వద్దనుండి వచ్చి పరుషంబులు పల్కిన ఉలూకునకుగూడ ధర్మనందనుడు తాంబూలాభర ణంబులిచ్చి పంపినాడు.

రాజులు ధర్మాన్ని కాపాడుటయేకాక ప్రజలకెట్టి కష్టములు కలుగకుండా చూచేవారు. యుద్ధానికి వెళ్లేటప్పుడుకూడా ఋష్యాశ్రమములకు, దేవతాయతనములకు నలజడి గాకుండ పరిహారంబు సేయుచు జనినాడు యుధిష్ఠిరుండు. దుష్యంతుడు కణ్వాశ్రమమునకు బోవునప్పుడాశ్రమ జనుల కేబాధ కలుగకుండుటకుగాను తన సైన్యములను దూరమున నిలిపి వెళ్లినాడు. విప్రుని ఆర్తనాదము వినినంతనే అర్జునుడు వ్రతనియమమునుగూడా నుల్లంఘించి ద్రౌపది ధర్మజుడు నున్న ఆయుధాగారమున ప్రవేశించి ఆయుధములను గొని అతివీరులైన చోరుల వధించి బ్రాహ్మణునికి గోధనం బిచ్చి, మర్యాదాభంగంబుకంటె దుర్యశంబెద్ది లేదని చెప్పి ద్వాదశ మాసిక వ్రతము నలుప తీర్థయాత్రకు బోయినాడు. తస్కరవధ-తదుపేక్షల వలన అశ్వమేధ భ్రూణహత్యల ఫలంబగునని వేదంబుల వినంబడునట. కొన్ని సంకట పరిస్థితులలో నీ తీర్థయాత్రలకు బోవుట ఒక వ్రతము - మనశ్శాంతికి కారణము అవుతుంది. కృష్ణుడు తాను రాయబారము నడిపి సంధిచేయలేకపోయినాడను కోపముచేనే పక్షమునను యుద్ధము చేయనొల్లక బలరాముడు ఆ సమయమున తీర్థయాత్రకు పోయినాడు. పాశుపతాస్త్ర సంపాదనకైపోయిన అర్జునుడు తిరిగిరాకుండుటచే - మన శ్శాంతికొరకు ధర్మజుడు తీర్థయాత్రకు బయలుదేరినాడు. రాజు పురప్రవేశము చేయునప్పుడు పణ్య పుణ్యాంగనలు అక్షతయుతమౌక్తికముల సేసలు చల్లుట, పౌరజానపద జనంబులు స్తుతిపాఠము లొనర్చుట ఒక ఆచారము. ఈ పౌరజానపద జనమును తృప్తి పఱచుటయేకాక, అనేక సందర్భములలో రాజు వారి యాజ్ఞపొంది మరీ ప్రవర్తింపవలసి యుండెడిది. ధర్మజుని రాజ్యాభిషేక సందర్భమున విద్వత్స మూహంబు, వైశ్య ప్రముఖ పౌరవర్గంబు, హలికాది జానపదా వలులు వచ్చి, సత్కారములనొంది సేవించియుండిరి. ఆ సమయమున చలిపందిరులు సత్రంబులు, తటాకంబులు దేవగృహంబులు కట్టించెను. అశ్వమేధ యజ్ఞము చేసిన ధర్మజుడు విప్రులకు దక్షిణలిచ్చిన యనంతరము రాజులకు, వైశ్యులకు, శూద్రరాజి, కన్యజాతులకు, మ్లేచ్ఛులకును బ్రభూతధనము లిచ్చెనట.

ఆకాలమున రాజులు వర్ణ ధర్మములను కాపాడినట్లే ఆశ్రమధర్మములనుగూడా కాపాడు చుండెడివారు. విద్యార్జన కాలమున బ్రహ్మచర్యము వలెనే వార్ధక్యమున రాజ్యమును కొడుకుల కప్పగించి వానప్రస్థాశ్రమమును స్వీకరించేవారు. ధృతరాష్ట్రుడు వనవాసమునకుబోవు సందర్భమున పురజనుల యాజ్ఞ బడయవలయునని ధర్మరాజుతో జెప్పగా నాతడు వారిని బడిసేసి తెప్పించినాడు. బ్రాహ్మణ క్షత్రియవైశ్య శూద్ర సంకులంబై యున్నదా నగరప్రజ. వారి ననుజ్ఞ వేడగా వారు మిగుల దుఃఖించి శంబువను బ్రాహ్మణుని మూలముగా వారియనుమతిని దెలియజేసినారు. పురుషులేకాక స్త్రీలును వానప్రస్థాశ్రమమును స్వీకరించేవారు. ధృతరాష్ట్రునితోపాటు గాంధారియేగాక, కుంతియు కొడుకులు వారింపజూచినను వినక -

''రాజ్యఫలముగామింప, పుత్రా సమగ్ర
తపమునకు ఫలమైన యుత్తమగతి ప్ర
సిద్ధిగోరుదు, నది గల్గఁజేత కిట్టి
తోడు మరి నాకు గలుగునే దురితదూర''

అని చెప్పి, వారల నొప్పించి పోయినది.

రాజులలో ద్యూతక్రీడ, పానము ప్రబలముగా నుండెను ధర్మజుని ద్యూతక్రీడాసక్తి నాధారము చేసికొనియే, శకుని యధర్మ ద్యూతము మూలముగా నాతని వంచింపదలచుట - అదియె భారత యుద్ధమునకు దారితీయుట తటస్థించినది. నలుడు-విరటుడు కూడ ద్యూతక్రీడాసక్తివలన దెబ్బతిన్న వారే. కీచకునింట వాచవియగు మదిరాసవ ముండెడిదట. మదిరాపానమత్తులయియే యాదవులు తమలో తాము పోరు కొని నాశము నొందిరి. పెక్కు జన్మములందలి పుణ్యమువలన సంపాదించిన జ్ఞానమునుకూడ నీ మద్యసేవ క్షణమాత్రంలో చెఱచు నను విషయమును స్వానుభవమువలన దెలిసికొన్నాడు గనుకనే శుక్రుడీ సురాపానము మహాపాతకముగా శపియించినాడు. స్త్రీలు పరలోకగతులైన భర్తలతో సహగమన ముచేయుటకూడ నాకాలమున గలదని పాండురాజుతో మాద్రి సహగమనము చేయుటనుబట్టి తెలియ వచ్చుచున్నది.

ఇట్లు ప్రధానముగా భారత, వేదకాలమున సాంఘిక జీవనమున ధర్మమార్గ ప్రవర్తనమునకు ప్రాధాన్యము కలదని వ్యక్తమగుచున్నది.

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు :

# సాహిత్యంద్వారా చరిత్ర : ఆచార వ్యవహారాలు

సాహిత్యం ద్వారా చరిత్రను తెలుసుకొనుటకు మన ముద్దేశించినప్పుడు అసలు సాహిత్యానికి చరిత్రకు గల సంబంధ మేమిటో, దీనిలోగల భేదమేమో అనే విషయాన్ని కొంచం తెలుసుకోవాలి. సామాన్యంగా ఏభాషలోనైనా ప్రతిభావంతు లగు మహనీయులు, కవులు రచించిన గద్యపద్య ఉభయమయ మైన రచనలన్నీ తద్భాషా సాహిత్యంగా పరిగణింపబడుతూ ఉంటవి. ముఖ్యంగా రసోదయము భావస్ఫూర్తి కలిగించే రచనలన్నీ సాహిత్యంలో చేరుతవి. అయితే ఒకప్పుడు ఒక భాషలో కొందరు పెద్దలచే సాహిత్యంగా గ్రహింపబడని పద ములు, పాటలు, యక్షగానాలు, శాసనపద్యాలు మొదలైనవి కూడా ఇప్పుడిప్పుడు సాహిత్యంలో చేర్పబడుతున్నాయి. సర్వాధారః కాలః అన్నట్లు సర్వము కాలాధీనము. 'నీచైర్గచ్ఛ త్యుపరి చ దశా చక్రనేమిక్రమేణ' ఆ కాలచక్రంతో పాటు స్థితిగతులు కూడా క్రిందికి మీదికి తిరుగుతూ ఉంటాయి. మానవ చరిత్ర, సాహిత్య చరిత్ర కూడ అట్టివే. ఇలా క్రింద మీదు పడుతూ ఉండే మానవులచరిత్ర నాధారంగా చేసుకునే, వారివారి భాషలలోని సాహిత్యం కూడా ఏర్పడుతుంది. కాబట్టి ఒక జాతి చరిత్రకు అందలి భాషాసాహిత్యాలకు చాలా దగ్గిర సంబంధమే ఉన్నదన్నమాట. అయితే - చరిత్ర అనగా ఇప్పుడు కేవలము రాజులకు - పరిపాలన పద్ధతులకు సంబంధిం చిన శుష్క వార్తా సంఘటనాత్మకములగు రచనలుగా పరిణ మించుటచేత దానికి సాహిత్యంలో స్థానం లేకపోతోంది. రసో ద్బోధకములు గాని యట్టి శుష్కరచనలు - శాస్త్రగ్రంథములు - నిఘంటువులు - పాఠపుస్తకములవంటివి సాహిత్యమున చేరవు గదా. కాని ఆ జాతి జీవిత చరిత్రను మాత్రము వదలి తద్భాషా సాహిత్యము పెంపొందలేదు. సాహిత్యము జాతిజీవిత చరిత్రకు ప్రతిబింబమే అని కూడ సాహిత్యవేత్తలు చెప్పుదురు. కేవల చరిత్రకారునివలె కాక సాహితీ పరుడా చారిత్రక సంఘట నలకు దన ప్రతిభాశక్తిచే జీవము పోసి, భావనాబలముచే నా పూర్వకథ మరల మన యెదుట జరుగుచున్నట్లుచేసి, కళా సౌందర్యముమ గల్పించి దాని మూలముగా తన హృదయము నావేశించి యున్న జీవితపరమార్థ మేదో దాన్ని సూచించడా నికి ప్రయత్నం చేస్తాడు. ఈ చేయడంలో కథ పూర్వపుదైనా కవి తన అనుభవాలను, తన దేశకాలపరిస్థితులను, జీవిత విశేషాలను, ఆచార వ్యవహారాలను, జాతీయ ధర్మాలను వ్యక్తప రుస్తూనే ఉంటాడు. కాబట్టే ఆయా భాషలలోని సాహిత్యం ద్వారా ఆయా కాలపు చరిత్రాంశములనే గాక అప్పటి జీవిత పద్ధతులను ఆచారవ్యవహారములను గూడ మనము తెలిసికొన డానికి సాధ్యమవుతున్నది.

మనదేశంలో మనకు ప్రాచీన సాహిత్యాన్ని ప్రసాదించిన మహనీయులకు చరిత్రరచనా విషయంలో ఇప్పటి వారికు న్నంత శ్రద్ధ ఉన్నట్లగపడదు. పురాణాలలో వంశానుచరితమొక భాగమైనా ఆధునిక దేశ చరిత్ర వంటిది మనకు లేదని కొందరా క్షేపించుటయు కలదు. కాని వారి దృష్టి వేరు. మానవ సంఘము ధర్మబద్ధమై చిరస్థాయిగా వర్ధిల్లు మార్గమునే యన్వేషించి, అట్లు ధర్మమార్గ ప్రవర్తకులగు చారిత్రిక పురుషుల జీవితములనే వర్ణించుచు మహాకావ్యముల రచించి సామాన్యజనుల జీవిత పథమును నిర్ణయించుటకే వారు యత్నించిరి. కాని సామా ని త్యకృత్యపు చారిత్రక సంఘటనలను గూర్చి వారంత[ ర్ధ వహించిన ట్లగవడదు. ఈ కారణం చేతనే హైందవ జా కి చరిత్ర గ్రంథములు లేక పోయినా ప్రాచీన హైందవ సాహిత్యం ఆ జాతి జీవిత చరిత్రను తక్కిన ప్రపంచజాతుల చరి అన్నిటి కంటె సువ్యక్తముగా దెలుపగలుగుతున్నది. దీనిని బ చూస్తే, వేదకాలములో, నార్యజాతి చాలవరకు ప్రత్యక్ష వమగు సూర్యుని యుపాస్తియందు మునిగి యుండి, యుషః కాంతుల రామణీయకమునకు ముగ్ధులగుచు, నెత్తిమీది యనంత కోటి ఖగోళ గ్రహసంచారమును గాంచి దిగ్భ్రమజెంది వాని తేజ స్సులో సర్వాంతర్యామియగు నారాయణుని స్వరూపమే గాంచి, ఆతనిని యజ్ఞపురుషునిగా భావించి క్రతు విధానమున సేవింపగడంగిరని, పిదప నా పూజింపబడు పరతత్వమునకు, పూజించు నీ యపర వ్యక్తికిని, వీనికి చుట్టును పరిదృశ్యమాన మగు నీ ప్రపంచమునకు గల సంబంధమును గూర్చిన చింతలో గొంతకాలము మునిగియుండిరనీ, మరికొంతకాలమునకే క్రతు విధానముతో దృప్తినొందని కొంద రాత్మశిక్షణము, అహింసా సన్యాసముల మూలముగా బుద్ధత్వమును బొందుటయే తర ణోపాయముగా గ్రహించి నేల నాలుగు చెరగుల నీ బుద్ధ ధర్మమును ప్రచారము చేయ గడంగిరనీ, అనంతరము విదేశీ యుల మూలముగా స్వీయ ధర్మమునకు గలిగిన

ప్రమాదములను ప్రతిఘటించి ఆధ్యాత్మిక దృష్టి, ధర్మచింత, వర్ణాశ్రమములు ప్రధానలక్షణములుగా గలిగిన యార్యధర్మము నాసేతుహిమాచలము స్థాపింపగలిగిరనీ తెలియ వచ్చుచుండు టచే, కాలముతో పాటు ముందుకు త్రోసుకొని వచ్చుచుండిన యీ యార్యధర్మమే యీ దేశీయుల ప్రాచీన చరిత్రకు ముఖ్యని దర్శన మగుచున్నదని చెప్పవలసియున్నది. ఈ నడుమ అనార్య సంపర్కము వలన గలిగిన ప్రత్యవాయములను, దస్యులు రాక్షసులు మొదలగు వారివలన గలిగిన బాధలను దొలగించికొని సర్వలోక హిత దృష్టితో ఆర్యధర్మమును సంఘ వ్యవస్థను పెంపొందించిన మహాపురుషులు - రాజన్యులు మొద లగువారి చరితమే రామాయణ భారత పురాణాదుల మూల ముగా మనకందింపబడినది. వీనియందు కేవల చరిత్రకంటె ఆర్యజాతి సభ్యతకుమూలమైన ధర్మజీవిత చరిత్ర , సాంఘికా చార వ్యవహార పద్ధతి - హెచ్చుగా నుండును. అంతమాత్రము చేత, అది కాల నిర్ణయమున కనువు పడకపోవుటచేత, నా చరిత్రము సర్వాంగ సుందరము కాదనుకోవలసిన పనిలేదు. రామరాజ్యమప్పటికి నిప్పటికి గూడ మన కాదర్శ రాజ్యమే గదా. దుష్యంతమహారాజు పరిపాలనమును గూర్చి నన్నయ గారి పలుకులలో వినుడు: ''ఆదుష్యంతుడనంత సత్త్వుడు - ఆది క్షత్రచరిత్రనేలె నజితుండై బాహువీర్యంబునన్ - అతని రాజ్యంబున నట నుర్వీతలము ప్రజాసమృద్ధి వెలసి, శోకా, తంక, క్షయ, శంకా, పేతంబై, ధర్మచరిత బెరుగుచునుండె'' నట. ఈ యుర్వీతలమున నీ ధర్మచరిత పెంచిన రాజా గుణాభిరతిన్ - సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమ న్మహి నొప్పు సర్వలోకాశ్రయుడాది రాజ విభుడే - అత్యకలంక చరిత్ర సంపదన్'' - అని. ఇక అతడే చెప్పుకొన్న మాట లివి - అతని యెడబాయవట - ఏవి? ''భూదేవ కులాభి తర్పణ మహీయః ప్రీతియున్, భారత శ్రవణాసక్తియు, బార్వ తీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవమున్, సంతత దాన శీలతయు, శశ్వత్సాధు సాంగత్యమున్'' - చాళుక్యుల నాటి యుట్టి హైందవ ధర్మ పరిరక్షణ నిరతియే, తరువాతి కాలమున దక్షిణ దేశమునుండి మహమ్మదీయ దండయాత్రల నరికట్టు టకై విద్యారణ్య మహామునుల సహాయముతో విజయనగర రాజ్య స్థాపనమునకు దోహదమై యా కాలపు టాంధ్రదేశ చరిత్ర యాంధ్ర సాహిత్యమున వెల్లి విరియునట్లు చేసినది.

ఇటీవలి కాలమున ప్రతాప చరిత్ర, కృష్ణరాయ విజయము, రాయ వాచకము, బొబ్బిలి విజయము వంటి చరిత్ర గ్రంథ ములే కొన్ని బయలు దేరినను రాజాస్థానములలోని కవులు తమ ప్రభువులకు గృతి నిచ్చునాచారము, ఆ సందర్భమున వారి వంశాదికము గుణగణము వర్ణించు నలవాటు ప్రబలుటను బట్టి, సాహిత్యమే చరిత్రజ్ఞానమునకు గూడ తోడ్పడుచు వచ్చినది. నన్నపార్యుడు కృత్యాదిని రాజమహేంద్రుని మహత్వ ప్రశంసతో దాటివేసినను ఆనాటి తెలుగు దేశపు వైదికాచార సంపత్తిని మాత్రము అనఘమై శిష్టాగ్రహారభూయి ష్ఠమై ధరణీ సురోత్తమాధ్వర విధాన పుణ్యసమృద్ధమై పొలుచు వేగీ దేశ విభవంబును విపులముగా వర్ణించి వ్యక్తము చేసినాడు. ఆ ప్రాచీన వైదికాచారములు కొన్ని అతని కాలములో సులభ ముగ నర్థమయ్యే వేమోకాని, మిక్కిలి మార్పులకు లోనగు చున్న యీ కాలములో మాత్రమా పలుకుబడి, ఆచారము సులభముగ, బోధపడవేమో అని తోచును. అట్టివి ఒకటి రెండు మాత్రము. భృగుడను విప్రుడు మగువ పులోమయన్ దానిని ''అగ్ని హోత్రార్థ మగ్నులను విహరింపుమని పంచి, అభిషేచ నార్థము పోయె''నట. పువ్వుల తోటలో విహరించుట అంటే అర్థమగునేమోకాని, అగ్నులను విహరించుట అంటే ఈ కాలపు స్త్రీలకెవ్వరి కైనా తెలుస్తుందా అని సందేహము. స్త్రీలకే కాదు పురుషులలోనూ ఈ యాజ్ఞిక సంప్రదాయం తెలుసుకొన్న వారికి గాని తెలియక పోవచ్చు. పురుషులలోను అగ్ని హోత్రాలు చేసే వారీ కాలంలో ఎంతమందున్నారు గనక. హోమార్థమై మూడు కుండములలో గార్హపత్యాగ్నిని, ఆహవ నీయం, దక్షిణాగ్ని అని విహరించి- విభాగించి ప్రజ్వలింప జేయుటయే విహరించుట యగును. ఇట్లు చెప్పి భృగు వభిషేచనార్థము పోగా నింతలో పులోముడన్ రక్కసుడు వచ్చి ఇది నాకు తొల్లి వరింప బడిన భార్య అని అగ్ని తో జెప్పి దాని నెత్తుకొని పోయినాడట. భృగుపత్నిని రాక్షసుడు ''నాకు వరింపంబడిన భార్య'' అంటాడేమిటి అని మనకు వికృతంగా తోచవచ్చు. ఈ కాలంలో ఒకని భార్య నింకొకరు వరించుట అనేది లేదు గనుక. ఒకని భార్య నింకొకడు వరించుట అంటే తప్పుకూడాను ఈ కాలంలో. కాని సామాన్యంగా మనకర్థం తెలియక గుర్తింప లేక పోతున్నా ఇప్పటికీ మన యిండ్లలో జరుగు పెళ్లిళ్లలో మనల చేత పురోహితుడు రెండేసి రూపా యలు కన్యావరణాలని పెట్టించి చేతుల్లో వేసుకునే ఆచారాన్ని మనం జ్ఞాపకం చేసుకుంటే - రిజిస్టరీ మారేజీలతో ఈ ఆచారం కూడా పోయినట్లే లెండి - ముందు పురోహితుడు వెళ్లి వరుని కొరకు - కన్యను వరించి వచ్చుట - ఆపైని వరునికి వివాహము జరుగుట - ఒకప్పుడు అట్లొకనికై వరింప బడిన కన్య మరియొ కరిని వివాహ మగుట కూడ - తటస్థించుననీ మనకు వ్యక్తమవు తుంది. ఈ సందర్భంలోనే లాంఛనంగా 'మదర్థం కన్యాం వృణీధ్వం' (మీరు నా కొరకు కన్యను వరించవలసినది) అని కన్యావరణాలు పురోహితుని చేతుల్లో పెడతారు. ఈ ''మదర్థం'' ఇత్యాది వాక్యము తలపునకు వచ్చిననే గాని ''నాకు వరియింపంబడుట'' అను నన్నయగారి చతుర్థీ కారక ప్రయోగ మర్థము కాదు. ఇలాగే అతిథిని క్షణియించు నాచారం కూడా ఈ కాలంలో అర్థం కావడం కష్టమే. ఉదంకుని - పౌష్యుండు

అయ్యా, నీ వతిథివి మా యింట గృత భోజనుండవై పొమ్మని క్షణియించెనట. ఇట్లు పిలుచుట 'క్షణః క్రియతాం'' అని కర్థినాలు పెట్టే అలవాటున్న వాళ్లకే బాగా అర్థమవుతుంది.

ఇలాగే అనేకాచారాలు మారిపోతూ ప్రాచీన సాహిత్యాన్ని పట్టి తెలుసు కోవలసినవిగా ఏర్పడు తున్నాయి. నన్నయ ద్రౌపదీ వివాహంలో తిక్కన ఉత్తరా వివాహ సందర్భంలో వర్ణించిన దేశీయాచారాలు చాలా వర్ణించలేదు. వధూవరుల నడుమ తెరచీర పట్టడం, తలంబ్రాలు పోయించడం, ఏకాసన మందుండి హోమము చేయుట, పాండవులకు వాసుదేవ పురస్సరంగా, కర్పూరాది సుగంధిద్రవ్యంబుల దాంబూలం బుల తోడ కట్టనిచ్చుట, అల్లున కరణ మిచ్చుట మొదలగు వానిని అతడు వర్ణించలేదు ఆకాలంలో లేవేమో! ఈ తాంబూల మిచ్చు నాచారము వివాహాదులలోనే గాక పెక్కు సందర్భములలో గాన వస్తుంది. అది యొక గౌరవ సూచకము. ప్రభువులు కవులను కర్పూర తాంబూలములు వెట్టి చీనాంబర ములతో మన్నించుటొక యాచారము ఇది యొక కార్యభార మును వహింప నంగీకార సూచకము కూడాను. నన్నిచోడుని కు.సం.లో తారక సంహారమునకు గుమారోత్పత్తిని సాధించు టకై పార్వతి యందు శివునికి మరులు గొల్ప మన్మథుని నింద్రుడు ప్రేరేపించినపు డాతడు ''నాకిది యేమి గహనంబు · నాకుందగిన కెలసంబుగంటి దీని కింతకు మైకొంటి- దాంబూలంబు దయ సేయుమని'' చెప్పి సురరాజుచే నపార సత్కారంములం గొనెనట. వివాహ సందర్భములలో దాంబూ లంబుల గొనుట నిశ్చయ సూచకము.పాచకులకు, పాటగాం డ్రకు, ఆటకత్తెలకు తాంబూలంబిచ్చి వచ్చుట అనగా బేరము నిశ్చయమగుట. ఇట్లు మన దేశములో నీతాంబూల దాన ప్రయోజన మపారముగా నున్నది. ఇక నీ వీటికానుభవ పారస్యమును గనవలెనంటె కృష్ణరాయల కాలమునకు బోవలె. అటు తిరిగి నంతనే ''మృగ మద సౌరభ విభవ ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధ స్ఫగితే తర పరిమళమై మగువ పొలుపు దెలుపు నొక్కమారుత మొలయన్.'' ఇంతకు పూర్వమే శ్రీనాథుని కస్తూరి కేక కూడా వినవస్తూందీలాగు. 'అక్షయ్యం...కస్తూరికా భిక్షాదానము సేయరా సుకవిరాట్ బృందారక శ్రేణికిన్, దాక్షారామ పురీ విహార వరగంధర్వా ప్సరో భామినీ వక్షోజద్వయ కుంభి కుంభములపై నాసించు నద్వాసనల్''-అవి.

ఈ రీతి గుమగుమలు పూర్వకవుల సాహిత్యంలో అంతగా గనబడవు. వైదిక నిష్ఠతో పాటు ఆత్మబలము రసికత్వము పెరుగుచున్న కాలమది. మహమ్మదీయ సంసర్గము కూడ నొక కారణ మేమో. కృష్ణరాయాసిచే దెగి స్వర్గమునకు బోయిన యువభటులు అక్కడ కూడా ''సనకాదిదివిజమస్కారి ఫాల గోపిచందన పుండ్రవల్లికల్ నాకి నాకి, రంభా! ధానాప్సరః పృథూ రోజకుం, భంబులెచ్చట గన్న పట్టి ప '' సురతరు సురల మరిగి, హరిపురి తిరుగుదురట. శ్రీ 'ష్ణరాయలు వర్ణించిన యా కాలపు వైశాఖ పూజ ఈ నాటికిని నోరూరింపక పోదు-పరిపక్వ సురభి రంభా ఫలంబుల తోడ, దళమెక్కు పనసపెన్ దొనల తోడ, ఘృత పిండనిభ శర్కరా ఖండముల తోడ, బలు తెరంగులమావి పండ్ల తోడ, గోస్తనీ మృదు గుళుచ్ఛ స్తోమముల తోడ, కప్పు దేరిన వడపప్పు తోడ, సుమధుర స్థూల దాడిమ బీజముల తోడ, దనువార రసదాడి గనెల తోడ పానకం బతిథులకు నిడ్డ దాను గ్రోలి, యర్చనా దత్త చందన చర్చ దేలి, విరులు సిగదాల్చి కర్పూర వీటి జౌరు కొట్టుచు ద్విజులు వెన్నెలలో విహరింతురట! రాయలకాల మున కొంత పెరిగిన వైష్ణవమతాభిమానము, దక్షిణదేశమున నాయక రాజుల ప్రాభవమున కొంత విజృంభించి సంగీత సాహిత్యములతో నాట్యపద కవిత్వాదుల మూలముగా వ్యక్తమై నను సామాన్యముగా తెలుగు దేశమున తొలుత నన్నయ తిక్కనలు స్థాపించిన వైదిక ధర్మాద్వైతతత్త్వములే పాదుకొని పోయినవి కాని వైష్ణవరసికత అంతగా కాలూనినట్లగపడదు. ఇటీవలి చెన్నపురిలోని తెలుగువారు కూడా వైదిక మతాచార సంపత్తి నెట్లు నిలుపుకొని యుండిరో శంకర విజయకర్తయగు ఆలూరి కుప్పన యిట్లు వర్ణించినాడు:

''శ్రీ పార్వతీశ లక్ష్మీశసేవా సము
    పార్జిత మహనీయ భాగ్యయుతులు
ఘటనాఘటన సముత్కట మనీషాతి
    చమత్క్రియాధోరణీ మంజు మతులు
కలిత యజనాది విహితషట్కర్మ నిరత
    సారలౌకిక వైదికాచారభృతులు
చతుర చెన్నపురీచర త్పచివతతులు.''

ఇక నిటీవలి కాలమున, పాశ్చాత్యసం సర్గము, విదేశీయాను కరణము ఆంగ్ల విద్య మొదలగునవి సంఘజీవితమున గలిగిం చిన మార్పులు సాహిత్యమునను బొడసూపినవి. ఈకాలపు సాంఘికాచార వ్యవహారములయందు గలిగిన మార్పును బ్రద ర్శింపగల గ్రంథములు - గురజాడవారి కన్యాశుల్కము, వీరేశ లింగంగారి సంఘ సంస్కరణోద్యమములను దెల్పురచనలు, విశ్వనాథవారి నవలలు మొదలగునవి ఇంకను క్షణక్షణము సంఘమున గలుగుచున్న భావపరిణామమున కిప్పటి ఖండకా వ్యములు, నాటికలు, కథలు మొదలగునవియు నిదర్శనములే గదా. కాని సాంఘిక వ్యవస్థ - జీవిత పద్ధతి అతి త్వరితగతిని మార్పునొందుచున్న యీ ప్రజాస్వామిక యుగములో బయలు వెడలు ప్రజాసాహిత్యము భారతీయ సంప్రదాయ విజ్ఞాన సూత్ర ముల నతిక్రమింపక ధర్మబద్ధంబైన మార్గమును సూచించునది మాత్రము కావలయునని ఆశింతము.

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు :

# వారిధి చూపిన వసుధ : నౌకలు - నావికులు

వారిధి చూపిన వసుధ - నిజమే. ఏమంటే మనము నివసించే యీ భూమి వారిధి చూపినది కాదూ మరీ - అనగా సముద్రములో నుండి బయలువడినదే గదా. ఉపనిషత్తుల్లో చెప్పినట్లు సృష్టిక్రమాన్ని బట్టి చూచినా ''ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః - అద్భ్యఃపృథివీ'' అన్నట్లు ఉదకము నుండే ఈ భూమిపుట్టినట్లు తెలుస్తోంది. ఇక పురాణగాథలను బట్టి చూస్తే, ఒకప్పుడు ప్రపంచకమంతాజలమయమై ఉన్నదనీ, ఆ చీకటిలో జలమధ్యమున విష్ణుమూర్తి వటపత్ర శాయియై ఉంటాడనీ, సృష్టి సమయంలో భూమి బరువై సముద్రంలో మునిఁగే ఆ భూమిని పైకెత్తి ఫణిరాజు పడగలపై నిలిపినాడని ఒక గాథ కానవస్తుంది. దీన్ని బట్టి వసుధ, వారిధి లోనుండియే పైకి వచ్చినట్లు తెలుస్తోంది. అయితే ఇప్పుడు భూగోళముపైనే కొంతజలభాగము కొంత భూభాగముగా ఉన్నదని మనం తెలుసుకుంటున్నాము. సముద్రములో నుండి ఏ భూభాగము ఎప్పుడెల్లా పైకి వచ్చినదో ఇప్పుడు మనం చెప్పలేము. కాని, సముద్రముల మధ్యనున్న ఆయా భూభాగములలో నివసించిన మానవుడు సముద్రముల నెట్లు దాటి ఇతర భూభాగాల నెప్పుడెల్లా తెలుసుకోగలిగినాడు, అనేదే మన మిప్పుడు పరిశీలించవలసిన విషయం. కాబట్టి వారిధి చూపిన వసుధ అంటే ఈ విధంగానే మన మిప్పుడు అర్థం చేసుకోవాలి.

ఒక్కొక్క భూభాగాన్ని చుట్టి ఉన్న వారిధిని తరించడానికి మానవుడు చేసిన ప్రయత్నాలేమిటి, ఇప్పుడు మనకు తెలిసిన భూభాగాలు ఖండాలు ప్రాచీనులకు తెలుసునా, భూమినంతా ఒక్కసారి చుట్టి వచ్చుటకు ఇప్పటి ఎయిరోప్లేనుల వంటివి వెనుకటి కాలంలో లేవేమో, ఈ భూభాగాల నెప్పుడెవరెల్లా కనిపెట్టినారు - అని విచారిస్తే - రామాయణంలో పుష్పక విమానాన్ని గూర్చి వింటామేకాని, అట్టివి సామాన్య మానవుడికాకాలంలో ఈ కాలంలో వలె అందుబాటులో నున్నవో లేవో చెప్పలేము. కాని అతి ప్రాచీన కాలము నుండి మానవుడు సముద్రములను దాటి యితర భూభాగములను కనిపెట్టి వానితో వాణిజ్య వ్యాపారములను సలిపి, వాని నాక్రమించుటకు గూడ యత్నించినది నౌకాయానము మూలముగానే యనుట నిశ్చయము. అతని ధైర్యసాహసములే ఇందాతనికి చాల తోడ్పడినవి.

తక్కిన పెక్కు సాంస్కృతిక విషయములలో వలెనే ఈ నౌకాయాన విషయములో కూడా భారతీయుల చరిత్రయే అత్యద్భుతమైనది. కాని ఇటీవలి కాలములో మనము దాన్ని మరచిపోవడము చేత, ఇతరులు కొందరు దాన్ని మరుగుపరుపయత్నించడంచేత, పోర్చుగల్, స్పెయిన్, ఇంగ్లండు మొదలగు పాశ్చాత్య దేశాల వారగు వాస్కోడి గామా, డ్రెక్ మొదలగు వారు క్రొత్త దేశాలను కనిపెట్టి భూమిచుట్టూ తిరిగి వచ్చినారన్న విషయాలను తెలుసుకొంటున్నామేగాని, ప్రాచీనకాలంనుండి నిర్వహింపబడుచున్న భారతీయ నౌకా నిర్మాణ పద్ధతులను గూర్చికాని, భారతీయ నావికుల సాగరోత్తరణ సాహస నైపుణ్య లక్షణములను గూర్చిగాని మనము గుర్తెరిగిన వారము కాలేదు.

ఆయా కాలములలో స్వదేశీయులు - విదేశీయులు చేసిన రచనలను బట్టి ప్రాచీన భారతీయ శిల్పములను బట్టి నాణెములను బట్టి భారతీయ నౌకానిర్మాణ నావికా వ్యాపారముల మహత్తర చరితను సమకూర్చి రచించిన మహనీయుడు రాధాకుముద్ ముఖర్జీ అను వంగ దేశీయపండితుడు. హిందువుల నౌకాయాన చరిత్రను దెలుపు విషయములనేకములు ప్రాచీన హైందవ సారస్వతమున గలవని బుహలర్ పండితుడు కూడ తెలిపియున్నాడు.

భారతీయుల యీ నౌకాయాన చరిత్ర ఋగ్వేదకాలము నుండియే ప్రారంభమగుచున్నదని చెప్పవచ్చును. ఏలయనగా ఋగ్వేదమునందే, వరుణునకు నౌకలు పోవు సాగరమార్గములన్నియు దెలియు ననియు, నా కాలమున ధనాశాప్రేరితులైన వణిజులు దూరదేశములతో వాణిజ్యమునకై సముద్రము నలుమూలలకు నౌకలను పంపుదురనియు, దెలుపబడియున్నది. ఇంతేగాదు, తుగ్రుడను రాజర్షి భుజ్యుడను తన

కుమారుని, దూర ద్వీపములందు గల శత్రువులపై నౌకలలో దండయాత్ర పంపినపుడు, ఆ భుజ్యుని నౌకలు తుపానుచే సముద్ర మధ్యమున భగ్నము కాగా, శతారిత్రములు 'నూరు' తెడ్లు గల ఓడలలో అశ్వినీ దేవతలు వచ్చి అతనిని కాపాడినట్లు ఋగ్వే. 1 మ. 116 సూ.లో చెప్పబడియున్నది. ఇది ఋగ్వేద కాలము నాటి కథ.

రామాయణము - కిష్కింధకాండలో సీతాన్వేషణమునకై సుగ్రీవుడు కపివరులను బంపునపుడు ''సముద్రమవగాఢాంశ్చపర్వతాన్ పత్తనానిచ'' అని సముద్రములోని ద్వీప పర్వత పట్టణములనెగిరే దారులను, 'భూమిశ్చకోషకారాణాం' కోష కారుల భూమిని కూడా వెతకమన్నాడు. అనగా కౌశేయములు పట్టు దారము పురుగుల నుత్పత్తి చేసే భూమిని అనగాచీనాదేశమును గూడా వెదకి రమ్మని పంపినట్లు అగపడుచున్నది. ''చీనాంశుక మివ కేతోః'' అని కాళిదాసు నాటికి చీనాంశుకము సుప్రసి మేగదా! సప్తరాజ్యోపశోభిత మగు యవద్వీపము, సుత రూప్యక ద్వీపము కూడ రామాయణమున పేర్కొనబ నవి. మహాభారతంలో ఒక చమత్కారమైన సందర్భం ఉంది. ప్రాణాపాయము నుండి తప్పించు కొనిన పాండవులు రహస్యముగా విదురుడు పంపిన జనులు కొందరు గంగానదీతీరమున నిర్మించిన ఒక ఓడలో తప్పించుకొని పారిపోయినట్లు తెలుస్తుంది వాళ్ళు చూపించిన ఓడ

పార్థానాం దర్శయా మాస
మనోమారుతగామినీమ్,
సర్వవాత సహాం నావం
యంత్రయుక్తాం పతా నికినీమ్
శివే భాగీరథీతీరే
నరైర్విశ్రంశిభిః కృతామ్'' (ఆది.)

మనోవాయు వేగం గలదట. సర్వవాత సహమైనదట - ఇంకా విశేషం ఏమంటే యన్త్ర యుక్తమట కూడాను. అంటే .(motar equipment) వంటి దేమైన నుండెనేమో ఆ రోజుల్లో కూడా.

అయితే మరికొంత కాలానికి బోధాయనాపస్తంబాది సూత్రకారులు బ్రాహ్మణులకు సముద్రయానాన్ని నిషేధించారు. మనువు సముద్రయానం చేసిన బ్రాహ్మణుడు శ్రాద్ధ భోజనానికి పనికిరాడన్నాడు. ఇక బౌ యుగంలో జాతకకథ లను బట్టి, సింహళ గాథలను బ క్రీస్తుకు పూర్వము 500 సం. ప్రాంతంలో విజయుడ వంగ దేశపురాజ కుమారుడు దేశము నుండి బహిష్కృతుడై 700 మంది అనుచరులతో అనేక నావలలో బయలుదేరి వెళ్లి సింహళమున రాజ్యస్థాపకుడైనట్లు, ఆ కాలంలో తామ్రలిప్తి సింహళము మధ్య అనవరతము ఓడలలో రాకపోకలు జరుగుతున్నట్లు తెలుస్తుంది. కళింగ దేశము నందలి దంతపురమునుండి బుద్ధుని దంతమును తీసికొని సింహళమునకు పోవుచున్న దంతకుమారుని ఓడలు కృష్ణా ముఖద్వారమున వజ్రాల దిన్నె యొద్ద మెట్ట ఎక్కగా, తెలుగుదేశంలోని నాగరాజొక డాతనికి స్వాగతమిచ్చి ఆదరించి మరల నోడల నెక్కించి పంపినట్లు, అమరావతీ శిల్ప చిత్రములలో నౌక దానిని బట్టి తెలుస్తుంది. అప్పటి ఓడలు 300 మంది వర్తకులు తమ సామానుతో సుఖముగా ప్రయాణము చేయుటకు దగినవిగా నుండేవట. ఆ కాలమున పారసీకపు రాజధాని బాబిలానుతో వా పారము జరుగుచుండెడిదని గ్రీసు ఈజిప్టు, రోం, అ ।రియా మొదలగు యూరపు ఆఫ్రికాలోని దేశములకు మళ్లు, సుగంధ । వ్యములు, మణులు, ముత్యములు, కాశ్మీరశాలువులు, మ లు, రవసెల్లాలు మొదలైన వస్తువులను భారతదేశము ఎగు తి చేసి అపార ధనమును సంపాదించుటచేత సుభిక్షమై మిక్కిలి ధనవంతమైయుండెడిదని తెలుస్తుంది. ఇండియా మజ్లిన్‌లకై రోం దేశపు స్త్రీలు చాల మక్కువపడేవారట. ఇండియానుండి వచ్చు విలాసవస్తువులకై ఖర్చుపెట్టి ఏటా ఎంతో సొమ్ము కోలుపోవుచున్నదని ప్లినీ అను యాత్రికుడు చాల దుఃఖపడుచు వ్రాసినాడు.

బైబిల్ గ్రంథమును బట్టిక్రీ.పూ. 1000 సం. నాడే ఇండియానుండి గ కలప, ఏనుగు దంతములు, సుగంధ ద్రవ్యములు, నెమ , వస్త్రములు ఈజిప్టు వర్తకులచే కొని పోవబడుచుండెడివ తెలుపబడినది. ఇవి దక్షిణదేశమునుండియే పోవుచుండెననుటకు ఆ హీబ్రూ భాషలోని అహలిం, తూకి అనునవి తమిళమునందలి అగిల్, తోకై అనుపదముల వికారములగుటయే ప్రబల నిదర్శనముగా కనబడుతుంది. దీనిని బట్టి అతిప్రాచీనకాలమునుండి భారతీయ వాణిజ్యమును నడిపిన వారిలో దక్షిణదేశమందలి ద్రావిడ జాతులందరును ప్రాముఖ్యము వహించినట్లు తెలియుచున్నది. క్రీస్తుకు పూర్వము 7వ శతాబ్ది కాలంలో చైనాకు పోయి అచ్చట లాంగ్‌గా అనువలస నేర్పరచిన హిందువులు పెక్కు ఓడలలో వచ్చినారని ఆ ఓడల ముఖముల ముందరిభాగములు పక్షులు, జంతువుల ముఖములవలె నుండెడివని చైనా దేశపురచనలను బట్టి తెలుస్తుంది. క్రీ.త. బోధధర్మ అను దక్షిణ దేశపు రాజకుమారుడు 3000 బౌద్ధభిక్షువులతో చైనా దేశములో కాంటన్ పట్టణమున చేరినాడట మత ప్రచారము కొరకు. అక్కడ నుండి జపాన్ కూడ వెళ్లినాడని, మరియొకడు బోధిసేన అనునతడచ్చటివారికి సంస్కృతం నేర్పినాడని తెలుస్తుంది. క్రీస్తు శకారంభమున ఆంధ్రసామ్రాజ్యకాలము లోనే కంటకోసల, కూడూరు `రేవుల నుండి ఆంధ్ర దేశీయులు బర్మా సుమత్రా జావా కాంబోడియా మొదలగు

ద్వీపములలో అధినివేశరాజ్యముల నేర్పరచు కొనుట యేగాక అక్కడ బౌద్ధ బ్రాహ్మణ మతములను హైందవ నాగరికతను చిత్రకళలను విస్తరింపజేసిరి.

ఇట్లు దక్షిణ బర్మా దేశమునకు తొలుత పోయి యాక్రమించిన తెలుగు వారచ్చట 'మన్' జాతిస్త్రీలను వివాహమాడి యొక సామ్రాజ్యమును స్థాపించుటచే, నారాజ్యపు జనులందరికీ ''తెలైంగు'' అను పేరు కలిగిన దని బర్మా చరిత్ర కారుడగు 'పెయిర్'అను నతడు తెలుపుచున్నాడు. ఈ తలైంగు రాజ్యము సుమారు క్రీ.శ. 12వ శతాబ్ది వరకు నుండెనట. కళింగ దేశమునుండి బౌద్ధభిక్షువులు మత ప్రచారమున కచ్చటి కంతవరకు బోవుచునేయుండిరట. దీనిని బట్టి కృష్ణా గోదావరీతీరములందలి తెలుగువారే క్రీస్తుకు పూర్వమున సముద్రమును దాటి దక్షిణ బర్మాలో నెలకొనిన వారని యేర్పడు చున్నది.

హిందూ దేశీయులు అతి చిరకాలమునుండి అపారమైన విదేశముల వాణిజ్యములు జరుపుతున్నట్లు తెలియవచ్చుచున్నది గాని, ఆ కాలంలో నౌకా నిర్మాణమును గూర్చిన గ్రంథములు విశేషముగ కానరావు. కాని ఇటీవల భోజ నరపతిచే రచించిపబడినదిగా చెప్పబడు 'యుక్తి కల్పతరువు' అను గ్రంథమొకటి మాత్రము బయలువడినది. అందు రత్న ఆశ్వగజ పరీక్షాది విషయములతోపాటు నౌకా నిర్మాణమును గూర్చి కూడ కొంత కానవస్తుంది. నౌకను నిర్మించడానికుపయోగపడు కలప బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర జాతులకు జెందినదిగా విభజించి - అందు బ్రహ్మ జాతిది తేలికగను మృదువు గను, క్షత్రియ జాతిది తేలికగను దృఢముగను ఉండుటచే నిదియే ప్రశస్తమని అగాధసముద్రములందు ప్రయాణమునకనువై సుఖసంపదల నిస్తుందని చెప్పబడింది. చెక్కల నతికించుటకు ఇనుపమేకులు వాడకూడదంటాడు. నదుల పై నడచునవి సామాన్యములు - సాగరమున నడచునవి, విశేషములు అని విభాగము చేసి వాటి పరిమాణములు వాని భేదములు పేర్లు, బంగారు, వెండి రాగితో అలంకరణము - వానికి వేసే రంగులు, వాని అగ్ర భాగములందు చెక్కవలసి సింహ, గజ, వ్యాఘ్ర, పక్షి, భేకాకృతులు - పక్షిమందిరములు - అగ్రమందిరములు, మధ్య మందిరములను భేదములను గూర్చి తెలిపియున్నాడు. సర్వమందిరములు రాజుల ధనమును, అశ్వములను, అవరోధజనమును తీసికొని వెళ్ళుటకట - మధ్యమందిరములు వర్షాకాలముననను, రాజులు విలాసార్థముగ ప్రయాణము చేయుటకట, అగ్రమందిరము నౌకా యుద్ధములందుపయోగపడునట.

మౌర్యుల కాలములో నౌకా నిర్మాణము ప్రభుత్వముచే నడపబడునొక పెద్ద పరిశ్రమగా నుండెడిది. చంద్రగుప్తుని యుద్ధకార్యాలయంలోని ఆరు విభాగములలో నౌకాధికారవర్గము (Board of Admirality) ఒకటై యున్నట్లు కౌటిల్యుని అర్థశాస్త్రమువలన తెలుస్తుంది. అందునావాధ్యక్ష పదవి చాలా బాధ్యతలతో గూడినదిగా కనబడుతుంది. అలెగ్జాండర్ యొక్క అపార సైన్యము దేశీయులు సమకూర్చిన రెండు మూడు వేల నావల మీదనే సింధునదిని దాటిందని చెపుతారు.

ఆంధ్ర రాజుల నాణెముల మీద ముద్రితములైయుండిన రెండు కొయ్యలు గల పెద్ద ఓడలే గౌతమిపుత్ర యజ్ఞశ్రీ మొదలగు వారి కాలమున జరుగు విదేశీయ వ్యాపారము, సముద్రములపై వారికి గల యాధిపత్యమును వ్యక్తము చేయుచున్నవి. ఇటీవల మార్కోపోలో హిందూ మహాసముద్రము నంతను విహరించు నౌకల నిర్మాణాదికమును గూర్చి చెప్పుచు వాటిని దేవదారు కర్రతో కట్టేవారని, అడుగు భాగమున రెండేసి చెక్కల చొప్పున మేకులతో బిగించేవారని, సందులలో జనప నారదూర్చి, ఒక చెట్టు నూనె సున్నము కలిపి కీలులాగు తయారుచేసి దానిపై పూసే వారని, అవి చాలా పెద్దవిగాను విశాలముగాను ఉండేవని వాటిని నడపుటకు రెండు మూడు వందల నావికులుండి తెరచాపలు తెడ్లు వీనితో నడుపుచు, వెంట రెండు మూడు చిన్న యోడల నేగాక, పార్శ్వములయందు పదిపంద్రెండు చిన్న నావలను వ్రేలాడగట్టి తీసికొని పోవుచుండెడివారని, ఉపరిభాగము అనగా (deck) కు క్రింది అంతస్తునందు ఇరువదిగదుల వరకు వర్తకుల యుపయోగము కొరకును, ఇంకను అడుగు భాగము కూడ దెబ్బతగిలినను నీరు చొరకుండ చిన్న గదులుగ చేసి చెక్కలను బిగించేవారని - వివరించి తెలిపినాడు. ఫిరోజిషా టుగ్లక్ - 'భట్టిరాజ్యంపై దండయాత్ర సలిపినపుడు 90 వేల అశ్వ సైన్యాన్ని 480 గజములను సుమారు 5000 ఓడలలో సింధు నదిమీద పంపినాడట.

రాజరాజనరేంద్రుని కాలములోను, కులోత్తుంగుని కాలంలోను విదేశీ వాణిజ్యము బాగా పెంపొందింది. కులోత్తుంగుడు చీనాచక్రవర్తి దగ్గిరకు రాయబారము పంపినట్లు, రాజేంద్రచోళుడు సింహళం మొదలగు ద్వీపాలను జయించి, లాకెడీవ్, మూల్ డివ్ ద్వీపాల వారితో నౌకాయుద్ధాలు చేసి విజయము గాంచినట్లు తెలుస్తుంది. వంగదేశ కావ్యాలు కొన్నింటిలో సముద్రవ్యాపారాన్ని గూర్చి తెలిపేవి కలవు. అందు తెలుపబడిన నౌకల పేర్లు గంగాప్రసాద్, సాగరఫేన, హంసవర, రాజవల్లభ అనునవి. ధనపతి సింహళము వెళ్లేటప్పుడు 7 నౌకలతో వెళ్లినాడట. అందు మధుకర అనునది చాలా పెద్దది. అందలి గదులు బంగారంతో మలామా చేయబడినవట - తక్కిన వానిలో కొన్ని 'దుర్గావర' సింహముఖి, చంద్రపాన అని పేళ్లు గలవి. తెలుగుదేశములో

ోటుపల్లి క్రీస్తు శకారంభకాలం నుండి గొప్ప రేవు ట్టణమని ప్రసిద్ధిగాంచింది. కాకతి గణపతి దేవుడచ్చటికి చ్చు నావికుల కభయ శాసనము వ్రాయించి కొన్ని ంల్కములను తగ్గించి యచ్చటి వ్యాపారం వృద్ధి అగునట్లు ేసినాడు.

రెడ్డి రాజుల కాలంలో ఎఱ్ఱాప్రెగడ మల్లారెడ్డిని గూర్చి ుట్లు చెప్పినాడు:

'బాహాదర్పమునంప్రతీపధరణీ
పాలావలింద్రోలి, యు
త్సాహోదగ్రుడు మోటు పల్లిగొని
సప్తద్వీప సద్వస్తుసం
దోహంబుల్ దనకిచ్చునెచ్చెలి
సముద్రుంప్రీతి గావించుమున్
మాహాత్మ్యంబు వహించె మల్లరథినీ
నాథుండు గాఢోద్ధతిన్''

ు కాలంలోని ఆంధ్ర సాహిత్యంలో మన దృష్టి పథానికి ప్పకవచ్చేది, కుమారగిరిరెడ్డి సుగంధ భాండాగారాధ్యక్షుడు వచితిప్పయ్య సెట్టి. అతని విదేశవ్యాపారమును వర్ణించిన శ్రీనాథుడు

''తరుణాసీర తవాయి గోవరమణా
స్థానంబులన్ జందనా
గరుకర్పూర హిమాంబు కుంకుమ రజః
కస్తూరికా ద్రవ్యముల్
శరధిం గప్పలి జోగులన్ విరివిగా
సామాన్ల దెప్పించు నే
ర్పరియే వైశ్యకులోత్తముం డవచి
తిప్పండల్పుడే యిమ్మహిన్''

ందులో కప్పలి - జోగులు - అని రెండు విధాల ఓడలను ెలిపినాడు.

తరువాత గోల్కొండనబాబుల కాలంలో ప్రాచీనంలో ుసోలియా అని ప్రసిద్ధి జెందిన కృష్ణా ముఖ ద్వారంలోని ుచిలీబందరు మరల ప్రసి ్కి వచ్చింది. 17వ శతాబ్దిలో చ్చిన ఫ్రాంసు దేశయా కుడు టెవెర్నియరను నాతడు ంగాళాఖాతములోనింత ఖ్యాతి గల రేవులేదని, సముద్రపు ిరినుండుటచే ఓడల రాక కలకు చాలవీలుగా నుండెడిదని, చ్చటి ఓడలు చీనా మక్కా హోర్మజు పట్టణములకు ుడగాస్కర్, సుమత్రా, మైనిల్లా దీవులకు బోవు చుండెడివని ప్పినాడు. ఇతరులు కూడ దీనిని గొప్ప నౌకాశ్రయమని, ర్తక స్థానమని చెప్పినారు. గోల్కొండ నబాబులకిది పెద్ద ్యపార స్థానముగా నుండెడిది. వారితర దేశముల నుండి, ద్వీపముల నుండి ప్రత్యేక నౌకలలో ఏనుగులను దెచ్చుకొను చుండెడివారట. ఒక్కొక్క ఓడలో 25 ఏనుగుల వరకు వచ్చెడివట. వెయ్యి టన్నుల బరువు గల ఓడలుండేవట వారికి. ఈ బందరు నగరములో 'మసూలా' అను ఓడలు తేలికగా నుండి చాల బరువును తీసికొనిపోయేవి. ఒంటి తెరచాప వేసుకొని తెడ్లతో కళాసులు నడుపు చుండెడివారట. కెటమరాన్ అనుపడవలు కూడ నిచ్చట నుపయోగములో నుండేవి.

బందరు తరవాత పెద్ద ఓడల నిర్మాణమున చిరకాలము నుండి ముఖ్యస్థానముగా నుండెడిది నరసాపురం. ఇక్కడ నౌకానిర్మాణమునకు దగిన మంచి కఱ్ఱ గోదావరి వరదలలో కొట్టుకొని వచ్చినది లభించేది. నిపుణులైన పని వారు ఉండే వారు. ఇచ్చట గోదావరి చాలా లోతుగా నుండుట చేత ఆకాలపు బ్రిటిషు నౌకాదళమంతా నిలవడానికి తగినంత విశాలముగా ఉండేదని మారిన్ దొరగారు వ్రాసారు. 17వ శతాబ్దిలో బ్రిటిష్ వారు కూడా వారి పెద్ద ఓడల నిచ్చటనే కట్టించుకొనే వారట. నక్షత్రములనుబట్టి ఓడలను చక్కగా నడపగలిగిన నావికులు కూడా నరసాపురంలో వుండేవారట.

గోదావరీ తీరమునందలి కోరంగి, తాళ్లరేవు గొప్ప నౌకాశ్రయములు. అల్బట్రస్ - అను బ్రిటిషు వారి యుద్ధ నౌక ఇచ్చట మరమ్మతు చేయబడినదట. విశాఖ పట్టణం కళింగపట్టణములు నౌకా నిర్మాణమున కాశ్రయములు. సహజనౌకాశ్రయ మగుట విశాఖ పట్టణమీకాలము నందు మరల పూర్వపుటౌన్నత్యమును బొందగలుచున్నది.

క్రీ.శ. 4వ శతాబ్దిలో చైనా యాత్రికుడు జావా సంపూర్ణ ముగా హిందూ జనులచే నిండి యున్నదని, తాను జావా నుండి సింహళము అక్కడ నుండి చైనాకు బోవునపుడు బ్రాహ్మణమతస్థులగు నావికులచే నడుపబడిన ఓడలలో వెళ్ళినట్లు చెప్పినాడు. 14వ శతాబ్దిలో ఫ్రయర్ ఒడొరిక్ అనునాతడు గుజరాత్‌లోని రాజపుత్ర నావికులు సముద్రంలో 700 జనముగల నౌకలో ప్రయాణము చేస్తూ, వారానౌకను నడపుటలో చూపిన నైపుణ్యమును చాల మెచ్చుకున్నాడు. సోమనాథ్ నుండి చైనాకు పోయే నౌకలను రాజపుత్ర నావికులే నడుపుతూ ఉండేవారట. ఒక్కొక ఓడ కలాసులు వందల కొలది ఉండే వారు. ఓడకు ప్రధానాధికారికి ''నఖుదా'' అనిపేరు. మాంతిగుడు నడపేవాడు. తండేలు కలాసులపై అధికారి. సరంగు - ఎగుమతి దిగుమతులను చూసేవాడు, ఇంకా నీళ్లు తోడేవాడు లెక్కలు వ్రాసేందురు మరికొందరు. ఈ రీతిగా వారిధిలోని ద్వీపాంతరాలతోను ఖండాంతరాల తోను వ్యాపారం చేసిన మన నౌకల యొక్క నావికుల యొక్క చరిత్ర మత్యద్భుతము.

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు :

# సంస్కృత తత్త్వ శాస్త్రమునకు ఆంధ్రుల సేవ

సంస్కృత సాహిత్యము అపారమైనది. ఈ లోకమునగల సాహిత్యములలో అతి ప్రాచీనమైనది కూడాను. మరొక విశేషమేమంటే - ''వేదో ధర్మ మూలం'' అని భారతీయ సనాతన ధర్మమునకు, తత్త్వ పరిశీలనకు గూడ మూలభూతమైన వైదిక వాఙ్మయమంతా - అనాదియని, అపౌరుషేయమని కూడా భారతీయులలో చాలమందికి గట్టి నమ్మకము కలదు. కల్పాంతర భేదమున కనుగుణముగా భారతీయ మహర్షులు సమాధ్యవస్థలో తాము దర్శించిన యాధ్యాత్మిక పరమార్థములను, దేశకాల వ్యవస్థానుగుణముగా వ్యక్తము చేసి, ఆ మహా విజ్ఞాన సంపదను మన కిచ్చిపోయినారు. ఆ వైదిక విజ్ఞానమే వేదములు, బ్రాహ్మణములు, ఉపనిషత్తుల రూపమున నీ యుగములో మనకు భాసించినవి. వానిలోని భావములు, భాష, కల్పన, రచన, వినియోగము, పరమార్థము మొదలగు వానినిబట్టి ప్రాచీనులే కొన్ని విభాగములేర్పరుపగా, వానిని బట్టియే ఆధునికులు వానిని దేశ, కాల, చరిత్రలతో సమన్వయించి, వాని పౌర్వాపర్యము, పరిణామ రీతి, పరమార్థ తత్త్వము మొదలగువాని నన్వేషించి తెలిసికొన యత్నించుచున్నారు.

అనాదియైన ఈ వైదిక విజ్ఞానము వైయాకరణుల స్ఫోటబ్రహ్మలాంటిది. అనాది నిధనమనబడు అఖండ వాక్యరూపస్ఫోట బ్రహ్మను వ్యవహారము కొరకు పదస్ఫోట, వర్ణస్ఫోట అని విభజించి కాల్పనికములగు నా వర్ణములతోను పదములతోను గూర్చిన అఖండ వాక్యమును మరల ప్రయోగించి మన భావములను వ్యక్తము చేసుకొంటున్నట్లే, అనాది యనబడు వేద వాఙ్మయమును తత్త్వమును గూడ దేశ కాలానుగుణముగా సమన్వయించు కొనుచున్నామన్న మాట. శబ్దార్థముల సంబంధము నిత్యమని స్ఫోట బ్రహ్మవాదులగు వైయాకరణులంటే, సాంకేతికము - Conventional అని ఆధునికులంటున్నారు. ఈ విధంగా మన భారతదేశంలో ప్రతి శాస్త్రము - విద్య - బ్రహ్మ విద్యపై నాధారపడియున్నది. ఈ విషయమునే ''సర్వ విద్యా ప్రతిష్ఠా బ్రహ్మ విద్యా'' అని ముండకోపనిషత్తు చెపుతోంది. వివేకానందు డుద్ఘోషించినట్లు ఈ బ్రహ్మజ్ఞానోపాసనమే భారతదేశమునకు వెన్నెముక - గుండె కాయ, ముఖ్య ప్రాణము - జీవ మూలాధారమునై యున్నది. జీవిత పరమార్థ విచారణ మితర జాతులలో తీరిక సమయములలో గావింపబడు విలాస విషయము. వారిదృష్టి బాహ్యములగు రాజకీయ సాంఘిక విషయములందు, ప్రకృతి పరిశీలన మందు లగ్నమై యుండును. అది సహజమే కూడాను. ఏమనగా, బ్రహ్మదేవుడు మన ఇంద్రియములను బాహ్య దృష్టికలవానిగానె సృజించాడట - ''పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః తస్మాత్పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్.'' కాబ ఎవడో మహాత్ముడు గాని తన దృ ి అంతరా వైపుకు మరల్చుకొనలేడట. అంతర్ దృ ి జిజ్ఞాసకు డంగుచు, జగద్రహస్యమును, జీవిత రహ ములను పరిశీలించుట ప్రాచీన భారతీయ మహర్షులకు వె తో బెట్టిన విద్యయగుటచే, తత్త్వశాస్త్ర మీదేశము ఎంపొందిన ట్లేదేశమునను పెంపొంద లేదు. మొదట క ఋషులు ప్రకృతి యొక్క బాహ్య సౌందర్యానికి ముగ్ధు దాని కధిష్ఠాన దేవతలుగా సూర్యాగ్ని ఇంద్రావరుణాది వతలను స్తుతించి పూజించి యజ్ఞాదులను సల్పినా, క్రమముగా ఈ దేవతల కందరకు అంతర్యామి యొకడున్నాడనే భావానికి వచ్చారు. ''ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహురథో దివ్యస్సుపర్ణో గరుత్మాన్ ఏకం స ద్విప్రా బహుధా వదంత్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః'' ఇంతమందిలో ''కస్మై దేవాయ హవిషా విధేమ'' ''ఏ దేవునికి హవిస్సునివ్వ వలె'' ఒక్కరినే అనేక విధాలుగా చెప్పినారట.

ఈ దేవతలను గూర్చి వలెనే, ఈ జగత్తు సృష్టి వీని కారణమును గూర్చి, జనన మరణాదులను గూర్చి, జీవ లక్షణము, జగత్తుతో దానికి గల సంబంధము, జనన మరణాదులు, జీవాత్మ పరమాత్మ సంబంధము మొదలగు వానిని గూర్చిన ప్రశ్నలు - ''క్వేదమభ్రం నివిశతే క్వాయం సంవత్సరో మిథః - క్వ మాసా ఋతవశ్శ్రితాః'' అని. మరొకప్పుడు ''కేనేషితం పతతి ప్రేషితం మనః - కేనేషితాం వాచ మిమాం వదంతి'' - మన వెనక నుండి మన మనస్సును, వాక్కును, ప్రాణాన్ని ప్రేరేపించి పనిచేయించే దెవరు? శౌనకుడు అంగిరసుని అడుగుతాడు: ''కస్మిన్ను భగవో విజ్ఞాతె సర్వమిదం విజ్ఞాతం భవతి'' - 'దేన్ని తెలుసుకొంటే అన్నీ తెలుస్తాయి'. అంటే ''పరావిద్యా అపరావిద్యా అని ఉన్నవి. వేదములు శాస్త్రములు అన్నీ అపర విద్య.

ఇక ఏదైతే 'అదృశ్యం, అగ్రాహ్యం, అపాణిపాదం, నిత్యం, సర్వభూత కారణం అయి ఉందో - అది పరా విద్య. దాన్ని ధీరులే తెలుసుకుంటారు. 'తేనేదం పూర్ణం పురుషేణ సర్వం' సర్వము అతని స్వరూపమే'' అన్నాడు - అంగిరసుడు. తండ్రి యజ్ఞం చేసి దక్షిణలిస్తూ ఉంటే నన్నెవరికిస్తావని అడిగినాడు నచికేతుడు. యమునికి అన్నాడు తండ్రి. సరాసరి యముని దగ్గరకు వెళ్లి ఆతని వలన వరములను పొంది - మరణానంతర స్థితిని గూర్చి యముణ్ణే అడుగుతాడు. నీకవిస్తాను ఇవిస్తాను అని ప్రలోభన చేసి - ఏమైనా కోరుకోగాని 'నచికేతో మరణం మా ప్రాక్షీః' - మరణాన్ని గూర్చి మాత్రము అడుగవద్దు- అది చాలా చిక్కైన విషయమన్నాడు. కాని ''న విత్తేన తర్పణీయో మనుష్యః'' డబ్బే ప్రధానం కాదు. శరీర వియోగం తరువాత ఆత్మ ఉంటూ ఉందా లేదా అనే విషయం నీకంటే నాకు చెప్పే వారెవరు చెప్పి తీరాలి. ఇదే నేను కోరే వరం'' అన్నాడు నచికేతుడు. అప్పుడు తప్పిందికాదు యమునికి. ''శబ్ద స్పర్శ రూప రసగంధాతీతము, అనాద్యనంతమునైన ఆ పరబ్రహ్మను తెలుసుకొన్నవాడు మృత్యు ముఖము నుండి తప్పించుకొంటాడు. 'పురుషాన్నపరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః' - అంతకంటె పైన ఏమి లేదు అన్నాడు'' యముడు. ఈ విధంగా ప్రాచీన భారతీయ మహర్షుల ఆంతరంగిక తాత్విక విచారణల మూలంగా వేదాలకు శిరోభూతమైన ఉపనిషత్తులు - తద్రహస్య విజ్ఞానము బయలుదేరినది.

ఈ తత్త్వ జ్ఞానము నంతా వైదిక మహ లు వారి ఆంతరంగిక దృష్టివలన ధ్యాన మార్గమున కనిపె వెల్లడించిరి. వారి బ్రహ్మ జ్ఞాన నిరూపణమువలన వైదిక మ మునకు మంచి బలము చేకూరినది. కాని ఆత్మ జ్ఞాన మందరు అర్థము చేసుకొనలేరు. జీవహింస నాక్షేపించు వారు బయలుదేరి మత భేదములు, వర్ణ వ్యవస్థ పెరిగినది. వేదముల ' మాణ్యమును శంకింపబడ జొచ్చినది. ప్రత్యక్షమునే ' మాణముగా గ్రహించి, వేదములు పౌరుషేయములని, ణ్యాపాపములు, పరలోకములు లేవని, దేహముకంటె వేరు ఆత్మ లేదని, బ్రతికినన్నాళ్లు సుఖముగా తిని త్రాగి ఆనందించ వలయునని వాదించెడి చార్వాకులు, సర్వం క్షణికం, క్షణికం, శూన్యం శూన్యమని వాదించు బౌద్ధులు మొదలగు నవైదిక నాస్తిక మతముల వారు బయలుదేరి జనసామాన్యము నాకర్షింప దొడంగిరి. వీరిని ప్రతిఘటించి వేదమతము నుద్ధరించుటకు బయలుదేరిన ఆస్తికమతములలో కర్మకాండయే నిశ్శ్రేయస సాధనమని; ఆత్మైక్య జ్ఞానమే ముక్తిదాయకమని చెప్పుచు, జైమిని పూర్వమీమాంసా సూత్రములను, జ్ఞానకాండ యొక్క ప్రాధాన్యమును దెలుపుచు బాదరాయణుడుత్తరమీమాంసా సూత్రములను, గౌతముడు న్యాయ సూత్రములను, కణాదుడు వైశేషిక సూత్రములను, కపిలుడు సాంఖ్య సూత్రములను, పతంజలి యోగ సూత్రములను రచించిరి.

ఆయా మహర్షులు వేదవేదాన్తములలోని విషయములను పరిశీలించి యవగాహన చేసికొని చేతనాచేతన వస్తువు మూలతత్త్వమును దర్శించు ను ముతో రచించిన శాస్త్రములు గనుక యివి యారును ర్శనములని చెప్పబడుచున్నవి. వేద ప్రామాణ్యమును స్థా ంచుచు జైమిని రచించిన కర్మ మీమాంసా సూత్రములకు తొలుత గొప్ప భాష్యమును రచించినవాడు శాబర స్వామి. శబరులాంధ్ర దేశస్థులగుటచే నీ శాబరస్వామి ఆంధ్ర దేశీయుడే కావచ్చును. ఇంతేగాక యజ్ఞయాగాది కర్మకాండతో గూడిన వైదిక మతమును పోషించుటే గాక, స్వయముగా వాజపేయ పౌండరీకాద్యనేక క్రతువులను సల్పి, యీ మతమును వ్యాప్తి గావించి, ముఖ్యముగా దక్షిణమున కృష్ణా గోదావరీ మధ్య దేశమున దానిని నెలకొల్పిన వారాంధ్ర రాజులే. గౌతమీపుత్ర శాతకర్ణి మొదలగు వారనేక యజ్ఞములను చేసి, గోవులను - దక్షిణలను - ఇచ్చుటే గాక, వారిలో నొకరు 'యజ్ఞశ్రీ' నామమును ధరించుటే - వారికీ మతము నెడల గల యభిమానమునకు సూచకము. ఈ దేశమున తరువాతి రాజవంశముల వారును వారి వలెనే యితర మతముల నెడల ద్వేషభావములేక వైదికమతాభిమానులేయై దానిని పోషించిరి. కావుననే జైమిని సూత్రములకు శాబర భాష్యమునకు గూడ భాష్యముగా గ్రహింపదగిన తంత్రవార్తికమను మహాగ్రంథమును రచించిన కుమారిలభట్టు ఆంధ్ర దేశీయుడగుట తటస్థించియుండును. ''ఆంధ్రోత్కలానాం సంయోగే పవిత్రే జయమంగళే, ఆంధ్ర జాతి స్తిత్తిరికో మాతా చంద్రగుణా సతీ, యజ్ఞేశ్వరః పితా యస్య'' అని జినవిజయమున చెప్పబడి యుండుటను బట్టి యాతడాంధ్రుడనియేతలంపదగియున్నది. ఈ మతాన్ని ఖండించిన వారిలో నొకడు, దిఙ్నాగుని ప్రమాణ సముచ్చయముపై న్యాయబిందువను వ్యాఖ్య రచించిన ధర్మకీర్తియను నాతడుకూడ ఆంధ్రుడని చెప్పెదరు. కర్మ జ్ఞానమునకు సాధనముగావున పూర్వపుదైన కర్మను గూర్చి తెలుపునది పూర్వమీమాంస కాగా, బ్రహ్మ జ్ఞానమును గూర్చి తెలుపు వేదాంత మీమాంస ఉత్తర మీమాంస యనబడినది. ఉపనిషత్తులాధారముగా బాదరాయణులు రచించిన 552 బ్రహ్మసూత్రములే దీనికాధారము. వీనికి శంకర రామానుజమధ్వాచార్యులు వ్రాసిన భాష్యమును బట్టి అద్వైత విశిష్టా ద్వైత ద్వైతములను మూడు మతము లేర్పడినవి. శంకరాచార్యులు అద్వైత సూత్రములకే గాక దశోపనిషత్తులకు, భగవద్గీతకు భాష్యములు నింకననేకములగు నద్వైత భావబోధకములగు గ్రంథములు స్తోత్రములు రచించెను.

ఈతని భాష్యము నాధారముగా జేసికొని అద్వైత మతము నుద్ధరించుటకై బయలుదేరిన గ్రంథము అపారములు. వేదాంత పంచదశి వివరణ, ప్రమేయ సంగ్రహము, జీవన్ముక్తి వివేకము మొదలైన గ్రంథములను రచించి వేద భాష్యమును రచించిన విద్యారణ్యులు ఆంధ్రుడనియే కొందరి మతము. బ్రహ్మ సూత్రములకు భాష్యము వ్రాసిన వారిలో వల్లభాచార్యు లొకరు ఆంధ్రులు. 'అణుభాష్య' మని యీయన రచించిన భాష్యమునకు పేరు. ఈతని పూర్వులు గోదావరీ ప్రాంతమం దలి కాంకరవాడ నివాసులట. వీరు వెలనాటి బ్రాహ్మణులు. తండ్రి లక్ష్మణభట్టు. గురువు పురుషోత్తమభట్టు. జైమిని సూత్రములకు వ్యాఖ్యను భాగవతమునకు 'సుబోధిని' యను వ్యాఖ్యను వ్రాసినాడు. ఇతడు మాయా వాదమును ఖండిం చుచు సాకార బ్రహ్మవాదమును వ్యాప్తి లోనికి దే యత్నిం చెను. ఈతనిది భక్తి మార్గము. విజయనగరాస్థానమున శ్రీకృష్ణరాయల యెదుట జరిగిన వాదములో అద్వైత వాదుల నోడించి విష్ణుమతమును స్థాపించి కనకాభిషేకము నొంది, ఆచార్య పీఠము నలంకరించెను. నింబార్కుని వలన నుండి రాధాకృష్ణ తత్త్వము నీతడు గ్రహించెనని ఈతనిది శుద్ధాద్వైత వాదమని చెప్పుదురు. మాయావాదము మూల ముగా శంకరునిది అశుద్ధా ద్వైతమట. కృష్ణుడే పరబ్రహ్మము. విశుద్ధ భక్తిగా అతని సేవయే ఆతని యొద్ద జేర్చునది. నింబార్కుడు కూడ తెలుగుదేశము వాడే - బృందావనమున స్థిరపడినాడు. కృష్ణ భక్తుడు. వేదాంత సూత్రముల మీద ''వేదాంత పారిజాత సౌరభ'' మనే వృత్తిని రచించినాడు. ఈతని కృష్ణుడు విష్ణువు అవతారము కాదు. పరబ్రహ్మయే. గోలోకములోని రాధ బృందావనములోని కృష్ణుని భార్య. ఈతనిది భేదా భేదతత్త్వమంటారు. స్వీయ మతము నుద్ఘాటించుచు 'దశశ్లోకి' యను కావ్యమును రచించినాడు.

ఇటీవలి కాలమున వేదాంత గ్రంథ రచనచే సంస్కృత భాషా సేవ చేసిన ఆంధ్రులలో బెల్లంకొండ రామారావు గారొకరు. వీరిది గుంటూరు జిల్లా పమిడిపాడు అగ్రహారం. బాల్యము నుండి హయగ్రీవుడు వీరి యిష్ట దైవం. భగవద్గీతా శంకర భాష్యముపై భాష్యార్థ ప్రకాశనమను వ్యాఖ్య రచించి నారు. శ్రీ భాష్య విమర్శ, సిద్ధాంత బిందు వ్యాఖ్య, సిద్ధాంత కౌముదిపై శరద్రాత్రియను వ్యాఖ్య వీరికి గల శాస్త్ర పరిజ్ఞానమును దెలుపు నితర గ్రంథములు. ఇంకను చంపూ గద్య కావ్యాదు లనేకములు రచించినారు. వీరు 37వ యేటనే స్వర్గస్థులైరి. ఇక గుంటూరులోనే స్థాపింపబడిన యొక శంకర పీఠమున కధ్యక్షులైన శ్రీ కల్యాణానంద భారతీ మాంతాచార్య స్వాముల వారు సుమారు 30,40 సం.లు తెలుగుదేశములో అద్వైత మత ప్రచారమును సాగించిరి. వీరసమాన ప్రతిభావం తులు. ఆంగ్ల విద్యాధికులు కూడాను. అనేకములగు నుపనిషత్తులకు, బ్రహ్మ సూత్రములకు వ్యాఖ్యలు రచించి ప్రకటించిరి. వీరి శిష్యులు లింగన సోమయాజులుగారు పంచదశి వ్యాఖ్యానము రచించినారు. ఇంక ఉపనిషత్తులను కొన్ని సవ్యాఖ్యానముగా ప్రకటించి, వైదికమత ప్రచారమునకు దోడ్పడుతున్నారు. ఇక తాము రచించిన యనేక కావ్య నాటకాలంకార చంపూగద్య ప్రబంధముల చేతనే గాక తమ తత్త్వ శాస్త్ర రచనల చేతను సంస్కృత వాణి నలంకరించిన విజయనగర వాస్తవ్యులొకరు ముడుంబి వెంకటరామ నరసిం హాచార్యులు గారు. వీరు 1842లో జన్మించి 96 సంవత్సర ములు జీవించి 1928లో స్వర్గస్థులైనారు. వీరి మూల పురుషుడు ముడుంబి ఆచాన్ అను నాయన రామానుజుల వారేర్పరచిన 72 వైష్ణవాచార్యులలో నొకరట. విజయ నగరాస్థానములో విజయరామ గజపతి మహారాజు కోర్టులో ఆస్థాన పండితుడు. బ్రహ్మసూత్ర రోమంథము - అని సూత్రముల కొక భాష్యము, ''తత్త్వదర్పణ'' మనే స్వతంత్ర వేదాంత గ్రంథము, దశోపనిషత్తులకు వ్యాఖ్యానము, పాతంజ లయోగ సూత్రములకు వ్యాఖ్యానము మొదలైన గ్రంథములను ఇతర కావ్యములను శతాధికముగా సంస్కృతములో రచించి నారు.

ఇక ఇతర దర్శనములలో తర్క శాస్త్రమున తర్క సంగ్రహము దానికి దీపిక అనే వ్యాఖ్య వ్రాసిన అన్నం భట్టు, గౌతమ సూత్రాల ననుసరించి కేశవమిశ్రుడు వ్రాసిన తర్క భాషకు - తర్క భాషా ప్రకాశమను వ్యాఖ్య వ్రాసిన చెన్నుభట్టు ఆంధ్రులే. ఇటీవల జగదీశుని సిద్ధాంత లక్షణముపై క్రోడపత్ర మును ''సంగమేశ్వర క్రోడ''మను పేర రచించిన గుమ్మ లూరి సంగమేశ్వర శాస్త్రులు గారు సుప్రసిద్ధులైన తార్కికులు, గొప్ప పండితులు, విజయనగర వాస్తవ్యులు.

బ్రహ్మ సూత్రాలకు శ్రీకరభాష్యమను పేర శైవ పరంగా నొక భాష్యము రచించిన శ్రీపతి పండితుడు పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకాలోని కాలధారి గ్రామ నివాసి, యాంధ్రుడు.

# సంస్కృత సాహిత్య పరిశీలనము - హాస్యరసము

అపారమైన సంస్కృత సాహిత్యములోగల హాస్యరసాన్ని గూర్చి పరిశీలించడానికి పూర్వము, హాస్యమనగా ఎట్టిదో మనము కొంచెము విచారించి తెలుసుకోడం మంచిది. హాస్యమాడటం అంటే అందరికీ తెలిసిందే అయినా, అది ఎల్లా కలుగుతోందో, దాని లక్షణమేమిటో మాత్రము చెప్పడానికి వెనుకాడుతుంది మనస్సు; 'భగవదజ్జుకం' అనే ఒకప్రహసనంలోని విదూషకు డిల్లాగే అంటాడు; ''నేనే హాస్యానికి మూలమని అంటారుగాని, హాస్యమంటే మాత్రం నాకేమిటో తెలియదు'' అని. హాస్యాన్ని ఇంగ్లీషులో 'humour' అంటారు. ఒక గంభీరమైన భావమును నవ్వు తెప్పించేటట్లు ఒక వికృత రూపంలో చెప్పడం (Humour is thinking in fun while feeling in earnest, a feeling and presentation of the ludicrous). దీనిలో irony, sarcasm, satire అని అనేక భేదాలున్నాయి. వీటన్నిటి కంటె కూడా మన ఆలంకారికులు చెప్పిన హాస్యరస మనేది విశాలమైన భావంగా కనబడుతుంది. ఈ హాస్యమనేదాన్ని వారు నవరసాలలోను ఒకటిగా భావించారు. కాబట్టి తాత్కాలిక చమత్కార కారిత్వము మూలంగా నవ్వు పుట్టించుటయే కాకుండా, స్థిరతరానందాను భవానికి కూడా కారణమవుతుందని వారి భావం. ''నవరసాలలోనూ సర్వచేతనసాధారణమైనది, సర్వహృదయంగమమైనది అగుటచేత శృంగారానిదే పైచేయి గదా! శృంగారమొక్కటే రసమన్నాడు కూడాను భోజుడు. మొత్తంమీద సాహిత్యంలో తక్కిన రసాలన్నిటికంటె శృంగార, వీరరసాలకు ప్రాధాన్యం హెచ్చు అనడానికి సందేహం లేదు. అందు శృంగారానికి ద రగా సంబంధించినదనే గాక ఈ హాస్యం దాని నుండి పు నదని భరతుని అభిప్రాయము. వికృతాకార వాగ్వేష చె దుల ప్రదర్శనముచేత 'హాసము' స్థాయి భావముగా ర్పడి హాస్యరసము కలుగుతుంది. అనగా ఏదో ఒకవిధమైన వికృత రూపప్రదర్శనమే 'Presentation of the ludicrous' హాస్యానికి కారణమవుతుందన్న మాట. దీని కుదాహరణంగా ప్రతాపరుద్రీయమున విద్యానాథుడు ''ఓరుగంటిలో బందీలుగా చేయబడిన శత్రురాజులు కొప్పులు, పమిటెలు పెట్టుకొని ఆడవేషాలు వేసుకుని వీథులలో నుండి పారిపోవడానికి యత్నిస్తుంటే వీరు జారిణులని భ్రమపడి కొంటె విటకాండ్రు వారి పమిటలను లాగినప్పుడు వారి నిజము బయటపడగా ఆ వింత వేషములకు హీహీ యని కడుపు చెక్కలగునట్లుగా నవ్వినారట!'' అని వర్ణించినాడు. ఇది వికృత వేషము మూలంగా నేర్పడిన శృంగారాభాసము వలన గలిగిన హాస్యమే కదా! కాబట్టే అభినవగుప్తుడు వ్యాఖ్యానం చేస్తూ - ఈ ఆభాసమనునదే హాస్యానికి మూలము అన్నాడు. దీనినే 'incongruity is the soul of humour' అని పాశ్చాత్యవిమర్శకు లన్నారు. ఇది శృంగారాభాసమూ కావచ్చు; ఇతర రసాల ఆభాసమూ కూడా కావచ్చును. ఇది ఆయారసావేశాన్ని తగ్గించే లలితాభాసమై యుంటుంది. దానివలన మనకొక విశ్రాంతి-లలితానుభూతి కలిగి, వికాసము, నవ్వు వస్తుంది అని సూచించారు. హాసము స్థాయీభావమును చెందితే - హాస్యరసం కలుగుతుందని మన ఆలంకారికుల మతము. ఈ హాస్యముకూడా ఆరురకాలుగా నుంటుందట. అందులో స్మితము, హసితము - ఉత్తములలోను, విహసితము, అవహసితము - మధ్యములలోను, అపహసిత అతిహసితములు అధములలోను ప్రకటితములగుతూ ఉంటవి నేత్రవికాస, శిరఃకంపనాదుల మూలముగా ఉత్తమ మధ్యములచే అనుమోదింపబడు హాసాన్నే - మన 'humour' శబ్దవాచ్యంగా చెప్పకోవచ్చు. బాష్పములు అనగా కళ్లంబడి నీళ్లు, ఒడలు విసరుటలతో గూడిన అపవహసితా తిహసితములు అసభ్యహాస్యంలోకి దిగుతాయి.

ఏ సాహిత్యంలోనైనా హాస్యరసమే ముఖ్యరసంగా కలిగిన కావ్యాలు చాలా తక్కువగనే ఉంటాయి. ఆంగ్ల వాఙ్మయంలో ఇట్టి వానిని satires అంటారు. సంస్కృత సాహిత్యంలో కూడా హాస్యరసం ప్రధానంగా కలిగిన కావ్యం ఒక్క ప్రహసనమే! భాణాదులలోకూడా హాస్యరసం కొంత ఉండేది. ఏమంటే ఇందలి కథ ధూర్తచరితం. ధూర్తులంటే చోరులు, జూదగాండ్రు మొదలగువారు. దీనికి విటుడు నాయకుడు. దీనిలో శృంగార వీరాలు ప్రధానరసాలు. ప్రహసనంలో మాత్రం హాస్యమే ప్రధానరసం. ప్రాచీనకాలంలో భాణాలు వ్రాసిన మహాకవులున్నారుగాని అవి ఏ కారణంచేతో కాళిదాసాదుల కావ్యాలముందర వెనుక పడిపోయాయి. అయినప్పటికీ

వారిముందర కాళిదాసెందుకు పనికివస్తాడు అని చెప్పుకునేవా రట ఆ రోజుల్లో.

''వరరుచి రీశ్వరదత్తః శ్యామలికః శూద్రకశ్చ చత్వారః,
ఏతే భాణాన్ బభణుః - కాశక్తిః కాళిదాసస్య''

అనే ప్రాచీనశ్లోకాన్ని బట్టి ఈసంగతి తెలుస్తోంది.

కాళిదా సేమీ భాణాలు వ్రాసినట్లు కనబడదు. లంబోదర ప్రహసనం కాళిదాస విరచిత మంటారుగాని అది వాస్తవమని తోచదు. ఇక నాటకాల్లో హాస్యరస ప్రధానముగా గ్రహింపదగి నది విదూషక పాత్ర. నాటకాల్లోని ఈ విదూషకుని పాత్రలు అదొక సంప్రదాయసిద్ధమై, ఒకే దిమ్మలో పోతపోసిన బొమ్మలు లాగ తయారవుతూ వచ్చినవిగాని, స్వతంత్ర వ్యక్తులులాగ హాస్యరసాన్ని పోషించినవి కాలేదు. అయినా కాళిదాసు ఈ పాత్రలను తననాటకాల్లో ఉపయోగించుకునే రీతిలో చాలా చాకచక్యం, ప్రతిభ చూపించినాడు. తొలినాటక మగు మాళవికాగ్నిమిత్రంలో విదూషకుడు హాస్యరసోద్బోధ మునకేకాక, కథా ప్రవృత్తికి కూడా తోడ్పడినాడు. రాజుకంట బడకుండా దేవిచే రక్షింపబడుతున్న మాళవిక దర్శన లాభము రాజుకు కలగడం దగ్గిరనుంచి ఆమె నాతడు పరిగ్రహింపగలిగేటంత వరకూ విదూషకుని తంత్రాలమీదనే ఆధారపడవలసి వచ్చినది, అగ్ని మిత్రుడూ, అందలి కథాగమనికా కూడాను! శాకుంతలంలో విదూషకుణ్ణి ఆవలకు పంపివేయడమే కథా ప్రవృత్తికి తోడ్పడేటట్లు చేసికొన్నాడు కాళిదాసు. ''శకుంతలను గూర్చి నీవైనా జ్ఞాపకం చేసినావు కావేమీ'' అని తా నామెను తిరస్కరించిన తరువాత విదూషకుణ్ణి అడుగుతాడు దుష్యంతుడు. అప్పుడాత డంటాడు ''పరిహాస విజల్పితం సఖే! పరమార్థేన న గృహ్యతాం వచః - అని శకుంతలా వృత్తాంతం అంతా పరిహాసంగా చెప్పినదిగాని నిజంకాదని నీవన్నావు గనుక మృత్పిండ బుద్ధిగల నేను - అనగా మట్టి మెదడు గల నే నది నిజమే అనుకుని ఊరకున్నా'' నన్నాడు ఈ మృత్పిండ బుద్ధి!

ఈతనికొక లక్షణము: అతిభీరుత్వము. మాళవికలో నిపుణిక ఈతణ్ణి జడిపించాలని కర్రముక్క ఆతని మీద పడవేస్తే - పామునుకుని గంతులు వేస్తాడు. విక్రమోర్వశీ యంలో గాలికి కొట్టుకొని వచ్చిన భూర్జ పత్రాన్ని చూచి పాము కూసమనుకుని భయపడతాడు. ఎల్లప్పుడు తిండి మీదనే దృష్టి - మోదకాల కోసము, వాయనాల కోసమే తపిస్తూ ఉండడం, ప్రగల్భాలు కొడుతూ ఉండడం - ఇవి సామాన్యంగా విదూషకుని ముఖ్యలక్షణాలు. వీని మూలముగా కొంత హాస్యము కలుగుతుంది గాని - ఇవే గుణాలు నియతంగా అందరిలోనూ కనబడుతూ ఉండడం చేత విదూషకుని పాత్ర నాటకాల్లో ఒక హాస్యపు బొమ్మగా తయారయిపోయింది. కాని ఈ సంస్కృత నాటకసాహి త్యంలో హాస్యరస పోషకములైన పాత్రలలో శూద్రకకవి మృచ్ఛకటికలోని శకారుని పాత్రము ముఖ్యముగా చెప్పదగి నది. అందు వసంతసేన బండిలో రహస్యంగా ఎక్కి రాజుచే బంధింపబడి చెర తప్పించుకొని ఊరుదాటి పోవుచున్న ఆర్యకునికి అభయమొసంగిన చందనకుడు, మరియొక రక్షకుడగు వీరకుడు ఆర్యకుని బండీ తణిఖీ చేయకుండా తప్పించుటకుగాను లేవదీసిన కర్ణాట కలహ సందర్భము కూడా హాస్యరస పోషకమైనదే! శకారుడు బుద్ధిహీనుడైనా పరమ దుర్మా డు, తంత్రజ్ఞుడు. రాజుగారి బావమరది యగుటచేత మి ౼లి ఉద్ధతుడు. దీని మూలముగా హాస్యర సాన్ని బాగా క ంచాడు శూద్రక మహాకవి. మాటలలో 'స'కారానికి 'శ'కారము వేసి - వసన్తసేనను వశన్తశేణ అని పలుకడం, పౌనరుక్త్యం. ''స్నాతోహం సలిల జలైః పానీయైః - ఉద్యాన ఉపవన కాననే నిషణ్ణః'' అని చెప్పడం, వసంతసేనను వెంబడిస్తూన్న శకారు డామెనుగూర్చి ''కిం ద్రౌపదీవ పలాయసే రామ భీతా'' (రామునివల్ల భయపడిన ద్రౌపదివలె పరిగెత్తుతున్నావా?) అని అసందర్భపు కథాసన్ని వేశములు, ''న ఛిన్నౌ వృషభౌ నమృతా రజ్జవః'' (వృషభములు తెగిపోలేదు, త్రాళ్లు చచ్చిపోనులేదు) అని పదాలను అస్తవ్యస్తముచేయుట, అసందర్భపు ఉపమానములు మొదలగు వికృతభాషణరీతుల మూలముగాను, వికృతచేష్టల మూలముగాను అత్యద్భుతముగా నీ కవి హాస్యరసమును ఈ 'మృచ్ఛకటిక' నాటకమున కల్పించినాడు.

సంస్కృత సాహిత్యంలో ఈ నాటకప్రహసనాదులందువలె కావ్యములందు హాస్యరస మంతగా కనబడదు. కాని కవి యుపమానముల మూలముగా హాస్యరసము నక్కడక్కడ పోషిస్తూ ఉంటాడు. ఇట్టివి వైదిక వాఙ్మయంలో కూడా కనబడతవి. ఋగ్వేదంలో 7వ మండలంలో వర్షాకాల మందు కప్పలను గూర్చిన వర్ణన మొకటి కలదు. వీనితో నాకాలపు బ్రాహ్మణుల కృత్యములను పోల్చి కొంత హాస్యరసమును కల్పించినాడు కవి. వ్రతనిష్ఠులైన బ్రాహ్మణులవలె సంవత్సర కాలము మౌనము వహించియుండి పర్జన్యుని రాకతో నీకప్పలు గొంతులెత్తిన వట. ''ఉపాధ్యాయులయొద్ద పాఠము చెప్పు కొను శిష్యులవలె ఒక దానికేకను మరియొకటి అనుకరించున పుడు మన శరీరావయవములన్నియు కుదిలించి నట్లగును. సోమయజ్ఞములో సోమరసపూరితమైన పెద్ద భాండము చుట్టు అరచుచు కూర్చున్న బ్రాహ్మణులవలె, వర్షాగమ దినమున కప్పలన్నియు నీటిగుంటచుట్టును చేరి, సోమరసము

గ్రహించి గొంతెత్తి యరచు బ్రాహ్మణులవలె నీకప్పలును బెక బెకలాడుచుండునట!'' ఇది కేవలము వైదికబ్రాహ్మణుల యవహేళనము కాకపోయినను ఈ ఔపమ్యములో కవి నర్మహాస్యమును కూర్చినా డనుటకు సందేహములేదు.

కాళిదాసు కావ్యములలో హాస్యరసం లేదని భాణ కర్తలతో పోల్చిన వారెవరో అన్నారు కాని, వాస్తవంగా పరిశీలిస్తే అతని కుమారసంభవములో హాస్యరస గర్భితములైన పట్టులు చాలా కనిపిస్తవి. ముఖ్యంగా శివుడు కపట బ్రాహ్మణ వేషంతో వచ్చి పార్వతితో సంభాషణ జరిపినపట్టు అంతా హాస్యరస గర్భితమే! కాళిదాసుకంటె కూడా మన నన్నిచోడుడు ఒకమెట్టు పైకివెళ్ళి, అతని చేతను ఒళ్లు విరుచుకొనుటతో గూడిన అపహసితమును కూడా చేయించినాడు. అనగా ప్రక్కలు విరుగునట్లుగా నవ్వించినాడు.

ఇంకనెన్నండు దయ పరమేశ్వరుండు
గన్నుదెరచునొయని తనకున్న రూపు
నెరయ జెప్పిన విని కేలు చఱచుకొనుచు,
నఱయ పాఱుండు ప్రక్కలువిరుగ నగుచు.

శా. ''ఎట్టెట్టూ శివు గెల్చెనంటి నికమా
యీ తన్వి దన్ గెల్వగా
నట్టుల్ మెచ్చక యున్నవే తపము
సేయంజొచ్చె నున్నాతడే,
ముట్టుంబోలిన వానిగా దలచియే
మోహించె దేశంబులో
బుట్టం బట్టులు మాలెనే నగజ
యీ భూతేశ్వరుం గల్వగాన్.''

''వివాహంలో అతని చేతులకు పాములే అలంకారాలు గనుక కరగ్రహణం చేయుటయే కష్టము. నీవు హంసల చీరకట్టుకుని ఏనుగు చర్మం కట్టుకున్నవానినా పెండ్లాడుతావు? చక్కటి పారాణి పెట్టుకున్న పాదాలతో శ్మశానభూమినా త్రొక్కుతావు? అతనిని కౌగిలించుకుంటే హరిచందనానికి బదులు శ్మశానంలో బూడిద నీ వక్షస్థలాని కంటు కుంటుంది. ఏనుగు మీద ఊరేగవలసిన దానవు ఎద్దునెక్కి ఊరేగితే ఊళ్లోవాళ్లంతా నవ్వరూ? అందం చూడబోతే విరూపాక్షుడు! డబ్బున్నదేమో అంటే దిగంబరుడు; మంచి వంశపు వాడేమో అంటే - పుట్టుక ఎక్కడో తెలియదు. రూపం, ధనం, వంశం కూడా లేనివా ణ్ణెందుకు పెళ్లాడుతావు?'' అని ఈశ్వరుని చేతనే నవ్వులాటకు చెప్పించి మనకు నవ్వులాటను కల్పించాడు కాళిదాసు.

ఇంతే కాదు, మొదట మన్మథుని తగుల బెట్టిన ఈశ్వరుడు తొందరబడి పార్వతి చేయిపట్టుకు లాగుతాడు. ఎంతో కాలంనుండి తపస్సు చేస్తు పార్వతే ''ఆగు, ఆగు, మా నాన్నతో చెప్పు''అన్నది. స లు వెళ్లారు - వివాహం నిశ్చయించారు. ఈశ్వరుడు పె ొడుకు ముస్తాబుతో వివాహవిధులన్నీ జరిపి అల్లుడైనాడు. బ్రహ్మకు నమస్కారం చేస్తాడు. అత్తగారి మనస్సుకెక్కేటట్లు ప్రవర్తిస్తాడు. మొదట బింకంతో భస్మంచేసిన మన్మథుణ్ణి మరల బ్రతికిస్తాడు. అభవుడైన ఈశ్వరుని చేత ఇల్లా చేయించడం నవ్వులాటకు కారణం కాదూ! హాస్యరసానికి మూలం కాదూ? అయినా కాళిదాసు ఈ హాస్యాన్ని జగత్కారకులైన పార్వతీ పరమేశ్వరు లయెడ మన కేవిధమైన అలత్యభావమూ కలుగకుండానూ, భక్తి భావము సడలకుండానూ చేసి, పోషించడంలో అతని అప్రతి మాన ప్రతిభాశక్తి నంతను కనబరచినా డనకతప్పదు.

ఇక హాస్యరస ప్రధానములగు ప్రహసనములు: వరరుచ్యాదుల భాణముల వలెనే ప్రాచీన కవి కృతములై ప్రసి లయ్యె ననుటలో సందేహము లేదు. ఇటీవలెనే వాటి ' చుర్యము తగ్గినట్లగపడుతోంది. దశరూపకాల్లోనూ నాట ప్రకరణా లకు కాలక్రమాన ప్రాధాన్యం పెరిగిన కొలదీ తక్కిన రూపకాలు బాగా వెనుకపడిపోయి నట్లున్నాయి. అంటే తక్కిన రూపకాలను వ్రాసిన మహాకవులు లేరని కాదుగాని కాళిదాసాదుల పంచకావ్యాలు చదివిన తరువాత తక్కిన వాటియందు కొంత ఉపేక్షాభావము కలుగుతూ ఉన్నట్లు గానే - ఈ రూపకములను చదివేవారుగాని, ప్రదర్శించే వారుగాని తక్కువ అయి ఉంటారు. ఈ కాలంలో కూడా సంస్కృత కావ్యాలు - రూపకభేదాలు కూడా వ్రాసినవారు మన ఆంధ్రదేశంలో కూడా ఎంతమంది లేరు? వారి పేర్లు కూడా చాలామంది ఎరుగరు. ఎన్నో ఖిలమైపోయియుంటాయి. అచ్చుపడడమే అరుదు. అచ్చుపడినవాటినైనా చదివేవారు లేరు. మా తాతగారగు కోరాడ రామచంద్రశాస్త్రి గారు 'శృంగార సుధార్ణవ'మను భాణము, 'కమనానంద' మనే భాణము, 'రామచంద్రవిజయ' మనే వ్యాయోగము, 'త్రిపురాసుర విజయ'మనే డిమము-ఇంకా అనేక చంపువులూ, కావ్యాలూ వ్రాశారు. ఇల్లా వ్రాసిన వారనేకులున్నారు. వీరి గ్రంథా లెప్పటికి బయటకు వస్తాయో! ప్రాచీన కవుల ప్రహసనాలు కొన్ని ఈ కాలమున ప్రకటితము లైనవి. భానుని నాటకములన్నీ మొన్నమొన్ననే గదా ప్రకటితములైనవి. ప్రాచీనకాలంలో కూడా హాస్యకథల మీద కొంత ఏవగింపు ఉండేదని తోస్తూంది. లేకపోతే 'పాద తాడితకం' అనే ప్రహసనం వ్రాసిన శ్యామిలకుడు హాస్యకథలను గూర్చి ఇలా అన్నాడు:

''న ప్రాప్నువంతి యతయో రుదితేన మోక్షం
స్వర్గాయతిం న పరిహాస కథా రుణద్ధి
తస్మాత్ ప్రతీత మనసా హసితవ్యమేవ
వృత్తిం బుధేన ఖలు కౌరుకుచీం విహాయ.''

(యతులై యేడుస్తూ కూర్చున్నంత మాత్రాన మోక్షంరాదు. పరిహాస కథలు స్వర్గమార్గాని కెప్పుడూ అడ్డు తగలవు. కాబట్టే బుద్ధిమంతుడెప్పుడు కుచ కచాదుల నుండి మనోవృత్తిని మాత్రము మరలించి ధైర్యంతో నవ్వుతూనే ఉండాలి). అని ప్రహసనం పనికిరాదనీ మేము మడికట్టుకు కూర్చున్నామనీ అనే దంభవృత్తికలవాళ్లను చక్కగా మందలించాడు.

యాభై నీతివాక్యాలు చెప్పినదానికంటె - ఒక్క పరిహాసవాక్యంచేత విషయాన్ని మనస్సున నాటునట్లు చేయవచ్చు. సంఘసంస్కరణ కోసమని వీరేశలింగంగారు చేపట్టిన ప్రహసనరచన మనకందరికీ తెలిసినదే! కాబట్టే బౌద్ధమత ప్రాబల్యం కలిగిన రోజుల్లో - దాన్ని ఢీకొని ఖండించడానికిగా చాలా ప్రహసనాలు బయలు దేరినట్లగపడుతుంది. అందుకనే, శుద్ధ ప్రహసనానికి లక్షణం చెపుతూ దశరూపకకారుడిట్లు చెప్పినాడు:

''పాఖండవిప్ర ప్రభృతి చేటచేటీ విటాకులం,
చేష్టితం వేషభాషాభిః శుద్ధం హాస్యవచోన్వితమ్.''

పాఖణ్డులనగా శాక్యులు, నిర్గ్రంథులు మొదలైన వాళ్లట! జాతిమాత్రోపజీవులైన విప్రులతోను చేట, చేటీ విటులతోనూ గూడినది - ప్రహసనం. తరువాతి వాడగు ధనంజయుడు కూడా ప్రహసనలక్షణం పాషణండులతో కూడినదని చెప్పడం చూస్తే, అంతకు పూర్వమున్న వాటిలో పాషండులు ప్రాధాన్యాన్ని వహించారనుట నిశ్చయం. 'మత్తవిలాసం', 'పాదతాడితకం,' 'భగవదజ్జుకం', 'లటకమేళకం' - మొదలైన వికొన్ని ప్రాచీనములైన ప్రసిద్ధప్రహసనాలు. బౌద్ధమతమును ఖండించి, ఆధ్యాత్మతత్త్వమును, యోగశక్తిని చమత్కారముగా ప్రదర్శించి బోధించుటకుద్దేశించినది భగవదజ్జుకము. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులుగారు దానిని తెలుగులోని కనువదించారు.

బౌద్ధమతము నభిమానించి తిండిపోతై అధ్యయన విముఖుడైన తన శిష్యునికి పరివ్రాజకుడగుగురువు బుద్ధిగరపుటకుగాను తాను విటునికై యుద్యాన వనమున వేచియుండి పాముకాటుచే మృతినొందిన యొకగణికాశరీరమున యోగశక్తిచే ప్రవేశించి ఆ గణికామూలముగ దనప్రభావము వెల్లడించి శిష్యుని హృదయమున నొక విధమగు సంస్కారమును గల్గించెను. ఈ ప్రహసనములలోను, కావ్యములలోనూగల హాస్యరసము చదువరులలో అతి సులభముగ చిత్త సంస్కారమును గల్పించుటకు మంచి సాధనములనుటలో సందేహము లేదు. కాబట్టే శ్యామిలకుడు చెప్పిన మాట మరొక మాటు జ్ఞాపకం చేసుకొని - యతులై ఏడుస్తూ కూర్చున్నంత మాత్రాన మోక్షంరాదనీ, పరిహాసకథలు మోక్షమార్గాన్ని అడ్డగించలేవనీ తక్కినరసముల వలెనే హాస్యరసమున్నూ విగళిత వేద్యాంతరమైన ఆనందాన్ని ఇస్తుందనీ తెలుసుకొని అపారమైన సంస్కృత సాహిత్యంలోని హాస్యరసాన్ని ఇంకా తరచి తీయటానికి అందరూ ప్రయత్నంచేయాలి

విశద సుధారస లేపాత్ గృహ మివ మాధుర్య విమలతాతిశయాత్।
వారివ నౌరివ వేగాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

వెల్ల వేయడంవల్ల ఇల్లులాగ, తీపి, స్వచ్ఛతల వల్ల మంచినీళ్లలాగ, వేగంవల్ల నావలాగ ఓ సుందరీ! నీ యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— 'ఉపమావళి' నుండి

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు:

# నన్నిచోడుని కుమారసంభవ ప్రతులు-పాఠములు

నన్ని చోడదేవుని కుమారసంభవము మొట్టమొదట క్రీ.శ. 1909-1914 సంవత్సరములలో శ్రీ మానవల్లి రామకృష్ణకవి గారిచే ప్రకటింపబడినతోడనే ఆంధ్రసాహిత్యలోకమున నొక నూతనసంచలనమున కది కారణ మైనది. ఆ కవిని గూర్చి, ఆతని కాలమునుగూర్చి, ఊరునుగూర్చి, పేరును గూర్చి, కవితనుగూర్చి, కావ్యభాషనుగూర్చి, ప్రతులనుగూర్చి, పాఠములనుగూర్చి అనేకవిమర్శనలు, చర్చలు బయలుదేరినవి; బయలుదేరుచున్నవి. ఇంకను ఎన్నో బయలు దేరవలసియున్నవి కూడాను. అట్టి సాహిత్యచర్చకు, చారిత్రకపరిశీలనమునకు, భాషా సంప్రదాయపరిశోధనమునకు ఎంతయు దగినదే యీ కావ్యమనుట కేమాత్రము సందేహము లేదు. కాని వీని కన్నింటికి మూలాధారమైనది అసలు గ్రంథము గదా! దీని తాళపత్రప్రతి యొక్కటి మాత్రమే తంజావూరు సరస్వతీమహల్ పుస్తక భాండారమున గలదు. మరియొకటి శ్రీ కవిగారి యొద్ద గల దందురు గాని యది యితరులకు లభ్యము కాలేదు. ప్రాచీనలాక్షణికులలో ప్రసిద్ధు లెవ్వరు నీ కవిగ్రంథము నుండి యుదాహరించి లక్షణవిమర్శనము చేసినవారు కానరారు. కావుననే యీతనిపే రింతకాలము మరుగు పడిపోవుటయు దటస్థించినది.

ఈ కారణముచే తంజావూరు ప్రతి యొక్కటియే యీ గ్రంథమునకు గల మూలాధార మగుచున్నది. తరువాత కవిగారి ముద్రితగ్రంథము, అందు వారిచ్చిన పాఠభేదములు గ్రహింపదగినవి. వీరిచ్చిన పాఠాంతరములలో పెక్కు తంజావూరి ప్రతి పాఠములతో సరిపోవుచునే యున్నవి. కాని తంజావూరిప్రతిలోనే కొన్నిచోట్ల గ్రంథపాతములు మొదలగునవి కనబడుచుండుటచే నాయా స్థలములందు ప్రత్యంతరము లేకపోవుటచేత ఎవరికి తోచినట్లు వారు పూరించవలసియే యుండును. అయితే ఇటీవల నా తంజావూరి మూలగ్రంథమునకు గొన్ని పుత్రికలు బయలుదేరినవి. ఆంధ్ర సాహిత్యపరిషత్తువారు వ్రాయించిన దొకటి. ఇదే తొలుత బయలుదేరినదిగా గనబడును. తరువాత మద్రాసు యూనివర్సిటీవారు వ్రాయించి తెప్పించినది మరియొకటి కలదు. శ్రీ నేలటూరి వెంకటరమణయ్య గారు వ్రాయించి తెప్పించుకొనినది యింకొకటి కలదని చెప్పుదురు. ఇప్పటికి నాకు తెలిసినంత వరకీ మూడు ప్రతులును తంజావూరి మాతృక నుండి యేర్పడినవే. మరికొన్ని దీనినిబట్టి వ్రాయబడినవుండిన నుండను వచ్చును. ఈ ప్రతులు వ్రాసినవారి సంస్కార భేదమునుబట్టి యీ ప్రతులలోగూడ మార్పు లేర్పడియు నుండవచ్చును. తాటియాకు గ్రంథము నుండి మరల వ్రాయునపు డందలి యక్షరములు తెలియక కొన్ని, అర్థము తెలియక కొన్ని, పొరపాటున కొన్ని, అర్థము పొసగించుటకై వ్రాయువారు చేయు సంస్కరణము మూలమున నేర్పడునవి కొన్ని - ఈ రీతిగా నొక్క మాతృకనుండియే యేర్పడిన పుత్రికలలో ననేకభేదము లేర్పడుటకవకాశము కలదు. వారి భాషా సాహిత్య సంప్రదాయములలోని దృక్పథములు భిన్నమైనచో, తదనుకూలముగ జేయబడు సంస్కారములు మరికొన్ని యేర్పడవచ్చును. కవియొక్క దేశకాలసంస్కారాదులను గూర్చి తమకు గలిగిన అభినివేశముల కనుకూలముగ జేయబడు సంస్కారాదుల మూలమున గూడ కొన్ని పాఠ భేదము లేర్పడవచ్చును. ఇట్లీరీతిని ఒక్కమాతృక నుండియే బయలు దేరిన పుత్రికలలో నేర్పడు పాఠభేదములను పరిశీలించి, కవి యుద్దేశించిన పాఠ మిదియని నిర్ణయింప దొరకొనుట వాస్తవముగా నసిధారావ్రతము వంటిదే. మొత్తము గ్రంథమునంతను సూక్ష్మపరిశీలనము చేసి ఆ కవి యవలంబింపదలచిన కవితాసంప్రదాయ పద్ధతులను గనిపెట్టి నిర్ణయించుకొనగలిగినగాని, ఆ పాఠభేదములను తప్పులని దిద్దుటకును, ఒప్పులని, ఆ కవికి సహజసంప్రదాయ సిద్ధములని గ్రహించుటకును గూడ వీలుపడదు. ఇట్టి స్థితిలో నా మూలప్రతినుండి బయలుదేరు పుత్రికల సంఖ్య పెరిగినకొలదిని ఈ చిక్కులింకను పెరుగుచునే యుండును. ప్రతులు పెరుగుటవలన గలుగు చిక్కులు భారతాదిగ్రంథముల విషయమున కొంతవరకు తెలియుచునే యున్నవి. అట్టి చిక్కులే యీ గ్రంథము విషయమునగూడ

గలుగకుండ నాంధ్రసాహిత్యవేత్తలు జాగరూకత వహించుట యుక్తము గదా! ఇప్పటికి లభ్యమగుచున్న మూలప్రతియనదగినది తంజావూరు తాళపత్రప్రతి యొక్కటే. తక్కిన వ్రాతప్రతులుగాని, ముద్రితగ్రంథములుగాని దాని నాధారము చేసికొని బయలుదేరినవే. కావున నిప్పుడే-వీనిలో గలిగిన పాఠభేదము లెట్టివో, అవి యెట్లు బయలుదేరినవో, మూలప్రతిలోని పాఠములతో నివి యెంతవరకు సంవాదము కలవై యున్నవో పరిశీలించుకొని ఇప్పటికి దొరికిన మూలగ్రంథము లోని వ్రాతలోగల పొరపాటు లేవో, తరువాత బయలు దేరిన వేవో, తేల్చుకొనగలుగలేకపోయిన ట్లయితే, మరికొన్ని ముద్రణములు బయలుదేరునప్పటి కీ పాఠ నిర్ణయ మనునది గహనాతిగహనము కాకమానదు.

శ్రీ రామకృష్ణకవిగారి తొలిముద్రణము తరువాత దీని ముద్రణమునకై ప్రయత్నించినవారు మద్రాసు యూనివర్సిటీ వారు. దీనిని పునర్ముద్రణము చేయు నుద్దేశముతోడనే తంజావూరుగ్రంథమునకు ఒక ప్రతి వ్రాయించి చిరకాలము క్రిందటనే తెప్పించి పెట్టినారు. ఆ ప్రయత్నములోనే అప్పుడు తెలుగు శాఖలో జూనియర్ పండితులుగా నుండిన కీ.శే. శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రులు గారొక విమర్శనము ప్రకటించుట, ఇచ్చటి వ్రాతప్రతిలో సందేహముగా నుండిన వట్ల మూలప్రతినే ప్రత్యక్షముగ జూచి పాఠనిర్ణయము చేయు నుద్దేశముతో వారు తంజావూరు వెళ్లి మూలప్రతిని పరిశీలించి వచ్చి, అచ్చుప్రతి సిద్ధముచేసి ముద్రణము ప్రారంభించుట సంభవించినది. కాని ఈ నడుమ గలిగిన యనేకములగు నవాంతరపు చిక్కులచే నాగ్రంథము సత్వరముగా వెలువడుట కవకాశము కలుగకపోవుట శోచనీయమే. శ్రీ కవిగారి యొద్ద తొలి ముద్రణపు ప్రతులన్నియు నమ్ముడుపోయి, దేశమున నాగ్రంథమే లభ్యముకాని స్థితి గలుగుట చేత, వారేగాక యితరు లనేకులు పునర్ముద్రణము చేయ తహతహ గలవారే యై యుండిరి. కాని కవిగారే యొకప్పుడన్నట్లుగా-యూనివర్సిటీ ముద్రితగ్రంథము బయలువడిన గాని, అది చూచిగాని వీరు మరల దీనిని ముద్రింప బూనుకొనిన ట్లగపడలేదు. కాని దేశమున పలయువారికి గ్రంథమే చిక్కకుండుటచేతను, విద్వాన్ మొదలగు పరీక్షలకు బోవు విద్యార్థుల యుపయోగార్థము ఈ నడుమ శ్రీ వావిళ్లవారు మొదటి రెండాశ్వాసముల నచ్చొత్తించి ప్రకటించిరి. అందు కీ.శే. శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారే యా ముద్రితగ్రంథమునకు నవరణలను గావించి యిచ్చినట్లు తెలుపబడియున్నది. ఇటీవల గ్రంథమంతయు ముద్రణ నందినట్లు గూడ తెలియుచున్నది. కావున నిప్పటికి రెండు ముద్రిత ప్రతులు, మూడు వ్రాతప్రతులు బయలుదేరినవి. యూనివర్సిటీ వారిది బయలువడిన నివి మూడు, నవి మూడు నగును. యూనివర్సిటీవారి ముద్రిత గ్రంథముకూడ కొద్దికాలముననే బయలుపడవచ్చును. కాని, శ్రీ కవిగారు ముద్రించిన గ్రంథమునకును, తరువాత రెండవ భాగములో వారిచ్చిన పాఠభేదములకును గనబడు వ్యత్యాసమే (ఇవి వారు మరియొక ప్రతిలోని పాఠములని చెప్పినను గూడ) ఆశ్చర్యకర మగుచుండగా, శ్రీ లక్ష్మీపతిశాస్త్రి గారి చేతనే నవరింపబడిన రెండు భిన్న ముద్రణములలోని పాఠములుగూడ భేదించు చుండుట మరింత ఆశ్చర్యజనకము కాకమానదు. నవరణలు లేకపోగా అచ్చుతప్పులు కూడ మిక్కుటముగా వెలిసినవి. అయితే ఇది కాల భేదమును బట్టి, వ్యక్తులలో గలుగు అనుభవసంస్కార భేదమునుబట్టి యేర్పడుచుండు ననియు తలంపవచ్చునేమో! ఏదె యైనను అపూర్వముగా దలంపబడిన యొక గ్రంథమున కొకటే మూలప్రతి కనబడుచుండిన పుడు, దానినే యాధారముగా చేసికొని ముద్రణము నందిన మూడుగ్రంథములలోను కొన్నిచోట్లనైనను మూడేసివిధము లగు పాఠములు కనబడినవో, నింత యల్పకాలములోనే యిట్లయినపుడు, ఒక శతాబ్దితరువాత దీని స్వరూపమింక నెట్లు మారగలదో పండితు లూహించుకొనవలసినదే. కాలక్రమమున నా తంజావూరిప్రతిలో తాటియాకులలోని ముక్కలు రాలిపోయి, యింకను గ్రంథపాతము లేర్పడవచ్చును. అప్పుడింకను సంపాదకులయొక్కయు, ముద్రాపకుల యొక్కయు స్వయంకవిత్వ మెక్కుడగుట, పూరణభాగములు పెరుగుచుండుట తటస్థింపగలదు. కావున లభ్యమైన యీ యేకైకప్రతికైనా జాగ్రత్తగా ఫోటో గ్రాఫ్ కాపీలు తీయించియుంచు ప్రయత్నము చేయవలయునని తంజావూరు సరస్వతీ మహల్ పుస్తకభాండాగారాధ్యక్షులను ప్రోత్సహింపవలసిన విధి ఆంధ్ర సాహిత్యపరులదై యున్నది. దానిలో సంపాదకులు దిద్దవలసిన భాగములు లేవని కాదు. అనేకము లుండవచ్చును. ఉన్నవి. కాని ఇప్పటికి ఏకైక మూల మనదగిన దానిలో నున్న స్వరూప మెట్టిదో, ఇటీవల వ్రాతలోను ముద్రణములలోను బయలుదేరిన మార్పులేవో తెలిసికొనుటకు తగిన యాధార మున్నగాని, కవ్యుద్దిష్టపాఠము, కవిహృదయము, ఆతని కవితా సంప్రదాయము మొదలగువానిని గూర్చిన పరిశీలనకైన నవకాశము లంతరించి పోవును. కావున నాంధ్రసాహిత్యలోక మీ పాఠ నిర్ణయ విషయమున, కవిసంప్రదాయముల విషయమున నిప్పుడే శ్రద్ధ వహించుట యుక్తమని తోచకపోదు.

ఇట్టి యుద్గ్రంథ మింతకాలము మరుగుపడియుండుటయే ఒక యపూర్వవిషయము. ఇదిగాక ఈతడాంధ్రమున నాదికవి యని తలంపబడుచుండిన నన్నయకు పూర్వుడైనను,

పరమందలి వాడైనను, భాషా సాహితీరచనారీతులయందు భిన్నసంప్రదాయములోనివా డనుటకు సందేహము లేదు. ఆ దృష్టితో నీతని గ్రంథమును పరిశీలించినగాని ఆంధ్రభాషా సాహిత్య చరి లో నీ కవిరాజశిఖామణి కావ్యముయొక్క ప్రాముఖ్యము క్తము కాదు. అయితే యా ప్రాముఖ్యము తేటతెల్లమగుట కూడ అసలు గ్రంథమునందలి పాఠనిర్ణయ మావశ్యకము. కావున ఓపినంతలో దాని నుపక్రమింతము. ఎవరో ఒకరు దారి తీసినగాని దానిగూర్చి పండితులకు శ్రద్ధగలుగదు; చర్చ బయలుదేరదు. కవిహృదయము, కవిపాఠమును గుర్తింపగలుగుటయే సాహితీపరుల కందరకు గావలసినది.

1. కుమారసంభవము–మొదటి పద్యము:

''శ్రీవాణీంద్రామరేంద్రార్చి తమకుటమణి
శ్రేణి నా మాంఘ్రిపద్మా
జీవోద్యత్కేసరుండు......''
(అని యూనివర్సిటీ వ్రాతప్రతి.)

''శ్రీవాణీంద్రామరేంద్రార్చితమకుటమణి
శ్రేణిరామాంఘ్రిపద్మా
జీవోద్యత్కేసరుండు.......''
(అని కవిగారి ముద్రితప్రతి.) 'కా' దిద్దుబాటు.

''శ్రీవాణీంద్రామరేంద్రార్చితమకుటమణి
శ్రేణికామాంఘ్రిపద్మా......''
(అని వావిళ్ల ముద్రణము.)

వీనిలో 'అర్చిత' అని యూ.ప్ర.లో నున్నట్లే వావిళ్ల ముద్రణమున గలదు. కవిగారే 'అర్చిత' అని దిద్దినారు, అన్వయముకొరకు. 'అర్చిత' మైనది మకుటము కాదు. అం ఘ్రిపద్మముగనుక అన్వయము కుదరదు. శ్రీవాణీంద్రామ రేంద్రులచే (అంఘ్రిపద్మములయందు) నర్పింపబడినవి మకుటములు. వానియందలి మణిశ్రేణులయొక్క; నామా, కామా అను శబ్దముల కర్థ మేమియు పొసగు నట్లగపడదు. అది 'ధామా' కావచ్చును. కాంతులు, ఆ మణిశ్రేణుల కాంతులే; అంఘ్రి ప ద్మ ము యొక్క ఆజీవము - పోషణచేత, ఉద్యత్- పైకి లేచుచున్న (ప్రకాశించుచున్న) కేసరములుగా గలవాడు. అనగా శ్రీవాణీంద్రామరేంద్రులాతని పాదపద్మము లకు మ్రొక్కగా, వారి కిరీటములందలి మణిశ్రేణుల కాంతు లాతని పాదపద్మములపై ప్రసరించుటచే, నా కాంతులే పాదపద్మములనుండి పైకి ప్రసరించు కింజల్కములవలెనున్న వని భావము. శివుని పాదపద్మములమీద పడిన మకుటరత్న కాంతులకు ఆ పాదపద్మములనుండి బయలు వెడలు కింజల్కములతో నభేదము సాధింపబడినది. రామా (పాఠము): మణిశ్రేణిచే, రామ=సుందరమైన, అభిరామమైన, అంఘ్రిపద్మముల ఆజీవముచేత ఉద్యత్కేసరుండనుట యుక్తముగా లేదు. మణిశ్రేణియే ఉద్యత్కేసరములుగా గలవాడను వలె. మణులే కేసరము లనుటకంటె, పాదపద్మములపై బ్రసరించిన మణికాంతులను, పద్మములనుండి పైకి వెడలిన కేసరములతో బోల్చుట యుక్తముగా గనబడకపోదు.

కన్నడమున రన్న గదాయుద్ధములో 'శ్రీవాణీంద్రామరేంద్రాంచితమకుట' అని 'అర్చిత' అనుచో 'అంచిత'యని గలదు. అంచు-ధాతువునకు పూజార్థ మున్నను (అంచు గతిపూజనయోః) మకుట శబ్దముతో నా యర్థము నప్పయిం పదు. కావున ఉంచబడిన - ఒప్పుచున్న అను గత్యర్థమును చెప్పుకొనవలసియున్నది. ఆ 'అంచిత' శబ్దసాదృశ్యము చేతనే తెలుగులో 'అర్చిత' వచ్చినదేమో! కవియే 'అంచిత' గ్రహించియుండునా? అను సందేహము గలుగకపోదు. 'అంచిత'కు బదులు 'అరుణ' అను పాఠ మొకటికూడ కనబడుచున్నది. కాని నన్నిచోడుని భావము పాదపద్మముల రకేగాక ఆ పద్మములలోని కేసరముల వరకు బోయినది. మణు లా కేసరము లనుట యుక్తముగా గనబడదు. మణికాంతులు పాదపద్మములపై బడి వాని నుంచి పైకి లేచి, ప్రకాశించునపుడు ఆ మణికాంతులను కింజల్కములతో బోల్చుటచే కవి భావగాంభీర్యము వ్యక్తమగుచున్నది. కవిగారి ముద్రితగ్రంథములోని 'అర్చిత', 'రామా' అను పాఠములను గూడ వదలి వేసి వావిళ్లముద్రణములో 'అర్చిత', 'కామా' పాఠము లేల యాదరింపబడెనో తెలియదు. ఇది సవరణ గాబోలును.

''ఆశ్రితజనలసితాశేషవస్తుప్రదుండు'' 'లస' - విలసనే=ప్రకాశించుట. లష-అభిలాషే. ఆశ్రితజను లభిలషించిన అశేషవస్తువులను ఇచ్చువాడు. 'లసిత' అనునది 'లషిత' అనుదానికి వ్రాతలో గలిగిన పొరపాటు గావచ్చును. వావిళ్లముద్రణమున నట్లే అర్థ మెట్లు గ్రహించినారో?

2. శిద్ధవిస్ఫూర్తి-అని యూ. వ్రా. ప్ర. సిద్ధ-కవిగారి ముద్రి. ప్రతి. సిద్ధ-వావిళ్ల ముద్రిత ప్రతి. రజతపర్వతము నాశో భిల్లు శివుని మూర్తి ''సిద్ధ విస్ఫూర్తి'' అనుటలో అర్థము కానరాదు. 'శుద్ధవిస్ఫూర్తి-శుద్ధము=తెలుపు, తెల్లని ప్రకాశము గల మూర్తి' అనుట యొప్పును.

''మకుటాదిభాతి'' అని యూ. వ్రా.ప్ర. కవి గారి ముద్రి. ప్ర; వా.ము.ప్ర.లో 'మకుటాతిభాతి' అని కలదు. ఆ రజత పర్వతాగ్ర హేమైకశృంగమువలె నమరునది ఈశ్వరుని జటామకుటముయొక్క 'అతిభాతి'=గొప్పకాంతి అనుటయే

యొప్పు. ఇంతే గాక, ఈ పద్యములో కవి ప్రతిపాదము తుదిగణములలో నంత్యప్రాస కూర్చుచున్నాడు. "స్ఫూర్తి మూర్తి" -ఇట్లే "టాతిభాతి"యని యుండనోపును. భూరివారి, పాలలీల, దాతగాత అనియే కలదు. కాని ఎత్తుగీతి రెండవ పాదమున "భోగభోగి"యనియే వ్రాతప్రతిలోను, కవిగారి ప్రతిలోను, వావిళ్ల ప్రతిలోనుగూడ గలదు. ఇది పై నాతడనుసరించిన నియమమునకు భిన్నముగా నున్నది. కావున 'భోగిభోగి' అనియే యుండవలయునని తోచకపోదు.

3. మృగాంక్కు కంద్ధ నిస్ఫురిత -అని యూ.వ్రా.ప్ర. "దండ" అని కవి. ము. ప్ర. "కందు" అని వా. ము. ప్ర. ఇందలి భావ మిది: హరి శివునికి వికచామలాంబుజసహస్రము పూజచేసిన తరువాత నా చంద్రశేఖరుని శిరమున మృగాంకుడు గూడ నుండుటచే, నాతనిం జూచి అది తాను పూజ చేసిన పుష్పములలో వచ్చిన "(అ) విస్ఫురితామలాసితాబ్జ" మని తలంచి, దానిని తీసి వేయు నుద్దేశముతో మృగాంకునివైపు చేయి చాచగా, నీలవర్ణుడగు నీహరి నల్లని బాహువును జూచి చందురు డద్దాని 'రాహు' వని భ్రమపడి "నెఱ దుప్పలదూలుచు" జారదొడంగెను. ఇట్టి వీరిద్దరిని జూచి యీశ్వరుడు నవ్వసాగెను.

ఈ భావమే సరియైనచో, అది కవిభావమే యనుకొన దగినచో "మృగాంకు దండ చాచిన చేయి చాచి" అని "దండ" పాఠమే యుక్తమని తోచకపోదు. "మృగాంకు కందు" అను వా.ము.పా. లో నొక చిక్కుకలదు. మృగాంకునిలోగల 'కందు' ను మాత్రమే విస్ఫురితామలాసితాబ్జ మని తలంచినవాడనవలె. అప్పుడు అబ్జము కందువు మాత్రమా, కందువుతో గూడిన మృగాంకుడా? అను ప్రశ్న కలుగకమానదు. చంద్రునికే అబ్జముతో బోలిక గాని, అందలి కందుకు గాదు గదా! ఈ రీతిగానే దీని తాత్పర్యమును గ్రహించినను మూలములో "కంద్ధ" అని కనబడుచుండుటచే గాబోలు కవిగారు దానిని మరల 'కంద' అని దిద్దినారు. మృగాంకునియందలి కందే అవిస్ఫురితామలాసితాబ్జమని, పుచ్ఛగ=తీసివేయ నెంచి అను భావమే కలుగును. ఈ చిక్కును దొలగించుటకుగా యూ.ము. ప్రతిలో శ్రీ ల. శా. గారు-"మృగాంకునందవిస్ఫురిత" అని మరి యొక మార్పు కల్పించినారు. మృగాంకున్ = చంద్రుని, అందు = ఆ పూన్చిన అంబుజ సహస్రమునందు గల, అవిస్ఫురితమలాసితాబ్జమని తలచి, పుచ్ఛగ చేయిచాచె నను భావముతో 'నంద' పాఠ మొకటి కల్పించినారు.

ఇట్లు 'కంద్ధ, కందు, కంద, దండ, నంద' అని యిప్పటికే ఇన్ని పాఠములు బయలుదేరినవి. ఇంకముం దెన్ని ముద్రణములు గావలిసియున్నవో, ఎన్ని పాఠములు బయలుదేరవలసి యున్నవో? మృగాంకు నందలి 'కందు' నే మలాసితాబ్జమని తలచె ననుట యొప్పు గాదు. కావున 'కందు' పాఠమునకు సాధుత్వము కలుగున ట్లగపడదు. 'దండ' అనునది 'కంద్ధ' అను వ్రాతప్రతిపాఠమునకు సమీపముగా నుండును. 'నంద' అనునది 'కంద్ధ' కు చాల దూరమైనదే గాని, అర్థము సరిగా గిట్టించునదిగా నున్నది. 'కందు' పాఠమున కర్థ మెవరైన పండితవర్యులు గిట్టింపగలరేమో!

ఇక "నెరందుపలందూంగంగం" అని యూ.వ్రా ప్రతి. "నెఱదుప్పలదూలగ" అని కవి. ముద్రి. పాఠము. "దుప్పలఁ దూగగ" అని కవిగారి తప్పొప్పులపట్టికలో దిద్దుబాటు. 'తూగగ' అని వావి. ముద్రి.పా.

మొత్తముమీద నీ ముద్రితప్రతులు వ్రాతప్రతిలోని రూపము ననుసరించుచున్న వనవచ్చును. కాది యిది 'తుప్పలదూగు' అనియా, లేక 'తుప్పలదూలు' అనియా అను సందేహము గలుగకమానదు. ఇందలి వ్రాతప్రతి ననుసరించిన 'తూగగ' అనియే యనవలె. అయితే, ఈమధ్య, సూర్యరాయనిఘంటువువారు దీనిని "తుప్పలు దూలఁ గ" అని గ్రహించి "నెఱదుప్పలు దూలగ జాఱుచున్న" అను పాఠముతో నీ నన్నిచోడుని పద్యమునే యుదాహరించినారు. (తుప్పలఁ దూగగ-వ్రాతప్రతిపాఠము. తుప్పలదూలగ ముద్రి.) అని కుండలీకరణములో వా రిచ్చియుండుటచేత వ్రాతప్రతిపాఠమును, ముద్రితపాఠమును (ఈ ముద్రిత పాఠము మరల 'దూగగ' అని తప్పొప్పుల పట్టికలో మార్పబడినది) గూడ వదలివేసి, దీనిని తాము "తుప్పలు దూలగ" అనియే యుండవలయు నని నిష్కర్ష చేసినట్లగపడుచున్నది. భాస్కరరామాయణము నృసింహపురాణములలో నీ రూపముల గ్రహించిన పాఠములే యీ దిద్దుబాటు కాధారముగా గ్రహింపబడిన ట్లగపడుచున్నది. శబ్దరత్నాకర కారుడు భారతము శాంతి పర్వమునుండి 'తుప్పలు తూలు' అనుట కొక యుదాహరణము నిచ్చినాడు. "దూరమున బోయి తుప్పల దూలియుండె." తరువాతి కవుల ప్రయోగములనుబట్టి దీనిని దిద్దివేసి, వానితో సమీకరణముచేయుటా, లేదా ఏకైకప్రతిలో గనబడుచున్న 'తుప్పల దూంగగ" అను పాఠమును గ్రహించుటా అను విషయమును నిర్ణయించు టెట్లు? దానిని నిర్ణయించువా రెవరు?

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు:

# ప్రసిద్ధ వ్యాఖ్యాతలు : మల్లినాథుడు

వ్యాఖ్యానము-అంటే, వి-ఆఖ్యానం, విశేషంగా వివరించి చెప్పడం అన్న మాట. అయితే ఈ వివరించి చెప్పడం దేన్ని, అలా చెప్పవలసిన అవసరం ఏమిటి అనే ప్రశ్న కలుగవచ్చు. సరిగా తెలియని దానినే- అర్థంకానిదాన్నే వివరించి చెప్పవలసిన అవసరం కలుగుతుంది గదా. ఆ తెలియకపోవడమనేది కూడా అజ్ఞానం వల్ల కలగడం సామాన్యం. ఇంకా కాలగతిని బ గాని, విషయ నిగూఢతను బట్టిగాని, రచనా భేదమును బ గాని, ఇంకా ఇతర కారణాల వల్లనూ కలుగవచ్చును. కాలం గడి న కొద్దీ భాషా జీవిత సంప్రదాయాలు మారిపోతూ ఉంటాయి. ఒక కాలంలో చెప్పింది మరో కాలంలో అర్థం కాకపోవచ్చు. కాబట్టే వేదాలు- వైదిక వాఙ్మయం సులభంగా అర్థం కాకపోవడం, దానిలోని శబ్దాలకు నిర్వచనం చేసి అర్థం చెప్పే నిఘంటువులు రచించడం, తరువాత శాయనాదులు భాష్యాలు వ్రాసి అందలి అర్థాన్ని వివరించి చెప్పడం అవసరమైంది. ఒక కాలంలో భారతీయ విజ్ఞానాన్ని సూత్రప్రాయంగా సూత్రాలలో రచించే అలవాటు లేదా రచించవలసిన ఆవశ్యకత ఏర్పడింది. కొంత కాలమయేటప్పటికి అందిమిడియున్న అర్థాన్ని వివరించవలసిన ఆవశ్యకత ఏర్పడి, వానికి భాష్యాలు రచించవలసి వచ్చింది. ఈ రీతిగా వేదభాష్యం, బ్రహ్మసూత్ర భాష్యం, వ్యాకరణ భాష్యం మొదలైనవి బయలుదేరినవి. ఇందులో ఆయా మతకర్తలు ఆయా మత భేదాలనుద్ఘాటిస్తూ వ్రాసిన భాష్యాలు కూడా కొన్ని ఉ-్నయి. ఇవన్నీ కూడా వ్యాఖ్యానాలే. అయితే ఈ పేరులో మాత్రం కొంత గొప్ప, గాంభీర్యము ఉంది. ఇలాగే పురాణాలకీ, కావ్యాలకీ, ఇంకా ఇతర గ్రంథాలకీ చేసిన అర్థ వివరణాది రచనలను వ్యాఖ్యానాలన్నారు. ఈ వివరణంలో-శబ్దార్థ స్వరూప లక్షణములు, శాస్త్ర కవితా సంప్రదాయ లక్షణాలు, కవి హృదయావిష్కరణమునకు దోడ్పడు అర్థాన్వయ రీతులు మొదలగునవనేక విషయములు సప్రణామగ ప్రపంచింపబడుతూ ఉంటాయి. ఒక్కొక్క గ్రంథాని కనేక వ్యాఖ్యానాలు ఆయా గ్రంథ గౌరవాన్ని బట్టి మత భేదాలను బట్టి రచయిత పాండిత్య ప్రకర్షకు సూచకంగా బయలుదేరుతవి. రామాయణానికి గోవింద రాజీయమనీ, భారతానికి నీలకంఠీయమనీ, భాగవతానికి శ్రీధర వ్యాఖ్య అని ప్రసిద్ధములైనవి. రామాయణ భాగవతాలు మతగ్రంథాలుగా గూడ పరిగణింపబడడం చేత గాబోలు వీనికి ప్రత్యేకంగా తొమ్మిదేసి వ్యాఖ్యానాలు బయలుదేరినవి. తరువాత కాళిదాసాది మహాకవుల కావ్యాలకు నాటకాలకు, ఇతర అలంకార గ్రంథాలకు ప్రసిద్ధ వ్యాఖ్యానాలు వ్రాసి పేరొందిన మహాపండితులనేకులు గలరు. అట్టి సుప్రసిద్ధ వ్యాఖ్యాతలలో మల్లినాథ సూరి యనే ఆయన ఒకడు.

మనదేశంలోని పెక్కు కవులు పండితులు మొదలగు వారి విషయంలో వలెనే, యీ మల్లినాథ సూరి విషయంలో గూడ అనేక కథలు సందేహాలు ఉన్నాయి. ఇతడు ఎవరు, ఏ దేశం వాడు, అనే విషయంలోను, ఈతని యింటిపేరు విషయంలోను చాలా చర్చలు జరిగినవి. ఈతడు కర్ణాటక దేశస్థుడనే వారు కొందరు, కాదు మహారాష్ట్రుడనేవారు కొందరు, ఇంటిపేరు విషయమున కూడ, కొలచలా, కోలాచల, కోలాచలము, కొలచలమా అను విషయంలో సందేహాలు బయలుదేరినవి. ఆయా గ్రంథాల్లో ఆయా రూపాలు కనబడుతూ ఉండడం చేత ఏది అసలు రూపమని నిర్ణయించడం సుసాధ్యంగా లేదు. ఇప్పుడు కొలచిన, కోలాచలం అని యింటి పేర్లు గలవారందరు మల్లినాథ సూరికి సంబంధించినవారనియే తలంచుచుండుటయు గలదు. ఇది 'పందిపాడు, పందిమెట్టు' అను గ్రామ నామములకు సంస్కృతీకరణమనువారు కొందరు. ఏదెట్లైనను ఈతని రఘువంశాది గ్రంథ వ్యాఖ్యానముల తుది గద్యలలో ''ఇతి శ్రీ పదవాక్య ప్రమాణ పారావారపారీణ శ్రీమహోపాధ్యాయ కోలచల మల్లి నాథ సూరి విరచితాయాం'' అని కనబడుతున్నది. ఏకావళీ వ్యాఖ్యలో ''కోలాచల మల్లినాథ సూరి విరచితాయా''మని యున్నది. విద్యానాథ కవి రచితమగు ప్రతాపరుద్రీయానికి వ్యాఖ్య వ్రాసిన కుమారస్వామి యను మల్లినాథ సూరి కుమారుడు కూడా ''తస్య శ్రీ మల్లినాథస్య తనయో జని తాదృశః - కోలచల పెద్దయార్యః ప్రమాణ పద వాక్య పారదృశ్వా యః'' అని చెప్పుట చేత కోలాచల అనునది కోలచల అనుదాన్ని రూపాంతరమేమో యనిపించుచున్నది. అయితే మల్లినాథుని కెనిమిదవ తరమువాడుగా జెప్పికొనిన చంపూరామాయణ వ్యాఖ్యానకర్త నారాయణ పండితుడు ''కొలచెల్మాన్వయాబ్ధీందు ర్మల్లినాథో మహాయశాః-శతావధాన విఖ్యాతో వీరరుద్రాభి వర్షితః'' అని చెప్పుటచేత, వ్యవహారంలో

'కోలచల' అనునది 'కోలాచలం'ఐ తరువాత ''కోలాచలమ'' అయినదా అను సందేహము కలుగుచున్నది. 'కొలచలమ' అనునొక పురము వెలుగోటి వారి వంశ చరిత్రలో నొకచోట ''వీరుండా యాచపృథ్వీవిభుడు. ఘోరాజిం ధాటి జెల్లం కొలచెలమ పురీ ఘోటికాకోటి దెచ్చెన్'' అని, ''కొలచల్మకా డను బలియుడై తురకల గొట్టి యశ్వములను బట్టినాడు'', అని గనబడుచుండుటచేతను, కోలచల, కోలాచలం అనునదే, తరువాతి కాలమున 'కొలచల్మ' గా మారియుండునని తోచుచు న్నది. చంపూ రామాయణము వ్యాఖ్యానమున నారాయణ పండితు డిచ్చిన వంశ క్రమములో కొన్ని తికమకలున్నవి. కాని యీతడు మల్లి నాథుని వంశము వాడనుటుకు సందేహం లేదు. మల్లినాథుడు తన నైషధ వ్యాఖ్యలో సర్వజ్ఞ సింగభూపా లుని రసార్ణ వసుధాకరము నుండి 'లావణ్య' శబ్దలక్షణము నుదాహరించి యుండుటచేతను మన వ్యాఖ్యాత తాత మల్లినా థుడు శతావధాన విఖ్యాతుడు ఓరుగల్లు ప్రతాపరుద్రుని వలన కనకాభిషేకము పొందుటచేతను కొలచెల్మాన్వయేందువగు నారాయణ పండితు డీతని వంశమువాడగుటచేతను మల్లినాథ సూరి రాచకొండ, ఓరుగల్లు ప్రాంతమునందలి 'కోలచలం' గ్రామ వాసి కావచ్చుననియు ధ్రువపడుచున్నది. కావున నీతడు తెలంగాణా ప్రాంతమువాడైన తెలగాణ్య బ్రాహ్మణుడు, కాశ్యప గోత్రుడునగు తెలుగువాడేకాని యితరుడు కాడని నిశ్చయము కావచ్చును.

ఈ కోలాచలం మల్లినాథ సూరి ఉద్దండ పండితుడు. మహోపాధ్యాయుడు. పదవాక్య ప్రమాణ పారీణుడు. శతావ ధాన విఖ్యాతుడు. వీర రుద్రాభివర్ధితుడునైన మల్లినాథుడీతని తాత. ఈతని తండ్రి కపర్ది. గొప్ప మంత్ర కోవిదుడు. శ్రౌత కల్పమునకు కారికలు రచించినాడట. ఇ వంశములోని వాడగు నీ మల్లినాథ సూరి పాండిత్య ప్రక నీతడు తన వ్యాఖ్యానాలకు ముందు వ్రాసికొనిన శ్లోకము నిదర్శనము. అందీతని రచనా గాంభీర్యము కూడా వ్యక్తము కాగలదు:

**''వాణీం కాణభుజీమజీగణ దవాసాసీచ్చ వైయాసికీం**
**అంతస్తంత్ర మరంస్త పన్నగగవీ గుంభేషు చాజాగరీత్,**
**వాచామాచకలత్ రహస్య మఖిలాం యచ్చాక్షపాదస్ఫురాం**
**లోకే భూద్యదుపజ్ఞమేవ విదుషాం సౌజన్య జన్యం యశః.''**

అంటే కాణ భుజీం -అనగా కణాద తర్కం వైశేషిక దర్శనం, వైయాసిక వేదాంత శాస్త్రం, అంతస్తంత్రం - మీమాంసా శాస్త్రం, తరువాత పాతంజల భాష్యం-శబ్దశాస్త్రం, అక్షపాద గౌతమ న్యాయశాస్త్రం వీటన్నిటియందు కూలంకష పాండి త్యము గలవాడు. ఇట్టి అఖండ పండితుడైనా సౌజన్య రాశి యట. పాండిత్యం కంటెను శీలానికే యీత డెంత ప్రాధా న్యము నిచ్చినాడో దీనినిబట్టి తెలుస్తుంది శ్రీనాథాదులు కొందరి విషయంలో వారెంత గొప్ప పండితులైనా కొన్ని అపవాదు లుండుట లోకప్రసిద్ధమే గదా! మల్లినాథ సూరి పాండిత్యము బహుగ్రంథ పరిశీలనము మొదలగునవి యీతని వ్యాఖ్యానములలో సువ్యక్తములే. సంస్కృత భాషాభ్యాసకులకు ప్రథమ పాఠ్యములు గా గ్రహింపబడుచుండిన పంచ కావ్యము లకు - అనగా కాళిదాసుని రఘువంశ, కుమార సంభవ మేఘసందేశ కావ్యత్రయమునకు, భారవి కిరాతార్జునీయము, మాఘుని శిశుపాల వధలకు నీతడు రచించిన వ్యాఖ్య లమూల్య ములు గాన ఈతని ప్రసిద్ధి వ్యాఖ్యాతలందరి లోన చాలవన్నె కెక్కినది ఈ ప్రసిద్ధ పంచ కావ్యములకే గాక యింక ననేక గ్రంథముల కీతడు చక్కని వ్యాఖ్యానములు వ్రాసినాడు. వాని కాతడు పెట్టిన పేళ్ళ లోగూడ చాల సారస్యము గలదు. కాళిదాస త్రయమున కీతడు రచించిన వ్యాఖ్యకు 'సంజీవని వ్యాఖ్య' అని పేరు. ఈ పేరు పెట్టడానికి కారణమతడే చెప్పినాడు:

**''భారతీ కాళిదాసస్య దుర్వ్యాఖ్యావిషమూర్ఛితా,**
**ఏషా సంజీవనీ టీకా తామద్యోజ్జీవయిష్యతి.''** అని.

దుర్వ్యాఖ్యలనే విషంతో కాళిదాసుని వాక్కు మూర్ఛపోయిన దట. దాన్ని ఉజ్జీవింపజేయుటకొరకై యీ సంజీవని అనే టీక రచించినాడట. కిరాతార్జునీయటీక - ఘంటాపథము. శిశుపాల వధకు -సర్వంకష వ్యాఖ్య, నైషధానికి - జీవాతువు. భట్టి కావ్యానికి - సర్వపథీన వ్యాఖ్య. 'ఏకావళి' అను అలంకార శాస్త్ర గ్రంథము విద్యాధరుడు వ్రాసినాడు. 'ఏకావళి, ఒక హారము గనుక దానికి 'తరళ' వ్యాఖ్యానం పేరు. హారం మధ్య నాయక మణి వంటిది. తన్త్ర వార్తికమునకు సిద్ధాంజనం వ్యాఖ్య, స్వర మంజరికి 'పరిమళం' వ్యాఖ్య పేరు. తార్కిక రక్ష అనే గ్రంథా నికి 'నిష్కంటక అనే టీక రచించినాడు. ఈ రీతిగా సుమారు ఒక డజను గ్రంథములకు పైగా నీతడు వ్యాఖ్యలు రచించాడు. 'ఏకావళి' అనే అలంకార శాస్త్రగ్రంథము 14వ శతాబ్ది ప్రారంభ కాలమున కళింగ ప్రభువగు ద్వితీయ నరసింహరాజు ప్రశస్తిని కీర్తించుచు విద్యాధరుడను కవి రచించిన గ్రంథమగుటచే దానికి వ్యాఖ్య వ్రాసిన మల్లినాథుడు 14వ శతాబ్ది చరమ భాగమున నుండి యుండునని తలంచుచున్నారు. సర్వజ్ఞ సింగభూపాలు నికి గూడ తరువాతి వాడనదగియుండుటచేత నీతడు 14వ శతాబ్ద్యంతము 15 ప్రారంభమునను జీవించియుండవచ్చును. మల్లినాథునికి కొడుకు లిద్దరు. పెద్ద యార్యుడు, కుమార స్వామి. వీరు తండ్రిని మించిన కొడుకులు. పెద్దయార్యునికే పెద్దిభొట్లు అని కూడా వ్యవహార ముండి నట్లగపడుతుంది. ప్రతాపరుద్రీయానికి 'రత్నాపణ'మను వ్యాఖ్య వ్రాసిన కుమార స్వామి తన అన్నగారినిట్లు వర్ణిస్తాడు:

''తస్య శ్రీమల్లినాథస్య తనయో జని తాదృశః.
కోలచల పెద్దయార్యః ప్రమాణపద వాక్య పారదృశ్వాయః.

తండ్రితో సమానమైన కొడుకని, నిఖిల శాస్త్ర వ్యాఖ్యాత యని సకల విద్యాపారంగతుడని చె ''తస్యానుజన్మా తదను గ్రహోప్త విద్యానవద్యో వినయావన' '' తానా యన్నగారి యనుగ్రహమున విద్యావినయ సం న్నుడై ''ప్రతాపరుద్రీయ రహస్య భేత్రి''యగుటీకను రచించినట్లు చెప్పకొన్నాడు. ఇట్లే కోలచల వంశ ముద్దండపండితులకు ప్రసిద్ధ వ్యాఖ్యాతలకు పెక్కుతరముల వరకు మూలమై యున్న ట్లగపడుచున్నది. చంపూ రామాయణ వ్యాఖ్యాతయగు నారాయణ పండితుడు 'పెద్దిభట్ట మహోదయుడు' ''మాతులేయక్రతౌ దివ్యే సర్వజ్ఞే నాభివర్షితః'' మేనమామ చేసిన క్రతువునందు సర్వజ్ఞసింగభూపాలునిచే కనకాభిషేక గౌరవమును బొందినట్లు చెప్పినాడు. ఈ పెద్దిభట్టు సర్వజ్ఞ సింగభూపతి కాలము వాడనుటకు మరియొక కథ కూడ గలదు. ఈతడు రాజసభకు సామాన్యపు వేషముతో వెడుతున్నాడు. దారిలో ఎవరో ఆక్షేపించారు. దానికి సమాధానం చెప్పినాడని:-

''కిం వాససా చీకిరి బాకిరేణ,
కిందారుణా వంకరటింకరేణ
సర్వజ్ఞ భూపాలవిలోకనార్థం
వైదుష్య మేకం విదుషాం సహాయమ్.

చింకిరి గుడ్డ లైతేనేం వంకర కఱ్ఱ అయితే నేమి, సర్వజ్ఞ భూపాలుని చూడాలంటే పాండిత్య మొకటుంటె చాలు అన్నాడట. గాంధీమహాత్మునిలాగే మహారాజ సభలోకి వెళ్లినా కొల్లాయి గుడ్డతోనె వెళ్లే మహాపండితులూ ఉండేవారు వెనుకటి రోజుల్లో. ఎల్లప్పుడు పాఠ ప్రవచనములు వ్యాఖ్యానరచనలు చేయుచు ఇంటి విషయాలు పట్టించుకొనేవాడు కాదేమో! కనుక కుండ బోకులు గృహేషులుతంతి లంజనాకొడుకు లెల్ల హసంతి. ఒకనాడింటి కెవరో బంధువులు వస్తే ఏం వండుతావు కూరగాయలని పెద్దిభొట్లు భార్య నడిగినాడట ''ఇత్యర్థముల కూర ఇతి భావముల పులుసు వండుతాను. అవెగదా ఇంటి నిండానున్నవి.'' అని బదులు చెప్పినదట. కావ్య పాఠములు చెప్పేటప్పుడు, వ్యాఖ్యానాలు వ్రాసేటప్పుడు చదువుతూండే స్త్రీ వర్ణన శ్లోకములను ఎప్పుడూ వింటూ ఉండిన ఆతని భార్య ''నన్నెప్పుడూ ఒకసారైనా వర్ణించరే''మని అడిగిందట. అప్పుడాయన తన భార్యను ఇల్లా వర్ణించాడని చెపుతారు:

''మేరుమందర సమాన మధ్యమా
తింత్రిణీ దళవిశాల లోచనా,
అర్కశుష్కఫల కోమలస్తనీ
పెద్ది భట్ట గృహిణీ విరాజతే''

అని వర్ణించాడని చెపుతారు. ఈ కథలకు సంబంధించిన పెద్దిభట్టు రఘువంశాదుల వ్యాఖ్యాత యగు మల్లినాథుడనీ, అది యాతనికి అపరనామమని కొందరు తలంతురు. కాని పెద్దయార్యుడు మల్లినాథుని కొడుకే యని ప్రతాపరుద్రీయ వ్యాఖ్య వ్రాసిన ఆతని రెండవ కుమారుడు కుమారస్వామి చెప్పిన దానిని పట్టి స్పష్టము.

మల్లినాథుని వ్యాఖ్యానములన్నీ

''ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా,
నామూలం లిఖ్యతే కించిన్నా నపేక్షితముచ్యతే''

అని ఆతడు చెప్పి కొన్నట్లుగా చక్కని అన్వయ సరణిని అర్థం చెప్పతూ కావలసిన దానిని చెప్పవలసిన దానిని వదిలి పెట్టకుండా అనవసరప్రసంగములు చేయకుండా, రచింప బడియుండుట చేత ఆయా కావ్యపాఠకులకు మిక్కిలి సుగమములై తక్కిన వ్యాఖ్యానముల కంటె దేశమందంతటను గూడ విశేష ప్రచారమును పొందినవి. సంస్కృత విద్యా భ్యాసకు లెవరును పంచకావ్యములను జదువని వారు గాని మల్లినాథ వ్యాఖ్య సహాయము గొనని వారుగాని యుండరు. కావ్యములకే గాక అలంకారము, సంగీతము, మీమాంసా శాస్త్రములకు కూడా టీకలు వ్రాసినాడు. అపూర్వమైన గ్రంథసామగ్రి నుండి అపూర్వ నిఘంటువుల నుండి ప్రమాణావాక్యాల నుదాహరించి యుండుటచే నా కాలములో నీతడెట్టి గ్రంథ సామగ్రిని సంపాదింప గలిగెనో యను విషయమాశ్చర్యము. మల్లినాథ సూరి తండ్రితాతలు మహా పండితులు, మంత్ర కోవిదులు, శతావధాన విఖ్యాతులు. అతడు అతని కొడుకులు సుమారేడెనిమిది తరముల వరకు సుప్రసిద్ధ వ్యాఖ్యాతలు మహా పండితులెగాక సర్వతోముఖ విశ్వజిద్యాగాదిక్రతువులను జేసిన మహా వైదిక నిష్ఠాపరులు. ఇట్టి మహాపండితుల కాకరమైన కోలాచల వంశము నందలి సుప్రసిద్ధ వ్యాఖ్యాతల మూలముగా ఆంధ్రుల ప్రతిష్ఠ తెలుగు దేశముననే గాక యావద్భారత దేశమందును వెలుగొందిన దనుటకు సందియములేదు. వ్యాఖ్యాన రచనచే మల్లినాథుని వలెను, సంగీత సాహిత్య కవితా వైభవముచే జగన్నాథ పండిత రాయలవలె సంస్కృత భాషా విజ్ఞాన పోషకులై ఆసేతు హిమాలయము యావద్భారత ప్రతిష్ఠనందిన తెలుగు పండితుల సంఖ్య అల్పమే కావచ్చును. కాని వీరివలెనే గీర్వాణ భాషా సాహిత్యమును తమరచనలచే పెంపొందించిన పండితకవు లనేకులు తెలుగు దేశమున గలరు. అట్టి యాంధ్ర కవుల రచనలను చరిత్రమును లోకమున బ్రసిద్ధి గాంచునట్లు చేయుట యాంధ్రుల కర్తవ్యము.

# తమిళ సాహిత్య నిర్మాత - ఇలంగో

సాహిత్య నిర్మాతలు అంటే మనభాషల్లో పెద్దపెద్ద గ్రంథాలు వ్రాసిన వాళ్లన్నమాట. మన తెలుగుభాషలో మొదట ఉద్గ్రంథం వ్రాసినవాడు నన్నయభట్టు గదా. అతడు మొదలు పెట్టిన తెలుగు భారతాన్ని తిక్కన పూర్తి చేశాడు. కాబట్టి నన్నయ తిక్కనలు మన సాహిత్య నిర్మాతలలో మొదటివారు. ఇలాగే పాల్కురికి సోమనాథుడు ద్విపద సాహిత్యానికి, పెద్దన, శ్రీ కృష్ణదేవరాయలు మొదలైనవారు ప్రబంధ సాహిత్యానికి నిర్మాత లని చెప్పవచ్చు. అయితే ఈ ఇల్లంగో అనే ఆయన మన తెలుగు భాషా సాహిత్యానికి సంబంధించిన వాడుకాదు. ఈతడు తమిళ సాహిత్యానికి సంబంధించినవాడు. తమిళ సాహిత్య నిర్మాత లలో ఒకడు. అయితే ఈతడు సాహిత్య నిర్మాతలలో ఒకడు.

మనభాషలో నన్నయను సాహిత్య నిర్మాతలలో మొదటివా డని అనుకుంటున్నాము. అంతకు పూర్వము మనకు లభ్య మైన సాహిత్యం ఏమీ లేదు గనుక, తొలిసారి యీతడు భారతం లాంటి ఉద్గ్రంథం రచించినాడు గనుక, ఈతడు మన సాహిత్య నిర్మాతలలో మొదటివాడైనాడు. అరవ భాషలో ఈ ఇల్లంగో అనునాతనికి పూర్వమందు సాహిత్య రచన లేక పోలేదు. ఆ భాషలోని ప్రాచీన వాఙ్మయాన్ని సంఘవాఙ్మయమంటారు. అది చాలవరకు విశేషంగా కథాచమత్కారంలేని అల్పరచనలతో కూడి ఉంటుంది. విశేషంగా నీతి బోధకములైన పద్యాలు, ఆయా రాజులు చేసిన యుద్ధాలను, వారి పరాక్రమాన్ని, దిగ్విజయాలను, యువతీ యువకుల ప్రణయ కథలను వర్ణించు అల్పరచనలతో కూడినదే గాని, ఉత్తమ పురుషుల కథా వర్ణనాత్మకమైన ప్రౌఢకావ్యములతో కూడినది కాదు. అట్టి ప్రౌఢ కావ్యమును మొదట తమిళ భాషలో రచించిన వాడగుట చేత ఈ ఇల్లంగో అనునాతడు ఈ భాషలో నొక సాహిత్య నిర్మాతగా ఎంచబడుతున్నాడు.

ఈతడు ''శిలప్పది కారం'' అనే కావ్యాన్ని వ్రాశాడు. ఇంతకు పూర్వమందలి కవులందరు రాజులను వారికీర్తిని ప్రశంసిస్తూ పద్యాలు వ్రాసేవారు. కాని ఈ ఇల్లంగో ఒక రాజపుత్రుడు అయి ఉండి, మన కృష్ణదేవరాయలులాగ ఒక ప్రౌఢ కావ్యం వ్రాశాడు. అయితే కృష్ణదేవరాయలు లాగ ఈతడు రాజపుత్రుడైనా రాజ్యం మాత్రం చేయలేదు. రాజ్యం చేయక పోగా రాజ్యాన్ని వదలిపెట్టి, జైనులలో కలిసి జైన సన్యాసి యైనాడు. కాబట్టే ఈతనికి ''ఇల్లంగో అడిగళ్'' అని ప్రసిద్ధి కలిగింది. 'అడిగళ్' అంటే 'దాసుడు, దాసులవారు' అని అర్థం. సన్యాసం పుచ్చుకొని జైన మునుల కందరకు దాసుడై నాడన్న మాట. ఈతని పేరు ''ఇల్లంగో'' కదూ. 'ఇల్లంగో' అంటే 'చిన్నరాజా' అని అర్థం అరవంలో. ఇది అరవమాట అయినా మన తెలుగునకు కూడా సంబంధం లేక పోలేదు. ఆ సంబంధం ఎలా ఉన్నదో మనం కొంచెం పరిశీలించి తెలుసుకో వాలి. 'ఇళం' అనేది తెలుగులో 'ఎల'=ఎలమావిగున్నలంటారే - లేత - అన్నమాట. ఇళంత అనేదీ ఎళంత-లేంత-లేత అయింది. చిన్న అన్నమాట. కో అంటే రాజు అని అర్థం. ఒక దేశానికి రాజును ప్రభువంటాము. ప్రపంచాని కంతటికి రాజు దేవుడు. కాబట్టి 'కో' అంటే 'దేవుడు' అనే అర్థం కూడా వచ్చింది కాబట్టే తెలుగులో ఆ దేవుడి గుడిని కోయిల అంటు న్నాము. గుడి ముందు ఉండే చెరువుకు కోనేరు అంటున్నాము.

ఇంతకు 'ఇల్లంగో' అంటే చిన్నరాజు. ఈతని తండ్రి ''నెడుం చెరలారన్'' అనేవాడు. చేరదేశపు రాజు. అతనికిద్దరు కొడుకులు. అందులో ఇల్లంగో రెండవవాడు కాబట్టే ఇల్లంగో అయినాడు. ఇతడు చిన్నప్పుడే బాగా చదువుకున్నాడు. ఈతడు సన్యాసం పుచ్చు కొన్నదానికి ఒక కథ ఉంది. ఈతని తండ్రి కొకసారి జబ్బు చేస్తే జ్యోతిష్కులు కొందరు వచ్చి ఒకనాడు జోస్యం చెప్పినారట. ఏమనీ? ఆ వృద్ధరాజు కొద్దికా లంలో చచ్చిపోతాడని, రెండవ కొడుకు ''ఇల్లంగో'' రాజ్యానికి వస్తాడని. ఈ మాటవిని పెద్దకొడుకు ముఖం చిట్లించుకొని బాధపడ్డాడట. దాన్ని చూచి తమ్ముడు విచారపడి, అన్న కట్టి బాధ కలిగించిన వాడనైనానే అని విచారపడి, వెంటనే సన్యాసం పుచ్చుకొని, రాజ్యానికి అర్హత లేకుండా చేసుకున్నాడట. ఈ విధంగా జైన మతాన్ని, సన్యాసాన్ని స్వీకరించి, దూరంగా ఆశ్రమం ఒకటి నిర్మించుకొని అక్కడనుండి విద్యా వ్యాసంగం చేస్తూ కొంతకాలానికి 'శిలప్పదికారం' అనే మహాకావ్యాన్ని రచించినాడు. ఇది ఈ భాషలోని పంచమహా కావ్యాలలో ఒకటి.

''శిలప్పదికారం'' అని కావ్యానికి పేరెందుకు వచ్చినదంటే శిలంబు+అధికారం. 'శిలంబు' అంటే కాలికడియం. దాన్ని అధికరించి అనగా దాన్ని గురించి బయలుదేరిన కథగనుక. శిలప్పదికారం అయింది. అనగా ఈ కథలో ఒకావిడ కాలికడి యాన్ని గూర్చిన విషయం ప్రధానంగా వస్తుందన్నమాట. ఎవరావిడ అంటే, ఆవిడే కథానాయిక. కణ్ణకి. ఈమెను గూర్చిన కథే ఇది.

చోళ రాజధాని యైన కావేరి పుర పట్టణంలో 'మాశాత్తు నార్' అనే ఒక ధనికుడైన కోమటి ఉండేవాడు. అతని కొక కొడుకు 'కోవలన్' అనే వాడు. కోవలన్ భార్య కణ్ణకి. చాల గుణవతి. మిక్కిలి పతివ్రత. కోవలన్ బాగా డబ్బు గలవాడు. యువకుడు. పట్నంలో ఆటలు పాటలు చూస్తూ ఒకనాడు మాధవి అనే నర్తకి నాట్యం చూసి దాన్ని మోహించాడు. డబ్బంతా దానికి పెట్టి, భార్య మొహం చూసేవాడు కాదు. కొంతకాలానికి దగ్గరున్న డబ్బంతా అయిపోయేటప్పటికి మాధవి కతని మీద అనురాగం కూడా సన్నగిల్లింది. ఆ సంగతి తెలిసికొని, విరక్తి చెంది, కోమటి బిడ్డ గనక మరల వ్యాపారం సాగిద్దామని ఊరు విడిచి పోవాలను కున్నాడు. దగ్గిర డబ్బు లేదు. భార్యనగలమ్మి వ్యాపారం చేయ వలసి వచ్చింది. ఆమె కూడా వెనుతీయకుండా కాలికడియ మొకటి తీసి ఇచ్చింది. (ఇదే శిలంబు.) దానితో భార్యను వెంట బెట్టుకొని మధురానగ రికి వెళ్ళేడు. అక్కడ బజారులో దాన్ని అమ్మజూపాడు. ఈతడి దురదృష్టం చేత అక్కడ ఒక కంసాలి వాడి చేతిలో చిక్కినాడు. ఆ కంసాలి ఇంతకు పూర్వమే ఆ వూరి రాజుగారి భార్య కాలి కడియాన్ని అపహరించాడు. ఆ కడియం కూడా పైకి ఈ కడియంలాగే ఉంటుంది. కాబట్టి వీలు చిక్కింది కదా అని ఊరికి కొత్తగా వచ్చిన ఈ కోవలన్ అనే వాడే రాణిగారి కాలికడియం అపహరించిన వాడని రాజభటుల కొప్ప చెప్పి బంధింప జేశాడు. ఆ భటులు వాణ్ణి రాజు ఎదుటకు తీసికొని పోయి కడియంతో కూడా చూపించేసరికి రాజు కోపంతో విచారణైనా సరిగా చేయకుండా అతనికి మరణదండన విధిం చాడు. వెంటనే అతన్ని ఉరివేసేశారు కూడాను. ఈ సంగ తంతా తరువాత ఈతని భార్యకు తెలిసింది. పాపం కొత్త ఊళ్లో ఒంటరిగా నున్న ఆమెకు ఏం చేయడానికి కూడా తోచక నిర్ఘాంత పోయింది. చివరికెలాగో రాజు దగ్గరకు వెళ్ళి తనభర్త కేవలము నిరపరాధుడనీ, రాణి కడియమపహరించిన వాడీ తడు కాడనీ, అది తన కాలికడియమే తాను తీసిచ్చితిననీ, అందుకు నిదర్శనముగా అప్పుడు తన రెండవ కాలినున్న రెండవ కడియమును తీసి దానిని పగులగొట్టి ఆకడియములో పల రత్నములు పొదిగి యుండుటను జూపి అట్లే ఆ రెండవ కడియమును పగుల గొట్టగా అందులోనూ రత్నములగ పడుటచే అది రాణి కడియము కాదని తన భర్త నిరపరాధియని ధ్రువపరచినది. ఇది చూచి పాండ్యరాజు తాను చేసిన పాప మును గుర్తించి, దానిని సహింపలేక సింహాసనము నుండి క్రింద పడి వెంటనే మృతినొందెనట. నిరపరాధి యైన తన భర్త మరణమువలన కలిగిన దుఃఖమును సహింపలేక కణ్ణకి కోపోద్దీ పితయై తన ఎడమ వైపు స్తనమును పెరికి ఆ పట్టణము మీద విసిరివేసి ఆ రాజు పట్టణమంతయు తగులబడిపోవుగాక అని శపించినది. అగ్నిదేవుడు వెంటనే ఆ మధురా పట్టణము నంతా దగ్ధము చేసినాడట. అంత కణ్ణకి పశ్చిమాభిముఖియై మలైనాడు నకు వెళ్ళి, నెడవెల్ కుండ్రం అను కొండమీద వెంగైచెట్టుక్రింద కూర్చొని తపస్సు చేయుచుండగా ఇంతలో ఆ మధురా పట్టణానికి కాపుండే అధిదేవత వచ్చి కణ్ణకి ఎదుట ప్రత్యక్షమై, వీరి వెనుకటి వృత్తాంతం కొంత చెప్పింది. ఆమె భర్త కోవలన్ వెనుకటి జన్మలో భరతన్ అనే పేరుతో సింగపురాధీశుని కొలువులో నుండి, నిరపరాధియైన ఒక వర్తకుని గూఢచారుడనే అపోహతో తెలియక చంపివేసినాడట. ఆ కారణంచేతనే ఈ జన్మలో నీయవస్థ ననుభవించ వలసి వచ్చినదనీ, నాటికి 14వ దినమున తన భర్త విమానముమీద వచ్చి తనను తీసికొని స్వర్గారోహణము చేయగలడని చెప్పి వెళ్ళిపోయినది. ఆ కొండ మీద కాపురమున్న కురవలందరు చూచుచుండగా విమాన మెక్కి స్వర్గారోహణము చేసినదట. ఈ విషయమునచ్చటి జనులు రాజు శెంగుట్టువాన్ అను నాతని యొద్దకు వచ్చి చెప్పినారు. రాణి కణ్ణకి కొక గుడి కట్టించి ఆమె విగ్రహాన్ని అందు స్థాపించాలని ఉద్దేశించింది. శెంగుట్టువాన్ ఉత్తర దేశానికి దండెత్తి వెళ్లినప్పుడు హిమాలయ పర్వతాలలోని మంచి రాతిపల కను తెప్పించి కణ్ణకి విగ్రహాన్ని చెక్కించి ''పత్తిని క్కడవు ళాల్'' అనే పేర ఒక దేవతగా ఆగుళ్లో ఆమెను స్థాపించి పూజాపురస్కారాలు జరపడం మొదలు పెట్టారు. ఈ విధంగా కణ్ణకి దేవత అయింది.

ఈ పతివ్రత కథనే ఇలంగో 'శిలప్పదికారం' అనే కావ్యంగా వ్రాశాడు. మాధవి కూతురు 'మణిమేఖలై' అనునామె కథను ఆతని స్నేహితుడగు సత్తనార్ అనే ఆతడు 'మణిమేఖలై' అనే కావ్యంగా వ్రాశాడు. ఈ రెండునూ కూడా తమిళ వాఙ్మ యంలో పంచమహాకావ్యములలో ముఖ్యమైనవి. అందులో ఇల్లంగో వ్రాసిన శిలప్పదికారం అనేక చక్కని వర్ణనలతోనే కాకుండా ఇశై (గీతము) నాటక లక్షణములతో గూడ కూడి ఉంది. గొల్లపడచుల 'కురవైక్కూత్తు' కోవలన్ మాధవిల కానల్‌వరి- సముద్రగానము, ఆటువరి- ఏటిపాటలు, ఊశల్ వరి- ఊయల పాటలు మొదలగు వాటినాయా సందర్భములలో కవి రచించినాడు.

ఇంతేగాక ఆ కాలమునందలి తమిళ రాజ్యములగు పాండ్య, చేర, చోళ రాజ్యములు-వాటి పరస్పర సంబంధములు- దేశ మందలి మత, సాంఘిక జీవిత పరిస్థితులు- జనులకు నృత్య సంగీతాది కళలయందుగల అభిరుచులను ఒకటేమిటి క్రీ.శ. ప్రా రంభమున తొలి శతాబ్దములలోని తమిళ దేశీయుల జీవిత చరిత్రను తెలుసుకొనుటకీ శిలప్పదిగారం ఎంతో సహాయకారి అవుతుంది. ఇట్టి గ్రంథాన్ని రచించిన వాడుగనుకనే- ఇల్లంగో అడిగల్ కవి తమిళ సాహిత్య నిర్మాతలలో ముఖ్యమైన వాడుగా గ్రహింపబడుతున్నాడు.

'కోరాడ' వారి కొన్ని ప్రముఖ రచనలు:

# తమిళ కావ్యము - అగనానూరు

మన దక్షిణ హిందూ దేశంలోని భాషలన్నీ ఒకే కుటుంబమునకు చెందిన సోదర భాషలే గనుక, ఒక భాష మాటాడేవారు ఇతర భాషలలోని సాహిత్య రీతులను, సంప్రదాయములను గూర్చి తెలుసుకొనుట ఎంతయు ఆవశ్యకమే. ఏ భాషలో ఏ కాలంలో ఎట్టి సాహిత్యం బయలుదేరిందో, వీనిపై సంస్కృత భాషా సాహిత్యాల ప్రభావమెట్టిదో, భాషా విషయంలో వలెనే, భావము, ఛందస్సు, రచనారీతులు మొదలగు వానిలో కూడ ఈ సాహిత్యాలకు సమానమైన లక్షణాలేమైనా కలవా, విలక్షణ గుణాలేమిటి, అనే విషయాలు కూడ అవశ్యము పరిశీలింపతగ్గవే. అదట్లుండగా తమిళంలో ప్రాచీనములని చెప్పబడే కావ్యాలు కొన్ని కనబడుతూండగా, తక్కిన భాషలలో అట్టి ప్రాచీన రచనలు కనబడవేమి అనేది కూడా ఒక ప్రశ్న. వీనిని పరిశీలించడానికి సమయం కాదుగాని, ప్రస్తుతం ఆ ప్రాచీన తమిళ సాహిత్యానికి చెందిన ఒకటగు 'అగనానూరు' అను దానిని గూర్చి తెలుసుకుందాం.

తమిళ భాషలోని ఆ ప్రాచీన కాలపు వాఙ్మయాన్ని 'సంఘ' వాఙ్మయమని అంటారు. 'సంఘ'మంటే ప్రాచీన కాలంలో ఈ తమిళ భాషలో రచింపబడిన కావ్యముల గుణగణములను, విలువను నిర్ణయించడానికి ఏర్పాటు చేయబడిన ఒక పండిత పరిషత్తు లాంటిదన్న మాట. అట్టివి ప్రాచీన కాలంలో మూడు సంఘములుండేవనీ, అవి వేల కొలది సంవత్సరముల పాటు అనేక కవుల కావ్యములను పరిశీలించినవనియు, అపారమైన ఆ ప్రాచీన వాఙ్మయమంతా నశించినదనియు సూచించు కథలను కొందరు చెపుతారు. కాని వీనినిప్పుడు విశ్వసించువారం తగా లేరు. కాని క్రీస్తుశకమునకు చాల పూర్వము నుండి తమిళదేశీయులు పాండ్య, చేర, చోళ వంశజులగు దేశీయ ప్రభువుల పాలనలో నుండి, వారి యాస్థాన కవులు వారి విజయమును కీర్తించుచు, అందలి యువతీయువకుల ప్రేమ కలాపములను గూర్చి ప్రణయ గీతములను రచించుచుండెడి వారనుటకు మాత్రము సందేహము లేదు. అవియు చిరకాలము వైదిక ఋక్కులవలె తరతరములుగ జనులలో కంఠస్థములై యుండినవేగాని చాలకాలము వరకు గ్రంథస్థములు కాలేదు. తరువాత కొంతకాలమునకు దక్షిణ దేశమునకు వచ్చి యచ్చట నెలకొన్న ఆర్య భాషా తత్త్వజ్ఞులు అగస్త్యుడు, తొల్కాప్పియనార్ వంటి వారలు, తమిళ భాషా సాహిత్యముల తత్త్వమును పరిశీలించి నిరూపింప గడంగిన తర్వాతనే, అందలి ప్రాచీన రచన లనేకములు ప్రోవు చేయబడుట, గ్రంథస్థములగుట తటస్థించినది. ఇలా ప్రోవు చేయబడిన సంకలన గ్రంథములే 'ఎట్టుత్తొగై, పత్తుప్పాటు, పదినేన్ కీళ్ కణక్కు'' అనే పేర్లతో వ్యవహరింపబడుతు సంఘ వాఙ్మయముగా గ్రహింపబడుతున్నాయి. ''ఎట్టుత్తొగై'' - అంటే ఎనిమిది పద్యమంజరులు గల ఒక పెద్ద గుత్తి అన్నమాట. తొగై - అనగా సమూహము. పుష్పమంజరికి 'తొగ' అని వాడుట కలదు.

ఈ 'ఎట్టుత్తొగై' అను పద్యకూటంలోని - ఎనిమిది పద్యమంజరులలో ''అగనానూరు'' అనేది ఒకటి. దీనినే 'నెడుంతొగై' అని కూడా అంటారు. అనగా దీనిలో 13 మొదలుకొని 31 పాదముల వరకు గల అనగా అంత అంత పొడవు గల పద్యములు సమకూర్చబడి ఉన్నాయన్నమాట. అంతకంటె తక్కువ పాదములు గల పద్యములు అనగా 9-12 వరకు గల పద్యముల కూటమును 'నట్రినై' అన్నారు. మరీ చిన్న పద్యములు గల దానిని 'కురుంతొగై' అన్నారు. ఐంకురునూరు, కలిత్తొగై, పదిట్రుప్పత్తు, పరిపాడేల్, పురనానూరు అనేవి ఈ ఎట్టుత్తొగై లో తక్కిన వాని పేర్లు. ఈ అగనానూరు, పురనానూరు మొదలైనవన్నీ 'అహవల్' ఛందస్సులో రచింపబడినవి. వీటిని అగం, పురం అని కూడా అంటారు. అగం - అంటే అభ్యంతర. పురం = బాహ్యము, అనగా అభ్యంతరమైన స్త్రీపురుషుల ప్రణయ విషయాలను గూర్చి వర్ణించేది అగం అనీ, బాహ్య విషయములగు సాంఘిక రాజకీయాదులను గూర్చి ముఖ్యముగా యుద్ధాదులను గూర్చి చెప్పేది 'పురం' అనీ తేలుతోంది. ఈ విషయాలను గూర్చి వర్ణించే నాలుగేసి నూర్ల పద్యాలిందులో చేర్చబడి యున్నాయి గనుక వీనికి అగనానూరు- పురనానూరు అని పేరు వచ్చింది. ఇంతకూ తేలిందేమంటే అగం అనే శబ్దం అగ్గము అధీనము, అగపడు, గోచరించు అనే అర్థాలతో తెలుగులో కూడ వాడుకలో ఉండనే ఉంది. ఆగ ంతర విషయము, లేదా వస్తువు అనదగిన స్త్రీ పురుషుల ణయ గాథలను అహవల్ ఛందస్సులో వర్ణించే గీతికాగుచ్ఛ నదగిన ఒక ప్రాచీన తమిళ గ్రంథమన్న మాట. అయితే ఇందులో నాలుగునూర్ల పద్యములున్నా యనుకు

న్నాము గదా. ఇవన్నీ ఒక్కరు రచించినవీ కావు, ఒక్క కాలంలో రచింపబడినవీ కావు. ఈ నాలుగు వందల పద్యాలను 145 గురు కవులు రచించినవిగా కనబడుతున్నది. వీటిలో కొన్ని అతి ప్రాచీనములు, అనగా క్రీ.శకమునకు పూర్వకాలము నాటివి కూడా ఉన్నా, పెక్కు క్రీ.శ. తరువాత 4,5 శతాబ్దముల వరకు రచింపబడినవనే పండితుల అభిప్రాయము. అయితే ఒక్క విశేషం మాత్రం ఉంది. వీటిలోని భాష చాలా ప్రాచీనమై సంస్కృత సంపర్కము అంతగా లేక సంస్కృత శబ్దజాలము విశేషముగా అందు ప్రవేశింపని కాలమునాటి రచనలని మాత్రము నిశ్చయింపదగియున్నవి. వీటినన్నిటిని ప్రోగుచేసి ఒక గ్రంథముగా చేసినవాడు రుద్రశర్మ అనునాతడు. ఆతడు ఉగ్రపెరువలుడి అనునొక పాండ్యరాజు ప్రోత్సాహముచే నీ సంగ్రథనము చేసినట్లు తెలుస్తుంది. ఈ సంగ్రథనములో కూడ మరి యొక చమత్కారమున్నది. అది అందలి పద్యములు లేదా ఆ ప్రణయ గీతములు ఆ గ్రంథమున అమర్చబడిన రీతి లేదా ఏర్పాటులో నున్నది. ఈ విషయమును సరిగా అర్థం చేసుకోవాలంటే ఆ కాలంలో 'అగం' అను నీ ప్రణయ వస్తువు కవుల రచనలలో నెట్టి సంకేత రూపములను బొంది యెన్ని విధములుగా వర్ణింపబడుచు వచ్చెడిదో అనే విషయమును కొంచెము ముందర అవగాహన చేసుకొనవలసియుంటుంది. అగం -పురం-అనే ఈ రెండు విషయములను గూర్చి అనగా ప్రణయ వస్తువును యుద్ధాది విషయమును గూర్చి కవులు వర్ణించేటప్పుడు వాటి నాయాదేశ కాల పరిస్థితుల కనుకూలములగునట్లుగానే వర్ణించవలెనను నియమము ఒక సంకేత రూపంగా ఆ భాషలో వెలసియుంది. అనగా ఒక విధంగా మన ప్రబంధాల్లో విరహం వర్ణించవలసి వస్తే ఒక ఆరామము, మలయానిల కోకిలాలాపాలు, చంద్రోపాలంభము, మన్మథోపాలంభము, శిశిరోపచారాలు మొదలగునవన్ని వర్ణింపబడుతున్నట్లే - ఈ ప్రణయ వస్తువుగాని, బాహ్య యుద్ధాదిక విషయముగాని 5 విధములుగా వర్ణింపబడుతూ ఉంటుంది. ఈ అయిదు విధములనేది కూడా దేశము యొక్క 5 భాగాలకు సంబంధించి ఉంటుంది. వాస్తవముగా ప్రాచీన కాలంలో తమిళ దేశీయుల జీవిత పరిస్థితులు కూడా ఐదు విధములుగా విభజింపదగిన ఆ దేశము యొక్క భౌతిక పరిస్థితులను బట్టే ఉండినవని, అట్టి ప్రాచీన జీవిత సంప్రదాయములే తరువాతి కాలపు కవితలో సంకేత రూపమున భాసిస్తున్నవని పలువురి యభిప్రాయము. ప్రాచీన తమిళులు నివసించే దేశ భాగాన్ని 5 రీతులుగా విభజించి దానికి 'తిణై' అని పేరు పెట్టినారు. అందు మొదటిది 'కురింజి' అనగా కొండ ప్రదేశం. రెండవది పాలై - ఆ కొండ ప్రదేశమునకు క్రింద నిర్జలమగు ఎడారి ప్రదేశం. మూడవది - ముల్లై. ఆ ఎడారి ప్రదేశముల తరువాత నుండు అరణ్య ప్రదేశము. నాల్గవది - మరుదం- అనగా నదీలోయలు గలిగి జల సమృద్ధి గలిగి వ్యవసాయమున కనుకూలమగు పల్లపు ప్రదేశము. అయిదవది - నెయ్‌దల్ సముద్రప్రాంత దేశము. ఈ విభాగమున కనుకూలముగనే యచ్చటి జనులు, వారి జీవితం, వృత్తులు, ఆచార వ్యవహారాలు, తుదకచ్చటి పువ్వులు, కాయలు చెట్లు - సంప్రదాయాలు అన్నీ కూడా ప్రాచీన కాలంలో ఏర్పడుచు వచ్చినా, తరువాతి కవులు కూడా వానినట్లే వర్ణింపజొచ్చుటచేత నవి యొక విధమైన సంకేతరూపమును బొంది, ఆ సాంకేతిక లక్షణములే తరువాతి తొల్కాప్పియమువంటి లక్షణ గ్రంథాలలోని కెక్కవలసి వచ్చినది.

తొలుత కవులు ఆయా దేశ భాగములందు తమకు పరిచితములగు జీవిత పద్ధతులను వర్ణిస్తూ పాడి ఉంటారు. తరువాతి కవులు కూడా అచ్చటి జీవిత పద్ధతులు మారిన తరువాత కూడా ఆ పాత సంప్రదాయములనే అనుసరించుటచేత అవి కేవల సంకేతములగుట తటస్థించినది. తొలి కాలములో పశువులే రాజులకు, జనులకు ధనంగా ఉండేవి గనుక ఒకరి పశుగణము నింకొక రపహరించుట కలహ కారణమయ్యేది. కాని తరువాతి కాలంలో కూడా రాజులలో గలిగిన కలహమును వర్ణింపవలసి వచ్చినప్పుడెల్లా ముందుగా పశుగణాపహరణము వర్ణింప మొదలుపెట్టడం చేత అది ఒక సంకేతంగా ఏర్పడిన దనవలసివస్తోంది.

అట్లే కురింజి అను ప్రదేశము జంతువులను వేటాడు బోయవాండ్రకు నివాసమగుటచేత వివాహ విషయమైన సాంఘిక నియమాలుండవు. ప్రణయము స్త్రీ పురుషుల ప్రథమ దర్శనముననే ఏర్పడి పిదప పరస్పరాంగీకారము మీద ఆధారపడి ధ్రువమగుట తటస్థించును. అట్టి యంగీకార చిహ్నముగా పురుషులు స్త్రీలకు పులిగోళ్లను, తలిరుడుపులను బహూకరించుట ఆచారమై యుండును. కాని తరువాతి కాలంలో వివాహోత్పూర్వమందగు నిట్టి ప్రణయము - గాంధర వివాహము వంటి దానికి - 'కళము' అని పేరు పెట్టి ఇట్టి ణయమును కవులు వర్ణిస్తే కురింజి కొండ దేశంలో జరిగినట్టే ర్ణింపవలెనని, ఆ కొండ ప్రదేశమందలి పువ్వులు, చెట్లు మాత్రమే ఆ సందర్భమున వర్ణింపవలెనని నియమ మేర్పరుపబడినది. పులి పళ్లతో గూడిన తాళి, తలిరుడుపులు వరుడిచ్చినట్లు వర్ణించవలెను.

అట్లే 'ముల్లై' అనగా అరణ్య ప్రదేశమున పశువులు కాచుకొనుటకు పురుషుడు పోయినప్పుడు స్త్రీ పురుషులకు శీఘ్ర కాలములో పునస్సమాగమము గలుగును గనుక ఇట్టి అల్ప వియోగమును తరువాతి కవులు వర్ణింపదలచినచో ముల్లైత్తిణై అను నా యరణ్య ప్రదేశమును వర్ణింపవలయునను నియమ మేర్పడినది. ఇక దీర్ఘకాల వియోగమును వర్ణింపవలసినచో నది పాలై - ఎడారి ప్రదేశములో గాని, నెయ్‌దల్ - సముద్ర ప్రాంత

దేశంలో గాని సంభవించినట్లు వర్ణింపవలసినదే. ఏమనగా పాలై - అనగా ఇసుక ఎడారి ప్రదేశములలోని పురుషులు పని లేని వారగుటచే దూర దేశము పోయి జనులను కొల్లగొట్టుకొని వచ్చుటకు చాలకాలము పట్టును. అట్లే చేపల వేటమీదనో లేదా దూర దేశము తోడి వ్యాపారము కొరకో సముద్రయానము చేయు పురుషులు కూడ తిరిగివచ్చుటకు చాల కాలము పట్టును. అట్టి దీర్ఘ వియోగమును వర్ణింపవలసినచో పాలై, నెయ్‌దల్, తిణైలలో జరిగినట్లే వర్ణింపవలెను. ఇక - మరుద త్తిణై అనునది - నదీ మాతృకమగు పంట ప్రదేశము. జనులకు పుష్కలమైన పంట తిండి - సంవత్సరమున కొంత భాగము విరామము గల దేశము. కావున సామాన్యముగా తల్లిదండ్రుల చేత పిల్లలకు చిన్నప్పుడే వివాహాలు జరుపబడుతూ ఉంటవి. కాబట్టే వివాహానంతర ప్రణయము అనగా 'కర్పు' అనునదే ఈ దేశ భాగంలో వర్ణింపబడుతూ ఉంటుంది. ఈ గృహస్థ జీవితమందలి సౌఖ్యము ఇతర స్త్రీ లేదా పణ్య స్త్రీ సంపర్కము వలన భంగమగుట - దాని వలన గలుగు పోరాటములు తుదకు భార్యాభర్తలెట్లో సఖ్యపడుట మొదలైన విషయములన్నీ - ఈ మరుదత్తిణైలోనే జరిగినట్లు కవులు వర్ణించాలి. ఈవిధంగా 'అగం' అనగా ప్రణయమనేది వివాహపూర్వమేర్పడునది 'కళవు' అని, వివాహోత్తరమందేర్పడినది కర్పు అని రెండు విధములుగా నుండునని దానిని కవులు వర్ణించినప్పుడాయా దేశ భాగముల కన్వయించి, తత్సంప్రదాయానుసారముగనే వర్ణించవలయునని నిర్దేశింపబడినది. ఆగం పురంను గూర్చి లక్షణము ఇరయనార్ అగప్పొరుళ్ అనుదానిలో వ్యక్తపరుపబడినది. తొల్కాప్పియములో పొరుళ్ అధికారములో కూడ వ్యక్తీకరింపబడియున్నది.

ఇట్లే ప్రణయ గీతాల నా కాలపు కవులు దేశ విభాగమునకు సంబంధింపజేసి వర్ణింపవలసిన యాచార మొకటి ప్రబలమై యుండుటచేతనే తరువాత ఈ గీతములను ప్రోవుచేసి గ్రంథములుగా సమకూర్చినవారు కూడా తత్సంప్రదాయానుసారముగనే సంగ్రథనము చేసి పెట్టారు. కాబట్టే ఈ అగనానూరులోని 400 గీతములలో ఒకటి మొదలు బేసి సంఖ్య గల గీతములు పాలైత్తిణైకి సంబంధించినవిగాను, రెండు మొదలు నాలుగు ఆరు వ్యవధానము గల సంఖ్యల గీతములు కురింజికి సంబంధించినవిగను, నాలుగు మొదలు 10 వ్యవధానము గల సంఖ్యలు గలవి ముల్లై దేశ భాగమునకు సంబంధించినవిగను, 10,20,30 ఈ రీతి సంఖ్యలు గలవి నెయ్‌దల్ కి సంబంధించినవిగను సమకూర్చబడినవి. ఎట్టుత్తొగైలో మిగిలిన వాటిలో గూడ నేదోవిధముగ నిట్టి యేర్పాటే కానవచ్చును. ఐంకురునూరు అన్నదానిలో కురుంజి మొదలగు ఐదు దేశభాగములకు జెందినవి ఒక్కొక్క దానికి నూరేసి చొప్పున 5 నూర్లు సమకూర్చబడినవి. తక్కిన నట్రిణై, కుఱుందొగై అనువానిలో కూడ అగనానూరులో వలెనే నాలుగేసి నూర్లు గీతములే సమకూర్పబడియున్నవి. ముల్లై - అరణ్య దేశ భాగమున వియోగతప్తయగు నాయిక అంటుంది ''సూర్యుడస్తమించినాడు. ముల్లై పువ్వులు చక్కగా పూచినవి. సూర్యుని ఉగ్రత సాయంతనములో చల్లారినది. నా జీవితము కొరకు నేనీద వలసియున్నచో ఈ చీకటి వెల్లువ సముద్రము కంటె వెడల్పుగ నుండునా?'' నెయ్‌దల్-సముద్ర ప్రాంతపు వియోగము దీర్ఘతమము. ఒక నాయిక అంటుంది: ''నా సౌందర్య మంతయు ఉడిగినది. నా బాహువులు సన్నగిలినవి. రాత్రుల కంటి కొక్కు కునుకైనను రాదు. నాముఖ మెండబారినది. ఇదియంతయు పెద్ద అలలు తీరమునకు గొట్టుచు, అడవి పువ్వుల వాసనలను జిమ్ముచున్న వారిధి యొద్ద నా నాథునితో నవ్వులాటాడిన ఫలితమా?'' పాలై - ఎడారి ప్రాంతమునకు బోయిన నాథుని గూర్చి - నా కురులు కన్నులు మెచ్చుకొనుచు నిన్నటివరకు నాయొద్దనున్న వాడు ఈ దిన మెచ్చటికో చెట్లు, చేమలు లేని యెడారి దేశమునకు బోయినాడని చెప్పుచున్నారు. అచ్చట సూర్యుడు ఒక పట్టున అస్తమించడు. అది ఒక ఇసుక సముద్రము. అక్కడ ఎండమావులను జూచి లేళ్లు నీళ్లని భ్రమపడును. అడవి మామిడి ఉప్పు నేలలో పెరుగును. సున్నపురాళ్లు కాగిన కుండమీద చిలికిన వెన్న చుక్కలవలె ఎండకు కరిగిపోవును.'' మరుదం-నదీ ప్రాంత భూములలో వివాహము తరువాతి ప్రణయము. దానికి ఇతరస్త్రీల వల్ల పణ్య స్త్రీల వల్ల కలుగు విఘాతము పునస్సమాగమము వర్ణితమగును. ప్రాచీన తమిళ వివాహ వర్ణనము: ''పప్పుతో కలిపి వండిన అన్నపురాశి అనగా పులగము వచ్చిన వారికి తృప్తి కలిగించును. రెండు వరుసలుగ రాటలు పాతి వేసినపందిరిలో క్రొత్త ఇసుక పరచినారు. ఇంటిలో దీపములు వెలిగింపబడినవి. పుష్పమాలాలంకృతులగు వధూవరుల చుట్టును ప్రాతః కాలమున కుండలు నెత్తిపై ధరించిన స్త్రీలు పాటలు పాడుచు తిరిగి వత్తురు. వధువు నెత్తిపై నీళ్లు పేలాలును చల్లుచు నిన్ను ప్రేమించు నీ భర్త కనుకూలురాలవై పతివ్రతవై చరింపుము-అని ఆశీర్వదింతురు. ఆరాత్రి నూతన వస్త్రములు గట్టి వధువును వరుని యొద్దకు బంపుదురు. ఉత్సవాలలోను, జాతరలోను చక్కగ నలంకరించుకొని వచ్చి వీథులలో తిరుగుచు పురుషుల నాకర్షించు 'విరళి' నాట్య స్త్రీల నుండి, వారాంగనల నుండి తమ భర్తలను కాపాడుకొనుడని, కుల స్త్రీలు జాగరూకలై యుండుడని చెలికత్తె హెచ్చరిస్తుంది.

ఈ రీతిగా 'ఆగం' - ప్రణయ వస్తువును ప్రాచీన తమిళ కవులు ఆయా దేశ భాగముల కనువగునట్లుగా వర్ణించుచుండేవారను విషయము మనకి ''అగనానూరు''లోని రచనల మూలముగా తెలియవచ్చుచున్నది. దీని మూలముగా ప్రాచీన కాలమునందలి తమిళ జనుల జీవిత చరిత్రమును గూడ మనము చక్కగా తెలిసికొన గలుగుచున్నాము.

Grams : "TELVERS"

Phones Off 234815
236911
Res 248451

# తెలుగు విశ్వవిద్యాలయం
# TELUGU UNIVERSITY



**Prof. C. NARAYANA REDDY**
M A Ph D, D Litt
VICE-CHANCELLOR

Public Gardens
Andhra Pradesh

Lr No. తెవివి/ఉపా/414/92

Date : 11-9-1992

షా సాహితీ వి

అటు తెలుగు భాషా స్వరూప నిరూపణలోనూ, ఇటు ఆంధ్ర సాహిత్య మూల విశ్లేషణలోనూ గడిదేరిన చేయి శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారిది.

భాషా విషయపరిధిలో చూస్తే ప్రాచీనాంధ్ర భాషా స్వరూపాన్ని వివేచించి, దానికి ప్రాకృత సంస్కృతాలతోనూ, ఇతర ద్రావిడ భాషలతోనూ వున్న అనుబంధాన్ని వివరించి చెప్పిన భాషాశాస్త్రవేత్త ఆయన.

సాహిత్య విమర్శన క్షేత్రంలోనూ అంతటి మౌలికాభినివేశంతో కృషిచేసిన విద్వన్మణి ఆయన. భారత కవితా విమర్శనం', 'కాళిదాసుని కళా ప్రతిభలు' అనే విమర్శన గ్రంథాలు ఆయన ప్రగాఢ సమీక్షణ శక్తికి నిలువుటద్దాలు. పాశ్చాత్య విమర్శన పద్ధతులతో, కాళిదాసు కావ్యాలను పరిశీలించి చూపిన ప్రత్యేకత ఆయనది.

ఇంతటి ఉద్దండ పండితుడు తెలుగులోని దేశిసాహితికి దివ్వెలెత్తడం గమనించదగిన అంశం. నిశిత మేధతోపాటు రసమయ హృదయాన్ని పండించుకున్న వ్యక్తిత్వం ఆయనది.

వారిని కలుసుకునే అవకాశం నాకు కలగకపోయినా నా మిత్రులు ఆచార్య మహాదేవశాస్త్రి గారి ప్రతిభామూర్తిలో వారి ప్రతిబింబం చూసుకుంటూ తృప్తి పడుతుంటాను.

(సి. నారాయణరెడ్డి)

# నా చిన్నతనం - కొన్ని జ్ఞాపకాలు

శ్రీమతి భమిడి కమలాదేవి

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి కడపటి సంతానాన్ని, రెండవ కుమార్తెను నేను. వారి సాహిత్య భాషాసేవా, నవ్యమైనవారి విమర్శనా పటిమా, సునిశితమైన వారి ఆలోచనా సరళీ-, ఇవన్నీ సాహితీ రంగంలోని వారికి సుపరిచితాలే. ఇక దైనందిన జీవితంలో - వారివ్యక్తిత్వం, జనక ఋషిలాంటి వారి స్వభావం, నా జీవితం మీద వారి ప్రభావం క్లుప్తంగా చెప్పటం వల్ల వారి మూర్తిని పూర్తిగా పరిచయం చేయడం జరుగుతుందనే ఉద్దేశ్యంతో నాలుగు మాటలు వారిని గురించి చెప్పాలని ఈ ప్రయత్నం.

నా చిన్ననాటి ముచ్చట్లు చెప్పడం మాత్రమే నా ఉద్దేశ్యంకాదు. కాని ఆనాటి ఉన్నతమైన విలువలూ, వాటిప్రభావం ఒక సంపూర్ణ వ్యక్తిత్వాన్ని కల్గించగల తీరూ, అన్నిటికీ మించి తలిదండ్రులు తమ పిల్లలకి ఉత్తమ అభిరుచులు కల్గించటం ఆరోజుల్లో దైనందిన జీవితంలో ఎలా సాధ్యపడిందీ వాటి గురించి చెప్పాలీ అంటే నా చిన్నతనం.....నాన్నగారు.....నేనూ;

''ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ కమలాదేవీ ఉత్తిష్ఠ'' అంటూ తెల్లవారు ఝామున నాలుగున్నరకల్లా లేపేసేవారు. ఓ 5ని ల్లో తెమిలి కూర్చుంటే ప్రాతఃకాల ప్రార్థనకి- ప్రాతః స్మరామి రఘునాథ ముఖారవిందం - అంటూ శ్రీరామచంద్ర మూర్తి సుప్రభాతంతో మొదలుపెట్టి, కస్తూరీతిలకం; చేర్చుక్కగానిడ్డ చిన్ని జాబిల్లిచే సింధూరతిలకమ్ము చెమ్మగిల్ల, అమ్మలగన్నయమ్మ, ధ్యేయస్సదాసవితృమండల మధ్యవర్తి, నమశ్శివాభ్యాం ..... ఇలా సాగేదిమా **prayer**. వారు మొదలు అందిస్తూంటే అలాపూర్తిచేసుకుంటూ పోవడమే.'' అంగనా మంగనా మంతరే మాధవం, హేగోపాలక హేకృపాజలనిధే, నీవే తల్లివితండ్రివి, ఎవ్వనిచే జనించు - ఇలా ఈ పద్యం ఆశ్లోకం అని కాకుండ, భారతం భాగవతం, కృష్ణకర్ణామృతం, ముకుందమాల, కృష్ణశతకం ... ఎందులోవైనాసరే అలా మనసుకి 'బాగుంది' అనిపించిన వాటిని అలాచదువుకుంటూ పోవడమే- ''ఈ పద్యం నాకు చెప్పలేదు నాన్నా'' అనేదాకా సాగేది. ఆపద్యమో శ్లోకమో అప్పటికప్పుడే 5,6 సార్లు వల్లింపజేసి, అర్థం తాత్పర్యం చేప్పేవారు. అంతటితో **prayer** ముగిసేది. అప్పటికి 6గంటలు అయేది. ఓ పదినిముషాల్లో తెమలి మద్రాసులో ఉన్నప్పుడు బీచ్‌కీ, తిరపతిలో ఉన్నప్పుడయితే కపిలతీర్థం దాకానో అలిపిరిదాకానో **mo-rning walk** కి బయలుదేరేవాళ్లం. దారిలో వేంకటేశ్వర సుప్రభాతం శ్లోకాలూ, బాలరామయణంలో శ్లోకాలు చెబుతుండేవారు (నేర్పేవారు). అక్కడికక్కడే అర్థ తాత్పర్యాలతోసహా. నాన్నగారి బోధనలో ఇది మాత్రం ప్రత్యేకం! తిరుపతిలో కపిలతీర్థం వేళ్లేదారిలో గొల్లవాళ్ల ఇళ్లుండేవి. ''యోషాగణేషు వరదధ్ని విమథ్యమానే ఘోషాలయేషు దధిమంథన తీవ్ర ఘోషాః'' అంటూ శ్లోకం చెబుతూ వాళ్ల ఇళ్లకేసి తీసుకెళ్లి వాళ్ళు చల్లచిలకటం చూపించి- ''మనం చెప్పుకున్నామే యోషాగణం... అదుగో వారే! అదే ఆదధి మంథన తీవ్రఘోష, వింటున్నావ్‌గా? ''అంటూ ఆ దృశ్యం మనసులో నిల్చిపోయేలా చెప్పేవారు. అలా అడవిదారిలో ప్రభాతసమయంలో'' భృంగావళీచమకరంద రసానువిద్ధ ఝుంకార గీతాల్ని'' వింటూ అలా నడవడం ఒక మరపురాని అనుభూతి. ఇదీ వారి బోధనాసరళి. **Radio**లో తెలుగు వార్తలొచ్చే **time** కి ఇంటికి చేరుకునే వారు. **Home work** చేసుకుని తెమలి స్కూలికి వెళ్ళటమే. ఇప్పట్లా బోల్డు, బండెడు **home work** ఉండేది కాదు ఆరోజుల్లో!

ఉత్తమసాహిత్యం చదివే అలవాటూ, మంచిసంగీతం మీద అభిరుచీ వారు చేసినవే. అందుకు తగినట్లే ఆరోజుల్లో మద్రాసులో శ్రీబులుసు వెంకట్రమణయ్యగారు, శ్రీ వసంతరావు వెంకట్రావ్‌గారూ, సంధ్యావందనం శ్రీనివాస రావ్ గారిలాంటి- ఆనాటి ఈనాటి మహామహులు మాఇంట్లో ఉండేవారు. **middle school** చదివేరోజుల్లోనే మంచి మంచి చారిత్రకనవలలూ, పౌరాణికనాటకాలూ, శ్రీభమిడిపాటికామేశ్వర్రావ్, మొక్కపాటి నరసింహశాస్త్రి, గురజాడ అప్పారావ్, కాళ్లకూరి వారివంటి మహామహుల హాస్యనాటికలు ఇచ్చి చదివించి, వాటినిగురించి తనకు చెప్పమనేవారు. చదివిన వాటిల్లో నచ్చిన అంశాన్నీ, లేదాకొత్తగా అనిపించిన విషయాన్నీగురించి నాన్నగారితో చర్చించడం చాలా బాగుండేది.

మాస్నేహితులు కొందరు ఆరోజుల్లో కొత్తగా ''యువప్రచురణల'' పేరుతో వచ్చే కొవ్వలి, చలం నవలలు చదువడంచూసి నేనూ ఒకసారి ఎవరూ చూడకుండా చదూదామని మొదలుపెట్టాను. ఆరోజుల్లో వాటిని మరీపెద్ద వాళ్లు ఇష్టపడే వారుకాదు. ఇంతకీ పుస్తకం పేరు ''లాటరీ పెళ్లాం' నాన్నగారు చూసినట్లున్నారు. ఒక్కమాటేనా మాట్లాడుకుండా నాచేతిలోంచి పుస్తకం తీసుకుని మధ్యకిచించేసి పారేసి వెళ్ళిపోయారు. అంతే, నాల్గురోజులదాకానాన్నగారి కంటపడకుండ తప్పుకొని తిరిగాను. వారికిష్టంలేని పనిచేసినందుకు. ఐదోరోజు నన్ను పిలిచి అడవిబాపిరాజుగారి ''హిమబిందు'' నవల ఇచ్చి చదవమన్నారు. ఇదీ వారు మందలించకుండా ఏ పుస్తకాలు చదవాలో చెప్పేతీరు!

వచ్చిన సినిమాలన్నీ చూసే అలవాటుండేదికాదు. 'ఝాన్సీరాణి' పాఠం ఉండేది మాకు. హిందీలో ఆ సినిమా వస్తే తీసుకెళ్లి, పాఠంలో చదివిన దాన్ని సినిమాలో చూసి దానితో అన్వయించి చెప్పే ఆపాఠం మనసుకి హత్తుకునేలా చేశారు. భక్తపోతన, త్యాగయ్య, మల్లేశ్వరీ, ఇవీ వారితో చూసిన మరికొన్ని సినిమాలు.

విలక్షణంగానూ కొత్తగానూ ఆలోచించేతీరు నేర్పేవారాయన. ఏడోతరగతి చదివే రోజుల్లో ఒకసారి వార్షికోత్సవానికి Mono action competition లో పేరిచ్చాను. మాస్నేహితులు కొందరు నాటకాల్లోని ఒక సీనో సినిమాల్లోని సీనో చేస్తున్నట్లు తెల్సుకున్నాను. నేనేం act చేయ్యాలో అర్థం కాక నాన్నగారిని సలహా అడిగాను. (అందుకు ఏదైనా ఒక సీన్ చెప్పండని అడిగితే) మనుచరిత్రలో వరూధినీ ప్రవరాఖ్యుల సంవాదం పద్యాలు నేర్పి చదవమన్నారు. ''ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ'' అంటూ ప్రవరాఖ్యుడు అడుగటం, ''ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర'' అంటూ వరూధిని జవాబూ, మరికొంత సంభాషణా, వాగ్వాదం జరిగాక- '' చెప్పకుమిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్ అంటూ ఛీత్కరించి. ''దానజపాగ్నిహోత్రపరతంత్రుడనేని'' అంటూ హవ్య వాహనుని ప్రార్థించి ప్రవరాఖ్యుడు పురం చేరినవైనమూ ఒక సీన్‌చెప్పారు. రాగయుక్తంగా పద్యం చదవటం నాన్నగారే నాకు నేర్పారు. ''ఎవరూ ఇలా పద్యాలు చదవరు. నేనొక్కదాన్నే చదూతే బాగుండదేమో'' అంటే ''ఎవరూ చదవటం లేదు కనక ఇంకా బాగుంటుంది'' అని ప్రోత్సహించారు. మొత్తానికి వెళ్లి - వరూధినీ ప్రవరాఖ్యసంవాదం Monoaction చేయటం Prize రావటం జరిగింది. వచ్చిన judgesకి కూడా చాలా నచ్చిందీ ప్రయోగం. మను చరిత్రకథ గురించి వచ్చిన వాళ్లలో ఓ judgeగారు ఆనాటి చిన్న meeting లో క్లుప్తంగా చెప్పారు కూడ పిల్లలకి.

ఆరోజుల్లో మద్రాసు అన్నిటికీ కూడలి. సంగీతం సాహిత్యం, కోర్టు, వింత, చదువూ,... ఇలా దేనికైనా మద్రాసు రావలసిందే. అలా మద్రాసు వెళ్ళిన వారెవరేనా ఈ రోజుల్లోలా హోటళ్లలో దిగటం ఉండేదికాదు. మనవాళ్లెవరున్నారో తెల్సుకుని వాళ్లింటి కెళ్లటమే. అటు విజయనగరంనుంచి నెల్లూరు దాకా ఎవరే పని మీద వచ్చినా పూర్తయ్యేదాకా ట్రిప్లికేన్‌లో రామకృష్ణయ్యగారింట్లో దిగాల్సిందే. ఎప్పుడూ వచ్చేపోయె జనాల్తో, నరసింహ జయంతీ, కృష్ణాష్టమీ, శ్రీరామనవమీ, దేవీనవరాత్రుల బొమ్మల కొలువులూ, ఓహ్!! ఎంతో కోలాహలంగా ఉండేది. శ్రీ చిరంతనానంద స్వామివారూ. శ్రీవిశ్వనాథసత్యనారాయణగారూ, గిడుగురామ్మూర్తి పంతులుగారు మామిడి పూడి వెంకట్రంగయ్యగారు, ప్రొ. సాంబమూర్తిగారూ ఇలా అన్నిరంగాల ప్రముఖులూ ఏదోసందర్భాన్ని పురస్కరించుకుని తరుచు వస్తూ పోతుండేవారు. మా ఇంటి మేడమీద అప్పుడప్పుడు కవిసమ్మేళవాలు కూడ జరుగుతుండేవి. ఇవికాక రామకృష్ణమిషన్‌కి, థియసాఫికల్ సొసైటిల్లో జరిగే ఆధ్యాత్మిక ప్రసంగాలకి నాన్నగారితో కూడ వెళ్తుండేదాన్ని. ఆ ఆధ్యాత్మిక వాసనే నాజీవితంలో ఈ నాటికీ పరిమళాన్నిస్తూందనిపిస్తుంది.

మద్రాసులో అప్పుడుప్పుడు రాత్రి 8 గం. ప్రాంతంలో ద్వారం వెంకటస్వామినాయుడు గారింటికెళ్లి కూర్చునేవారం. వారు వైలెన్ వాయిస్తూంటే వింటూ కాస్సేపయాక వారింట్లో మొక్కల మధ్యనున్న సిమెంటు బెంచిమీద ఇద్దరూ కూర్చుని రాగాలూ, రచనలూ, పాడేవిధానాలు గురించి మాట్లాడుకుంటూండేవారు. యూనివర్సిటీలో అయితే ప్రొ. సాంబమూర్తిగారితో సంగీత శాస్త్రగ్రంథాల గురించి చర్చ ఎక్కువగా సాగేది. తిరుపతిలో ఉన్నప్పుడు శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారితో నాన్నగారి సంగీత సాహిత్య సంబంధమైన అనుబంధం చాలా చక్కనిది. ఆరోజుల్లో ప్రతి శుక్రవారం సాయంత్రం శ్రీ శర్మ గారింట్లో శర్మగారు violen వాయిస్తూండేవారు. అప్పుడప్పుడు వారి కుమార్తె పాడే వారు కూడ.

చెంబై వైద్య నాథభాగవతార్, M.S.సుబ్బలక్ష్మి, చౌడయ్యలవంటి పెద్దల కచేరీలకీ, కమలా లక్ష్మణ్, ఉదయశంకర్ లాంటి వారిడాన్సు ప్రోగ్రాములకీ నాన్నగారి కూడ నేనుండాల్సిందే! ప్రకృతి రామణీయకం అంటే నాన్నగారికి తగనిమక్కువ. అందుకే ప్రతి వేసవి శలవుల్లోను కోనసీమకి వచ్చేవాళ్లం. అమలాపురంలో నాకసలు స్నేహితులే లేరు.

నాన్నగారేనాకు అక్కడ స్నేహితులు. అక్కడ కూడ ఉదయాన్నే గోదావరి కాలవగట్టుకి morning walk. పెరట్లో మల్లెపందిరికి పాదులుచేస్తూ, కరుణశ్రీగారి పద్యాలు పుష్పవిలాపం, పుత్తడిబొమ్మ

పూర్ణమ్మా, ''ఆంధ్రతోటల సంస్కృత వనలతాళి అంటు తొక్కిడి ఆంధ్రవిద్యార్థి నేను'' లాంటి చక్కటి పద్యాలు చదివించుకొనేవారు. సాయంత్రానికి రెండు మూడు గంట లేనా అప్పటి వరకూ నేను నేర్చుకున్న సంగీతం పాడించుకునేవారు. శ్రీవిస్సా అప్పారావుగారూ, కల్లూరి వీరభద్రశాస్త్రి గారూ సంకలనం చేసిన ''త్యాగరాజ కృతినమా మ్నాయం'' పుస్తకం ఉండేది. ఆపుస్తకం ఎప్పుడూ నాన్నగా రితో కూడ ఉండేది. రేడియోలో దివ్యనామకీర్తన లేవేనా వస్తుంటే వెంటనే ఆపాట వెతికి చూసి పాడేవాళ్లతో కూడ విని పాడేదాన్ని. దివ్యనామకీర్తనలు, ఉత్సవసంప్రదాయ కీర్తనలు సులభంగా ఉంటాయి కనుక విని నేర్చుకోడం సులభం. ఆపాటకి సంబంధించిన వివరాలు చదూకునే వాళ్లం. ఈ విధంగా ఒకపాట, దాని అర్థం, సందర్భం అన్నీ ఒకసారి మనసులో హత్తుకోడం వల్ల మర్చిపోడం అంటూ జరగదు. ఇలా ప్రతీదీ అధ్యయనమే!

మద్రాసులో ట్రిప్లికెన్‌లో ఎక్కువగా శ్రీవైష్ణవులుండే వారు మాఇంటి దగ్గిర. మాస్నేహితులు మీరు వైష్ణవులా శైవులా అని అడిగేవారు. నిజమే నాకూ తెలీదు. నాన్నగారిని అడిగాను ఈ విషయమే. వెంటనే - శ్రీయన గౌరినాబ రగు'' పద్యంనేర్పి అర్థం చెప్పారు. అంతా వల్లెవేశానే కాని ఇంతకీ మేం ఎవరో అర్థంకాలేదు. ''మనం శివుణ్ణి విష్ణువుని కూడ సమంగానే పూజిస్తాం. మనకి భేదం లేదు అన్నారు. అంతలావిడమరచి చెప్పలే ననిపించిన నేను వాళ్లతో ''మేం పరతత్వం వారం'' అన్నాను! అవును. – పరతత్వభావన మనసులో ఆ చిన్నతనంలోనే గాఢంగా నాటుకునేలా చేశారు నాన్నగారు. ఆ అద్వైత భావనే ఈనాడు ఆదిశంకరుల తత్వాన్ని లోతుగా అర్థం చేసుకోడానికి ఉపకరిస్తూంది. ఇలా నాన్నగారితో గడిపిన ప్రతి క్షణం, ప్రతి విషయం ఏదో ఒక కొత్తవిషయాన్ని (తెలుసుకోడానికే) మనసులో ప్రతిష్ఠించుకుందుకే పనికివచ్చేది.

శ్రీ వీరేశలింగం పంతులు గారి సంస్కరణాభిలాషా ప్రభావం, చాలా మంది మీద ఉన్నట్లే నాన్న గారి మీద కూడ ఉండేదనుకుంటాను. మా పెదతల్లి కుమార్తె అతిపిన్న వయసులోనే పసుపుకుంకుమలకు దూరమై, ఏవిధమైన వ్యాపకమూ లేకుండ పల్లెటూర్లో గడపడం చూసి నాన్నగారు ఎంతో కష్టం మీద అందరినీ ఒప్పించి, తను బాధ్యత వహించి మద్రాసు తీసుకునివచ్చి Lady Willington home లో చేర్పించి చదివించారు. ఆమె అతర్వాత అదేస్కూల్లో ఉపాధ్యాయినిగా చేసి రిటైరై తాను పుట్టిన గ్రామంలో ఒక కాలేజిస్థాపనకు కారకురాలు కాగలిగింది.

స్త్రీలు బైటికి వచ్చి చదువుకోడం అరుదైన రోజులవి. అలా చదూకోవాలని ఉత్సాహం చూపిన శ్రీమతి కాంచనపల్లి కనకమ్మగారు, బత్తుల కామాక్షమ్మగారు వంటికొందరు నాన్నగారివద్ద చదువుకుని విద్వాన్ పరీక్ష పాసైనారు. జీవితంలో తమదైన ప్రత్యేకతను నిల్పుకున్న విదుషీమణుల్లో కొందరు వీరు. ఆనాటి స్త్రీలలో శ్రీమతి దుర్గాబాయమ్మ గారి ధైర్యం, చొరవా, వాక్చాతుర్యాలని ఎంతగానో మెచ్చు కొనే వారు నాన్నగారు.

గాంధీగారి ఆలోచన తీరు నాన్నగారికి చాలా ఇష్టం. భగవద్గీత గాంధీగారి జీవితానికి చుక్కాని వంటిదని చెబుతుండేవారు. నేను పెళ్లయి అత్తవారింటికి వెళ్లేప్పుడు గాంధీగారు కామెంటరీ రాసిన భగవద్గీత ఇచ్చారు. నాకు నిజంగా భగవద్గీత నాదైనందిన జీవితంలో ఎంతో మార్గదర్శ కమై తృప్తిని వెతుక్కుని శాంతిగా జీవించటం ఎలాగో నేర్పింది.

ఇలా వారి ఔన్నత్యం ప్రతీ అడుగుకు మార్గదర్శకమై సాగింది నాజీవితంలో. కేవలం జన్మకారకులుగా మాత్రమేకాక మార్గదర్శకులుగా కూడా వారిస్మృతికి అంజలి ఘటించటం నాకర్తవ్యం.

# ప్రత్యక్ష పరి ^ క్ష

శ్రీ నందూరి రామకృష్ణమాచార్య

**1943 వ సంవత్సరం:-**

అప్పుడు యావ దాంధ్ర వాఙ్మయ జగత్తులో విలసిల్లిన త్రిలింగ పీఠాధి పతులు ముగ్గురు. (1) చెన్నపురి విశ్వ విద్యాలయం ఆంధ్ర శాఖాధినేత శ్రీ కోరాడ రామ కృష్ణయ్య గారు. (2) ఉస్మానియా తెలుగు శాఖకు అధిపతి ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు. (3) ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు - ఆంధ్ర శాఖాధినేత శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు. శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారు కవిగా, శ్రీ పింగళి లక్ష్మీ కాంతం గారు అధ్యాపకుడుగా, శ్రీ కోరాడ రామ కృష్ణయ్య గారు పరిశోధకుడుగా సుగృహీత నామధేయులు. మద్రాసు విశ్వవిద్యాలయానికి ఒక విశిష్టత ఉంది. అది తెలుగు - మళయాళం - కన్నడం - తమిళ భాషలకు కూడలి సంగమేశ్వరం.

1943 సెప్టెంబరు నెలలో నేను మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో పరిశోధకునిగా చేరాను. ఆంధ్ర శాఖాధిపతియైన శ్రీ కోరాడ రామకృష్ణయ్యతో నాకు తొలి పరిచయం అదే.

సౌమ్యగంభీర మూర్తి - మిత భాషి - క్రియాశూరుడు - అనుష్ఠాన వేదాంతి, ద్రావిడ భాషా శాస్త్ర పరిశోధనలో సులువు బలువులు తెలిసిన విద్వాంసుడు, తరతరాల వెలుగులు పండించిన వైదిక విద్వత్ కుటుంబానికి చెందిన వినయమూర్తి. సామాజిక జీవితంలో సాటివారిచే అజాత శత్రువుగా మన్ననలు పడసిన మహానుభావుడు, మేధావులలో మేరు శిఖరి, తెలుగు మహాభారతంపై విశిష్ట విమర్శ వ్రాసిన గ్రంథకర్తగా ఆయన పేరు ప్రఖ్యాతులు అంతకు ముందే విని యున్నాను. ఆయన విగ్రహం - ఆ పేరు ప్రతి ^కు సరి పోయినట్లే భాసించింది. నేటి వరకు ఆ థమ పరిచయం నా మెదడులో చెరగని ముద్రగా నిలిచి ంది.

శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారి దర్శకత్వంలో అంతే వాసిగ పరిశోధన చేయటానికి వెళ్ళిన నేను వారికి అభివాదం చేసి నిలిచాను. వారు మందహాసం చిందే సుందర వదనార విందులై మౌనంగా నాకు స్వాగతం చెప్పి - కుర్చీలో కూర్చోమని చేయి చూపించారు. నాకూ వారికీ జరిగిన సంభాషణ - జ్ఞాపకం ఉన్నంత మేరకు ఈ క్రింద పొందు పరుస్తున్నాను.

శ్రీ కోరాడ : మీరు ఎప్పుడు ఎం.ఏ ప్యాసయినారు?
నా సమాధానం : 1942లో ప్రథమ శ్రేణిలో.
శ్రీ కోరాడ : ఇంత వరకూ ఏం చేశారు?

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పటం నాకు ఇష్టం లేదు. నేను గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో అధ్యాపకునిగా చేరాను ఆగస్టు 1942లో. అయితే - క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనే వారికి సాయం చేశానని భయంకరాచారి ప్రభృతులకు ఆశ్రయం ఇచ్చానని నా మీద అభియోగం మోపబడి పోలీసులు నన్ను నిర్బంధంలోకి తీసుకున్నారు. ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో ఉద్యోగం ఊడి పోయింది. మా మేనమామ గారు ఆత్మకూరి గోవిందాచార్యులుగారు - ('సత్యాగ్రహి' పత్రిక సంపాదకులు-అవి భక్త మదరాను రాష్ట్ర శాసన సభా సభ్యులు) పేరు కెక్కిన కాంగ్రెసు వాది. స్వాతంత్ర్య యోధుడు. 1921 నుండి నాలుగు సార్లు జైలుకి వెళ్లిన త్యాగయోగి. నేను నా పూర్వచరిత్ర దాచకుండా చెప్పిన సమాధానం: ఆంధ్రక్రైస్తవ కళాశాల వారు నా తప్పు లేకుండా నన్ను ఉద్యోగం లోనుంచి తొలగించారు. ప్రస్తుతం నేను నిరుద్యోగిని.

శ్రీ కోరాడ : మీ మేనమామ గారు క్షేమంగా ఉన్నారుగద! వారి ఉత్తర రామాయణానికి నా అభిప్రాయం అందించాను.
సమా : క్షేమంగా ఉన్నారు. రామాయణం పూర్తిగా వ్రాయాలని వారి సంకల్పం.
శ్రీ కోరాడ : మీ సంకల్పం ఏమిటి? ఎందుకు మీరు మదరాసు యూనివర్సిటీలో తెలుగు శాఖలో చేరదలచారు?
సమా : తిక్కన కవితా శిల్పం మీద పరిశోధన చేయాలని నా కోరిక.
శ్రీ కోరాడ : సరే. ఇది ఉద్యోగం కాదు. మూడు నెలల పిదప గాని మీకు నెలకు 60/-రు.ల ఉపకారవేతనం లభింపదు. ఈ మూడు నెలలు పరీక్షా కాలమే.

సమా : ఉపకారవేతనం నాకు ముఖ్యం కాదు. ఇంటరులో నేను శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారికి ప్రత్యక్ష శిష్యుణ్ణి. విశాఖలో శ్రీ పింగలి లక్ష్మీకాంతం - వజ్ఝల చిన సీతారామశాస్త్రి - తదుపరి శ్రీ దువ్వూరి వేంకట రమణశాస్త్రి - శ్రీ గంటి జోగి సోమయాజులు - శ్రీ సోమశేఖర శర్మ - శ్రీ అబ్బూరి రామకృష్ణ రావు ప్రభుతులు నా గురువులు. మీరు - నా గురుంపరలో - మకుటాయమా నులు కావాలని మీ సన్నిధికి వచ్చాను.

శ్రీ కోరాడ రామ కృష్ణయ్య గారు నాకు అప్పగించిన పని ''తిక్కన పద ప్రయోగకోశం'' తయారు చేయటం. ఆంధ్రశాఖలో నేను వారికి ఏకైక శిష్యుణ్ణి. నాకు వారు ఏకైక గురువు మూడునెలలు అహోరాత్రులు కృషి చేసి - తిక్కన పద ప్రయోగ కోశం విరాటపర్వం పూర్తి చేశాను. శ్రీవారి అనుగ్రహంవల్ల నాకు ఉపకార వేతనం లభించింది. అయితే 'కోశం' తయారు చేయటం ప్రత్తి పని అయింది. అది సాహిత్యము కాదు, భాషా శాస్త్ర పరిశోధనా కాదు. నా హృదయం గుర్తించి ఆ కోరాడ వారు ఆరు నెలల పిదప అన్నమాట: ''ఆచార్యవర్యా, ఉదయంపూట కోశ నిర్మాణ కార్యక్రమం-మధ్యాహ్నం పిదప తిక్కన పరిశోధన చేయటం మంచిది''- అన్నారు. పర్యవేక్షకులుగా శ్రీ కోరాడ వారు నాకు ఒక గడ్డు సమస్య ఇచ్చారు. తెలుగు దేశంలో బహుళ ప్రచారంలో ఉన్న కథ ఇది - అక్కన్న బయ్యన్నలు దాయాదులు. విజృంభించి మనుమసిద్ధి మహారాజును సింహా సనం నుండి తొలగించి నెల్లూరును ఆక్రమించారు. మంత్రి తిక్కన గణపతి దేవుని దగ్గరకు వెళ్లి - రాయబారం నడపి - భారతం వినిపించి - ఆయన సాయంతో అక్కన్న బయ్యన్నలను ఓడించి మనుమసిద్ధి మహారాజును నెల్లూరు సింహాసనంపై పునఃప్రతిష్ఠించాడు. ఈ కథనే తిక్కన తరువాత మూడు సంవత్సరాల పిదప ఉన్న కాసె సర్వప్పకవి - సిద్ధేశ్వర చరిత్ర ది పద కావ్యంలో వ్రాశారు. సోమదేవరా జీయం అనే పద్య కా ంలో అదే కథ కనుపిస్తోంది. అయితే - శ్రీ కందుకూరి శలింగంగారు - తమ కవి జీవితాలలో ''సోమదేవ రాజీయంలో చెప్పబడిన ఈ కథ కవి కల్పిత మనుటకు సందేహము లేదు.'' అని నొక్కివక్కాణించి తీర్పు చెప్పారు. ఈ కథకు - చారిత్రక సాక్ష్యం సమకూర్చమని నన్ను పర్యవేక్షకులు శ్రీ కోరాడ గారు ఆదేశించారు.

''ఇది ఏ విధంగా సాధ్యం?''-అని నేను లోలోపల అనుకున్నాను. పర్యవేక్షకు లైన శ్రీ కోరాడవారు నాకు మార్గదర్శకులై శిలాశాసనాలు పరికించ మన్నారు. వివరాలు తెలిపారు. నెల్లూరు జిల్లా శాసనాలు వేణుగోపాలు, బట్టర్‌వర్త్ వ్రాసినవి రెండు సంపుటాలు చూచాను. కాటమరాజు కథ. ఆ యుగానికి సంబంధించిన సారస్వత గ్రంథాలు చదివాను. నేను మూడు నెలల కొకసారి 'నివేదిక' సమర్పించాలి. నాకు అంతా అంధకార బంధురంగానే ఉంది. శ్రీ కోరాడ వారి దగ్గరకు వెళ్లి నేను చేసిన కృషి వివరించి - ఫలితం శూన్యం అని విన్నవించాను. ఒక పద్యం కూడా వ్రాశాను

''గడ్డివాములోన కలిసి పోయిన సూది
వెలికి తీయవలెను వెదకి పట్టి
ప్రతిభ కాదు - ఓర్పు పరిశోధన మటన్న
రమ్య హాసలోల - రామకృష్ణ!''

శ్రీ కోరాడ వారు ఆగ్రహించలేదు.

ఈసారి ''దక్షిణ భారత శాసనాలు'' - రంగాచారిగారి సంపుటిలో పరిశోధించమన్నారు. మరి మూడు నెలల పిదప - మూడు శాసనాలు లభించాయి - మనుమసిద్ధికి సంబంధించినవి. ఒక దానిలో గణపతి దేవ చక్రవర్తి పేరు ఉన్నట్లుంది. అది గుంటూరు మండలంలో, నాయనిపల్లి గ్రామంలో దొరికిన శిలాశాసనం. శ్రీ కోరాడ వారు నన్ను అభినందించి ఆ శాసన ప్రతిని తెప్పించి అందులో ఏ మున్నదో చూడాలి అన్నారు. ఉదకమండలం నుండి ఆ శాసన ప్రతిని తెప్పించి - నన్ను చదవమన్నారు. అందులో ఒక అక్షరం గూడ నేను చదువ లేక పోయాను. మల్లంపల్లి సోమశేఖర శర్మగారి నుండి శాసన లిపి నేర్చు కున్నాననే నా గర్వం నేల కొరిగింది.

శ్రీ కోరాడ వారు నవ్వుతూ - ''ఈ శాసనం గ్రంథ లిపిలో ఉంది - శ్రీ మల్లంపల్లి సోమ శేఖర శర్మ గారు బ్రాహ్మీలిపి మాత్రమే చదువగలరు'' అన్నారు. అయితే అది మదరాసు విశ్వవిద్యాలయం కాబట్టి ప్రాచీన తమిళ లిపి గ్రంథలిపి - శ్రీ నీలకంఠ శాస్త్రి నాకు చదివి దాని అర్థం వినిపించారు.

''గణపతి దేవ చక్రవర్తి - అక్కన్న బయ్యన్నలను జయించి నెల్లూరు తగుల బెట్టి - మనుమసిద్ధి మహా రాజును సింహాసనం ఎక్కించి''నట్లు అందులో ఉంది. నా కృషి ఎట్టకేలకు ఫలించింది. అప్పుడు వెంటనే ''భారతి '' మాస పత్రికలో తిక్కన నాటి ఐతిహ్యం ద్వారా ఆ శాసన విషయం ప్రచురించాను. ఆ శాసన సంఖ్య 369; దొరికిన సంవత్సరం 1922.

మరు సంవత్సరం - మదరాసు విశ్వవిద్యాలయంలో ఆంధ్రశాఖ సంఖ్య మూడుకు పెరిగింది. శ్రీ నిడుదవోలు

వేంకటరావు గారు ఉపన్యాసకులుగా చేరారు ముగ్గురికి మూడు గదులు ఉండేవి. ''పరశోధన'' తప్ప వేరే పని యేదీ ఉండేదికాదు.

రెండేండ్ల పరిశోధన గడపిన పిమ్మట - నాకు భీమవరం కళాశాలలో ప్రాచ్యభాషా పీఠాధిపతిగా ఉద్యోగం లభించింది. అప్పుడు మదరాసు యూనివర్సిటీకి ఉపాధ్యక్షుడు డాక్టరు లక్ష్మణస్వామి మొదలియారు గారు నాకు ''విడుదల పత్రం'' ఇవ్వటానికి నిరాకరిస్తూ అన్నమాట - ''అవివేకి యైన ఓ యువకుడా! - ఇంతవరకు భారతదేశంలో బ్రిటిషు యుగంలో అధికులు అల్పస్థానాలలో పని చేయవలసి వచ్చింది - ఇక - స్వరాజ్యం వచ్చిన పిదప, అల్పులు పెద్ద పదవులు అధిష్ఠిస్తారు - నీవు పిహెచ్.డి. డిగ్రీ పుచ్చుకొని వెళ్లు''.

అయితే శ్రీ కోరాడ వారు నన్ను ఊరడించి - పదిరోజుల పిదప విడుదల పత్రం వచ్చేటట్లు చేశారు.

మరికొంత కాలానికి మైసూరు విశ్వవిద్యాలయానికి 'తిక్కన కవితాశిల్పం' శీర్షిక మీదనే - నేను థీసిస్ సమర్పించి డాక్టరేటు పట్టం సంపాదించుకున్నాను అయితే నా థీసిస్ అచ్చు వేసినప్పుడు పీఠికలో శ్రీ కోరాడ రామ కృష్ణయ్య గారు నాకు పెట్టిన పరిశోధనా భిక్ష ఇది అని పేర్కొన్నాను. డాక్టరు బెజవాడ గోపాల రెడ్డిగారు ఒకసారి నన్ను అడిగారు - ''మీరు శ్రీ కోరాడ వారి పర్యవేక్షణలో తయారు చేసిన తిక్కన పద ప్రయోగ కోశం ఏమైంది?'' ఆ కోశం ఎప్పటి కప్పుడు తయారయిన మేరకు మూడు నెలలకు ఒకసారి మద్రాసు యూనివర్సిటీకి సమర్పించి యున్నాను- శ్రీ కోరాడ వారి ద్వారా. ఏమైందో నాకు తెలియదు. ఇది అర్ధ శతాబ్ది నాటి మాట.

మద్రాసు విశ్వ విద్యాలయం తెలుగుశాఖ గొప్ప పరిశోధనా వ్యాయామశాల. ఏతత్ పీఠాధిపతి చాలాకాలం శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు. వారు చేసిన కృషి అనన్య సామాన్యమైన కృషి - వారు వ్రాసిన సంధి మొదలైన గ్రంథాలలో సాక్షాత్కరిస్తుంది.

''శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః
ఆ యే దివ్య ధామాని తస్థుః।
వేదాహ మేతం పురుషం మహాంతమ్
ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్॥''

"Listen to me, Ye, sons of the immortal spirit, ye, who live in the heavenly abode! I have known the supreme person, whose light shines forth from beyond darkness"

— (శ్రీ 'కోరాడ' వారి డైరీనుంచి)

# శ్రీ కోరాడ రామకృష్ణయ్య

శ్రీ మేకా రంగయ్యప్పారావు

ఈ శతాబ్దం పూర్వార్థంలో తెలుగు పరిశోధనా రంగ వైతాళికులుగా వెలసిన సాహితీ వేత్తలు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు. ప్రాక్రుతీపీ విజ్ఞాన పారంగతులైన రామకృష్ణయ్యగారు తెలుగు భాషా వ్యాకరణాధ్యయనంలో ఆధునిక భాష శాస్త్ర పద్ధతిని, తెలుగు సాహిత్యాధ్యయనంలో పాశ్చాత్య సాహిత్య విమర్శ సూత్రాలకు అనువృత్తిని ప్రవర్తింపజేశారు.

రామకృష్ణయ్యగారు ఖర నామ సంవత్సరం ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నాడు (1891 అక్టోబరు 2వ తేదీన) వేదశాస్త్రాధ్యయన పరాయణులైన శిష్టాచార సంపన్నుల వంశంలో జన్మించారు. వారి పితృపాదులు, పితామహులు కూడ మచిలీ పట్నంలో ఉన్న నోబుల్ కళాశాలలో పండితులుగా పని చేశారు. రామకృష్ణయ్య గారు ఆ కళాశాలలోనే విద్యాభ్యాసంచేసి, 1915లో పట్టభద్రులైన పిదప విజయనగరంలోని మహారాజా కళాశాలలో ఉపన్యాసకులు గాను, దేశ భాషాశాఖ అధిపతులుగాను నియమితులయ్యారు. వారక్కడ 12 సంవత్సరాలు పని చేశారు. ఆకాలంలో వారు పెక్కుమౌలిక వ్యాసాలు మహారాజా కళాశాల పత్రికలోను, భారతి మున్నగు పత్రికలలోను వ్రాశారు. ఆవ్యాసాలలో "ద్రావిడ భాషాపద చరిత్రము" వంటి ద్రావిడ భాషేతుల నాత్మ కాధ్యయనానికి సంబంధించిన వ్యాసాలు చాలా ఉన్నాయి. వారు 1924 నుండి ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్స్ సమావేశాలలో పాల్గొన్నారు. 1944లో తిరుపతిలో జరిగిన ఆ కాన్ఫరెన్స్ తెలుగు విభాగానికి అధ్యక్షులు గాను, 1947 లో దర్భంగాలో జరిగిన ఆ కాన్ఫరెన్స్ ద్రావిడ సంస్కృతి విభాగానికి అధ్యక్షులుగాను వ్యవహరించారు.

1927లో మద్రాసు విశ్వవిద్యాలయాల భాషా శాస్త్రాధ్యయన ప్రాముఖ్యదృష్టితో తమిళ, తెలుగు, కన్నడ, మలయాళ భాషా విభాగాలను పునర్వ్యవస్థీకరించినపుడు, అప్పటి ఉపాధ్యక్షుడు సర్ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు రామకృష్ణయ్యగారిని తెలుగు విభాగంలో పనిచేయడానికి ఆహ్వానించారు. రామకృష్ణయ్య గారు 1927 నుంచి 1950 వరకు మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు విభాగ అధిపతిగా పని చేశారు. మద్రాసులో పదవీ విరమణ చేసిన తర్వాత వారు తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర ప్రాచ్యపరిశోధన సంస్థలో చేరారు. అక్కడ ఆరేళ్లు పని చేశారు. ఈ నలభైఏళ్ళలోను (1915-1956) వారు తెలుగు భాషా సాహిత్య సంస్కృతులకు అమూల్యమైన సేవ చేశారు.

## తెలుగు భాష

రచనలు:

1) భాషోత్పత్తి క్రమము – భాషాచరిత్రము: భాషాశాస్త్ర సిద్ధాంతానికి పీఠికా ప్రాయమైన ఈ పుస్తకం భాషల మధ్యగల సజాతీయ సంబంధాన్ని నిరూపించడంలో అనుసరించిన సూత్రాలను వివరించడంతో పాటు పదాలస్వరూప, అర్థాల మార్పులను కూడ విశదీకరిస్తుంది.

2) సంధి: ఈ గ్రంథం సంధి సూత్రాలను చారిత్రక దృష్టితో చర్చిస్తుంది. తెలుగు భాషాశాస్త్ర గ్రంథాలలో అతిముఖ్యమైన వాటిలో ఇదొకటి "... ఒక భాషయందలి తాత్కాలిక వ్యాకరణ విశేషముల సమన్వయదృష్టితో పరిశీలించి వానితత్త్వమును తెలుసుకొనవి యాభాషాచరిత్రమును తెలుసుకొన సాధ్యము కాదు గదా. ఆంధ్ర భాషా చరిత్ర కిట్టి చారిత్రక వ్యాకరణము పునాదివంటి దగును కావున నీ భాషలోని శబ్దముల విజ స్వరూప నిరూపణమున దోడ్పడు సంధి నియమములను చారిత్రక పద్ధతి ననుసరించి ఇతర సన్నిహిత భాషాలక్షణములతో పరిపోల్చియందలి విశేషములను సకారణముగా సమన్వయించుటకు ఇందు నా చేతన యిన ప్రయత్నము చేయబడినది. ఆంధ్ర వ్యాకరణతత్త్వ పరిశోధన విషయమున చారిత్రక పద్ధతి నవలంబింప జేయుటకీ రచనము కొంతవరకైన తోడ్పడ గలదని నమ్ముచున్నాను. (పీఠిక)

3) స్టడీస్ ఇన్ ద్రవిడియన్ ఫైలాలజీ (ద్రావిడ భాషా శాస్త్ర పరిశీలనం): ఈ ఆంగ్ల గ్రంథం ఆర్యద్రావిడ భాషల పరస్పర ప్రభావాన్ని తెలుపుతూ, నామవిభక్తి క్రియావిభక్తుల

విషయంలో ద్రావిడ భాషల సంయుక్త పదరూపతత్వ లక్షణాన్ని వివరిస్తుంది.

4) ద్రవిడియన్ కాగ్నేట్స్ (ద్రావిడభాషా సజాతీయ పదాలు): ద్రావిడ భాషాధ్యయనానికి ద్రావిడ భాషలలోని సజాతీయ సమానార్థక పదాల సేకరణ అత్యావసరమైన ఆధారమని కాల్డ్‌వెల్ తన "కంపేరిటివ్ గ్రామర్ ఆఫ్ ద్రవిడియన్"లో నొక్కి చెప్పారు. రామకృష్ణయ్య గారు ఈ విషయమై చేసిన సేకరణ తొట్టతొలికృషి.

5) తెలుగు లాంగ్వేజ్ ఇన్ ది ఫస్ట్ మిలినియం ఎ.డి (ప్రాఙ్నన్నయ యుగంలో తెలుగు భాష): ఇది తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయం జర్నల్‌లో ధారావాహికంగా ప్రచురితమైంది. క్రీస్తు శకం 1000 వరకు ఉన్న శాసనాలు ఆధారంగా ప్రాచీన తెలుగు భాషకు చారిత్రక వ్యాకరణం వ్రాయడానికి మొట్టమొదటి ప్రయత్నమిది.

6) భాషా చారిత్రక వ్యాసములు: భాషా శాస్త్ర వ్యాసాల సంకలన మిది

అనల్స్ ఆఫ్ ఓరియంటల్ రిసెర్చి మొదలయిన పత్రికలలో ప్రచురితమైన అసంఖ్యాకమైన వ్యాసాలున్నాయి. 'ద్రవిడియన్ ఫొనెటిక్స్' 'ది ద్రవిడియన్ ఇన్‌ఫినిటివ్', 'ద్రవిడియన్ పాసివ్', ద్రవిడియన్ ఇన్ ఫ్లెక్షన్' మొదలయినవి. ఈ పుస్తకాలు, వ్యాసాలు ద్రావిడ భాషల పద వాక్య నిర్మాణంలో సామ్యాన్ని చూపడమే కాక తెలుగు సంస్కృత జన్యమనే సిద్ధాంతాన్ని పరాస్తం చేశాయి.

## సాహిత్యం

7) ఆంధ్రభారత కవితా విమర్శనము:- రామకృష్ణయ్య గారు ఈ గ్రంథం పీఠికలో 'భారతమే యీ భాషలో మొదటి యుద్గ్రంథమనుటచే తద్భాషా వాఙ్మయ పరిణామమున కిది ఎంతవరకు తోడ్పడినదో తెలుసు కొనవలసిన యావశ్యకత కలదు.....కావున భారత కవితకు, తత్తద్దేశ కాల పరిస్థితులకు నెట్టిసంబంధము కలదో, ఇది యాంధ్ర భాషా పరిణామమున కెట్లు తోడ్పడినదో, కవి త్రయము యొక్క అందు ముఖ్యముగా కవి బ్రహ్మ యొక్క కవితా నిర్మాణ చాతుర్య మెట్టి విశేష గుణములు కలదగుటచే సర్వాతిశాయియై వెలయు చున్నదో పరిశీలించి వివరింపగల విమర్శను'గా దీనిని రచించినారు. హిందూ పత్రికలో ఈ గ్రంథం పై ప్రచురితమయిన సమీక్ష "కవిత్వ తత్త్వ విచారంలో సాహిత్యవిమర్శలో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చిన కట్టమంచి రామలింగారెడ్డిగారే ఆంధ్ర మహా భారతంపై విమర్శాత్మకమైన పరిశీలనను వెలువరిస్తారని తెలుగు సాహిత్య ప్రపంచం ప్రతీక్షించింది. కాని కోరాడ రామకృష్ణయ్య గారి రచన అలాంటి అవసరాన్ని తీర్చింది" అనిముక్త కంఠంతో ప్రశంసించింది. ఈ గ్రంథం పాఠకులపై చెరగని ముద్రవేసి, మహారంజకమైంది.

8) దక్షిణదేశ భాషా సాహిత్యములు-దేశి: ఈ గ్రంథం ఆర్యేతర భాషా, భావనలు ఆర్య సంస్కృతిలో అంతర్వాహినిగా విడదీయ రానంతగా చేరపోయినవని నిరూపిస్తుంది. దక్షిణ భాషల ప్రాచీన సాహిత్యంలోని ఛందస్సాహితీ రీతుల విశేష లక్షణాలను బట్టి ప్రాచీన దక్షిణ దేశీయ మైన దేశికి సంబంధించిన వివిధ విషయాలను ఈ గ్రంథం తలస్పర్శిగా పరిశోధిస్తుంది.

9) తెలుగు లిటరేచర్ ఔట్‌సైడ్‌ది తెలుగు కంట్రీ (తెలుగు దేశానికి వెలుపలి తెలుగు సాహిత్యం): దక్షిణాంధ్ర వాఙ్మయ యుగంలో దేశిసాహిత్య పునరుద్ధరణ, ఆధునిక తెలుగు సాహిత్య లక్షణాలుగా పరిణమించిన కొన్ని సాహిత్య శాఖల అభివృద్ధి తెలుగు దేశానికి వెలిగా ఉన్న రాజ్యాలను పాలించిన తెలుగు రాజుల చలవే. తరువోజ వంటి దేశి వృత్తాలు ఎంత సులభంగా గానయోగ్యలవుతాయో లేక బహుశా మొదట రాగతాళ లయలతో ఉన్న దేశీవృత్తాలే తర్వాత వృత్తాలుగా తీర్చబడినాయా అనే విషయాలు ఈ గ్రంథంలో నిరూపితాలు. ఇందులో మునలమ్మలు పాడే పాటలలోను, బిచ్చగాళ్ళు వీధులలో పాడే పాటలలోను, కార్మికులు, కర్షకులు పొలాలలో పాడే పాటలలోను, గ్రామసీమలలో ఇతర పనిపాటలలో పాడే పాటలలోను తెలుగులోని 'పాత దేశి ఛందస్సు ఇంకా సురక్షితమై ఉందని మనం విశ్వసించవచ్చు" అని ఈ గ్రంథం మనకు హామీ ఇస్తున్నది.

10) కాళిదాసుని కళాప్రతిభలు: ఈ పుస్తకం కాళిదాసుని వ్యక్తిత్వాన్ని, నాటక కళానైపుణ్యాన్ని వివరిస్తుంది. రామ కృష్ణయ్య గారి తొలి రచనలలో ఒకటయిన ఈ పుస్తకం సాహిత్య విమర్శలో ఆధునిక పద్ధతులను అనుసరించాలని నొక్కి చెబుతుంది.

రామకృష్ణయ్యగారు మద్రాసు విశ్వవిద్యాలయంలోను, తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన సంస్థలోను నవనాథ చరిత్ర, పరతత్త్వ రసాయనము, వల్లభాభ్యుదయము, నన్నిచోడని కుమార సంభవము, ము గు పదిహేను, పదహారు గ్రంథాలను పరిష్కరించి వి ల పీఠికలతో ప్రచురించినారు. వల్లభాభ్యుదయము కృష్ణా రంలోని శ్రీ కాకుళక్షేత్ర మాహాత్మ్యాన్ని విశేషంగా కీర్తిస్తుంది. ఈ గ్రంథం పౌరాణిక విషయాలను మాత్రమే కాక ప్రాచీనాంధ్ర (సాతవాహన) రాజుల చరిత్రను కూడ చెబుతుంది. కుమారసంభవం

విచిత్రమైన సాహిత్య సమయాలు, భాషావిశేషాలు ఉన్న అత్యుత్తమ కావ్యం.

దీనికి రామకృష్ణయ్యగారు విచక్షణతో సంస్కరించి, అత్యంతాముల్యమైన, పీఠికను, విచిత్రమైన పదాలు, జాతీయాల పలుకుబళ్ళ ప్రయోగాల పట్టికలను, పాఠాంతరాలను సంతరించారు. తిరుపతిలో శ్రీ రామకృష్ణయ్య గారు శ్రీనివాస విలాస సేవధి (ద్విపద), వేంకటాద్రి మాహాత్మ్యము (వచనం) మున్నగు పెక్కు పుస్తకాలను, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ప్రారంభించిన శ్రీ వెంకటేశ్వర స్తుతి రత్నమాలను, శ్రీనివాసాంధ్ర సాహిత్యానికి, సంబంధించినవీ, అన్నమాచార్యులపై వ్యాసాలు మున్నగు గ్రంథాలను ప్రచురించారు. పుస్తకరూపంలో ప్రచురించ వలసిన సాహిత్య వ్యాసాలు వారివి ఎన్నో ఉన్నాయి.

### సంస్కృతి

రామకృష్ణయ్య గారు మనసంస్కృతికి సంబంధించిన అతి ముఖ్యమైన వ్యాసాలను ఎన్నిటినో ప్రచురించారు. (మనసాహిత్యంలో వర్ణించిన వివాహ సంప్రదాయానికి సంబంధించి) తాళి బొట్టు మంగళ సూత్రం డాక్టర్ తిరుమల రామచంద్ర గారి సంపాదకత్వంలో వెలువడిన పరిశోధన పత్రికలో ప్రచురించిన 'ఆంధ్రము-దక్షిణాపథ సంస్కృతి' 'తమిళంలో భక్తి సాహిత్యం', 'అక్క మహాదేవి' వచనాలు మొదలయిన తమిళ కన్నడ సాహిత్యాలకు సంబంధించిన వ్యాసాలు, రేడియో ప్రసంగాలు అలాటివి. ఇవి తులనాత్మక సాహిత్య పరిశీలన జరిపే విద్యాంసులకు చాలప్రయోజనకరమైనవి.

వివిధ పత్రికలలో చెదురుగా ఉన్న వారి వ్యాసాలు ఎన్నో పుస్తక రూపంలో ప్రచురణ పొందవలసి ఉన్నాయి. అలాగే ఇప్పుడు లభించని వారిపుస్తకాలు కూడ పునర్ముద్రణపొందాలి.

''ఇహ చే దవేదీత్ అథ సత్య మస్తి।
న చే దిహావేతీత్ మహతీ వినష్టిః''॥

"To know him in this life is to be true,
Not to know Him in this life
is the desolation of Death"



**How to know Him?**

'భూతేషు భూతేషు విచింత్య ధీరాః'
"By realising Him in each and all"

— (శ్రీ 'కోరాడ' వారి డైరీనుంచి)

# కవిత్రయానికి కరదీపిక

శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ

ఆంధ్ర సాహిత్య మహాపురుషుల్లో అగ్రణి స్థాన మలంకరించిన వారు శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు. వారి ''ఆంధ్రభారత కవితా విమర్శనము'' అనే గ్రంథం 'కవిత్రయ' దర్శనానికి కరదీపిక. ఆయన ప్రాముఖ్యం స్పష్టం కావడానికి ఆంధ్రసాహిత్య ఆధునిక యుగ ప్రారంభ చరిత్ర సంక్షిప్తంగా నైనా జ్ఞాపకం చేసుకోవడం అనివార్యం.

ఒకప్పుడు సోమకాసురుడు వేదాన్ని దొంగిలించుకుని పోయి సముద్రంలో దాక్కున్నాడు. అప్పుడు శ్రీ మహా విష్ణువు వాడ్ని వధించి వేదాన్ని మళ్ళీ లోకాని కిచ్చాడు. మానవుడి జ్ఞానార్జనలో ఉన్న కష్టనష్టాల్ని గురించి మన పురాణాలు చెప్పిన ప్రతీకాత్మక కథనం ఇది. వెయ్యేళ్ళ పంట అయిన ఆంధ్ర సాహిత్యం క్రమశః కాల ప్రవాహంలో కొట్టుకు పోగా, ఇప్పటికి సుమారు 100, 150 సంవత్సరాల క్రితం వరకు ఆంధ్రుల్లో నూటికి 99 మందికి తన సాహిత్య స్వరూప మేమిటో తెలియదు. మను చరిత్ర, వసుచరిత్ర, కాశీఖండము, పాండురంగ మాహాత్మ్యము, పారిజాతా పహరణము ఇత్యాది ప్రబంధాల పేర్లే ఎరగరు; ఎరిగిన కొద్ది మందికి కూడా వాటి మీద భారతం మీద ఉన్నట్లు గౌరవం ఉండేది కాదు. అంటే 11శ.పు నన్నయ నాటి నుంచీ తిరుపతి కవుల వరకు వచ్చిన కావ్యాలు, వ్యాకరణ అలంకార శాస్త్ర గ్రంథాలు ఏవీ చదవబడేవి కావు, కనబడేవికావు. ఈనాడు మనమెరిగిన విద్యావిధానము విద్యాశాలలు ఉండేవికావు. అంటే అది సోమకాసురుడి కథ!

ఇంగ్లీషు వాళ్ళ రాజ్యం ఈ దేశంలోకి ప్రవేశించిన తర్వాత వాళ్ళు తెచ్చిన నూతన లాంతరుతో ఈ దేశపు చీకట్లో ఉన్న వస్తువుల్ని వెదికి పోగు చేయడం ప్రారంభ మయింది. అన్ని రంగాల్లోనూ ఈ ప్రక్రియ ప్రారంభమయింది; అలాగే ఆంధ్ర సాహిత్య రంగంలో కూడా. ఆంధ్ర సాహిత్య స్వరూప పునర్నిర్మాణ మనే మహత్తర ఉద్యమం ప్రారంభమయింది. మొదట ఈ కార్యానికి పూనుకున్న వాళ్ళు, పాపం,తెలిసినంత వరకు పూర్వ కవుల్నీ వాళ్ళ కావ్యాల్నీ వాళ్ళ జీవన విశేషాల్నీ కథలు కథలుగా పోగు చేసి రాశారు. అలా కవి జీవితాలు రాయడంతో ఆంధ్ర సాహిత్య స్వరూపాన్వేషణలో ప్రథమ దశ ప్రారంభమయింది. ఇందులో ప్రథముడు, కావలి వెంకట రామస్వామి అనే పండితుడు ఇంగ్లీషులో 1829లో **Biographical Sketches of Deccan Poets** అని తెలుగు కన్నడ సంస్కృత మరాఠీ గుజరాతీ కవుల జీవితాల్ని సంక్షిప్తంగా రాశాడు. తర్వాత అలాంటివి తెలుగులో చాలా మంది రాశారు. కందుకూరి వీరేశలింగం పంతులు గారు కూడా 1886లో ఆంధ్రకవుల చరిత్ర రాశాడు. ఎన్నో భ్రమ ప్రమాధాలతో నిండిన అపుస్తకాన్ని, తర్వాత ఉద్దండులైన మానవల్లి, వేటూరి, కొమఱ్ఱాజు, వంగూరి ఇత్యాదులు చేసిన ఉత్కృష్ట పరిశోధనల ఫలస్వరూప గ్రంథాలు వస్తూఉంటే వాటినిబట్టి తన పుస్తకంలో ఉన్న అనేక ''హొలర్సు''ను దిద్దుకుంటూ ఆ పుస్తకాన్ని పునర్ముద్రణలు చేస్తూ వచ్చారు. అలా అది ఆరు ముద్రణలు పొందింది! వాటిలో కూడా కవుల బయోడేటాయేగానీ కావ్య విమర్శ కనిపించదు.

ఇలా కవుల చరిత్ర రాయడం కొంత ముదిరిన తర్వాత తన్మూలంగా ఏర్పడిన కాలనిర్ణయాది ఆవశ్యకాలచేత శాసనాలు, వాటికాలము, వాటిభాష పరిశీలించ వలసిన అవసరం ఏర్పడింది. అప్పుడు శాసనాల వేట ప్రారంభమయింది. ఇందులో జయంతి రామయ్య పంతులుగారు, కొమఱ్ఱాజు వారు, మల్లంపల్లివారు, హెచ్. కృష్ణమూర్తి, హుల్ట్జ్, ఎ. బట్టర్వర్త్ మరియు వేణుగోపాలచెట్టి, చిలుకూరు నారాయణ రావు, వేటూరి ప్రభాకర శాస్త్రి ఉన్నారు. వీరందరు ప్రకాండ పండితులు.సుమారు 200 శాసనాలకు పైగా సేకరించారు. అప్పటికే దాక్షిణాత్య భాషల పరస్పర సంబంధాల అధ్యయనం ప్రారంభమై ఒక దశ చేరింది. ఒక లిపి శాస్త్రము, శాసన భాషాధ్యయన సూత్రాలు స్పష్టరూపంలో ఉదయించాయి. ఈ కోలాహలంలో కవుల చరిత్రలు రాయడం వెనక బడిపోయి తెలుగు భాషోద్గమము, దానిపరిణామము, దానివికాసము, తెలుగు వ్యాకరణ చరిత్ర ఇత్యాది పరిశోధనలు ప్రాధాన్యం వహించాయి. ఆంధ్రశబ్దచింతామణి కర్త నన్నయ కాదు అనే ఒక సిద్ధాంతం శ్రీకందుకూరి వీరేశలింగం పంతులు గారే లేవదీశారు. దాన్ని వజ్ఝల చిన సీతా రామస్వామి శాస్త్రులవారు సోపపత్తికంగా ఖండించారు. అనేక పండితులు పారంపర్యంగా నన్నయనే చింతామణి కర్తగా చెప్పారు. బాలవ్యాకరణ, ప్రౌఢ వ్యాకరణ కర్తలు ఎలకూచి బాలసరస్వతి, అహోబలపండి

తుడు, అప్పకవి వాసుదేవవృత్తి, కవిజనాంజనము, ఆంధ్ర కౌముది, ఇత్యాది గ్రంథాల్లో కూడా నన్నయ భట్టే చింతామణి కర్త అని చెప్పబడింది. నన్నయ ప్రథమాంధ్ర వ్యాకర్తకాడని మరొకవాదం ఈ ఊపులోనే లేచింది. మండ లక్ష్మీ నరసింహాచార్యులు గారు చూపించిన ''బార్హస్పత్యం రావణీయం కాణ్వ మాధర్వణం విదన్ కరోమి సారస్వత త్రిలింగ శబ్దాను శాసనమ్'' అనే శ్లోకం ప్రకారం బృహస్పతి మొదటి తెలుగు వ్యాకరణ కర్త అనీ, కాదు కణ్వుడనీ, ఇలా కవి రాక్షస, పుష్పదంత, కవిభల్లట, హేమచంద్ర ఆద్యనేకుల పేర్లు చర్చింపబడ్డాయి. (''హేమచంద్రాదిమునిభిః కథితంచాంధ్ర లక్షణం'' ఇతడు జైనుడని) ఇదొక గొప్ప ఆంధ్ర వ్యాకరణ చరిత్రజ్ఞాన కోశంగా రూపొందింది. అయితే ఈ వాదాలను శ్రీ వజ్ఝలవారు ''ఆంధ్ర ఛ్ఛందస్సు'' అనే వ్యాసంలో (సాహిత్య పరిషత్ పత్రిక, రౌద్రి జ్యేష్ఠాషాఢ మాసములు సంచిక) ఖండించారు. కానీ ఆంధ్ర శబ్దచింతామణి కర్త అయిన నన్నయ వేరు ఆంధ్ర భారత కర్త అయిన నన్నయ వేరు, ఒకరు 15వ శతాబ్ది మరొకరు 11వ శతాబ్ది అని ఒక వాదం ఇంకా ఉంది. అంటే ఆంధ్ర సాహిత్య స్వరూప పునర్నిర్మాణ ఉద్యమం చివరకు భాషా వ్యాకరణాల అరణ్యంలో ఇరుక్కొని దారి కోల్పోయింది. మొత్తంమీద కన్నడ తెలుగు లిపులకు ఎప్పుడో క్రీ.పూ 3శ.లో ఉన్న బ్రాహ్మీలిపి మూలం అని తేల్చారు. (దీన్నే ద్రావిడీ, డామిలి అనికూడా అనేవారు) మూలద్రావిడం అని ఒక భాష ఊహించి దానిలో నుంచే దక్షిణాదిభాషలు ఏర్పడ్డాయని ఒక మతం రూపొందించారు. ఈ మూల ద్రావిడం ఏమిటో!

సుమేరియన్ నాగరకతని గురించి రాశిన ఆధునిక పరిశోధన గ్రంథాల్లో చర్చించిన సుమేరియన్ భాషలోనూ సుమేరియన్ ఇతిహాసం గిల్గమేష్‌లోను అనేక కన్నడ, తెలుగు పదాలున్నాయి. గిల్గమేష్‌లో నింగిరను (సూర్యుడు) ఎంకిడు (గిల్గమేష్ అనేకథా నాయకుడి ప్రియమిత్రుడు) ఉరు (ఊరు) ఇత్యాదులు ఉదాహరణములు. అయితే సుమేరియాలజిస్టుల ప్రకారం ఈ పదజాలం భారతదేశమంతటా ఉంది. ఉదా. సంగ్రూర్ (పంజాబు) బేలూరు (బెంగాల్) బిజ్నూర్ (హిమాచల్ ప్రదేశ్) చిత్తోడ్ చిత్తూరు (రాజాస్థాన్). ఈ భాష అన్యభాషా వాదుల ప్రకారం మధ్యధరా సముద్రపు తూర్పు ప్రాంతం నుంచి భారతదేశంలోకి వలసవచ్చిన ప్రోటో ఆస్ట్రేలా ప్రాంతం నుంచి భారతదేశంలోకి వలస వచ్చిన ప్రోటూ ఆస్ట్రేలాయిడ్ జాతుల వారి భాష, కానీ కొంత నిశితంగా చూస్తే ఈ ఉభయవాదాల్లో వైరుధ్యం కనిపించదు. (యూఫ్రైటిస్, టైగ్రిస్ నదీ ద్వయ ప్రాంతాలే - ఇరాక్ మధ్యధరా సముద్రపు తూర్పు ప్రాంతం కావడం చేత) ఈ నూతన తెలుగు భాషాన్వేషకులు నామకరణం చేశిన మూలద్రావిడం సుమేరియన్ భాషే కావచ్చును. ఇది యావద్భారత దేశంలోనూ వ్యాపించి ఉత్తర భారతం మీద అనేక శతాబ్దాల నుంచీ జరుగుతూ వచ్చిన దండయాత్రల మూలంగా అక్కడి భారతీయ భాషలమీది పై పొరలు ఎగిరి పోయి బహిర్గత భాషల పొరలు ఆస్థానంలో చేరగా క్రింది పొరల్లో పాతభాషల పొరలు ఇంకా అలాగే ఉన్నట్లు భాషా పరిశోధకులు అంటున్నారు. బీహార్‌లో అనేక ఆదిమవాసుల భాషల్లో తెలుగు, కన్నడ పదాల్ని పోలిన పదాలున్నాయని చూపించారు. కానీ ఇక్కడ ఒక విశేషం గమనించాలి. సింఘలీస్ భాష (సింహళం), తమిళ్, కన్నడము, తెలుగు, ఒరియా, బర్మీస్, థాయిలెండ్ , కంబోడియా, లావోస్, మలయా, జావా ఇత్యాది ఆసియా తూర్పు సముద్రతీర (చైనా జపాన్ కొరియాలు తప్ప) దేశాల లిపులన్నీ ఒక్కలాగే ఉంటాయి! ఇది యాదృచ్ఛికం కాదు. పరిశీలనార్హం. బహుశా కామరాజ్ యూనివర్సిటీ ప్రొఫెసర్ ఒకాయన మనదేశపు కన్యాకుమారి నుంచీ జపాన్‌కొరియాల వరకూ ఒకే సాంస్కృతిక పరగణా అని ఒక సిద్ధాంతాం చేశినట్లు నాకు జ్ఞాపకం.

శాసనాల భాషాధ్యయనంలో క్రీ.శ. నాలుగయిదు శతాబ్దాల్లో కనిపించే తొఱ శబ్దం క్రీ.శ. 10వ శ. నాటికి త్రోవగా మారిందనీ, దాని మూలరూపం త్టోవ అనీ అంటే క్రమేణా శకటరేఫం సాధు రేఫంగా మారడం కనిపిస్తుందనీ, మూలద్రావిడ'ణ' కారం తెలుగు 'న' కారంగా మారడం 7, 8 శతాబ్దాల్లో జరిగిందనీ (చెఞ్చెరువ, కంబురాఞ్చెరువ) క్రీ.శ. 7, 8 శతా.ల్లో మూలద్రావిడ క కారం తెలుగులో చ కారం అయిందనీ ఇలాంటి సూక్ష్మమైన అక్షర పరిణామ అధ్యయనమూ, త్రికసంధి, వైరి సమాసాలు మొదలైన చర్చలు, చాలాకాలం జరిగి మొత్తం కూడ నన్నయ్య పూర్వ తెలుగు భాష మనకు శాసనాల్లోనే ఉపలబ్ధం అవుతుందని తేల్చారు.

కవుల చరిత్రలతో ప్రారంభమయిన తెలుగు సాహిత్య స్వరూప పునర్నిర్మాణ ఉద్యమం ఈ దశ వరకూ తెలుగు సాహిత్య స్వరూపాన్ని ముట్టుకోనే లేదు. ఇక్కడే శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారి కీలక స్థానం ఆవిష్కృతం అవుతుంది. అప్పటికి పోగు చేయబడిన కవుల చరిత్రల సామగ్రి, తెలుగు భాషా పరిణామ సామగ్రి శ్రీ కోరాడవారు సమీచీనంగా అవగాహన చేసుకునే తెలుగు సాహిత్యస్వరూపాన్ని పునర్నిర్మించాలంటే తెలుగు సాహిత్యాన్నే పరిశీలించాలి అనే నిర్ణయానికి వచ్చినట్లు తెలుస్తుంది. కనక అయన తన గ్రంథ నామధేయమైన ఆంధ్ర భారత కవితా విమర్శనము'' లో కవితా శబ్దం చేర్చారు. అందులో మన సాహిత్యంలో మొదటి గ్రంథంగా లబ్ధం అవుతున్న నన్నయ భారతంలోనే మన సాహిత్య చరిత్ర యొక్క

బీజరహస్యాలుంటా యని ఆయన గ్రహించారు. కనుకనే ఆయన అన్ని శాసనాలూ తీసుకోకుండా నన్నయకు పూర్వం నన్నయకు సమీపంగా ఉన్న కొన్ని శాసనాలే పరిశీలించాడు. 7వ శతాబ్దికి చెందిన జయసింహ వల్లభ శాసనము ఆ శతాబ్దందే అయిన లక్ష్మీ పురశాసనము, 8వ శతాబ్దార్ధభానికి చెందిన అహదనకర శాసనము, 9 శతాబ్దికి చెందిన పండరంగ లేక అద్దంకి శాసనము, ఆ శతాబ్దిదే అయిన గుణగ విజయాదిత్యుని ధర్మ వరపు శాసనము, తర్వాత చాళుక్యభీముని శాసనము, దీర్ఘాసి శాసనము, యుద్ధ మల్లుడి శాసనము మాత్రమే తీసుకు న్నారు. వీటిలోనే తెలుగు భాషయొక్క నన్నయ సమీపకాల రూపము కనిపించడము, తరువోజ అక్కరల వంటి దేశిచ్ఛం దస్సులో చేసిన రచనలు ఆ శాసనాల్లో ఉండడము, దీనికి ముఖ్యకారణం కావచ్చును. ఎందు చేతనంటే శ్రీ రామకృ ష్ణయ్య గారికి భాషతో గాక సాహిత్యంతోనే సంబంధం అని గ్రంథనామమే చెబుతోంది. తాలుత సాహిత్యం కోసం వెతుకు లాడిన అనేక మంది అన్యమార్గాల్లోకి నడిచి దారి కోల్పోగా శ్రీ రామకృష్ణయ్యగారు సాహిత్యాన్ని పట్టుకోవడానికి కాపల సిన తాళపు చెవులే పట్టుకున్నారు. ఈ తాళపు చెవుల్లో కన్నడ భాషా శబ్దపరిశీలనముఖ్యమైంది. ఉదా. ''ఉడివోవు. ఉడి+ పోవు- ఉడుగు అను ధాతువు- కన్నడంలో ఉడగు అని కలదు. కావున ఉడుగు అనుదానికి ప్రాచీన మూల రూపము ''ఉడి'' యై యందును'' ''తగులు'' సంక్రందన సూతికిందగిలి కన్గొన జాలదె, సక్తమై ఆసక్తితో ఇప్పుడు తాకుట అని అర్థము. అధునిక కన్నడములోనను ''తగులు'' కలదు. ప్రాచీన కన్నడ మున తాగు to touch తాంగు'' ఇదంతా భాషాపరమైన తాళపుచెవి.

తర్వాత సంస్కృత భాషా బాహుళ్యమును, దేశిపదావళి రెంటిని కలిపి అల్లిన నన్నయ రచన తత్పూర్వమే కన్నడ భాషలో పంపాదుల యందున్నదని శ్రీ రామకృష్ణయ్యగారు చూపడం రెండవ తాళపు చెవి. ఈ విధంగా శ్రీ రామ కృష్ణయ్యగారు సుదీర్ఘకాలం నిష్ఫలంగా సాగిన తెలుగు సాహిత్య స్వరూపాన్వేషణ ఉద్యమాన్ని చివరకు తన ''ఆంధ్ర భారత కవితా విమర్శనము'' అనే గ్రంథంద్వారా సఫలత్వ ద్వారం దగ్గరకు తెచ్చారు. అంటే శబ్దములు, ఛందస్సులు, రచనాశైలి అ \ కర్ణాట సాహిత్యం నుంచి తెచ్చుకుని ఒక ప్రథమ కృతిని నన్నయ భట్టు, ఆనాడు ప్రవర్తమాన మనుకొన వల న పండరంగ, యుద్ధమల్లు ఆది శాసనాల్లో ఉన్న శిష్టాంధ్ర భాషలో రాశాడని మొదటి సారి చెప్పారు. కనుక శ్రీ రామకృష్ణ య్యగారి ''ఆంధ్ర భారత కవితా విమర్శన''మనే గ్రంథం తెలుగులో భారతపరిశోధనకు ఆద్యగ్రంథము, మార్గదర్శక గ్రంథము. పరిశోధనలో ముందుకు పోవడానికి ఆ గ్రంథంలో ఎన్నో విశేషాలు బీజప్రాయంగా కనిపిస్తాయి. అంటే ఆంధ్రభా రత పరిశోధనకు అనివార్యమైనది కన్నడ భాషా సాహిత్య పరిచయము, పరిశీలన అని ఆయన మొదటి సారి చెప్పారు - ''ఆంధ్ర శబ్దచింతామణి విషయ పరిశోధనము'' అనే గ్రంథంలో శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రులవారు చింతామణి సందర్భంగా చర్చిస్తూ ''అప్పటికే కర్ణాట పండి తులు త్రొక్కిన పద్ధతులు పరిశీలించి యు...ఆంధ్రభాషా సహజములగు నియమములను గొంతవిశాలముగా సూత్రీకరిం చియుండును,'' అనియు ''ఆంధ్రభాషా కవితను ధారావాహిక ముగా నడుపుట దుష్కరము కానేరదని యుభయ భాషాకవితా నుభవము గలవారికి దోచకపోదు గదా. ఇంతకును నాతనికి పూర్వము నందే సంస్కృత భాషా సాహాయ్యమున గర్ణాట భాషలో ధారావాహి కవిత వెలయు చుండ లేదా?'' అనియు స్ఫుటముగా చెప్పెను. మరొకటి శ్రీ వజ్ఝల పండితులు కర్ణాటాంధ్ర లిపుల సమానతను గురించి కూడా చర్చించారు. అలా సమానంగా ఉన్న రెండు భాషల లిపులను జూచి నన్నయ తెలుగు లిపికి ప్రత్యేకత కావలెనను ఉద్దేశ్యముతో కొన్ని మార్పులు చేసెనని చెప్పి అప్పకవీయం నుంచి ''అప్పకవి పుస్తకే స్థితం ఆంధ్ర లిప్యుద్ధారకం శ్లోకత్రయం'' అని ''బాలేందు పరిధి శృంగా వర్త కుశ గ్రంథి దాత్రపరశు సమాః....'' ఇత్యాది శ్లోకాల్ని ఉద్ధరించి చూపారు. రెండు భాషల అక్షరాల విషయంలో కూడా శ్రీ వజ్ఝల వారు అలఘు లకారము వేరనియు, వర్ణ సమామ్నాయగత ళకారము వేర నియు నన్నయ తన చింతామణిలో చెప్పెననియు ఈ విషయ మున ఆయన కర్ణాట సంప్రదాయమును అనుసరించె ననియు చెప్పి కర్ణాటక శబ్దానుశాసనము 140వ సూత్ర వ్యాఖ్య ఉదాహ రించెను. అంటే శ్రీ వజ్ఝల వారు శ్రీ రామ కృష్ణయ్య గారి గ్రంథాన్ని అప్పటికి చూచే ఉంటారు. (ఆంధ్ర భారతకవితా విమర్శనము ప్రచురణ 1929; ఆంధ్ర శబ్దచింతామణి విషయ పరిశోధనము ప్రచురణ 1931). ఈ విధంగా శ్రీ రామ కృష్ణయ్యగారు ప్రవేశ పెట్టిన ఆంధ్ర కన్నడ సంధాన పద్ధతిని శ్రీ వజ్ఝల వారు సాధుమార్గంగా స్వీకరించి బలపరచారన్న మాట.

శ్రీ రామకృష్ణయ్యగారు చూపిన మార్గంలో తర్వాత వెళ్ళిన వారు చాలా ఆశ్చర్యకరమైన విషయాలు గ్రహించి మనకు చూపారు. ఛందస్సుల్లో ఉత్పలమాల చంపకమాల నన్నయా దులు కన్నడంలో నుంచి ఎలాతీసుకున్నారో చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. కన డ ఉత్పలమాల: ''వ్యాసమునీంద్ర రుంద్ర వచనా మృత వా ~ నీను వెంకవి, భ్యాననె నెంబ గెర్వ మెనగిల్ల....(పంప చంపక మాల: కతెసిరి దాదొడం కథయె మెయ్ గిడలీయదెముం నమస్తభారతమున పూర్వమాగెసలె

పెళ్ఘదకవీశ్వర రెల్ల వర్ణకం,కతెయొళొడం బడం...''(పంప). కన్నడకందం: ''మిగె కన్నడకబ్బంగళొ, ళగణిత గుణ గద్య పద్య సమ్మిశ్రితమం, నిగదిసువర్గద్య కథా, ప్రగీతి యంతచ్చి రంతనా చార్య ర్కళ్.'' క్రీ.శ. 9వ శతాబ్ది నృపతుంగుని'' కవిరాజ మార్గ'' అనే గ్రంథంలో నుంచి) మన కవులు చాల కన్నడ శబ్దాలు వాడడం చూపించ బడ్డాయి. ''చోళనాళిక కాక క్షోణీత లేశ'' అని పండితారాధ్యచరిత్రలో ప్రయోగం. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు చోళనాళిక అంటే జొన్నలు నాళికతో అని అర్థం చెప్పారు. జోళ అంటే కన్నడంలో జొన్నలు. ''జొన్నలు గొన్న ఋణంబు నీగెదన్'' అనినన్ని చోడుడు కుమార సంభవంలో రాశిన దానికి పంప భారతంలో '' జోళమ నెంతు నీగు'', లేక రన్న భారతంలోని ''జోళది పారియం'' మూలమయి ఉంటుందని శ్రీ పాద లక్ష్మీపతి శాస్త్రిగారు చెప్పారు. శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారే నన్నయ తిక్కనలు కూడా పంపభారతాన్ని పద్య నిర్మాణం లోను అలంకార ప్రయోగాల్లోనూ ఎలా అనుసరించారో తమ నన్ని చోడ కుమారసంభవ పరిశోధన గ్రంథంలో చూపారు. నన్ని చోడుడు తన కుమార సంభవంలో'' నేలయు నింగియు తాళముగా వాయింప,నెండ మావుల బట్టి బండవలయు'' అని ఒక సీస పద్యం రాశాడు. అట్లాగే పాల్కురికి సోమ నాథుడు. ''నెట్టన నేలకు నింగికి సూత్ర పట్టమే కాళ్ళను బట్టతలలను'' అనివ్రాశాడు. ఇక తిక్కన సోమయాజి ''నేలయునింగియు తాళముల్ గాజేసి, యేపున రేగి వాయించియాడ'' అన్నాడు (విరాట) ఇందరిలో ఉన్న ఈ ''నేలయు నింగియు తాళ ముల్'' అనే పద్ధతి కర్ణాటకవి నయసేనుడు రాశిన ధర్మా మృతం అనే కావ్యంలో ఉందట. అది - ''ధరణి చక్రము వియత్తళము మంగంటిక్కువర్ ముంచ నచ్చరి యప్పంతు'' ఇత్యాది. నయసేనడు 1112 సంవత్సరంవాడు.

కనక తాత్పర్యమేమిటంటే - ఆంధ్ర సాహిత్యంలో ఇతర కావ్యాలు పరిశోధన కార్యానికి లొంగినట్లు ఆంధ్ర మహాభారతం లొంగదు. తదనంతర కావ్యాలన్నీ భారతభాషాలం కారచ్ఛందస్సుల ననుసరించాయి. కానీ ఆంధ్ర భారతం మాత్రం, క డ భాషలో కలిశిపోయి ఉన్నతెలుగు క్రమంగా విడిపోతూ ప్ర క రూపాన్ని ధరిస్తున్న అస్పష్ట సంధి యుగ గర్భంలో నుం పుట్టింది. కనుక అందులో నూత్నాంధ్ర శబ్దాల కన్నడ మాతృకలు, కన్నడ జాతీయాల ఆంధ్రీకృత రూపాలు, కన్నడ ఛందస్సులు, ఇంకాముఖ్యం కన్నడ కావ్యాల్లోని సుందర అలంకారాలు (కావ్యం గ్రాహ్య మలంకారాత్'') ఉన్నాయి. వాటిని పట్టుకోవలసిన బాధ్యత ఆంధ్ర భారత పరిశోధకుడి మీద ఉంది.

సమగ్ర ఆంధ్ర మహాభారత పరిశోధన కార్యానికి వ్యాససంస్కృతపాఠాన్నీ కవిత్రయ తెలుగు పాఠాన్నీ పోల్చి ''ఇది తీశేశారు, ఇది నూతనంగా సృష్టించారు'' అంటూ చేశే పరిశోధన చాలదు. చాలామంది, తెలుగు కవిత్రయం నూతనంగా సృష్టించిన భావం ఎంత రమణీయముగా నున్నది; కవిత్రయము వారే వ్యాసుడి కంటే మహానుభావులు అనే మూర్ఖ పద్ధతిని కూడ అవలంబించారు. కానీ శ్రీ రామ కృష్ణయ్య గారి, శ్రీ శ్రీపాదలక్ష్మీ పతి శాస్త్రిగారి పరిశోధన గ్రంథాలు చూస్తే కవిత్రయం వారి నూతన సృష్టి సంస్కృత మూలం అనువదించడం విడిచిన సందర్భాల్లో కర్ణాట కవుల కావ్యాల్నించి తీసుకున్న భాగాలని అర్థమవుతుంది. కనుక ఎక్కడయితే కవిత్రయంవారు నూత్నసృష్టి చేసి నట్లు కనిపిస్తుందో అక్కడ పరిశోధకుడు అధిక అప్రమత్తుడై కన్నడ కావ్యాల్ని శోధించాలి. అందుచేత కవిత్రయం వారి భారత శోధనకు సంస్కృత పాండిత్యమే గాక కన్నడ పాండిత్యం అంత కంటే అధికంగా కావాలి. ఈ అనివార్యతను అతిక్రమించి చేయబడిన పరిశోధన అసమగ్రంగాను నిష్ప్రయోజనంగాను ఉంటుంది.

కర్ణాటకాంధ్ర సాహిత్య సంబంధాల్ని గురించి ''కర్ణాటాంధ్రసేతువు'' అని నేను ఆంధ్రప్రభ (దైనిక) 20-5-1962లో రాశిన వ్యాసంలో ఈక్రిందివిధంగా చెప్పాను. ''మన కావ్యాలను వాటి సంస్కృత మాతృకలతో పోల్చి పరిశీలించడం యింతవరకూ పరిపాటి అయితే యికమీద కన్నడ మాతృకలతో పోల్చి పరిశీలించడం ఆధునికాంధ్ర వాఙ్మయ విమర్శ పద్ధతిగా నెలకొనాలి'' - (ఈ వ్యాసం 1963లో ప్రచురితమయిన ''నరుడు నక్షత్రాలు'' అనే వ్యాస సంపుటలో చేర్చబడింది: పేజీ 159).

ఈ విధంగా శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు అమూల్యమైన కర్ణాటాంధ్ర సంధాన పద్ధతిని ఆంధ్రమహాభారత పరిశోధనలో ప్రవేశపెట్టి ఆంధ్రసాహిత్య మహాపురుషుల్లో అగ్రణి అయ్యారు. వారికి ఎంతో ఋణపడి ఉన్న ఆంధ్రులు జరుపుతున్న ఈ శతజయంతి సందర్భంలో నేను రెండు చేతులెత్తి ఆయనకు నమస్కారం చేస్తున్నాను.

# విమర్శన కళానిధి

శ్రీమతి కోలవెన్ను మలయవాసిని

బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమున దద్ప్రాగల్భ్యమూహించె దన్ అని ఆంధ్రోక్తిమయ ప్రపంచప్రాగల్భ్యాన్ని రామరాజభూషణుడు 'ఊహించెదన్' అన్నాడు. ఊహించడం కాకుండా సోపపత్తికంగా సోదాహరణంగా సాహిత్యాన్ని ఎలా అధ్యయనం చెయ్యాలి, సాహిత్యచరిత్రను ఎలా నిర్మించుకోవాలి, సాహిత్యసమస్యలను ఏదృష్టితో పరిశీలించి పరిష్కరించుకోవాలి అనే విషయాలను ఆంధ్రులకు వివరించి చూపిన విమర్శనకళా నిధి శ్రీ రామకృష్ణయ్యగారు.

సాహిత్యాధ్యయనంలో రస, రీతి, వ్యాకరణాది విషయాలకు ప్రాధాన్యం ఇవ్వడం భారతీయుల పద్ధతి. ఆంగ్లవిద్యా సంపర్కం, ఆంగ్లసాహిత్య విమర్శనా విధానాలతో పరిచయం ఏర్పడిన తరువాత ఆ దృష్టితో కావ్యాలను చదివి కవిప్రతిభను గమనించి అతని రచనా విన్యాసాన్ని వివిధకోణాలలో పరీక్షించి కావ్యానందాన్ని దోసిళ్లతో క్రోలగలిగే అవకాశం పాఠకులకు కలిగించిన తొలితరం విమర్శకులలో వీరొకరు.

వీరి తొలి రచనలలో ఒకటయిన 'కాళిదాసుని కళా ప్రతిభలు' అనే విమర్శకగ్రంథం విమర్శకవిధానంలో నూతన ద్వారాలు తెరచుకొని కావ్యానికి మరింత వెలుగు తారసిల్లనిచ్చి - ఆవెలుగులో ఆకావ్యానికున్న సొగసుల్ని గుర్తించవలసిన అవసరాన్ని తెలుగు సాహితీ పాఠకులకు గుర్తుచేశారాయన.

ఇంగ్లీషులో డ్రైడెన్ అనేవిమర్శకుడు 'The Art and mind of Shakespeare' అనే పుస్తకాన్ని వ్రాశాడు. అందులో కాలక్రమానుసారంగా ఒక కవి రచనలలో ఆకవి యొక్క ప్రతిభ ఎలా వికసిస్తుందో, మానసికంగా కవి ఎంత ఉన్నతంగా ఎదుగుతాడో - అతని రచనల ద్వారా ఎలాగ్రహించవచ్చునో అన్న విషయాన్ని డ్రైడెన్ సోదాహరణంగా సూచించాడు. ఆరచనను ఒరవడిగా పెట్టుకుని 'కాళిదాసుని కళాప్రతిభలు' అనేపేర కాళిదాసు మూడు నాటకాల్లో - అతని కళాప్రతిభలు ఎలా అభ్యుదయం పొందాయో వివరించారు. ప్రస్తావనలో ప్రేక్షకుల నుద్దేశించి 'పురాణమిత్యేవ నసాధుసర్వం' అంటూ మొదటి నాటకం మాళవికాగ్నిమిత్రంలో చెప్పుకున్నా, విక్రమోర్వశీయంలో ఉత్తమ నాయకుణ్ణి బట్టి అయినా ఈ నాటకాన్ని ఆదరించమన్నకాళిదాసు అభిజ్ఞానశాకుంతలం నాటికి కాళిదాసు రచించిన ఈక్రొత్త నాటకాన్ని ప్రదర్శిస్తున్నాం అనిపించాడు.

మొదటి రెండు నాటకాల్లో కేవలం కామ శబలిత మయిన శృంగారం పోషింపబడితే - అభిజ్ఞాన శాకుంతలంలో ఉత్తమ దాంపత్య ధర్మ నిరూపణం జరిగింది - అంటూ - మరికొన్ని ఉపపత్తులతో కాళిదాసుని కళా ప్రతిభలు ఒక నాటకంలో కంటె మరో నాటకంలో ఏవిధంగా ప్రకాశవంతమయ్యాయో వివరించారాయన. తెలుగులో ఈ విధమయిన విమర్శనా విధానానికి వీరే ఆద్యులని చెప్పవచ్చు.

'కాళిదాసుని కళాప్రతిభలు' వెలువరించిన కలంతోనే మరింత సునిశత పరిశీలనతో సారమతితో లోనారసి ''ఆంధ్రభారతకవితా విమర్శనము'' అనే ఉదాత్త నవ్యకవితా విమర్శనాత్మకమయిన గ్రంథాన్ని రచించారు. ఈగ్రంథం వెలువడిన నాళ్లలో హిందూ పత్రికలో - ఈ గ్రంథముపై ప్రచురితమైన సమీక్షలో-

''కవిత్వతత్త్వ విచారంతో సాహిత్యవిమర్శలో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చిన కట్టమంచి రామలింగా రెడ్డిగారే ఆంధ్రమహాభారతంపై విమర్శనాత్మకమైన పరిశీలనము వెలువరిస్తారని తెలుగుసాహిత్య ప్రపంచం ప్రతీక్షించింది. కాని కోరాడ రామకృష్ణయ్యగారి రచన అలాంటి అవసరాన్ని తీర్చింది.'' అని ప్రశంసించింది.

ఒక నూతన విమర్శనా విధానంతో మహాభారతం మీద గ్రంథం రావాలని ఆశించిన రోజులవి. రామకృష్ణయ్యగారి రచన అప్పటిదే అయినా ఇప్పటికీ ''ఆంధ్రభారత కవితా విమర్శనము'' పరమప్రమాణము, నవీనగుణసనాథము అయిఉన్న గ్రంథం. ఆంధ్రమహాభారతాన్ని అధ్యయనం చేసే విద్యార్థులు, పరిశోధన చేసే పరిశోధకులు, పాఠప్రవచనం చేసే అధ్యాపకులు కూడా చదివి ఆపద్ధతిలో ఆంధ్రమహాభారతం లోని 'కవితని' అర్థం చేసుకోవలసి ఉంది. కథ తెలుసు కోవడంవేరు కవితని తెలుసుకోవడంవేరు. కవిత్రయ భారతంలోని కవితాశిల్పాన్ని సహృదయతతో అవగతం చేసుకోకపోతే ఆకవుల ఋణాన్ని తీర్చినట్లుకాదు.

ఆంధ్రభారత కవితా విమర్శనానికి పూర్వమే కోరాడవారు ఆంధ్ర సారస్వతానికి చెందిన వివిధాంశాలపై వ్యాసాలు వ్రాసారు. ఆ వ్యాసాలు 'సారస్వత వ్యాసములు' అనే పుస్తకంగా ప్రచురింపబడ్డాయి. భారతి మొదలయిన సాహిత్యపత్రికల్లో ప్రచురింపబడ్డ వ్యాసాల సంకలన మది. ఆ వ్యాసాలలో కోరాడ వారి విమర్శనా పద్ధతిని వివరించి ఆ తరువాత 'ఆంధ్రభారత కవితా విమర్శన' మనే పుస్తకం గురించి వివరిస్తాను.

'సాహిత్య వ్యాసములు' - లోని వ్యాసాలు అయిదు.

1. జాతీయజీవనము - వాఙ్మయము
2. విమర్శన పద్ధతులు
3. నన్నయకు బూర్వ మాంధ్రవాఙ్మయ స్థితి
4. ఆంధ్రవాఙ్మయ చరిత్రము ; యుగవిభజనము
5. భారతాంధ్రీకరణము - ఎఱ్ఱాప్రెగడ.

'జాతీయ జీవనము - వాఙ్మయము' పరస్పరము సంబంధము కలిగినవని ఈ వ్యాసకర్త వ్యాసం రచించే నాటికి తెలుగు పాఠకులు అంతగా గమనించని విషయం. ఆవిషయాన్నే వ్యాస కర్త -

'సామాన్యముగా జాతీయజీవనము తద్వాఙ్మయమున ప్రతి బింబితంబై యుండునను విషయము నితరభాషా వాఙ్మయపరిచితి లేని కేవల హైందవ విజ్ఞాన ధురంధరు లగు మనవారు కొందరు పాటింపరేమోగాని, పాశ్చాత్య వాఙ్మయములను అచ్చటి విమర్శకాభిప్రాయములను పరిశీలించిన వారికెల్లర కును అది వాఙ్మయవిషయమువలన నొక ముఖ్య తత్త్వముగ గోచరింపక మానదు.'' అనే ఉపోద్ఘాతంతో వ్యాసాన్ని ప్రారంభించి సోపపత్తికంగా నిరూపించారు.

విమర్శన పద్ధతులు - అనేవ్యాసంలో - కవిజీవితం కొంతయినా తెలిసి ఉంటే అతని కావ్యాన్ని బాగా అర్థం చేసుకోవచ్చు అనేవిషయా గురించి - ''కవి గ్రంథములను అందలి విశేషాంశములను పూ గ్రహింపవలయునన్నచో ఆకవి జీవితము మనకు గొంత యపడగలదు.'' వ్యాసం చివరిలో విమర్శక విధానంగూర్చి వీరిచ్చిన ముగింపూ వారి ఔచిత్యదృష్టికి నిదర్శనం.

''విమర్శయనగా దోషారోపణ కాదని తేలుచున్నది. అయినను ఆగ్రంథకర్త కుకవి యని పరిగణింపబడునేమోయను భయముచే దోషములను దోషములని చెప్పుటకు భయపడ గూడదు. లేనియౌన్నత్యమును నొక కావ్యమునం దున్నదని చెప్పుచు జనులను మోసపుచ్చరాదు; ఉన్నగుణములను గణన చేయకయుండరాదు''.

విమర్శలు వ్రాసేవారికొక చక్కని బాటను చూపిన సద్విమర్శకులు కోరాడవారు.

'నన్నయకు పూర్వ మాంధ్రవాఙ్మయస్థితి' - ఏమిటి అనేది శాసనాలు, జానపదగేయాలు, మొదలయిన వాటిని పరిశీలించి, పరిశోధించి, చెప్పవలసిన విషయం. కోరాడ వారా విషయాల నన్నిటిని సునిశితంగా అవలోడించి -

''ఈ శాసనములలోని పద్యములన్నియు దేశీయవృత్తముల లోనే గాని నమకాలికములగు కన్నడశాసనములలో వలె సంస్కృత వృత్తములలో రచింపబడకుండుట.......విశేషము.'' అని వివరించడంతో బాటు - ఒకభాషా స్వరూప స్వభావాలుస్థితి గతులు తెలుసుకోవలసిన అగత్యాన్నిసోపపత్తికంగా నిరూపించి తులనాత్మకాధ్యయనావశ్యకతను ఈశతాబ్ది ఆరంభంలోనే చాటి చెప్పారు.

''ఇట్లాయా దేశకాలపరిస్థితులను బట్టి యాయా భాషా వాఙ్మయములందలి రచనా పద్ధతులకును వాఙ్మయ స్వరూపమునకును గల సంబంధమును విమర్శింపవలసి వచ్చినప్పుడు సన్నిహితభాషల స్థితిగతులను వాని సంప్రదాయములను దెలిసికొన వలసిన యావశ్యకత యెంతేనియు గలుగు చుండును.''

'ఆంధ్రవాఙ్మయ చరిత్రము: యుగవిభజనము' - వాఙ్మయాన్ని యుగాలుగా విభజించి అధ్యయనం చేసే పద్ధతి మనకు ఆంగ్లసాహిత్య సంపర్కంతో ఏర్పడినదే. కోరాడవారు ఈవ్యాసం వ్రాసేనాటికి - 'ఆంధ్రకవుల చరిత్ర', 'కవిజీవితములు' మొదలయిన గ్రంథాల్లో చేసిన యుగవిభాగం ఏవిధంగా అవ్యాప్తి అతివ్యాప్త దోషాలకు తావునిచ్చాయో వివరించి-

''వాఙ్మయ యుగమును తత్పరిణామక్రమమునందలి విశేషలక్షణముల చేతనేకాక - ఆయా కాలములం దాపరిణామమునకు దోడ్పడుచు ప్రసిద్ధులై యుగపురుషులన దగిన మహాకవుల నామములచే గూడ చెప్పుచుండుటయు గలదు.''

మహాకవుల నామములతో యుగ విభజనను సమర్థించి వీరు-

1. అజ్ఞాత యుగము లేదా - ప్రాఙ్నన్నపార్యయుగము
2. భాషాంతరీకరణయుగము లేదా - కవిత్రయ యుగము
3. సంధియుగము లేదా - శ్రీనాథయుగము
4. ప్రబంధయుగము లేదా - రాయల యుగము
5. దక్షిణదేశవాఙ్మయ యుగము
6. ఆధునిక యుగము - అను ఆరు యుగములుగా విభజించిరి.

ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు చేసిన యుగవిభజనమే నేడు విశ్వవిద్యాలయస్థాయి పఠనపాఠనము లందు ప్రామాణికము నిర్దుష్టము అయిన విభజనగ పలువురు పండితులు అంగీకరించిరి.

ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారి శిష్యులు. వీరి పర్యవేక్షణలో 'ప్రభావతీప్రద్యుమ్నము'పై శ్రీ లక్ష్మీకాంతముగారు M.A (Hons) ను చేసిరి. శ్రీ కోరాడవారిసాన్నిధ్యము, ప్రభావము కలిగిన లక్ష్మీకాంతముగారు ఆంధ్రవాఙ్మయమును పది యుగములుగ విభజించిరి. ఆ పది యుగములు కోరాడవారి యుగ విభజనము నుండి పుట్టినవే.

పింగళివారి విభజనము ప్రధానముగా మహాకవులను యుగకర్తలుగా నిర్ణయించి చేసినదే. ఈ విధానము ఆ గురుప్రభావమే. కోరాడవారి కవిత్రయ యుగమును - పింగళివారు 'నన్నయ యుగము', 'తిక్కనయుగము', 'ఎఱ్ఱనయుగము' అని విభజించిరి. నన్నయ తిక్కనలకునడుమ శివకవియుగమును చేర్చిరి. దక్షిణదేశవాఙ్మయ ఆధునిక యుగములకునడుమ క్షీణయుగము నొకదానిని చేర్చిరి. కోరాడవారి మార్గమునను సరించియే పింగళివారు ఈ విభాగము చేసిరి. కాగా ఆంధ్ర వాఙ్మయ యుగవిభజనమునకు కోరాడవారు మార్గదర్శకు లన్నమాట.

అయిదవ వ్యాసము - 'భారతాం[illegible]రణము - ఎఱ్ఱాప్రెగడ' ఎఱ్ఱాప్రెగడ భారతమును ఆం[illegible] కరింపలేదనీ, అక్కడక్కడ శిథిలములను మాత్రమే పూరిం[illegible]నని ఒకవాదము. అది కాక నన్నయను గూర్చి తిక్కన తనభారతంలో - 'అందాది దొడంగిమూడు కృతులు నన్నయవ్రాశాడనడంలో మూడు పర్వాలూ పూర్తిగానన్నయే వ్రాసినట్లుగా పాఠకులు అర్థంచేసుకోవడానికి అవకాశం ఉంది. ఈ సందర్భంలో కోరాడవారు నిశితంగా పరిశీలనచేసి అసలు తిక్కన నన్నయను చదివాడా అని ఒకప్రశ్నవేశారు. నన్నయ ప్రసక్తి తిక్కన ఉత్తరరామాయణంలో లేనేలేదు. 'ఆదికవీంద్రుల నూత్నసత్కవీశ్వరులను' భక్తితో కొలుస్తానన్నాడంతే. ''వారికృపన్ కవితావిలాస విస్తర మహనీయుడనైన నను'' అని కూడా అన్నాడు. తిక్కన నాటికి నన్నయభారతం ఆంధ్రావళిచేత చదవబడుతూ ఉంటే - తిక్కన నన్నయ భాగాన్ని చదివి ఉంటే - అతని కవిత్వం గురించికాని, భారతం గురించి గాని రామాయణంలో చెప్పడా?

రామాయణంలోనే కాదు. విరాట పర్వంలో కూడా - భారతాన్ని ప్రశంసించి - 'అందాది దొడంగి మూడు కృతులు ఆంధ్రకవిత్వవిశారదుడు విద్యాదయితుడు అయిన నన్నయ వ్రాశాడన్నాడు. నన్నయకవితారీతికి సంబంధించి ఒక్కవిశేషణంకూడా తిక్కన వాడలేదు. పైరెండు విశేషణాలు - సర్వకవి సామాన్యాలు.

నన్నయ భారతభాగమును తిక్కన చదవలేదేమో! అని కోరాడవారు వెలిబుచ్చిన సందేహానికి సమాధానం ఆంధ్రవిమర్శకులు ఇంకా వెతకవలసి ఉంది.

ఇక ఎఱ్ఱన భారతాంధ్రీకరణ విషయంలో - ఎఱ్ఱనే ఆంధ్రీకరించాడనడానికి తిరుగులేని ఉపపత్తిని, గ్రంథస్థమయిన విషయాన్ని ప్రదర్శించి ఎఱ్ఱన భారత భాగాన్ని ఆంధ్రీకరించాడని నిరూపించారు కోరాడవారు. అది మధ్యాక్కరలలో యతి విషయం.

''ఇక మిగిలిన ఇద్దఱు నన్నయ ఎఱ్ఱాప్రెగడలు రచించిన మధ్యాక్కరలలో గొంతలక్షణభేదము కనబడుచుండుట యొక విశేషము. నన్నయ మధ్యాక్కరలలో బ్రతిపాదమునను నాలుగ వగణము తరువాత యతి పాటించినాడు. కాని యెఱ్ఱాప్రెగ్గడ మూడవ గణము తరువాతనే యతిపాటించిన ట్లగపడుచున్నది. - అరణ్యపర్వము 4వ ఆశ్వాసమున 144వ పద్యముతో నన్నయ కవిత ముగిసినదనియు 145 పద్యముతో ఎఱ్ఱన కవిత ప్రారంభించినదనియు గదా చెప్పబడుచున్నది. ఒక్కయాశ్వాసముననే నన్నయ కవిత్వమని చెప్పబడుదానిలోని మధ్యాక్కరలకును, ఎఱ్ఱన కవితలోని వానికిని భేదము కనబడుటకీ భాగములు కేవలము భిన్నకవి కర్తృకములని చెప్పుటతప్ప వేఱుకారణ మగపడదు.''

సాహిత్యవ్యాసములను ఎంత నిశితముగ పరిశీలించి, సోపపత్తికముగ నిరూపణ చేయవలెను అను విషయములకు ఈ వ్యాసమొక్కటి చాలును. కోరాడవారి సాహితీ విమర్శనములో నూతన కాంతి పుంజము-లనదగిన కొన్ని వ్యాసము లివి.

ఇక 'ఆంధ్రభారత కవితావిమర్శనము' -

1928 నవంబరునెలలో అనగా సుమారు 64 ఏళ్లక్రితం మద్రాసు విశ్వవిద్యాలయంలో రీడరుగా ఉండి చేసిన పరిశోధన ఫలితమే ఈ విమర్శన గ్రంథం.

ఈ రచనకు పూనుకొనుటకు వారు చెప్పిన ప్రధాన కారణము -

''కేవల భాషాంతరీ కర్తలుగ నెన్న బడుచున్న భారతకవుల కళాచాతుర్య విశేషములను మూలగ్రంథముతో బోల్చివిడదీయ వలయునను తలంపే! -

దీనికి వీరు పరిధిని నిర్ణయించు కోవడానికి కారణం ప్రమాణముగ గ్రహింపదగిన మూల గ్రంథపాఠము తక్కిన పర్వములకు లభింపకపోవుటచే నీ విమర్శనము ప్రధానముగ నొక్కవిరాటపర్వము పైననే ఆధారపడవలసిన దైనది''.

తిక్కనార్యుని కళాప్రతిభలను బయలు చేయుటకే ప్రధానముగ కోరాడ వారీ గ్రంథాన్ని రచించారన్నది వారిమాటే. మహాభారతం మీద వీరికున్నగౌరవం వీరి సునిశిత పరిశీలన వల్ల ఏర్పడినదేగాని గతానుగతికంగా చెప్పిన మాట కాదు.

''వాఙ్మయము మొదటి గ్రంథంబగుటయే గాక, భాషాప్రయోగ విషయమునగాని, కవితాప్రావీణ్య విషయమునగాని దీనిని మించిన గ్రంథమీ భాషలో బూర్వముగాని, పరమునగాని బయలుదేరియుండలేదనుట సాహసోక్తి కానేరదు. ఇందు నన్నపార్యుని కవితాప్రవాహ గాంభీర్యమునకు తిక్కనార్యుని యసమాన కవితాకళా చాతుర్యము (poetic Art) వన్నె వెట్టుటచే దీనికట్టి మహాప్రతిష్ఠగలిగినది.''

**ఇంతవఱకేకాదు** - తిక్కనకు మహాభారతరచన చేకూరడం గురించి శ్రీ కోరాడవారు - తిక్కనరచనలోని విషయాన్నే సాదృశ్యంగా చెప్పడం ఒక అద్భుతమైన రచనా విధానం. ఒక కళ.

''ఒక కవియొక్క సహజశక్తి యాతడు తననైపుణ్యము వెలయించుటకుగా సేకరించిన వస్తువు యొక్క మహత్త్వమును బట్టియే వ్యక్తమగుచుండునని సాహిత్యవిమర్శకుల మతము. అర్జునుని యస్త్రకళానైపుణ్యమునకు దగిన గాండివ మాతనికి దొరికినట్లే తిక్కనార్యుని ప్రతిభకు గవితాశక్తికి దగినవస్తువు భారత కథయం దాతనికి లభించినది.

**''ఇన్నగమునందు గాండివ**
**మున్నది యదిగాని మద్భుజోద్రేక విలా**
**సోన్నతి కోర్వదు పెద్దయు**
**నన్నువ లీ విండ్లుగుఱుచ లల్పబలంబుల్.**

అని అర్జునుడు చెప్పినట్లుగా, తిక్కనమొదట నిర్వచనోత్తర రామాయణమును రచించి చూచి యది తన కవితావిలాసోన్నతికోర్వదని తలంచి కాబోలు ఈ భారతకథను చేపట్టినాడు.

అట్టి తిక్కన కవితావిలాసోన్నతిని వివరించడానికి ముందుగా తిక్కన ఎంచుకున్న సంస్కృతభారతప్రతి ఏది అయి ఉంటుందనే విషయం మీద సునిశితంగా పరిశీలన జరిపారు కోరాడవారు. చేతికి దొరకిన సంస్కృతభారత ప్రతితో ఆంధ్ర భారతకవుల ఆంధ్రీకరణాన్ని తారతమ్యపరీక్ష చేయడం సరియైన పద్ధతి కాదనీ - సాధ్యమైనంతలో ఏప్రతి ఆంధ్రకర్తస్వీకరించి ఉంటాడన్నది విమర్శకుడుపరిశీలించి నిర్ణయించుకోవడం పరిశోధకుని ప్రథమకర్తవ్యమని కోరాడ వారి హెచ్చరిక.

ఎఱ్ఱన అరణ్యపర్వశేషాన్ని నన్నయకవిత తన్నావహింపగా తద్రచనయకా రచింతునన్నాడు. అయినా పరిశీలించి చూస్తే ఎఱ్ఱన ఆంధ్రీకరణలో తిక్కన కవితామార్గాన్ని అనుసరించి రచించిన సన్నివేశాలు, ఘట్టాలు కనిపిస్తున్నాయని కోరాడవారి పరిశోధనలో బయటపెట్టిన విశేషాంశాలు.

''నన్నపార్యుని కవితయందుకంటె నెఱ్ఱాప్రెగ్గడ కవితలో దేశీయపదప్రయోగము కొంత యెక్కువగా గనబడుటయేగాక వర్ణనాంశములందు గూడా నతడు తిక్కనార్యుని యనుకరింప యత్నించెననుటకు - సముద్రవర్ణనమే నిదర్శనము.''

''గరుసులు గడవంగ గదలియల్లల్లన'' అనే ఎఱ్ఱనగారి సీసపద్యం - విరాటపర్వంలోని తిక్కన శమీవృక్ష వర్ణన పద్యాన్ని పోలి ఉన్నది. ''నెగడికొనలేచి నింగియంతంత''.

ఇదేకాక - ''సత్యాద్రౌపదీ సంవాదముగూడ సంభాషణశైలిలో రచింప బడుటయే కాక యిందలి జాతీయము, మనోవృత్తి వివరణ రీతులు తిక్కన శైలినే యనుకరించినట్లున్నవి.

**''ఏనును నీవలన నిజము**
**గానిది యంతయును నెఱిగి కమల దళాక్షుం**
**బూనివశగతుని జేసియ**
**మానస్నేహాను భోగ యుక్తి దలిర్తున్''**

**అనియడిగిన మదినించుక**
**గినుకవొడమ నడచు కొనుచు కృష్ణమృదులహా**
**సినియగుచు కృష్ణ భామిని,**
**గనుకొని యిట్లని యె నిర్వికారాకృతియై-**

**అరణ్య - 5-29**

మదిని బొడమిన కినుక నడచికొనుట (మనోవృత్తిగోపనము) మృదులహాసినియగుట, తుదకునిర్వికారాకృతియై పలుకుట ఇట్లు మనోవృత్తుల గమననైఖరిని విశదీకరించునట్టియు (Psychological descriptions or descriptions of mental attitudes and conflicts). నాటకాభినయమును సూచించునట్టియు వర్ణనల నత్యద్భుతముగా జేయుటలోని ప్రాగల్భ్యమొక్క తిక్కనకే చెల్లినది. తిక్కన ననుసరించి, యాత-డసమాన చాతుర్యముతో చిత్రించిన ద్రౌపదీ పాత్రముయొక్క తత్త్వమును బాగుగా దెలిసినవాడు గనుకనే యెఱ్ఱాప్రెగ్గడ యీ సందర్భమును తిక్కనవలె రచింపగలిగినాడు.''

ఒక కవి తాను చెప్పికొన్న రీతిలో ఎటూ తనరచనసాగిస్తాడు. అంతకంటే భిన్నంగా ఆకవిలో కనబడే కవితాలక్షణాన్ని పరిశీలనతో గమనించి సోపపత్తికంగా నిరూపించడం విమర్శనక శీలునికి మాత్రమే శక్యమైన విషయం.

ఒక మహాకవి చేతిలో రూపుదిద్దు కున్నపద్యంలో ఎన్ని భావాలు ఇమిడి ఉన్నాయో - ఎన్ని ఆలోచనలు దాగి ఉన్నాయో, ఆ పదాల వాడి ఎంతటిదో, ఆ పలుకులు పలికిన

ాత్ర మానసికస్థితి ఎట్టిదో సహృదయనైవేద్యంగా వివరించడం ఒక కళ. పద్యం వ్రాసే నేర్పుకంటే - ఆపద్యాన్ని వివరించే విమర్శకుని ప్రతిభ ఒకొక్కసారి కవికి పేరు తెచ్చిపెడుతుంది. మహాకవులవ్రాతలు సామాన్యులకు పూర్తిగా అర్థంకావు. ఆకవిని అర్థం చేసుకోవడానికి కవితో సమానమయిన ప్రతిభగల విమర్శ కులుండాలి. పద్యానికి వ్యాఖ్యానం వ్రాయడమంటే తిప దార్థం తాత్పర్యం వ్రాయడం కాదు. ఆ పద్యంలో కవి ని చే సిన కవితా సామగ్రిని వెలువరించడం. పాశ్చాత్యుల కవితా మ ర్శనల పద్ధతిని కూడా ఆకలింపు చేసుకొని ప్రాక్ విపశ్చిన్మత ముల వేయిరెట్లుగొప్పదయిన రసపోషణలో కవినేర్పును పాఠ కులకు అరటిపండు ఒలిచి చేతబెట్టినట్లు చెప్పగల కవితా విమర్శకులు శ్రీకోరాడ వారు. వీరి విమర్శనావిధానాన్ని విప్పిచెప్పగల ఒక్క ఉదాహరణతో ఈవ్యాసాన్ని ముగిస్తాను.

ద్రౌపది సుధేష్ణ కోరికపై కీచకుని యింటికి మదిర తేనేగి భంగపడివచ్చినది. దైన్యమాకారముగ దర్శన మిచ్చినసైరం ధ్రిని చూచి - సుధేష్ణ

**"ఏది కారణమున నెవ్వరెచ్చోట నీ**
**కేమికీడొనర్చి రెట్టిపాటె**
**సాహసికులు వారిజంపుదు నొంపుదు**
**భంగపఱతు నిదుమపఱతు జెఱతు."**

అనినది. 'ఈ పలుకులలోని యంత్యనియమ మామె తెచ్చి కోలు సంభ్రమమునకును శౌర్యమునకు ఎంత తగియున్నదో చూడుడు. ద్రౌపది సుధేష్ణతో తనకు జరిగిన పరాభవమును ఒక్క పద్యములో వివరించినది.

**"నను నీవప్పుడు సూతమందిరమున న్మద్యంబు దెమ్మన్న 'బో**
**యిన నాతం డవినీతి సేసినను జేయీకేను మత్స్యావనీ**
**శుని యాస్థానము దిక్కువే చనిన నచ్చో దీవ్రకోపంబువన్**
**వెనుకం గూడగముట్ట పట్టికొని తన్నెంబల్కులింకేటి కిన్".**

ఈ పద్యానికి కోరాడవారి కవితావిమర్శ -

"ఈపద్యం బెట్లు పరుగులిడుచు వివక్షిత కథాంశమును క్లుప్తముగా (concisely), సరళముగా (simply), సువ్యక్తముగున ట్లుగా (clearly) మనమున నాటునట్లుగా (impressively) చెప్పుచున్నదో గమనింపుడు. పిదప సుధేష్ణ యోదార్పామె శీలమునకు దగియే యున్నది. అత్క్షణముననే కీచకుని దండితు జేసి ఆమె కాహ్లాదమొనర్చుట. ఈ యనత్యసంవాదిని పూర్ని యెట్టిదో పాండుసుత వల్లభకు తెలియును. కావున దాని 'నాలముచేసి' తగినట్లే సమాధానము చెప్పినది.

**"నీవింత యలుగ నేటికి**
**నావంతయు బౌరజన మనః ఖేదము నొ**
**క్కావంత ద్రిక్కుకుండగ**
**లా వంతులు మత్పతులు గలరు పగదీర్పన్."**

నీవేమియు కోపగింప నక్కఱలేదు. కీచకుని దండింపనక్క ఱలేదు. నా పతులే యాపని చేయఁగలరన్నది. నీవు పూనుకొని నను నావంత దీరునటుల నిశ్చయములేదు గాని వారు నామనః ఖేదము నావంత ద్రిక్కకుండఁ దీర్చెదరన్నది. తన వంతనే గాదట. పౌరజన మనఃఖేదమును గూడ నొక్కావంతయు ద్రిక్కకుండఁ దీర్తురని చెప్పినది" ... ఇక్కడ తిక్కన కీచక వధను గూర్చిన కథలో నొక క్రొత్త విషయమును ప్రవేశపెట్టి నాడు. నూతనోద్దేశ (motive) కల్పనము చేసినాడు. ఈద్రౌ పది చెప్పిన మాటలచే కీచకుడొక్క ద్రౌపదినేగాక, ఇంతకు బూర్వమనేకులను బౌరజనులను గూడ బాధలు పెట్టుచు పౌరజన కంటకుడు గూడనైయున్నాడని తెలియచుండుటచే, నీ కీచకవధకు సన్నిహిత కారణము ద్రౌపదియే యైనను, దీని మూలముగా భీముని కృత్యమున కొక విధమగు ఘనత కూడ కలుగుచున్నది. తమకుపకారకులైన బ్రాహ్మణకుటుంబము నకు ప్రత్యుపకారము చేయుటయే సన్నిహిత కారణముగా బకాసురునిఁ జంపి యేకచక్ర పురవాసుల కందఱికి మహోపకా రము చేసినట్లే, యిచ్చటను ద్రౌపదీ పరాభవ పరిమార్జనము కారణముగా విరాట పౌరుల కుపకారము చేసిన వాడైనాడు. ఒక్క మాటచే తిక్కన యెట్టి మహ ద్విశేషమును సాధించినాడో చూడుడు. మూలములో నేమూలను గూడ పౌరజనులను గూర్చిన సూచనయే గానరాదు"

అమూలకమయిన చిన్న చిన్న కల్పనలతో కథను రసవత్త రంగా తీర్చగల శిల్పి తిక్కన. ఆ మహాశిల్పి కళాప్రతిభలు కోరాడవారు తమ రచనలో సోపపత్తికంగా సోదాహరణంగా వివరించి భావిపరిశోధకులకు విమర్శకులకు చక్కని రాజమా ర్గాన్ని నిర్మించి పెట్టారు.

ఆంధ్ర మహాభారతానికి విమర్శ వ్రాయడమే కాదు. కొన్ని కావ్యాలను పరిష్కరించి వాటికి విలువయిన పీఠికలు వ్రాసి పీఠికా రచనకున్నూ మార్గదర్శకు లయ్యారు వారు.

నవనాథ చరిత్ర, పరతత్త్వ రసాయనము, వల్లభాభ్యుద యము, నన్నిచోడని కుమార సంభవము, శ్రీనివాస విలాససే వధి, వెంకటాద్రి మాహాత్మ్యము మున్నగు గ్రంథాలకు వారు వ్రాసిన పీఠికలు అమూల్య రత్నపేటికలు.

ఆంధ్ర వాఙ్మయ చరిత్ర నిర్మాతలుగా, సత్కవితా విమర్శ కులుగా శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు చిరస్మరణీయులు.

సత్కవులతోబాటు సద్విమర్శకులు కూడా అజరామరులే అగుదురు.

# ''కోరాడ'' ఆంధ్ర భారత కవితా విమర్శనం
# తిక్కన మౌలికతా నిరూపణం

శ్రీ రాచపాళెం చంద్రశేఖర రెడ్డి

తెలుగు భాషా సాహిత్యాల మీద పరిశోధన చేసిన తొలితరం వాళ్ళలో రెండు రకాల వాళ్ళుండేవాళ్ళు. ఒకరు, సాహిత్య శాఖలతో సంబంధం లేని ఇతర రంగాల వాళ్ళు. అంటే న్యాయశాస్త్రం గణితశాస్త్రం మొదలైన శాఖలకు చెందిన వాళ్ళు. మొదట్లో ఎక్కువ మంది సాహిత్య పరిశోధకులు వీళ్ళే. ఇంకొకరు, సాహిత్య శాఖలలో పనిచేసే వాళ్ళు. వీళ్ళు తక్కువ మంది. ఈ కొద్ది మందిలో కీ.శే. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు ఒకరు.

''ఆంధ్రభారత కవితావిమర్శనము'' అనే గ్రంథం 1929లో వచ్చింది. అప్పటికి తెలుగు భాషా సాహిత్య పరిశోధనకు కొంత పునాది ఏర్పడింది. గిడుగు గురజాడలతో భాషాపరిశోధన, కట్టమంచి, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి మొదలగు వాళ్ళతో రచనా విమర్శనం, కందుకూరి మొదలగు వాళ్ళతో కవి, కవిత్వచరిత్రలు, పి. దక్షిణామూర్తి వంటి వారితో కవి జీవితపరిశీలనం, వెన్నేటి రామచంద్రరావు వంటి వారితో రెండు రచనల తులనాత్మక పరిశీలన, మానవల్లి వంటివారితో గ్రంథ పరిష్కారం-ఇలా భాషా సాహిత్యాలకు సంబంధించి అనేక రంగాల్లో పరిశోధన మొదలైంది. ఈ నేపథ్యంలోంచే కోరాడవారి గ్రంథం పుట్టుకొచ్చింది.

ఈ గ్రంథం కన్నా ముందే మహాభారతం మీద కొంత పరిశోధన సాగింది. మొదట్లో సంస్కృతాంధ్ర భారతాలను పోల్చి గుణదోష విచారణ చేసే పరిశోధన బాగా జరిగింది. 1894 జనవరిలోనే వైజయంతిలో పనప్పాకం అనంతాచార్యులు గారి ''సంస్కృతాంధ్ర భారతముల యందలి శంతను పాత్రు ప్రభుత్వముం గూర్చిన యొక చర్చ'' ఆంధ్రాంగ్లాలలో వచ్చింది. దాయవిభాగ చర్చ ఇందులోని విషయం. దీనిమీద కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు ''కురుపాండవ దాయవిభాగ నిర్ణయము'' వ్రాసి 1907లో ప్రకటించారు. దీనిని ఖండిస్తూ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు అదేపేరుతో 1913లో వ్రాశారు. 1915లో ''శ్రీమహాభారత విమర్శనము''లో పార నంది రామశాస్త్రిగారు పై వాదోపవాదాలు అనవసరాలని తేల్చి చెప్పారు. ఇందులో ఇంకా చివుకుల అప్పయ్యశాస్త్రి, శివపురపు వీరభద్ర పాకయాజి, భమిడిపల్లి వీరవెంకట దీక్షితులు మొదలగు వాళ్ళు పాల్గొన్నారు. 1899లో కళాపూర్ణోదయం మీద వ్యాసం వ్రాస్తూ మహాభారతంలోని పాత్రల సజీవత్వానికి, అందులోని సహజత్వానికి ముగ్ధులైనారు కట్టమంచి రామలింగారెడ్డిగారు. రాజమండ్రిలో నన్నయ్య వర్ధంతి సభలో కట్టమంచి చేసిన అధ్యక్షోపన్యాసం సాహిత్యాన్ని సామాజిక జీవిత ప్రతిబింబంగా చూసే ధోరణికి మార్గదర్శకమైంది.

ఈ సాహిత్య నేపథ్యంలోంచి కోరాడ వారి గ్రంథం ఆవిర్భవించింది. కోరాడవారు మద్రాసు విశ్వవిద్యాలయంలో రీడర్‌గా ఉండి చేసిన పరిశోధనా ఫలితమే ఈ గ్రంథం. 1927లో ఆయన మద్రాసు విశ్వవిద్యాలయంలో చేరారు. వారి పరిశోధనలు ఆధారంగా మరుసటి సంవత్సరం 1928లో ఆయన చేసిన ఉపన్యాసాలకు విస్తర రూపమే ఈ గ్రంథం. తన పరిశోధనా లక్ష్యాన్ని కోరాడవారే ఇలా వివరించారు. ''గీర్వాణ సారస్వత మహావృక్ష శాఖకు గట్టిన యంటుగా బయలుదేఱి విజృంభించి యాంధ్ర సారస్వతమునందు ఆంధ్ర జాతీయ గుణమెంత వఱకు నిలిచియున్నదో పరిశీలింపవలసియున్నది... కేవల భాషాంతరీ కర్తలుగ నెన్నబడుచున్న భారతకవుల కళాచాతుర్య విశేషములను మూలగ్రంథముతో బోల్చి విడదీయవలయునను తలంపే నన్నీ విమర్శనమునకు బురికొల్పినది'' (పీఠిక). దీనిని బట్టి కోరాడవారి విమర్శల లక్ష్యం ఆంధ్ర మహాభారతం సంస్కృత భారతానికి యథాతథానువాదం కాదని, మౌలికత ఎంతో ఉందని నిరూపించడమేనని అర్థమౌతుంది. సంస్కృత భాషా వ్యామోహంతో తెలుగు భారతాన్ని తక్కువ చూపు చూసే పండితులకు సమాధానంగా కోరాడవారు ఈ గ్రంథాన్ని రచించారని చెప్పవచ్చు.

ఈ గ్రంథంలో కోరాడవారు పరిశీలించిన అంశాలు ప్రధానంగా రెండు. ఒకటి, తిక్కన అనుసరించిన మూలప్రతి, మూలాన్ని తిక్కన అనువదించిన తీరు, చేసిన కల్పనలు. రెండు, తిక్కన ప్రబంధకవులకు మార్గదర్శకంగా నిలిచిన

నైనం. లభిస్తున్న సంస్కృత భారతప్రతులు ఉత్తర భారత ప్రతులని, దక్షిణ భారత ప్రతులని పేర్కొంటూ తిక్కన దక్షిణ భారతప్రతిని అనుసరించాడన్నది ప్రచురంగా ఉండే వాదాన్నే కోరాడవారు సమర్థించారు. అయితే ఈ చిన్న నిర్ణయంతో సరిపెట్టుకోలేదు ఈయన. ఉత్తర దక్షిణ దేశ ప్రతులకు వైరుధ్యం ఏర్పడినచోట్ల దక్షిణదేశ ప్రతిలోని పాఠం తిక్కన రచనకు దగ్గరగా ఉంటున్నది, కాని ఇలాంటి చోట్ల మూలపాఠం స్పష్టంగా లేక గందరగోళంగా ఉంది, ఈ కారణంగా తిక్కనకు లభించిన దక్షిణదేశప్రతి అప్పటి ఉత్తరదేశ ప్రతితో సమానంగానే ఉండి ఉంటుంది, తర్వాత ఎప్పుడో దక్షిణదేశ ప్రతిలో కొన్ని ప్రక్షిప్తాలు చేరి ఉంటాయి, అందులో తిక్కనగారి పద్యాలు కూడా శ్లోకాలుగా మార్చి ఎవరైనా చేర్చి ఉంటారు అన్నది కోరాడవారి ప్రతిపాదన. ఇదే తిక్కన గొప్పతనానికి ప్రబల నిదర్శనమని ఈయన అభిప్రాయం. తిక్కన అనువాదం తీరును నిరూపిస్తూ కోరాడవారు ఈ వాదాన్ని బలంగా నిరూపించడానికి ప్రయత్నించారు.

కవిత్రయం వారి కల్పనలను చర్చిస్తూ అనేక మంది పండితులు వ్యాస భారతంలోని అనౌచిత్యాన్ని పరిహరించడానికి చేసిన కల్పనలుగా పేర్కొన్నారు. కాని కోరాడవారు తిక్కన కల్పనలకు నాటి సమాజం ఎలా ఆధారమైందో ఉదాహరణలతో నిరూపించారు. విరాటపర్వ ప్రారంభంలో విరటుని కొలువులో భీముడు మల్లులతో చేసిన కుస్తీని గురించి చెబుతూ తిక్కన భీముని నడకను వర్ణించినప్పుడల్లా ఏనుగు నడకతోనే పోల్చడాన్ని సమర్థించారు. ''మల్లయుద్ధ రంగములోనికి మల్లులు వచ్చుటను గజాలస్యగమనముతోడను పోల్చుటయే యుక్తతరంబను విషయ మాంధ్రదేశమున కుస్తీ పందెములకు వస్తాదులు నడచు రీతిని చూచిన వారికి దోచకపోదు. తిక్కన తన కాలమున నాంధ్రదేశమున విశేషముగా బ్రబలియున్న యీ కుస్తీ పందెములను మనమున నిడుకొనియే భీముని మల్లయుద్ధ వర్ణనను రచించినాడనుటలో సందేహము లేదు'' అన్నారు (పు.162).

తిక్కన కల్పనలలోని దేశీయ జీవితాన్ని పునర్నిర్మిస్తూ తిక్కన మౌలికతను నిరూపించడానికి బాగా శ్రమించారు కోరాడవారు. స్వాతంత్ర్య సంగ్రామ కాలంలో సహాయ నిరాకరణ స్వదేశీ ఉద్యమాలు మార్మోగుతున్న కాలంలో, ఆంధ్రోద్యమం బలపడుతున్న కాలంలో ఒక రచనలోని మౌలికతను గురించి వెతక బూనడం సహజ చర్యే. అందుకే కోరాడవారు తిక్కన వర్ణనలలో ''తిక్కన దేశీయాభిమానమును వ్యక్తపఱచు దేశీయాచార వర్ణనలు గలవు'' అన్నారు (పు.284). ఈ క్రమంలోనే వ్యాస భారతానికి అనువాదకులుగా కవిత్రయం వారు న్యాయం చెయ్యలేదు అనే విమర్శకులకు ఈయన గట్టిగా సమాధానం చెప్పారు. కవిత్రయం వారి ఉద్దేశం వ్యాస భారతాన్ని యథాతథానువాదం చెయ్యడం కాదు, వాళ్ళ ఉద్దేశమే అది కానప్పుడు వాళ్ళు సరిగా అనువదించ లేదనడం సరికాదని అభిప్రాయపడ్డారు. ''విమర్శకుని దృక్పథము మాఱిన గాని యీ కవితయందలి విశేష గుణములు బయల్పడవు'' (పు.103). ''మూలము వ్యాసునిదే యైనను వారు దీని నొక విధమగు స్వతంత్ర గ్రంథ మనిపించునట్లే రచించినారు... ఒక గ్రంథమును చదువునపుడు మన మే దృష్టితో చదువుచున్నామను'' విషయము గూడ ముఖ్యముగా గమనింపదగియున్నది'' (పు.15). ఈ సందర్భంగానే దేశీయ జీవిత చిత్రణకు సంబంధించిన అంశాలు కొన్ని దక్షిణ దేశ ప్రతుల్లో కనబడడం వల్ల, అవి అక్కడ అతుకుల బొంతలుగా అసందర్భంగా ఉండడం వల్ల, అవి తిక్కన భారతంలోంచి దక్షిణభారత ప్రతిలోకి వెళ్ళిన ప్రక్షిప్తాలన్న వాదాన్ని స్థాపించడానికి కోరాడ ప్రయత్నించారు.

కోరాడవారికి ఆనందాన్నే గాక ఆశ్చర్యాన్ని కూడా కలిగించిన అంశం తిక్కనలోని స్వాభావికత; పాత్రచిత్రణ, సంభాషణ, వర్ణన, శైలి వంటి అనేకాంశాల్లో కొట్టొచ్చినట్లు కనిపించేది స్వాభావికత! భారతంలోని సహజత్వాన్ని గురించి బాగా ప్రస్తావించినవారు కట్టమంచి. ఈ శతాబ్ది ప్రారంభంలో అందర్నీ వాస్తవికతావాదం ఆకర్షించిన విషయం తెలిసిందే. (నవల, కథానిక, విమర్శ వంటి ప్రక్రియల్ని వాస్తవికత నడిపిస్తున్న కాలంలో కవిత్వంలో భావ కవిత్వం ప్రధానంగా రావడం తెలుగు సాహిత్య చరిత్రలో పెద్ద వైరుధ్యం.) పాశ్చాత్య సాహిత్యం ద్వారా రియలిజం ప్రభావం సాహిత్య విమర్శ మీద కూడా పడింది. అప్పుడు తిక్కనే మహోన్నత కవిగా కనిపించాడు. ''ఆంధ్ర భాషలో సహజకవితను తూచి చూడవలెనన్న భారతకవుల యొద్దకు నందు ముఖ్యముగా తిక్కనార్యు నొద్దకు బోవలసినదే'' అంటారు కోరాడవారు (పు. 282). ''ఈతని కవితా కళకంఠతకును గూడ స్వాభావికత్వగుణమే (realism) మూలతత్త్వము'' (పు.321) ''మొత్తముమీద నీతని కవితకు ముఖ్య లక్షణంబగు 'స్వాభావికతా' గుణమే యీ భారత కథ యెప్పుడో యెచ్చటనో జరిగినది వలెగాక మన కనుల యెదుట జరుగుచున్నదానివలె బ్రత్యక్షానుభవము లోనికి దెచ్చుటకు విశేషముగా తోడ్పడినదని చెప్పవలసియున్నది'' (పు. 328).

భారతం ఇతిహాసం. కాని తెలుగు భారతం మాత్రం కావ్య లక్షణాన్ని పుణికిపుచ్చుకున్న ఇతిహాసం. కావ్యేతిహాసం. ఇతిహాసంలో విషయం విస్తృత మైంది గనక ప్రతిదీ రేఖామాత్రంగా చెప్పబడుతుంది. కావ్యంలో ప్రతిదీ వివరంగా వర్ణింపబడుతుంది. తిక్కన కాలానికి ఆలంకారిక శాస్త్రాలు సాహిత్యాన్ని శాసించే దశకు ఎదిగాయి. నన్నయ్యమీద కన్నా తిక్కనమీద

వీటి ప్రభావం స్పష్టంగా కనబడుతుంది. కాకతీయ శిల్పంలోను తిక్కన కవిత్వంలోను కనిపించేది ఆలంకారికత. అందుకే ''అతని దృష్టి యెల్లప్పుడును రసపోషణమునందును ఔచిత్యముతో గూడిన శీలభావ పోషణము నందును ఆయా పాత్రల మానసిక వృత్తి వివరణము నందును కథా ప్రవృత్తికి స్వాభావికత్వ గుణ సంపాదనమునందును (make the movement of the story realistic) కావ్యకళా సౌందర్యమునందును నిశిత వ్యంగ్యంబై (keen) యొప్పుచుండును'' అన్నారు కోరాడ వారు (పు. 209).

పింగళి లక్ష్మీకాంతం మొదలైన పండితులు తిక్కన తర్వాత ప్రబంధ కవులకు ఎలా మార్గదర్శకుడు అయ్యాడో వివరంగా నిరూపించారు. వీళ్ళందరికన్నా కోరాడవారు తిక్కన వర్ణనల్లో తన కళాచాతుర్యాన్ని ప్రదర్శించి తర్వాతి ప్రబంధాలకు మార్గదర్శకుడయ్యాడని నిరూపించారు. కీచకుడు ద్రౌపదిని భావించిన తీరును వ్యాఖ్యానిస్తూ ''ఇయ్యింతి ప్రాపున నయ్యనంగుడు పార్వతీశునైనను దక్కనేల కున్నె'' మొదలగు పద్యాలను పేర్కొని ''ఇట్టి (ఆంతరంగిక శృంగార భావాతిశయ) వర్ణన యందే యాంధ్ర ప్రబంధ వృక్ష మూలబీజం బగపడుచున్నదని చెప్పవచ్చును'' అన్నారు (పు. 186). ''కుసుమ బాణుని బాణముల్'' అన్న తిక్కన పద్యం ''నేరెఓటేటియనల్ దెచ్చి'' అనే పెద్దన ప నికి మూలమన్నారు. ఇలా ఎన్నో ఉదాహరణలతో తిక్కన బంధ మార్గదర్శకత్వాన్ని స్థాపించారు. ''నిజముగ నాంధ్ర బంధకన్యకు పితామహుడు పెద్దనార్యుడేయైనను నంతకంటె ప్రపితామహుడు తిక్కనార్యుడు మఱియొకడు గలడని మనము ముఖ్యముగా గుర్తింపవలసియున్నది'' (పు.282).

15వ, 16వ శతాబ్దాల ప్రబంధాలకు 17వ, 18వ శతాబ్దాల ప్రబంధాలకు స్పష్టమైన తేడా కనిపిస్తుంది. ఆలంకారిక శాస్త్ర పరిధిని, వ్యాకరణ శాస్త్ర పరిమితుల్ని అతిక్రమించలేని బలహీనత ప్రబంధ కవులను శుష్క ప్రయోగాలలోకి నెట్టింది. కవిత్వమంటే శబ్దాడంబరం, శబ్దచమత్కారం అనే అపోహను కలిగించింది. భావుకతా శూన్యం, నిరర్థక శబ్దాడంబరం 17వ, 18వ శతాబ్దాల కవిత్వాల లక్షణం. తిక్కన మార్గదర్శకత్వం అప్పటికి కాలం చెల్లిందిగా మారిపోయింది. శుష్కించిపోతున్న ఫ్యూడల్ వ్యవస్థతోపాటు, ఆ వ్యవస్థను ప్రతిబింబించాల్సిన కవిత్వం కూడా శుష్కించిపోసాగింది. అందుకే సాహిత్య చరిత్రకారులు దీనిని క్షీణయుగమన్నారు. ఈ క్షీణయుగ సాహిత్యానికి తిక్కనను నిందించి లాభం లేదంటారు కోరాడవారు. అనంతర ప్రబంధ కవులు కృత్రిమ భావాలను అతిశయోక్తులతో నింపి తిక్కన మార్గాన్ని రోత పట్టించారని ఆవేదన పడ్డారు. ''తిక్కన తరువాతి ప్రబంధ కవులకు మార్గదర్శకుడేయైనను, వారివలె నత్యంతాతిశయోక్తులకును, కృత్రిమ భావములకును, సాంకేతిక నియమములకును లోబడక తన కవితయం దంతటను స్వాభావికత్వగుణమునే వెలయించినాడు''. (పు.101). భారత కథయను మేలిమి బంగారమున దన సహజ కవితా చాతుర్యముచే నసమాన తేజోవిరాజమానంబులగు ప్రబంధమణులను పొదిగి యాంధ్రవాణి కమూల్యాలంకారములను జేసినవాడు తిక్కన. పై బంగారము మీద వికృతపు నగిషీ పనులను విపరీతముగా జేసి చూపుటచే నందు పొందు పరుపబడిన ప్రబంధ మణుల సహజ విలాసమును, కాంతిని తగ్గించినవారు తరువాతి ప్రబంధ కవులు'' (పు. 283).

తిక్కన కవిత్వాన్ని గురించి పరిశోధిస్తూ, విమర్శ వ్రాస్తూ కోరాడవారు పరిశోధకులకు, విమర్శకులకు కొన్ని సూత్రాలు అందించారు. వీటిలో కొన్నిటిని ఇక్కడ స్మరిద్దాం:

1. ''ఒక కవి యొక్క సహజ శక్తి యాతడు తన నైపుణ్యమును వెలయించుటకుగా సేకరించిన వస్తువు యొక్క మహత్త్వమును బట్టియే వ్యక్తమగుచుండునని సాహిత్య విమర్శకుల మతము'' (పు.10).

2. ''ఒక కవి యొక్క గొప్పతన మాతడు చేపట్టిన విషయము యొక్క గౌరవమును బట్టియేగాక, ఆ విషయమును దా నెట్లుపయోగపఱచికొనినాడు, ఎ శిల్ప చాతుర్యమును చూపినాడు, దాని కే వన్నె చిన్నెలు వె యెట్టి నూతన వస్తువు - నూతన సృష్టిగా చేసిచూపి తన ప్ర భను మెఱయించినాడు - అనుదానిని బట్టియుండును'' (పు. 14).

3. ''ఆ కావ్యమునంతను ఆవరించియుండు నాతని (కవి) యాత్మశక్తియె (personality) తన్మహత్త్వమునకు గారణమగుచుండును. అదియే మనము ముఖ్యముగా గమనింపదగిన విషయము'' (పు. 14).

4. ''ఒక గ్రంథమును చదువునపుడు మనమేదృష్టితో చదువుచున్నామను విషయము గూడ ముఖ్యముగా గమనింపదగియున్నది'' (పు. 15).

ఇవిగాక ఈ గ్రంథంలో నేటి పరిశోధకులు తెలుసుకోదగిన అంశాలు కొన్ని ఉన్నాయి. ఏదైనా ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం ఎంత బాధ్యతాయుతమైన పనో, దానికి ఎంత నేపథ్యం, అధ్యయనం అవసరమో, ఉపపత్తుల సేకరణ ఎంత అవసరమో నిరూపిస్తుంది ఈ గ్రంథం.

విషయ విశ్లేషణ, వివేచన, శైలి మొదలైన వాటిలో ఉండవలసిన నిర్దుష్టత, స్పష్టతలకు ఈ గ్రంథం మంచి నిదర్శనం.

జాతీయోద్యమ ప్రభావంతో భారతంలోని మౌలికతను, దేశీయతను, జాతీయతను పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో భారతంలోని వాస్తవికతను ప్రదర్శించడానికి చేసిన ప్రయత్నం ''ఆంధ్ర భారత కవితా విమర్శనము''. 1928 నాటికి ఇది అగ్రగామి పరిశోధనా విధానం.

# కోరాడ రామకృష్ణయ్య విమర్శన వ్యాస సాహిత్యం

శ్రీ కొలకలూరి ఇనాక్

1. ఆధునికాంధ్ర సాహిత్య ప్రక్రియల్లో వ్యాసం ప్రాముఖ్యం పొందిందనీ, ఆ వ్యాస రచయితల్లో కోరాడ రామకృష్ణయ్య మొదటి తరం రచయిత అనీ గుర్తుంచుకోవటం అవసరమే! కోరాడ రామకృష్ణయ్య వంటి ప్రసిద్ధులు పలువురు చేపట్టిన ఈ రచనా ప్రక్రియ సృజనం కాదు, విమర్శనం, ఇది విమర్శన వ్యాసం.

వ్యాసం సృజన, విమర్శన ధర్మాలు రెండింటితో పరిపుష్టమ యింది. వ్యాసగతమైన విమర్శనా, ముఖ్యంగా సాహిత్య విమ ర్శనం, కొంత ప్రాధాన్యం సంతరించుకుంది. సృజన ధర్మంతో ప్రకాశించే వ్యాసం అసలు వ్యాసంగా గుర్తించబడగా, విమర్శన వ్యాసం కూడా వ్యాసంగానే గుర్తింపు పొందింది.

విమర్శన వ్యాసం పరిధిలో భాషా విషయం, భాషాశాస్త్ర విషయం ప్రసక్తమయిన సందర్భం ఈ స్థితిలో గుర్తుంచుకో వాలి. అటు పరిపూర్ణ వ్యాసంగా కాక, ఇటు సంపూర్ణ భాషాలో చనంగా కాక, ఆవిష్కరణం పొందిన రచనా ప్రక్రియ విమర్శన వ్యాసంగా గుర్తింపు పొందింది. కోరాడ రామకృష్ణయ్య వ్యాస కృషి, ప్రధానంగా భాషా శాస్త్ర ప్రాంగణంలో ప్రవర్తిల్లింది. భాషా విషయకంగా ప్రాథమికం, మౌలికం అయిన ఆలోచన రంగం సిద్ధంచేసిన ఖ్యాతి కోరాడ రామకృష్ణయ్యను వరించింది.

2. వస్తు తత్త్వాది ధాన విషయాలు కూలంకషంగా నిశితంగా పరిశీలించే ప్ర యి విమర్శనం. ఈ రీతిలో అంత సర్వంకషంగా కాని అం సునిశితంగా కాని లేని సారస్వత శాఖ విమర్శనవ్యాసం. అది విస్తృత పరిశీలనంగా ఉంటే తద్భాగంగా విమర్శన వ్యాసం ఉంది. వస్తు సమస్త భాగ పరీక్ష విమర్శనం చేస్తే ఏ భాగమయినా ఇది పరీక్షించింది. సమగ్ర సంపూర్ణ పథకం విమర్శనం కలిగి ఉండగా తదున్నతి తత్త్వం పూర్ణత అనవసరమయి విమర్శన వ్యాసం ఉంది. అది వస్తు గుణ పరిశోధన పూర్తిగా చేయగా, తదావశ్యకం లేనిదయింది విమర్శన వ్యాసం. వస్తు స్వభావం, స్వరూపం తెలుపుతూ అన్ని అంశాలు వివరించేదిగా, ప్రత్యంశ పరాకాష్ఠ పరికించేదిగా విమర్శనం ఉంటే కొన్ని అంశాలే అయినా, కొంతవరకే అయినా తెలిపేదిగా ఉంది విమర్శన వ్యాసం.

అందువల్ల విమర్శన వ్యాసం, విమర్శనం యొక్క అసం పూర్ణ రూపంగా కాని, ప్రారంభ దశగా కాని, అపరిపక్వ స్థితిగా కాని భావించే అవకాశం ఉంది. అయితే విమర్శనాధిక్యం విమర్శన వ్యాసాధిక్యం వ్యక్తీకరించటం కాదు. వస్తు విస్తృతి గ్రహించటమే కాని, అధిక్యానాధిక్య ప్రసక్తి లేదు. సంపూర్ణ విమర్శనం కాని రచన విమర్శన వ్యాసంగానే గ్రహింపవచ్చు. కాబట్టి వస్తు పరిశీలనా పరిధి విస్తృతమయితే విమర్శనం, పరిమితమయితే విమర్శన వ్యాసం.

అయితే ఏ గ్రంథం విమర్శనం ఏది? విమర్శన వ్యాసం అని పరిశీలించటం సక్రమ విభజనం, వేర్పాటు లేమి వల్ల, బాధ్యతా యుత కర్తవ్యమే అవుతుంది. కట్టమంచి రామలింగారెడ్డి 'కవిత్వ తత్త్వ విచారము' విమర్శనంగా 'వ్యాసమంజరి' విమర్శన వ్యాస సంపుటిగా గ్రహించటం జరిగింది. అలాగే కోరాడ రామకృ ష్ణయ్య ఆంధ్రభారత కవితా విమర్శనము విమర్శనంగా, 'సార స్వత వ్యాసములు' విమర్శన వ్యాసాలుగా భావించటం అయింది. విమర్శనంగా, విమర్శన వ్యాసంగా నిర్ణయించటానికి రచనా పథకం దోహదకారి. కట్టమంచి రామలింగారెడ్డి 'కవిత్వ తత్త్వ విచారము'లో కవితా నిర్మాణానికి ప్రాథమిక తత్త్వం పరికించి కళాపూర్ణోదయం, ప్రభావతీ ప్రద్యుమ్నం పరిశీలిస్తే, కోరాడ రామకృష్ణయ్య 'ఆంధ్ర భారత కవితా విమర్శనము'లో ఒక ప్రక్రియ సంపూర్ణ వైశిష్ట్యం సారభూత ధర్మం విశదీకరిం చారు.

3. కోరాడ రామకృష్ణయ్య జీవితమంతా అధ్యాపక వృత్తి, పరిశోధన కృషి రెండు నేత్రాలై ప్రకాశించింది. ఆయన పరిశో ధన భాషను, సారస్వతాన్ని వెలిగించింది. ఈ రచయిత విమర్శన వ్యాస సృష్టి భాషా సారస్వత రంగాలలో తద్రీతిలో ఆద్య దశలోని ప్రధానం, ఉత్తమం అయిన కృషిని విశదం చేస్తూ ఉంది.

కోరాడ రామకృష్ణయ్య వ్యాస సృష్టిని ప్రధానంగా భాషా వ్యాసాలు, సారస్వత వ్యాసాలు, ఆకాశవాణి ప్రసంగ వ్యాసాలుగా మూడు పాయలుగా పరికింపవచ్చు. ఈ త్రివేణీ సంగమం

స్థూలంగా కావ్యతత్త్వ ప్రదర్శకంగా ఉంది. తెలుగు సారస్వతంలో ఆద్య విమర్శకులలో కోరాడ వారి స్థానం స్థిరం.

**3.1. భాషా వ్యాసాలు:** తెలుగు భాష ద్రావిడ భాషా కుటుంబానికి చెందినదని ఆంగ్లేయులు భావించడం, కాల్డ్వెల్ ఆ విషయం విస్పష్టం కావించటం ఆంగ్లంలో జరిగితే తెలుగులో ఈ భాషా దృష్టి వ్యాసగతంగా వెలువరించిన తొలి విమర్శకులలో కోరాడ రామకృష్ణయ్యకు ప్రాధాన్యం ఉంది.

'ద్రావిడ భాషా తత్త్వము' అనే వ్యాసం (1921) విజయనగరం మహారాజా కళాశాల పత్రికలో ప్రకటించి, పెంచి, 'భాషోత్పత్తి క్రమము-భాషా చరితము' అనే విశిష్ట వ్యాసంగా ప్రకటించటం జరిగింది. ఇది ప్రచురణకు పూర్వం ఆంధ్ర సాహిత్య పరిషత్తు తణుకు సమావేశంలో ఉపన్యాసంగా చదువబడింది. భాష పుట్టుక, తద్వికాసం స్థూలంగా వివరిస్తూ ఉందీ వ్యాసం. ఈ భాషా దృష్టి వల్ల 'నన్నయ్యకుఁ బూర్వమాంధ్ర వాఙ్మయ స్థితి'ని పరిశీలించటం జరిగింది.

ఈ భాషా పరిశీలనలో భాగంగా తెలుగు భాషలో సంధి వైశిష్ట్యం దర్శించటం కుదిరింది. ఈ పరిశీలనం సమగ్ర విమర్శనంగా భావింపదగ్గ ఉన్నత పథకంతో ఒప్పుతూ ఉంది. ఈ సాహితీ వేత్త రచనావ్యాసంగంలో విశిష్ట దృష్టిగా 'దేశి' గోచరమవుతూ ఉంది. తెలుగు సాహిత్యంలోనే కాదు, జీవితంలోనూ వ్యక్తమయ్యే మార్గ దేశి సంప్రదాయాలలో వ్యాసకర్తకు దేశి రీతిమీద ఉ ` అభిమానం అభినివేశం తెలుపుతూ 'దక్షిణ దేశ భాషా సార ˜తములు - దేశి' గ్రంథం ఉంది. ఇది ఆరు వ్యాసాల సంపు . తెలుగు భాషకు, సాహిత్యానికి పథ ప్రదర్శకంగా ఉన్న దేశి తత్త్వం విస్పష్టంగా ఇందులో వివేచించటం జరిగింది. ఈ భాషా వ్యాసాలు రచయితను ఆంధ్ర భాషా శాస్త్రవేత్తగా విశిష్ట స్థానంలో నిలుపుతున్నాయి.

**3.2. సారస్వత వ్యాసాలు:** 'ఆంధ్ర భారత కవితా విమర్శనము' ఖ్యాత విమర్శన గ్రంథం. 'సారస్వత వ్యాసములు' సుప్రసి వ్యాస సంపుటి. ఇందులో ఆంధ్ర వాఙ్మయం యుగాలుగా వి జించి, చారిత్రకంగా పరిశీలించి, ఎఱ్ఱా ప్రగ్గడ భారతం ఆంధ్రీకరించిన రీతి విశదీకరించి, సారస్వతంలో జాతి జీవితం ఏవిధంగా ప్రతిబింబిస్తుందో వివరించిన వ్యాసాలతో పాటు విమర్శనం, విమర్శకుడు ఉన్న తీరు, ఉండవలసిన రీతి విపులీకరించిన వ్యాసం కూడా ఉంది.

అంతేకాక కౌంట్ ఆఫ్ మౌంట్ క్రిస్టోకు కథా మాత్రానువాదంగా ఉన్న 'యుగంధర విజయము' అన్న నవల ఆధారంగా ఆధునికానువాద ప్రక్రియపైన వ్యాసకర్తకున్న అభిప్రాయాలు విశదమవుతున్నాయి. సారస్వత వ్యాసాలు తత్త్వదృష్టిని విశదీకరించే పరిధిని అతిక్రమించలేదు. ఈ వ్యాసాలలో వ్యాసకర్త బుద్ధి నైశిత్యం, వైశిష్ట్యం గోచరమవుతున్నాయి.

**3.3. ఆకాశవాణి ప్రసంగ వ్యాసాలు:** ఇవి భిన్న విషయ విన్యస్తాలుగా ఉన్నాయి. ఇందులో సాహిత్యంలో సాంఘిక జీవితం దర్శించటం జరిగింది. ఇది సారస్వతం, భాష రెండింటి సమ్మేళనంగా గోచరమవుతూ ఉంది. సంస్కృతం తమిళం రెండూ పరిశీలన పొందాయి. హాస్యరసమూ తత్త్వశాస్త్రమూ ఈ వ్యాసాలలో సమాదరణ పొందాయి. ప్రథమాంధ్ర కవితా శిల్పిగా నన్నయభట్టూ, ఆధునికాంధ్ర సాహిత్య మార్గదర్శిగా వీరేశలింగం పంతులూ, పరిశీలన పొందారు. తాళపత్ర గ్రంథాన్వేషణం, నౌకాయానం వంటి అనేకాంశాలు ప్రసంగ వ్యాసాలుగా ఉన్నాయి.

ప్రసంగ వ్యాసం విస్తృతిలోనూ, ప్రయోజనంలోనూ ప్రయోగంలోనూ, రచనా పద్ధతిలోనూ పరిమితంగా ఉంది. ఉపన్యాసం, వ్యాసం రచించటం కంటే భిన్నంగా రెండింటి గుణ భరితంగా సమ్మేళనంగా ఉన్న రచనా రీతి ప్రసంగ వ్యాసం.

4. ఈ వ్యాసకర్త వ్యాస రచన త్రిగుణీకృతంగా భాషా, సారస్వత, ప్రసంగ వ్యాసరీతిగా సాగింది. స్థూలంగా భాషా వ్యాసాలలో వివరణ నైపుణ్యం, సారస్వత వ్యాసాలలో విమర్శన సామర్థ్యం, ప్రసంగ వ్యాసాలలో విశదీకరణ శిష్ట్యం గోచరమవుతున్నాయి. కోరాడ రామకృష్ణయ్య సార ˜తాంతర్వాహినిగా తొణుకెరుగని బుద్ధి హృదయాల ప్రశాంత విస్పష్టంగా గమనార్హంగా ఉంది.

రచనలలో స్పష్టత రచయిత ప్రధాన కాంక్ష. శాస్త్ర విషయం విశదంగా వివరించటంలో వ్యాసకర్త దీక్ష ఉంది. అందువల్ల భాష సరళ సుందరంగా రూపొందింది. స్పష్టత కోసం వ్యాసం విస్తృతంగా ఆవిర్భవించటం, వివరణ కోసం విశాలం కావటం పరికించవచ్చు.

భాషా శాస్త్రవేత్తగా వ్యాకరణ దృష్టి విశాలం కావించుకొన్న వ్యాసకర్త రచనలు ప్రారంభంలో గ్రాంథిక భాషా పరిధిలోనూ, అనంతరం వ్యావహారిక భాషా రూపంతోనూ కనిపించాయి. ఆకాశవాణి ప్రసంగ వ్యాసాలు ఈ భాషా దృష్టి ప్రదర్శించాయి.

కళాశాల విద్యార్థులకు, భాషా సారస్వత విద్యార్థులకు, పండితులకు పాఠ్యభాగాలుగా, పరిశీలన గ్రంథాలుగా పఠన గ్రంథాలుగా ఈ శతాబ్ది ఆరంభం నుంచి ఉపయోగపడుతున్న ఈ వ్యాస ప్రాచుర్యం గణనీయమయింది. భాషా సారస్వత పరిశోధన విమర్శలతో ఈ వ్యాసాల దృష్టి అత్యవసరంగా పరిశీలింపబడుతూ ఉంది. తెలుగు భాషా శాస్త్ర దృక్పథం వివరించటంలో ఆంగ్ల మార్గంలోని నూత్న విమర్శన రీతిని తెలుగులో ప్రవేశ పెట్టటంలో కృషి చేసిన రామకృష్ణయ్య వ్యాస సృష్టి ఆద్యదశా ప్రదర్శకమై చారిత్రాత్మక ప్రాముఖ్యం పొందింది.

# రామకృష్ణయ్య గారి
# కాళిదాస నాటక పరామర్శ

శ్రీ సాళ్వ కృష్ణమూర్తి

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి శత వార్షికోత్సవాల సందర్భంగా వారి 'కాళి దాసుని కళా ప్రతిభలు' అనే పరామర్శ వ్యాసాన్ని గురించి నాలుగు మాటలు వ్రాయటం ఇప్పటి నా ఉద్దేశం. సాహిత్య విమర్శలో 'consideration' అనే మాటకు 'పరామర్శ' అనే మాట, judgement అనే మాటకు 'అనుమతి' అనేమాట తుల్యార్థకాలుగా నప్పుతా యని అనుకుంటాను.

కాళిదాసు సంస్కృతంలో ప్రసిద్ధుడైన కవీ, నాటకకర్త. ఆయన కళా ప్రతిభను గూర్చి తెనుగువారికి చెప్పాలంటే మొదట తాను తీసుకున్న గ్రంథాలు కాళిదాసువే కావాలి. అంటే తాను తీసుకున్న కావ్యాలకు లేదా నాటకాలకు కాళిదాసు కర్తృత్వాన్ని నిరూపించి స్థాపించాలి. కాళిదాసు కళాప్రతిభ 'సాధ్యం' అయిన అంశం అయితే, ఈ 'సాధ్యం' ఆ గ్రంథాల కాళిదాస కర్తృత్వం మీద నిలిచి ఉంటుంది. ఆ గ్రంథాల కాళిదాస కర్తృత్వం 'పక్షం' అనీ, ఆ గ్రంథాల్లో కాళిదాస రచనా లక్షణం ఉండటం 'వ్యాప్తి' (inveriable concomitance) అనీ, ఈ కాళిదాస కర్తృత్వమనే విశేషంతో కూడి ఉండటమనే గుర్తును లింగం లేదా హేతువును చూడటం లేదా చూపటమే 'పరామర్శ' (consideration) అనీ, ఈ పరామర్శే కాళిదాసు కళాప్రతిభకు 'అనుమతి' (judgement) అవుతుందనీ తార్కికమైన విశ్లేషణగా గ్రహించాలి.

'కాళిదాసుని కళాప్రతిభలు' అనే రామకృష్ణయ్యగారి రచన ఏభైమూడు అచ్చుపుటల నిడుపైన వ్యాసం. శ్రవ్యదృశ్య కావ్యాలను క్రమంగాను స్థూలంగాను ఆత్మాశ్రయ (subjective) పరాశ్రయ కవితల పరంగానూ నిర్దేశిస్తూ, నాటకాలు ఎంత బాహ్యవృత్త ప్రతిపాదకాలైనా - 'తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్, భగవంతుడు సృష్టిచేసి తానే ఆ సృష్టియందంతటా ప్రవేశించి వ్యాపించెనన్నట్లు నాటక కర్త వ్యక్తిత్వం కూడా వ్యాపించి ఉంటుందన్నారు. నాటకకర్త ఇతర గ్రంథాలనూ పరిశీలించి అతని కవితా ప్రభావ పరిణామాన్ని, లోకానుభవ పరిపాకాన్ని, అతని (1) కావ్యకళాభివృద్ధికి (2) మనస్తత్వానికి (3) జీవిత చరిత్రకు కల పరస్పర సంబంధాన్ని తెలుసుకొని సమన్వయించే పాశ్చాత్యుల విమర్శవంటిది మనకు తక్కువగా ఉండటం, లాక్షణిక విమర్శ మాత్రమే మనలో ముఖ్యంగా ఉండటం చూపి చెప్పి, విమర్శలో ఆనుపూర్వి అయిన అధ్యయన విధానాన్ని (chronological method), తారతమ్య పరిశీలన (comparative method) తోటి అధ్యయన విధానాన్ని స్పృశించి, కాళిదాసు నాటక త్రయాన్ని - అనగా మాళవికాగ్ని మిత్రము, విక్రమోర్వశీయము, అభిజ్ఞాన శాకుంతలము - గూర్చి వ్రాయబూనినారు.

కాళిదాసు నాటకాల్లో శాకుంతల విక్రమోర్వశీయాల్లో కనపడే భావసౌకుమార్యం, రీతిమాధుర్యం, కల్పనాపటిమ మాళవికలో కనబడ వంటూ, ఇది కాళిదాస విరచితమేనా అని శంకించిన వారున్నారు. ఈ కారణాన్ని పురస్కరించుకొని రామకృష్ణయ్యగారు ఈ మూడు నాటకాలకు ఏకకర్తృత్వాన్ని, అందులోను కాళిదాస కర్తృత్వాన్ని స్థాపించ వలసిన వారైనారు.

కాళిదాసు నాటకాల్లో చారిత్రక నేపథ్యం ఉండేది మాళవికాగ్నిమిత్రం. అగ్నిమిత్రుడు మగధ రాజ్యాన్ని పాలించిన శుంగవంశానికి మూలపురుషుడైన పుష్యమిత్రుని కొడుకు. ఇతడు విదర్భదేశపు రాజకుమారి మాళవికను పెళ్లాడగోరినాడు. ఆమె సోదరుడు మాధవసేనుడు ఆమెను పిలుచుకొని అగ్నిమిత్రుని పట్టణానికి బయలుదేరినాడు. విదర్భదేశాన్ని అప్పుడు యజ్ఞ సేనుడు పాలిస్తున్నాడు. యజ్ఞసేనునికి మాధవసేనునికి దాయాదితనపు ద్వేషం. అగ్ని మిత్రుడు మాళవికను పెళ్లాడితే మాధవసేనునికి బలం ఏర్పడుతుంది. అది చెడగొట్టితే అతడు బలహీనుడుగానే ఉంటాడని యజ్ఞసేనుడు దారిలోనే మాధవసేనుణ్ణి బంధించి చెరలో ఉంచినాడు. ఇది తెలిసి అగ్నిమిత్రుడు మాధవ సేనుణ్ణి విడిపించటానికి కొంత సైన్యాన్ని పంపినాడు. యజ్ఞసేనుడు ఓడగా అగ్నిమిత్రుడు విదర్భలో ద్వైరాజ్యం స్థాపించటా~

జరిగింది. ఈ ప్రాసంగికమైన అంశాలతో మాళవికాగ్నిమిత్రుల ప్రణయకథ నడిచింది.

ఈ నాటకాన్ని కాళిదాసు తన ప్రథమ ప్రయత్నంగా భాసుణ్ణి అనుసరించి వ్రాయ ప్రయత్నించాడని కోరాడ వారి తీర్పు. భాసుడప్పటికే భారత కథలతో ఉదయనుని కథలతో ప్రసిద్ధుడు. భాసుని వాసవదత్త నాటకంతో కాళిదాసు మాళవికను పోల్చవచ్చు. వాసవదత్తలో యౌగంధ రాయణుని వల్ల కథనడిస్తే మాళవికలో విదూషకుడు ఎక్కువగా కథను నడిపిస్తాడు. భవభూతి, శూద్రకుడు కూడ భాసుని అనుకరించిన వారనే చూపవచ్చు. భాస నాటకాల్లో నాందీ శ్లోకం లేకుండానే సూత్రధారుడో స్థాపకుడో ప్రారంభం చేస్తాడు. నాందీ శ్లోకం నాటకకర్త వ్రాయటం కాళిదాసు కాలం నుండే వచ్చినట్లుందని కోరాడ వారి అనుమితి. భాస నాటకాల్లో భరత వాక్యాల్లో రాజప్రశస్తి కనబడటం చేతను, సూత్రధార స్థాపకుల మాటల్లో నాటక వస్తువును గూర్చికాని కర్తను గూర్చికాని ఏమీ ప్రశంస లేకపోవటం చేతను అవి రాజానుమతంతో వ్రాయబడి రాజ సభల్లో ప్రదర్శింపబడినవనే ఊహించవచ్చు. కాళిదాసు తన మాళవికలో 'కాళిదాస గ్రథిత వస్తు'వని చెప్పుకోవడం అది ఆయన స్వతంత్రమైన ప్రథమ ప్రయత్నమని సూచిస్తుంది. 'మా తావత్ ప్రథిత యశసాం భాస సౌమిల్ల కవిపుత్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య వర్తమాన కవేః కాళిదాసస్య కథం పరిషదో బహుమానః?'' ''పురాణమిత్యేవన సాధుసర్వం, నచాపి కావ్యం నవమి త్యవద్యం, సంతః పరీక్ష్యాన్యతర ద్భజంతే'' అనే మాళవికలోని వాక్యాలు అది ఆయన ప్రథమ ప్రయత్నమనటానికి నిశ్చాయకాలు

మాళవికలో 'అష్టాభి ర్యస్య కృత్స్నం జగదపి తనుభి ర్బిభ్రతో నాభిమానం', ఇత్యాదిగా అష్టమూర్తి స్తుతి ఉంది. శాకుంతలంలోను 'ప్రత్యక్షాభిః ప్రసన్న స్తనుభిరవతుస్తాభిరష్టాభి రీశః' అని అష్టమూర్తి ప్రశంస ఉంది. (నేల, నీరు, నిప్పు, గాలి, ఆకాశం అనే పంచభూతాలు, సూర్యుడు, చంద్రుడు, యజమానుడు అనబడే సృష్టి శరీరంలోని ఆత్మ - పరమేశ్వరుని ఎనిమిది తనువులు). చెవిలో పెట్టుకోవటానికి చిగురాకు తీసుకున్న మాళవిక పాదాఘాతాన్ని పొందిన అశోకాన్ని చూచి అగ్నిమిత్రుడు 'ఆమె చెట్టునుంచి ఒక చిగురాకు తీసుకొని, చిగురాకు లాంటి తన పాదాన్ని ఆ చెట్టుమీద పెట్టింది. ఆమె కిసలయ సుకుమారమైన పాదస్పర్శ నాకు అబ్బలేదు. నేను వంచితుణ్ణి', అనుకుంటాడు: శాకుంతలంలో దుష్యంతుడు చెలులతో కూడ చెట్లకు నీరు పోస్తున్న శకుంతల ముఖంమీద వాలుతూ పెదవి తాకుతున్న తుమ్మెదను చూచి 'ఓ తుమ్మెదా! నీవు కృతార్థుడవు. తత్త్వాన్వేషణం చేస్తూ మేము చెడ్డాము' అంటాడు. మాళవికలో నాయికా నాయకులను ఒంటరిగా వదలటానికి లేడి పిల్లలను తోలే మిషతో విదూషకుడు వకుళావలిక ప్రక్కకి తప్పుకుంటాడు. శాకుంతలంలోను శకుంతల చెలులైన ప్రియంవ దానసూయలు ఇట్లే తప్పుకొంటారు. రెండింటిలోను నాయకులు తీగెలమాటున దాగి ఉండి సమయము రాగానే నాయికల ఎదుటికి వస్తారు. మాళవికలో రాణి ఇరావతి చెలి నిపుణికతో కూడి అగ్నిమిత్రుని రహస్యచర్యలను కనిపెట్టటానికి ఉద్యానంలో సంచరించినట్లే విక్రమోర్వశిలోను రాణి ఔశీనరి నిపుణిక అనే పరిచారికతో కూడి పురూరవుని వెదుకపోతుంది. అగ్నిమిత్రుడు భావశూన్యమైన రాణి ఉపచార విధులను ప్రశంసించినట్లే పురూరవుడు తనరాణిని గూర్చి పలుకుతాడు. మాళవికలో రాజు సర్వావస్థల్లోను చారుత్వం శోభను పోషించు నన్నట్లే శాకుంతలంలోను కంచుకి సర్వావస్థలలోను ఆకృతి విశేషం రమణీయమే అంటాడు. రహస్య ప్రణయం బయటపడగానే మాళవికలో విదూషకుడు నాయికుని లోప్రశహస్తుడైన కుంభీరకునితో పోల్చుతాడు. విక్రమోర్వశిలోను ఇదే పోలిక ఉంది. మాళవికలో పిరికివాడైన విదూషకుణ్ణి నిపుణిక పాములాంటి వంకలకర్ర పడవైచి బెదరగొడుతుంది. విక్రమోర్వశిలోను విదూషకుడు అక్షర విన్యాసంతో కూడిన భూర్జపత్రాన్ని చూచి పాముకుబుస మనుకుంటాడు. మాళవికలోని స్వరసంయోగ ప్రశంస లాంటిది శాకుంతలంలోను ఉంది. ఇలాంటి భావ, పదబంధ సాదృశ్యాలు ఇంకా కొన్ని చూపవచ్చు. ఈ అంశాలన్నీ మాళవికాగ్ని మిత్రం, విక్రమోర్వశీయం, అభిజ్ఞాన శకుంతలం ఏక కర్తృ కాలనటానికి సాక్ష్యాలు. మాళవికలోని పారి పార్శ్వకుని మాటల్లో ''వర్తమాన కవేః కాళిదాసస్య'' అనేదళం విక్రమోర్వశిలో మారిషుడు ''సోహమద్య కాళిదాస గ్రథితవస్తునా విక్రమోర్వశీయం నామాపూర్వం నాటకం ప్రయోక్ష్యే'' అనే మాటలు, శాకుంతలంలో ''అద్యఖలు కాళిదాస గ్రథిత వస్తునా అభిజ్ఞాన శాకుంతల నామధేయేన నవేన నాటకే నోపస్థాతవ్య మస్మాభిః'' అనే సూత్రధారుని మాటలు కాళిదాసు కర్తృత్వాన్ని ఉద్ఘోషించే మాటలని చెప్పనవసరం లేదు. కాళిదాసు కళాప్రతిభను గూర్చి మాటాడేటప్పుడు ఇది ''శుష్కేష్టి'' సదృశం. ఇంతకూ కోరాడవారూ వారి ననువదిస్తూ నేనూ ఈ ప్రసంగం చెయ్యటం సూర్యభగవానునికి ఆనంద నీరాజన మియ్యటం లాంటిదే కాని వేరేకాదు కదా! ఇక్కడికి సాధ్యాంశం చెప్పడం, కాళిదాస కర్తృత మనే 'పక్షమ్', అతని రచనా లక్షణం ఉండట మనే ' ' చెప్పినట్లయింది ఇంక కాళిదాస కర్తృత్వ విశిష్టత అ గుర్తును చూపట

మనే 'పరామర్శ' మిగిలి ఉంది. అదే కాళిదాసు ప్రతిభకు 'అనుమితి' (judgement) అవుతుంది.

కాళిదాసు నాటకాలను స్మరించేటప్పుడు నాకు మధురంగా తోచేది ఆయన శ్రౌత విద్యాగంధిలమైన చిత్తవృత్తి. దానికి చిత్తవృత్తే కారణం కావచ్చు. చారిత్రక నేపథ్యంతో నడిచిన నాటకం మాళవికలో అగ్నిమిత్రుడు చారిత్రక పురుషుడు కావచ్చు. యజ్ఞసేనుడు, ఐరావతి వంటి పాత్రల పేర్లు కల్పితా లనక తీరదు. ఈ పేర్ల వైదిక గంధం స్పష్టమే. విక్రమోర్వశి దగ్గర, శాకుంతలం దగ్గర నేను దర్శించే శ్రౌతగంధాన్ని ఆ యా చోట్ల నిరూపిస్తాను.

మాళవిక వ్రాసేనాటికి కాళిదాసు భాస సౌమిల్ల కవిపుత్రాదులతో పోటీకి నిలబడబోతున్న యువకుడు. 'నవీన' నాటకం సామాజికులను మెప్పించి, ప్రాతవి మాత్రమే మంచివి క్రొత్తవి మంచివికావనే భావాన్ని తొలగించి, రెంటిలోను మేలేర్చి చూడాలని ఉద్బోధించే ధైర్యం ఉంది. ఆ ధైర్యంతో చారిత్రక నేపథ్యాన్ని గ్రహించి భాసుని పద్ధతిలోనే మాళవిక వ్రాశాడు. దీంట్లో రాజకీయ విషయాలు ప్రాసంగికాలు. అగ్నిమిత్రుని గృహజీవితం ముఖ్యవిషయం. అగ్నిమిత్రుడు కూడ భాసుని వత్సరాజు లాగే రాజ్యభారాన్ని మంత్రుల కప్పగించి తాను అంతఃపురంలో వినోదించేవాడు. భాసుని యౌగంధరాయణుడు తన నేర్పుతో వాసవదత్తను పద్మావతి యొద్ద నిక్షేపంగా ఉంచినాడు. (వత్సరాజు వాసవదత్తను పెళ్లాడితే ఆ రాజ్యం కలిసి వస్తుందని సిద్ధాదేశం). మాళవికలో మాధవసేనుడు బంధింపబడ్డప్పుడు మాళవిక ఆరణ్యకుల చేతిలో పడి ఎట్లో ధారణి యొద్ద చేరుతుంది. అక్కడికి చేరిన పండితకౌశికి మాళవికను గుర్తిస్తుంది. అయినా ఒక ఏడు ప్రేష్యభావాన్ని అనుభవించిన పిదప మాళవిక తగిన భర్తను పొందుతుంది అన్న సిద్ధుని మాటల మీద నమ్మకంతో గుంభనగా ఉంటుంది. ఇట్లా ఈ రెండింటిలోను సిద్ధాదేశం కథాప్రవృత్తికి కారణం. కథానాయకలు ఇద్దరు నాయకుల అంతఃపురాల్లో ప్రచ్ఛన్నంగా ఉండటం, నాయకానురాగానికి పాత్రములు కావటం, పుట్టింటి వారిచేత గుర్తింపబడటం, నాయకపట్టమహిషుల మన్ననకు పాత్రలు కావటం రెండింటా సమానమే. ఒకచోట యౌగంధరాయణుని తంత్రం ముఖ్యమైతే మరొక చోట విదూషకుని తంత్రం ముఖ్యం. మాళవికలోని అగ్నిమిత్రుడు తాను స్వయంగా యుద్ధానికి పోవలసినవాడైనా వీరసేనుని పొమ్మని జాబువ్రాసి పంపి తాను శృంగార కలాపాల్లో మునిగిన వాడు. ఇతనిలో రాజున కుండదగిన పరాక్రమాది లక్షణాలు ప్రకటం కాలేదు. పైగా తన కంటబడకుండ దేవిచే రక్షింపబడుతున్న మాళవికను తనకు గూర్పు మని విదూషకుని అభ్యర్థించిన వాడు. చిత్రగతయైన నాయికను చూచి మోహించెనే కాని ఈమెను నేను కోరవచ్చునా గ్రహింపవచ్చునా అనే సందేహం కూడా ఇతనికి కలుగలేదు. విదూషకుడు మాళవికతో తనకు రహస్య సమావేశం కూర్చినపుడంతా ఇరావతి ప్రత్యక్షమయ్యేది. ఇతడు ఏదోఒక బొంకు బొంకి తప్పించుకొనేవాడు. నాయిక పరతంత్రురాలు. నాయకునకు ఆమెను పరిగ్రహించటానికి స్వాతంత్ర్యమూ లేదు; ధైర్యమూ లేదు. చివరకు దేవి ఇంక లాభము లేదని తలచి మాళవికను తానే అతనికి వివాహము చేయించుటతో ఇతనికి సిద్ధి కలిగింది కోరాడ్వారు చూపిన ఈ అంశాలు నాయకుని పరిమితులను ప్రదర్శిస్తున్నై.

రెండో నాటకం ఐదంకాల విక్రమోర్వశీయం. 'నవీన' నాటకమంటూ 'మాళవిక'ను వ్రాసిన కాళిదాసు 'అపూర్వ' మంటూ విక్రమోర్వశీయం వ్రాశాడు. 'అపూర్వ' మనేది యజ్ఞయాగాది క్రతువుల్ని చెప్పే జైమినీయ దర్శనంలో వినబడే పారిభాషికం కూడ. ఊర్వశీపురూరవుల కథను గురించి కొన్ని మాట లిక్కడ చెప్పాలి. మనకు తెనుగులో రాయలవారు రచించిన ఆముక్తమాల్యద బాగా తెలుసు. అందులోని మాల దాసరి కథ ఇంకా బాగా తెలుసు. ఈ కథకు మూలం ఎక్కడుందో రాయలు చెప్పలేదు. వేదంవారు కూడా చెప్పినట్లు కనబడదు. ఈ కథ బ్రహ్మపురాణంలో ఉంది. ఊర్వ శీపురూరవుల కథలో ఈ గొడవ ఏమిటంటారేమో ఆ బ్రహ్మపురాణంలోని మాలదాసరి అనంతర కాలంలో పురూరవుడుగా పుట్టాడని అందులోనే ఉంది. ఈ ఊర్వశీ పురూరవుల కథ ఋగ్వేదంలోను, శతపథ బ్రాహ్మణంలోను, మత్స్య, విష్ణు పురాణాల్లోనూ ఉంది. ఊర్వశి పురూరవుని విడిచిపోయిన తర్వాత అత డున్మత్తుడై తిరుగుతుండగా గంధర్వు లతన్ని ఒక అడవిలోనికి కొనిపోయి అరణులతో అగ్న్యుత్పాదన విధిని నేర్పి యజింపుమనిరట; సంవత్సరాని కొక్కరోజు అతడు గంధర్వలోకంలో ఊర్వశిని కలుసుకోగలిగేటట్లు వరమిచ్చిరట. ఇది వైదిక సారస్వతంలోని కథ. కాళిదాసు ''అపూర్వ'' నాటకం వ్రాయటంలోని రహస్యాల్లో ఇది ఒక టనుకుంటాను. పురూరవుడు ఇంద్రునికి సహాయం చేయబోయినవాడు. ఊర్వశి 'కేశి' దానవుని బాధకు గురి అయింది. ఇది మనకు నాటకంలో తెలిసే అంశం. ఈ కథకు సంబంధించిన ఖగోళ సంబంధమైన సమన్వయం చెప్తాను. ఇందులో నా కల్పన ఏమీ లేదు. 'ధనుర్మాసం' అనబడే మార్గశీర్ష మాసం డిశంబర్ 15 - జనవరి 13)లో సూర్యుని రథానికి ముందు అప్సరస ఊర్వశి నాట్యం చేస్తుందని మార్కండేయాది పురాణాలు చెప్తున్నాయి (ప్రతి నెల సూర్యరథానికి ముందు ఒకొక్క అప్సరస నాట్యం చేస్తుంది). ఇంక మృగశీర్షానక్షత్రంలో పురూరవుడు పుట్టాడని నక్షత్ర చూడామణి. ఇది ఋషభ రాశిలో రెండుపాదాలు, మిథునరాశిలో రెండుపాదాలు ఉన్నట్టిది. దీనితో ఊర్వశీ

పురూరవుల శృంగారానికి, ప్రాతిపదిక తెలుస్తుంది. ధనూ రాశి అన్నప్పుడు ఇషుధనువనీ, కోదండమనీ తెలియాలి. బృహస్పతి దేవతాకమైన ఈ ధనూరాశి, మీనరాశి కూడ మన్మథుణ్ణే సూచిస్తాయి. పుష్పకోదండ, మీన కేతన పదబంధాలు చూడండి. ఈ పురూరవుడు మిథున రాశ్యధిపతి బుధుని సంతతి కదా! అందుచేత ఇతనికి మిథునరాశి సంబంధం న్యాయమే. ఇంక ధనూరాశికి ముందు వచ్చే వృశ్చిక రాశిలోని జ్యేష్ఠా నక్షత్రానికి ఇంద్రుడు అధిదేవత. ధనూరాశిలోనే వచ్చే మూలానక్షత్రం కేతున క్షత్రం. ఈ కేతువుకు ఆశ్లేషాభవుడని పేరు ఈ కేతువే కచుడు: భచక్రంలో అశ్విని, మఖ, మూలలు కేతు దైవత్యాలు. కచ శబ్దానికి కేశార్థం తెలిసిందే. ధనూరాశిలో సూర్యరథానికి ముందు నాట్యం చేసే ఊర్వశి కేశిదానవుని బాధకు గురికావటం- అనగా మూలా నక్షత్ర సంబంధమైన బాధకు గురికావటం దానికి ప్రతిస్పర్ధిగా తోచే మృగశీర్షా నక్షత్రంలో పు న పురూరవుడు ఆమెను కాపాడటం సులభంగానే అ యానికి వచ్చే విషయాలు. మేషరాశిలోని అశ్వినీ నక్షత్రాధి వతలైన ఆశ్వినులు మేకల నెపాన ఊర్వశీ పురూరవుల ఎడబాటుకి కారణం కావటం కూడా గమనింప దగిన అంశం. మార్గశీర్ష మాసంలో పున్నమనాడు చంద్రుడు మృగశీర్షలో ఉంటాడు. అందుకే ధనుర్మాసానికి మార్గశీర్ష మనే పేరు. రాత్రి మృగశీర్షా నక్షత్రం ఉదయించేటప్పటికి మూల అస్తమానం అవుతూ ఉంటుంది. ఇదే పురూరవుడు కేశిదానవుణ్ణి జయించటం.

విక్రమోర్వశీయం కూడ మాళవికాగ్ని మిత్రం లాగే పురూరవుని అంతఃపుర చర్యలను ప్రదర్శించేదే అయినా నాయకుడు ప్రభావాతిశయం కలవాడు. నాయిక దివ్యస్త్రీ దివ్యమర్త్యుల సమ్మేళనం ద్వారా పృథ్వీసమ్మేళనం వంటిది. ఈ నాటకం వ్రాసే నాటికి కాళిదాసుకు కొంత ధైర్యం వచ్చినట్లుంది. ఇంకా సుప్రతిష్ఠితుడు కాలేదు. అంచేత అతడు ప్రఖ్యాతమైన ఇతివృత్తాన్ని (వేదపురాణ వాఙ్మయంలోది) తీసికొని 'అపూర్వమైన ఈ నాటకం వ్రాశాడు. సంకోచం గాని, విజ్ఞాపనలుగాని లేకుండా 'నా మీది ప్రణయంతోనో దాక్షిణ్యంతోనో, సద్వస్తుపురుష బహుమానంతోనో' ఈ నాటకాన్ని చూడమన్నాడు. ఇందలి విక్రముడు పరాక్రమాది గుణసహితుడై ఇంద్రునికి సహాయం చేయబోయిన మహాపురు షుడు. ఆపదలో బడిన స్త్రీని కేశి రాక్షసుని నుండి కాపాడిన కృపామయుడు కాగా అతని రూప గుణ సౌందర్యాలకు ఊర్వశి మోహిత అయింది. ఆమె పొందు ఇతనికి కలిగినది. విక్రముడు కూడ తన రాణి ఔశీనరికి వెరచి తన ఊర్వశీ ప్రణయ వృత్తాంతాన్ని, విరహవేదనను కప్పిపుచ్చినాడు. అయినా ఊర్వశి ఔశీనరి అధీనం లోనిది కాదు కనుక ఆమెతోడి సమాగమానికి ఇతడు రహస్య తంత్రాలను పన్నవలసిన పని లేకపోయింది. చివరకు ఔశీనరి ప్రియప్రసాద నసే వ్రతం మిషతో ఆతనికి ఊర్వశి ప్రణయ విషయాల్లో అనుమతి నిచ్చి మాట దక్కించుకొన్నది. విక్రమోర్వశీ యంలో కథా సంధులు విశేషమైన నైపుణ్యంతో అమర్చబడినై. విక్రముడు ఊర్వశిని రక్షించుటచేత ఇంద్రుడు అతనిని బహుమానించినాడు. ఈ రక్షించిన ఘట్టంలో ఊర్వశికి విక్రముని యందు కలిగిన అనురాగం భరతముని ఊర్వశిని శపించటానికి కారణమైతే, ఇంద్రునికి విక్రముని యందు కలిగిన ఆదరం ఆ శాపాన్ని వారిద్దరి మనోరథ సిద్ధికి హేతువుగా మార్చింది. తన శాపావధి తెలిసినందువల్లనే ఊర్వశి తన కుమారుని చ్యవనాశ్రమంలో విడిచి వచ్చుటకు కారణమై చివరి పంచమాంకంలో ఆయువును గూర్చిన కథకు దారి యేర్పరచింది. శాపంమీద ఆధారపడి నడిచిన కథా చక్రం, తర్వాతి శాకుంతల నాటక కథా చక్రం ఏర్పడటాన్ని కూడా సూచిస్తుందనవచ్చు.

శాకుంతలకథ మహాభారతంలోను పాద్మ పురాణంలోను ఉంది. వ్యాస భారతం అభిసంధి విధానంతో కూర్చబడిన యజ్ఞయాగాది క్రతుస్వరూపం అని చెప్పవచ్చు. ఇక్కడ కొన్ని మాటలు చెప్తాను. భారతంలోని సౌపర్ణాఖ్యానం, పావమానేష్టులు; అగ్ని, అగ్నిపవమాన, అగ్నిపావక, అగ్ని శూచి, ఇంద్రాగ్ని, అదితి అనే ఆర్గురి నుద్దేశించి చేసే ఇష్టులు. ఇవి అగ్న్యాధేయానికి అంగ సదృశాలు. రురు, సహస్రపాద, జరత్కారు వృత్తాంతాలు పునరాధేయం. జనమే జయుడు చేసిన సర్పయాగం సోమసంస్థల్లోని దశరాత్ర భేదం. ఉపరిచర వసు వృత్తాంతం 'చయనం' అనే పూర్వవేది సంస్కారం. గంగా శంతనుల వృత్తాంతం చయన యాగానికి అంగమైన 'వసో ర్ధారా' అనే యాగం. చిత్రాంగద విచిత్ర వీర్య, భీష్ముల కథ చరక సౌత్రామణి; పాండవ జనన పర్యంతకథ కౌకిల సౌత్రామణి. (సోమశ్రవన్ అనే పేరుగల ద్రుపదరాజు సౌత్రామణి అయిన కోకిలాదేవి పత్నిగా పుత్రకామేష్టి చేసి కృష్ణ, యాజ్ఞసేని అనే పేర్లు గల ద్రౌపదిని ధృష్టద్యుమ్నుడనే కొడుకును పొందినాడు.) వీటి వివరాలను చెప్పటానికి ఇది చోటు కాదు. ప్రస్తుతమైన శకుంతలా దుష్యంతుల వృత్తాంతం పూర్వ మీమాంసా పరంగా 'ప్రకరణం' అని కాని 'అవాంతర ప్రకరణం' అనికాని చెప్పుకోవచ్చు. ప్రకరణం అనేది సాంగంగా చెప్ప బడ్డ ప్రకృతి యాగాల్లో వస్తుంది. రెండోది అంగ, భావనా సంబంధి. ఇది 'సందంశం'తో తెలియబడుతుంది. ఈ ప్రకరణం అనేది వినియోగ విధికి సహకారి భూతాలైన ప్రమాణాలు ఆరింటిలో ఒకటి. ఇవి 1) శ్రుతి 2) లింగ 3) వాక్య 4) ప్రకరణ 5) స్థాన 6) సమాఖ్యలు. ఉత్తరోత్తరం బలహీనాలు. శకుంతల దుష్యంతుని కడకు వచ్చుట, అతడు తిరస్కరించుట, అశరీరవాణి చెప్పుట ఈ కథా భాగం ప్రయాజలు అనే

యాగాంగంలో వచ్చే అభిక్రమణాదికం. ఆమె కొడుకుతో గూడి దుష్యంతుని కడకు పోవటమే అభిక్రమణం. దీన్ని పారిభాషికంగా 'సందంశం' అనవచ్చు. తెనుగులో నన్నయ శకుంతలా దుష్యంతుల సంవాదంలో ముందు చెప్పిన ఆరు ప్రమాణాలను చిత్రించి ఆకాశవాణి అనే శ్రుతి ప్రమాణంతో సత్యాన్ని స్థాపించి భరతుని యొక్క రాజ్యపట్టాభిషేకమనే వినియోగాన్ని సాధించాడు. పూర్వమీమాంస తెలిస్తే కాని ఈ వివరాలు సుబోధకాలుగా ఉండవు. శాకుంతల కథా వస్తు స్వరూపం ఎంత గంభీరమైందో సూచనగా చెప్పటానికి ఈ మాటలు చెప్పవలసివచ్చింది.

అసలు శకుంతలను పక్షులు కాపాడడ మేమిటి? పక్షులంటే ధర్మపక్షులైన ఋషు లని అభిప్రాయం. భారతంలోనే ఖాండవ దాహ ఘట్టంలో ఆ చోటి మందపాల సంతానమైన పక్షులు అగ్నిచేత రక్షింపబడినారు. ఆ పక్షులు మామూలు పక్షులు కావు. పక్షులుగా చెప్పబడిన ఋషులు. వైదిక ఋషులు చెప్పిన స్తోత్రాలే వ్యాస భారతంలో అక్కడ శ్లోకరూపంగా ఉన్నాయి. కావ్యకంఠ గణపతి ముని ఆ వేద మంత్రాలను ఈ భారత శ్లోకాలను తమ 'భారత చరిత్ర పరీక్ష' అనే గ్రంథంలో ప్రదర్శించి చూపారు. మార్కండేయ పురాణంలో 'పక్షులు క్రిష్టుకితో చెప్పడం కూడా ఇలాటిదే. అక్కడ కూడా పక్షులు మామూలు పక్షులు కావు; ధర్మపక్షులు; '(క్రోష్టు)' మామూలు నక్కకాదు. ఆపేరు గల ఋషి అనుకోవాలి. ఈ శకుంతలా దుష్యంతుల కథ కాళిదాసు చేతిలో అభిజ్ఞాన శాకుంతలమనే లోకోత్తరమైన నాటకమైంది. ఇది వ్రాసేనాటికి కాళిదాసు లబ్ధప్రతిష్ఠుడు అయినా వినయంతో 'బలవదపి శిక్షితానా మాత్మన్యప్రత్యయం చేతః'' అంటూ తన ప్రయోగ విజ్ఞానం వైదుష్యం గల వారికి పరితోషాన్ని కలిగిస్తేనే తనకు తృప్తి అన్నాడు.

శాకుంతలం జగత్ప్రసిద్ధి గన్న నాటకం. దీని వస్తు విన్యాస వైభవంలోని సౌష్ఠవం గొప్పది. కథ భూలోకంలోని కణ్వాశ్రమంలో ప్రారంభమై ఊర్ధ్వలోకంలోని మారీచాశ్రమంలో ముగుస్తుంది. ప్రియంవ దానసూయలు, శార్ఙరవ శారద్వతులు, మేనకా సానుమతులు అపూర్వ సృష్టులు. సానుమతి అంటే సూర్యోదయ కాలానికి చతుర్దశి మిగులుండి అటు తర్వాత వచ్చిన పున్నమ. ఒక కళ తక్కువ అని అభిప్రాయం. మేనకకు స్నేహితురాలు సానుమతి. అమె కంటె కొంచెం తక్కువైన కళ కలది ఈమెను కాళిదాసు తన సమర్థనలకు అభిప్రాయాలకు ముఖంగా వాడుకొన్నాడు.

శకుంతలా దుష్యంతుల ప్రణయం ధర్మ బద్ధం; దాంపత్య నిష్ఠం; ఆత్మ నిగ్రహంతో కూడినట్టిది. దుష్యంతుడు తొలుత ఈమె తనకు పరిగ్రహ యోగ్య అగునా కాదా అనే వితర్కంలో పడ్డ మర్యాదస్థుడు. అంతఃకరణాన్ని నమ్ముకున్నాడు. శకుంతల జన్మవృత్తాంతాన్ని, ఆమెకు వివాహం చేసే ఉద్దేశం కణ్వునికి ఉందా లేదా అనే అంశాన్ని చెలికత్తెల నడిగి తెలుసుకున్నాడు. శకుంతల కూడ దుష్యంతుని చూచిన పిదప 'ఏమి నా మనసు ఆశ్రమ వాస విరుద్ధమైన వికారాన్ని పొందుతోందే' అని వితర్కించుకున్న వ్యక్తి. దుష్యంతు డామెను కలిసికొని నిరోధింపబోగా 'పౌరవా, మర్యాద నిలబెట్టు. ఇష్టమున్నా నేను స్వతంత్రురాల్ని కానంది. దుష్యంతు డామెకు వివరంగా తెలియ జెప్పి గాంధర్వాని కొడబరచినాడు. వీరి దాంపత్యం కణ్వుని సమ్మతినే కాక ఆశీర్వాదాన్ని కూడా పొందింది. శకుంతలను దుష్యంతుని పాలికి పంపే చతుర్థాంకంలో వన దేవతల సౌమనస్యం ఆమె పవిత్రతకు పతాక!

రాజు నని చెప్పితే శకుంతల బెదరిపోతుందని 'ఋషుల తపస్సులు విఘ్నం లేకుండా జరుగుతున్నవో లేదో విచారించుకొని పోవటానికి వచ్చిన ధర్మాధికారినని తొలుత చెప్పిన దుష్యంతుడు యథార్థంగానే నడచుకొన్నవాడు. అరవ అంకంలో కాశ్యప సందేశహారులైన ఋషికుమారుల ఆగమనాన్ని గూర్చి వ్యాకులపడి ఋషుల తపస్సుకు విఘ్నంకల్గిందా, ఆశ్రమాల్లో అసచ్చేష్టితా లేర్పడినవా అంటూ ఆలోచించాడు. ఆతని ధర్మాభిరతి స్పష్టంగా తెలుస్తూనే ఉంటుంది.

దుష్యంతుని ప్రణయ వృత్తాంతానికి విదూషకుని పాత్ర సహకరించిం దేమీ లేదు. కాళిదాసు నాటకాల్లో క్రమంగా విదూషకుని ప్రమేయం తగ్గటం కన్పిస్తుంది (విదూషక పాత్ర చివరకు flat character కావటానికి ఇదే కారణమా అనిపిస్తుంది.)

శాకుంతలంలో దేవియైన వసుమాలి నాయకుని ప్రణయ కార్యాలకు భంగం కలిగించటం కాని, అత డామెకు భయపడి బొంకటంకాని కనబడదు. మాళవికలో కంటే, విక్రమోర్వశిలో కంటే ఇందలి ప్రణయం ఉదాత్తంగా నడిచిం దనటం స్పష్టమే.

ఈ నాటకంలోని దుర్వాసశ్శాప వృత్తాంతం కీలకాంశమై కథను నడిపింది. పాత్ర పోషణకు రసోత్కర్షకు దోహదం చేసింది. శాపవిమోచన కారణం కథా ప్రవృత్తికి తోడ్పడింది. దుష్యంతు డి ౹న ముద్రాంగుళీయకం అభిజ్ఞానాంగుళీయకం. చెలికత్తెలు (। యంవదా అనసూయలు) శాపవృత్తాంతము శకుంతలకు ప్పలేదు. 'రాజు నిన్ను గుర్తు పట్టకపోతే ఈ ఉంగరం చూపించు' అని మాత్రమే చెప్పినారు. 'యది నామ రాజా ప్రత్యభిజ్ఞామంథరో భవేత్ తదా ఏతదంగుళీయకం దర్శయ!' ఉంగరపు వ్రేలు సత్యస్థానీయం. అంచేత .ఇక్కడ ఉంగరం అభిజ్ఞానం అయింది.

వ్యాస భారతంలో పాశుపతాస్త్రాన్ని పొందటానికి అర్జునుడు బయలుదేరక మునుపు వ్యాసుడు ధర్మజునికి, ధర్మజుడు అర్జుననికి 'ప్రతిస్మృతి' అనే విద్యను ఉపదేశించటం ఉంది. అదే అనంతర కాలంలో ప్రత్యభిజ్ఞాస్త్రం అయింది. కాళిదాసు నాటికీ ఈ పేరుతో ఈ శాస్త్రం ఉండిందేమో తెలియరాదు.

కాళిదాసు నాటకకళ శాకుంతలంలో పరాకాష్ఠకు వచ్చింది. వస్తు విన్యాసం, పాత్ర పోషణం, రస నిర్వహణం- దీనికి నిదర్శనాలు. పతి దేవత అయిన నాయికకు ఏకవేణికగా విరహ వ్రతాన్ని భరిస్తున్న నాయికకు ఊర్ధ్వలోకంలోని మారీచాశ్రమంలో భర్తృ పునస్సమాగమం కలిగించడం హృదయంగమం.

రామకృష్ణయ్య గారెంత శాంత చిత్తులో, విమర్శన పటువులో ఆయన వ్రాసిన ఈ ఏభై మూడు పుటల లఘు గ్రంథంలో తెలుస్తుంది. విమర్శనాంశాల్ని సూత్రాల్ని ఈ వ్యాసంలో ఆలాత చక్రంగా త్రిప్పి చూపించా రాయన. వస్తు ప్రధానము, శాంత సుభగమూ అయిన రచన ఆయనది. ఇందులో నాటక వస్తుపరంగా వ్రాసిన వన్నీ ఆయన భావాలే. కథా వస్తువును గూర్చి అదనంగా చెప్పిన మాటలు నావి అనువదించటంలో తప్పులు దొర్లి ఉంటే అవి నావి అనటానికి నాకు సంకోచం లేదు. చంద్రునికి నూలుపోగుగా నేనీ వ్యాసం వ్రాయటం జరిగింది. 'ధీనామవిత్ర్యవతు'.

**విద్యేవ వ్యాసంగాత్ సంపద ఇవ నయప్రవర్తనాత్ నృపతేః।**
**చాంద్రీవ జలద విరహాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥**

నిరంతరాభ్యాసం వల్ల చదువువలె, నీతి మార్గంవల్ల రాజు సంపద వలె, మబ్బులు తొలగడంవల్ల వెన్నెల వలె, ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— 'ఉపమావళి' నుండి



**తప ఇవ హృదయ నియమనాత్ సుకృతమివ మహేశపూజ నాభ్యాసాత్।**
**ముక్తి రివ నృహరి భజనాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥**

మనస్సును అదుపులో పెట్టడంవల్ల తపస్సులాగ, మహేశ్వరుని నిరంతరం పూజించడంవల్ల సుకృతంలాగ, విష్ణువును సేవించండవల్ల ముక్తిలాగ ఓ సుందరీ! నీదేహ కాంతి యౌవనంవల్ల వెలుగొందుతున్నది.

— 'ఉపమావళి' నుండి

# సంస్కృత నాటకాలు: శ్రీ కోరాడవారి కృషి

శ్రీ రామవరపు శరత్‌బాబు

ప్రాచీన సాహిత్యంలో కవి ప్రతిభను, కావ్య రసాస్వాదనకు తోడ్పడే సామగ్రిని పాఠకునకు అందజేసేవి ఆయా కావ్యాలపై వెలువడిన వ్యాఖ్యానాలు తప్ప తక్కిన గ్రంథాలు లేవని చెప్పడం సాహసం కాదనుకుంటాను అవే సంస్కృతానికి సంబంధించినంతవరకు కొంతవరకు కనిపిస్తాయి కాని తెలుగులో అదీలేదు. సంస్కృత కావ్యాల విషయానికి వస్తే దృశ్య కావ్యాలకీ, శ్రవ్య కావ్యాలకీ మల్లినాథాదుల వ్యాఖ్యానాలున్నాయి కాని తెలుగులో ఏవీ? భారతం ఇతిహాసమని తీసివేసినా, భాగవతం పురాణమని సరిపెట్టుకున్నా శ్రీనాథుని కృతులకు గాని, అష్ట దిగ్గజాల ఆంధ్ర కృతులకు గాని ' చీన కాలంలో వ్యాఖ్యానాలు లేవనే చెప్పాలి. ఒక శృంగార షధానికి కానీ, మరో ఆముక్తమాల్యదకు కాని మాన్యులు శ్రీ దం వేంకటరాయశాస్త్రి గారి వ్యాఖ్యానానికి ముందు మరో వ్యాఖ్యానం ఉన్నట్టు తోచదు. ఆ తరువాత కవి హృదయాన్ని ఆవిష్కరించే కొన్ని ప్రయత్నాలు జరిగాయి. విశ్వనాథవారి 'నన్నయ్య ప్రసన్న కథా కవితార్థయుక్తి', 'అల్లసాని వారి అల్లిక జిగిబిగి', 'ఒకడు నాచన సోమన' ఇత్యాది. కొంతమంది పుస్తకరూపంలోను, మరికొందరు చిన్ని చిన్ని వ్యాసాల రూపంలోను ఇటువంటి విమర్శన పద్ధతిని అమలులోకి తీసికొని వచ్చారు. ఈ విమర్శన పాఠకునికి కావ్యం పట్ల అభిరుచిని అనుసంధించి, అతని మేధకు మెరుగులు దిద్ది, కావ్య ప్రయోజనమైన రసానుభూతిని కలిగిస్తుందనడంలో ఆవంత సందేహమైనా అవసరం లేదు.

ఈ విమర్శన పద్ధతుల్లో చారిత్రక (Historical method) అనేది పాశ్చాత్యుల నుండి సంక్రమించిన ఒక పద్ధతి. దీనివల్ల మౌలికంగా సందేహాలు తొలగిపోయి, బాహ్య దృష్ట్యా కొంత విచారణ జరిగి కావ్య పరిశీలనకౌతుకం పతితలో జనిస్తుంది. ఈ మొదటి మెట్టుని అధిగమిస్తే తప్ప కావ్యాన్ని లోతులకు వెళ్ళి పరిశోధించటం కుదరదు. పండితులు క్షమిస్తే ఒక్కమాట. వ్యాఖ్యానకారులకు శిరోమణిగా ప్రసిద్ధి గాంచిన మల్లినాథ సూరి వ్యాఖ్యానాలు సైతం శబ్దార్థం, శబ్ద సాధుత్వం, వ్యాకరణం, అలంకారం మొదలైన వాటికిచ్చిన విలువ రచనా శిల్పం, కవి హృదయావిష్కరణలకు ఇవ్వలేదని తోస్తుంది. సరే వారి పద్ధతి ఆనాటి పరిస్థితికి అనుకూలంగా ఉండి ఉండవచ్చు. ఇప్పుడే మనం అనుకొన్న చారిత్రక పద్ధతిని విమర్శలోనికి జొనిపి దానిని అత్యంత ప్రతిభావంతంగా నిర్వహించి కృతకృత్యులైన వారిలో శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు ఒకరు.

సంస్కృత నాటక విషయానికి సంబంధించినంతవరకు శ్రీ కోరాడ వారి కృషిని క్లుప్తంగా సూచనా ప్రాయంగా తెలియజేయడం మాత్రమే ఈ నా ప్రయత్నం. 'కవితాలక్షణం: రస చర్చ' అనే వారి వ్యాసంలో చారిత్రక పద్ధతి ననుసరించి కాళిదాసు కాలనిర్ణయంలో వారు చూపిన ఒడుపు అమోఘమైంది. కీట్స్, మెక్డోనెల్, వింటర్నిట్జ్ వంటి హేమాహేమీలు సైతం కాళిదాసు కాలం క్రీ.పూ. 3వ శతాబ్దం నుండి క్రీ.శ. 6వ శతాబ్దం వరకు అత్యంత ప్రాచీనాధునికావధులను ఉటంకించి క్రీ.శ 3 - 4 శతాబ్దుల కాలమనే భావాన్ని పాఠకునిలో ముద్రవేసికొనే రీతిగా ధ్వనింపజేశారు. తదితర పాశ్చాత్య పండితులు, వారి భావాలతో ప్రేరేపితులైన భారతీయ విద్వాంసులు సైతం ఆ భావానికే బలాన్ని చేకూర్చారు. కానీ కోరాడ వారు, 'రే' అనే బెంగాలీ పండితుడు 'భైటా' అనే ప్రాంతంలో దొరికిన ఒక రాతి ఫలకం-దీన్నే Baita Madallion అంటారు- ఆధారంగా పాశ్చాత్య వాదాన్ని పరాస్తం చేశారు. ఈ రాతి ఫలకంలో ఒక కన్య మొక్కలకు నీరు పోస్తుంటే ఇద్దరు స్త్రీలు నిలబడి చూస్తున్నట్లుగా చిత్రించడం జరిగినది ఆ ఫలకానికి స్ఫూర్తి కాళిదాసు అభిజ్ఞాన శాకున్తలంలో శకుంతల వృక్షసేచనం చేయడం, అనసూయాప్రియంవదలు సహకరిస్తున్న ఘట్టంగా గుర్తించి, ఆ శిలా ఫలకం శుంగ రాజుల కాలంనాటిది కావడం వల్ల కాళిదాసు క్రీస్తుపూర్వం వాడనే నిర్ణయం చేసినట్లు తెలిపేరు అంతేకాదు శాకుంతలంలో 6వ అంకంలో తెలియవస్తున్న దొంగతనం చేసిన వాడికి విధించవలసిన శిక్ష, మృతుడైన ఒకని ఆస్తి సంక్రమించే విధానం క్రీ.పూ. వారైన బోధాయన, వశిష్ఠాదుల ధర్మసూత్రాలని అనుసరిస్తోంది కాని, క్రీ.శ. మొదటి శతాబ్దం వారిగా చెబుతున్న బృహస్పత్యాదుల ధర్మసూత్రాల కంటె భిన్నంగా ఉండటం వల్ల కాళిదాసు క్రీస్తుపూర్వం వాడేనని నిశ్చయించ వచ్చునన్నారు.

1950 ఏప్రిల్ 19వ తేదీన శ్రీ కోరాడవారు వ్రాసిన సంస్కృత సాహిత్య 'పరిశీలనము: హాస్యరసము' అనే

వ్యాసంలో సంస్కృత నాటకాలను వారెంత నిశితంగా పరిశీలిం చిందీ వ్యక్తమౌతుంది. ఇందులో బోధాయన కృత 'భగవద జ్జుక' ప్రసక్తి కూడా వుంది. ఈ వ్యాసంలో కొంత comparative study కూడా కనబడుతుంది లక్షణంలో. "Humour is thinking in fun while feeling in earnest - a feeling and presentation of the ludicrous' అనే వాక్యాల్ని ఉదాహరిస్తూ ఆ లక్షణంలో irony, sarcasm, satire అనే అనేక భేదా లున్నా, ఇవన్నీ మన ఆలంకారికులు చెప్పిన హాస్యరసంలో గతార్థాలేనని ఉటంకించారు. శృంగార హాస్యాల గూర్చి చర్చిస్తూ హాస్యం శృంగారాన్నుంచి ఉద్భవించిందనే భరతాచా ర్యుని మతమంటూ సంస్కృత నాటకాల్లో హాస్య నిర్వచనం చెప్పి దాన్ని సోదాహరణంగా వివరించారు.

వికృతాకార వాగ్వేష చేష్టాదుల ప్రదర్శనం చేత హాసం స్థాయి భావమై రసమౌతుందని ఆలంకారికుల నిర్వచనం. ఇందులో వికృతమైన ఆకారం, వాక్కు, వేషం, చేష్ట అనే నాల్గంశాలు న్నాయి. దీనికి ఉదాహరణంగా ప్రతాపరుద్రీయంలో విద్యానా థుని ఉదాహరణ ఉటంకించారు. ఓరుగంటిలో బందీలుగా చేయబడిన శత్రురాజులు కృత్రిమములైన కొప్పులు, స్తనములు ధరించి స్త్రీ వేషధారులై పారిపోవడానికి ప్రయత్నిస్తుంటే వీథుల్లోని విటులు వీరు జారిణులని భ్రమపడి వారి పైటలను లాగడంతో వారి నిజస్థితి బయలుపడడంతో ఆ వింత వేషాలకు హిహీ అని కడుపు చెక్కలయ్యేట్టు నవ్వుతారని వర్ణించడం జరిగింది. ఇక్కడ వికృతమైన వేషం మూలంగా ఏర్పడిన 'శృంగారాభాసం' వల్ల ఉత్పన్నమైంది హాస్యం. 'ఆభాసే హాస్యా నికి మూల మనే అభినవ గుప్త వ్యాఖ్యానాన్ని 'Incongruity is the soul of humour' అనే పాశ్చాత్య నిర్వచనంతో సరిపో ల్చారు. హాస్యంలో ఆరురకాల్ని ప్రస్తావిస్తూ స్మిత, హసితాలు ఉత్తముల్లోనూ, విహసిత, అవహసితాలు మధ్యముల్లోను, అప హసిత, అతిహసితాలు అధముల్లోనూ ప్రకటిత మౌతాయ న్నది పెద్దలు చెప్పిందే. అయితే నేత్ర వికాస, శిరః కంపనాదుల మూలంగా ఉత్తమ, మధ్యముల చేత అనుమోదింపబడే హాస్యాన్నే 'humour' శబ్ద వాచ్యంగా మనం అనుకోవచ్చున నడం అత్యంత సమంజసం.

''వరరుచి రీశ్వర దత్తః శ్యామలికః శూద్రకశ్చ చత్వారః,
ఏతే భాణాన్ బభణుః కా శక్తిః కాళిదాసస్య.''

అనే శ్లోకాన్ని ఉటంకిస్తూ శ్రీ రామకృష్ణయ్యగారు సంస్కృత నాటకకర్తల్లో హాస్యరస ప్రాభవాన్ని ప్రకటించిన ప్రసిద్ధుల ముందు తద్రస నిర్వహణలో కాళిదాసుని పట్ల ఉదాసీనతను వ్యక్తీకరించారు. మిగతా నాటకాల్లో వలె కాళిదాసు నాటకాల్లో కూడా హాస్యం విదూషక పాత్ర ద్వారా ఉత్పన్నమైందే. ఆ తరువాత నాటకాల్లో ఈ విదూషక పాత్రలు ఒకే దిమ్మలో పోతపోసిన బొమ్మలలాగా తయారవుతూ వచ్చాయికాని స్వతంత్ర వ్యక్తుల్లా హాస్యరసాన్ని పోషించినవి కాలేదని చెప్ప డంలో కోరాడవారి సునిశిత విమర్శన దృష్టి, నిష్కర్షగా విషయాన్ని చెప్పగల స్థైర్యం ముగ్ధుల్ని చేస్తుంది. కాళిదాసు మూడు నాటకాల్లో విదూషక పాత్రల వైలక్షణ్యాన్ని చక్కగా విశ్లేషించారు. మాళవికాగ్నిమి। ంలో విదూషకుడు హాస్య రసో ద్బోధకానికే కాక కథాప్రవృ * కూడా తోడ్పడినాడంటూ మాళవిక దర్శనలాభం రాజు లభింపజేయడం నుండి అతడా మెను పరిగ్రహించడం వరకు కథ ఆసాంతం విదూషక తంత్రాధీ నమైంది. శాకున్తలంలో తద్భిన్నంగా కథా ప్రవృత్తికి విదూషక నిష్క్రమణం జరిగింది. శకుంతలను తిరస్కరించిన తదుపరి ఆమె జ్ఞప్తికి వచ్చిన సందర్భంలో ''కణ్వాశ్రమంలో జరిగిన వృత్తాంతాన్ని నువ్వైనా జ్ఞాపకం చేశావు కావేమని విదూషకుణ్ణి డిగితే అప్పుడు విదూషకుడు ''పరిహాస విజల్పితం సఖే పరమార్థేన నగృహ్యతాంవచః'' అని 'శకుంతలా వృత్తాంత మంతా తమాషాకి చెప్పిందేకాని నిజం కాదు సుమీ' అని నువ్వన్నావు కనుక 'మృత్పిండ బుద్ధి' గల నేను నిజమనుకుని ఊరుకున్నానంటాడు. 'మృత్పిండ బుద్ధి' శాకుంతలంలోని విదూషకుని ముఖ్య లక్షణమైతే 'అతిభీరుత్వం' మాళవికాగ్నిమి త్రంలోని విదూషకుని లక్షణమనీ, ఇది విక్రమోర్వశీయంలోని విదూషకునిలో కూడా కన్పిస్తుందనీ, నిపుణిక కట్టుముక్క విసరితే పామనుకొని గంతులు వేసిన ఘట్టం మాళవికాగ్ని మిత్రం నుంచి, గాలికి కొట్టుకొని వచ్చిన భూర్జపత్రాన్ని చూసి పాము కుబుసమనుకొని భయభ్రాంతుడైన సన్నివేశం విక్రమో ర్వశీయం నుంచీ ఉటంకించారు.

వీటికి భిన్నంగా మృచ్ఛకటికంలోని శకారుని పాత్రని వారు విశ్లేషించిన విధానం విశేషంగా వినుతింపదగింది. శకారుడు బుద్ధిహీనుడు మాత్రమే కాదు, దుర్మార్గుడు, తంత్రజ్ఞుడు. మృచ్ఛకటికంలో ప్రతినాయకుడైన ఇతని నుండి హాస్యాన్ని ఉత్పన్నం చేయడం ఒక వైలక్షణ్యం. రాజాగారి బావమరది కావడంలో ఒక ఔద్ధత్యం కూడా ఉంది. ఉచ్చారణలో 'స'కారా నికి 'శ'కారం పలకడం వలన ఆ పేరు పెట్టి ఉండవచ్చు. 'వసంతసేన'కు బదులు 'వశంత శేణా', శబ్దాల్లో పౌనరుక్త్యం, పారిపోతున్న వసంతసేనను గూర్చి ''కిం ద్రౌపదీవ పలాయసే రామభీతా'' ఇత్యాది అసందర్భ కథా సన్నివేశాన్ని సమకూ ర్చడం, ''న ఛిన్నౌ వృషభౌ-న మృతారజ్జవః'' మొదలైన వాక్యాల్లోని శబ్దాల్ని అస్తవ్యస్తం చేయడం, అసందర్భ ఉపమా నాల రీతిని ప్రస్తావించి కవిని శ్లాఘించారు. ఈవిధమైన హాస్యం తెలుగుతనానికి దగ్గరగా ఉందనిపిస్తుంది. నేటికీ హిందీ, తది తర ఆంధ్రేతర సినిమాల్లో హాస్యం వికృతాకార, వేష చేష్టల

ల్ల ఉత్పన్నమైనదయితే ఇందులో కేవల వికృత భాష వలన వాక్కు వలన) మాత్రమే హాస్యం ఉద్భుద్ధమై ప్రేక్షకులకి ఏదికాలాలపాటు జ్ఞాపకముంటుంది. ఆకారం, వేషం, చేష్ట అప్పటికప్పుడు హాస్యాన్ని సమకూర్చినా అది తాత్కాలికమే. కాని వాక్కు మాత్రమే కలకాలం ఉండిపో గలిగేది. ప్రతి నాయకుని వాగ్రూపంగా హాస్యాన్ని వెదజల్లిన ఆధునిక సిని మాల్లో 'ముత్యాలముగ్గు'ను ముచ్చటించుకోవచ్చు.

శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు సంస్కృత నాటకాల గురించి ప్రస్తావించిన వ్యాసాల్లో ప్రచురణ నందిన 'కాళిదాసుని కళా ప్రతిభలు' ప్రత్యేకంగా పేర్కొనదగింది. ఆంగ్లంలో Dowden వ్రాసిన Shakespeare's mind and art' ఈ రచనకు ఆయనను ప్రేరేపించినట్లు 'తొలిపలుకు'లోనే పేర్కొన్నారు.

మాళవికాగ్నిమిత్ర విషయానికివస్తే - అభిజ్ఞాన శాకుంతలం, విక్రమోర్వశీయం అనే రెండు నాటకాల్లో కనిపించే భావ సౌకుమార్యం, రీతి మాధుర్యం, కల్పనాపటిమ, మొదలైన కొన్ని ఉత్తమ గుణాలు మాళవికాగ్నిమిత్రంలో కనబడక పోవటం వల్ల, కథ కవికల్పితమై సార్వజనీన అనుభవాన్ని అంటే universal experience ఉన్నత ధర్మాన్ని High morality ని ప్రతిబింబించేది కాకపోవడం వల్ల ఇదసలు కాళిదాస విరచితమే కాదనే కొందరి పండితుల అభిప్రాయాన్ని ఉటంకించి శ్రీ రామకృష్ణయ్య గారు చారిత్రక పద్ధతుల ననుసరించి విమర్శించి ఆ పండితుల వాదాన్ని ఖండించారు. కాళిదాసు చేయి తిరగక ముందు చేసిన రచన కావడం వల్ల తదనంతర రచనల్తో తులతూగక పోయి ఉండవచ్చుననీ, మాళవికాగ్ని మిత్రంలో కనిపించే పద గుంభనలు కూడ తక్కిన రెండు నాటకాల్లో సమాన సందర్భాల్లో కనబడటం వల్ల ఈ మూడు నాటకాలు ఏక కవికృతాలుగానే భావించవలసి ఉంటుందని చెప్పారు. అయితే పూర్వరచన కంటె ఉత్తరోత్తర రచనల్లో కవి భావనావిలాసం, భావ గాంభీర్యం ఉత్కృష్టమైనవే కాక అతని బుద్ధి పరిపాకం, కళా నైపుణ్యం కూడ ప్రకటితమైనా యంటారు.

మాళవిక పాదాఘాతాన్ని పొందిన అశోక వృక్షాన్ని చూచి అగ్నిమిత్రుడు తనకంత అదృష్టం పట్టకపోయిందేఅని చింతిస్తాడు. అలాగే శకుంతల ముఖం మీద వ్రాలిన తుమ్మెదను చూచి...

''.......పిబసి రతి సర్వస్వమధరం.

వయం తత్త్వాన్వేషాన్మధుకర హతాస్త్వం ఖలుకృతీ''

మాళవికాగ్నిమిత్రంలో తన మిత్రునితో ''ఆత్మానం వ ఇచ్ఛతం మన్యే'' అన్నది శాకుంతలానికివచ్చేసరికి ''త్వం రతి సర్వస్వం అధరం పిబసి, త్వం కృతీఖలు'' అని తుమ్మెదతోనే సంభాషించడం నిజంగా మొదటి ఘట్టం మీద improvement కదా! వయం హతాః త్వం కృతీ ఖలు.

అలాగే మరో ఉదాహరణ కూడా వారు చూపించారు. నాయికా నాయకులకు ఏకాంతం కల్పించడానికి అక్కడ నుంచి తప్పుకోవడం రెండు నాటకాల్లోనూ కనిపిస్తుంది. మాళవికాగ్ని మిత్రంలో విదూషకుడు

''ఏష బాలాశోక వృక్షస్య పల్లవాని లంఘయతి హరిణః ఏతా నివారయావ ఏనమ్'' అంటే వకుళావళిక 'తథా' అని తప్పుకొంటే శాకుంతలంలో ప్రియంవద

''అనసూయే! ఇతో దత్తదృష్టి రుత్సుకో మృగ పోతకో మాతర మన్విష్యతి, ఏహి, సంయోజయావ ఏనం'' అంటూ ఇద్దరూ నిష్క్రమిస్తారు.

ఇంతేకాక ఈ మూడు నాటకాల్లోనూ సమాన సందర్భాలు అనేకం ఉన్నాయంటూ సమానార్థ పదబంధ విశేషాలు కల 17 సంభాషణలని మూడు నాటకాల్లోంచీ ఉద్ధరించి చూపారు శ్రీ కోరాడవారు. ప్రథమ ప్రయత్నమైనందున పరిణతి లేకపోయి నంత మాత్రాన మాళవికాగ్నిమిత్రం కాళిదాస కృతమే కాద నడం సమంజసం కాదని త్రోసిపుచ్చారు. అంతేకాక నాందీ ప్రస్తావనాంశాల ప్రసంగం తీసికొని వచ్చి మాళవికాగ్ని మిత్రంలో ''అష్టాభిర్యస్య కృత్స్నం జగదపి తనుభిర్బిభ్రతో నాభిమానం'' అన్నమాట శాకుంతలానికి వచ్చేసరికి ప్రత్యక్షాభి ప్రపన్నస్తనుభి రవతు వ స్తాభి రష్టాభి రీశః''

అని నాటకోద్యమంలో వచ్చిన పరిణతి కూడా ఎంతో నేర్పుతో చూపించేరు రామకృష్ణయ్యగారు. పూర్వరంగాంగ భూతమైన నాంది ఇష్ట దేవతాస్మరణ పూర్వకం, ఆశీర్వచనాత్మకమైన శ్లోక రూపంలో నాటకకర్తే రచించే ఆచారం కాళిదాసు కాలం నుంచే బయలుదేరి ఉండవచ్చునంటారు. ఎందుకంటే కాళిదాసు పూర్వికుడైన భాసుని నాటకాల్లో ''నాంద్యంతే తతః ప్రవిశతి సూత్రధారః'' అని మొదట్లోనే ఉండడం వల్ల రంగప్రసాధనం, నాంది మొదలైన పూర్వరంగాలన్నీ ముగిసిన తర్వాతే సూత్రధారుడు లేదా తత్తుల్యుడైన స్థాపకుడు ప్రవేశించి నాటకవస్తువును , పాత్ర ప్రవేశాన్ని సూచించి నిష్క్రమించడం ఆచారమై నదని ఊహించవచ్చునంటారు. పైగా వాటిలో ప్రధాన పాత్రల నామనిర్దేశంతో కూడిన మంగళ శ్లోక మూలముగ చేయబడిందే కాని నాటక ప్రశంస కాని, రచయిత ప్రశంస కాని ఏమాత్రం కనిపించదుకనుక మొదటి నాందీ శ్లోకం నాటకకర్త రచించే

ఆచారం ౹ తం కాళిదాసుతోనే బయలుదేరి ఉండవచ్చునని శ్రీ రామకృష్ణయ్య గారి వాదం.

ఇకపోతే భాసుని నాటకాలన్నీ రాజాజ్ఞచే ఆయన ఆస్థానంలో ప్రయోగించడానికి రచించబడినవి కనుకే ఆయన స్వీయ నామనిర్దేశం చేయక పాత్ర ప్రవేశాన్ని సూచించి స్థాపనలను చిన్నవిగా చేసి చివరకు భరత వాక్యంలో మాత్రం తన ప్రభువును కీర్తించేడనీ చెప్పి, కాళిదాసు కూడా ఏదో ప్రభువు ఆస్థానాన్ని అలంకరించేడన్న కథలున్నా ఆయన నాటకాలు మా ం రాజాజ్ఞచేకాని, రాజాస్థానాల్లో ప్రయోగించాలన్న ప్రధానో ంతో కాని రచించినట్లు కనిపించదన్నారు. మాళవికాగ్ని త్రంలో కూడా సూత్రధారుడు పరిషదాజ్ఞచే నాటకాన్ని ప్రయోగిస్తున్నట్లు చెబుతాడు.

''అభిహితో2 స్మి పరిషదా కాళిదాస గ్రథిత వస్తు మాళవికాగ్ని మిత్రం నామ నాటకం అస్మిన్వసంతోత్సవే ప్రయోక్తవ్యమితి''

కనుక కాళిదాసీ నాటకాన్ని సామాజికుల ఆనందం కోసమే వ్రాశాడని చెప్పవచ్చు. అంటే రామకృష్ణయ్య గారి ఆలోచనా సరళిలో మనం విచారిస్తే నాటకం రాజాస్థానాన్ని విడచి జనంలోకి వెళ్ళిందని చెప్పాలి. ఇవాళ మన slogan కూడా అదేగా! నాటకాన్ని జనాల్లోకి తీసికొని వెళ్ళాలని. పైగా నాటక విజయానికి సామాజికామోదమే కొలబద్ధ అనే సత్యాన్ని కాళిదాసానాడే ఒప్పుకున్నాడు.

''ఆపరితోషాద్విదుషాం న సాధు మన్యే ప్రయోగ విజ్ఞానం'' అంటాడు. 'ప్రయోగ విజ్ఞానం' అన్న మాటలో ఈ నాటకం చదువుకొనేది కాదనీ, ప్రతిభావంతంగా ఆడేదనీ (play) చెప్పేడు. దీన్ని ఆధారంగా తీసికొనే కోరాడవారు అతని కాలంలో ఇటువంటి నాటకాలు ఉత్సవ సమయాల్లో ఆ కాలానికే ప్రబలియున్న నాటక సమాజాలచే బహిరంగ ప్రదేశాల్లో పండిత సభల ఎదుట ప్రయోగింపబడుతుండేవని తెలియ వస్తోందన్నారు.

కాళిదాసు కాలానికే కాదు. గట్టిగా మాటాడితే రామాయణ కాలానికే నాటక సమాజాలున్నాయి. నిన్న feminism దృక్పథంతో ఒక సోదరి ఆనాడు పురుషాధిక్యం ఉందనీ స్త్రీలు తమ ఇంటికే పరిమితమై ఉండేవారన్నట్టుగా మాటాడేవారు. కేవలం స్త్రీలే నిర్వహించే నాటక సమాజాలు దశరథుని కాలంలో అయోధ్యలో ఉన్నట్లు వాల్మీకే వ్రాశాడు రామాయణంలో

''వధూ నాటక సంఘైశ్చ
సర్వతోరభితః పురీమ్'' (బాలకాండ).

సరే - మళ్ళీ కాళిదాసు విషయానికి వస్తే ''మా తావత్ ప్రథిత యశసాం భాస సౌమిల్ల కవిపుత్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య వర్తమాన కవేః కాళిదాసస్య కథం పరిషదో బహుమానః'' అనే వాక్యాన్ని గ్రహించి ఆనాటి ప్రజలకు నాటకాల పట్ల అభిరుచి ఉండేదనీ, సమాజాలు కూడా చాలా ఉండేవనీ చక్కగా ఊహించారు.

''పురాణమిత్యేవ నసాధు సర్వం-న చాపి కావ్యం నవమిత్యవద్యం'' అనే శ్లోక పాదం వల్ల ప్రజల్లో ఆనాటికి క్రొత్తదానికంటె పాత నాటకాలంటేనే మోజు ఉండేదనీ దాన్ని పోగొట్టడానికి కాళిదాసీ శ్లోకం వ్రాసినట్లు చెప్పేరు అంతేకాక prejudiced view తో చూడకండని.

''సంతః పరీక్ష్యాన్యతరద్భజన్తే - మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః'' అని ప్రజల్ని మందలించినట్లూహించారు కోరాడవారు.

సాహిత్యదర్పణ కారాదుల

**''తత్ర పూర్వం పూర్వరంగః సభాపూజా తతఃపరం
కథనం కవి సంజ్ఞాదేః నాటకస్యో పథాముఖమ్''**

అన్న లక్షణ వాక్యాలకు సైతం కాళిదాస నాటకాలే లక్ష్యమై యుండనోపునన్నారు.

ఈవిధంగా domestic drama గా ప్రారంభించిన మాళవికాగ్నిమిత్రం తరువాత దానిమీద developed drama గా విక్రమోర్వశీయం, ఆ తరువాత ఆయన dramatic art కి culmination point గా శాకున్తలం రచనల్లో ఈ చారిత్రక పద్ధతి ననుసరించే evolution గుర్తించడంలో శ్రీ కోరాడవారు కృతకృత్యులయ్యారు. భాస నాటకాలు కాళిదాసుకు models గా ఉన్నా వాటి మీద improvements కాళిదాసులో చూస్తామని తులనాత్మకంగా నిరూపించారు.

ఒక్కమాట.

కవి ప్రతిభ కల్పనలో ఊహలో ఉంటుంది. ఇది ఎంత రసాత్మకంగా ఉంటే పఠితకంత అనుభూతి కలుగుతుంది. కావ్యప్రయోజనం, దృశ్యమైనా, శ్రవ్యమైనా అదే. దాన్ని ఏవిధంగా ఆస్వాదించవలసినదీ ఆనందవర్ధన అభినవగుప్తాదులు సోదాహరణంగా తమ గ్రంథాల్లో చర్చించారు. దాన్ని ఆధారంగా తీసికొని అధ్యయనం చేస్తే ఆ అనుభూతికి దగ్గరవుతాము. దానికి ముందు కావ్యంలో అభినివేశం కలగాలి. దానికి కోరాడ రామకృష్ణయ్య గారవలంబించిన చారిత్రక పద్ధతి విశేషంగా ఉపకరిస్తుంది. కనుక ఆవిధంగా సంస్కృత నాటకాలకు ఆయన చేసిన సేవ చిరస్మరణీయం.

# తెలుగు భాషా చరిత్ర

## కోరాడ రామకృష్ణయ్యగారి పరిశోధనలు

శ్రీ బూదరాజు రాధాకృష్ణ

తెలుగు భాషను చరిత్రదృష్టితో పరిశీలించటం ఇరవయ్యో శతాబ్దానికి ముందు తెలుగువారెవరూ చేసినట్లు లేదు. భాషను వ్యాకరించే ప్రయత్నాలు ఎప్పుడెవరు ఆరంభించారో స్పష్టంగా చెప్పటమూ సాధ్యం కాదు. ఈనాటికి లభ్యమైన సమాచారాన్ని బట్టి పదమూడో శతాబ్దంలో కేతన రాసిన 'ఆంధ్రభాషా భూషణ'మే తెలుగు భాషకు వెలిసిన తొలి వ్యాకరణగ్రంథం. నన్నయ వాగనుశాసనుడనే బిరుదును మొట్టమొదట ప్రస్తావించిన వ్యక్తి ఎళ్లనామాత్యుడే గాని, ఆయన సమకాలికులు కాదు. అప్పకవి పుణ్యమా అని ''ఆంధ్రశబ్ద చింతామణి' నన్నయ రచనగా అభూతకల్పనలు సాక్షిగా సంప్రదాయ పండితుల దృష్టిలో తిరుగులేని వాస్తవంగా చెలామణీ అయింది. ఇప్పటికీ అదే నిజమని నమ్మి సిద్ధాంతవ్యాస పరంపరలు వెలయిస్తున్న పరిశోధకులు లేకపోలేదు. చిన్నయసూరి బాలవ్యాకరణం వేద ప్రమాణంగా నిన్నమొన్నటిదాకా ప్రతిష్ఠ సంపాదించినా కేతన కాలాలనుంచి చిన్నయ కాలందాకా చరిత్ర దృష్టితో భాషాస్థితిని వ్యాకరించిన వాళ్ళు లేరు.

తెలుగు ద్రవిడ భాషాకుటుంబానికి చెందిందని మొదట ఎల్లిస్, తరువాత కాల్డ్వెల్ అక్షర రూపంలో గ్రంథస్థం చేసినా శేషగిరిశాస్త్రిగారి కాలందాకా తెలుగువాళ్ళెవరూ ఆ వాదాన్ని అంగీకరించినట్లు కాదుగదా కనీసం అటువంటిదొక అభిప్రాయముందని గుర్తించినట్లు లేదు. శేషగిరి శాస్త్రిగారి గ్రంథాల్లోని అభిప్రాయాలు పరిశీలనార్హాలని మొదట గ్రహించిన తెలుగు విద్వాంసుడు సంప్రదాయవాది అయిన వేదం వేంకట రాయశాస్త్రి గారే ననిపిస్తుంది. ''ఆంధ్రభాషా సర్వస్వార్థనియమ కతిపయము''లనే తమ గ్రంథంలో వేదంవారు పాశ్చాత్య పండితులు చెప్పే వ్యుత్పత్తి శాస్త్రాన్ని ప్రశంసించారు. భారతీయ భాషలను భిన్న కుటుంబాలకు చెందినట్లు నిరూపించే గ్రంథసంచయం, వ్యాసపరంపర ఇంగ్లీషులోనే ఉన్నందువల్ల గిడుగు వేంకటరామమూర్తిగారి వంటి వ్యుత్పన్నులు తప్ప తొలితరం - ఇరవయ్యో శతాబ్ది తెలుగు విద్వాంసుల్లో తొలితరం వాళ్లు ఆ వాద ప్రతివాదాలను పరిశీలించినట్లు కని పించదు. బటర్‌వర్త్‌తో కలిసి వేణుగోపాల చెట్టి వంటి వాళ్లు తెలుగు శాసనాలను ప్రచురించినప్పుడు వాటిమీద దృష్టిని నిలిపినవాళ్ళుకూడా చాలాకొద్దిమంది. భాషాశాస్త్ర సిద్ధాంతాలు - ఆనాటికి ప్రపంచంలో ప్రచారంలో ఉన్నవి - చాలా కొద్దిమంది తెలుగువాళ్ళను ఆకర్షించాయి. మాక్సుముల్లర్ ''సైన్స్ ఆఫ్ లాంగ్వేజి'' అనే బహుళ ప్రచారం సంపాదించిన ఇంగ్లీషు పుస్తకం రెండు సంపుటాలనూ విజయనగర మహారాజు ఆనందగజపతి మహారాజు అంకితం పుచ్చుకొని అచ్చువేయించాడు. ఆయన ఆస్థానములో ఉన్న గురజాడ వేంకట అప్పారావు, ఆయన మిత్రుడయిన గిడుగు వేంకట రామమూర్తిగారలు అప్పటి భాషా శాస్త్రపద్ధతులను అవగతం చేసుకున్నారు. గిడుగువారు సవర భాషకు రాసిన వ్యాకరణం, నిఘంటువు జగద్విఖ్యాతమైనాయి. వారి వ్యావహారిక భాషావాదానికి భాషాశాస్త్ర సిద్ధాంతాలు ప్రాతిపదికలైనాయి. అయితే భాషా స్వరూపం గురించి నినదించిన జయంతి రామయ్యాదులెవరూ తెలుగు ద్రవిడభాషా కుటుంబానికి చెందిందనే గిడుగువారి విశ్వాసవాదాలను ఎదుర్కోలేదు. నిజానికి ఆ వివాదంలో ఆసక్తి చూపలేదు.

గిడుగువారి ప్రత్యక్ష శిష్యులుగా ఉండి, గురువుగారి నోట్సులను స్వాయత్తం చేసుకోగలిగిన చిలుకూరి నారాయణ రావుగారు మాత్రం ద్రవిడభాషా వాదాన్ని మనస్ఫూర్తిగా వ్యతిరేకించి, ఆయన వ్యావహారిక వాదాన్ని మాత్రం ఆమోదించారు. అప్పటికి భారతీయ విద్వాంసుల్లో నాటికి ఆధునికమైన భాషాశాస్త్ర సిద్ధాంతాలను అనువర్తించి బెంగాలీ భాషా చరిత్రను రాసిన సునీత్‌కుమార్ ఛటర్జీగారి గ్రంథమొకటీ భారతీయ విద్వాంసుడు రాసిన మహత్తర గ్రంథమనే ప్రతిష్ఠ సంపాదించింది. ఛటర్జీగారు ద్రవిడభాషా వాదాన్ని అంగీకరించటమేగాక ద్రవిడభాషల ప్రభావం ఆర్యభాషలమీద ఎంత విస్తృతంగా ఉందో ససాక్షికంగా నిరూపించారు. చిలుకూరి వారు ఆ మార్గాన్ని, ఆ వాదాన్ని నిరాకరించారు. వారు

తెలుగును పైశాచిక ప్రాకృతంలోనుంచి, దానికూ్కడా మూలమని భావిస్తున్న సంస్కృతంలోనుంచి ఉద్భవించిన భాషగా నిరూపిస్తూ 1935లో ''ఆంధ్రభాషా చరిత్ర''ను రెండు మహాసంపుటాలుగా ప్రచురించారు. దరిమిలా చిలుకూరివారి వాదాన్ని ఖండిస్తూ గంటిజోగి సోమయాజిగారి 'ద్రవిడ భాష'లనే చిన్న పుస్తకం వెలువడిందిగాని దాని ప్రభావం తెలుగువారిమీద అంతగా పడలేదు. సోమయాజిగారి 'ఆంధ్రభాషా వికాసము'' 1947లో ప్రచురితమై అది పాఠ్యగ్రంథమయిన తరువాత తెలుగుదేశంలో ద్రవిడభాషా వాదానికి కొంత ప్రతిష్ఠ వచ్చింది. ఈ రెండో తరంలో ద్రవిడభాషా సిద్ధాంతాన్ని ప్రతిష్ఠాపించటానికి సమర్థంగా శ్రమించిన విద్వాంసుల్లో కోరాడ రామకృష్ణయ్యగారు సుప్రసిద్ధులు. వారి రచనలను గురించి స్థూలంగా ప్రస్తావించి, తెలుగు భాషా చరిత్ర నిరూపణకు వారుచేసిన శాస్త్రీయ ప్రసంగాలను అంచనా వేయటం మేలు.

1926 నాటికే ''భాషోత్పత్తి క్రమము-భాషా చరిత్రము'' అనే వ్యాసాన్ని ప్రచురించిన రామకృష్ణయ్యగారు అప్పటికి పాశ్చాత్య ప్రపంచంలో వేళ్ళుదన్నిన భాషా శాస్త్రసిద్ధాంతాలను, అనువర్తన విధానాలను తెలుగువాళ్ళకు పరిచయం చేశారు. 'నన్నయ్యకు బూర్వ మాంధ్రభాషా స్థితి'ని 1922లో శాసనాధారాలతో చర్చించారు. 'ద్రావిడ భాషలు-సంధి' అనే వ్యాసంలో ప్రధాన ద్రవిడ భాషల్లోని సంధి విధానాలను 1930లో తెలుగువారికి తెలియజేశారు. 'సంధి'ని గురించి వారు రచించిన గ్రంథం 1935లో వెలువడి వారికి ఎంతో ప్రతిష్ఠ సంపాదించి పెట్టింది. వారి 'భాషా చారిత్రక వ్యాసములు' 1949లో వెలువడ్డాయి. 1951-52 మధ్యకాలంలో చాళుక్య పూర్వయుగానికి సంబంధించి క్రీస్తు తరవాతి మొదటి సహస్రాబ్దంలో తెలుగుభాషా స్థితిని గురించి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యాలయ పత్రికలో ధారావాహికంగా ఇంగ్లీషు వ్యాసాలు రాశారు. 1954లో అంతకుపూర్వ కాలంలో తెలుగుభాషా పరిస్థితి ఎలా ఉండేదో చర్చిస్తూ అదే సంచికలో మరో ఆంగ్లవ్యాసం రాశారు. రామకృష్ణయ్యగారు సాహిత్యాది విశేషాలమీద రాసిన వ్యాసాలనూ, గ్రంథాలనూ, ఆయా ఇతర రంగాలకు చేసిన సేవలనూ ఈ చిన్నవ్యాసంలో ప్రస్తావించటంలేదు. కేవలం భాషాశాస్త్ర వ్యాసాలను గురించి మాత్రమే క్లుప్తంగా పరిశీలించి వారికి నివాళు లర్పిస్తాను.

మానవజాతి గతచరిత్రను తెలుసుకోటానికున్న సమస్తాధారాలకు పరిమితి ఉంది. పూర్వులు వాడిన వస్తువులు, చేసిన నిర్మాణాలు ఒక ఎత్తయితే మానవత్వం సంక్రమించినందుకు గుర్తుగా ఉండే భాష అందించే గతచరిత్ర మరో ఎత్తు. వస్తురూపంలో ఉన్నవి శిథిలమై నశించిపోయినా భాష ఒకజాతి చరిత్రకు చిహ్నంగా నిలుస్తుంది. భాష మారుతుంది అనేక విధాల. అయినా సరే అత్యంత ప్రాచీన లక్షణాలను, సంస్కృతి నాగరకతల చిహ్నాలను భాష ఏదో ఒక రూపంలో తనలో నిలుపుకొంటుంది. ఆ రహస్యాలను బయటికి తీసే సాధనం భాషాశాస్త్రం. పాత కాలపు వ్యాకరణాలకు ఆ దృష్టిలేదు. మహాకవుల, రచయితల - అందులోనూ ప్రాచీనతముల - భాషాప్రయోగాలు సాధువులనీ, తక్కినవి అసాధువులనీ గ్రామ్యాలనీ నిరూపించటమే వాటి కర్తవ్యంగా పరిణమించింది. భాషా వ్యవహర్తల భావభంగిమలు, ఆచార వ్యవహారాలు, వేషభాషలు మొదలయిన వాటిలో కాలపరిణామ క్రమంలో వచ్చిన మార్పులేమో, అందుకు కారణాలేమో భాషాధ్యయనం ద్వారా తెలుసుకోవాలన్న సంకల్పమే లేని పండితులు తాము నేర్చి అభిమానించి ఆరాధించే సంస్కృత వ్యాకరణ రచయితలు, భాష్యకారులు వేల సంవత్సరాల క్రితం చూపిన విజ్ఞతను కూడా ప్రదర్శించలేదు. నన్నయకు ముందుకాలంలోని శాసనాలు, శిలాక్షరాలుగా తామ్రఫలకాలుగా లభించినా వాటిలోని భాషావిశేషాలను చరిత్రకారులే మొదట వివరించారుగాని వైయాకరణులు ఆజోలికి పోలేదు. అటువంటి సమయంలో తులనాత్మక భాషాధ్యయన విధానాలు నేర్చి తెలుగువాళ్ళకు నేర్పిన కొద్దిమంది విద్వాంసుల్లో కోరాడ రామకృష్ణయ్యగారు ప్రాతస్స్మరణీయులు. ఆధునికులు.

1948 నాటికి క్రీస్తుశకం 6వ శతాబ్దినాటి రేనాటి చోళుల తెలుగుశాసనాలు కూడా లభించాయి. అంతకు చాలాకాలం ముందే సంస్కృత ' కృత శాసనాల్లోని తెలుగుమాటలు - ఊళ్ల పేర్లుగా, క్తి నామధేయాలుగా, అక్కడక్కడ పదబంధాలుగా దొరి చరిత్ర నిర్మితికి తోడ్పడ్డాయి. చిలుకూరి నారాయణరావు గారి ఆంధ్రభాషా చరిత్ర నిర్మాణ కాలానికిగాని, గంటి జోగి సోమయాజిగారి ఆంధ్రభాషా వికాసరచన కాలానికిగాని రేనాటి చోళుల తెలుగు శాసనాలు దొరకలేదు. అయినా లోక విరుద్ధమైన, శాస్త్ర సిద్ధాంత విరుద్ధమైన ప్రతిపాదనలతో చిలుకూరివారు ఆంధ్రభాషా చరిత్రకు విపరీత వ్యాఖ్యానాలు చేశారు. భాషలు మొదట ధాతురూపంలో ఉండేవని, ఆయా ధాతువుల కలయికవల్ల భాష లేర్పడ్డాయని. అలా ఏర్పడ్డ భారతీయ భాష సంస్కృతమేనని, తక్కిన భాషలన్నీ అందులోనుంచి పుట్టాయనీ ఆయన విశ్వసించి వాదించి వికృత సిద్ధాంత దిపాదనలు చేసి అందుకు ప్రమాణంగా ప్రాచీన భారతీయ ~కరణులనే ప్రస్తావించాడు. 'ప్రకృతి ప్రత్యయ విభాగే వలం కాల్పనికే' అన్న మంజూషా వాక్యాన్నయినా ఆయన స్మరించలేదు. వాక్యపదీయంలో, పతంజలి మహాభాష్యంలో,

యాస్కనిరుక్తంలో, ప్రాతిశాఖ్య వ్యాకరణాల్లో ప్రతిపాదిత సిద్ధాంతాలనయినా గమ నించలేదు. అయితేనేం ఒక బృహద్గ్రంథాన్ని ప్రసాదించారు తెలుగు వారికి. వారి సిద్ధాంత లోపాన్ని బలహీనతను మొట్టమొదట ఎదుర్కొన్నవారు రామకృష్ణయ్యగారే. వారి వాదంలోని ప్రత్యేకత అది శాస్త్ర బద్ధమేగాని వ్యక్తిగతం కాకపోవటం. సోమయాజిగారి గ్రంథంలో లాగా నైయక్తిక ప్రసంగాలు లేకుండా కేవలం ఆధారాలకు సిద్ధాంతాలకు అనువర్తనలకు మాత్రమే పరిమి తంగా శాస్త్రీయంగా రచించిన కొద్దిమంది తెలుగు విద్వాం సుల్లో ఆయనొకరు కావటం వారి విశిష్టత.

రామకృష్ణయ్యగారు 1951-52లలో ప్రాఙ్నన్నయ యుగాంధ్రభాషా స్వరూపాన్ని చర్చించే నాటికన్నా చాలా ఎక్కువ సమాచారం దరిమిలా ప్రకాశితమయింది. అప్పట్లో తులనాత్మక పరిశీలన ప్రధానంగా, చారిత్రక పరామర్శ గౌణంగా ఉండేది. సమకాలంలోని విధానాలను, పద్ధతులను ఆయన పరమ సమర్థంగా పాటించారు. ఆయా శాసనాల కాలనిర్ణయం వగైరాల్లో మార్పులున్నా యిప్పుడు. ఇప్పటి భాషా చరిత్ర రచయితలు తమకు అందుబాటులో ఉన్న శాసన భాషను శతాబ్దాలవారీగా వర్ణనాత్మకంగా విశ్లేషించి, భిన్న శతాబ్దాల వర్ణనాత్మక లక్షణాలను పోల్చి చరిత్ర నిర్మిస్తారు. చరిత్రకందని - అంటే ప్రత్యక్ష సాక్ష్యానికి అందని - విషయాలను మాత్రమే తులనాత్మక పద్ధతిలో సజాతీయ భాషా లక్షణాలతో పోల్చి చరిత్రను స్పష్టీకరిస్తారు తులనా త్మక విధానం ద్వారా తెలిసిన లక్షణాలను ప్రాతిపదికగా తీసుకొని - అంటే లిఖితాధారాలు దొరక్కపోయినా శాస్త్రీయంగా ఊహించి నిర్ణయించగల అతి ప్రాచీన భాషాకుటుంబ లక్షణాలను ఆధారంగా తీసుకొని - తెలుసుకున్న, తెలిసిన చరిత్రతో సమన్వయించటం అప్పటి పద్ధతి. వర్ణనాత్మక పద్ధతికి అప్పట్లో ప్రచారం లేదు - ప్రాముఖ్యం లేదు. అందువల్ల కోరాడవారి పరిశ్రమను నేటి విధానాలతో పోల్చటం అనవసరం - సంభావ్యమూ కాదు. వారి ఆవిష్కరణలను స్థూలంగా పరిశీలిద్దాం - నేటి నిర్ణయాలతో పోలుస్తూ.

క్రీస్తుశకం 7వ శతాబ్దికి ముందు పూర్తిగా తెలుగులో ఉన్న శాసనాలు లేవన్నారు వారు. ఇప్పుడు ఆరో శతాబ్ది చరమపాదంనుంచీ లభిస్తున్నాయంటున్నారు. ఆధారాలు సమానం; మారిందల్లా కాలనిర్ణయం మాత్రం. అమహత్తుల ప్రధానమైన వచన ప్రత్యయం క్రీస్తుశకం 7వ శతాబ్ది నాటికే 'ము'గా మారిందని వారన్నారు. ఇప్పటివారు అన్యదేశాల్లో అప్పటికే ఈమార్పు వచ్చినా తరవాతి శతాబ్దిదాకా దేశ్య శబ్దాల్లో ఈ పరిణామం వచ్చిన నిదర్శనలు లేవంటున్నారు. వివరాల్లోనేగాని స్థూల నిర్ణయంలో అభిప్రాయభేదం లేదు. అది ''మ్ము- మ్'' అనే రూపాలను తొమ్మిదో శతాబ్దినాటికి పొందిందని ఇప్పటివారు మరికొన్ని నిదర్శనలు చూపారు. మూలభావనకు అది వ్యతిరిక్తం కాదు. మహదేక వచన ప్రత్యయమైన - 'న్తు' అనేది 'ణ్డు'గా మారటంకూడా ఏడో శతాబ్దంలోనే జరిగిందని వారన్నారు. లేఖనంలో 'న్తు' అనే రూపం ఏడో శతాబ్దందాకా ఉందన్న 'చేర్పు' మాత్రమే నేటివారిది. 'న్తు' ప్రత్యయం 'ణ్ణండు' మారటానికి దంతమూలీయ త వర్ణం సహాయకధ్వనిగా (Help Sound) చేరటం కారణమన్నారు వారు. శకటరేఫ దంతమూలీయతా చిహ్నంగా లేఖనంలో నిలిచిందన్న వివరణతప్ప ఇప్పటికీ వారు చెప్పినమాట నిలుస్తూనే ఉంది. 'వారు' అనే బహువచన రూపంనుంచి 'వాణ్డు' అనే ఏకవచన రూపం సిద్ధించిందని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, గంటి జోగి సోమయాజిగారూ చేసిన వాదన పొరపాటని కోరాడ రామకృష్ణయ్యగారు చేసిన నిరూపణ, చూపిన ఉపపత్తులూ నేటికీ స్వీకార్యాలే.

ప్రాఙ్నన్నయ యుగంలో గసడదవాదేశం నిత్యంగా ఉండేదని కోరాడవారు చెప్పినది సత్యం. తత్సమశబ్దాలు అదంతాలయినా 'వు' ప్రత్యయం చేరినప్పుడు ఉదంతాలుగా మారుతాయని చెప్పింది నేటికీ సరైన నిర్ణయం. కర్మణిప్ర యోగం నన్నయలోనే బహుళంగాని అంతకుముందున్న శాసనాల్లోగాని, తరువాతి కాలపు మహాకవి రచనల్లోగాని విరళంగా ఉండేవన్న నిరూపణ యథార్థం. క్రీ.శ. 9 శతాబ్దంనుంచే సంస్కృత ప్రభావంవల్ల ఈ ప్రయోగపద్ధతి తెలుగులో ప్రవేశించిందన్నమాట వాస్తవం. యత్తదర్థక ప్రయోగంకూడా మక్కికిమక్కీ అనువాదంచేసిన నాలుగు సందర్భాల్లో తప్ప ప్రాఙ్నన్నయ శాసనభాషలో కనిపించద నటం సత్యం. ఱ, ళ వర్ణాల పరిణామక్రమనిరూపణ ఉపాదేయం. నన్నయ ముందున్న శాసనాల్లో సాంస్కృతిక ఛందస్సులు కనిపించలేదనటం నిజం. సంస్కృత భాషాపర మైన కోరుమిల్లి శాసనంలో కూడా దేశీయచ్ఛందమైన రగడలో సంస్కృత రచన చేశారన్నది పరిగణనీయం. అద్దంకి శాసనం నుంచే 'చంపూ' ప్రక్రియ తెలుగులో ఉందనటం పరిశీలన పూర్వకం. భూతకాలిక క్రియారూపాల్లో ఎన్- ఎమ్ అనే ప్రత్యయాంతరం లింగబోధలేకుండా, పురుష ప్రత్యయ రహితంగా వాడాడన్న నిరూపణ సత్యం. ఇలా ఆనాడాయన చేసిన వ్యాఖ్యానాలు నేటికీ సమర్థనీయాలుగా ఉన్నవి అనేకం.

ఎటొచ్చీ క్రీ.శ. 7-9 శతాబ్దాలమధ్య సంధిపద్ధతి గందరగో ళంగా (chaotic) ఉందనటం సమర్థనీయం కాదు. తులనాత్మక విధానంతో సంబంధం లేకుండా కేవలం

భిన్నకాలాల చారిత్రక పరిణామాలను మాత్రమే పరిశీలించిన ట్లయితే ఆ కాలంలో కూడా సంధిపద్ధతి విస్పష్టంగా ఉందని, పరిణామశీలంగా ఉందనీ గుర్తించవచ్చు. గసడదవాదేశం కూడా క్రీ.శ. 8 - 11 శతాబ్దాల మధ్యకాలంలోని శాసనభాష లోనే ని ంగా ఉండేది. అంతకుముందు వైకల్పికంగానే ఉండేది. ' .శ. 9-10 శతాబ్దాలదాకా యడాగమం వికల్పంగా ఉండి, రవాతికాలంలో బహుళమయింది. ప్రాఙ్నన్నయ యుగభాషలో ఉత్సంధి బహుళమేగాని నిత్యంకాదు. పదాది యవలు క్రీ.శ. 7వ శతాబ్దినుంచీ కనిపిస్తాయి. కేవలం చరిత్రనేగాక తులనాత్మకాధ్యయనాన్ని గూడా అప్పటి పద్ధతుల ప్రకారం పాటించినందువల్ల మాత్రమే సంధి అవ్యవస్థితంగా ఉందని చెప్పవలసి వచ్చింది. అది విధానలోప మేగాని పరిశీలనదోషం కాదు. గంటి జోగిసోమయాజిగారు ప్రాఙ్నన్నయభాష ''ద్రవస్థితిలో'' ఉండేదన్నమాట ఉపా దేయం కాదని కోరాడవారు సమర్థంగా నిరూపించారు.

ప్రాచీన ద్రావిడంలోనే తాలవ్యీకరణం ఆరంభమయిం దన్న కోరాడ రామకృష్ణయ్యగారి ఊహను విపుల పరిశీలన మీద కొంత విభేదించవలసి వుంటుంది. తెలుగులో జరిగిన తాలవ్యీకరణమూ తమిళ, మలయాళ భాషల్లో జరిగిన తాలవ్యీకరణమూ భిన్న సమయాల్లోవని బరో నిరూపిం చాడు. ఇది వేరు వేరుగా జరిగినవేగాని ఈమూడు భాషలూ ఏకభాషగా ఉన్నప్పటివికావని ఆయన వాదం. దక్షిణద్రావి డంనుంచి తెలుగు విడిపోయే కాలంలోనో, క్రీ.శ. 5వ శతాబ్దికి ముందో తాలవ్యీకరణం మొదలై తెలుగులో సాహిత్యం ఏర్పడటానికి ముందున్న ప్రాచీనాంధ్ర కాలానికి పూర్తయి ఉంటుందని భద్రిరాజు కృష్ణమూర్తిగా రన్నారు. తెలుగుదే శంలో వెలువడ్డ ప్రాకృత శాసనాల్లోనూ ప్రాకృత రూపాల్లో కూడా ఈ పరిణామం కనిపిస్తున్నందున (ఉదాహరణకు క్రీ.శ. 3వ శతాబ్దినాటి నాగార్జునకొండ శాసనంలోని 'చిలాత' శబ్దం కిరాత శబ్దభవం) ఈ ధ్వనిపరిణామం మధ్యాంధ్రదే శంలో మొదలయిందని బూదరాజు రాధాకృష్ణ నిరూపణ. తాలవ్యీకరణ పొందని 'కేసిన' వంటి రూపాలు క్రీస్తుశకం 8వ శతాబ్దంలోకూడా క్వాచిత్కంగా కనిపించినా ధ్వనిపరి ణామం పూర్తయిందనటానికి సందేహం లేదన్న కోరాడ వారి అభిప్రాయం సమర్థనీయమే. పదాది శ, శకారాలు రేఫ శకట రేఫలూ, పదాది సంయుక్తాక్షరాలూ, క్రీ.శ. 200 నాటికే తెలుగులో వర్ణవ్యత్యయం, ఊనికమార్పులవల్ల ఏర్పడ్డాయన్న కోరాడవారి నిరూపణకూడ సమంజసమే.

తమనాటికి అందుబాటులో లేని ఆధారాలను, పరిశోధనా పద్ధతులను పాటించలేదని ఎవరినీ విమర్శించటం న్యాయం కాదు. తమకు తెలిసిన విషయాలను నిష్పాక్షికంగా శాస్త్రదృ ష్టితో పరిశీలించారా లేదా అన్నదే ప్రశ్న. చారిత్రక తులనాత్మక పద్ధతులు పరస్పరాధారాలు. వీటిని దేనికదిగా విడివిడిగా పాటించటం నలభైయేళ్లక్రితం ఆనవాయి తీకాదు. తెలుగు ద్రవిడభాషా కుటుంబానికి చెందిందని నిరూపించటం ప్రథమ కర్తవ్యంగా ఉన్నకాలంలో కోరాడ రామకృష్ణయ్యగారు చేసిన పరిశ్రమ శ్లాఘనీయం. వర్ణనాత్మక వ్యాకరణ నిర్మాణ పద్ధతులు అప్పటికి వ్యాప్తిలోకి రాలేదు. 5వ శతాబ్ది భాషకు వర్ణనాత్మక వ్యాకరణం రాసి, అలా భిన్న కాలాల వర్ణనలను పోల్చి చారిత్రక వ్యాకరణం రాసేవిధానం అప్పటికి ఆచరణలో లేదు. ఈ వాస్తవాన్ని గుర్తించినప్పుడు కోరాడవారు చేసిన భాషా సేవను ప్రశంసిం చక తప్పదు. కాలంతోబాటు విస్తరించే ఆధారాలు, వ్యాప్తికి వచ్చే పరిశోధనా విధానాలు పూర్వకాలికులకుగాక భావితరాల వారికి ఉపాదేయాలవుతాయి. ఇప్పుడు తులనాత్మక చారిత్రక పద్ధతుల్లో భాషాశాస్త్రజ్ఞుల్లో కొందరికి మాత్రమే ప్రవేశ ముంది. చాలామంది వర్ణనాత్మక విధానాలను, సామాజిక భాషా పరిశీలనలను, పరివర్తన వ్యాకరణాలను అభిమానిస్తున్న రోజుల్లో ఇంతవరకూ వచ్చిన పరిశోధనలే ముందుతరాలవా రికి ఆదర్శప్రాయాలుగ ఉంటాయి. అందువల్ల 1950 ప్రాంతంలో ప్రాఙ్నన్నయ యుగాంధ్రభాషా లక్షణాలను గురించీ, చరిత్రను గురించీ కోరాడ రామకృష్ణయ్యగారు చేసిన పరిశోధనలూ రాసిన గ్రంథాలూ నేటికీ గౌరవస్థానం లోనే ఉన్నాయి. అది వారి విశిష్టతకు చిహ్నం.

# భాష పుట్టుక

శ్రీ విశ్వనాథ అచ్యుత దేవరాయలు

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, దేశభాషలకు, అందు ప్రత్యేకముగా తెలుగు భాషకు చేసిన సేవ అపారమని, తెలుగునాట అందరకు తెలిసినదే. అట్టి పండితుని శతసంవత్సరోత్సవ సందర్భమైన సంచికకు వ్యాసము భాషావిషయకమై ఉండుట సమంజసము కదా! అందువలన ఈ వ్యాసము భాషల పుట్టుకను గురించి.

భాష అచ్చముగా నది వంటిది. మబ్బులు క్రమ్మి, కనపడని కొండ ప్రదేశములవంటి, తెలియని భూతకాలమున పుట్టి, సముద్రము వంటి అంతము లేని భవిష్యత్కాలమున అంతమగుచున్నది. ఈ రీతిని, పూర్వ మెన్నియో బాసలు పు ~వి; అంతరించినవి. ఈ భూమి యందు ద్వీపములు పు ~వి; అంతరించినవి. ఈ భూమియందు ద్వీపములు పు అంతరించుచుండగా, భాషలు పుట్టి అంతరించుటలో ఆ ్చర్యము లేదు. భాషాశాస్త్రజ్ఞులు ప్రస్తుతము సుమారు 3000 భాష లున్నవని చెప్పుచున్నారు. ఇవిగాక, వ్రాత, వ్యాకరణము లేని వట్టి నోటిమాటలైనవి, ప్రాంతీయములైనవి మరి ఎన్ని ఉన్నవో తెలియదు. మారుచున్న ప్రపంచ చరిత్ర చూచినచో, భాషలు ఎట్లు మాయమగునో, కొంతవరకు అవగాహన మగును. సుమేరియన్ భాష, పురాతన ఈజిప్టు దేశ మందలి భాష, హిటైట్ భాష, గాథిక్ భాషలను మాటాడు వారు ఇప్పుడు లేరు.

భాష పుట్టిననాటినుండి సాంఘిక, రాజకీయ, దేశకాల పరిస్థితులనిన ఎత్తు పల్లములకు దారి మార్చుకొనుచు ముందుకు ప్రవహించుచునే ఉండును. మధ్యకాలములందు, ఇతర భాషా ప్రభావములనిన ఉపనదులను కలుపు కొనుచు, ముందుకు సాగును. ఆ భాషను మాటాడు వారు సమర్థులైనచో ప్రవాహము దూరదేశముల వరకు సాగి, పాయలు గట్టి, క్రొత్త లంకలను కల్పించు కొనుట మనము చూచు చుంటిమి గదా!

ఈ విధముగా భాషా ప్రవాహమును తెలిసి కొనుచు, వెనుకకు పోయినచో, (ముందుకు పోలేము గదా!) గంగోత్రి, యమునోత్రి వంటివి పుట్టిన చోటికి పోవచ్చును. కాని అచ్చటకు పోయినను, ఎట్లుపుట్టినదో తెలియదు. పాశ్చాత్య ..జ్ఞాన సర్వస్వముల నెన్ని తిరుగ వేసినను, ఎట్లు పుట్టినదో - దాని వివరణ ముండదు.

ధ్వని పుట్ట వలెననినచో, ఆకాశము ఉండవలెను (space). అందు వాయు వుండ వలెను. ఆ వాయువు ఉన్న చోట కదలిక వలన, కంపము వలన శబ్ద ముద్భవించునని ఫిజిక్స్ చదివిన మన అందరకు తెలిసిన విషయమే. ఆకాశమునందు ఉరుము ఉరిమినపుడుగాని, అడవిలో పులి గాండ్రించినపుడు గాని, మన గదిలో రేడియో, టెలివిజన్ సెట్టులు పలికినపుడు గాని, వాయువు నందు కలిగిన కదలికయే ధ్వని పుట్టుటకు కారణము కదా! కనుక వాయు కణములను కదిపి ధ్వనిని కల్పించుశక్తి ఈ సృష్టి యందంతయు నిండియున్నది. ధ్వని, శబ్దము, వాక్కు - ఈ మూడును పుట్టు కారణము ఒక్కటియే యగుట వలన ''వాగ్వై వాయుః'' అని వేదవాక్కు.[1]

మన నోటినుండి గూడ ధ్వని పుట్టుచున్నది గదా! కోపము వచ్చినపుడు అరుపు, దుఃఖము వచ్చినపుడు గాద్గద్యము, ఆనందము నందు హసనము - మనము చేయు ధ్వనులు. వాటికి ప్రతిరూపములైన ధ్వనులను మనము వినినపుడు కూడ, ఆ ధ్వనుల వెనుక ఆ భావములున్నవని తెలియుచున్నది. సముద్ర ఘోషగంభీరభావమును, కోకిల స్వనము మధుర భావమును కలిగించుచున్నవి. కొండ గుహలోన ఆకలితో వేచి ఉన్న పులి పిల్లలకు, దూరమునుండి వినవచ్చిన తల్లిఅరుపులో, తల్లి వచ్చుచున్నదని తెలియుచున్నది. ఆ తల్లి ఆహారము కొని తెచ్చు ఉత్సాహముతో అరచిన అరుపు వేరు. ఆహారము దొరకక, వట్టి చేతులతో నిరాశగా అరచిన అరుపు వేరు. ఆహారము తీసికొనిరాని వేళల, పిల్లలు బయటకు రావు. మృగముల ధ్వనులలోని భేదములు వేటకాండ్రకు తెలియును. మన దేశమునందు జిమ్ కార్బెట్ అని ఒక ప్రసిద్ధమైన వేట కాదుండెడి వాడు. ఆయన అచ్చముగా ఆడపులి వలె అరచి, మగ పులిని పొదలలోనుండి బయటకు తెచ్చెడి వాడు. కనుక ధ్వని వెంట, భావము, అర్థములు ఉన్నవి వట్టి ధ్వనికి గాని, అక్షరములతో గూడిన మాటకుగాని అర్థముండి తీరుట

వలననే మన శాస్త్రముల యందు శబ్దార్థ సంబంధము నిత్యమనివారు. ''.... సంబద్ధౌ హి శబ్దార్థౌ వాచ్యవాచకత్వేన నిత్యమితి'' అని నిరుక్త శాస్త్రము.

అక్షరములు లేని ధ్వనియందు మనోభావములును, శరీర స్థితిని స్థూలముగా చెప్పగలిగిన శక్తి ఉన్నది గాని, సృష్టిలోని అనంతములైన వస్తువులను ఎత్తి చూపి, వస్తువుల యొక్క జ్ఞానమును వేరువేరుగా తెలుపగల శక్తి లేదు. కావుననే, స్థూల, సూక్ష్మ దేహావసరములను తీర్చగలిగిన ధ్వనిని మాత్రమే సృష్టించగలిగిన శక్తి పశు పక్ష్యాదుల కున్నది. జ్ఞాన దేహావసరములను తీర్చగలిగిన అక్షరోత్పాదన శక్తి మానవునిది. ధ్వనిని గాని, అక్షరములను గాని సృజించు శక్తి ప్రాణశక్తి. ''తస్యా (వాచః) ఉ ప్రాణ ఏ వ రసః'' అని జైమినీ యోపని షద్బ్రాహ్మణము[2].

అక్షరములు ఎట్లు సృజింప బడుచున్నవి? శబ్దము, ఆకాశము (వ్యోమము) నందు పుట్టును గదా! ''ఋచో అక్షరే పరమే వ్యోమన్'' అని వేదవాక్కు[3]. వేదాక్షరములు పరమమైన (శ్రేష్ఠమైన) వ్యోమము నందు పుట్టినవి. మన శరీరము నందు ఆకాశము వ్యాప్తమై ఉన్నది గదా! అందు పరమమైన వ్యోమము మూలాధార చక్రము వద్దనుండి, స్వాధిష్ఠాన చక్రమును దాటి మణిపూరక చక్రము (నాభి వద్ద) వరకు వ్యాపించినట్టి ఆకాశము. ప్రధానముగా మూలాధార చక్ర ప్రాంతమున ఉన్న ప్రాణ శక్తి కదలును. వాక్కును పుట్టించు ఈ సంచలనమునకు వేదమిడిన పేరు ''సరస్వతి'' (Technical Word)

ఎప్పుడా ప్రాణశక్తి సరస్వతి రూపమున (వాక్కును ఉచ్చరించు ఇచ్ఛతో) కదలినదో, అప్పుడా కదలిక మనస్సును కదుపును. మనస్సు ఉచ్చారణ కార్యక్రమ మారంభించును. శుక్లయజుర్వేద బ్రాహ్మణమైన శతపథ బ్రాహ్మణము దీనిని వివరించినది: ''మనోహి సరస్వాన్; వాక్ సరస్వతీ; ఏతౌ సారస్వతౌ ఉత్సౌ[4]''. బ్రాహ్మణము నందలి మొదటి వాక్యము - మనస్సు 'సర స్వాన' మగునని. మనస్సు మెదడునకు చెప్పుట, ఆ మెదడునుండి ఆజ్ఞలు నాభిప్రాంతము నందున్న కండరములను చేరుట, వాటి సంకోచ వ్యాకోచముల వలన ఊపిరితిత్తులకు పొట్టకు మధ్యనున్న వప (Diaphragm) కదలుట, ఊపిరి తిత్తుల లోని వాయువు కంఠనాళమును (Larynx) ఊదుటలు, వరుసగా జరుగుననిన విషయమందరకు తెలిసినదే. అప్పుడు సరస్వతి వాక్కుగా ఆవిర్భవించునని బ్రాహ్మణము నందలి ౨-డవ వాక్యము. (వాక్ సరస్వతీ).

నాభి వద్ద వాయువు కదలి నప్పటినుండి, అక్షరము వెలికి వచ్చు వరకు జరుగు వ్యాపారము మన శిక్ష శాస్త్రము నందు వివరింపబడినది. ఈ కాలము నందు పాశ్చాత్య దేశములందు ఉచ్చారణను గురించి తీవ్రమైన పరిశోధనలు జరుగు చున్నవి.[5] భౌతిక శరీరమునందు కలుగు ఈ వ్యాపారమును అట్టి పాశ్చాత్య గ్రంథముల యందు కూడ చూడ వచ్చును.

నాభి వద్ద నుండి బయలు దేరిన కదలిక, ఊపిరి తిత్తులందున్న వాయువును కంఠనాళమునందు ధ్వనింప జేయును. ఈ ధ్వని సన్నగా (మందముగా) నుండును.[6] ఆ సన్నని ధ్వని వదన గహ్వరములయందు (నోరు, నాసిక, శిరోభాగములయందు) కంపనము (Resonance) వలన పెద్దదై బయటకు వినవచ్చుచున్నది. ఆ గహ్వరము (Cavity) యొక్క ఆకారము, పెదిమలు, నాలిక, దవడలు కదుపుట చేత వేరువేరు గొట్టములుగా మారి అచ్చులు (అ ఆ ఇ ఈ...) పుట్టు చున్నవి. హల్లులు (క, ఖ ....) నాలిక వదన గహ్వరము భిన్న స్థానములను తాకుట చేత, పెదిమల కలయిక చేత పుట్టు చున్నవి. అక్షరములను, ఉచ్చరింప కుండ, మనసులో అనుకొనినచో, ఈ అక్షరములు పుట్టు చోటులు ఎచ్చటెచ్చట నున్నవో మనకు మనకే తెలియును. ప్రాణాక్షరములు కంఠబిలోద్భవములు. హల్లులకు వదన గహ్వరము జన్మస్థానము.

మనము పుట్టుటకు ముందే మన ముచ్చరించు అక్షర స్థానములు, అక్షర స్వరములు నిర్ణయింప బడినవి[7] కాని అన్ని స్వరములను అన్ని భాషల వారు ఉపయోగించుటలేదు. అందువలన ఏ భాష వర్ణముల (Alphabet) సంఖ్య ఆ భాషదే.[8] ప్రపంచమునందున్న ఏ భాషలో నైనను మొత్తము అక్షరములు 100కు మించి లేవు. అచ్చులు 30 లోపు. అనగా ఇంతకు మించి అక్షరములను ఉచ్చరించు శక్తి మానవునకు లేదు. ఇది వరకెన్ని భాషలు పుట్టినను, ముందెన్ని భాషలు పుట్ట బోయినను ఈ అక్షర సముదాయ పరిమితిలోననే ఉండును.

సృష్టికారణమైన మహా చైతన్యమును వేదము బ్రహ్మమ నును. ఆ బ్రహ్మమునకు మూడు ప్రధాన లక్షణము లున్నవి. ఒకటి జ్ఞానము, తెలివి (Consciousness) . రెండవది ప్రాణము. మూడవది శబ్దము. ఆ జ్ఞాన మీ అక్షరములను కలపి మాటలు, మాటలను కలపి వాక్యములు చేయును. వాక్యము లగుటకు మాటలకు వలసిన ప్రత్యయాదులు - వాక్యపు కూర్పు కొరకైన వ్యాకరణము - ఒకదాని వెంట నొకటిగా - ప్రవహించును. సరస్వతీ ప్రవాహ మారంభించి నది

''ఏతా సారస్వతా ఉత్సా.'' వాక్కు మనస్సులు కలిసి సారస్వతమయిన ప్రవాహము (ఉత్సము) అగును. వేద మచ్చట ''ఉత్స'' శబ్దమును పరమరమణీయముగ, మహార్థ వంతముగా వాడినది. ఉత్సము ఊటబావి; కొండ సెల యేరు. ఎక్కడ నుంచి వచ్చుచున్నదో, ఊరు చున్నదో తెలియదు. బిందువు తరువాత బిందువుగా నీరు వచ్చుచునే ఉండును. ఆలోచించిన కొలది మనస్సు నుండి భావము వెనుక భావము, మాట తరువాత మాట, వాక్యసరణి పోవుచునే ఉండును. సారస్వతమైన మనస్సు ఊట బావి.

ప్రాణలక్షణమైన బ్రహ్మము పశుపక్ష్యాదులుగా, అనేకము లైన మానవ జాతులుగా ప్రళయాంతము వరకు పుట్టుచునే ఉండును. శబ్ద బ్రహ్మము, మేఘ స్వానముగా, జలపాత ధ్వానముగా, కోకిల కూతగా, సింహ గర్జనముగా, ప్రియు రాలి మాటగా, వీణా నిక్వాణముగా, అనేకమైన జాతులతో పుట్టి, వారితో నంతరించు భాషలుగా నిత్యమై భాసిల్లు చుండును.

## సూచికలు

1. తైత్తిరీయ బ్రాహ్మణము 1-8-8-1: తాండ్ర బ్రాహ్మణము 18-8-7.
2. జైమినీయోపనిషద్బ్రాహ్మణము 1-1-7.
3. ఋగ్వేదము 1-164-39; అధర్వణ వేదము 9-10-18.
4. శత పథ బ్రాహ్మణము 7-5-1-31.
5. శిక్షా శాస్త్రము మనదేశమునందు పుట్టినను, మనము దానిని గూర్చి పట్టించు కొనుచున్నట్లు కనపడుటలేదు. పాశ్చాత్య దేశములయందు గత 50 సంవత్సరములలో చాల పరిశోధన జరిగినది. వాక్కును గూర్చి వందల కొలది పత్రికలు, వేల కొలది పుస్తకములున్నవి. ఆ శాస్త్రమునందు ఇష్టముండి చదవదలచినవారికొరకు కొన్ని పేర్లు: JOURNAL OF THE ACOUSTIC SOCIETY OF AMERICA, SOUTHERN SPEECH

Drama Book Specialists, New York 1976
6. ...స్థం జనయతి స్వరమ్'' పాణినీయ శిక్ష 2-7.
7. అందువలననే పాణిని శిక్షా శాస్త్రమునందు వర్ణములను స్వయం ప్రోక్తములు, స్వయంభువము లనినాడు.

''త్రిషష్టి శ్చతుష్షష్టిర్వా వర్ణా స్సమ్భవతో మతాః,
ప్రాకృతే సంస్కృతే చాపి స్వయంప్రోక్తా స్స్వయమ్భువా.''

– పాణినీయ శిక్ష 1-3.

8. వివిధ భాషలలో వర్ణముల పట్టిక. (ఇది పాశ్చాత్య భాషాశాస్త్రవేత్తల ననుసరించి. వర్ణముల సంఖ్యలో మత భేదములున్నవి. సంఖ్యలలో ఒకటి రెండు అటు నిటు కావచ్చును.)

| భాష | మొత్తము వర్ణముల సంఖ్య | హల్లులు | అచ్చులు |
|---|---|---|---|
| ఇంగ్లీషు | 26 | 21 | 5 |
| అరబ్బి | 28 | 25 | 3(?) |
| చైనా | 36 | 28 | 8(?) |
| స్లావిక్ భాషలు | 32 | 25 | 7 |
| ఎస్కిమో | 48 | 45 | 3 |
| షిరోకీ | 85 | 80 | 5 |
| ఐరిష్ | 18 | 15 | 3 |
| జర్మన్ | 31 | 33 | 8 |
| గ్రీకు | 24 | 10 | 6 |
| హీబ్రూ | 34 | 32 | 2 |
| జపాన్ | 76 | 70 | 6 |
| సంస్కృతము | 48 | 34 | 14 |
| థై | 65 | 38 | 27 |
| టిబెటన్ | 38 | 31 | 7 |

సామ్నైవ కార్య సిద్ధిః సౌజన్యా త్కీర్తిః ఈర్ష్యయా రోషః।
ప్రియ వచనేన ప్రియతా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

మంచి మాటలతో కార్యసిద్ధిలాగ, సౌజన్యంవల్ల కీర్తిలాగ, ఈర్ష్యతో రోషంలాగ, ఇష్టమైన మాటలతో ప్రీతిలాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీదేహ కాంతి వెలుగొందుతున్నది.

— 'ఉపమావళి' నుండి

# తిక్కన పదప్రయోగకోశం

శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి

పదప్రయోగకోశాలవల్ల ప్రయోజనా లేమిటని చాలామంది ప్రశ్నిస్తారు. ఈ ప్రయోజనాలను నన్నయ పద ప్రయోగకోశం 'తొలిపలుకు' లో శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు రేఖామాత్రంగా పేర్కొన్నారు. ఈ సంపుటం ఆధారంగా ఆ ప్రయోజనాలను మరింత వివరించి చూపటమే ఈ రచనలో ఉద్దేశం.

తెలుగు భాషాచరిత్ర రాయటానికి కావ్యభాషలోను శాసనభాషలోను వచ్చిన పరిణామక్రమాన్ని గుర్తించాలి. తెలుగుకు సమగ్రభాషాచరిత్ర లేకపోవటానికి పదప్రయోగకోశాలు, శాసనపదకోశాలు మొన్న మొన్నటివరకు లేక పోవటమే కారణం.

ప్రతిమాటకూ విలక్షణమైన చరిత్ర ఉంటుంది. నామ క్రియావిభక్తుల స్వరూపమూ, అర్థమూ కాలక్రమాన మారు తుంటాయి. ఉదా. నన్నయగారి వాడుకలో 'వలయు' ప్రధానక్రియగాగూడా కనిపిస్తుంది. కాని ఎక్కువ ప్రయోగాల్లో మరో క్రియ నుజ్యంతరూపానికి పరంగా 'వలయు' వస్తుంది. 'సాధు రక్షవలయు జేయ' ఆర-1-30. అంతేగాక 'వలయు' చతుర్థీవిభక్తితో కూడిన నామాన్ని ఆకాంక్షిస్తుంది: 'నాకు సహింప వలయు' ఆది-5-21, 'పరిహరింప వలయును మనకున్' ఆది-3-128. ఎక్కడన్నా ప్రథమలో కర్తృపదం రావటం కద్దు: 'నీవ దీనిం జేయవలయు' ఆది-6-140. ఇలాటి నన్నయ్య వాడుకలో రెండు మార్పులు వచ్చాయి: (1) 'వలయు' ఎక్కువగా అన్నంత క్రియ తరవాతే రావటంవల్ల దాంతో కలిసిపోయి ప్రత్యయమాత్రమైంది; వలయు (న్) ⟶ వలెన్ ⟶ వాలె/వాలి,-ఆలె/-ఆలి. (2)చతుర్థ్యంత నామాకాంక్ష భాషలో పోయి ప్రథమావిభక్తి నామమే కర్తృపదంగా నిలవటం: 'నేను సహించాలి' కాని 'నాకు సహించాలి' కాదు. ఈ మార్పుల్లో రెండోది తిక్కనగారి వాడుకలో తరచుగా కనిపిస్తుంది. 'వలయు', 'వలె, వాలె' లుగా ఎప్పుడు మారింది ఇంకా మనకు తెలియదు. పదప్రయోగకోశాలు ఇలాటి పరిశోధనకు సామగ్రి నిస్తాయి.

## రూపాంతరాలు

కావ్యభాషలో ఇప్పటికన్నా చాలాపదాలకు రూప వైవిధ్యం కనిపిస్తుంది. ఒక పదానికి రూపాంతరాలు మూడు కారణాల వల్ల ఏర్పడ్డవై ఉంటాయి. (1) చారిత్రకంగా పూర్వ రూపాలు కొన్ని, అర్వాచీన రూపాలు కొని , ఉదా: ఎవ్వాడు, ఎవ్వడు. (2) కవికి సమకాలంలో భిన్న ' ంతాల, ప్రజల వాడుకలో ఏర్పడ్డ ఉచ్చారణ భేదాలు, (3 సంఘంలో ఉన్న ఎక్కువ తక్కువలనుబట్టి ఏర్పడ్డ వర్గ మాండలికాలు.

ఆకసము, సంతసము, కత మొ.వి. పామరజనుల వాడుక నుంచి కావ్యభాషలోకి జొరబడి ఉంటాయి ఇవన్నీ అనియతంగా కలగాపులగంగా కావ్యభాషలో కనిపిస్తాయి. అవి మోతుబరి కవులు వాడితే సాధువులని వ్యాకర్తలన్నారు. కాస్త సన్న కారువాళ్ళు వాడితే అసాధువులన్నారు. 'లోకోక్తీనాం భవేద్యోగో, యదిసా ప్ర్భుతిరంజనమ్' (వికృతి వివేకం, అజం. 82) 'చెవికింపు'గా ఉండటం శోత్రాశ్రయధర్మం గాని భాషాశ్రయధర్మం గాదు. భాషలో సహజపరిణామంలో వచ్చిన రూపాంతరాల మొత్తాన్ని కవులు వాడుకొన్నా, తరుచుదనాన్నిబట్టి కవిసమకాలీన రూపం ఏదో, ఛందస్సుకు సరిపడటానికి వాడుకొన్న దేదో ఊహించవచ్చు. మరీ విరళంగా ఉండి అర్వాచీనకాలంలో ఏర్పడ్డది పూర్వకవుల వాడుకలో ఉంటే ప్రక్షిప్తరూపంగా గుర్తించవచ్చు.

తిక్కన భాషలో రూపాంతరాలు కోకొల్లలుగా కనిపిస్తాయి. స్థూలంగా తనకు పూర్వమున్న సాహిత్యంలో స్థిరపడ్డ రూపాలను తీసుకొంటూ సమకాలీన మాండలిక రూపాలను గూడా విస్తృతంగా వాడుకొన్నట్టు కనిపిస్తుంది. కొన్ని మచ్చుకు:

1. సంఖ్యకు పూరణార్థంలో వచ్చేది చారిత్రకంగా 'అగు'. ఇది కాలక్రమాన అవు ⟶ అవ ⟶ ఓ గా మారింది. మూడగు ⟶ మూఁడవు ⟶ మూఁడవ ⟶ మూడో నన్నయ్యగారి వాడుకలో 'అగు' తరచుగా వస్తుంది; '-అవ' ఉన్నా వెల్లైన ప్రయోగాలు లేవు. ఇది 'అవు' కావచ్చు. తిక్కనలో '-అగు' చాలా విరళం;

'-అవ' చాలా బహుళం. నిజంగా నన్నయ కాలానికే '- ఓ' గూడా వచ్చింది: 'మూండో నడవున' (క్రీ.శ. 1108; చూ. కుందూరి ఈశ్వరదత్తు, శాసన శబ్దకోశము; ఓ అనే ఆరోపం కింద). బహుశా జనసామాన్యంలో ఉన్న ఓ ప్రత్యయం గ్రామ్యమని తత్పూర్వరూపాలన్నిటినీ కవులు వాడారు. చదువుకొన్నవాళ్ళు బహుశా '-అవ' అని గూడా ఉచ్చరిస్తూ ఉండవచ్చు. నన్నయగారికి ముందున్న సాహిత్యంలో '-అగు' ఉంటే దాన్ని వాడుతూ తన కాలంలో వచ్చిన 'అవు, అవ' రూపాలుగూడా అక్కడక్కడా వాడుకొన్నాడు. తిక్కనలో 'అవు' కనిపించదు. ఆనాటి శిష్టభాషలో ఉన్న '-అవ' రూపమే ప్రచురంగా వాడినట్టు తోస్తుంది.

2. వురు ⟶ గురు, సంఖ్యావాచకాలకు మహదర్థంలో చేరే ప్రత్యయం. - వురు మూలరూపం, - గురు దాని పరిణామరూపం. (తమిళం: - వర్, కన్నడం: - వర్/- బర్.) తిక్కనలో ఏడ్వురు (10 ప్రయోగాలు), ఏవురు (80) కనిపిస్తాయి. ఏడ్గురు, ఏడుగురు అసలు లేవు. ఏగురు - ఒక ప్రయోగం (ద్రో-5-177) ప్రక్షిప్తం కావచ్చు. నన్నయ్యలో ఏవురు (63), ఏగురు (2), ఏడ్వురు (6) కనిపిస్తాయి. 'ఏడ్గురు' లేదు. ఇక్కడ గూడా ఏగురు ప్రక్షిప్తరూపమై ఉండాలి. ఈ విధంగా తరచుదనాన్ని = బట్టి కవి ఉద్దేశించిన రూపమేదో, ప్రక్షిప్తరూపమేదో నిరూపించటానికి పదప్రయోగ కోశాలు వినియోగిస్తాయి.

3. ఆరయు, అరయు.

4. అప్పుడు, అపుడు, అప్డు (చివరి రెండు రూపాలూ ప్రాచీన మాండలికాలని తోస్తుంది. వీటికి విభక్తి ప్రత్యయాలు చేరవు: 'అపటికి, అప్టికి' లాగా.)

5. ఆతఁడు, అతడు; ఈతఁడు, ఇతఁడు.

6. అక్కట, అకట

7. ఆచోటు, అచ్చోటు, అచ్చొటు, అచ్చటు, అచటు. (సప్తమ్యంత రూపమే తరవాత ప్రాతిపదిక అయింది; అచ్చట: తిక్కనలో 'అచ్చటన్, అచటన్' రూపాలు ఎక్కువగా ఉన్నాయి.)

8. 'అక్కటాదులగణంలో అమ్మ, అక్క, అప్ప, అయ్య, అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని' చిన్నయసూరి చేర్చటం పొరపాటనిపిస్తుంది. (ప్రకీర్ణ - 8) 'అమ, అక, అని, ఇని' లాటివి కవిత్రయ ప్రయోగాల్లో లేవు. ఆయమ, ఈయమ, ఆయన, ఈయన అనే చోట్ల వృత్తిలోనే జడ్డకు లోపం.

9. ఇంక, ఇఁక - ఇవి రూపాంతరాలయినా అర్థభేదం ఏర్పడ్డది. 'ఇంకను' అనవచ్చునుగాని 'ఇఁకను అని తిక్కనలో ప్రయోగాలు లేవు. నేటి వాడుకలోనూ ఈ అర్థభేదం నిల్చిఉంది: ఇంకా రాలేదు, ఇకరాడు; ఇంకా చెప్పు, ఇకచెప్పు.

10. అట్టులు, అటులు, అట్లు: ఇట్టులు, ఇటులు, ఇట్లు; ఎట్టులు, ఏటులు, ఎట్లు (అట్లు, మొ.వి చాలా తరచుగా వస్తాయి).

11. ఈయకొను, ఇయ్యకొను.

12. ఎడ్డ, ఎడ.

13. ఏది, ఎద్ది, ఎది; ఏవి, ఎవ్వి, ఎవి.

14. ఏవాఁడు, ఎవ్వాఁడు, ఎవఁడు, ఎవ్వఁడు (చివరి రూపం తిక్కనలో విరళం; ఎవ్వఁడు చాలాతరచు (ఎవ్వాఁడు యత్తదర్థక సంబంధంలోను, ఎవ్వఁడు ప్రశ్నార్థకంగాను ప్రచురంగా వస్తున్నట్టనిపిస్తుంది).

15. ఎమ్ము, ఎముక.

16. ఎమ్మెయి, ఎమ్మై : అలానే అమ్మెయి మొ వి. 'ఆమెయి' లాటి పూర్వ రూపాలు చాలాకొద్ది.

17. ఎఱఁగి, ఎరఁగి (-ఱ-కారరూపం ప్రాచీనం, కాని తిక్కన కాలానికి సాధు శకట రేఫాలభేదం పోయిందని టానికి ఇవి తార్కాణం: ప్రాసస్థానాల్లోనూ ఈ తేడా కనిపిస్తుంది.)

18. ఎరియు, ఎఱియు (సాధురేఫ ప్రాచీనం).

19. ఎఱ్ఱ, ఎఱ (అద్విరుక్త రూపం ప్రాచీనం)

20. ఏమి, ఏమిటి.

21. ఒక్క, ఒక.

22. ఒరఁగు, ఒఱఁగు (శకటరేఫమే ప్రాచీనం).

23. ఒరుఁడు, ఒరువుఁడు (తమిళం: ఒరువన్, ప్రాచీన ద్రావిడ రూపం * ఒరువన్తు)

24. ఏను, ఐదు-వీటి చరిత్ర మరీ విచిత్రమైనది. ప్రాచీన దక్షిణ ద్రావిడరూపం *అయ్న్దు; మూలధాతువు *అయ్మ్; అమహత్ప్రత్యయం'దు' (< తు) తమిళ

మలయాళాల్లో ⟶ అయ్న్డు ⟶ అయ్‌న్జు ⟶ అంజుగా మారింది. కన్నడంలో అనునాసిక లోపం వచ్చి 'అయ్దు' అయింది. 'ఐదు' ప్రాచీన సాహిత్యంలో ఉంటే 'ఇదు, అయిఁదు'గా ఉండాలి. ఎక్కడా అనుస్వారం పాడ గనిపించదు. ప్రాచీనద్రా. *అయ్- తెలుగులో ఏ/ఐ లుగా కనిపిస్తుంది: చేయి/కై-, మేను/మై, మెయి/మై, ఏఁబది/ఐదు, వేయు/వై-చు ఇలాటివి. *అయ్‌మ్ తెలుగులో ఏనుగామారింది; * అయ్-వర్ (మహత్ప్రత్యయం: వర్) ఏవురు అవుతుంది.

నన్నయ వాడుకలో 'అయిదు' లేదు; 'ఐదు' 4 చోట్ల వచ్చింది; 'ఏను'కు-24 ప్రయోగాలు. తిక్కనలో ఏను (8), ఐదు (75), అయిదు (16). - దు స్థానంలో - వురు వస్తుంది, 'ఏవురు' అని. ఐదుగురు చాలా అర్వాచీనం. నన్నయ పద ప్రయోగకోశంలో ఉన్న ఐదుగురు (ఆర-3-139) తప్పనిసరిగా ప్రక్షిప్తరూపం. అయితే అర సున్నా ఏమయింది? సామాన్య జనవ్యవహారంలో అనునాసిక్యం పోయిం తరవాతే సాహిత్య కారులు 'ఐదు' శబ్దాన్ని కావ్యభాషలో ప్రవేశపెట్టి ఉండాలి. 'ఏను' వ్యస్తరూపం వాడుక క్రమంగా పోయి సమాసాల్లో నిల్చింది: ఏఁబది, ఏఁభై, మొ॥

ఈ విధంగా తులనాత్మక పరిశోధనకు, భాషా చరిత్ర నిర్మాణానికి, పాఠపాఠ నిర్ణయానికి, భాషాపరిణామశీలం అర్థం చేసుకోటానికి పదప్రయోగకోశాలు మౌలిక సామగ్రి.

## సమాసాలు, పలుకుబళ్ళు

'పదముల పొందు', 'పాతబడ్డ మాటల'తోనైనా కొత్త పదబంధాలు సృష్టించటం, సంస్కృతంలోనే చెప్పటానికి సాధ్యమౌతా యనిపించే ఉదాత్తభావాలను గూడా 'అలఁతి యలఁతి మాటల'తో 'కాహలసంధించినట్టు' చెప్పటం తిక్కనగారి కవితాశిల్పం (conscious craftsmanship)లో ముఖ్య ప్రక్రియలు. తిక్కన పదాలకూర్పులో తెలుగువారు కొత్త మాటలు సృష్టించుకొనే తీరు తెన్నులు ప్రతిబింబిస్తాయి. అచ్చ తెలుగు కావ్యాల రచయితలు కల్పించిన 'కడలి మొలనూలి చేడియ కనిన పడుచు' లాంటి దీర్ఘసమాసాలు తెలుగులో అతకవు. తిక్కన పదబంధాలు మామూలుగా రెండు మూడు మాటలతో కూర్చినవి.

పొడి మాటలు అంకెల లాంటివి; పదబంధాలు సంఖ్యల లాంటివి. అంకెలను, స్థానాన్ని బట్టి వాటి విలువలను, కలిపే తీరును మనం గుర్తుపెట్టుకోవాలి గాని సంఖ్యలను గుర్తు పెట్టుకోనక్కరలేదు. ఏ కొత్త సంఖ్యనైనా మనం సృష్టించగలం. అలానే భాషలో పొడి మాటలు నేర్చుకొంటేనే గాని రావు. వాటి కలయికతో పదబంధాలు [illegible] తీర్లు మనకు భాషాజ్ఞానగతంగా అలవడుతాయి. [illegible]తి కొత్త సమాసాన్నీ మనం గుర్తుపెట్టుకోము. 'మట్టి బొ[illegible]' అంటే 'మట్టితో చేసిన బొమ్మ'. 'మట్టి', 'బొమ్మ' అనే మాటలు నేర్చుకోవాలి: ఆ రెండూ ఆ వరసలో కలిస్తే వాటి మధ్య 'తో చేసిన/చేసే' అనే సంబంధం గతార్థమౌతుంది. ఈ నియమం తెలుగు వచ్చిన వాళ్ళందరికీ వారికి తెలియకుండా ప్రవర్తించే సమాస సూత్రం. దాన్నిబట్టి 'గాజుసీసా, వెండి కంచం, స్టీలుకుర్చీ' లాటి పదబంధాలు అంతకుముందు భాషలో విననివి కూడా సృష్టించుకొంటారు. ప్రతి భాషకూ విలక్షణంగా ఈ సృజనాత్మకశక్తి ఉంటుంది. 'రాముడు కత్తితో కొట్టాడు' అనే వాక్యాన్ని నామపదబంధంగా మారిస్తే 'రాముడు కొట్టిన కత్తి' అనవచ్చు; కాని 'రాముడు సీతతో వెళ్ళాడు' అన్న వాక్యాన్ని 'రాముడు వెళ్ళిన సీత' అని సంక్షేపించటానికి వీల్లేదు. దీనికి మన భాషాజ్ఞానంలో ఒక నియమం ఉంది. ఉపకరణార్థంలో ధాతుజ విశేషణం విశేష్యంతో సమసిస్తుంది గాని సహార్థంలో సమసించదు. ఇలాటి వ్యాకరణ రహస్యాలు మన సాంప్రదాయిక వైయాకరణులు పట్టించుకోలేదు. పదాల రూపనిష్పత్తితోనే మన వ్యాకరణాలు ఆగిపోతాయి.

తిక్కన పదబంధ నిర్మాణంలో ఉన్న ఈ సూత్రాలను గ్రహించి తెలుగు నుడికారానికి ముప్పురాకుండా 'పాతవడ్డ మాటలతో' తన 'నేర్పు చూపి' కొత్త సమాసాలు కూర్చి తెలుగులో ఉన్న సృజనాత్మక శక్తిని ప్రదర్శించాడు. మాట లెప్పుడూ పాతవే. మాటలను ఏ కవీ కొత్తగా సృష్టించలేదు. 'మాటల పొందిక'తో పదబంధాలు (భాషా నియమాల నతిక్రమించనంతవరకు) ఎన్నైనా కొత్తవి సృష్టించవచ్చు. తిక్కన 'ఇంపారెడు పల్కుల'ను ఏరుకొంటాడు. 'అప్పలు కుల్ సరిగ్రుచ్చునట్లుగాఁ జేరువనేరగావలయు' నన్నాడు. ఈ కింది మచ్చు పదబంధాల్లో ఈ నేర్పు స్వరూపం గమనించవచ్చు.

అరదంబుల యిఱుకటంబు
అమ్ములవాన
అవ్వెడందవాఁతి యమ్ము
అత్తొలితాఁకు
తమ్ముఁగుత్తులు
అందని ప్రాఁకులవండ్లు
అంపపాన్పు
అంప మూఁడమంచు
అరువుఁదెవులు = క్షయవ్యాధి

కన్నాకు = కంటిరెప్ప, రక్షణ (నుడికారం)
ఆలమందలు
ఆవులనేయి

(ఆవుపాలు = ఆవునుంచి తీసిన పాలు; ఆవునేయి = ఆవునుంచి తీసిననేయి కాదు. ఆవు పాలనుంచి తీసిననేయి. దీన్ని వైయాకరణులు ఏ సమాసం అంటారో!)

ఒక్కిండ్లవారలు
ఇంతలింతలు(ఇది సమాసమే అవాలి: కాని సమాన విభక్తికి లోపంరాలేదు: ఇంతలు+ఇంతలు)

ఇంతలంతలు-పనులు
ఇనుపగుండియకు
ఈగకాలియంతయేనియు
ఈ పెంటితనము
ఉల్లికుట్టుమాటలు

ఎండకన్ను వానకన్నెఱుగని (పురపురంధ్రులు) (ఎండన్, కన్నెఱుగని అంటే చాలదు; ఎండకన్ను వానకున్న ఏ సమాసాలౌతాయో! 'కన్ను' అంటే చూడటం, చూపు అని అర్థం చెప్పుకోవాలి: ఎండపొడా, వానపొడా ఎరుగని స్త్రీలు)

ఎడకత్తెరయు, వాలుకబెల్లము
(గాలి) కెత్తిన చావవోలె
ఎత్తినడుగులన్ = ప్రయాణానికి సిద్ధంగా.
ఎదురుచూచు (శబ్దపల్లవం)
ఎనమన్నూఱు (యథాప్రయోగంగా గ్రాహ్యం!)
ఎరగలిచిచ్చు
ఎఱకలిగాలి
ఏలినవాడు
ఒప్పనివారు

అమూర్తమైన భావాలకు మనకు చప్పున తెలుగు మాటలు తట్టవు: సుఖం, దుఃఖం, రాగం, ద్వేషం, ఉపాయం, అపాయం, ఆశ్చర్యం, సంకోచం, గర్వం, శౌర్యం, ధైర్యం మొ.వి. కాని తిక్కనకాలంలో జానపదుల వాడుకలో ఇలాటి వాటన్నిటికీ తెలుగుమాటలే ఉండేవి. తిక్కనగారి వాడుక చూస్తే దేశ్యశబ్దాలతో భావశబలత నెంతగా సాధించవచ్చో తెలుస్తుంది: అనువు, అలమట, అర, ఈను, ఉక్కు, ఉత్తలము, ఉబ్బు, ఉమ్మలిక, ఏడ్తెఱ, ఏపు, కొందలపాటు, చలము, చెలువు, తగవు, పెంపు, వగవు, వెరవు, వెఱంగు, వెఱపు మొ.వి. కుప్పతిప్పలు. ఇలాటివి ఇప్పటి వాడుకలో మృతమైపోయినాయి. వీటి అర్థచ్ఛాయలు తెలుసుకోవాలంటే సోదరభాషల్లో సజాతీయ శబ్దాల అర్థాలతో పోల్చి చూసుకొంటేగాని బాగా తెలియదు. తిక్కన పదసంఘటనలో ఒక్క పొల్లుమాటకూడా కనిపించదు. తిక్కన రచన 'శిల్పం'గాని, 'చిత్రలేఖనం' గాదు. ఎంత దగ్గరికిపోయి పరామర్శించి చూస్తే అన్ని నిర్మాణ విశేషాలు కనిపిస్తాయి.

## అర్థ నిర్ణయం

ఒక దేశ్యశబ్దానికి అర్థం నిర్ణయించాలంటే ఆ మాట వాడిన సమకాలీన ప్రయోగాలన్నిటినీ పరిశీలించి - ఆ సందర్భాలన్నిటికీ సరిపడే అర్థం చెప్పుకోటం ఒక పద్ధతి. సోదర భాషల్లో ఆ మాటకు తోబుట్టువులుంటే వాటి అర్థంతో పోల్చి మన భాషలో ఉన్న అర్థంతో అది ఎంత వరకు సరిపడుతుందో చూడటం రెండోపద్ధతి. అర్థ నిర్ణయంలోనూ అ విపరిణామాన్ని గుర్తించటంలోనూ, ఈ రెండు ప లూ వినియోగిస్తాయి. సోదర భాషలన్నిటికీ సరిపడ్డ అ ప్రాథమికమై ఉండాలి. ఒక్కోభాషకు విలక్షణమైన అర్థం దాని నుంచి వాడుకలో మార్పులవల్ల వచ్చిందై ఉండాలి. ఈ రకమైన కృషిలో ఒక కవి తన రచనలో వాడిన మాటకున్న ప్రయోగ సర్వస్వాన్ని ఒకచోటికి తెచ్చి చూపటానికి పద ప్రయోగ కోశాలు చాలా అవసరం. ఉదాహరణకు చూడండి:

'అట్ట=పి. కబంధము, మొండెము (కర్ణ 3-371)', అని సూర్యరాయాంధ్ర నిఘంటువు (సూ.ని), ఒకే ప్రయోగం ఇచ్చింది. కన్నడంలో 'అట్టె' దీనికి తోబుట్టువు. 'జీవశేషం ఉండి కదలికపోని మొండెం' అని అక్కడిచ్చిన అర్థం. తెలుగులో కూడా అర్థాన్ని ఇలా సవరించకపోతే అసమగ్రం అవుతుంది. తిక్కనలో 'అట్టలాడు' అని చాలా ప్రయోగాలు న్నాయి. అలానే 'అడరెడు నట్టయు' అంటాడు (అడు, అడరు = కదలు). అట్టలాడు ('అల్లాడు'లాగా) వేరే ఆరోపంగా కూడా కోశాల్లో ఇవ్వాలి.

ఆడు అనేరూపం చారిత్రకంగా నాలుగు ధాతువుల కూడలి. ఆడు[1]=కదలు, చలించు, నర్తించు (అనుయోగ క్రియగా కూడా వస్తుంది. 'అల్లాడు;) ఆడు[2]=అను, చెప్పు (కన్నడం: ఆడు)- ఆడు[3]=స్నానంచేయు (తమి.కన్నడం. ఆట్); ఆడు[4]=నాటుకొను (బాణ, మొ.) ఇది 'నాడు' అనే శబ్దం రూపాంతరం. ఈ నాలుగూ ఒకే ధాతువు అర్థాలుగా సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఉన్నది. (తెలుగులో చాలా శబ్దాలకు పదాదినకారం లోపించిన రూపాంతరాలు కూడా ఉన్నాయి. అవుడు<నవుడు, ఈగు < నీగు, ఈలుగు < నీలుగు.)

ప్రయోగాలు తక్కువ ఉన్నప్పుడు అర్థనిర్ణయం కష్టమౌతుంది. అలాటి శబ్దాలను గుర్తించి పరిశోధించటానికి పదప్రయోగ కోశాలు పనికివస్తాయి. ఈ సంపుటంలో నాకు కనబడ్డవి కొన్ని:

ఈరువు - మాంసం అని సూ. ని. 'పిల్లిపట్టిన యీరువు సేసియున్నన్' ఉ-2-35.

ఉదరిండ్లు=? సూ.ని., శ.ర.,లో లేదు. 'గొడుగులు నుదరిండ్లు ముడివడ' అను- 4-333.

ఉల్లిమిఱుతన్, ఎనుకొలుచు/ఎనుకోలు, ఎరకట్లు, ఎరవఖులు, మొ.వి ఇప్పటి కోశాల్లో కనిపించలేదు.

ఏదు (క్రి) 'నశించు, ఉడుగు' అనే అర్థాలు కోశాల్లో ఇచ్చారు. కాని ప్రయోగాలు పరిశీలిస్తే ఈ క్రియకు కర్తలుగా అమూర్తభావాలను దెలిపేశబ్దాలే (అమహన్నపుంసకాలు) వస్తాయిగాని, మహద్వాచక కర్త లుండవు; ఉదా: వగపేదు, పెంపేదు, సొంపేదు, వెరవేదు, ఇత్యాది; కాని 'వారేదిరి' లాటి ప్రయోగాలు లేవు. ఈ విశేషం గూడా అర్థనిర్ణయంలో చేర్చాలి. లేకపోతే చచ్చిన మాటలను ఉజ్జీవింపజేసే ఆధునిక కవులు తప్పు ప్రయోగాలు చేస్తారు.

## అర్థవిపరిణామం

ప్రయోగాలు పరిశీలిస్తే తిక్కన వాడుకలో ఉన్న మాటలు అర్థాలు అర్వాచీనకాలంలో మారిపోయినట్టు తెలుస్తుంది. ప్రయోగాన్ని ప ఒక మాటకు రెండర్థాలు సరిపడుతుంటే- ఒకటి వక్త ఉ ంచింది, ఒకటి శ్రోతకు తెలిసింది- కాలక్రమాన ఒ అర్థం ఇంకో అర్థంగా మారుతుంది. సందర్భాలను బట్టి వక్త శ్రోతలమధ్య అర్థావగాహనలో ఏర్పడే అస్పష్టత అర్థ విపరిణామహేతువు. ఇప్పుడు 'తగవులాడుట' అంటే పోట్లాట. ఒకప్పుడు 'ధర్మంకోసం చేసే వాగ్వాదం'; అలానే 'పోట్లాట' అయుధవు పోట్లతో చేసేది, మాటలతోనైనా ఇప్పుడు పోట్లాడుకోవచ్చు. ఈ సంపుటంలో వచ్చిన కొన్ని ఉదాహరణలు:-

అరుదు, అరిది=వింత, అసాధ్యం (ఇప్పుడు అసామాన్యం)

అగపడు=ఎదురుపడి / లోబడటం, వశపడటం.

(ఇప్పుడు ఎదురుపడటం, కనబడటం అని, ఈ సందిగ్ధార్థ సందర్భాలు తిక్కనలోనే కనిపిస్తాయి.)

అలవడు=సరిపడు, ప్రయత్నంతో నేర్చుకొంటే సాధ్యపడు! అలవరించు = నేర్పు (ఇప్పుడు ప్రయత్నం లేకుండా ఏర్పడే ప్రవర్తన)

ఉమ్మడి='ఒక్కుమ్మడి' అనే చోటనే గాని వ్యస్తంగా లేదు. అనేకులు ఏకకాలంలో ఒక పనిచేసినప్పుడు అవ్యయంగా కాలార్థంలో వస్తుంది. (ఇప్పుడు అనేక కర్తృ సాపేక్షంగా వ్యస్తంగా వస్తున్నది.)

భాషలో అర్థవిపరిణామశీలం తెలుసుకోటానికి పద ప్రయోగకోశా లవసరం.

## వ్యాకరణ విశేషాలు

సాంప్రదాయిక వైయాకరణలు ప్రకృతి ప్రత్యయ రూపనిష్పత్తితో తృప్తిపొందుతారు. వాళ్ళ సొంత కొలబద్దలను బట్టి సాధ్వసాధు రూపనిర్ణయంగూడా జేస్తారు. కాని భాషలో ఇంకా ఎన్నో వ్యాకరణ విశేషాలున్నాయి. కారక సంబంధాలు, ఏ క్రియలకు ఏ నామవిభక్తులతో ఏ రకమయిన సంబంధం ఉంది, పదబంధ నిర్మాణ సూత్రాలేమిటి, చను, కూడు, వచ్చు, నేర్చు, చాలు, వలయు మొదలైన సహాయ క్రియలవల్ల మన క్రియాన్వరూపం ఎలా మారిపోయింది, వాక్యానికి వాక్యావయవాలకు సంబంధం ఏమిటి-ఇలాటివన్నీ వ్యాకరణ విషయాలే. పద నిష్పత్తి ప్రక్రియలోనూ మన వ్యాకరణాలు ఇంకా అసమగ్రాలని అందరూ ఒప్పుకొన్నదే.

తిక్కన భాషకు సమగ్రమైన వర్ణనాత్మక వ్యాకరణం రాయాలంటే పది పదిహేను సిద్ధాంత వ్యాసాలకు సరిపడ్డ సామగ్రి ఈ పదప్రయోగకోశంలో దొరుకుతుంది. కొన్ని స్థూలంగా యాదృచ్ఛికంగా నేను చూసిన విశేషాలు:

అన్నిధాతువులతోనూ అన్ని క్రియావిభక్తులూ చేరిన సమాపకాసమాపకక్రియలు కనిపించవు. శత్రర్థకరూపాలు భూత తద్ధర్మాలతో పోలిస్తే చాలా విరళం; ఆనంతర్యంలో -డు కొన్ని ధాతువులకే వస్తుంది; ఉదా: *అడుగుడు లేదు. అన్వాదుల్లో 'ఇయుడాగమ' రూపాలే ఎక్కువ. అనె, అనెడు లాటివి చాలాతక్కువ.

తిక్కనలో కృత్తద్ధిత ప్రత్యయాలను గూర్చిన విశేషాలు కనిపిస్తాయి. పగతుడు, విల్తుడు శబ్దాల్లో ఉన్న-తుడు ప్రత్యయమూ, అతడు, ఈతడు, మొ.చోట్ల ఉన్న-తడు ప్రత్యయమూ ఒకేమూలం '*తన్టు' నుంచి ఏర్పడి ఉంటాయి: (తమిళం; ఒరుత్తన్*<ఒరుత్తన్టు). ఇది మహదేక వచన ప్రత్యయం.

ఆకొండున్, అండేని. మొ.రూపాలనుబట్టి అన్వాదులకు పరమైన 'ద' 'డ'గా మారిన మాండలికం ఒకటి ప్రాచీనభాషలో ఉండి ఉండాలి. 'రు' వర్ణానికిముందే 'ద' వికల్పంగా 'డ' అవుతుందని రాసిన లక్షణం అసమగ్రం. వ్యాకర్తలు

'ఉండిన' నుంచి 'ఉన్న' నిష్పన్నం చేశారు. ఉన్నే, ఉన్న, ఉన్నన్, ఉందురు-ఉందునే, ఉండిన, ఉండినన్, ఉండుదురు రూపాలను పోల్చిచూస్తే వర్ణనాత్మకంగా· ఉండు, ఉన్-అని రెండు ధాతువులు తెలుగులో ఉన్నాయని చెప్పాలి. 'ఉన్' అన్వాది గణానికి చెందినది. దీనికి, ఇద్వ్రక్రముత్తు రూపాలు(ఉనిరి, ఉనియె, ఉనక మొ.) లేవు. అందు వల్ల న్యూనక్రియ (Defective verb).విను: వినికి, మను: మనికి లాగా 'ఉనికి' అనే కృద్రూపం ఉను+ఇకి వల్ల ఏర్పడ్డది.

పావరమ్మ(పాప+అమ్మ), ఇందాక, ఇన్నాళ్ళు, ఇన్నూళు మొ.చోట్ల సంధివిశేషాలున్నాయి. కృత్తద్ధితాల్లో చిడిదల, ఇల్లడము, అలసట, ఊటట, ఏకట, ఒడ్డనము, ఎనమండ్రు మొ.లక్ష్యసామగ్రి సేకరించాలి. ఎద గాగమం ఎక్కువగా భవిష్యదర్థంలో కనిపిస్తుంది.

తిక్కన వాడిన విశేషణాలు, విశేష్యాలు, క్రియలు, అవ్యయాలు, కారకవిశేషాలు, తద్భవదేశ్యాలు, అన్యదేశ్యాలు (త్రాను, మొ.వి.) సంయుక్త క్రియలు, శబ్దపల్లవాలు, నుడికారాలు, సామెతలు, వాక్యాలు, ఉపవాక్యాలు, పదబంధాలు, కృత్తద్ధితాలు-వీటిల్లో ఒక్కొక్క విషయాన్ని గురించి గాఢమైన పరిశీలన చేస్తే తెలుగు భాషాచరిత్రకు ఉపయోగించే విశేషాలెన్నో వెలువడుతాయి.

పదప్రయోగ కోశాలు మౌలిక గ్రంథాలు. వాటిని ఉపయోగించేవాళ్ళ సంఖ్య తక్కువైనా వాటి ప్రయోజనం ఎన్ని శతాబ్దాలకు గూడా తరగనిది.

– (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సౌజన్యంతో)

బల మివ పయసా వినయా దివ సాధుత్వం ప్రియోదితా త్ప్రణయః।
మోద ఇవేప్సిత లాభాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

పాలతో బలం లాగ, వినయంతో సాధుగుణంలాగ, ప్రియురాలి మాటలతో ప్రణయంలాగ, ఇష్టవస్తువు లాభంవల్ల సంతోషం లాగ ఓ సుందరీ! నీ దేహకాంతి యౌవనంవల్ల వెలుగొందుతున్నది.

— ఉపమావళి' నుండి

★ ★ ★

సద్వర్తన మివ సాధువ్రజ సంగాత్ దీపవర్తి రివ తైలాత్।
రాగ ఇవ మిథో వచనాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

సత్పురుషసాంగత్యంవల్ల సత్ప్రవర్తనలాగ, నూనె వల్ల దీపం వత్తిలాగ, పరస్పర సంభాషణవల్ల అనురాగంలాగ ఓ సుందరీ! నీ దేహకాంతి యౌవనంవల్ల వెలుగొందుతున్నది.

— 'ఉపమావళి' నుండి

# నన్నెచోడుని కాల నిర్ణయం

శ్రీ లింగంనేని బసవ శంకర రావు

ఈ శతాబ్ది తొలిదశకాలలో నన్నెచోడుని కాల విషయమై పండితుల్లో పెక్కు వాదోపవాదాలు జరిగాయి. ప్రసిద్ధ పండితులైన జయంతి రామయ్య పంతులు, వేటూరి ప్రభాకరశాస్త్రి, కోరాడ రామకృష్ణయ్య, నిడుదవోలు వేంకట రావు మున్నగు వారు గ్రంథస్థాధారాల్ని, శాసనస్థాధారాల్ని పరిశోధించి, పరిశీలించి నన్నయ - తిక్కన్నల నడిమి కాలం వాడు నన్నెచోడు డని నిర్ధారించారు. ఈ వాదం బహుజనాదరణ పొందింది. వీరెవ్వరు నన్నెచోడుని కుమార సంభవ కావ్యంలోని భాషను నన్నయ, తిక్కనల భాషతో పోల్చి చూడలేదు. ఆ నాటికి ఆయా కవుల భాషలపై పరిశోధన అంతగా జరగక పోవటం చేత భాషా దృష్టితో శోధించి, పరిశీలించే అవకాశం వారికి లేకపోయింది. నన్నయ, నన్నెచోడుడు, తిక్కనల భాషను సూక్ష్మదృష్టితో గమనించి భాషా చారిత్రక దృక్పథంతో నన్నయ - తిక్కనల నడిమికాలం వాడు నన్నెచోడుడు అని నిరూపించటమే ఈ వ్యాసం ప్రధానోద్దేశం.

1. నన్నయ కాలంలో ఋకారానికి రికారోచ్చారణ ఉంది. అందువల్ల నన్నయ ఋ - రి లకు యతి వేశాడు. - ఋత్విజుండని విచారించి పూజించితే (సభా 2 - 11). నన్నెచోడునిలోను. ఇలాగే ఉంది - ఋష్య సారంగ చమరీ మృగముల (3-89). కుమార సంభవంలో నిరృతి అనే పదం నిరురుతి (10-191)గా రాయబడింది. (కాని దీనికి పాఠాంతరం కూడా ఉంది.) అంటే అప్పటికి ఋను రుగా ఉచ్చరించడం బయలుదేరి ఉండవచ్చు. పాల్కురికి సోమన లోను ఈ లక్షణం కనబడుతోంది. 'రురు వర్ణ దేహంబు ఋగ్వేదమునకు' (పండి. పు-523). ఇది తిక్కనలోను దర్శన మిస్తోంది. - 'సప్త/ఋషులైరి వారు మరుద్గణంబు' నకు (శల్య 2 - 160). (అయితే దీనికీ పాఠాంతరం ఉంది.)

2. సాధు రేఫ, శకట రేఫలకు నన్నయ యతిప్రాసల్లో సాంకర్యం చేయలేదు. నన్నెచోడుడు కూడా చేయలేదనే చెప్పాలి. అయితే ఒకచోట సంకరం కనబడుతోంది - నరుఁగు - వనే/చరియలు - చెచ్చెర - అ/య్యెఱుంగమి (6-44). (కాని దీనికి పాఠాంతరం ఉంది.) ఈ ప్రాస నిర్వచనోత్తర రామాయణంలో లేదు గాని భారతంలో ఉన్నట్లు కొన్ని అచ్చువేసిన పాఠాంతరాలు ఉన్నాయి - అరవఱ - నెఱిదప్పఁగ - తఱుచుగ - గిరి కొనియెన్ (భీష్మ 2-136) గిఱికొనియెన్ అనుట సరియైనది. పాల్కురికిలో సాధు శకట రేఫల సాంకర్యం ప్రబలింది.

3. క్షకార సంయుక్తంలో మొదటి వర్ణమైన కకారానికే నన్నయ ప్రాధాన్యమిచ్చి కవర్గంతోనే యతిని పాటించాడు - 'క్షత్రియుఁడుద్భవిల్లియు నఘ క్షయకారణుఁడున్' (అరణ్య 3-136). నన్నయలో రెండు చోట్ల క్షకారానికి, చ, సలకు యతి వేశాడు, కాని పాఠాంతరాలున్నాయి. నన్నెచోడుడు కవర్గంతోనే గాక, రెండవ వర్ణమైన షకారానికి కూడా ప్రాధాన్యమిచ్చి యతి వేశాడు - ఈ/సుర సంఘంబులలోన సంచు సతి దక్షుం దూలిపోఁ బల్కుచున్ 2-32, చెలువమగు హర్మ్యకులము సుక్షత్ర కులమున్ 7-127. తిక్కన కూడ నన్నెచోడుని లాగానే యతిని పాటించాడు - సుశి/క్షితులఁ గనుగొనందలఁపు చిత్తమునన్ మొలతెంచునేని (శల్య. 2-221), క్షితి నెందుం జరియించి భూపతుల నిశ్శేషంబుగానేక... (శాంతి 2-26).

4. నన్నయ జ్ఞకార సంయుక్తంలో మొదటి వర్ణమైన జకారానికే ప్రాధాన్యమిచ్చాడు. అందువల్ల ఆ వర్గాక్షరాలకి, ఊష్మ వర్ణాలకు యతి వేశాడు. నన్నెచోడుడు జ్ఞలోని రెండు వర్ణాలకు ప్రాధాన్యమిచ్చి చ వర్గాక్షరాలకు, ఊష్మలకు, సకారానికి కూడ యతి వేశాడు - జ్ఞాన స్వరూపమై సర్వాత్ముఁడున్నదా (7-53), జ్ఞేయ స్వరూపమై నెఱసి యుండు (7-53). తిక్కన నాటికి ఈ భాషా స్థితి ఇంకా కొంచెం పరిణతి పొందింది. తిక్కన జ్ఞ కారానికి క కారంతో కూడా యతిని పాటించాడు. ఎందువల్ల నంటే ఆ నాటికే జ్ఞను గ్నగా ఉచ్చరించడం అలవాటు అయ్యుంటుంది - జ్ఞానికి నుపదేశ విధిఁ బ్రకాశము సేయఁన్ (శాంతి. 4-255).

5. క్త్వార్థక ఇకారానికి సంధి వచ్చిన రూపాలు నన్నయలో లేవు. ఇవి నన్నెచోడునిలో ఉన్నాయి - పట్టికఁజూచితే 8-176, పట్టీక 9-51, పొంగెఱగెడు (11-172.) ఇటువంటి

సంధి రూపాలు తిక్కనలోను ఉన్నాయి - పట్టీ (నిర్వ. 2-93), వెర చిట్లంబుధి నాథ నందనులు (నిర్వ 5-88). వెలినిట్లని అనే పాఠాంతరం దీనికి ఉంది. భారత విరాట పర్వంలోని అందిమ్ము (4-112)ను శబ్దపల్లవంగా కొందరు పరిగణిస్తున్నారు.

6. నన్నయలో తెలుగు మీది తత్సమాలకు గసడదవా దేశం రాదు. నన్నెచోడునిలో గసరడవాదేశం వచ్చిన రూపాలున్నాయి - ఎలమి ప్రీత్యావహముగ (1-36), ఏమి సిత్రము (5-88), నీవు దపము (6-7.) తిక్కనలోను ఇటువంటి గసడదవాదేశం ఉంది - ఇట్లు దపంబు (నిర్వ. 5-8), ఏమి గులంబున (విరాట 1-215), ఎంత గుమతులైన (ఉద్యోగ 1-268).

7. నన్నయ భాషలో కర్మధారయ సమాసాల్లోనే ము వర్ణానికి పుంప్వా దేశం వస్తుందే గాని షష్ఠీ సమాసాల్లో రాదు. నన్నెచోడునిలో షష్ఠీ సమాసాల్లోను పుంప్వాదేశం వచ్చిన రూపాలు మూడు ఉన్నాయి - సింగపువేటలు (4-62), గుఱ్ఱపు దడంబులు (11-5), నుగాగమంతోను ఉన్నరూపం గాపుంద్రాడు (10-71) తిక్కనలో ఇటువంటి రూపాలు ఎక్కువగా ఉన్నాయి. గుఱ్ఱపు దడంబులు (భీష్మ 1 - 93), గుఱ్ఱపు మొగ్గరంబులు (భీష్మ 3-91), గుఱ్ఱపు అట్ల రాసులు (ద్రోణ. 2-60), గుఱ్ఱపు తండము (శల్య 1-55), నుగాగమంతో ఉన్న రూపాలున్నాయి - సింగపుఁ గొదమ (నిర్వ. 10-29), సింగపుఁబెంట్లు (స్త్రీ. 1 - 102).

8. పోఁడి తోడి బహువ్రీహి సమాసాలు నన్నయలో లేవు. నన్నెచోడునిలో ఒక్క సమాసం ఉంది - తలిరుఁబోఁడి (5-135.) ఈ సమాసాలు తిక్కన కాలంనాటికి విరివిగా ఉన్నాయి - అలరుఁబోఁడి (విరాట. 2-53), ఇగురుఁబోఁడి విరాట (1-312), చిగురుఁబోఁడి (అను 5-167), తీగబోఁడి (విరాట 5-399), పువ్వుఁబోఁడి (అను 2-209), పూఁబోఁడి (నిర్వ 6-64), మెఱుఁగుఁబోఁడి (విరాట. 1-312) ఇత్యాదులెన్నో సార్లు ప్రయోగింప బడ్డాయి.

9. ఉత్తమ పురుష సర్వనామాల్లో నన్నయలో హలాది రూపాల కంటె అజాది రూపాలకు ప్రాచుర్యం ఎక్కువ - ఏను (245 మార్లు) నేను (5 మార్లు), ఏము (5), నన్నెచోడునిలో ఏకవచనంలో హలాది రూపాలకే ప్రాచుర్యం ఎక్కువ - ఏను (9), నేను (11). తిక్కనలోను హలాది రూపాలకే ప్రాచుర్యం - ఏను (449), నేను (529). నన్నయ నన్నెచోడుల్లో లేని నేము అనే బహువచన రూపం తిక్కనలో (శాంతి 1-14) ఉంది. మధ్యమ పురుష ఏకవచన సర్వనామాల్లో నన్నయలో అజాది రూపాలకే ప్రాచుర్యం ఎక్కువగా ఉంది - ఈవు (64), నీవు (21). అయితే బహువచనంలో మాత్రం హలాది రూపాలకే ప్రాచుర్యం ఉంది - ఈరు (3), మీరు (49). నన్నెచోడునిలో హలాది రూపాలకే ప్రాచుర్యం - ఈవు (16), నీవు (47), తిక్కనలోను నన్నెచోడునిలో లాగా ఉంది - ఈవు (145), నీవు (314). నన్నెచోడునిలో బహువచనంలో ఈరు రూపం లేదు. మీరు మాత్రం 12 సార్లు ప్రయుక్తం. తిక్కనలో నన్నయలో లాగా బహువచనంలో హలాది రూపాలకే ప్రాచుర్యం ఉంది - ఈరు (5), మీరు (247).

10. నన్నయలో ఒకఁడు, ఒక్కఁడు అమహద్వాచక రూపాలని, ఒక్కరుఁడు మహద్వాచక రూపమని చిలుకూరి నారాయణరావు గారి భావన (పు. 1416). నన్నయలో ఉన్న ఒక్కటికి (4) పాఠాంతరాలున్నాయని వీరి ఉద్దేశం. నన్నెచోడునిలో ఒక్కఁడు 10 మార్లు యోగింపబడింది - 5 మార్లు అమహద్వాచకంలోను 5 మా మహద్వాచకం లోను ఉంది. 'ఒక్కటి' నన్నెచోడుని ఒక మారు ప్రయోగింపబడింది - వారి మేనులన్ మానుగఁ గూర్తు నొక్కటిగ (4-69). తిక్కనలో ఒక్కఁడు (4), ఒక్కండు (5) ఒకఁడు (22) అమహద్వాచకంగా ప్రయుక్తం. మహద్వాచకంగా ఒక్కఁడు (127), ఒకఁడు (188) ఉన్నాయి. తిక్కన కాలం నాటికి అమహత్తులో ప్రయోగాలు తగ్గుతూ, మహద్వాచకంగా ప్రయోగాలు ఎక్కువ అవుతూ వచ్చాయి. తిక్కనలో ఒక్కటి (112), ఒకటి (99) అనే అమహద్వాచక రూపాలు నన్నయ, నన్నెచోడుల్లో కంటె చాల ఎక్కువ అయ్యాయి.

11. నన్నయలో కలఙ్యి అనుబంధంతో ఏర్పడిన భవిష్యత్కాల క్రియా రూపాలు రెండు ఉన్నాయి - ఈఁగల వాఁడను (సభా 2-174), కావంగల వారము (అను 3-384). (ఇవి శక్యార్థాన్ని కూడ వ్యక్తం చేస్తున్నాయి). నన్నెచోడునిలో ఇటువంటి రూపం ఒక్కటి ఉంది - కొల్వఁగల వాఁడన్ 7-134. తిక్కనలో ఇటువంటి భవిష్యత్కాల క్రియా రూపాలు ఎక్కువగా ఉన్నాయి - అడుగం గలవాఁడు (అను 3-6), అనంగల వాఁడన్ (విరాట 1-73), ఉండఁగలాఁడ (అశ్వ 4-192), చేయంగల వాఁడవు (ఉద్యోగ 3-172), నమ్మఁగల వాఁడు (భీష్మ 1-61), పోవం గలవాఁడు (అను 1-273).

12. తచ్ఛబ్ద వకారం లోపించి తత్పూర్వ స్వరానికి దీర్ఘం వచ్చిన రూపాలు నన్నయ నన్నెచోడుల్లో లేవు.

తిక్కనలో ఇటువంటి రూపాలు చాల ఎక్కువగా ఉన్నాయి - ఉన్నాఁడు (నిర్వ 5 - 128, 6-19), ఉన్నారు (స్వర్గ 1-28), ఉండఁగలాఁడ (అశ్వ 4-192), కలాఁడవు (శాంతి 3-348).

13. నన్నయ భారతంలో ఇడిన, పడిన రూపాలే గాని ఇడ్డ, పడ్డ వంటి రూపాలు లేవు. నన్నెచోడునిలో ఇడ్డ (6-16), పడ్డ (4-76), ఇడ్డన్ (4-85), పడ్డన్ (7-94) వంటి రూపాలున్నాయి. తిక్కన నాటికి ఈ రూపాలు ఎక్కువ అయ్యాయి - పడ్డ, (నిర్వ 6-53), ఇడ్డ (నిర్వ 6-42), చెడ్డ (అను 5-151), పడ్డ (విరాట 5 - 206).

14. చువర్గం తోడి దుగ్దకారం తకార మవుతుంది. నన్నయలో ఇటువంటి రూపాలే ఉన్నాయి. నన్నెచోడునిలో యువర్గం తోడి దుగ్దకారం తకారమైన రూపాలు కూడా ఉన్నాయి - చేతున్ (1-5), చేతురు (11-186). అయితే వీటికి పాఠాంతరాలున్నాయి. తిక్కనలో కూడా ఈ రూపాలు ఉన్నాయి - చేతున్ (నిర్వ 1-16), చేతువు (కర్ణ 1-29). వీటికి పాఠాంతరాల్ని చూపిస్తున్నారు.

15. భావార్థకంలో నన్నయలో టవర్ణ రూపాలు ఎక్కువే అయినా, డువర్ణ రూపాలు కూడా ఉన్నాయి. నన్నెచోడునిలో టవర్ణ రూపాలు 116, డు వర్ణ రూపాలు 40 మాత్రమే ఉన్నాయి. తిక్కననాటికి డు వర్ణ రూపాలు తగ్గుతూ, టవర్ణ రూపాలు ఎక్కువ అవుతూ వచ్చాయి.

16. నన్నయలో ఏ వార్థకాలు- అ, ఏ- అనేవి; నన్నెచోడునిలో ఏవార్థకాలు - అ, ఎ, ఏ. తిక్కనలోను ఏవార్థకాలు అ ఎ ఏ లు ఉన్నా, అకారం కంటె ఎ ఏ లకే ప్రాచుర్యం కలిగింది. తర్వాతి కవుల్లో అ పోయి ఏ ప్రాచుర్యం పొందింది. నన్నయలో ప్రశ్నార్థకాలు - ఎ ఏ. నన్నెచోడుని లోను ఇంతే. తిక్కనలో కూడా ఇంతే. కాని తర్వాతి కాలంలో ప్రశ్నార్థకం 'ఆ' అయ్యింది, ఏవార్థకం 'ఏ' అయ్యింది.

17. నన్నయ నన్నెచోడుల్లో లేని శ్రేష్ఠతా వాచకాలైన అర్యాంబాద్యర్థక శబ్దాలు పరమైనపుడు సంధి వచ్చిన రూపాలు తిక్కనలో ఉన్నాయి - అన్నము (నిర్వ 1-13), కొమ్మన (నిర్వ 1-13). నన్నయ పేరులో ఈ సంధి ఉందే గాని ఇటువంటి రూపాలు నన్నయ భారతంలో లేకపోవడం గమనార్హం.

18. అకారాంత తెలుగు శబ్దాలకు అకారాది సంస్కృత శబ్దాలు పరమైనపుడు సవర్ణ దీర్ఘసంధి వచ్చిన రూపాలు నన్నయ నన్నెచోడుల్లో లేవు. కాని తిక్కనలో ఉన్నాయి. గమనించండి - తిక్కాంకుండ (నిర్వ 1 - 12).

19. ద్వంద్వ సమాసాల్లో పూర్వపదాంత అకారానికి దీర్ఘం వచ్చి, గసడదవాదేశం రాని రూపం తిక్కనలో ఉంది - అప్పా చెల్లెండ్రు (నిర్వ 3-96). ఇటువంటి రూపాలు నన్నయ నన్నెచోడుల్లో లేవు.

20. ఐదు అనే సంఖ్యావాచక రూపం నన్నయ నన్నెచోడుల్లో ఎక్కడాకనిపించదు. తిక్కనలో కనిపిస్తూంది.

21. నిందయందు ఆమ్రేడితంలో ఆద్యక్షరానికి గిగీలు రావటం నన్నయ నన్నెచోడుల్లో లేదు: తిక్కనలో కనిపిస్తూంది: వాలింగీలియు (నిర్వ 7-99), భీష్ముని గీష్ముని (భీష్మ 2-150).

ఈ విధంగా పై ముగ్గురి భాషను భాషా చారిత్రక దృష్టితో పరిశీలించి, పరికించినపుడు నన్నెచోడుని కాలం నన్నయ - తిక్కనల నడిమిదని మనం ఘంటాపథంగా చెప్పవచ్చు.

వసతి రివ దీపశిఖయా క్రీడావసతి ర్మనోజ్ఞ సంభారాత్।
భిత్తి రివ చిత్రయా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

దీపం వెలుగువల్ల ఇల్లులాగ, సుందర వస్తువులవల్ల క్రీడాగృహంవల్ల, చిత్రాలవల్ల గోడలాగ ఓ సుందరీ! నీ యౌవనంవల్ల నీ దేహ కాంతి వెలుగొందుతున్నది.

— 'ఉపమావళి' నుండి

# తెలుగు 'సాని' కహానీ

శ్రీ తూమాటి దొణప్ప

తెలుగు నందలి 'సాని' శబ్దం పుట్టుక ముఖ్యంగా మూడు మూలమూర్తులతో ముడిపడి ఉంది. సంస్కృతం లోని 'సాధనీ', 'స్వామినీ' శబ్దాలూ, అరబ్బీ భాషాగతమైన 'సానీ' శబ్దమూ ప్రకృత చర్చలోని ముగ్గురు సానులకూ మూలపుటమ్మలు.

శతాబ్దుల తరబడిగా సప్తాంగ సమన్వితమైన రాజతంత్రం లోని సమరతంత్రానికి ప్రధానంగా ప్రశస్తిని బడసిన చతురంగ బలసంపత్తి ప్రస్తుతం ప్రముఖంగా ప్రస్తావించదగ్గది. ఇందు లోనూ ప్రాణ్యంగ రూపమైన సామజ తురంగ బలాలది మొన్నమొన్నటిదాకా మొదటి మునుము. వెనకటి తరాలలో విక్రమశాలులూ, సమరాంగణ విజయశ్రీ లోలురూ ఐన చక్రవర్తుల సాంగ్రామిక విజయ పరంపరలూ, రణస్తంభప్రతి ష్ఠలూ, ఆస్థాన కవిసార్వభౌముల కైవారాలూ, వందిమాగధ వైతాళిక బృందాల స్తోత్రపాఠాలూ ఆయా రాజన్యుల సామరిక మహత్త్వ పటుత్వ సంపత్తికి మూలమైన గజతురంగ బలాలమీదా, పతిహిత చరితులూ, ప్రథన ప్రబంధన మహితులూ ఐన గజాశ్వబలాధ్యక్షుల పర్యవేక్షణలో వాటికి కల్పించిన రక్షణ మీదా, శిల్పించిన శిక్షణ మీదా అత్యధికంగా ఆధారపడి ఉండినట్లు మన చరిత్రా సాహిత్యమూ సాక్ష్యమిస్తు న్నాయి. ప్రాణ్యంగ రూప అశ్వగజ పదాతి సేనావాహినుల ప్రాధాన్యాన్నీ, ప్రాబల్యాన్నీ పురస్కరించుకుని చరిత్రపుట లలో కానవస్తున్న అశ్వపతులూ, గజపతులూ, నరపతులూ అన్న ప్రసిద్ధ వ్యవహారాలు ఆయా రాజశేఖరుల శౌర్య సాహస సామర్థ్య పరమైన సార్థక చిహ్నాలుగా రూపొందినట్లు నిష్కర్షించవచ్చు.

సంస్కృత భాషాగతమైన 'సాధన-' అన్న శబ్దానికీ, దీని రూపాంతరమైన 'సాధనీ-' శబ్దానికీ సేనయనీ, సేనావిభాగమనీ, సాంగ్రామిక సాధనమనీ సామాన్యార్థాలు; గజాశ్వసేనా వాహినులని విశేషార్థం. 'సాదన'(=శస్త్ర విద్య, శరాభ్యాసం), 'సాదనకాడు'(=శస్త్రవిద్యాపారీణుడు) 'సాద నజోదు'(=మల్లయుద్ధ ప్రవీణుడు) మొదలైన వాడుకలలోని 'సాదన' అన్నది సంస్కృత 'సాధన' శబ్దానికి జన్యరూపం; సంస్కృత భవం. 'రణపెండ్లి కొడుకులు' గా రాణించిన వారి పట్లా, సమర కౌతుక వ్రతుల విద్యాకౌశలం పట్లా ఈ వ్యవహారాలు అచ్చతెలుగున ఉపయుక్తాలు.

'సాధన-', 'సాధనీ-' శబ్దాలు కాలాంతరంలో దేశాంత రంలో ధ్వనిపరిణామాలు పొంది మౌలికార్థాలలోనే ప్రాకృత భాషలలో వ్యాప్తి నందిన 'సాహిణం', 'సాహిణీ' శబ్దాలు ప్రాకృత సమాలుగా తెలుగున దిగుమతి దినుసులు. సేనావాహి నులకు సంబంధించిన గజాశ్వాదుల కేర్పరిచిన ఆవాసమే 'సాహిణం'. లాయమనీ, వాహాగారమనీ దీనికి పర్యాయవాచ కాలు. సవారీకీ బరువు మోతకూ ఉపయోగించే తిర్యక్ప్రాణు లకు రూపించిన ఆవాస మన్న అర్థంలో కిందివి కొన్ని కావ్యప్రయోగాలు.

> నలినసంభవు సాహిణము వారువమ్ములు
> కులము సాములు మాకు...
> (శృం.నై. 2-66)

> 'పవన పౌలస్త్య పశుపతుల్ జవనరూఢి
> బరుగు తమ సాహిణముల నిబ్బరము సూప'
> (నిరం. 3-36).

ఏనుగుల సాల అనే అర్థానికి కావ్యప్రయోగాలు కొన్ని:

> 'రక్షోభయంకరైరావణ మదగంధ
> నాగంబు దన సాహిణమున నుండ...'
> (వరాహ.3-65),

> 'ఎకరాలన్ మందువా సాహిణముల గల
> భద్రేభ సందోహ వాహప్రకరంబు...'
> (మను. 1-40),

గుర్రాల సాల అనే అర్థానికి మాదిరి కొక ప్రయోగం:

> 'సాహిణమున బాగా యన
> వాహాగారంబునకును వర్తిలుc బేర్మై' (ఆం.శే.25).

మంత్రోత్సాహ ప్రభు శక్తిత్రయ సంపన్నులైన కాకతీయ ప్రభువుల పరిపాలనా కాలం (క్రీ.శ. 12,13,14 శతాబ్దులు)లో 'సాహిణి' శబ్దానికి అత్యధిక వ్యాప్తి కనిపిస్తుంది. తురుఫీ

హాథీ సేనాదళాలకు సారథ్యంవహించిన కదనకుతూహలప రులు రాయరాహుత్తగండలుగా రాణించి, మహాహవదోహలు లుగా పురాణించి, విక్రమాంక గాథలలో విశిష్టస్థాన మలంక రించి సాహిణులనీ, గజసాహిణులనీ, రాయగజ సాహిణులనీ, మహారాయ పట్టసాహిణులనీ హుందాహుజూరీ బిరుదుప ట్టాలు పొందినవారు ఎందరెందరో మనకు కనిపిస్తారు. గంగ సాహిణి (క్రీ.శ.1322), గంగయ గజసాహిణి (క్రీ.శ.1250), గంగయ సాహిణి (1239-1257), గండయ సాహిణి (క్రీ.శ. 1320), గన్నయ గజసాహిణి (క్రీ.శ. 1330), గజసాహిణి గుండయ (క్రీ.శ. 1320), రాయ గజసాహిణి గుండయ (క్రీ.శ. 1320), రాయ గజసాహిణి మగతల గుండయనా యడు (క్రీ.శ. 1320), రాయగజసాహిణి మగతల మాదయ రెడ్డి (క్రీ.శ.1291), సాహిణి మారన (క్రీ.శ. 1270-1310), మల్లెయ సాహిణి (క్రీ.శ.1229), సకల సేనాధిపతి మహా రాయ పట్టసాహిణి సోమయనాయంకులు (క్రీ.శ.1308)... మొదలైన సాహిణి శబ్దోపనామకులూ, సమరాంగణ గణనాయ కులూ మరెందరో ఆనాటి చరిత్రపుటలలో మనకు దర్శనమిస్తారు. సంగర సంక్రీడనంలో కలియుగార్జునులుగా గణుతికెక్కి, రణాంగణ పదస్థులుగా ఘనత వహించిన వీరి పారంపరీణ వృత్తిప్రవృత్తులకు సూచకమైన 'సాహిణి' శబ్దం వారి వారసుల గృహనామం గానూ కొన్ని సందర్భాలలో స్థిరపడినట్లు సంభావించవచ్చు.

'సాహిణి' శబ్దం హయశాలాధికారి, హయశిక్షకుడు అనే అర్థాలలో అనేక కావ్యాలలో ప్రయక్తమైంది.

.... సాహిణి యొకండు
కర్తయెదుటికి గొనివచ్చె... సైంధవంబుఁ'
(మను. 4-37)

'ఉత్తమాశ్వంబు సాహిణి యొకడు నిలుప'
(సారంగ. 1-81)

'సాహిణి రా నిగ్గ సాధించు నావల
రాజు క్రొత్త చిలుక తేజి యనగ' (చంద్రి. 6-122),

'...రాజు మ్రోలకు హయంబొక సాహిణిదెచ్చె జెచ్చెరన్' (పె.శకుం.1-113).

గుర్రపు రౌతు అన్నదానికి ప్రయోగాలు మచ్చుకు కొన్ని:
'మారయ ధరణీ రమణోత్తముడు సాహిణీతిలక మిలన్'
(భాస్కర. రా.),

'సాహిణీలు మావుల బఱపంగ...' (ఆముక్త. 3-22).

ఇంటిపేరుగా 'సాహిణి'కి ప్రయోగాలు:
'బుద్ధయకుమార సాహిణిమారా' (భాస్కర. అయో.),
'చెప్పగవలె సాహిణి మా
రప్పను దానమున...' (ఒక చాటువు).

ఈ 'సాహిణి' శబ్దమే మరిన్ని ధ్వని పరిణామాలకు లోనై 'సాని'గా సరికొత్త రూపెత్తింది ఆశ్వికుడు, రాహుత్తుడు అనే అర్థాలలో 'సాని' శబ్దం ప్రయుక్తం

'తగరు బాబాసాని' (=పొట్టేలు వాహనంగా గల అగ్ని దేవుడు) అని అచ్చతెలుగు పద్యనిఘంటువులలో కనిపిస్తుంది

ఇదే కొందరి ఇంటి పేర్ల చివర భాగంగా తెలుగు నాట వాడుక పడినట్లు మనం చూడవచ్చు. సాహితీ పథాలలోనూ, శాసన ఫలకాలలోనూ, కౌలు కదపా కవిలె కడిత కబూలియత్ కైఫీయత్తులలోనూ, నేటి వాడుక లోనూ ప్రచుర వ్యాప్తిని పొందిన అల్లసాని, ఉమ్మసాని, కారసాని, కాసాని, కేసాని, గంగసాని, గౌరసాని, చలసాని, చాగసాని, తిప్పసాని, నల్లసాని, పెమ్మసాని[2], పోసాని, బైసాని, మల్లసాని, ముద్దసాని, మేడసాని, రాసాని, లక్కంసాని... వంటి తెలుగు వారి ఇంటిపేర్లు ఆయా గృహనామకుల పూర్వాపూర్వ కులస్వాముల సామజ తురంగ దళ శిక్షా రక్షా దీక్షా దక్షతా, సమర సమయ సమవిషమ మహావ్యూహ రచనా చతురతా, సమస్త సాంగ్రామిక వ్యూహ నిర్భేదనోపాయ నిపుణతా నేపథ్యంగా నిలిచిన అన్వర్థవ్యవహా రాలుగా మూర్తిసందినవని నిర్ధారించడం సత్యదూరం కాదు. మడమదిప్పని మహారథులుగా, మాట తప్పని మహావ్రతు లుగా నిస్తుల ప్రశస్తిని ఇస్తువుగా మూటకట్టిన తొలితరాల కొలముసాముల వ్యక్తినామాలే కాలాంతరంలో ఆ మహాభాగుల స్మృత్యంకనాలుగా ఇటువంటి ఇంటిపేర్లుగా వాడుకలో స్థిరపడ్డాయని నిర్ధారించ వచ్చు. కావ్య ప్రయోగాలలో కనిపించే ఈ తీరు ఇంటిపేర్లు కొన్ని:

'అల్లసాని వాని అల్లిక జిగి బిగి' (ఒక చాటువు),
భీక రాహవ సేనాని పెమ్మసాని
అక్కభూపాల చిన తిమ్మ! అలఘుధర్మ'
(ఒక చాటువు).

ఇక, రెండో 'సాని'ని గూర్చి.

అధిపురాలు, ప్రభుభార్య, యజమానురాలు, స్త్రీదేవత- అనే అర్థాలు గల సంస్కృత 'స్వామినీ' శబ్దం ఇదే అర్థాలలో ప్రాకృత భాషలలో 'సామిణీ'గా కనిపిస్తుంది. మరికొంత మార్పును పొందిన 'సామిణీ' శబ్దం తెలుగున 'సాని'గా వాడుక కెక్కిన ప్రాకృతభవం. ఎరుకల సాని, గౌడసాని, జక్కుల సాని, దాసరిసాని, దొమ్మరి సాని, పూజారి సాని,

బూబు సాని, బోగంసాని, మేదరిసాని, రెడ్డిసాని, సెట్టిసాని, సోమిసాని(=సోమిదమ్మ, సోమయాజులు* భార్య) వంటి కులమత వర్ణవాచక పదబంధాల ఉత్తర భాగంలో 'సామిణీ' శబ్దభవమైన 'సాని' వచ్చికూచుంది. ఆనాటి ఆర్థిక సామాజిక వ్యవస్థకు అద్దంపట్టే వృత్తి ఉపాధి సూచక పదాలు ఎన్నోకులవాచకాలుగా రూపొందిన విషయం సామాజిక శాస్త్రవేత్తలు చాలమందికి తెలిసిందే! ఉదాహరణకు కావ్య ప్రయోగాలు కొన్నింటిని అనుశీలించండి.

'... ఎరుకల సాని వచ్చినది...' (వేం.మా. 5-11),
'కొడుకు గుల్లాడు చన్నుగుదువకట్లుంట
విచారించి మేదరిసాని యపుడు' (పరమ.1-139),
'సెట్టుపోతల సాగసాని సెట్టిసాని' (శుక. 2-208).

ఏలికసాని, ఒజ్జసాని, దొరసాని, పట్టపుసాని, ప్రెగ్గడసాని, మంత్రసాని-వంటి అధికార పదసూచక పదబంధాల చివరగల 'సాని' సైతం 'సామిణీ'కి జన్యరూపమే.

'ఏమన్ననియె గాకేమి మీయేలికసాని' (కాశీ.6-226),
'ఇనుడుదయాద్రికి నేతేక మున్న
చనకున్న నేలిక సానిచే జావు'
(ద్వి.హరిశ్చ.పంక్తి.2252),
'చపలాత్ముడా యొజ్జసాని కిట్లనియె'
(పైది. పంక్తి 1030),
'తనరు నుపాధ్యాయ భార్య యొజ్జసాని
యన...' (ఆంధ్రభాషార్ణవ. 2-107),
'దొడ్డిపట్టుల దొడ్డ దొరసానుల యొడళ్ళ
సొమ్ములు సొమ్ములు సొంపు నెఱప'
(అచ్చ.రా.బాల.33),
'దొరసాని, రాణినా దోచు చుండును రాజ్ఞి'
(ఆంధ్రభాషార్ణవ.2-107),
'మానిని నిను నా పట్టపుసానిగ నొనరించి'
(రసిక. 6-114).

ఇవి అధికార పదసూచకాలకు కొన్ని కావ్యప్రయోగాలు.

ఇంతకు ముందు పేర్కొన్న శాసనాలూ మొదలైన రకరకాల ఆకరాలలో 'సాని' పదఘటితాలైన అనేక స్త్రీ సంజ్ఞావాచకాలు కనిపిస్తాయి. అయ్త (ఆదిత్య) సానమ్మ, ఎలుక సానమ్మ, ఎఱియాసాని, కామమసాని, కామసాని, కుప్పసానమ్మ, కొండసాని, కొమ్మసాని, చానసాని, తిమ్మ సాని, తిర్మలసాని, నాగసానమ్మ, పాపసానమ్మ, పారసానమ్మ, పారసాని, పేకసాని, పోతసాని, ప్రోలిసాని, బయ్యసాని, బాచసాని, బాస్సాని, మల్లసాని, మాదసాని, మారసాని, యెరసాని, రుద్రసాని, లక్కసాని, వల్లసాని, వెన్నసాని, వేమాసాని, సూరపసాని, సూరసానమ్మ, సూరసానవ్వ, సూరసాని... మున్నగు స్త్రీ నామాల ఉత్తర భాగంలోనూ, చిక్కసాని పల్లె (అనంతపురం జిల్లా), దొంగల సాని కనుమ (నెల్లూరు జిల్లా) నాగసాని పల్లె (కడపజిల్లా) బోడసాని పల్లె (అనంత.జి.) సూరసాని యానాం (గోదావరి జి.) మొదలైన స్థల వాచకాలలో కనిపించే 'సాని' కూడ ఆధిక్యాన్నీ, ఆధిపత్యాన్నీ ప్రకటీకరించే 'స్వామినీ' పదసంబంధి. స్త్రీల పేర్ల చివరచేరే అక్క, అంబ, అంబిక, అమ్మ, అవ్వ, దేవి, బాయి వంటి గౌరవార్థక చిహ్నమిది.

ఇవే ఆకరాలలో ఐతమ్మ, ఐతాంబిక, కుప్పమాంబ, కుప్పాంబ, బయ్యమ్మ, బాచాంబ, లక్కమాంబ, లక్కాంబ-అన్న స్త్రీ సంజ్ఞా వాచకాలతో అంబ, అంబిక, అమ్మ-లు 'సాని'కి పర్యాయ పదాలుగా వ్యవహృతాలయ్యాయి. ఆనాటి అధికృతవర్గాల అంతఃపురాలకో, కులమూ తలమూ, కలిమీ బలిమీ గల కుటుంబాల వారి జనానా జనాభాకో చెందిన స్త్రీల పేర్ల చివర 'సాని' వాడకం సర్వసాధారణం. మాదిరికి కొన్ని కావ్య ప్రయోగాలు:

'చొప్పేరు వడియుండ సూరసానమ్మ'
(పండితా.దీక్షా.పు.118).
'ధీరత పోరండ్ల సూరసానమ్మ'
(పైది, వాద.పు.519),
'సూరసానవ్వనా ధారుణి బరగు'
(పైది, దీక్షా.పు.114),
'అంతంత సాష్టాంగులై సూరసాని
కెంతయు భక్తితో నిలజాగిమ్రొక్కి'
(పైది.దీక్షా.పు.157),
'శివరాత్రి సంగయ్య శ్రీ సూరసాని'
(పైది, మహిమ.పు.93),
'శూలియా పోరండ్ల సూరసానికిని'
(పైది, పర్వత.పు.246),
'మానిని లీడుగారు... బమ్మెరకే సయ
లక్కసానికిన్' (భాగం. 1-24).

అంతేకాదు, అతివేలపు విషయలోలుపతా, మితిమీరిన శృంగార ప్రియతా, ప్రతిష్ఠాచిహ్నాలుగా భావించే ఆయుగా లలో, శ్రీమంతులూ సామంతులే కాక రాచనగళ్ళ పరివారా నికి చెందిన మావంతులూ(మావటి వారు), రేవంతులూ (గుర్రపురౌతులు) సైతం 'నగర నారీ' సారస్య స్వారస్య సంగ్రహణ జయంతులు' గానూ, 'వారనారీ యౌవన వన వసంతులు' గానూ స్తోత్రపాఠకుల భోగావళీ రాగ తరంగిణీ

తరంగాలలో ఓలలాడిన ఆ బడా బడాయిరోజులలో రెండో రాణివాసంగా వాసికెక్కిన నాగవాసాల స్థాయి అసలు అంతఃపురాలకు పై అంతస్తుగా పరిగణించ బడేది. ఈ నాగవాసపు సానుల పేర్ల చివరనూ వారి ప్రసక్తిగల తావులలోనూ ప్రత్యక్షమయ్యే 'సాని' సైతం 'సామినీ' శబ్ద జన్యమే. గడసాని, గడనసాని, గుడిసాని, రంగసాని, లంజెసాని, సంతసాని, సానికూతురు, సానికొడుకు, సాని కొంప, సానిటెక్కులు, సానితమ్ముడు, సాని తెలివి, సానిపాప, సానిమాయలు, సాని మేళం, సాని మొగ్గలు, సానివగలు, సానివరస, సానివాడ, సానివాడు, సానివేషాలు, సానిసరసం, సానిసొగసు-వంటి వేశ్యావృత్తి పరమైన పదబంధాలలోను 'సాని' పదం ప్రచుర వ్యాప్తిని సంపాదించుకుంది. మచ్చుకు కొన్ని ప్రయోగాలు:

'... సంత నెన్నడో జవ్వన మమ్ముకొన్న గడసాని...' (ఉ.హరి.1-73),

'... భీమేశ్వరుని గొల్తు రప్పురమున
సానులనుపేరి యప్సర శ్చంద్రముఖులు'
(భీమ.1-89),

'భీమేశుడు సానివాడ కరుగున్...' (సైది, 1-112),

'... ఆ యూరి సాని యొకతె వాని
సందుకొనియె'(భల్లాణ.3).

పై ప్రయోగాలలోని 'సాని' దేశదాసీ జనానికీ, నాగవాసపు స్త్రీ జనానికీ సంబంధించిన పదం.

ఇంతేకాక, వార్ధక సూచకమైన 'ముదుసలిసాని' అన్న పదబంధంలోనూ 'సాని' పొడగట్టు తున్నది. ద్రుపదు నగరంలో మత్స్యయంత్రచ్ఛేదనానంతరం 'అయ్యిద్దఱును (భీమార్జునులు) గృష్ణనట్లొప్ప దోడ్కొని చని యొక్క ముదుసలిసాని(కుంతి) కపుడు మ్రొక్కి యక్కన్యను మ్రొక్కించి...' (భారత.ఆది.7-221) నట్లు పేర్కొన్న నన్నయ ప్రయోగంలోని 'సాని' కూడ సామిణీ ( స్వామినీ) శబ్దభవం. మహారాజ్ఞి అనే అర్థంలో నన్నయ్య నాటికే 'సాని' కావ్యభాషలో కాపురం పెట్టిందన్నమాట!

పెళ్ళి పేరంటాలలో-విశేషించి నాగోలి-నాగవల్లి- నిష్ఠురా లలో ఆరిందా కారిందాగా పెత్తనం చెలాయించే పెద్ద ముత్తైదువను నాగవసాని, నాగప్పసాని, నాగమసాని, నావ సాని... అని పేర్కొనడం కద్దు. వయస్సుకూ, హోదాకూ మించిన గడసరి మాటకారి తీరులను 'నావసాని కబుర్లు' అని పరిభాషించడం కూడ పరిపాటి. ఈ పదబంధాలలోని 'సాని' సైతం 'సామిణీ' పద సంబంధి.

వ్యుత్పత్తి పరంగా పరికిస్తే 'సాహిణీ'కి వికృతిగా రూపిత మైన 'సాని' అన్నపదమూ, 'సామిణీ' శబ్దం సమీపమాతృకగా అవతరించిన 'సాని' అన్న పదమూ తెలుగున ప్రాకృత భవాలే. పై చూపులకు ఒకే రూపున పొడసూపినను, వీటి మాతృకల దృష్టిలో ఇవి రెండూ నూటికి నూరు పాళ్ళూ వేర్వేరన్న అంశం, మీది చర్చవల్ల సుస్పష్టం. వీటి సమీప మాతృకలైన 'సాహిణీ', 'సామినీ'-లు రెండింటా పదమధ్యాక్షర లోపమూ, చివరి 'ణ' వర్ణం 'న' వర్ణంగా మారి ఒకే మాదిరి 'సాని'గా మూర్తి కల్పన జరగడం మాత్రం సమానం. వాస్తవస్థితి ఇలా ఉండగా మన తెలుగు నిఘంటువులలో ఈ పదాలు రెండూ ఏక మాతృకాజన్యాలుగా ప్రదర్శితమవడం అవిచారిత రమ ణీయం.

ఇక, మూడో 'సాని' ముచ్చట! ఇందాకటి చర్చలోని రెండూ గాక, వీటికి సదృశ రూపంగల మరోమూర్తి సైతం తెలుగు సాహితీ చరిత్రలో క్షీణయుగంగా నిర్వచించబడ్డనాటి వాడుకల లోని 'సానికరణాలు', 'సాని గుమాస్తాలు', 'సాని పట్టాదారులు', 'లా సానీ' అన్న పదబంధాలలో ప్రత్యక్షమవు తున్నది. నిన్నా మొన్నా పల్లెపట్టులలోని పెద్దకరణాలకు రోజువారీ అడంగుల ఖాతా కమాయిషీలలో సరిజోడులు గానూ, సాలుసరి జమాబందీ జాడా లెక్కాపక్కా పద్దుపైసలా లలో సైదోడులుగానూ పని చేసి పెట్టే కింది కరణాలను 'సానికరణాలు' అనీ, అదాలత్ అమల్ జారీ కాజీ కార్యాలయాలలోని సహలేఖకులను 'సానిగుమాస్తా' అనీ వ్యవహరించేవారు. స్థిరాస్తులపరమైన పొత్తుల ఆసామీలకూ, సహభాగస్వామ్యంగల చేని గుత్తదారుకూ 'సానిపట్టాదారు' అని ఆనాటి వాడుక. ఈ సందర్భంలోని 'సానీ' అంటే సాటి, సరి సమానం అనీ, 'లాసానీ' అంటే బేజోడు అనీ, సరిసాటి లేని అనీ సామాన్యార్థాలు. సహచరుడు, సహప్ర తుడు, సహోద్యోగి (= co-writer, fellow-clerk) అని ఈ 'సాని'కి విశిష్టార్థాలు సాధనీ, స్వామినీ అన్నమూలమూ ర్తులకు క్రమంగా జన్యరూపాలైన 'సాని', సాని-లు రెండింటికీ అన్ని అందాలా భిన్నమైన మూడో మూర్తి ఈ పదబంధాల లోని 'సాని'. మధ్య ప్రాచ్యసీమల బాసలలో పుట్టిపెరుడు తీర్చుకుని, మొగలాయీ సిపాయీ పహారా డేరా గుడారాలలో - దఖినీ భాషాలాలన పాలనలలో పెరిగి పెద్దయై, తురికీ, అరెమరాఠీ వగైరా వాడుక బాసల సాథీ సావాసంలో బతికి బట్టగట్టి, సులతానుల బారాదరీ బారామహళ్ళలో బాల్‌బచ్చే సోలాసింగారాలతో సానదీరి, నవాబుల నవేలీ హవేలీ నగళ్ళలో నాజూకు జిగినీ నగిషీలు దిద్దుకుని, నానాప్రకారాల నకల్ నవీసీ లేఖనాలలో నయా నయగారాలు నేర్చిన 'ఉర్దూ' భాషనుంచి బారా బలూతీ పరిపాలనా పరమైన పారిభాషిక

పదంగా-రెండోరకం, రెండోస్థాయి, సరీసాటీ అన్న అర్థాలతో -తెలుగు వారి దినసరి వరవడిలోనికి సరాసరి తరలి వచ్చిన ఉరువు ఈ మూడో 'సాని'. సావాసం, సావాసి-అనే అర్థాలు గల అరబ్బీ 'సానీ' పదంగానీ, మంత్రి, సభ్యుడు, సహచరుడు అనే అర్థాలుగల పారసీక 'సాహనీ', 'సాహినీ'- పదాలుగానీ అర్వాక్కాలికమైన ఈ మూడో 'సాని'కి మూల ప్రకృతులు కావచ్చునని కొందరు ఊహ. అక్క సరి దళారీ భాష ఏదైననూ అరబ్బీయే అసలు మూలమని చాలామంది తలంపు.

ఈ వరకూ అనుశీలించిన తెలుగు రూపులోని ముగ్గురు సానుల సరసకు చేరాలన్న తీవ్రాభిలాషతో ఇంకొక్క 'సాని' 'వస వల్చు బాలకుల' బుగ్గలు సుతారంగా గీటుతూ ఆంధ్ర ప్రబంధమందిరాలలో కాలక్షేపం చేస్తూ, అసలు సానులు ముగ్గురి మగ్గులోనిక దిగ్గున దిగనా వద్దా అని ఇగ్గిన ముగ్గిసలు పడుతున్నది. అదే 'కు(ఖు)రాసాని'. మధ్యప్రాచ్య భూము లలో యుగయుగాలుగా జగా పేరు పెంపులతో ప్రవర్ధిల్లుతూ వస్తున్న ఈరాన్-ఈరాణీ, హిరాణీ అని పశ్చిమంధ్ర మాండలిక వ్యవహారాలు-దేశపు ఈశాన్య సీమగా, అష్టని స్థానపు పడమటి సరిహద్దులలో 'దశ్త్-ఏ-కవీర్' (great salt desert) అన్న ఉప్పు ఎడారి తూర్పు టంచుల అక్షాంశ రేఖలకూ, దీర్ఘాంశ రేఖలకూ నట్టనడుమనూ విస్తరించిన నేటి 'ఖు(ఖో) రాసాన్' రాష్ట్రమే-ఈరాన్ కా పూర్వీసుబా-మన ప్రబంధాదులలో తారసిల్లే 'కు(ఖు)రాసాని'. ఈరాన్ దేశం దక్షిణ తీరపు పారసీక జలసంధిలో హుర్ముజ్ (=హురుముంజి) రేవు ద్వారా ఎన్నో శతాబ్దులుగా వాముా వజా(=వస) వంటి మసాలా దినుసులూ, బుక్కా బురకీ వగైరా సుగంధద్రవ్యాలూ, కర్బూజా, కళింగిడీ (water melon) వంటి పుచ్చకాయలూ, వాటిగింజలూ కు(ఖు) రాసాన్ సుబాకు చెందిన గంధీసేఠ్ సౌదాగర్ సాహుకార్లు దూరప్రాచ్య తీరాలకు ఎగుమతి చేసే వారు. స్వదేశీ అరదేసి పరదేసి నానాదేసి సెట్లు దళారీలుగా అవచితిప్పయ సెట్టి, దేవయ సెట్టి ప్రభృతి పాకనాటి బేహారి సెట్లు వీటిని దిగుమతి చేసుకుంటూ తెలుగు నాటి లోతట్టు మాగాణాలకు కూడా వాటిని నాటుకోటి సెట్ల ముఖంగా సరఫరా చేస్తూ ఉండినట్లు తెలుస్తున్నది. జీర్ణశక్తి పెంపుదలకు, కడుపు నొప్పుల అవుదలకూ మాత్రమేకాక, బాలెంతబోళంలోనూ, పురిటి బిడ్డల సురిటి పాలలోనూ వాముా వజలను ముడిదినుసులుగా వాడడం నాడూ నేడూ పల్లెటూరి మంత్రసానుల, నంచికట్టు వైద్యుల అలవాటులోని నాటు వైద్యం. వాముగింజ నుంచి తీసిన నూనెను సైతం దీప్యక పదార్థంగా వాడడం కద్దు. ఇక, సుగంధద్రవ్యాల వాడకం సరేసరి! ఏటేటా వేసవి నెలలలో ఏటి చాలులలో, ఇసుక మేట నేలలలో పండే కర్బూజా కళింగిడీ వంటి పుచ్చకా యలూ, వాటి విత్తనాలూ ఖురాసాన్ సుబా నుంచి దిగుమతైన సరకని కింది ప్రయోగం మూలంగానూ స్పష్టపడుతున్నది.

'అలుకన్ ఘోటక ఘట్టికా ఖురపుటీ
హల్యం గురాసాని పు
చ్చలువో దున్ని....' (ఆముక్త.1-42).
'ఆ నగరంబు గంధవహు
డంగడి వీథుల నాడుచుం గురా
సాని పిసాళి గంధవొడి
సన్నపు గుంకుమ పూవు బోచ...' (కకు. 1-139).
'....కురాసాని యోమమంచన యవానికాభిధ...'
(ఆంధ్ర భాషార్ణవ. 2-57).

ఐతే ఈ 'కు(ఖు) రాసాని యవానికాసుందరి' ప్రబంధ మందిరాల పరదాల చాటు నుంచి దొంగచూపులతో తొంగిచూడడం వినా మామూలు జనం మధ్యకు ఇందాకా అడుగు పెట్టనే లేదు. ఇక మీద అడుగిడుతుందన్న ఆశా లేదు; అవకాశమూ లేదు. అందువల్ల, ప్రబంధ వీథులతో చిరంతన పరిచయమున్న పండిత ప్రవరులకూ, పరిశోధ కాగ్రసరులకూ, పాఠకోత్తములకూ తప్ప సామాన్య జనానీకా నికి ఈ నాలుగో 'సాని' గారి బడీశాన్ సాంగత్యం లభ్యం కాలేదు.

ఇలా భిన్న వ్యుత్పత్తి ప్రవృత్తులు గల 'సాని' రూపభేదా లను వేర్వేరు ఆరోపాలు (entries) గా - సాని, సాని, సాని ....ఈ మాదిరిగా- ప్రదర్శించి, వాటి సమీప మాతృక (immmediate source) లనూ, మూలమాతృక (original source) లనూ వాటి అర్థాదికాలతో నిర్దేశించి, నిర్దుష్టమైన అర్థ వివరణలనూ, అవశ్యక ప్రయోగభాగాలనూ, ఆధార గ్రంథ సూచికలనూ ఆయా ఆరోపాల కింద రూపించ వలసిన అవసరం ఎంతైనా ఉంది.

ఇదీ తెలుగు 'సాని' కథా కమామీషూ.

# కన్నడాంధ్ర భాషలలో రగడలు

శ్రీ కె. సర్వోత్తమ రావు

దాక్షిణాత్య భాషలలో ఛందోరీతుల పేర్లకు సంబంధించి జరిగిన కృషి అంతంత మాత్రమే. తమిళంలో మాత్రం కొంత వరకు ఈ పరిశోధన ముందడుగు వేసింది. కన్నడాంధ్ర మలయాళాలలో ఈ రకమైన పరిశీలన 'ఊపు' అందుకోవలసిన అవసరముంది. అలాగని పూర్తిగా పరిశోధకులు పట్టించు కోలేదని కాదు. కందం, రగడ ద్విపదలను గురించి చాలినంత ''నేల విడిచిన సాము'' జరిగింది. ప్రస్తుతం రగడల విషయం చూద్దాం.

ఒక వ్యక్తి బాగా ప్రసిద్ధి పొందాక ''మన వాడనే'' చుట్టరికం కలుపుకున్నట్టు కొన్ని ఛందోరీతులకు కొత్త అనుబంధాలను జోడించి చెప్పడం జరిగింది. అలాంటి వాటిల్లో 'రగడ' ఒకటి. ప్రాకృతంలోని పద్ధడిఅ(స్వయం భూ ఛందము 2-129), అడిల్లా(ప్రాకృత పైంగళం 1-127), ఛప్పయ్ ఛందం మొదలయినవి, అలాగే సంస్కృతం లోని మానిని, కవిరాజ విరాజితం లాంటి ఛందోరీతుల్లో రగడల ఛాయలు కనిపిస్తున్నాయి.

రఘటాభవం రగడ అని కేశిరాజు శబ్దమణి దర్పణంలో (సంధి-32) చెప్పాడు. దీన్ని ఆధారంగా చేసుకొని ఘటా అంటే గుంపు అనే అర్థం వుండడం వల్ల రఘటా అంటే రగణాల సమూహమని, రగణం పంచ మాత్రాత్మకం కావడం వల్ల, పంచ మాత్రాత్మకమయిన ఛందోరీతికి రఘటా అనే పేరు వచ్చి వుండవచ్చని శ్రీ కుక్కిల కృష్ణ భట్టు గారు భావించారు. కన్నడాంధ్ర దేశి చ్ఛందోరీతులలో పంచ మాత్రాత్మక విన్యాసం ఎక్కువ కావడం వారి ఊహకు ప్రబల నిదర్శనం కావచ్చు. కన్నడంలో రగళెను తెలుగులో రగడ అని అంటారు. రగడలు లయబద్ధమయిన గేయ చ్ఛందం. జానపద సరణులకు చాలదగ్గరివి రగడలు. అంచేత శాసనాల లోని చాలా వాక్యాలు రగడల లాగా కనిపిస్తాయి. క్రీ.శ. 575 నాటి ధనంజయుని కలమళ్ళ శాసనంలోని

''ఎరికల్ ముత్తురాజు ధనంజయులూ
రేనాణ్డెళన్ చిఱుమూరి -''

మధురగతి రగడల లాంటిదే. అలాగే క్రీ.శ. 750 నాటి రెండవ మహేంద్రుని బూడిద గడ్డపల్లి శాసనంలోని ''శ్రీ మహేన్ద్రన్ మానరవి మారా పిడుగు'' 'ద్విరద గతి రగడ' లాంటిది. ఇవే గాక క్రీ.శ. 600-625 ఎరికల్ ముత్తురాజు శాసనం, క్రీ.శ.600 నాటి చోఅ మహారాజు ఉరుటూరు శాసనం క్రీ.శ. 600-625 నాటి పొట్లదుర్తి మాలెపాడు శాసనం, క్రీ.శ. 600-625 నాటి చోఅ మహారాజు ఇందుకూరు శాసనం, క్రీ.శ. 600 నాటి చోఅ మహారాజు ముతుకురు శిలాశాసనంలలో మధురగతి రగడ చ్ఛాయలున్న పంక్తులు కనిపిస్తాయి.

క్రీ.శ. 1022 నాటి కోరుమిల్లి సంస్కృత శాసనం ''తస్మై సమస్త జనతా విశేష గుణాయ,... మహీదేవ దేవగణాయ'' వంటి పాదాలు అచ్చం ద్విరద గతి రగడే. తెలుగులో లాగే కన్నడ శాసనాలలో కూడా రగడ చ్ఛాయలున్నాయి. ఏమయినా తెలుగు శాసనాల్లోనే రగడచ్ఛాయల ప్రాచీనత స్పష్టమౌతుంది.

దాక్షిణాత్యులయిన సంస్కృత కవులు 'చంపూ' పద్ధతిని అభిమానించినట్టు రగడలను కూడా అభిమానించారు. 9వ శతాబ్దంలోని సోమదేవ సూరి యశస్తిలక చంపువులో

''వికచ కర్ణోత్పల స్పర్ధి తరలేక్షణాః
కేళి తాళక్వణ త్కనక మయ కంకణాః -''

అన్నది వృత్త గంధిగా భావించినా ఇది కూడా రగడ ప్రభేదమే.

రఘటల లక్షణాన్ని విస్తరించి చెప్పిన వారిలో జయకీర్తి ప్రసిద్ధుడు.

స్వచ్ఛందః సంజ్ఞా రఘటా
మాత్రాక్షర సమోదితాః
పాద ద్వంద్వ సమాకర్ణా
సుశ్రావ్యా సైవ పద్ధతిః - ఛందో. శాసనం 1-24

ఈలాగే గుణ చంద్రుడు ఛందస్సారంలో రగడా ప్రభేదాలు(5-14-15-16) చెప్పాడు.

తెలుగులో రేచన రగడల్ని చర్చించలేదు. విన్నకోట పెద్దన మాత్రం రగడల్ని చాటు ప్రబంధాలుగ వివరించాడు.

రగడలను గురించి విస్తరించి చెప్పినవాడు అనంతుడు. రగడలకు తాళాలను నిర్దేశించిన వారు అప్పకవి, చిత్రకవి పెద్దనలు.

కన్నడాంధ్ర భాషలలోని రగడా ప్రభేదాలకు నామసామ్యం కనిపించదు. కన్నడిగులు మందానిల, లలిత, ఉత్సాహ రగళెలను చెప్పారు. ఇవి యించుమించు మధుర, ద్విరదగతి, తురగ వల్గన రగడలకు సమానమని చెప్పవచ్చు. ఇవేకాక అనంతుడు హయప్రచార, విజయ మంగళ, హరిగతి, విజయభద్ర, హరిణగతి, వృషభగతి రగడల్ని చెప్పాడు.

## ఈ రగడల సంగ్రహ స్వరూపం.

| రగడ పేరు | పాదమునకు గణములు | | మొత్తము పాదమునకు మాత్రల సంఖ్య | | | గతి | నిషేధ గణములు |
|---|---|---|---|---|---|---|---|
| 1. హయప్రచార | 3 | మాత్రల గణాలు | 4 | - | 12· | -త్ర్యస్ర | ల గణం |
| 2. తురగ వల్గన (ఉత్సాహరగళె) | 3 | ,, | 8 | - | 24 | ,, | ,, |
| 3. విజయమంగల | 3 | ,, | 16 | - | 48 | ,, | ,, |
| 4. మధురగతి (మందానల) | 4 | ,, | 4 | - | 16 | చతురస్ర | జగణం |
| 5. హరిగతి | 4 | ,, | 8 | - | 32 | ,, | ,, |
| 6. ద్విరదగతి (లలిత) | 5 | ,, | 4 | - | 20 | ఖండ | జల యగణం |
| 7. (వి) జయభద్ర | 5 | ,, | 8 | - | 40 | ,, | |
| 8. హరిణగతి | 2 | ,, | 7 | - | 14 | మిశ్ర | లగ, జగణాలు |
| 9. వృషభగతి | 4 | ,, | 7 | - | 28 | ,, | ,, |

లక్షణ గ్రంథాల్లో చెప్పక పోయినా కన్నడంలో 'తోమర రగళె' అనే పేరుతో ఒక రగడ ఉన్నట్లు తెలుగులో కూడా చాలా రకాల పేర్లతో ఈ రగడలు కనిపిస్తాయి. త్రిపురాంత కోదాహరణంలో 5+5+3+2 మాత్రల విన్యాసంతో 'హంసగతి రగడ', అయ్యల రాజు నారాయణామాత్యుని హంస వింశతిలో 4+4+4+4+8+4+4 మాత్రల విన్యాసంతో 'మంజుల రగడ', విష్ణుపల్లకి సేవా ప్రబంధంలో 5+5+5+5+5+4 మాత్రల విన్యాసంతో 'మయూరగతి రగడ', ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసంలో అచుంబిత చతుర్దశయమ కాంత్య నియమ భరణ, చరణ నిరోష్ఠ్య నిరోష్ఠ్య విరాజిత రగడ అనే పేరుతో ఆరు పాదాల రగడలు కనిపిస్తున్నాయి.

రగడల నడకలు చాలా వరకు జంతువుల నడకలతో సమానంగా భావించి చెప్పినట్లు కనిపిస్తుంది. వీటిలో గుర్రపు నడక సూచించే విధంగా హయప్రచార, తురగ వల్గన, విజయ మంగళ రగడలున్నాయి. అలాగే ఏనుగు నడకను సూచించే విధంగా ద్విరద, విజయ భద్ర రగడలున్నాయి. జింక పరుగు, ఎద్దు నడకల్ని సూచించే విధంగా హరిణగతి, వృషభగతి రగడలున్నాయి. ఉచ్ఛ్వాస నిశ్వాస ప్రమాణాలను సూచించే విధంగ హంసగతి రగడలు కనిపిస్తాయి. ఇవే కాకుండా విషయం బట్టి రగడల నామకరణం ఉంది. పాల్కురికి సోమన చెన్నబసవరగడలు, శ్రీనాథుని మణికర్ణికా ప్రభావ రగడ, పెద తిరుమలయ్య సుదర్శన రగడలు వస్తు సంబంధి రగడలనవచ్చు.

కన్నడ సాహిత్యంలో ప్రాచీన కాలం నుండీ రగడల ప్రయోగం ఉంది. పంప భారతం, పొన్నకవి శాంతి పురాణం, రన్నకవి అజిత తీర్థంకర పురాణతిలకం, నాగవర్మ కర్ణాటక కాదంబరి, శాంతి నాథకవి సుకుమార చరిత్ర, అగ్గళకవి చంద్రప్రభాపురాణ, ఆవణ్ణకవి వర్ధమాన పురాణ, బంధువర్మ జీవ సంబోధనె మొదలయిన చంపూ కావ్యములలో రగళెలు కనిపిస్తాయి. ఈలాగే తెలుగులో ప్రబంధ కవులు శృంగార వనవిహార వర్ణనలకు రగడల్ని వాడారు.

కన్నడంలో రగళెలకు ప్రత్యేక కావ్య గౌరవం పెంచిన కవి హరిహరుడు. ఇతని బసవరాజదేవర రగళె, నంబియర రగళె, ఆదయ్యరగళె, భృంగీశ్వర రగళె మొదలైనవి ప్రసిద్ధాలు. తెలుగులో నయన రగడ, తాళ్ళపాక పెద తిరుమలయ్య సుదర్శన రగడ, పాల్కురికి సోమన చెన్నబసవ రగడలు ప్రత్యేక కావ్య గౌరవం కలిగినవి.

రగడలకు సంస్కృత ప్రాకృత మాతృకల్ని చెప్పినట్లు గానే దేశిచ్ఛందో రీతులకు రగడల్ని మాతృకలుగా చెప్పడం కూడా ఒక సంప్రదాయం. ఉదాహరణ కావ్యాల్లోని కళికోత్కళికలు రగడల సంక్షిప్త రూపాలే. యక్షగానాల్లో కనిపించే రేకులు కూడా రగడల వికృతులే. రగడలకు, తాళాలకు జత కట్టడం కన్న త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్రజాతులని చెప్పడం సమంజసంగా వుంటుంది. కన్నండాంధ్ర భాషల్లోని అనేక జానపద గేయాలు, ఆధునిక గేయాలు రగడల వికారాలని చెప్పడం తప్పు కాదు.

తిలక శ్రియాలపన మివ చికురా ఇవ నైల్య ధైర్య సంపత్త్యా।
సువిలాసతయా వయసా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

కుంకుమ తిలకంతో ముఖంలాగ, నలుపు నిడుపులతో కేశసంపద లాగ, విలాసాలతో వయస్సులాగ ఓ సుందరీ! నీ దేహకాంతి యౌవనంవల్ల వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి

★ ★ ★

గుడ ఇవ పాకవిశేషా ద్దుగ్ధ మివ సితా విశేష సంపర్కాత్।
సంస్కారా దివశాకః తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

వండడంవల్ల బెల్లంలాగ, పంచదార కలపడంవల్ల పాలలాగ, తాళింపు మొదలయిన సరిస్కారంవల్ల కూరలాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహ కాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి

# మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవి) గారి
# నుడికడలి

శ్రీ ద్వా. నా. శాస్త్రి

''ప్రాకృతము సంస్కృతంబును ప్రకృతు లనిరి
అకట! తెనుఁగన్ననో వాని వికృతి అనిరి;
ఎన్ని వ్రాతలు చూచిన ఇదియె నిగ్గు;
తెనుఁగునకు బానిసతనంబు తెచ్చి యిడిరి''

''సంస్కృతము మహాభాషయై చనును గాక!
ప్రాకృతము గొప్పబాసయై పరఁగు గాక!
తెనుఁగు వానికి వికృతి అందనుట ఎట్లు
తాను ఒక నాటి పలుకయి తనరునపుడు!''

ఇవి ''కవిగారు''గా విశాఖ ప్రాంతంలో ప్రసిద్ధి పొందిన మారేపల్లి రామచంద్రశాస్త్రి గారి పద్యాలలో కొన్ని. 'కవిగారు' అంటే తెలుగుతనానికి మరో పేరు. ఒకసారి ఎవరో అన్నారట - ''తెలుగు ముక్కలకు వ్యుత్పత్తి ఏమిటి?'' అని. దానిని ''వెట్టి మాట'' గా భావించి తెలుగు తల్లి పెంపు సొంపులు వెల్లడించటానికే దీక్ష పూనారు.

''పలుకుల పొలకువల తెలియ గలరు. దగ్గర బాసలతో, దూరపు బాసలతో తెనుగునకు గల చుట్టరికమును పోల్చి చూచి తెలుగు మేలిమిని వీరు తెలిసి కొనినారు. తెలుగు పుట్టువును వెలిపెట్ట గల నిఘంటువును రచియింప తలపెట్టి యున్నారు'' అని ఆంగిరస - భాద్రపదం -'భారతి' సంచికలో కవి గారిని గురించి రాసింది అక్షరాలా సత్యం.

ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి సూర్య రాయాంధ్ర నిఘంటువు మచ్చుపదాల పీఠిక వెలువడింది. అందులో కూడా ''సాధన సామగ్రి చాలమిం జేసి'' తెలుగు పదాల ఉత్పత్తి, వ్యుత్పత్తులు రాయటం విరమించారని ప్రకటించబడింది. అది చూసిన కవిగారు ఎంతగానో 'నొచ్చుకొన్నారు'! ''తెలుగు తల్లిని గద్దె నెక్కించుట యెట్లు?'' అని తపన పడ్డారు. అందుకోసం తెలుగు తోబుట్టువుల (సోదరీభాషల) గుట్టు మట్టులే కాకుండా 'పలునాడుల లోని పలుకు చెలులు పుట్టు పెంపులు కూడా తెలుసు కోవటానికి కృషి చేశారు. తెలిసినవారందరినీ కలిసి, ఉత్తరాలురాసి పదాలను, అర్థాలను, వ్యుత్పత్తులను సేకరించారు. ప్రమాణాంధ్ర నిఘంటువుగా ''నుడికడలి''ని నిర్మించాలని తలపెట్టారు. జీవితంలో సగభాగం అందుకోసమే వెచ్చించారు. స్వాతంత్ర్య సమరయోధులై రాజకీయాలలో పాల్గొంటూ, సంఘసేవా కార్యక్రమాలు నిర్వహిస్తూ గ్రంథాలయోద్యమంలో తిరుగుతున్న కవిగారు, వాటిని పక్కనపెట్టి ''నుడికడలి'' కోసం ఎడతెరిపిలేకుండా పరిశ్రమించారు. జైలులో వున్నప్పుడుకూడా చిన్నచిన్న కాగితంముక్కలమీద ''చిత్తుప్రతి''ని తయారుచేసేవారు. అప్పట్లో కాగితం కరువు బాగా ఉండటంవల్ల సేకరించిన నుడుల్ని అకారాదిక్రమంలో రాసుకోవటంగాని, వ్యుత్పత్తులు- సోదరీభాషల పదాలు ఎత్తి రాసుకోవటంగానీ రశీదులవెనకాల రాసేవారు. కాంగ్రెసు కార్యాలయాల రశీదుల, గ్రంథాలయ రశీదుల, కరపత్రాల వెనుక భాగంలో అక్షరాలా ''చీమ తలకాయంత'' అక్షరాలలోనే రాసేవారు. ఒక అరటావులో సరిపడే విషయాన్ని (మేటర్) చిన్న రశీదు వెనుకాల వైపు సరిపెట్టేవారు. మనం వాటిని ''భూతద్దాల'' సహాయంతో మాత్రమే తెలుసుకోగలం.

''నుడికడలి'' అనే నిఘంటు నిర్మాణంలో కవిగారు పేరున్న పండితుల్ని కలిసి చర్చించారని డైరీలవల్ల తెలుస్తోంది. వారిలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు, తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రిగారు, గిడుగు రామమూర్తి పంతులుగారు ఉన్నారు. వేటూరివారి సహకారమే ఎక్కువగా లభించినట్టు తెలుస్తోంది. పురిపండా అప్పలస్వామిగారు, జయంతి సుబ్బారావుగారు కవిగారి శిష్యులే కాబట్టి ఈ పనిలో వారిద్దరూ బాగా కృషి చేశారు. ఎలమంచిలిలో ''తెనుగు గుడి'' కార్యాలయాన్ని దీనికోసమే ప్రారంభించారు. కొన్నాళ్ళు ఈ కార్యాలయం బ్రాంచి విజయవాడలో కూడా ఉండేది. కవిగారి అమ్మగారు, నాన్నగారు కొన్ని వ్యావహారికపు పలుకుబడులు సేకరించి వివరించేవారట! నిఘంటు నిర్మాణానికి ముందుగా కవిగారు

వేసుకొన్న ప్రణాళిక గమనించదగింది. ముందుగా 'శరము' (శబ్ద రత్నాకరము) లో లేని తెలుగునుడులు సేకరించారు. తర్వాత వాడుక నుడులు సేకరించారు. ఆ తర్వాత ద్రావిడభాషల్లో గల సజాతీయ పదాలు సేకరించారు. 'విద్యార్థుల నిఘంటువు' తయారుచేశారు. సామెతలు సేకరించి 'మేలుప్రతి' (ఇది నాదగ్గరవుంది) సిద్ధం చేశారు. ''క్రొత్త నుడులు - అసలు నుడులు'' అనే నోట్సు తయారు చేసుకున్నారు. ''తెనుగునుడి దండలు'' అనే వ్రాతప్రతిని కూర్చారు. ఇంతగా పూర్వరంగాన్ని తయారుచేసుకొని ''నుడికడలి''కి శ్రీకారం చుట్టారు.

ముందుగా ''మచ్చునుడులు'' ప్రకటించడానికి పూనుకున్నారు. కాని-డబ్బు కావాలిగదా! ఎలమంచిలిలోగల శ్రీరామలింగేశ్వరాలయంలో 1944 సెప్టెంబరు 30నుండి సత్రయాగం జరుగుతోంది. ఈ సంగతి ఆ సత్రయాగ కార్యదర్శియైన ఆకెళ్ళ సూర్యనారాయణగారి చెవిన పడింది. ఆయన డబ్బు సేకరించడానికి హామీ ఇచ్చారు. మొత్తంమీద 1945 అక్టోబరు 16న 'నుడి కడలి' - 'ప్రమాణాంధ్ర నిఘంటువు-మచ్చునుడులు' ప్రచురితమైంది. మద్రాసులో ఆనందప్రెస్‌లో ముద్రించబడిన ఆరు పేజీల ఈ ''మచ్చు నుడులు''కి ముందు మాటలో కవిగారు రాసిన ఈ మాటలు గుర్తుంచుకోదగినవి:

''ప్రమాణాంధ్ర నిఘంటువు లేనిలోటు తీర్చుటకే నేను నుడికడలి కూర్పు దలంచితిని. ఇప్పటికి దొరకిన కొంత సజ్జుతోడ కూర్చినవే యీ మచ్చు నుడులు. స్వభాషాభిమానులు నుడికడలిలోని మచ్చునుడులు పరికింతురుగాక! అందు ముఖ్యముగా హెచ్చునుడులును, ఉత్పత్తి, వ్యుత్పత్తులును ఉండుట గుర్తింతురుగాక! ప్రయోగాదులు పిదప నిండు నుడిదండలో హెచ్చుగా చేరగలవు. నెఱవాదులు నుడికడలికి మెలుగు తెచ్చు సలహోలే ఒసంగుదురుగాక! తెనుగు తోబుట్టువులారా! మీతోడ్పాటుతోడనే మీ కొఱకు నేను కూర్చుచున్న నుడికడలి పైకి రాగలదను నమ్మకముతో పాటుపడుచున్నాను. నుడికడలి పని మీ పని అనియే తలంచి మీకు మీకు తగినట్లు తోడ్పడుదురుగాక!''

ఈ నిఘంటువులో వాడిన సంకేతాలను ముందుగా ''గుర్తుల తెలివిడి'' అనే శీర్షికలో వివరించారు. కవిగారు అచ్చతెలుగు పదాలను వాడటంలో మక్కువ చూపేవారు. ఒక్కొక్కసారి ఆ ''అభిమానం'' అతిగా కనిపిస్తుంది. ఆయన ''గుర్తుల తెలివిడి'' తెలుసుకుందాం:

క్రొ.ను - క్రొత్తనుడి
ఎ.చె - ఎక్కటి చెయిది, అకర్మక క్రియ
చే - చేర్పు, ప్రత్యయము
పే - పేరు నుడి, నామ వాచకము
పే.తో - పేరుతోడు, విశేషణము
మా - మార్పునుడి, తద్భవము
స - సరినుడి, తత్సమము
- మొదలు, మూలము
వి - విప్పిడి, అవ్యయము
పొ.చె - పొందిమిచెయిది, సకర్మకక్రియ
గు - గుట్టుతెలిమి, వ్యుత్పత్త్యర్థము

'నుడికడలి'లో మచ్చునుడులలో కొన్నిటిని ఉదాహరిస్తాను-

**+ అంకినీడు:** నా.పే.గు ( అంకి + నీడు) దేశమునకు ప్రభువు. 1. ఱేడు, రాజు **(A King)**; 2. చల్లపల్లి జమీన్‌దారుల బిరుదుపేరు.

(+ ఈ గుర్తు గల నుడులు సూ.ని (సూర్యరాయాంధ్ర నిఘంటువు)లోకంటె ఇందు హెచ్చు)

**+ అంకిళ్ళు:** నా.పే. దవుడు క్రింది కీళ్ళు.

గు. ( అంకిలి + కీళ్ళు) శ.ర. + సా (సామెత). అంకిళ్ళు పడిపోయినపిదప, అత్తగారూ! అరిసెలు కావాలా అని అడిగినదట కోడలు.

**అలమేలు మంగ:** నా.పే. వేంకటేశ్వరుని భార్య

గు ( అలరు మేలు మంగ; త. అలర్మేళ్‌మంగై. (తామర) పూవుమీద ఉండునది. మా.రూ. అలమేల్మంగ (మారు రూపం).

**+ అనాస:** పోర్చు. మా.పే. 1. అనాసమొక్క, 2. అనాసపండు. **Pine-apple.** అనానస్.బ్రే. నానస్. దీనిపుట్టు చోట్లు మెక్సికో, పనామా. అనాస మొక్కలు కొండలమీద పెరుగును. అనాసపండు రసము ఆయుస్సును పెంచు నందురు.

**కురులు:** నా.పే. తలవెంట్రుకలు + గు (క.త. కురుళ్ = (చురుళ్) చుట్టుకొను) చుట్టుకొనునవి.

**తూర్పు:** నా.పే + గు. ప్రొద్దుపొడుచు దిక్కు; తూరు (ఉదయించు) + పు. మ.చుక్క తూఱింది(వా) - (వాడుకభాష).

**పిల్లి:** నా.పే. పులితెగలో చేరిన చిన్నజంతువు; మాంసము తినును. పో.కో. ఒ. బిలేఢ; తూ.బం. బిలాఇ; పాలి. బిలార,

బిలాల, బిరాల; హిం. బిల్లా = మగపిల్లి, బిల్లీ = ఆడుపిల్లి, A Cat.

నిఘంటు రచనావిధానం గమనిస్తే కవిగారు సోదరభాషా పదాలతోనే కాక గ్రీకు, తుర్కీ, పారసి, పోర్చుగీను, ఫ్రెంచి, బ్రెజిలువంటి భాషాపదాలతోకూడా సరిపోల్చినట్టు తెలుస్తుంది. కొన్ని పదాలకి వ్యుత్పత్తులు చెప్పినవారిపేర్లు ఆ పదాలప్రక్కనే వే.ప్ర., వే.వేం. మ.సో. అని తెల్పడం విశేషం. ఏ పదం ఎవరు సూచించారో గుర్తుపెట్టుకొని కృతజ్ఞతతో సూచించడం కవిగారి వ్యక్తిత్వానికి చిహ్నవతాక! కొన్ని శాసనాలనుంచి ఉదాహరణలు ఇచ్చారు. తొలిసారిగా (బ్రౌణ్యంతప్ప) వాడుక పదాలకి, సామెతలకి ప్రాధాన్యమిచ్చిన నిఘంటువు ఇదేనని చెప్పవచ్చు. ఈ మచ్చునుడులలో 125 పదాలను పేర్కొన్నారు. బాంబు, బిల్లు, బాజావంటి అన్యదేశ్యాలను కూడా తీసుకున్నారు. కొన్నిటికి కావ్య ప్రయోగాలు చూపారు. 'బస్తా' పదం పారసీనుంచి వచ్చినదని కవిగారు తెల్పారు. (కాని పురిపండావారు ఇది 'బెంగాలీ' పదం అనేవారు). వియ్యంకుడు, అర్ధంకి, అందం, అండీ వంటి పదాలకి ఇందులో వ్యుత్పత్తులు వివరించారు. 'తెనుగు'కి తెన్ + ఉన్ + గు = దారిలో ఉండువారి భాష, ఇది తెలుగు రూపాంతరముకాదు. త్రిలింగ వికృతి కాదు. ఎక్కటినుడి (తెన్ - దక్షిణము, దక్షిణదేశభాష అని బ్రౌ) అని కవిగారు వ్యుత్పత్తి తెలిపారు. అయితే

తెల్ + ఉన్ + గు = తెలుంగు - తెలుఁగు

తెలి(వి + ఉన్ + గు) = తెలుంగు

తెల్లగా ఉండువారి భాష, తెలివితో ఉండువారి భాష అనే వ్యుత్పత్తుల్ని భాషాశాస్త్రవేత్తలు అంగీకరించలేదు. కవిగారికి ఈ నిఘంటురచనలో ఎన్నో పుస్తకాలు, శాసనాలు తోడ్పడ్డాయి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఇచ్చిన శాసనపాఠాలు - నోట్సు, కోరాడ రామకృష్ణయ్యగారు ఆదరంగా ఇచ్చిన "Studies in Dravidian Philology" నా దగ్గర ఉన్నాయి. వీటినిండా కవిగారి క్రీగీటులు, పువ్వుగుర్తులు, అక్కడక్కడ చిన్న సవరణలు కనిపిస్తాయి. ఇంతగా శ్రమపడి కాగితం ముక్కలపై తయారుచేసిన కొంతభాగం వరదల్లో నష్టమైపోయింది. మిగిలిన భాగానికి ''మేలుప్రతి'' తయారుచేశారు. ఆ ప్రతికూడా అలికిపోయి ''ఎంతోకాలం వుండను'' అన్నట్టు వుంది. (ఇది పురిపండావారు నాకిచ్చారు). ఇంతటి విలువైన నిఘంటువు వెలుగులోకి రాకపోవడం ఎంత బాధాకరం! అందుకే కవిగారు ఇలా అన్నారు:

''తల్లిపలుకు పై మన్నన ఎల్లరకును ఉండు నందురు. అట్టి మన్నన మన తెలుగువారికి పెక్కురకు తెనుగునందు సున్న! ఇది తెనుగు తల్లి నోచుకొన్న కొఱనోము పంట!!''

పర్యంక కాయమాన శ్రీరివ నవ విద్రుమాంచితై శ్చరణైః।
తానీవ రుచిర పాత్రైః తారుణ్యా త్తవ విభాతి తను శోభా॥

కొత్త పగడాల కోళ్లవల్ల పందిరి పట్టె మంచంలాగ, అందమైన పాత్రలలో (పళ్లెంలో) పెట్టడంవల్ల ఆపగడాల కోళ్లలాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి

# ని... నిర్మాణంలోని వివిధ దశలు

శ్రీ కె. రామాంజనేయులు

తెలుగుభాషలో నిఘంటు నిర్మాణం క్రీ.శ. 17వ శతాబ్దంనుండి జరుగుతూ వస్తూంది. మొదట పద్య నిఘంటువులు ఆతర్వాత వచన రూపంలో ఉన్న నిఘంటువులు వెలువడ్డాయి. పద్య నిఘంటువులు విషయక్రమంలో కూర్చబడగా వచన రూపంలో ఉన్నవి అకారాది క్రమంలో కూర్చబడ్డాయి. పద్య నిఘంటువుల్లో పదాలు వాటి పర్యాయపదాలు, నానార్థాలు అన్నీ ఛందోబద్ధమైన కవిత్వ రూపంలో ఉంటాయి. పదజాలమంతా కంఠస్థం కావాలనే ఉద్దేశంతో పద్య నిఘంటువులు బయలుదేరాయి. ఇవి పండితులకే ఎక్కువగా ఉపయోగపడతాయి. పద్య నిఘంటువులపై సంస్కృతంలో శ్లోకరూపంలో ఉన్న కోశాల ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. భాషలో వచ్చిన పరిణామాల దృష్ట్యా పద్య నిఘంటువులు తగ్గిపోయి, వచన నిఘంటువుల బల్యం పెరిగింది. ఇవి సామాన్య జనాదరణ పొంది బాగా చుర్యం పొందాయి. తత్ఫలితంగా పద్య నిఘంటువులకు నం లేకుండా పోయింది. వచన నిఘంటువుల ఆవిర్భావానికి శ్చాత్య నిఘంటువుల ప్రభావం ప్రధానకారణం.

తెలుగు భాషలో నేడు అనేక రకాల నిఘంటువులు దర్శనమిస్తాయి. సమాజంలో వస్తున్న పరిణామాలవల్ల నిఘంటువుల ఆవశ్యకత కూడా పెరుగుతూ వస్తోంది. ఇప్పుడున్న నిఘంటువులు ఆధునికమైన అవసరాలను అంతగా తీర్చలేకపోతున్నాయి. ఇంగ్లీషులాంటి భాషలతో పోల్చిచూసినపుడు నిఘంటు నిర్మాణంలో మనం చాలా వెనుకబడి ఉన్నామని చెప్పవచ్చు. ఇంగ్లీషులో నిఘంటు నిర్మాణం ఒక శాస్త్రంగా అభివృద్ధి చెందింది. మనభాషలో ఇప్పుడిప్పుడే శాస్త్రీయ అవగాహన కలుగుతోంది.

నిఘంటు నిర్మాణం ఒక నిర్దిష్టమైన ప్రణాళిక ఆధారంగా జరుగుతుంది. ప్రణాళికలో నిఘంటు స్వభావం, ఉద్దేశం, ప్రయోజనాలను స్పష్టంగా పేర్కొనాలి. అలాగే నిఘంటువులో ఉపయోగించే భాష, సమాచార సేకరణ పద్ధతులు, ఎక్కడినుండి సమాచారాన్ని సేకరిస్తామో వాటి వివరాలు సూచించాలి. ఇంకా నిఘంటు పరిమాణం, దానికయ్యే ఖర్చు, కాలవ్యవధి, సిబ్బంది వివరాలు మొదలైన అంశాలుకూడా ప్రణాళికలో వివరించాలి.

నిఘంటు నిర్మాణంలో ప్రధానంగా నాలుగుదశల్ని పేర్కొనవచ్చు. అవి:-

1. సమాచార సేకరణ (Collection of material)
2. అర్థ రచన (Writing of meaning)
3. సంపాదకత్వం (Editing)
4. ముద్రితప్రతి తయారీ (Preparation of Press Copy)

## 1. సమాచార సేకరణ

ఈ దశలో నిఘంటు నిర్మాణానికి అవసరమైన సమాచారాన్ని సేకరించడం, సేకరించిన సమాచారంనుండి నిఘంటువుకు యోగ్యమైన ఆరోప పదాలను ఎన్నుకోవడం, ఎన్నుకున్న ఆరోప పదాలకు తగిన సమాచారం కూర్చడం జరుగుతుంది.

నిఘంటు నిర్మాణానికి సమాచారసేకరణ చాల ప్రధానమైన అంశం. లిఖిత సాహిత్యమున్న భాషలో నిఘంటు నిర్మాణం చేసేటప్పుడు ఆధార గ్రంథాలనుండి యోగ్యమైన పదాలను ఏరి, ఒక్కోదానిని ఒక్కో కార్డుమీద విడిగా రాసుకోవాలి. ఇలా రాసుకోవడాన్నే excerption of text అంటారు. పదంతోపాటు దాని సందర్భం (context) కూడా ఇవ్వాలి. అంతేకాదు అది ఎక్కడినుండి తీసుకున్నదీ ఆ సమాచారం కూడా ఇవ్వడం సముచితం.

లిఖిత సాహిత్యంలేని భాషల విషయంలో oral texts (కథలు, పాటలు మొదలైనవి) నుంచి సమాచారాన్ని సేకరించవలసి ఉంటుంది. అయితే ఈ మౌఖిక సాహిత్యంలో ప్రాచీన రూపాలు (archaic forms) చాలా ఉంటాయి. అందువల్ల చర్చలు, సంభాషణలు మొ. వాటినుంచి కూడా సమాచారం సేకరించడం మంచిది.

Overall descriptive dictionary తయారు చేస్తున్నట్లయితే అన్ని రకాల texts నుంచి పదసేకరణ చెయ్యాలి. Standard descriptive dictionary మాత్రమే లక్ష్యమైతే ప్రామాణికమైన texts నుంచి మాత్రమే పదసేకరణ చెయ్యాల్సి

ఉంటుంది. ఇలా ఒక్కో రకమైన నిఘంటువుకి ఒక్కోరకంగా సమాచారం సేకరించాలి.

Diglossia ఉన్న భాషల్లో (ఉదా. తమిళం) లిఖిత రూపానికీ వాగ్రూపానికీ చాల తేడా ఉంటుంది. అలాంటప్పుడు నిఘంటువు తయారు చేస్తున్నప్పుడు పరిధిని నిర్ణయించుకోవచ్చు. లిఖిత ప్రమాణభాష (Literary standard language) కు గాని, కేవలం వాగ్రూపంలో ఉన్న వ్యవహారభాష (spoken language) కు గాని నిఘంటువు తయారు చేయవచ్చు. నిఘంటువులో ప్రాచీన (archaic), అర్వాచీన (neologisms) రూపాలు, పలుకుబళ్ళు (phrases), జాతీయాలు (idioms) చేర్చడం, చేర్చకపోవడమనేది నిఘంటు పరిమాణంమీద, స్వభావంమీద ఆధారపడి ఉంటుంది.

పదాలతోపాటు సందర్భాల్ని కూడా సేకరించడంవల్ల ఆ పదాలు ఏ Signification లో ఉపయోగించబడినవో తెలుస్తుంది. ఫలితంగా ఆ అర్థం, దానికున్న వ్యాకరణాంశాలకు సంబంధించిన కొంత సమాచారం మనకు బోధపడుతుంది. సందర్భం సాధ్యమైనంతవరకు సంక్షిప్తంగాను, స్పష్టంగాను ఉండాలి. ఒకే ఒక్క సందర్భం ఒకపదానికి చెందిన మొత్తం అర్థాన్ని వివరించక పోవచ్చు. కాబట్టి చాల సందర్భాల్ని సేకరించవలసి ఉంటుంది.

పదంతోపాటు దాని అర్థాన్ని స్పష్టంగా, శ్లేషరహితం (un-ambiguous) గా బోధించే సందర్భాన్ని ఒక నిర్ణీత పరిమాణంలో ఉన్నకార్డుమీద ఎత్తి రాసుకోవాలి. పదానికి సంబంధించిన వ్యాకణాంశాన్ని సంకేతరూపంలో కూడా సూచించాలి. ఆరోపపదం చదవటానికి వీలుగా ధ్వన్యాత్మక లిపి (phonetic script) లోగాని, వర్ణాత్మకలిపి (phonemic script) లోగాని ఇస్తే ఇవ్వవచ్చు. ఇంకా రకరకాల సమాచారాన్ని ఇవ్వదలుచుకుంటే సులభంగా కనుక్కోడానికి వీలుగా రంగు కార్డుల్ని కూడా ఉపయోగించవచ్చు. ఈ కార్డులమీద ఉన్న సమాచారం కేవలం నిఘంటు నిర్మాణానికి మాత్రమే కాకుండా భాషా పరిశోధనకు కూడా బాగా ఉపయోగపడుతుంది. అందువల్ల ఈ కార్డుల్ని జాగ్రత్తగా అకారాదిక్రమం (alphabetic order) లో భద్రపరచుకోవాలి. ఇలా నిఘంటు నిర్మాణంకోసం ఉపయోగించిన సమాచార సామ ని భద్రంగా ఉంచిన ప్రదేశాన్ని నిఘంటు పరిభాషలో 'లె ]కో గ్రాఫిక్ ఆర్కైవ్స్ లేదా స్క్రిప్టోరియమ్' అని వ్యవహ స్తారు. ఇది ఏ భాషకు సంబంధించింది అయినప్పటికీ ఆభాషకు అమూల్యమైన ఆస్తిగా నిలిచిపోతుంది.

పదసేకరణ పూర్తి అయినతర్వాత ఈ కార్డులలో పునరావృతమైన పదాలను పరిహరించి, నిఘంటువుకి యోగ్యమైన పదాలనెన్నుకుని, ఆ పదాలకు ఆరోప పదస్థానాన్ని కల్పించాలి. కార్డులమీద రాసుకున్న పదాలను, అవి వచ్చే సందర్భాలను అన్నిటిని మళ్ళీ పెద్ద పొడుగాటి కాగితంమీదికి ఎక్కించాలి. ఈ కాగితాలమీద ఉన్న ఆరోపాలకు అర్థాలు రాయడం జరుగుతుంది. కాగితాల్లోని ఆరోపాల్ని మాత్రమే తీసుకుని చెకింగ్‌కోసం ఒక పుస్తకంలో రాసి ఉంచాలి. ఇలా రాసి ఉంచిన పదాల జాబితానే 'మాస్టర్ లిస్ట్' అని వ్యవహరిస్తారు.

ఆరోప పదాలుగా ఎన్నుకునేటప్పుడు ఎలాంటి పదాల్ని స్వీకరించాలి అన్నది ముందుగా నిర్ణయించుకోవాలి. అనుకున్నమేరకు ఆరోపాల్ని ఎన్నుకోవాలి.

స్వతంత్ర ప్రయోగార్హత కలిగిన ఏక పదాలను ఆరోపాలుగా గ్రహించవచ్చు. అయితే ఇవి అతి సామాన్యమైనవి కాకూడదు. నిఘంటువు భాషను నేర్చుకోడానికి ఉద్దేశింపబడిందయితే సామాన్య పదాలను కూడా తీసుకోవచ్చు. మాతృభాషలో పరిజ్ఞానాన్ని పెంపొందించుకోడానికి ఉద్దేశింపబడితే విలక్షణార్థ బోధక పదాలనే ఎన్నుకోవలసి ఉంటుంది. ఆరోపపదాలు అనేక రకాలుగా ఉంటాయి. ఏక పదం అరోపంగా ఉండవచ్చు. ఉదా: అపోహ, ఉదంతం, గన్నీ, అప్పీలు మొదలైనవి. సమస్తపదాలు (compounds) ఆరోపాలుగా ఉండవచ్చు.

ఉదా: అడవిఅన్నలు, అభయారణ్యం, అభిశంసన తీర్మానం, అలీనదేశం మొదలైనవి.

విడదీయరాని సంబంధ కలిగిన పదాలు (set expressions) కూడా ఆరోపాల స్థానాన్ని పొందుతాయి. ఉదా: ఇష్టాగోష్ఠి, ఒడిదుడుకలు మొదలైనవి. ఏక పదస్ఫూర్తినిచ్చే అనేక పదబంధాలు (multi-word lexical units) కూడా ఆరోపాలుగా స్వీకరించబడుతాయి. ఉదా: దృశ్య శ్రవణ విద్యావికాసకేంద్రం, గ్రామ స్వయం సంరక్షణ సమితి మొదలైనవి.

ఒక పదానికి విభిన్న ప్రత్యయాలు చేరగా ఏర్పడే పదరూపాలన్నిటినీ కలిపి ఆపదానికి సంబంధించిన Paradigm అని అంటారు. నిఘంటువుల్లో అన్ని రూపాలను ఆరోపాలుగా పేర్కొనడం అసాధ్యం. అనవసరం కూడా. కాబట్టి మొత్తం Paradigm నుంచి ఒక రూపాన్ని ప్రతినిధిగా ఎంపికచేసి ప్రధాన ఆరోపంగా ఇవ్వడం జరుగుతుంది. ఈ ప్రధాన ఆరోపాన్నే ఇంగ్లీషులో (నిఘంటు పరిభాషలో)

canoncial form అని వ్యవహరిస్తారు. ప్రధాన ఆరోపాల ఎంపిక భాషా సంప్రదాయాన్ని బట్టి ఉంటుంది. తెలుగులో ఏకవచన రూపాన్ని నామపదానికి ప్రధాన ఆరోపం (canonical form) గా గ్రహించడం సంప్రదాయం. క్రియల విషయంలో ప్రాతిపదిక రూపంతో సమానమైన విధ్యర్థక రూపాన్ని (imperative form) ప్రధాన ఆరోపంగా గ్రహిస్తారు.

ప్రధాన ఆరోపంగా ఎంపికచేసే రూపంనుంచి అదే paradigm కి చెందిన ఇతర రూపాలను సులభంగా నిర్మించగలగాలి. Paradigm లో క్రమరహిత రూపాలు (irregular forms) ఉన్నట్లయితే ప్రధాన ఆరోపాలతోపాటు వాటిని కూడా ఇచ్చి ప్రధాన ఆరోపానికి క్రాస్ రెఫరెన్సు ఇవ్వవచ్చు.

కొన్ని పదాలకు ఏకవచన రూపాలు మాత్రమే ఉండి బహువచనంలో ప్రయోగాలు ఉండవు. మరికొన్ని పదాలకు బహువచన రూపాలు మాత్రమే ఉండి ఏకవచన రూపాలు ఉండవు. ఇలాంటి చోట్ల వ్యవహారంలో ఉన్న పదాలనే ప్రధాన ఆరోపాలుగా ఇవ్వవలసి ఉంటుంది.

ఒక పదంనుంచి ఏర్పడిన నిష్పన్నరూపా (derivatives) లను కూడా ఆరోపాలుగా స్వీకరించాలి.

కొన్ని ప్రాచీన రూపాలు నేటికీ అనేక సందర్భాల్లో ప్రయుక్తమవుతూ ఉంటాయి. వాటినికూడ నిఘంటువుల్లోకి ఎక్కించవచ్చు. ఉదా: సభాపతి, శ్రీముఖం మొదలైనవి. అలాగే కొన్ని కొత్తపదాలుకూడా భాషలో వచ్చి చేరుతుంటాయి. వాటికి కూడా నిఘంటువుల్లో చోటు కల్పించవలసి ఉంటుంది. ఉదా: కోటరీ, ఫ్లీనరీ మొదలైనవి కొన్ని ఆంగ్లపదాల సంక్షిప్తాక్షరాలు స్వతంత్ర పదాల్లాగా ప్రయోగింపబడుతుంటాయి. వాటినికూడా ఆరోపాలుగా గ్రహించవచ్చు. ఉదా. ఫెరా (FERA = Foreign Exchange Regulation Act), అవాక్స్ (AWCS = Airborne warning and controlling system) మొదలైనవి. నిఘంటు స్వభావాన్నిబట్టి పలుకుబళ్ళు, జాతీయాలను కూడా ఇవ్వవచ్చు.

## 2. అర్థరచన

పెద్ద పొడుగాటి కాగితంపై సందర్భంతోపాటు రాసుకున్న ఆరోపాలకు సందర్భాన్ని పురస్కరించుకొని నిర్వచనాలు (definitions), సమానార్థకపదాలు (synonyms) వ్రాయడం జరుగుతుంది. నిర్వచనాలు ఇవ్వడంలో నిఘంటుకారులు చారిత్రక, సామాజిక, సాంస్కృతిక, పౌరాణిక, జానపద సంప్రదాయాల నేపథ్యాన్ని కూడా కలిగి ఉండాలి. అలాగే ఇతర విషయాలు కూడా తెలిసి ఉండాలి. లేకపోతే అలాంటి ఆరోపాలకు అర్థం స్పష్టంగా బోధపడేటట్టు రాయడం కష్టమవుతుంది.

నిఘంటుకారులు నిర్వచనాలు రాసేటప్పుడు కొన్ని నియమాలను పాటించవలసి ఉంటుంది. నిర్వచనాల్లో క్లిష్టపదాలు వాడకూడదు. ఆరోపాల్లో ఇచ్చిన పదాలను నిర్వచనంలో పునరావృతం చేయకూడదు. ఉదా: ఘాతుక చర్య; దారుణం, అమానుషం అయిన పని. నిర్వచనం చాల సూటిగా, శ్లేషరహితంగా, స్పష్టంగా ఉండాలి. నిఘంటువులోని పదాలు కాకుండా వేరే పదాలను ఉపయోగించకూడదు. వీలైనంతవరకు నిర్వచనం ఒకే వాక్యంలో ఉండాలి. ఆరోప పదం వచ్చే సందర్భాలనన్నిటిని బాగా పరిశీలించి సందర్భానికి అతికేవిధంగా నిర్వచనం ఇవ్వాలి. ఆ సందర్భంలోని ఆరోప పదస్థానంలో నిర్వచనాన్ని ఉంచి చూస్తే అర్థం సరిగా సరిపోవాలి. ఉదా: గందరగోళం; అర్థంకాని అయోమయ పరిస్థితి; తీర్మానాన్ని తిరస్కరించడంతో సభలో గందరగోళం ఏర్పడి ఎవరు మాట్లాడుతున్నారో వినిపించలేని పరిస్థితి ఏర్పడింది. ఇక్కడ సందర్భంలోని 'గందరగోళం' అన్న ఆరోప పదస్థానంలో 'అర్థంకాని అయోమయ పరిస్థితి' అన్న నిర్వచనాన్ని ఉంచి చూస్తే అర్థంలో ఏమాత్రం తేడా కనిపించదు. ఆరోప పదం విశేష్యరూపమైతే నిర్వచనం కూడా విశేష్యరూపమై ఉండాలి. ఉదా: అజమాయిషీ (విశేష్యం): క్తి లేదా సంస్థ పనితీరుమీద ఉన్న అదుపు, ఆరోపపదం 'యా రూపమైతే నిర్వచనంకూడా క్రియారూపంలోనే ండాలి. ఉదా: అజమాయిషీ చేయు (క్రియ): పనులు సరిగా జరుగుతున్నదీ లేనిదీ దగ్గరుండి ఎప్పటికప్పుడు పరిశీలించు; పర్యవేక్షించు. ఈవిధంగా ఆరోపపదానికి నిర్వచనానికీ పొంతన (agreement) ఉండాలి. నిర్వచనాల్లో అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలు చోటుచేసుకోకుండా జాగ్రత్త వహించాలి. సమానార్థకపదాలు (synonyms) దొరికితే వాటిని నిర్వచనంతోపాటు ఇవ్వాలి. ఇంకా అర్థ స్పష్టతకోసం నిర్వచనాల్లోగాని, సమానార్థక పదాల్లో గాని గ్లాసెస్ (glosses) ని ఉపయోగించవచ్చు. ఉదా: అప్రమత్తం చేయు. (రక్షకదళ యంత్రాంగాలను) విపత్కర పరిస్థితులను ఎదుర్కొనేందుకు సంసిద్ధంగా ఉంచు. బ్రాకెట్లలోని పదాలద్వారా ఇక్కడ అర్థస్పష్టత సాధించడం జరిగింది. గ్లాసెస్‌ని ఎప్పుడూ బ్రాకెట్లలోనే ఇస్తారు. ఒక్కోసారి నిర్వచనాల్లో పదాలకున్న వాచ్యార్థాల్ని కాకుండా అవి ఉద్దేశించిన లక్ష్యార్థాలను మాత్రమే ఇవ్వవలసి ఉంటుంది. ఉదా: శృంగభంగం : దీనికి 'కొమ్ములు విరిగి బోడితల కావడం' వాచ్యార్థమయితే పరాభవం (అవమానం) అన్నది లక్ష్యార్థం. ఈ విధంగా అర్థరచనలో అత్యంత శ్రద్ధాసక్తుల్ని చూపించవలసి ఉంటుంది.

## సంపాదకత్వం

అర్థ రచనపూర్తి అయిన తర్వాత నిఘంటువుకై కూర్చిన అన్ని అంశాలను జాగ్రత్తగా పరిశీలించవలసి ఉంటుంది. నిఘంటువులో ప్రధానంగా ఈ క్రింది అంశాలుంటాయి. 1) ప్రధాన ఆరోపం (head word) 2) వర్ణక్రమం, ఉచ్చారణ (Spelling and Pronunciation) 3) వ్యాకరణాంశాలు (grammatical categories) 4) అర్థం (meaning) 5) సందర్భం (context or illustrative example) 6) నిష్పన్నరూపాలు (derivatives), 7) పలుకుబళ్ళు, జాతీయాలు (phrases and idioms) 8) వ్యుత్పత్తి (etymology) 9) సమానార్థకాలు, వ్యతిరేకార్థకాలు (synonyms and antonyms).

ఈ పై అంశాలన్నీ ప్రతి ఆరోపం (entry) లోనూ ఉంటాయి. వీటిని రెండు భాగాలుగా గుర్తిస్తారు. మొదటి భాగం లేదా ఎడమవైపు భాగాన్ని 'లెమ్మా' (lemma) అంటారు. ఇందులో ప్రధాన ఆరోపం, ఉచ్చరణ రూపం, వ్యాకరణ సమాచారం (భాషావిభాగం, అకర్మక సకర్మక మొ. విషయాలు) ఉంటాయి. రెండోభాగం లేదా కుడివైపు భాగాన్ని 'అర్థ విభాగం' అంటారు. ఇందులో పదానికి సంబంధించిన అర్థం, సందర్భం, తదితర విషయాలు ఉంటాయి. ఇంకా మొదటి భాగాన్ని వర్ణితభాగం (described part) అనీ, రెండోభాగాన్ని 'వర్ణనభాగం' (description part) అని వ్యవహరిస్తారు.

నిఘంటువులో అర్థపరంగానూ, నిష్పాదన పరంగానూ సంబంధం ఉన్న అన్ని పదాలను nesting పద్ధతిలో ఒకచోట చేరుస్తారు. ప్రాథమిక రూపం నుండి నిష్పన్నమయ్యే రూపాలను, సమాసాలను, నుడికారాలను nesting ద్వారా వ్యక్తం చేస్తారు. పునరావృతమయ్యే ప్రాథమిక రూపం స్థానంలో emdash లేదా swung dash (~) కాని ఉంచి దానితర్వాత nest చేసిన భాగాన్ని పేర్కొంటారు. ఉదా: సలహా: ~ దారు: ~ సంఘం. ఇలా nesting చేసిన వాటిని 'ఉప ఆరోపం' (subentry) అంటారు. నిఘంటువుల్లో స్థలం ఆదాచేయటానికి, పదాలు పునరావృతం కాకుండా ఉండటానికి ఈ nesting పద్ధతిని ఉపయోగిస్తారు. అదేవిధంగా క్రాస్ రెఫరెన్సు కూడా తోడ్పడుతుంది.

ఈ దశలో ప్రతి ఆరోపాన్ని చెక్‌చేసి, అన్ని అంశాలు దానికి సమకూరాయా లేదా చూడాలి. అంతా పూర్తి అయిన తర్వాత లెక్సికోగ్రాఫర్స్ ఒకరికొకరు బదలీ చేసుకుని క్రాస్ చెకింగ్ చేస్తే ఎక్కడైనా పొరపాటున దొరలిన తప్పుల్ని కూడా సరిదిద్దడానికి అవకాశం ఉంటుంది. ఆరోపానికి సంబంధించిన సమాచారమంతా ఒక క్రమపద్ధతిలో ఉండాలి. భాషకూడా ఒకే విధంగా ఉండాలి. శైలికి ఆమోద యోగ్యంగా ఉండాలి. పదసేకరణ మొదలుకొని పదాల అమరిక (arrangement of entries) దాకా జాగ్రత్త వహించాలి. ఇలా ప్రతి అంశంలోను తగిన మెలకువలు తీసుకుని పాఠకుల్ని ఆకర్షించేవిధంగా నిఘంటువును రూపు దిద్దే అవకాశం సంపాదకత్వంలో ఉంటుంది.

## 4. ముద్రితప్రతి తయారీ

నిఘంటువు నిర్మాణంలోని ప్రధానమైన మూడుదశలు గడచిన తర్వాత పరిపూర్ణమైన రూపంతో ఉన్న ఆరోపపదాలను అకారాది క్రమంలో మొదట కార్డులమీది కెక్కించి, ఆ తర్వాత నిడివిగల కాగితంపై ఒకదాని తర్వాత ఒకటి వచ్చేట్టురాసి ముద్రిత ప్రతిని తయారుచేయాలి. ఈ చివరిదశలో ఏమైనా మార్పులు చేయవలసి ఉంటే చేసుకోవచ్చు. క్రాస్ రెఫరెన్సులు చూసుకోవాలి. వివిధ అంశాల్ని సులభంగా గుర్తుపట్టడానికి విరామ చిహ్నా (Punctuation Marks) లను క్రమ పద్ధతిలో వాడాలి. సారూప్య పదా (Homonyms) లను, అనేకార్థ పదా (polysemous words) లను జాగ్రత్తగా ఇవ్వాలి. అనేకార్థ పదాల్లో ప్రధానమైన అర్థా (dominant meaning) న్ని మొదట ఇచ్చి అనుషంగికమైన అర్థాలను తరా త క్రమపద్ధతిలో ఇవ్వాలి. Labels విషయంలో కూడా జాగ్ర వహించవలసి ఉంటుంది. సరిగా ఇవ్వకపోతే అర్థాలు మారి యే ప్రమాదం ఉంది. పరిధిని నిర్ణయిస్తాయి.

ఇకపోతే నిఘంటువుకు ఉపోద్ఘాతం (Preface) మార్గదర్శిగా ఉంటుంది. ఇందులో నిఘంటువు పరిధి, పరిమాణం, ఉద్దేశం మొదలైన అంశాలకు సంబంధించిన సమాచారం ఉంటుంది. నిఘంటువుతయారీలో అనుసరించిన పద్ధతులు, విషయసేకరణ విధానం మొదలైన విషయాలు కూడా ఇక్కడ నమోదు చేయాలి. ఉచ్చారణకు సంబంధించిన విషయాలను వివరించి, ధ్వనాత్మక పట్టిక (phonetic chart) ను, వర్ణాత్మక పట్టిక (phonemic chart) ను ఇవ్వాలి. నిఘంటువు కోసం పనిచేసిన సిబ్బంది విధి నిర్వహణను కూడా రికార్డు చేయాలి. నిఘంటువు చివర అతి ముఖ్యమైన అనుబంధాలను చేర్చడం ఆనవాయితీ.

నిఘంటువు బాహ్య సౌందర్యంకూడా పాఠకుల్ని ఆకర్షిస్తుంది. కాబట్టి నిఘంటువులో అందమైన letter types ని ఉపయోగించాలి. దాని కనుగుణంగా మంచి నాణ్యమైన కాగితాన్ని వాడాలి. ముఖపత్రాన్ని కూడా అందంగా తీర్చి దిద్దాలి.

# తెలుగు సాహిత్యం - కొన్ని నిజాలు

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

ఆముక్తమాల్యద, మనుచరిత్ర, పారిజాతాపహరణం - ఈ మూడు ప్రబంధాలూ ఆధారంగా చేసుకుని శ్రీకృష్ణ దేవరాయల కాలంనాటి ప్రజలలో కనిపించే రాసిక్యాన్ని గుర్తించేందుకు పూనుకున్న స్వర్గీయ శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ తమ వ్యాసం ఆరంభంలోనే వజ్రపు తునుక వంటి ఒక మాట అన్నారు.

**''సత్యమగు విషయమును మాత్రమే చెప్పవలయునను నిర్బంధ మా గ్రంథకర్తలలో నెవరు గాని చేసికొన్నవారు కారు. మఱియు, అనుభవమునకు రానివి, అసత్యములైనవి ఎన్ని విషయములు చెప్పినను వారి నాక్షేపించిన వారా కాలమున లేరు''.**

సుమారు రెండు వందల ఏళ్లక్రితం ఉన్న సాహితీ వ్రతులకంటె మన సాహిత్యం పూర్వాపరాలను పరామర్శించు కుని రాగద్వేష విరహితమైన, వస్తునిష్ఠమైన దృష్టితో మన సాహిత్యంలో మంచిచెడ్డలను నిర్ణయించుకునేందుకు అవసర మైన అనుకూల పరిస్థితులు ఈ నాడు మనకు ఎక్కువగా ఉన్నాయి. తెలుగు, సంస్కృతం - రెండే వెనుకటి వారికి తెలుసు. సంస్కృతం స్థాయిని తెలుగు ఎన్నడూ అందుకోలే దనే 'ఆత్మన్యూనతాభావం' (inferiority complex) వారిలో ఉండేది. 'దేశభాషలందు తెలుగు లెస్స' అన్న రాయలవారి సుభాషితం, 'ఆంధ్రత్వ, మాంధ్ర భాషా చ నాల్పస్య తపసః ఫలమ్' అని అప్పయ్య దీక్షితుల వారిచ్చిన ప్రశంసాపత్రం పదే పదే గుర్తు చేసుకుంటూ ప్రపంచంలో సంస్కృతం తరువాత తెలుగు కవిత్వం అంత గొప్పది మరి లేదని బుజాలు ఎగుర వేస్తూ ఉండేవారు. ఈ నాడు మనకు భారతదేశంలోని ఇతర సాహిత్యాలతోనే కాకుండా ఇంగ్లీష్, ఫ్రెంచ్, జర్మన్, రష్యన్ మొదలైన పాశ్చాత్య సాహిత్యాల తోనూ, వాటిలోని కవిత్వపు విలువలతోనూ తగినంత పరిచయం ఏర్పడింది. ఇతర సాహిత్యాల దృష్ట్యా మన తెలుగు సాహిత్యం మంచి చెడ్డలను నిజాయితీతో మదింపు కట్టుకోగల లో ఈనాడు మనం ఉన్నాము. ఆ విధమైన విచక్షణ దృ తో పరిశీలించి చూస్తే - అవి ఎంత బాధాకరం అయినా - న వెనుకటి తెలుగు సాహిత్యాన్ని గురించిన మూడు నిజాలను మనం ఒప్పకోకతప్పదు.

**ఒకటి:** నన్నయ్యమొదలు తిరుపతి వెంకట కవుల దాకా వచ్చిన మన తెలుగు కవిత్వం ఎక్కువ భాగం జమీందారీయుగ కవిత్వమే! సంఘంలో చుట్టూ జరుగుతున్న సంఘటనలకు సజీవంగా ప్రతిస్పందిస్తూ, స్వంత అనుభూతులను స్వంత గొంతులలో ప్రకటించడం గాని, ఉదాత్తాశయాలతో జీవిత సత్యాన్ని అన్వేషిస్తూ, పరిణతాత్ములై తమస్వంత సందేశా లను, ప్రబోధాలను వినిపించడం గాని ఎన్నడూ మన తెలుగు కవులకు ధ్యేయాలు కావు. ప్రభువుల తల లూపించే ఉత్ప్రేక్షలతోనూ, అతిశయోక్తులతోనూ, 'అక్షర రమ్యత, అనబడే శబ్దాలగారడీతోనూ 'కవి' అనే యశస్సు గడించడం, తత్ఫలితంగా ప్రభువుల మెప్పు పొంది అగ్రహారాదులు ఆర్జించుకోడం - ఇవే మన వెనుకటి తెలుగు కవులకు ప్రధాన కవితా ప్రేరణలుగా ఉండేవి.

**రెండు:** ఇందుకు అపవాదాలుగా ఆత్మ సంతుష్టికోసం, ఆత్మపరిణతి సాధనంగా కవిత్వాన్ని ఉపాసించినవారు - పోతన్న, వేమన్న, గోపన్న, పుసులూరి సోమరాజు, అన్నమయ్య వంటి భక్తకవులు కొందరు కనిపిస్తున్నా, తెలుగులో ప్రథమశ్రేణి కవులుగా వారికి గుర్తింపు లేదు. అదీ గాక - ఆత్మద్రష్టలైన మహాభక్తులై, శిష్యపరంపరను సంపాదించుకొన్న కబీరు, సూరదాస్, తులసీదాస్, మీరా బాయి వంటి హిందీ కవుల స్థాయికి గాని, నమ్మాళ్వార్ (శఠకోపయతి), పెరియాళ్వార్ (విష్ణుచిత్తుడు), తొండరడి ప్పొడి యాళ్వార్ (విప్రనారాయణుడు), గోదాదేవి వంటి దాక్షిణాత్య భక్తకవుల స్థాయికి గాని వారు ఎదిగినవారు కాదు. దేవాలయాలలో విగ్రహాలుగా వెలసి, ఆరాధింపబడే ఔన్నత్యా నికి వారు నోచుకోలేదు. వారి రచనలు దేవలయాలలో పారాయణ చేయబడే ఉదాత్త స్థాయిని అందుకోలేదు. త్యాగరాజూ, జగన్నాథ పండితుడూ, వల్లభాచార్యులూ, రామానుజాచార్యులూ మన తెలుగువారే అని మురిసిపో జూచినా, వారు తెలుగు గడ్డను వదలి పోయి, అన్య ప్రాంతాలలో మహా కార్యాలను సాధించినవారు; తెలుగు వారిచేత పూర్తిగా విస్మరింపబడి, ఇతర ప్రాంతీయుల స్వంత కాతాలో జమ కట్టుకోబడ్డవారు.

మూడు: "అల నన్నయ్యకు లేదు, తిక్కనకు లేదా భోగము..." అని స్వోత్కర్షను చాటుకునే లక్షణం తెలుగు కవులలో ఆధునికుడైన శ్రీవిశ్వనాథతోనే ఆరంభం కాలేదు. 'విపుల శబ్దశాసనుడను,' 'అవిరళజప హోమ తత్పరుడను,' 'నిత్యసత్యవచనుడను,' 'నానారుచిరార్థ సూక్తినిధిని' అని తనను గురించి తానే ఆత్మ వికత్థనం చేసుకునే ఆచారం ఆదికవి నన్నయనుంచే మనలో ఆరంభమైనట్టు కనిపిస్తుంది. ఆత్మశ్లాఘ, అన్యోన్యశ్లాఘ, తమను కాదన్న వారిని కుకవులని దూషించడం, వస్తునిష్ఠమైన సత్యదృష్టితో చేసే నిష్పాక్షిక విమర్శను సహృదయతతో స్వీకరించగల ఔదార్యం లోపించడం నేటి మన కవులకు మన ప్రాచీన కవులనుంచి వారసత్వంగా సంక్రమించినవే అనడానికి బోలెడు రుజువులున్నాయి. 'ప్రసన్న కథా కవితార్థయుక్తి', 'అక్షర రమ్యత' సత్కవిత్వ లక్షణాలని నన్నయ గారు నిర్వచిస్తే," సొగసు కోర్కులు రావలె అలకించినన్" అని పెద్దనగారూ, "సొసగ ముత్తెపు సరుల్ పోహళించిన లీల" అని పింగళి సూరన - ఇలా ఎవరికి వారు తమ కవిత్వం ఆధారంగానే కవితా లక్షణం నిరూపించి, అందుకు భిన్నమైనదాన్ని కుకవిత్వం అని త్రోసి పుచ్చారు. ఈ విధంగా తెలుగులో కవులే విమర్శకు లైనందువల్ల అందరి కావ్యాలనూ శాస్త్రీయంగా అధ్యయనం చేసి, సర్వాంధ్ర కవిత్వానికీ వర్తించే సాధారణ సూత్రాలను రూపొందించే తెలుగు అలంకారశాస్త్రం అభివృద్ధి పొందే ఆస్కారం లేకుండా పోయింది. తెలుగులో ఉన్న లక్షణ గ్రంథాలు ఇంచుమించు అన్నీ సంస్కృతానికి అనువాదాలే!

మన ఆంధ్ర సాహిత్యాన్ని గురించి ఇలాంటి అప్రియపు మాటలు చెప్పిన వారిలో నేనే మొదటివాణ్ణి కాను. అక్కిరాజు ఉమాకాంత పండితుడు తెలుగు సాహిత్యాన్ని గురించి కొన్ని నిష్ఠురమైన నిజాలు పలికి, సాహిత్య బంధు విరోధి అయాడు. ఇలా ప్రాచీనాంధ్ర సాహిత్యాన్ని గూర్చి నిర్భయంగా కొన్ని ఆక్షేపణలు లేవదీసినవారు మరొకరున్నారు - వేంకట రామకృష్ణ కవులు! 'ప్రాచీనాంధ్రకవుల అపరాధాలు' అనే శీర్షికతో 30 పద్యాలు వ్రాసి భారతిలో వారు ప్రచురించగా, ఆ నాటి ఆంధ్రవిద్వల్లోకంలో అవి గొప్ప సంచలనం కలిగించాయట!

**ఆంధ్ర లోకోపకారమ్ము నాచరింప,**
**భారతమ్మును నన్నయభట్టు తెలుగు**
**జేయుచున్నాడు సరియె, బడాయిగాక**
**తొలుత సంస్కృత పద్య మెందులకు చెపుడి"**

ఇది వారి మొదటి ఆక్షేపణ. ఇంకొకటి-

**"అచ్చతెలుగు పదంబుల నిచ్చకొలది**
**పుచ్చి, తలతిక్క అవ్యయంబులను బెట్టి**
**పాడుచేసెను నన్నయభట్టు రీతి**
**ఉభయ కవి మిత్రులష తిక్కయొజ్జ గారు"**

ఇంకా వెనుకకు పోతే ప్రజలకు సులభంగా అర్థం కాని సంస్కృత పదభూయిష్ఠమైన శైలిని వరించిన ప్రాచీనాంధ్ర కవులను మొట్టమొదటిసారిగా నిర్భయంగా దుయ్యబట్టిన వాడు తెనాలి రామకృష్ణుడు కనిపిస్తాడు. అయన చెప్పిన చాటువు ఇది:

**"ప్రౌఢ దీర్ఘ సమాస పదముల గూర్చి శ్రీ**
**నాథుండు కూలార్చె నైషధంబు**
**దాని తల్లిగ అల్లసాని పెద్దన చెప్పె**
**ముది మదితప్పి ఆముక్తమాల్య**
**దూహించి తెలియరాకుండ సూరపరాజు**
**భ్రమ కళా పూర్ణోదయము రచించె**
**అతిశ్లేష శబ్ద వాగాడంబరం బొప్ప**
**వస ఘటించెను మూర్తి వసుచరిత్ర**
**ఇట్టి కవులకు నేను వాక కొరకు**
**చెప్పవాడ మదీయ నైచి మెరయ**
**పాండురంగ విజయము పటిమ దనర-**
**విష్ణువర్ధిష్ణు డగు రామకృష్ణ కవిని"**

సత్యమే చెప్పాలనే నియమం మన ప్రబంధ కవులకు లేదని ఆదిలోనే గుర్తించి, అతి జాగరూకతతో తమ పరిశీలనకు ఉపక్రమించిన శ్రీ అనంతకృష్ణ శర్మగారిని కూడా కన్ను గప్పగలిగేనంతటి ఐంద్రజాలికులు మన ప్రబంధ కవులు. రాయల కాలంనాటి తెలుగువారి గృహాలను ఇలా వర్ణించారు శ్రీ శర్మగారు: "ఇవి అన్ని ఋతువులకు అనుకూలముగా, హితముగా నుండునట్లు క ివి. ముంగిటిలో ఇరుప్రక్కల అరుగులు. కంబముల బొమ్మలు తీర్చియుండురు. గోడలపై చిత్తరువులు; ఎ న మేడలు, అచ్చటనే వెన్నెల సౌఖ్యము లనుభవించుటకు చంద్రశాలలు. ఇంటి కొక పూలతోట, అందు చెంగలువ కొలను, అవకాశమున్నచో దాని ప్రక్క కృత్రిమముగా తయారుచేసిన కొండ....".

సరిగ్గా ఇలాంటి ఇళ్లనే సంస్కృతంలో కాళిదాసు మొదలు ఎందరెందరో కవులు వర్ణించారు. ఆ సంప్రదాయాన్ని అనుసరించి కాక, రాయలవారు తన కాలం నాటి ఇళ్లనే వర్ణించారని ఏమిటి నిర్ధారణ?

మరొక సంగతి: సమకాలీన ప్రజల వేష భాషలూ, ఆభరణాలూ, వంటకాలూ, వేట సామగ్రి, పశువుల జబ్బులూ, వాటికి మందులూ మొదలైన బా విషయాలను ఏకరువు పెట్టినంత మాత్రం చేత ఒక కా ం ఆ నాటి ప్రజాజీవనాన్ని ప్రతిబింబించిం దని నే అనలేను. అంతర్దృష్టితో, దార్శనిక నేత్రం (perceptive eye) తో సమకాలీన జలచైతన్యమూర్తి (ethos) ని దర్శించి జీవితం పట్ల వారి రిని ప్రదర్శించినప్పుడే ఆ కవి కావ్యంలో సమకాలీన వనం నిజంగా ప్రతిఫలించినట్లు! ఆ దృష్టితో చూస్తే మన ప్రబంధా లన్నిటికంటె రాయలకాలం నాటి నుంచి అనుశ్రుతంగా వస్తున్న ఒక ప్రజాచాటువు ఆ నాటి ప్రజల మనోవైఖరిని విశదం చేసేది కనిపిస్తూంది. ఒక రాత్రి మారువేషంతో రాయలవారు నగరంలో తిరుగుతూ ఉండగా ఒక చాకలివాడు పాడుకొంటున్న ఈ గీతం ఆయన చెవుల బడిందట:

"కొండవీడు మనదేరా! కొండపల్లి మనదేరా!
కాదని ఎవ్వరు వాదుకు వచ్చిన కటకం దాకా మనదేరా!"

యుద్ధాలూ, అన్యరాజ్యాక్రమణలూ కేవలం రాజుల రాజ్య విస్తరణ కాంక్షలకే పరిమితం కాక, ఆ నాటి ప్రజలలో కూడా దేశాభిమానం వెల్లివిరుస్తూ ఉండేదని ఈ చాటువు చాటుతూంది.

బ్రిటిష్ వారికంటె ముందు సుమారు 7,8 శతాబ్దాలు మన దేశాన్ని ఏలిన మహమ్మదీయులు బ్రిటిష్ వారంత సౌమ్యులు కారు. వారు చేయని దుష్కృత్యం లేదు. ఆ నాటి వారి ఆగడాలను ఆంధ్రసాంఘిక చరిత్రవ్రాసిన స్వర్గీయ శ్రీ సురవరం ప్రతాపరెడ్డి ఇలా వర్ణిస్తారు:

"ఓరుగంటిని మంటగలిపిన మునల్మానులు తెలుగుదేశ మంతటా వ్యాపించుకొని తమ ఘోర కృత్యములను నిరాఘాటముగా సాగించిరి"
(ఆం. సాం. చ. పుట 308)

సంస్కృతంలో 'మధురావిజయం' రచించిన గంగాదేవి మునల్మానుల ఆగడాలను నిర్భయంగా వర్ణించింది:

"మధురోపవనం నిరీక్ష్య దూయే
బహుశః ఖండిత నారికేళ ఖండం ।
పరితో నృకరోటి కోటి హార
ప్రచలచ్చూళ పరంపరా పరీతమ్ ॥"

(మధురానగరంలో కొబ్బరి చెట్ల తలలు నరికి వాటి స్థానంలో తురుష్కులు తాము వధించిన హిందువుల తలకాయలను శూలాలకు గుచ్చి నిలబెట్టారు. ఆ ఉపవనాలను చూస్తూ ఉంటే గుండె చెరువవుతూంది).

"రమణీయతరో బభూవ యస్మిన్
రమణీనాం మణినూపుర ప్రణాదః ।
ద్విజ శృంఖలికా బలాత్ క్రియాభిః
కురుతే రాజ పథః స్వ కర్ణశూలః ॥"

(ఏ మధురా వీథులు రమణీ మణుల నూపురధ్వనులతో కలకల లాడేవో అవి ఇప్పుడు బ్రాహ్మణుల చేతులకు శృంఖలాలు తగిలించి బలవంతంగా ఈడ్చుకు పోతున్నప్పుడు వినిపించే కర్ణ కఠోరమైన చప్పుళ్లతో నిండి పోయాయి)

"స్తన చందన పాండు తామ్రపర్ణ్యా
స్తరుణీనా మభవత్ పురా యదంభః ।
తదసృగ్భి రుపైతి శోణిమానం
నిహతానా మభితో గవాం నృశంసైః ॥"

(ఒకప్పుడు తరుణుల స్తన చందనాలతో ఘుమఘుమ లాడిన తామ్రపర్ణీనది లోని తెల్లని నీళ్లు ఇప్పుడు తురుష్కులు వధిస్తున్న ఆవుల నెత్తురు ధారలతో ఎరుపెక్కి పోయాయి)

తెలుగులోనూ రాయలవారూ, పెద్దనగారూ తురుష్కుల ఆగడాలను స్వల్పంగా స్పృశించకపోలేదు. అయితే వాటిలో పై సంస్కృత శ్లోకాలలోని కరుణ రసం ఎంత వరకు స్ఫురిస్తుందో మీరే చూడండి.

"సనకాది దివిజ మస్కరి ఫాల గోపీచందన పుండ్రవల్లి కల్ నాకి వాకి" (ఆముక్త 1-41) అనే సీస పద్యంలో రాయల వారు హిందూ దేవాలయాలలో మహమ్మదీయులు చేసిన దారుణాలు మాత్రమే ఏ మాత్రం ఆవేశం లేకుండా వర్ణించగా, పెద్దనగారు వరూథినిచేత "గోవధము చేయు తురకల దైవంబవు నీవు" అని చంద్రుణ్ణి ఉపాలంభింప జేస్తాడు.

తెలుగు ప్రబంధ కవులలో కొంతలో కొంత వాస్తవికతా దృష్టి గల మహాకవులు శ్రీ కృష్ణదేవరాయలు, తెనాలి రామ కృష్ణుడు! ఆ ఇరువురి రచనల నుంచి రెండు మూడు ఆ నాటి ప్రజాజీవన మధుర సన్నివేశాల పదచిత్రాలను మీ ముందుంచి అంతటితో నా వ్యాసం ముగిస్తాను. ఆముక్తమాల్యద లోని ఈ పద్యం చూడండి:

"తల పక్షచ్ఛట గుచ్చి బాతువులు కేదారంపు కుల్యాంతర
స్థలి నిద్రింపగజూచి ఆరెకు లుష స్స్నాత ప్రయాత ద్విజా
వలి పిండీకృత శాటులన్ సవి తదావాసమ్ము చేర్పంగ రే
వుల డిగ్గన్ వెనబారు వాని గని నవ్వున్ శాలిగోప్యోఘముల్"
(1-65)

చేలు - చేలమధ్య పంట కాలువలు - ఆ కాలువలలో స్నానంచేయడానికి తెలతెలవారుతూ ఉండగానే వచ్చే బ్రాహ్మణులు - చేలలో పంటదొంగతనాలు జరుగకుండా రాజభటులు (ఆరెకులు) రాత్రుళ్లు గస్తీ తిరగడం - చేలలో కాపలాకు మంచెలపై నిద్రించే గొల్ల పడుచులు - ఇదీ దృశ్యం! ఒక రోజున ఏం జరిగిందంటే - ఆ పంట కాలువల ఒడ్డున కొన్ని తెల్లని బాతులు తలలు రెక్కలలోకి ముడుచుకుని నిద్రపోతున్నాయి. రాజ భటులు వాటిని చూసి ''అరే పాపం! ఎవరో బ్రాహ్మణులు వచ్చి స్నానం చేసి తమ తెల్లని బట్టలు పిడుచుకుని ఒ న పెట్టి మరచి పోయి వెళ్లినట్టున్నారు. వాటిని తీసుకె ఆ బ్రాహ్మణులకు అందజేద్దాం'' అనుకున్నారు. మె రేవులోకి దిగారు. వారి అలికిడికి బాతులు నిద్రలేచి తుర్రుమని నీళ్లలోకి జారుకున్నాయి. పక్క చేలలోనుంచి ఈ తతంగం అంతా చూస్తున్న గొల్ల పడుచులు కిలకిలా నవ్వారు. ఇలాంటిదే అందమైన పదచిత్రం మరోటి:

''శయ పూజాంబుజముల్ ఘటిన్ తడ బడన్
చందోయి లేగానుపై
దయదప్పన్ పసుపాడి పొగడపు
పాదం బొప్ప చెంగల్వ డి
గ్గియనీ రచ్యుత మజ్జనార్థము కటిన్
గీలించి దివ్య ప్రబం
ధ యుగాస్యల్ ద్రవిడాంగనల్ పొలుతు
రుద్యానంపు లోత్రోవలన్'' (1-56)

విష్ణుచిత్తుడూ, గోదాదేవీ అవతరించిన శ్రీవిల్లిపుత్తూరు గ్రామం. అక్కడి వైష్ణవాంగనలు గృహ తిరువారాధనలోని పెరుమాళ్ల తిరుమంజనం కోసం మడిగా నీళ్లు తీసుకురావడా నికి ఒక ఉద్యానవనం మధ్య ఉన్న ఎర్ర కలువల దిగుడు బావికి వెళుతారు. పసుపు రాసుకుని శిరస్స్నానం చేస్తారు దేవతార్చనకు రెండు మూడు పూలు త్రుంచుకుంటారు. బిందె నిండా నీళ్లు ముంచుకొని, బిందె చంకనబెట్టుకొని, చేతిలోని తామరపూలు బిందెమీద నాట్యం చేస్తూ ఉండగా, దివ్య ప్రబంధం చదువుకుంటూ ఆ ఉద్యానవనం లోని కాలి బాటలవెంట ఇళ్లకు తిరిగి వెళుతున్నారు. ఆ ద్రవిడాంగనల మనోహర పదచిత్రం ఇది ఆ యుగ ప్రభావం వల్ల రాయలవారి దృష్టి ఆ ద్రవిడాంగన సన్నని నడుము మీద దయ దప్పిన చన్దోయి మీదికి పోకుండా ఉండి ఉంటే ఈ చిత్రం మరింత హృద్యంగా ఉండేది!

సంస్కృత కవి సమయాల శృంఖలాలనుంచి విడివడి, ఉపమానాలలో, పాత్ర చిత్రణలో, పలుకుబళ్లలో స్వతంత్ర తనూ తెలుగు సంఘ వాస్తవికతనూ ప్రదర్శించిన మరొక తెలుగు మహాకవి తెనాలి రామకృష్ణుడు. నిగమశర్మ తండ్రి సభాపతిని వర్ణిస్తూ 'వేదముల్ పోసిన గాదె' అని అచ్చతెనుగు రూపకాన్ని వాడే సాహసం ఇతరులలో మనకు కనిపించదు. పాండురంగ మాహాత్మ్యంలోని నిగమశర్మకథ ఆ నాటి మధ్య తరగతి తెలుగు బ్రాహ్మణ కుటుంబ జీవనానికి తీసిన ఒక వార్తాచిత్రం (documentary) లాంటిది. 'నిగమ శర్మ అక్క' అనే ప్రామాణికమైన వ్యాసంలో శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ ఆ కథలోని తెలుగు జీవన మాధుర్య ముద్రను కళ్లకు కట్టినట్టు ప్రదర్శించారు.

ఏతావతా - అతిశయోక్తులకూ, ఉత్ప్రేక్షలకూ నిలయం అయిన మన ప్రాచీన ఆంధ్రకవిత్వంలో సమకాలీన జీవన ముద్రకోసం అన్వేషించడం గడ్డివాములో సూదికోసం వెదకినట్టు! ఆధునిక యుగంలో కూడా శ్రీ గురజాడ, శ్రీ ఉన్నవ, శ్రీ విశ్వనాథ వంటి ఇద్దరు ముగ్గురు రచయితలే తెలుగు సంఘ వాస్తవికతను తమ రచనలలో చిత్రింప యత్నించిన వారు కనిపిస్తారు. ప్రాచీన సంప్రదా యాన్ని పాటిస్తూ అన్యభాషానుకరణాలకూ, చౌర్యాలకూ తలపడిన వారే ఎక్కువ! తెలుగు సాహిత్యానికి అభ్యుదయాన్ని సాధించా లంటే రచయితలలో సత్యదృష్టి, వాస్తవికతా దృష్టి పెంపొందడం ఎంతైనా అవసరం!

# ధ్వని దీప్తులు

శ్రీ శలాక రఘునాథ శర్మ

ఆనందవర్ధనులు ధ్వనిని కనుగొన్నారు; సృష్టించలేదు. దానిని కావ్యాత్మగా గుర్తించారు.[1] దానిని త్రోసిపారవేద్దామనే భావన ఉన్నవారు తత్కాలంలో, తరువాతి కాలంలో ఉండ వచ్చును గదా![2] వారి ఆక్షేపాల నన్నిటినీ తామే ఉద్భావన చేసి సిద్ధాంతాన్ని సుప్రతిష్ఠితం చేశారు. సహృదయ మనః ప్రీతికోసం దాని స్వరూప స్వభావాల నన్నింటినీ లక్ష్యలక్షణ సమన్వయ పూర్వకంగా వివరించి చూపారు. ఆ సిద్ధాంతం కావ్యలక్షణ వివేకంలో తలమానికమై కూర్చుంది.

ధ్వని అంటే ఏమిటి? ధ్వని ఎలా కావ్యాత్మ అవుతుంది? అది కావ్యాత్మ అయితే అలంకార గుణ వృత్తి రీత్యాదులు ఏమౌతాయి? అనే ప్రశ్నలను గూర్చి ఆలోచించాలి.

సాధారణంగా మానవుని హృదయ కుహరంలో అనంత మైన భావాలు ఉంటాయి అయితే అతడు పైకి చెప్పగలిగింది అత్యల్పం మాత్రమే. ఒక్కొక్కప్పుడు దానిని కూడా అంతంత మాత్రంగానే చెప్తాడు. ఇలా చెప్పటంలో వక్త అశక్తత కొన్ని సందర్భాలలో కారణ మవుతుంది. ఆ అశక్త విభాగంతో ప్రస్తుతం మనకు పనిలేదు. కాని కొందరు బుద్ధి పూర్వకంగా వక్తవ్యాన్ని శ్రోత ఊహకు వదలివేస్తూ మాటాడుతూ ఉంటారు. అన్నమాట ద్వారా హృదయంలో ఉన్న రమణీయభావం శ్రోతకు స్ఫురిస్తే అప్పుడతడు ఆనందపడతాడు. వక్త ప్రజ్ఞను ఉదాత్త పరిధులలో నిలిపి చూస్తాడు. నిజానికి అన్నమాటకంటె హృదయంలో ఉన్నభా వమే కదా శ్రోత అపేక్షింపదగినది. ఒక మామిడి పండులో నైగనిగ్యం, రస తుందిలత్వం, నిండుదనం మొదలైన లక్షణాలు కంటికి ఎంత కనుపించినా, నాలుక ఆ రసాన్ని ఆస్వాదించినపుడు కలిగే అనుభూతి, దర్శన మాత్రం చేత కలుగదు కదా! అయితే ఆ రుచికి తోలుగుజ్జు, టెంక, ద్రవ పదార్థము మొదలైన ప్రత్యక్షవస్తువులకంటె భిన్నమైన స్థితి ఉందని అందరికీ తెలుసు. దానికి ఆకారం లేదు. అయినా దానికి సంబంధించిన అనుభవం మాత్రం విస్పష్టంగా హృదయానికి తెలుస్తూనే ఉంటుంది. ఇలా శబ్దార్థాలు తమ్మ తాము అప్రధానంగా రూపొందించుకొని మరొకవిశిష్టమైన అర్థాన్ని స్ఫురింపజేస్తే అది ధ్వని అవుతుందన్నారు.[3] ఎప్పుడైతే ఆధారభూమికలయిన శబ్దా లు అప్రధానాలైపో యాయో అప్పుడు స్ఫురించిన అ తప్పని సరిగా ప్రధానమవుతుందికదా! అందుకే దాని ఆత్మ అన్నారు. అది లేకపోతే ఏది ఉన్నా లేనట్టే. అది ఉంటే అన్నీ ఉన్నట్టే అనేస్థితి దేనికి ఉంటుందో అది ఆత్మ; ఇది ఉన్నా లేక పోయినా పెద్దలోపం లేదు - అనే స్థితి కలదానిని అనాత్మ అని స్థూలంగా వింగడించుకోవచ్చు.

తేలిన సారాంశం ఏమిటంటే అన్న మాట వాచ్యం. అనదలచుకొన్న భావం వ్యంగ్యం. స్థూలంగా ఇటువంటి విభాగం లోకంలో ఏర్పడుతున్నది. లోకంలో మనం వింటూ ఉంటాం - 'నా ఉద్దేశ్యం అది కాదు' 'నేను అనదలచుకొన్నది అది కాదు' - అని. అంటే మాటకు వెనుక సాధారణంగా శబ్దం ఇచ్చే అర్థం కానిది మరొకటి ఉందనే విషయం స్పష్టమవుతున్నది కదా!

ఇది ఆధారంగా కావ్య ప్రపంచంలోనికి ప్రవేశిస్తే ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసాలు పుష్కలంగా ఉన్న కవి శబ్దాన్ని ప్రయో గించే తీరు చాలా విలక్షణంగా ఉంటుంది. ఒకమాట నుండి వంద అర్థాలు పుడుతూ ఉంటాయి. ఆ అర్థాలు స్ఫురించినం తసేపూ శ్రోత ఆనందంతో పరవశించిపోతూ ఉంటాడు. ఆ అర్థాలు మనకు నిఘంటువులలో దొరకవు. అగతికంగా కల్పించుకున్న అర్థాలు కావు. కాబట్టే ఆ అర్థదీప్తి మరింత విశిష్టతను సంతరించు కొంటుంది. అందుకనే ఆనందవర్ధ నులు దానిని అంగనల యందు లావణ్యం వంటిదని[4] అభివర్ణించారు.

ఈ విధంగా మొదటి రెండు ప్రశ్నలకు సమాధానం సిద్ధించింది. దీనిని గురించి మరికొంత చర్చించవలసిన అవసరం ఉంది.

లోకంలో ధ్వని లేని కావ్యం ఉంటుందా? ఉంటే, దానికి ఆత్మ లేనట్లే కదా? అని ఒక ప్రశ్న ఉద్భవించవచ్చు. ఇక్కడ మనం జాగ్రత్తగా ఆనందవర్ధనుల అభిప్రాయాన్ని పరిశీలిస్తే వాఙ్మయం వేఱు, కావ్యం వేఱు అన్న తాత్పర్యం వారికి ఉన్నట్లుగా వ్యక్తమవుతుంది. శబ్దార సమవాయం

వాఙ్మయం. ధ్వని విశిష్టమైనది కావ్యం అని మనం వింగడించుకోవాలి. కావ్యాన్ని వాఙ్మయమని కూడ వ్యవహరించవచ్చును గానీ వాఙ్మయమంతా కావ్యవ్యపదేశానికి అర్హం కాదనే విషయం మనం గట్టిగా గుర్తుపెట్టుకోవాలి. అప్పుడు కావ్యమంటే ధ్వన్యాత్మకమే అవుతుంది. కాకపోతే కావ్యమనే వ్యవహారమే కలుగదు. అట్టి కావ్యం ధ్వనివలన ఆత్మవంతమవుతున్నది. ఇక్కడ మరొక విషయం కూడ చెప్పుకోవటం అవసరం. కావ్యమంటే కనీసం ఇంత ప్రమాణంలో ఉండాలని నియమమేమీ లేదు. ఒక్కొక్కప్పుడు ధ్వని పూర్ణమైతే ఒక పదం కూడ కావ్యం కావచ్చు!.

శబ్దంనుండి సాక్షాత్తుగా అందరికీ ఒకే విధంగా తెలియవచ్చే అర్థాన్ని అభిధేయం, వాచ్యం అని అంటారు. వాచ్యార్థం పొసగకపోతే సిద్ధించే అర్థాన్ని లక్ష్యం అంటారు. ఈ రెంటి కంటె విలక్షణంగా మనోహరంగా స్ఫురించే అర్థాన్ని వ్యంగ్యం అంటారు. ఈ మూటికీ మూడు ప్రత్యేకమైన వృత్తులున్నాయి. అభిధా లక్షణా వ్యంజనలు వాని పేర్లు. వీనిలో మొదటి రెంటిని సాధారణంగా అందరూ అంగీకరిస్తారు. మూడవదాని విషయంలో కొందరికి సందేహాలున్నాయి. ఆనందవర్ధన అభినవగుప్తులు ఆ సందేహాలనన్నింటినీ శాస్త్రీయంగా సోపపత్తికంగా తీర్చటానికి గట్టిప్రయత్నాలే చేశారు. కానీ కొందరు ఇంకా సంశయాత్ములుగానే మిగిలి పోయారు. ఇది లోక సహజమైన విషయమే. అందరికీ అంగీకారమైన సిద్ధాంతాలు ఉండటం సాధారణంగా అరుదు.

ప్రతీయమానార్థప్రాధాన్యాన్ని మనం సంభావించినంత మాత్రాన వాచ్యలక్ష్యార్థాలు స్థితిని కోల్పోతాయేమో అని మనం శంకింపనక్కరలేదు. ఆనందవర్ధనులు, అందుకే, ఒక అందమైన విషయం చెప్పారు. "వెలుగు కావా లనుకొనేవాడు దీపశిఖ యందు ప్రయత్నపరుడు కావలసిందే కదా!"[5] అన్నారు. ఇంకా కొంచెం లోతునకు వెళ్లి వాచ్యార్థం కూడ ఆత్మలో భాగమే అని కూడ సూచించారు. "సహృదయ శ్లాఘ్యమై కావ్యాత్మగా వ్యవస్థితమైన అర్థమేదైతే ఉందో దానికి వాచ్య మనీ ప్రతీయమాన మనీ రెండు భేదా లున్నాయి"[6] అన్నచోట వాచ్యాన్ని కూడ ఆయన ఆత్మగానే పరిగణించారు. అయితే అవ్యవస్థ ఏర్పడటం లేదా? అంటే లేదు. ఎలాగంటే చెఱకుగడ వాచ్యం వంటిదనీ, రసం ప్రతీయమానం వంటిదనీ భావిస్తే మనకు కావలసినది రసమే అయినా అది చెఱకుగడ లేకుండా సిద్ధించదు కనుక అదికూడ ఉపాదేయమే అవుతుంది. వాచ్యార్థస్థితి కూడ ఇటువంటిదే అని చెప్పటానికి ఇలా చెప్పవలసి వచ్చింది.

నిజానికి ఆత్మ శబ్దం వేదాంత పరిభాష నుండి గ్రహింపబడినది. ఆ శాస్త్రం ప్రకారం సృష్టిలో ఆత్మకానిది ఏదైనా ఉన్నది అంటే అది అజ్ఞానదృష్టితో మాత్రమే. సుజ్ఞాన దృష్టికలవారికి సర్వమూ ఆత్మయే. అలాగే ప్రతీయమానార్థం ఆత్మగా గుర్తించిన వానికి దాని కాధారభూమి యైన వాచ్యలక్ష్యార్థాది సామగ్రి అంతా ఆత్మభిన్నంగానే అనుభూతికి వస్తుంది. ఈ విధంగా వాచ్యార్థపు ఆత్మ తనాన్ని ఆనందవర్ధనులు సంభావించారు. ఇంత ఎందుకు చెప్పవలసివచ్చిందంటే - వ్యవహారజ్ఞానానికీ, తత్త్వజ్ఞానానికీ ఉన్న భేదాన్ని గుర్తించవలసిన అవసరాన్ని గుర్తుచేయటానికి మాత్రమే. విభాగాత్మకంగా నిరూపించే తరువాతి విషయంలో కూడ ఈ అంశాన్ని స్మరణలో ఉంచుకోవాలి.

నిజానికి ఆత్మకు విభాగాలు లేవు. కాని సాధనదశలో ప్రతివిషయాన్ని మానవుడు విభాగాత్మకంగానే చూస్తాడు. ఆ దృష్టితో ధ్వనికి వస్తువు, అలంకారము, రసము అని మూడు విభాగాలు ఏర్పడ్డాయి. మరీ సూక్ష్మాతి సూక్ష్మ విభాగాల లోనికి పోకుండా ఈ మూడింటి స్వరూప స్వభావాలను ఉదాహరణాత్మకంగా వివరిస్తాను.

వస్తుధ్వని: వాచ్యమైన ఒక వస్తువు వస్త్వంతరాన్ని ప్రతీయమానం చేస్తే దానిని వస్తుధ్వని అంటారు. ఇందులో వాచ్యరూపమైన వస్తువుకంటె ప్రతీయమానమైన వస్తువు విలక్షణమూ ప్రధానమూ, రమణీయమూ అవుతుంది. ఒక ఉదాహరణను పరిశీలిద్దాం.

**సేమపు దెరు వొక్కటి గల**
**దే మెచ్చితి; దాని నడుగు మెయ్యది యని, సు**
**త్రామసుత! యడుగ కున్నను**
**నేమి! వినుము; చెప్పెదను మునీంద్రుల కెక్కన్[7].**
**12-1-57.**

ఇది తిక్కన్నగారి పద్యం. శాంతి పర్వంలోనిది. ధర్మరాజు అర్జునునితో అన్నమాట. వాచ్యార్థం తేలికగా తెలుస్తూనే ఉంది. కానీ ఆ అర్థం దగ్గర పాఠకుడు ఆగిపోతే కవి హృదయం చక్కగా తెలిసిరాదు. రాకపోతే అతడు పొందే నష్టం చెప్పనలవి కానిది. ఇందులోని వ్యంగ్యార్థ మాధుర్యాన్ని తనివితీరా గ్రోలితేనే పాఠకుని ఉత్తమత్వం నిలుస్తుంది.

'ఒక్కటి' - అంటే ఇటువంటిది మరొకటి లేదు కనుక మనకందరికీ అపరిహార్యమైన మార్గం సుమా! అని హెచ్చరిక. 'కలదు' - అనే వర్తమానక్రియ ఈ తీరుపు సర్వకాలసర్వావస్థలకు సంబంధించినది అనే అర్థాన్ని సూచిస్తుంది. 'ఏను'- అనే పదం తన వివేకాతిశయానికి ద్యోతకం. 'మెచ్చితిని'-

అనటం వలన గుణదోషాలు జాగ్రత్తగా పరిశీలించి దోషాలు లేవని నిరూపించుకున్న తరువాత గుణాధిక్యం మాత్రమే ఉండటం వలన నాకు మెప్పు గలిగింది సుమా! అనే ఒక నిండు తృప్తి అభివ్యక్త మవుతుంది. ధర్మరాజు 'దాని నడుగుము' అని అర్జునుని చోదన చేస్తున్నాడు. ఎందుకంటే 'నాపృష్టః కస్యచిద్ బ్రూయాత్' అని ధర్మశాస్త్రవాక్యం ఉన్నది కనుక. ఇటు వంటి మహోదాత్త విషయాలను అడిగి తెలుసుకోవాలయ్యా! అని అతని అంతరంగ తాత్పర్యం. 'ఎయ్యది అని' - అనే మాటలో దానిమీద ఉండవలసిన ఆదరాతిశయం ప్రతీయమానం అవుతుంది. 'సు మ సుత!' అని సంబోధన. ఇందులో రెండు మూడు అ లు స్ఫురిస్తాయి. దేవేంద్రుని కుమారుడ వైనా సేమపు తె వు తెలియకపోతే హీనుడవే అవుతావు - అని ఒకస్ఫూర్తి. దేవేంద్రుని కుమారుడవు కనుక నీ వంటివానికి బోధిస్తే ప్రయోజనం అధికంగా ఉంటుంది - అని మరొక స్ఫూర్తి. దేవేంద్రుని కుమారుడని అహంకరిస్తే ''యదహంకార నశ్రోష్యసి వినంక్ష్యసి'' అన్న కృష్ణపరమాత్మ వాక్యం అనుసంధించుకో - అని వేరొకస్ఫూర్తి. ''అడుగకు న్నను నేమి?'' - 'స్వయంతీర్త్వా పరాం స్తారయతి' అన్న న్యాయా న్ననుసరించి నావంటివాడు నీ వంటిబాలునికి ధర్మవిరుద్ధమైనా అడుగక పోయినా చెప్పవలసిన పరిస్థితి ఏర్పడుతుంది - అనే తాత్పర్యంతో ధర్మజుడు ఇలా అంటున్నాడు. 'వినుము'- అనేది శ్రద్ధాతిశయ పూర్వక శ్రవణచోదనకు జ్ఞాపకం. చెప్పెదను - అనేది చెప్పటం లో ఉన్న, తన ద్రఢిమను అభివ్యక్తి చేస్తుంది. 'మునీంద్రుల కెక్కు_న్' - అనటంలో ఇది గొప్ప తపోమహిమతో మహర్షి సంభావన చేసే మహర్షులలో శ్రేష్ఠులైన వారికి కూడ ఉపాదేయమైన తెరువు. అంటే ఇక నీ వంటి సాధారణులసం గతి చెప్పనేల? - అనే అర్థం స్ఫురిస్తుంది.

ఇలా భావించిన కొలదీ సహృదయ హృదయంలో వింత వింతగా తోచే ఈ అర్థ విశేష మంతా వాచ్య లక్ష్యకోటిలోనికి చేరుతుందా? ఈ అర్థాన్ని కాదన గలమా? ఈ అర్థస్ఫురణ వలననే కదా మహాకవి హృదయం ఎంత లోతైనదో తెలిసి వచ్చేది! కాబట్టి 'అస్తి ధ్వనిః'. ఇట్టి దీనిని వస్తుధ్వని అంటారు.

అలంకార ధ్వని: సాహిత్య శాస్త్రంలో అలంకారాలకు చాలా విలువ ఉన్నది. అందుకనే ''కావ్యం గ్రాహ్య మలంకారాత్''[8] అనే శాస్త్రోక్తి బయలుదేరింది. అయితే దాని పేరులోనే ఉంది అది బాహ్య విషయమనీ, అంగ ప్రాయిమనీ. కానీ ఒక్కొక్కచోట ఈ అలంకారం ధ్వనిరూపంలో సిద్ధించి ప్రధానార్థంలో పర్యవసిస్తుంది. కాబట్టి 'అలంకార ధ్వని' అనేది కూడ ఒక విభాగంగా ఏర్పడుతున్నది. దాని స్వరూపం చూద్దాం.

బలవంతులైన భీష్మా
దుల న ను దోర్చు నూర్జితుండై, మఱి పో
రుల గ ందు పదాఱవ
కళకు మానుండు గాడు కవ్వడితోడన్[9]

ఇది నన్నయ్యగారి పద్యం. పాశుపతాస్త్రం కోసం శివుని గూర్చి తపస్సు చెయ్యటానికి వెళ్లిన ప్రియానుజుని రాక కోసం ధర్మరాజాదులు ఎదురుచూస్తున్నారు. అప్పుడు వారిదగ్గరకు రోమశ మహాముని వచ్చి అతని బలపరాక్రమాదు లను వర్ణిస్తూ ఈ మాట అన్నాడు.

కళ అంటే చంద్రుని పదారవభాగం. ఇక్కడ నిజంగా చంద్రుడు కాదు. కాబట్టి కర్ణుడు పదారవ కళకు సమానుడు కాదు అనేమాట లోకోక్తి. ఆవిధంగా ఈ పద్యంలో లోకోక్త్యలంకారం ఉంది. కానీ మరొక అలంకారం దీనివలన స్ఫురిస్తున్నది. అర్జునుడు పూర్ణచంద్రుడు అనేరూపకాలం కారం కానీ, అర్జునుడు పూర్ణచంద్రసమానుడు అనే ఉపమా లంకారం కానీ ఇక్కడ ప్రతీయమానం అవుతుంది. ప్రకృత సందర్భంలో ఆ స్ఫురించే అలంకారం ప్రాధాన్యాన్ని సంతరించుకోవటమే కాదు, పరమరమణీయం కూడా అవుతుంది. కృష్ణ పక్షం అంతా ఎలాగో కడపి పూర్ణచంద్రుని ప్రతీక్షచేసే చకోరాల లాగా ఉన్నారు ధర్మరాజాదులు. అ రికి పూర్ణచంద్ర సామ్యంగల అర్జున దర్శనం ఎంత ఆ దకర మవుతుందో చెప్పనక్కరలేదు కదా! పైగా ఇది ఒ మహర్షి వాక్కు. ''ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోను ధావతి''[10] అన్నట్లు ఇది అవశ్యంభావి విషయం అనే స్ఫూర్తి పాఠకునికి కలుగుతుంది. మహా కవుల అలంకారాలు కేవలం అలంకారాలుగా మిగిలిపోవు. అవి ధ్వనికోటిలోనికి చేరి ఆత్మస్థానా న్నందుకుంటాయి.

రసధ్వని: రసం విభావాదిసామగ్రిచేత స్ఫురించవలసినదే కానీ శబ్దంచేత సాక్షాత్తుగా చెప్పబడేది కాదు. అంతేకాదు. ఒకవేళ ఏ కవి అయినా ఏ కారణంగా నయినా రసాన్ని వాచ్యంచేస్తే అది దోషం అవుతుంది. కావ్యంలో రసాన్ని కవి ఎలాగైనా సాధించాలి.[11] అది ధ్వనిరూపంలోనే ఉండాలి. అయితే వస్త్వలంకార ధ్వనులవలె దీనిని ఏదో ఒక పద్యంలో నిరూపించటం సుకరం కాదు. అయినా మచ్చునకు ఒకటి చూద్దాం.

ఈ క్రింది పద్యం మహాభారతంలోని నలచరిత్ర లోనిది.

కలహంస పలికిన పలుకులు గణియించు;
వడి దాని పోయిన వలను సూచు

బలుకదు సఖులతో లలితాంగి; మిన్నక
  యలయుచునుండు దా ననుదినంబు;
చారు విభూషణాహార విహార శ
  య్యాసన భోగంబులందు విముఖి
యయి రేయి బగలు నిద్రయు నోర్పు నెఱుగక
  దమయంతి నలు డను ధరణినాథు
నంద బుద్ధి నిలిపి కందర్ప బాధిత
యగుచు నున్నయది ధరాధినాథ!
ధరణి పతుల నౌరుల నురుగుణాఢ్యుల విన
నొల్ల దెంత విభవ యుక్తు లయిన![12]

ఇక్కడ దమయంతి చేష్టలను కవి వర్ణిస్తున్నాడు. సహృదయునికి అందులో రస చర్వణకు కావలసిన సామగ్రి లభిస్తుంది శాస్త్ర మర్యాదలో మాటాడుకుంటే నల దమయంతులు ఆలంబన విభావం. కలహంసపలుకులు ఉద్దీపన విభావం. ఆ పలుకులను గణియించటం, అది పోయిన వలను చూడటం మొదలైనవి అనుభావాలు. సఖులతో పలుకకపోవటం జాడ్య మనే వ్యభిచారి భావాన్ని తెలియజేస్తుంది. అలయుచునుండుట గ్లానిని, భోగ విముఖత్వం అరతినీ తెలుపుతున్నాయి. వీనిని మన్మథావస్థ లంటారు. ఇలా ఈ పద్యంలో విభావాది సామగ్రి అంతా పాకానికి వచ్చి అభిలాషరూపవిప్రలంభ శృంగార రసాన్ని పాఠకునికి అనుభవానికి తెస్తున్నది. సూచనా మాత్రంగా ఇది రసధ్వని స్వరూపం.

శాఖోపశాఖలుగా విస్తరిల్లిన కావ్యాత్మ రూప ధ్వని స్వరూపనిరూపణకు ఇది ఒక పులాకం మాత్రమే. కాగా మొదట ఒక ప్రశ్న వేసుకున్నాం. గుణాలంకార వృత్తి రీత్యాదుల స్థితి ఏమిటి? అని. ధ్వని అంగి అని కదా పైచర్చ వలన తేలిన సారాంశం! అవన్నీ అంగాలు అవుతాయి నిజానికి అనుభూతిలో అంగాంగి భావం తెలియరాదు. అది అఖండంగానే ఉంటుంది. చర్చ అంతా శాస్త్రమర్యాదకోసం మాత్రమే. ఇందాక అనుకున్నట్లు ఆత్మానుభూతి కలిగిన తరువాత సర్వమూ తన్మయమే అవుతుంది. అలాగే ధ్వని అనుభవానికి వస్తే గుణాలంకారాదులేవీ విడిగా తమ అస్తిత్వాన్ని అంటిపెట్టుకొని ఉండవు. ఒక మహాగాయకుడు పరవశించి పాడుతుంటే ఇదిగో పాట, ఇదిగో తాళం, ఇదిగో మృదంగ నాదం, ఇదిగో వాయులీన నినాదం - అనే అభిజ్ఞ ఉత్తమశ్రోతకు కలుగదు. అంతా నాదతనువైన పరమశివుని అనుభూతిని కలిగిస్తూ ఉంటుంది. ఇక్కడ కూడా అదే స్థితి!

## జ్ఞాపికలు

1. "కా స్వాత్మా ధ్వనిః" - ధ్వన్యా. 1-1 వ శ్లోకం
2. "త భావం జగదురపరే" - 1-1 వ శ్లోకం
3. యత్రా శబ్దో వా తమర్థ ముపసర్జనీకృత స్వార్థౌ వ్యఙ్క్తః కావ్య విశేషః ధ్వని రితి సూరిభిః కథితః. ధ్వన్యాలోకం 1-1 3వ శ్లోకం.
4. "విభాతి లావణ్య మివాఙ్గనాసు" - ధ్వన్యా 1-4వ శ్లోకం.
5. "ఆలోకార్థీ యథా దీపశిఖాయం యత్నవాన్ జనః" ధ్వన్యా. 1-9 వ కం.
6. యో సహృదయశ్లాఘ్యః కావ్యాత్మేతి వ్యవస్థితః, వాచ్య ప్రతీయమా ... తస్య భేదా వుభౌ స్మృతౌ. ధ్వన్యా 1-2వ శ్లోకం
7. ఆం మహాభారతము - శాంతిపర్వము - 1-57
8. కావ్యాలంకార సూత్రాణి - 1అ 1సూ.
9. ఆంధ్ర మహాభారతము - అరణ్య. 2.296.
10. ఉత్తరరామ చరిత్ర-
11. "సాధ్యోహి రసం యధాయధం కవిభిః" - ఆంధ్రశబ్దచింతామణి - 4 వ సూత్రము.
12. ఆంధ్ర మహాభారతము - అరణ్య. 2-26

తామ్ర మివామ్రరసాప్తేః టంకణ సంగేన సాధు కనక మివ।
రజత మివ సుధా లేపాత్ తారుణ్యా త్తవ విభాతి తను శోభా॥

పులుపు తగలడంవల్ల రాగిలాగ, టంకణ సంబంధంతో బంగారులాగ, సున్నం పూతతో వెండిలాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉమవాలి నుండి

# భారతంలో సమన్వయ దృష్టి

శ్రీ మోపిదేవి కృష్ణస్వామి

సంజయుడు, కర్ణుడు - ఇద్దరూ కూడ సూతపుత్రులుగా పిలువ బడినవారే! సంజయుడు నిజంగా సూతపుత్రుడు. కర్ణుడు సూత పుత్రుడుగా అనుకోబడినవాడు.

చిత్రమేమిటంటే ఇద్దరినీ సూతపుత్రులనే పిలిచినా సంజయుణ్ణి అందరూ గౌరవించారు. కర్ణుడు మాత్రం అనేక సందర్భాల్లో సూతపుత్రుడని నిందింపబడ్డాడు. సూతపుత్రుడయినంత మాత్రాన నిందార్హుడయితే సంజయుడు కూడా నిందింపబడాలి కదా!

సంజయుడు ధృతరాష్ట్రుణ్ణి సేవకుడై సేవించాడు. మిత్రుడై హితం చెప్పాడు. గురువై వాసుదేవతత్త్వాన్ని ఉపదేశించాడు. ధృతరాష్ట్రుని చేత అన్ని స్థాయిలలోనూ చూడబడ్డాడు. అతడికి ఎప్పుడు ఎలా అవసరమో అలా మెలగ గలిగాడు. ధృతరాష్ట్రుణ్ణే మెప్పించాడూ అంటే ఇక ఇతరులను మెప్పించాడు అని వేరే చెప్పాలా! అర్జునుడు ఇతనిని ప్రక్కన కూర్చోపెట్టుకున్నాడు. వ్యాసుడు ఇత శిష్యశ్రేష్ఠునిగా పరిగణించాడు. శ్రీ కృష్ణుడు ఇతణ్ణి పరమా మెరిగిన జ్ఞానిగా ప్రశంసించాడు. శ్రీ కృష్ణుని ముం వెలువడిన భగవద్గీత ఇతడి మీదుగానే లోకాని కందింది. ఎలాంటి స్థితిని అనుభవించాడితను! ఎలాంటి స్థితిలో ఉంచబడ్డాడితను! ఎలాంటి స్థితిలో సర్వులచేతా చూడబడ్డాడితను!

మరి కర్ణుణ్ణి కనబడ్డవారెల్లా నిందించారు. పెద్దలందరూ అతణ్ణే తప్పుపట్టారు. భీమార్జునులు గేలి చేశారు. కర్ణుడి వల్లనే ఈ కథంతా జరిగిందన్నారు అందరూ! దుష్టచతుష్టయంలో ప్రముఖుడిగా పేరుబడ్డాడు. రాయబారం అనంతరం శ్రీకృష్ణుని రథం ఎక్కేంత వరకూ రాగద్వేషాలే ఇతణ్ణి నడిపించాయి - అన్నది మనకు స్పష్టమవుతుంది.

సంజయుణ్ణి గౌరవించిన వారు కర్ణుణ్ణి ఎందుకు గౌరవించలేదు? కులం అడ్డువస్తే ఇద్దరికీ అడ్డురావాలికదా! సూటిగా చూడగలిగితే ఇక్కడ అడ్డువచ్చింది కులంకాదు - గుణం. గుణవంతుడు కాబట్టే సంజయుడు గౌరవింపబడ్డాడు. గుణహీనుడుగా ప్రవర్తించాడు కాబట్టే కర్ణుడు నిందించబడ్డాడు.

సమాజం గుణం కనబడిన చోట కులాన్ని అడగదు. గుణం కనబడని చోట మాత్రమే అది కులప్రసక్తిని తెస్తూ ఉన్నది - అని వీరిద్దరి జీవితాలూ స్పష్టంచేస్తున్నాయి.

అప్పుడే కాదు ఇప్పుడు కూడా గుణవంతులయిన వారు కనబడినప్పుడు మీ కులం ఏమిటని సమాజం ప్రశ్నించడం లేదు. ఒకవేళ వారి కులాన్ని గురించి తెలిసినా దానికి ప్రాధాన్యం ఇవ్వడం లేదు. 'ముమ్మడివరం బాల యోగి' జీవితమే ఇందుకు ఒక ఆధునికమైన నిదర్శనం. తపస్సంపన్నుడయిన అతని కులాన్ని గురించి ఎవరైనా పట్టించుకున్నారా? శివరాత్రి నాడు శివునితో సమానంగా అతడినీ అర్చిస్తూ వచ్చారు కదా!

గుణ సంపత్తి లేనప్పుడు, గుణహీనత కనబడుతున్నప్పుడు సమాజం అతడి పుట్టుపూర్వోత్తరాలను తడుముతున్నది, అడుగుతున్నది. గుణహీనుడు కాకపోయినా, గుణసంపత్తి ప్రజ్వరిల్లినా సమాజం ఇక పుట్టుపూర్వోత్తరాలను విస్మరిస్తున్నది. అవన్నీ అప్రధానమైన అంశాలు అంటున్నది. ఆనాటి నుండి ఈనాటి వరకు సమాజం మొత్తంమీద కనిపిస్తూవస్తున్న ఈమాత్రపు మంచితనాన్ని మనం గుర్తించాలి. అభినందించాలి!

కులప్రసక్తి తెస్తున్న వారిని నేను సమర్థించడం లేదు. అలా తేవడం భావ్యమని నేననడం లేదు. అయితే ఈ విషయమై సమాజంలో వ్యక్తమవుతూ వస్తున్న ఒకానొక సూక్ష్మాంశాన్ని నేను గమనించమంటున్నాను. గుణ సంపత్తి పెంచు కోడానికి సర్వదా ప్రయత్నించమని సర్వులకూ విజ్ఞప్తి చేస్తున్నాను. గుణ సంపత్తి పెరిగిన కొద్దీ సామాజిక మయిన రుగ్మతలు - అవి ఏవయినా సరే రూపుమాసి పోతాయని నేను నొక్కి చెప్తున్నాను. మహాభారతం ఈ విషయమై మనకు ఉపదేశిస్తున్న ధర్మ సూక్ష్మాన్ని మీ ముందు పెడుతున్నాను.

తోటివారిని హీనంగా చూస్తున్నవారు వారిలో గుణ సంపత్తి పెరిగిన నాడు ఇంక అలా చూడలేరు. హీనంగా చూడబడుతున్నవారు వారిలో గుణసంపత్తి పెరిగిన నాడు ఇంక అలా చూడబడరు.

మహాభారతం మనకు ఉపదేశిస్తున్న అసంఖ్యాకమైన ఉపదేశాలలో ఇది ఒకటి. నేటి సమాజానికి ఎంతగానో అవసరమైన ఉపదేశ మిది!

పెద్దలు మహాభారత పరమార్థాన్ని గురించి నన్ను వ్రాయమని అడిగారు. వైద్యుడు తన దగ్గరనున్న ఔషధాలలో రోగికి ఏది అవసరమో దానిని ఇవతలకి తీసి అందించిన ట్లుగా, పారమందని మహాభారత మహేతిహాసం నుండి ఈ కాలానికి కావలసిన అంశాన్ని ఒకదానిని తీసి మీ ముందు ఉంచుతున్నాను. నేటి సమాజానికి కావలసిన ఔషధసేవగా నేను దీనిని విశ్వసిస్తున్నాను. మహాభారతమనే వినీల ఆకాశంలో ఈ మహత్తర సందేశం ఒకానొక మెరుపుతీగ మాత్రమేనని హితుడనై తెలియజెబుతున్నాను.

'ధర్మార్థ కామమోక్షాల విషయంలో ఇందులో ఉన్నది ఎక్కడైనా ఉన్నది. ఇందులో లేనిది మరెక్కడా లేదు' అని అంటున్నాడు మహాభారత గాథను జనమేజయునకు విని పిస్తూ వైశంపాయనుడు. ఈ మాట ఎంత నిజం!

'ధర్మార్థ కామ మోక్షాల విషయంలో వేదశాస్త్ర పురాణ ఇతిహాసాల మధ్య అభిప్రాయ భేదాలు ఏమయినా తలెత్తినట్ల యితే ఆయా సందర్భాలకు కావలసిన పరిష్కారం, సమ న్వయం మహాభారతం అలవోకగానూ, అర్థవంతంగానూ అందిస్తుంది' అని అంటున్నాడు భారతానువాదంలో తన వంతు పాత్రకు శ్రీకారం చుడుతూ తిక్కన మహాకవి. ఈ మాట ఎంత ముదల!

మనవారు ఏది చెప్పినా, అవన్నీ వేదాలలో ఉన్నాయని అంటారు. కొందరు అలా అనడాన్ని హేళన చేస్తూ ఉంటారు. అది అలా ఉంచి, సామాజిక సహజీవనానికి కావలసిన సదుపదేశాలన్నీ, కావలసిన సమన్వయాలన్నీ మహాభారత మహేతిహాసంలో మహోన్నతంగా అందించ బడ్డాయని అంగీకరించక తప్పదు. లోక శ్రేయస్సును కోరిన వారు దీనిని అనుసరించకా తప్పదు.

**కనక మయామ్బుజ ముకులై రంతర మివ చారు కాయమానస్య।**
**తదివోప ర్యున్నతితః తారుణ్యా త్తవ విభాతి తను శోభా॥**

బంగారు కమలపు మొగడలవల్ల పందిరి మంచం లోపలి భాగంలాగ, ఎత్తుగా ఉండడంవల్ల పందిరిమంచం లాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి

# పద కవిత్వం

శ్రీ యస్. గంగప్ప

## పదమంటే పాట

పాడుకోడానికుపకరించేది. పద పద్య కవితల్లో, విశ్వ సాహిత్యంలో, పదమే ముందావిర్భవించింది. మానవుడు అతి ప్రాచీన కాలంలో మాట నేర్చిన వెంటనే తనలోని ఆవేశకావేషాలను, భావోద్రేకాగ్రతలను, భక్తిప్రేమలను మొదలైన వాటిని అభివ్యక్తీకరించడానికి పాట నేర్చుకొన్నాడు; ఆ పాటతోపాటు ఆట నేర్చుకొన్నాడు. మాట, పాట, ఆట - అనేవి క్రమంగా మానవుని వ్యక్తిత్వాన్ని పెంచాయి. అయితే ఆ పాటలు మౌఖికమే. తరువాతి కాలంలో పాండిత్య ప్రకర్ష పెరిగాక పద్యమై పండితులకు పరిమితమైంది. ఇది లిఖిత సాహిత్యం. మౌఖికమైన జానపద సాహిత్యం అనాది; పునాది. లిఖిత సాహిత్య రీతి ననుసరించి అనిబద్ధమైన జానపదమే తరువాతి కాలంలో నిబద్ధీకరించబడి పద కవిత్వమైంది. ఇది మన తెలుగుకు మాత్రమే పరిమితం కాదు. అన్ని సాహిత్యాలకు వర్తించే లక్షణం.

## మార్గ - దేశి

మన దేశంలో సాహిత్యం మార్గ, దేశి అని ద్వివిధం. ఆయా ప్రాంతాల్లో ఆయా ప్రజల చేత వాడబడి, పాడబడుతూ పరివ్యాప్త మైంది దేశి. లక్షణబద్ధమై పండితైకపరమైంది మార్గ. ఈ మార్గ, దేశి విభాగం మొదట సంగీత పరంగాను, ఆ వెనుక నృత్య పరంగాను, ఆ తరువాత సాహిత్య పరంగాను నిరూపించబడింది. ఈ మార్గ దేశి విభాగాన్ని సంగీత దర్పణమూ సంగీత రత్నాకరమూ నిరూపిస్తున్నాయి. ఈ విభాగం దశ రూపకంలో నృత్యపరంగా పేర్కొన బడింది. దీనివల్ల తేలిన సారాంశం: ''నియమబద్ధమై, శిష్టసమ్మతమును, శాస్త్ర సమ్మతమును అయి ఉత్తమ ఫణితిని రచింపబడినది మార్గ కవిత. నియమరహితమై, శాస్త్రమున కెక్కక కేవల ప్రజారంజనమునకై రచింపబడినది దేశి కవిత.'' దీన్ని మనం పద్య కవిత్వానికీ, పదకవిత్వానికీ సమన్వయించుకోవడమే సముచితం.

## పదకవిత - ఆవిర్భావం

ప్రపంచ సాహిత్యాలన్నింటిలోను పద్యం కంటే పదమే ముందు ఆవిర్భవించిందన్న అంశం సర్వ పండితాంగీకృతం ఇదే విషయాన్ని రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ గారిలా పేర్కొన్నారు: ''రాగతాళములు రెంటిని కలిపి హృదయంగమములైన భావములను వెలువరుచు భాషను అలంకరించుటయే పద రచనకు పరిపూర్ణ స్వరూపము. దాని పరిపూర్ణానుభవమును మనకప్పుడే. సతాళముగనో, వితాళముగనో కావ్యకళా రసానుభవమును ప్రాచీన మనుష్య జాతి పాట రూపముననే అనుభవించి రసించినదని పండితు లూహింతురు. మన పద్యములన్నియు పదముల పరిణామములే అని భావించుటకు పెద్ద సూక్ష్మ దృష్టి అక్కర లేదు.''

ఈ అభిప్రాయాన్ని శ్లాఘిస్తుంది మౌల్టన్ పండితుని సిద్ధాంతం. "The improvised lyrical song, communal or individual, popular or artistic, is probably the simplest and most spontanious form of lyrical expression. The true song is primarily the instinctive out burst of thought in language by aptness of word and rythm echoes or suggests the underlying emotion and by melody of line and harmony of stanza is adapted to such modulations of the singing voice as naturally distinguish emotional utterance The song is, therefore, more than any other lyrical kind a musical cry" ఇది జానపద గేయావిర్భావాన్ని గూర్చి చెప్పినప్పటికీ, తరువాత, దాన్ని నిబద్ధం చేస్తూ రచితమైన పదమే పదకవితకు మూలం. లక్షణ బద్ధమైంది పద్యం. ఏలాంటి లక్షణమూ లేకుండా సామాన్య ప్రజల నోళ్లలో పాడబడేది పదం. ఇదే పాట. ఇదే మొదట ఆవిర్భవించింది.

అదేవిధంగా తెలుగులోను పదమే ప్రప్రథమంగా పుట్టింది. నన్నయ్యకు ముందు, సమకాలికంగాను, ఎంతో దేశి కవిత

అనబడే జానపద కవిత ఉండి ఉంటుంది. అది లిఖితం కాక కేవలం మౌఖికం (oral) గా ఉండి ఒక నోటి నుంచి, మరో నోటికి, ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి ఎన్నో మార్పులకు చేర్పులకు లోనై, ఎంతో కాల గర్భంలో కలిసిపోయింది. ఇది తెలుగు జాతి దురదృష్టం. తమిళంలో ప్రాచీన కవిత అంటే ఈ పద కవితలే.

## మధుర కవిత

దేశి అయిన తెలుగు కవిత నాలుగు విధాలనీ, అందులో మధుర కవితా రీతిలో చేరినది పదకవిత అనీ లాక్షణికోక్తి.

''తెల్గుకవిత యాశు, మధుర, చిత్ర, విస్తరములని నాల్గు తెఱఁగుల గలదని లాక్షణికులనిరి. అందు మధుర కవిత యనగా పాటలు మొదలైనవి. లక్షణ దీపికలో నీ విషయమిట్లు చెప్పబడినది. మధుర కవిత్వంబన్నది నాటకాలంకారం బులు, కళికోత్కళికలు, విభక్త్యాది దేవతోదాహరణములు, సప్తతాళ నటనలు, నట్టొట్లు, గీత ప్రబంధములు, చతుర్భద్రి కాష్టభద్రికలు, బిరుదావళి, నామావళి, భోగావళి, రంగ ఘోష, త్యాగఘోష, చతురతర సంఘటనలు, యక్షగానం బున వెలయు పదంబులు, దరువులు, ఏలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, నుయ్యాల జోలలు, జక్కులరేకు పదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ఏకపద, ద్విపద, త్రిపద, చతుష్పదాష్ట పదులు నివియాదిగా గల్గునవి.''

## పదమంటే

'పదం' అంటే సామాన్యార్థంలో పాట అనే వాడుకని పూర్వోక్తం. రాగతాళ సహితమై ఉండవచ్చు; లేదా కేవలం స్వర సహితమూ కావచ్చు. ఇది జానపద గేయాల్లో స్పష్టంగా తెలుస్తుంది. కోలాటం, దంపుళ్లు మొదలైన పాటల్లో విధిగా తాళముంటుంది. రాగంతోపాటు, విసర్రాయి, కపిలి (మోట) పాటల్లో రాగమే గాని తాళానికవకాశ ముండదు. అయితే రెండింట లయ ఉండి తీరుతుంది. 'పదం' పాడటమన్నది జన వ్యవహారం.

భరతముని చేసిన పద నిర్వచన మిలా ఉంది:

''గాంధర్వం యన్మయాప్రోక్తం, స్వరతాళపదాత్మకమ్
పదంతస్య భవేద్వస్తు స్వరతాళానుభావకమ్
యత్కించి దక్షరకృతం తత్సర్వం పదసంజ్ఞితమ్
నిబద్ధంచా నిబద్ధంచ తత్పదం ద్వివిధం స్మృతమ్
అతాళంచ, సతాళంచ ద్విప్రకారంచ తద్భవేత్
సతాళంచ ధ్రువార్థేషు నిబద్ధం తచ్చనై స్మృతమ్''

స్వరతాళ పదాత్మకమైంది గాంధర్వమనీ, స్వరతా ళానుభావకమైన పదమే వస్తువనీ, అర్థసహితమైన అక్షరాలతో కూడినది పదమనీ, ఈ పదం నిబద్ధం, అనిబద్ధం - అని రెండు విధాలనీ, అవి అతాళము, సతాళమూ నని రెండు విధాలనీ భరత మహర్షి నిర్వచనం. ''నియతాక్షర సంబంధము కలిగి, ఛందోయతి సమన్వితమై, తాలపాతములతో కూడిన పదము నిబద్ధ మనబడును. యతిపాద నియమము లేనిది యును, అనియతాక్షరమును అగు పదము అనిబద్ధమనబ డును.'' దేశీయ వ్యవహారములోని దరువు నుంచి ధ్రువపద మనే లక్షణ నామంగాని, ధ్రువపదం నుంచి దరువు అనే వ్యవహారంగాని వచ్చి ఉండవచ్చునని ప్రాజ్ఞుల అభిప్రా యము.'' సంగీత పరిభాషలో ఈ పదాలు ప్రబంధాలన బడతాయి. పైని భరతముని చెప్పిన రీతిలోనే మతంగుడు, శార్ఙ్గదేవుడు, చివరికి వేంకటమఖి వరకు అందరూ లక్షణా లను వివరించారు.

## పదం: అన్నమాచార్యులు

పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అని ప్రసిద్ధి పొందిన తాళ్లపాక అన్నమాచార్యులు సంస్కృతంలో 'సంకీర్తన లక్షణ'మనే లక్షణ గ్రంథం రచించాడు. అది ప్రస్తుతం లభ్యం కావడం లేదు. కానీ అతని మనుమడు చిన తిరుమలాచార్యుడు తెలుగులో పద్యాత్మకంగా దాన్ని అనువదించాడు. భరతా దులు చెప్పిన పద్ధతిలోనే పద నిర్వచనం ఇందులోను చెప్పబడింది:

''పదమగు సుప్తి ఙ్ఙన్తము
పదమవయవ, మవయవియును బదమనఁ బరగున్
దుదినీ తెఱంగులన్నియుఁ
బదకవితామార్గ సార్వభౌముఁడు దెలిపెన్.''

- ఈ పదాలు శృంగార వైరాగ్య పదాలని ద్వివిధం. శృంగార పదాలు గ్రామ్యోక్తులతో కూడి ఉండవచ్చు.

''పదములు శృంగార వధూ
మృదు మధురమనోజ్ఞ వాక్య మిశ్రములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁ బొంకమొఱిగి పలుకఁగ జెల్లున్''

''పల్లవ నారీ ప్లేచ్ఛా
ద్యుల్లాసమనోజ్ఞ బంధురోక్తులు చవియై
చెల్లును గ్రామ్యములైనను
హల్లీసకముఖ్య నాటకాదిక ఫణితిన్''

- అయితే శృంగార పదాల్లా గాక, వైరాగ్య పదాలు ఉదాత్తంగా ఉండడం అవసరం.

"వైరాగ్య వృద్ధికర గం
భీర పద ణి పొసఁగఁ బెనుపుచు నగ్రా
మ్యార విష్ణుచరితో
దారము యున్న జాలు ధరణి న్వెలయన్"

- వీటినే అధ్యాత్మ పదాలంటారు. ఈ పదాలను సంస్కృతంలోనే గాక ప్రాకృతాది దేశ భాషల్లో చెప్పవచ్చు. వీటికి పద్యాల్లాగా యతిప్రాసలు వర్తిస్తాయని భరతాదుల మతం. ఈ పదాలు వృత్త, నిబంధ, అనిబంధాలని మూడు విధాలు. ఈ నిబంధ పదంలో నాలుగు పాదాల చరణ మొకటిగానీ, అంతకు మించి గానీ ఉండవచ్చు. ఇలాంటి చరణాల అర్థాన్ని వదలక అన్నిటికీ ఏక వాక్యతతో గుది గ్రుచ్చినట్లు మరల మరల భాసిల్లునట్టి పల్లవి ఉంటుంది. ఇది పల్లవి, శిఖాపదమని ద్వివిధం. 'పదసమానమాన పాదయుగ్మము గలది' పల్లవి. అందులో సగం ఏకపాదం గలది శిఖాపదం. ఈ నిబంధ పదంలో పల్లవి ఉంటే శిఖాపదముండదు. శిఖాపదముంటే పల్లవి ఉండదు. ఇలాంటి పల్లవి, శిఖాపదాలలో ఒక దానితో కూడిన నిబంధ పదం చతుర్ధాతుక, త్రిధాతుక, ద్విధాతుక, ఏకధాతుకాలని చతుర్విధం. కాని ఏకధాతుక పదం అరుదుగా ప్రయుక్తమవుతుంది. వృత్తాలు నాలుగు పదాలతోను, జాతులు రెండు పదాలతోను ఉన్నట్లే సంకీర్తనలు కూడా చతుష్పాద, ద్విపాదాకృతితో ఉంటాయి. ఇట్టి కీర్తనలలో దరువు, వాక్యం, అర్ధచంద్రిక, ఏల, గొబ్బిళ్లు. చందమామ పదాలు - అనేవి రెండు పాదాలతో ఉంటాయి. ఇవిగాక అష్టపది, పదమాలిక, శరభపదం అనే పద విశేషాలున్నాయి. ఇంక అనిబంధ పదం అంటే, అనిర్యుక్త పదం తాళ బంధచ్ఛందో విరహితమై చూర్ణాఖ్యతో ఉంటుంది. దీనిని తాళగంధి అని కూడా అంటారు. ఇది అన్నమాచార్యులు సంస్కృతంలో చెప్పిన సంకీ లక్షణం. దీనికి లక్ష్యంగా వేల సంఖ్యలో అతడు సంకీ లు రచించి తరించాడు. ఈ పద లక్షణం అన్ని భాషల వర్తిస్తుంది.

## వాగ్గేయకారుడు

పైని వివరించిన పద రచయితలను పదకారులనీ, పద కర్తలనీ, వాగ్గేయకారులనీ అంటారు. వాగ్గేయకార లక్షణాల్ని తెలుసుకొందాం.

"తాళ్లపాక వారి కాలమున సంకీర్తనమునకే పదమనియు వ్యవహారము. 'కృతీసంశబ్దనే' కీర్తించునది- కీర్తనము. సమ్యక్ కీర్తనము (గీయత ఇతిగీతమ్) పాడబడునది గీతము లేదా గేయము. కాగా అవామాఙ్మనసగోచరమగు దివ్యశక్తిని కీర్తించి పాడునది కీర్తనము లేదా సంకీర్తనము. ఇట్లు గేయమానమగు కీర్తనమే భక్తుని హృదయమును పరమాత్మని పాదసన్నిధికి గొంపోవునది. 'పదగతే' అని అమరము. అందువలన అట్లు తీసుకొని పోవునదే పద మనియు రూఢి కెక్కినది. ఇట్లు నాడు కీర్తనయు, పదము అనబడిన రచన సంగీత సాహిత్యముల సమ్మేళన రూపము. ప్రాచీన లాక్షణికులిందరి సాహిత్యాంశమును 'వాక్' అనియు, సంగీతాంశమును గేయమనియు వ్యవహరించిరి. వీనికే క్రమముగా మాతు, ధాతు సంజ్ఞలు గూడా కలవు." పదంలోని మాతు లేక వాక్కు - సాహిత్యాన్నీ, ధాతు లేక గేయాన్ని - సంగీతాన్ని రచన చేయగలవాడు వాగ్గేయకారుడు. శార్ఙ్గ దేవుడు సంగీతరత్నాకరంలో వాగ్గేయ కారుని గూర్చి నిర్వచించిన వాటిని శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావుగారు విపులంగా వివరించారు.

"వాఙ్మతురుచ్యతే గేయం ధాతురిత్యభిధీయతే
వాచం గేయంచ కురుతే యః సవాగ్గేయకారః"

- కాగా ఈ వాగ్గేయకార లక్షణాలీ విధంగా చెప్పబడ్డాయి:

"శబ్దానుశాసన జ్ఞానమభిధాన ప్రవీణతః
ఛన్దః ప్రబోధ వేదిత్వ మలంకారేషు కౌశలమ్."

- ఈ వాగ్గేయకార లక్షణాలు ఉత్తమ కవికుండవలసిన లక్షణాలతో ఏ మాత్రమూ తీసిపోవనీ, పైపెచ్చు కవి కంటే ఉత్తమ వాగ్గేయకారునిలో సంగీతాది కళల్లో పరిజ్ఞాన ముండాలనీ స్పష్టమవుతుంది.

4.0 పైరీతిని వివరించిన పద లక్షణాలకు లక్ష్యాలుగా అన్నమాచార్యాదులైన వాగ్గేయకారులు అనేక పదాలు రచించారు. అన్నమాచార్యులకు ముందు కృష్ణమాచార్యులు అనిబంధ పదాలైన వచనాలు రచించాడు. అవే సింహగిరి వచనాలు అన్నమాచార్యులు సంకీర్తనలనీ, పదాలనీ రచించారు జానపద గేయ ఫణితులెన్నో ఈ వాగ్గేయకారుడుపయోగించుకొన్నాడు. ఆయన కుమారుడు పెద తిరుమలాచార్యుడు, మనమడు చిన తిరుమలాచార్యుడు. అన్నమయ్య మార్గంలో పద రచన చేసిన వాగ్గేయకారులు. క్షేత్రయ్య కేవలం శృంగార పదాలను రచించాడు. అన్నమాచార్యునిలో ఆధ్యాత్మ, శృంగార సంకీర్తనలున్నాయి. రామదాసు, సారంగ పాణి, త్యాగరాజు ఈ పద రచనా పథంలో క్రమంగా ఉన్నత శిఖరాల నధిరోహించారు అన్నమయ్యలో సంగీతం కంటే సాహిత్యం ప్రాముఖ్యం వహించగా, క్షేత్రయ్యలో సంగీత సాహిత్యాలకు సమ ప్రాధాన్యంతో పాటు అభినయం జోడింపబడి ఉండగా, క్రమంగా సాహిత్యం కంటే సంగీతం త్యాగరాజులో విశిష్టమై ఉంది. తెలుగుదనానికి, ముఖ్యంగా రాయలసీమ మాండలిక పదప్రయోగానికి అన్నమయ్యలో ప్రాధాన్యముండగా, క్షేత్రయ్యలో మరింతగా తెలుగు తేటదనం స్పష్టమైంది. ఇంకా ఎందరో మహానుభావులు ఈ పదకవితకు ప్రాధాన్యమిచ్చి సుసంపన్నం చేశారు.

# ప్ర హే ళి క

శ్రీమతి పి. యశోదా రెడ్డి

ప్రాచీనమైన మన భారతీయ సంస్కృతి వేదమాత నుదుట తీర్చిన కుంకుమరేఖ వలె సకల సౌభాగ్యాలకు మూలదొంతిగా భాసిస్తూ ఉంది. ఈ సంస్కృతి ఎంతప్రాచీన మైందో అంత వివిధమూ, విశాలమూ, విచిత్రపర్వణమూ ఐంది. దీనికి ఔనత్యాన్ని మించిన లోతూ ఉంది. ఎన్ని యుగాల తరబడి ఎన్ని ప్రతికూలపుగాలులు ఎంత వేగంగా వీచినా ఇసుమంత చలనం కూడా లేకుండా, నవోన్మేషశాలిని ఐనప్రతిభావిశేషం వలె నిత్యనూతన వికాసంతో ఎలజవ్వనిలా గోచరిస్తూ ఉంటుంది. ఈ సంస్కృతిలో సకల శాస్త్రాలూ, సమస్తవిద్యలూ, వివిధ నాగరకతలూ, నమ్మకాలూ, కళలూ అన్నీ ''ఋజుకుటిల నానాపథజుషాం నృణా మేకో గమ్యః'' అన్నట్లు ఆ మహాకడలిలో ఏకాత్మతా భావంతో సంలీనం పొందుతున్నాయి. వర్ధిష్ణువూ, సహిష్ణువూ ఐన శ్రీహరిని భక్తులతో పాటు సపత్నులు కూడా ఎవరికివారు తమవాడే అంటూ భావిస్తూ పరవశించినట్లుగా భారతీయ సంఘంలోని ప్రతి ఒక్కరూ ఈ సంస్కృతిని తమదిగానే భావిస్తూ కాపాడుతూ వస్తున్నారు. ఇదొక ఉమ్మడిసొత్తు. ఇందులో అందరికీ భాగం ఉంది. దీనిపై అందరికీ ఆదరాభిమానాలు న్నాయి. దీని సంరక్షణ అందరి బాధ్యత. అసలు సంస్కృతి అంటేనే సంపూర్ణమైన సామాజిక జీవన విధానం. ఇందులో కుల, మత, జాతి, లింగ, వయో భేదం లేకుండా సంఘజీవిత విశేషాలు అంటే ఆచార వ్యవహార, శిక్షాస్వేచ్ఛ, వినోదవిద్యా వివాహాది పద్ధతులు, పండుగ పబ్బాలు అన్నీ చేరుతాయి. తరతరాలుగా మన పూర్వులు తమ అనుభవాన్నంతటినీ కూడ బెడ్తూ దొంతరలు, దొంతరలుగా పేర్చి మనకిచ్చిన వారసత్వం సంస్కృతి. అదొక పెన్నిధి. కండ్లంటూ ఉండాలి కాని ఆ నిధిలో దొరకని వస్తువంటూ లేదు. మన ప్రాచీనులు స్పృశించని విషయ మంటూ దొరకదు.

మన సంస్కృతి సకలం జిజ్ఞాసవల్లనే వృద్ధిని పొందింది. జ్ఞప్తి, జ్ఞేయం అనే ఈ రెండు విషయాలే మనిషిని అజ్ఞానాంధమైన పశుదశనుండి మరల్చి వెలుతురు మార్గంలో పయనింపచేసినవి. నిజం చెప్పవలసివస్తే మనది వ్యావసాయిక మైనదేశం, మన సంస్కృతి నాగరికతలకు ఊపిరి నింపి, నడక నేర్పినవి పల్లెపట్టులు. అందుకే ఈ నాటికీ జనపదా లంటే ప్రతి భారతీయుడూ స్పందిస్తాడు. ప్రతిసాహితీ ప్రక్రియ అప్యాయంగా కదిలి తట్టాడుతుంది. సగౌరవంగా స్మరిస్తుంది. ఆనాటి మన పూర్వులు పచ్చిక బయళ్లలో పశుసమృద్ధిలో, నీలాకాశపు మెరుపుల్లో, సముద్రపు హోరులో, కుండపోతగా కురిసేవర్షంలో, మండుటెండలో, ఏదో తమకు తెలియని రహస్యం దాగి ఉన్నట్లు భావించినారు. ఈ భావనే అన్ని తత్త్వరహస్యాలకూ, సమస్యలకూ, ముడులకూ, ముడివిప్పులకూ కారణమైంది. నాటి నుండే ప్రశ్నలూ, సమాధానాలూ, పాఠాలూ, ప్రవచనాలు ప్రారంభమై నాయి.

అంటే వేదకాలంనుండే ప్రశ్నోత్తర రూపమైన ఈ విజ్ఞానం మన సంస్కృతిలో గట్టిగా కాలూని చోటుచేసుకొన్నట్లు భావించవచ్చు. వేదోపనిషత్తుల తరువాత ప్రశ్నోత్తర రూపంలో నిగూఢమూ, అత్యంతగహనమూ ఐన ధర్మ సూక్ష్మలను ప్రకటితం చేసే విధానాన్ని మహాభారతం చేపట్టింది. వనపర్వంలో యక్షరూపి ఐన ధర్మదేవ - ధర్మజాల సంవాదంలో వ్యక్తమైన మహావిజ్ఞానమే 'యక్షప్ర శ్నలు' అనే పేరుతో ప్రసిద్ధమై సాహిత్యంలో స్థిరపడింది. అందుకే ఈనాడు విడదీయరాని చిక్కు సమస్యలు ఎదురైన ప్పుడు 'ఇది యక్ష ప్రశ్నరా తండ్రీ!' అంటూ లక్షణార్థంలో వాడటం పరిపాటియై కన్పిస్తూఉంది. ఒకొక్కప్పుడు పోలి కలో సాటిచూపుతూ 'వలె'అనే ఉపమావాచకప్రయోగంతో ఉపమానంగా కూడా ఉపయోగించడం గోచరిస్తూ ఉంది. అంటే ఈ మార్గానికి ఎంత ప్రాధాన్యం ప్రాచుర్యం కలిగిందో విదితమవుతుంది. జిజ్ఞాసువులకు సులభంగా విజ్ఞానాన్ని పంచే ఉత్తమ విద్యా మార్గంలో సర్వోపనిషత్సారభూత మైన మహావిజ్ఞానం గర్భితమై ఉన్నా పైకి ఏ మాత్రం గోచరించ కుండా అగ్నిగర్భ ఐన ఆశ్వత్థం వలె సరళమై సుందరంగా కన్పిస్తూఉంటుంది. విజ్ఞాన సర్వస్వం వలె ఉపకరించే ఈ । కియలో ఒక్కొక్కప్పుడు చమత్కారం, శబ్దశక్తి అర్థగర్భిత ధ్వని, మొదలైన శాస్త్ర సిద్ధవిశేషాలు చోటుచేసుకుంటూ హితీవేత్తలకు మంచి విందును పంచుతుంది. విజ్ఞానంతో పాటు, వినోదాన్నీ సహృదయులకు పంచే కారణంతో ఈ సాహితీ ప్రక్రియ రాను రాను ఒక విశిష్ట ప్రక్రియగా స్థిరపడి

అభిమానంతో ఆదరింపబడుతూ వచ్చింది. అదే ప్రహేళిక అని పేర్కోవచ్చు.

ప్రహేళిక అంటే వాక్చమత్కార రూపమైన క్రీడావిశేషంగా మనం గ్రహించవచ్చు. విద్యావంతులూ, నాగరకులూ ఐన మన భారతీయులు రమించే వైజ్ఞానికపు క్రీడలలో ఈ ప్రహేళికా వినోదం ప్రధానమై కన్పిస్తూ ఉంది. ఈ ప్రహేళికను ప్రవల్హికా అనే పేరుతో కూడా వ్యవహరిస్తూ మన నిఘంటుకారులు నిఘంటువులను చూపినారు. ఉదాహరణకు-

1. ప్రవల్హతే అచ్ఛాదయతీతి ప్రవల్హికా - ఈ నిఘంటువు ఆధారంగా ప్రవల్హికా అంటే అచ్ఛాదనం చేసేది. అంటే మనకు అభిమతమైన అర్థాన్ని కప్పిపుచ్చేది, గూఢంగా ఉంచేది, పైకికనుబడకుండా గవుసెన కప్పినట్లు దాచి ఉంచేది అని భావించవచ్చు.

2. మరికొందరు ఈ ప్రహేళికను పురస్కరించుకొని 'ప్రహేళయతి - అభిప్రాయం సూచయతీతి ప్రహేళికా' - అంటూ వివరణ ఇచ్చినారు. ఇక్కడ ప్రహేళనం అంటే అభిప్రాయాన్ని సూచించడం అనే అర్థంలో ఉపయోగం ఉన్నట్లు తేలుతుంది. కానీ మరికొందరు 'ప్రహేళయతి' సూచయతి భావం నతు స్వరూపార్థ మితిభావః'' - అంటూ చెప్పి స్వరూపార్థాన్ని ప్రకటితం చేయకుండా కేవలం భావాన్ని మాత్రమే తెలిపేది ప్రహేళిక అంటూ సవరణ చూపినారు. దీనివల్ల ప్రహేళికలో ఒక నిగూఢత, ఒక మర్మం, ఒక మాట చమత్కారం, దాగి ఉన్నట్లు సులభంగా గ్రహించవచ్చు.

ఈప్రహేళికను రస్కరించుకొని కాణేపండితుడు -'ప్రహేళికాతు సా యా వచోసంవృతికారి యత్' - అంటూ నిర్వచించినా . ఈ నిర్వచనం దాదాపు ప్రవల్హికను పురస్కరించుకొని చెప్పిన నిర్వచనం వలెనే గోచరిస్తుంది. కానీ పండితులను పురస్కరించుకొని ప్రహేళికకు వాక్ సంవరణం ప్రధానం. అంటే అభిధార్థసూచన వెంటనే అవగతం కాకుండా మాట చమత్కారపు ముసుగులో ఉంచడం ప్రధానంగా భాసిస్తుంది. అంటే ఏమీ లేదు. దానికి అర్థ నిగూఢత ముఖ్యం అంటూ మనం గ్రహించవలసి ఉంది. మహాకవి దండి తన కావ్యాదర్శంలో; 'క్రీడాగోష్ఠీ వినోదేషు తద్‌జ్ఞైరాకీర్ణ మంత్రణే! పరవ్యామోహనే చైహాసోప యోగాప్రహేళికా అన్నారు. అంటే నాగరకులైన మన పూర్వులు ఆడుకునే ఆటలల్లో కూడా బుద్ధివిశేషాలైన మాట చమత్కారాలతో క్రీడించేవారుగా తెలుస్తుంది. క్రీడారూపమైన ఈ ప్రహేళికా గోష్ఠీవినోదంలో, తద్‌జ్ఞులైన వారు పాల్గొంటూ ఉండే ఈ మాటల గారడీలు వ్యామోహ కారకాలై అందరికీ నవ్వుల పువ్వులు పంచేవి అంటూ మనం సగర్వంగా స్మరించుకోవచ్చు. పరస్పర వ్యామోహకారకమై, బుద్ధివిశేష జన్యరూపాలైన ఈ వాక్యచమత్కారాలను పురస్కరించుకొని భట్టబాణుడు తన కాదంబరిలో ప్రస్తావించినాడు. బాణుడు శూద్రకుని దినచర్యలను గూర్చిప్రస్తావిస్తూ-'కదాచి దక్షరచ్యుతిక మాత్రాచ్యుతక, బిందుమతీ, గూఢచతుర్థపాద, ప్రహేళికా, ప్రధానాదిభి రన్వితా సంభోగసుఖపరాఙ్మఖః సుహృత్పరివృతో దివసమనయత్'' అంటూ చెప్పి శూద్రకుడు స్నేహబృందంతో కూడి సంభోగసుఖాన్ని కూడా మరచి కాలాన్ని వెళ్ల బుచ్చడానికి కారణాలైన వ్యామోహాలలో తదితర వాక్యచమత్కార రూపాలైన సాహితీ వినోదాలలో ప్రహేళిక కూడా ఉన్నట్లు విదితం చేసినాడు. ఈ వాక్యాలు ఆధారంగా చూస్తే సకల సంపత్సంపన్నమూ, సుసంస్కృతమూ ఐన మనజాతి ఎంతటి మహోన్నత దశను అనుభవించిందో ఆలోచించుకోవచ్చు. విద్యావంతులూ, రసికులూ, నాగరకులూ అని చెప్పకోదగినవారు ఈనాటివలె చిల్లరపనులలో బుద్ధిశక్తులను వృథా చేసుకోలేదు. ఆనాటి విద్వాంసులూ, రసికులూ, యువరాజు స్నేహ బృందంతో కలిసి చమత్కార జనకాలు, గుప్తార్థ సంభరితాలూ, వినోదైకప్రాయాలూ ఐన వాగ్వినోదాలతోక్రీడించేవారని ఈ వాక్యబంధాలన్నీ సద్యోజనితాలై అప్పటి కప్పుడే కల్పింపబడేవి అని మనకు తెలుస్తుంది.

ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఘనం ప్రతివిషయంలో హద్దులనూ, సరిహద్దులనూ ఛేదించుకుని విశాలవిశ్వంతో పోలికలు చూసుకుంటున్నాం. ఇది ఎంతైనా హర్షించదగ్గ విషయం. కానీ కేవలం లక్ష్మణ రేఖలను దాటడానికి మాత్రమే కాకుండా శక్తిని పెంచుకొని దేశగౌరవాన్ని కాపాడే విషయంలో కూడా పాటిస్తే మేలుగా ఉంటుంది. ''ప్రహేళిః, ప్రహేళికా'' A riddle, an enigma, a camendrum అంటూ నిఘంటువులు కన్పిస్తున్నాయి.

'విదగ్ధముఖమండన' కారుడు ఈ ప్రహేళికలను పురస్కరించుకొని

''వ్యక్తీకృత్య కమప్యర్థం స్వరూపార్థ గోపనాత్
యత్ర బాహ్యాంతరా వర్థౌ కధ్యతే సా ప్రహేళికా''

అంటూ నిర్వచించినాడు. స్వరూపాన్ని అర్థాన్ని కప్పిపెడ్తూ వ్యక్తీకరింపబడిన ఏదో ఒక అర్థంలో బాహ్యాభ్యంతర స్వరూపం దాగి ఉంటుందో లేదా ప్రకటితమౌతుందో అట్టి విచిత్ర రచనా విశేషం ప్రహేళికగా మనం ఈ నిర్వచనం వల్ల గ్రహింపవచ్చు. అందుకే ఈ లాక్షణికుడు

ఈ ప్రహేళికలను 'శాబ్దీ, ఆర్థీ' భేదాలతో రెండుగా గుర్తించినాడు.

ఇట్లే రుద్రటుడు ఈ ప్రహేళికలను పురస్కరించుకొని -

"మాత్రా బిందుచ్యుతకే ప్రహేళికా కారకయా గూఢే
ప్రశ్నోత్తరాది యాన్యత్ క్రీడా మాత్రోపయోగ మిదమ్"

అంటూ చెప్పినాడు. గూఢార్థనిక్షిప్తాలై, ప్రశ్నోత్తర రూపం లోకానీ, మరి వేరే రూపంలో కానీ ఉన్న ప్రహేళికలు, మాత్రాబిందు చ్యుతకాదులతో పాటూ క్రీడా మాత్రోపయోగాలుగా ప్రాచీనులు గ్రహించినట్లు రుద్రటునివల్ల తెలియ వస్తుంది. రుద్రటుడు కూడా ఈ ప్రహేళికలను 'స్పష్టప్రచ్ఛన్నార్థ, అవ్యాహృతార్థ అనే భేదాలతో రెండుగా గుర్తించినాడు.

ఈ ప్రహేళికలన్నీ శబ్దార్థ చమత్కారాలతో ఏర్పడుతూ ఉంటాయి.

ఉదాహరణకు -

కేశవం పతితం దృష్ట్వా
ద్రోణో హర్షముపాగతః।
రుదంతి కౌరవా స్సర్వే
హా! కేశవ! కథం గతః॥

అనే శ్లోకాన్ని గ్రహించవచ్చు. ఈ పద్యాన్ని మామూలుగా దండాన్వయం చేస్తూ తాత్పర్యాన్ని ఆలోచించినప్పుడు - శ్రీకృష్ణుడు పడటం చూచి ద్రోణుడు సంతోషాన్ని పొందుతూ ఉంటే, కౌరవులందరూ 'హా! కేశవా ఎక్కడికి వెళ్లినా'వంటూ ఏడుస్తున్నా రని తెలుస్తుంది. కానీ ఈ తాత్పర్యం సంప్రదాయక దృష్టితో, కథా దృష్టితో పొసగడంలేదు. కేశవ పతనానికి ప్రబల విరోధులైన కౌరవాదులూ సంతోషించాల్సి ఉంటుంది. కానీ దుఃఖించవలసిన పని లేదు. అందుకే ఈ సందర్భంలో కనిపించే విరోధాన్ని అభిధా శక్తికి ఉన్న మరో సంకేతితార్థాన్ని స్నేహ, వైర, సాహచర్య, ప్రాకరణికాదుల సాహాయ్యంతో ఆలోచించవలసి ఉంటుంది. అప్పుడు ద్రోణః అంటే కాకి అనీ, కౌరవ అంటే నక్క అనీ అర్థాలు స్ఫురిస్తాయి. ఈ రెండు సమకూడిన తరువాత 'కేశవ' అనే సమస్త పదాన్ని బుద్ధినైశిత్యంతో కే+శవ - ఏదో ఒక శవం అనే అర్థ కల్పనతో కథా సంబంధితమైన తాత్పర్యాన్ని సృష్టించుకుంటాం. అప్పుడు కాకి అనువైనచోట పడిన శవాన్ని చూచి సంతోషిస్తూ ఉంటే, తమకు వీలులేని స్థితికి దుఃఖిస్తూ ఆశవాన్ని పురస్కరించుకొని కేశవా! ఓశవమా! ఎక్కడకు వెళ్లినావంటూ నక్కలన్నీ వాపోతున్నట్లు ప్రాకరణికశుద్ధితో అన్వయాన్ని కుదుర్చుకోవచ్చు. ఇదే ఇక్కడున్న చమత్కారం. ఈ ఆటలో పాల్గొనే వ్యక్తికి భాషావ్యాకరణాది శాస్త్రాలపై అధికారం అవసరం. ఇట్లే మరికొన్ని సందర్భాల్లో వివక్షితార్థం సులభంగా వ్యక్తమౌతూ ఉన్నా, ఆ అర్థం అదికాదు, కాదంటూనిషేధిస్తూ చివరకు అనేక వివరణలకు గమ్యంగా ఉన్న ఒక అప్రసిద్ధపదార్థాన్ని అభిమతార్థంగా స్వీకరించడం జరుగుతుంది.

ఉదాహరణకు-

ఏక చక్షు ర్న కాకోయం
బిల మిచ్ఛే న్న పన్నగః।
క్షీయతే వర్ధతే చైవ
న సముద్రో న చంద్రమాః ॥

అనే శ్లోకాన్ని గ్రహించవచ్చు. ఒక కన్నున్నదేది? అనే ప్రశ్నకు వెంటనే 'కాకి' అనే సమాధానం వస్తుంది కానీ, అదే సంకేతితార్థం అయితే ప్రహేళిక ఎక్కడుంటుంది? అందుకే కాదు, అట్లే బిలాన్ని (రంధ్రాన్ని) ఏది కోరుతుంది పాముకాదు, సరే తరుగుతుందీ, పెరుగుతుందీ ఏది? సముద్రమా? చంద్రుడా? కాదు మరి ఏమై ఉంటుందీ? అనే జిజ్ఞాసను కలుగచేస్తూ ఆలోచనకు పదునుపెడుతుంది. ఈ ఆలోచనల రాపిడిలో నిగ్గుదేరిన బుద్ధికి ఒకవస్తువిశేషం గోచరిస్తుంది అప్పుడు దాన్ని అతడు 'దారంతో ఉన్నసూది' అన్నాడు. తర తరాలకూ అదే వివక్షితార్థంగా చలామణి ఔతూ వస్తూ ఉంది.

కొన్ని కొన్ని సార్లు ఒకప్రహేళికలో ఒక పదాన్ని తొలగించడం వల్లనో, ఒక పదంలోని ఒక అక్షరానికి మారుగా మరో అక్షరాన్ని ఉంచడం వల్లనో కావలసిన అర్థం ఏర్పడుతుంది. ఉదాహరణకు - 'యౌవనే ఫుల్ల మంబుజం' అన్న వాక్యాన్ని గ్రహించవచ్చు', యౌవనంలో పద్మం వికసించింది అంటే అర్థం అంత సూటిగా కుదరలేదు, అందుకే ఆవాక్యంలో 'యౌ' అనే అక్షరాన్ని తొలగిస్తే 'వనే ఫుల్లం అంబుజం' - నీళ్లలో పద్మం వికసించింది అనే అర్థం వస్తుంది. ఇట్లే 'కింకరోతు కురంగాక్షీ వదనేనపీడితా' అనే వాక్యం సరిగా అర్థసంగతిని కలిగించడం లేదు, అప్పుడు 'వదనే' అనే పదాది 'వ' కారాన్ని తొలగిస్తూ 'మ' కారాన్ని ఉంచితే 'మదనునితో బాధింపబడిన యువతి ఏం చేస్తుందీ? అనే వాక్యం ఏర్పడితే దానికి ఏదో అప్పటికి తోచిన సమాధానం చెప్పుకోవచ్చు. ఇటువంటివి అంత విదగ్ధులుకాని విద్యార్థుల వంటి వారు వినోదించే ప్రహేళికారూపాలు. ఒక్కొక్కసారి ఉపయుక్తమైన పదమే అనేక మార్లు పునరుక్తిని పొందుతూ కథాకృతిగా పరిణమిస్తుంది. ఆ పదానికి సరి ఐన అర్థాన్ని నిర్ణయించడంలోనే చిక్కంతా గూడుకట్టుకొని ఉంటుంది.

ఉదాహరణకు -

**సువర్ణస్య సువర్ణస్య సువర్ణస్య చ జానకీ**
**ప్రేషితా తవ రామేణ సువర్ణస్య ముద్రికా !!**

అనే పద్యాన్ని గ్రహించవచ్చు. అశోకవనిలో ఉన్న సీతకు శ్రీరామచంద్రుడు తన బంగారు ముద్దుటుంగరాన్ని పంపినాడన్న విషయం ప్రసిద్ధమైంది కాబట్టి ఈ శ్లోకంలోని రెండవ పాదార్థాన్ని సుళువుగా గ్రహించవచ్చు, అయితే మొదటి పాదంలో ఉన్న మూడు సువర్ణాలే చిక్కును తెస్తూ ప్రహేళికై కూర్చుంది. దీని ముడిని విప్పదలచుకుంటే కథకు భంగం రాని అర్థవ్యక్తిని కల్పించాల్సివస్తుంది. అప్పుడు కొంచెం బుద్ధికిపని కల్పిస్తూ ఆలోచిస్తే, ఎనబైరత్తుల బరువుతో, మేలిమివన్నెకలిగి, చక్కగా అక్షరాలు చెక్కబడిన బంగారపు వ్రేలిముద్రికను రాముడు సీతకు పంపినాడు అనే అర్థంకుదిరి ఆనందాన్ని కలిగిస్తుంది. ఇట్లే సంకేతప్రహేళిక లంటూ మరికొన్ని ఉన్నాయి. ఉదాహరణకు-

**కాంతే కనక జంబీరం కరే కిమపి కుర్వతి**
**ఆగారలిఖితే భానౌ బిందు మిందు ముఖీ దదౌ!**

ఈ విశేష సంఘటనను గ్రహించవచ్చు. ప్రియురాలిని కలుసుకోదలుచుకొన్న ప్రియుడు సమయసంకేతం కోసం అరచేతిలో నిమ్మకాయను అటూ ఇటూ నలుపుతున్నాడు విషయాన్ని గ్రహించిన జాణ తన ఇంటిగుమ్మంముందున్న సూర్యుని బొమ్మచుట్టూ గుండ్రంగా సుడి గీచింది. అంటే సూర్యాస్తమయం తరువాత అంటూ ఆప్రేమికుడు సంకేతాన్ని గ్రహించినాడు. వ్యంజనావృత్తి వలె ఈ సంకేతాలు కూడా అనేక పరిస్థితులపై ఆధారపడుతూ మనోహరార్థాన్ని సూచిస్తూ వినోదాన్ని కలిగిస్తుంటాయి.

మరో విచిత్ర విధానంలో ప్రశ్నోత్తర రీతిని ప్రదర్శించే ప్రహేళిక లున్నాయి. ఇందులో శ్లోకపాదం మొదటి చివరి అక్షరాలను జోడిస్తే అడిగిన ప్రశ్నకు సమాధానం వస్తుంది.

ఉదాహరణకు-

**సీమంతినీషు కా శాంతా** = స్త్రీలలో శాంతమూర్తి ఎవరు?
**రాజాభూత్ కోగుణోత్తమః** = రాజులలో గుణశ్రేష్ఠు డెవరు
**విద్వద్భిః కా సదా వంద్యా** = విద్యాంసులచేసదావందనీయమైన దేదీ? అత్రైవోక్తం న బుధ్యతే

ఈ శ్లోకంలోని మొదటి చివరి అక్షరాలు కలిపితే - సీతా, రామ, విద్యా అనే మాటలు వస్తాయి. అప్పుడు స్త్రీలలో శాంతమూర్తిసీత, రాజులల్లో గుణోత్తముడు రాముడు, విద్వాంసులచేత సదా నమస్కరింపబడేది చదువు అనీ సమాధానం తేలుతుంది విద్వల్లోకం ప్రహేళిక అంటూ పిలిచే ఈ క్రీడ జనసామాన్యంలో, తెలుగు వారిలో పొడుపు కథగా స్థిరపడుతూ వారి ఇంట విడదీయరాని చుట్టంగా మెలగుతూ వస్తూ ఉంది! ఇక పొడుపు కథ అనే పదానికి నిఘంటువును గూర్చి ఆలోచిస్తే మన నిఘంటుకారు లంతగా పరిశ్రమించినట్లు కనిపించడం లేదు - అందుకే నాకు తోచిన రీతిలో ఆలోచిస్తే-

1. పొడుపుకథ - పొడ్పుకథ - (పొడుపు + కథ) - (పొడుచు+కథ)

2. పొడ+చూ - పొడుచు-ఉదయించు, ప్రకాశించు - అర్థాన్ని కాశింపచేసే కథ; పొడర్పు - పొడుపు = ప్రకాశం, లుగు, అందుకే వెలుగును విజ్ఞానాన్ని పంచే కథ.

3 పొడచు - పొడుపు - తగులుట, తాకుట, బాధించుట, చిక్కులో వేయుట. మనస్సును తాకే అర్థాలు, చిక్కు ప్రశ్నలు - ఆ చిక్కును విడదీసే కథలు
ఈ పొడుపు కథలు ఎద లోతులను తాకుతూ బుద్ధికి పదను పెడ్తూ మేల్కొలిపేవి. జ్ఞానోదయాన్ని కలిగించేవి. ఉత్తేజాన్ని ఉల్లాసాన్ని కలిగించేవి అంటూ నిర్వచించవచ్చు.

## పొడ్పుకథ – దాని పర్యాయ పదాలు

1. **విచ్చుకథ :–** విచ్చు = వికసించు = దాగిఉన్న దాన్ని తెరచిచూపు, ముడివిచ్చు ఆవరణ తొలగించు, ఈ అర్థాల్లో ఈ పదాన్ని గ్రహించి ఎప్పుడు విచ్చుకథ అంటే నిగూఢార్థాన్ని ప్రకటించేది, చిక్కును విడదీసి మనస్సుకు ఆనందాన్ని కలిగించేది అంటూ భావించవచ్చు.

తెలంగాణా ప్రాంతంలో పొడుపు కథలు 'తట్లు' అనే పేరుతో అపురూపమైన సాహిత్యంతో అనాదినుండి ఆబాలగోపాలంగా ప్రచారంలో ఉన్నాయి. 'నేనో తట్టేస్త చెప్పుసూతం' 'మనం తట్లేసుకుందమా!', అంటూ నలుగురు ఒకచోట కూడినపుడు, వెన్నెల రాత్రిళ్లలో, పెండ్లీ పేరంటాలు జరిగే వేళ వయసు కాండ్లంతా ఒకచోట కలిసి పడుకునేప్పుడు 'తట్లు' అనే మాటల వినోదాలతో గడిపేవారు, గడుపుతున్నారు కూడా

**తట్లు:– తాకుట, స్ఫురించుట.**

సాధారణంగా తెలంగాణా ప్రాంతంలో, చూడకుండా తొందరగా నడిచివెళ్లేప్పుడు కాలివేళ్లకు ముఖ్యంగా బొట్టన వ్రేలికి ఎదురు దెబ్బ తగిలినప్పుడు తట్టు తాకింది అనడం పరిపాటి

కాని ఇక్కడ ప్రాకరణిక శుద్ధితో పరిశీలిస్తే స్వీకరింపవలసింది ఈ అర్థం కాదు. కానీ యోగ రూఢితో 'తట్టుట' అనే దాన్ని స్ఫురించుట, తోచుటగా గ్రహిస్తూ 'తట్టు' అంటే అర్థగర్భితమైన ప్రశ్నలకు సద్యోజనితంగా స్ఫురించే జవాబు లున్న కేళీ విశేషం అని మనం నిర్ణయించుకోవచ్చు. ఈ సందర్భంలో ఒక చిక్కుప్రశ్నకు నలుగురు మేధావులు నాలుగు విధాలుగా సమాధానాలు చెప్పుకోవచ్చు. అయినా ప్రధానంగా కావలసింది మాత్రం సద్యస్ఫూర్తి. ఒకరు ఒక తట్టు వేస్తే ఆ తట్టును విడదీసిన వారికి మారు తట్టు వేసే అధికారం ఉంది. దీన్నే తట్టుకు మారు తట్టు అంటాం. మాటకు ప్రతిమాటగా 'తట్టుకు మారుతట్టు'వేస్తూ రెండు జట్లుగా విడివడి పిల్లలు వినోదిస్తూ ఉంటారు, ఈ రెండు జట్లకూ వారి వారి అమ్మమ్మలూ, నాయనమ్మలూ తోడ్పడుతూ నవ్వుల జల్లులతో గలగలమంటూ వినోదిస్తారు.

**మారు కతలు:** రాయలసీమలో కొన్ని చోట్ల ఈ 'తట్లకే' మారుకతలు అనే పేరుంది. మారుతట్టు లేనిదే అది వినోదం కాదు అందుకే మారుతట్టును మారుకతలుగా స్వీకరించి ఉండవచ్చు. సాధారణంగా పొడుపు కథలో ఒక విశేష కథనం ఉన్న కారణంతో, అది ఒకరినుండి మరొకరికి చెప్పబడే కారణంతో ఈ ప్రక్రియకు 'కత' అనే బిరుదు తప్పలేదు.

**శాస్త్రం:** కరీంనగరం ప్రాంతంలో పొడుపు కథను 'శాస్త్రం' అంటూ వ్యవహరిస్తారు. 'ఏదీ ఒక శాస్త్రం ఏయ్', 'నీకు శాస్త్రం ఒక్కటన్నరాదా?' అంటూ అడుగుతుంటారు. ఇక్కడ 'శాస్త్రం' అంటే రహస్యార్థంతో కూడిన ప్రశ్న, విస్తృతమైన అర్థాన్ని అంతా సూత్రబద్ధంగా సూక్ష్మరూపంలో ఇముడ్చుకొని అలవోకగా గమ్మత్తుగా కన్పించే కారణంతో పొడుపు కథకు 'శాస్త్రం' అనే పేరు రూఢి అయి ఉండవచ్చు. ఇదే ప్రహేళిక

**విప్పే కతలు:–** మరికొన్ని ప్రాంతాల్లో చదువుకున్నాం, నాగరకులం అని తమను తాము సంభావించుకునే తెలుగు విద్యార్థులు కొందరు తట్లను విప్పే కథలు అంటూ పేర్కొంటున్నారు. ఈ పదాన్ని విచ్చు కథకు మారుగా వ్రాతలో ఉపయోగిస్తూ దీనికి కొత్తగా ప్రచారాన్ని కల్పించే ప్రయత్నం చేస్తున్నారు. కాని కొత్తగా కల్పించిన ఈ పదం సహజంగా కాకుండా కొంత కృతకంగానే కన్పిస్తూ వివరణాత్మకంగా ఉంది. విప్పేకతలు - అంటే, వాక్యార్థం సులభంగా అవగాహన కాక, ముడి కట్టేసినట్లు కఠినంగా కుదించి ఉండేవి అని అర్థం. ఆయా సందర్భాల్లో ఆ ముడిని అంటే, ఆ కాఠిన్యాన్ని తొలగిస్తూ అర్థాన్ని సరళతమంగా చేసి వాస్తవాన్ని ప్రదర్శించడం జరిగే కారణంతో ముడివిప్పులకు 'విప్పే కథలు' అనే పేరు విద్యావంతులు పెట్టుకున్నారు. పొడుపు కతలన్నీ ఒకే రూపంలో ఉండవు. కొన్ని పొడి మాటల్లో ప్రశ్నార్థకంగా, మరి కొన్ని పదాలుగా, ఇంకా కొన్ని అదృశ్య రావృత్తితో, అంత్యాక్షరావృత్తితో, ముక్తపదగ్రస్తంగా, అనుప్రాస రీతిలో అంటే శబ్దాలంకార ప్రధానరూపాలుగా, మరికొన్ని గేయరూపంలో కన్పిస్తూ ఉంటాయి. ఏవి ఎట్లా, ఎన్ని రూపాల్లో ఉన్నా ప్రయోజనం మాత్రం ఒక్కటే! ప్రధాన విషయం మాత్రం విజ్ఞానం, వినోదం. ఒక విషయం పిల్లల మనస్సులో నాటుకొని త్వరగా కంఠస్థమై వ్యవహార రూపంలో స్థిరపడేందుకు ఎన్ని పోకడలు అవసరమో అన్ని పోకళ్లనూ మనవారు ప్రయోగించి చూచినారు. ఇవన్నీ మన గ్రామీణుల బుద్ధి వికాసానికీ, సంప్రదాయానికీ, ప్రయోగ కుశలతకూ దోహదం చేస్తూ బుద్ధిగతమైన క్రీడా విశేషంగా మనలో మినుకుమినుకు మంటూ నిలిచి ఉంది.

**తట్టు:**

మానులో మానైన
మక చక్రం పండైన
తినరాని పండైన
తీపులు మెండు

అంటే - బిడ్డ. శరీరంలో,శరీరం, ఆ శరీరానికి అంటే ఆ మానుకు పుట్టిన ఫలం బిడ్డ. కానీ ఆ పండును తినలేం. అయినా అమితమైన తీపి కలది. బిడ్డకన్నా మధురమైన ఫలం ఏముంటుంది? ఈ విధంగా తెలుగు వారి జీవితంలో చిన్ననాటి నుండే గృహనీతి విద్యకు మూలమైన మాతృత్వ భావనను ప్రోదిచేస్తూ శిశు ప్రాధాన్యాన్ని ఎత్తి చూపుతూ మన సంస్కృతికి వెన్నెముకలుగా నిలుస్తాయి ఈ పొడుపు కథలు.

**మారుతట్టు:**

గట్టంత చెట్టు
చాపం తాకు
గుమ్మంత పూత
చెప్పుకో చూతం?

ఇక్కడ ప్రశ్నలోనే సమాధానం గర్భితమై ఉంది. ఇది పూర్తిగా గ్రామీణ వాతావరణానికి సంబంధించిన రహస్యం. కాదు నిత్యకలాపం. ప్రశ్నను నిదానంగా ఆలోచిస్తే చాలు అర్థం దానంత టదే ప్రకటిత మౌతుంది. కావలసిం దల్లా వస్తుపరిశీలనం, ఆచార పరిజ్ఞానం. గట్టు అంటే చిన్న కొండ, మామూలుగా వింటే అక్కడ కొండంత చెట్టుంది, దాని

ఆకులు చాపంత ఉన్నాయి, దాని పువ్వు గుమ్మిలా విశాలంగా ఉంది, అమ్మో! ఇదేం రాక్షసి చెట్టో అనిపిస్తుంది. పేరు చెప్పలేక తంటాలు పడాల్సివస్తుంది. కానీ నిదానంగా ఆలోచిస్తే గట్టునిండా ఉండేది వృక్ష సముదాయం అదే నిత్యైక వచనంలో గట్టంత చెట్టు, చాప ఆకుతోనే అంటే ఈత ఆకుతోనే అల్లుతారు, మరి చాపంతా ఆకు కాక మరేమై ఉంటుంది? అట్లే గుమ్మిని (గింజలు నిల్వ చేసే పెద్ద తడికల బుట్ట) కాపాడేందుకు రంధ్రాలనుండి గింజలు రాలకుండా కుదురుగా ఉండేందుకు పేడతో అలుకుతారు, దాన్నే పూయడం, పూత అంటారు. అందుకే గుమ్మి అంతా ఉన్నది పూతనే కదా! ఇదీ రహస్యం. ఈ ముడి విప్పి చెప్పితే పిల్లా పెద్దా అంతా గలగల నవ్వుతూ సంతోషాన్ని వ్యక్తం చేస్తారు.

**ఇట్లే మరో విచ్చు కథ:**

**గోడమీద బొమ్మ - గొలుసుల బొమ్మ**
**వచ్చిపొయ్యేవాళ్లకు - వొడ్డిచ్చె బొమ్మ -? =తేలు**

తేళ్లు ఎప్పుడూ గోడకు తగిల్చిన బొమ్మల్లా అతుక్కుంటాయి. ఈ బొమ్మ అంటే తేలూ, దాని కొండి, గొలుసులు గొలుసులుగా ఉంటుంది. ఇది ఆగోడ సమీపం నుండి వచ్చి పోయే వాళ్లకు వొడ్డిస్తుంది, అంటే కొండితో చిటుక్కుమంటుంది ఇదీ రహస్యం.

**కాయగూరలకు సంబంధించిన పొడ్పుకత:**

**ఓరోరి అన్నరో - కారాకు పచ్చరో**
**నీ వోళ్లంత ముళ్లురో - నీ కండంత చేదురో**
**సమాధానం: కాకరకాయ**

వ్యావసాయిక దేశంలో మన కుటుంబాల్లో మొన్నమొన్నటిదాకా పెరట్లలో పందిళ్లకు కాకర, బీర, పొట్ల కాయలు నిండుగా కాచేవి. పిల్ల లందరికీ విత్తు నాటింది మొదలు మొలకెత్తి, పెరిగి పెద్దై పూచీ కాచీ, కాయలు తెంపేవరకు తెలుసు, కానీ పిల్లలకు తెలిసినవి, గరుకుగా, పసరాకు పచ్చతో ఉన్న కాయ లెన్నో ఉన్నాయి. కానీ ఉన్న కాయలల్లో కాకరకాయను వేరు చేసే ప్రత్యేక లక్షణం చేదు. ఈ చేదుతనం ప్రత్యేకంగా నిలుస్తూ పొడుపు కథలో ఉన్న కిటుకును సులభంగా గ్రహించి ముడి విప్పడానికి తోడ్పడుతుంది.

ఇట్లే మన శరీరంలోని అవయవాలను పరిచయం చేసే విచ్చుకత:

'గబ గబ నడచిపోయేవి రెండు
గట్టెక్కి చూచేవి రెండు
అంటి పట్టుకునేవి రెండు
ఆలకించేవి రెండు -

సమాధానం - కాళ్లూ, కళ్లూ, చేతులూ, చెవులూ ఇవన్నీ జతగా, రెండు రెండు అంటూ అవి చేసే పనులు కూడా పిల్లల మనస్సుల్లో చొప్పించచేసే విద్యాబోధన విధానం ఇందులో దాగి ఉంది. ఎంతో చిక్కైన ఖగోళ రహస్యాలను చిటికెలో విప్పి చెప్పే పొడుపుకథ.

**చాప చుట్టాలేము - రూక లెంచాలేము.**

అయ్యో రామ! చుట్టని చాప ఏది? ఎంచని రూక లేవి? అంటూ మెదడుతో కుస్తీ పట్లకు దిగకుండా పిల్లలు క్షణంలో మహా శాస్త్రజ్ఞుల్లా, ఆకాశం, చుక్క లంటూ చెప్పి వేస్తారు. దీన్నిబట్టి ఉత్తరోత్తర పిల్లలు ఆకాశం లేనిది అనీ, చుక్కలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయనీ గ్రహించగలుగుతారు. ఈ కనువిప్పుతో వారు భవిష్యత్తులో ఎంతైనా పరిశోధించగలరు.

ఇట్లా చూపుతూ పోతూ ఉంటే ఎన్నైనా చూపగలుగుతాం. కానీ, ఈనాడు ఉమ్మడి కుటుంబ వ్యవస్థ లేదూ. పల్లెటూరు, పాడీ, పంట, చెట్టూ, గుట్ట, తాడూ తలుగు, పొలం పెరళ్లతో సంబంధం అంతకంతకు తగ్గిపోతూ ఉంది. ఆ వడ్లనలూ, వార్పులూ లేవు. గాదెలూ, గుమ్ములూ లేవు. ఒక్కచోట కలిసి ఉండే ఓపికలూ, సంస్కారాలూ లేవు. ఆ సందర్భంలో ఈ మాట చమత్కారాలూ, అందుకు కావలసిన ముడి సరుకూ ప్రకృతి విజ్ఞానం ఆచార వ్యవస్థ, శాస్త్ర పాండిత్యం అన్నీ ఉంటేనే కానీ ఈ పొడుపు కతల పురాణం జరుగదు. అసలు ప్రహేళికా క్రీడకు ఆసక్తి, రసికత, చాలినంత సమయం, నవ్వుతూ నవ్వించే స్వభావం చాలా అవసరం. నిలిచి నిలకడగా నీళ్లు తాగే సమయం లేక పరుగు పందేల్లో చిక్కుకొనే ఈ నాటి నాగరికుడికి ఇవన్నీ నచ్చవు. అనవసరపు Waste గా దమ్మిడి చేయని దండుగగా కన్పిస్తూ ఉంటుంది. రుచి తెలిస్తేనే కాని అనుభవించలేడు, అనుభవిస్తేనే కాని రుచి తెలియదు. అందుకే సంస్కృత భాషావేత్తలైన శిష్టులు క్రీడించే బుద్ధి వికాస రూపమైన ఈ క్రీడ ఒక కావ్య ప్రక్రియా విశేషంగా ఈ నాడు పుస్తకాల్లో కన్పిస్తుందే తప్ప, వ్యవహారంలో అంతగా లేదు. దాని ప్రతిరూపమే పొడ్పుకత. వీటికి ఇంకా వింత ప్రశ్నలు, విచిత్రపు ముళ్లు, చిత్రప్రశ్నలు, సమస్యలు, తీర్పు కథలు, యక్షప్రశ్నలు, చిట్కులు, చిట్కాలు, టక్కర్లు, అంతులు, జిత్తులు, అంటూ కొత్తగా మనం ఎన్నైనా పేర్లు పెట్టుకోవచ్చు. పేర్లు కాదు ముఖ్యం, మనకు కావలసింది మనోహరమూ, ఉల్లాసకరమూ, వినోదకరమూ, విజ్ఞాన దాయకమూ అయిన ఈ క్రీడ మరుగున పడకుండా చూడటం!

# నన్నయ భాషా మాధుర్యం

శ్రీ వి.వి.యల్. నరసింహారావు

'ఆంధ్ర భారత కవితా విమర్శనము'లో శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు నన్నయ భారతం గూర్చి చెప్పిన వాక్యపం -

''భిన్నమతములవారిని సంతోషపెట్టు తలంపుతోనే ప్రసన్న కథాకవితార్థయుక్తిలో నారసి కొందఱు, అది అక్కరలేని కేవల మపభ్రంశవాదులగు పండితులు సంస్కృత కావ్యములలో వలెనే ఇచ్చటను గానవచ్చు దీర్ఘసమాసబాహుళ్యము, పదములపొందిక, అక్షరరమ్యత, ధారాళ మృదుమధురశైలిని జూచి ఈ గ్రంథము నాదరింతురుగాకయని జగద్ధితము కొఱకు నన్నపార్యుడు తెనుగు భారత సంహితా రచన బంధురుడయ్యెనని తెలియుచున్నది ''

(పు 92)

ఇక్కడ కోరాడవారు పేర్కొన్న నన్నయ 'ధారాళ మృదుమధురశైలి' ఆయన భాషామాధుర్యానికి సంబంధించినదేనని వేరుగా చెప్పనక్కరలేదు.

నేటికి పదిశతాబ్దాలుగా తెలుగువారికి అమృతరుచులు చూరలిచ్చిన ఆంధ్ర పద్యకవిత్వంలో నన్నపార్యుని ఏ ఒకపద్యం కదిలించినా అందులోని భావగాంభీర్యం కంటే ముందు శ్రోత నాకర్షించేది భాషామాధుర్యమే మధుర మధురమైన ఈ మహాగుణం వల్లనే నన్నయ వాల్మీకిని గుర్తుకుతెస్తూ ఉంటాడు కవితాశాఖ నారోహించిన వాల్మీకి కోకిలకు సర్వులూ నమస్కరించేది ఆ కోకిల గొంతునుండి స్రవించే మాధుర్యానికి ముగ్ధులయ్యేకదా! ''కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్'' అన్నప్పుడు అతిమాత్రమైన భాషామాధుర్యమే ప్రస్తావించబడింది. వాల్మీకి కవితా భాషలోని ఆ మహామాధుర్యమే నన్నయ భాషలోకి కూడా జాలువారింది. భారతకథ వ్యాసుడు చెప్పిందే అయినా కథా విషయంలో మాత్రమే నన్నయకు వ్యాసుడు అనుసరణీయుడైనాడు కాని, భాషా మాధుర్యవిషయంలో మాత్రం వాల్మీకే గురువైనాడు.

ఆంధ్రభాషా మాధుర్యం గూర్చి ప్రస్తావించవలసివచ్చినప్పుడు దీన్ని రెండు దృక్కోణాలనుండి పరిశీలించవలసి వస్తుంది. ఒకటి - నన్నయనాటికి సిద్ధమైయున్న తెలుగు పదాల స్వరూపం, సంస్కృత ప్రాకృతభవమై సిద్ధించిన భాష, అనురూపద్రావిడ భాషలనుండి తెలుగునకు సంక్రమించిన పదజాలం మొదలైన కేవల భాషా సంబంధమైన శబ్దస్వరూప వివేచనం రెండవది - సంస్కృత కావ్యాలలో నాటికి ప్రహతంగా ప్రయుక్తమైవస్తున్న సమాస సంయోజనపద్ధతులు తమిళ కర్ణాటాది భాషలలోగల కావ్యాల్లో ప్రయుక్తమౌతున్న శబ్ద సంయోజనపద్ధతులు, ఆలంకారిక సంప్రదాయంలో కావ్యగుణాలకు సంబంధించి మాధుర్యమనే గుణం సిద్ధించే మార్గం మొదలైనవి.

నన్నయ తనకు సమకాలికమైన పండితసభలను ఆలంకారికముగా అభివర్ణించుచు పలికిన పద్యం పరామర్శించవచ్చు ఈ సందర్భంలో

పరమవివేక సౌరభ విభాసిత సద్గుణపుంజ వారిజో
త్కర రుచిరంబులై సకల గమ్యసుతీర్థములై మహామనో
హర సుచరిత్ర పావన పయః పరిపూర్ణములైన సత్సభాం
తర సరసీవనంబుల ముదం బొనరం గొనియాడి
వేడుకన్.

(ఆది 1-23)

ఈ పద్యంలోని దీర్ఘసమాసాలు, నాతిదీర్ఘసమాసాలు సంస్కృత కావ్యాల్లో, ఎడనెడ కనిపించేవే అయినా శబ్దాల కూర్పులో సిద్ధిస్తున్న మార్దవ లాలిత్య మాధుర్యాది విశేషాలు నన్నయ కవితకు ప్రాణలక్షణాలైన గుణాలుగా కనిపిస్తుంటాయి

నన్నయకు ఆదర్శప్రాయుడుగా చెప్పబడుతున్న పంపని విక్రమార్జున విజయంలోని ''లలితపదం ప్రసన్న కవితా గుణమిల్లదె పూణ్దు'' (1-9) అనే పద్యంలో సులలితశబ్ద జాలం ప్రసన్నకవిత్వగుణం అనేవి అనల్ప కవితాగుణాలుగా చెప్పబడ్డమాట వాస్తవం. 'పంపభారతదీవికె' రచించిన డా డి ఎల్. నరసింహాచార్ పంపని 'లలితపదము'నకు సుందరమైన శబ్దములని అర్థం వివరించారు. శబ్దాలకు సౌందర్యమనేది రసానుగుణంగా సిద్ధించవలసిందేకాని కేవల సుకుమార శబ్దాలు సర్వత్రా ప్రయోగించటంవల్ల సిద్ధించేది

కాదు. సింహగర్జనం భయావహంగా ఉండటం, కోకిల కుహూకారం మధురంగా ఉండటం పరిశీలిస్తే గర్జన భయం కలిగించటం గర్జాసౌందర్యం. కుహూరావం మధురంగా ఉండటం కుహూకార సౌందర్యం స్వభావ రమణీయతలోనే సౌందర్యం ఆవిష్కృతమౌతుందని గమ్యార్థం. భావానుగుణ శబ్దాల ప్రయోగంవల్లనే రసావిష్కారం జరుగుతుంది మాధుర్య మనే గుణం సర్వరసాలకు సంబంధించింది కాదు. శృంగారాదులైన కొన్ని పరిమిత రసాలకు మాత్రమే సంబంధించింది. ఈ అంశం పరిశీలించటానికి అలంకార శాస్త్ర ప్రమాణాలు ఆశ్రయించక తప్పదు.

పంపకవి పేర్కొన్న 'లలితపదము, ప్రసన్న కవితాగుణము' అనేవి నృపతుంగుడు 'కవిరాజమార్గము'లో పేర్కొన్న కవితాగుణాలకు సంబంధించినవే.

''సమ, మధుర, నిబిడ, శాంత, సు
కుమార, సుసమాహిత, ప్రస, న్నోదార,
ప్రమి తాగ్రా, మ్యోజస్వి
క్రమదిం దశభేద మల్లి దక్షిణమార్గం.''
(క.రా.మా ll - 54)

దశవిధములైన ఈ కావ్యగుణాలు 'శబ్దాలంకార వర్ణన నిర్ణయ' మనే ద్వితీయపరిచ్ఛేదంలో పేర్కొన్నాడు నృపతుంగుడు. దాక్షిణాత్య సంప్రదాయంగా రూపొందిన ఈ 'దక్షిణమార్గం' దండి 'కావా దర్శమ్' లో చెప్పిన కావ్యగుణాలే.

''శ్లేషః ప్రసాదః సమతా
మాధుర్యం సుకుమారతా,
అర్థవ్యక్తి రుదారత్వ
మోజః కాంతి సమాధయః''
(కావ్యాదర్శమ్ l - 41)

ఈ దక్షిణమార్గంలో మధుర రావోచితమైన చతుర రుచిర పదరచన ప్రసిద్ధి వహించిందని స్పష్టమౌతుంది నృపతుంగుడు కవిరాజమార్గంలో వీటిని స్పష్టంగా పేర్కొన్నాడు.

శ్రీ విశదవర్ణ మధురా
రావోచిత చతుర రుచిర పదరచన చిరం
దేవి సరస్వతి హంసీ
భావదని విగూళ్గి కూర్తు మన్మానస దూళ్.
(క.రా.మా l - 3)

విశదవర్ణములతో కూడి మధురమైన శబ్దముల ధ్వనికి (నాదమునకు) తగిన చమత్కార సుందరమైన పదముల రచన సరస్వతీవాహనమైన ఆడురాయంచ గమనంలా మనస్సును ఆహ్లాదపరుస్తుందనేది దాక్షిణాత్య కవిరాజమార్గంగా నాటికి ప్రసిద్ధమై ఉందని భావించవచ్చు.

'అయితే వీర రౌద్ర భయానక రసాలకు ఇట్టి మధుర నాద స్ఫూర్తిగల శబ్దప్రయోగం సముచితంగా ఉంటుందా?' అంటే సముచితంగా ఉండదనే జవాబు.

మాధుర్యగుణంలో పృథక్పదత్వం ప్రధానలక్షణంగా ఉంటుంది. పదాలు విడివిడిగా ఉండి, సుకుమార నాదాన్ని స్రవింపజేసేవిగా ఉండాలి.

రాజసూయం పూర్తి అయినప్పుడు ధర్మరాజు ఎటువంటి వైభవంతో ఉన్నాడో చెప్పేసందర్భం ఉంది. ఇది ధర్మజుని వీరప్రతాపవైభవాన్ని సూచించే సందర్భం రచన ఓజోగుణ ప్రధానంగా ఉండటం సముచితం. అధర్వణా చార్యులు రచించిందిగా చెప్పబడే ప్రసిద్ధమైన ఒకపద్యం ఈ సందర్భంలో ఉదాహరణీయం.

''ప్రణుతాశేష వసుంధరాధిప శిర
స్స్రగ్గంధ లుబ్ధభ్రమత్
క్వణ దభ్రభ్రమకృ ద్ద్విరేఫగణ
ఝంకారప్రదాబద్ధ సం
ప్రణవ త్రుధిత ప్రవర్తిత
సమగ్రక్ష సూయాధ్వర
క్షణ సిం సన భాసితున్ దృఢ
ధనుశ్శ్లాఘానుజుం ధర్మజున్''

ఈ పద్యం ఆంధ్రకావ్యాలంకార సూత్రవృత్తిలో 'మాధుర్య' మనే శబ్దగుణానికి విపర్యయలక్షణంగా ఉదాహరించబడింది. ఇదే కథాసందర్భంలో నన్నయ తన భారతంలో వ్రాసిన పద్యాన్ని ఈపద్యంతో పోల్చిచూస్తే అధర్వణ రచనకూ, నన్నయరచనకూ భేదం స్పష్టమౌతుంది.

దేవగురుద్విజప్రకర
తృప్తికరున్ వరరాజసూయ య
జ్ఞావభృథాభిషేక విమ
లాంగు విశుద్ధయశోనిధిన్ జగ
త్పావను ధర్మనందను
సభాస్థితుజూచి ముదంబు చెంది రిం
ద్రావరజాది మిత్రు; లస
హత్వము పొందిరి ధార్తరాష్ట్రులున్.
(సభా ll - 73)

దీర్ఘసమాస భూయిష్ఠం కాకుండా పృథక్పదత్వలక్షణంతో మాధుర్య ప్రసాద సౌకుమార్యాలకు అభిముఖంగా నడిచే శబ్ద సంయోజనం కనిపిస్తుంది నన్నయపద్యంలో.

దశవిధములైన కావ్యగుణాలలో మాధుర్య ప్రసాదములు నన్నయ భాషాప్రయోగ లక్షణాలుగా కనిపిస్తాయి. ఇంతకూ ఈ గుణద్వయంలో ప్రసన్నతకు సంబంధించిన ప్రసాదగుణం మాధుర్యం కంటె విలక్షణమై సర్వరససాధారణ గుణంగా

కనిపిస్తుంది. అటువంటప్పుడు 'ప్రసాద' మనేది శబ్దగుణమా ? అర్థగుణమా అనే ప్రశ్నకలుగకపోదు. ఈ ప్రశ్నలకు జవాబుగానే వామనుడు కావ్యాలంకార సూత్రవృత్తిలో ''శబ్దార్థయో ర్ధర్మాః'' అని ప్రసాదము శబ్దార్థ సంబంధమైన ఉభయగుణంగానే నిర్దేశించాడు. ఒక్క వామనుడనే కాదు. ధ్వనికారుడైన ఆనందవర్ధనుడూ, లోచనకారుడైన అభినవగుప్తుడూ ప్రసాదగుణ విశేషాన్ని సర్వరస సాధారణమైనదిగానే అంగీకరించారు.

''సమర్పకత్వం కావ్యస్య యత్తు సర్వరసాన్ ప్రతి
స ప్రసాదగుణో జ్ఞేయః సర్వసాధారణ క్రియః
ధ్వన్యా ॥ - 11

''ప్రసాదస్తు స్వచ్ఛతా శబ్దార్థయోః సచ సర్వరస సాధారణో గుణః''

- లోచనం

మమ్మటుడు కావ్యప్రకాశంలో ప్రసాదగుణ వైశిష్ట్యాన్ని వివరిస్తూ ''ఇది ఎండు కట్టెలో అగ్నివలె ' గుణం కలిగిం''దనీ, ''తేటనీటివంటి''దనీ సర్వవ్యాప త్వగుణం కలిగిందని కొనియాడాడు.
(కా.ప్ర. 8 - 94)

ఒక్క ఉదాహరణ చూద్దాం. ఖాండవదహనం జరుగుతోంది వనంలోని పక్షులు మొదలైన సర్వజీవజాలం తప్పించుకొని పోగలిగినవి పోగా తప్పించుకొనిపోలేని పసిప్రాణులు అగ్ని కాహుతి కావలసిన స్థితిలో ఉన్నాయి. మందపాలుడనే ముని జరితఅనే లావుకపెంటివల్ల తాను కన్నపక్షి సంతానం-ఖాండవవనంలో మంటలు ప్రజ్వరిల్లగా-ఏమైపోయినవో అని విచారిస్తున్నాడు.

''తరుణుల నజాత పక్షుల
జరణంబులు లేనివారి శార్ఙ్గేయుల న
ల్వుర నొక్కతె యెట దోడ్కొని
యరుగంగా నేర్చు జరిత యాపదగడవన్''
ఆది VIII - 314

నిజానికిది కరుణజనకమై చిత్తద్రుతిహేతువైన సందర్భం. కరుణ విప్రలంభములలోనే కాక, శాంతములో కూడా ద్రుతిహేతువైన విలక్షణ మాధుర్యం లేకపోలేదు. శృంగారంలో అయితే చిత్తద్రుతి సంగతి చెప్పనే అక్కరలేదు. ఆనందవర్ధనులు ఈ అంశాన్ని చాలా స్పష్టంగా నిర్దేశించారు.

''శృంగార ఏవ మధురః పరం ప్రహ్లాదనో రసః
తన్మయం కావ్య మాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి
శృంగారే విప్రలంభాఖ్యే కరుణేచ ప్రకర్షవత్
మాధుర్య మార్ద్రతాం యాతి యతస్తత్రాధికం మనః
ధ్వన్యా ॥ 8,9

కేవలం విడివిడి పదాలవల్లనే మాధుర్యం సిద్ధిస్తుందను కోవటానికి వీలులేదు. ఆర్ద్రతకు హేతుభూతమైన శబ్దాలతో భాష నడిచినప్పుడే మాధుర్యం వ్యంజక మౌతుంది.

''నల దమయంతు లిద్దఱు
మనః ప్రభవానల బాధ్యమానులై
సలిపిరి దీర్ఘవాసర నిశల్
విలసన్నవ నందనంబులన్
నలినదళంబులన్ మృదుమృణా
ళములన్ ఘనసారపాంసులన్
దలిరుల శయ్యలన్ సలిల
ధారల జందన చారుచర్చలన్ ఆర ॥ - 24

ఇందులో సమాసాలున్నప్పటికీ అవి అతిదీర్ఘములు కాకుండా పృథక్పదత్వస్ఫూర్తిని కలిగిస్తూ సాగటం విశేషం. శబ్ద సన్నివేశం చిత్తద్రుతిహేతువై ఎంతో మాధుర్యవ్యంజకంగా ఉంది.

మాధుర్య ప్రసన్నతలు ఒండొంటితో నెయ్యమంది సాగిన రచన నన్నయ భాషా మాధుర్యమునకు ప్రధానహేతు వన వచ్చును.

సత్కవి ప్రయుక్తమైన పదాలు ఆయా సందర్భాలలో సహృదయునకు అర్థస్ఫూర్తికంటే ముందే-కేవల శబ్దశ్రవణం వల్లనే - సౌందర్యద్యోతకాలుగా ఉంటాయని ఆనందవర్ధనోక్తి. అర్థం మనస్సుకు స్ఫురించటానికి ముందే శబ్దం శ్రోతకు రస స్ఫూర్తిని కలిగిస్తూ రమణీయతను ఆపాదిస్తుందట!

''పదానాం స్మారకత్వేపి పదమాత్రావభాసినః
తేన ధ్వనేః ప్రభేదేషు సర్వేష్వప్యస్తి రమ్యతా''
- ధ్వన్యా

ఈ క్రింది పద్యంలో నన్నయ మాధుర్యాభివ్యక్తి అర్థాతిశాయిగా గోచరిస్తుంది.

లాలిత రూపయౌవన విలాస విలాసినులైన అంబికాం
బాలికలన్ వివాహమయి భారత వంశకరుండు కామలీ
లా లలితానుభోగరస లాలసుడై నిజరాజ్యభార చిం
తాలసుడయ్యె గామికి నయంబున నొందు
తలంపబోలునే?

(ఆది 4-213)

విచిత్రవీర్యుడు అంబికాంబాలికలతో నిరంతర కామ లీలాలోలుపుడై వర్తించిన తీరు పద్యంలోని శబ్దాలన్నిటిలోని లకారావృత్తి వల్ల వ్యంజింపజేస్తూ, నన్నయ ఆర్ద్రతామూలకమైన భావ మాధుర్యాన్ని కుప్పపోసిన సందర్భం ఇది.

భారతం ఆనందవర్ధనులు సంభావించినట్లు శాంతరసప్రధానమైంది. శాంతమునకు ఉన్ముఖంగా సాగే రచనలో సందర్భా

నుసారంగా అనేకరసాలు ప్రసక్తము నాయి. కాని భిన్నభిన్న ములైన ఆ రసాలన్నీ అంగరసము అంగిరసమైన శాంతము నకు ఉపస్కారంగా నడవటం ఀషం. ఈ రహస్యాన్ని గుర్తించే నన్నయ భారతకర్తయైన వ్యాసుణ్ణి గూర్చి ఇట్లా ప్రస్తుతించాడు.

భారత భారతీ శుభ
 గభస్తి చయంబులజేసి ఘోరసం
సార వికార సంతమస
 జాల విజృంభము వాపి సూరి చే
తో రుచిరాబ్జ బోధన
 రతుండగు దివ్య పరాశరాత్మజాం
భోరుహమిత్రు గొల్చి ముని
 పూజితు భూరియశోవిరాజితున్
(ఆది 1-122)

సంసార వికారమనే చీకట్లను పోద్రోలగల సూర్యుడు వ్యాసుడట! ఆ సూర్యుని కిరణాలే మహాభారత సాహిత్యం. పండితుల మనఃపద్మాలను వికసింపజేయటంకోసం ఉదయించిన సూర్యు డావ్యాసమహర్షి.

భారత కథా ఫలాన్ని కూడా నన్నయ ఈ పద్యంలో సూచించాడు.

దీని కనుగుణంగానే వ్యాసభారతాన్ని ఎంతో జాగరూకతతో అనువదించాడు నన్నయ.

పాండవులు ద్రౌపదీ సహితులై అరణ్యావాసం చేస్తుండగా కిమ్మీరదానవుడు వారిపై విజృంభించగా ద్రౌపది భయభ్రాంత అయిపోయింది. పాండవులు వెంటనే కిమ్మీరదానవుడి మీదకు విజృంభించటానికి మారుగా, భయంతో వణకిపోతున్న ద్రౌపదిని తమ పదిచేతులతో పాదివిపట్టుకొన్నారట. ఆ సందర్భాన్ని వ్యాసులవారు తత్త్వదృష్టితో వివేచించి వర్ణించారు.

''దుశ్శాసన కరోత్సృష్ట విప్రకీర్ణ శిరోరుహా
పంచపర్వత మధ్యస్థా నదీవాకులతాం గతా
మోముహ్యమానాం తాం తత్ర జగృహుః పంచపాండవాః
ఇంద్రియాణి ప్రసక్తాని విషయేషు యథారతిమ్
- ఆరణ్య

సంసార వికారరూపమైన తత్త్వమాధుర్యాన్ని శాంతోన్ముఖంగా వ్యాసులవారెట్లా ప్రవహింపజేశారో నన్నపార్యుడు అదే రీతిగా ప్రవహింపజేయటం ఇందలి విశేషం.

దుశ్శాసన కరాకృష్ట వికీర్ణవేణీభరంబు వెనువెంట నొలయం బాంచాలి పంచపర్వతంబుల నడిమి నదియుం బోలె బతులనడుమ భయవ్యాకుల చిత్తయైన నింద్రియంబులు విషయరతిం బరిగ్రహించునట్లు లేవురు నక్కోమలిం బట్టుకొని భయపడకుండ నాశ్వాసించుచున్నంత''
ఆర 1-107

''ఇక్కడ ఇంద్రియంబులు విషయరతిని పరిగ్రహించునట్లు అనే ఉపమ కావ్య హృదయ మాధుర్యాన్ని తత్త్వోన్ముఖంగా జాలువార్చుతున్నది'' నిజానికి వ్యాసభారతంలోని అతి ముఖ్య మంత్రభాగాల్ని కొన్నిటిని నన్నయ వదలివేశాడు. ఉదాహరణకు ఈ కిమ్మీరదానవ ఘట్టంలోనే ధౌమ్యుడు రక్షోఘ్నమంత్రం చదువుతాడు. రక్షోఘ్నమంత్రాన్ని వ్యాసుడు మూలంలో ఉటంకించాడు.

'జామి మజామి ప్రమృణీహి శత్రూన్'

అంటే - ''ఆలస్యం విడిచి శత్రువుల్ని నాశనం చెయ్యి'' అని అర్థం. ఈ మంత్రాన్ని ఉద్ధరించకుండానే, నన్నయ మంత్రఫలాన్ని మాత్రం పేర్కొని విడిచాడు.

''రక్షోఘ్న మంత్రముల నా
రాక్షస మాయాపరిస్ఫురణ జెఱిచె గ్రియా
దక్షుడు ధౌమ్యుడు పాండవు
వీక్షించుచు నుండగా నహీనప్రతిభన్.''
ఆర 1-108

రసస్ఫోరకమైన భాషా మాధుర్యమన్న నిట్లుండును.

నన్నయ భారతానువాదం శరద్వర్ణనతో ఆగిపోయింది. శరదాగమానికి ముందు 'సుగంధగంధవహు డూపుతుండగా మొల్లగుత్తుల ఉయ్యాలలెక్కి, మధుర గీతాలు పాడుతూ ఊగే తుమ్మెదలను వర్ణించాడు నన్నయ.'

దళిత నవీన కందళ
 కదంబ కదంబక కేతకీ రజో
మిళిత సుగంధ బంధుర
 సమీరణుడన్ సఖు డూచుచుండగా
నులియుచు మొల్లగుత్తులను
 నుయ్యెల లొప్పగ నెక్కియూగె ను
ల్లల దళినీకులంబు మృదుల
 ధ్వని గీతము విస్తరించుచున్
ఆర 4-138

మధుర ఝుంకారాత్మకమైన ఈ తుమ్మెదపాట నన్నయ శబ్ద ప్రపంచమంతా ఆవరించి, ఆవహించి, నన్నయ భాషామాధుర్యంగా వెలసి, వెయ్యేళ్లుగా తెలుగువారి మనః కర్ణపుటాలకు సంతర్పణ చేస్తోంది. ఇకముందు కూడా చేస్తుంది ఎన్నివేల యేళ్లైనా. తథాస్తు!

# నన్నయ్య 'అపూర్వ సభా రచనలు'

శ్రీ ముదిగొండ వీరభద్రశాస్త్రి

మయుడు ధర్మరాజునకు నిర్మించి యిచ్చిన సభను గూర్చి తండ్రికి చెబుతూ దుర్యోధనుడు 'ధారుణి నట్టి యపూర్వ సభా రచనలు వినగ జూడ బడ వెవ్వరి చేన్' అని తన తుది తీర్పు వినిపించాడు. నన్నయ్య గడుసువాడు కాకపోలేదు! తాను తన పథకంలో మహాభారత సభా పర్వాన్ని తీర్చి దిద్దిన తీరుతెన్నుల గూర్చిన సంతృప్తిని కూడా ఇందులో ధ్వనించ లేదని అనుకోవచ్చునా?

సంస్కృత భారతాన్ని ఆంధ్ర మహాభారతాన్ని పోల్చి చూస్తూ నిర్ణయాలకు రావడానికి ఒక అభ్యంతరం ఉన్నది; ఆనాడు కవిత్రయంవారికి లభించిన మూలపాఠం ఏదో మనకు తెలియదు గనుక. అయినా, కవిత్రయంవారు ఇతిహాస రూపంలో ఉన్న మూల భారతాన్ని తెలుగులో కావ్యేతిహా సంగా మలచటంలో మూలపాఠంలోని కొన్ని అంశాలను పూర్తిగా వదలి వేయడం, కొన్నింటిని సంక్షిప్తం చేయడం జరిగిందని స్థూలంగా గ్రహించడానికి అది అడ్డురాదు.

ఇక్కడ ప్రసక్తమౌతున్నది నన్నయ రచనారీతికి, అందునా సభాపర్వానికి పరిమితంగా కొన్ని అంశాలు మాత్రమే విడిచిపెట్టేది విడిచిపెడుతూ, సంక్షిప్తం చేసేది చేస్తూ నన్నయ్య ప్రధానాంశాలను ప్రస్ఫుటీకరించిన విధానం గమనిస్తే, విపులమైన మూల భారతానికి ఆసక్తికరమైన ఒక సంగ్రహప్రతిని అయన 'పరిష్కరించి' దాన్ని తన మూలంగా గ్రహించినట్లు కనబడుతుంది. వ్యాసభారత పాఠాలకు, తెలుగునాట బహుశః భారతదేశమంతటానేమో, తొలి 'పరిష్కర్త' నన్నయ్య అనే మాట ధ్రువపడుతుంది.

ఖాండవ వనదహనం తరవాత పాండవులతో కలిసి ఉన్న శ్రీకృష్ణుడు పితృ దర్శన లాలసుడై ద్వారకకు మరలిపోవాలని బయలుదేరడం, పాండవులు వీడ్కోలివ్వడం, శ్రీకృష్ణుడు ద్వారకకు చేరి తనవారిని అందరనూ కలుసుకోవడం మూల భారతంలో ఒక అధ్యాయమైంది. దాదాపు 24 శ్లోకాలు. తన కథనానికి అత్యవసరం కాని ఈ భాగమంతా 'ఇట నారాయణుండును బాండవుల వీడ్కొని పితృ దర్శన లాలసుండై ద్వారవతీ పురంబున కరిగె' అని సూక్ష్మంలో తేల్చివేశాడు. అదేవిధంగా రాజసూయ యాగ సమయంలో కృష్ణునకు అగ్రపూజ చేయడాన్ని నిరసిస్తూ శిశుపాలుడు ఆక్షేపించగా, అతనిని శాంతపరచడానికి ధర్మరాజు మృదువుగా మాటాడుతున్నప్పుడు భీష్ముడతనిని వారించి కృష్ణుని మహత్త్వాన్ని గూర్చి కొంత దీర్ఘంగానే వివరిస్తాడు. అది చాలదన్నట్లు ధర్మరాజు 'విస్తరంగా వినాలని ఉంది. కనుక కృష్ణుని మహామహిమకు సంబంధించి నాకు చెప్పు' అని భీష్ముణ్ణి అడగటం, భీష్ముడు చెప్పటం సంస్కృత భారతంలో ఉన్నది. భీష్ముని ఈ వివరణ దాదాపు అయిదారు వందల శ్లోకాలకు విస్తరించింది. అక్కడ రచయిత దృక్పథం వేరు. ఆంధ్ర మహాభారతం కావ్య నిర్మాణ దృష్టితో దీనిని పరిహరించింది.

ఇటువంటి విశేషాలు చాలా ఉన్నాయి. అయితే వీటికంటె ముఖ్యమైనది ఒక పాత్రను గూర్చిగాని, ఒక సన్నివేశాన్ని గూర్చిగాని నిష్కర్ష చేయడానికి అనువుగా మూలంలో సాధారణ ధోరణిలో ఉన్నదానిని వెలికితీసి పదును పెట్టడం.

శిశుపాలుడు కృష్ణునికి అగ్రపూజ ఇవ్వడాన్ని ఆక్షేపిస్తూ పరుషంగా మాటాడాడు; సభాస్థలి విడిచి పోవడానికి ఉద్యుక్తుడైనాడు.

> ''ఇత్యుక్త్వా శిశుపాల స్తా నుత్థాయ పరమాసనాత్।
> నిర్యయౌ సదస స్తస్మాత్ సహితో రాజభి స్తదా॥

ధర్మరాజు మధురంగా, సాంత్వన పూర్వకంగా 'నేదం యుక్తం' అని అంటూ 'పారుష్యంచ నిరర్థకమ్' అని బోధించాడు. అదే తెలుగున ధర్మరాజు మూర్తిని, మూర్తిమత్త్వాన్ని ప్రస్ఫుటీకరించే విధంగాను, నన్నయ రుచిరార్థ సూక్తి నిధిత్వం భాసించే విధంగాను రూపు దిద్దుకున్నది.

> ''భూరి గుణోన్నతు లనదగు
> వారికి, ధీరులకు, ధరణీ వల్లభులకు వా
> క్పారుష్యము చన్నె? మహో
> దారుణ మది విషము కంటె దహనము కంటెన్.''

ధర్మరాజు, భీష్ముడు కలిసి శిశుపాలుని వంటి ఒక అల్పుని సాంత్వన పరచడం చిన్నవాడు సహదేవునికి నచ్చలేదు.

ఉవ్వెత్తుగా లేచి విరుచుకుపడ్డాడు. 'ఎడపక అర్ఘ్యమచ్యుతున కిచ్చితిమి. ఇచ్చిన దీని కిం దొడ బడమని దుర్జనత్వమున బల్కెడు వీరుల మస్తకంబుపై నిడియెద' అని నోటిమాటగా అంటూ ఇడ దలుచుకున్న చరణాన్ని ఎత్తి తన ఆవేశాన్ని ప్రకటించాడు. మూలంలోనైతే సహదేవుడు ఇంత ఉద్విగ్నుడు కాలేదు. 'సర్వేషాం బలినాం మూర్ధ్ని మయేదం నిపాతం పదమ్' అని వాచ్యం చేశాడు. తెలుగులో ఎంత మెరుగువచ్చిందో కనబడుతున్నది కదా!

నాటకీయత అంటే దుర్యోధనుడు మయసభలో తాను పొందిన భంగపాటును వివరించిన వచన ఖండికను స్మరించాలి. వాచకాభినయంలో ఆరితేరిన నటుడు పఠిస్తున్నట్లు ఊహించి చూడండి.

''నిర్మల స్ఫటిక శిలా నిర్మితంబై, శశి ప్రకాశంబై, వివిధ ప్రభా భాసురంబైన-ఆ సభా విభవంబు చూచు వేడుక-నందు - ' మ్మరువాడ-హరినీలబద్ధ స్నిగ్ధ మణి స్థలంబునందు-జల బు -జేసి పరిధానోత్కర్షణంబు సేసి, విమల శిలా తల బు నుదక పరిపూర్ణంబయిన వాపి సొచ్చి కట్టిన పుట్టంబు ద యం ద్రెళ్ళిన- నన్నుం జూచి-వృకోదరుండు నగియె. దాని నంతయు నెఱింగి ధర్మరాజ చోదితులయిన కింకరులు నాకుం బరిధానంబులు తెచ్చి యిచ్చిరి. మఱియు - వివృత ద్వారంబు గవాట ఘటితంబని చొరనొల్లక, కవాట ఘటితంబు వివృతంబుగా వగచి-చొరంబోయి-తత్కవాట స్ఫటిక శిలా ఘట్టిత లలాటుండనైన నన్నుం జూచి - అనేక సహస్ర విలాసినీ పరివృతయయియున్న ద్రౌపది నగియె - అంత - నకుల సహదేవులు పరతెంచి - ఇదె వాకిలి-ఇట వచ్చునది-అని నన్నుం దోడ్కొని పోయిరి. అట్టి సభా ప్రలంభంబు నాకు హృదయ శల్యంబయి యున్నది.''

తెలుగు వారికి సహజమైన పలుకుబడులు, చెబుతున్న అంశానికి తగినట్లు మాటల సమాసాల దీర్ఘత, హ్రస్వత; సంభాషణలో ఆవేశాన్ని ఉద్వేగాన్నిబట్టి పలికే కాకువులు - ఈ గుణాలు నన్నయ తీర్చిన నాటకీయతలో ఉపకరణాలు.

ఈ సభాపర్వంలోని శిశుపాల వధ ఘట్టాన్ని ఎంత చమత్కార యుక్తంగా తీర్చిదిద్దాడో నన్నయ!

భీష్ముని వచనానుసారంగా ధర్మజుడు సహదేవోపనీతమైన అర్ఘ్యాన్ని వాసుదేవునికి శాస్త్రదృష్ట విధానాన ఇచ్చిన తరువాత గాని శిశుపాలుడు ఆక్షేపణకు దిగలేదు. స్నాతకుడు, ఋత్విజుడు, సద్గురుడు, ఇష్టుడు, భూతలేశుడు, సంయుజుడు-ఈ ఆరుగురూ పూజనీయులే. ఇట్లా లభించే వారిలో సద్గుణములకు పెద్దయైన మహాత్ముని పూజించాలి అని ముందు భీష్ముడు చెప్పాడు; అట్టివాడెవ్వడో చెప్పవలసిందని ధర్మరాజు కోరగా కృష్ణుడు కాక మరెవరు అని నిర్దేశించాడు. సభలో శిశుపాలుడు గాని, మరెవ్వరుగాని కాదనలేదు-అప్పటికి.

తన తొలి ప్రసంగంలో శిశుపాలుడు - కృష్ణుడు కష్టచరితుడు. వార్ష్ణేయుడు, దాశార్హుడు, పూజార్హుడు కాదు అనీ, సభలో ఇంకా అంతకంటే అర్హులైన వారున్నారనీ అన్నాడు. భీష్ముడు మతిచలించి చేసిన ఉపదేశాన్ని శిరసావహించి, ధర్మరాజంటే మంచీ మర్యాద తెలిసిన 'పురుష విశేష విత్తముడు' అనుకొని వచ్చిన వారందరకూ అవజ్ఞ చేశావు గదా అన్నాడు. మీరంతా కలిసి ఇష్టామంటే మాత్రం గోవిందుడికి తగుదునా లేదా అనే బుద్ధి ఉండవద్దా అన్నాడు.

శిశుపాలుని శాంత పరచడానికి ధర్మరాజు ప్రయత్నిస్తుంటే, బాలుడు, పాలిత దుర్ణయుడు వాడితో నీ కెందుకని అతనిని వారించిన భీష్ముడు తాను మొదలు పెట్టాడు, శిశుపాలునికి సమాధానం చెప్పడం! చివరకు చిన్నవాడైన సహదేవుడు తీవ్రపడటంతో ముందు శిశుపాలుని పక్షంవారిని చూచి యదు వృష్ణి భోజ కుకు రాంధక వాహినులు దారుణక్షయకాల సాగరాల తీరు వహించినాయి. సహజంగానే ధర్మరాజు భయసంభ్రమం పొందాడు. 'తాతా వీరి కిచ్చట చిత్తశాంతి యొనర్పవే' అంటూ తత్తర పడ్డాడు. భీష్ముడు ధైర్యం చెప్పాడు; కృష్ణుని పరాక్రమం గూర్చి వివరించాడు. అది శిశుపాలునికి మరీ కోపహేతువైంది. కృష్ణుని, భీష్ముని నిందించాడు. అందుకు భీముడు అంతకరూపుడైనాడు.

భీముని శాంతపరచడానికి భీ‹‹ డు శిశుపాలుని జన్మవృత్తాంతం చెప్పి అతని చావు కృ ని చేతిలోనే ఉన్నదని వివరించాడు. అదేదో చూద్దాము ర ్ని శిశుపాలుడు కృష్ణుని సంగ్రామానికి ఆహ్వానించాడు. కృష్ణుడు శిశుపాలుడు చేసిన అపరాధాలు చెబుతూ వచ్చి తుదకు ''బభ్రు భార్య తనకు భార్య జేసె'' అని నొక్కిపలకటంతో రెచ్చిపోయిన శిశుపాలుడు అసలు కోపం బయటపెట్టాడు.

''నీ కూర్మియు నీ యలుకయు
నాకవి యేమిటికి? దుర్గుణప్రియ, మొదలన్
నాకిచ్చిన యక్కన్యక
జేకొని నీకిట్లు పలుక సిగ్గును లేదే?''

అని ప్రశ్నించాడు శిశుపాలుడు. అతని నిజస్వరూపం బయటపెట్టించి కృష్ణుడు అతణ్ణి సంహరించాడు. ఇంతకుముందే చెప్పినట్లుగా ఈ కథలోని ఉద్విగ్న ఘట్టాలను యథాక్రమంగా ఆవిష్కరిస్తూ నన్నయ ఈ కథను తీర్చిదిద్దాడు.

కథావిష్కరణ సందర్భంగా చెప్పుకోదగినవి రెండు

మూడు అంశాలు ఉన్నాయి. పాలుని వృత్తాంతం చెబుతూ అశరీరవాణి ఏమన్నదో భీష్ముడు ఇట్లా చెప్పినట్లు నన్నయ వ్రాశాడు.

''వీని నొరులు చంపగా నోప రెవ్వరు
నెవ్వరేని వీని నెత్తికొనుడు
మిగిలియున్న బాహు యుగళంబు గన్నును
నడగు వీని కతడ యంతకుండు.''

సంస్కృతంలో అశరీరవాక్కు 'ఏష తే నృపతే పుత్రః శ్రీమాన్ జాతో బలాధికః' అన్నట్లు ఉన్నది. అది నిజమైతే కావచ్చుగాని ఒక దుర్మార్గుని కథలో ఆ మాట పనిగట్టుకుని చెప్పించకపోవడమే బాగుంది.

తెలుగు భారతంలో కృష్ణుడు అనకుండా విడిచిపె మాటలు సంస్కృతంలో ఉన్నాయి. 'రుక్మిణ్యామ మూఢస్య ప్రార్థనాసీ న్ముమూర్షతః, నచ తాన్ ప్రాప్తవా మూఢః శూద్రో వేదశ్రుతీ మివ.' అక్కడ కృష్ణుడు అట్లా అంటే, 'మత్పూర్వం రు ణీం కృష్ణ సంసత్సు పరికీర్త యన్, విశేషతః పార్థివేషు । డాం నకురుషే కథం' అని శిశుపాలుడు ఆక్షేపించాడు. లుగులో రుక్మిణి ఉదంతానికి సంబంధించిన సూచన శిశుపాలుని నోటి వెంట చేయించటం అదే శిశుపాలుని మృతికి దారితీయటం ఎంత పదిలంగా ఆలోచించి నన్నయ కథనం చేశాడో తెలుపుతుంది.

ఇక శిశుపాలుని సంహారం దగ్గర కూడా కృష్ణుడు సంస్కృత భారతంలో

**''శ్రుణ్వంతు మే మహీపాలా యే నైతత్ క్షమితం మయా,**
**అపరాధ శతం క్షామ్యం మాతురస్యైవ యాచనే.**
**దత్తం మయా యాచితం చ తాని పూర్ణాని పార్థివాః,**
**అధునా వధయిష్యామి పశ్యతాం వో మహీక్షితామ్.''**

అని పలికి చక్రం ప్రయోగించాడు.

వేగం పుంజుకుంటూ సాగిన నన్నయ కథనంలో దానికి పరాకాష్ఠగా 'సిగ్గును లేదే?' అన్న శిశుపాలుని వాక్కు పూర్తి అవుతూ ఉండగానే-

''అని శిశుపాలు డొండొకట
నప్రియముల్ హరి బల్కుచున్నచో
నసల శిఖాళి దూల దను
జాంతక చక్రము రాజచక్ర మె
ల్లను భయమంద మూర్ధ వికె
లంబుగ నప్పుడు సేసె జేది నం
దను తనువున్ బృహద్రుధిర
ధారలు ఘోరన మీది కొల్కగాన్.''

ఇందులో కృష్ణుని ప్రస్తావన, మాట లేవు, వాడట్లా మాటాడుతున్నాడు. చక్రం వచ్చింది. శిరసు ఖండించింది. హఠాత్సంజనితమైన అద్భుతంతో కథ ముగింపు!

ఈ కథనంలో నన్నయ అనేక పర్యాయ పదాలను సాభిప్రాయంగా ప్రయోగించి కథలోని లోతులను మనోజ్ఞంగా ప్రకటించాడు.

శిశుపాలుడు మొట్టమొదట ధర్మరాజును ఆక్షేపిస్తూ 'కృష్ణు గష్టచరితున్, వార్ష్ణేయు బూజించి నీ యవివేకం బెఱిగించితి' అన్నాడు. కృష్ణుడు కష్టచరితుడు, అంటే పాపచరిత్రుడు. అతడు వార్ష్ణేయుడు అన్నాడు. వృష్ణివంశం వాడు కనుక వార్ష్ణేయుడు. కాని ఇక్కడ మరో ప్రస్తావన కూడా ఉన్నది. వృష్ణి అంటే 'రేతస్సును వర్షించునది, గొర్రె' అని సంప్రదాయార్థం. కృష్ణుని నిందించటంలో అట్లా నిందించే వారికి ముందు కనబడే దోషం అతని బహుకాంతా వల్లభత్వమే కదా!

మూలంలో కూడా ''నాయ మర్హతి వార్ష్ణేయ స్తిష్ఠ స్విహ మహాత్మసు మహీపతిషు'' అని ఉన్నా కష్ట చరితుడు వార్ష్ణేయుడు అని గుదిగుచ్చడం వల్ల తెలుగులో ఈ విశేషం గమనించడానికి వీలవుతున్నది.

'శిశుపాలుం డుపాలంభన పరుండయి యధోక్షజు నాక్షేపిం చుచు ధర్మరాజున కిట్లనియె' అని నన్నయ ప్రారంభించాడు. అధోక్షజుడు అంటే ఇం య ని హం కలవారికి మాత్రమే ప్రత్యక్షమయ్యేవాడని అ . అ నిని ఆక్షేపించేవా డెట్టి వాడు? నన్నయ కృష్ణుని వాడిన ర్యాయ పదం శిశుపాలుని గూర్చి కూడా వ్యాఖ్యానిస్తున్నది.

ఆ శిశుపాలుడు ఎట్టివాడో నన్నయ భీష్మునిచేత స్పష్టంగా చెప్పించాడు.

**''పాలిత దుర్నయుండు శిశు**
**పాలుడు బాలుడు; వీని నేల భూ**
**పాలక నీకు బట్టువడు**
**పన్? మఱి ధర్మ్మ వెఱుంగ వీనికిం**
**బోలునె రాగకోప పరి**
**భూత మనస్కున కప్రరాజ్య ల**
**క్ష్మీ లలనాంధ బుద్ధి కని**
**మిత్త మహత్పరివాద శీలికిన్.''**

ఇంకా ఏమి దుర్లక్షణాలు ఉండాలి కనుక? పరపదాసహిష్ణు వైన శైలిలో నన్నయ చేసిన ఈ వర్ణనంతా అమౌలికమే, మూలంలో లేదు - 'నా స్మై దేయో హ్యనునయో నాయ మర్హతి సాంత్వం' అని తప్ప.

'ఎందుకూ కొరగాని కృష్ణుని చేష్టలను మహిమల కింద తెగ వర్ణిస్తున్నావు. 'కథం భీష్మ న తే జిహ్వా శతధేయం విదీర్యతే' అన్నాడు శిశుపాలుడు.

ఈ మాటలకు నన్నయ ఇంకా పురిపెట్టాడు 'కృ టీరమ్ములు పొగడుచు ౧ నీ నాలుక యొక్కుడయు వ్రయ్యవలయు నూఱు య్యలు గాగ; నట్టయిన గా చాల వతని బొగడ; నె ని నేన యెఱుగుదు; నెందు వాడర్ఘ్యదాన యోగ్యుడయ్యె జెపుమ!' అనిపించాడు శిశుపాలు నిచే.

పైగా జాలిపడి శిశుపాలుడు భీష్ముడికి ఒక మంచి ఉపదేశం చేశాడు-'పొగడంగ వలయునేని సుగుణవంతులైన కర్ణశల్యు లాదిగా గల వీరుల బొగడుచుండరాదె ప్రొద్దుపోవ'. 'కర్ణ శల్యులను' పొగడమని! నన్నయ హాస్యప్రియత్వం దరహాస సీమితం. మూల భారతంలో శిశుపాలుడు పొగడ దగిన వారి పట్టిక చాలా పెద్దది ఇచ్చాడు.

కృష్ణుడెత్తుకోగానే తన కుమారుని వికృత రూపం పోవడం చూచిన సాత్వతి 'శిశుపాల స్యాపరాధాన్ క్షమేథా స్త్వం మహాబల' అని కృష్ణుని కోరింది. అయితే అంతకు ముందే కృష్ణుడు ఆమెకు 'శక్యం వా యది వాశక్యం కరిష్యామి వచ స్తవ'' అని మాట ఇచ్చాడు. కాని అపరాధాలు క్షమించమన్న తరువాత మాత్రం 'అపరాధ శతం క్షామ్యం మయా హ్యస్య' అని వరమిచ్చాడు. ఈ ఘట్టాన్ని నన్నయ ఇంకో రకంగా తీర్చాడు. సాత్వతి 'మురవైరి' వలన తన పుత్రునికి మరణం కలుగుతుందని తెలుసుకున్నది. తన కొడుకు ఎట్టివాడు కాబోతున్నాడో ఆమెకు అర్థమైంది.

''కుపథ ప్రవృత్తుడయి వీ
డపనయమున నీ కనిష్టు డయినను గరుణా
నిపుణుడవై నీ మఱదికి
నపరాధ శతంబు సైపుమయ్య యుపేంద్రా!''

అని ' ర్థించి వరం పొందింది. తల్లి మనసు! ఎంత దుర్మా 'డైనా, వంద తప్పులు చేయడానికి సుదీర్ఘ జీవిత కాలం ట్టక పోతుందా అనుకున్నట్లుంది!

శిశుపాలవధ జరిగింది. సత్కార పూర్వకంగా అతని శరీరానికి సంస్కారం చేయించ వలసిందిగా ధర్మరాజు తన సోదరులకు తెలిపాడని మూల భారతం పేర్కొన్నది. తెలుగులో నన్నయ కొంచెం మార్చి 'అంత ననంత శయనుండు శిశుపాలు సంస్కరింపం బంచి' నట్లు చెప్పాడు. మృతకళేబరాన్ని తీసుకొని పోయే వాహకాన్ని 'అనంత శయనం' అనడం ఒక సంప్రదాయం, కనుక ఈ పని అనంత శయనుని చేత చేయించినట్లన్నాడు. 'జగన్నాథ' రక్షితంబయి రాజసూయ మహాధ్వరం సమాప్త సంప్రయోగ మైనదని నన్నయ ముగించాడు.

మరొక్క విశేషం చెప్పుకొని, స్థాలీపులాకంగా పరామర్శిం చిన నన్నయ 'అపూర్వ సభా రచన'కు అంజలి ఘటిద్దాము.

అటు శిశుపాలాదులు, ఇటు యాదవ సైన్యం 'దారుణ క్షయకాల సాగరములట్లు' కలగటం చూసి ధర్మరాజు కలవర పడ్డాడు; ససంభ్రముడైనాడు. ఊగి తూగి నడిచే తరలంలో ధర్మజుని ఆతురతను నన్నయ చక్కగా పలికించాడు.

''తతః సాగర సంకాశం దృష్ట్వా నృపతి మండలమ్,
సంవర్త వాతాభిహతం భీమం క్షుబ్ధ మివార్ణవమ్.''

అని మాత్రమే మూల భారత వర్ణన. 'క్షయకాల' ప్రస్తావన నన్నయ చేసినదే.

అంతగా విచలితుడైన ధర్మరాజుకు భీష్ముడు ధైర్యం చెబుతూ ఏమన్నాడు?

''నీ యజ్ఞమునకు విఘ్నము
సేయగ నోపుదురె యొరులు జితదైత్యుడు నా
రాయణుడు యజ్ఞ పురుషు
డజేయ పరాక్రముడు దీని జేకొని కావన్?''

కృష్ణుడు జితదైత్యుడు-మహా మహా రాక్షసులను జయించి నవాడు; ఈ శిశుపాలాదులు ఒక లెక్కా? ఆయన యజ్ఞ పురుషుడు కనుక యజ్ఞ సాఫల్యం ఆయన బాధ్యత; మధ్య నీ కెందుకు అందోళన? పైగా 'అజేయ' పరాక్రముడు. ఈ మాత్రమే సరిపోతుం దా ధర్మరాజును ఊరట పెట్టడానికి? ఆ మిగిలిన విశేషణం-'నారాయణుడు' అన్నది లేదూ? సాంప్రదాయికంగా ఈ మాటకు రెండు రీతుల అర్థాలు. నారం అంటే నర సంబంధమైనది. కనుక నారాయణుడంటే అవతార సమయాలలో నర శరీరం ధరించేవాడు. ఈ కృష్ణుని మానవ మాత్రునిగా భావించవద్దు. మానవ రూపంలో ఉన్న భగవంతుడు అని భీష్ముని వివరణ. అంతే కాదు, ఇంకా ఉన్నది. 'క్షయకాల' సాగరాలన్నావు కదా! నిజమే ప్రళయకాళంలో అమిత భయావహంగానే ఉంటాయి సాగరాలు. వాటి వర్ణన చాలాచోట్ల ఉన్నది. ఎంత క్షయకాల సాగరాలైతే నేమయ్యా? నారం అంటే నీరు. ఆ నీటిపై శయనించేవాడు నారాయణుడు. నీవు చెప్పిన ఆ సంక్షుబ్ధ క్షయకాల సాగరాల జలాలపై మఱ్ఱియాకున సుఖంగా పవ్వళించే దివ్య బాలకుడు ఈ నారాయణుడే. వటపత్ర శాయి. ఆయన లీలా ప్రకటనానికి కావలసిన అనువైన వాతావరణమే సుమా! నీవు ఇంతగా భయపడే దారుణ క్షయకాల సాగరాల విజృంభణ అని భీష్ముడు ఆశ్వాసించాడు. మూలంలో హరిని సింహంగాను, ఆ సింహం విజృంభించక నిదానంగా ఉన్నంత కాలమే మొరిగేకుక్కలతో శిశుపాలాదు లను వర్ణించటం మాత్రమే ఉన్నది.

కావలెనని నన్నయ క్షయకాలం అన్నమాట చేర్చుకొని దానికి సమాధానాన్ని నారాయణ శబ్దంలో లోకోత్తరంగా ధ్వనింప జేశాడు. ధ్వనికి నిధానం నన్నయ్య.

# జక్కన చిత్రించిన సాంఘిక పరిస్థితులు

శ్రీమతి నీరజా చక్రవ

కథలంటే చెవి ఒగ్గని వాళ్లుండరు. ఆబాల వృద్ధమూ, ఆపండిత పామరమూ కథలంటే కుతూహలం చూపేవారే!

మానవుని మనస్సు చిత్రమైంది. కొత్తకొత్త కథలు వినాలనే అదెప్పుడూ తీగలు సాగుతూనే ఉంటుంది. పురాణేతిహాస గాథలకన్న కల్పనావిష్కృత కమనీయ గాథలు శ్రవణపే యాలు కదా!

కథ అంటే కల్పనా కవిత విషయ వివరణమని అమరసింహుడు నిర్వచించాడు![1] దీంట్లో సత్యాసత్యాంశాలు రెండూ ఉంటాయి. కథ అంటే ఏదో కొద్ది సత్యవిషయాలాధా రంగా అసత్య విషయాల అల్లికే.

కథలపట్ల ప్రజలకే కుతూహలం మిక్కుటమైనప్పుడు కథకులకు కొత్త కథలు అల్లడం, లేక ప్రాచీనమైన వాటినే కొత్తరీతిలో చెప్పడంలో ఆసక్తి పెరగడం సహజం. జక్క నకూ అటువంటి అభిలాషే కలిగింది మరి! అతనికి ముందే కేతన దండి 'దశకుమార చరిత్రము'ను తెలుగులోకి అనువదించి, కథలకో బంగారుబాటవేసి, కథాప్రక్రియకు మార్గ దర్శకుడయ్యాడు.

తెలుగులో రెండో కథాకావ్యం 'కేయూర బాహుచరి త్రము.' సంస్కృతంలో రాజశేఖర కవికృత ' విద్ధసాలభంజి క'ను మంచన పైపేర తెనిగించాడు.

ఇక 'విక్రమార్కచరిత్రము'ను రచించిన జక్కన కవి కల్పన కవకాశం కలిగేలా విక్రమార్కుని కథలను ఇతివృత్తంగా ఎన్నుకున్నాడు. సమకాలీన గాథలను గ్రహించి, వాటిని చక్కగా అతికాడు. విక్రమార్క చక్రవర్తి సుప్రసిద్ధ పురు షుడు. అప్పటికే విక్రమార్కుని కథలు తెలుగునాట బహుళవ్యాప్తి చెందాయి. వాటిలో దేశీయమైన కొన్ని కథలను సముచితంగాను, సుందరంగాను కూర్చి, కావ్యాన్ని మణిఖ చిత రత్నభూషణంగాను, సప్తస్వర శోభిత సుకుమార గీతంగాను తీర్చాడు. కేవలం కథా కావ్యంగా మాత్రమేగాక, పాత్రచిత్రణం, రసపోషణ, వర్ణనలు, ఔచిత్యం, శైలి ఇత్యాదులను తన వైదుష్యంతో పరిపుష్టం చేసి, జక్కన దీన్ని ఎనిమిదాశ్వాసాల ప్రబంధంగా మలిచాడు.

నన్నయాది పూర్వ కవులను అనుసరిస్తూ, తన తరువా వారైన శ్రీనాథాది కవులకు మార్గదర్శకుడుగా వెలసి పురా ప్రబంధయుగాలకు మధ్య వారధిగా విరాజిల్లినవాడు జక్కన

ఈ కావ్యంలో కనబడే కథలకు క్షేమేంద్రుని 'బృహత్క మంజరి',[2] సోమదేవుని 'కథాసరిత్సాగరము'[3] మూలం. ఇ కాకుండా సంస్కృత 'విక్రమార్క చరిత్రము'లోని కొన్ని (పది) కథలను కూడా తీసుకున్నాడు జక్కన.

ఇంతేకాక ప్రాచీన ఇటలీ కథా రచయిత అయి బొకాషియో రచించిన కథల సంపుటి[4] లోని 'పామ్‌ఫిలోన్' అనేకథవంటి కథ ఒకటి 'విక్రమార్క చరిత్రము' లో కనబడుతూ ఉంది.

ఇవన్నీ అలా ఉంచి ఒక కావ్యం, లేక గ్రంథాని పఠించినప్పుడు దానిలోని వివిధ విషయాలవల్ల మనకు ఆనా పరిస్థితులు, మత సంబంధాంశాలు, సాంఘికంగా తెలుసు నేవి ఎన్నో ఉంటాయి. వాటివల్ల మతం, నాగరికత, కళల సారస్వతం, సభ్యత, దైనందినాభివృద్ధి యిత్యాదులు వెల్ల అవుతాయి. జక్కన 'విక్రమార్క చరిత్రము' కూడ అటువంటి విలువైన విషయాలు తెలిపే భాండాగారమే.

ఇక ఆనాటి మతాది విషయాలను వీక్షిద్దాం.

## మతం

భారతదేశంలో బౌ జైన మతాల తరువాత శైవమత ప్రాబల్యం పొందింది. '.శ. 12-13 శతాబ్దాలలో తెలుగు శంలో శైవమతం అభి ద్ధి పొందింది. క్రీ.శ.10వ శతా నుండి 14 వ శతాబ్దివరకు భక్తిప్రధానమైన శైవ సంప్రదాయ ఉచ్చ స్థితిలో ఉంది.

శైవ సంప్రదాయాలన్నిటిలోనూ పాశుపత శైవ సం దాయం చాలా ప్రాచీనమైంది.[5] విగ్రహారాధనాది పూజల భక్తి ప్రధానమైన ఆరాధ్య సంప్రదాయం విక్రమార్క చరి ములో వర్ణించబడటంచేత, ఈ కావ్యంలో ప్రతిపాదించి మతం ఆరాధ్య శైవమనుకోవచ్చు.

'విక్రమార్క చరిత్రము' ప్రారంభంలో శ్రీహరిహరేశుడు, గణనాయకుడు, షడాననుడు, బెల్లముకొండ భైరవుడు, లక్ష్మీసరస తీ పార్వతులు, సూర్యుల స్తుతి ఉన్నది. ఒక్క లక్ష్మీ సర తులు తప్ప, తక్కిన వారందరూ ఒకే గణానికి చెందినవ . శైవమత ప్రాబల్యం వల్లనే ఆయాదేవతా స్తుతి జరిగింది. హరిహరులకు అభేదం తిక్కననాటి నుంచీ ఉన్న సంగతి తెలిసిందేకదా![6] జక్కన కూడా తిక్కన ననుసరించి హరిహరుల కభేదాన్ని పాటించాడు. తన ఇష్టదైవం బెల్లముకొండ భైరవుడని చెప్పుకోవడం వల్ల (1-4), అతను శైవమతావలంబి అనుకోవచ్చు.

ఇందులోని శ్రీశైల, మేరుపర్వత వర్ణనలవల్ల ఆనాటి శైవమత ప్రాబల్యం వెల్లడి అవుతూంది.

వరరుచి తక్కిన పండితులకు 'పూజాలింగమై' వెలశాడన డంవల్ల (1-189) లింగపూజ ఆనాడు జరిగేదని తెలుస్తూంది.

కథానాయకుడైన విక్రమార్క చక్రవర్తి వింధ్యవాసినీ దేవి భక్తుడు. అతడు దర్శించిన ఆదేవి ఆలయం ముందు సన్మునివరులు సికతాతలాన శివలింగపూజనపరులై ఉన్నారు. సిద్ధకోటి చెట్లనీడల్లో గోష్ఠి చేస్తున్నది. అంతర్జలాల్లో యతులు అఘమర్షణ స్నానం చేస్తున్నారు. ఆ సరోవరం అపరమణికర్ణికా ఘట్టంలా విలసిల్లిందన్న (2-54) ఈ వర్ణనవల్ల శైవమత వ్యాప్తి స్పష్టమవుతూంది.

ఇక వైష్ణవమత సంబంధ విషయాలు: ''శ్రీనాథచరణ యుగళ ధ్యానాధీనాంతరంగ'' అన్న సంబోధన వల్ల కృతిపతి వైష్ణవ, శైవాలను రెంటినీ సమానంగా ఆదరించినట్లు అనుకోవచ్చు.

సూర్యాస్తమయ వర్ణన సందర్భంలో ''సర్వం విష్ణుమయం జగత్'' (6-65) అనడం, పుష్పకరండకుడు ఆడవేషం వేసుకున్నప్పుడు అతని రూపం ''కృత్రిమపు చేడియయైన ముకుందుడోయన'' ఒప్పిందట!

గయ, ప్రయాగ, శ్రీశైలం, ఏలేశ్వరం, సిద్ధేశ్వరం, కాళహస్తి, వేంకటాచలం, కంచి, కుంభకోణం, రామేశ్వరానం తశయాలు, విరూపాక్ష క్షేత్రాల వర్ణనవల్ల జక్కన శివభక్తిపారమ్యం తెలుస్తూంది.

## సాంఘిక జీవనం

**కళలు, విద్యలు:–** జక్కనకవినాడూ, అంతకుపూర్వమూ సారస్వతం విశేషంగా వర్ధిల్లింది. విక్రమార్క చరిత్రము కృతిభర్త అయిన జన్నయ సిద్ధమంత్రి నవరసోజ్జ్వల కావ్యనాటకాలంకార నికషోపల వివేకవరులను, వేదవేదాంత వైశేషికాది షడ్దర్శన తర్క కర్కశులైన తార్కికులను, దత్తిల భరత మతంగ కోహళ మత । ముఖులగు సంగీత పారంగతులను తన 'సాహిత్య సరసగో ' లో సత్కరించాడు. (1-19). అంతేకాక సిద్ధనమంత్రి 'గ త విద్యాప్రౌఢి ఘనత' కెక్కినవాడు. అణిముత్యాల సొయగాన్ని మించిన వ్రాలను ఇరుకేల వ్రాయగలవాడు. అన్యదేశాల లిపులనూ ఆత్మీయలిపి చదివినట్లు చదవగలవాడు (1-49).

కావ్యనాయకుడైన విక్రమార్కుడు సామాన్యుడేమీకాదు. వేదశాస్త్ర పురాణ వివిధాగమాలు, కావ్యనాటకాదులు, ధర్మార్థ కామశాస్త్ర ప్రపంచం, వాహన స్యందనారోహణ మర్మాలు, నృత్యగీత విద్యాప్రౌఢి, సకల దివ్యాస్త్ర శాస్త్రాల్లో ప్రశస్తి గన్నవాడు (1-191).

పైన పేర్కొన్నవేకాక, అనేక విధాలైన విద్యలు జక్కన నాడు ప్రజల్లో ప్రచారంలో ఉన్నాయి. అందువల్లనే ఆయా విద్యల వివరాలను జక్కన అంత స్పష్టంగా చెప్పగలిగాడు (6-31).

మనుష్యులే కాక, పక్షులుకూడా సర్వవిద్యలూ నేర్చినట్లు చెప్పాడు కవి. సప్తమాశ్వాసంలో రాజశేఖరుడనే రాజకుమారుడికి కానుకగా వచ్చిన శుకం అష్టాంగయోగవిద్యలు, అరవైనాలుగు విద్యలు నేర్చి త్రికాలవేది అని ఖ్యాతిగాంచిందట. (7-19,20)- కర్పూర మంజరికి చిక్కిన శారిక ఒకటి చిలుకలకు 'శ్రుతిశాస్త్ర పురాణ సత్కథాసారము' లప్ప జెబుతూందట.[7] (7-49) దీనివల్ల ఆకాలంలో జనం చిలుకలు, గోరువంకలను పెంచి (నేటిలాగే) వాటికి ముద్దు మాటలు నేర్పేవారన్నది మాత్రం నమ్మదగిన విషయం.

**వర్ణవ్యవస్థ:** ఆనాడు చతుర్వర్ణాల వారూ - బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య శూద్రులు - తమతమ ధర్మాలు తప్పకుండా, నీతి నియమాలతో ఉత్తములుగా విలసిల్లారు. (1-70,75,76). వీరభటులను, ఏనుగులను, గుర్రాలను కూడా వర్ణించాడు జక్కన.

**అలంకరణ:** ఆనాటి ప్రజల అలంకరణ ఆసక్తిదాయకమే. స్త్రీ పురుషులిద్దరూ సమానంగానే అలంకరించుకునేవారు, ఒక్క వస్త్రధారణలో భేదంతప్ప; అదీ సహజమే కనుక!

స్త్రీలు అన్నిరకాల పువ్వులదండలూ ముడుచుకోవడమే కాక, రకరకాల శయ్యలు కూడా పూలతో రచించుకునేవారు. అపూసజ్జలలోని రకాలు - చెంగలువల పాన్పు (1-136), చేమంతి రేకులు పరిచినపాన్పు (1-139), క్రొవ్విరిజాజుల సెజ్జ (6-108), నెత్తమ్మిరేకులు పరచిన హంసతూలికా

తల్పము (8-94). ఇవికాక సర్వసాధారణంగా ఉపయోగించే బహుశిల్ప కల్ప తల్పములు (4-214), మేలిమి బంగారంతో నిర్మించినవీ, వినూత్న రత్న పర్యంకము (6-34) ఉండనే ఉండేవి.

ఇక సుగంధ ద్రవ్యాల విషయానికివస్తే ఘనసారం, కాశ్మీరం, గంధసారం, మృగమదపంకం (1-8), కాలాగరు, కస్తూరి (1-39) - ఇవన్నీ నాటివారు వాడినవి. అంగరాగాలు, మకరికా చిత్ర పత్రికలు (5-61), నానాగంధానులేపనాలు (5-62), మలయజ కర్దమం (4-205), కుంకుమ పంకం (7-14) ఇవి స్త్రీల అలంకారాలు.

స్నానానికి గొజ్జంగి తేటనీటిని (1-136) (గులాబిపన్నీరుని) వాడేవారు. శరీరతాపాన్ని హరించి శీతలత్వం కలుగడానికి చన్నీటి స్నానమాడేవారు (4-158)

స్త్రీలు కాంచనాంచల దివ్యకౌశేయ చేలం (1-8), సన్నగావి వలిపాలు (1-136), చీనాంబరాలు (5-62), వన్నె చీరంచులు (7-116), కంచులి (4-71) ధరించేవారు.

చీకటిరాత్రి ఆకాశాన్ని వర్ణిస్తూ ''మెఱుగారు ముత్తెములచే, మెఱవడియగు నల్లపట్టు మేల్కట్టు గతిన్'' (6-64) అని జక్కన అనడంవల్ల నల్లని పట్టు వస్త్రానికి ముత్యాలు పొదివి, లేక కుట్టి ఉపయోగించేవారని తెలుస్తూంది. రాజపురుషులు పట్టుపుట్టాలే కట్టారు (2-97).

పసిడికమ్మలు, మణిహారాలు, ఆణిముత్యాల పేర్లు, హరినీల హారాలు, కంకణాలు, కేయూరాలు, తారహారాలు, మణి కాంచికావలయం, అందెలు, నూపురాలు ఇత్యాదివే కాక, స్త్రీలు వికచ ప్రసూనాలంకారాలు కూడా చేసుకునేవారు. కర్ణాభరణాలుగా హల్లకాలను వాడేవారు (8-76). పురుషులు కూడా చిన్ని గేదగిరేకులను సిగలో ఉంచుకునేవారు (8-7).

జేగురుబొట్టు, మృగనాభి తిలకం, నెలవంక వంటి తిలకం ఆనాడే ఉన్నాయి. ద్రావిడ స్త్రీలు పసుపు రాచుకోవడమూ (7-116) అప్పటినుంచే ఉంది. ఒకయోగీంద్ర కాంత మత్తికాటుకను, సంకుపూసలను ధరించిందట (7-14). అంటేవారి వారి యోగ్యతానుసారం అలంకరణ ఉండేదన్న మాటే కదా!

**వివాహం:** వివాహవిషయంలో ఆనాడు వర్ణాశ్రమ ధర్మం తప్పకుండా పాటించేవారు. వివాహం 'క్రమము దప్పకుండ సకల లౌకిక వైదికాచార సరణి' జరిగేది. ఒక్కోసారి బ్రాహ్మణులకు నాల్గువర్ణాల కన్యలనూ పెళ్లాడే అవకాశం ఉండేది.

విక్రమార్కుని పెళ్లికి ఉభయపురోహితుల సమ్మతితో నేటిలా శుభముహూర్త నిర్ణయం జరిగేది. (4-135) ఇక అలంకరణలు చెప్పేపనిలేదు. మామూలు వాళ్లే అట్టహాసంగా పెళ్లికి ఇళ్లూ, వాకిళ్లూ అలంకరిస్తే, రాజులమాట వేరే చెప్పాలా? 'విక్రమార్క చరిత్రము' నాలుగో ఆశ్వాసంలో వివాహవర్ణన, అనంతర భోజనవర్ణన మనోహరంగా ఉన్నాయి. కాని తెరకట్టడం, మంగళసూత్రధారణం, సప్తపది - వీటిని గురించిన ప్రస్తావన లేకపోవడం విచిత్రమే. వివాహ భోజనంలో 'ఊరగాయలు' అన్న పదంవల్ల ఆనాడూ అవి ఉన్నాయని తెలిసిననాడు మనకు నోరూరుతుంది. (4-188)

అప్పగింతలు, ఇల్లరికం ఆనాడూ ఉన్నాయి. కామమంజరి అనే రాకుమార్తె భర్త హేమాంగదుడూ (5-61), విలాసవతి భర్త సుధర్ముడూ (7-161) ఇల్లరికపుటల్లుళ్లే.

**రాజనీతి:** రాజులానాడు రాజ్యవిస్తరణకు, ప్రజలశాంతి సౌఖ్యాలకోసమూ పాటుపడేవారు. తమకీర్తి ప్రతిష్ఠలు దశదిశలా వ్యాప్తి చేయడానికి తగిన కృషి చేసేవారు. శృంగారశేఖరుడనే ధరణీనాథుడు నాభాగ, దిలీప, రంతిదేవుల్లా రాజ్యం ఏలాడట! (1-103).

సప్తాంగ రక్షణ, సప్తోపాయాలు తెలుసుకోవడం సప్తవ్యసనాలుడగడం, ఆప్తరక్షణ (4-8), మంత్రతంత్రాచరణలో తత్పరమతిగా ఉండడం (4-9), దేశసంచారం, చారులవ్యవస్థ ఇత్యాదులు రాజుల పరమకర్తవ్యాలు.

ఆనాడు వ్యభిచారిణులకు, జారిణులకు, దుర్మార్గులకూ దేశ బహిష్కారమే శిక్ష (7-130). దీన్ని తప్ప ఇతర విధాలైన 'శిక్షలనుగురించి జక్కన తెలుపలేదు.

**నగర నిర్మాణం:** ఎత్తైనసౌధాలు, చంద్రశాలలు, మణిమయ గోపురాలతో నగరం నిర్మించేవారు. ఉద్యానవనాల్లో శశికాంత వేదికలు, క్రీడా శైలాలు, జలాశయాలు ఉండేవి. (4-227) యజ్ఞవేదికలు బంగారు ఇటుకలతో కట్టేవారట (5-127).

దేవాలయ ప్రాంగణాల్లో స్ఫటికమణి కుట్టిమము లుండేవి. ప్రసిద్ధులైన సిద్ధుల, నవనాథుల చరిత్రలు వర్ణచిత్రాలుగా లిఖింపబడేవి.

ఇవన్నీ నాటి జనుల విలాస జీవితం, రసికత వ్యక్త పరుస్తున్నాయి.

విక్రమార్క చరిత్రములో ఆనాటి ఆయుధాలు కొన్నింటి పేర్లున్నాయి. ప్రాస, పట్టిస, పరిఘ, క్షుర, చర్మ, బాణ, బాణాసన, తోమరాలు (2-240), అత్తళం, శూలం, కుఠారాలు (4-98), కెంపుటరిగ (6-74). చివరి ఆయుధాన్ని బట్టి ఆయుధాలుసైతం నవరత్నాదులు పొదిగినవని తెలుస్తూంది.

**ఇతర విషయాలు:** జక్కన తరువాతి కాలంలోనే మాంగల్యధారణం వాడుకలోనికి వచ్చినట్లుంది.[8] గర్భిణులైన స్త్రీలు కోరినవన్నీ తెచ్చివ్వడం, వారిని సంతోషపెట్టడం ఆనాడూ ఉన్నాయి. చంద్రగుప్త మహీశుని భార్యలు గర్భిణులుగా ఉన్నప్పుడు అతను వారితో 'పులిజున్నును నేదుకన్నును దెమ్మనినను దెచ్చువాడ, ప్రియమైనవి యెల్లను జెప్పుడంచు' అన్నాడట (1-169). పులిజున్నూ, ఏదు కన్నూ సాధారణంగా అలభ్యాలు.

సంతానానికి యథావిధిగా జాతకర్మ చేసి, వారి జన్మ నక్షత్రాల ప్రకారం పేర్లుంచేవారు (1-171,172,183).

అంజనం వేయడం వాడుకలో ఉండినట్లుతోస్తుంది. భర్తృహరికి వేదాంత మర్మాలన్నీ 'అంజన మబ్బినవానికిన్ ధరాక్రాంతములైన పెన్నిధులు గన్నులకుం బొడచూపు కైవడిన్' ఆత్మలో గోచరించాయట' (1-192). దీన్నిబట్టి నేటి సులభ సంపాదన (easy money) కోసం ప్రాకులాడేవాళ్ల వంటి వ్యక్తులు ఆనాడూ ఉన్నారనిపిస్తుంది.

శకునాలు, దుర్నిమిత్తాలు రాజకుమారులు సైతం నమ్మే వారు (3-74).

శుభాశుభాలకు, యుద్ధాలకు మౌహూర్తికోత్తంసులు నిర్ణయించిన 'నిశ్చితవేళ' (4-49) ల్లోనే బయలుదేరేవారు.

ఎవరినైనా చూడ్డానికి వెళ్లినప్పుడు ఖాళీచేతులతో వెళ్లే వారు కారు.(2-124; 6-6).

కాలక్షేపానికి కథలు చెప్పుకునే అలవాటుండేది. ఇది విక్రమార్కుని అలవాటుకూడా. ఇతను అచేతన వస్తువులకు ప్రాణంపోసి వాటిచేత కథలు చెప్పించాడు అని 6,7,8 ఆశ్వాసాల్లో ఉన్నది.

''ఆశాగజాకృతులలవడ జనులకు
జూపవచ్చిన బహురూపులనగ.....'' (1-85)

అని అనడంవల్ల బహువిధ రూపధారణతో నాటకాదులు కూడా ప్రదర్శించుకునేవారనిపిస్తుంది.

''నిరవధికభక్తి రసాతిశయ ప్రాణోపహార సమర్పణ మహావీర శిలాప్రతిరూపంబుల వలనను'' - (2-51) అనడంచేత భక్తులుద్రేకంతో ప్రాణత్యాగం చేయడం, వారిని మహావీరులుగా పరిగణించి శిలలు స్థాపించడం వాడుకలో ఉండేవని తెలుస్తూంది.

విక్రమార్కుడు, అనంగవతి వివాహ సందర్భంలో 'సహజ రీతి పుష్పశరుడు త్రాసున దూచి ప్రియముతో బంచి పెట్టినట్లు కూర్మివహించారనడం వల్ల (4-183), త్రాసు వాడేవారని తెలుస్తూంది.

ఇప్పటిలా అప్పుడూ జపమాలలుండేవి. 'పటికంపుజప మాల' (2-27) ప్రస్తావన దీనికుదాహరణ.

తనకాలంనాటి మాడలు (1-21; 2-8), నిష్కములు (4-201), సొన్నాటంకములు (6-100) అనే మూడు రకాల నాణేలను జక్కన పేర్కొన్నాడు.

తరుణరంభాదళ, అంభోజదళ, తాళవృంతాలను వీవనలుగా వాడేవారు (4-159). ఒకచోట 'చెంబట్టు సురటి' అన్న ప్రయోగం ఉంది (6-67). అంటే 'వస్త్రువిసనకర్ర' అని అర్థం.[9] వలయాకారంలో చేసిన పట్టువస్త్రం - పట్టువీవన అన్నమాట.

కొత్తవస్తువులు తెచ్చుకొన్నపుడు వాటిని పూజించడం, దానధర్మాదులు, హోమాదులు చేసే అలవాటుండేది ఇంద్రుడు తనకు కానుకచేసిన ద్వాత్రింశత్సాల భంజికారంజిత దివ్య సింహాసనాన్ని అధిష్ఠించే ముందు, విక్రమార్క భూపాలుడు పుణ్యాహవాచన పూర్వకంగా నవగ్రహాల ప్రీత్యర్థం హోమం చేశాడు. అన్నదానాది సమస్తదానాలనూ అర్థుల కిచ్చాడు. ఆ గద్దెకు షోడశోపచారాలు చేసి, వృద్ధ పుణ్యాంగనల ఆశీర్వాదం పొంది ఆపైన దాన్ని అధిష్ఠించాడు (2-95).

విక్రమార్కభూపతి దేవిని స్తుతిస్తూ 'లోకరక్షామణీ' (2-59) అనడంవల్ల, రక్షరేకుల్లా పవళాది నవరత్నాలను ఆనాడు కట్టుకునే ఆచారముందనుకోవచ్చు.

అపస్మారానికి పలువిధాలైన వైద్యాలు, మంత్రతంత్రాలుండేవి. విజయపాలుడనే రాకుమారుని అపస్మార నివారణకు దేవ, భూదేవ సమారాధనలు, మణి మంత్ర తంత్ర క్రియలు, నానావిధ భూత బలివిధానాలు, మహాదానాలూ జరిగాయి.

'వాకట్టు[10] విడిపింపవచ్చిన వెజ్జు' (5-3) అన్న ప్రయోగంవల్ల వాకట్టనేది ఉండేదనీ, దాన్ని వైద్య, భూతవైద్యుల సాయంతో విడిపించేవారనీ స్ఫుటమవుతూంది.

మేనమామ కుమార్తెను పెళ్లాడే ఆచారం ఉండేది (7-92). 'కరసాన బట్టిన రత్నపుత్రిక' - (1+58) రత్నాలను సానబట్టేందుకు చక్రాకారపుసానను వాడేవారు.

'చేనికిగట్టిన వెఱబొమ్మ' (2-179): మృగాలను, పక్షులను భయపెట్టడానికి చేలల్లో నేటిలాగే వెరబొమ్మలు కట్టేవారు.

''ఎంతటి పాపాత్ముడైనను మహీసురుండు
హింసకర్హుడుగాడని యెఱిగి యెఱిగి' (3-64)

పై పద్యపాదంవల్ల బ్రాహ్మణుడెంత దుష్టుడైనా అతన్ని శిక్షించే వారుకాదని వెల్లడి అవుతుంది.

ఈ కావ్యంలో అష్టాదశ వర్ణనలలో ఒకటైన మధుపాన వర్ణనం లేదు. కాని స్త్రీలు దోహదక్రియల సందర్భంలో కల్లుతాగడం ఉండేది (1-133, 8-64). స్త్రీలు కూడా ఇంద్రజాలం నేర్చేవారు (5-34).

జలవిహార సందర్భంలో 'కరయంత్ర ధారలు' (5-36) అన్న ప్రయోగం ఉండడంవల్ల ఆనాడు వసంతోత్సవాలు కూడా చేసుకునేవారేమో ననిపిస్తుంది.

'కందము రాసినవాడే కవి, పందిని వేసినవాడే బంటు' అన్నది లోకోక్తి. ఆకాలంలో పందివేట చాలా ప్రసిద్ధం. విక్రమార్క చరిత్రములో రెండుతావుల ఈ పందివేట ప్రసక్తి ఉంది (2-132;3-77).

ఈవిధంగా జక్కన ఆనాటి సాంఘిక పరిస్థితులను తనకావ్యం ద్వారా తెలియజేశాడు. ఇందువల్ల ఇతర కావ్యప ఠనం చేసి, వాటివల్ల కూడా మరిన్ని విశేషాంశాలు తెలుసుకోవాలన్న జిజ్ఞాస కలుగుతుందనడంలో ఎటువంటి సంశయమూ లేదు.

## సూచికలు

1. అమరకోశము 1-6-6.
2. బృహత్కథామంజరి కథలు: అనువాదం: తిరుమల రామచంద్ర
3. ఆంధ్రకథా సరిత్సాగరము: శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రి.
4. Tales of Decameron పుటలు: 231-239.
5. శైవము-మన సంప్రదాయములు - విజ్ఞాన సర్వస్వం. సం.3, పుటలు 553-559.
6. ఆంధ్ర మహాభారతము - విరాటపర్వము-1.
7. కాదంబరిలో మాతంగకన్య తెచ్చిన శుకానికి జన్మాంతరాలు కల్పించడం, దానికి పాండిత్యమాపా
8. పంచవదనుని కనుజేగురించెనేని త్క్షణంబు తమయాంధ్ర తాళ్ళు తెగవె? కాశీఖండం (7-60) దక్షాధ్వర ఘట్టమిది.
   కం. మ్రింగెడువాడు హరుండని
   మ్రింగెడిది గరళమనియు మేలని ప్రజకున్
   మ్రింగుమనె సర్వ మంగళ
   మంగళసూత్రంబు నెంత మదినమ్మినదో! భాగవతము 8-24.
9. శబ్దరత్నాకరము. పుట 793.
10. వాకట్టు - మూలికా మంత్రములచేత చేయు వాగ్బంధన క్రియ శ.ర. పు.702.

చందన మివ పన్నీరా త్తదివ సువర్ణ మణిపాత్ర సంవాసాత్।
తద్వసుమతాం నివాసాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

పన్నీరు కలవడంవల్ల మంచి గంధంలాగ, మణిఖచితమైన బంగారు గిన్నెలో ఉన్న ఆ చందనంలాగ, శ్రీమంతుల భవనాలలో ఉన్న ఆ సువర్ణ మణిఖచిత చందన పాత్రలాగ ఓ సుందరీ! యౌవనం వల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి

# శ్రీనాథుని సీసపద్య నిర్మాణం

శ్రీ పి.ఎల్. శ్రీనివాసరెడ్డి

సీసపద్యం తెలుగు సాహిత్యానికి సంబంధించిన దేశీయ ఛ్ఛందం. శీర్షక ఛ్ఛందంతో దీనికి సంబంధముందని కొందరు భావించినా, పరిశీలనమీద ఇది స్వతంత్రమైన ఛందస్సుగానే తెలుస్తోంది.

పరిణామ దృష్టితో తరువోజ, ద్విపద, సీసాలమధ్య నిర్మాణ సాజాత్యం కనిపిస్తోంది

క్రింది పట్టికలో గణనిర్మాణ పరిమితి దృష్ట్యా ఈ సంబంధాన్ని గమనించవచ్చు.

| | తరువోజ | ద్విపద | సీసం |
|---|---|---|---|
| ఇంద్రగణాలు | 3 + 3 = 6 | 3 + 3 = 6 | 6 |
| సూర్యగణాలు | 1 + 1 = 2 | 1 + 1 = 2 | 2 |

గణాల నిర్మాణంలో ఉన్న ఏకరూపకత ఈమూడు ఛందోరూపాల ప్రాచీనతను, జనప్రియత్వాన్ని, గాన యోగ్యతను నిరూపిస్తోంది. ఈ అంశాన్ని పూర్వ పరిశోధకులు గుర్తించారు.

సాహిత్యవికాస దృష్టితోకూడా శాసనాలలో మొదట కనిపించింది తరువోజ (గుణగ విజయాదిత్యుని సేనాని పండరంగని పేరిటి అద్దంకి శాసనం - క్రీ.శ. 848). తరువాత కనిపించింది సీసం (కందుకూరి శాసనం క్రీ శ. 848). నన్నయ తిక్కనల్లో సీసపద్యం ఒక నిర్దిష్టమైన ఆకృతిని పొందింది. కవిత్రయంవారు సాధారణంగా సీసపద్యాన్ని వర్ణనకు, ఒక మహా సన్నివేశాన్ని ప్రారంభించడానికి, భారమైన విషయ వివరణ ఇవ్వడానికి, కథాగమనానికి పోషకంగా వాడినట్లు తెలుస్తోంది.

శ్రీనాథుడు సీసపద్యానికి ఒక ప్రత్యేకమైన స్థానాన్ని కల్పించాడని పూర్వ పరిశోధకులు ప్రతిపాదించే ఉన్నారు.

శ్రీనాథుని సీసం భిన్నకారణాలచేత ఒక విశిష్ట రసభావ వాహికగా రూపుదిద్దుకొంది. శ్రీనాథుడు స్వభావతః ఈశ్వరార్చన కళాశీలుడు. శివకవుల సంవేదనాత్మకమైన ద్విపదల లోని ఆర్తి, శబ్ద స్పందగుణం ప్రేరేపించిన లక్షణమే శ్రీనాథునిలోని 'రస ప్రసిద్ధ ధారా ధుని' నోరారా మాటాడడానికి, నిండుగా జీవితాన్ని అనుభవించడానికి తగిన హృదయ వైశాల్యం ఉన్న రజోగుణజీవి శ్రీనాథుడు. నింపాదిగా తొణుకు బెణుకు లేకుండా అతని జీవితమెలా సాగిందో అతని సీసం కూడా అలాగే 'పాదబద్ధమై అక్షరసమమై, తంత్రీలయ సమన్వితమై' వాల్మీకి అనుష్టుప్పులాగా గానయోగ్యతను సంతరించుకొన్నది. వందలకొద్ది సీసపద్యాలను తన కావ్యాలలో నింపడమేగాక అసంఖ్యాకమైన చాటువుల్లోనూ, జీవితావసానదశలో 'దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ' అమరపురికి అరుగుతూ చెప్పిన

''కవిరాజు కంఠంబు కౌగిలించెను గదా
పురవీథి నెదురెండ పొగడదండ
''

''కాశికావిశ్వేశు గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయ డిచ్చు
''

అనే రెండు పద్యాలుకూడా సీస పద్యాలే కావడం గమనిస్తే సీసం అతని హృదయంనిండా వ్యాపించిన నిర్నిద్రమైన హృదయగతిగా కనిపిస్తుంది. ''శ్రీనాథుని చివరి శ్వాసకూడా సీసపద్యంలో ఛందోమయంగా వినిర్గతమైంది'' అందుకే శ్రీనాథుడు సీసమూ పర్యాయ పదాలైపోయాయి.

ఇతరకవులు సీసపద్యాల అనంతరం ఆటవెలదుల్ని కూడా వాడగా శ్రీనాథుడు తేటగీతినే ఎన్నుకోవడంలో ఒక ప్రత్యేకత ఉంది. ఆటవెలది పాదాలు 1,3 దీర్ఘంగానూ (3సూ.గ, 2 ఇం.గ); 2,4 హ్రస్వంగానూ (5 సూ.గ) ఉంటాయి.

తేటగీతిలో ఉన్న ప్రతిపాదగణ సమత్వమే (1 సూ.గ.; 2 ఇం.గ. మరల 2 సూ.గ.) ఆయన తేటగీతిని ఎన్నుకోవడానికి హేతువైంది.

శ్రీనాథునిలో దాదాపు 811 సీసపద్యాలుండగా అందులో మూడుచోట్ల మాత్రమే ఆటవెలది కనిపిస్తుంది. (తిక్కన 1152 సీసాలకు అనుబంధంగా 783 తేటగీతుల్ని 369 ఆటవెలదుల్ని చేర్చాడు (ఛందః శిల్పము పుట.470).

### శ్రీనాథుని సీసపద్యాల నిర్మాణ రీతులు:-

సాధారణంగా ఇతర కవుల్లోకూడా ఇక్కడ చెప్పబోయే లక్షణాలు కన్పించవచ్చుకానీ శ్రీనాథునిలో ఇవే రీతులు చాలాచోట్ల పునరుక్తం కావడంవల్ల వీటిని అధ్యయన యోగ్యాంశాలుగా గ్రహించడం జరిగింది. భాషా నిర్మాణగత అంశాలను కవులు ఎన్నివిధాలుగా సదుపయోగం చేసుకుంటారో ఈ పరిశీలనవల్ల తెలుస్తుంది. శ్రీనాథుని సీసపద్యాలలో క్రింది నిర్మాణరీతులు కన్పిస్తాయి.

**1. పాదంలో ప్రథమార్థం అన్ని పాదాల్లోను పునరుక్తం కావడం:**

సీ. ఎన్నఁడు చూతునో యింకొక్క మాఁటేను
    బ్రకట కైవల్యాంబు రాశి గాశి?
నెన్నఁడు చూతునో యింకొక్కమాఁటేను
    జగదేక పావని జహ్ను కన్య?
నెన్నఁడు చూతునో యింకొక్క మాఁటేను
    మహిమాస్పదము ముక్తిమంటపంబు?
నెన్నఁడు చూతునో యింకొక్క మాఁటేను
    విశ్వలోకారాధ్యు విశ్వనాథు?

తే. నింక నెన్నఁడు చూతునో యేను దుంఠి?
నింక నెన్నఁడు చూతునో యేను దుర్గ?
నింక నెన్నఁడు చూతునో యేను వటుకు?
నింక నెన్నఁడు చూతునో యేను గుహుని?
(కాశీ. 2-158)

**2. ద్వితీయార్థం పునరుక్తం కావడం:**

సీ. కలహంసి! రారాదె కదలి నాతో గూడి
    నీవేల వత్తమ్మ నెమ్మినుండి
కదలికా కాంతార! కదలిరా నముగూడి
    నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
శ్రీ విశాలాక్షి! విచ్చేయు నాతో గూడి
    నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
నాతోడ గూడి యంతర్గేహ! యే తెమ్ము
    నీవేల వత్తమ్మ నెమ్మి నుండి

తే. రండు నను గూడి యో పరివ్రాట్టులార!
వత్సలత గల్గి మీరేల వత్తురయ్య!
పరమ నిర్భాగ్యుడైన నాపజ్జ బట్టి
కటకటా! సౌఖ్య జలరాశి గాసి బాసి.
(కాశీ. 2-140)

**3. ద్వితీయార్థంలో సగం పునరుక్తం కావడం:**

సీ. పరమ కల్యాణి! యో భాగీరథీ! గంగ!
    వార్ధి భామిని! పోయి వత్తునమ్మ!
యమరేంద్రులార! లోలార్క కేశవులార!
    వనజ సంభవ! పోయి వత్తునయ్య!
శ్రీ విశాలాక్షి! దాక్షిణ్య పుణ్యకటాక్ష!
    వాసవార్చిత! పోయి వత్తునమ్మ!
శ్రీ పూర్ణభద్ర పారిషద నాయకులార!
    వటుక భైరవ! పోయి వత్తునయ్య!
(కాశీ. 2-139).

**4. ఒక్క పదంతప్ప పాదమంతా పునరుక్తం కావడం:**

సీ. దక్షవాటీ మహా స్థానంబులో లేని
    యమరులే స్థానంబు నందులేరు
దక్షవాటీ మహా స్థానంబులో లేని
    యర్థమే స్థానంబు నందులేదు
దక్షవాటీ మహా   నంబులో లేని
    యమృతమే   నంబు నందు లేదు
దక్షవాటీ మహా   నంబు లో లేని
    యజ్ఞమే స్థానంబు నందు లేదు.

తే. దక్షవాటిక సకల తీర్థముల కిరవు
దక్షవాటిక సకల విద్యలకు గరిడి
దక్షవాటిక విభవంబు తానకంబు
దక్షవాటిక శివుని యంతః పురంబు.
(భీమ. 6-106)

5. యత్తదర్థక సంబంధంతో పద్య నిర్మాణం సాగడం:

సీ. ఎవ్వండు నీ పదం బెలమి నుద్దేశించి
    యతి ఘోరమగు తపం బాచరించె?
నెవ్వండు నీ చిత్త మెరియించు చున్నాడు
    కైవల్య పదవికై కాలు సాచి?
యెవ్వండు గురునీతికే పాకమును బొంద
    కుద్దండ రీతి మా యొడ్డి నిలిచె?
నెవ్వండు దంభోళి హేతి నిర్ఘర ధార
    దలచె నీలోత్పల ధార గాగ?

తే. వాని భంజింతు నాతని మాన మడతు
నతని నిర్జింతు నాతని నతకరింతు
(హర. 3-44)

6. దాదాపు పద్యం మొత్తం క్రియలలో కూడి ఉండడం:

సీ. అనువు దప్పిరి నొచ్చి రలసి రాపదనొంది
    రదవదలైరి చీకాకు పడిరి

యంగ లార్చిరి విచ్చి రాఱడి బొందిరి
బ్రమసిరి పాఱిరి పల్లటిలిరి
బెగ్గడిల్లిరి పికాపికలైరి సొలసిరి
కులకుల గూసిరి కుతిల పడిరి
గగ్గుల కాలైరి కలగి రోటాఱిరి
వెల వెల్ల నైరి నివ్వెఱగు పడిరి

తే. అసవుసవులైరి గుజగుజ యైరి డస్సి
రొల్ల బోయిరి వెగ్గిరి తల్లడిలిరి
సిగ్గువడి రొచ్చవడిరి యిస్సిస్సి యైరి
తారకుని చేత మునులు బృందారకులును.

(హర. 3-10)

7. ప్రథమాంత అస్మద్విశేషణాలలో సాగడం:

సీ. నే గొమ్ము మేనుగ నే విహంగంబను
నే స్తబ్ధరోమంబ నేను గొఱియ
నేను బకంబను నేను గర్కటకంబ
నే నచ్ఛభల్లంబ నేను నక్క
నేను మండూకంబ నేను గించులికంబ
నేను గీటంబ నే వానరంబ
నే శుకకీటంబ నే బుండరీకంబ
నే ఖంజరీటంబ నేను దోమ

తే. నేను మానిసి మున్నంచు నేకతమున
నొండొరుల తోడుతను జెప్పికొండురుబుసు
దారక బ్రహ్మ మణిపేటి దక్షవాటి
సంభవించిన ప్రత్యగ్ర చంద్రధరులు.

(భీ. 4-33)

8. కాకు ప్రశ్నార్థక వాక్యంతో నిండి ఉండడం:

సీ. పాయంగ వచ్చునే ప్రాలేయగిరి కూట
సమవతీర్ణ జలౌఘ జహ్నుకన్య?
మఱ వంగ వచ్చునే మందార మధురసా
స్వాద ఘూర్ణితనేత్రు వటుకనాథు?
విడువంగ వచ్చునే విఘ్నాంధకారార్కు
డుంఠి విఘ్నేశు మండూక జఠరు?
మానంగ వచ్చునే మధ్యాహ్న కాలంబు
శ్రీ విశాలాక్షి కెంజేతి భిక్ష?

(కాశీ. 2-112)

9. పాద ప్రారంభంలో క్రియ ఉండడం:

సీ తెంచు నెవ్వని హేతి దృప్తారి నరవర
గ్రైవేయ పరిలసత్కంధరముల
ముంచు నెవ్వని కీర్తి ముగ్దేందుధరకంఠ
కాకోల్ల విషమషీ కాళిమంబు
బెంచు నెవ్వని బుద్ధి పంచాస్త్ర పరిపంథి
పాద పాథోధి తాత్పర్య చర్య
మించు నెవ్వని మూర్తి మీనచిహ్న జయంత
నల నలకూబరాదుల జయించి.

(కాశీ. 1-51)

10. పాదంలో ప్రథమ ద్వితీయార్థాలు క్రియతో ప్రారంభం కావడం:

సీ కట్టించె బట్టన క్ష్మావిభాగము పైడి
గల్పించె వప్రంబు గాంచనమున
మలిపించె బంగారముల దేవ గృహములు
కూర్చించె నట్టిండ్లు కుందనమున
నిర్మించె బ్రాసాద నివహంబు గనకాన
బాటించె గవకులు హాటకమున
రచియించె గార్తస్వరమున గోపురములు
కీలించె గేలిదీర్ఘికలు భూరి

(భీమ. 5-88)

11. పాదాంతంలో క్రియ ఉండడం:

సీ. హాలహలంబను నల్లనేరడు పండు
మిసిమింతుడును గాక మ్రింగినాడు
పెనువ్రేలి కొనగోర బిసరుహాసను మోము
గెందమ్మి విరివోలె గిల్లినాడు
పంచ వన్నియ తోడ బసవనారాచుని
నెజ్జ చిచ్చఱకంట జుట్టినాడు
మెఱుగు గోఱలు డుల్ల మృత్యు దేవత నోరు
ధట్టించి యఱకాల దన్నినాడు.

(భీమ 1-111)

12. సంబోధనలతో మొత్తం పద్యం సాగడం:

సీ. గోవింద! భూతేశ! గోప! గంగాధర!
చాణూర మర్దన! చండికేశ!
కంస ప్రణాశన! కర్పూరగౌర! గో
పీపతి! శంకర పీతవసన!
గిరిశ! గోవర్ధనోద్ధరణ! బాల మృగాంక
వర్ణ! మాధవ! భవ! వాసుదేవ!
విషమేక్షణ! మురారి! వృషభధ్వజ! హృషీక
పతి! భూతపతి! శౌరి! ఫాలనేత్ర!

(కాశీ. 3-160)

13. విభక్తి ప్రత్యయంతో పాదం ముక్తాయింపు పొందడం:

సీ. ఖండ శర్కర జున్ను కండ చక్కెరలు దో
సెలు వడలేన్వె పాసెముల తోడ
గమ్మగా గాచిన కఱియాల నేతిలో

గమనీయ పంచ భక్ష్యముల తోడ
సంబారములతోడి శాకపాకము తోడ
బక్వ మయిన పెసరప్పు తోడ
దేనియ ధారతో బానకంబుల తోడ
శిఖరషాడబ రసశ్రేణి తోడ.

(భీమ. 1-61)

14. ఐదు మాత్రల అన్ని ఇంద్ర గణాలతో సాగడం:

సీ. కాలకంఠకఠోర కంఠ హుంకారంబు
చెవులు సోకని నాటి చిత్తభవుడు
కుపిత రాఘవ ఘన క్రూర నారాచంబు
తనువు నాటని నాటి వనధిరాజు
క్రుద్ధ కుంభోద్భవ భ్రూలతా కౌటిల్య
వికృతి క్రుంగని నాటి వింధ్య శిఖరి
వీరభద్రోదార ఘోర వీరావేశ
విహతి కందని నాటి తుహినకరుడు.

(శృం. 1-35)

(చూడుడు.శృం. 1-37; కాశీ. 3-85, 91; భీమ.1-7,8,9; హర. 4-11,28; శివ. 2-89,97.)

15. వృత్త్యను ప్రాస కూర్చడం:

సీ. భవు భవానీ భర్త భావ సంభవవైరి
భవరోగ భంజను భాల నయను
భోగ ప్రదుని భోగిరాజ విభూషు
భూనభోబ్ధి వ్యాప్తు భువన వంద్యు
భగవంతు భర్గుని భసితాంగరాగుని
భాను కోటి ప్రభా భాసమాను
భాగీరథీ మౌళి భగదృగ్విపాటను
భూ రథాంగుని భద్ర భూతి ధరుని

(భీమ. 3-83)

16. అంత్యాను ప్రాసను ప్రయోగించడం:

సీ. బ్రహ్మలోకోన్నత ప్రాసాద నిశ్రేణి
యాజవంజవ భీతి కభయ పాణి
కలుష కంఠచ్ఛేద కాలాయస కృపాణి
కైవల్య నవ మౌక్తికమున కాణి
వీరావనీ సముద్విష్టకంఠర్వాణి
చక్షు రుత్సవ గంధ సారసాణి
చేతఃప్రసాద లక్ష్మీ విహార క్షోణి
కల్పాంత కాలంబు గలపురాణి

(కాశీ. 3-91)

17. లాటాను ప్రాస కూర్పులో ఉండడం:

సీ. శ్రీభీమ నాయక శివనామధేయంబు
చింతింప నేర్చిన జిహ్వ జిహ్వ
దక్షవాటీపురాధ్యక్ష మోహన మూర్తి
జూడంగ నేర్చిన చూపు చూపు
దక్షిణాంబుధి తట స్థాయి పావన కీర్తి
చే వింపనేర్చిన చెవులు చెవులు
తారక బ్రహ్మ విద్యాదాత యౌదల
విరులు పూన్పగ నేర్చు కరము కరము.

(భీమ. 3 198.)

18. ముక్త పదగ్రస్తాలతో కూర్చడం:

సీ. విఘ్నాధినాథుండు విన్నవించిన మీద
పర్వతాత్మజ విన్నపంబు చేసె
పర్వతాత్మజ విన్నపంబొనరించిన
వెనుక గ్రౌంచఘ్నుండు విన్నవించె
గ్రౌంచఘ్నుడటు విన్నవించిన యత్తఱి
మఱి విన్నవించెను మాతృగణము
బ్రాహ్మ్యాది మాతృవర్గము విన్నవించిన
వెండియు భూతముల్ విన్నవించె.

(భీమ. 5-13)

19. గునుగు సీసాలతో రచించడం:

సీ. అవధారు దేవి! దివ్య కిరీట కోటి సం
ధానిత వికచ మందార దామ
సందోహమకరంద బిందు ధారాధౌత
సందీప్త చరణార విందుడైన
సంక్రందనుండు నాస్వామి నన్నాయింద్రు
గారాబు సంచారిగా నెఱుంగు

(శృం. 3-120)

(హర. 2-15; కాశీ. 2-163; 6-23.)

20. తత్త్వ వ్యంజకంగా పాదనిర్మాణం ఉండడం:

సీ. చంద్రబింబానన చంద్రరేఖామౌళి
నీలకుంతలభార నీలగళుడు
ధనళాయతేక్షణ ధవళాఖిలాంగుండు
మదన సంజీవనీ మదనహరుడు
నాగేంద్ర నిభయాన నాగ కుండల ధారి
భువన మోహన గాత్రి భువనకర్త
గిరిరాజకన్యక గిరిరాజ నిలయుండు
సర్వాంగ సుందరి సర్వగురుడు

తే. గౌరి శ్రీవిశ్వనాథుండు కనకరత్న
పాదుకల మెట్టి చట్టలు పట్టి కొనుచు

(భీమ 2-148)

నేగుదెంచిరి యొయ్యార మెసకమెసగ
విహరణ క్రీడ మాయున్నవేది కపుడు.

పార్వతీ పరమేశ్వర తత్త్వం అర్ధనారీశ్వరం కాబట్టి పూర్వో త్తరార్ధాల్లోనూ మొదటి సగం శక్తిని రెండోసగం శివుని వర్ణించేలా పాదనిర్మాణం చేయడం ఈశ్వరార్చన కళాశీలునికే చెల్లింది.

# అన్నమయ్య శృంగార వైరాగ్య సంకీర్తనలు

శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు

పదకవితకు ద్విపదకవితకు తాళ్లపాక కవులు చేసిన సేవ అపారమైనది. వీరిలో అన్నమాచార్యులు తొలి తెలుగు వాగ్గేయకారులు. వీరి రచనలు మనకు లభించినవి శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు, మంజరీ ద్విపదలో సాగిన శృంగార మంజరి, అలమేలుమంగా శ్రీనివాసులను కలిపి స్తుతించిన వేంకటేశ్వర శతకం. సంస్కృతంలో వీరు రచించిన సంకీర్తన లక్షణం మనకు దక్కలేదు. దీనికి వ్యాఖ్యాన ప్రాయంగా అతని కుమారుడు పెద తిరుమలయ్య రచించిన వచనం కూడ మనకు లభించలేదు. వీని యాధారంగా ఇతని కుమారుడు చినతిరుమలయ్య రచించిన సంకీర్తన లక్షణం మాత్రమే ఇప్పుడు మనకు మిగిలింది. గీర్వాణంలో అన్నమయ్య సంకీర్తన లక్షణాన్ని 'సంకీర్తనా పరిశుద్ధిన్ మనుజేయబూని...... పరిపూర్ణాఖిల శాస్త్ర సమ్మతముగ' చేసినట్లు చిన తిరుమలయ్య పేర్కొంటాడు. అన్నమయ్య పదరచనలో ఎక్కువగ మనకు లభించినవి శృంగార సంకీర్తనలే. ఇవి సుమారు పదివేలకు పైగా ఉన్నవి. ఆధ్యాత్మిక సంకీర్తనలు రెండు వేలకు పైబడినవి. అన్నమయ్య మనుమడు చిన్నన్న వ్రాతల ప్రకారం ముప్పై రెండు వేల సంకీర్తనలు అన్నమయ్య రచించినట్లు తెలుస్తున్నది. ప్రాయః మనం పోగొట్టుకొన్న ఇరవైవేల సంకీర్తనల్లో ఎక్కువగ ఆధ్యాత్మ పదరాశి కలసి ఉన్నదేమో. పోయినవి పోగా ఉన్నవానినైనా భద్రంగా పదిల పరచుకొని నిత్యం అనుసంధానం చేసుకోగలిగితే చాలు. మధురభక్తి ఒరవడిలో సాగిన శృంగార పదాలలో ఆధ్యాత్మికపు మెరుపులే గోచరిస్తాయి. లోకనీతి, ధర్మం, నా యం, మానసబోధ, వేంకటేశ్వర స్వామి తత్త్వం, మూ సౌందర్యం మొదలైన అంశాలు వీరి అధ్యాత్మ సంకీ ల్లో గోచరిస్తాయి. దీర్ఘ శరణాగతి తత్త్వానికి ఇవి ప్రతిబింబాలుగ నిలిచాయి.

సంకీర్తన లక్షణంలో శృంగార పదాలను ప్రస్తావిస్తూ

పదములు శృంగారవధూ
మృదుమధుర మనోజ్ఞ వాక్యమిశ్రములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగా బొంక మెఱిగి పలుకగ జెల్లున్

అంటారు. వైరాగ్య అధ్యాత్మ సంకీర్తనలను ప్రస్తావిస్తూ

వైరాగ్యవ్ర ర గం
భీర పద ణి పొసగ బెనుపుచు నగ్రా
మ్య ర విష్ణు చరితో
దారము యున్నజాలు ధరణిన్వెలయున్.

దేహాత్మేశ వివేకో
త్సాహంబను లోక వేద ధర్మాధర్మా
ద్యూహాపోహంబులగల
యా హరి సంకీర్తనంబు లధ్యాత్మంబుల్.

అనే నిర్వచనాలు కనిపిస్తాయి ఈ లక్షణాలకు లక్ష్యాలుగ అన్నమయ్య పదాలను మనం వింగడించ వచ్చు.

అన్నమయ్య జీవితం శ్రీనివాస భక్తి ప్రచారం. అన్నమయ్య తపస్సు శ్రీనివాస భక్తి ప్రచారం. తల్లి లక్కమాంబ నుండి సంక్రమించిన భక్తి తండ్రి నారాయణ సూరి శిక్షణలో అలవరచుకొన్న విద్యాబుద్ధులు అన్నమయ్య సంకీర్తనకు బలాన్నిచ్చినవి. సహజమై పదను చెడని ప్రతిభ, వ్యుత్పన్నమైన లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణం రెండూ అతని శ్రీనివాస భక్తి సామ్రాజ్యంలో అభ్యాస బలాన్ని సంతరించుకొన్నవి. రోజుకు ఒక సంకీర్తనకు తక్కువ కాకుండా వచించడం అతనికి వ్రతం. అంతరంగ బహిరంగాలలోని శుద్ధి - ఆర్జవత్వాన్ని తోడు చేసుకొని వేంకటేశ్వర మంత్రాలుగ అతని సంకీర్తనలు భాసించడానికి పునాదిగ నిలిచింది. ఆ పాటలు చదువుతున్నంత సేపు మనల్ని పట్టి ఆకర్షించేది శబ్దార్థాల సొబగు కన్న అనంతమైన భావనాబలం. అతడు నరులకోసం పాటలు పాడినా నరహరిని మెప్పించడమే ధ్యేయం. నరపతుల సన్మానాలను సత్కారాలను ఆశించిన వాడు కాదు. సాళ్వ నరసింగరాయలు పెనుగొండ ప్రభువైనా అన్నమయ్య దృష్టిలో తనకు బాలసఖుడు మాత్రమే. ఆచార్యుడని తన పాదాల మీద వ్రాలినా ఆశీర్వదించిన వాడేకాని ఐశ్వర్యాలను ఆశించిన వాడు కాదు. ''పుట్టు

భోగులము మేము భువి హరిదాసులము, నట్టన మి దొరలు నాకియ్యవలెనా'' ఈ మనస్తత్వమున్న వ్య ఎవ్వరు మాత్రము ఏమిచేయగలరు? ''మనుజుడై పు మనుజుని సేవించి అనుదినమును దుఃఖమంద నేల'' అని ఆత్మపరిశీలన చేసుకొనే మహాపురుషుని ఎవరు లోభపెట్టగలరు? ''అడవిలో మృగజాతియై పుట్టవచ్చుగాని, మునురుమానై జీవించవచ్చుగాని'' ఇతరులను కొలువరాదనే అతని సిద్ధాంతము. ''ఆ వేంకటేశ్వరుని సేవారతికి గాక జీవన భ్రాంతి పడు సిరులేల'' అన్నది అన్నమయ్య ఆత్మ విశ్వాసం. ఆ పరతత్వంతో ఆడి పాడి, కూడివాడి, కలసి కలహించి, పొగడి తెగడి ఆ అనుభవాలను మధుర పదరచనలుగ ఆవిష్కరించిన మహాభక్తుడు, వాగ్గేయకారుడు అన్నమాచార్యులు. తాతగారి 'వచోనూత్నక్రియలను' చిన తిరుమలయ్య సుందర సత్యంగా విశదపరచినాడు.

''శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞాన సారంబులై
యతిలోకాగమవీథులై వివిధ మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైలవల్లభ రతిక్రీడారహస్యంబులై
నుతులై తాళులపాక యన్నయ వచో నూత్నక్రియల్
చెన్నగున్

ఒక్క శృంగార పదం:

అప్పుడే కేళికామందిరం వెలికివచ్చిన నాయికను చెలికత్తెలు పట్టుకొని పరియాచకా లాడుతున్నారు. ఆ నాయిక కనుగొనల అరుణిమ, పయ్యెద చెరగుదాటిన చనుగవ మెరుగులు, చెక్కిళ్ళ జారిన ముత్యాల జాలరుల పోలిన చెమట బిందువులు - వీనిని చెలులు చింతించి, కనుగొని, ఊహించి తెలుసుకొన వలసిన అవసరం ఏర్పడింది. భామచిగురుటధరం మీద నిండిన కస్తురికి కారణాలు వెదికితే మిగిలినవన్నీ స్పష్టంగా బోధపడతాయి

ఆ పల్లవాధర అధరం మీద అక్కడక్కడ కస్తూరి అంటుకొన్నది. అది భామ తన విభునకు వ్రాసిన పత్రికయట. కలికి కనుగొనలు ఎర్రవారినవి. అవి వింత అందాన్ని సంతరించుకొన్నవి. సతి పతిపై నాటిన కొన చూపులను నిలువుగ పెరికినప్పుడు అంటిన నెత్తురట. పడతికి చనుగవమెరుగులు పయ్యెదచెరగు మించి వ్యాపించినవి. వేడుకతో ప్రియుడు తన మగువ చనుగవపై ఒత్తిన నఖశశిరేఖలు వెదజల్లిన వేసవికాలపు వెన్నెలట. ఆ ముద్దియ చెంపల కిరువైపుల ముత్యాల జాలరుల ఆభరణాలు అమరినట్లయినది. అవి తిరువేంకటపతి కామినిని తన కౌగిటచేర్చి అద్దిన సురతపువేళల చెమటల అందమట.

**పల్లవి:**

**ఏమొకొ చిగురుటధరమున యెడనెడ గస్తురి నిండెను**
**భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా**

**చరణాలు:**

**కలికి చకోరాక్షికి గడకన్నులు కెంపై తోచిన**
**చెలువంబిప్పుడిదేమో చింతింపరె చెలులు**
**నలువున ప్రాణేశ్వరుపై నాటిన యా కొనచూపులు**
**నిలువున పెరుకగ నంటిన నెత్తురు కాదుగదా**

**పడతికి చనుగవమెఱుగులు పై పై పయ్యెద వెలుపల**
**కడు మించిన విధమేమో కనుగొనరే చెలులు**
**ఉడుగని వేడుకతో ప్రియుడొత్తిన నఖశశిరేఖలు**
**వెడలగ వేసవికాలపు వెన్నెల కాదు గదా**

**ముద్దియ చెక్కుల కెలకుల ముత్యపు జల్లుల చేర్పుల**
**వొద్దికలాగు లివేమో వూహింపరె చెలులు**
**గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున**
**అద్దిన సురతపుజెమటల అందము కాదు గదా.**
**(సంపు.12.సంకీ.82)**

అన్నమయ్య కవిత, గానం దేశమంతటా వెన్నెలలా వ్యాపించింది. పెనుగొండ ప్రభువు సాళ్వనరసింగ రాయలు భక్తుని తన కొలువున కాహ్వానించినాడు. 'అంగజగురుని మీద నభినవంబైన శృంగారయుత పదశ్రేణి' పాడమని కోరినాడు. 'చెలులార వేంకటశిఖరి నాయకుని ''కలికి గడగంట గనుపట్టు నెఱుపు చెలువ మేగతినుండె జెప్పరే'' యనిన, ''నలువున ప్రాణేశు నాటిన చూపు, నిలువున బెఱుకనూనిన శోణితంబు తలపోయగాదు గదా'' యన్న పదము పలుమారు బాడించి పాడించి చొక్కి తలయూచి ''యిది కవిత్వం'' బని మెచ్చినాడు. అంతటితో ఆగక గర్వాంధుడైన రాజు 'వేంకటపతిమీద నుడువు పదముల రీతి నాపై నొక్కపదము చెప్పుమా' అన్నాడు. వెంటనే అన్నమయ్య 'హరిహరీ' అని చెవులు మూసుకొని ''హరిముకుందుని గొనియాడు నా జిహ్వ నిను గొనియాడంగ నేరదని 'నీవు వద్దు నీ కొలువు వద్ద'ని సభానిష్క్రమణం చేసినాడు. రాజధిక్కారాన్ని సహింపని రాయడు అన్నమయ్యను బంధించి, మూరురాయరగండ సంకెలలేసి చెరసాలలో త్రోయించినాడు. ''అధిపుల్ క్రూరఫణి స్వరూపులు''. అన్నమయ్య ''నీదాసుల భంగము నీవుచూతువా ఏ రీతి పరాకు నీకు నను రక్షింపరావా'' అనే సంకీర్తన పాడగా సంకెళ్లు తెగి నేలపడినాయి. రాజు పశ్చాత్తాపంతో ఆ హరిభక్తుని శరణు వేడినట్లు చిన్నన్న వ్రాసిన అన్నమాచార్య చరిత్ర చెప్తుంది. ఈ పదం చుట్టూ ఇంతకథ అల్లుకొని ఉంది. ఈ పాటలోని భావసౌందర్యానికి ముగ్ధుడు కాని

సాహిత్య రసికుడుండడు. చిన తిరుమలయ్య అన్నట్లు అది 'వేంకటశైలవల్లభ రతిక్రీడా రహస్యం'.

**లఘుటీక:**

'పతి-కౌగిటి యధరామృతముల అద్దిన సురతపువేళల అందము' ఇది సాధారణ రేకులోని పాఠాంతరం. (అన్నమయ్య సంకీర్తనలు నిడు రేకులలో, సాధారణ రేకులలో కూడ వ్రాసి పెట్టబడినవి).

**కలికి:** మనోజ్ఞయైన స్త్రీ. చకోరాక్షి: చకోరము కన్నుల వంటి కన్నులు గలది. 'చకోర మంటే గబ్బిలం. దీని కళ్లు ఎర్రగ ఉంటాయి. రాత్రిపూట వీనికి సంచారం. ఈ విషయాన్ని నాకు తెలిపిన వారు రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ గారు. వారికి శ్రీకట్ట మంచి రామలింగారెడ్డిగారు తెలిపినారట. నలువునన్: అందంగ, సమర్థవంతంగ. నఖశశిరేఖలు: రతి సమయంలో పడతి కుచాలపై ప్రియుడు వేసే గోటి నొక్కులు, నఖక్షతాలు, శశిరేఖ లనడం చక్కని రూపణ. ముత్యపు జల్లుల చేర్పులు: ముత్యాల జాలరులతో కూడిన అభరణ విశేషం కాబోలు. ఆడవాళ్లు చెంపలపై వ్రేలాడదీసుకొనే జాంకీల వంటివి. ఒద్దిక లాగులు: అనుకూలమైన విధానాలు. గద్దరి: దిట్టతనం గల.

రేయి నాయికా నాయకుల సమాగమమైంది. ప్రియుని దంతక్షతాలను పెదవిపై కప్పుకొనడానికి ఆ మగువ కస్తురి కప్పినది. ఎర్రని మృదువైన పెదవి. అక్కడక్కడ అంటని కస్తురి. తాటాకు మీద మషీపంకంతో రేఖలు వ్రాసినట్లు. భామ విభునికి వ్రాసిన ప్రేమలేఖ. లేదా ఒడంబడిక కుదిరి ప్రియురాలు వ్రాసి యిచ్చిన ఆమోదపత్రం. కలికి కనుగొనల ఎర్రజీరలు సౌందర్యరేఖలే కాదు అదృష్టరేఖలు కూడా. ఆ కనుగొనల ఎర్రదనాన్ని 'గూర్చి ఆలోచించి హేతువేమిటో తెలుసుకోవలసిన అవశ్యకత ఏర్పడింది. ఒడుపుగ ప్రాణేశ్వరునిపై నాటిన తన కడగంటి చూపులను నిలువుగ లాగినందువల్ల అంటిన నెత్తురట. చెలువ కనుగొనల అరుణిమకు కారణం తెలిసింది. ఆంధ్రవాఙ్మయంలో ఎక్కడా ఇటువంటి విలక్షణము వినూత్నము అయిన భావన కనిపించదు.

ఒక్క వైరాగ్య అధ్యాత్మ సంకీర్తన:

**పల్లవి:**

**నానాటి బదుకు నాటకము**
**కానక కన్నది కైవల్యము**

**చరణాలు:**

**పుట్టుటయు నిజము పోవుటయు నిజము**
**నట్టనడిమి పని నాటకము**
**యెట్టనెదుట గల దీ ప్రపంచము**
**కట్టగడపటిది కైవల్యము**
**కుడిచేదన్నము కోక చుట్టెడిది**
**నడుమంత్రపు పని నాటకము**
**వొడిగట్టుకొనిన వుభయకర్మములు**
**గడి దాటి నపుడె కైవల్యము**
**తెగదు పాపము తీరదు పుణ్యము**
**నగీ నగీ కాలము నాటకము**
**యెగువనె శ్రీ వేంకటేశ్వరుడేలిక**
**గగనము మీదిది కైవల్యము**

**(సంపు: 9: సంకీ: 287)**

జీవితమంతా ఒక నాటకమని ప్రపంచ తత్త్వవేత్తలంతా భావించిందే. అన్నమయ్య 'చక్కదెర నాటకము సంసారము' 'సరిసంసారము సంతల కూటమి... మరులగు విధమే మాపటికి' 'ముంచిన జగమిది మోహినీ గజము పొంచిన ఆసల పుట్టించేదిది' అంటూ మాటిమాటికీ జీవితం అశాశ్వతమని తెలిపినవాడే. ఈ అన్నముని కుమారుడు పెద తిరుమలయ్య కూడ తన వైరాగ్య వచనములకు గీతాలలో 'సర్వేశ్వరా! యవధారు. జగంబు నీ నాటకశాల' అని అంటాడు. లౌకిక జీవితం సత్యం కాదు - అది నాటకం. అలౌకికమైన పరతత్త్వాన్ని పొందడమే కైవల్యం - అది సత్యం. ఈ పాటలో అన్నమయ్య ప్రబోధించిన తత్త్వమిది.

మనం నిత్యం సాగించే జీవయాత్ర నాటకం. కోరి సాధించేది కైవల్యం. జనన మరణాలు సత్యాలు. వీని మధ్య సాగేదంతా నాటకం. ప్రత్యక్షంగా మనకు కనిపించేది ప్రపంచం. దీనిని అధిగమించి సాధించేది కైవల్యం. తినేది అన్నం. కట్టుకొనేది బట్ట. నడుమంత్రంగా నడిచే వ్యవహారమంతా నాటకం. ప్రారబ్ధసంచితాలు ఉభయ కర్మలు. ఇవి మనం ప్రయత్నించి ఒడిగట్టుకొన్న పుణ్యాపాపాలు. ఇవి తొలగినప్పుడే కైవల్యం. పాపం తెగేది కాదు. పుణ్యం తీరేది కాదు. మనం చూస్తూ ఉండగానే మన కళ్ల ఎదుటనే కాలం నవ్వుతూ దొర్లిపోతుంది. అందుకే మనం దిగువ (ఇహంలో) ఏమీ సాధించలేం. సాధించేది సాధించ వలసింది ఎగువనే (పరంలో). అక్కడ ప్రభుత్వం వెంకటేశ్వరునిది. అతడే కైవల్య ప్రదాత.

**లఘుటీక:**

బదుకు: బ్రతుకు, బ్రదుకు: జీవనం కానకకన్నది లేకలేక పొందినది. కైవల్యం: మోక్షం. నట్టనడిమిపని: జనన మరణాల మధ్య సాగే జీవయాత్ర. కుడుచు: భుజించు నేటి సభ్యవ్యవహారంలో ఈ శబ్దం అర్థ విపరిణామాన్ని (semantic variation) పొందింది. కోక: వస్త్రసామా ం. నేడు స్త్రీలు ధరించే వస్త్రాలకే పరిమితం. నడుమం పు పని: నడుము+ అంతరము-రెండూ సమానార్థకాలే. మ కాలంలో వచ్చింది. అంటే భార్య, బిడ్డలు మొదలైన సారపు తగులము. వొడిగట్టుకొనిన వుభయ కర్మములు: రబ్ధ సంచిత కర్మలు -పుణ్యాపాపాలు. ఇవి ప్రా లు. ప్రయ ంచి పొందినవి. గది దాటినపుడె: ఆ క లు రెండు ళ్లలు దాటినప్పుడే; వానిని అధిగమించ గ గినప్పుడే కైవల్యం. 'పుణ్యాపాపే విధూయ' అనే ఉపనిషద్వాక్యమే ప్రమాణం

# తెలుగులో 'వేంకటేశ్వర' సాహిత్యం

శ్రీ కోరాడ రామకృష్ణ

తిరుమల జగత్ప్రసిద్ధ పుణ్యక్షేత్రం. అక్కడి ఆనందనిలయంలో నెలకొన్న అర్చామూర్తి శ్రీ వేంకటేశ్వరుడు; ప్రాచ్యపాశ్చాత్య దేశాలలోనూ ప్రఖ్యాతి గాంచిన ప్రభావ సంపన్నుడు. ఇతనిచేత ఆకర్షితులై నానాదేశాలనుంచి ఎందరో భక్తులు వచ్చి తరిస్తుంటారు. ఈ ఆలయ ప్రాచీనత ఊహకందని విషయం. ఋగ్వేదంలోనే వేంకటాచల ప్రసక్తి కనిపిస్తోంది. అతిప్రాచీన తమిళవ్యాకరణ గ్రంథం తొల్కాప్పియంలో కూడ వేంకటాచల ప్రసక్తి ఉంది. క్రీస్తుశకం ఒకటవ శతాబ్దిలో వెలసిన సంఘకావ్యాల్లో తిరుమల విష్ణుదేవుని శైలంగా కీర్తింపబడింది. అగనానూరు 149 వ పాటలో 'ఒడియావిళవిన్ నెడియోన్ కుండ్రమ్' పదబంధం కూడ ఈ విషయాన్నే బలపరుస్తూంది. దీనినిబట్టి వేంకటాచలం అతిప్రాచీన కాలం నుంచే అంటే క్రీస్తుపూర్వం నుంచే ప్రసిద్ధిలో ఉందని తెలుస్తూంది. మిక్కిలి ప్రాచీనులుగా వైష్ణవులచేత పరిగణింపబడుతున్న ఆళ్వార్లలో తొండరడిప్పొడి ఆళ్వారు, మధురకవి ఆళ్వారు మినహా తక్కిన ఆళ్వార్లు అందరూ వేంకటాచలాన్ని, వేంకటేశ్వరుణ్ణి వినుతించి వినుతికెక్కినవాళ్ళే.

వేదాల తరువాత పురాతనంగా పరిగణింపబడే పురాణ వాఙ్మయంలో వేంకటాద్రికి, వేంకటేశ్వరునికి సంబంధించిన అనేక అంశాలు కన్పిస్తున్నాయి. మొదట సంస్కృతంలో వెలువడిన పురాణాలు చాలమటుకు ఆంధ్రీకరింపబడ్డాయి. కాబట్టి తెలుగులో వేంకటేశ్వర సాహిత్యాన్ని పరామర్శించేటప్పుడు దీనికి సంబంధించిన పురాణ వాఙ్మయాన్ని స్పృశించక తప్పదు. అష్టాదశ పురాణాల్లో బ్రహ్మ, పద్మ, మార్కండేయ, భవిష్యత్, బ్రహ్మవైవర్త, వరాహ, స్కాంద, వామన, గరుడ, బ్రహ్మాండ పురాణాలు పదింట్లోనూ వేంకటాద్రి క్షేత్ర మాహాత్మ్యం, వేంకటేశ్వర సంబంధిత కథా విశేషాలు, స్వామి మాహాత్మ్యం ప్రసక్తమయినవి.

ఇక తెలుగులో వెలువడిన వేంకటేశ్వర సాహిత్యాన్ని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. 1. శాసన సాహిత్యం, 2. ప్రాచీన సాహిత్యంలో వేంకటేశ్వర ప్రసక్తి.

వేంకటేశ్వరునికి సంబంధించిగాని, దేవస్థానానికి సంబంధించి కాని వెలువడిన శాసనాలను వేంకటేశ్వరునికి సంబంధించిన శాసనాలుగానే పరిగణించవచ్చు. వ్యాసవిస్తర భీతివల్ల ఈ శాసనాలను దిఙ్మాత్రంగానే ఇక్కడ స్పృశించడం జరుగుతూ ఉంది.

తిరుమల తిరుపతి దేవస్థానం తరఫున శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, తిరుమల దేవాలయం, తిరుపతి గోవిందరాజస్వామి దేవాలయం, మంగాపురం, అలిపిరి, కపిలతీర్థం మొదలైన ప్రాంతాలలో శాసనాలన్నిటిని సేకరించారు. వీరు సేకరించిన 1060 శాసనాలను తిరుమల తిరుపతి దేవస్థానంవారు కాలాన్నిబట్టి ఆరు సంపుటాలుగా ప్రకటించారు. ఈ ఆరు శాసన సంపుటాలలో ఎక్కువ శాసనాలు తమిళభాషలోను, 74 శాసనాలు తెలుగు భాషలోను కన్పిస్తున్నాయి. కొన్ని కన్నడ, సంస్కృత, హిందీ భాషలలో కూడ ఉన్నాయి. ఈ 74 తెలుగు శాసనాలలో తిరుమల దేవాలయ గోపుర ప్రాకార ప్రాంగణాలలో లభించిన శాసనాలు 54, తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి దేవాలయం, కపిల తీర్థం, మంగాపురం మొదలైన ప్రాంతాలలో లభించిన శాసనాలు 20. ఇవి అన్నీ కూడ వేంకటేశ్వరస్వామి సంబంధిత వాఙ్మయం క్రిందకే వస్తాయి. ఇందు మొదటి తెలుగు శాసనం శ్రీ మహామండలేశ్వర మీసరగండ మంగిదేవ మహారాజులు క్రీ.శ.1359లో వేయించింది.

ఇక ఈ దానశాసనాలను మూడు రకాలుగా వర్గీకరించవచ్చు 1) స్పష్టంగా వ్యక్తిపేరు, కాలసూచనలున్న శాసనాలు 2) వ్యక్తిపేరు మాత్రం ఉన్న శాసనాలు 3) వ్యక్తిపేరుగాని, కాలసూచనగాని స్పష్టంగా తెలియని శాసనాలు.

దేవాలయాల శాసనాలను రాజులు, దేవేరులు, రాజసేవకులు, సైన్యాధ్యక్షులు, మఠాధిపతులు, ఆచార్యపురుషులు, వైదిక బ్రాహ్మణులు, ఆలయ నిర్వాహకులు, వ్యాపారస్థులు మొదలైనవారు వేయించినట్లు తెలుస్తూంది. వ్యక్తుల పేర్లతో బాటు ప్రకటించిన సంవత్సర, మాస, తిథి వివరాలు వ్రాయించడం శాసన సంప్రదాయం. ఈ విధంగా వ్యక్తి కాల, స్పష్ట నిర్దేశమున్న శాసనాలు 24; కాలసూచనలేని తెలుగు శాసనాల సంఖ్య 35, వ్యక్తుల పేర్లుగాని, కాలసూచన

గాని స్పష్టంగా తెలియని శాసనాలు 4 ఉన్నాయి.

ఈ శాసనాలు శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ఆయా సేవా సందర్భాలలో, ఏయే వస్తువులు ఎంత ఖర్చుతో సమర్పింపబడాలో తెలుపుతాయి. ఈ శాసనాల ఆధారంగా స్వామివారికి సమర్పించిన మాన్యాల వివరాలు, ఆనాడు దేవాలయంలో జరిగే ఉత్సవ క్రమం, నాడు జరిగే దైనందిన పూజా కార్యక్రమాలు మొదలైన విషయాలు వీటివల్ల కొంతవరకు తెలుసుకొనే వీలు ఉంది. ఈ శాసనాలవల్ల చారిత్రకంగా తిరుమల ఆలయాభివృద్ధిని గుర్తించడానికి వీలవుతుంది. 'ఆగమ' శాస్త్రానుగుణంగా దేవాలయ కైంకర్యాదులలో జరుగుతున్న సేవలు, వాటిల్లో వచ్చే మార్పులు తెలుసుకొనేందుకు తోడ్పడుతున్నాయి.

ఈ దానశాసనాలలో కైంకర్యాలకోసం వేయబడిన శాసనాలు మూడువిధాలుగా కన్పిస్తున్నాయి. కైంకర్యాలు సజావుగా జరిగేందుకు నగదురూపేణా దానం చేయడం; గ్రామాలను దానంచేసి వాటిమీద వచ్చే ఆదాయంతో కైంకర్యాలకు ఏర్పాటు చేయడం; స్వంతద్రవ్యంతో నీటివనరులను ఏర్పాటు చేయడం, లేదా నీటివనరులను పునరుద్ధరించడం చేసి వాటిమీద వచ్చే ఆదాయం కైంకర్యాలకు వినియోగించడం. ఈ మూడవ పద్ధతి తక్కిన వాటికన్నా కొంత వేరుపడడమే కాక విలక్షణంగానూ, విశిష్టంగానూ కనిపిస్తోంది.

ఈ శాసనాలలో సాహిత్యపు విలువకంటే సాంఘిక విలువే ఎక్కువగా కనిపిస్తుంది.

తెలుగులో వేంకటేశ్వరునిపై వచ్చిన సాహిత్యాన్ని నాలుగు విధాలుగా విభజింపవచ్చు.

1. వేంకటేశ్వర ప్రసక్తాలు, వేంకటేశ్వరాంకితములు
2. శతకాలు, యక్షగానాలు, సంకీర్తనలు వంటి లఘుకృతులు
3. ప్రబంధాలు
4. తాళ్లపాకవారి సాహిత్యం

తెలుగు కావ్య జగత్తులో తిరుమల ప్రశంస ఎఱ్ఱాప్రగడ నృసింహపురాణంలో కనిపిస్తోంది. విజయనగర సార్వభౌముడైన అచ్యుతదేవరాయల భార్య తిరుమలాంబ రచించిన 'వరదాంబికా పరిణయము', శ్రీనాథుని 'కాశీఖండం', పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు రచించిన 'జైమినీభారతం', తొలి తెలుగు జంటకవులైన నంది మల్లయ, ఘంట సింగయ రచించిన వరాహపురాణం, ముక్కుతిమ్మన రచితమైన 'పారిజాతాపహరణం', సంకుసాల నృసింహకవి రచించిన 'కవికర్ణరసాయనం', ధూర్జటి విరచిత 'శ్రీకాళహస్తి మాహాత్మ్యం', మాదయగారి మల్లన 'రాజశేఖర చరిత్ర'; ధరణిదేవుల రామనమంత్రి రచిత దశావతార చరిత్ర, చింతలపల్లి ఛాయాపతి రచించిన రాఘవాభ్యుదయం, గురుభాస్కరాచార్యుని వైశ్యపురాణం, ఎఱ్ఱగుడిపాటి వెంకటకవి వేంకటేశ్వరునికి అంకితమిచ్చిన విష్ణుమాయా విలాసం, కూచిరాజు ఎఱ్ఱనకృత సకలనీతి కథానిధానం, కృష్ణకవికృత శకుంతలా పరిణయం; వేంకటేశ్వరునికే అంకితమిచ్చిన చల్లపల్లి వెంకనార్యుని శ్రీకృష్ణవిలాసం; స్వామికే అంకితమివ్వబడిన చింతలపల్లి వీరరాఘవకవి రచించిన మధుర వాణీవిలాసం మొదలైన గ్రంథాలలో వేంకటాచల ప్రసక్తి వేంకటేశ్వరుని ప్రస్తావన, స్తుతులు గోచరిస్తాయి.

పింగళి సూరన 'కళాపూర్ణోదయం'లో మణికంథరుడు తీర్థయాత్రచేస్తూ తిరుపతికి వచ్చినట్లు వ్రాశాడు. తిరుమల కొండను, పవిత్రతను కొనియాడుతూ కొండలరాయని కోరికతీరా వర్ణించాడు. తెనాలి రామలింగడు ఘటికాచల మాహాత్మ్యంలో తిరుమలలో జరిగే వివిధ కార్యక్రమాలను విస్తృతంగా వర్ణించాడు. పరమయోగి విలాసంలో సిద్ధిరాజు తిమ్మరాజు ఏడుకొండల వెంకన్నను స్తుతించాడు. చంద్రభాను చరిత్రలో తరిగొప్పుల మల్లన తిరుమలకొండ పవిత్రతను వర్ణించాడు. అంతేకాకుండా కొండనెక్కే యాత్రికులను కూడ కొనియాడాడు. కాకమాని మూర్తికవి వేంకటేశ్వరునికే అంకితమిచ్చిన రాజవాహన విజయంలో 'శుక్రవారపు తిరుమంజ' నాన్ని గూర్చి తెలిపాడు. ఆసేతు హిమాచలం నుంచి వచ్చే యాత్రికుల గూర్చి కొంత వివరం ఇచ్చాడు. టేకుమళ్ల రంగశాయికృత వాణీవిలాస వనమాలికను వేంకటేశ్వరునికే అంకితమిచ్చాడు. దాంట్లో అలమేలుమంగ వేంకటేశ్వరులను స్తుతించాడు. తిరుమలలోగల పుణ్యతీర్థాలను వర్ణించాడు. గ్రంథకర్త నామ, దేశ, కాలాదులు తెలియని 'వేంకటాచల విలాసం' లో శ్రీనివాసుని వర్ణన ఉంది. తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురించిన 'శ్రీవేంకటేశ్వర స్తుతిరత్నమాల' (మొదటిభాగం) లో శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు, తిరుపతి వెంకటకవులు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించిన వేంకటేశ్వర స్తుతులు ప్రకటింపబడినాయి. వేంకటేశ్వరస్వామికి అంకితం ఇవ్వబడ్డ రచనలు కూడ తెలుగు సాహిత్యంలో అనేకం కన్పిస్తాయి.

ఆంధ్రభోజుడైన శ్రీకృష్ణదేవరాయలు తన ఇష్టదైవముగా చెప్పుకొని తన ప్రబంధం ఆముక్తమాల్యదను శ్రీకాకుళాంధ్ర దేవుని ప్రేరణతో వేంకటేశ్వరునికే అంకిత మిచ్చాడు. రాయసం వెంకటపతి రచించిన లక్ష్మీవిలాసం, గుళికల్లు వెంకటరమణ కవి కృతమైన కనకరంజిత శిఖామణి పరి

ణయం, వెలగపూడి వెంకనార్యుడు తెలుగులో రచించిన శ్రీకృష్ణకర్ణామృతం, మారేపల్లి వెంకటజోగి రచించిన తత్త్వదీపిక, గోపన మంత్రి కృత సింధుమతీ విలాసం, సిరిప్రగడ ధర్మయామాత్యుని నలచరిత్రం, చిత్రకవి రమణ కవి కృత సాంబవిలాసం, కృష్ణకవి ప్రణీతమైన శకుంతలా పరిణయం, తాళ్లపాక తిమ్మక్క రచించిన సుభద్రా కళ్యాణం, గణపవరపు వెంకటకవి కృత ప్రబంధరాజ వేంకటేశ్వర విలాసం, శ్రీవేంకటేశ్వరాంధ్ర నిఘంటువు; చల్లపల్లి వేంక టార్యుని 'శ్రీకృష్ణవిలాసం', టేకుమళ్ల రంగశాయి కృత సకలనీతి కథానిధానం మొదలైన కావ్యాలెన్నో వేంకటేశ్వరు నికి అంకితం ఇవ్వబడ్డాయి. అంకిత పద్యాలతో బాటు స్వామి ఘనతను కొనియాడే పద్యాలు కూడ వీటిలో చోటుచేసుకోవడం గమనార్హం వీరిలో కొందరు కవులు స్వప్నంలో సాక్షాత్కరించిన వేంకటేశ్వరుని ప్రేరణతో కావ్యాలు వ్రాసికొన్నట్లు చెప్పుకోవడం విశేషం.

ఆ తరువాత స్వామివారికి సంబంధించిన ఎన్నో లఘుకృతులు తెలుగు సాహిత్యంలో కనిపిస్తాయి. కీర్తిశేషులు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు స్వామికి సంబంధించిన శతకాలు, స్తవాలు మొదలైన పందొమ్మిది లఘుకృతులను సేకరించి తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురణ క్రింద ''శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు'' అను పేర ప్రకటించారు. వీటిలో కొన్ని అసంపూర్ణాలు; కొన్ని అజ్ఞాత కర్తృకాలు. ఈ లఘుకృతులలో కొన్ని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వేంకటేశ్వరుని మహిమను, మాహాత్మ్యాన్ని వేనోళ్ల వినుతిస్తు న్నాయి. శ్రీ లక్ష్మీ వేంకటేశ్వరుల వివాహం ఇతివృత్తంగా తరిగొండ వెంగమాంబ రచించిన 'రమా పరిణయము' ఈ లఘుకృతులలో ఒకటి. దీంట్లో స్వామివారి పెండ్లి వేడుకలు, విందు ముచ్చట్లు అతిసుందరంగా వర్ణించబడ్డాయి.

వేంకటాచల విహార శతకంలో 17 వ శతాబ్ది ఉత్తరార్ధంలో మహమ్మదీయులు తిరుపతి ప్రాంతంలో జరిపిన దండయా త్రలు, చేసిన దురాగతాలు, సృష్టించిన కల్లోలం అన్యాపదే శంగా వర్ణింపబడ్డాయి. ఈ శతకం అజ్ఞాత కర్తృకం.

చిక్కదేవరాయలు పరిపాలించిన మైసూరు రాజ్యంలో అంతర్భాగం అయిన వామలూరులో వేంకటేశ్వరస్వామి వెలసి దివ్యవైభవాలు పొందడం వస్తువుగా ప్రసన్న వేంకటే శ్వర మంజరి అనే లఘుకృతి వెలసింది. దీని కర్తపేరు తెలియడం లేదు.

అద్వైత వేదాంత ప్రతిపాదకంగా వేంకటేశ్వరుని స్తుతిస్తూ చేసిన రచన 'శ్రీవేంకటేశ్వర పంచచామరములు'. ఇది నామయోగి కృతం. ఇంకా ఇందు వెచ్చాధర్మపురి కృత వేంకటరమణ శతకం, ధర్మపురి వెంకటశాస్త్రిగారి రచనయగు వేంకటేశ్వర శతకం, వేంకటాచలధామ తారావళి; గణపవరపు వేంకటేశ్వర కవికృత వేంకటశైల నాయక శతకం, ప్రే(హే?) మాది రంగేంద్రుని వేంకటేశ్వర దండకము; అజ్ఞాత కర్తృకాలైన పంకజ భవాండేశ శతకం, వేంకటాచలపతి శతకం, వేంకటశైలనాయక శతకం, వేంకటాచలేశ శతకం మేల్నాటి వేంకటశతకం, వేంకటనగాధ్యక్ష శతకం, శ్రీ వేంకటేశ్వర కల్యాణ గేయరచన, అలమేల్మంగాస్తవం, వేంకటేశ్వర దండకం, వేంకటేశ్వర పంచకం ఈ లఘుకృతులలో ప్రకటింపబడ్డాయి.

వేంకటేశ్వర స్వామిపై రచింపబడ్డ శతకాలలో క్రీ.శ.1600 తరువాతి కాలపువాడైన ఊడిమూడి సూరపరాజు 'శ్రీ వేంకటేశ శతకం'; క్రీ.శ.1800 సం. ప్రాంతపు వారగు కృష్ణాతీర నివాసి నల్లాన్‌చక్రవర్తుల వెంకటాచార్యులు రచిత తిరుమలగిరి వేంకటేశ శతకం, పత్రి రమణప్ప కవికృత వేంకటరమణ శతకం; క్రీ.శ.1850 సంవత్సర ప్రాంతపువా రగు మంచెళ్ల కృష్ణకవి 'వేంకటనగాధిప శతకం', భుజిమెళ్ల భగవచ్ఛాస్త్రికృత తిరుమల శ్రీ వేంకటేశ్వర శతకం; క్రీ.శ.1880 సంవత్సర ప్రాంతపు వాడగు కేశవదాసు రచిత సప్తగిరీశ్వర శతకం; పుష్పగిరి తిమ్మన శేషశైల విహారశతకం, రత్నాంబ రచిత వేంకటరమణ శతకం, వెచ్చాధర్మపురి వేంకటరమణ శతకం, ధర్మపురి వేంకటశాస్త్రిగారి వేంకటే శ్వర శతకం మొదలైనవి చెప్పుకోదగ్గవి. స్వామిమీద రచింపబడ్డ శతకాలలో కొందరు క్షేత్ర ప్రాధాన్యమును వివరించగా, కొందరు స్వామిని స్తుతించారు. మరికొందరు పద్మావతీ వేంకటేశ్వరులను స్తుతించారు. మరికొందరు స్వామివారి దివ్యలీలలను కొనియాడారు.

తెలుగులో వేంకటేశ్వరాత్మకంగా వెలసిన మాహాత్మ్య గ్రంథాలు అనేకం. వాటిలో మొదట పేర్కొనదగినది లింగము గుంట రామకవికృత వేంకట మాహాత్మ్యం. ఇది నేడు అలభ్యం. 18 వ శతాబ్దపు కవి అల్లమరాజు రంగధామ కవికృత నారాయణాచల మాహాత్మ్యం, తరిగొండ వెంగ మాంబ రచించిన శ్రీ వేంకటాచల మాహాత్మ్యం, శిష్టు కృష్ణమూర్తిగారి వేంకటాచల మాహాత్మ్యం, ఊటాయతిరాజా వచనంలో రచించిన శ్రీ వేంకటాచల మాహాత్మ్య మొదలైనవా నిని ప్రముఖంగా చెప్పుకోవచ్చును. తెలుగులో మాహాత్మ్యకా వ్యాలు పురాణేతిహాసాలలోని మాహాత్మ్య వృత్తాంతాలని ఆధారంగా చేసుకొని ఒక కావ్యప్రక్రియగా అవతరించాయని చెప్పవచ్చు.

దేశి ప్రక్రియలలో దేశవాసుల ఆదరాభిమానాలు చూర

గొన్న ప్రక్రియ యక్షగానం. శ్రీనాథుని కాలంలోనే దీని ప్రస్తావన కనిపించినా కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయంలో ప్రారంభరూపం సంతరించుకొని దక్షిణాంధ్ర యుగంలో ఇది పరిపూర్ణవికాసం చెందింది. శ్రవ్య దృశ్యకావ్యాల సమ్మిళిత రూపమైన ఈ ప్రక్రియ వేంకటేశ్వర సాహిత్యానికి కూడ తనలో స్థానం కల్పించింది. ఓబయ మంత్రి రచించిన గరుడాచల విలాసం, బద్ది శ్రీనివాసామాత్యుని అలమేలుమంగా విలాసం, యాదవదాసుని గరుడాచల విలాసం; అజ్ఞాత కర్తృకమైన అలమేలుమంగా విలాసం, దళవాయి తిమ్మప్ప రచిత ప్రసన్న వేంకటేశ్వర విలాసం మొదలైన యక్షగానాలు ఈ కోవలో పేర్కొన దగినవి.

పద్మావతీ శ్రీనివాసుల పరిణయ గాథకు సంబంధించి, వేంకటేశ్వర మాహాత్మ్యానికి సంబంధించి అనేక నాటకాలు, హరికథలు, బుర్రకథలు, వచనగ్రంథాలు, పాటలు ఈ శతాబ్దంలో వెలువడ్డాయి; వెలువడుతున్నాయి.

పురాణాలనుంచి తీసుకొన్న ఇతివృత్తాన్ని స్వకపోల కల్పనలతో పెంచి పెద్దచేసి కవి తన శక్తి సామర్థ్యాలని ప్రదర్శించేందుకు అనువైన ప్రక్రియ ప్రబంధం. తెలుగులోని ప్రబంధ సాహిత్యం విలక్షణం, విస్తృతం. మూడు లోకాలూ ఆక్రమించిన ఏడుకొండలవాడు ప్రబంధసాహిత్యంలోనూ ప్రవేశించాడు.

17వ శతాబ్దానికి చెందిన శ్రేష్ఠలూరి వేంకటార్యుని 'శ్రీనివాసవిలాససేవధి'[1] ప్రౌఢ ద్విపద ప్రబంధం. వేంకటేశ్వరుని సాహిత్యంలో తలమానికంగా ఇది కనిపిస్తుంది. దీన్ని గురించి, దీని రచయిత గురించి శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు వెలిబుచ్చిన అభిప్రాయం ఇక్కడ సంస్మరణీయం: ''వేంకటాచల పతియగు శ్రీనివాసుని కథలను ఆ వేంకటాచలము యొక్క మాహాత్మ్యకథనముతో మేళవించి, తెలుగున ద్విపదకావ్యముగ రచించిన వారిలో శ్రీ శ్రేష్ఠలూరి వేంకటార్యుడను కవియే మొదటివాడుగా గనబడుచున్నాడు''. వరాహ, వామన, బ్రహ్మాండ, పద్మ, గరుడ, స్కాంద, మార్కండేయ పురాణములలో చిక్కుపడియున్న శ్రీనివాసుని కథలలో పూర్వోత్తర విరోధములను సవరించి ఈ కృతిని వెలువరించితినని రచయితే చెప్పుకొన్నాడు. ఈ ప్రబంధాన్ని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారే వచనంచేసి ఉండడం ఈ సందర్భంగా చెప్పుకోదగ్గ అంశం.

ఆ తరువాత చెప్పుకోదగ్గది గణపవరపు వేంకటకవి 'ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసం'. ఆకాశరాజు కూతురు నాంచారుదేవితో స్వామివారి వివాహం దీనిలోని ఇతివృత్తం. కవి వేంకటేశ్వరుని మహిమలకు సంబంధించిన విషయాలను ఇందులో వివరించాడు.

చళ్లపిళ్ల నరసకవిచే రచింపబడిన 'వేంకటేశ్వర విలాసం' స్వామివిహారలీలలు, వైభవాలు వర్ణింపబడిన రసవత్ ప్రబంధం. కొండలరాయుడైన వెంకటేశుడు చెంచురూప ధారి; నాయిక పద్మిని; స్వామి చెంచుకన్నెను వివాహమాడడం దీనిలోని ఇతివృత్తం.

ఈ ప్రబంధాలన్నిటిలోనూ వస్తువు దాదాపు సమానంగానే కన్పిస్తుంది. విష్ణువు వేంకటేశ్వరుడుగా శేషాద్రిమీద నెలకొనడం, పద్మావతితో ఆయన వివాహం వీటిలో ప్రధానాంశాలు. తిరుమల దాని పరిసర ప్రాంతాలను వర్ణించేందుకు కవులు ఈ ప్రబంధాలను చక్కగా వినియోగించుకున్నారు.

15-16 శతాబ్దకాలంలో జీవించిన తాళ్లపాకవారిదే వేంకటేశ్వర సాహిత్యంలో అగ్రస్థానం. తక్కిన వేంకటేశ్వర సాహిత్యం అంతా ఒక ఎత్తు అయితే, తాళ్లపాకవారి సాహిత్యం మాత్రమే ఒక ఎత్తు. తమ ఇలవేల్పుగా, కులవేల్పుగా కొండల రాయడినే కొలుస్తూవచ్చిన తాళ్లపాకవారు స్వామి సన్నిధినే తమ జీవితాలు వెళ్లబుచ్చారు. అతని సేవకే అంకితమయ్యారు. వారి సాహిత్యమంతా వేంకటేశ్వరునికే అంకితమిచ్చి చరితార్థులయ్యారు. తాళ్లపాక అన్నమాచార్యుడు, పెద తిరుమలాచార్యుడు, చిన్న తిరుమాలాచార్యుడు కూడ స్వామి సన్నిధిలో కీర్తనలు పాడి తరించడమేకాక మానవ జాతికి తరణోపాయం చూపారు. తాళ్లపాక వారి సాహిత్యాన్ని ప్రస్తావించేటప్పుడు స్వామికి సంబంధించి వారు వేయించిన శాసనాలు కూడ పేర్కొనడం సమంజసం. వీరు స్వామికైంకర్యాలకు సంబంధించి, నిర్మాణాలకు సంబంధించి, ఉత్సవాదుల ఏర్పాటుకు సంబంధించి అనేక శాసనాలు వేయించారు. వీటన్నిటిని పేర్కొనడం అంటే ఒక గ్రంథమే అవుతుంది కాబట్టి స్థలాభావంవల్ల వాటిని గూర్చి సమగ్రంగా పేర్కొనటం లేదు.

తాళ్లపాక సాహిత్యానికి అన్నమాచార్యుడే ఆద్యుడు. ఈయన స్వామిమీద ముప్పైరెండువేల సంకీర్తనలను వచించి గానం చేశాడు. వీటిలో తెలుగు సంకీర్తనలే కాకుండా సంస్కృత కీర్తనలు కూడ వున్నాయి. వస్తువును బట్టి వీనిని అధ్యాత్మ, శృంగార సంకీర్తనలని వర్గీకరించడం జరిగింది. అన్నమయ్య ఏ దేవుని ఉద్దేశించి సంకీర్తన రచించినా అది చివరకు వేంకటేశ్వరుని పరంగానే ముగుస్తుంది. ఇతని అధ్యాత్మ కీర్తనలు భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధకాలు. విష్ణు వినుతి విలసితాలు; శృంగార సంకీర్తనలు అలమేలు మంగా వేంకటేశ్వరుల ప్రణయ ప్రతిపాదకాలు, ఆ దివ్యదంపతుల రతిక్రీడా రహస్యబోధకాలు. సంకీర్తనలను రాగిరేకుల మీద చెక్కించి తిరుమల శ్రీవారి ఆలయంలోని 'సంకీర్తన

భండారంలో భద్రపరచడం జరిగింది. 'రాగం విలువ తెలియని జాతి' రాగిని కరగించి అమ్మివేయడం వల్ల అన్నమయ్య సంకీర్తనల్లో అధికశాతం పోగొట్టుకొన్నాము. లభించిన సంకీర్తనలను తిరుమల తిరుపతి దేవస్థానంవారు సంపుటాలుగా ముద్రించారు.

అన్నమయ్య సంకీర్తనలనే కాక ''శృంగార మంజరి'' అనే ద్విపద కావ్యం రచించాడు. దీనిలో అలమేలుమంగా శ్రీనివాసుల ప్రణయగాథ వస్తువు. అన్నమయ్య రచించినట్లు చెప్పబడే 12 శతకాలలో 'వేంకటేశ్వరా' అనే మకుటంతో అలమేలుమంగను కొనియాడుతూ చెప్పిన శతకం ఒకటి లభించింది. దానిలోని పద్యాలు హృద్యాలు. ఇవిగాక అన్నమయ్య 'వేంకటాచల మాహాత్మ్యం రచించినట్లు ప్రతీతి. అయితే ఇపుడు ఇది అలభ్యం.

తాళ్లపాక అన్నమాచార్యుని కుమారుడు పెదతిరుమలాచార్యుడు. ఇతడు తండ్రి ఆనతిని అనుసరించి ప్రతిదినం ఒక సంకీర్తన రచించి శ్రీ వేంకటేశ్వరస్వామికి సమర్పించేవాడు. తన తండ్రి, తానూ రచించిన సంకీర్తనలను రాగిరేకులపై వ్రాయించి 'సంకీర్తన భండారం' లో భద్రపరచాడు. శ్రీరంగం వంటి దివ్యదేశాల్ని దర్శించి ఆయాచోట్ల తమ వేంకటేశ్వర సారస్వతానికి స్థానం, ప్రచారం కల్పించాడు. ఈయన రచించిన సంకీర్తనల్లో అధ్యాత్మ సంకీర్తనలు 463; శృంగారసంకీర్తనలు 544 మాత్రమే లభించాయి. ఇవన్నీ, భావంలోనూ, భాషలోనూ అన్నమయ్యకృతులను అచ్చటంగా పుణికిపుచ్చుకొన్న గేయకుసుమాలు. ఈయన రచించిన 'చక్రవాళ మంజరి' లో వేంకటేశ్వరుని వలచిన నాయిక విరహావస్థ, వేంకటేశ్వరుడు ఆమెను అనుగ్రహించడం వర్ణింపబడ్డాయి. ఈయన రచించిన 'నీతి సీస శతకం' నీతులపుట్ట. అందలి ప్రతి పద్యం సూక్తులకు నిలయం. మకుటాన్ని బట్టి ఇది వేంకటేశ్వర శతకమైనా ఇందలి నీతుల ప్రాశస్త్యాన్ని బట్టి ఇది 'నీతి సీస శతకం'గా ప్రఖ్యాతి గాంచింది. ఈయన మరో రచన 'వేంకటేశ్వరోదాహరణ'. దీంట్లో అక్కడక్కడ వేంకటేశ్వరుని మహిమలు హృద్యంగా కొనియాడబడ్డాయి. పెద తిరుమలయ్య రచన 'సుదర్శన రగడ', మహావిష్ణువుని పంచాయుధాలలో అత్యంత ముఖ్యమైనదీ, తిరువేంకటపతి నిత్యం ధరించేదీ అయిన సుదర్శన చక్రం యొక్క స్తుతి. నూట ఎనిమిది పాదాలలో చక్రానికి సంబంధించిన ఒక్కొక్క విశేషణం ఉల్లేఖింపబడింది. సుదర్శన చక్రం యొక్క వివిధ కోణాలు, స్వరూప, తేజోవిశేషాలు, కావించిన కార్యాలు ఇందులో వర్ణింపబడ్డాయి. 'శృంగార దండకం' కూడా వేంకటేశ్వరుడు ఒక నాయికతో జరిపిన ప్రణయ వృత్తాంతమే. స్తుత్యాత్మకమైన దండకం శృంగార కథాత్మకంగా ఇక్కడ ప్రయుక్తం కావడం విశేషం. వేంకటేశ్వర వచనాలనీ, వేంకటేశ్వర విన్నపాలనీ పెదతిరుమలాచార్యుని 'వైరాగ్యవచన మాలికా గీతాల'కి నామాంతరాలు. ఇవి నూట అరవై ఆరు లభించాయి. భక్తిరస పరిప్లుతమైన హృదయాన్నుండి పెల్లుబికిన కమనీయ కవితామృత తరంగాలు ఇవి. ప్రతివచనంచివర వేంకటేశ్వర మకుటం కన్పిస్తుంది. ఈతని 'శృంగార వృత్తపద్యాల శతకం' చంపకోత్పల శార్దూల మత్తేభ వృత్తాలలో రచింపబడిన నూటమూడు పద్యాలతో ఉంది. వేంకటేశ్వరుని దక్షిణ నాయకత్వం ఇందులో అనేకవిధాలుగా వర్ణింపబడింది. ఈతని 'మేలుకొలుపు ద్విపద'లో దేవతల మేలుకొలుపుతో స్వామి మేలుకొని, దినచర్య పూర్తిచేసుకొని కొలువుండి కొలిచేవారిని అనుగ్రహించటం వస్తువు. ఈ ద్విపదలో కృష్ణావతారానికి సంబంధించిన గాథలు, ఆ లీలామానుషుని పరాక్రమహేలలు, అనుగ్రహమహిమలు, శృంగార లీలలు వర్ణింపబడ్డాయి.

తాళ్లపాక పెదతిరుమలాచార్యుని జ్యేష్ఠ కుమారుడు చిన తిరుమలాచార్యుడు. ఈయన రచించిన అధ్యాత్మ సంకీర్తనలు 60; శృంగార సంకీర్తనలు 119 లభించాయి.

తాళ్లపాక పెదతిరుమలాచార్యుని చిన్నకుమారుడు తిరువెంగళ నాథుడు. చిన్నన్న అనికూడ వ్యవహారనామం. ఇతడు తాతగారి కథను తెలిపే 'అన్నమాచార్య జీవిత చరిత్ర' లో తిరుమల వైభవాన్ని, తిరుమలేశుని గరిమను కొనియాడాడు. స్వామిభక్తులైన ఆళ్వార్ల జీవితాలను తెలిపే పరమయోగి విలాసంలో స్వామికి సంబంధించిన ఆళ్వార్ల పాశురాలను తెనిగించి వ్రాసి స్వామిపట్ల తనకున్న భక్తిని వెల్లడించుకొన్నాడు.

అన్నమయ్య దౌహిత్రుడు రేవణూరి వేంకటార్యులు శ్రీ వేంకటేశ్వర పాదపద్మాల మీద ఉంచే శ్రీ పాదరేణు విశిష్టతను తెలిపే శ్రీ పాదరేణు మాహాత్మ్యం రచించాడు.

మనసా వాచా కర్మణా తమను వేంకటేశ్వరునికే సమర్పించుకొన్న తాళ్లపాకవారు తమ హృదయాల్లోనిండి నెలకొన్న స్వామిని తమ సాహిత్యంలో ప్రతిష్ఠించడం అతిశయంకాదు. ఈ కారణంవల్లనే వేంకటేశ్వర సాహిత్యంలో తాళ్లపాకవారికి ప్రత్యేకస్థానం ఉంది. దానాల వల్ల తమకు సంక్రమించిన ఆస్తిని కూడ స్వామికైంకర్యాలకే సమర్పించి కృతార్థులయిన వారు తాళ్లపాకవారు.

ఆంధ్రసాహిత్య చరిత్ర తొలిదశలో శివకవుల ప్రభావం ఎక్కువగా ఉండడం వల్లనో, మరి ఎందువల్లనో వేంకటేశ్వర సాహిత్యం వెలువడినట్లు కనిపించదు. కృష్ణదేవరాయల కాలంనుంచే వేంకటేశ్వర సాహిత్యం విరివిగా వెలువడింది.

# భూషణుని భాషాభూషణం

శ్రీ యామిజాల పద్మనాభస్వామి

భూషణుడంటే వింతగా తోస్తుంది - ఎవరా? అని, ఆ వింత తెలియని వారికి. ఆ అదృష్టవంతుడు కావ్యకళా భూషణుడు రామరాజ భూషణుడు. ఆపాతమధురం, ఆలోచ నామృతం అయిన సంగీతానికీ సాహిత్యానికీ సమన్వయం కలిగించి వసుచరిత్రకి భాషా భూషణ సౌభాగ్యం కలిగించిన శారదామూర్తి రామరాజ భూషణుడు.

'శ్రుతి హితం సంగీతం' 'శ్రుతిహితం + సాహిత్యం' - సంగీత + సాహిత్యాలకు ప్రధాన లక్షణం ఒకటే శ్రుతిహితం చెవికి ఇంపుగా ఉండడం - అని భావం. శ్రుతి, స్వరం, తాళం సంగీతానికి ప్రధానం. అర్థం, అర్థానికి తగిన పదం, పద ప్రయోగనైపుణ్యం సాహిత్యానికి ముఖ్య లక్షణం -

సంగీతానికి శ్రుతి శబ్దం రెండర్థాలు చెప్తుంది... 'శ్రుతి ర్మాతా లయః పితా', గానానికి శ్రుతి తల్లి లయ తండ్రి' ఆ రెండూ సరితూకంలో ఉండాలి. శ్రుతి తప్పితే గతి తప్పు తుంది. ఆ రెండూ అనురూపాలైతే ఆ గానం శ్రుతికి - చెవికి విందు అవుతుంది.

అలాగే సాహిత్యం శ్రవణ సుఖమై ఉండాలి. అది పదప్రయో గముపై ఆధారపడి ఉంటుంది. కాబట్టి సంగీత సాహిత్యాలు శ్రుతిహితములై ఉండాలని లాక్షణికులు నిర్వచించారు. ఈ రెండు ధర్మాలనూ సలక్షణంగా తన ప్రబంధంలో చూపించి రామరాజ భూషణుడు కావ్యకళా భూషణుడు అయాడు. నాకు తెలిసినంతవరకు ఉభయ ధర్మ నైపుణ్యం సంగ్రహించి ఉదాహ రణంగా ప్రదర్శిస్తాను.

వసుచరిత్రమునందు కథా నాయిక గిరిక. నాయకుడు వసురాజు. నాయికతండ్రి కోలాహలుడు - తల్లి శుక్తిమతి, చెలికత్తె మంజువాణి, సార్థక నామధేయ.

కూతురికి వీణ నేర్పించి వీణాగాన విదుషీమణిని చేశాడు. కోలాహలుడు ఆ పని చేశాడో లేదో గాని భూషణుడు చేశాడని గ్రహించాలి. వీణా వాదనకి సలక్షణమైన భవనం ఉండాలని భూషణుడు పద్యంలో సూచించాడు.

'వీణా వాదన వేళలన్ ఘుమ ఘుమా
విర్భూతినింపన్ జగ
త్ప్రాణా చంచలతైల శూన్య నవ
దీపశ్రేణికా పాదియై
రాణింపన్ ముఖలక్ష్మికిన్ ముకురమై
రంజిల్ల తేటట్టికిన్
మాణిక్యాయతనం బొనర్చెగిరి
ఆత్మశ్రీ ప్రభావంబునన్ త్వ.ఆ.

వీణపై పలికించే స్వరం ప్రతిధ్వనించాలి. దానివల్ల సుస్వరా పస్వర పద్ధతి తెలియాలి. అలాటి గోడలూ, పైకప్పు ఉండాలి. దానిలో కల కలలాడుతూ ఉండే దీపం ఉండాలి. కాని అఖండ జ్యోతియై వెలుగుతూ ఉండాలి. చీకటి కొంపలో గాన విద్య అభ్యసించ కూడదని గాంధర్వ శాస్త్ర మర్యాద. అలాటి భవనం మణులు పొదిగినది, స్వరం ప్రతిధ్వనించేది తన ముద్దుల పట్టికి నిర్మలమైన అద్దం లాగా ఉన్నది, తన ఆత్మసృష్టిగా కోలాహ లుడు కట్టించాడు.

'రసో వై సః స ఏవానందః, ఆనందో బ్రహ్మ' పంచేంద్రియా లను పరవశింపచేసేది రసం - అదే ఆనంద వాచ్యం. ఆ ఆనందమే బ్రహ్మ పదార్థం - ఈ శ్రౌతవాణిని గిరిక వీణానా దంలో భూషణుడు పొందికగా చెప్పిన తీరు:

'వీనుల విందై, అమృతపు సోనలపొందై
ఆమంద సుమచలదలినీ గానము క్రందై
ఆస్వన మానంద బ్రహ్మమైన -'

వీనుల విందు = శ్రుతిహితం - అమృతపునోనల పొందు- ఆపాత మధురం - అలినీగానము క్రందు - షట్పదీరూపం - కాగా ఆ స్వనం - ఆనందబ్రహ్మమయింది.

ఉద్యానవనములో కాంతలు గానం చేస్తూ ఉన్న సమయం. అది శిశిర వసంత సంధిసమయం - ఈ రహస్యం బాహాటంగా చెప్పక పద్యరూపాన ప్రకటించిన గడుసరికవి -

'అరిగా పంచమ మేవగించి నవలా
లవ్వేళ హిందోళవై
ఖరిసూపన్ పికజాతమాత్మరవభం
గవ్యాకులంబై వనీ
ధరనాలంబిత పల్లవ వ్రతవిధుల్
డాల్పన్ తదీయ ధ్వనిన్
సరిగా కైకొనియెన్ వసంతము మహో
సంపూర్ణ భావోన్నతిన్- (1-130)

రిషభ పంచమస్వరాలను విడిచి ఆకాంతలు పాడిన పాటకి ఆతోటలో ఉన్న కోకిలలు తమ స్వరం లేదని విచారించాయట. ఒకింత సమయం దాటగానే కలకంఠులు ఆలపించిన గానంలో

వాటిస్వరం వినిపించగా ఆనందించాయి.

'శిశిరస్య వసంతస్య సంధౌ హిందోళరాగకః'

శిశిరవసంత ఋతువుల సంధిలో పాడవలసినది హిందోళ రాగం. ఆలలనలు ఆసమయంలో రిషభపంచమాలు లేని రాగం హిందోళం పాడారన్నమాట. మరికొంత సేపయాక పాడినది వసంతం - రిషభగాంధార పంచమస్వరాల ఆరోహణ-అవరోహణలతో సంపూర్ణరాగం వసంత - వచ్చినది వసంతం ఋతువు.

వేరొక చోట గిరిక గానవైదుష్యాన్ని అపూర్వపద సమ్మేళ నతో చెప్పడం - భూషణుని సంగీత కళా రహస్య నిధిత్వము నకు ప్రబల సాక్ష్యం.

మంజువాణినోట మంజువాణీ విలాస వైఖరిగా చెప్పాడు:

**'పదమెత్తన్ కలహంసలీల, అధర**
**స్పందంబు సేయన్ శుభా**
**స్పదమౌరాగకదంబకంబు, శ్రుతి సూపన్**
**శ్రీవిలాసంబు కే**
**ల్గదలింపన్ సుకుమార పల్లవనవై**
**లాలక్ష్మి వీక్షింపష**
**ట్పదియుం బొల్చు; తరంబె కన్నెగొని**
**యాడన్ గేయ వాక్ప్రౌఢిమన్ (3-59)**

పదం కలహంసరాగంలో పాడుతుంది. పెదవుల కదలికలో రాగ కదంబకం వినవస్తుంది. శ్రుతి వేసిందా శ్రీరాగం వినవ స్తుంది. (శ్రుతి తప్పని శ్రీ రాగాలాపన) వీణపై వ్రేలు నడిపితే ఏల - పలుకుతుంది. చూపులో షట్పది ప్రత్యక్ష మాతుంది.

దీనిలో షట్పదిని గూర్చి ఎవ్వరూ వివరించలేదు. నేను వివరిస్తాను.

**గీతం పల్లవి, అనుపల్లవి – చరణం కలిసి**
**ఉంటుంది. మొత్తం – ఒకే రాగం – ఒకే తాళం –**
**ఇది సామాన్యం –**
'షట్పది' - దీనికి విరుద్ధం-
పల్లవి ఒక గతి - అనుపల్లవి వేరొక గతి-
చరణం నాలుగు భాగాలూ వేర్వేర నాలుగు గతులు

**అది** షట్పది. నాట్యశాస్త్రప్రవీణులు దీనిని ప్రదర్శించాలి. కష్టసాధ్యమైనది యీ పద్ధతి. దీనిని సూచిస్తున్నాడు భూష ణుడు ఈ పద్యంలో.

ఇక - 'ఏల' అనేది. శుద్ధ సూడ ప్రబంధం - - - ఏల, రాగకదంబకం - అనేవి ఏ బాలమురళీకృష్ణ వంటి గాయక మౌళియో ఆలాపించవలసేవి ఏదో అయిందనిపంచేవారు ఖసూచులే అవుతారు.

గిరిక విరహమును వర్ణిస్తూ ఆ కొమిరె బాధను కాంభోజిలో వివరించాడు.

వెన్నెలను భరించలేక గిరిక విలపించింది. కాంభోజీరాగ ములో - అయితే దానిని వెటకారంగా తెనాలికవి వెక్కిరించా డని చాటువులాటి మాట వినవస్తూంది.

**అల్లసాని పెద్దన అలా ఇలా ఏడిచాడు**
**ముక్కు తిమ్మన ముద్దు ముద్దుగా ఏడిచాడు.**
**భట్టుమూర్తి బావురుమని ఏడిచాడు** – అని.

కాంభోజీ రాగం ఉపయోగించాడని - అనడంలో - అది గాంభీర్యానికి సూచన - రాగాలలో 'గంభీరమైన రాగము కాంభోజే'' అని ప్రశంసించాడు చౌడకవి.

ఇలాగే లయానుగుణంగా శబ్ద ప్రయోగం చేయడంలో భూషణుడు ఘటికుడు. ఆ పద్ధతి సీస పద్యాలలో ఎక్కువగా కనిపిస్తుంది.

**అతికాంత సలతాంత లతికాంత రనితాంత**
**రతికాంత రణతాంత సుతనుకాంతము'**

**'ఏపారు పాదరింఢ్ల నా పాటలాశోక**
**దీపార్చి కనక కలాప మరసె'–**

**'ఒక చాయ ననపాయ పికగేయ సముదాయ**
**మొకసీమ నానామయూరనినదము'**

**'సలయాహత లతాకిసలీయాగము లయాగ**
**నిలయానిలున కూర్పు తెలుపదలచు'**

**'తలిరు బ్రాయము వాని వలరాజు నలరాజు**
**నలరాజు దెగడు సోయగము వాని'**

ఇలా చెప్పాలంటే చాలా పద్యాలలో లయానుగుణ్యం కనిపిస్తుంది. ఈ క్రింది కందపద్యంలో మృదంగ ధ్వని వినిపి స్తుంది.

**ఉ రిపు విద్ధతపన**
**ప తి కరిభవన దవనిపటదంబుధి సం**
**ప ణ సముద్ధరణ స**
**మి రణ రజోవ్రజోద్యదిభమదస్ఫృతికిన్**

'దిద్ధిమితక తద్ధిమితక' - అని ఆరంభించి శబ్దం వినిపించ వచ్చు.

విశేషించి చెప్పవలసిన ఇంకొక విషయం వ్రాసి యీ వ్యాసం ముగిస్తాను.

నాయికా నాయకుల పెండ్లి సమయంలో సుమంగలులు, 'సింధు కన్యకా ప్రకట వివాహగీతికలు' పాడారు. లక్ష్మీనారాయ ణులకు సంబంధించిన పెళ్లి పాటలు పాడడం సంప్రదాయం. సింధుకన్యక = లక్ష్మీదేవి - ఇక్కడ సైంధవి - అనే రాగము సూచితం. దానికి 'నిషాదం ఉండదు - అంటే తారస్థాయిని (పై స్థాయిని) ఆ గీతం పాడరాదని భావం - ఆ రహస్యం సామాన్య ప్రబంధకర్తలకు తెలియదు. భూషణుడు సంగీత కళారహస్యనిధి కనుక యీ ప్రధాన విషయం చెప్పి తన ప్రజ్ఞను నిరాక్షేపంగా ప్రదర్శించాడు. ఆ విధంగా వసుచరిత్ర భాషా భూషణం అయింది.

# రుద్రకవి కవితా వైశిష్ట్యము

శ్రీ ఆర్. అనంత పద్మనాభరావు

"సిరులు మించిన పసిడి బంగరు
జిలుగు దుప్పటి జారగా
చరణపద్మము మీద దేహము
చంద్రకాంతులు దేరగా
మురువు చూపుచు వచ్చినావో
మోహనాకృతి మీరగా
గరుడవాహన! దనుజమర్దన!
కందుకూరి జనార్దనా!"

ఈ పద్యం చాలా మంది పండితుల నాల్కలపై నర్తిస్తున్నంతకాలం రుద్రకవీ, ఆయన రచనలూ అజరామరం.

కందుకూరి రుద్రకవి ఏ కాలం వాడు? ఆయన కృష్ణదేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజ కవులలో ఒకడా? కాదా? అనే అంశంపై వాదోపవాదాలున్నాయి. ముగ్గురు రుద్రకవు లున్నారని సమగ్రాంధ్ర సాహిత్య చరిత్రలో ఆరుద్ర అభిప్రాయం! ఈ వివరణలు అక్కరలేదు.

ఒకప్పటి నెల్లూరు జిల్లా యిప్పటి ప్రకాశం జిల్లా కందుకూరు తాలూకా చింతలపాలెం గ్రామంలో విశ్వ బ్రాహ్మణ కుటుంబంలో రుద్రకవి జన్మించారు. చింతల పాలెం గ్రామాన్ని మల్కిభరాముడు దానమిచ్చిన శాసనం యిందుకు సాక్ష్యం.

"అద్యాశీతి చతుశ్శతాధిక సహస్రం
వై శకాబ్దాః గతాః
తస్మిన్ శ్రీ జయవత్సరే జయ తిథౌ
మాసే చ మాఘే తథా,
పంచమ్యాం ద్వయతింత్రిణీ జనపదం
రుద్రస్య విద్యత్కవేః
ప్రీత్యా శ్రీఇభరామ భూపతి రదాత్
క్షోణీధరాఖండలః"

ఇందులో శాలివాహన శక సంవత్సరం 1480, క్రీ.శ.1558 కి సరిపడుతుంది. కాని, జయనామ సంవత్సరం సరిపోవడం లేదు. కాళయుక్తి నామసంవత్సరమది. ద్వయతింత్రిణీ అంటే రెంటచింతల అవుతుందిగానీ, చింతలపాలెంకాదు. మల్కిభరాముని రాజ్యకాలంలో చారిత్రకంగా చూస్తే జయ సంవత్సరం రానే రాలేదు. ఈ శాసనంలో పొంతన కుదరని విషయాలు వదిలేద్దాం

అష్ట దిగ్గజములలో ఒకడైన రుద్రకవియే మల్కిభరాముని దానశాసనం స్వీకరించాడని చెప్పవచ్చు. క్రీ శ 1480 ప్రాంతంలో జన్మించిన రుద్రకవి 1520 ప్రాంతాలలో రాచమంగలి కొండోజీ సహాయంతో రాయల ఆస్థాన ప్రవేశం చేశాడు. కృష్ణరాయలు కందుకూరు సందర్శించినట్లు చారిత్ర కాధారా లున్నాయి ఆ సమయంలో రుద్రకవి రాయ సందర్శనం చేసి వుండవచ్చు రాయల మరణానంతరం ఆశ్రయం లభింపక మల్కిభరాముని చెంత చేరివుండవచ్చు. 1558 ప్రాంతాలలో చింతలపాలెం మల్కిభరాముని ద్వారా అగ్రహారంగా పొంది 1560 వరకు జీవించాడు.

రుద్రకవి తిట్టుకవిత్వం చెప్పినట్లు చాటువులు చెప్పున్నాయి. మనకు లభించే గ్రంథాలలో నిరంకుశోపాఖ్యాన ప్రబంధము, సుగ్రీవవిజయ యక్షగానము, జనార్దనాష్టకము రుద్రకవిరచనలని ఘంటాపథంగా చెప్పవచ్చు. రాష్ట్రౌఢవంశ మహాకావ్యమనే 20 సర్గల సంస్కృతకావ్యం రుద్రకవి వ్రాసిందని స్వర్ణ సుబ్రమణ్య కవి ప్రకటించారు కాని అంతరంగ సాక్ష్యాధారాలు భిన్నంగా ఉన్నాయి కందుకూరి రుద్రకవి తండ్రి పెదలింగన. తల్లి చెన్నమాంబ ఈ రుద్రకవి తండ్రి అనంతభట్టు.

## నిరంకుశోపాఖ్యానం

నిరంకుశోపాఖ్యానం సాంఘిక ప్రబంధం. కథా సరిత్సాగర ములోని ఒకానొక ఉపకథను స్వీకరించి, ఔచిత్యంకోసం అక్కడక్కడా కొన్ని మార్పులు చేసి స్వకపోల కల్పిత ప్రబంధంగా రచించాడు. మూలకథకు రుద్రకవి ఎన్నో మార్పులు చేశాడు. రింరాకరాళుడు అనేపేరు ప్రబంధ నాయకుడికి బాగు లేదని నిరంకుశుడని నామకరణం చేశాడు. కథా సరిత్సాగరాన్ని మూలంగా తీసుకొని మాదయగారి మల్లన రాజశేఖర చరిత్రము, జక్కన విక్రమార్క చరిత్రము,

వెన్నెలకంటి అన్నయ షోడశకుమార చరిత్రమ్ము తెలుగులో కావ్యాలుగా వెలిశాయి. ప్రబంధోచితమైన మార్పులతో రుద్రకవి నిరంకుశుణ్ణి తెలుగుసాహిత్యంలో చిరస్థాయిగా నిలిపాడు.

నామకరణాన్ని కవి చమత్కారంగా చెప్పాడు.

''అశనప్రగ్రహ దానధర్మ సురశర్మా
కర్మ సంపన్న పం
చశరాకారుడు నీకుమారుడు వచ
స్సంభార దుర్వారుడై
విశదానర్గళశేముషీ మహిమచే
వేదాది విద్యా నిరం
కుశు డౌనన్న నిరంకుశుండె
యనియెన్ క్షోణీసురుండాఖ్యయున్''

కావ్యావతారికలో రుద్రకవి స్వప్నవృత్తాంతం కల్పించాడు. కందుకూరి సోమేశ్వరస్వామి కంకితంగా ౹ ంథం వ్రాయ సంకల్పించినపుడు తిక్కనకు వలె రుద్రకవి స్వామి కలలో కన్పించాడు.

'వచ్చి కృతికన్యకా సముద్వాహమునకు
శుల్కమున నాయురారోగ్య సుప్రసిద్ధు
లిత్తునని యల్లుడగుటకు నిచ్చగించె
నింతకంటెను సౌభాగ్యమెందు గలదె
అని సంబరపడ్డాడు కవి.

'సంసార దురిత తాపములకు తొలగెడి తీరును' తిక్కన ప్రార్థించాడు. '(శ్రీ)కైవల్యపదంబు చేరుటకునై' అని పోతన వేడుకొన్నాడు. రుద్రకవి ఆయురారోగ్య సుప్రసిద్ధులు కోరాడు.

'ఏ నిన్ను మామ యనియెడు దానికి తగ నిమ్ము భారతీ కన్యక' అని తిక్కన కృతిపతిచే పలికిస్తే రుద్రకవి కావ్యానికి కన్యాత్వం ఆరోపించాడు.

''కోమల వర్ణధామయును
కోవిద సంస్తవనీయ లక్షణ
స్తోమఫలాభిరామయును
శుంభదలంకరణ ప్రసాధన
క్షేమయు నప్రతర్క్యగుణ
సీమయునైన మదీయ కావ్య క
న్యామణి నిచ్చి మంచుమల
యల్లుని నల్లునిగా నొనర్చెదన్''

నన్నయగారు 'సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థ యుక్తి' అన్న పద్యానికీ దీనికీ సామ్యం వుంది. నన్నయ అక్షర రమ్యతనే రుద్రకవి కోమలవర్ణధామంగా పేర్కొన్నాడు. నాలుగాశ్వాసాల ప్రబంధంలో అష్టాదశ వర్ణనలు జోడించబడ్డాయి. కాళీవరప్రసాద లబ్ధ వర్ణనీయ కవిత్వతత్త్వ ధౌరేయుడననీ, పండితమ్మన్యతరాజేయుడననీ, సకల విద్వజ్జన విధేయుడననీ కవి స్వాభిమానంగా చెప్పుకొన్నాడు.

బాల్య చాపలము పెంపున స్వామికి ఈ కథ విన్నవించితినని రుద్రకవి వినయవినమిత గాత్రుడై పలికినాడు. స్థూలంగా నాలుగాశ్వాసాలలో కథ యిది:

మణిపుర మనే పట్టణంలో సురశర్మ అనే నైష్ఠిక బ్రాహ్మణుడు పుత్రుల లేమికి చింతిస్తున్నాడు.

'విప్రు డింటికి వచ్చిన విమలభక్తి
నన్నపానాదులొసగి నెయ్యమున జేరి
యయ్యా! పుత్రులు మీ కెందఱనుచొకావి
యితర మేమియు నడుగ డాక్షితిసురుండు'

మీ రేయేదేశములన్ చరించితిరని ప్రవరుడు అడిగినట్లు గాక, సురశర్మ సంతతిని గూర్చి ప్రశ్నించాడు. ఒకానొకనాడు విష్ణుమూర్తి స్వప్నంలో సురశర్మకు కనిపించి నీకొకపుత్రు డార్య మహనీయచరిత్రుడు గల్గునంచు లక్ష్మీకుచగంధలిప్త మగు చేత ఫలంబొక టిచ్చినాడు. ఇక్కడ కవి సాభిప్రాయంగా ఈ పదాలను వాడినాడు. పుట్టబోయే నిరంకుశుడు కామవ్యామోహితుడు. అందుకే స్వామివారి చేయి లక్ష్మీ కుచగంధ లిప్తము. మొదటి ఆశ్వాసంలో నిరంకుశునికి వివాహమైంది.

చదివించెం ద్రయి వాక్యముల్ గఱపె
శాస్త్రంబుల్ పఠింపించె సా
మ్యదవిష్ణ ప్రతిభం గవిత్వము
రచింపంజేసి గానక్రియా
విదురుంగా నొనరించె వైదికకులా
విర్భూత నాకార సం
పదుపేతం గుణధన్యకన్య కర
మొప్పంజేసె నుద్వాహమున్.

నిరంకుశుడు జయంత కంతులను మించిన చక్కదనాలవాడు. వివేకశీలుడు. కాని శిష్టాచార సంపన్నత మాని అతడు వేశ్యాలోలుడైనాడు.

ఆ తరుణావనీసురు
డొకప్పుడు పీఠికిరా విలాసినీ
వ్రాతకఠోర ధైర్యకుధ
రంబులు తుత్తుమురై చనం దయా

ద్రేతర వృత్తినేయు నిత
డింటికి బోవ నిరస్తవావుడై
చేతులు తీయగా మరుదు
సెజ్జపయింబడు భూవరోత్తమా!

అతని విశృంఖల వేశ్యాసంచారాన్ని కవి సుదీర్ఘంగా వర్ణించాడు. అతడు చంపకగంధి అనే వేశ్య తగులంలో చిక్కుకొని యింటిముఖం చూడకుండా తిరుగసాగాడు. సమస్తమైన సంపదను వేశ్యకు ధారపోసి నిర్ధనుడై వేశ్యమాత చేత పరాభవం పొంది చేసేది లేక అడవి పాలైనాడు. అక్కడ ఒక శిథిల శివాలయంలో శివుణ్ణి నిర్బంధించి సొగటాల ఆటకు ఉపక్రమించి శివుడు పలకక పోయినా రెండు పందెములూ తానే నిష్పక్షపాతంగా నిర్వహించి ఆట ఒడ్డిన పందెం. కావున తనకు దేవ వేశ్యను సమకూర్చవలసిన దిగా శివుని నిక్కచ్చి చేయటంతో పరమశివుడు సమస్త దేవత లతో ప్రత్యక్షమై నిరంకుశుడికి రంభ నివ్వవలసిందిగా ఆదేశిం చాడు ఇంద్రుణ్ణి.

నిరంకుశుని బుద్ధికుశలతను ఇంద్రుడు ప్రశంసించి, రంభ భూలోకం వచ్చిపోయే ఏర్పాటుచేశాడు చిరకాలం రంభతో ఇష్టభోగాలు తనివి తీర అనుభవించి చివరకు దైవానుగ్రహం వల్ల తన నడవడి మార్చుకొని ధర్మపత్నితో సంసారం చేసి సంతానం పొంది దశదిశాపూర్ణకీర్తి మండలుడైనాడు నిరంకుశుడు.

## నిరంకుశుని సమ ఉజ్జీలు:

కామ ప్రవృత్తికి లోనై భ్రష్టతనొంది తుదకు భగవత్సాన్ని ధ్యాన్ని పొందిన పాత్రలు యితర కావ్యాలలో కూడా కనిపిస్తాయి.

**పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో మల్లణుడు–**
**శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యంలో సుకుమారుడు–**
**కాశీఖండంలో గుణనిధి–**
**పోతన భాగవతంలో అజామీళుడు**
**ఎడపాటి ఎఱ్ఱన మల్హణచరిత్రలో మల్హణుడు –**
**రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యంలో నిగమశర్మ**
**ఉద్భటారాధ్య చరిత్రలో మదాలసుడు**
**హరిభట్టు నారసింహపురాణంలో మందేహుడు,**
**ఈ కోవలోవారు. వీరిని ధూర్త నాయకు లనవచ్చును.**

ఒక్కొక్కరి దొక్కొక్క ప్రవృత్తి. వీరి భార్యల ప్రస్తావన గమనార్హం. గుణనిధికి పదియు నార్వత్సరముల భార్య. సుకుమారున కింకను వివాహం కాలేదు. అజామీళుడు వృషలిని పత్నిగా వరించాడు. మదాలసునకు చంద్రకళతో వివాహమైనది. నిగమశర్మకు భార్య పొలిండ్లు రిక్తకుంభములు. నిరంకుశుని భార్య త్రిభువనాశ్చర్యకర సౌందర్యధుర్య! ఒక్క చంద్రకళ తప్ప మిగతావారికి కవులు నామకరణమే చేయ లేదు. పేరుతో పనిఏముంది? అందరు నాయకులూ వేశ్యాసంగమ మిచ్చగించారు.

తల్లుల కీ తనయులు ముద్దుపెంపు బిడ్డలు. కానక కన్న సంతానం. లేకలేక కలిగిన ముద్దుకుమారులు. వ్రతములు, నోములు నోచి కన్నవారు. అందుకే వారి నల్లారుముద్దుగా పెంచినారు. తల్లి ఔదాసీన్యాన్ని నిరంకుశుని భార్య తూర్పార బట్టింది. వారలతాంగుల యిండ్లకేగగా, మీరును మామయు ఊరకే చూచుచుండెద రదలించక యని మందలించినది.

## జనార్దనాష్టకం

అష్టకాలు సాధారణంగా దేవతాస్తుతిరూపకాలు. అచ్యుతా ష్టకం, అన్నపూర్ణాష్టకం, జగన్నాథాష్టకం - యిలా యిరవైకి పైబడి శంకరాచార్యుల పేర వ్యాప్తిలో వున్నాయి. పాల్కురికి సోమన రచించిన బసవాష్టక, వృషభాష్టకాలు చెప్పుకోదగ్గవి. కాని అవి రెండూ సంస్కృతంలో ఉన్నాయి.

**'బసవాష్టక మిదం పుణ్యం, సర్వపాప ప్రణాశనం**
**యః పఠత్ శృణుయాద్వపి, శివలోకే మహీయతే' –**
అని

మంగళాష్టకాలు సంస్కృతంలో బాగా వ్యాప్తిలో ఉన్నాయి.

అష్టక లక్షణాలను లాక్షణికులు వివరించలేదు. మత్తకోకి లను మాత్రాఛందస్సులోనికి మార్చి సాగిన రచనయిది. పాదానికి 26 మాత్రలు. యతి ప్రాసనియమము, పాటింపబడి నది. ఆదిప్రాసతో బాటు అంత్య నియమము కూడ తొలిమూడు పాదాలలో పాటించాడు కవి. పింగళి లక్ష్మీకాం తంగారు జనార్దనాష్టకాన్ని గూర్చి ప్రశంసిస్తూ-

''మేఘసందేశమందు కాళిదాసు వర్ణించిన మందాక్రాంత మువలె రుద్రయ భావానుగుణమగు వృత్తము నేరికొని, వృత్తగతమైన గతికి అనురూపమైన భాష నేరికొనిరి. క్షేత్రయ పదములవంటి సొగసుదనపు కుప్పలైన ఎనిమిది జనార్దనాంకిత పుష్పమంజరులను - ఎన్నటికి వాడని వానిని - ఆంధ్రలోక మున కర్పించిపోయెను.'' అన్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు మొదటిసారిగా చాటుపద్యమణిమంజరిలో ఏడు పద్యాలను ప్రకటించారు.

**నీవు నేనును తూగుటుయ్యెల పయిన్**
**నిద్రింపగా నెవ్వతో**
**నీవంచున్ ననులేపి ముద్దుగొనెరా**
**నీపేరనే పిల్చెరా**

**ఆవేళప్పు డదేల వచ్చె చెపరా**
**ఆ యింతి పేరేమిరా**
**శ్రీవైకుంఠనివాస! మారకపురీ**
**శ్రీ చెన్నరాయాధిపా!**

అనే చాటుపద్యం బహుళవ్యాప్తిలో వుంది.

శృంగారాత్మకమైన జనార్ధనాష్టకంలో పది పద్యాలు ప్రచారంలో ఉన్నాయి. రెండు ప్రక్షిప్తాలు తర్వాత చోటుచేసుకొన్నాయి. నాయిక జనార్ధనుని దక్షిణ నాయకత్వాన్ని నిందించడం ప్రధానేతివృత్తం. శైలి మనోహరం. ఇది తొలితెలుగు అష్టకమని చెప్పవచ్చును. భాష వ్యావహారికము. ధూర్త నాయకుడైన జనార్ధనుని నాయిక సరసముగ నిందించుట ఈ అష్టకమునకు శోభ గూర్చినది.

**నిన్నరాతిరి చవికలోపల నీవు చెలికూడుంటిరా**
**ఉన్నమార్గము లన్నియును నేనొకతె చేతను వింటిరా**
**విన్నమాత్రము గాదురా నిను వీథిలో కనుగొంటిరా**
**కన్నులారా! దనుజమర్దన! కందుకూరి జనార్దనా!**

గోగులపాటి కూర్మనాథకవి చంద్రనగరీ పురీశ్వరాష్టకం, కూచిమంచి తిమ్మకవి రసిక జన మనోభిరామంలో కందాష్టకము, కాకుమాని మూర్తికవి రాజవాహన విజయంలో రాఘవాష్టకం, ఇలా ఎన్నో అష్టకాలను ఆరుద్ర తమ జనార్ధనాష్టక పీఠికలో ఉటంకించారు.

**చెల్లెబో పసుపంటినది నీ జిలుగుదుప్పటి విప్పరా**
**ముల్లుమోపగ సందులేదుర మోవికెంపులు గప్పరా**
**తెల్లవారినదాక యెక్కడ తిరుగులాడితి చెప్పరా**
**కల్లలాడక, దనుజమర్దన కందుకూరి జనార్దనా!**

ఇలా మృదుమనోహరమైన భావాలతో నాయిక జనార్ధనుని మందలిస్తుంది. విరహోత్కంఠితయైన నాయిక తన కడకు ఆలస్యముగా వచ్చిన దక్షిణ నాయకుని సుతిమెత్తగ నిందించును. మోహనాకారుడైన జనార్ధనుడు సిరులు మించిన పసిడి బంగరు జిలుగు దుప్పటిజారగా ప్రేయసి కడకు మురువు జూపుచు వచ్చినాడు. అటు మొన్న నాయకుడు ఆనపెట్టీ రాలేదు. నిన్న తాను చూచుచుండగనే నీటుచేసుకవెళ్లినాడు. అట్టి వగలుచూసి నాయిక క్రుద్ధురాలైనది. పైపెచ్చు నాయకుని కడ సురత చిహ్నాలు చూసి మిక్కిలి బాధనొంది వ్యంగ్యంగా పలుకరించింది. పెదవియందు మొలకకెంపులు, చెక్కిటి నొక్కులు, కత్తిగోరులు ప్రత్యక్ష నిదర్శనాలు. నాయకుడేవో బొంకినాడు. ముల్లు మోపగ సందులేని మొలక కెంపులను చూపి నిలదీసినది. మోమోటమికై నాయకుడు బాసలు చేసినాడు. తమ పూర్వ దాంపత్య జీవితమును నెమరువేసుకొని 'గండిదొంగ' వని దూషించినది. ప్రణయకలహానంతర మామెను ప్రసన్నను చేసుకొన్నాడు చివరకు నాయకుని స్వీయానురక్తుని చేసుకొన్నది. ఇదీ కథ

## 'సుగ్రీవవిజయ' యక్షగానం

చక్కని తెనుగుదనము ప్రదర్శించిన సాహిత్య ప్రక్రియలన్నిటికి మకుటాయమానమైనది యక్షగానం. ప్రోలుగంటి చెన్నశౌరి సౌభరిచరిత తొలియక్షగాన మని పండితాభిప్రాయం. అది యిప్పుడు దొరకడంలేదు. సుగ్రీవ విజయమే లభించిన తొలి తెలుగు యక్షగానం.

'ఈ రుద్రకవి సుగ్రీవ విజయమును స్త్రీవృద్ధ పామరాదులు పలువురు పాడుచుందురట. ఆయా పాత్రల పాటలు తద్వేష ధారులు వచ్చి పాడునట్లును, తక్కిన సంధివచనాదులు ఒక్క రిద్దరు సూత్రధార ప్రాయులు పఠించునట్లును ఈ సుగ్రీవవిజయము వీథి యాటగా నాడబడుచుండెడిది'. అని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సుగ్రీవవిజయ పీఠికలో పేర్కొన్నారు. సుగ్రీవ విజయము జనార్ధనదేవుని కంకితము. కందుకూరులో జనార్ధనస్వామి దేవాలయము ఇప్పటికీ పూజలందుకొంటున్నది.

కథాగమనం పరిశీలించినచో శ్రీరాముని సీతావిరహ క్లేశము, రామునితో వాలి సంవాదము, తారా విలాప సన్నివేశము, అంగదునప్పగింత మొదలైన సన్నివేశాలు యక్షగానంలో చోటుచేసుకొన్నాయి. కరుణభాసుర యక్షగానమని రుద్రకవి స్వయంగా చెప్పుకొన్నాడు. తాత్కాలికమైన శ్రీరాముని సీతా వియోగ దుఃఖముతో - కరుణ విప్రలంభముతో కథారంభం. శాశ్వతమైన భర్తృ వియోగ వేదనతో తారాస్థాయి నందుకొన్న తారరోదనము గ్రంథాంతమున ముఖ్య సన్నివేశం. వాలి సుగ్రీవుల యుద్ధ ఘట్టమున అంగముగా వీరరసము ప్రసక్తమైనది.

16వ శతాబ్దిలో వెలసిన యక్షగానాలు యథాతథంగా ప్రదర్శింపలేము. సంవాదశైలి అందులో అధికం. 'అనవుడు సుగ్రీవునితో రామచంద్రుం డేమనుచున్నాడు' -వంటి పాత్రలమధ్య సంభాషణలు ఉన్నాయి. కిష్కింధాకాండనే రచయిత ఏల స్వీకరించెనో తెలియదు. సుగ్రీవ పట్టాభిషేక వృత్తాంతమే కరుణరస ప్రధానము. శ్రీరాముడు, లక్ష్మణుడు, వాలి సుగ్రీవులు, తార, హనుమ - ప్రధానపాత్రలు. ప్రబంధాలలోవలె ఇష్టదేవతాప్రార్థన, సుకవి భూషణ, కుకవి దూషణ, షష్ఠ్యంతాలు కథాప్రవేశము మామూలు. వాల్మీకి రామాయణానికి భిన్నంగా కథాంశాలు కవి చేర్చలేదు. తాళ ప్రధానములైన దరువులు, త్రిపుట, జంపె, కురుచజంపె,

అటతాళము, ఏకతాళము - ఇందులో ప్రయోగింపబడ్డాయి.

''రుద్రకవి రామాయణమంతా ఇలా యక్షగానంలా వ్రాయలేదే యనే బాధ దీనిని చదివాక కలుగుతుం' దని ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యంలో అభిప్రాయపడ్డాడు. ఈ యక్షగానంలో శ్రీరాముడు నాయకుడు. రామునా యించిన వీరము ఆశ్రిత రక్షాదక్షము. శ్రీరాముడు సుగ్రీవున కభయ మిచ్చినపుడు ధర్మవీరము, దుందుభి శ రము నంగుటమున జిమ్మునపుడు, సప్తతాళభేదనమున, వాలి సంహారమున బలవీరము స్ఫురణకు వస్తాయి.

రామబాణముచే నిహతుడైన వాలి దుఃఖము, కోపము, తర్కము ముప్పిరిగొనగా రాముని నిందిస్తాడు. వాలిమాటలలో కరుణరస దీప్తిగలదు. అలానే దుఃఖార్తయై భర్తృవియోగాన్ని భరించలేక తార దుఃఖించిన తీరు కరుణాలవాలము.

''ఆలిగొని పోయినట్టి దశాస్యుదుండంగ నిర్నిమిత్తము
వాలినేమిటికి జంపితివి రఘువంశతిలకా!
ఇట్టి సాహసకర్మ మెచటికి నేగె భరతుడు సీమవెడలగ
గొట్టి రాజ్యము పుచ్చుకొన్నెడ కువలయేశా!''

''కపికులోత్తమ రాయిగాబోలు నాగుండె
యిపుడు తుమురైపోవ దేమి సేయుదును.''

ఇలా తారపలుకులు స్వభావసిద్ధంగాను, కరుణరసోద్దీపితంగాను ఉన్నాయి.

ఈ యక్షగానాన్ని కందుకూరు జనార్దన స్వామి వసంతోత్సవాలలో ప్రదర్శించి ఉంటారు. రామాయణంలో వాలివధ వృత్తాంతము లోకంలో విభిన్న విమర్శలకు గురి కావ ం మనకు తెలుసు. శ్రీరాముని శీలానికి కళంక మా దింప కుండుటకై వివిధాలైన వాదాలను వారు ప్రతి దించారు. చెట్టుచాటున దాగి శ్రీరాముడు బాణమేయుట దోషమని వారి వాదము. ఈ వాదాన్ని సుగ్రీవ విజయంలో రుద్రకవి చెప్పదలచుకొన్నాడు.

శ్రీరామచంద్రుడు జీవితంలో ప్రథమంగా సీతావియోగ దుఃఖాన్ని అనుభవిస్తున్నాడు. సుగ్రీవుడు కూడా ఇట్టి సమానావస్థలో ఉన్నాడు. ఇద్దరూ స్నేహితులై పరస్పరం సహకరించుకోవాలని అగ్నిసాక్షిగా మైత్రి చేసుకొన్నారు. సమానావస్థలో ఉన్నవారు సహజంగా మిత్రులుగావడం సహజం. 'సమాన శీల వ్యసనేషు సఖ్యం' అన్నారు పెద్దలు. సుగ్రీవమైత్రి కలుగనిచో సీతాన్వేషణ ప్రయత్నం సాధ్యపడదు. సుగ్రీవ పట్టాభిషేకం చేస్తానని రాముడు ప్రతిజ్ఞ చేశాడు. ఈ సన్నివేశాలను కవి యక్షగానంలో చి కరించాడు. ఈ యక్షగానము పామరుల వినోదార్థము ప్రద ్ంచుచుండెడివారని వేటూరివారు పీఠికలో పేర్కొన్నారు.

రాక్షసం చ దురాత్మానం తవ భార్యాపహారిణం
కంఠే బద్ధ్వా ప్రదద్యాంతే నిహతం రావణం రణే -

అన్న వాల్మీకిశ్లోకానికి రుద్రకవి అనువాదం రమణీయంగా సాగింది.

శ్రీరామ నీ రామ చెఱగొన్న రావణుని
వారిధుల ముంచితిని వాలమున జుట్టి
ఒకమాట వాకు చెప్పక పోయితివిగాక
సకలదైత్యుల దున్మి జానకిని దేనా''

దేశిరచనా విశేషములైన ఏలలు, దరువులు, శోభనములు సుగ్రీవ విజయంలో మెండు.

ఆలి చెఱగొని పోయినట్టి దశాస్యుదుండగ నిర్నిమిత్తము వాలినేటికి జంపితివి - ఆక్షేపణకు రాముని సమాధానము:

'రోసమున నిజసోదరుని యాలిసైకొన్న
దోసకారిని నిన్ను, ద్రుంపనే తగవు
పొంచి యేసితివంటే భువిలోన మృగములను
పొంచి యేయకయున్న, బోనె దవ్వులకు.''

సుగ్రీవ పట్టాభిషేకసమయంలో పురజనులు పరిపరివిధాలుగా తలపోసిన విధానము గంభీరము.

కటకటా! ఏల నిష్కారణమ జంపె నీ
కుటిలునకుగా వాలిన్ కువలయేశ్వరుడు
చెవి నిల్లుగట్టుకొని చెప్పి చంపించె నీ
రవిసుతుండే ద్రోహి రాముడేమెరుగు
ఎవ్వరును జంపింపరీ పాపకర్ముడే
క్రొవ్విచచ్చెను తార, కొడుకు వద్దనగన్
దశరథాత్మజుతోడ తగునె వైరము హస్తి
మశకాంతరము వెర్రి మర్కటముగాక
మన కేమిటికి వాలి యినతనూజుడు మేలు
జనులపాలిటివాడు శాంతవర్తనుడు

లోకరీతి ఇది.

ఈ మూడు గ్రంథాలు చాలు రుద్రకవికి ఆంధ్ర సాహిత్యంలో అపారమైన కీర్తి ప్రతిష్ఠలు సంపాదించి పెట్టడానికి.

''తిట్టుదువా భుజంగ విష
దిగ్ధదవానల ధాగధగ్యచి
ట్చిట్ట చిటార్భటీ ప్రకట
శీఘ్రమహోగ్రత దంతనిష్ఠురో
ద్ఘట్టన విస్ఫులింగలయ
కారణ దారుణమైన తిట్టు కవిగా''

నిలిచిపోలేదు రుద్రకవి. జనార్దనాష్టక కృతికర్తగా చిరస్మరణీయుడయ్యాడు.

# చేమకూర వే క కవి
# సారంగధర చరిత్ర - గ్రీకు ట్రాజెడి

శ్రీ సర్‌దేశాయి తిరుమలరావు

నన్నయ నుండి గోపీనాథ వేంకటకవి వరకుగల తొమ్మిది నూరేండ్ల కాలములో వచ్చిన తెలుగు సృజనాత్మక సాహిత్యమును ఈ క్రింది విధముగా వర్గీకరింపవచ్చును.

1. **ఇతిహాసములు :** రామాయణము, మహాభారతము, జైమిని భారతము, హరివంశము.
2. **పురాణములు :** భాగవత, విష్ణు, మార్కండేయాదులు.
3. **మతస్థాపకములు :** బసవపురాణము, పండితారాధ్య చరిత్ర, ప్రబోధ చంద్రోదయము, ఆముక్తమాల్యద, వైజయంతీవిలాసము, వీరభద్రవిజయము, ఉషా పరిణయము, తోభ్యచరిత్ర, హర విలాసము.
4. **స్థలపురాణములు :** కాశీఖండము, భీమఖండము, శ్రీకాళహస్తి మాహాత్మ్యము, పాండురంగ మాహాత్మ్యము, ఘటికాచల మాహాత్మ్యము.
5. **ప్రబంధములు :** శాకుంతలము, మను చరిత్రాదులు
6. **కథాకావ్యములు :** దశకుమారచరితము, కేయూరబాహు చరిత్ర, విక్రమార్కచరిత్ర, భోజరాజీయము, షోడశకుమారచరిత్ర, పంచతంత్రము, శుకసప్తతి, హంసవింశతి. సింహాసనద్వాత్రింశత్సాల భంజిక.
7. **చరిత్రలు :** రాయవాచకము, రంగరాయ విజయము, సిద్దేశ్వర చరిత్ర.

ఈ గ్రంథములలోని సమాన లక్షణములను క్రోడీకరింతము:

వీనిలో సాంఘికసంబుద్ధి (సోషియల్ సెన్సిబిలిటి) యుండదు. ఉండదు అనిన ప్రధాన రంగముగా నుండదని యర్థము. కావ్యముల పరిణామము పరిశీలించిన, అది సాంఘిక పరిణామ ఫలితమేయని తేలినను ఆ సాంఘిక పరిస్థితి కావ్యములలో ప్రతిబింబింపదు. కావ్యములను, సూక్ష్మముగా విశ్లేషించిన, ఆయాకాలములలోని సాంఘిక పరిస్థితులు చూచాయగ కన్పించును. ముఖ్యముగా హంసవింశతి వంటి కథా కావ్యములలో నిది స్పష్టము. కళాపూర్ణోదయములోను ఆ కాలమునాటి సాంఘిక పరిస్థితులు కొన్ని కనపడును. అంతమాత్రముచేత, వానిలో సాంఘిక స్పృహయున్నదనలేము. సాంఘిక స్పృహ యున్నట్లెప్పుడు లెక్కయనిన, ఆ కథాగమనమునకు, పాత్రోన్మీలనమునకు నప్పటి సాంఘికస్థితి ప్రధావశీలి కావలెను. సంఘము ఏమనుకొనునో కదా యని కావ్యపాత్రలు డోలాయమానము కావలెను. ''ఈ కడజాతి నాతి కిహిహీ మహిదేవుడు చిక్కెనంచు నన్ రాకకు పోకకున్ జన పరంపర కెంపగు జూడ్కి జూచి యంబూకృత మాచరించుటకు బుద్ధి దలంక'' అను నిగమశర్మ పలుకుల దృష్ట్యా అచట సాంఘికస్పృహ యున్నట్లు చెప్పవచ్చును. శ్రీరాముడు సీతను వదలివేయుటలోను, శ్రీకృష్ణుడు శ్యమంతకమణిని తెచ్చుటకుపోవుటలోను, రాజు సంశయరేఖకు పైనుండవలెనను నియమము వలననేకానీ, అందు సాంఘిక సంబుద్ధిలేదు. అటువంటిదే అర్జునతీర్థ యాత్రాకారణముకూడ. ''లోకంబుల మర్యాదలు విచారించి రక్షించుచున్న మనయందు మర్యాదాభంగం బైన నింతకంటె దుర్యశం బొండెద్దియు లేదు'' కావున తాను ద్వాదశ మాసిక వ్రతము చేయుదునన్నను అర్జునుడు. ఇదియును రాజుల బాధ్యతా స్పృహ సూచకమేకాని సాంఘిక స్పృహ సూచకము కాదు. పందొమ్మిదవ శతాబ్దమున పాశ్చాత్య నవలలలో సర్వే సర్వత్ర గోచరించు నట్టి సాంఘిక స్పృహ యెచ్చట కనపడుననగా పందొమ్మిదవ శతాబ్దాంతముననే తెలుగులో వచ్చిన యొక నాటకము (కన్యాశుల్కము), ఒక నవల (రాజశేఖరచరిత్ర), ఒక కావ్యము (ముసలమ్మ మరణము) నందు కనబడును.

ప్రాచీన కావ్యములలో శ్రీమన్నారాయణుని నుండి శ్రీమత్పోతప్ప వరకుగల దేవుళ్లలో నొక్కరైనను వత్తురు. కథా కావ్యములలో విద్యాధరపు వ్యక్తులు, జంతువులు, దయ్యములు ఎక్కువ. అతిలోక, అతిమానుష సంఘటనలు, సన్నివేశములే ఎక్కువ. పాత్రలు అతి మానుషములే

యయినను గ్రంథములలో మాత్రము లౌకిక వాతావరణమే యుండును. విజయవిలాసము, ప్రభావతీ ప్రద్యుమ్నము, ఉషాపరిణయము, వసుచరిత్రలలో మహత్వపూర్ణ సంఘటన లేవీ జరుగవు. అన్నీ కుటుంబపు గొడవలే. తుదకు పేరేజులే. తెలుగు సినిమాంతము అందువలె గ్రూపు ఫోటోలే. దేవతావ్యక్తుల సమస్యలు వివాహములతో సమసిపోగా, మానవుల సమస్యలు వివాహములతో తలయెత్తును. మన గ్రంథములలో మనుషులు దేవుళ్లవలెను, దేవుళ్లు మనుషుల వలెను వ్యవహరింతురు. ''దైవతభూమి, ఋషులభూమి, భరతభూమి'' యని భారతదేశ వర్ణన. మనుష్యులేరీ? రాక్షసులనైనను ఆప్యాయముగా వర్ణింతురు కానీ సామాన్య మానవులను వర్ణింపరు మన కవులు. నీవు దేవుడవు లేదా రాక్షసుడవు. ఒక నక్షత్రక, ఒక నిగమశర్మ అక్క, ఒక మణికంధరుడు తప్పించి మన ప్రాచీన కావ్యములలో మానవీయపాత్రలు కన్పడునా?

మనకు విమత కవిత్వము (సెక్యులర్ పొయట్రి) లేదు. ప్రతీ కావ్యము నేదోయొక మత ప్రచారముతో నిండియుం డును. మత ప్రచారము సూటిగా లేకున్నను, వంకరగనైన నుండును. ''పారిజాతాపహరణ'' కావ్యములో కృష్ణపార మ్యము ప్రతిపాదితము. అట్టివే ''ఉషా పరిణయము'', ''కుమారసంభవము''. మనకు సమష్టి వేదాంతమున్నది. వ్యష్టినీతి లేదు. ప్రహ్లాద నారదాది వ్రేళ్లమీద లెక్కపెట్టునంత మంది తప్ప తక్కిన యధిక సంఖ్యాక భక్తులు నీతిలేని వారుగ కన్పింతురు. భక్తుడెంత పతితుడయిన భగవంతుని కృపాజలపాత మంత జోరుగ పడునను శ్రీవైష్ణవ భక్తి సిద్ధాంతమొకటి కలదు. ఇందులోని యర్థవాదము నేను గుర్తించలేదను కొనకుడు.

భక్తిమీదున్న రక్తి సత్య, సమత, అస్తేయ, అపరిగ్రహ, అహింసలపై లేదు భారతీయులకు. పైని గుణములనే నొక్కిచెప్పినదానివలననే కదా బౌద్ధజైనములకు మనదేశ ములో నాగతి పట్టుట! స్వర్గము లేదు, నరకము లేదు, దేవుడు లేడు. దయ్యములేదు. మీరు చేయున దిక్కడే యనుభవింపవలెను. తస్మాత్ జాగ్రత యనినవారిని చార్వాకు లని, నాస్తికులని, కౌలులని, పాషండులని శాపనార్థములు పెట్టినారు. సెక్యులర్ రాజ్యాంగము వచ్చిన తర్వాత వివిధ మతములు పేట్రేగుచున్నవి. సెక్యులరిజం అనిన, మతము అప్రాధాన్యము వహించుటపోయి, అన్ని రకములైన దయ్యాల పూజలు ప్రచారసాధనములలో వినవచ్చుచున్నవి. ప్రతిక్షుద్ర దేవతయు ప్రాముఖ్యము వహించుచున్నది. హోమరు, వర్జిలులు వ్రాసిన ఇతిహాసములు ''ఇలియడ్'', ఏనీడ్ ''లలో గ్రీకు రోమక దైవములు వచ్చెదరు. నార్వే, స్వీడను దేశముల [illegible] ప్రజలు. క్రైస్తవ మతము వచ్చిన తరువాత [illegible] దేవుళ్ళందరు తమ పవిత్రత, గౌరవము కోల్పోయిరి. పదభ్రష్టులయిరి. ష్లీమరు అను పురాతత్త్వ శాస్త్రజ్ఞుడు పాశ్చాత్య కురుక్షేత్ర మనదగిన ట్రాయ్ నగరమును 1870 లలో టర్కీప్రాంతమున ఏడు పొరలుగ త్రవ్వి తీసినప్పటినుండి, ''ఇలియడ్'' లోని గ్రీకుదేవుళ్ళపై మిగిలిన గౌరవము కూడా ఆవిరైపోయినది. ఏలయనిన అందు ఆ మహా ఐతిహాసికవీరుల యవశేషములు దొరుకలేదు సరికదా చాలాబంగారునగలు దొరికినవి! ప్రాచీన ఇంగ్లీషుభాషలో ''బియోవుల్ఫ్'' అను నితిహాసమున్నది. అందు ఇతివృత్తము రోమాంచకారిగ నుండును. కానీ-యాగ్రంథము మలేరియా దోమ చరిత్రకు సంకేతకావ్యము అనే వాదము వినినతర్వాత రోమాంచముపోయి తురదవచ్చును. క్రైస్తవమత మెంతవ్యాపిం చినను, మతప్రమేయముకల ఇతివృత్తముల నెన్నుకొనిన కవులు తక్కువే. ఇంగ్లీషులో కెడ్మన్ (క్రీ.శ. 670) ''సృష్టిగీత'' వ్రాసెను. దాదాపు వేయిసంవత్సరముల తర్వాత మిల్టను ''స్వర్గచ్యుతి'' వ్రాసెను. బైబిలులో వర్ణితమైన సృష్టిక్రమము, ఆది మానవుడు అదాం పతనవృత్తాంతమును వర్ణించు పురాణములివి. మొట్టమొదటి ఇంగ్లీషు జాతీయకవి ఛాసరు (క్రీ.శ. 14-15శతాబ్దములు) లౌకికేతివృత్తమగు ''కాంటర్బరీ కథలు'' వ్రాసెను. క్రైస్తవమతమెంత వ్యాపించి నను, ఆ మతము నెపమున నెన్ని రక్తవాహినులు ప్రవహించి నను, ఆ మతముమీదకానీ, క్రీస్తుమీదకానీ వ్రాయబడినకావ్య ములు పాశ్చాత్య సాహిత్యమున తక్కువ. ఇటాలియన్ కవి డాంటే (క్రీ.శ.14వ శతా) కృత ''దైవీయతోషదము'', ఇంగ్లీషుకవి జాన్ బన్యను (క్రీ.శ.17వశతా) కృత ''తీర్థయా త్రిక పురోగతి'', జర్మన్ కవి గెటే (క్రీ.శ. 18-19వశతా ) కృత ''ఫౌస్టు'', హంగేరియన్ కవి ఇమ్రీమాడక్ (క్రీ.శ. 19వ శతా.) కృత ''మానవత్రాసదము'', టి.యస్. ఇలియట్ (క్రీ.శ. 20వ శతా.) కృత ''మతములో మారణ హోమము'', అమెరికన్‌కవి అర్చిబాల్డు మెక్లీషు (క్రీ.శ.20వ శతా.) కృత ''జె.బి'' లలో క్రైస్తవ సిద్ధాంతములకన్న, అధ్యాత్మికతా భావములే హెచ్చుగనుండును. ఇంగ్లీషుకవులు జార్జిహెర్బర్టు, జాన్‌డున్, రిచర్డ్ క్రాషా, గెరార్డ్‌మాన్లీ హాప్కిన్సులు మతాభినివేశితులై మంచికావ్యములనే రచించిరి. వీరు క్రైస్తవ మతాచార్యులు. ఫ్రాన్సిస్ థాంప్సను ''శౌనపర మాత్మ'' (''హవుండ్ ఆఫ్ హెవెన్'') అను మార్మిక తాత్త్విక కావ్యము వ్రాసెను. ఈ రచనలన్నియు పరిమిత పరిధిలో నెంతరమణీయముగనున్నను, వీనిని వ్రాసినకవులను ప్రధానక వులుగ పరిగణింపలేదు. నాస్తికుడగు షెల్లీతోవీరిని పోల్చజా లము. ఇక భారతీయుల సాహిత్యములో మంచి కవిత్వమని యేదైనను నున్నచో నది మతకవిత్వమైయుండును. ప్రతిక

వియు తనయాత్మోద్ధారమునకో, ఎదుటివారి యాత్మోద్ధార మునకో, తర్వాతవచ్చువారియాత్మోద్ధారమునకో, మత భావములతో కవిత్వమొలికించును.

తెలుగు కవిత్వములో నింకొక రివాజు ఏమనగా, కావ్యములు భాషాంతరీకరణములగుట. నన్నయనుండి చిన్న యవరకు చూడుడు. ''శబ్దరత్నాకరము'' తెలుగుకవులను ఆరు తరగతులుగా వర్గీకరించెను. అందు నన్నయ, తిక్కన, ఎర్రన, నాచనసోమనలు ప్రథమశ్రేణికవులు. వీరి 'కావ్యము లాంధ్రీకరణములు. మారన, శ్రీనాథుడు, పోతనలు ద్వితీయశ్రేణికవులు. వీరును అనువాద కవులే. భాషాంతరీకరణము మంచిది కాదని వాదము కాదిది. ఎందుకనగా ప్రతిభాషలోను వ్యాసుడు షేక్సుపియరు, యూగో, టాల్స్టాయి లుండరు కదా! భాషాంతరీకరణము విశిష్టకళయే. సాహిత్యాసేవయే. దీనిని ఇప్పుడు ''అనుసృష్టి'' యనుచున్నారుకూడ. నన్నయ, తిక్కన, పోతనాదులు చేసిన దనుసృష్టియే. చెప్పవచ్చిన దేమన, అనువాదములు చేసి మహాకవులయినది తెలుగు సాహిత్యములోననేమో అనునదే. హోమరును ఆంగ్లీకరించిన జార్జిచాప్మను, ఋగ్వేదమును జర్మనీకరించిన గెల్డ్నరు, ఆయాభాషలలో మహాకవులలోకి రారు.

ప్రాచీన తెలుగు కావ్యముల సామాన్య లక్షణములను క్రోడీకరించిన తర్వాత, కొన్ని విశేషలక్షణములుకల కావ్యములు ఉన్నవా యను ప్రశ్న పుట్టును. అ విశేష లక్షణము లేవి యనగా,

1. కావ్యములో దేవుడు రారాదు.
2. అందలి విషయము పురాణేతిహాసములలోది కారాదు. చరిత్ర కందుబాటు కాలములో జరిగియుండవలెను.
3. అది భాషాంతరీకరణము కాకూడదు. పురాణేతిహాస పూర్వక వృత్తాంతములు రాకూడదు.
4. అందు మతప్రసక్తి, ప్రచారము లుండరాదు.
5. అందాధ్యాత్మతత్త్వము కాక సాంఘిక నీతి ప్రతిపాదితము కావలెను.
6. అందతిలోక, అతిమానుష సంఘటనలు జరుగరాదు.
7. ఆ కావ్యము ప్రబంధములవలె ''ఫార్ములా'' రచన కారాదు.
8. అందు నాయకుడు కావ్యనాయకునివలె కాక జీవితవీరుని వలె ఉండవలెను. జీవితమున అస్తిత్వపరిస్థితి (ధర్మసంకటము)లో చిక్కుకొని, రెండు ప్రవర్తనా మార్గములలో దేనినైనను అనుసరించుటకు స్వతంత్రతగలిగి, యా స్వతంత్రత నుపయోగించుకొని యొకమార్గము నెన్నుకొని, పర్యవసాన మనుభవించుచు దానికెవరినీ బాధ్యులుగా శాపనార్థములు పెట్టకుండ ఉండవలెను. ప్రామీథియస్, సోక్రటీజు, జీమూతవాహనుడు, మాండవ్యుడు, అయుత నియుతులు వలె.
9. కా ము పెండ్లితోడనో, పట్టాభిషేకముతోడనో లేదా స్వ ˘ నకు పోవుటతోడనో ముగియక, త్రాసదముగ ను ంపన్నము కావలెను.

ఈ నియమములకు చాలావరకు సరిపోవు ప్రాచీన కావ్యము చేమకూర వేంకటకవి 'సారంగధర చరిత్ర'.

సారంగధర చరిత్రలో గ్రీకు త్రాసద లక్షణములున్నవి. అందలి నాయకుడగు సారంగధరునిలో గ్రీకు త్రాసద వీరుని లక్షణములున్నవి.

అరిస్టాటిలు ఇస్కైలస్, సాఫోక్లిజ్, యురిపిడిస్ వంటి త్రాసదనాటక కర్తల నాటకములను లక్ష్యములుగా, ఓజబంతులుగా నెంచి, విషాదాంతమగు ''ట్రాజెడీ'' యను రూపక లక్షణములనిట్లు నిర్వచించెను: ''ట్రాజెడి ('త్రాసద' మని నా స్వీకారము) గంభీరముగ నుండవలెను. వర్ణనాత్మకముగా కాక క్రియాత్మకము (నాటకీయము) గా నుండవలెను. అది భయము, దయల మూలమున మన మనస్సులను క్షాళనము చేసి యా యుద్వేగముల నుండి మనలను విముక్తుల చేయవలెను. గ్రీకు, ఇంగ్లీషు భాషా పదముల నుపయోగించ కుండ ఈ లక్షణమును కొంత స్పష్టీకరింతును.

మనిషిని బెంబేలు పరచునవి రెండు ఉద్రేకములు. అవి భయము, దయ. (ఈ పదమునకు జాలి, అనుకంప, కరుణ యను పదములను సమానార్థకములుగ వాడెదను) భయముండరాదు, భయపడరాదు, భయము పోగొట్టుకొనుటకే ఎన్నియో మతములు, మంత్రతంత్రములు వచ్చినవి. వేద మున 'అభయసూక్త'మే యున్నది. మన దేవుళ్లు ఆపన్నులకు మొట్టమొదట యిచ్చునది అభయమే. అభయ హస్తము దేవుని జన్మహక్కు. ''భయమా పొమ్మ, అభయమా రమ్మ'' అనే వాక్యములను మంత్రములవలె వల్లెవేయించెడు వాడు ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుడు ''భయ మెచ్చట లేదో, అచట నాదేశము జాగృతమగుగాక'' అను నర్థములో రవీంద్రుని గీత మొకటున్నది. దీనివలన తేలినదేమన ''భయము'' అను ఉద్వేగము మనలో కూరుకొని పోకూడదు. దానిని క్షాళనము చేయవలెను అనగా వదలించుకొనవలెను.

దయ అను భావము మంచిదే. ఈ గుణమున కన్ని

గ్రంథములలోను, మతములలోను మంచి స్థాన మీయబడి నది. అహింసా పరమో ధర్మః, దయయు సత్యంబు నాదిగా దలపడేని, సర్వభూతదయకు, సత్యవాక్యమునకు నుత్త మంబు ధర్మవొండెఱుంగ, ఏకోరసః కరుణ ఏవ, రంతిదే వుని కథ, శిబిచక్రవర్తి కథ, మున్నగు నవి దయాప్రశస్తిని తెలుపును. యమునివంటి నిర్ఘృణుడైన మనువుకూడ ''స్మృతి'' లో హృదయము దేని నొప్పుకొనునో యదియే ధర్మము అని శాసించినప్పుడు ఆయన దయాగుణమునే నిర్దేశించినాడని నే ననుకొందును. ప్రకృతిలోని జీవజంతువుల విషయమున దయ యవిభాజ్యమని కూడ చెప్పవచ్చును. కోలిరిడ్జికృత ''ప్రాచీన నావికుడు'' అను కావ్యనీతి యిదియే. రామాయణ, మహాభారత, భాగవతముల యాద్యంతముల లోని ఆంతర్యము, దయ అనునది సర్వజీవసంవేదనమ నియు, అవిభాజ్యమనియు నయి యున్నది. ఇట్టి దయాభా వము మనలో వెల్లువవిరియ వలెను. ఎక్కువ నీరు వచ్చి నిలువనీరును కొట్టుకొనిపోయినట్లు (''క్షాళనము'') అనగ, త్రాసదమును చూచినప్పుడుకాని, వినినప్పుడు కాని, భయద యలు వెల్లువికి మనకు అదొక విధమైన తేలికదనము, ఊరట కల్గింపవలెను. ఇట్టి భావము లన్నియు విసర్జితములు కావలెను. అప్పుడు మనకు ''ఆనందము'' కల్గును. ఇదీ అరిస్టాటిలు నిర్వచనసారము. ఆయన ఉపయోగించిన యొక కీలకపదము తికమక పెట్టును. ఆ పదము ''భేది'' అగుట అనునర్థమిచ్చును. భేది యయినప్పుడు కడుపుబ్బరము తీరి ఎటుల హాయి యనిపించునో, త్రాసదజనిత, భయదయాది నిబిడోద్వేగముల మూలమున మన మనస్సు అటుల తేలిక యగునని భావము. ఇంకొక వ్యాఖ్య ఏమనగా భయదయాది ఉద్రేకములు తమ తామసికత కోల్పోయి, స్వచ్ఛములై, వ్యక్తిగతములు కాక సామాజికపరములై కావ్యానందము గూర్చును అని. ఈ దృక్పథము భరతుడు ''నాట్య శాస్త్రము''లో రసనిష్పత్తికి చెప్పిన నిర్వచనమును బోలుచు న్నది.

## 'త్రాసద' వీరుని లక్షణములు:

''కీర్తిమంతుడు, ఐశ్వర్యవంతుడై యుండవలెను. సంపూ ర్ణముగ సుగుణోపేతుడు కాడు. అవినీతి, నైచ్యముల వలనకాక, విచక్షణారాహిత్యమువలననో, ప్రవర్తన నియమా వళి యందలి లోప, బలహీనతలవలననో తలవని తలంపుగ విపత్తును తెచ్చుకొనువాడు త్రాసద వీరుడు''. ఇచ్చట కీలకపదము త్రాసదనాయకునిలో నుండ వలసిన ''త్రాసదీ యలోప'' లక్షణము. ఈ లోపము మూలమున నాయకుని యదృష్టము హఠాత్తుగా మారిపోవలెను. విపత్తు రావలెను. సంపూర్ణసుగుణోపేతుడు దురంతము పొందరాదు. ఇది ప్రేక్షకుడు సహించరానిది-దీనివల్ల సంఘనీతియే విచ్ఛిన్నమ గును. దుర్మార్గుడు సుఖాంతము పొందరాదు. ఇదియు సవినీతి ప్రతిపాదకమేకాక, భయదయాది ఉద్రేకములను క్షాళనము చేయక, వానిని ప్రకోపింపజేసి త్రాసదములోని ఆనందాంశను భ్రంశము చేయును. దుర్మార్గుడు దురంత మును బొందు సన్నివేశము ''వీనికి శాస్తియయినది'' అను తృప్తిని కలిగించినను త్రాసదాశయమును నెరవేర్పజాలదు. సాఫోక్లిస్ అను ప్రాచీన గ్రీకు త్రాసదకర్త వ్రాసిన ''ఇడీపస్ రాజు'' అను త్రాసదములోని నాయకుడు ఇడీపస్‌రాజు ఆదర్శ త్రాసదనాయకుడని పాశ్చాత్య విమర్శకులను చుందురు.

ఈ వివరముల బట్టి మన ప్రాచీన సాహిత్య నాయకులలో త్రాసద వీర లక్షణములున్నవా యను ప్రశ్న వచ్చును. నాకు జూడగ రామాయణములోని వాలి, మహాభారతములోని కర్ణపాత్ర ఉదాహరణ ప్రాయములుగా కన్పించును. వారికి దురంతము దాపురించినప్పుడు ఆ దురంతమును కలిగించిన వారే, తాము చేసిన పనిని కష్టముతో సమర్థించుకొనుటకు ప్రయత్నించుటయే నా యభిప్రాయమునకు బలము కలిగించు చున్నది. రావణుని తేజస్సును హనుమంతుడు ఓ హో హో యని తెగమెచ్చికొనును కానీ, రావణునిలోనుండు ఆ ఒక పరమావినీతి యున్నదే దానిని తెగనాడును. అందుకే రావణుడు సదవీరుడు కాలేకపోవుచున్నాడు. భాగవతము లోని పరీ- - పాత్రలో త్రాసదవీరుని లక్షణ మున్నది. అతడు ప్రొ -థియన్ (ఇస్కైలస్ కృత ''బంధిత ప్రొమీథి యన్'' అను త్రాసదవీరుడు), బైబిలులోని ''జాబ్'' వంటి స్వాధీనత లేక నిశ్చేష్టితుడైన త్రాసదపాత్ర.

సారంగధర చరిత్ర నాటకీయ కావ్యాత్మకముగ నున్నది సంఘటనలు, సన్నివేశములు వర్ణనాత్మకముగా కాక నాటకీ యముగ మలచబడినవి. అరిస్టాటిలు వ్రాసిన ''కావ్యమీ మాంస'' (''పొయటిక్స్'')లో ''త్రాసదము'', ''కావ్యము'' అనున వొక్కటే యనుభావ మున్నది. మన కావ్యములోని 700 పద్యములలో సగానికి సగము పద్యములు సంభాషణ లతో, పాత్రల స్వగతములతో నిండియున్నవి. ప్రబంధ కవులలో నాటకీయతకు పింగళి సూరనను పేర్కొందురు కాని, యాయనకు, ఆయన సమకాలికుడు చేమకూర వెంకన యేమాత్రమును తీసిపోడని నా యభిప్రాయము. పి- కల్పించు సన్నివేశములు లఘువులు. చేమకూర కలి- సన్నివేశములు గంభీరములు. ఆయనది తోష- ఈయనది త్రాసద నాటకీయత. సూరన మేనరుస్ వ్రాయగా, వెంకన ట్రాజెడీ వ్రాసినాడు.

త్రాసదములో నుండవలసిన భయదయలు త్రాసదనాయకుని లక్షణములు, త్రాసదీయలోపము "సారంగధరచరిత్ర"లో కల తీరులను చూతము. నేను ఇదే ఇతివృత్తముతో వ్రాయబడిన యితరుల (బాణాల శంభుదాసు, గురజాడ, ధర్మవరము, చలం, శ్రీపాద) రచనల తడవను. ఆ తులనాత్మక పరిశీలన విశ్వవిద్యాలయ పరిశోధకులకు వదలి పెట్టెదను. నా చర్చ చేమకూర వేంకటకవి కావ్యముమీదనే. ఇతివృత్తము ప్రాగ్రూపము. లేదా మూల నమూనా కావున ఎన్నియో దృక్పథములతో ఎందరిచేతనో రచింపబడ్డది. ఈ ఇతివృత్తము విశ్వవ్యాపి యయిన "ఆర్కిటైపు".

సారంగధరుని పావురాలపందెమునుండి త్రాసదలక్షణములు తలయెత్తును. దీనిని వర్ణించు పద్యపుటెత్తుగడ, అర్థస్పందన, ఏదో పుట్టిమూడునను ననిర్వచనీయ భీతావహము కల్గించును. ఈ భీతావహవాతావరణమును కవి యదే పనిగ సారంగధరునకు శిక్షపడువరకు కల్పించి సాగించును. తరువాత దయావాతావరణము తెచ్చును. చేమకూర అరిస్టోటిలు చేసిన గ్రీకుట్రాజెడీ లక్షణములను తెలిసియే యనుసరించుచున్నాడా యనునంత ప్రణాళికాబద్ధముగా వ్రాయుచున్నాడు. ఆ పద్యమిది:

"సారంగధరుడు లీలా
సారంగధరుండు సాధు సంస్తుత్యనయా
చారుండు ధర్మమర్మ వి
చారుండపు డుబుసు పోక సమ్మదలీలన్
పారువంబుల బట్టెడివారి జేరె"ను.

ధర్మమర్మములను విచారము చేసికొనుచుండు నయాచారుడు సారంగధరుడు ఉబుసుపోకకు పావురముల యాటకు సమకట్టెను. ఈ ఖేలనాసక్తి యతని బలహీనత లేక లోపమనవచ్చును. దీనివలన నతని సౌగుణ్యాము పూర్ణమయినది కాదని తేలినది. అతనికి సంభవింపబోవు నదృష్టవిపర్యాయమునకు మొదటికారణ మీ ఖేలనాసక్తత.

చిత్రాంగి యింటికి పోవలదని సుబుద్ధిచేసిన ప్రబోధమటునాటకీయకార్యమునకు నిటు విచక్షణతకు మేలుబంతి. దీనిపై సారంగధరుడు సుబుద్ధిని మందలించును. "చిత్రాంగి నా తల్లి కదా ఏల నీకీ యనుమానములు" అని సారంగధరుడడుగగా సుబుద్ధి

"చిత్రాంగి తల్లి నా కనియె దకట
ఏ కాంతనైన బురుషుం
డేకాంతమునందు జేరునేనియు నతనిన్
లోకాపవాద మంటదె"

యని మొరపెట్టును. సుబుద్ధి సొంతబుద్ధితో చెప్పుటలేదు. తల్లితోనైనను, సోదరితోనైనను, కూతురుతోనైనను ఏకాంతమున కూర్చొనకూడదు. ఇంద్రియములు బలీయములు. విద్వాంసులను సైతము జయించును అని "మనుస్మృతి" చెప్పుచున్నది. ధర్మము, ధర్మము అని పలుసారులు పనవిన సారంగధరుని కీసనాతన ధర్మము తెలియదా? అటు ధర్మశాస్త్రమును, నిటు సుహృద్బోధను నిర్లక్ష్యముచేసి "మనసుకు మనసే తార్కాణ" మనుచు చిత్రాంగి యింటికి పోవును.

ఇది విచక్షణా రాహిత్యము. అప్పటి పద్యమెంతయో బుగులు పుట్టించునదిగ నున్నది.

"వలదన్న మానకరిగెన్
జలమున దనపాలి విధి వెసన్ గొనిపోవన్"

ఆతతాయి పిల్లలు చీమలతో చెలగాటమాడి వానిని చరచినట్లు, విధి, మానవులతో చెలగాటమాడును. ఇట్టి పరిస్థితిని గ్రీకు త్రాసద పరిభాషలో "హమార్టియా" అనినారు. చిత్రాంగి మేడలోనికి పోయిన సారంగధరుడు చిత్రాంగి మేడను "భయానకము" అని యిట్లు వర్ణించుచున్నాడు. "రవి యణు రశ్మికిన్ జొరగరాని భయానకమైన నీ మణీ భవనము వచ్చి సొచ్చి పదపంకజముల్గని మ్రొక్కగంటి". అంతయు మణిమయము. అందరు సుందరులు. ఇందు భయానక మేమి యుండును? సత్యధర్మములు లేని మనుషులుండు భవనము మణులతో పొదుగబడియున్నను, శీలములేని యాకారము సుందరమైనను భయానకములే యని త్రాసదము వ్రాయు చేమకూర హృదయము. అప్పటినుండి సారంగధరునిలో, రాఫ్కారచిత "విచారణ"లోని పాత్రకువలె భయారాట మావరించుట మొదలుపెట్టును.

చిత్రాంగి సారంగధరుల వాకోవాక్య రూప సంవాదము విశిష్టమైనది. మణికుడ్యముల పైని చిత్రములకు చిత్రాంగి కామసూత్రపరముగ వ్యాఖ్యానములు చేయుచుండగా, సారంగధరుడు ధర్మశాస్త్రపర వ్యాఖ్యానములు చేయును. ఇచట వరూధినీ ప్రవరుల సంభాషణ జ్ఞప్తికి వచ్చును. చిత్రాంగి కామసూత్ర వ్యాఖ్యాత్రి. వరూధిని "కామ శాస్త్రోపాధ్యాయిని." వరూధినీ ప్రవరుల సంభాషణ ఉల్లాసముగా, ఇంకా కొనసాగిన బాగుండుననిపించును. తడియునుక తిన్నెమీద నడిచినట్లుండును. వరూధిని యప్సర స్త్రీ. పంకమంటని పద్మదళము వంటిది. స్వచ్ఛంద. ప్రవరుడు బ్రాహ్మణుడు. అగ్గిరాముడేనరి. వారి సంవాద పరిణామము ఘోరవిపత్తుకు దారితీయునను చింతలేదు. రాజబాధ్యత లేవియు లేని బాపడు కాలుజారినను ఏవో ప్రాయశ్చిత్తములు చేసికొని

బయట పడగలడు. చిత్రాంగి సంసారిణి. రాజుభార్య. సారంగధరుడు క్షత్రియుడు. మహిమలు లేనివాడు. అర టాకు వంటివాడు. ప్రజల యోగక్షేమముల బాధ్యతకల యువరాజు. రాజే కాలు జారిన, ప్రజలు క్రింద పడెదరు. అందుకే వీరి సంభాషణ బీభత్సముగ నున్నది. వినువారికి ముండ్లకంపమీద నడిచినట్లుండును. వీరు మాట్లాడుట ఎప్పుడాపెదరో కదా యనిపించును. అట్టి సంభాషణకు వాకోవాక్య పద్ధతిని ప్రయోగించిన చేమకూర ఆంతర్య మిదే. వాకోవాక్య రీతిలో నొకరు వాక్యము ముగింతురో లేదో, ఎదుటివాడు తన వాక్య మారంభించును. అంటే ఆ రెండవవానికా సంభాషణ యనిన యిష్టము లేదన్నమాట. నలుని దమయంతి దగ్గరకు దూతగ పంపించు ఘట్టములో దేవతలకు, నలునకు జరిగిన సంవాదమునకు నన్నయ వాకోవాక్య పద్ధతి ననుసరించినాడు. (''ఎఱిఁగి యెఱిఁగి నన్ను...దేవహితము. దీని దీర్పవలయు''.) చిత్రాంగి సారంగధరుల సంవాద పర్యవసానము జీవిత ప్రళయాంతక ముగ నుండితీరునని మన మనస్సులలో బితుకు బితుకు మనుచునే యుండును. ఇచట జరిగిన యొక చిన్న సంఘటన చూడుడు. చిత్రాంగి ''మేలావర సద్రూపకమేలా వరియింపు మనుచు మీదన్ బడి''నది. ఇది వరూధిని చేసిన పనియే. ప్రవరు డామెను వెనుకకు నెట్టినాడు. మరి సారంగధరుడో? ''హా మహాదేవ యని చెవులంటి కేల పడిగడకుబోవ, నవ్వనిత పణిత మణిగణోజ్జ్వల కంకణ క్వణన మొలయ, బట్టు దుప్పటి చేజుట్టి పట్టుకొనియె''.

సారంగధరుని యుత్తరీయము చిత్రాంగికి దొరకినది. ఈ సన్నివేశము ''ఒథెల్లో'' నాటకమున సుగుణవతి యగు డెస్డిమోనా తనచేతి రుమాలును ఏమరుపాటున క్రింద పారవేసికొనుటయు ఈర్ష్యాళువు అయాగో కది దొరుకు టయు దాని యాధారమున ఆమె శీలము సందేహింపబడు టకు కూటసాక్ష్యము సృష్టించుటయు, పర్యవసానముగ ఒథెల్లో డెస్డిమోనాను హత్యచేయుటయు, ఆమె నిర్దోషి యని తెలిసిన తర్వాత ఒథెల్లో తానును ఆత్మహత్య చేసికొను టయు నను విషాదకరదృశ్య పరంపర మనోయవనికమీద యాడును. ఒథెల్లోపాత్ర ప్రచండవీరుడయ్యు ''జాలి అయాగో, జాలి'' అనే మాటలు పనవుచుండును. ప్రేక్షకు లను వడకునట్లు చేయుటకు షేక్సుపియరు పాత్రచే చేరుమాలును క్రిందపడవేయించిన జాలునని విమర్శకులనిరి.

సారంగధరుని యుత్తరీయము చిత్రాంగికి చిక్కలేదను కొందము. సారంగధరుడు తన యింటికి వచ్చెననీ, తనను బలవంతపెట్టెననీ చిత్రాంగి రాజు, మంత్రుల యెదుట యభియోగము తెచ్చి దఖలుపరచిన సాక్ష్యములు రెండు. ఒకటి - కుచరేఖలు. ఇది యనుమానాస్పద సాక్ష్యము. రెండు - సారంగధరుని దుప్పటి. ఇది ప్రత్యక్షసాక్ష్యము. దుప్పటిసాక్ష్యమే లేకుండిన కుచరేఖలసాక్ష్యము నిలువదు. కుచరేఖలు చూపించి ఇవి ఫలానవారు చేసినవి అనిన ఎవరు నమ్మెదురు? ఇక, దుష్యంతునితో శకుంతల చెప్పిన నిత్యసాక్షులగు ''వేదములును, పంచభూతములు, ధర్మువు, సంధ్యలు, నంతరాత్మయున్, చంద్రసూర్యులు, నహంబును, రాత్రియు'' సారంగధరుని పక్షమే. కానీ వీని నన్నింటినీ సారంగధరుని దుప్పటిచే చిత్రాంగి కప్పివేసినది. కావుననే చిత్రాంగి ''కేసు'' నెగ్గినది. ఈ విషయమును సారంగధరుడే ముందుగా పసికట్టినాడు. చిత్రాంగిమేడనుండి శీలభద్రతతో బయటపడి, పైన వల్లెలేకుండుట గమనించి యేదో మూడు నని భయపడును. ''మదవతికి గోక చేపడి, నదిమొదలుగ గుట్టుపాటీ యడలు గుమారుం డెదలోన''. దుప్పటి ఎటులనో చిత్రాంగినుండి కొట్టివేయక తిరిగివచ్చుట సారంగ ధరుని త్రాసదీయలోపము. అందుకే యతడు ఒకక్షణము ముందు యువరాజు, ఇప్పుడు దోషి. ఈ హఠాద్విపత్తు గ్రీకుత్రాసదవీరుని లక్షణము.

గ్రీకు త్రాసదములో నుండవలసిన రెండు స్థాయిభావము లగు భయ, దయలతో భయవిజృంభణ చూచితిమి. ఇక దయావిలసనమును చూతము. రాజు మంత్రులను పెద్దలను సారంగధరుని విచారించుటకు పంపును. వారు పోయి, వినయమున ''రాజకుమారక వెఱచి చెప్పుదుమో వెఱవక చెప్పుదుమో'' యని విన్నవించుకొనినను, సారంగధరునే వెఱచునట్లు చేసిరి. ఈ పై పై మర్యాదలలో నేదో విపత్తు దాగియున్నదను భయము సారంగధరునకు కల్గినది. సారంగ ధరుడు ''ఇది యేమోయని యెదవడి యదవద'' యైనాడు. ''ఎదపడు'' అనిన భయపడు అను అర్థమున నిప్పటికిని రాయలసీమలో వాడుకలో నున్నది. సారంగధరు డెదపడి నాడు. మనకేమో జాలియగుచున్నది.

తలవరులు సారంగధరుని చేతులు కాళులు నరికిరి. అప్పుడు సారంగధరుడు ''హర మహాదేవ శివ'' యని యరచును. నేనేమి నేరము చేసితిని నాకేల యీశిక్ష యని ఈ ఆక్రోశపుటర్థము. ఏసుక్రీస్తును సిలువవేయగా ఆయన ''ఎలీ ఎలీ, లామా సబక్తాని'' (ఇది ఏసుక్రీస్తు యొక్క అరామైక్‌భాష, అర్థము- ''దేవదేవ నన్నేల విడనాడితివి'') అని బిట్టడలెనని బైబిలు వర్ణించినది. దేవపుత్రుడగు ఏసుక్రీస్తు ధర్మమునకై ప్రాణము నిచ్చెను. రాజపుత్రుడగు సారంగధ రుడు శీలమునకై యంగముల కోల్పోయెను. ఆయన పునరుజ్జీవితుడై మానవాళిని ముందుకు నడిపించుచున్నాడు -అధ్యాత్మపథమున. ఈయన యంగములు మొలిపించుకొని

ముందుకు నడచుచున్నాడు-సచ్ఛీలపథమున. ఏసుక్రీస్తు కంటె 500 సంవత్సరముల పూర్వము సోఫోక్లిస్‌చే వ్రాయబడిన ''అంటిగొనె'' యను గ్రీకు త్రాసదమున, మృతసోదరుని గౌరవము కాపాడుటకై ప్రభుత్వము నెదిరించి, తత్ఫలితముగ నురిశిక్ష విధించబడిన అంటిగొనె యను నాయిక వధ్యస్థానమునకు పోవునపుడు ''ఏ భగవదాజ్ఞను నేను జవదాటితినని యీశిక్ష'' యని సదాగ్రహముతో నాక్రోశించి యుండెను. ఆంటిగొనె కానీ, ఏసుక్రీస్తు కానీ, సారంగధరుడు కానీ ప్రాణభయముచేత నీ విధమున ప్రవర్తింపలేదు. మానవుని ప్రయత్నముకంటె బలీయమైన శక్తి యొకటున్నది యను విషయము తెలుపుటకే యటుల చేసిరి.

కాలుసేతులు నరుకబడి స్వాధీనము లేక నెత్తుటి మడువున పడియున్న సారంగధరుని ''జొత్తుపాప'' యని చేమకూర వర్ణించును. అప్పుడే పుట్టి రక్తపుమడుగులో పొర్లాడుచు, స్వాధీనములేక యరచుచుండు నిసుగు జొత్తు పాప. ఈ యొక సమాసము చాలును ఆరిస్టాటిలు చెప్పిన ''దయ'' ను క్రుమ్మరించుటకు! కాళ్ళు చేతులు లేని సార్ఙగధరునకు మత్స్యేంద్రనాథుడు యోగవిద్య నేర్పించెను. ఫలితముగ సారంగధరునకు కాళ్ళుచేతులు మొలవ మొదలుపెట్టెను. ఇప్పుడు సారంగధరుడు రెండవసారి పుట్టిన పాపవంటి వాడు ఈ పాపని మత్స్యేంద్ర నాథుడు తప్పటడుగులు వేయించు విధానము చూడుడు:

''జుట్టువ్రేళ్లను రెండు బట్టించి నడిపింప
 దలకుచు రాలేమి బలిమిదిగుచు
దనచేతి నిడుద లాతపు గోల యందిచ్చి
 మెల్ల మెల్లనె కొంత మెలగ జేయు
నవలంబముడిగి రమ్మన నా దుగులేగి
 పడబోవ గ్రక్కున బ నిలుపు
జనుదెంచి విస విస దను ంటుకొమ్మని
 వచ్చిన నగుచు నవ్వలని కరుగు
నాడునాటికి నీరీతి నడవనేర్పు
గొన్నినాళ్ళకు నలవడి కొంకు దీఱి
లెస్సలై కరపదములు లీలదనర
బ్రేమ చౌరంగి యనియెడి పేరొసంగి.''

మత్స్యేంద్రనాథుడు రక్తపు మడుగులో పడిన జొత్తుపాప వంటి సారంగధరుని ఎత్తుకొని రక్తము కడిగి, తేమ తుడిచి, తానుత్రాగుపాలు సగపాలు బాలు పాలు చేయుచు వానికి యోగవిద్య వలన కాళ్లుచేతులు మొలిపింపజేసి, నడిపింప నేర్పి, యాడించి, క్రొత్తపేరు పెట్టి (అది ముద్దు పేరువలెనున్నది, ''చౌరంగి''), క్రొత్త జన్మనిచ్చి వానికి నిజమైన తల్లియు దండ్రియు తానాయెను.

సారంగధర చరిత్ర గ్రీకు ట్రాజెడి వంటిదనియు, సారంగధరుడు గ్రీకు ట్రాజెడీ లోని నాయకుని వంటి వాడనియు చూచితిమి. మరి సారంగధర చరిత్ర విషాదాంతము కాదే యనిన, గ్రీకు ట్రాజెడి కూడ నిజమునకు విషాదాంతము కాదని సమాధానము. త్రాసము నిచ్చునది అని మాత్రమే తెలియవలెను. భయ దయల వెల్లువలచే మన తలంపులకంటిన పెంటను కడిగివేయుటలు గ్రీకు త్రాసద ఆశయములు. గ్రీకు త్రాసదములు త్రిభాగాత్మకములు. మొదటిభాగమున నాయకుని గుణప్రదర్శనముండును. మొదటిభాగపు తుదిలోను, రెండవభాగములోను నాయకుని యదృష్ట విపర్యాయము (విపత్తు) సంభవించును. మూడవభాగమున నాయకుని విపన్ముక్తికాని, విప ్లిగాని యుండును. ఇస్కైలస్ అను త్రాసదకర్త ''బంధిత' మీథియన్'', ''బంధముక్త ప్రోమీథియన్'', ''అగ్నిధర ' మీథియన్'' యను త్రైత్రాసద మాలను వ్రాసెను. అట్టిదే యీయనది యగు ''ఏగమెమ్నన్''1 ''కోపోరీ''2 ''యూమెనిడిన్''3 అను త్రైతాసద గుచ్ఛము. ఇస్కైలస్ తర్వాత సాఫోక్లిస్ అను త్రాసదకర్త ''ఇదీపస్‌రాజు'', ''అంటిగొనె'', ''కొలోనస్‌లో ఇడిపస్‌రాజు'' అను త్రైత్రాసద మాలను వ్రాసెను. ఆ ప్రణాళిక ప్రకారము సారంగధరుడు చిత్రాంగి మేడకు పోవుటకు నిశ్చయించువరకు మొదటి భాగము, అతనికాళ్లు చేతులు నరుకబడు వరకు రెండవ భాగము, అతడు తల్లిదండ్రుల యొద్దకు వచ్చి వారికి జ్ఞానోపదేశము చేయువరకు మూడవభాగముగ పరిగణించిన ఒక్క సారంగధర చరిత్రకావ్యమే త్రిభాగ త్రాసదము కాగలదు. గ్రీకుత్రాసదములో నుండవలసిన ఆది, మధ్య, అంతములు కావ్యమున గలవు. గ్రీకు త్రాసదమున నుండవలసిన లక్షణములైన దేశ, కాల, పాత్రైక్యములు సారంగధర చరిత్రలో గలవు. ఇతరకావ్యముల నుండి వేరుచేయునట్టియు, మనము వ్యాసాదిలో చేసికొనిన నియమములకు సరిపోవునట్టియు విశేష గుణములు సారంగధర చరిత్రలో నేవేవి కలవో విచారింతము.

సారంగధర చరిత్రలో దేవుళ్లు రారు. రాజనరేంద్రుని కలలో నీశ్వరుడు కన్పడెనట. వాంఛాపూర్తికి, మ్రొక్కుబడి చెల్లింపునకు, గృహస్థులు క్షేత్రములకు పోవుటయు, కొన్ని దినములకు ఆ క్షేత్రనాథుడు తమ కలలో వచ్చి వరమిచ్చెనని వారు తిరిగివచ్చు సంఘటనలు మనము నిత్యము చూచుచున్నాము. ఇది స్వప్న మహత్వాకాంక్ష. పాత్రల మన స్తత్వము అసహజమైనది కాని సంఘటన సహజమైనదే.

సారంగధర చరిత్ర పురాణేతిహాసములలోనిది కాదు. చరిత్ర కాలపరిధి లోపలనే యున్నది. ఇతివృత్తము ''ఆర్కిటైపు'' కావున కాలమును జయించినట్టిది యని కూడ చెప్పవచ్చును. కథ యుప్పు కారములు తిను మనుషులది. రాజు రాజరాజ నరేంద్రు డయినను, రాజ నరేంద్రుడయినను వేంగీశుడైనను, మాళవేశుడైనను చారిత్రక వ్యక్తియేకాని పురాణపురుషుడు కాడు. కర్ణాటకదేశమున నిట్టి యైతిహ్యము కలదు. హఠయోగము, అవధూతమార్గము ఎక్కువగానుండు మహారాష్ట్రమునను, ఉత్తరహిందూస్థానమున జనశ్రుతిలో నిటువంటి కథలు కలవు. చౌరంగి, మాళవ వంటి పేర్లే దీనికి తార్కాణము. ఇతివృత్తము మాత్రము జీవధర్మమునకు ప్రాతిపదిక సంబంధమగు ''ఆడ - మగ''. ప్రాచీనాలంకారికులు రతిస్థాయి భావమనినను, ఫ్రాయిడ్ లైంగిక మానసిక శాస్త్రమనినను ఒక్కటియే. రసము శృంగారమయినను, వాత్సల్యమయినను స్థాయి రతియే. అప్పుడుపుట్టిన పసిబాలునికి తల్లితోగల సంబంధము ఆపెయొక్క సెకండరీ సెక్సు అవయవముల ద్వారానే యనుట ప్రకృతిసూత్రము. లింగము - పానవట్టము, పతి (శివుడు) పత్ని (పార్వతి) లకు సంకేతముకాక కొడుకు - తల్లి (జగన్మాత) కి సంకేతమని కొందరందురు. అందులో సామంజస్యమున్నది. సంతానమునకు, వారి తల్లిదండ్రులకు లింగభేదమాధారముగ మమత - కక్ష అను భావబంధమే తామువలె పనిచేయుచున్నది. కొన్ని యుదాహరణము లిచ్చెదను. ఈ యుదాహరణములు ''మంచి - చెడ్డ'' యను మూర్తీకరణముపై నాధారపడియుండును. సారంగధరచరిత్రలోని అడ - మగ సంబంధము చెడ్డతల్లి - మంచికొడుకుకు కల మమత- కక్షల విలసనమే. చిత్రాంగిని చెడ్డదానిగ చేయు దృక్పథమిది. ఆమెపరముగ సానుభూతితో వ్రాయవచ్చుగదా యనిన ఔనని సమాధానమిత్తును. ప్రసిద్ధమైన యుత్తమ నాయికానాయకులు కల్గిన యాభిజాత్యసాహిత్యమునందే వారి తారతమ్య ప్రాముఖ్యము తబిసీలయిన సంఘటనలు కలవు. రామాయణోత్తరకాండను సీతపరముగ దిఙ్నాగుడు ''కుందమాల'' యను నాటకము వ్రాయగా, భవభూతి ''ఉత్తరరామ చరితము'' అని రామపరముగ నాటకము వ్రాసెను. వాల్మీకియే 'రామోవిగ్రహవాన్‌ధర్మః' అని రాముని నాయకునిగ నెన్నుకొని రామాయణమును 'సీతాయాః చరితం మహత్' అనును. షేక్సుపియరు ఒక ప్రసిద్ధ నాటకము పేరు ''రోమియో మఱియు జూలియట్'' అనిపెట్టి, యా నాటకమును (అది త్రాసదము) ''జూలియటు, ఆమె రోమియో'' అని ముగించును. ఏమి దృక్పథపరిణామము?

చెడ్డతల్లి - మంచికొడుకుల కుదాహరణములు: సురుచి- ధ్రువుడు, కద్రువ - గరుడుడు, కైకేయి విషయములో పరిస్థితి గడ్డుగనుండును. కైకేయి తానేమో కొడుకు కోసమింత చేయుచున్నానని మురిసిపోవును. ఆ భరతుడేమో యామెను నీవు నాకు తల్లివే కాదు పొమ్మనినాడు. భరతునివంటి పాత్ర ఎక్కడా దొరుకుట కష్టము. గాంధారి - భీముడు, కుంతి - కర్ణుడు, ఊర్వశి - అర్జునుడు, గెర్ట్రూడు - హామ్లెటు, దయానిధితల్లి - దయానిధి (బుచ్చిబాబు 'చివరకు మిగిలేది') 'చెడ్డతండ్రి - మంచికూతురు' కుదాహరణములు. లియరు - కార్డీలియా, బాల్కాన్స్కీ - మేరీ (టాల్స్టాయికృత ''సమరము-శాంతి'' లోని తండ్రిబిడ్డలు). 'మంచితల్లి- చెడ్డకొడుకు' కుదాహరణము· ఆదిశంకరాచార్యుని తల్లి- ఆదిశంకరాచార్యులు. చెడ్డకొడుకు అని యుండవచ్చును కాని చెడ్డతల్లి యని యుండదు అను నర్థములో నొక స్తోత్రమును కూడ ఆయన వ్రాసినాడు. ఏదో సాకుచెప్పి తల్లిచేత తాను సన్యసించుట నొప్పించినం దున అయనను ''చెడ్డ'' యని యనినాను. కాని వేఱపార్థము చేయవలదని మనవి. ''మంచితండ్రి - చెడ్డకూతురు'' కుదాహరణము. లియరు - గోనరిల్, రీగానులు. కార్డీలియా విషయమున ''చెడ్డ'' వాడయిన లియరు వీరి విషయమున ''మంచి'' వాడయినాడు. చెడ్డగ వ చిన తండ్రిని ఆమె చేరదీయును మంచిగ వర్తించిన తం ని వీరు గెంటివేయుదురు. ఇదే మమత - కక్షల తాము. ''చెడ్డతల్లి'' క్లైటమ్నెస్ట్రా. ''మంచి కూతురు'', ''మంచి కొడుకు''లు ఎలెక్ట్రా, ఒరెస్టెజ్‌లు (చూ. ఇస్కిలస్ కృతత్రాసదములు ''ఏగమెమ్నన్'', ''కోహోరీ''లు). ఈ గ్రీకుత్రాసదములలోని పాత్రల మమత - కక్షయను సంబంధములమీద యాధారపడి, యాధునిక లైంగిక మానసిక శాస్త్రములో ''ఇడీపస్ కాంప్లెక్స్'', ''ఎలెక్ట్రా కాంప్లెక్స్'', ''ఒరెస్టెజ్ కాంప్లెక్స్'' యను సిద్ధాంతములు ప్రతిపాదింప బడినవి. జీవధర్మ, సంఘధర్మముల మూలకములైన యితివృత్తములు కల యిటువంటి రచనలు సార్వదేశీయ, జనీన, కాలికములై వచ్చుచున్నవి. ఈ ''కాంప్లెక్సు'' లను వదలించుకొనుటయే సారంగధరుడు సాధించినది. జనశ్రుతిలోనుండి ప్రాగ్రూప గాథను గ్రంథస్థము చేయు సదవకాశము గౌరనకు కల్గినది. కాళిదాసు, భవభూతి, షేక్సుపియరుల ప్రసిద్ధ నాటకము లెరవు తెచ్చుకొన్న యితివృత్తములపై నాధారపడియున్నను, వారి నాటకముల సృజన కానీ మౌలికత కాని కొరవడలేదన్నది విమర్శకులందరును నొప్పుకొనిన విషయమే.

ఇంతమాత్రపు మౌలికత నైనను చేమకూర కావ్యమున కీయవచ్చును.

సారంగధర చరిత్రలో మత ప్రమేయము లేదు. ఇందాధ్యాత్మ తత్వము కాక లౌకిక నీతి, సంఘ ధర్మము లున్నవి.

సామాన్య మానవుడు కూడ నాచరింపగల నిర్మాణాత్మక బాధ్యతాయుత అచరణ నియమావళి యున్నది. అతిలోక, అధిమానుష సంఘటనవలె కన్పించునంశము ఆకాశవాణి పాత్ర, నమ్మదగనిదిగా ననిపించు నంశము సారంగధరునికి కాళ్లు చేతులు మొలచుట.

అదృశ్యవాణి ప్రవేశము కావ్యములో మూడు సందర్భములలో కలుగును. మొదటిసారి, చిత్రాంగి నా మాట వినవు కదా! చూడు నిన్నేమి చేసెదనో యని సారంగధరుని బెదిరించినప్పుడు, అతడు నీ మాటలే విని రాజు నన్నుదండించెనేని యీ భూమి యీ ఆకాశవాణి సత్యమెటు గరా అని ప్రశ్నించినప్పుడు. రెండవసారి, కాళ్లుచేతులు నఱుకబడి యాతన పడుచున్న సారంగధరునికి వాని పూర్వ జన్మ వృత్తాంతము చెప్పుటకు గగనభారతి ప్రారంభించినప్పుడు. ఈ సన్నివేశమును సారంగధరుని నిర్దోషిత్వము అచటనే దాగికొనియున్న తలారులకు తెలియుటకు కవి కల్పించెను. తలారులు పోయి రాజుకు అకాశవాణి చెప్పినది చెప్పుదురు. రాజు చిత్రాంగిని పిలిపించి ఆకాశవాణి చెప్పినదాని కేమందువు అని ప్రశ్నించును. చిత్రాంగి ''అకాశవాణి యాడ బలికినది, ఎటుపోయె నీడ బలుకరాదె యిపుడు'' అని పగ్గించును. అప్పుడాకాశవాణి నాటకీయముగా, నున్న సత్యము బయట పెట్టినది. చిత్రాంగికి శిక్షపడుట, రాజు పశ్చాత్తప్పుడగుట, వీనికన్న ముఖ్యముగ సత్యము స్థాపింపబడుట అను కవితాన్యాయములు కలుగుటకు ఆకాశవాణి పాత్రను చేమకూర ప్రవేశపెట్టెను. ఆకాశవాణిని, నాటకపు భూత పూర్వవృత్తాంతము తెలిసి, వర్తమానమును గమనించుచు భవిష్యత్తును తెలుపు ''అధి పాత్ర'' గ పరిగణింపవలెను. అకాశవాణిని గ్రీకుత్రాసదముల లోని ''కోరస్''తో పోల్పవచ్చును. అ పాత్ర లేక పాత్రసముదాయము ఎల్లప్పుడు రంగముమీద నుండును. జరిగినదానిని చెప్పును. జరుగుచున్న దానిమీద స్వీయాభిప్రాయము వెల్లడించును. జరుగబోవు దానిని ధ్వనిపూర్వకముగా వక్రోక్తిలో సూచించుచుండును. లేదా గ్రీకుత్రాసదములలో (ముఖ్యముగ ఇస్కైలస్కృత ''యూమెనిడిస్'') వచ్చు ''ఫ్యూరీ'' లను అతిమానుష సంకేతపాత్రగ జమకట్టవచ్చును. ఇట్టి ఫ్యూరీలు థామస్ హార్డి వ్రాసిన ''డైనాస్ట్స్'' (నెపోలియను చరిత్ర) అను పద్యనాటకము నందును వచ్చును. షేక్సుపియరు నాటకము ''మాక్బెత్తు'' లో వచ్చును. ఆ పాత్రలను ''పిశాచము''లని అందురు. ఉన్నవ లక్ష్మినారాయణ నాటకము ''నాయకురాలు'' లో ''ప్రతాపుడు'' అను పాత్ర భూత భవిష్యములు ప్రకటించి పోవుచుండును. ఇట్టి సందర్భములలో నటువంటి పాత్రలు సాధ్యమాయని కాక, యవి నాటకీయత కెట్లు దోహదము చేయునని పరిగణించిన యెడల ''ఆకాశవాణి'' యసహజత తొలగిపోవును. సంశయమును ఐచ్ఛికముగ విడనాడుట కావ్యవిశ్వాసమునకు మూలకందమని కోలిరిడ్జి యనినాడు.

సారంగధరునకు కాళ్ళు చేతులు వచ్చుట యోగాభ్యాసమహిమ. అసలుకు నవనాథ చరిత్ర రచనయే యోగమహిమను చాటుటకై యున్నది. యోగాభ్యాసము వలన ఎన్నెనా గొప్ప ఫలితములు సమకూరునని అధునాతన శాస్త్రజ్ఞులు కూడ నిరూపించుచున్నారు. అమెరికా రష్యాలలో ''యోగము'' మీద పరిశోధనలు జరుగుచున్నవి. అందుకే ఈ యోగము వలన సారగంధరుడు కాళ్లు చేతులు వచ్చినవనుటలో నత్యుక్తి యుండవచ్చును కాని యసత్యము లేదు. ''సాధ్యము'', జరిగి యుండవచ్చు అను నిశ్చయము కలుగును. ఈ నాథపంథలోని యోగులు గొప్ప సంగీతజ్ఞులు. హిందూస్థానీ శాస్త్రీయ సంగీతములోని ''గోరఖ్ కల్యాణ్'' అను రాగమును గోరఖ్‌నాథుడు సృష్టించెనట. ఈరాగము ఎత్తుగడ ముక్తాయింపులయందలి గాంభీర్యము, సమాధి యను గుణములెంతని వర్ణింపగలము! ఈ యోగులు రుజా చికిత్సకు యోగముతోబాటు సంగీతమును వినియోగించెడువారు. ''జొత్తుపాప'' అయిన సారంగధరుడు సావయవుడగుటకు మత్స్యేంద్రనాథుడు సంగీత మహిమను గూడ ఉపయోగించి యుండి యుండును.

సారంగధరుడు కావ్యనాయకుడే కాడు. జీవితనాయకుడు. శీలము కొరకు చచ్చుటకు సిద్ధమయినాడు. చావు ఓటమి. కావున శీలముతో బ్రతికినాడు. సారంగధర చరిత్ర ముగింపు విశిష్టమైనది. సారంగధరు డొకనాడు తల్లిదండ్రులను చూచుటకు వచ్చును. తండ్రి, రాజ్యమును స్వీకరింపుమనును. మిమ్ములను జూచుటకు వచ్చితిని కాని రాజ్యమునకై కాదు. యోగము కంటె భోగము మఱిలేదని యుపదేశించి, వంశకరుండగు కొడుకు మీకు పుట్టును అని చెప్పి, బాహుబలి (గోమతేశ్వరుడు) వలె సర్వము త్యజించి సర్వము కలవాడయ్యెను. ఇట్టి ముగింపు ఏ తెలుగు కావ్యమునకున్నది? సారంగధర చరిత్ర చదివిన తర్వాత బ్రదుకుపై గాఢవిశ్వాసము కలుగును. టాల్‌స్టాయి నవల ''సమరము-శాంతి''పై వ్యాఖ్యానించుచు నొక విమర్శకు డా నవలను చదివిన తర్వాత కంటిరంగు, పెదవుల అమరిక మారకుండా ఉండునా? అనినాడు. ఈ వాక్యము సారంగధర చరిత్రకు జెల్లును. మానవుని బ్రదుకులోని గడియలు కొన్నియే. గడియ గడియకుమధ్య కాలమును వినియోగించుకొనుటలో నున్నది. మాత్సర్యము తెలియనివాని, క్షమగలవాని బ్రదుకు, జీవిత గడియలను మూల్యవంతము చేయును. రత్నదీపమువలె

వెలుగుచు నట్టి బ్రదుకు బ్రదుకుటయే జీవితవిజయము. ''సారంగధర చరిత్ర'' అందుకే ''సారంగధర విజయము'' అని నేను అనుచున్నాను.

''సారంగధర చరిత్ర'' గ్రీకు త్రాసద రూపకపద్ధతిలో నున్నదనుచున్నావే? చేమకూర వేంకటకవి, వానిని నమూనాలుగా పెట్టుకొని అరిస్టాటిల్ సిద్ధాంతము చదివి వ్రాసినాడా? వాని నన్నింటిని చేమకూర ఎఱుగునా? అని యడుగుదురా?

గీతాబోధ నంతటిని ధృతరాష్ట్రునకు చెప్పి సంజయుడు యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు, ధనుర్ధారియైన పార్థుడు నెచట నుందురో యచట ఐశ్వర్యము, విజయము, గౌరవము, నీతి యుండును అని చెప్పలేదు. ఉండును అని నా కనిపించినది యనినాడు. ఆ దివ్య సందేశమును మరల మరల నెప్పునకు తెచ్చుకొని మురియును. ఆ దివ్య దర్శనమును మరల మరల నెప్పునకు తెచ్చుకొని మురియును. ఇంకా యుద్ధము జరుగలేదు. ఎవరికిని ఐశ్వర్యము, విజయము, గౌరవము, నీతి రాలేదు. అయినను సంజయున కట్లనిపించినది. అందుకే ''మతి ర్మమ'' అనినాడు. అటులనే గ్రీకుత్రాసదములను, అరిస్టాటిలు సిద్ధాంతమును చదివి చేమకూర వేంకటకవి ''సారంగధర చరిత్ర'' చదువగా నా కట్లనిపించినది. సంజయుని వలె నేనును ''మతిర్మమ'' అందును.

నృపతిః పండిత భజనా ద్విజిగీషు రివ ప్రతాప సంపత్తేః।
భట ఇవ ధృతి శౌర్య భరాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

పండిత గోష్ఠివల్ల రాజులాగ, ప్రతాప సంపదతో విజగీషులాగ (జయంకోరే వాడిలాగ), శౌర్యాతిశయంతో సైనికునిలాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి

★ ★ ★

శయన మివ కాయమానా త్తదివాంతర ప్రదీప రుచిర రుచా।
కాచమయామలపాత్రాత్ తారుణ్యా త్తవ విభాతి తను శోభా॥

పందిరి మంచంవల్ల పరుపులాగ, దీప కాంతులతో వెలిగే పందిరి మంచంలాగ, గాజు పాత్రవల్ల దీపంలాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి

# చామర్తి సుందర శేషగిరిరాయ కవి అముద్రిత
# నమశ్శివాయ శతకము

శ్రీ కొడవలి సత్యనారాయణ

ఆంధ్ర వాఙ్మయంలో పురాణాలు, కావ్యాలు, ద్విపదకావ్యాలు, ప్రబంధాలు, శతకాలు, ఉదాహరణ, యక్షగాన, నాటక, పదకవితా, కీర్తనలు ఇత్యాది ప్రక్రియ లెన్నో ఉన్నాయి. వీటిల్లో శతక ప్రక్రియ ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకుంది.

తెలుగులో అమూల్య శతకాలలో అముద్రితాలై వెలుగు చూడకుండా వున్న శతకాలెన్నో వున్నాయి. అటువంటి వాటిల్లో చామర్తి సుందరశేషగిరి రాయకవి రచించిన ''నమశ్శివాయ శతకం'' ఒకటి.

ఈ శతకం హైదరాబాదులోవున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయం - పరిశోధనాలయంలో అముద్రిత గ్రంథాల జాబితాలో చేరి భద్రపరచబడి వుంది. ఇది కాగితపు వ్రాతప్రతి. ఎ.సి.సి. నెంబరు 5557.

ఈ శతకంలో 108 తేటగీతులున్నాయి. ప్రతి పద్యం నాల్గవ పాదం శతక సంప్రదాయానుగుణంగా ''మథితగజదనుజాయ నమశ్శివాయ'' అనే కేవల సంస్కృత మకుటాన్ని కలిగివుంది.

తే. శ్రీ మదఖిల జగజ్జాల జీవనాయ
భక్తజన హృదయాంభోజ భాస్కరాయ
నిన్ను సతతంబు మదిలోన నిల్పనాయ
మథిత గజదనుజాయ నమశ్శివాయ -

పై పద్యాన్ని పరిశీలిస్తే. 'నిల్పనాయె'' అని వ్రాయడానికి మారుగా పైపాదలలోనూ క్రింది పాదంలోనూ ఉన్న ''జీవనాయ - భాస్కరాయ - శివాయ'' అనే 'య' వర్ణంతో ముగిసిన సంస్కృత చతుర్థీ విభక్త్యంత పదాలను చూచి అంత్యప్రాస దృష్టితో వ్యావహారిక భాష ప్రభావంతో ''నిల్పనాయె''- నిల్పన్ ఆయె అన్న పదంలోని ''ఆయె'' ''ఆయ''గా ప్రయోగించబడినట్లు చూడవచ్చు.

శేషగిరిరాయకవి సులభశైలిలో కథా ఘటనలను ఆధారం చేసుకొని నీతిబోధలను చేస్తున్న వివిధ విషయాలతో విరాజిల్లుతున్న కొన్ని పద్యాలను చవిచూడండి

తే. హద్దుమీరి చరించిన యతివ భువిని
భంగ పడకుండ బోదు, శూర్పణఖ ముందు
ముక్కు కోతల బడిపోదె విక్కివీగి
మథిత గజదనుజాయ నమశ్శివాయ. - 72

ఈ పద్యం రామాయణంలోని శూర్పణఖ పరపురుషాపేక్షతో హద్దుమీరి ప్రవర్తించి లక్ష్మణునిచే ముక్కుచెవులు కోయించుకున్న ఘట్టాన్ని మనముందు సాక్షాత్కరింప జేస్తుంది.

ఈ పద్యంలో 'విక్కివీగి' అనే నుడికారం ''నిక్కినీల్గి'' అనే అర్థంలో ప్రయుక్తమైంది.

తే. ఎట్టి ఘనుడైన దన బల మెదుటి బలము
నెరిగి పోరంగవలె, నని నరుని సుతుడు
కురుబలము నొంటిగా జొచ్చి కోలువోడె
మథిత గజదనుజాయ నమశ్శివాయ. 46

ఈ పద్యంలో - రాజనీతిలో అంతర్భాగమైన యుద్ధ నీతిని చక్కగా వివరించాడు. శత్రుబలాన్ని తెలుసు కోకుండా యుద్ధరంగంలోకి ఉరకడం యెంత మూర్ఖత్వమో, యెంత హాని కరమో తెలియచెప్పడానికై అభిమన్యుడు తన బలాన్ని, ఎదుటి బలాన్ని గ్రహించకుండా కురుసేనను జొచ్చి ప్రాణాలు కోల్పోయిన కథా ఘట్టాన్ని సహేతుకంగా ఉటంకించి పఠితలకు పద్మవ్యూహంలో ప్రాణాలు కోల్పోయిన అభిమన్యుని యుద్ధ ఘట్టాన్ని కనులముందు కదిలేలా చేసి, తాను చెప్పదల్చుకున్న యుద్ధనీతిని సూటిగా చెప్పాడు.

ఇదే విధంగా భాగవతంలోని శుక్రుని కథాఘట్టాన్ని

దృష్టిలో పెట్టుకుని నీతి స్ఫోరకంగా ఈ పద్యం విరచించాడు-

తే. దాత ధర్మంబుసేయ నాతంక పరప
కూడ దితరుల కెందు, శుక్రుండు బలికి
నడ్డుపడి వామనునిచేత గుడ్డియయ్యె
మథిత గజదనుజాయ నమశ్శివాయ. (77)

శివపురాణంలోని మన్మథ దహనానికి దారితీసిన ఘట్టాన్ని దృష్టిలో పెట్టుకుని ఈ క్రింది పద్యం చక్కగా చెప్పాడు.

తే. బలిమిగలిగిన వానితో పగ్గటించి
చేతగాని నరుండెట్లు చెడకపోవు
నిమ్న జెనకిన మదను డే వేర్పుగాంచె
మథిత గజదనుజాయ నమశ్శివాయ. (8)

వైష్ణవభక్తుడైన విప్రనారాయణుని వృత్తాంతాన్ని స్వీకరించి యీ క్రింది పద్యంలో చక్కగా విడమర్చి నీతిని బోధించాడు:

తే. ఎంత దృఢమతినైన బో నిందుముఖులు
కరుగ దీసి గులాముగా బరపుటరుదె
మరులుగొల్పదె విప్రుని మధురవాణి
మథితగజ దనుజాయ నమశ్శివాయ. (5)

ఈ విధంగా పై పద్యాలలో ఒక్కొక్క పద్యం ఒక్కొక్క కథాఘట్టాన్ని గోచరింపచేస్తూ నీతిబోధకమై విరాజిల్లు తుంది. కథా ఘట్టాలను సందర్భోచితంగా-నీతి స్ఫోరకంగా మలచడం ఈ కవి ప్రత్యేకత. ఈ ప్రత్యేకతకు పై పద్యాలలో ఉపమానాలుగా స్వీకరించబడిన కథాఘట్టాలే నిదర్శనాలై నిలుస్తాయి. అయితే ఈ కవి తనకు పూర్వం ప్రచారంలో వున్న నీతి శతకాలలోని నీతులకు ప్రభావితుడై ఆయా నీతులను తన శతకంలో కూడా తన రచనద్వారా తిరిగి వ్యక్త పరచకుండా ఉండలేక పోయాడు. అవి యివి:

తే. దక్షు డీల్గిన గృహము నిర్జనము మాన
హీనమై జెడు నెట్లన నేర్పరింతు
గండుబడిన తటాకంబు కరణి పుడమి
మథిత గజదనుజాయ నమశ్శివాయ. (27)

ఈ పద్యం దక్షుడు లేనియింట - అనే భాస్కర శతకంలోని పద్యానికి ప్రతిబింబం. అదే విధంగా -

తే. తన నెలవు దప్పినంతనె తథ్యముగను
మిత్రులే శత్రులౌదురు మిహిర రుచుల
వనజములు డిగ్గియలు బాసి వాడకున్నె
మథిత గజదనుజాయ నమశ్శివాయ. (38)

తే. బలిమి గలవాడనని గర్వపడుట గూడ
దుర్విలోన నెట్లన్న నొక్కవేళ
చీమలకు జిక్కడే ఫణి చిత్రముగను
మథిత గజదనుజాయ నమశ్శివాయ.

ఈ రెండు పద్యాలూ '' కమలములు నీటబాసిన-తమ మిత్రులు శత్రువౌట తథ్యము సుమతీ'', ''బలవంతుడ నాకేమని - చలిచీమలచేత జిక్కి చావదె సుమతీ.'' అనే సుమతీ శతక పద్యాలకు ప్రతి రూపాలై కనిపిస్తున్నాయి. అయితే యీ కవి పై పద్యాలలో ఆయా శతకకారులు ఆయా పద్యాలలో వాడిన రూఢి పదాలనే గ్రహించి వాటికి పుత్రికలుగా శోభిల్లే విధంగా తన పద్యాలను రచించాడు.

చామర్తి శేషగిరి కవి తన శతకంలో నేటి కాలానికే కాదు సర్వకాలాలకు సైతం ఉపయుక్తాలైన విషయాలను స్వతంత్ర ప్రతిపత్తితో రచించి సమాజాన్ని ఉద్బోధించాడు.

తే. తనను దా మెచ్చుకొన్న సార్థక్యమేమి
గలుగు నరునకు? తమివోని కాంత ఎలమి
స్వకుచ మర్దన మొనరింప సౌఖ్యమగునె
మథిత గజదనుజాయ నమశ్శివాయ. (15)

తే. వచనమిచ్చి తొలంగినవాని గుణము
హీనమనదగు బోగము చాన పగట
నొకని రమ్మని రేయి వేరొకని గూడు
మథిత గజదనుజాయ నమశ్శివాయ. (19)

చామర్తి శేషగిరికవి కేవలం లౌకిక విషయికనీతి పద్యాలేకాక, అలౌకిక వేదాంత విషయాలను సైతం సరసంగా, సుబోధ కంగా వివరిస్తూ కొన్ని పద్యాలను రచించినాడు. మచ్చుకొ కటి.

తే. ఇహము సాధించలేని వాడేమి పరము
సాధనముచేయు నప్రయోజకుడు ధరణి
నింటగెల్వక రచ్చ దా నెట్లు గెల్చు
మథిత గజదనుజాయ నమశ్శివాయ. (83)

తే. మాయ విడిపోయి బ్రహ్మంబు బట్ట
బయలుగా గానుపించు నభ్రములు విడిన
కర్మసాక్షి విడంబించుకరణి ధరణి
మథిత గజదనుజాయ నమశ్శివాయ. 92

'నమశ్శివాయ శతకం' లో మామూలుగా తాళపత్రగ్రంథా లలో కనిపించే లేఖన, భాషాదోషాలు - అక్షరదోషాలు అనేకం వున్నాయి. వీటి నన్నింటినీ నిర్దుష్టంచేసి పరిశీలిస్తే కవి రచనా పాండితీ గరిమలు మనకు గోచరమవుతాయి.

# మంజరీ మధుకరీయము -
# తొలి తెలుగు నాటకం

శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు

ఇది శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారు రచించిన నాలుగు అంకముల నాటిక. దీనిని గూర్చి శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు ఈ క్రింది విధముగా వ్రాసినారు - ''... ఈ నాటిక 1860 సం. ప్రాంతమున రచింపబడియుండెను. పురాణాదుల నుండి సంగ్రహించినదికాదు. ఇది ప్రస్తుతపు రంగ వ్యవస్థలను బట్టి ప్రదర్శించుట కనుకూలము కాకున్నను ప్రాచీన సంప్రదాయములననుసరించి స్వపాండిత్య ప్రకర్షయే ముఖ్యముగా కవులందఱు తలచుచుండెడి కాలమున వ్రాసిన గ్రంథమగుట బ్రదర్శనయోగ్యములగు నాధునిక నాటకముల కంటె కించిద్భిన్నమై యుండినను ఆంధ్ర వాఙ్మయమున నాటకశాఖకు మూలమగు గ్రంథములలో నొక్కటియై యుండుననుటకు సందియముండదు ... (ఘనవృత్తపీఠిక - పుటలు 18-19). కథ అపూర్వము స్వకపోలికల్పితము అగుటచేతను, ప్రతులు అలభ్యములగుటచేతను ముందుగా కథను సంగ్రహముగా వివరింతును

1వ అంకము - రాజకుమారి యగు మంజరికి యౌవనోదయమైనది. ఆ సమయమున శరీరమందు కలిగిన నూత్న వికారము లామెకు అర్థముకాలేదు పాటమరించిన పాలిండ్లు మొదలగునవి ఆమెకు కంతులు మొదలగువానివలె తోచినవి. మందిప్పించుమని తల్లియగు సంతానవల్లితో చెప్పెను. ఆమె సిగ్గుతో కుమార్తెకు అసలు విషయము చెప్పలేకపోయినది. కాని, తన పుట్టినింటనుండి మంజరి వయస్యయగు ఆమోదరేఖను రప్పించి ఆమె నందులకు నియోగించెను.

2వ అంకము - ఆమోదరేఖ సకలవిద్యా ప్రవీణ. ఆమెవలన అసలు విషయము నెఱింగి మంజరి తన అజ్ఞతకు సిగ్గిలినది. ఆమోదరేఖ ఇదివరకే మంజరికి గానకళ నేర్పినది. ఇప్పుడు సాహిత్యము చెప్పుటకు పూనుకొనినది. అచిరకాలములోనే మంజరి సర్వమును గ్రహించినది. (విద్యాభ్యాసములోని ఆయా దశలను ప్రబంధధోరణిలో వర్ణించుట జరిగినది. రంగ విభజనలేదు.) ఒకనాడు వారిరువురు ఉద్యానవనములో నుండగా కుంభస్తని యను చేటిక వచ్చి చండయోగిని యనునామెను సందర్శించుటకు మంజరిని అంతఃపురమునకు తీసికొని వెళ్ళెను. చండయోగిని క్షుద్రమంత్రోపాసకురాలు, సామంత రాజకన్యల కుమార్తెలకు గురువు. మంజరి వారందఱి కంటె పండితురాలని ప్రతీతి వహించుటచే ఆమెను వాదము నందుకాని మాయోపాయమునకాని జయించుటకే చండయోగిని వచ్చెను. ఉద్యానవనమందు ఆమోదరేఖ వేచియుండగా మనోజ్ఞ యనుచేటి వచ్చి మంజరికి చండయోగినితోనైన వాగ్వాదమును వర్ణించి చెప్పెను. అంత నామె అంతఃపురమునకు బయలుదేరును.

అచ్చట చండయోగినితో ఆమోదరేఖయు, ఆమె గురువైన రాజయోగినియు వాదించిరి. ఒండొరులు మహిమలు చూపుకొనిరి. చండయోగిని ఓడియు బీరములు పలుకుచు వెడలినది.

3వ అంకము - ఆమోదరేఖ వయస్యయైన సంయమి, ఆమె చెలి సుమతి అను తపస్విను లిద్దరు ఆమోదరేఖామంజరులకు వచ్చిన ఆపదను గూర్చి చెప్పుకొందురు. మంజరి ఒకనాడు కలలో ఒక రాజచంద్రునితో రతిసుఖమనుభవించి, ఆ పారవశ్యముతో వానినిగూర్చి పద్యములు ఆశువుగా చదువసాగినది. అది తెలియక అందరును కలతనొందిరి. ఒకనాడు వారు ఉద్యానవనములో తిరుగుచుండగా చండయోగినిచే నియమితుడైన ఒక రాక్షసుడు హరిణరూపుడై ఆమోదరేఖామంజరులను తన కొమ్ములనందున నిరికించుకొని ఆకాశమున కెగసెను. వీరిట్లు మాటలాడుకొనుచుండగా ఒక కాపాలిక వచ్చి ఇట్లు చెప్పెను - కలలో మంజరితో ననుభక్త సంయోగ సౌఖ్యుండగు మధుకర రాజపరమేశ్వరుడు విరహియై, అరణ్యములో తిరుగుచు ఆకాశమున నెగురుచున్న ఆ హరిణమును బాణముతో కొట్టెను. అంతట రాక్షసుడు నిజరూపమునుతాల్చి, మంజరీ, ఆమోదరేఖలను కల్పితమగు ఒక ఆయసపు పెట్టెలో పెట్టి దూరముగా విసిరివేసి, మధుకరునితో యుద్ధమొనర్చి, నిహతుడయ్యెను, పెట్టె ఏమైనదో మధుకరునికి తెలియలేదు. - ఇట్లు చెప్పిన తరువాత ముగ్గురును నిష్క్రమింతురు.

మంజరివార్త తెలియక విలపించుచు రాజమాత అగ్నిప్రవేశము చేయనున్న సమయములో కాపాలికాకల్పితమగు ఒక మణిఘంటిక ఒక లేఖతో కూడ ఆమె చేతిలోపడెను. మంజరి క్షేమముగా తిరిగివచ్చునని అందులోనుండుటచే ఆమె ఆనందమొందెను. రాజయోగిని శాపముచే చండయోగిని ఉన్మాదిని యైనట్లు తెలిసినది.

4 వ అంకము : మధుకర చక్రవర్తి భార్యయగు హేలావతి ఎదుట ఆ పెట్టెపడెను. ఆమె మంజరీ, ఆమోదరేఖలను దానినుండి తీసి, తన అంతఃపురమున రాజుకంట బడకుండగ దాచెను. రాజు ఎందులకు విచారముతో నుండెనో ఆమెకు తెలియలేదు. ఈ విషయములను కుంభస్తనియను చేటిక విదూషకునితో చెప్పెను. అది నిష్క్రమింపగానే కంచుకి వచ్చి విదూషకుని రాజునొద్దకు గొంపోవును. విదూషకుడు రాజు చెప్పినదానిని కుంభస్తని చెప్పిన దానిని సరిపోల్చుకొని, యుక్తిపన్ని రాణి రాజును ప్రసన్నుని చేసికొనునట్లు చేయును.

విదూషకుని భార్య యుక్తివలన ఒక విప్రశ్నికవచ్చి ఖేచరస్త్రీ సందర్శనమువలన రాజు స్వస్థుడు కాగలడని చెప్పును. మందసములో నున్నవారిని ఖేచర స్త్రీలనుగా భ్రమించి రాణి, ఆమోదరేఖ రాజునకు కన్పడునట్లుగా చేయును. (చిన్నదియగు మంజరిని చూచినచో రాజు మనస్సు చెదరునని ఆమె భయము.)

రాజు, విదూషకులు ఉపాయాన్వేషణము చేయుచు క్రీడాశాలకు రాగా, అచ్చట మంజరి కన్పట్టును. మధుకరుడు మంజరి పాణిని గాంధర్వవిధిచే పరిగ్రహించెను. ఇంతలో రాణి వచ్చి అల్లరిచేసెను. రాజు వెడలిపోగా రాణి ఆమోద రేఖామంజరుల నిరువురను చెఱసాలలో వేయించెను.

రాజు చర్యకు రాణి చింతిల్లుచుండగా ఆమె పినతల్లినుండి ఒక లేఖ వచ్చెను. దానినిబట్టి మంజరి రాణికి పినతల్లి కుమార్తెయని స్పష్టమైనది. రాణి పశ్చాత్తాపపడెను. చిన్నతనములో మంజరిని చూచినప్పుడే ఆమెను తనకు సపత్నిగా చేసికోదలచినదట.

రాణి రాజునొద్దకువచ్చి క్షమాభిక్ష కోరెను. మంజరికి దేవీపద మిచ్చి తాను 'భట్టిని' అగుటకు సమ్మతించెను.

రాణి మంజరిని తీసికొనివచ్చి రాజుచే పాణిగ్రహణము చేయించెను.

నాట్యశాస్త్రమందు నాటీ (నాటకా) లక్షణ మీ క్రింది విధముగా నీయబడినది - ''వస్తువు ఉత్పాద్యము నాయకుడు - రాజు; నాయిక - అంతఃపురకన్య లేదా సంగీత శాలా కన్య; అంకములు - నాలుగు. మఱియు నాటిక స్త్రీ ప్రాయము; లలితాభినయాత్మకము (కైశికీవృత్తి ప్రధానము); బహునృత్త, గీత, పాఠ్యయుక్తము; రాజోపచార సహితము; ప్రసాధన క్రోధ దంభ సంయుక్తము; నాయక, దేవీ, దూతీ, పరిజన యుక్తము; రతిపురస్సరమగు రాజ్యప్రాప్త్యాది ఫలోపేతమును కావలెను.'' (18 వ అ.)

పై నాటికాలక్షణములన్నియు ఈ మంజరీమధుకరీయమునకు పట్టుచుండుటచే దీనిని నాటిక యనుట సమంజసమే. నృత్తము, అధికరాజ్యప్రాప్తి మాత్రము ఇందులేవు. ఇవి ముఖ్యలక్షణములుకావు. అచ్చటచ్చట కొన్ని కల్పనలను విడిచివేసినచో తక్కిన కథయంతయును సంస్కృతరూపక సామాన్యమైనదే. మంజరీమధుకరులు కలలో రతిసౌఖ్య మనుభవించుట ఉషానిరుద్ధుల కథను జ్ఞప్తికి తెచ్చుచున్నది. ఇందలి నాయికా నాయకులు మంజరీ, మధుకరులగుటచే దీనికి మంజరీ మధుకరీయ మను పేరుపెట్టబడినది. నాందిలో 3 వృత్తములు, ఒక సీసమును కలవు, కాన, ఇది అష్టాదశపద నాంది యగుచున్నది. ఇందు కవి శ్రీరాముని, విష్ణువును, లక్ష్మిని స్తుతించెను. కవి శ్రీరామ మంత్రోపదేశమును పొందినవాడుకదా! నాంద్యంతమున సూత్రధారుడు సూర్యోదయ, వసంతకాలాది వర్ణనములను గావించి భద్రాద్రి శ్రీరాముని మరల స్తుతించెను. ఈ వర్ణన లన్నియును బహుదీర్ఘములుగా, కావ్యధోరణిలో సాగినవి.

కాళిదాస భవభూతి ప్రభృతులచే రచింపబడిన రూపకంబు లనెల్ల తఱచుగ పరికించుచుండిన సభాస్తారులు అన్యాభిలాషులై, క్రొత్తరూపకము నొక దానిని నిరూపింపుమని సూత్రధారుని కొక లేఖను పుత్తెంచినారట. అందు మీదట మారిషునిచే ప్రబోధితుడై సూత్రధారుడు సకల సరస పదార్థ కుసుమ వనీవాటియగు ఈ మంజరీమధుకరీయమును ప్రదర్శింప సమకట్టెను. నటియగు సంగీతశారిక ద్విపదలో ఋతుగాన మొనర్చెను, ఇది ధ్రువ యని పేర్కొనబడినది. దాని నాధారముగ చేసికొని సూత్రధారుడు ప్రథమాంక కథా పరిచయము సూచనామాత్రముగ చేసినాడు. ఇంక మారిషుడు, చంద్రరేఖ యను నటి మంజరీ భూమికను, తరంగిణి యను నింకొక నటి ఆమోద రేఖావేషమును ధరించి రంగమును ప్రవేశింపనుండుటను సూచించెను. అంతట ఇరువురు నిష్క్రమించిరి. ఇంతటితో సుదీర్ఘమైన (10 1/2 పేజీలు) ఈ ప్రస్తావన ముగిసినది.

వీరి శైలి తెలియుటకై ప్రథమాంక ప్రారంభమందలి ఆమోదరేఖా మంజరుల సంభాషణమును, అంతమునందలి

దేవీమధుకరుల సంభాషణమును కొంత ఉదాహరింతును. (పుట 127, పుటలు 236-37)

(అనంతరంబున మంజరియు నామోదరేఖయుం బ్రవేశించుచున్నారు.)

ఆమో: హళా! మంజరి! సుమాళంబుగ నుంటివిగదా.

మంజ: అత్తికా! నీవు వచ్చుట నింకనింక యద్ధి కలుగునని నెమ్మనంబున నే నమ్మెదనే.

ఆమో: హలా! యిట్లంటివేమే?

మంజ: అత్తికా! నీవు నా చెంగట నుంటివే.

ఆమో: హలా! నీ కురంగట నవ్వ మొదలుగల వారంద రున్నారు గదా.

మంజ: అత్తికా! యీ యవ్వ తొల్లింటి యవ్వ యనుకొంటివే.

ఆమో: ఇప్పుడు గ్రొత్తగ మఱియొకతె యేతెంచెనే?

మంజ: కాదే, యవ్వయయిన యద్దియేకాని దాని యాత్మ మారినదే.

ఆమో: ఓసీ చెలియా, కాదే, తొల్లింటికంటె నీ యాత్మ మారినదే. దాని నెఱుంగక యమ్మను వింతగ దూరుచున్నావు.

మంజ: అత్తికా! నీవు కొన్నినాడులు దడవున నుండుట నీ యాత్మయుం దాఱుమా అయ్యెనని దలంపదగునే.

(రాజు...విదూషకమాత్ర సహాయుండై నిరీక్షించుచున్నాడు. దేవి...అభిముఖంబుగ నేతెంచి మంజరినిం బ్రణతి యొనరింపు మని వినిచి మ్రొక్కించి వినీతాత్మ యగుచు)

దేవి: ఆర్యపుత్ర! విజయంబు నొందుము. విజయుంబు నొందుము. మన యల్పభాగ్యంబువలన బిన్నమ్మ పంపిన యక్కమ్మ నా తావునకుం జేరెగాన దీనికి నాకుం జిరకాలంబు మనికి యింపొందె. ఇంతకు నపయశంబు నాకుం బొడమకుండ నాకమ్మ యిగ్గొడవలకుం దొలుత నేతెంచె. దీన మనమందరము వెలలేని లగ్గులకె పాల్పడి యున్నారము. కావున సంశయంబువీడి దీని జేకొమ్ము. ఈమీద దేవి శబ్దంబు దీనికిం భట్టినీ శబ్దంబు నాకునుం గలుగుగాక (అని మంజరికరంబు ప్రియుని కరంబున నునిచి) ఇంక నీయెడ నే యభిమతం బొడగూర్తును.

రాజు: (ప్రసన్న వదనుం డగుచు)

గీ. తొలుత బొడమిన కోపంబు త్రుంగణంచి
యాదరంబున దాని నా యాలు జేసి
మోద మొనరించితివి నీవు ముదముతోడ
నింతకంటెను బ్రియమెద్ది యిపుడు చెపుమ.

అయిన నీ భరత వచనం బగుగాత.

గీ. సకల జీవులు సంపూర్ణ సౌఖ్య లగుచు
దైవతానుగ్రహంబున ధైర్య మమర
చిరసమయ ముపహిత బుధసేవు లగుచు
మనుచు నుందురు గావుత మహిమమీర.

(ఇట్లని యథోచితంబున నందఱు వెడలుచున్నారు.)

ఇట్లు సాధారణముగా సంభాషణ లన్నియును సరళము గానే నడచును. అచ్చటచ్చట కొన్ని సంభాషణలును ముఖ్యముగా కొన్ని వర్ణనలును జటిల, దీర్ఘసమాస భూయి ములుగా కూడ నున్నవి. కొన్ని చోట్ల సంభాషణము పద్యములలోనే నడచినవి. అసలు సంభాషణలను చేయించు లోను, వినుగు కలిగింపకుండ వాటిని దీర్ఘముగా కొనసాగిం టలోను కవిగారికి గొప్ప ప్రతిభ ఉన్నది. ఈ సంభాషణ కొన్నిచోట్ల ప్రబంధధోరణిలో వర్ణనాత్మకముగ నుండు దృశ్య కావ్యమునందు దీనిని ఒక లోపముగానే ఎంచవ యున్నది. ఇది డెమ్మీసైజులో, చిన్న అక్షరములలో 23 పుటలున్నది. సంభాషణలను సాగదీయుటవలననే ఇం పెరిగినది. ప్రదర్శనయోగ్యముగా చేయవలెనన్నచో సం ప్తము చేయవలసిన అవసర మెంతేని కలదు.

సంస్కృత రూపకములందు తత్తత్పాత్ర విశేషంబుల ప్రాకృతభాష రూపకానుశాసనవిహితమై యున్నది. మ తెలుగులో ఏ పద్ధతి ననుసరింపవలెనను సందేహము కవిగారి కలిగినది. కాని (1) వసంత తిలక, వల్లీవల్లవోల్లాస, శృంగా రంగాది భాణంబులు రూపక విశేషంబులయ్యును ప్రాకృ మిశ్రంబులు కాక ననిమిషభాషయందు సవిశేషంబుగ జూప చున్నవి; (2) మిశ్రంబులయందు గ్రథితంబగు ప్రాకృత బును ఛాయ వీడి సకలజనంబుల కానంద విధాయకం గానేరమి సంభవించుచున్నది; (3) ఆ మిశ్రరూపకంబు యందును ఒక్కొక్క చక్కిం బ్రాకృత వ్యవహార యోగ్యం లయిన పాత్రంబులును సంస్కృతం బాశ్రయించి వచించు కలదు. ''అందుచే ప్రాకృతభాష లేమి అంత నిషేధాప కంబు కాదని తలంచి సంచితోత్సాహు సంస్కృతాం మిశ్రంబుగా బ్రాచీనానుశాసనోక్త లక్షణ ల తంబగునటుల తమ రూపకమును విరచించినారు. 'ప్రాకృతభాష లేవి అనుటలో కవిగారు తెలుగు భాషకు సంబంధించి వ్యాప కము నుద్దేశించి చెప్పియున్నారని తలంచుచున్నాను. ఇం 'సంస్కృతాంధ్ర మిశ్రంబుగా' రచించితి నన్నప్పు సంస్కృత మనగా తత్సమ మనియు, ఆంధ్ర మనగా తద్భ దేశ్యము లనియు గ్రహింపవలసి యున్నది. సాధారణముగ

ఇందలి ఉత్తమ పాత్రలు తత్సమ బహుళమగు భాషను, స్త్రీ, నీచపాత్రలు తద్భవ, దేశ్యబహుళమగు భాషను

అవలంబించి మాటలాడుట గమనింపదగును. కుంభస్తని మాటలు వ్యావహారిక సన్నిహితములుగా కూడ నున్నవి.

అంకమంతయును ఒకే రంగముగా నుండుటయు, అందుల, కాలైక్యములు పాటింపబడుటయు సంస్కృత రూపక సంప్రదాయము. శ్రీ కవిగారు కూడ ఆ పద్ధతినే అవలంబించినట్లు కన్పట్టినను ఇందు రెండు ప్రధానములగు లోపములున్నవి - (1) అంకములను విభజించుటలో కాలైక్యముకాని, స్థలైక్యముకాని పాటింపబడలేదు. అంతియే కాక మొదటి అంకము 12 పుటలుకాగా చివరి అంకము 125 పుటలున్నది. (రెండు, మూడు అంకములు చెఱి నలుబదియైదు పుటలున్నవి.) రెండవ అంక ప్రారంభములో మంజరి సాహిత్యాధ్యయన ప్రారంభము చెప్పబడినది. అంకము సగమైనను కాకుండగనే ఆమె పండితురాలైపోయి నది. ఆమె అధ్యయన ప్రకారమును కవి తానై వర్ణించుట మాత్రమే జరిగినది. దృశ్యకావ్యమునం దిది అసంగతము.

(2) కవి రంగవిభజనము చేయకపోయినను రెండవ అంకమందు 4 రంగములును; నాలుగవ అంకమందు ఇంచుమించుగా 8 రంగములును కలవు. స్థల, కాలములు భిన్నములగుటచే వీటి ప్రదర్శనము కష్టసాధ్యము కాగలదు.

సంస్కృత రూపకకర్తలు కాని, లక్షణకర్తలు కాని తెరలు, సెట్టింగులు మొదలగు వాటిమీద దృష్టి నిలుపలేదు. ఆ లోపమును పూరించుకొనుటకు వారు రెండు ప్రధానసాధ నము లవలంబించినారు-(1) కవి వర్ణనలచేతనే ఆయా వాతావరణ భావన కల్పించుట; (2) నటులు ఆంగికాభిన యము చేతనే అధ్వగమనాదులు, ఆరోహణాదులు నిరూపిం చుట. మొదటి దానిని కవిగారు బాగుగా వినియోగించుకొని నారు; అంతియేకాదు కొన్నిచోట్ల వర్ణనలు మితిమీరినవని యును చెప్పవచ్చును. రెండవ దానిని నటులు పూర్తిగా వినియోగించుకొనినను ప్రవేశ నిష్క్రమణాదులు కొన్నిచోట్ల సహజములుగా కన్పట్టవు.

కథాకథనమునందు కవిగారు రెండు చక్కని పద్ధతులను అవలంబించినారు (1) ప్రేక్షకుల లేదా పఠితల కుతూహల మును రేకెత్తించుటకు గోప్యార్థ గోపనము చేయుచు, సరియైన సమయములో అసలు విషయమును వ్యక్తము చేయుచుండుట. ఆయసవు పెట్టె మాయమగుట, మంజరీ మధుకరుల విరహకారణములు, దేవి ప్రయత్నములు మొదల గునవి పెక్కులు ఇందుల కుదాహరణములు. (2) స్పష్టత కొఱకును, ముఖ్య విషయము లేదా క్లిష్ట కల్పనము ప్రేక్షకుల దృష్టినుండి తప్పిపోకుండుటకును ఒకే విషయమును రెండు, మూడుసార్లు చెప్పించుట; అట్లు చెప్పినను వినుగు కలుగ కుండ చేయుట, చెప్పినదానినే మరల చెప్పుటను సాధారణ ముగా మనవారంగీకరింపరు. కొందఱు పాశ్చాత్యులు దీని నంగీకరింతురు. తక్కిన కావ్యములమాట ఎట్లున్నను, రూపకము ప్రదర్శన ప్రధానమగుటచేతను, ఒకసారి దృశ్యము జరిగిపోయినచో పునరవలోకనమునకుగాని, జరిగినదానిని గూర్చి ఆలోచించుటకుకాని అవకాశము లేకపోవుటచేతను స్పష్టతకొఱకు మరలమరల చెప్పుట అవశ్యకమే. Benavente అను స్పానిష్ రూపక కర్త ఈ క్రింది విధముగా చెప్పినాడు.

"Everything that is of importance to the proper understanding of a play must be repeated at least three times during the course of the action. The first time half of the audience will understand it; the second time the other half will understand it: only at the third repetition may we be sure that everybody understands it, except, of course, deaf persons and 'some critics'." (A study of the Modern Drama by B.H Clark-page 8.)

Scribe అనెడి ఫ్రెంచి రూపక రచయిత ముఖ్యాంశములనెల్ల ప్రథమాంకమందే ముమ్మారు చెప్పెడివాడట. రెండుసార్లు చెప్పుట ఇబ్సెన్‌లో కూడ ప్రధానముగా కన్పట్టును. పాశ్చాత్య సాహిత్య ప్రభావము ఏమాత్రమును లేనివారీ రామచంద్ర కవిగారు. కాని పై పాశ్చాత్య సి ంతముతో ఇప్పట్ల వారి రచన సంవదించుట చిత్రము. రంగ మునందు భోజనాదులను మనవారు నిషేధించినారు. కా ఇందులో విదూషకుడు రంగముమీద ఫలహారము తృప్తికరముగా జేసి గఱ్ఱున త్రేన్చినాడు. మొత్తమున కీ మంజరీమధుకరీయము సంస్కృత రూపక లక్షణ విహితమే అయినను, కొన్నిచోట్ల రామచంద్ర కవిగారు క్రొత్తపోకడలను ప్రవేశపెట్టినారు. భాష సరళమును గాదు, జటిలమును గాదు. సంక్షిప్త మొనర్చి, చిన్న చిన్న మార్పులను చేసికొన్నచో ప్రదర్శన యోగ్యము కాగలదు.

– 'స్రవంతి' సౌజన్యం

# శ్రీమద్రామాయణ కల్పవృక్షము - ఆత్మతత్త్వ విచారణ

శ్రీమతి జె. హేమలత

విశ్వనాథ వారి జీవుని వేదనకు ఫలముగ నావిర్భవించిన మహాకావ్యము శ్రీమద్రామాయణ కల్ప వృక్షము. జీవుని వేదన యనగ ఆత్మ జిజ్ఞాస. తత్ఫలము అద్వైత దర్శనము. ఆ అద్వైత దర్శనమున కక్షర రూపమే కల్పవృక్షకావ్యము.

ధవళోజ్జ్వల తేజో రూపుడు, జ్యోతి స్స్వరూపుడు, ఆద్యంత రహితుడు, ఆత్మసాహిత్య పరమ సూక్ష్మ రస బిందు స్వరూపుడు అయిన వానిని దర్శించి తరించవలెనని విశ్వనాథ వారి ఆకాంక్ష. శశిఖండ లాంఛనుని ఆనందతాండవ మును దర్శింపవలెనని, ఆసమయము నందలి కింకిణీనాదము వినవలెనని ఆయన కోరిక. కాని తన కోరికలు సిద్ధించుటకు మార్గము సుగమముగ కనిపించలేదు. బ్రతుకంతయు జన్మాం తర సంగతమయిన పాపపు పుట్టగ గోచరించినది. కామా దులు చుట్టు ముట్టి యుండుట గమనించినారు. దానిని విచ్ఛేద మొనర్చు మార్గము తెలియక ఖేద పడినారు. 'నీభక్తుడు శోభనాద్రిదగు సంతానంబు జన్మాద్యపాయము దప్పించుత! యెన్ని పుట్టువుల పెట్టైతిన్ శివా! యేమి కామము! కోపంబది యేమి? ఏమి యగు నీ మాత్సర్య మోహో ప్రభూ!' యనుచు జన్మజన్మలుగ కామాదుల పాలైనందుల కార్తి చెందినారు. తన తపము పండి జన్మజరా రహితుడగు నట్లను గ్రహింపుమని ప్రార్థించినారు. ఆదిని బంధహేతువయిన మోహకోపకామాదులను త్రుంచి కోదలచి నారు కావున 'వాద సమాగత మోహకోప కామాదుల చేత గట్టుపడునట్టుల జేయకువే మనపతీ!' యని దీనముగ వేడుకొనినారు. మానవుని చిత్తము కడు చంచలమైనది. అందుకే 'కోతి వంటి మనసు' అందురు. భగవద్ధ్యానమున నున్నంత సేపు బాగుగనే యుండును. మరల చిత్తము లౌకిక విషయములపై మరలును. 'నిను మదిలోన నెంచు తఱి నేనొక యోగిని, నీవునా మనస్సున జొర రానివేళ బురసూదన! నన్నును మించి పాలనుండని ధరనుండ బోవ'డని తనను, తనకు సహకరించని మనసును నిందించు కొనుచు తననట్లు 'ఎత్తి కూల వేసిన గతి చేయకు' మని అర్థించినారు. విశ్వనాథ వారు తన పూర్వార్జిత పుణ్యఫలము గనో, ఈ జన్మలోని సాధన ఫలముగనో ఆత్మానందము నొక్క లిప్తకాలము పాటు దర్శింప గలిగినప్పు డా యనుభూతిని శాశ్వతముగా నిలుపుకొనలేక పోయితినని నిర్వేదము నొందినారు. లోకమున కొందరు తెలిసిన మూఢు లుందురు. వారికి సత్యానిత్యముల గూర్చి తెలియదు. కాని అంతలోననే మాయలో పడిపోవుదురు. అట్టి వారిలో దానుజ్జ్వల తరుడనని భావించుచు 'జంతుతతి జన్మలు భ్రాంతులు చావులన్నియుందెలిసియు బిట్టు చీకటుల తెన్నున బొప్పెలు కట్టు చుండె'నని దురపిల్లినారు. ఆ యంధకార మును దాటుటకై 'నీ వెలుతురు లోనికిం గొనుచు వెళ్ళవె! మౌళి శశాంక రోచిషా'! అని జ్యోతిస్స్వరూపుని సహాయము నభిలషించినారు. తన జిజ్ఞాసయే గ్రీష్మతాపమై బాధింప 'తీవ్ర బాధమీ గ్రీష్మము నందు నన్నునుడికింపకువే! శశిఖండ లాంఛనా!' అని జీవన్ముక్తికై పరితపించినారు.

సాధకుడు స్వస్థానమును చేరుటకై ప్రయత్నముచేయు సందర్భమున నెన్నిమారులో క్రిందపడి భ్రష్టయోగియై మరల పైకి బోవ యత్నించును. విశ్వనాథ వారు మనోవికారములచే తాను అధోకృష్టుడగుచున్నను లెక్కసేయలేదు. తన ప్రయ త్నము మాన లేదు. ఉప్పు కడలి వంటి హృషీక రాశిని దవశిఖరేగగా తరచి ఆ దవాగ్నిని స్వీకరించి సుధను ప్రసాదింపుమని ఆర్తితో నాభగవంతుని యాచించినారు

విశ్వనాథ వారి విశ్వామిత్ర పాత్ర సృష్టి అద్భుతమైనది. కామాద్యరిషడ్వర్గ పరిభూత మనస్కుడైన మానవుడు అంచెలంచెలుగ తన శత్రువులను నిర్జించి స్వారాజ్యపదవినెట్లు పొందగలడో విశ్వామిత్రుని కథలో ప్రదర్శితమైనది. వశిష్ఠుని చేత పరాజయము పొందిన విశ్వామిత్రుడు బ్రహ్మత్వము నొందుటకై తప మొనరింప యత్నించెను. ఆ సంకల్పము తోడనే ఆతని మనసులోని మదమడగినది. తన తపఃఫల మును ధారపోసి త్రిశంకునకై స్వర్గమును నిర్మించినాడు. అందులకు కారణము మాత్సర్యము. తన తప్పిదమును

తెలిసికొని మాత్సర్యమును త్యజించినాడు. శునశ్శేపుని వృత్తాంతము నాటికి విశ్వామిత్రుడు కోపము నరికట్టలేదు. మరల తపమొనరించి కోపమును త్యజించిన పిదప ఋషి అయినాడు. మేనకా వృత్తాంతముతో కామ ముపశమించినది. కామక్రోధములు విడువని తాను బ్రహ్మర్షిత్వమున కనర్హుడ నని తెలిసికొనిన పిదపనే కామ ముపశమించినది. 'లౌకిక భోగ తృప్తి శబలత్వము మాలిన గుండెతో దపస్స్వీకృతి విఘ్నకారి' అని తలంచి కామము కోసి వేసి మరల తపమాచరించినాడు. బ్రహ్మ సాక్షాత్కరించినపు డాత డడిగినది తాను జితేంద్రియుడయినాడా? కాడా? యని మాత్రమే. మరియొక కోరిక అతనికి లేదు. 'కామ క్రోధములం జయించుటకు సంకల్పించి కాయంబు నానా మార్గంబుల శోష వెట్టుకొను చుండిన' తన మనసు మరల్ప యత్నించిన రంభను విశ్వామిత్రుడు శపించినాడు. మరల వివేకమును పొంది 'నాలో గ్రోధము పాయ దేవిధమునన్ నాపైని నాకున్' అని తెలిసికొని

'ఇంక గోపము తెచ్చికో నింక నసలు
పెదవి గదుపను శ్వాసమ్ము విడువ బోను
ఎంత వఱకు బ్రాహ్మణ్యము నేను గనుదు
నంతవరకును నది నిశ్చయంబటంచు'

ప్రతినవూని నిరాహారుడై, మౌనవ్రతావలంబియై ఆకలి దప్పులు తలపక తపమాచరించి సిద్ధి గనినాడు. ఇప్పుడాత డొక బ్రహ్మజ్ఞాని. జితేంద్రియుడైన అతనిని లోక మేవిధము గను లోభపెట్టజాలదు.

రామునిలోని అన్వేషణ మరియొక విధముగ కనిపించును. తాటక మరణ సందర్భమున విలవిల లాడుచు ప్రాణములు త్యజించుట చూచిన రామునకు దేహ సంబంధి విషయముల పట్ల వైముఖ్యము కలిగినది. జీవుడు మాయాపరివృతుడై యున్నాడను విషయమును గుర్తించగలిగినాడు. దేహము దుఃఖారామ మని గ్రహించినాడు. దేహమున జీవుడొక డాశ్రితుడై యున్నాడని తెలిసికొనినాడు. కాని అతడెవరు? వానిస్వరూపమేది? ఎందుచేత మాయావృతుడై యున్నాడు? వాని స్వస్థానమేది? అను సంశయములచే తాడితుడై వృద్ధ కృకలాసమట్లు నిర్వేదము నొందినాడు. బద్ధసామజమట్లు క్షోభము వహించినాడు. విరాగియైన రామునకు ధరాజాత ముఖాంభోజమే 'యేమోగా' తోచినది. 'చూచిన దానికై కనులు చూడవు. నాలుక తిన్నదానికై చాచదు. విన్నదాని కయి వీనులు సాగవు. లోయెడందలో దోచియు దోచనట్టి దయి దూరము దగ్గర కాని సందడి' చే రాపిడి కలుగగ తెలియరాని ఏదో వేదన ననుభవించినాడు. ఈ వేదన గ్రీష్మతాపమై మండించు చుండ ఆతాపమేమియని తెలిసికొన గోరినాడు. ఆత్మయనగా నేమి? ఆ యాత్మ జన్మపరంపర లతో నిత్య యాత్ర సాగించవలసినదేనా? అని సందిగ్ధు డైనాడు. ఈదృశ వేదనతో దేహమదగ్ధ దగ్ధమగు ననిపించినది. రాముడిట్లెంతో ఆయాసపడినాడు.

అట్టి రామునకు ప్రకృతి అంతయు తత్త్వోపదేశమొనరించు చున్నట్లనిపించినది. వృక్షములు దండకమండల కాషాయ శాటికాధారులై ఓంకార మొనర్చు యోగి పుంగవుల వలె కనిపించినవి. ప్రకృతిలో అల్పాల్పములుగ పరిగణింపబడు కాకి, నత్తగుల్ల, ముకుళీభూత పుష్పయుత శిరీష ద్రుమము వీటిలో కూడ తత్త్వమును దర్శించి అవగతము చేసికొని నాడు. కాకి వేపడొల్లను త్యజించు విధముగ నిస్సారమయిన లౌకిక విషయములను పరిత్యజించ వలయునని, నత్తగుల్ల లోనికి చొచ్చుకొని యుండు రీతి మానవుడాత్మోన్ముఖుడై యుండ వలయునని, ముకుళీభూత పుష్పయుత శిరీష ద్రుమము వలె ఐహిక విషయ నిరాసక్తుడై యుండ వలయునని గ్రహించినాడు. కాని కర్మజీవియైన మానవుడు కర్మవిముఖుడు కారాదు. అంతఃప్రవృత్తిలో మాత్రమే నిర్వేద నిరాసక్తతలు కదలాడ వలెను గాని లౌకిక కర్మాచరణ కవి భంగకరములు కారాదు. కర్మఫల భూతముగ కలిగిన జన్మము కర్మాచరణ ములో పునీతము కావలెను. కాబట్టి నిర్వేదమును పొందు చున్న రామునకు అరుంధతి కర్మ యోగమును బోధించి తద్ద్వారా తెలియనగు పరతత్త్వమును సూచించినది. తత్ఫలితముగ ఆత్మాన్వేషియైన రాముడు పరమేశ్వరి అయిన సీతయందు పరబ్రహ్మతత్త్వమును దర్శించి ఆ తత్త్వము తనలోనే యుండుట తెలిసికొనినాడు. 'నాదు సంకల్పము నందు సర్వమును గామిని! నీవుగ నిండియుంటివీ కల్పితమైన మోహమను కాటుక చీకటి జిన్ని దివ్వెవై శిల్పపు వెల్గుగాగ విరచింతువు నా హృదయాంతరంబునన్' అని ఆ పరత త్త్వము నాత్మలో నిత్యముగా హత్తుకొనినాడు.

సీతాన్వేషణకేగిన హనుమ కూడ నొక జిజ్ఞాసువే! అతడు అన్వేషించినది కేవలము సీతను కాదు. సీతారూపమున నున్న పరమేశ్వరిని. సీతాసందర్శనము కలుగు వరకు హనుమ హృదయ సంవేదన కల్పవృక్షమున కడుహృద్యముగ వర్ణింపబడినది. మారుతి లంకలో నడుగిడిన క్షణమే పోయిన వస్తువును వెదుక బోయిన రీతిగ సీత కొఱకై చూడసాగినాడు. రావణాంతఃపురమున ప్రవేశించినాడు. అచట సీత కానరాలేదు. అంతఃపురమంతయు కామక్రీడలకు నిలయమై యుండినది. విషయావృతమైన ప్రపంచము బాహ్య దృష్టికి భోగపరిపుష్టమే. అంతర్దృష్టికి మాత్రమే ప్రకృతిలోని పరతత్త్వము స్పష్టము. 'అంత మహానుభావుండయిన అయ్యాంజనే

యుండు తనలో తాను చూచికొని యాత్మ మహాప్రసన్నతా భావము పొందుట యెటులింగి పునర్విచయ వ్యగ్రడైనాడు.' ఐహిక విషయములచే మలిన పడిన మనసు ఆత్మాన్వేషణ కవరోధము కలిగించును. హనుమ తన మనసు మలిన పడలేదను విషయమును గ్రహించిన పిదప మరల అన్వేషణకు పూనుకొనినాడు.

అనంతరము శయ్యాగృహమున ప్రవేశించినాడు. 'నిద్రా మహాదేవి నీలనీరంధ్ర నిష్కుటముగా నిర్మించుకొన్నయ ట్లు'న్న ఆ గృహమున మదిరా పానముతో మత్తి రాక్షసు లటునిటు పడి సుషుప్తిని పొంది యుండిరి. సుషు యనగా అజ్ఞానము. ఇంద్రియ జ్ఞాన శూన్యమైన, చైత దిన స్థితి యది. పరమాత్మ చైతన్యస్వరూపుడు. అజ్ఞాన తిమిర బంధుర మయిన తావుల చేతనారూపమయిన బ్రహ్మాండము. కనుక 'ఇంతటి యింద్రియ జ్ఞానము మాలిన సుషుప్తి భావమునకును నిత్యజాగ్రదవస్థా భూతయైన జానకీ దేవికిని సంబంధంబు లేదని' హనుమ ఆ చోటును పరిహరించినాడు.

హనుమకు 'భూమిలోపల దిగబడిపోవుచున్న యట్లున్న దైత్యకాంతాలి, భూమి నంటక నడచుచు 'బోవుచున్న వేల్పు కాంతలు' అగుపించుచుండిరే కాని యుత్తమస్థితి ప్రాపకంబు సమపాళంబైన మానవ కాంతలగుపించలేదు. సీత మానవ రూపిణి గనుక మానవకాంతల నన్వేషించుచుండినాడు. ఈ సందర్భమున మానవుల యొక్క ఉత్తమత్వము వ్యంజిత మగుచున్నది. విషయ వాంఛాసక్తులు దైత్యులు. వారికి తమ దైహిక సుఖానుభూతిని మించిన ఒక అనుభూతి యుండు నను పరిజ్ఞానముండదు. కనుక వారిలో ఆత్మాన్వేషణ లేదు. ఆనందమున కవధి భూతులు దేవతలు. కనుక అచటను ఆనందమునకై అన్వేషణలేదు. ఉత్తమ గుణ సంపన్నులు, ద్విధీభావములందు సమస్థితి కలిగిన మానవులకే ఆత్మాన్వేషణ సాధ్యము. ఇది మానవ జన్మలోని విశేషము. హనుమకు ఎచట చూచినను దానవ కాంతల టక్కుటిక్కులు, అచ్చరల బిక్కమోములే కనిపించినవి. ధరణిజ జాడ తెలియక పోవుటచే మిక్కిలి నైరాశ్యమును పొందినాడు. అతడు తిరుగని చోటు లేదు. చూడని ప్రదేశము లేదు. అంగుళము మేర అయినను విడువక గాలించినాడు.

హనుమ భిక్షుకు డనుట యెంతైనఁగాని
తగియె నెక్కెడు గడపయు దిగెడు గడప
మరియు దగనేది యర్థించె మహితమూర్తి
యద్ది లభియించ దొక్క గేహాంతరమున.

పరతత్త్వము కొఱకు భిక్షుకుని వలె వెదకుటలో సాధకుని అన్వేషణ తీవ్రత వ్యక్తమగుచున్నది. సీత కానవచ్చు టాలస్యమగు కొలది హనుమ శాంత భావమును వహించు చునే యుండెను. శాంతము లేని వానికి హృదయము పరిశుద్ధముగ నుండదు. కనుకనే శాంతము వహించుట.

హనుమ ఒక మారు తానన్వేషించుచున్న మూర్తిని ఎదలో భావించి మరల అన్వేషణ సాగించినాడు. అప్పుడతనికి మండోదరి కనిపించినది. ఆమెను సీత యని భ్రమించినాడు. 'సీతం గాంచితి'నని సంతసించి ఎగిరి గంతులు వేయుచు లాంగూలమును ముద్దిడుకొనినాడు. అయితే ఆ ఆనంద ములో నేదో అసంపూర్తి తోచినది. అచట కలిగినది నిజమునకు భ్రమ మాత్రమే. చేతోనిర్వృతి కలుగలేదు. ఆత్మ సాక్షాత్కారమున్నపుడే చేతోనిర్వృతి కలుగును. పరమేశ్వరీ సాక్షాత్కారము కలుగనందులకు హనుమ చింతాక్రాంతుడై నాడు. విచారగ్రస్తుడైయున్న ఆతనికి విరాగము కలిగినది. తపము చేయవలయునను తలంపు కలిగినది. మానవులు, సురలు, దైత్యులు అందరును సౌఖ్యము కొఱకు, ధనము కొఱకు పాటుపడుచుందురనిపించినది. లోకము సుఖదుఃఖ మయమను సత్యము బోధ పడినది.

లోకమనన్ మఱిన్ సుఖములున్
మఱి దుఃఖములున్ ధరిత్రి క
న్యాకమనీయ రూపము
కనంబడినన్ సుఖమామె మూర్తియే
దో కనిపించ కుండినను
దుఃఖము చూచిన సౌఖ్యదుఃఖముల్
తూకము హెచ్చు తగ్గులుగ
దోఁచదు రెండు సమాన కక్ష్యలై.

హనుమ భావనలో సీతను చూచుట సుఖము. సీత కానరాకుండుట దుఃఖము. ఆ సుఖ ప్రాప్తికై తపము చేయనెంచినాడు. ఆ 'యచ్చపుఁదొలి రూపు తానెఱుంగఁజాలుట సర్వజనుష్ఫలంబుగా' భావించినాడు. హనుమకు సీతాన్వేషణ మాని తపము చేయుట న్యాయమేనా అనిపించి నది. తరువాత రెండును ఒక్కటిగనే అగుపించినవి. 'తాత్పర్యమునందు రెండు నొక్కటే యన్నట్లు భాసించె దచ్చేతంబు నందు.' అనగా సీతాన్వేషణ అనినను, సత్యాన్వేషణ అనినను అర్థమొక్కటియే. పదార్థము నందు పరమార్థ మును అన్వేషించుచున్న హనుమ కర్మయోగి. ఇట్లు తలపోయుచు హనుమ తపోయోగ్య ప్రదేశమునకై చూచు చుండ అశోకవని కనిపించినది. దానిని చూడగనే అది తపమున కర్హమైనదిగా తోచినది. అశోకము శోక రహితము. అశోకమును దర్శించినా డనిన హనుమ సుఖదుఃఖములను సమముగా స్వీకరించు స్థితికి చేరుకొనినాడని తెలియును. ద్వంద్వాతీతులకే పరతత్త్వము సులభ సాధ్యము.

పరమేశ్వరి యుండు చోటులు పవిత్రములు. సత్త్వగుణ భాసురములు. అశోకవని సౌందర్యమును చూచినంతనే సీత అచట తప్పక యుండునను భావము కలిగినది. హనుమ భావించినట్లుగనే సహస్ర మండప మధ్యమున సూర్యాగ్ని తేజోవిలాస దేహ అయిన సీతాదేవి కనిపించినది. ''కవి మహర్షి తపోగ్నిచే 'క్రాఁగి క్రాఁగి' సర్వతేజః ఫలంబురసంబు తుదకు కనుగొన్న యట్లుగ'' హనుమ రసరూపిణియైన సీతను దర్శించినాడు. సత్యాన్వేషణకై జరుగు తీవ్ర మథనము జీవుని వేదన. 'క్రాఁగి క్రాఁగి' యను పునరుక్తిలో జీవుని వేదన యొక్క తీవ్రత వ్యక్తమగుచున్నది. సీతా సందర్శనము జన్మజన్మల అన్వేషణకు ఫలము. 'చారితార్థ్యంబు జన్మకు సంఘటింప జానకిని కనుగొంటి'నని హనుమ ఆనందరస హృద్వీథీ విహారియైనాడు.

రావణుని ఆత్మాన్వేషణ విలక్షణమైనది. అతడు పైకి కాముకుడు. లోన సాధకుడు. దేవి యనుగ్రహమును సాధించుటకై యత్నించిన వాడైనను తానెన్నుకొనిన మార్గము సరియైనది కాకపోవుటచే అనుసరణీయుడు కాకపోయినాడు. వానిలో అన్వేషణ యున్నది. ఆవేదన యున్నది. అతడు శ్రీదేవి ఉపాసకుడు. సీతను శ్రీదేవిగ గుర్తించియే లంకా రాజ్యమునకు గొనిపోయినాడు. శ్రీమాత శోక విరహితయని తెలిసిన వాడు గనుకనే ఆమెను అశోక వనిలో నుంచినాడు. పరిచారికల కామె శంకరుని రాణియని తెలిపి మర్యాదలకు లోపము కలుగకూడదని హెచ్చరించినాడు. జానకితో మాట లాడునపుడతని కామ ప్రవృత్తియే గోచరమగుచుండును. కాని తన ఆత్మ పవిత్రముగనే ఉన్నదని రావణుని విశ్వాసము. 'ఆత్మ నంటని మనోదేహ దుష్ట వాంఛల యందు, దత్కాలావేశమున రసవీథీ నిమగ్న ప్రమాణముగ సంభాషించి ప్రతారించుట కొందఱు జీవుల లక్షణము.' కావున అతడెన్నో విధముల ప్రేలాపములు గావించినాడు. రావణుని ఆత్మ పరమేశ్వరికి సమర్పితము. అతని ఆత్మ ఆ శ్రీమూర్తితో నైక్యము నొందవలెనని పరితపించినది.

'భ్రాజితమైన యీ సకల
  వైభవముం ద్యజియించి యొక్క నీ
తోఁజనుదెంతు నేరికినిఁ
  దోపని సీమల నీవు దేవతా
భ్రాజిత మూర్తి నేను పద
  నీరజసేవకుడన్ భవత్కటా
క్షాజిర రంగవల్లులకు
  నర్హివడౌ మృగనాభి కల్పుడన్'

అని ఐహికముల పట్ల విరక్తి గొని ఎవరు కనుగొన లేని, పొందలేని శ్రీచరణ సన్నిధిని కాంక్షించినాడు.

'నీ వఖిల భవాంభోనిధి
నావవు నే నువ్వు నీళ్ళు నాసా కంఠ
వ్యావల్గువులుగ నుంటి గృ
పావేత్రము నిచ్చి యొడ్డు పట్టించగదే'

అని సంసార సాగరము నుండి తరింప జేయుమని ప్రార్థించినాడు. భవసాగర తారణ సాధనము పరమేశ్వరి. ఒడ్డు శ్రీరాముడు. తెడ్డు పరమేశ్వరీ కృపాకటాక్ష వీక్షణము. ఆమె కృపయున్ననే రాముని తత్త్వమును గుర్తించగలడు. కనుకనే ఆమె యనుగ్రహము నర్థించినాడు. ఒడ్డు తెలియని రావణుడు సంశయగ్రస్తుడైనాడు. రాముడు సాక్షాద్బ్రహ్మ పదార్థమేనా యని అతని సంశయము. పరమేశ్వరి నాతడు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలలోనైనను గుర్తించగలడు. ఆమె అతని ఎదలో నున్నదట. కాని మనసు తామసిక భూయిష్ఠమగుటచే స్పష్టత లేకుండినది. అస్పష్టత తొలగుటకై ఎంతో వేదన చెందినాడు. ఎంతో తర్కించుకొనినాడు. మాయ పరమేశ్వరుని ఏమియు చేయజాలదు. కనుక రాముని బ్రహ్మత్వము నెఱుగ గోరి మాయా జాలముతో యుద్ధమొనర్చినాడు. రాము డోడకుండుటఁజూచిన తోడనే సంశయము తీరిపోయినది. తాను ముక్తి నొందుటకు సమయ మేతెంచినదని గుర్తించినాడు. ''బ్రహ్మసంగతమగు దీప్తికాఁ దొలి వికారము నందలి తేజమౌచు నచ్యుతుడు'' తనను వధింప నేతెంచినాడని తెలిసి కొనినాడు. స్వస్థానము చెందుటకు మార్గము తోచిన మరుక్షణమే రాముని చేతిలో ప్రాణములను త్యజించినాడు.

విశ్వనాథ వారి చిత్రణలో శ్రీరాముడు హనుమంతుడు- ఈ ఇరువురు సాత్త్విక గుణ సంపన్నులు. విశ్వామిత్రుడు రాజసికుడు. రావణుడు తామసికుడు. జన్మచే సంక్రమించిన సంస్కారము వలన త్రిగుణములలో నొక్కొక్కటి ఒక్కొక్కని యందు అధికముగ నుండును కాని 'బహుస్యాం ప్రజాయే' అని భిన్న దేహముల నాశ్రయించిన ఆత్మ పొందు వేదన ఆత్మాన్వేషకులందరిలో సమానముగనే యుండును. కనుక ఒక్కొక్క దేహి ఆత్మ సంస్కార ప్రాబల్యముచే నొక్కొక్క విధముగ అన్వేషణ సలుపునను విషయమును విశ్వనాథ వారీ పాత్రల ముఖమున నిరూపించిరి. జగదనిత్యత్వ భావనా నిరతుడు, నిరంతర దైవ చింతనాపరుడు అయిన విశ్వనాథ కల్పవృక్షములో కవితా రూప తపస్సు చేసి, 'శ్రీపతి రాముని బ్రహ్మవస్తువున్' దర్శించి సర్వకవితా సంభారమును నైవేద్య మిచ్చినారు. ఇంతటితో ఆయన జీవుని వేదన శాంతించినది.

# ఋశ్యశృంగ ఋషి - విశ్వనాథ దృష్టి

శ్రీమతి జి. ఇందిర

'విశ్వనాథ' రచించిన శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో వచ్చే మొట్టమొదటి ఉపాఖ్యానం ఋశశృంగునిది. ఈ ఋశ్యశృంగుని తండ్రి విభాండక మహ  కాగా తండ్రి కొడుకు లిద్దరూ బ్రహ్మచారులు కావ ం విశేషం. ఈ విభాండుకుడు కశ్యపుని కొడుకు. ఋశ్యశృంగ జన్మ వృత్తాంతం భారతంలో విపులంగా ఉంది.

విభాండకుడు నదిలో స్నానం చేస్తూ ఊర్వశిని చూడగా స్మరాతురుడైన ఆ మునికి రేతఃపతనం జరిగింది. అప్పుడే ఆ నదిలో మృగం ఒకటి జలం త్రాగుతోంది. జలంతో విభాండకుని వీర్యం కూడ మృగి గర్భంలోకి వెళ్ళింది. ఆ మృగి యందు జన్మించిన పుత్రుడే ఋశ్యశృంగుడు (శ్రీమదాంధ్ర మహాభారతం - అరణ్య 3-88, 89). ఈతడు మానిసి రూపుగలవాడైనా ఒక కొమ్ము గలిగి ఋష్యశృంగుడైనాడు.

శ్రీరామ జననానికి హేతువు ఋశ్యశృంగుడు. పుత్రార్థి యైన దశరథ మహారాజులోని అంతర్గత వేదన -

సీ. ఆత్మజుడన్న తీయదనం బెఱుంగని
    చిత్తంబు ఊరగు చేదు కట్టె
ప్రియసుతుడన్న జాబిల్లిc జూడని కన్ను
    లవి యప్రసన్నతాంధ్యంపు గూళ్ళు
కొడుకన్న చిన్నారి పడవ చేరని వాని
    బ్రదుకు ఝుంఝూమరు త్ర్పళయ వీథి
కొమరుడన్ పుణ్యకర్మముc గాంచనేరని
    కట్టడి పున్నరకంపు ద్రోవ
తనయుడన్న సూక్ష్మ తత్త్వం బెఱుంగని
జీవి మాయలోనcజిక్కుc-కొన్న
    యనద పుర్వు వానికై హికాముష్మికం
బులు నశించు దారి వెలుcగు లేక.
(శ్రీ మద్రామాయణ కల్ప వృక్షం -
ఇష్టి పుటలు. 7, 8)

అని సంతాన హీనుల దురదృష్టాన్ని భావిస్తాడు. ఆ జీవుని వేదనోపశమనార్థం ''నీవో యఘుద్రాత్ముండవు యాజ్ఞికుండవు'' - అని సుమంత్రుడు మార్గం చూపెట్టాడు. అది కూడా రెండు మార్గాన్నాడు. అంటే శ్రీరామ జననం రెండు యజ్ఞాల ఫలమన్న మాట!

క. పుత్రార్థ మశ్వమేధము
    సత్త్రం బొనరింతు గల్ప సరణీ బటుతరా
    మిత్రాఘుషతి గలుగcగc
    బుత్రులc గలిగింతు వంశమున్ వెలిగింతున్

అని దశరథుడు వశిష్ఠాదులని 'క్రతువు సొంతము సేయుcడి యాప్తబద్ధులై' అని అడుగగా వశిష్ఠుడు.

ఉ. నాయన! యశ్వమేధము నొ
    నర్పు గరిష్ఠ సమంత్రక కృష్టి వా
రాయణుc దెచ్చెదన్ హవిసు
    నందగ నాపయి నీయదృష్టరే
ఖాయతిc బు' దున్ గలుc
    గుగా పసిత యు గోసలేంద్రక
న్యాయువతీ రోమణి మ
    హా సుకృతంబుల పంట పండcగా''
(కల్పవృక్షం ఇష్టి పుట. 20)

కౌసల్యాదేవి మహాసుకృతము పంట పండేటట్లుగా, అంటే ఆమె కడుపు పండేట్లు సంకల్పించి సమంత్రకంగా నారాయణుణ్ణి యజ్ఞశాలకు పిలిపిస్తానన్నాడు.

అశ్వమేధయాగం వలన సంతానలబ్ధి కలుగుతుందని తెలిసి పొంగిపోయిన దశరథుడు భార్యలతో తన ఆనందాన్ని పంచుకున్నాడు. వారిని కూడ వ్రతదీక్ష పూనమన్నాడు. అని, ఆనందాతిరేకంలో తానే మంటున్నాడో తనకే తెలియనట్లుగా ఇలా అంటున్నాడు:

ఉ. కన్నుల నత్తరుల్ బుగులు
    కాటుకc బెట్టుము పైడి చీర లె
న్నెన్నియొ పెట్టెcదీసి ధరియింపుము
    నచ్చినవాని నెల్లcగ్రాం

జెన్నులు భూషణాలిఁ గయి
 సేయుము పూతహవిః ప్రదానవే
ళన్నినుఁ జూడఁగా నదితి
 లాగున శ్రీహరి యెంచఁగా వలెన్
(కల్పవృక్షం - ఇష్టి పుట. 23)

నారాయణుణ్ని నవమాసాలు మోసి కన్నది కౌసల్య. ఆమెకి తెలియనివేం ఉంటాయి? అందుకే మాయలో పడిపోతున్న భర్తతో-

''నాదగు కనుంగొన లొత్తిన బత్తిఁ జూచి మ
న్ననఁ బొనరింపఁగా వలె సనాతనుఁడాద్యు''
(కల్పవృక్షం - ఇష్టి పుట. 23)

అంది. ఇంతవరకూ ఋష్యశృంగుడి ప్రసక్తి ఎక్కడా రాలేదు. అశ్వమేధ యాగానికి సర్వసన్నాహాలూ అయిపోతున్నాయి. అప్పుడు మంత్రి సుమంత్రుడు దశరథుని పుత్రప్రాప్తి హేతువు దేవరహస్యంగా తెలిసికొమ్మన్నాడు. దేవరహస్యం చెప్పకూడదు. చెప్తే భగవన్నిర్ణయ కర్మ మార్గాన్ని తొలగ ద్రోయడానికి ప్రజలు ప్రయత్నిస్తారన్నమాట! ప్రతి జీవుడు కర్మ ననుభవించడానికే జన్మలెత్తుతున్నాడు. దశరథుడు పుత్రసంతానార్థం చేసే అశ్వమేధయాగానికి ఋత్విక్కు ఋష్యశృంగుడవడం దేవ రహస్యం. దశరథుడు యజ్ఞార్థం ఋశ్యశృంగుణ్ని కొని తేవలసింది అని సుమంత్రుడు కర్తవ్య బోధ చేశాడు ''మున్ను దేవయుగంబున సనత్కుమారుడు ఋషులతోఁ జెప్పునెడ నేను విన్నది'' - ఈ ఋష్యశృంగుడి వృత్తాంతం అని చెప్పాడు.

ఈ జన్మవృత్తాంతాన్నంతా విడిచి ఋశ్యశృంగుణ్ణి ఆతని తండ్రి కన్నులకు 'వెన్నెల వత్తి' అంటారు విశ్వనాథ. ఆ తండ్రి సుతుని పెంచిన పెంపకం అటు వంటిదట-

చం. ఆతనికి లోకమే తెలియ
 దగ్నియుఁదండ్రియు నిద్దరే జగ
మ్మతనికి బ్రహ్మచర్య మిపు
 డైనను వర్లె ద్విధాగతి ప్రసా
రితముగఁ బొల్చు నవ్వనిఁ
 జరించును దూరపుఁదోటఁపోఁడు లో
భితమతి కాఁడు స్త్రీపురుష
 భేదము కూడ నెఱుంగఁ డింతయున్
(కల్పవృక్షం - ఇష్టి పుట 27)

అంతే కాదు ఆతడు మూడవ మనిషినే ఎఱుంగడు. ఆడది అనే పదానికి అర్థమే తెలియనంతటి అమాయకుడట ఆతడు! ఆతడెలాంటివాడో, ఆతని ఆశ్రమ కార్యకలాపాలూ, వానిపట్ల ఆతనికి గల శ్రద్ధాశక్తులూ ఇక్కడ కవి వర్ణించారు.

సీ. తండ్రి కన్నునఁ ముందుఁ దానె మేల్కని యగ్ని
 హోత్రము సరిచూచి యుముకఁబెట్టు
తండ్రికన్నను సముద్యద్ఘోష మేపార
 నర్థర్చలును ఋక్కులనువదించు
తండ్రి కన్నను సమాహిత శ్రద్ధమై యుష
 ర్బుధున కర్చాహవిర్బుధ్నము లిడు
తండ్రికన్నను నిశ్చిత జ్ఞాన దృఢ బుద్ధిఁ
 బిత్ర సమర్చాధురాప్రీతిఁగాంచు
నతఁడు పుంరూప బ్రహ్మచర్యంబు శ్రద్ధ
 ప్రోవు నెల్ల ప్రాయశ్చిత్తరూప మతఁడు........''
(కల్పవృక్షం - ఇష్టి - పుట 28)

అందుకే అతడు -

''శాంతుడు ఋష్యశృంగుడను
 సన్ముని యున్న యెడన్ ధరిత్రికిన్
సంతత వర్షణంబగు
 భృశం బగునట్టి వరంబు దొల్లి వృ
త్రాంతకుచే దయం బడసె''!
(ఆంధ్ర మహాభారతం - అరణ్య 9 - 3)

నట! ఒకసారి అంగదేశములో అనావృష్టి వచ్చింది. దానికి కారణం అంగరాజైన రోమపాదుడు తన పురోహితులపట్ల చేసిన అపరాధం. దర్పితుడైన రోమపాదుని బ్రాహ్మణులు విడువగా, వారు విడుచుట చూసి అమరులు, వారితో వర్షము కూడ అంగములను విడచినదట!

(కల్పవృక్షం - ఇష్టి - పుట 26;
భారతం అరణ్య 3 - 90)

దీనికి ప్రతికృతి 'ఆషాఢ మేఘము వోని వాని' నా ఋశ్యశృంగుని అంగదేశానికి రప్పించడమే నని నిర్ణయం జరిగింది.

ఆధ్యాత్మిక భావనా గరిష్ఠుడైన ఋశ్యశృంగుణ్ణి, ఆశ్రమమే ప్రపంచంగా బ్రతికిన ఈ ఋశ్యశృంగుణ్ణి రాచనగరున కాలుపెట్టడం సామాన్యం కాదు. రోమపాదుడు మంత్రులతో కలిసి ఆలోచనలు చేసినా దారితోచలేదట! ఆతని ఆస్థానంలో ఉన్న వారంతా కూడా -

మ. ఎడదన్ భీతులు పొంది మౌనిఁ గొనిరా
 నెవ్వండు ముందంజ వే

యందు; నే బోవను నేను బోవ
 ననుచున్ హా! హా! యనావృష్టిచే
జెడియున్ మృత్యువు వద్ద నుండియు మునిం
 జేరన్ భయం బంట హా
త్రెదు నేత్రంబులకున్ బొరల్ జనుల
 బుద్ధిన్ మాయ యట్లేకదా!
 (కల్ప వృక్షం - ఇష్టి పుటలు 28, 29)

అనావృష్టితో మృత్యు సమీపానికి వచ్చి కూడ మానవుడికి మృత్యువుపట్ల గల భయంకంటె మునిశాప భీతి ఇక్కడ చాల సహజంగా వర్ణించడమైంది. అదే కాక ఇక్కడ రాజు తనకి అధికారం ఉన్నదని ఎవర్నీ శాసించలేదు. దేశానికి వచ్చిన కష్టం చెప్పి కష్టంలో పాలుపంచుకొమ్మన్నాడంతే.

వాల్మీకి రామాయణంలో ఋష్యశృంగుని తీసికొని రావడానికి అమాత్య పురోహితుల్ని సత్కరించి పంపాలని రోమపాదుడనుకుంటాడు. కాని అమాత్య పురోహితులు విభాండక మహర్షికి భయపడి గణికాజనాన్ని పంపడం మంచి దని రోమపాదునికి సలహా ఇస్తారు. గణికలు వివిధోపాయా లతో ఋశ్యశృంగుని ప్రలోభపెట్టి తీసుకుని రాగలరని చెబుతారు.

(వాల్మీకి రామాయణం, బాలకాండ 10 - 5)

నన్నయ గారి భారతంలో రోమపాదుడు ''బుద్ధిమంతు లతో విచారించి విదగ్ధ వేశ్యాంగనలం బిలువంబంచి మీ నేర్చు విధంబుల ఋశ్యశృంగుం 'బ్రబోధించి' యిటఁదో డ్కొని రండని'' (భారతం, అర 3 - 94) పంపినట్లుగా ఉంది. లోభపెట్టే పదం కంటె '' బోధించి' అనే పదంలో కొంచెం ఔచిత్యం ఉందేమో నని స్తుంది.

జనమంచి శేషాద్రిశర్మగారు తమ రామాయణంలో వాల్మీకి ననుసరించారు. భాస్కర రామాయణంలో కూడా అంతే. (భాస్కర బాలకాండ - 74) రఘునాథ రామాయణం లోనూ మంత్రి పురోహితులే రాజుకి సలహా ఇచ్చినట్లు ఉంది.

''గామ కళారసజ్ఞతలు
 గల్గిన వారల నంచితేని వా
రామునిఁదోడి తేఁగలరు
 హాస విలాస విహార లీలలన్.
 (రఘునాథ రామాయణం - 2 2 103)

కాని గోపీనాథ రామాయణంలో రోమపాదుడు ఋశ్యశృం గుని ఏ విధంగా తీసికొని రాగలనని విచారిస్తూ ఉంటే గణికలు తమంత తామే ఈ కార్య నిర్వహణకై ముందుకు వచ్చినట్లుగా ఉంది. కానీ సుమంత్రుడా వృత్తాంతాన్ని దశరథునికి విస్తరించి చెప్పే విధానంలో పురోహితుని సలహాపైన గణికలను పంపినట్లుంది.

(గోపీనాథ రామాయణం, 254, 262)

కల్పవృక్షంలో విశ్వనాథవారు గోపీనాథ రామాయణంలో మొదటి కల్పననే స్వీకరించడంలో ఎంతో ఔచిత్యాన్ని పాటించారు.

ఆ సమయంలో రాజుకే కాక ప్రజలకి కూడ ఆశ్చర్యం కలిగేటట్లుగ రాజుకు వింజామరలు వీచు ''కుసుమ శరకో దండ లస్తక మధ్య'లైన వారయువతులు వీచుచున్న చేతులడ్డ ముగా నొడ్డుకొని యొకళ్ళొకళ్ళు కన్గలుపుకొని వారిలో నొక్క గడుసరి'' (కల్పవృక్షం - పుట 29) రాజుతో నిట్లందిట.

ఈ సందర్భంలో కల్పవృక్షకర్త వారయువతి మాటాడిన మాటలు ప్రియంవద, ప్రణవము అనే రెండు విలక్షణ వృత్తాల్లో చెప్పారు. మొదటి పద్యంలో రాజు తమని పంపడంలో గల ఔచిత్యాన్ని తెలిపారు.

ప్రియంవద: ''దివిషద్వీరుడు తేపమౌనులన్
 గవురు గప్పుచు పొగల్ వెలార్పగా
 నవు తపస్సుల మహాగ్ని రేగcగా
 నవుర నచ్చరల నంపునంటగా''

(కల్పవృక్షం - పుట. 29)

రెండో పద్యంలో - అందుకని తనని పంపమనీ, తాను మునిని తీసికొని రావడంలో కృతకృత్యురాలు కాలేకపోతే పట్టణ ప్రవేశమే చేయననీ ఆత్మ విశ్వాసంతో చెబుతుంది.

''క్ష్మానాథుల్ మఱి మముఁబంపినన్
మౌనీంద్రున్ గొని మమతం దెత్తున్
తేనుం జాలక ధృతి నే రానే
రా నీ పట్టణ రమ సిగ్గిల్లన్''

(కల్పవృక్షం బాల. పుట. 29)

ప్రభువు తాంబూలము దయసేయించినచో నీనా చెలిమి కత్తెలతోc గూడి యిప్పుడే బయలుదేరు చుంటి'' (కల్ప వృక్షం - పుట 29) అన్నది. స్వామి భక్తి, ఆత్మవిశ్వాసం మిక్కిలి ప్రశంసనీయాలుగా భాసింప జేశారు విశ్వనాథ 'నాతుల గుండె నిబ్బరము నచ్చి ధరాపతి' బండ్లమీc పంపించాడా 'తలిరాకు బోండ్ల'ని. 'ఆతిని గూడ మాద మెయిఁజావు గగుర్పొడిపించు'నని వారి ఆత్మ విశ్వాసం.

ఈ సందర్భంలో 'రఘునాథ రామాయణం'లో ఇలా వెళ్ళిన వారాంగనల గూర్చి సామాన్య ప్రజలేమనుకున్నారనేది ఎంత సహజంగా వర్ణించారో చూడండి -

''మునిరాజు ఋశ్యశృంగునిఁ బిల్వ వేశ్యల
 నంపు చున్నాఁడఁట యనెడి వారు
హితులు మంత్రులు బురోహితులు నుండగ వీరి
 నంపంగఁ దగవౌనె యనెడివారు
నంగనలను జూడఁడట వాఁడు వీరిమా
 యలచేతఁ జిక్కునే యనెడి వారు
వెలయాండ్ర వెంటనే వలచి వచ్చిన యేవి
 యుతఁడేడ తాపసి యనెడి వారు

వాన రప్పింపఁ బురివిప్రవరుల కంటె
నెక్కుడే వాఁడు దొరలకు నెల్లఁదలఁప
దూరమున నున్న వారలె దొడ్డవార
లనెడి వారలునై చూచిరపుడు జనులు''

(రఘునాథ రామాయణము - 2 184)

విశ్వనాథవారు కల్పవృక్షంలో వారాంగనలు తమంత తాము వెళ్ళినట్లుగ ఒక్క చక్కని మార్పుచేసి రోమపాదుడికి ఈ మాత్రం మచ్చ కూడా రానీయకుండా జాగ్రత్త పడ్డారు.

వాల్మీకి రామాయణాన్ననుసరించి కల్పవృక్షంలో వార కాంతలు ఋశ్యశృంగుని, ఆశ్రమానికి కొంచెం దూరంలో విడిసి సమయం కోసం ఎదురు చూస్తున్నారు. అంతలో ఋశ్యశృంగుడే వారు విడిసియున్న ఉద్యానవనానికి వెళ తాడు. కాని భారతంలో విభాండకుడు ''వన్య ఫలహరణార్థంబు వనంబున కరిగిన అవసరంబున అందొక్క జరద్వేశ్య తన కూతు నభినవ యౌవన విలాస విభాసిని నమ్మునిపుత్రు పాలికి బుచ్చిన'' ట్లుంది.

(భారతం - అరణ్య. 3-96)

ఋశ్యశృంగుని ఎదుట వారవనితలు సంగీతము పాడినట్లు అన్ని గ్రంథాల్లోనూ ఉన్నా కల్పవృక్షంలో ఆమె పాడిన రాగాలూ, ప్రక్క వాద్యాల్నీ పేర్కొనడం విశేషం. వీణ, మృదంగం, తాళాలు, ప్రక్క వాద్యాలు కాగా నాయకురాలు నాట, పున్నాగ, ఆరభి, శ్రీ, వరాళి రాగాల్లో వర్ణాలూ, కృతులూ పాడిందట! ఆ సంగీతం, ఆ రాగాలూ ముని కుమారుని గుండెకి ఆర్ద్రత కలుగజేయడమే కాక సృష్టిలో ఉన్న 'కొత్త మాధుర్య సీమలు క్రేళ్ళుగొఁ జెంగలించి' అంతకుముందు తానెంఱుగని ఆనంద రేఖ ఉద్బుద్ధమై కనుకొలకుల్లో కన్నీళ్ళు తెప్పించి, శరీరం గగుర్పొడిపించా యనడంలో సంగీతం యొక్క శక్తిని అద్భుతంగా భాసింప జేశారు కవిసమ్రాట్టులు.

మాలిన్యమంటే ఏంటో తెలీని, స్ఫటికంతో పోల్చదగిన స్వచ్ఛాతి స్వచ్ఛమైన గుండె ఋశ్యశృంగుడిది. అటువంటి గుండెని ఈ సంగీతం తాకింది. ఆ పాట తనదే. ఆరాగ సరణి తన గుండె లోనిదే. తన గుండె లోపలి పొరల్లో సుప్తమై ఉన్న మెత్తనైన చోట్లని ఈ స్వరం వచ్చి తాకే సరికి అతడు లౌకికేతరమైన అనుభూతికి లోనయ్యాడు. మనసులోని బిగువు ఒకింత సడిలింది. ఇది అవకాశంగా తీసికొని వేశ్య లాతని ప్రబోధించారు. తమ గీతాలతో. ఆ గీతాలు -

''అంతట నవ్వెలఁదుక లై
కాంతిక కేళీ కళారహస్యార్థన వా
త్యంత ధ్వనిమద్గీతా
సంతానము భరత శాస్త్ర సరణిం బాడన్''

(కల్పవృక్షం బాల పు. 31)

ఇది నిజంగా జ్ఞానపీఠ సంభావనకే కాదు, ఎంతటి మహోన్నత పురస్కారానికైనా అర్హతను కలిగించేది. విశ్వనాథ వారి అమోఘ శేముషీ విలసనానికి శేఖరీ భూతమైన పద్యం ఇది. భరతముని నాట్యశాస్త్రంలో వివిధ రాగాలను పేర్కొంటూ ఏ రాగం ఏ రసాన్ని వ్యక్తీకరించడంలో సమర్థమైందో వివరించాడు. అయితే కేవలం ఆ రాగాలు పాడినంత మాత్రాన రసాభివ్యక్తి కలుగుతుందా? అంటే కలుగుతుంది - ఎప్పుడు? గాయకునిలో ఆ ప్రత్యేక రాగంపట్ల తాదాత్మ్యం, ఉపాసనా ఉన్నప్పుడు. అంతేకాని నేటి చాలామంది గాయక రత్నాలు గానం చేసినట్లు లెక్కలతో చెక్కేయడం కాదు. మరి - ఇక్కడి కొచ్చిన ఈ జాణలు 'ఆకతాయి తనం' గా వచ్చిన వాళ్ళు కాదు. చక్రవర్తికీ, తమ దేశానికీ, శ్రేయస్సు కలుగజేయడానికి, తమరాక యొక్క ప్రయోజనంపై ఆరాధనా భావం కలవారు. కేవలం ఋశ్యశృంగుని మనసు మెత్తబడడంతో సరిపోదు! అతడు తమ చక్రవర్తికి భావిజామాత కావాలి! కనుక ఏకాంత కేళి రహస్యార్థాన్ని చక్కగా ధ్వనింపజేసే గీతాల్ని పాడారు. వారు పాడిన గీతాలేమిటో మనకు తెలియదు. ఆనాటి గీతాలు నేటి గీతాలవలె కాక అంతర్గతంగా నిద్రాణమై ఉన్న ఉదాత్త భావాల్ని రేకెత్తించేవిగా ఉండే వనుకోవాలి. కనుకనే వీరు పాడిన పాటలు, చేసిన నాట్యాలతో ఋశ్యశృంగునికి ప్రబోధం కలిగింది. జీవిత పరమార్థం లేదా జీవన సాఫల్యం, లేదా పురుష ధర్మం అవిదిత పూర్వమైన ఒక వైఖరి క్రమక్రమంగా విదితమౌతున్న అనుభూతి ఋశ్యశంగుడికి కలిగింది. అందుచేతనే ''రెండవ వాల్మీకి'' యైన ''ఋ-

వంటి నన్నయ'' ఇదమిత్థంగా నిర్ణయించరాని ఈ స్థితిని ''ప్రబోధించటం' అన్నారు. అంటే ఒక కొత్త విషయం పూర్తిగా తెలియనిది, తెలిసీ తెలియని స్థితిలోంచి క్రమంగా తెలుస్తోందా? అన్నట్లున్నదన్నమాట! కనుకనే నన్నయగారి 'ప్రబోధించి' అనే ప్రయోగం చాలా అర్థవంతమైంది. వాల్మీకి మహర్షి ప్రయోగించిన 'ప్రలోభ' శబ్దం లౌకికులకి వర్తిస్తుంది. కాని ఋశ్యశృంగుని వంటి లోక వాసనా విరహితునికి కాదు.

ఆ తరువాత వాళ్ళు లోకోత్తరమైన నాట్యాన్ని చేశారు. మిగతా రామాయణాల్లోనూ, భారతంలోనూ కూడా వేశ్యలే ఋశ్యశృంగుని ఆలింగనం చేసికొన్నట్లుగా ఉంది. వాల్మీకి రామాయణంలోనూ అంతే. కాని కల్పవృక్షంలో ఋశ్యశృంగుడే వేశ్యలను తనకు తానుగా స్పృశించి, కౌగిలించి, ఏదో తెలియరాని సుఖానుభూతి కలుగగా మీ శరీరం ఇంత చల్లగా ఉండటానికి ఎటువంటి తపస్సు చేశారని అడుగుతాడు. ఇక్కడ ఋశ్యశృంగునికి స్త్రీ వాంఛ కలుగుతోందని అనుకుంటే అది చాలా పొరపాటు. అతనిది విచికిత్సా దృష్టి. కనుకనే వారి జడలు, ముఖము, చిబుకము స్పృశించి ఉరమును తాకినా అచ్చోట ''అసమ శరుడు తొంగి చూడడు ముని ఋశ్యశృంగు వంక'' అంటారు విశ్వనాథ. ఆరూపాజీవలు కూడా ''భూపశ్రేష్ఠుని కూతు పెన్మిటను చున్ పూజింతు''రేకాని హద్దు దాటరు! ఈ తీర్పు నిజంగా లోకోత్తరమైంది. ఎంతో నిగ్రహంతో ఒక చంపకమాల, ఒక సీసపద్యంలో ఆతని విచికిత్సా దృష్టి కమనీయంగా రూపొందించారు. అందుకే

''.... .... ... మీ చిత్రాశ్రమ స్థానిలో
బ్రహ్మానందము లింక నెన్ని కలవో
వత్తున్ నిజం బేను న
న్నాహ్వానించుట కేదియైన గలదా?
యభ్యంతరం బన్నచో''
(కల్పవృక్షం - బాల. పుట. 33)

అని అడుగుతాడు తరవాత ఋశ్యశృంగుడికి తన నిజాశ్రమ కర్మలు జ్ఞప్తికి వచ్చాయి. అతిథి మర్యాదలు మరచిన తనని క్షమించమని వారినడిగి తన ఆశ్రమాన్ని చూడ వారి నాహ్వానించాడు. వారాంగనలు తమకీ పని ఉందని చెప్పి, ''భవదాగమనార్థమ యుండ మందురా మమ్ముల నిందె'' అన్నారు వారవనితలు. (కల్పవృక్షం - బాల - పుట 54) మంచి దంటూ తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడా ముని కుమారుడు.

మరి నన్నయగారి ఋశ్యశృంగుడో - వేశ్య ప్రబోధానంతరం ఆమె ధ్యాసలోపడి ఆశ్రమ విధుల్నే మరచాడు. చింతాక్రాంతుడయిన కుమారుని చూచి విభాండకుడు విషయమేమిటని అడగగా ఋశ్యశృంగుడు మునికుమారుని సౌకుమార్యాన్ని వర్ణించి ''నాకు నమ్మునిపుత్రు నాశ్రమంబునందు వానితో నొక్కటఁ దపంబు సేయుచుండ నిష్టం'' అన్నాడు. (భారతం - అరణ్య 3-110). తండ్రి కాదని చెప్పినా వినక ఋశ్యశృంగుడు ''విలాసినీ మోహితుడయి తండ్రి కెఱిగింపక సచ్చరిత్రంబయిన ఆశ్రమాన్ని'' (భారతం - అరణ్య 3-112) ఆమె వెంట అంగదేశాన్ని సొచ్చాడు. నన్నయ గారి ఋశ్యశృంగుడు మోహితుడయిపోయాడేమో నన్న అనుమానం ఇక్కడ పాఠకులకి కలుగుతుంది. కాని కల్పవృక్షంలో మాత్రం ఆశ్రమం విడిచి వెళ్ళేటప్పుడు కూడ పసిపిల్లవాని మనస్తత్వాన్నే ఋశ్యశృంగునిలో ప్రకటించి, ఆ ఘట్టానికి అపురూపమైన సొగసుని ఆపాదించారు విశ్వనాథ.

''పోదమా యన్నఁబోదము పోదమంచుఁ
గదలి శకటంబు పైని నంగములు సేర్చి''!
(కల్పవృక్షం - బాల. పుట. 34)

రట! ఋశ్యశృంగ సహితలైన వేశ్యలు.

ఋశ్యశృంగుడి పాత్ర ద్వారా విశ్వనాథవారు పాఠకుల కెరిగించిన మరో విషయం - మానవుడికి మానినులని, పురుషులని, పురావళులని, సదనాలని, పొలాలని, పంటల్ని, నదుల్ని చూచి, వానిని వానినిగా గుర్తించడానికి, వివేచనా జ్ఞానాన్ని పొందడానికి అనంతమైన కాలం అవసరం లేదు. ఇవన్నీ వారికి 'సహజ బోద్ధలు'. ఈ కారణంగానే ఆతనిలోని ఆధ్యాత్మ భావనకి లౌకిక స్పర్శ రాలేదు. పైగా ఇంత కాలం లోకమంటే ఏమిటో ఎరుగడు. ఇప్పుడో లోకాన్ని తెలుసుకొన్న ఆధ్మాత్మ విడుదయ్యాడు 'నిశ్చల తత్త్వమానసుల్' అనే విశేషణంలోని రహస్యం ఇది.

ఋష్యశృంగుడు నగరంలో వేశ్యలతో అడుగు పెడ్తున్నాడు.

ఉ. ఆరథ మేగుత్రోవ జల
దావళి మింట వినీల కాంతిమా
లారుచిరాతపత్ర పరిలంబిని
యై రథనేమి నిస్వన
స్ఫోరక హేతువై యుఱుము
చున్ వెనుకన్ దెసలన్ బ్రపాత ధా
రా రమణీయవాః కణధురా
పరితర్పిత దేశమై చనెన్''

(కల్పవృక్షం - బాల పుట 34)

ఋశ్యశృంగుడికి గల విశేష లక్షణం అతడు ఋతుధర్మ మూర్తీభావమగుట. అతని ప్రభావం వృష్టిహేతుకం.

రోమపాదుడు ఆతడికి ఎదురేగి - 'నీవు రా హర్షము వర్షమున్ కలిగెనయ్యా' - అని తన కూతురు శాంతనిచ్చి పెళ్ళి చేస్తానని ఆమెని చూపాడట! అంత-

శా. లజ్జా ముగ్ధ ముఖారవింద
గని యా
లావణ్య పాథోధిc
నజ్జామాతయు లజ్జయొత్తిడి మొగం
బల్లంత వాల్చెన్ బురో!
మజ్జారే! పురికిన్ వనంబునకు నీ
మాత్రంబు భేదం బటం
చజ్జల్ ప్రోవులు వారముఖ్యలు సురం
టంటించి గెంటించుచున్

(కల్పవృక్షం - బాల. పుట. 34).

లజ్జా ముగ్ధత్వాలు మూర్తీభవించిన శాంతను చూడగానే ఋశ్యశృంగుడు కూడ సిగ్గు పడినాడట! సిగ్గుపడి మొహం అల్లంత వాల్చాడట! అంటే ఋశ్యశృంగుని యందు మన్మథావిర్భావం ఇప్పుడు జరిగిందన్న మాట! ఇట్టివారిని చూచి ''పట్టణమునకు వనమ్మునకు ఈ మాత్రము భేద''మని వీచుచున్న వీవనతో నతనిని తాకినారు. పురికిని వనమ్మునకును ననగా నిక్కడ బ్రహ్మచర్యమునకు గార్హస్థ్యము నకు ననిగాని, తపశ్చర్యకు గార్హస్థ్యమునకు ననిగాని యర్థము.'' (కల్పవృక్షం రహస్యములు - పుట. 17) అని విశ్వనాథవారు ఈ పద్యంలోని రహస్యాన్ని విడమర్చి చెప్పారు.

ఇంతకథని మంత్రి సుమంత్రుడు తాను మున్నెప్పుడో సనత్కుమారుడు ఋషులతో చెప్తూండగా విన్నానని, ఋశ్యశృంగుడి మహత్త్వంబున దశరథుడికి వీర్యవంతులైన కుమారులు కలుగుతారని దశరథుడికి తెల్పి క్రతువు చేసేందుకు ముందే ఋశ్యశృంగుని కొనితేవలసిందని ప్రబో ధించాడు.

ఋశ్యశృంగుని అయోధ్యకు తీసికొని రావడానికి వశిష్ఠుని అనుమతి బడయగా ఆయన -

''.... .... గదున్ ముదంబుc
బొంది వారు తండ్రి! పో! ఋశ్యశృంగుండు
చిన్ని సుకర పాలజున్ను గడ్డ''

(కల్పవృక్షం - ఇష్టి పుట. 37)

అన్నాడు. అంత దశరథుడు భార్యలతో గూడి, మంత్రి పరివార సహితుడై, అంగదేశము లేగాడు, ఋశ్యశృంగుణ్ణి చూచాడు. చూడగానే ఆయనలో భక్తి పొంగి పొర్లుకు వచ్చింది.

చ. ''దశరథరాజు కొమ్ము జడ
దారికిcబాదయుగంబునందు ము
న్నె శిరసుc జేర్చి వాకయిన
నేస్తము గావున రోమపాదుc డీ
రు సగము నాకు నల్లురది
త్రోపు వదున్ మునిరాజు లౌటనీ
శిశిర దృగంతముల్ దనుపు
జెందుత మా యెడc గూడ నో మునీ!''

(కల్పవృక్షం - బాల. పుట 38)

అన్నాడు నీ చల్లని చూపులు మా యెడ ప్రసరింప జేసి మ... తరింప చేయమంటున్నాడు. ఇక్కడ దశరథుడు పుత్రా ఋష్యశృంగుడి దగ్గరకి వచ్చాడు. పుత్రుడు పున్నా నరకం పొగొట్టే వాడని ఒక నమ్మకం, పుత్రభిక్ష పెట్టి తనని తరింప చెయ్యమని ధ్వని

అంగదేశంలో కొన్నిరోజులు గడిపి, దశరథుడు శాంతా ఋశ్యశృంగుల్ని తన వెంట అయోధ్యకి పంపమని రోమపాదు నర్థించి, వారితో అయోధ్యాపురికి ప్రయాణ మయ్యాడు. ఋశ్యశృంగుడు ఎక్కడ అడుగుపెట్టే అక్కడ వర్షాలు పడతాయనేది అతడికి ఇంద్రుడిచ్చిన వరం. ఋశ్యశృంగుడు అయోధ్యలో అడుగుపెట్టాడు. ఇక్కడ మళ్ళీ వర్ష వర్షవ వుండాలి కానీ అది కన్పట్టదిక్కడ. ఎందుకంటే దశరథుడికి కావలసినది భౌతికమైన వర్షం కాదు. అతనిది సంతాన హేతుకమగు అనావృష్టి. అశ్వమేధ యాగాన్ని ఋశ్యశృంగుడు అధ్వర్యుడుగా చేసినపుడు ఈ అనావృష్టి తొలగుతుంది. ఋశ్యశృంగుడు ఆ కార్య నిర్వహణకి ఒప్పుకున్నాడు. దశరథుని కడుపు పంట విష్ణువు. ఆ సస్యోత్పత్తి హేతుకమైన వర్షానికి హేతువు ఋశ్యశృంగుడు.

పుత్రకామేష్టి పూర్తయిన నెలదాకా జనక మహారాజుని కాని, రోమపాదునికాని, ఋశ్యశృంగుని కాని అయోధ్యనించి కదలనీయలేదు దశరథ మహారాజు. దశరథుడు తన కూతురు శాంతతో అంటాడు. ''అమ్మా నీవొక దైవమై వెలసినా వస్మ ద్గృహమ్మందు నీవమ్మానిన్ గొని వెంట వచ్చితివి పుత్రావాప్తికై'' అని.

# గురజాడ అడుగుజాడ

శ్రీ చిత్రకవి ఆత్రేయ

విశ్వశ్రేయః కావ్యం. వాక్యం రసాత్మకమ్ కావ్యం. కావ్య లక్ష్యం, లక్షణం నిర్దేశిస్తున్న ఈ రెండు నిర్వచనాలకు గురజాడ సాహిత్యం ఆటపట్టు. గురజాడ మాటల్లో చెప్పాలంటే, 'Though art is my master, I have a duty to Society'. గురజాడ అప్పారావుకు గల ఉదాత్త జీవితతత్వమే, ఆయనను ఆధునిక సాహిత్య యుగకర్తగా చేసింది. ప్రజలు మాట్లాడుకునే జీవద్భాషను కావ్య భాషగా చేసి గురజాడ మనకు వెలుగుజాడ అయ్యాడు. సామాన్య మానవుని వాస్తవ జీవితాన్ని సహజ సుందరమైన దృశ్యకావ్య వస్తువుగా చేసిన నవయుగ వైతాళికుడు గురజాడ. సాహిత్యం ద్వారా సంఘ సంస్కరణకు ప్రోదిచేసిన మహాకవి గురజాడ. ఆయన జీవించినది యాభై మూడేళ్ళే అయినా, సాహిత్యప రంగా ఆయన సాధించినది సార్వకాలీనం, విశ్వజనీనం, శాశ్వతం. అందుకే గురజాడ అప్పారావుకు, బెయిలీ మహాశయుడు చెప్పినట్లు 'మృత్యువు జీవనద్వారం' అయింది. తద్వారా మరింత విస్తృత మయిన, మరింత సత్యమయిన, మరింత తేజోవంతమైన జీవితంలోకి ప్రవేశిం చాడు గురజాడ. గురజాడ అడుగుజాడలో పయనించని ఆధునిక కవులు లేరనడం అత్యుక్తి కాబోదు!

## ఆనాటి సాంఘిక వ్యవస్థ

ఆనాటి సాంఘిక పరిస్థితులు క్లిష్టమైనవని గురజాడ వ్రాశారు. ముక్కు పచ్చలారని ఆడబిడ్డలకు వివాహాలు, కాటికి కాళ్ళు చాచిన ముసలి మగ మొసళ్ళకు పెళ్ళిళ్ళు, ప్రజలలో అవిద్య, అజ్ఞానం, మూఢ నమ్మకాలు, భూత ప్రేత పిశాచాలపై పిచ్చి నమ్మకం, క్షుద్ర మంత్ర తంత్రాలపై భక్తి విశ్వాసాలు, దళారుల దోపిడీ వ్యవహారాలు, దారిద్ర్యం, కరువు కాటకాలు, బందిపోటు దొంగతనాలు, కులభేదాలు ఇలా ఎన్నో క్షీణయుగ లక్షణాలు సమాజంలోనే గాక సాహిత్యంలోనూ తిష్టవేసుకున్నాయి. కుంటుకుంటూ నడిచే అసహజమైన, శుష్క పాండిత్య ప్రదర్శకమైన గ్రాంథిక భాష, పాతకాలపు వైయాకరణుల పైత్యాలే ఉత్తమ ప్రమాణాలుగా చెలామణీ అవుతున్న రోజులవి! వాడుక భాషను 'గ్రామ్యభాష'గా తప్పుడు పేరుతో పిలుస్తూ ఈసడించుకోవడం పరిపాటి అయింది. సంస్కృత సమాసాలలో (వాటి అర్థం తెలియక పోయినా) సంభాషించడం, సొనిదాన్ని ఉంచుకోవడం (దాన్ని సంతోష పెట్టలేక పోయినా) అలనాటి సమాజంలో వ్యక్తి గొప్పతనానికి గురుతులు. కన్యాశుల్కం పేరుతో పశుమాంస విక్రయం జోరుగా సాగిస్తున్న నికృష్టపు రోజులవి. 'అవినీతి క్రిములు' సమాజ శరీరాన్ని తొలిచి వేస్తున్న దుర్దినాలవి.

## పునరుజ్జీవన యుగం

19వ శతాబ్ది తొలి వత్సరాలలో తెలుగు సాహితీ స్రవంతిలో కొంగ్రొత్త ఆలోచనాధార వచ్చి కలిసింది. ఆంగ్ల సాహిత్య పఠనంతో ప్రభావితులైన విద్యావంతులలో చైతన్యం చిగురు లెత్తింది. పాశ్చాత్య దేశాలలో తలఎత్తిన రినైజాన్స్ (పునరుజ్జీవన ) యుగం వంటిది, ఆంధ్ర దేశంలో సామినేని ముద్దు నరసింహనాయుడి 'హితసూచని' (1862)తో ప్రారంభ మైంది. 'గత శతాబ్దపు తొలి సగంలో పొడమాపిన సకల సంస్కరణలకు, గాఢ విచారణకు, తలమానిక మనదగినట్టి ప్రణాళిక - జాతి పునర్నిర్మాణ పథక మది. 'హిత సూచని' వెలుగు చూచిన 1862లోనే గురజాడ జన్మించడం విశేషం!

సామినేని వెలిగించిన పునరుజ్జీవన 'దీపాన్ని కందుకూరి వీరేశలింగం (1848-1919) ప్రచండంగా ప్రజ్వలింపచేశాడు. కందుకూరి స్ఫూర్తిని పుణికి పుచ్చుకుని, ఆయన కంటె వయసులో చిన్నవాడైన . గురజాడ అప్పారావు (1862-1915), సంస్కరణ జ్యోతిని జాజ్వల్యమానం చేశాడు. అయితే వీరేశలింగం లాగ గురజాడ కరకు నీతివాది కాడు. మానవ బలహీనతలను ఆయన చాలవరకు మన్నించారు. వీరేశలింగం కార్యవాది. గురజాడ ప్రధానంగా స్వాప్నికుడు. అందుకే ఆయన సాహిత్యం కళాత్మకమై, చిరస్థాయి అయింది.

గురజాడ సమకాలికుడు, ఆజన్మమిత్రుడు గిడుగు వెంకట రామమూర్తి (1863-1940) వ్యావహారిక భాషోద్యమ నిర్మాతగా ప్రసిద్ధుడు. ఈనాటి అక్షరజ్యోతి ఉద్యమాలకు ఆద్యుడు గిడుగు. ఛాందస గ్రాంథికవాద పండితమ్మన్యులకు

పిడుగు ఈ గిడుగు. సామాన్యుల వాడుక భాషకు గొడుగు ఈ గిడుగు! తన సంఘ సంస్కరణ ప్రియత్వాన్ని ఆచరణలో చూపిన మహనీయుడు గిడుగు వెంకట రామమూర్తి. ఆత్మగౌరవ రక్షణలో, అస్పృశ్యతా నిర్మూలనములో వితంతు వివాహాలలో గిడుగుదే ముందడుగు. గురజాడ - గిడుగు పరస్పర ప్రభావితులు. ఇంకా ప్రిన్సిపాల్ చంద్రశేఖరశాస్త్రి, శంభు చంద్రముఖర్జీ, విజయనగరం మహారాజా ఆనంద గజపతి, ఒంగోలు మునిసుబ్రహ్మణ్యం ప్రభృతులు గురజాడ రచనలకు ప్రోదిచేసి, ఆయనను ప్రభావితం చేశారు. జాతీయ తమిళకవి సుబ్రహ్మణ్య భారతి గురజాడ సమకాలికులు. రవీంద్రనాథ్ టాగూరుతో గురజాడకు పరిచయం వుంది. తెలుగు, బెంగాల్, కర్నాటక తమిళనాడు రచయితలతో, మేధావులతో ఆయనకు మైత్రీ సంబంధాలున్నాయి.

అన్నిటికంటె ముఖ్యమైనది, సమాజంలోని వివిధ వర్గాల సామాన్య ప్రజానీకంతో గురజాడ అప్పారావుకున్న నిత్య సాన్నిహిత్యం, సాహచర్యం. ఈ సాన్నిహిత్యమే ఆయన అనుశీలనను, ఆలోచనలను సుసంపన్నం చేసింది.

## అపార గ్రంథ పరిచయం - అధ్యయనం

గురజాడకున్న గ్రంథ పరిచయం చాల విస్తారం. భారతీయ ప్రపంచ సాహిత్యాలలో ముఖ్యమైనవన్నీ ఆయన అధ్యయనం చేశారు. ఆయన గ్రంథాలయం, డైరీలు ఈ విషయాన్ని నిరూపిస్తాయి. వోల్టేర్, కాన్ట్, మిల్, వర్డ్స్‌వర్త్, షెల్లీ, షేక్‌స్పియర్, బైరన్, బెర్నార్డ్ షా, రాబర్ట్‌సన్, గిల్‌బర్గ్, మోలియర్, పినరో, ఇబ్సన్, చెహోవ్ మొదలగు ప్రముఖుల రచనలను చదివాడు. అపార గ్రంథ పఠనం వల్ల, విస్తార వ్యక్తిపరిచయాల వల్ల గురజాడ మూర్తిమత్వం పరిణామ శీలమై పరిణతి చెందుతూ వచ్చింది.

గురజాడ తాత్విక దృక్పథంలో, రచనలలో గోచరించే ముఖ్యాంశాలు ఇవి:

1. మనిషిలో సమూలమైన, మౌలికమైన మార్పు రావాలి. మనిషి ఆలోచనా శాలిగ, మానవత్వం నింపుకున్న మానవతావాదిగ, బాధ్యతాయుతుడైన వ్యక్తిగ నడుచుకోగలిగి నప్పుడే సమాజం చైతన్యవంతం, అభ్యుదయవంతం అవుతుంది.

2. మనిషిని మనిషిగా నిలబెట్టి, మనీషిగా చేసేది 'ప్రేమ' మాత్రమే. మానవుల మధ్య ప్రేమ అంతస్సూత్రం కావాలి. ప్రేమ అజ్ఞానమనే అంధకారాన్ని పోగొట్టి, ఆత్మను తేజోవంతం చేస్తుంది.

3. మంచితనం, ప్రేమ - ఇవి దైవానికి ప్రతిరూపాలు. విశ్వప్రేమ విశ్వశాంతికి, వసుధైక కుటుంబానికి ఆలంబనం.

4. ఒక దివ్యశక్తి మానవులను నడిపిస్తున్నది. అయితే మానవుని శక్తి, సంకల్పబలమూ పరిసరముల ప్రభావాన్ని అధిగమించగలదు.

5. సమాజం నిర్ణయించిన నీతి సూత్రాలను మనం గౌరవించాలి. కాని అవి లోపభూయిష్ఠమైనపుడు, వాటిని మనం బాహాటంగా ఎదుర్కొని, సంస్కరించాలి.

6. స్త్రీ పురుషులకు ఒకే నీతి, విద్య, స్వేచ్ఛ వుండాలి. 'ఆధునిక మహిళ మానవ చరిత్రను తిరగరాస్తుంది' - ఇది గురజాడ తీర్పు.

7. 'పని: దాని కదే పరమగమ్యం' 'ఎవరి ప్రశంస మనం కోరుతామో, వారి మనస్సులో మనమీద నమ్మకం కలిగించే సాధనం పని'. పని ఒక అలవాటు. Work is worship.

8. సాంఘికానుబంధం లేని భాషా సాహిత్యాలు పునాదులు లేని గాలి మేడలు. భాషా సాహిత్యాల ఆధునికీకరణ సమాజ ఆధునికీకరణకు, సుహృద్భావ విలసనానికి తోడ్పడుతుంది.

'గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల,
కొత్త పాతల మేలుకలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా'.

కొత్తి పాతల మేలు కలయికనే గాదు, వినూత్న సృష్టిని కూడ గురజాడ సాధించారు. ఆనాటి సమాజ రుగ్మతలను పోగొట్టడానికి గురజాడ అమూల్య రచనలు పంచదార అద్దిన మందుగుళికల్లా పనిచేశాయి.

## గురజాడ కావ్య ప్రపంచం

కవిగా గురజాడ తన ఇరవయ్యో ఏట పుట్టాడు. 'ఓడ్ టు ది కుకూ' 'సారంగధర' 'చంద్రహాస' - ఆంగ్లంలో వ్రాశాడు. మొదటిది పద్యం-అలభ్యం. రెండోది పద్యకావ్య ఖండిక - లభ్యం. మూడవది పెద్ద కావ్యమే కాని - అలభ్యం. తాత్విక భావనలతో, ప్రకృతిపరమైన ఉత్తమ పదచిత్రాలతో తొణికిసలాడుతున్న 'సారంగధర' కావ్యంలోని ఈ పంక్తులు కవి ప్రతిభావ్యుత్పత్తులకు తార్కాణాలు·

With tempting hues the lilies blow upon the lake of life;
But all below unseen they grow,
The weeds of sin and strife,

The plant of wealth on guile is grown
And watered is with sin;
The craft of power on blood is built
Its sails are puffed with din

ఇంత ఉత్తమ కవిత్వం వ్రాసిన గురజాడ అప్పారావు గారే రేవారాణి పనుపున 'విక్టోరియా ప్రశస్తి గేయాలు' (1890), ఐదవ జార్జిని, తెల్లవారిని కీర్తిస్తూ 'ముత్యాల సరము' (1912) వ్రాశారు. తనను పోషించే సంస్థానాధీశుల అవసరానికి ఈ గీతాలను గురజాడ రాశాడనుకుంటే వింత లేదు. కాని ఆంగ్లేయుల న్యాయపాలనకు జోహారుగా ఆయన ఈ గీతాలు వ్రాశాడని ప్రఖ్యాత రచయిత ఒకరు సమర్థించ డమే కొంత విడ్డూరం అనిపిస్తుంది.

## అపూర్వ దృశ్య కావ్యం

ఇది గురజాడ రచించి ప్రదర్శింపజేసిన అపూర్వ దృశ్యకావ్యం కన్యాశుల్కం శతజయంతి వత్సరము. ఈ నాటకం మొదటి ప్రదర్శన 1892 ఆగస్టు 13న విజయనగ రంలో జరిగింది. 'ది తెలుగు హార్ట్' రిపోర్టు ఆధారంగా ఈ నాటిక తొలి ప్రదర్శన ఆగస్టు 24 శనివారం (1892) జరిగిందని శ్రీ అబ్బూరి గోపాలకృష్ణ అభిప్రాయం. ఈ నాటిక తొలి కూర్పు 1897లోను, మలికూర్పు 1909లోను రించబడినవి. అయితే 'మొదటి కూర్పు వట్టి ఎముకల గు, రెండవది సర్వాంగ సంపుష్టమైన మానవాకారం' (శ్రీ .వి. రమణారెడ్డి) 'అది మోదుగ పూత, ఇది రెల్లు పూత; కన్యాశుల్కం వట్టి నాటకం కాదు, జీవిత చికిత్స'.

మృచ్ఛకటికం తర్వాత ఒక్క ప్రతాపరుద్రీయమే కన్యాశు ల్కమునకు సరితూగ గల నాటకమని శ్రీ కె.వి. రమణారెడ్డి ప్రభృతుల నిర్ణయం. గురజాడ 'కన్యాశుల్కం' వ్రాయక ముందే, ఈ దురాచారాన్ని ఎండగడుతూ శ్రీ కందుకూరి కూరి వీరేశలింగం వ్రాసిన 'బ్రాహ్మ వివాహము, కన్యా శుల్కం' ప్రహసనాలు వెలువడి శ్రీ గురజాడ ప్రశంసను పొందాయి - అయితే ఆ ప్రహసనాలు చిమ్చుబుడ్లు, ఈ నాటకం ఆరని జ్యోతి; అజరామర కమనీయ కరుణామయ కావ్యం. అయితే ఇది చదివి ఆనందించడానికి బాగా అనువైనది. ప్రతి సంభాషణ రసాత్మకమే. ప్రదర్శన పూర్తిగా అయితే ఎనిమిది గంటలైనా పడుతుంది. 35 రంగాలు, 7 అంకాలు, ప్రధానంగా వచ్చే పాత్రలు 16, ఇంకా చిన్నవి. 14 - ఇవిగాక సమయాను కూలంగా వచ్చేవి కొన్ని - అయినా ఈ నాటకం - ప్రదర్శన సౌలభ్యం లేనిది మాత్రం కాదు. గురజాడ కాలంలో ఏ స్టేజి నాటకమైనా, వీధి నాటకమైనా రాత్రి 10 గంటలకు మొదలుపెడితే, ఉదయం ఆరు గంటలయ్యేదే, పూర్తి అయి, మంగళం పాడడానికి. నిన్న మొన్నటి వరకు మన పద్యనాటకాలు, వీధి భాగవతాలు భళ్ళుమని తెల్లవారే వరకూ 'వన్సుమోర్లు' కొట్టుకుంటూ ప్రదర్శించే వారు గదా!

'కన్యాశుల్కం' నాటకం హాస్య కరుణ రసాలతో విషాదం రంగరించిన ఓ దివ్యౌషధం! ఈనాడు ఈ నాటకం 'వరశుల్క' బాధితులకూ, 'అమీనా' లాంటి అభాగినులకూ వర్తించుకుంటే చదివే వాళ్ళు భుజం తడుము కోవడం, వాళ్ళ గుండెలు పోలీసు - కముకు దెబ్బలు తిని, మూలగడం ఖాయం; పూర్తి ప్రదర్శన చూస్తే, పైకి నవ్వుతూ, లోపల లోకలైజ్డ్ ఎనస్తీషియాతో శస్త్ర చికిత్స చేయించుకుంటున్న వాళ్ళలా ఫీలవుతారు, హృదయం, మానవత్వం వున్న వాళ్ళు. ఈ నాటకంలోని ప్రతి సంభాషణ ఆణిముత్యమే - అణుబాంబే!! - అందుకే 'కన్యాశుల్కం' నవ్యాతినవ్యం, భవ్యాతిభవ్యం, ఒక మహాకవి వ్రాసిన మహాకావ్యం - మహానాటకం! జనపదాలలో, అప్పటి పట్టణాలలో అన్ని వర్గాల ప్రజలు మాట్లాడే జీవద్భాషలోనే రచనలు చేసి, వాడుక భాషకు సాహిత్యంలో సమున్నత స్థానం కల్పించి, ఆ నాటక ప్రదర్శనల ద్వారా సమకాలీన సమాజ సమస్యలపై ప్రజాభిప్రా యాన్ని మలిచి, 'విశ్వ శ్రేయః కావ్యం' అన్న ఉన్నతాదర్శం ఆచరణీయం చెయ్యాలని గురజాడ కన్న కల నిక్కం చేసే పవిత్ర బాధ్యతను నేటి యువతరం స్వీకరించాలి.

ఈ నాటకం ఇప్పటికే కొన్ని వేల సార్లు ప్రదర్శింపబడింది - ఇంకా ఇతర భాషల్లోకి అనువాదం చెయ్యబడి ప్రదర్శింపబ డింది. కన్యాశుల్కం ఒక అపురూప కళాఖండం. నూరేళ్ళు అవిచ్ఛిన్నంగా ప్రదర్శింపబడిన ఈ నాటకం వేయేండ్లు, వేల యేండ్లు వర్థిల్లాలి! ఇప్పటివరకు ప్రదర్శింపబడినట్లు ఖండ ఖండాలుగా గాక, అఖండంగా ఖండ ఖండాంతరాలలో ప్రదర్శింపబడాలి. గురజాడ లక్ష్యం సంపూర్ణంగా నెరవేరాలి 'మారుతున్న సాంఘిక సమస్యలకు మారని శాశ్వత విలువలకు దర్పణంగా.

## ముచ్చటైన వరాలు: ముత్యాలసరాలు

తెలుగులో కవిగా గురజాడ మొదటి రచన 'నీలగిరి పాటలు' ఈ పాటల్లో 'గురజాడ తన జీవితంలో మొదటిసారిగా, చివరిసారిగా కూడా, ఏక కాలంలోనే పదబంధ నిర్మాణ వ్యామోహంలో ప్రణయావేశంలో మునిగిపో యారు.' అని బుర్రా వెంకటప్పయ్యగారు అంటారు. ఇంతే నిక్కచ్చిగా గురజాడ ఇతర నాటికలను గూర్చి నార్ల వారిలా అంటారు. 'ఖచ్చితమైన నాటక విమర్శక ప్రమాణాలతో

చూస్తే 'కొండు భట్టీయం' 'బిల్హణీయం' వైఫల్యాలు - హీన సాఫల్యం హద్దులను దాటిపోయే ఉన్నత వైఫల్యాలు'.

గురజాడ కవిగా తన సొంతగొంతును, బాణీని, విశిష్టతను ప్రపంచానికి తెలియపరిచింది 'ముత్యాల సరము'లతోనే (1910). తాను సృష్టించిన ఈ మాత్రా ఛందస్సులో రచించిన 'దేశభక్తి' గేయం విశ్వమానవ కల్యాణానికి విలక్షణ ప్రాతిపదిక; గురజాడ అమర సందేశం.

'దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా!
ఈసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్
జల్దుకొని కళలన్ని నేర్చుకు
దేశి సరకులు నించవోయి....

స్వంత లాభం కొంత మానుకు
పొరుగు వాడికి తోడు పడవోయ్
దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులోయి....

'యెల్ల లోకము వొక్క యిల్లై,
వర్ణ భేదము లెల్ల కల్లై,
వేల నెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియ
మతములన్నియు మాసిపోవును
జ్ఞాన మొక్కటే నిలిచి వెలుగును'

(ముత్యాల సరములు)

## గురజాడ అడుగు జాడ - గురుజాడ

గురజాడ వారి ఇతర రచనలలో మకుటాయమానమైనవి పూర్ణమ్మ - గొప్ప కావ్య ఖండిక: దిద్దుబాటు (తెలుగు కథానికా సాహిత్యంలో తొలికథ - 1910), మెటిల్డా, సంస్కర్త హృదయం - కథలు, లవణరాజుకల - గేయ కావ్యం. ఈ కావ్య ఖండికలోనే గురజాడ ఆదర్శం ఆవిష్కృతమైంది:

''మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండె కులములు;
మంచి యన్నది మాలయైతే
మాలనే అగుదున్''.

ఒక ద్రష్టగా, ఒక స్రష్టగా గురజాడ తన కాలాని కంటె ముందుండడమే కాదు. పుట్టడం కూడా ముందే, నెలలు నిండకుండానే పుట్టాడు. ''ఈ తొందరపాటుకు, యీ పురవడికి ఆయన నిజంగానే ఆయన అధిక మూల్యం చెల్లింపవలసివచ్చింది'' అంటారు నార్లవారు. నిజమే! గురజాడ ఆరోగ్యం బాగుండి, స్వతంత్ర జీవనం కలిగివుంటే ఆయన కవిగానే గాక, పరిశోధకునిగా నాటకకర్తగా, సంస్కరణోద్యమాల నేతగా ఇంకా బాగా రాణించే వారు. ఆయన డైరీల్లో, నోట్సుల్లో, వ్యాసాల్లో వ్రాసుకున్న విషయాలు, అనుభవాలు, స్మృతులు, ఆలోచనలు రెక్కలు విప్పి సాహిత్య కళాఖండాలు అయ్యేవి. - అయినా గురజాడ నిస్సందేహంగా నవయుగ వైతాళికుడు, మహాకవి, యుగకర్త. ''అడుగుజాడ గురజాడది, అది భావికి బాట'' అని మొదట చాటిన 'మరో ప్రపంచం' మహాకవి శ్రీశ్రీ మొదలు ఆధునిక కవులకు, కథకులకూ, సర్వజనులకు ఆదర్శం గురజాడ - అదే అందరికీ 'గురుజాడ'.

వేషేణేవ చ దంభః దంభేన విమూఢ హృదయ సమ్మోహః
మోహేన కార్య హాని రివ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

బాహ్య వేషంవల్ల కపటంలాగ, కపటంతో మోహంలాగ, మోహంవల్ల కార్యహానిలాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి

# తెలుగులో 'గజల్'

శ్రీ ఎం. బుద్దన్న

'గజల్' అనే పదానికి సఖితో సల్లాపమని, లేడికూత అని ఇలా పలు అర్థాలున్నాయి. మొదటి అర్థం శృంగారానికి, రెండవది ఆశ్చర్యాది భావాలకు సంకేతం. అడవిలోని లేడి ఆశ్చర్యంగా వేసే కేక వంటి చైతన్యాన్ని గజల్ అందివ్వాలి కనుక, ఇదే గజల్ తత్త్వావిష్కారానికి సమర్థకం. వాచ్యార్థాలెన్ని వున్నప్పటికీ, ఈ సాంకేతికార్థమే చిరస్థాయిగా నిలుస్తుంది. ఇదే గజల్‌కు జీవధాతువు వంటిది. 'వల్లరి' అనే మరో అర్థం శృంగారపు సౌకుమార్యాన్ని వికాసాన్ని సూచిస్తుంది.

ఈ గజల్ వల్లరి అరబ్బీనుంచి పార్సీ, తుర్కిస్తాన్ దేశాలకు ప్రాకి 13 వ శతాబ్దంలో 'అమీర్ ఖుస్రూ' ద్వారా భారతదేశానికి కూడ విస్తరించింది. ఖుస్రూ పార్సీకవి. అతడు నిజానికి 'దోహా'కవి. దోహా గజల్‌కు పూర్వరూపం. ఇది ద్విపద వంటిది. దోహాల వంటి 'షేర్ల' సంపుటి మాత్రమే గజల్ అనబడుతుంది కాని, దోహాయే గజల్ కాదు. ఆనాటి దోహాలు విడి విడిగా 'బ్రిజ్' భాషలో రచింపబడినట్లు ప్రతీతి. ఏమైనప్పటికి గజల్‌కు అవయవప్రాయమైనట్టి షేర్‌కు దోహా ప్రాగ్రూపమనడంలో సందేహం లేదు. వేల దోహాలను చెప్పిన కబీర్, అబ్దుల్‌రహీం ఖాన్ ఖానాన్‌లు ఆ రంగంలో సూర్యచంద్రుల వంటివారు. దక్కనులో మాత్రం 16 వ శతాబ్దంలోని 'ఖులీకుతుబ్షా'ను మొదటి ఉర్దూ గజల్ కవిగా పేర్కొన వచ్చు. ఖులీ రచించిన 50,000 కవితలలో అధికంగా గజళ్ళేనని విశదమవుతుంది. ఆ తరువాత ఈ ప్రక్రియను 'వలీ' నుంచి 'హాలీ' దాకా వెలసిన కవులెందరో మూడు పువ్వులు ఆరు కాయలుగా అభివృద్ధి చేశారు.

గజల్ మానవుని మధుర వేదనకు ప్రతీక. మనసులో మౌనసంచారం చేసే భావాలే గజళ్ళలో రాగాత్మకనాదాలను వినిపిస్తాయి. పానశాలలో మోహన సాకీలాగా ప్రపంచంలో గజల్ ఆకర్షణీయమైనది. అది ముక్తకమే అయినా, శ్రోతలకు ఆశ్చర్యాఘాతాన్ని కలిగిస్తూ, మహేంద్రజాలానికి నడిపిస్తూ-ఇలా ఒక నిమ్నోన్నత యాత్ర చేయించే 'విద్యుత్తు' గజల్ కవితా ప్రత్యేకత ఈ విద్యుత్తు పెరగాలంటే గజల్ కవి ఉర్దూలోని 'ఇస్లా' అనే ఆచారం ప్రకారం బాల్యం నుంచే శిక్షణ పొందాలి. అప్పుడే గజల్ కవితలోని సాకీలు, మైఖానా(పానశాల)లు, మధుర మథనాలు ఆత్మదర్శనంగా ఆస్వాదింపబడతాయి. అందుచేతనే గజల్ ఉర్దూసంస్కృతికి పునాదిగా విజ్ఞుల చేత భావింపబడుతున్నది.

గజల్‌కు ఇదమిత్థమైన వస్తు వుండదు. కాని ప్రారంభం నుంచి శృంగార భావాలకు గజల్ ఒక 'జల్వా' వంటిది సాకీవియోగం, మధుపానం, దీన ప్రార్థన, ఆత్మసమర్పణ, సర్వసంగపరిత్యాగం, మరణం, సాకీ అనుగ్రహం వల్ల తరచు పునరుత్థానం వంటి విషయాలెన్నో ప్రతీకాత్మంగా, పడుగు పేకల్లాగా గజళ్ళలో అల్లుకొని వుంటాయి. నీటి కింద బురద వున్నట్లు శృంగారం చాటున శోకం దాగివుంటుంది. కనుక, అచ్చమైన గజల్ కవితకు అంతర్విషాదమే ఆలంబనం. దీని వికృతిరూపమే శృంగారం. జీవాత్మకు కలిగే కషణసంస్కారానికి ఉర్దూప్రేమికుని వియోగబాధ కేవలం ఒక సంకేతం. చివరకు మాత్రం అద్వైతం. ప్రత్యేకించి గాలిబ్ లాంటి సూఫీకవులు ఈ తత్త్వాన్నే గజల్‌కు మూలతత్త్వంగా భావించి రచనలు చేశారు. కథ లేకుండానే మరపురాని కవితను చెప్పటంలో గజల్ కవులు దిట్టలు.

అయినా వాయులీనం నుంచి సంగీత వైవిధ్యం వినబడుతున్నట్లు గజల్ కూడా అన్ని భావాలను చెప్పడానికి నేడు వినియోగింపబడుతున్నది. దాని ఆత్మ మాత్రమే శృంగారం తక్కినదంతా శరీరప్రాయం. 'ఫైజ్' వంటి విప్లవకవులు కూడా గజళ్ళలో శృంగారానికే ప్రాధాన్యమివ్వడం వల్ల సంప్రదాయ శృంగారపు గజల్‌కవితలు ఈనాటికీ నిత్యనూతనంగా నిలచి వుండడం వల్ల ఆ భావాలకు, ఈ ప్రక్రియకు గల అవినాభావ సంబంధాన్ని గమనించ వచ్చు. నేడు మాత్రం గజళ్ళలో కనరాని భావం, వినరాని ధ్వని కానరావు. అందుకే దాశరథి 'సాకీనామా' లో పన్నీట, కన్నీట తడిసిన గజళ్ళున్నాయి. ఇదంతా గజల్ పరిణామం

గజల్ కవులు సాధారణంగా సంయోగ శృంగారాన్ని చెప్పరు. అది ఏనాటికైనా పోతుందని వారి బాధ. అందుకని కోరి వియోగాన్ని చెబుతారు. ఎన్నటికైనా ఇది పోతుందని,

సంయోగం రాబోతుందని వారి సంతోషం. కనుకనే మానిపోయే గాయాన్ని శత్రువుకి, మానిపోని మౌనవ్రణాన్ని తమకు ఇవ్వాల్సిందిగా దైవ ప్రార్థనలు చేస్తారు. చిత్రమే మంటే, వ్రణాల తోరణాలలోనే, గజల్ కవి గతిస్తాడు. అతని అంతిమయాత్ర సాకీ చూపులు సోకే వీధి గుండా సాగుతుంది. సాకీ అనుగ్రహిస్తే పునర్జీవితుడవుతాడు. ఆగ్రహిస్తే అవని గర్భంలోనే ఆత్మఘోష చేస్తాడు. ఈ వింతవాతావరణమంతా గజల్ కవితకు ఒక మహాప్రాణ శక్తి వంటిది. గజల్ ముక్తకమే అయినా, ఇలాంటి శక్తిమంతమైన భావశాబల్యం కలది కనుక అది ఒక విద్యున్మాల వలె విలసిల్లుతుంది.

కవిత ఛందస్సు కందని మహావిషయం. అట్లని ఛంద స్సును కవిత్వాని కనవసర మనలేము. కవితకు బాహ్య సౌందర్యం ఛందస్సు. ఇది కవితను లయాన్వితం చేస్తుంది. హృదయస్పందన లయ ద్వారా ప్రకటితమవుతుంది. గజల్, గానయోగ్యమైనది. కనుక పాడటానికి రాయబడుతుంది. అందుచేత అది మాత్రాఛందస్సులో కూర్చబడుతుంది. యతి, ప్రాసలు కవికి ఐచ్ఛికం. రాగవిశేషాన్ని బట్టి గజల్ లోని లఘు, దీర్ఘ మాత్రలు అడపా దడపా సవరింపబడతాయి. ఆకర్షణీయమైన గజల్ కు రాగం దీర్ఘాయువు నిస్తుంది. ఈ రాగంలోనే గజల్ కవి తన రాగాత్మక హృదయాన్ని ఆవిష్కరిస్తాడు. ఈ ధోరణిలో మహాకవి 'మీర్' హిమా లయం వంటివాడు. కనుకే గాలిబ్ వంటి కవులకు ఆరాధ్యుడు.

గజల్ - సుమారు పది షేర్ల సంపుటి. అనగా కచ్చితంగా పదే వుండాలన్న నిర్బంధం లేదు. 6,7 షేర్లతోనూ తెలుగు గజళ్ళు కనిపిస్తాయి. కాని సాధారణంగా పదిని మించదు. షేర్ అనగా రెండు పాదాల కలయిక. పాదం 'మిస్రా' అనబడుతుంది. ఈ రెండు పాదాల్లోనే భావం, అలంకారం, ధ్వని, చమత్కారం అన్నీ చోటు చేసుకొంటాయి. ఏ షేర్ కు - ఆ షేర్ ఒక ముక్తకం వంటిది. అందుచేత చెప్పదలచుకొన్న ఒక్కొక్క భావమంతా ఒక్కొక్క షేర్ లో ఇమిడిపోవాల్సిందే. నిజానికి షేర్ అంటే బిందువులో సింధువు నిముడ్చటమే. ప్రతి షేరూ ఒక ముక్తకం కనుక, షేర్లు గల గజల్ ఒక 'ముక్తకమంజరి' వంటిదవుతుంది. గజల్ లోని మొదటిషేర్ 'మత్లా' గాను, చివరిది 'మక్తా' గాను పిలువబడతాయి. మత్లాకు ఆకాశమని, మక్తాకు జాగీరని అర్థం. ప్రత్యేకించి మక్తా, కవి జాగీరు కనుక అందులో అతని 'నామముద్ర' వుంటుంది. ఇది 'తఖల్లుస్' అనబడు తుంది. కవి, తఖల్లుస్ ద్వారా అంతర్ముఖీనుడవుతాడు. కవితకు, కవికి గల జన్యజనక సంబంధాన్ని ఇది సూచిస్తుంది. మక్తానుంచి మత్లాదాకా సాగే భావ విన్యాసం కవియొక్క ఆరోహణ విధానాన్ని తెలుపుతుంది. గజల్ కవి తనునుంచే ఒక ఆకాశహర్మ్యాన్ని నిర్మిస్తున్నాడు కనుక ఇదంతా ఊర్ధ్వనాభ దృష్టాంతం వంటిదని చెప్పవచ్చు. అందుకే 'ఆరోహణ' మనక తప్పినది కాదు.

ప్రతి షేర్ లోని రెండవ పాదం చివర ఖాపియా, రదీఫ్ నియమాలుంటాయి. మొదటి షేర్ లో మాత్రం రెండు పాదాల్లోనూ ఇవి అనివార్యం. ఇవి అంత్యానుప్రాసలు. ఈ మొదటి, రెండు షేర్లను కలిపితే, అది మరల 'రుబాయి'గా మారుతుంది. ఖాపియాకు అరుదుగా సడలింపు కనబడు తుంది. రదీఫ్ కు లేదు. నాదమాధురిని ఇవి పోషిస్తాయి. మొదటిది తప్ప, మిగిలిన అన్ని షేర్లలోనూ నియమాలు రెండవ పాదానికి మాత్రముంటాయి. మొదటి పాదానికుం డవు. కారణం-రెండవ పాదస్పర్శ వల్ల మాత్రమే మొదటి పాదానికి చైతన్యం కలుగుతుంది. అంత్యానుప్రాసల చివర అచ్చు, హల్లుల నియమం కూడా వుంటుంది. ఈ ఛందస్సు గజల్ కవితకు బాహ్య సామగ్రి మాత్రమే. అంతస్తత్త్వమే గజల్ కవితాయువును పోషిస్తుంది. చైతన్యం అంగిగా, ఛందస్సు అంగంగా కలదే గజల్-అంగాంగి సమన్వయం సౌందర్య మయినట్లు.

పై నియమాలు కొంతవరకు కొన్ని తెలుగు గీతాలలోనూ కనిపిస్తాయి.

రమ్మంటె చాలు కాని రాజ్యాలు విడిచి రానా
నీ చిన్ని నవ్వుకోసం స్వర్గాలు గడిచి రానా

అని దాశరథి షేర్. గజల్ లో ఇది మొదటి షేర్ కనుక 'రానా' అనే రెండు రదీఫ్ లు, విడిచి, గడిచి అనే ఖాపియాలు రెండు పాదాల్లో పాటింపబడ్డాయి. ఇది 24 మాత్రలతో సాగిన రచన.

ఏడేడు సాగరాలు ఎన్నెన్నొ పర్వతాలు
ఎంతెంత దూరమైన బ్రతుకంత నడిచి రానా

అనే తరువాతి షేర్ లో నడిచి, రానా, అనే ఖాపియా రదీఫ్ లు రెండవ పాదంలోనే పాటింపబడ్డాయి. మొదటి పంక్తి కుండవు. పై పంక్తుల్లో సఖుడనుభవిస్తున్న విరహాతిశయం వర్ణింపబడింది.

'తఖల్లుస్' కూడా తెలుగులో పాటింపబడింది. సినారె తన తెలుగు గజళ్ళలో మెత్తని అధిక్షేపాన్ని తఖల్లుస్ ద్వారా ప్రవేశపెట్టాడు. ఆయన అధిక్షేపంలో ఆవేదన కూడా చోటు చేసికొన్నది.

**ఏరు దాటితె ఎవరు వారె – ఏమి లోకం ఓ 'సినారె'**
**ఎంత నటన భరించెనో – ఇంత పల్చని జీవిక.**

చిన్న జీవితం, కార్యసిద్ధికోసం ఎంతో నటనను భరిస్తుంది. కార్యం సిద్ధించిన తరువాత నటింపబడిన 'ఆత్మీయత' లోకంలో అసలు కనిపించదు. మనుషులలోని అవకాశవాద గుణాన్ని, 'సినారె' నామముద్ర చక్కగా అధిక్షేపించింది.

దాశరథి తన నామముద్రను 'శరధి' పదంతో శ్లేషించాడు.
**'శరధి రచించే నాటికలా**
**మురిపించే నవ చూలికలా'**

అంటూ బాలికలను వర్ణిస్తున్నాడు. దాశరథికి సంక్షిప్త నామముద్ర శరధి. శరధి అనగా సముద్రం. ఇది అలల నాట్యాలతో మురిపిస్తుంది. చూళిక - ఇది ఆకాశభాషణం. నాటకాలలో నాయికా నాయకుల వియోగశాపవిముక్తిని ఇది సూచిస్తుంది. ఇరువురిలో సమాగామాకాంక్షను చిగురింపజే స్తుంది. దాశరథి జీవిత నాటకంలో బాలికలు అలాంటివారే! నామముద్ర, జాగీరు కనుక స్వవిషయం స్పృశింపబడు తుంది. ఇంతటి గూఢార్థ సౌందర్యాన్ని దాశరథి తఖల్లున్ ద్వారా సాధించాడు.

'అరుస్తున్న ఆ ' అనే కవితల సంపుటిలో గజల్ రచనా 'టెక్నిక్' క బడుతుంది. అందులో శేషేంద్ర తన నామముద్రను 'శే 'గా ప్రకటించాడు.

**ఓ 'శేషేన్' నీవు పీడితప్రజలకే చెందుతావు!**
**అక్షరమై అందరికీ అందుతావు!**

పీడితజనప్రియత్వం శేషేన్ ప్రత్యేకత. జనులందరికీ తాను, తన కవిత అందాలి. జన జీవన సమస్యల్ని చిత్రించి శేషేంద్ర తన నామముద్ర పరిధిని మరింత పెంచాడు. ఛందోనుకూ లంగా నామముద్ర సవరింపబడుతుంది. ఇలా తఖల్లున్ ఒక సార్థక్యాన్ని సంతరించుకొంటుంది. శేషేంద్ర 'ఈ నగరం జాబిల్లి' అనే సవిమర్శక గజల్‌కృతి రచించాడు. గాలిబ్ షేర్లను దాశరథి 'గాలిబ్ గీతాలు' పేరుతో అనువదించాడు. 'సాఖీనామా' లో సొంత గజళ్లే రచించాడు. సినారె సొంతంగా 'తెలుగు గజళ్ళు' రచించాడు.

గజల్ అసలే నాజూకైనది కనుక, రకరకాల నియమాల కబంధహస్తాలకు అది నలిగిపోతుంది. ఉర్దూనియమాలు బంధాలే అయినా, అవి పుష్పబంధాల వంటివి! ఆ నియమాలనే తెలుగులో ప్రవేశ పెడితే అవి కరకు కంటకాలుగా పరిణమిస్తాయి! అందుకే గజల్, ఉర్దూ ఛందస్సులో మార్దవంగా విహరించే అందచందాల 'బుల్బుల్' అయితే - తెలుగు ఛందోబంధంలో నలిగిపోయే 'ఖైదీ'గా మిగిలిపోతుంది. అయినా, ఖైదీని కూడా బుల్బుల్‌గా మార్చలేక పోయినా, పంజరంలోని రామచిలుకగానైనా మార్చ గలిగారు తెలుగు కవులు. దాశరథికి ఇందులో అగ్రతాంబూల మివ్వక తప్పదు. గజళ్ళను చదువుకోవడం వేరు. చదివి, లేదా విని ఆనందించడం వేరు! ముషాయిరాలలో పాడడం కూడా వేరు! సొంతంగా గజళ్ళనే రచించి మెప్పించడం వేరు! వీటన్నింటికన్న, గజలు స్వభావాన్నే కలిగివుండటం ఇంకా వేరు! దాశరథిలో పై గుణాలన్నీ పుష్కలంగా ఉన్నాయనటానికి సందేహం లేదు. శేషేంద్రకు కూడా గజలుతో విడదీయరాని అనుబంధం వుంది. విశేషించి దాశరథి గజల్ ప్రక్రియను ఉర్దూ, హిందీ, ఫారసీ, స్పానిష్ భాషలలో అధ్యయనం చేసి, పరిశోధించి తెలుగులో కొంత విస్తృతంగా ప్రయోగాత్మకంగా పోషించిన మహాకవి.

గజల్ రచనలో 'దావా దలీల్' అనే గుణం చాలా ప్రధానం. ప్రతి షేర్‌లోని రెండు పాదాల్లో మొదటిది దావా, రెండవది దలీల్. అనగా నిరూపణ. నిరూపణ వల్లనే దావాకు ఒక అస్తిత్వం చేకూరుతుంది. న్యాయస్థానంలో వేసే దావా ఎంత అయోమయమో షేర్ లోని మొదటి వాక్యం కూడా అంతే అయోమయం. సాక్ష్యం ద్వారా దావాకు ఒక సార్థక్యం ఏర్పడుతున్నట్లు దలీల్ పంక్తి దావా పంక్తి ద్వారా చైతన్యవంత మవుతుంది. మబ్బు వంటిది దావా అయితే మెరుపు వంటిది దలీల్. మేఘం అయోమయం మెరుపు చకచ్చకితం. అందుకే దావా ఒక సాధారణ వాక్యంగాను, ఏదో మరో పూరణ లేదా నిరూపణ వాక్యాన్ని అపేక్షించేది గాను ఉంటుంది. దావా సఖునికి, దలీల్ సాఖీకి సంకేతాలు. సఖుడు 'ఆషిక్' గాను, సాఖీ 'మాషూక్' గాను ప్రసిద్ధి. తాత్త్విక దృష్టితో పరిశీలిస్తే జీవేశ్వర సంబంధమే దావాదలీల్ సంధానం! కొంతవరకు ఈ పద్ధతి కూడా తెలుగులో కనిపిస్తుంది.

**అడుగు సడి లేని కాళరాత్రాన**
**ముదిత పాదాల మువ్వలున్నాయి!**

అని దాశరథి షేరు. ఈ పంక్తుల్లో మొదటిది దావా, రెండవది దలీల్. ఇదొక పానగోష్ఠి వాతావరణాన్ని తెలుపుతున్నది. సాఖీ వియోగకారణంగా సఖుడు విచారగ్రస్తుడు. అతనికి తోడునీడ ఎవ్వరూ వుండరు. అసలే విచారగ్రస్తుడైన, విరహజ్వరపీడితుడైన ప్రేమికుడు అడుగు సడి కూడా లేని కాళరాత్రివేళ మరింతగా క్రుంగిపోతాడు. కాళరాత్రి ఎంత నిశ్శబ్దమో అంత భయానకం కూడా! శేషేంద్ర చెప్పినట్లు ఆ 'చీకటి రాత్రి భయానక చెహరా(ముఖం)', 'కారు చీకటిలో

కాంతిరేఖల్లాగా అతని నిరాశను తొలగించే మువ్వలున్నాయి. అవి ముదిత పాదాలకు సంధింపబడివున్నాయి. పానగోష్ఠిలో పాదాలు లయాన్వితంగా కదలుతాయి. మువ్వలు మ్రోగుతాయి. ఏ ముదిత కోసం సఖుడు వగపుపాలయ్యాడో - ఆ ముదిత పాదాల మువ్వలరవళి వింటూ అతడు కాళరాత్రిలో కోలుకోవచ్చు. 'అడుగు సడి లేని కాళరాత్రాన' అనే వాక్యం సాధారణంగాను, అసంపూర్ణంగానూ వుంది. 'ముదిత పాదాల మువ్వలున్నాయి' అనేది ఎంతో అర్థవంతంగా, చమత్కారయుతంగా ఉంటూ పూర్ణత్వాన్ని ఇస్తున్నది. గజల్‌లో ప్రతి షేరూ ఇలాగే వుంటుంది. ఈ రచనాధోరణి అలవడటం అంత సులభమేమీ కాదు. కాని ఇలా చమత్కరించి చెప్పేగుణం గజల్ కవికి వెన్నతో పెట్టిన విద్య! అది ముక్తకం కనుక చమత్కార గుణం చేత శ్రోతను రంజింపజేస్తుంది. ఈ 'టెక్నిక్' గజల్‌కు ప్రాణభూతం!

శబ్ద విషయంలో గజల్ పరమసుకుమారమైనది. నాజూకైన పదాలతో, భావాలతో, చమత్కారాలతో 'జాదూ' (మాయ) చేస్తూ పోవడమే గజల్ రచనా విశేషం. సంప్రదాయపు గజళ్ళనుంచీ, శృంగారభావాలకు పేశలమైన పదాలనే గజల్ కవులు ప్రయోగించారు. ఉర్దూపదాలు కూడ అందుకనుకూలమైన వాతావరణాన్ని ప్రదర్శిస్తాయి. ప్రత్యేక ధ్వనికి, నిరూపణకు ఆ పదాలే మిక్కిలి అనుకూలం. ఉర్దూకవి జలీల్ షేరొకటి చాలా సుప్రసిద్ధం:

**జబ్ తూ చలూ జమీఁ చలే ఆస్మాఁ చలే**
**జబ్ తో మై చలూ సాయా భీ మేరా సాథ్ న దే**

నీవు నడిస్తే నీతో పాటు భూమి నడుస్తుంది. ఆకాశం నడుస్తుంది. నేను నడిస్తే నా నీడ కూడ నాతో నడిచి రాదు- అని పై పంక్తుల కర్థం. ఇవి నాయిక నుబ్బించటానికి నాయకుడనే మాటలే అయినా రెండవ వాక్యంలో ఎంతో అర్థశక్తి వుంది. సహజంగా కదిలే భూమ్యాకాశాలు ఇక్కడ నాయికా గమన సౌందర్యానికి పోషకాలు. ఆకాశం అనే మాట నాయిక నడుమును, దాని కృశత్వాన్ని వ్యంజిస్తుంది. ఇదంతా దావాదలీల్ నిర్వహణలోని అంశమే. ఇదే జలీల్ షేరు అన్యభాషలలోకి అనువదింపబడితే ఈ సౌందర్యం రాదు. అందుకే గజల్ రచన అ-ఉర్దూ ప్రజలకు అసాధ్యమని ఒక మహాకవి అభిప్రాయం. ఇంక అనువాద మన్నది మల్లెపూవు మీది మంచుబిందువును తాకి చెడగొట్టడమే.

**'మీర్' ఉన్ నీమ్ బాజ్ ఆంఖోఁ మే**
**సారీ మస్తీ దునియా షరాబకీసీ హై**

అనే మీర్ షేర్‌ను ఎంత అనువదించినా ఆ శక్తి, వేగం రావు. ఆ సంప్రదాయమూ ఇముడదు. ఎర్రని సాఖీ అరమోడ్పు కన్నుల్లో సకల ప్రపంచపు మధుమాదకత దాగివుందని పై షేర్‌కు అర్థం. ఢిల్లీశైథిల్యం పట్ల తన(దిల్) హృదయశైథిల్యాన్ని మీర్ నిరంతరం ఆవిష్కరించుకొంటాడు. అందుకే నష్టప్రాయమైన ఢిల్లీకి మీర్ (నేత) ఒక సజీవ ప్రతీక.

అయినా భాష, భావాల సమైక్యత దృష్టితో చూస్తే ఇతర భాషలలోని గజల్ రచన కూడ కొంతవరకు సమర్థనీయ మనిపిస్తుంది. తెలుగులో గజల్ రచన పై లక్ష్యాన్నే తెలుపుతుంది.

గజల్ రచనలో 'అందాజె బయాన్' అనే గుణం **అతి** ముఖ్యం. బయాన్-వాక్యం, అందాజ్-విధానం. అనగా వాక్యరచనారీతి అని దీనికర్థం. శైలి అని కూడా చెప్ప వచ్చు. పదాలు పదునుగా పసందుగా భావోచితంగా పొందు పరుపబడాలి. గజల్ పేశలభావవిన్యాసం కనుక, పరుష, సంయుక్త క్లిష్టాక్షరాలకు ఇక్కడ తావు లేదు. గతు ` బట్టి మాత్రలు కూర్పబడుతున్నట్లు, భావాభివ్యక్తిని బ వాక్య రచనారీతి సిద్ధించాలి. గజల్ రచనలో ఈ విధా ం చాలా ప్రధానం.

**కాలమేమో బరువుబరువు కంటికేమో నిదుర కరువు**
**ఎంత చేదును మింగెనో ఇంత తీయని కోరిక.**

అనేది సినారె షేరు. బయాన్ విధానానికి దీనిని కొంతవరకు ఉదాహరణగా చెప్పవచ్చు. ఈ పంక్తులలోని సరళ పదాలు, అంత్యానుప్రాసలు, ప్రసాద గుణం బయాన్ రచనా ధోరణిని అలవోకగా పట్టి యిస్తున్నాయి.

గజల్ రచన ఒక ఎత్తైతే, ఆ సంప్రదాయ వాతావరణాన్ని తీసుకరావడం మరొక ఎత్తు! గజల్ స్వభావమే వుంటే ఇది సాధ్యం కానిది. మధురస్మృతులకు స్వగ్రామమైన భాగ్యనగర సౌందర్యాన్ని గజల్ టెక్నిక్ లో శేషేంద్ర రమణీయంగా వర్ణించాడు. భాగ్య నగరాన్ని ఒక అందాల జాబిల్లిగా, దక్కను ప్రేమగల్లీగా, మూసీనదిని వలపుల వాగుగా అభివర్ణించాడు. సందర్భం భాగ్మతీ ఖులీకుతుబ్షాల ప్రణయేతిహాసం!

**గులాబీలు వీధుల్లో గుసగుసలాడే చోటు**
**మధుశాలలు మసీదులు మనసును చీల్చే చోటు**
**అంగూరు తీగె లాంటి అందచందాల సాకి**
**మేను విరిచి ఒయారంగ మెహఫిల్‌లో తిరుగుచోటు**

గజల్ షేర్‌లకు సమానంగా సాగిన పంక్తులివి. ఖాఫియా లేకున్నా, రదీఫ్ నియమముంది. అయినప్పటికీ శేషేంద్ర పరిభాషలోనే చెప్పాలంటే ఇలాంటి వాటిని గజళ్ళనటం సాహసమట! గజల్ టెక్నిక్ అనటమే సమంజసమట!

అర్థదృష్టితో చూస్తే పై పంక్తుల్లో గజల్ వాతావరణం ప్రవేశించింది. భాగ్యనగరు బాజార్లలో గులాబీలు పరిమళాలతో గుసగుసలాడుతున్నాయి. ఎటు చూస్తే అటు మసీదులు, మధుమందిరాలు మనసును ఆకర్షిస్తున్నాయి. మధుర వేదనలను రేకెత్తిస్తున్నాయి. ద్రాక్షలత లాంటి అందాల సాఖీ పానశాలలో ఒయ్యారంగా మేను విరిచి నడయాడుతున్నది. అసలే మత్తు! ఆపై సాఖీ షరారత్తు(చిలిపి చేష్ట)! ఇందుకు తోడు పరిమళపరంపర! ఇక చాందినీ రాత్రిని కూడా కలుపుకొంటే, సితారువాద్యం సి గా వుంటే గాయాలసిరులతో కదలి వస్తుంది గజల్! ఈ ఉ ్న సామగ్రి ఉర్దూలో అడుగడుగునా కనిపిస్తుంది. ఇలా ల్ జన్మకు అనువైన వాతావరణాన్ని పైన పేర్కొన్న పంక్తుల్లో శేషేంద్ర చక్కగా ఆవిష్కరించాడు.

ఉర్దూలో 'పానగోష్ఠి' ప్రస్తావన పదేపదే వస్తుంది గజల్ సంప్రదాయంలో ఇదే ముఖ్యాంశం. విశ్వసంకేతం! సాఖీ దైవసంకేతం! పరబ్రహ్మ చెక్కిన అందాల బొమ్మగా అభివర్ణింపబడే ఈ మోహన సాకీ, గజల్‌కవికి ఒక ఊహాసఖి మాత్రమే! ఆవిడ పంచే మధువు అనుగ్రహానికి సంకేతం! గజల్‌కవే ప్రేమికుడు. భక్తుని వంటివాడు. గోష్ఠిలో సాఖీ అందరికీ 'నురగ కల్లు' అందిస్తుంది. ప్రేమికుడికి మాత్రం మదిరలేని కారణంగా 'నవ్వే కళ్ళు' చూపిస్తుంది. మండే గుండెలతో, ఎండిపోయిన పెదవులతో కాచుకొని చివర కూర్చొన్న ప్రేమికుడికి ఆ కళ్ళనవ్వులే పన్నీటి జల్లులవుతాయి! ఈ సంప్రదాయాన్ని కూడ దాశరథి తెలుగులో ప్రవేశపెట్టాడు.

'మండిన గుండెల, ఎండిన పెదవుల
మధుకణమొక్కటి చిలకవులే
త్రావినవారే మరిమరి త్రావగ
వలదని యైనా పలకవులే'

వియోగాగ్నివల్ల ప్రేమికుడికి గుండెమంటలు పుడుతున్నాయి. ఈ వేడిమి కారణంగా అతని పెదవులు ఎండుకుపోతున్నాయి. ఈ దాహాన్ని బయటయితే మంచినీటితో తీర్చుకోవచ్చు. ఇది ప్రణయదాహం కనుక పానశాలలో ప్రేమికుడు ప్రవేశించాల్సి వచ్చింది. అందరికీ సాఖీసరసం అబ్బగా, ప్రేమికుడికి అసాధ్యమవుతుంది. ఇది ఉర్దూ గజల్ సంప్రదాయం. మదిర లేదంటే సాఖీసమ్మతి లభించలేదని అర్థం! 'నవ్వేకళ్ళంటే' కవ్వించే విరహాతిశయమన్న మాట. దైవం సుఖజీవులకే అధికసుఖాలనిస్తుంది. త్రావినవారే మరి మరి త్రాగే భాగ్యానికి నోచుకోవడ మిలాంటిదే! పేదలకు దైవం అధిక దారిద్ర్యాన్నిస్తున్నట్లు, ప్రేమికుడికి సాఖీకృప సాధారణంగా లభించదు. ఫలితంగా సఖుడు తీవ్రవేదనకు గురి అవుతాడు. జీవాత్మ పొందే కషణ సంస్కృతికి ఈ వేదన సంకేతం. చివరకు మృతి అనే దాన్ని నెపంగా భావించి, అద్వైతసిద్ధి నొందుతాడు.

ఇంకా గజల్ కవులకు అలవాటయిన వియోగానందాన్ని దాశరథి చాలా సందర్భాలలో ప్రవేశపెట్టాడు. అలా ప్రవేశపెట్టడంలో తన స్వభావాన్ని మిళితం చేసినప్పుడే దానికి పరిపూర్ణత వస్తుంది. దాశరథి రచించిన 'కుపిత ప్రణయిని' అనే గజల్ అలాంటిదే.

చేరువ లో లేకున్న చిరునగవులె చాలు
చెలిమి చేయదలచకున్న చిరు తగవులె చాలు
మమత పొంగు నవ మధువు మా కిడకున్నా
మధువు తడికి మెరిసే నీ పెదవులె చాలు.
ఎద పొలాన పంటవేసి వదిలేశావు
వలపుపంట రాకున్న కరువులె చాలు.

సాఖీ చిరుతగాదాలు, మెరిసే పెదాలు, పరువులు, కరువులు, నవమధువు ఈపైపంక్తుల్లో కనిపిస్తున్నాయి. ఇవన్నీ గజల్ కవితా సామగ్రికి సంబంధించినవి. సాధారణంగా సాఖీ, సఖునికి వశమయ్యే ప్రశ్నే వుండదు. ఊరించడం ఉడికించడం మాత్రముంటాయి. పై పంక్తుల్లో కనిపించే సామగ్రి సఖుణ్ణి ఊరించడాని కన్న, ఉడికించటానికే ఉపకరిస్తున్నది. సఖునికి ఉడికింపబడటం కూడా, ఊరింపబడటంలాగానే వుంది. ఇదే గజల్ చమత్కారం! ఇదే వియోగానందం! ఇంకా చిత్రమేమంటే సాఖీకి, సఖునికి అంత దూరం కూడా వుండదు. సమీపంలోనే వియోగం! నవ్వుతూ, నవ్విస్తూ, నడయాడుతూ, నడిపిస్తూ కూడ వియోగం. ఈ వియోగశృంగారాన్నే పై పంక్తుల్లో దాశరథి చెబుతున్నాడు.

'విత్తు' అనగా శృంగార బీజావాపం. వలపుపంట-సంయోగం. ఇది అసాధ్యం కనుక వియోగమే శరణ్యం! దీనినే 'కరువులె చాలు' అని దాశరథి చమత్కరించాడు. ఇలాంటి ధ్వనులు, చమత్కారాలు గజళ్లలో పడుగుపేకల్లాగా అల్లుకొని వుంటాయి. గజల్ సంప్రదాయానికి ఇవి జీవనాడుల వంటివి.

గజల్ ప్రక్రియలో కొన్ని ప్రత్యేక కవిసమయాలు, న్యాయాలు కనిపిస్తాయి. గులాబీతోట, బుల్బుల్ పాట

వంటివి అందులో కొన్ని. శృంగారవికాసాన్ని, విలాసాన్ని తోట తెలుపుతుంది. పాట ఆనందాన్ని ప్రకటిస్తుంది. ఇంకా 'సయ్యాద్' అంటే వేటగాడు. సాధారణంగా నాయిక కోసం నాయకు డన్వేషించే విధానం ఇది. ఒక్కోసారి వేటగాడు పక్షిని హతమార్చినట్లు నాయిక వెదకివెదకి నాయకుణ్ణే ఖతం చేయవచ్చు. ఈ పద్ధతి చాలా సందర్భాలలో కనిపిస్తుంది. అందుకే సయ్యాద్ అనే పదం చాలావరకు శ్లేషార్థాలకు ప్రయోగింపబడుతుంది. 1. నాయిక 2. వేటగాడు అనేవి ఆ అర్థాలు.

'గుల్చీ' - పూలు త్రుంచేవాడు. ఇతడు సాకీనిర్దయతకు ప్రతీక. కవి గుల్చీని చాటు చేసుకొని సాకీకాఠిన్యాన్ని తెలుపుతుంటాడు. అల్లే 'ఆషియానా' అనగా గూడు. సఖుడు సాకీకోసం సర్వాన్నీ సమర్పించి వుంటాడు సద్భక్తుని లాగా. అతనికి ఒక చిన్న గూడు వంటి గృహమే మిగులుతుంది. ఇంతలో బర్క్-పిడుగు వచ్చి గూడును నాశనం చేస్తుంది. అనగా సఖుని ఆశ అడియాస అవుతుంది. 'బర్క్ ఔర్ ఆషియానా' అనేది గజల్ కవితాన్యాయం.

అల్లే 'షమా' - దీపం. ఇది సాకీకే ప్రతీక. 'పర్వానా' - పురుగు. ఇది సఖునికి ప్రతీక. దీపం చుట్టూ పురుగు తిరిగి బలి అవుతుంది. అల్లే సాకీచుట్టూ సఖుడు తిరిగి మృతుడవుతాడు. జీవేశ్వరైక్యం ఇక్కడ స్ఫురింపబడాలి. ఇంకా సఫీనా (పడవ)లు - సముద్రాలు, సత్రాలు - బాటసారులు, ఎడారులు- ఎండ మావులు, కత్తులు - రక్తాలు, వ్యాధులు - వైద్యులు, వధ్యశిలలు - వధించేవాళ్ళు, మిత్రులు - శత్రువులు, నిరీక్షణలు - నిరాశలు వంటివెన్నో గజల్ కవితావాతావరణంలో చోటుచేసుకొంటాయి. సంప్రదాయపు 'చేవ'ను చాటి చెబుతాయి. ఇంతటి వింత వాతావరణం తెలుగులో సాధ్యం కాలేదు. అందుకే తెలుగులో గజల్ కవితార చన అంత అయస్కాంతశక్తిని అందుకోలేకపోయింది. కారణం పై సామగ్రి లేకపోవడం, శబ్దంలో మార్పు.

ఇలా గజల్ కవిత స్వరూపంలో కొత్తదనాన్ని, స్వభావంలో మెత్తదనాన్ని కలిగివుంది. తెలుగులో ఈ స్వరూప స్వభావాల ప్రత్యేకత అంతంతమాత్రంగానే దర్శనమిస్తుంది. అయినా అంతటి రంగుల, రాగాల గజల్ కవితా విహంగం తెలుగులోకి ప్రవేశించడమే హర్షణీయం! అంతశ్చేతనకు గజల్ కవితలో మొదటి స్థానముంటుంది. దీనికి ప్రాధాన్య మిస్తూ తెలుగులో గజల్ కవిత ఇతోధికంగా అభివృద్ధి చెందే స్వప్నం క్రమంగా నిజమవుతుంది.

వాపీవ జలభృ దుదయా చ్చాపీవ శరవ్య భేదనా దనిశమ్।
జాపీవ హృదయనియమాత్ తారుణ్యా త్తవ విభాతి తను శోభా॥

వర్షా కాలంరాగానే బావిలాగ, ఎప్పుడూ గురితప్పక కొట్టడంవల్ల విల్లులాగ, మనస్సును అదుపులో పెట్టుకోడంవల్ల తపస్విలాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి

# చతుర్భాణి

శ్రీమతి కె. కమల

''వరరుచి రీశ్వర దత్తః
శ్యామిలకః శూద్రకశ్చత్వారః
ఏతే భాణాన్ బభణుః
కా శక్తిః కాలిదాసస్య.''

వరరుచి, ఈశ్వరదత్తుడు, శ్యామిలకుడు, శూద్రకుడు. ఈ నలుగురు భాణములను చెప్పిరి. (రచించిరి). వీరి ముందు కాళిదాస మహాకవి శక్తి ఎంత?

వరరుచి ఉభయాభిసారికను ఈశ్వరదత్తుడు ధూర్తవిట సంవాదమును, శ్యామిలకుడు పాదతాడితకమును, శూద్రకుడు పద్మప్రాభృతకమును రచించెను. ఈ నాల్గింటిని ఒకచోట చేర్చినపుడు చతుర్భాణీ అను నామకరణము జరిగినది.

చతుర్భాణీగ్రంథము ప్రాతఃస్మరణీయులు, పండిత ప్రకాండులైన శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారికి, శ్రీ ఎన్.కె.రామనాథశాస్త్రి గారికి త్రిచూర్‌లోని శ్రీ నారాయణనంబూద్రిపాద్ వద్ద లభించింది. ఈ భాణములు నాల్గింటిని అధ్యయనము చేసి, ఇవి క్రీ.శ. నాలుగు, అయిదు శతాబ్దములలో గుప్తుల సామ్రాజ్య మతి వైభవముగా నున్న కాలములో రచింపబడి యుండునని విద్వాంసు లభిప్రాయపడిరి. పద్మ ప్రాభృతకము, ఉజ్జయినీ నగరాన్ని, ధూర్తవిట సంవాదము, ఉభయాభిసారిక పాటలీపుత్ర నగరాన్ని, పాదతాడితకము సార్వభౌమనగరాన్ని వర్ణించును. సార్వభౌమనగరము ఉజ్జయినియే-

ఉభయాభి సారికాకారుడయిన వరరుచి పాణిని మహర్షికి సమకాలికుడని, కంఠాభరణము, చారుమణి అనుగ్రంథములను రచించినవాడని అంటారు. అవంతి సుందరీ కథా సారము అను గ్రంథమీతనిని గోదావరీ తటవాసియని పేర్కొనెను.

పద్మప్రాభృతక కర్త అయిన శూద్రకుడు, మృచ్ఛకటికము, వత్సరాజచరితము, బాలచరితము, అవిమారకము, చారుదత్తము, కామదత్తాప్రకరణమును రచించిన శూద్రకుడును ఒకడేయని భావించవచ్చును. శూద్రకు డాంధ్రభృత్యుడయిన స్వాతి యనువాని సేవకుడని, ఎన్నోకష్టములను ఎదుర్కొన్న తరువాత, స్వాతిని ఓడించి శూద్రకుడు ఉజ్జయినికి రాజు అయ్యెనని రామిలక, సోమిలకుల శూద్రక కథ, విక్రాంత శూద్రక నాటకము పంచార్ణవుని శూద్రక కథ తెలుపుచున్నవి. శూద్రకుని పరిచయము మృచ్ఛకటిక నాటకములోని ఆముఖము నందిట్లున్నది.

ద్విరదేంద్ర గతిశ్చకోరనేత్రః
పరిపూర్ణేందుముఖః సువిగ్రహశ్చ
ద్విజముఖ్యతమః కవిర్బభూవ
ప్రథితః శూద్రక ఇత్యగాధ సత్త్వః
ఋగ్వేదం సామవేదం, గణితమథ కలాం
వైశికీం హస్తి శిక్షాం
జ్ఞాత్వా శర్వప్రసాదాత్ వ్యపగత తిమిరే
చక్షుషీ చోపలభ్య,
రాజానం వీక్ష్యపుత్రం పరమ సముదయే
నాశ్వమేధేన చేష్ట్వా
లబ్ధ్వాచాయుః శతాబ్దం దశదిన సహితం
శూద్రకోగ్నిం ప్రవిష్టః

గజేంద్ర గమనము, చకోరనేత్రములు, పున్నమనాటి చందమామ వంటి ముఖము, మంచి విగ్రహమును గలిగిన ద్విజముఖ్యతముడు శూద్రకుడు. అతని సత్త్వము అగాధము. శూద్రకుడు ఋగ్వేదము, సామవేదము, గణితమును, వేశ్యలకు సంబంధించిన కళను (లేక అగ్నివేశుడను రాజు చతుఃషష్టి కళాత్మకమయిన కామ విద్యాగ్రంథమును రచించెను. అది గూడా వైశికీ కళయే కాగలదు), ఏనుగుల శిక్షకు సంబంధించి శాస్త్రమును అభ్యసించెను. ఈశ్వరుని ప్రసాదమువలన చీకటిని పోగొట్టుకొని తిరిగి కన్నులను పొందెను. (అజ్ఞానమును పోగొట్టుకొని జ్ఞాని అయి ఉండవచ్చును. లేదా కంటి రోగమును ఈశ్వరారాధనముచేత నివారింపజేసికొని యుండవచ్చును. మృచ్ఛకటిక నాందీ శ్లోకములో యోగీశ్వరుడయిన శివుని వర్ణనమే ఉన్నది) అతడు తన కుమారుని రాజుగా ప్రతిష్ఠించెను. మిక్కిలి వైభవముతో అశ్వమేధయాగమును చేసెను. నూరు సంవత్సరముల మీద, పది దినముల వరకు జీవించి తుదకు అగ్నిప్రవేశమును చేసెను. ఇదీ శూద్రకుని పరిచయము.

ధూర్తవిట సంవాదకర్త అయిన ఈశ్వరదత్తుడు మగధలో నివసించిన వాడు. ఇంతకన్న ఇతనిని గూర్చి తెలియదు. భోజదేవుని శృంగార ప్రకాశములో, హేమచంద్రుని కావ్యాను శాసనములోను ఈతని ప్రశంసగలదు. కాశ్మీర వాసియగు శ్యామిలకుని పేరును అభినవగుప్తుడు, క్షేమేంద్రుడును స్మరించిరి.

చతుర్భాణిలో తురకల దండయాత్రలను గురించిన ప్రస్తావన లేదు. ఇందులో వాడిన శబ్దజాలము, ఇందలి పాత్రలు పీల్చుకున్న ఊపిరి కేవలము మృచ్ఛకటికమును మాత్రము పోలియున్నది. అక్కడక్కడ భాస మహాకవి శైలిగూడా ఇక్కడ కనిపిస్తున్నది. వాసు, ధాంత్రః, ఉదవసితమ్ వంటి ప్రాచీన పదప్రయోగము లిందున్నవి. 'దేవానాంప్రియః' అనే పదము మహాభాష్యములో, కాశికలో గూడా మూర్ఖుడనే అర్థాన్ని తెలుపదు. క్రీ.శ.10 వ శతాబ్దిలోని మమ్మటాచార్యుడే దేవానాం ప్రియః అంటే మూర్ఖుడనే అర్థాన్ని తెలిపినాడు. చతుర్భాణిలో ఈ శబ్దము ఆదరార్థకమే.

పాదతాడితకములో వర్ణితమయిన సార్వభౌమనగరము సార్వభౌముడయిన చంద్రగుప్త విక్రమాదిత్యుని సంకేతమునే తెలుపుచున్నదని (క్రీ.శ.నాల్గవ శతాబ్ది) శ్రీ బరోపండితుని అభిప్రాయము - ఇక్కడ శకుల హూణుల ప్రసక్తివున్నది. చంద్రగుప్తుడు మాళవసౌరాష్ట్ర దేశములనుండి శకులను పారద్రోలినట్లును, ఇది నాల్గవ శతాబ్దమునాటి ఘటన అని చరిత్ర తెలుపుచున్నది. హూణులతో క్రీ.శ.అయిదవ శతాబ్దారంభములో భయంకర యుద్ధములను స్కందగుప్తుడు చేసినట్లును చరిత్రకారుల మతము పద్మ ప్రాభృతకములో మహేంద్ర శబ్దము ప్రయుక్తము. ఉభయాభిసారికలో ప్రియంగుసేన అనే వేశ్య విటునితో ఈ విధంగా పలుకుచున్నది.

''భగవతో Z ప్రతిహత శాసనస్య కుసుమపుర-పురందరస్య భవనే పురందర విజయ సంగీతకే యథారసాభినయ మభినేతవ్యమితి దేవదత్తయా సహ మే పణితః సంవృత్తః''

(అప్రతిహతశాసనుడు పాటలీపుత్ర పురందరుడు. రాజు అతని భవనములో పురందర విజయము అనే సంగీతకము, నాట్యము అభినయించవలసి యున్నది. దానికొరకు నాకు దేవదత్తకు, పణితము, ఒప్పందము జరిగినది. మేము అభినయించబోవుచున్నాము). ఇచ్చట మహేంద్ర, పురందర శబ్దములు, ఇంద్రునికి, మహేంద్రాతిత్యుడయిన కుమారగుప్త చక్రవర్తికిని సమముగా వర్తించును. కుమారగుప్తుని నాణెముల మీద శ్రీమహేంద్ర, శ్రీ అశ్వమేధ మహేంద్ర, మహేంద్ర సింహ, అజిత మహేంద్ర, మహేంద్రకర్మా, సింహమహేంద్ర, మహేంద్రాదిత్య, మహేంద్రకుమార నామములు లభించును. అతని శాసనములం దతడు అప్రతిహత శాసనుడన్న బిరుదమును వహించినట్లు. 'అప్రతిఘః' అన్న బిరుదము అతని కున్నట్లును తెలియుచున్నది.

ఇట్లనేక ఆధారములు చతుర్భాణీ రచనకాలము క్రీ శ నాలుగు, అయిదు శతాబ్దములయి యుండునని సోపపత్తికముగా పూజ్యులయిన శ్రీ వాసుదేవ శరణ అగర్వాల్, శ్రీ మోతీచంద్ర విద్వాంసులు తాము సంపాదకత్వము వహించి శృంగార హాటము (శృంగారపు అంగడి) అనుపేరుతో ప్రచురించిన చతుర్భాణీ ఉపోద్ఘాతము నందు నిరూపించిరి. ఈ కాల నిర్ణయము సుసంగతము.

దశవిధ రూపకములలో భాణము ఏకాంకికము. ఇందు విటుడొక్కడే రంగస్థలమునందు ప్రవేశించి వివిధ పాత్రలను గురించిన సమాచారమును. ఆకాశ భాషితముద్వారా మనకు తెలియజేయును. వారందరితోనూ తాను మాటలాడుచున్నట్లును వారి మాటలకు తానుబదులు చెప్పుచున్నట్లును ఉండును. ఇది ఏక పాత్రాభినయము - చాలా ప్రతిభావంతుడయిన నటుడు దీనికి కావలెను. క్షేమేంద్రుని విటుని వర్ణనమిట్లున్నది.

'ఉదంచితకచః కించిచ్చిబుక శ్మశ్రువేష్టనే దినే
దేవగృహాధీశవదనం వీక్షతే విటః'
(క్షేమేంద్రుని దేశోపదేశము - 5-16)

వెంట్రుకలు పైకి ఎత్తికట్టు కొన్నవాడు, లేదా తలమీద వెంట్రుకలు నిక్కబొడుచుకొనినట్లున్నవాడు, కొద్దిగా వంకర మీసమున్నవాడు, తలపాగా కలవాడు, పగటి పూట దేవాలయధర్మాధికారి ముఖమును వీక్షించువాడు విటుడు ఈ విటుని రూపాన్ని పోలిన శిల్పము పట్నావద్ద కుమ్రహారా, త్రవ్వకములలో లభించగా దానిని కాశీ విశ్వవిద్యాలయములోని భారత కళాభవనములో సురక్షిత పరచుట అయినది. ఈ విటుని వర్ణనము, గాథాసప్తశతీ, వజ్జాలగ్గము గ్రంథాలలోని ఛైకుని వర్ణనముతో పోలుతుంది. ఒక గ్రామము ఇండ్లతో, వాకిండ్లతో గ్రామ మనిపించుకోదు. ఛేకులు నివాసమున్న చోటే గ్రామము. వారికి ఎదుటి వారి మనోగత భావములను గ్రహించే నైపుణ్యము. చాతుర్యము, చమత్కారము మెండుగా ఉంటుంది.

చతుర్భాణిలో గుప్తసామ్రాజ్యకాలము నాటి ఈవి, ఆనాటి సాంఘిక స్థితిగతులు, విపణి వీధులు, దంభము, విశ్వాసము, మోసము, న్యాయము, అన్యాయము, కామశాస్త్రము నందలి విశేషాభినివేశము, వేశ్యలకు సమాజములో ఉండే స్థానము, చివరకు నపుంసకుల వర్ణనము, ఉత్తమ, మధ్యమ, అధమ

శ్రేణులకు చెందిన వేశ్యల నిరూపణము, వివిధ వర్గములవారి ఆచార వ్యవహారములు, వేయేల గుప్త సామ్రాజ్యమే మనకు కన్నులకు కడుతుంది. ధనము మాత్రము కొరకు ప్రియులను చేరునది, అధమురాలు, ధనముతోబాటు రూపరేఖావిలాస ములను వరించునది మధ్యమురాలు, ధనములేని వానినైనను, అతడు రూపవంతుడు, గుణవంతుడును అయితే అతనిని చేరు వేశ్య ఉత్తమురాలును అని, ఇక్కడ చెప్పబడింది. ఆవిధముగా మృచ్ఛకటికము నాయిక వసంతసేన ఉత్తమవేశ్య అయినది.

చతుర్భాణిని చదువుతూ ఉంటే సుందరకాండములో హనుమంతుడు రావణుని ఐశ్వర్యము, తేజస్సును అతని దర్బారులో చూచి అతనిని ప్రశంసించిన సందర్భము గుర్తుకువస్తుంది. ఒక్క అధర్మము బలవత్తరము కాకుంటే ఇతడు దేవలోకమునైనను ఏల గలవాడే యని హనుమంతుడ నెను.

'అహో రూప మహో వీర్య మహోసత్త్వ మహో ద్యుతిః,
అహోరాక్షసరాజస్య సర్వలక్షణయుక్తతా,
యద్యధర్మో న బలవాన్ స్యాదయం రాక్షసేశ్వరః,
స్యాదయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా.
(రా. సుం.49-27,28)

ఈ భాణములలో ఉత్తమ వర్ణనలు, రూపకల్పనలు, ఆభాణకములు, ఉపమలు, ఉత్ప్రేక్షలు, సాంఘికాచారముల వర్ణనము, వైదర్భీరీతికి అనుగుణమయిన సుకుమార పద ప్రయోగములు, నాట్యశాస్త్ర సంప్రదాయములకు అద్దము పట్టే నృత్యవర్ణనములు, నట, విట, గాయక, కవి, శాక్యభిక్షుక, వైయాకరణుల పరిచయములు, వేశ్యలలో మోసగత్తెలు, ప్రియుని రాకకై ఎదురుచూచే ప్రియవ్రతలు ఉన్నారు. ఒకటేమిటి సర్వాంగ సుందరమైనదీ కవిత్వము - ఇందు శిష్టాచారము ఉండిఉంటే ఇది శిష్టోపాధ్యాయికలో చేరి ఉండదగిన గ్రంథమే. బహుశః శూద్రక మహాకవి, పద్మ ప్రాభృతకము వ్రాసిన తరువాత అదేజీవనాన్ని శిష్టులకు ఆమోదయోగ్యమగునట్లుగా మృచ్ఛకటిక ప్రకరణములో తిరిగి రచించి యశస్వియయ్యెనని తోస్తున్నది. ఇంతటి సుకుమార శృంగారమునే వర్ణించిన కాళిదాస మహాకవి తన పాత్రల ఉదాత్తత వలన, నేర్పరి తనమువలన ఇంకా నునుపు చేసి మిలమిల మెరిసే శైలివలన, ధర్మప్రతిష్ఠాపనము కొరకే కాంతాసమ్మితమయిన ఉపదేశమును చేసినందువలన, కవికుల గురువు కాగలిగెను. ఒక్కొక్కసారి చతుర్భాణి, చతుర్భా ణియే. ఈ శైలి ఈవర్ణనములు ఈ విధంగా కాకుంటే మరో విధంగా ఉండటానికి వీలులేదు గదా అనిపిస్తుంది. ఇదంతా ఎందుకు చెప్పవలసి వస్తుందంటే, చతుర్భాణి రచయితలకు కాళిదాస మహాకవి ఋణపడి ఉన్నట్లు తోస్తున్నది. చూడండి;

దేవసేన అనువేశ్య కర్ణీసుతుడను ప్రియుని కామించినట్లు తెలియుచున్నదని. పద్మ ప్రాభృతక భాణము ఆరంభమయి నది. ఆమెకు కర్ణీపుత్రుని యందుగల అనురాగమును తెలుపుటకే విటుడు ఆమె చేత ధరించిన, తామరపువ్వునొక దానిని ప్రాభృతకముగా - కానుకగా కర్ణీపుత్రుని వద్దకు తీసికొని పోవుటయే పద్మప్రాభృతకము. దేవసేనవర్ణన మిట్లున్నది.

'విభ్రాంతేక్షణముక్షతోష్ఠ రుచకం
ప్రాచీన గండం ముఖం
ప్రత్యగ్రోత్పతితస్తనాంకురమురో
బాహూలతా కోమలా,
అవ్యక్తోత్థిత రోమరేఖ ముదరం
శ్రోణీకుతో2 ప్యాగతా
భావశ్చానిభృత స్వభావ మధురః
కం నామ నోన్మాదయేత్'
(చతు. పుట.7)

(ఆమె చంచల కటాక్షము, అక్షతమయిన ఓష్ఠము, చెంపలను పక్కకు తిప్పిన ముఖము, అప్పుడే అంకురించిన వక్షోజ ములు, అవ్యక్తముగా మొలిచిన రోమరాజి, ఎక్కడినుండియో వచ్చి ఇమిడిన శ్రోణీ స్థలము, దాపరికములేని స్వభావమధుర భావము ఎవరికి మత్తు కలిగించదు?)

ఈ శ్లోకము అడుగుజాడలు మాలవికాగ్ని మిత్రములో మాలవిక వర్ణనములో కనిపిస్తాయి. చూడండి.

'దీర్ఘాక్షం శరదిందుకాంతి వదనం,
బాహూనతావంసయోః
సంక్షిప్తం నిబిడోన్నతం స్తనమురః
పార్శ్వే ప్రమృష్టే ఇవ,
మధ్యః పాణిమితో నితంబి జఘనం
పాదావరాలాంగులీ
ఛందో నర్తయితుర్యథైవ మనసి
శ్లిష్టం తథాస్యావపుః'
(మాళవిక - --- 3)

కాత్యాయన గోత్రుడు, కావ్యవ్యసని, శారద్వతీపుత్రుడ యిన సారస్వత భద్రుడనువాడు కవి. అతడు విటునికి కనిపిస్తాడు. ఇంకేమున్నది. అతనిని విటుడు - పురాణకావ్యః

దచ్ఛేద గ్రథనచర్మకార, అని సంబోధించెను -పాతకావ్యాలలోని పదములను చించి, అతికించి కుట్టేపని చేసే ఈకవి చర్మకారుడే (చెప్పులు కుట్టేవాడు). గొల్లవాడు తప్పిపోయిన ఆవులను వెదకు కొంటున్న ట్లతడు తన పదాలను వెదుకుకుంటూ కనిపిస్తాడు. అతని వసంతర్తు వర్ణనమును విటుడు ప్రశంసించి. 'వయస్య, సత్పుత్రలాభ ఇవయశస్కరః శ్లోకో Z యమస్తు' అని దీవించెను. (మిత్రమా! ఈ శ్లోకము సత్పుత్రలాభమువలె నీకు యశస్కరమగుగాక)

ఆ ప్రశంసను విని దర్దురకుడను వాడు నవ్వి, విటునితో ఈవిధంగా పలుకును.

'ఇదం ఖలు భవతా సముద్రాభ్యుక్షణం క్రియతేయద్ వాగీశ్వరం వాగ్భిరర్చయసి'

(నీవు ఈ కవిని పొగడుట సముద్రము మీద నీటిని చిలకరించినట్లే సుమా!) అప్పుడు విటుడిచ్చిన సమాధానమిది

సూర్యం యజంతి దీపైః
సముద్రమద్భిః వసంతమపి పుష్పైః,
అర్చామో భగవంతం
వయమపివాగీశ్వరం వాగ్భిః' - (చతు - పుట.12)

(సూర్యుని దీపముతో అర్చించెదను - సముద్రమును నీటితో పూజించెదరు - వసంత మాసమును పుష్పములచే పూజించెదరు - మేమును పూజ్యుడయిన ఈ వాగీశ్వరుని (కవిని) వాక్ప్రసూనములచే అర్చించెదము. ఇందుతప్పేమి?)

ఇక్కపై భావము శంకర భగవత్పాదుల సౌందర్యలహరి లోని చిట్టచివరి శ్లోకములో సర్వాంగసుందర రూపమును ధరించి దర్శన మిచ్చుట సహృదయులకు, భక్తులకు, ఉపాసకులకు విదితమే - చూడండి.

ప్రదీపజ్వాలాభిర్దివసకర నీరాజనవిధిః
సుధాసూతేశ్చంద్రోపల జలలవైరర్ఘ్యరచనా,
స్వకీయైరంభోభిః సలిలనిధిసౌ హిత్యకరణం
త్వదీయాభిర్వాగ్భిస్తవజనని వాచాం స్తుతిరియమ్''.

దివసకరునకు ప్రదీపజ్వాలలతో నీరాజన విధి, చంద్రునకు చంద్రకాంత మణిద్రవముతో అర్ఘ్యము, సముద్రములోని దోసిలి నీళ్ళను పైకెత్తి సముద్రమునకే అర్పించుట ఓయమ్మా! నీదగు వాక్కుచే నిన్ను స్తుతించుట కదా!

ధూర్తవిటసంవాదము, కామశాస్త్రమునకు, వైశికనీతికి వ్యాఖ్యానమే. ఇందు ఇద్దరు ధూర్తులు. కామశాస్త్ర చర్చ చేయుదురు. దర్శనము, ప్రమాణము వంటి శాస్త్రీయ పదజాలమిందు యథేష్టము ఉపయుక్తము - ఇక్కడ వర్షర్తువు కామోద్దీపకమని విటుడు ఆ ఋతువు నీ విధంగా వర్ణిస్తాడు.

''భ్రాంతపవనేషు సంప్రతి
సుఖినోZపి కదంబ వాసి వనేషు,
ఔత్సుక్యం వహతి మనో
జలధర మలినేషు దివసేషు.''

(చల్లగాలి వీచుచుండగా, వనములనుండి కదంబ పుష్పగంధము వ్యాపించినప్పుడు నల్లని మేఘములతో మలిన ములయిన దినములలో సుఖముగా వెచ్చగా ఉన్నవారి మనస్సులలో గూడ ఔత్సుక్యము పెంపొంది భావములు ముప్పిరిగొనును-)

మేఘదూత కావ్యములో ఇదే భావమును కాళిదాస మహాకవి తెలిపెను:

మేఘాలోకే భవతి సుఖినోZప్యన్యథావృత్తి చేతః
కంఠాశ్లేషప్రణయిని జనే కింపునర్దూరసంస్థే.''
(మే - 3 -)

ఇంటిలో తమ ప్రియురాండ్రతో కలిసి సుఖముగా ఉన్నవారికి గూడా నీలమేఘములు కనిపించగానే మనస్సు పరిపరి విధముల ఔత్సుక్యము నొందుననగా, ఇక దూరముగా నుండి ప్రియావిరహము ననుభవించుచున్నవారి స్థితిని గూర్చి చెప్పనక్కరలేదు గదా!

రామదాసి అనే వేశ్య ఏడ్పు విటునికి వినిపిస్తుంది. ఆ ఏడ్పును విని అతడిట్లా అంటాడు.

అస్యా నేత్రాంత విభ్రష్టాః కోప సర్వస్వ సంభృతాః
ప్రియాపరాధ గణనాం కుర్వంతీ వాశ్రు బిందవః.''

ఆ రామదాసి కోప సర్వస్వమును నింపుకొని నేత్రాంతము నుండి జారిన కన్నీటి బిందువులు ప్రియుని అపరాధములను లెక్కపెట్టుచున్నావా? అన్నట్లున్నవట.

ఆ అశ్రుబిందువులు జారి అమె శరీరము మీద పయనించిన తీరు ఇది.

'ఆపూర్యాభినవాంబుజద్యుతి హరే
నేత్రే ప్రయాతో Z ధరం
తద్ భ్రష్టః కఠినాగతః స్తనతటౌ
తత్రాప్య లబ్ధాస్పదః,
బాష్ప స్తే తనురోమరాజిలులితః శోక ప్రసంగోజ్ఝితః
నాభిం పూర్ణయతి ప్రియాంగులి ముఖ
ప్రక్షేప లీలోచితః.''

(చతు. పుట 82)

అప్పుడే వికసించిన తామర యొక్క కాంతిని హరించు నీ కంటిలో కన్నీరు నిండి పెదవి మీదికి జారింది. అక్కడి నుండి కఠినమైన స్తనతటముల మీదపడి, అక్కడ కూడా చోటులేక కడుపుమీద రోమరాజిమీద దొర్లిపోయి చివరకు నాభిని నింపివేసింది. న్యాయముగా చూస్తే నీ ప్రియుడు తన ముని వ్రేలితో ఈ కన్నీటిని తుడిచి వేయవలసింది గదా!

ఉత్తమ కావ్యమని, ధ్వని కావ్యమని కుమార సంభవము లోని పంచమ సర్గలోని పార్వతీదేవి తపోవర్ణనములోని ఒక శ్లోకమును అప్పయ్య దీక్షితులు కువలయానందములో ఉదాహరించిరి. తొలి వానచినుకులు ధ్యానముద్రలో నున్న పార్వతి శరీరము మీద పడి పయనించెనని కాళిదాస మహాకవి వర్ణించిన తీరు లోకోత్తరము.

'స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధరోత్సేధనిపాత చూర్ణితాః,
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోదబిందవః. (కుమా. 5)

ప్రథమ వర్ష బిందువులు దేవి కనురెప్పల మీద ఒక క్షణము నిలిచి, అధరము మీద పడి దెబ్బ తగిలించి వక్షః ‌అముమీద పడి దెబ్బతిని, పిండి పిండిఅయిపోయి, ‌ వళులతో దొర్లిపోయి, చిరకాలము ఆమె నాభియందు ‌లిచినవట. దీనివలన ఆమె కనురెప్పలు పైకి ఒంగి, బిందువులను క్షణకాలము నిలుపగలిగినవని, అధరములు నీటి తాకిడికి తట్టుకోలేనంత సుకుమారములని, వక్షము కఠినమని, త్రివళులు బాగా ఏర్పడినవని, నాభి నిమ్నమని తెలియుచున్నదని ఆలంకారికులు వ్యాఖ్యానించిరి.

మరి ఈశ్వరదత్తుడు-కాళిదాసు, శూద్రకుడు-కాళిదాసు వీరి భావ సంవాదము యాదృచ్ఛికమా? భాణకారుల భావములకు కాళిదాసు మెరుగులు దిద్దినాడా? ఇచ్చట సహృదయులే ప్రమాణము.

ఉభయాభిసారిక సాగరదత్త శ్రేష్ఠి పుత్రుడయిన కుబేరదత్తు నకు నారాయణదత్త అను వేశ్యకు ఏదో కారణముగా కలిగిన కలహమును వర్ణించును - అందుచేత కుబేరదత్తుడు తన పరిచారకుడు సహకారకుడను వానిని విటుని తన కొరకు మధ్యవర్తిత్వమును వహించమని పంపించెను. ఇక జరుగబోవు కార్యమునకు విటుడయిన వైశికా చలుడే ప్రమాణము. ఈ విధముగా విటుని వాక్యములతో ఆరంభమయిన ఉభయాభి సారికలో అక్కడ ఇటు నటు తిరుగుతూ కనిపించిన వారందరితోనూ మాటలాడుతూ పొద్దు పుచ్చుచున్న విటునికి కొంత సమయము జరిగిన తరువాత నారాయణదత్త పరిచారిక కనకలత కనిపిస్తుంది. ఆమెను తన యాజమాను రాలి యోగక్షేమమును గూర్చి విటుడు ప్రశ్నించగా ఆమె యిచ్చిన సమాధాన మిది.

వసంతర్తువును వర్ణిస్తూ ఒక పురుషుడు గానముచేసి, ఈ మధు మాసములో ప్రియులను ఓదార్చి, వారిని చేరుకొనని వారి జీవితము నిష్ఫలమని ఆ గానములోని భావము. ఆ గానమును వినగానే నారాయణదత్త జాగుచేయక పాదచారిణి అయి ప్రియుని ఇల్లు చేరుకొనుటకు బయలుదే రెను. అట్లే కుబేరదత్తుడు గూడ వసంతాగమనము చేత శిథిలమయిన ధైర్యముతో యా నాయికను ఓదార్చుటకు దూతల సహాయము లేక స్వయముగా బయలుదేరెను. అతడు వీణాచార్యుడయిన విశ్వావసువు యొక్క ఉదవసితము ( ఇల్లు) ద్వారము వద్ద నారాయణ దత్తను కలిసికొనెను - ఈ విధంగా నాయికా నాయకులు ఉభయులును పరస్పరము అభిసరణమును చేయుటయే ఉభయాభిసారికా - భాణము.

ఉభయాభిసరణమును సూచించు ప్రాకృత గాథ నొకదా నిని ధ్వన్యాలోకకారుడు ధ్వనినిరూపణము చేయుచు ఉద్ధరిం చెను. (ధ్వ. ప్రథమోద్యోతమ్).

దే ఆ పసిఅ నివత్తసు
ముహ ససి జోణ్హా విలుత్త తమణి వహే,
అహిసారి ఆణ విగ్ఘం కరోసి అణ్ణాణవి హఆసే.

సీ. ప్రార్థయే తావత్ప్రసీద
నివర్తస్వ ముఖశశిజ్యోత్స్నా విలుప్త తమో నివహే
అభిసారికాణాం విఘ్నంకరోషి
అన్యాసామపి హతాశే

దీనికి లోచన కారుడయిన అభినవ గుప్తపాదుడు, మూడు నాలుగు వ్యాఖ్యానములు చేసి, ఇందు నాయికా నాయకులు పరస్పరము, అభిసరణము చేయుచు దారిలో కలిసికొనిరని, నాయకుడు త్రోవలోకనిపించిన నాయిక తనకు తెలియనట్లు నటించి, తన మనోగత భావము ఆమెకు అవగతమగు నట్లామెను హతాశురాలా! అని సంబోధించి ఆమెను వెనుదిరిగి పొమ్మని భావగర్భితముగా పలికెను అని చెప్పెను. ఇదియే ఉభయాభిసారిక.

ఇట్లు ఈ చతుర్భాణిలోని జీవనమును వర్ణించి చెప్పుట కొక విస్తృత పరిశోధన గ్రంథమే కావలసివచ్చును. మోతీ చంద్ర, వాసుదేవ శరణులు వ్రాసిన భూమిక దాదాపు వంద పేజీల దున్నది.

పద్మ ప్రాభృతకములో దత్తకలశియను వైయాకరణుడు పాణిని సంప్రదాయము ననుసరించు వాడు దర్శన మిచ్చును. వానిని కవి ఒక ఆట పట్టించెను. చూడండి.

'అస్య కలహా కండూ బంధురా వాగీష దపి స్పృష్టా దేవకుల ఘంటే వానుస్వనతి.'–

'కలహించుచున్న ఈ దత్తకలశి నోటికి ఎవరైనా పనికల్పిస్తే చాలును. దేవాలయములోని ఘంట వలె అది మోగుచునే యుండును.

'కరభ కంఠావసక్తా వల్లకీవ'–

వీనిని ఆశ్రయించిన వేశ్య గతి ఒంటె మెడలో వేలాడ దీసిన వీణతో సమానము సుమా! వీణానాదమెవరికి వినిపించును? అతడక్షర కోష్ఠాగారము - అతనికి కాతంత్ర వైయాకరణుల వల్ల దెబ్బలు తప్పవు.

ఏషో Z స్మి బలిభుగ్భిరివ సంఘాతబలిభిః కాతంత్రికైరవ స్కందితః'–

దత్తకలశిచేయు కఠిన పదప్రయోగములను సన్నంతము లను విని విసిగిపోయిన విటు డిట్లనెను.

'వార్ష్యస్మాన్ ఏవం విధైః కాష్ఠ ప్రహార నిష్ఠురై ర్వాగ శనిభి రభిహంతుమ్, సాధు వ్యవహారికయా వాచా వద–'

(నీవు కట్టె దెబ్బల వలె గట్టిగా తగులు ఈ వాగ్వజ్రములతో మమ్ము కొట్టుట తగదు. చక్కగా వ్యవహారిక భాషలో మాటలాడుము) అంటే ప్రసంగమునకు తగిన కఠిన భాషనో, సరళభాషనో ప్రయోగించవలెను గాని, అంతటా ఏకమూలికా ప్రయోగము తగదని భావము.

అట్లే ధూర్త విట సంవాదములో స్వర్గసుఖమును పరిహసించుచు విటుడన్న మాటలు చమత్కారముగా నున్నవి. నిద్రావిరహితే స్వర్గే కిమవాప్యతే (నిద్రకు నోచుకొనని స్వర్గములో కోరదగిన దేమున్నది).

'యది తావత్ సౌవర్ణాని గృహాణి సౌవర్ణాస్తరవః (స్వర్గే) కేవాలంక్రియంతే స్త్రియః'

(స్వర్గములో బంగారు గృహములు, బంగారు వృక్షములు ఉంటే స్త్రీలు అలంకరించుకొనుటలో ఇంక విశేషమేమున్నది?)

'తాస్తు (అప్సరసః) దీర్ఘాయుష్మత్యః సంస్కృత భాషిణ్యో మహాప్రభావాశ్చ శ్రూయంతే'

(ఆ అప్సరసలు దీర్ఘాయుష్మతులు. సంస్కృతములో మాట్లాడుచుందురట! - ప్రాకృతమే కదా స్త్రీలకు నాటకాదులలో, లోకములో ఉపాదేయము)

(చతు - 114, 16, 117)

ఇక్కడ అస్తమిస్తున్న సూర్యుని బంగారు తాబేలుతో పోల్చుట యుక్తముగా నున్నది.

హైమః కూర్మ ఇవావసీదతి శనైః
సంక్షిప్త పాదో రవిః

(చతు - 119)

ఉభయాభిసారికలో వైశేషిక దర్శనమును వీరు వేశ్యాగుణ సంకీర్తనముతో నన్వయించుట గొప్పగా నున్నది.

'ద్రవ్యంతే తనురాయతాక్షి దయితా రూపాదయ స్తే గుణాః
సామాన్యం తవ యౌవనం యువజనః సంస్తౌతి కర్మాణి తే.
త్వయ్యార్యే సమవాయమిచ్ఛతి జనో యస్మాత్ విశేషో Z స్తితే;
యోగస్తే తరుణైర్మనో భిలషి తై ర్మోక్షో Z ప్యనిష్టా జ్జనాత్.'

(చతు - + పుట. 132)

వైశేషిక దర్శనములో పదార్థముల నిరూపణము చేయుచు - ద్రవ్య - గుణ - కర్మ - సామాన్య - విశేష - సమవాయ అభావము లనునవి ఏడు పదార్థములని తెలుప బడినవి. నాయికా వర్ణనములు చేయుచు ఇచట విటుడు ఓ వెడద కన్నుల దానా! నీ శరీరము ద్రవ్యము; రూపాదులు గుణములు, నీ యౌవనము సామాన్యము (అందరికిని భోగ్యము), యువకులు నీ కర్మలను పొగడుచుందురు. నీతో సమవాయమును (కలయికను) జనులు కోరుచుందురు - ఎందుకనగా నీలో విశేషమున్నది గదా! నీవు కోరిన వారితో నీకు యోగముండును. ఇష్టము లేని వారి నుండి నీకు మోక్షము కలుగును అని పలుకును.

నాయిక ఆ మాటకు సమాధానముగా.

'సాంఖ్య మస్మాభిర్ జ్ఞాయతే, అలేపకోనిర్గుణః
క్షేత్రజ్ఞః పురుషః'

మాకు వైశేషికము సంగతి తెలియదేమోగాని సాంఖ్య దర్శనము బాగుగా తెలియును. అందు పురుషుడు అలేపకుడు, నిర్లేపుడు, నిర్గుణుడు (సత్వ - రజస్ - తమో

గుణములు ప్రకృతికే సంబంధించినవి) క్షేత్రజ్ఞుడు - అనగా వేశ్యలను సేవించు కామి ఇట్లుండునని అర్థము.

ఉదీచ్య దేశము వాడగు విశ్వేశ్వరదత్తుని కుమారుడగు ఆర్య శామిలకుడు పాదతాడితక భాణకర్త. ప్రణయకలహములో మదనసేన యను సౌరాష్ట్రిక వేశ్య అలవోకగా ప్రియుని తలను తన చరణకమలముతో అనుగ్రహిస్తుంది- అంటే తంతుంది. సదాచార సంపన్నుడనని, అభిజాత్యము కలవాడినని గర్వించేవా డామె ప్రియుడు తౌండికోకి విష్ణునాగుడు, ఇంతటి ఆచారభ్రంశము నెట్లు సహించగలడు? ఏ పాద తాడితకమును వేశ్యా హట్టములలో ప్రియులు మహాప్రసాదముగా భావించి తమ జీవనము ధన్యమై పోయినదని అనుకొని పాదతాడనానంతరము వారికి గలిగిన శృంగారానుభూతిని ''తతః పరం దేవానాంప్రియ ఏవ జ్ఞాస్యతి'' (ఆ తరువాత జరిగిన దంతా మధురాతిమధురము. అది దేవతలకు ప్రియుడైన వానికే తెలుస్తుంది) అని వచించిరో ఆ అనుభూతి, విష్ణునాగునికి అవమానకరము, పాపముగా తోచింది. దీనికి ప్రాయశ్చిత్త మేమిటని అందరి విటులను అడుగగా వారందరూ ఏకమై విటుల సమావేశాన్ని ఒకటి ఏర్పాటు చేయవలెనని, అందులో ఏ నిర్ణయము జరిగితే, ఆ విధముగా విష్ణునాగుడు నడుచుకోవలెనని అంటారు. ఆ విట సభలో సభ్యత్వమును పొందడానికి వేశ్యల వద్ద కామతంత్రమునం దారితేరిన వారే అర్హులు - ఆయా విటులు ఏయే పనులను చేసి లబ్ధ ప్రతిష్ఠులయిరో విస్తృతముగా వర్ణితమయినది ఈ పాదతాడితకమనే శృంగారపు అంగడిలో. కాదు కాదు సంతలో. ఇందు రాజపురుషులు, అమాత్య, దండనాథపుత్రులు, మహాప్రతీహారులు, స్థూలకాయులు, కాకి వలె నల్లగా ఉండే శకులు, హూణులు యవనులు, బర్బరులు, సౌరాష్ట్రులు, లాటులు (లాట దేశము - గుజరాత్) మాలవులు, మాగధులు, ఉజ్జయినీయులు దుష్టులై స్త్రీలను కామోప భోగసమయములోను హింసించువారు (Sadists), గుగ్గులు సేవనము వలన దేహస్థౌల్యము తగ్గుతుందని ఆశించి, దేహస్థౌల్యముతో బాటు వీర్యమును గూడ పొగొట్టు కొన్నప్పటికినీ ఇంకా వాసనలు నశించక వేశ్యల వీథులలో తిరిగే వారు, వృద్ధు రాండ్రైన తరువాత కూడ పొట్ట పోసుకోవడానికి విటులను మాటలతోనే మభ్యపెట్టేవేశ్యలు, ధనవంతుల మీదకు కూతురులను ఉసికొలిపే వేశ్యామాతలు, అధికరణ స్థానములో తూగుతూ తోటివారు కాలిని అదలిస్తే మేల్కొంటూ, మళ్లీ నిద్రలోనికి జారిపోతూ కాలముగడిపే ప్రాడ్వివాక శేఖరులు (Advocates) అయిన విటులు , మధు చషకము కొఱకు కవిత నమ్ముకునే కవివరులు, కత్తులు బిగించిన సూనాగృహము (కసాయి — స్థానము) లోనికి గడ్డిని చూపుతూ మనుష్యులు ఉసిగొలిపితే లోనికి వచ్చితెగి పడు పశులు, తుషారులు, పారసీకులు, మాగధులు, కిరాతులు, కళింగులు, వంగులు, కాశులు, మహిషకులు, చోలకులు, పాండ్యులు, కేరళులు, మున్నగు వారిచే నిండి ఉన్నది అలనాటి సార్వభౌమ నగరము ఉజ్జయిని.

ఈ భాణములో శృంగార వర్ణనము శ్రుతిమించి రాగాన పడింది. రసాభాసము గూడా తొంగి చూస్తున్నది. శ్యామిలకుని ఉద్ధత ప్రవృత్తి అది. ''మంచి వారంతా'' శమవృత్తి గలవారంతా తొలగి పొందు ఈధూర్త గోష్ఠి ఈగల జోరు లేకుండా నిర్విఘ్నంగా కొనసాగే మధుపానగోష్ఠిని జరుపద లచు కున్నది అని కవి భాణ ఆరంభములో అంటాడు. **'నిర్మక్షికం మధు పిపాసతి ధూర్తగోష్ఠీ'** - పా.తా.పు.150. ఇంతటి ఉద్వేల శృంగార వర్ణనము రెండు విషయాలను స్ఫురింపజేస్తున్నది. ఏ నాగరకత సంస్కృతి అయినా సమాజములో సంపద బాగాపెరిగి, చేతినిండ పని లేక పోతే ఆ ప్రజలు ఎట్టి వ్యాసంగాలను వెదుకు కుంటారో జీవనాన్ని ఎట్లాగడిపెదరో దీన్ని బట్టి తెలుస్తున్నది. ఇంతగాకుండలు పగుల గొట్టినట్లు చెప్పక పోతే అసలు సామాజిక స్వరూపము అవగతముకాదు. అందుకే భాణకారులకు వర్ణింపరాని విషయ మేదీ లేదు. చివరకు పుష్పవతులను గూడా వీరు వర్ణించినారు. అయినా ఇంతటి గందర గోళంలోనూ కవికళాదృష్టి మానవత్వము, ఔచిత్యము తొంగి చూస్తూనే ఉన్నవి. ఇక రెండవ విషయము. శ్యామిలకుడు కేవలము శృంగారపు సంతను వర్ణిస్తే అది నేటి వరకు కాలప్రవాహములో కొట్టుకొనిపోయి మరుగున పడిపోయి ఉండేది. సమాజ వర్ణనముతో బాటు శ్యామిలకుడు తన అపూర్వ ప్రతిభా సంపదను కాళిదాసు వంటి వారలతో సరితూగగల శబ్దసౌష్ఠవమును జోడించి, ఈ భాణమునకు అమరత్వమును కల్పించినాడు.

విటుల సమావేశమునం దెవరికి తోచిన ప్రాయశ్చిత్తమును వారు విష్ణునాగున కుపదేశించిరి. ఒకడు నీ ప్రియురాలు తన్నినతలను ముండనము చేసికొనమనెను. చివరకు మరొక విటుని మదనసేన కాలితో తాడనము చేయుటను విష్ణునాగుడు చూడవలెననెను. దానికి అతడు సమ్మతించుటతో కథ ముగియును - ఎవరి పిచ్చివారికి నచ్చుతుంది. అందులోని మాధుర్యమును మాత్రమతడెరుగలేదు గదా!

సత్యా కృష్ణుల ప్రణయ పరాకాష్ఠగా ముక్కు తిమ్మన కవి తెలుగు భాషలో పారిజాతాపహరణ ప్రబంధమును వ్రాసెను. అందు సత్యభామ పాదతాడనమును సరసుడగు శ్రీ కృష్ణుడు క్రీడగా గ్రహించి చెప్పిన పద్యము సువిదితము.

''నను భవదీయ దాసుని
మనంబున నెయ్యపు కిన్క బూని తా
చిన యది నాకు మన్ననయ
చెల్వగు నీపద పల్లవంబుమ
త్తను పులకాగ్ర కంటక
వితానము తాకిన నొచ్చు నంచునే
ననియెద నల్కమానవు
గదా నికనైన యరాలకుంతలా.

నీవు నన్ను తాచిన (తన్నితే) అది నాకు మన్ననయే. నేను నీకు దాసుడను. కాని చిగురుటాకు వంటి నీ పాదము నాశరీరముపై మొలకెత్తిన పులకాంకురములనే ముండ్లు గుచ్చు కొని ఎంత బాధ పడెనో గదా! ఇంకా నీకు కోపము తగ్గలేదా-యని దక్షిణ నాయకుడయిన శ్రీ కృష్ణుడు సత్యాదేవిని వేడుకొనెను. పొరపాటున శ్రీ కృష్ణ దేవరాయలు ప్రణయ సమయములో చిన్నాదేవి కాలు తగులగా మిక్కిలి కోపగించి వెడలి పోయెనని, ఆ చక్రవర్తిని సాంత్వనము చేయుటకు చిన్నాదేవిని పుత్రికా నిర్విశేషముగా ఆదరించిన ముక్కు తిమ్మన పారిజాతాపహరణము లోని పై పద్యమును రచించెనని, అది చదివిన రాయలకు లోకజ్ఞత కలిగెనని చెప్పు కథ ఒకటి ఆంధ్రదేశములో ప్రచారములో నున్నది. అట్టి వారికి అందరికి జీవన మాధుర్యపు లోతులను చూపించుటకు శ్యామిలకుడీ భాణమును వ్రాసెనేమో!

పరిహాస ప్రసంగము లేని మాట వ్యర్థమని ఈ కవి అంటాడు, చూడండి :

''న ప్రాప్నువంతి యతయోరుదితేన మోక్షం
స్వర్గాయతిం న పరిహాసకథా రుణద్ధి,
తస్మాత్ ప్రతీత మనసా హసితవ్యమేవ
వృత్తిం బుధేన ఖలు కౌరుకుచీం విహాయ''

(యతులు గూడా ఏడ్చి మోక్షాన్ని సాధించలేరు పరిహాసకథలు స్వర్గమార్గాన్ని అడ్డగించవు. అందుకే ముఖము పిండుకొని (ఆముదము తాగిన వానివలె ముఖాన్ని తిప్పి) ఉంచక, బుద్ధిమంతుడు మనసారా నవ్వవలెను.)

ఇక్కడ లాటదేశము వాడైన జకారుడు దర్శనమిస్తాడు. గుజరాతు ప్రాంతము వారు అనాగరకులని, యకారమును పలుక వలసిన చోట జకారాన్ని పలుకుతారని చెప్పినాడు కవి మగధలో నివసించే శకారుని శూద్రకకవి మృచ్ఛకటి కంలో చూపించి వారి ఉచ్చారణమును వెక్కిరించిన సంగతి సువిదితము.

'జన మాలపన్ జకారై
రున్నాటయతీవ లాటానామ్' (పా.తా.పు. 193)

డబ్బుచేతిలో పట్టుకొనకుండా వేశ్యావాసముల లోనికి ప్రవేశించువాడు, ఆయుధములేక యుద్ధరంగములోనికి ప్రవే శించిన యోధుని వలె అపకీర్తి, అనర్థానికి పాలవుతాడట. 'తత్కామం అసంగృహీత మాషస్య వేశప్రవేశో, నిరాయుధస్య సంగ్రామావతరణ మిత్యుభయ మపార్థకం కేవలమయశసే అనర్థాయచ'.

బౌద్ధ భిక్షువులు సంసారము, శ్రమణ జీవితముల మధ్య నలిగి పోతూ ఏమి చేయవలెనో నిర్ణయించుకోలేని వారు ఇక్కడ దర్శనమిస్తారు. ఒక భిక్షువును తలచుకొని విరహాన్ని అనుభవిస్తున్న ప్రియురాలిని చూచి, విటుడు ఆ భిక్షువు వద్దకు దౌత్యమును వహించి పోతాడు. భిక్షువు-'స్పృష్టోస్మి ఉపాసకత్వేన, ఈ దృశః సంసార ధర్మ ఇత్యుక్తం తథాగతేన' (పా.పు.197) ఉపాసకత్వం నన్ను బాగా ప్రభావితం చేసింది. సంసారధర్మము ఇలాటిదే అని తథాగతుడు చెప్పినాడు అని అంటాడు.

అప్పుడు విటుడు
'శ్రమ నిస్సృత జిహ్వా మున్ముఖం
హృది నిస్సంగ నిఖాత సాయకమ్,
సమవేక్ష్య మృగం తథాగతమ్
స్మరసి త్వం న మృగం తథాగతమ్''.

అని అంటాడు. 'నీవు వేటాడు నప్పుడు పరుగెత్తుతు అలసి నాలుక బయటకు వేలాడగా పైకి చూచుచు, గుండెలో బాణము గుచ్చుకొని బాధపడుచూ ఆ స్థితిలో (తథాగతః) ఒక జింక ఎదురు పడి నప్పుడు, నీకు ఏకాంత వాసాన్ని సేవిస్తూ, అహింసా వ్రతాన్ని ఆచరిస్తూ శ్రమణ జీవనాన్ని గడుప వలెనని ఉపదేశించు తథాగతుడు (బుద్ధుడు) గుర్తుకు రాలేదా' అని విటుడు ప్రశ్నిస్తాడు. వేశ్యల ఇండ్లకు పోవడ మొక్కటే కాదు వ్యసనము. వేటాడి జంతు హింసను చేయడమూ వ్యసనమే. ఇది చేయని వాడది కూడా చేయరాదనుట నీతి.

పేద వాడొకడు అయిదు పణములతో వేశ్యాసంగమును కోరితే దానికి విటుడిచ్చిన సమాధానమిది :

'భద్ర! రాజవీథ్యాం లావణికాపణేషు మృగ్యతాం గణికా! (పా.పుట. 204). (రాజ మార్గంలో ఉప్పుఅంగళ్ళలో వేశ్య ఏమైన దొరకుతుందేమో చూడు.)

అలెగ్జాండరు దండయాత్ర తరువాత భారత దేశంలో స్థిరపడి పోయిన గ్రీకు లెందరో ఉన్నారు. వారిలో వేశ్యలు గూడా ఉన్నారు. యవన వేశ్యలను పరిహసించినాడు కవి.

'యవనీ గణికా, వానరీ నర్తకీ, మాళవః కాముకో
గర్దభో గాయకః ఇతి గుణతః సాధారణ మవగచ్ఛామి;
(పు. 239).

యవన వేశ్య, కోతి నాట్యగత్తె, మాలవ కాముకుడు, గాడిద గాయకుడు, వీరంతా గుణ పర్యాయముగా సమానులే. ఎందుకంటే-

'వానరీ నిష్కూజితోపమాని, చీత్కార భూయిష్ఠాని.
అప్రత్యభిజ్ఞేయ వ్యంజనాని కించిత్కరేణాంతరాణి (?)
ప్రదేశినీ లాలన మాత్ర సూచితాని వేశయవనీ కథితాని,
కోహినామ శ్రోష్యతి?'

యవన వేశ్యమాటలాడితే ఆడకోతి కిచకిచలాడి నట్లుంటుంది. చీత్కారములతో నిండి ఉంటుంది. కొంచెము చేతిని ఆడిస్తూ చూపుడు వేలితో మాత్రమే లాలనను సూచిస్తూ ఉంటుంది. ఆమె మాటలాడుతూ ఉంటే హల్లులు గుర్తించడానికి వీలుగాదు అట్లాంటి మాటలను ఎవరు వింటారు? వీరు శబ్దకాములు. వీరి వృత్తిలో మాట మన్నన తప్పని సరి అంగాలు గదా మరి.

శ్యామిలకుని అద్భుత కావ్య ప్రతిభను దర్శింపజేసి ఈ వ్యాసాన్ని ముగిస్తాను.

''నేత్రాంబు పక్ష్మాభిరరాల ఘనాసితాగ్రైః
నేత్రాంబు ధౌతవలయేన కరేణ వక్త్రమ్
శోకం గురుంచ హృదయేన సమం బిభర్తి
త్రీణి త్రిధా త్రివలి జిహ్మిత రోమరాజిః''

ఉదీచ్యులకు, బాహ్లీకులకు, కరూశ మలదులకు (బీహారులోని షహబాద్ కారూశము, బెంగాలులోని మాలదా ప్రాంతము మలదము), ప్రభువగు మహాప్రతీహార భద్రాయుధుడు విటులకు జంగమ తీర్థము. శమదాసి అనే వేశ్యయింటి నుండి బయల్వెడలిన భద్రాయుధుడే జకారులగు లాటులను వెక్కిరించేవాడు. అతడి కొరకు విరహాన్ని అనుభవించే వేశ్య తన పొట్ట మీద త్రివళీ ప్రాంతములో వంకరగా తిరిగిన రోమరాజిని ప్రదర్శిస్తూ, వంకరగా దట్టముగా పెరిగి నల్లని కాటుక రేఖలతో తీర్చి దిద్దిన కను రెప్పల మీద కన్నీటి చుక్కలను, కన్నీటి చేత ముంజేతి కంకణము ధౌతము కాగా, అట్టి కంకణమును తొడిగిన చేతితో ముఖమును, హృదయమునందు శోకమును మూడింటిని మూడింటిచేత సమముగా భరిస్తున్నది. అనగా కనురెప్పలు కన్నీటిని, చెంప కానించిన చేయి ముఖాన్ని, హృదయము శోకాన్ని సమంగా మోస్తున్నవట. ఇది సహోక్తి అలంకారమున కెంత చక్కని ఉదాహరణము.

భాణముల పై జరుగవలసిన అధ్యయనము ఎంతైనా ఉన్నది.

ప్రకృతిప్రత్యయ యోగాత్ గీరివ కృతిరివ మనోజ్ఞ కల్పనయా।
తదివ రసవేత్తృ హృదయమ్ తారుణ్యా త్తవ విభాతి తను శోభా॥

ప్రకృతి ప్రత్యయ సంబంధంవల్ల పలుకులాగ, మనోహర కల్పనంతో కావ్యంలాగ, సత్కావ్యంవల్ల రసజ్ఞుని హృదయంలాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి

# స్వప్నవాసవదత్తం, అభిజ్ఞానశాకుంతలం: రచనా సంవాదములు

శ్రీ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి

సంస్కృత రూపక కర్తలలో భాసమహాకవి అతిప్రాచీనుడు. అనుపమ రచనావైశిష్ట్యంచేత ఆతడు వాగ్దేవతయొక్క హాసం ''భాసో హాసః ''అని ప్రసిద్ధి. ఆ మహాకవి రచించిన రూపకాలు అన్నింటిలో 'స్వప్నవాసవదత్తం' అనే నాటకం గుణబాహుళ్యంచేత అగ్రగణ్యమైనది. ఆలంకారికశిరోమణి అయిన రాజశేఖరుడు స్వప్నవాసవదత్త ప్రాశస్త్యాన్ని అభివర్ణించినాడు:

''భాసనాటక చక్రే Z పి చ్ఛేకైః క్షిప్తేః పరీక్షితుమ్‌
స్వప్న వాసవదత్తస్య దాహకో భూ న్న పావకః.॥

నాటక రచయితలలో మహాకవి కాళిదాసు అత్యంత విశిష్టుడు ఆతని నాటకాలలో ''అభిజ్ఞాన శాకుంతలం ''బహుజనశ్లాఘా పాత్ర మైనది. అది అత్యంత రమ్యమైనదని చెప్పే ''కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా'' అనే సూక్తి లోకప్రసిద్ధి పొందింది.

భాస కాళిదాసులలో భాసుడు పూర్వకాలికుడు, కాళిదాసు అనంతర కాలీనుడు అని విమర్శకుల నిర్ణయం. కాళిదాసు తన మాలవికాగ్నిమిత్రం అనే నాటకంలో భాసుని ఈ విధంగా స్మరించినాడు:

''భాస సౌమిల్లక కవి పుత్రా దీనాం ప్రబంధా నతిక్రమ్య
వర్తమాన కవేః కాళిదాసస్య క్రియాయాం కథం పరిషదో
బహుమానః''.

భాసుడు కాళిదాసుచే పేర్కోబడడం చేత భాసుడు కాళిదాసు కంటె పూర్వుడని స్పష్టమౌతుంది. భాసుని రచనలను కాళిదాసు బాగా చదివి ఉంటాడని కూడా విశదమౌతోంది.

వస్తుతః స్వప్నవాసవదత్తం, అభిజ్ఞాన శాకుంతలం భిన్నమైనవే అయినా చాలా సందర్భాల్లో ఆ రెండింట రచనా సంవాదాలు పరిస్ఫుటంగా గోచరించడం విశేషం. అవి సమీక్షింపదగ్గవి.

సంవాదం అంటే రచనా సాదృశ్యం. భావసాదృశ్యం కూడా. సంవాదము మూడు విధాలని అందులో మూడవది అయిన తుల్యదేహివ త్సంవాదం పరిగ్రాహ్యం అని, అన్యకవి సామ్యాన్ని విడువరాదని ధ్వనికారులు ఆనందవర్ధనులు ధ్వన్యాలోకంలో ఇలా వివరించారు.

సంవాదో హ్యన్య సాదృశ్యం తత్పునః ప్రతిబింబవత్
ఆలేఖ్యాకారవ త్తుల్య దేహివచ్ఛ శరీరిణామ్
తత్ర పూర్వమనన్యాత్మ తుచ్ఛాత్మ తదనంతరమ్,
తృతీయంతు ప్రసిద్ధాత్మ నాన్యసామ్యం త్యజేత్కవిః

ఉద్యో-4-శ్లో 1412.

కాబట్టి స్వప్నవాసవదత్తం అభిజ్ఞానశాకుంతలం అనే రెండు నాటకాలలోని ప్రధాన సన్నివేశాలను పురస్కరించుకొని సంగ్రహంగా వానిలోని రచనాసంవాదాన్ని పరిశీలించడం అత్యంత సముచితం.

కథాగతమైన ఒక సన్నివేశాన్ని ప్రధానంగా జేసుకొని స్వప్నవాసవదత్తా భిజ్ఞాన శాకుంతలముల నామకరణం చేయబడడం గమనార్హం. స్వప్నవాసవదత్తంలో స్వప్నవృత్తాంతం ఆధారంగా ఆ నాటకానికి ఆపేరు ఉంచబడింది. 'స్వప్నే వాసవదత్తా సాక్షాత్కృతా యస్మిన్ నాటకే తత్ స్వప్నవాసవదత్తమ్' అని ఆ నామసార్థక్యం. అంగులీయకరూపమైన అభిజ్ఞానం ప్రాధాన్యం వహించడంచేత అభిజ్ఞాన శాకుంతలం అనే పేరు ఏర్పడింది. ''అంగులీయక దర్శన రూపేణ అభిజ్ఞానేన స్మృతా శకుంతలా యస్మిన్ నాటకే తత్ అభిజ్ఞాన శాకుంతలమ్'' అని ఆనాటక నామం సార్థకం. ఈ విధంగా నామకరణంలో కూడా స్వప్నవాసవదత్తం అభిజ్ఞాన శాకుంతలం అనేవి సాదృశ్యాన్ని పొంది ఉన్నాయి.

నామకరణంలోనే గాకుండా కథా నిర్వహణంలో కూడా బహుసందర్భాలలో ఆ రెండు నాటకాలలో రచనా సంవాదం విశదం కావడం పరిశీలనార్హం.

1. ఇద్దరు భటులచే పో(ద్రోల బడుతున్న వాసవదత్త మార్గాయాసం కంటె ఈ పరాభవం మిక్కిలి యెక్కువ పరిభేదాన్ని కలిస్తోందని యౌగంధరాయణునితో అంటుంది. పరాభవదుఃఖంతో ఉంటున్న ఆ వాసవదత్తని ఓదారుస్తూ ఆ యౌగంధరాయణుడు ఇలా అంటాడు:

''భుక్తోజ్ఞిత ఏష విషయో (త్రభవత్యా నాత్ర
చింతా కార్యా కుతః
పూర్వం త్వయాప్యభిమతం గతమేవమాసీ
చ్ఛ్లాఘ్యం గమిష్యసి పునర్విజయేన భర్తుః,
కాలక్రమేణ జగతః పరివర్తమానా
చక్రారపంక్తి రివ గచ్ఛతి భాగ్య పంక్తిః.

అం 1–శ్లో4.

అభిజ్ఞానశాకుంతలంలో మారీచమహర్షి శకుంతల నుద్దేశించి

''వత్సే విదితార్థా సి! భర్తారం(ప్రతి న మన్యుః కర్తవ్యః.
శాపాదసి (ప్రతిహతాం స్మృతిరోధ రూక్షే
భర్తర్యపేత తమసి (ప్రభుతా తవైవమ్
ఛాయా విభాతి వ మలోపహత (ప్రసాదే
శుద్ధేతు దర్పణతలే సులభావకాశా''

అం 7–శ్లో 32.

శాకుంతలంలోని ''భర్తర్యపేత తమసి (ప్రభుతా తవైవమ్'' అనే వాక్యం స్వప్నవాసవదత్తంలోని ''శ్లాఘ్యం గమిష్యసి పునర్విజయేన భర్తుః'' అనే వాక్యానికి సంవాదరూపంలో ఉండడం గమనార్హం.

2. పద్మావతిని చూసి 'ఈమె (ప్రభువైన వత్సరాజుకి భార్య కాగలద'ని పుష్పక భ(ద్రాదులచే చెప్పబడడంచేత ఆవృత్తాంతాన్ని స్మరిస్తున్న నాకు ఈమెపై ఆత్మీయత గల్గుతోందని భావిస్తూ మం(త్రి యౌగంధరాయణుడు ఇలా సూచిస్తాడు:

''(ప్రద్వేషో బహుమానో వా సంకల్పాదుపజాయతే''

అం 1–శ్లో 7.

ఒకరి విషయమై (ప్రద్వేషంగాని బహుమానంగాని సంకల్పం చేతనే సంభవిస్తుందని భావం.

అభిజ్ఞాన శాకుంతలంలో దుష్యంతుడు హంసపదిక సంగీతాన్ని విని విదూషకునితో 'రమ్యమైన దృశ్యములను చూసినప్పుడు మధురములైన శబ్దాలని విన్నప్పుడు సుఖంగా ఉన్నప్పటికిని (ప్రతివ్యక్తి ఉత్సుకతని పొందుతాడు'' అని పలికి జనానాంతర సౌహృదములు హృద్గతములై ఉంటాయని

''భావస్థిరాణి జననాంతర సౌహృదాని''

అం 5–శ్లో 2.

అని అంటాడు. ఇక్కడ యౌగంధ రాయణుని వాక్యం, దుష్యంతుని వాక్యం యథాతథంగా గాక పోయినా తాత్ప ర్యంలో సంవాదరూపంలోనే ఉన్నాయి.

3. పద్మావతిని మొట్టమొదట చూసినప్పుడు ఆమెనుద్దే శించి వాసవదత్త 'అభిజనానురూపం ఖలు అస్యాః రూపమ్' అని ఆత్మగతంగా భావిస్తుంది (అం.1)..

దుష్యంతుడు తన రాజధానికి వెళ్లిన పిమ్మట అతడు ఇక్కడి శకుంతలా వృత్తాంతాన్ని స్మరిస్తాడో స్మరింపడో అని అనసూయ ఆశంకింపగా ఆమెతో (ప్రియంవద ధైర్యంగా ఉండు అని చెప్పి '' న తాదృశీ గుణవిరోధినీ (ప్రకృతిః'' అని పలుకుతుంది. గొప్ప ఆకృతి గుణవిరోధిని కాజాలదని భావం. ఆకృతి విశేషానికి సంబంధించిన పై రెండు వాక్యాలూ సంవాదాత్మకంగా ఉన్నాయి.

4. నా సోదరి అయిన వాసవదత్తను న్యాసరూపంగా ఉంచి రక్షింప వలసిందని యౌగంధరాయణుడు పద్మావతిని అర్థింపగా అది విన్న కంచుకి పద్మావతితో న్యాసాన్ని రక్షించడం దుఃఖం అని ఇలా అంటాడు.

సుఖమర్థో భవేద్దాతుం సుఖం (ప్రాణాః సుఖం తపః,
సుఖమన్యద్భవేత్సర్వం దుఃఖం న్యాసస్య రక్షణమ్.

అం 1–శ్లో 10.

భాసుని పై శ్లోక భావాన్ని వ్యాఖ్యానింప బూనినట్లు అభిజ్ఞాన శాకుంతలంలో శకుంతల నుద్దేశించి కణ్వమహర్షి పల్కినట్లుగా మహాకవి కాళిదాసు ఇలా రచించాడు:

అర్థోహి కన్యా పరకీయ ఏవ
తామద్య సం(ప్రేష్య పరి(గ్రహీతుః,
జాతో మమాయం విశదః (ప్రకామం
(ప్రత్యర్పిత న్యాస ఇవాంతరాత్మా.

అం 4–శ్లో21.

స్వప్నవాసవదత్తంలో న్యాసరక్షణ దుఃఖమని చెప్పబ డింది. న్యాసాన్ని తిరిగి భ(ద్రంగా అప్పగించిననాడు కలిగే సుఖం ఎంతటిదో శాకుంతలంలో వివరింపబడింది. భాసకాళిదాసుల భావైక్యం విశదమౌతోంది.

5. లావాణక (గ్రామమునుండి వచ్చి ఒకానొక (బహ్మచారి ఎక్కడ వి(శమింతును అని తలంచి పరిసరము లను అవలోకించి ఇది తపోవనము కాదగును అని ''అభితః

తపోవనేనానేన భవితవ్యమ్'' అని నిశ్చయిస్తాడు. అందలి విశేషాలని ఈ విధంగా అభివర్ణిస్తాడు:

విస్రబ్ధం హరిణాశ్చరంత్యచకితాః
దేశాగత ప్రత్యయాః
వృక్షాః పుష్పఫలై స్సమృద్ధ విటపాః
సర్వే దయా రక్షితాః,
భూయిష్ఠం కపిలాని గోకులధనా
న్యక్షేత్రవత్యో దిశః
నిస్సందిగ్ధమిదం తపోవనమయం
ధూమో హి బహ్వాశ్రయః.

అం 1–శ్లో 12.

అభిజ్ఞాన శాకుంతలంలో దుష్యంతుడు ఆశ్రమగతము లైన విశేషములను సముపలక్షించి సూతునితో ''అయమా భోగః తపోవన స్యేతి'' ఈ ప్రాంతం తపోవనములనకు చెందింది అని పలికి ఆ కణ్వాశ్రమ విశేషాలను

నీవారాః శుకగర్భకోటర ముఖభ్రష్టాః.......
కుల్యాంభోభిః పవన చపలైః......

అం 1–శ్లో 9,10

ఇత్యాది రెండు శ్లోకములలో అభివర్ణిస్తాడు.

ఈ సందర్భంలో చెప్పబడిన ''విశ్వాసోపగమాదభిన్న గతయః శబ్దం సహంతే మృగాః, భిన్నోరాగః కిసలయ రుచామాజ్యధూమోద్గమేన'' అన్న కాళిదాసుని వాక్యములకు స్వప్న వాసవదత్తంలోని ''విస్రబ్ధం హరిణాః చరంత్యచకితాః దేశాగత ప్రత్యయాః, ధూమోహి బహ్వాశ్రయః'' అను భాసమహాకవి వాక్యములకు భావ సంవాదం గోచరిస్తూంది.

6. వాసవదత్త చేత పద్మావతి 'నీ భర్త నీకు ఇష్టుడా?' అని ప్రశ్నింప బడగా ఆమె వాసవదత్తతో 'ఆర్యపుత్రుని విరహంచేత ఉత్కంఠితను అవుతున్నా'నని జవాబు చెప్తుంది.

శాకుంతలంలో శకుంతల స్పష్టంగా భర్తృ వియోగం చేత ఎంత ఉత్కంఠితురాలైనదో చెప్పబడలేదు కాని దుర్వాసో ముని వచ్చి తాను వచ్చినట్లు నివేదించిన సందర్భంలో శకుంతల ఏ మాత్రమూ గుర్తింపక పోవడం దానికి దుర్వాసుడు ఆగ్రహించి శపించడం పరిశీలిస్తే శకుంతల ప్రియావియోగానికి ఎంతగా పరితపిస్తోందో స్పష్టమవుతుంది. దుర్వాసుడు శకుంతలను ఆ సందర్భంలో ఇలా శపిస్తాడు:

విచింతయంతీ య మనన్యమానసా
తపోనిధిం వేత్సి న మాముపస్థితమ్,
స్మరిష్యతి త్వాం న స బోధితోపి సన్
కథాం ప్రమత్తః ప్రథమం కృతామివ.

అం4–శ్లో1.

రెండు నాటకాలలోను నాయికా విరహతాపమే అభివర్ణింప బడింది. భాసువిరచనలో వాచ్యంగా చెప్పబడగా కాళిదాసుని నాటకంలో వ్యంగ్యంగా నిరూపింపబడింది.

7. విదూషకుడు వత్సరాజుని ఇప్పుడు నీకు వాసవదత్త ఇష్టురాలా? లేక పద్మావతియా? అని ప్రశ్నింపగా వత్సరాజు ''నీవు వాచాలుడవు నేను చెప్పను''
''నఖలు నఖలు బ్రూయామ్ భవాంస్తు ముఖరః''

(అం4)

అని అంటాడు.

శాకుంతలంలో విదూషకుని దుష్యంతుడు తన పట్టణానికి పంపుతూ వీడు శకుంతలా వృత్తాంతాన్ని అంతఃపురజనులకి చెప్పగలడు అని చింతించి స్వగతంగా ''చపలోయం వటుః''(అం 2) అని భావిస్తాడు.

స్వప్న వాసవదత్తంలో విదూషకుని ముఖరత్వం, శాకుంత లంలో చపలత్వం చెప్పబడ్డాయి. తాత్పర్యంలో రెండూ ఒకటే.

8. ప్రభువైన వత్సరాజు వాసవదత్తా ప్రణయాన్ని సకరు ణంగా విదూషకునికి ఇలా నివేదించు కొంటాడు:

''స్మరామ్యవంత్యాధి పతేః సుతాయాః
ప్రస్థాన కాలే స్వజనం స్మరంత్యాః,
బాష్పం ప్రవృత్తం, నయనాంత లగ్నం
స్నేహాన్మమైవోరసి పాతయంత్యాః''

అం 5–శ్లో 5.

శకుంతలా వియోగాన్ని అనుభవిస్తూ దుష్యంతుడు ఆమె తన సభనుండి నిర్గమించిన సన్నివేశాన్ని పురస్కరిం చుకొని విదూషకునితో ఈ విధంగా కరుణ నిర్భరంగా వివరిస్తాడు:

ఇతః ప్రత్యాదేశాత్ స్వజన మనుగంతుం వ్యవసితా
స్థితా తిష్ఠేత్యుచ్చైః వదతి గురుశిష్యే గురుసమే,
పునః దృష్టిం బాష్ప ప్రకర కలుషా మర్పితవతీ
మయి క్రూరే యత్తత్ సవిషమివ శల్యం దహతి మామ్

అం 6 శ్లో 8.

రెండు నాటకాలలోను నాయిక బాష్ప మధురంగా అభివర్ణింప బడింది. కాని శాకుంతలంలో దుష్యంతుని

మాటలలో ఆతని దుర్భర ప్రియా వియోగ దుఃఖం సమ్యగావిష్కృతం అవుతోంది.

9. వాసవదత్తా వియోగంపొందిన ఆమె వీణను ఘోషవతిని పొంది ప్రభువు ఉదయనుడు బహుధా విలపించి ఆవీణను ఇలా అధిక్షేపిస్తాడు:

''శ్రుతి సుఖ నినదే కథం ను దేవ్యాః
స్తనయుగలే జఘనస్థలే చ సుప్తా,
విహగ గణ రజో వికీర్ణ దండా
ప్రతిభయ మధ్యుషితా స్యరణ్య వాసమ్.''
అం 6-శ్లో 1.

శాకుంతలంలో శకుంతల వ్రేలిని విడిచిన అంగుళీయ కాన్ని పొందిన దుష్యంతుడు ఆ ఉంగరాన్ని ఇలా నిందిస్తాడు.

''తవ సుచరితమంగులీయ నూనం
ప్రతను మమేవ విభావ్యతే ఫలేన,
అరుణ నఖ మనోహరాసు తస్యాః
చ్యుతమసి లబ్ధపదం యదంగులీషు.''
అం 6-శ్లో 10.

నాయికకు చెందిన వస్తువును నిందించడం నాయికావిరహ బాధను నాయకుడు వెల్లడించడం రెండు నాటకాలలో చమత్కరింప బడింది.

10 చిత్రపటగత అయిన వాసవదత్తను చూస్తూ పద్మావతి ప్రభువైన ఉదయనునితో ''ఈ రూపంతో సమానమైనది ఇక్కడనే ఉంది. ఆమె ఒకానొక బ్రాహ్మణుని చేత ప్రోషిత భర్తృకగా నా సోదరి అని న్యాసంగా రక్షింప దగ్గది అని అర్పింప బడింది'' అని చెప్పుంది. అప్పుడు రాజు పరస్పర రూపసాదృశ్యం లోకంలో కనబడుతూ ఉంటుందని అంటాడు.

యది విప్రస్య భగనీ వ్యక్తమన్యా భవిష్యతి,
పరస్పర గతా లోకే దృశ్యతే రూపతుల్యతా.
అం 6-శ్లో 14.

అభిజ్ఞాన శాకుంతలంలో దుష్యంతుడు తాపసీ భరతుల సంభాషణమును బట్టి ఋషికుమారుడు గానున్న ఆ భరతుని తల్లి శకుంతల అని తెలుసుకొని లోకంలో నామధేయ సాదృశ్యములు ఉంటూ ఉంటాయి.

''సంతి పునర్నామధేయ సాదృశ్యాని''
(అం 7)

అని భావిస్తాడు.

స్వప్నవాసవదత్తంలో రూప సాదృశ్యం చమత్కరింపబ డింది. శాకుంతలంలో నామసాదృశ్యం చమత్కరింపబడింది.

ఈ విధంగా సూక్ష్మేక్షికతో ఉపలక్షిస్తే ప్రధాన సన్నివేశా లలో స్వప్నవాసవదత్తాభిజ్ఞాన శాకుంతలములలో సంవాద రచనా విశేషాలు ప్రస్ఫుటం అవుతున్నాయి.

ఇతర సన్నివేశాలలో కూడా పెక్కుచోట్ల ఆ రెండు నాటకాలలోను రచనా సాదృశ్యం స్పష్టమవుతూనే ఉంది. ఆశ్రమ వాసుల జీవిత చిత్రణ నాటకారంభంలో నాయికా విరహప్రసక్తి నాయిక యొక్క ప్రోషిత భర్తృకాత్వ వర్ణనం, నాయకుని దక్షిణ నాయక స్వభావం, నాయకుడు వేటకు వెడలుట, మధుకరవృత్తాంతం, చిత్రఫలకోదంతం-అనే వాటి లోకూడా రచనా సంవాదం ఏర్పడుతోందని నిరూపించడం అత్యంత సమంజసం.

భావమందు రచనా శిల్పమందు ఆ రెండు నాటకాలలో సంవాదరచనము తేటతెల్లము అగుచున్నను మహాకవి కాళి దాసు శాకుంతలంలో తనదైన ప్రత్యేకతను నిరూపించు కొన్నాడు. నిశితంగా పరిశోధన దృష్టితో సమీక్షిస్తేగాని భాసుని రచనా సాదృశ్యం శాకుంతలంలో స్ఫురింపదు. ధ్వని కారులు వివరించిన తృతీయ మైన తుల్యదేహవత్సంవాదంగా శాకుంతలంలోని సాదృశ్యాలను పరిగణింప వలసి ఉంటుంది. ఆ సంవాదరచన అపకర్షకం కాజాలదని నిర్ణయింపవలసి ఉంటుంది. ధ్వనికారులు కూడా సంవాదములు బహుళంగానే మహాత్ముల రచనలలో ప్రవర్తిల్లుతూ ఉంటాయని ఇలా ఉద్ఘోషించారు.

''సంవాదాస్తు భవంత్యేవ బాహుల్యేన సుమేధసామ్.''

# శహాజీ మహారాజు - పల్లకీసేవా ప్రబంధాలు

శ్రీమతి ఉమా రామారావు

ప్రతిభాషలోని వాఙ్మయాన్ని సాహిత్యము. శాస్త్రము అనే రెండు శీర్షికలు క్రింద విడదీసి నప్పుడు శాస్త్రాన్ని అభిప్రాయ ప్రధానమై, తత్త్వ నిరూపణోద్దేశమై మనస్సును ధర్మనిశ్చయం చేసేదిగాను, సాహిత్యాన్ని, భావప్రధానమై వివిధాలంకారశోభితమై హృదయరంజక హేతువుగాను నిర్వ చించారు పండితులు. ఈ రెండింటికి తగిన భాష అవసరమేగాని సాహిత్యంలో భాషా ప్రయోజనం యెక్కువ. సాహిత్యానికి ఒక అలంకారమునిచ్చే, భూషణమది: కళా సౌందర్యానికి సుందర స్వరూపం వంటిది. భావము ప్రాణమైతే భాష విగ్రహము. ఈ రెండింటి సమ్మేళనము వలన సర్వజన మోహనమైన లావణ్యమే గాకుండా రసస్పం దన కూడా కలుగుతుంది. భావ సౌభాగ్యాన్ని భాషా సంపదను తగిన పొందికతో జోడించి సత్కావితను ఆవిర్భవింప జేస్తారు కవి పండితులు, సాహితీ వేత్తలు.

ఆంధ్ర భాషా మహాక్షేత్రంలో వాఙ్మయశాఖ ఒక బృందావ నము. అందులో నాటిన బీజము లనేకములు వృక్షములై గ్రంథరూపమైన స్వాదు ఫలములను రసికులకు అందిస్తు న్నవి. అటువంటి విలక్షణమైన తెలుగు కవితా ప్రపంచంలో చిరస్మరణీయుడు శహాజీ మహారాజు, తంజావూరు నేలిన మహారాష్ట్ర ప్రభువు. కవిత్వం అల్లే రచయితగా పరిపాలనా విభాగం శాసించే ఒక నియంతగా, రాజ్యాన్ని ఏలే మహారాజుగా ఒక అపురూపమైన సమ్మేళనంతో వన్నెకె క్కాడు.

వేదాంతంలో పురాణాలలో సంగీతంలో తనకున్న విద్వత్తు ఆధారంగా ఎన్నో రచనలను చేశాడు. ప్రబంధ కావ్యాలని అతి నేర్పుతో అల్లాడు. తాను కవిగా వుంటూ కవితా హృదయాన్ని అర్థం చేసుకుని తన రాచరికంలో ఎంతో మంది కవులను కళాకారులను ప్రోత్సహించాడు. పోషించాడు, సహృదయుడుగా, రాజకవిగా, కవిరాజుగా సాహితీ వినువీథులలో ధ్రువతారగా వెలిగాడు. ఆయనకు కర్ణాటక సంగీతంలో శాస్త్రంలో ప్రాయోగికంలో వున్న జ్ఞానం అంచనా వేస్తే తరువాత వచ్చిన వాగ్గేయకారులైన సంగీత త్రిమూర్తులు- త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితార్ శ్యామశాస్త్రి- శ్రీ స్వాతి తిరునాల్ మహా సంగీత సామ్రాట్టులకే ప్రేరణ కలిగించడమే కాకుండా మార్గ దర్శకుడయ్యాడనే ఒప్పుకోవాలి.

తన ముందువారితో సరిపోలిస్తే భోజుడు, జయదేవుడు, శ్రీ కృష్ణదేవరాయలు, రఘునాథ నాయకుడు, విజయరాఘవ నాయకుడు, క్షేత్రయ్య మొదలైన కవిచంద్రులతో పోటీ పడ్డాడు. చత్రపతి శివాజీ సవతి సోదరుడైన ఏకోజీకి దీవాంబిక ద్వారా జన్మించిన శహాజీ అతి పిన్నవయసులోనే క్రీ.శ. 1676లో తంజావూరు సింహాసనాన్ని అధిష్టించాడు నాయక రాజులు స్థాపించిన సంగీత, సాహిత్య, నృత్య కళా పీఠానికి మెరుగులు దిద్దాడు అదే సుస్థిరంగా నిలిచేటట్లు కృషిచే యడం అతని కళాపిపాసకు తార్కాణం. క్రీ.శ. 1712 వరకు తంజావూరుని పాలించి తన వారసులందరికి ఒక స్ఫూర్తిని ప్రసాదించాడు.

శహాజీ విదేశ సంబంధ యంత్రాంగాలలో యెక్కువ లాభం పొందక పోయినా అంతర్విషయ వ్యవహారాలను అతి మెలుకవతో చాకచక్యంతో సరిదిద్దుకున్నాడు. సంఘీభావంతో సామాజిక స్పృహతో వ్యవహరించాడు. యుద్ధాలలో నష్టం వచ్చినప్పటికీ పంటలు బాగా పండడం వల్ల తన క్రింద అధికారులతోను అనుచరులతోనూ మన్నింపబడే వారం దరూ తన ఆజ్ఞలను శిరసావహించేటట్లు చేసుకుని క్లిష్ట పరిస్థితులను అతి సామర్థ్యంతో చక్కదిద్దుకున్నాడు ప్రజల సేవార్థం సత్రములు కట్టించాడు. న్యాయస్థానాలను చికిత్సాల యాలను స్థాపించాడు. అరేబియా దేశ ప్రాంతాలనుండి ప్రసిద్ధ విదేశీ వైద్యులని రప్పించి ప్రజాక్షేమాన్ని కాంక్షించాడు అందువల్లనే మంచి పరిపాలనా దక్షుడుగా ప్రజల హృదయా లలో స్థానం సంపాదించుకున్నాడు ఈ శాంతియుత వాతావరణమే ఈతని సాంస్కృతిక కార్యకలాపాలకి భూమిక అయిందనే చెప్పవచ్చు

అతడు కేవలం కవే కాదు, రసికుడు, సరసుడు కూడా అతని ఆస్థానకవి బాలకవి సుబ్బన్న రచించిన 'లీలావతీ శాహరాజీయ' మనే యక్షగానంలో

"వాసి వన్నెలు గల్గి వరల నేరుపున
బాలించు శహజి భూపాల వర్యుండు
లాలితోత్సాహుడై లలన లందిచ్చు
చలువ పన్నీట మజ్జన మాడి రంగు
దళుకొత్తు నిండు బాదర గప్పిగొప్ప
సురతాణి ముత్యాల జోడంట్లు బెట్టి
కరముల పచ్చల కడియముల్ దొడిగి
గళమున వెల లేని కడ వన్నె పసిండి
సరిపెణల్ వైచి వక్షమున వజ్రాల
చిలుకల తాళి రంజిల దాల్చి దిశలం
దెక్కు గాన్పింప బైరిణి పాగ జుట్టి
తీరుగా గస్తూరి దిలకం బమర్చి
వీనుల జవ్వాజి వింతగా బూసి
పగలు భీతిల్లగ బరిఘుంబు బూని
హితులు మంత్రులు బురోహితు లాప్తజనులు
నతి ముదంబున గొల్వ నరుదొందు నెదుట
సందడింపుచు వారసతులు నర్తింప
వంది మాగధులు కైవారముల్ సేయ
మేడపై నొకనాడు మిహికాంశు దుదయ
శైలంబు మీదట సంపూర్ణ కళల
గొమరొందు గతి గొల్వు గూర్చున్న యెడల."

అతని భోగం ఈ విధంగా వర్ణించ బడింది.

ఇక శహాజీ విరచిత సాహితీ ప్రపంచాన్ని పరిశీలిస్తే అతడు శివభక్తుడు కావడం వల్ల తన యొక్క ఉపాసనను సాహిత్య పరంగా వాగ్గేయకారుడుగా సంగీతం ద్వారా నాదోపాసకుడుగా మలచుకుని తరించిన మహనీయుడు.

తంజావూరులో ఆంధ్ర నాయక రాజులలో సాహితీ సేవచేసిన వారు రఘునాథ నాయకుడు, అతని కుమారుడు విజయ రాఘవ నాయకుడు - క్రీ.శ. 1600 నుండి 1673 వరకు రాజ్యమేలిన వారు. వీరి కాలంలో రాజాస్థాన మనేక సంస్కృతాంధ్ర కవులకు కవయిత్రులకు నెలవైంది. ఆశ్రయమైంది. సాహిత్య ప్రక్రియలన్నిటిలో ముఖ్యంగా యక్షగానం. ఆగ్రతాంబూలం పుచ్చుకుంది. ముఖ్యంగా విజయ రాఘవ నాయకుడు తన ఆస్థాన కవులచే అనేక యక్షగానాలు రచింపజెయడమే కాకుండా తాను స్వయంగా అనేక కృతులు రచించి తన కొలువులో నట్టువమేళములచే ప్రదర్శింప జేసి వినోదించేవాడట. రఘునాథ నాయకుని కాలంలో రాజసభా ప్రవేశార్హత కల్పించుకున్న యక్షగానం విజయ రాఘవుని కాలంలో రంగభోగాన్ని అనుభవించింది. యక్షగాన ప్రక్రియ ఒక విశిష్ట పరిణతి పొందింది. తంజావూరు ఈ మహోన్నత స్థాయికి మూలమై నిలిచింది. అప్పటి నుండి యక్షగానం కోటలోని రాజుగారికి, పేటలోని ప్రజలకు సమానంగా ఆదర పాత్రమైంది.

ఆంధ్ర నాయక రాజుల రాజ్యమంతరించిన తరువాత మహారాష్ట్ర ప్రభుత్వం నెలకొన్నది. ఆ ప్రభువులు కూడా నాయక రాజుల అడుగు జాడలలో నడిచి సాంస్కృతిక రంగంలో విశేషమైన దోహదం చేయడం చరిత్రలో ఒక అపూర్వ సన్నివేశం, భాషా వాఙ్మయములని ఆదరించడమే కాకుండా యక్షగానాల పట్ల యెక్కువ మక్కువ చూపించడం మరొక విశేషం. వారుకూడా స్వయంగా వారి మాతృభాష మరాఠీ అయినా తమిళనాడు నడిబొడ్డులో రాజ్యపాలన చేస్తూ తీయనైన తెలుగు భాషలో అనేక రచనలు చేయడం తెలుగు జాతికీ సంస్కృతికీ గర్వకారణం. వీరిలో అగ్రగణ్యుడు శహాజీ, భోసల వంశీయుడు. ఇతడు అపర కృష్ణదేవరాయలు అపర విజయ రాఘవుడుగా పరిగణింప బడ్డాడు. సంగీత, సాహిత్య నాట్య కళా కోవిదుడు. శృంగార శూరుడు, హాస్యచతురాస్యుడు.

శహాజీకి అంకితములైన యక్షగానాలే గాక, తాను స్వయంగా ఇరవై యక్షగాన రచనలు చేసినట్లు తెలుస్తూంది. తంజావూరులో సరస్వతీ మహల్ గ్రంథాలయంలో చాలా వరకు ఇవి భద్రపరచ బడ్డాయి.

ఇందులో కళ్యాణ యక్షగానాలు - 6
విలాసములు - 4
ప్రబంధములు - 4
ఇతరములు -7
కల్యాములు - 6

విఘ్నేశ్వర, వల్లీ, శాంతా, ద్రౌపదీ, సీతా, రతి కళ్యాణములు.

విలాసములు - 4

1) కృష్ణలీలా విలాసము
2) సతీపతి దాన విలాసము.
3) కిరాత విలాసము
4) భక్త వత్సల విలాసము.

ప్రబంధములు - 4

1) పంచరత్న ప్రబంధం
2) త్యాగ వినోద చిత్ర ప్రబంధం
3) శంకర పల్లకీ సేవా ప్రబంధము
4) విష్ణు పల్లకీ సేవా ప్రబంధము.

ఇతరములు - 6
1) శచీ పురందరము
2) జలక్రీడలు
3) రామ పట్టాభిషేకం
4) రుక్మిణీ సత్యభామా సంవాదము.
5) గంగా పార్వతీ సంవాదము.
6) సతీ దానశూరము.

ఈ ఇరవై యక్షగానములలో నాలుగు ప్రబంధములుగా గ్రంథకర్తచే పేర్కొనబడ్డాయి. తక్కిన పదహారు రచనలు నాటకములై ఉదారవేష, భాషా భూషితములని వ్యవహరింప బడి 'నాట్యోద్దిష్ట గీతి బంధ ప్రకృష్టములు'గ నుండి ప్రదర్శనా యోగ్యతను కల్పించుకున్నట్లు చరిత్ర తెలుపుతూంది.

వీటిలో పల్లకీ సేవా ప్రబంధములకి ఒక విశిష్ట స్థానముంది. ఈ మధ్యవరకు తంజావూరు పరిసర దేవాలయములలో కొన్నిట ఉత్సవసందర్భములలో ఇవి దేవదాసీలచే ప్రదర్శింప బడినట్లు తెలుస్తూంది; ఆరాధనా ప్రక్రియలుగా సమర్పించ బడ్డాయి.

ఈ పల్లకీ సేవా ప్రబంధముల గూర్చి కళాత్మక పరిశీలన చేసే ముందు వాటిలో యిమిడి యున్న సాహిత్య ప్రక్రియలను కొంతవరకు స్పృశించాలి. దేవాలయ సంబంధ మైన పల్లకీ సేవలో యక్షగాన నాటక ప్రక్రియను, ప్రబంధ సాహిత్య సంపదను తగు పాళ్లల్లో పొందుపరిచాడు శహాజీ.

యక్షగానం సర్వోపభోగ్యమైన సమాహార కళాస్వరూపం గాను, వివిధ ప్రక్రియానుబంధంగాను బహువిధ పదకవితా ప్రభేద సమీకరణం. యక్షగానాలలో సాధారణంగా ఇతివృత్త ములలో పౌరాణికములు, స్థలపురాణ గాథలు, చారిత్రక ములు, కళ్యాణ గాథలు ముఖ్యంగా చోటు చేసుకుంటాయి. ఇంతటి వస్తువైవిధ్యం శహాజీ రచనలలో కనిపిస్తుంది.

దాదాపు అతని రచనలలో శృంగారం రసరాజమే అయింది. స్థూలంగా పరిశీలిస్తే దేశి వాఙ్మయమంతా మధుర కవితాశాఖకు చెందిన గీత ప్రబంధములతో కూడిన గాన ప్రక్రియగా, రూపక ప్రక్రియగా పరిగణింప బడుతూంది. దీనికి తోడుగా దేశి సరణికి చెందిన నాట్య కళా ప్రపంచములో కూడా తగిన ప్రాతినిధ్యాన్ని సంపాదించుకుం దనడంలో అతిశయోక్తి లేదు. ఆంధ్ర వాఙ్మయంలో బహుముఖ వైవిధ్యాన్ని వైశిష్ట్యాన్ని కలిగి విశాల సాహిత్య ప్రపంచంలో ఒక మెరుపుగా వెలిగింది యక్షగానం.

దక్షిణాదిన స్థిరనివాస మేర్పరచుకొన్న ఆంధ్రులే కాకుండా తమిళులు మహారాష్ట్రులు కూడా ఆంధ్ర వాగ్గేయ కారులై సంగీత గగనాన దీప్త తారలైనారు. దీనికి కారణం తెలుగు భాష ఇటలీ భాషవలె తీపి సొనయై తన్మయుల చేయడమే. ఈ మాధుర్యాన్ని గ్రహించే శహాజీ మహారాజు తన భక్తి వాఙ్మయానికి, సంగీతానికి తెలుగు భాషనే కాకుండా తెలుగు సంస్కృతిని కూడా జీవనాడిగా చేసుకున్నాడు.

శహాజీ ప్రబంధ యక్షగాన రచనలలో పల్లకీ సేవా ప్రబంధాలు కాక పంచరత్న త్యాగవినోద చిత్ర ప్రబంధాలు కూడా అతని భావకల్పనకి, నాట్యశాస్త్ర పాండిత్యానికి నిదర్శనాలు.

పంచరత్న ప్రబంధంలో కథా వస్తువు లేదనే చెప్పాలి. కేవలం పరమేశ్వరుని కొలువు కూటంలో బిరుదు మిటా రులు నవసిద్ధియోగి, చెంచు నట్టవోజు 'బిరుదు బంటు' సాధన కాండ్లు వచ్చి, తమ నాట్య కళానైపుణ్యాన్ని ప్రదర్శించి అనేక బిరుదులని, బహుమతులను అందుకుంటారు.

విష్ణు, శంకర, పల్లకీ సేవా ప్రబంధాలు లాస్యప్రధానములై శృంగార రస భరితమై భక్తి సంగీతముతో మధుర భావనలతో స్త్రీ పాత్రలతో సమన్వితమై వుంటే, పంచరత్న ప్రబంధము లాస్య తాండవములతో మార్గదేశి నడకలతో నాట్య ధర్మి, లోకధర్మి సంగతులతో వైవిధ్యంతో సాగింది. ఇందులో స్త్రీ పాత్రలు రెండే. బిరుదు మిటారులు. మిగిలినవి పురుష పాత్రలు. వారి ఆహార్యంలో, ఆంగికంలో వాచికంలో ప్రదర్శనా విధానంలో రూపురేఖలలో వైవిధ్యం కనిపిస్తుంది. ఇందులో దరువులు, ద్విపదలు మొదలైన యక్షగాన ఛందస్సే కాకుండా శాస్త్రీయ నృత్త సంబంధమైన అంశాలు జతి, సొల్లు, మొహరము, తీర్మానము, నృత్య విన్యాసమైనటువంటి గణపతి కవుత్వం, ప్రబంధ దరువులు, అభినయ ప్రధానమైన పదాలు యథోచితంగా ప్రవేశపెట్ట బడ్డాయి. ఇందులో కొన్నింటిలో మరాఠీ భాషా ప్రయోగం కూడా జరిగింది. దేశీ సంగీత ప్రక్రియలు యెక్కువగా కానవస్తాయి. శహాజీకి గల సంగీత సాహిత్య పరిజ్ఞానం, నాట్యకౌశలము వెల్లడి అయ్యాయి. నాట్యం ప్రధాన విషయం అయింది. కేవలం ఇతివృత్తం పురాణ విషయమే అయినా, భక్తిభావం అంతర్గ తంగా సాగుతూ జనరంజకమైన నృత్తాన్ని మధ్య మధ్యలో చొప్పిస్తూ సంగీత సౌరభ్యాన్ని సాహిత్య రసికతను జోడిస్తూ కథను అతినెమ్మదిగా ఆయాస పడకుండా ప్రతి సూక్ష్మ విషయాన్ని అందంగా విపులీకరిస్తూ అంచ అంచలుగా విశేషమైన అంశాలను సంగీత సాహిత్యాలకు పరస్పరాచ్ఛాదన లేకుండా ప్రత్యేక శైలిలో విజృంభించాడు. రసికుడు, కవి, భక్తుడు అయిన శహాజీ.

తోడై మంగళంలో దుర్గస్తుతిలో

సీ. మధుకైటభ ప్రాణ మరుదుగ్ర కాలాహి
కాలాహివేణి జాగ్రత్కృపాణి

గీ. హార నీహార హీర హారాంగకీర్తి
గహన యోగీశ్వర ధ్యాన గమ్యమూర్తి
పార్శ్వపరిచారికా భవదుర్గ దుర్గ
భూమి భృజ్జాత సాహేంద్రు బ్రోచుగాక.

ఈ విధంగా దుర్గ ప్రచండ స్వరూపాన్ని శ్లాఘిస్తూ, వీర రస భరితమైన అమ్మవారి మహిమాన్విత గుణాలని కీర్తిస్తూ, మధుకైటభ రక్తబీజ చండముండ రాక్షసులను బీల్చి చెండాడిన పరాక్రమమూర్తిగా స్తుతిస్తూ కేవలం కవిగా గాక ఒక వీర పురుషుని హృదయాన్ని వెల్లడించుకున్నాడు శహాజీ. ఆ మహా శక్తికే ఏవిధంగా రౌద్ర, సౌమ్యమూర్తిగా ద్విపాత్రలు న్నాయో ఆ విధంగానే శహాజీ హృదయం కూడా రాచరిక దర్పం తోను, కవిత్వ సౌరభంతోను నిండివుంది. అందువల్ల అతని రచనలలో ఉద్రేకం, ఉత్సాహం, ఉల్లాసం ఉద్భవించి ఆయా ప్రక్రియలకే జీవం పోస్తాయి.

ఇక రెండవ ప్రబంధమైన త్యాగ వినోద చిత్ర ప్రబంధము. ఒక చిత్రమైన రూప కల్పన. తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో ఆంధ్ర వాఙ్మయ సూచికలో శహాజీ కృతిగా కాళీతాండవ నాటకంగా కూడా పేర్కొనబడింది. ఇందులో పంచరత్న ప్రబంధం కంటే కథా వస్తువులో కొంత పటుత్వం వుంది. ఆరు అంకాలుగా విభజింపబడి సంస్కృత శబ్ద బహుళంగా మహారాష్ట్ర భాష వాడబడినది. శహాజీ యక్షగాన ప్రబంధాల లోని దరువులకి ఒక ప్రత్యేక స్థానం వుంది. సలాము దరువులు, ప్రబంధ దరువులు, పదాభినయ దరువు పంచరత్న ప్రబంధంలో ప్రసిద్ధికెక్కినవి. ఇక త్యాగ వినోద చిత్ర ప్రబంధంలో

సవ్యాపసవ్య సమపద దరువు క్రమసప్తస్వర
వర్ణార్థ లీలా దరువు, స్వరజతి. స్వర నాట్యజతి
పంచఘాతము పేర్కొన దగ్గవి. క్రమసప్తస్వర
వర్ణార్థ లీలా దరువు రాగసూచికగా తోడి,
కళ్యాణి మొదలైన రాగాలతో కూర్చబడింది

ఈ గ్రంథం శహాజీ కులదైవం అయిన త్యాగేటేనికి అంకిత మివ్వబడింది. నాట్య నైపుణ్యంలో తనంతటి వారు లేరనే భద్రకాళి గర్వమణచడానికి, నారదుని ప్రేరణతో త్యాగేశుడు నటరాజుగా వివిధ ప్రక్రియలలో నృత్యం సలిపి, కాళితో పోటీపడి గెలిచి చివరకు భద్రకాళిని ఓడించి పాణిగ్రహణం చేయడం యిందలి విషయం.

ఈ యక్షగానం కేవలం తనకు సంగీత సాహిత్య భరత శాస్త్రాలలో వున్న పాండిత్యాన్ని నిరూపించుకోడం కోసమే రచించినట్లు ఒక వూహ. అక్షరాలతో ఆటలాడుతూ, శబ్దాలతో వివిధ గతులతో రాగ తాళ సంగతులను మేళవించి చిత్ర విచిత్ర ప్రక్రియగా తీర్చిదిద్దాడు. అందుకే వినోద చిత్ర ప్రబంధంగా ప్రకటింపబడింది.

ఇక పల్లకీ సేవా ప్రబంధాలను పరిశీలిస్తే వాటి పోకడే వేరు. శహాజీ రచనలలో ఒక విశిష్ట స్థానాన్ని పొందాయి అవి.

పల్లకి సేవా ప్రబంధాలలోని సాహిత్యం అత్యుత్తమ స్థాయికి చెందినది.

శంకర పల్లకి సేవా ప్రబంధం.

శంకర పల్లకి సేవా ప్రబంధంలోని ఇతివృత్తం చాలా చక్కని కల్పన. తంజావూరు నేలిన మహారాష్ట్రులందరికి త్యాగరాజ స్వామి కమలాంబిక (తిరువారూరు) కులదైవాలు. అందువల్ల శహాజీ తన తొలి రచనను వారి పేర అంకితం చేస్తూ తిరువారూరు లోని దేవాలయం తదితర పరిసర ఆలయ ప్రాంగణాలలో ప్రదర్శనా భాగ్యాన్ని కలుగ జేశాడు.

ఈ ప్రబంధం పరమేశ్వర స్తుతితో ప్రారంభమై గౌరీశంకర సంస్తుతి రూప మంగళ గీతంతో పరిసమాప్తమవుతుంది

పరమేశ్వర వియోగ పరితప్తయైన పార్వతి తన స్వామిని పిలుచుకు రండని చెలికత్తెలను పంపడం వారు పోయి నిండు కొలువున ఉండిన పరమేశ్వరుని పార్వతి దగ్గరకు పల్లకిలో పిలుచుకు పోవడం యిందులోని ప్రధాన ఇతివృత్తము. తిరువారూరు దేవాలయంలో కమలాంబికాదేవి పరమేశ్వర సంయోగాన్ని కోరుతున్న దేమో అన్నట్లు ఈశాన్యాభిము ఖియై నిలిచి వుందట. ఈ విషయ ప్రేరణతో ఆలయంలో సంప్రదాయంగా జరిగే పల్లకి సేవను దృష్టిలో పెట్టుకుని స్వీయకల్పనా శక్తితో ఈ ప్రబంధాన్ని రచించినట్లు తోస్తూంది. యక్షగాన మనేది ప్రౌఢ వాఙ్మయ శాఖ కాదని, ఒక పామర వాఙ్మయ ప్రక్రియ యని కొంతమంది పండితులు సాహితీవేత్తలు అపోహపడినా, మరి కొందరు అది పండిత పామర వాఙ్మయాలకే సామరస్యం ఘటించిందన్న విషయాన్ని రూఢి పరుస్తున్నారు. ప్రౌఢి అనేది రచనాశ్రయం కాని, ప్రక్రియని బట్టి కాదు. యక్షగానాలు సామాన్య ప్రజానీక రంజనానికి ఉద్దేశింపబడి రచింపబడినవి కాబట్టి ప్రబంధం లోని శబ్దాశ్రయ మైన ప్రౌఢి అంటే పండితులని మెప్పించేది, కానరాక పోవచ్చుకాని వాటిలో భావాశ్రయమైన పటిమ కొట్టొచ్చినట్లుగా కనిపించడం సహజ లక్షణమైంది. యక్షగాన

రచన ఒక యజ్ఞము వంటిది. యక్షగాన కర్తలందరూ విద్వత్కవులు కాకపోవచ్చు కాని వారికి సంగీత నాట్య కళలలో కూడా తగినంత పరిజ్ఞానం అవసరం. కేవలం యక్షగాన రచన చేయడం ఒక ఎత్తు; చిన్న ఇతివృత్తంతో దానిని ప్రబంధ విషయంగా మలచుకొని ఒక ప్రత్యేకమైన శైలిలో విశిష్ట ప్రక్రియగా రూపు దిద్దడం మరొక ఎత్తు. ఇటువంటి క్లిష్టమైన రచనను శహాజీ చేపట్టాడంటే అతనికి యక్షగానాల మీద వున్న మక్కువా కావచ్చు; దేశాన్ని పాలించే రాజయినప్పటికి అతనికి సాహిత్య, సంగీత, నృత్య కళలతో గల పరిచయాన్ని పాండిత్యాన్ని క్రోడీకరించి ఈ ప్రక్రియ ద్వారా భగవదారాధన చేయడం కూడా అవవచ్చు. అందువల్లనే పల్లకి సేవా ప్రబంధం అని నామకరణం చేశాడు. ఇది అన్ని విధాలా సమంజసమే. ప్రబంధ శబ్దం విపులార్థంలో కావ్యపరంగా సంస్కృతాలంకారికులు వాడినా ఆంధ్ర సాహితీ జగత్తులో దానికి విశేష దృక్పథం వుంది. పాత్ర చిత్రీకరణ శైలీ పరిణతి, అష్టాదశ వర్ణనలు నవీన కల్పనలతో కూడిన పురాణ ప్రసిద్ధ ఇతివృత్తంగా గల విశిష్ట గుణాలు గల కావ్యరచన అది. కథ చిన్నదిగా వుండి, సన్నివేశాలు కూడా అతి స్వల్పంగా వుండి కవి హృదయాన్ని అనేక విధాలుగా ప్రకాశవంతం చేస్తుంది ప్రబంధం.

''కావ్య ప్రబంధాలలో నాయకాదులను ఉపమించి చెప్పుటలో అనుసరణీయములు కొన్ని కలవనీ ఏయే వస్తువు దైవత మానుష వ్యక్తులకుపమింప దగినదిగా సుభగము, హృద్యము అవుతుందో దానిని గాయనులు గీత వృత్తులతో ఉపమేయముగా నిరూపించ వచ్చునని, ఇట్లు విభావన మొనరించి యథా భావముగా యథారసముగా యథార్థముగా భరతుడీ నాట్యమును ప్రయోగింప దగునని, అభినయ మొనరింప దగునని, ఉపమేయ గతములైన గుణములుగా నభినయించి నిర్దేశించుటలో నానా విశేషణముల నభినయించి ప్రయోగింప వలసి యుండునని శారదాతనయుడు తన నాట్యగ్రంథం భావ ప్రకాశనములోని దశమాధికారంలో వివరించాడు.

పై విశేషాల అన్వయంతో రచింపబడినవి శంకర, విష్ణు పల్లకీ సేవా ప్రబంధాలు వీటి పోకడను గమనిస్తే యివి ఉభయ ప్రయోజనంతో దృశ్య శ్రవ్య ప్రక్రియలుగా ప్రయోగింపబడినట్లు తెలుస్తూంది.

శంకర పల్లకి సేవా ప్రబంధము ఉత్సవ సమయాలలో ప్రదర్శించే యేర్పాటు చేయడానికి తిరువారూరు త్యాగరాజ స్వామి దేవాలయానికే శ్రీ శహాజీ మహారాజు కొంత భూమిని దానమిచ్చినట్లు సుమారు రెండు వందల సంవత్సరముల కంటే యెక్కువ కాలము ఈ ఆరాధన జరిగినట్లు చరిత్ర చెప్తూంది. నాట్యకళా ప్రవీణలైన తరుణీమణులు పల్లకీ బోయీల పాత్ర ధరించి స్వామి పల్లకిసేవ చేసేవారట.

సాహిత్య పరంగా శహాజీ పల్లకి సేవా ప్రబంధం పరిశీలిస్తే అది దేశీయతను పుణికి పుచ్చుకుని సరళమైన తేటతెనుగు భాషలో తీగలా సాగింది. ఇతివృత్తం దైవసంబంధమైనదే కాని పురాణ ఇతిహాసాల లోనిది మాత్రం కాదు. మధుర కల్పన అది. శృంగారం రసరాజంగా అతి సుందరమైన సన్నివేశాలతో మధుర భావాల సమన్వయంతో నృత్త, నృత్య, నాట్య ప్రాధాన్యంగా లాస్య విన్యాసంతో కానసాగిన అపురూపరచన ''ఇందులో యక్షగాన రచనలో సాధారణంగా యిమిడ్చే ఛందస్సు- ఇందులో సీసపద్యాలు కందాలు(6), చంపక మాలలు(3), ఉత్పలమాలలు(2) గీత పద్యాలు(2). దరువులు 22 చూర్ణిక-1 చోటుచేసుకున్నాయి.

సంగీత పరంగా దరువులలో శంకరాభరణం, సావేరీ, మోహన, మధ్యమావతి, పంతువరాళి, సౌరాష్ట్ర, భైరవి నాదనామక్రియ, కురంజి, ఘంటాపున్నాగ వరాళి, సైంధవి రాగాలు వాడబడ్డాయి. ఇవన్నీ కూడా వీనులకింపుగా వుండి ప్రదర్శనా యోగ్యములైన రక్తి రాగాలే. ఈ గ్రంథం చిన్నదైనా అత్యంత మనోహరం కనుక ప్రబంధంగా భావ, రాగ, తాళాలతో బంధించాడు కవి. ఈతని దక్షత కేవలం సాహిత్య సంబంధమైన గేయాలు, వృత్త జాత్యుపజాతి పద్యరచనలు, యితర యక్షగాన ప్రక్రియలలోనే కాకుండా భావ సంబంధమై అభినయానికి చక్కగా అమరిన పదజాలంతో కూడిన సరస సుందర వర్ణనా చాతుర్యంలో కూడా కానవస్తుంది. పాత్రలనే కాకుండా పరిసరాలను వస్తువులను కూడా తీర్చిదిద్ది పాఠకులు ప్రేక్షకులు భక్తుల సమక్షంలో సాక్షాత్కరింప జేయగల సమర్థుడు ఈ రచయిత.

ఈతడు చేసిన శంకర పల్లకి, విష్ణు పల్లకి సేవా ప్రబంధ యక్షగానాలు రెండింటిలో దేవాలయ ఆరాధనా ప్రక్రియ అయిన పల్లకీ సేవ ముఖ్యాంశం కనుక పల్లకీల వర్ణన, అందులో శివకేశవుల వాహనాలుగా రెండింటిలో వైవిధ్యం, గమనించ దగ్గ విశేషం. భాష దేశీయమై అతి సుందరంగా ఉన్నా, మూడు వంతులు సంస్కృత పదాలు, ఒక వంతు మాత్రమే. తెలుగు భాషను వాడుకగా ప్రయోగించే వారికే శహాజీ శైలి అర్థం కావడం కష్టం. భాష సున్నితంగా వున్నా భావం అర్థం చేసుకోవడం కొంత శ్రమతో కూడిన పని. ఈ పల్లకీ ప్రబంధాలలో నృత్త సంబంధమైన జతులు, తీర్మానాలు కానరావు. దరువులన్నీ సంగీత, సాహిత్య సమష్టిపంటగా వెలిసాయి. విప్రలంభ శృంగారాన్ని వర్ణించిన కవి నృత్తానికి

ప్రాధాన్య మివ్వక పోవడం సమంజసమే. పార్వతి యొక్క విరహావస్థను శివునికి తెలిపి నాయికా నాయకులను కలిపే ప్రయత్నంలో దూతికలుగ వ్యవహరిస్తున్న చెలికత్తెలు అతి సంతోషంతో ఉల్లాసంగా వివిధ గతులలో , జతులలో నాట్యం చేయడం రసభంగ మవుతుందని భావించాడేమో, అయినప్పటికీ దేవాలయంలో నిత్య కళ్యాణం, పచ్చతోరణంగా వుండే ఉత్సవాలు వేడుకలు ఆనంద దాయకాలు. శివ పార్వతులు మానవ సహజమైన విరహావస్థలకు లోనై పరితపించడం అన్నది లోకస్వభావంగా చిత్రీకరించి ఆ వేడుకను తాను వూహించుకుని ఆనందించి, పులకరించడమే కాకుండా ఆ అనుభూతిని భక్తులకు, రసికులకు పంచిపెట్టాలన్నది శహాజీ ధ్యేయంగా భావించవచ్చు. అందువల్లనే దరువులన్నీ భావప్రధానములై నృత్యాభినయాలకే అనువైన ప్రక్రియలుగా మలిచాడు. ఈ దరువులలో కవి తన పదవాఙ్మయంతో కుదించి, అర్థ సౌలభ్యంతో బాటు, కావ్యభావనా సౌరభాన్ని కూడా కల్గించాడు. ఇందులో భాష గ్రాంథిక వ్యావహారిక పదాల సంకీర్ణము. ఈ తెగువ అందరికీ వుండదు. ఇటువంటి సాహసాన్నే అన్నమాచార్య ఆయన మాటవేదంగా, ఆయన నడిచిన తీరు మహాకవులకే బాటగా ఏర్పడి తరువాతి పదవాఙ్మయ కర్తలకు ఆదర్శ ప్రాయమైంది. ఈ విధంలో శహాజీ అనేక చోట్ల అన్నమయ్యను అనుసరించాడు. ప్రబంధ యక్షగాన రచనలో అతని హృదయం, మాట శైలి, సహృదయుల రసికతను తట్టి లేపుతుందనడంలో అతిశయోక్తి లేదు.

తన రెండవ ప్రబంధమైన విష్ణుపల్లకి సేవా ప్రబంధ రచనలో తాను చతుర్వేద సాహిత్య నిర్వహణ దక్షుడననీ వేదాంత వైశేషిక, వ్యాకరణాది శాస్త్ర విజ్ఞాతననీ సత్యవినోదిననీ సంగీత రహస్య వేదిననీ తెలుపుకున్నాడు. ఇది శంకర పల్లకి కంటె ప్రౌఢం. శంకర పల్లకిలో శహాజీ గణపతి శివ ప్రార్థనా పద్యాలతో కథనే సూటిగా మొదలు పెట్టాడు. విష్ణు పల్లకిలో అలా కాకుండా కుకవినింద, సుకవి స్తుతి, దేవతా వర్ణనలతో కూడిన తోడైమంగళ దరువులు పూర్వ రంగంగా అమర్చుకున్నాడు. దీనితో ఈ రచన దేవాలయ ప్రాంగణాన్ని దాటి సభా ప్రవేశం చేసి వుండవచ్చు. ఇందులో కవి తనకు వివిధ శాఖలలో వున్న, పాండితీ ప్రతిభను విశ్వాసంతో చాటుకున్నట్లు తెలుస్తూంది. ఇతివృత్తం రెండింటిలో యించుమించు ఒకటే. అయినా ఇందులో విష్ణువియోగంతో పరితపిస్తున్న లక్ష్మీదేవి తన ప్రాణప్రదుడైన జగత్రాణ పరాయణుడైన నారాయణుని తోడితెమ్మని చెలికత్తెలని పంపితే వారు నిండు కొలువులోవున్న శ్రీహరిని చూసి దగ్గరకు వెళ్లే ధైర్యం చాలక నారదుడు, శేషుడు, గరుడుడు, ఆంజనేయులతో వారి మాట హరితో తెలుప మని వేడుకుని చివరకు వారే ఆ స్వామిని చేరి పల్లకిలో తోడి తెచ్చి లక్ష్మీదేవికి అప్పగించే విధానము అతి సున్నితంగా తెలప బడింది. ఇందులో విష్ణు శంకర, పల్లకి ప్రబంధాలలో రెండు దరువులు ఒకే పోకడలో రచించినా అర్థం మటుకు వేరుగా స్ఫురింపజేస్తాడు శహాజీ.

శంకర పల్లకిలో చెలులు శంకరుని వర్ణించే విధానం.

దరువు శంకరాభరణ రాగం. త్రిపుట తాళం.
ప. కొలువై యున్నాడె దేవదేవుడు.
అనుపల్లవి. కొలువై యున్నాడె కోటి సూర్య ప్రకాశుడె వలరాజు విష్ణుపల్లకిలో - వలరాజు కొగవాడే వనిత మోహనాంగుడె.

పంతువరాళి రాగం ఆదితాళం.

ప. కొలువై యున్నాడె దేవదేవుడు. కొలువై యున్నాడె, అను పల్లవి లేదు.

చరణం.

1. కొలువై యున్నాడె - సురలు, కొలువ నారదాదులు
పలునూరు నుతియింప బలుమరులను కూడి.

నాలుగవ చరణంలో ఈ విధంగా
దేవదేవుడు శ్రీనివాసదేవుండు భోసల శ్రీశాహ భూ వాసవ సమ్మాన భూవాస త్యాగమురారి - అని శ్లాఘించాడు.

ఇక పల్లకి వర్ణనలో
శంకర పల్లకిలో
శంకరాభరణ రాగం మిశ్రచాపుతాళం పల్లవి. సింగారంపు పల్లకి చెలువు చూడవే అనుపల్లవి. సంగీత మేళముతోను సన్నుతించేను దేవుని.

1. జిగిమించు జలపూత జీని పన్నాంగము
చిగురునిండు బురుసా పింజెలును
నిగనిగయను పచ్చపగడంపు దండియు
మగరాల నిగరాల మంచి చట్టములుగల

ఇది రత్నాలతో పొదిగిన పల్లకి: విష్ణు పల్లకిలో
కేదారగౌళ రాగము ఆది తాళము
పల్లవి- సొగసు పల్లకి చూడవె కలికి - తెగువను బోయలు
అనుపల్లవి లేదు. దెచ్చిరి హరికి.

చరణము
సరసీరుహముల చట్టము లెల్లను మెరయు చున్నవి వేళ
మురువగు మొల్లల కత్తెర కోలలు ముద్దుగులికెడిని చాల.

ఇది పువ్వులతో అలరించి అమర్చిన పల్లకి. ఈ రెంటిలో ఎంత వైవిధ్యం.
శివుడు యోగి, కేశవుడు భోగి.

రత్నాలంకారము నిత్యమైనది. దేదీప్యమానమైనది జ్ఞాన ప్రదం. పుష్పాలంకారం నూతనమైనది. సౌరభాన్ని వెదజల్లేది. హృదయాలని సేద దీర్చేది. భగవంతుని నివాస యోగ్యం భక్తుల హృదయకుసుమాలే కదా.

ఈ విధంగా ఎన్నో ఊహలతో అల్లిన నవడోలిక ఈ యక్షగానాలు.

సంగీతంలో రాగ, తాళాలలో కూడా మార్పులు చేయడం గనునార్హం.

విష్ణుపల్లకి లో చాలా దరువులకి రాగ తాళాలు సూచించ లేదు. వాటి యొక్క నిర్ణయం సంగీత సాధకులకే వదిలేసాడు. శహాజీ ఇందులో 38, దరువులు, వృత్తాలు కాక కైవారాలు, వృషభగతి తోదక వృత్తము, మయూర గతి లయగ్రాహి, చూర్ణిక చోటు చేసుకున్నాయి.

ఎచ్చరికలు, పరాకులు, మంగళాలు, ఆరగింపులు, లాలి పాటలు, మేలుకొలుపులు అష్టకాలు, దైవపరంగా కూర్చిన ఆరాధనా ప్రక్రియలు. పల్లకీ సేవా ప్రబంధాలు ఎంత ప్రౌఢమైనవైనా భక్తి రస ప్రసక్తి లేని ఒక సామాన్య కావ్యాన్ని చదివినప్పటి కంటే భక్తి భావోజ్వలమైన పల్లకీ సేవా ప్రబంధాల వంటి శ్రవ్య, దృశ్య కావ్యాలు చదివినా, చూసినా కలిగే అనుభూతి, హృదయ స్పందన మేలుగా వుంటుందన డంలో సత్యముంది. భక్తికి కవితకు యేదో సహజమైన మధుర బాంధవ్యం వుంది. సహజంగా భావుకుడైన కవి భక్తిని రసంగా అంగీకరించడమే కాకుండా కావ్యంలో చెప్పే సామాన్యమైన అర్థానికి కలిగే అనుభూతి కంటే మిన్న అయిన తత్త్వం హృదయాన్ని తాకుతుంది. ఈ అనుభవం, రసానందం, అనుభూతి, హృదయ స్పందన భావుకత సమృద్ధిగా నున్న శ్రోతలకీ, ప్రేక్షకులకీ కూడా అనుభవ యోగ్యములే.

ఒక యక్షగాన కర్తగా పద సాహిత్యంలో దిట్టగా కాకుండా శహాజీ మహారాజు తన కులదైవమైన త్యాగరాజ స్వామి పేర దాదాపు 500 వివిధ రకములైన కీర్తనలు తెలుగులోను, 100 మరాటీ భాషలోను అతి భక్తి భావంతో రాసినట్లు తెలుస్తుంది. ఇవి గాకుండా తన సామ్రాజ్య పరిధిలో వున్న అనేక దేవాలయ మూల విరాట్టుల మీద సంస్కృతంలో స్తోత్రాలను రచించాడు. సంగీతంలో యెంత జ్ఞానం వున్నా భక్తి లేకపోతే నిస్సారమవుతుందన్న సత్యాన్ని తెలుసుకున్నాడు. ఆ సంగీతం భక్తి మార్గంలో ఒక ఉపాసనగా సాధనగా తపస్సుగా మలచుకుంటేనే తన జీవితానికి సార్థకత అని తను తీర్మానించుకున్నా, ఆ తత్త్వాన్ని తన రచనల ద్వారా లోకానికే చాటి చెప్పిన మహనీయుడు చిరస్మరణీయుడు శహాజీ మహారాజు.

## తిరువారూరు దేవాలయంలో 'శంకర పల్లకి సేవా ప్రబంధం'

దేవాలయాలు భారతీయ సంస్కృతికి ఆలయాలు. సామాన్య మానవుడు తన విధ్యుక్త ధర్మముతో ప్రవర్తిస్తూ సన్మార్గంలో నడవడానికి ప్రతి గ్రామంలోనూ వివిధ దేవతా మూర్తులతో ప్రతిష్ఠించిన ఆలయాలే ముఖ్య బోధనా సాధన నిలయాలు. పూర్వ కాలంలో శైవ వైష్ణవాలయాలలో సంకీర్తనలు, కథా కాలక్షేపాలు, హరికథలు శ్రవణానందాన్ని కలుగజేస్తూ భక్తుల హృదయాలను స్పందింప జేశాయి. అదే విధంగా దేవదాసీల నర్తనం నయనానందకరమే కాకుండా భక్త్యావేశములతో కూడుకుని సామాన్య మానవునికి భక్తి తత్త్వాన్ని అతి సూక్ష్మరూపంలో అందింపజేసింది దేవస్థానాలు కళలను పోషించాయి. ఆ కాలంలో ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో యే కళాపిపాసి అయినా నృత్యంచూడాలంటే దేవాలయ ఉత్సవ వేడుకల్లో పాల్గొంటున్న దేవదాసీల నృత్యాన్నే సందర్శించే వారు. అతి పవిత్ర మైన ఆరాధన అది. దైవకైంకర్యానికే అంకితం అయిన వారు దేవదాసీలు. ఆ భగవంతుని వివిధ నామాలతో గానం చేస్తూ, అనేక రూపాలలో శ్లాఘిస్తూ నర్తిస్తూ తమ కళల ద్వారానే నివేదన చేసి ఆత్మార్పణ చేసుకుని తరించిన పుణ్య మూర్తులు వారు. ఇప్పటికీ ప్రాచీన ఆలయాలలో నాట్యశాలలను దర్శించవచ్చు.

దక్షిణ భారతంలో తిరువారూరు దేవాలయానికే ఒక ప్రత్యేక స్థానం వుంది. సంగీత నృత్య కళా సంస్కృతికి నెలవే అయింది. అప్పటి దేవదాసీల నృత్య ప్రదర్శనకి సహకార వాద్యం నాదస్వరమేళం శహాజీ కాలంలోఆ తరువాత ఆలయ ఆరాధనా ప్రక్రియలలో రెండు నృత్యరూపకాలు ప్రయోగించ బడ్డాయి. అందులో మొదటిది. శంకర పల్లకి సేవా ప్రబంధం, రెండవది కురవంజి. దేవాలయంలో సంవత్సరం పొడుగునా కొన్ని ఉత్సవాలు జరుగుతూ వుండేవి.

''తెయి మాసం పండుగలో మల్లారి ప్రత్యేక నాదస్వర వాదన, దేవదాసీల ప్రత్యేక నృత్యాంశాల అభినయం బ్రహ్మోత్సవం 27 రోజులు పాటు జరిగేది ఈ ఉత్సవంలో ఊరేగింపులో రథయాత్రకి ప్రత్యేక గుర్తింపు. ఇక్కడ చెప్పుకోదగ్గ విశేషమేమిటంటే రథం కదిలే ముందు

దేవతామూర్తికి సంప్రదాయ పూర్వకంగా దేవదాసీలు పువ్వులు సమర్పించడం. ఈ సమయంలో దేవదాసి తన తలమీద ఆరాధన సంబంధమైన ఒక తలపాగా ధరించి చాలా పవిత్రంగా వుండాలిట. ఈ సేవ అందించినందుకు దేవునికి చేసిన నైవేద్యంలో కొంత భాగం కుంకుమ విభూతిని స్వీకరిస్తుంది. ఈ అవకాశం అందరికీ లభ్యమయ్యేది కాదు. పుష్పాంజలి తరువాత ఖండగతి, నాటరాగంలో కూర్చిన తెర్. మల్లారి వాద్యం ఒక ప్రత్యేక లయ నాద్యం కాటుకాట్టి. సహకారంతో వాయించిన వెంటనే రథం కదులుతుంది. పెద్దమేళానికి చెందిన నాదస్వర బృందం యింత విద్యని ప్రతిభని ప్రదర్శిస్తే చిన్నమేళానికి సంబంధించిన నట్టువ మేళం నర్తకీమణులు, నట్టువనారులు పాడేవారు. అడేవారు. రథం దేవాలయం చుట్టూ భక్తకోటి నినాదాలతో ప్రదక్షిణ మొదలు పెడుతుంది. ప్రాకారం చుట్టూ ప్రయాణం కొన సాగిస్తుంది.

ఈ చుట్టులో మూడవ మూలం దగ్గరకు వచ్చేటప్పటికి రథం అక్కడ కొంత సేపు ఆగుతుంది. ఇక్కడ వేదఘోష, అభిషేకం జరుగుతూ వుంటే 'పల్లకి సేవా ప్రబంధం' ప్రదర్శించ బడుతుంది. దీనినే పల్లకి నాటకం అని కూడా అంటారు. ఈ ప్రక్రియలో శహాజీ ప్రబంధ కావ్యలక్షణాలని యక్షగాన నాటక విశేషాలని జోడించి ఒక ప్రత్యేకశైలిలో ఆరాధనా సేవగా తీర్చిదిద్దాడు. దాంతోపాటు శాస్త్రీయ సంగీతాన్ని వివిధ రాగాలలో సందర్భోచితంగా వాడుకు న్నాడు. దాని వలన నృత్త, నృత్య, నాట్య అంశాలకు తగిన సమన్వయం కుదిరింది. ప్రదర్శనా యోగ్యత అతి పవిత్ర స్థలమైన దేవాలయంలోనే దేవదాసీ ముఖంగా కల్పించాడు. ఈ పల్లకి సేవ తిరువారూరు దేవాలయంలో దాదాపు 200 సంవత్సరాల పాటు జరిగింది. ఈ వేడుకకి శహాజీ కొంత భూమిని కూడా ప్రదానం చేసినట్లు తెలుస్తూంది. శహాజీ త్యాగేశ భక్తుడు. అతని భక్తి సంగీత రచనలలో పల్లకి ప్రబంధాలు అత్యుత్తమ స్థాయికి చెంది అతని యొక్క మతసామరస్యాన్ని తెలియజేస్తున్నాయి. అంతే కాకుండా మానవతావాది. జాతి మత భేదాలను తృణీకరిం చాడు. హిందూమతాన్ని ఆదరించినప్పటికి యితర మతాల పట్ల అమితమైన గౌరవం గలవాడు. భావ ప్రకటనకి భాష ఆధారం మాత్రమే అనుకుని మరాఠీ మాతృభాష అయినప్ప టికి తన రచనలలో యెక్కువ భాగానికి తెలుగునే వాడుకున్నాడు తద్వారా తెలుగువారి ఆచార, వ్యవహారాలని ఆదరించాడు. ఈ తీయని భాషతోనే తన ఆరాధ్య దైవమైన త్యాగేశుని కొలిచాడు. దేవదాసీలచే కొలిపించాడు ఈ పల్లకి సేవతో.

విష్ణు పల్లకి సేవాప్రబంధ యక్షగానం, సాహిత్య పరంగా ఉన్నత స్థాయినే అందుకున్నా, ప్రదర్శించినట్లు తెలియడం లేదు. శివాలయంలో విష్ణుపల్లకిని మతపరంగా ఆలోచించినా ప్రయోగించడం అసమంజసమే అవుతుంది.

ఆచార్య పి.సాంబమూర్తి శంకర పల్లకి సేవా ప్రబంధంలోని సాహిత్యాన్ని పరిశీలించినపుడు ఆ సందర్భంలో విష్ణుపల్లకి సేవా ప్రబంధం కూడా వున్నట్లు బయట పడింది. ఈ 'శంకర పల్లకి' సాహిత్యాన్ని, నొటేషన్‌తో సంగీతాన్ని గ్రంథరూపంలో అందిస్తూ, విష్ణు పల్లకి సాహిత్యాన్ని మటుకు తెలుగులోను, తమిళంలోను ముద్రించారు. విష్ణుపల్లకిలో సంగీత పరంగా కొన్ని దరువులకి మాత్రమే రాగ తాళాలను పేర్కొన్నారు. మిగిలిన వాటిని ధీరసమీరే వలె పాడుకొన వలెను. అంటూ సూచించారు. అందువల్ల ఈ ప్రబంధ యక్షగానం ఎంత వరకు ప్రదర్శనా యోగ్యతను, కల్పించు కున్నదీ అన్న విషయం మాత్రం సందేహాత్మకమే. శంకర పల్లకి కేవలం దైవానికి అంకితమైన రచన. విష్ణు పల్లకి రచనా విధానంలో కొంత సభామర్యాదలు-సుకవిస్తుతి, కుకవినింద మొదలైన లౌకిక సంబంధిత విషయాలు-కనిపించడం వల్ల కొంత ప్రౌఢరచనగా భావించవచ్చు. భావప్రకటనలో అభిన యానికి. నృత్యానికి రెండూ సమ ఉజ్జీలె; దైవ సమక్షంలో వున్న రెండు దీపకళికలు దివ్యానంద డోలికలు.

# రామాయణంలో త్రిజట స్వప్నం

శ్రీమతి కొల్లిపాక విజయలక్ష్మి

రామాయణంలోని ఆదర్శపాత్రలలో రాక్షసస్త్రీలూ ఉన్నారు. నిజానికి రాక్షసులలో పురుషులకన్న స్త్రీలే ఉత్తములుగా కనిపిస్తున్నారు. పురుషులలో విభీషణుడు ఉత్తముడే. రావణునికి హితవు చెప్పి, అతని ఆగ్రహానికి గురి అయి, తన్నులు తిని, రాజ్యబహిష్కృతుడై, రాముని శరణుపొంది రామకార్యానికి తోడ్పడ్డాడు. ఇలాటి విభీషణుని కూతురు త్రిజట.

మానవులలో అయినా సరే, రాక్షసులలో అయినా సరే, ఒక కుటుంబంలోని వారైనా, ఒక్కతల్లి కడుపున బుట్టిన అన్న దమ్ములు, అక్కసెల్లెండ్రయినా సరే, ఎవరి మనస్తత్వం వారిది, ఎవరి స్వభావం వారిది. నలుగురు అన్నదమ్ములలో అందరూ ఒకే రీతిగా ఉంటారనే అవకాశంలేదు. ఎవరి పూర్వజన్మ సంస్కారం వారిది. కాని, ఏ పడవలోనో, రైళ్లలోనో ప్రయాణం చేసే మనుష్యుల్లాగ, ఒకచోట కలిసి, ఆయా పనులేవో ముగించుకొని కొత్తఅనుభవాలు సంస్కారాలు పొంది, తమ కాలం వచ్చే సరికి వెళ్లిపోతుంటారు. కనుక రావణ విభీషణులకు స్వభావ భేదం కనిపిస్తుంది. అందువలన విభీషణుని హితబోధనను రావణుడు వినలేదు విభీషణుడు రావణుని తమ్ముడైనా సత్త్వగుణ సంపన్నుడు. ఈ సత్త్వగుణం అతని కుమార్తె త్రిజటకు కూడ సంక్రమించింది.

రావణుడు తన తమ్ముడయిన విభీషణుని కుమార్తె గనుక త్రిజట విశ్వాసపాత్ర అనే భావంతో ఇతర రాక్షస స్త్రీలతోపాటు ఈమెను కూడ అశోక వనంలో బందీ అయిన సీతకు కాపలాగా నియోగించాడు. త్రిజట సహజంగ సత్త్వ గుణశాలిని గనుక ఇతర రాక్షస స్త్రీలలాగ ప్రవర్తించక దుఃఖిత అయిన సీతకు అనేక విధాల తోడ్పడి సమయానుకూలంగా ఉత్సాహం కలిగిస్తూ వచ్చింది. కనుక త్రిజటకూడ రామకార్యానికి తోడ్పడిన రాక్షసస్త్రీ అని మనం చెప్పుకోవాలి. త్రిజట పాత్రను విశ్లేషించే ముందు కొంత రామాయణ ఘటనలను తెలుపడం అవసరం.

రామలక్ష్మణులను వంచించి సీతను ఎత్తుకొని వచ్చిన రావణుడు దారిలో తనకు అడ్డం వచ్చిన జటాయువును హింసించి సీతతో గగన మార్గంలో లంక చేరాడు. అక్కడ సీతకు తన వైభవమంతా చూపి ప్రలోభింప జేయడానికి ప్రయత్నిస్తాడు. కాని సీత కన్నెత్తి అయినా చూడదు. అప్పుడు రావణుడు కోపించి

''తెరగొప్ప నప్పుడు త్రిజటాదులైన
తెరవల బిలిచి ధాత్రీపుత్రి జూపి
యెందు నేమరక మీరందరు గాచి
పొందుగా ననుబొంద బోధింపుడనుచు''

ఆజ్ఞాపించి, సీతను అశోకవనంలో చెరపెట్టాడు. కాని సీత వారిబోధలను ఏమాత్రమూ వినలేదు.

మరికొన్నాళ్లకు రావణుడే అలంకరించుకొని అత్యంత వైభవంతో స్వయంగా సీత ఉన్న అశోక వనానికి వెళ్లి ''మనుష్య మాత్రుడయిన రాముడు సముద్రందాటి లంకకు వచ్చి నిన్ను విడిపించడం అసాధ్యం కనుక నన్నంగీకరించి సకలరాజ్య భోగాలు అనుభవించు'' అని నొక్కి చెప్పాడు. కాని, పతివ్రతా మ తల్లి అయిన సీతమ్మతల్లి అతని మాటలన్నిటిని ఖండించి, ఆతనిని తిరస్కరించింది. రావణుడు కాలాగ్నిరుద్రుడయ్యాడు. జానకిని నరకబోయాడు. మండోదరి మంచి మాటలతో అతనిని వారించింది. అప్పుడు అతడు త్రిజటాదులను పిలిచి

''ప్రియ నయోక్తుల చేత బెదరించియైన
భయద చేష్టల నయిన బాధించియైన
మాస ద్వయంబున మగుడ నాసొమ్ము
చేసి. తెండిటు మీరు చేయలేకున్న
నంతటి మీద నియ్యబ్జాక్షి జంపి
యింతు లీ కండల నిందరు గొనుడు''

అని శాసించి పోతాడు.

అప్పుడా రాక్షస స్త్రీలు సీతను అనేక విధాల బెదరి బాధింపసాగినారు. సీత వారి భయతర్జనలకు తాళలేక మూర్ఛపోయి లేచి

''హా లక్ష్మణా! యంచు హా రామ! యంచు
హా! యత్త కౌసల్య యనుచు నెల్గెత్తి''

ఏడువసాగింది. అప్పుడు ఆ సీత సంతాపం చూడజాలక ఒకచోట పడుకొని నిద్రపోతున్న త్రిజట కొక కల పడింది. అప్పుడు ఆమె లేచివచ్చి ఆ స్వప్నవృత్తాంతం ఆ రాక్షస స్త్రీలకు ఇలా తెలియజేసింది:-

''రాము దేనుగు నెక్కిరా జూడ గంటి,
సౌమిత్రి భృత్యుడై చనుదేర గంటి,
ఆ మహాగజముపై నవనీతనూజ,
కోమలి నెక్కించుకొని పోవగంటి.
పట్టాభిషిక్తుడై బ్రహ్మాది సురలు,
గట్టిగా గొలువ రాఘవుడుండ గంటి,
కమనీయమగు పుష్పకము మీద నుండి,
భ్రమసి రావణు దుర్విపై గూల గంటి,
వనధిలోపల లంక వడగూల గంటి,
కనక పీఠంబుపై కారుణ్యమూర్తి,
యొనర విభీషణు డుండంగ గంటి.

రావణ మరణంబు రఘురాము జయము,
నే విధంబున సిద్ధ మిట దీన నింక,
నటు గాన మీరలీ యవని తనూజ,
పటు దుష్టబాధల భర్జింపవలదు''

అని చెప్పి కాపలా వున్న రాక్షస స్త్రీలందరిని అవతలికి పంపి వేసింది. పిదప సీత తన జీవితానికి రావణుడు పెట్టిన రెండు నెలల గడువును తలచుకొని దుఃఖిస్తూ, తన కేశపాశంతో ఉరిపోసుకొని ఆత్మహత్యకు పూనుకుంటుండ గా, ఆమెకు హనుమత్సందర్శనం, రామసందేశాకర్ణనం జరిగాయి.

అంటే, త్రిజటా స్వప్న ఫలానికి వెంటనే సూచనలు కనిపించాయన్నమాట. త్రిజట తన స్వప్న వృత్తాంతం సీతకు చెప్పిందో లేదో స్పష్టంగా తెలియడంలేదు. రాక్షస స్త్రీలకు మాత్రం చెప్పి, సీతను బాధించక తొలగిపొండని చెప్పినట్లుంది. ఈ రాక్షస స్త్రీల భాష సీతకు తెలిసిందో లేదో! హనుమంతుడే రామవృత్తాంతాన్ని సీతకు తెలిపేటప్పుడు

''వావరభాష గీర్వాణ భాషయును,
ఈ వాతి యెరుగునో యెరుగదో యనుచు,
మానవ భాషల మగువ కిట్లనియె''

అలాంటప్పుడు మానవస్త్రీకి రాక్షసభాష తెలుసునని యెలా చెప్పగలం? కనుక ఈ స్వప్నవృత్తాంతం సీతకు తెలిసి వుండదు. తెలిసి వుంటే కొంత ఊరట చెంది వుండేది. తెలిస్తే, వెంటనే రెండు నెలల గడువును తలపోసి యెందుకు తన కురులతో ఉరిపోసుకొనడానికి ప్రయత్నిస్తుంది? అయితే, త్రిజట స్వప్న వృత్తాంతం ఆమెకు ఊరట కలిగించకపో యినా, రాక్షస స్త్రీల బాధ తొలగించింది. హనుమత్సందర్శ నానికి వీలు కలిగించింది. ఆ దుఃఖ సమయంలో ఒక ఆశారేఖను వెలిగించిం దనవచ్చు.

ఈ స్వప్నం త్రిజటకే ఎందుకు రావాలి? ఇతరులకు రాగూడదా? అనే ప్రశ్న కలుగుతుంది. స్వప్నాలు భావ్యర్థ సూచకాలని మానవ జాతికి అనాదిగా వుంటున్న నమ్మకాన్ని త్రిజట స్వప్నం బలపరుస్తున్నది. సీతకు కావలి ఉన్న రాక్షసస్త్రీలలో త్రిజట రాజకుటుంబానికి చెందింది; సాత్త్విక స్వభావం గల విభీషణుని కుమార్తె. రాక్షస స్త్రీ అయినప్పటికీ మానవస్త్రీ అయిన సీతకు కలిగిన ఆపదకు ఆమెహృదయం తల్లడిల్లింది. సున్నితమైన మనస్సుకలది గనుక భావ్యర్థ సూచనను గ్రహింపగల హృదయపరిపాకం గలది. కనుక ఆమెకు ఈలాటి కల వచ్చిందని మనం భావించాలి. ఒక్క త్రిజటే కాదు, మండోదరి, కైకసి కూడ రావణునికి రానున్న కీడును ఊహించి హితబోధ చేసినవారే.

రామ రావణ యుద్ధం ఘోరం గా జరుగుతున్నది - ''రామరావణయో ర్యుద్ధం రామరావణయోరివ'' అన్నట్టు. ఆ సమయంలో త్రిజట మరొక మారు సీతకు ఊరట కలిగించి ధైర్యం చెప్పి కాపాడింది రావణుడు రామలక్ష్మణుల శిరస్సులు తెగిపడినట్టు మాయచేత కల్పించి తెగిపడిన ఆ శిరస్సులను పుష్పక విమానంపై తీసుకొని పోయి సీతకు చూపించవలసిందిగా, త్రిజటాది రాక్షసస్త్రీలను వినియోగి స్తాడు, వాటిని చూచి నిజమనుకొని సీత వాపోవసాగింది. త్రిజట కొంత సేపటికి వాటిలోని మాయను తెలుసుకొని, సీతకు తెలిపి ఓదార్చింది.

రావణ బాధిత అయి అశోకవనంలో చెరలో చిక్కి దుఃఖిస్తున్న సీతకు ఊరటగలిగించి ఆమె ఆశాబంధాన్ని నిలిపిన త్రిజట తన తండ్రి విభీషణుని లాగే రామకార్యానికి తోడ్పడింది. రాక్షసస్త్రీ సహజమైన క్రౌర్యాదులు ఈమెలో కనిపించవు.

# ఓరుగల్లులోని సంస్కృత విద్యా వైభవం

శ్రీ కోవెల సుప్రసన్నాచార్య

కాకతీయుల సీమలో ఆదికాలం నుంచీ, దేశభాషా సాహిత్యంతో బాటు సంస్కృత సాహిత్యం కూడా పోషింపబడుతూ వచ్చింది. భారతదేశాన్ని సమైక్యంగా భావించడానికీ, సాంస్కృతిక వినిమయానికీ ఆధారభూతమైన గీర్వాణభాష దేశంలోని అన్ని ప్రాంతాలలోనూ తన తన విలక్షణలతో వృద్ధి పొందుతూనే వున్నది. ఒక్కో ప్రాంతానికి ఒక్కొక్క విశిష్టత సంస్కృత భాషా సారస్వత సమృద్ధిలో ఉన్నదని భావించటం జరిగింది.

కాకతీయ సీమలో సంస్కృత విద్యాభివృద్ధికి సాక్ష్యాలు ఆ రాజ్యారంభం నుంచే గోచరిస్తూ వున్నాయి. అనాటి శాసనాలలో అనేకం మధుర కవితా సౌగంధ్యం కలవియే. ఈ శాసనాలలో ప్రశంసలు, అతిశయోక్తులు ప్రధానమే అయినా అవి సమకాలీన చరిత్రకు ఆధారంగా ఉన్నవి. అతి ప్రసిద్ధమైన సహస్రస్తంభ దేవాలయములో రుద్రదేవుని శాసనము ఒక చిన్న కావ్యమే. ఈ శాసనరచయిత రామేశ్వరదీక్షితుని పుత్రుడు, అద్వయామృతయతికి శిష్యుడైన అచింతేంద్రయతి. ఈయన కావ్యశైలి వైదర్భీ రీతిలో అత్యంత మధురంగా పరిళంగా ఉన్నది.

కాకతీయుల ధ్వజ చిహ్నమైన వరాహమూర్తిని శాసన ఆరంభంలో వర్ణించే శ్లోకం ఈయన కావ్యరచనాశక్తికి అద్దం పడుతుంది.

యస్యోత్తుంగ తరంగ తాడిత వియత్ప్రాలేయం జలం
పాదాంగుష్ఠ నఖాగ్రదఘ్న మభవద్భూమండలోద్ధారణే,
దంష్ట్రాకోటికుటీరకోటరగతం త్రైలోక్యమబ్బిందువత్
బ్రహ్మాండా ఇవ రోమకందనికరో వందే వరాహం హరిమ్.

ఈ శ్లోకం ఏ కావ్యానికైనా అలంకారంగా ఉండదగిందే. రుద్రదేవ ప్రభువును బ్రహ్మతోనూ, విష్ణువుతోనూ పోల్చే పద్యాలు మధ్యయుగ సంస్కృత కావ్య ధోరణికి పతాకలవంటివి.

సత్యాసక్త మనా నిరస్తనరక క్లేశశ్చ లక్ష్మ్యాశ్రయః
పృథ్వీభృద్యదనంత భోగినిలయః శశ్వ ద్ద్విజేంద్రప్రియః
దుష్టారిష్ట విమర్దన స్సుమనసా మభ్యర్థితార్థ ప్రదః
గోత్రప్రోద్ధరణో సుదర్శనకరో రుద్రః స్వయం కేశవః.

ఈ పద్యంలో సత్య, నరక, భోగి, అరిష్ట, సుదర్శనాది శబ్దాలకు కవికూర్చిన సుకుమారశ్లేష కవి చతురవాక్య ప్రౌఢిని వెల్లడిస్తున్నది. రుద్రదేవుని అశ్వాలు విష్ణుపదమని ఆకాశాన్ని గోరూపిణి అని భూమిని తాకటం లేదట. అవి ఎప్పుడూ నేలమీద నిలువక పరుగెత్తుతూనే ఉన్నవని తాత్పర్యం.

వెల్లంకి గంగాధర మంత్రి శాసనాలలో రుద్రదేవుని వర్ణించే పద్యం ఒకటి గంగాధరుని కవితాశక్తిని పట్టియిస్తుంది.

అగాధ హృదయే యస్య స్ఫటికాదపి నిర్మలే,
క్షీరాంబురాశి బుద్ధ్యాస్తే శ్రియాసహసదా హరిః

రుద్రదేవుని హృదయం స్ఫటికం కంటె నిర్మలమూ, సముద్రం వలె అగాథమూ. అందువల్ల దాన్ని క్షీరసముద్రమనే భావంతో లక్ష్మీదేవితో సహా నారాయణుడు ఆయన హృదయంలో నెలకొని ఉన్నాడట. ఈ పద్యంలో భ్రాంతిమదలంకారంతో బాటు రుద్రదేవుని భక్తితాత్పర్యాన్ని చిత్రించి ఈ కవి కాకతీయుల శివకేశవాభేద బుద్ధిని ప్రకటిస్తున్నాడు.

బెక్కల్లు శాసనాన్ని రచించిన కవి నాగదేవుడు. ఈయన శాసన ప్రారంభంలోనే రచనా వైదగ్ధ్యాన్ని ప్రకటిస్తున్నాడు. యజ్ఞ వరాహమూర్తి భూగోళాన్ని ఉద్ధరించినప్పుడు

భూమిః పద్మతి కేసరంతి గిరయః పత్రంతి దిగ్భిత్తయః
పాథోధిర్మకరందతి ప్రవితతో మేరుశ్చ కింజల్కతి,

పద్మతి, కేసరంతి, పత్రంతి మొదలైన నామధాతువుల కల్పనతో కవి తన ప్రౌఢకవితా మర్మజ్ఞతను శబ్దశాస్త్ర పారంగతత్వమును తెలుపుతున్నాడు.

బూదపురశాసనంలో కవి ఈశ్వరసూరి. వ్యాకరణ వేత్త. ఇతని తాత ఈశ్వరభట్టు. తండ్రి మయూరుడు కూడా ఆ కాలంలో ఉన్న గొప్ప విద్వాంసుడు, కవి. ఈయన తటాకాన్ని వర్ణిస్తూ దాన్ని పాణినీయంతో పోల్చాడు.

పద్ధాతు వృద్ధ పృథ్వాది సమాసాళీ సమన్వితః
నదీ పూరణ సంపూర్ణః పాణినీయమతే చ యః.

ఈ ధాతు, వృద్ధ, పృథ్వాది, సమాసాళి మొదలైన శబ్దాలు వ్యాకరణ సంజ్ఞలు. ఈశ్వర సూరి శాసనకవితలో చిత్రకవిత అంటే దంత్యములు లేని, కంఠ్యములు లేని పద్యాలు. గర్భ కవిత్వము కూడా కానవస్తుంది.

ఈ శాసనాలలో ఓరుగల్లు వర్ణన కూడా కనబడుతుంది.

దేశాంతరా దాగామినః పుమాంస
ప్సర్వాసు విద్యాస్వపి పారభాజః
శాస్త్రార్థ సందేహ నిరాసరీతిం
యస్మిన్ లభంతే శుక శారికాభ్యః

దేశదేశాల నుండి వచ్చే విద్వాంసులు తమ తమ శాస్త్రార్థ సందేహాలను ఓరుగల్లులోని శుక శారికల దగ్గర తీర్చుకుంటు న్నారట.

శాసనకర్తలలో కవి చక్రవర్తి, రామదేవుడు, బాలభారతి, విశ్వేశ్వర శివాచార్యుడు, విద్యనాచార్యుడు మొదలైన వారు గొప్ప కవితాశక్తిగలవారు. వారి శాసనాల ద్వారా ఈ విషయం ప్రస్ఫుటమవుతుంది.

అయితే ప్రతాపరుద్రుని కాలంలో ఒకకావ్యం శిలాశాసనంగా నిర్మితమయింది. ఇది శాసనాల చరిత్రలో, వాఙ్మయ చరిత్రలో అపూర్వమైన అంశం. ఈ కావ్యకర్త నృసింహర్షి. విశ్వేశ్వర శివాచార్యుని కుమారుడు. ఈయన ఋక్భాష్య రచించెనట. ఇది ఋగ్వేదానికి టీకవంటిది కావచ్చును. ఒకరోజులోనే ఎనిమిది సర్గలలో కాకతీయ చరిత్రను బుధజనప్రియంగా రచించినాడట. దశవిధ రూపకములు కూడా సమకూర్చినవాడు. ఈనాడు ఈయన రచన లేవీ లభించక పోయినా శాసనములలోని రచనల మూలముగా ఈయన ప్రతిభనూ, పాండిత్యాన్నీ అంచనా వేయవచ్చును.

ఇది ఒక నూతనమైన సిద్ధ దంపతుల ప్రణయాన్ని వర్ణించే అరవై రెండు శ్లోకాల కావ్యం. వీటిలో అరవై శార్దూల విక్రీడితాలు, రెండు స్రగ్ధరలు ఉన్నాయి. గంగాసైకతాలలో విహరించే ఈ దంపతులలో నాయికను ఒక మాయావియైన యక్షుడు అదృశ్యను చేస్తాడు. దానితో దుఃఖితుడైన సిద్ధుడు ఆమెతోడి పూర్వానుబంధాన్ని స్మరిస్తూ ఆవేదనను పొందు తాడు. మళ్ళీ చివరకు ఆ యక్షుడు వారికి పునస్సమాగమం కలుగజేస్తాడు. ఇదీ కావ్య వృత్తాంతం.

రచనా వైఖరిలో ఈ కావ్యం కాళిదాసు మేఘదూతాన్ని పోలివుంటుంది.

ఆదౌ యావకపంకపాటల మథో బింబీ ఫలాభం తతః
సద్యోలూన బహిష్ఫలాశ వికచ స్వర్ణారవిందోపమం,
పశ్చాదాసవ మత్త మాళవ వధూ గండస్థల ప్రక్రియం
బింబం చాంద్రమసం క్రమాద్విరహిణీవక్త్రోపమానం దధౌ.

ఉదయించే చంద్రబింబంలో క్రమంగా వచ్చే రంగుల మార్పును ఈ పద్యం చాలా ఉచితంగా వర్ణించింది. తొలుత అలచందల పిండివలె కించిదరుణ వర్ణముతో, తరువాత దొండపండు వన్నెతో, అది మారి మోదుగుపూల నడిమి బంగారు తామరవలె, మద్యమత్తయైన మాళవ వధువు గండస్థలంలాగా, చివరకు విరహిణీవదనం లాగా తెల్లగా చంద్రబింబం రూపు కట్టిందని కవి వర్ణించాడు.

నాయిక ద్వారా సందేశం చేరింది, రాత్రి రహస్యంగా త్రాడు సహాయంతో అంతఃపురానికి రమ్మని. సిద్ధునికి అప్పటినుంచీ అంతా అదే ఆలోచన. తానేవిధంగా ఆమెదగ్గ రకు చేరేదీ, మాటాడేదీ, దర్శించేదీ భావన చేస్తూ కాలం గడుపుతాడు. చివరకు అర్ధరాత్రి దాకా గడిపి రహస్యంగా అంతఃపురంలోకి ప్రవేశిస్తున్నప్పుడు.

అనిద్రాసమయం కథం కథమపి స్థిత్వార్ధరాత్రే వ్రజన్
నిశ్శబ్దం ప్రపదేన మందనిహిత శ్వాసః ప్రదీపాత్త్రసన్,
జిహ్మైకాంత పథః తృణేపి చరితే శంకాం దధానోన్యథా
ఛాయాం స్వామపి వీక్ష్య వేపిత వపుః ప్రాప్తశ్శనైః చోరవత్.

గడ్డిపోచ కదిలినా అనుమానమే తన నీడ తాను చూచుకున్నా తాను వణకి పోతున్నాడు. ఎంత సహజంగా ఉన్నదీ వర్ణన. ప్రేమార్తులు పడే అవస్థలను ఎంత ఔచిత్య మహితంగా వర్ణించిందీ పద్యం.

ఈ విధంగా సిద్ధదంపతుల ప్రణయాన్ని వర్ణించే ఈ కావ్యం కాకతీయ యుగంలో వెలువడ్డ స్వతంత్రకావ్యం. సుకుమార పదయోజన కలిగి ప్రసన్నశైలిగల ఈ కావ్యం ఎవరికైనా ఆమోదాన్ని కలిగించే రచన. ఈ కావ్యంద్వారా నృసింహకవి సంస్కృత వాఙ్మయంలో విలక్షణ స్థానాన్ని సంపాదించుకున్నాడు.

ఈ కాలంలో శాసనాల్లో కనిపించే కవులు కాక - మరెందరో సంస్కృత కావ్యకరణ దక్షులు విలసిల్లారు. యుగ చైతన్యాకా శాన్ని ఆవరించిన మహాపురుషుడు ఆంధ్ర కర్ణాట భాషా సారస్వతాలలో ప్రసిద్ధుడూ అయిన పాల్కురికి సోమనా థుడూ సంస్కృతంలో అనేకరచనలు చేసినట్లుగా తెలుస్తు న్నది. సోమనాథ భాష్యము, రుద్రభాష్యమూ - ఈ రెండూ సిద్ధాంత గ్రంథాలు. స్తోత్ర గ్రంథాలలో బసవోదాహరణము సంస్కృత వాఙ్మయంలో తెలుగు వాఙ్మయంలో వలె ప్రథమ

లక్ష్యరచన ఉదాహరణ ప్రక్రియకు. వృషభాష్టకము, బసవ పంచకము కూడా సోమనాథుని ఇతర సంస్కృత రచనలు. బసవోదాహరణంలోని సంబోధన విభక్తి పద్యం ఇది:

**మూలాధార వికస్వరాంబుజవనీ మధ్య స్ఫురద్వీచికా**
**యాతాయాత వినోదపేశలమతే! చిద్వ్యోమ శీతద్యుతే!**
**సంసారార్ణవ కర్ణధార! కృపయా మాం పాలయ ప్రత్యహం!**
**భాండాగారధురంధరేశ! బసవామాత్యేశ చూడామణే!**

ఈ కాలంలోనే కొలని గణపతి దేవుడు శ్లోకవార్తికానికి రాజరుద్రీయమనే వ్యాఖ్య రచించినట్లు తెలుస్తున్నది

గణపతిదేవుని గణసాహిణియైన జాయపసేనాని సాహితీ సమరాంగణాలలో అసమాన ప్రజ్ఞానిధి ఆయన సంగీత నాట్య సాహిత్యరంగాలలో సుప్రసిద్ధుడు. ఆయన రచించిన గ్రంథాలలో నృత్తరత్నావళి ఇప్పుడు అఖిల భారతకీర్తి గడించిన లక్షణ గ్రంథం. ఈ గ్రంథం ఆధారంగానే రామప్పదేవాలయంలో నృత్యభంగిమలు తీర్చి దిద్దించినాడని లోకంలో ప్రసిద్ధి.

నృత్తరత్నావళి మార్గ దేశి నృత్తాలను వివరంగా వివేచించింది. దీనిలో వర్ణితాలైన దేశినృత్తాలలో పేరణి, ప్రేంఖణం, రాసకం, చర్చరి, దండరాసకం, శివప్రియం, చిందు, కందుకం, ఖాండికం, ఘంటిసణి, చరణము, బహురూపము, కోలాటం ప్రముఖమైనవి ఎనిమిది అధ్యాయాల ఈ గ్రంథంలోని నృత్త విద్యా వ్యాఖ్యానం భరతుని నాట్యశాస్త్రం తోనూ, దాని వ్యాఖ్యానమైన అభినవగుప్తుల అభినవ భారతితోనూ సంవదించుతుంది.

**క్షితౌ రత్నచ్ఛాయాఫలన ముదకే వీచిలలితం**
**శిఖిన్యర్చిః ప్రేంఖాసహజగతి వైచిత్ర్యమనిలే,**
**తటిత్క్రీడా వ్యోమ్నీత్యకృత సుభగః పంచసుపదః**
**ప్రవిష్టో భూతేషు ప్రభవతి హి నృత్తస్యమహిమా.**

భూమి మీద రత్నకాంతుల తారల్యం, నీటిలో తరంగాల కదలికా, అగ్నిలో జ్వాలల ఊగులాట, వాయువు ఎపుడూ కదిలే రీతి, ఆకాశంలో శంపానృత్యము ఇలా పంచభూతాల్లో సుందరమైన నృత్తవిద్య అంతర్భవించి యున్నది. ఎంత విశ్వజనీన భావన యిది!

కాకతీయ యుగంలో ప్రతాపరుద్రదేవుని కాలం సంస్కృతాంధ్ర సాహిత్యాలకు వసంతోదయం. ఆ మహాప్రభువు స్వయంగా గొప్పకవి, రూపకకర్త కూడా. ఆ విద్వత్కవి ప్రభువు సంస్కృతంలో నీతి సారమును, ఉష, రాగోదయము, యయాతి చరిత్రము అనునాటకాలను రచించాడు. ఈయనకు విద్యావిభూషణుడని బిరుదముండేది. ఆయన కాలంలో విలసిల్లిన ఉత్తమ కవులలో విద్యానాథుడు, అగస్త్యుడు, శాకల్యమల్లన ముఖ్యులు. అగస్త్యుడు, విద్యానాథుడు ఇద్దరు కారనీ ఒకరే ననీ వాదం కూడా ఉన్నది. అయితే విద్యానాథుడు ప్రతాపరుద్ర యశోభూషణమన్న లక్షణ గ్రంథం రచించినవాడు కాగా, అగస్త్యుడు బాలభారతము, నలకీర్తికౌముది, కృష్ణచరితము మొదలైన డెబ్బదినాలుగు గ్రంథాలు రచించిన మహాపురుషుడు. గంగాదేవి మధురా విజయములో ఇట్లా పేర్కొన్నది. ''చతుస్సప్తతి కావ్యోక్తి వ్యక్త వైదుష్య సంపదే, అగస్త్యాయ జయత్యస్మిన్ స్పృహయేత్కో న కోవిదః''. ఈయన బాలభారతానికి తిమ్మరుసు మంత్రి వ్యాఖ్యానం రాశాడు. శాకల్యమల్లన ఉదాత్తరాఘవమనే నాటకాన్నీ, నిరోష్ఠ్యరామాయణ కావ్యాన్నీ రచించాడు. ఈయన తరువాతి కాలంనాటి అవధానవిద్యకు ఆరంభకుడట. ప్రతాపరుద్రుని ఆస్థానంలో గుండయభట్టు అనే విద్వాంసుడు శ్రీహర్షుని 'ఖండన ఖండ ఖాద్యము'నకు వ్యాఖ్యానం రచించాడు. సకల శాస్త్రవేత్త వీరభల్లట దేశికుడు ఈ ఆస్థానంలోని వాడే.

ఇంకా ప్రతాపరుద్రుని ఆస్థానంలోని సంస్కృత కవులలో ముఖ్యులు అగస్త్యుని మేనల్లుడు సౌగంధికాహరణ నాటకకర్త విశ్వనాథుడు, మహాభారతాన్ని నాటకరూపంగా రచించిన గంగాధరకవి, కాదంబరీ నాటకకర్త నరసింహకవి, జినేంద్ర కళ్యాణాభ్యుదయము రచించిన అప్పయార్యుడు. ఇలా ఎందరినో పేర్కొనవచ్చును.

వినుకొండ వల్లభరాయని క్రీడాభిరామానికి మూలమైన సంస్కృత ప్రేమాభిరామాన్ని రచించిన రావిపాటి త్రిపురాంతకుడు ఈకాలంవాడే. ఈ గ్రంథంలో అనువాదాన్ని బట్టి ఊహించితే దీనిలో కాకతీయుల రాజధాని ఓరుగల్లును వర్ణించడమే కాక నాటి సామాజిక ఆర్థిక పరిస్థితులకు ఆధారాలు కూడా లభిస్తవి

ప్రతాపరుద్రుని కాలంలోని సంస్కృత కవులలో విద్యానాథుడు నాయకమణి వంటివాడు. ఆయన రచించిన ప్రతాపరుద్ర యశోభూషణం, యశోభూషణ కావ్యశాఖకు ప్రథమ గ్రంథం. అలంకార శాస్త్ర గ్రంథంలో లక్ష్యాలన్నీ ఒకానొక వ్యక్తిని గూర్చి రచించడమే. ఇదే దీని ప్రత్యేకత. ఈ గ్రంథం అలంకార శాస్త్రవిద్యార్థులకు ఈనాటికీ ప్రాథమికమైన అధ్యేయ గ్రంథంగా నిలచి ఉన్నది. మమ్మటుని కావ్యప్రకాశం ఎంత ప్రచురంగా పఠన పాఠనాలలో ఉన్నదో విద్యానాథుని గ్రంథమూ అట్లాగే నిలచి ఉన్నది

విద్యానాథుని కవిత మధురపద సంయోజనకు పరమస్థానము. ధారాశుద్ధికి నిదర్శనం. సౌకుమార్యానికి పట్టంకట్టిన రచన ఆనాటి ఓరుగల్లు నగరాన్ని వర్ణించే ఒక పద్యం.

**లక్ష్మీనివాస గృహమిత్యఖిలా నరేంద్రాః**
**శౌర్యాతి భూమి ఖనిరిత్యరి వీర వర్గాః,**
**విద్యావిహార పదవీతి చ లబ్ధవర్ణాః**
**శ్రీ కాకతీంద్ర నగరీ మనిశం స్తువంతి.**

సంపద చేత, వీర్యసంపదచేత, విద్యాసంపద చేత ఒక్కొక్కరికీ ఒక్కోవిధంగా స్ఫురిస్తూఉన్నది ఆ నగరం.

చంద్రునిలోని మచ్చను గూర్చి కవి యిట్లా భావన చేస్తున్నాడు. లోకంలో అందరూ చంద్రుని మచ్చ మందర పర్వతంలోని నల్లనిరాళ్ళు ఒరిపిడికి కలిగిన నల్లని మచ్చఅనీ, లేడి అనీ అనుకుంటారు. కానీ అది ప్రతాపరుద్ర దేవుని కీర్తిసంపద వల్ల జయింపబడి అతని చిహ్నమైన వరాహము ద్రను వక్షస్థలం మీద ధరించడం వల్లనే అని కల్పన. ఆ శ్లోకం యిది.

**మంథానాచల మూలమేచక శిలా సంఘట్టన శ్యామికా**
**కారం యత్తుహినద్యుతౌ స్ఫురతి తత్సారంగ మాచక్షతే,**
**మన్యే నన్విహ వీరరుద్ర నృపతేః కీర్తి శ్రియా నిర్జితః**
**తన్ముద్రాంక వరాహమిందు రురసా బిభ్ర త్సముజ్జృంభతే.**

కవితా సౌందర్యానికీ, విద్యాశాస్త్ర వాల్లభ్యానికీ విద్యానాథుని రచన మంతా ఉదాహరణయే కావచ్చు.

మధ్యయుగాల దాక్షిణాత్య తాత్త్విక సాంస్కృతిక సారస్వతలోకానికే మధ్యందిన భాస్కరుని వంటి వాడు విద్యారణ్యుడు. విద్యారణ్యుడు విదేశీయుల దురాక్రమణకు గురై మూలచ్ఛేదం పొందుతూవున్న భారతీయ సభ్యతకు పునరుజ్జీవనం కల్పించిన మహామనీషి.

శ్రీమతి మాయణుల పుత్రులు మాధవ, సాయణ, భోగనాథులు. వీరిలో మాధవులే తరువాత ఆశ్రమ స్వీకారం చేసి విద్యారణ్యులు అయ్యారు విద్యారణ్యులు, మాధవుడూ వేరువేరు వ్యక్తులని వాదం కూడా ఉన్నది. మాధవ సాయణులు ప్రతాపరుద్రుని కాలంలో ఓరుగల్లులో ఉండేవారనీ కాకతీయ సామ్రాజ్య పతనం తరువాత అక్కడి అధికార స్థానాలలో ఉన్న హరిహర బుక్కరాయలను ప్రేరేపించి విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపింపజేశారనీ స్థూల వృత్తాంతం. విద్యారణ్యులకు సంబంధించిన అనేకాంశాలు వివాదగ్రస్తాలే ఇప్పటికీ. అయితే అహోబలపతి వర్ణన ఇలా ఉంది.

'వేదానాం భాష్యకర్తా వివిధ ముని వచో ధాతు వృత్తేర్విధాతా ప్రోద్యద్విద్యానగర్యా హరి హర నృపతే స్సార్వభౌమత్వదాయీ విద్యారణ్యో(గగణ్యః''. అని.

చతుర్వేదాలకు సాయణుడు భాష్యంరచించాడు. ఇది అపూర్వమూ అసాధారణమైన కార్యం. శ్రీవిద్యారణ్యుల ప్రేరణతో పండిత మండలి సహాయంతో ఈ కార్యం చక్కగా కొనసాగింది. సాయణుల ఇతర రచనలలో ధాతువృత్తి, పురుషార్థ సుధానిధి, ఆయుర్వేద సుధానిధి, యజ్ఞతంత్ర సుధానిధి, ప్రాయశ్చిత్త సుధానిధి, పేర్కొనదగినవి. వీటిలో ధాతువృత్తికి మాధవీయ ధాతువృత్తి అనిపేరు. అలాగే మాధవాచార్యుడు పరాశరమాధవీయము, జైమినీయ న్యాయ మాల, వైయాసిక న్యాయమాల, వేదాంత పంచదశి, జీవన్ముక్తి వివేకం, వివరణ ప్రమేయం, కాలమాధవీయం, సంగీత సారం మొదలైన అనేక గ్రంథాలు రచించారు. జగద్గురువులైన ఆది శంకరుల జీవనాన్ని శంకరవిజయంగా రచించారు సూత సంహిత వ్యాఖ్య కూడా మాధవరచనయే. దీనినే విద్యారణ్యుల రచనగా తరువాతి కాలం పేర్కొన్నది వీటన్నింటి కన్నా ముఖ్యమైంది సర్వదర్శన సంగ్రహం-నాడు వ్యాప్తిలో ఉన్న తాత్త్విక దర్శనాల సంగ్రహవివరణం.

అయితే మరికొన్ని భోగనాథుని రచనలు కూడా ఉన్నవి. ఆయన తరువాతి కాలంలో శృంగేరిలో పీఠాధిపతులై భారతీతీర్థ నామంతో వ్యవహరించాడు. ఆయనదగ్గరే విద్యారణ్యుడు తరువాత పీఠాధిపత్యం స్వీకరించినట్లుగా తెలుస్తున్నది.

తరువాత ఆధునిక కాలం సమీపిస్తూవుండగా సంస్కృత కావ్యకృషికి సంబంధించిన ఆధారాలు లభ్యమవుతున్నాయి. వీటిని బట్టి మధ్య యుగాలలో ఈ ప్రాంతంలో సంస్కృత భాషా వాఙ్మయ కృషి అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నదనే భావించవచ్చు.

పరశురామపంతుల లింగమూర్తి తెలుగులో సీతారామాంజనేయ సంపాదకర్తగా ప్రసిద్ధుడు. ఈయోగశాస్త్ర కావ్యరచన పోతన్నకవితకు దీటైంది. ఈ వంశంలో ఐదవతరంవాడు అనంతరామయ్య సీతావిజయమనే చంపూకావ్యాన్ని సంస్కృతంలో రచించాడు. ఈ గ్రంథం శతకంఠ రామాయణమే. ఈ రచన మూడుస్తబకాలు మాత్రమే దొరుకుతున్నది. ఈ కవి 19వ శతాబ్దం మధ్య భాగంలో జీవించి యుండవచ్చు.

ఇంచుమించు ఇదే కాలానికి చెందిన మోతుకూరి పండరినాథరావు తెలుగులో అధ్యాత్మ వాల్మీకి రామాయణాల సమ్మేళనంగా రామాయణం రచించడమేగాక, సంస్కృతం

లానూ రోమకథాకల్పలత అనే కావ్యం రచించినట్లు తెలుస్తున్నది. ఇది యిప్పుడు అలభ్యమే.

ఈ శతాబ్దారంభంలో ఈ సీమలో ప్రవర్తిల్లిన సంస్కృత విద్వాంసులలో అమరవాది నారాయణాచార్యులు, కోయిల్ కందాడై రంగాచార్యులు, ముదిగొండ వీరేశలింగ శాస్త్రి అమరవాది వెంకట నరసింహాచార్యులు మొదలైనవారు ప్రముఖులు. ముదిగొండ శంకరశాస్త్రి, మల్లావఝ్ఝల సుబ్బరామ శాస్త్రి మొదలైనవారు ఆ సంప్రదాయాన్ని కొనసాగిస్తూ వున్నవారు.

అమరవాది నారాయణాచార్యులు ప్రతాపరుద్రయశోభూషణంలాగా రామానుజయశోభూషణ మన్న లక్షణ గ్రంథము, కూరనాథుల సుదర్శన శతకానికి వ్యాఖ్యానమూ రచించినట్లు తెలుస్తున్నది.

కోయిల్ కందాడై రంగాచార్యులు వేదాంత శాస్త్ర హృదయము, వేదాంత పంచవింశతి, గీతార్థ సంగ్రహము మొదలైన తాత్త్విక రచనలు రచించినారు

ఓరుగల్లు మండల సంస్కృత భారతీ ప్రకాశకులలో ఒద్దిరాజు సీతారామ చంద్రరావు, రాఘవరంగారావు సోదరులు చాలా ముఖ్యులు. వీరిరువురు అష్టాధ్యాయికి టీక రచించారు. మిగిలిన రచనల్లో ఉత్సవానందభాణమనే రచన ముఖ్యమైంది.

అమరవాది నారాయణాచార్యుల వారి కుమారులు వెంకట నరసింహాచార్యులు సంస్కృతంలో అనేక గద్యపద్య కావ్యాలను రచించిన మనీషి. యదువీరగద్య, యాదగిరి లక్ష్మీ నృసింహ పంచాశత్, కురంగీ పంచక వ్యాఖ్య, గోదాగాథా వ్యాఖ్య ప్రచురిత రచనలు. అప్రచురిత రచనలలో అనేకస్తోత్రాలు ధనంజయ విజయనాటకము, కవిజన రంజన భాణము, ప్రచండ భార్గవ వ్యాయోగము ప్రముఖమైనవి వారి కావ్యాల్లో 'ఆముక్తమాల్యదమ్' అన్నది మిక్కిలి ప్రసిద్ధమైంది.

ఈ రచనాధోరణి తెలుగు కావ్యరీతులతో ద్రావిడ ప్రబంధాల సౌందర్యంతో సంస్కృత సంప్రదాయంలో రూపొందిన రచన.

వియద్గంగా పంగూపరి పరిణతా పావనజితా
కి మస్మిన్ జన్మాంధే భువి నయన లాభః ఫలమయః,
అయత్నోపస్థాయీ ప్రభవతి హి మూర్తే వచనతా
సతామావిర్భావః స్థగయతి ప్రమోదం వితనుతే.

కథం కాలో నేయః కథమహమితో యామి స్వగృహం
కథం గోదే వేదశ్రుతి విహిత గాథే కురు దయాం
అయి శ్రీమత్యంబే తవపతి రథూద్రంగ రసికః
వయం దూరీభూతాః కథయ కథమేత త్ప్రభవతి.

విశదతాత్పర్యమైన ఈ రచన గ్రంథం అంతా ఆకర్షకంగా రూపొందింది. నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు ఉభయ వేదాంత విద్వాంసులు కవిశాబ్దిక కేసరిగా ప్రసిద్ధులు. వారు వ్యాసాలు, ఉపనిషత్ భాష్యాలు వివరణలే కాక ద్రావిడ దివ్య ప్రబంధంలోని కొన్నికొన్ని ఘట్టాలకు మధురమైన అనువాదం చేశారు.

వర్తమాన కాలంలో సంస్కృత కవితా జగత్తులో అఖిలభారత ప్రతిష్ఠనార్జించినకవి శ్రీ భాష్యం విజయసారథి. వీరు సుమారు యాభై కవితా గ్రంథాలు రచించినారు. అనేక ప్రక్రియలలో వీరి రచన సాగింది. ఛందస్సులో అనేక ప్రయోగాలు చేశారు. వీరి మందాకినీ కావ్యం మధురోక్తి గాంభీర్యం చేత, అర్థప్రౌఢిమ చేత, అక్షరరమ్యత చేత ప్రఖ్యాతిని పొందింది. కాళిదాస భవభూతుల తారతమ్యాన్ని వివేచిస్తూ విజయసారథి, ఇలా వ్యాఖ్యానించారు

సమస్తం జగదారామం కాళిదాసో Z వలోకతే,
జీర్ణారణ్యం జగత్సర్వం భవభూతి రుదీక్షతే.

విజయ సారథి కవిత్వంలో ఆధునిక జీవన పరిస్థితుల వ్యాఖ్యానం, విచారణ కనిపిస్తవి.

దారిద్ర్యదుఃఖసంతప్తే హృదయే శ్రమ జీవినామ్,
సంధుక్షితా విభజ్యంతే నిత్యం కోట్యగ్నిపర్వతాః.
దరిద్రాణా మతిమ్లాన దృక్కోణా శ్రుబిందుతః,
ఏకైకా జ్వలన జ్వాలా దగ్ధు మాయాతి వంచకాన్.

ఈ కవి రచనల్లో మూడు ఉదాహరణాలూ, ఎన్నో సుప్రభాతాలూ ఉన్నాయి. సంప్రదాయ స్తోత్ర రచనతో బాటు ఆధునిక జాతీయతా స్ఫూర్తిగల రచనలు అనేకం ఉన్నాయి. విజయసారథి రచన ఒకచోట సరళంగా, సుకుమారంగా, మధురంగా ఉంటే, మరొకచోట ప్రౌఢంగా పాండిత్యపూర్ణంగా, గూఢభావపుష్టితో ప్రకాశిస్తూ వుంటుంది.

ఈ విధంగా ఓరుగల్లులోని సంస్కృత సారస్వత విద్యావైభవాన్ని దర్శిస్తే ఈ గీర్వాణ విద్యారణ్యం వైయాకరణ సింహాలతోనూ, ఆలంకారిక దిగ్గజాలతోనూ, వేదాంత వేత్తలైన హంసలతోనూ, మధురమధుర కావ్యకరణ దక్షులైన కవివసన్తులతో వ్యాప్తమై స్పృహణీయంగా ఉన్నట్లు తెలియవస్తుంది.

# కన్నడకవి లక్ష్మీశుని కృష్ణచరితామృతం

శ్రీ ఇరిగేపల్లి ముద్దప్ప

కన్నడ సాహిత్యమున, లక్ష్మీశకవి రచించిన, జైమినిభారత మునకుగల ప్రాశస్త్యము మరి యే యితర ప్రాచీన సాహిత్యగ్రంథమునకును లేదనుట అతిశయోక్తికాదు. ఇది కన్నడ ప్రజల ఆదరాభిమానములకు, అభిరుచులకు, నిదర్శ నము. లక్ష్మీశకవి, అనన్యసామాన్యమైన ప్రతిభా విశేషములకు దర్పణము. పండితులేగాక, పామరులును, దీని సారస్యము నాస్వాదించి, ఆనందించి రనుటలో విద్ధారము లేదు. తెలుగు సాహిత్యమున నాదసౌందర్యమునకు నన్నయ భట్టార కునివలె, కన్నడమున లక్ష్మీశకవి నాదసౌందర్యమునకు ప్రసిద్ధుడు. ఇతనికి 'నాదలోల' అను బిరుదు కలదు. లక్ష్మీశుడు, జైమిని భారతమును, వార్ధకషట్పదులలో రచిం చెను. ఇతని ప్రతిషట్పదియు, ఒకరకమగు ఝుంకారముతో, సాగిపోవును.

జైమిని భారతమునందలి, పెక్కుకథలు, కన్నడ సాహిత్య మున, నాటకములుగా వ్రాయబడి, ప్రదర్శింపబడు చున్నవి. మరికొన్ని హరికథలుగా కీర్తింపబడుచున్నవి. కొన్ని బుఱ్ఱక థలుగా గానము చేయబడుచున్నవి. ఉదాహరణమునకు లవకుశ, తామ్రధ్వజ, మయూరధ్వజ నాటకములు; సుధ న్వుని కాళగము, బభ్రువాహనార్జునుల యుద్ధము, ప్రమీలార్జు నీయము మున్నగునవి. ఇవి కన్నడిగుల కత్యంత ప్రీతి పాత్రములైనవి.

కన్నడ జైమిని భారతమును, చదివి అర్థము చెప్పగలిగిన వాడే, సరియగు విద్వాంసుడను విశ్వాసము నేటికిని కన్నడిగులందు గలదు. దీనిని చదివి, వివరించి చెప్పగల పండితునకు, ఏ గ్రామమునందైనను గౌరవాదరములకు కొరతలేదు. సాధారణముగా, జైమిని భారతములేని కన్నడ గృహముకాని, లక్ష్మీశకవినో, ఆతని కావ్యమునో ప్రస్తావింపని విద్వత్సభలుగాని అరుదు. తెలుగువారికి, పోతన భాగవత మెట్లో, కన్నడిగులకు జైమిని భారత మట్లని చెప్పవచ్చును. వ్యాస భారతమున భిన్నభిన్న ప్రవృత్తులు కలిగిన పాత్రపోష ణము జరిగినది. రాజ్యకాంక్షవలన ఈర్ష్యాద్వేషాదులచే పరస్పర నాశనముగోరి, యిరువురు శత్రువుల మధ్య యుద్ధము జరుగును. జైమినిభారతము నందట్లుగాక అన్ని పాత్రలు సాధారణముగ ఒకే ధ్యేయమును గలిగినవియై యుండి పోరు సల్పెదరు. ఇందు నాయక ప్రతినాయకుల వింగడింపు లేదు. ఈర్ష్యాద్వేషాదులకు తావులేదు. కృష్ణదర్శ నార్థమే; కృష్ణాను గ్రహము పొందుటకే యుద్ధములు చేయుదురు. ఇచట ధర్మవిహితమైన యుద్ధము జరుగును. గెలుపోటములతోకాక కృష్ణదర్శనముతో యిరువురును సఖ్యము చేసికొందురు.

ఉపలబ్దమగు కన్నడ జైమిని భారతమున, అశ్వమేధకథ మాత్రమే ఉన్నది. సంస్కృతమూలమునందును, ఇది, ఒక్కపర్వము మాత్రమే గలదు. లక్ష్మీశకవికి అశ్వమేధపర్వ కథాకథనము కేవల మొక సాకు మాత్రమే. ఇందు సర్వత్ర, కృష్ణమహిమ, కృష్ణభక్తుల మహిమ కనబడును. ఇందలి, హంసధ్వజ, సుధన్వ, తామ్రధ్వజ, వీరవర్మాది మహావీరులు, గొప్పకృష్ణభక్తులు. వారు, అర్జునునితో యుద్ధము చేయుట కూడ, కృష్ణసందర్శనార్థమే. ఇట్టి కృష్ణభక్తులను జయించుట సులభముకాదు. ఎప్పుడైనను అహంకరించి కృష్ణుని మరచిన ప్పుడు, కష్టములు సంభవించుట; ఆతనిని స్మరించి అనుగ్రహము పొందినపుడు, ఆ కష్టములు తొలగిపోవుట అనునవి, ఇందడుగడుగున కనబడుచుండును. ఒక్కమా టలో చెప్పవలెనన్న, కృష్ణ మాహాత్మ్యముతో తెగిన శిరస్సుల నతికించి, పునర్జీవితులను చేయగలమను విశ్వాసము, ఇందు నిరూపింపబడినది.

జైమిని భారతమును, ఒక కథాకావ్య మన వచ్చును. ఇందలి కథలన్నియు, ఒకే ధ్యేయము కలవియైనను, వినువు జనింపని విధముగ కూర్పబడినవి. ఇందు (1) యౌవనా శ్వుడు (2) అనుసాళ్వుడు (3) నీలధ్వజుడు (4) హంసధ్వజుడు (5) సుధన్వుడు (6) ప్రమీలార్జునీయం (7) బభ్రువాహనుడు (8) సీతాపరిత్యాగము (9) మయూర ధ్వజుడు (10)చంద్రహాసుడు మున్నగు పెద్దకథలును, పండ్రెండు చిన్న కథలును కలిసి మొత్తము ఇరువదిరెండు కథలు గలవు. వీనియందు లక్ష్మీశకవి తన కథాకథన కౌశలమును నిరుపమానముగా ప్రదర్శించెను. ఈ గ్రంథము యొక్క ప్రాశస్త్యమునకు ఈ కథాగుచ్ఛములును తోడ్పడిన వని చెప్పవచ్చును.

లక్ష్మీశకవి-కాలమునుగురించి, పెక్కువాదములు గలవు. కవి, తానుగా, తనకాలమునుగూర్చి, కావ్యమున పేర్కొన లేదు ఇప్పటికి లభించిన కొన్ని ఆధారములనుబట్టి క్రీ.శ.1520-1600 మధ్యకాలమున లక్ష్మీశుడు జీవించియుం డునని, పెక్కుమంది అభిప్రాయపడుచున్నారు. అట్లయి నచో నితడు శ్రీకృష్ణదేవరాయల కాలమున, ఉండియుండవ చ్చునని ఊహింపనచ్చును.

కావ్యపీఠికనుబట్టియు, ఇతర సంధ్యంతపద్యములను బ యు, లక్ష్మీశుడు దేవపురములోని లక్ష్మీరమణస్వామి భ డని తెలియుచున్నది. జానపదుల వ్యవహారమును బ యు, దేవనూరు స్థలమాహాత్మ్యమును బట్టియు, కర్ణా ట రాష్ట్రమందలి, హాసనజిల్లా, అరసికెరె తాలూకాలోని, దేవనూరు, లక్ష్మీశకవి నివాసమైన దేవపురమై యుండునని చెప్పవచ్చును గుల్బర్గా పరిసరములందున్న, సురపురము లక్ష్మీశుడు పేర్కొనిన దేవపురమైయుండునని, కొందరభిప్రా యపడిరి. పై రెండూళ్ళ యందును, లక్ష్మీపతి ఆలయము లుండుట, గమనింపదగినది. కాని, దేవనూరులోని లక్ష్మీరమ ణస్వామివారి పూజాసమయమున నేటికిని, కన్నడ జైమిని భారతములోని స్తోత్రములనే పఠించుచుందురట.

లక్ష్మీశకవికి 'కర్ణాటకవి చూతవన చైత్ర' అను బిరుదము కలదు. దీనినే 'కర్ణాటకవి చైత్రవన చూత' అని కొందరు పేర్కొనిరి. మొదటిదానికి కవులను చూతవనమునకు చైత్రమువంటివా'డని యర్థము. రెండవదానికి కవులను చైత్రవనమున చూతమువంటివా డని యర్థము. కవులనెడి, చూతవనమును శోభింపజేయు చైత్రమువంటి వాడనుట కంటె, కవులనెడి చైత్రవనమున విలసిల్లిన చూతమువంటివా డనుటలో ఒక విశేషము స్ఫురించుచున్నదేమో! లేక, వ్రాయస గాండ్ర పొరపాటున, ఈ పాఠభేదములు పుట్టిన వేమో!

పేరునకు తగినట్లే లక్ష్మీశకవి లక్ష్మీరమణస్వామి భక్తుడై యుండును. ఇతని కావ్యముకూడ విష్ణుభక్తి ప్రతిపాదకమైనదే. కవి, తనకావ్యమును 'కృష్ణచరితామృతం' అనియే కీర్తించెను.

> ''పుణ్యమిదు కృష్ణచరితామృతం, సుకవీంద్ర
> గణ్యమిదు, శృంగారకుసుమ తరుతురిగి దా
> రణ్యమిదు, నవరస ప్రౌఢి, లాలిత్య, నానా, విచిత్రార్థంగళ
> గణ్యమిదు, శారదెయ సమ్మోహనాంగ లా
> వణ్యమిదు, భావుకర, కివిదొడవి గొడవిద, హి
> రణ్యమిదు, భూతళదొళెనె, విరాజిపుదు,
> లక్ష్మీపతియ కావ్యరచనె''

అనగా 'ఇది, పుణ్యప్రదమైన కృష్ణచరితామృతము. ఇది సత్కవులచే గణుతింపబడినది. శృంగారకుసుమ తరులచే క్రిక్కిరిసిన వనమిది. నవరసములతోకూడి, ప్రౌఢమై, లలి తమై, నానా విచిత్రార్థములచేత గణుతింపబడినది. ఇది శారదాదేవి సమ్మోహనాంగ లావణ్యము. భావుకుల కర్ణాభరణ ములకు లభించిన మేలిమి బంగారమే యిది. లక్ష్మీపతి గావించిన ఇట్టి ఈ కావ్య రచన, భూమండలముపై విరాజిల్లును' అని మహాకవి లక్ష్మీశుడే, తాను రచించిన కన్నడ జైమిని భారత కావ్యము యొక్క, ఘనతనుగూర్చి సగర్వ ముగా ప్రకటించినాడు. కొందరిది అతని అహంకారమనవ చ్చును. కాని తన కట్టిభావము లేదనీ, కేవలము తాను నిమిత్తమాత్రుడనేయనీ సర్వమూ ఆ గీర్వాణపుర నిలయుడైన లక్ష్మీరమణుని కరుణా కటాక్షమేయని, తన నమ్రతను క్రింది పద్యమున చాటు కొన్నాడు. (స1, ష8)

> ''జాణరం తలె దూగిసదె, నుడిదొడాపద
> క్కాణెయం బహుదెందు, సరసోక్తియింద, గీ
> ర్వాణపుర నిలయ, లక్ష్మీవరం తానె,
> సంగీత, సుకళా నిపుణను
> వీణెయిం గానమం, నుడిసువందది, లోక
> వాణియిం, కవితెయం, పేళిసిద నెందరిదు,
> కేణమం తొరెదు, పురిడిసువరం జరెదు,
> కివిదెరదు కేళ్వుదు, సుజనరు.''

అనగా 'మంచి సంగీత విద్వాంసుడు, వీణతో సుశ్రావ్యముగ సంగీతమును పలికించినట్లు, రసికులు తలలూపునట్టి సరసో క్తులతో ఆ లక్ష్మీరమణుడే లోకారాధ్యములైన లలితపదము లతో కూడిన మనోహరశైలితో నానుండి ఈ కావ్యమును పలికించెను. అందువలన సుజనులిందు అసూయ వహింపక మిక్కిలి ఆదరముతో ఈ కావ్యమును, వినగోరెదను' అనుటలో కవియొక్క దైవ విశ్వాసము, వినయశీలత విదితమగుచున్నవి.

5168 శ్లోకములతో కూడిన, 68 అధ్యాయములుగల, సంస్కృత జైమిని భారతమును లక్ష్మీశుడు 34 సంధులందు 1907 వార్ధక షట్పదులలో రచించెను. దాదాపు, మూలమున కిది, సగభాగమైనను, కాలానుగుణముగ కవి, వర్ణనలను పెంచి, ప్రబంధయుగపు కన్నడ కవులలో, నొక్కడై యుండునను వాదమును బలపరచుచున్నది. లక్ష్మీశుని కన్నడభాషా పాండిత్యమును గూర్చి ప్రత్యేకించి చెప్పనవస రము లేదు. ఇతని, సంస్కృతభాషా పాండిత్యమునకు ఆతడు రచించిన, ఈ సూర్యస్తోత్రము నిదర్శనము.-

"మిత్రాయ, సూర్యాయ; హంసాయ పూష్ణే ప
విత్రే, జగచ్చక్షుషే, చండ ఘృణయే, ప
విత్రాయ, పింగాయ, పురుషాయ భానవే;
జ్యోతిషే, భాస్కరాయ,
సత్రైకరూపాయ, విమలాయ; విశ్వ ర
క్షిత్రే, సహస్రకిరణాయ, రవయే, మంద
పిత్రే, దివాకరాయ, బ్రహ్మవిష్ణు
రుద్రాత్మనే, తుభ్యం నమః"

అనువాదకవు లందరివలెనే, ఇతడును, ఔచిత్యమును పాటించి అనువదించెను. ఉదాహరణమునకు, మూలమున ముప్పది శ్లోకములందు చెప్పబడిన అనుసాళ్వవృషకేతువుల సుదీర్ఘసంభాషణము మిక్కిలి సంగ్రహముగ, మూడుషట్పదు లందు ముచ్చటగ వ్రాసెను. సూర్యచంద్రుల ఉదయాస్తమయములు, వింధ్యపర్వత, గ్రీష్మకాల, పార్వతీదేవి తపోవనము, గంగా నది, మున్నగు వర్ణనలను పెంచి వ్రాసెను. వీరవర్మ కథాకథనమునందు, యమ-క్షయులకు మధ్యజరిగిన సంభాషణము మిక్కిలి విస్తృతము; శాస్త్రవిషయము కూడ కథాగమనమున కంతరాయమని భావించి, కాబోలు అనువాదమున వదలెను. తామ్రధ్వజార్జునుల యుద్ధమున అర్జునుని సైన్యము, గృధ్రాకారముగ నిలిచెనట. మూలమున గృధ్రమునకు కన్నుగా, హంసధ్వజుడు నిలువగా, అనువాదమున 'కంగళొళ్నీల హంసధ్వజరు' అనగా, కన్నులందు నీలుడు, హంసధ్వజుడు, ఇరువురు నిలిచిరని మార్చెను. ఇది, చూడ చిరుమార్పేయైనను, కవి నిశితభావన ద్యోతకమగుచున్నది. గృధ్రమునకు కన్నులు రెండుగదా! ఇటువంటిమార్పులు, కొకొల్లలు. ఇం దమూలకములును లేకపోలేదు.

మణి మాలయేవ కంఠః కంకణతః కూర్పరా దధో దేశః।
శ్రుతి రివ కుండల సంగాత్ తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

రత్నాల దండవల్ల మెడలాగ, కంకణాలతో చేతుల లాగ, కుండలాలతో చెవులలాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

★ ★ ★

ఆలంబనత ఇవ లతా సేవ మనోజ్ఞ ప్రసూన సంపత్త్యా।
సేవ సుగంధాతిశయాత్ తారుణ్యా త్తవ విభాతి తను శోభా॥

పట్టు ఉండడంవల్ల లతలాగ, మనోహరమైన పూవుల సిరివల్ల లతలాగ, సుగంధంవల్ల ఆ పూలవలె ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి

# తెలుగు, హిందీ పిల్లల పాటల్లో 'చందమామ'

శ్రీమతి. ఎం.కె. దేవకి

ఆకాశంలోని చందమామ భూమిపైన వుండే మానవులకు అనాది నుంచీ ఆనందాన్నే గాక జిజ్ఞాసనూ కల్గిస్తున్నాడు. జ్యోతిష్కులు చంద్రుని, నక్షత్రాల గతి విధానాలను గుర్తించి వాటిమూలంగా శుభ అశుభాలను చెప్పగలుగు తున్నారు. ప్రాచీన కాలంలో చంద్రుని దేవతలలో ఒకనిగా భావించే వారు. దేవతలందరి కన్న అతడు అందగాడని మానవుల వూహ. కవులు అందానికి చందమామను ఉపమానంగా ఎంచుతారు. చంద్ర శబ్దానికి అతిగా ఆకర్షించుకొనే వాడని స్థూలార్థం. ప్రతి కావ్యంలోను చంద్రవర్ణనలు మనోహర త్వాన్ని సంతరించు కున్నాయి. ప్రపంచంలో విభిన్న భాషలలో చందమామను ప్రధానాంశంగా తీసుకొని ఎంతో మంది రచనలు చేశారు.

పిల్లల ప్రపంచం పెద్దవా ప్రపంచానికి భిన్నంగా ఉంటుంది. పశుపక్ష్యాదులు, ‌ కీటకాలు మొదలైన సర్వ ప్రాణులు వాళ్లకు స్నేహితులే. జాతి, మత భేదాలుకాని, శత్రువులు, మిత్రులు అనే తారతమ్యాలు కాని వాళ్లకుండవు. సృష్టిలోని ఏ వస్తువును చూసినా దాని గురించి కుతూహ లంగా ప్రశ్నిస్తారు పిల్లలు.

పిల్లలకు చందమామ దూరంగా వున్న ఒక ఇష్టమైన ఆట వస్తువు ఒక మంచి స్నేహితుడు. అందుకే -

''పాలు త్రాగే పిల్లవాళ్లకు - చాల నేస్తం చందమామ
ఆటలాడే కుర్రవాళ్లకు - హాయి గొలిపే చందమామ
. . . . . . . . . . . . . . . . . . . .
దిగంతాలకు వెలుగునిచ్చే - దివ్యదీపం చందమామ''
(మాల్యశ్రీ. బొమ్మరిల్లు)

అని వర్ణించారు. దిగంతాలకు వెలుగునిచ్చే చందమామ దివ్యదీపం కాక మరేమవుతుంది? చందమామ వెలుగుకు సాటి ఈ లోకంలో ఏదీ లేదు అలాంటి చందమామను చూపిస్తూ పాటల రూపంలో రమ్మని పిలుస్తూ చిన్నపిల్లలకు అన్నం తినిపించడం అన్ని చోట్లా చూడవచ్చు. భీమఖం డంలో ''మనకు నిజమయ్యె నెల చందమామ ఘుటిక'' (2-135) అని ప్రయోగం. విష్ణుపురాణంలో ''అందని పంటికేమిటికి నట్టునిగిడ్చెదు విష్ణుడున్నయా, కందువ చందమామ గుటకల్ విను మీ పని గట్టిపెట్టి'' అని ప్రయోగం. (2-51) దొరకని దానికి అల్లులు చాచడం, అందని దానికి ఆశపడడాన్ని 'చందమామ గుటిక/ఘుటిక' అంటారు. అలా అందని ఆకాశంలో ఎక్కడో వున్న చందమామను చూపిస్తూ, రమ్మనిపిలుస్తూ పిల్లలను ఆడిం చడం ఆనవాయితీ.

పిల్లల పాటల్లో చందమామ రకరకాలుగా దర్శనమిస్తాడు కొన్నిపాటలు చంద్రుని పుట్టుకను, రూపురేఖల్ని వర్ణిస్తాయి వీటిలో వింత వింత ఊహలు చోటు చేసు కున్నాయి మరి కొన్నింటిలో చందమామను తమతో ఆడుకోవడానికి రమ్మని పిలవడం ఉంది. మరికొన్ని పాటలు శాస్త్ర సంబంధమైన వాస్తవాల్ని పిల్లలకు తెలియ జేస్తాయి

చంద్రుని పుట్టకకు సంబంధించి పురాణాల్లో ఎన్నో కథలున్నాయి. చంద్రుడు విష్ణువు యొక్క ఎడమ కన్ను అని ఒక పురాణం చెప్తే, చాలా పురాణాలు చంద్రుని అత్రి నేత్రోద్భవునిగా పేర్కొంటాయి. తల్లి సంబంధం లేకుండా పుట్టిన పౌరాణిక పుత్రులలో చంద్రుడొకడు. అత్రి భార్యతో ఉండగా క్రిందబడ్డ ఇంద్రియం గాలికి మూడు భాగాలై ఒక భాగం అతని నేత్రంలో చొచ్చింది. ఆ కంటిలో నుండి చంద్రుడు పుట్టాడని ఒక కథ. తపస్సు చేసుకుంటున్న అత్రి నేత్రంనుంచి వెలువడిన గొప్ప తేజస్సును పది దిక్కులూ భరించ ప్రయత్నించాయి. కాని సాధ్యపడ లేదు. అప్పుడు బ్రహ్మ ఆ తేజస్సునంతా పోగు చేసి దానికి పురుష రూపం ఇచ్చాడు. ఆ పురుష రూపమే చంద్రుడని మరో కథ దేవతలకు ఆహారంగా ఉండడానికి చంద్రుడు సృష్టించ బడ్డాడని ఒక పురాణం పేర్కొంటూ ఉంది చంద్రుడు దేవతలకు అమృతాన్ని సరఫరా చేసే ఆసామి శుక్ల పక్షంలో

అతడు అమృతాన్ని తయారు చేస్తాడు. కృష్ణ పక్షంలో దాన్ని దేవతలు పానం చేస్తారు.

ఒక సారి చంద్రుడు మామ అయిన దక్షుని పైన కోపించి అతనిని నాశనమయి పొమ్మని శపించి అంతటితో వూరుకోక లోకాన్నుండే మాయమయ్యాడు. చంద్రుడు లేక పోవడం వల్ల పంటలు, ఓషధులు ఎండి పోయాయి. దేవతలు చంద్రుని తిరిగి రప్పించమని బ్రహ్మను ప్రార్థించారు. క్షీర సముద్రాన్ని తరిస్తే వస్తాడని బ్రహ్మ చెప్పాడు. దేవాసురులు పాల సముద్రాన్ని చిలికితే పుట్టిన పధ్నాలుగు వస్తువుల్లో చంద్రుడొకడు. ఇది చంద్రుని పునర్జన్మ. పిల్లల పాటల్లో కూడా ఈ అంశం చోటు చేసుకుంది.

చంద్రుని 'చందమామ' అని సంబోధిస్తారు. ఎవరికైనా చంద్రుడు 'మామ' ఎలా అయ్యాడన్న సందేహం వస్తుంది. అలపర్తి వెంకట సుబ్బారావు రాసిన 'ఎవరిమామ' అన్న గేయంలో

''తల్లి అగును కద లక్ష్మి అందరికి
తమ్ముడగును మన చంద్రుడామెకు
అందు చేతనే చంద్రుడందరికి
అవుతాడమ్మా మామయ్య వరుస'
(పిల్లన గ్రోవి. పుట:41)

అని సమాధాన మిచ్చారు. పాల సముద్రంలో లక్ష్మీదేవి, చంద్రుడు ఒకే సారి పుట్టినట్లు కథలున్నాయి. హిందీలో కూడా ఇలాంటి భావమే కన్పిస్తుంది. బాలగేయ కారులలో ప్రసిద్ధులైన అయోధ్యా సింహ ఉపాధ్యాయ 'చందమామ' గేయంలో

''మేరే ప్యారే బడే దులారే ఏ మేరీ ఆంఖో కే తారే
జగత్ పితా జో మానా జాతా వహ్ లక్ష్మీపతి హై కహలాతా
ఇస్‌నాతే హై సభీ ఉమగతే చందకో మామా హై కహతే''
(నిరంకార్ దేవ సేవక్. బాలగీత్ సాహ్యి. పుట:59)

విష్ణువు తండ్రిలాంటి వాడనీ, తల్లి లక్ష్మి అనీ ఆమె సోదరుడైన చంద్రుడు మామ అవుతాడనీ భావం.

పాశ్చాత్యుల దృష్టిలో చంద్రుడు స్త్రీమూర్తి. " In ancient times the Moon was often worshipped as a God- ess ." భారతీయుల దృష్టిలో పురుషమూర్తి. హైందవ పౌరాణిక గాథలు చంద్రుని పురుషమూర్తిగా చిత్రించాయి. ఇంగ్లీషులో బాలసాహిత్యం బాగా అభివృద్ధి చెందినా చందమ్మాపు ప్రసక్తి వున్నపాటలు మాత్రం చాలా తక్కువగా కన్పిస్తాయి. దానికి కారణాలను నిరంకార్ దేవ్ సేవక్ ఇలా చెప్పారు. ఇంగ్లండులో ఎక్కువగా చలి వుండడం వల్ల, పొగమంచు పడుతుండడం వల్ల అక్కడి పిల్లలకు వెన్నెల భారతదేశపు పిల్లల కున్నంత ఆనందదాయకంగా ఉండదు. అందుకే ఆంగ్ల బాలసాహిత్యంలో హిందూదేశ భాషా సాహిత్యాలలో ఉన్నంత ఎక్కువగా చందమామపై బాలగీతాలు కాని, రంగు రంగుల కల్పనలతో కూడిన కథలు కాని తక్కువ.

పుట్టుకను చెప్పినట్లే చందమామలో కనిపించే మచ్చల్ని గురించి చాలా ఊహలున్నాయి. పురాణాలు దీనికో కథ చెప్తాయి. దేవతల గురువైన బృహస్పతి వద్దకు చంద్రుడు చదువుకోడానికి వచ్చాడు. బృహస్పతి భార్య తార. చంద్రుని సౌందర్యాన్ని చూచి తార అతన్ని వరించింది. చంద్రుడు తారామనోహరుడై నాడు. వారికి బుధుడు పుట్టాడు. గురుతల్పగమనం పంచమహా పాతకాల్లో ఒకటి. అలాంటి పాపం చేసినందుకు చంద్రునికి పొడల రోగం పట్టుకుంది. ఎన్నిమందులు పుచ్చుకున్నా నయం కాలేదు. మిత్రుల సలహామీద మహారాష్ట్ర దేశంలోని పండరిపురానికి పోయి అక్కడి నదిలో స్నానం చేశాడు. రోగ బాధ తగ్గింది కాని పొడల ఆనవాళ్లు మాత్రం పోలేదు. ఆమచ్చలే నేటికీ చంద్రునిలో కన్పిస్తుంటాయి. స్నానం చేసినంత మాత్రాన పొడల బాధను పోగొట్టిన ఆనదికి నాటినుండి 'చంద్రభాగ' అనే పేరు వచ్చింది.

చంద్రునిలోని ఆ మచ్చల్ని కొందరు కుందేలుగా భావిస్తే కొందరు పచ్చని మైదానంలో గడ్డిమేస్తున్న లేడిగా ఊహించారు. కొందరు సముద్రపు నీడ అన్నారు. మరికొందరు అవ్వ రాట్నంలో నూలువడకుతున్నట్లు చెప్పారు.

చంద్రుని లోని మచ్చను శశము (కుందేలు) గా వర్ణించారు కాబట్టే చంద్రునికి శశాంకుడనే పేరు వచ్చింది.

''రే లమృతాంశులో శశము
రెమ్ముదమంచు దలంచి జాళు వా
మేలి పసిండి సోయగపు
మేడల గుజ్జెనగూళ్ళ సందడిన్
బాలిక లుండి యావల
జనంగని చింతిలి వంట యింటి కుం
దేలిది యెందు బోగలదు
నేటికి నేమని యందు రందులన్.''
(విజయ విలాసము. 71 వ ప)

ఇంద్ర ప్రస్థపురంలో వెన్నెల రాత్రులలో జాలువారే బంగారపు మేడల పైన ఆడుకొనే బాలికలు చంద్రుడు తమ మేడమీదకు వచ్చినప్పుడు దానిలోని కుందేలును పట్టుకోవా

అనుకొని గుజ్జెన గూళ్ళు ఆటల్లో పడి మరచి చంద్రుడు దూరం పోవడం చూచి విచారించి అయితేనేమిలే? ఇది వంట ఇంటి కుందేలే కదా! ఎక్కడికి పోతుంది. ఈ రోజు కాకపోతే ఇంకో రోజు పట్టుకోవచ్చును అనుకుంటారు. పిల్లలు పట్టదలచిన కుందేలు అమృతాంశుని లోనిది. అమృతాన్ని దేవతలకు తన కిరణాల నుంచి ఇస్తాడు కాబట్టి చంద్రుని వంట ఇల్లుగ చమత్కరించారు. కాబట్టి ఆ కుందేలు వంట ఇంటి కుందేలు. అంతేగాక పిల్లలు గుజ్జన గూళ్ళు వండుకుంటున్న వంట ఇంటికి వచ్చి ఆటల సందడిలో వుండగా అవతలకు వెళ్లిపోయింది. 'వంట ఇంటి రుచి మరిగింది కాబట్టి మళ్లీ రాకుండా పోదు' అని చమత్కారం. పిల్లిగాని, చెవుల పిల్లిగాని రుచి మరిగిన చోటికి మళ్లీ రాకపోదని కుందేలు వేట గాళ్లంటారు. చంద్రుని పేరు చెప్పుకొని మేలు పొందిన కుందేళ్ళ కథ కూడా ఒకటి ప్రచారంలో ఉంది.

భట్టి ప్రోలు కృష్ణమూర్తిగారు 'చం ఛం చందా' అనే బాలగేయంలో

''చం చం చందా మామయ్యా
కుందే లెందుకు నీకయ్యా
చక్కని చుక్కలు వేల కొలదిగా
చిక్కని మబ్బులు గుంపు గుంపులుగ
మిల మిల పాల పాల మీ చుట్టూరా
తిరుగులాడగా పరుగు పెట్టగా'' అని ప్రశ్నిస్తూ

''మా బడి వూరికి చాలా దూరం
దారిని తోడేలే రెవ రసలూ
నా ప్యారీగా మా నేస్తంగా
నీ కుందేటిని మాకిస్తావా.''

(బొమ్మరిల్లు)

అని అడిగినట్లు వర్ణించారు. పిల్లల మనస్తత్వం ఈ గేయంలో చక్కగా వ్యక్తమవుతుంది.

'చంద్రుని పొట్టలో జింక ఉంది చూడు' అని పెద్దలు పిల్లలకు చూపించడం మామూలుగా చూస్తుంటాం. కవులు చంద్రుని 'ఏణీధరుడు' అని వర్ణిస్తారు. జానపదుల ఈ కల్పనలే కవుల మీద ప్రభావాన్ని చూపి చంద్రుని రకరకాలుగా వర్ణించడానికి ప్రోత్సాహించి ఉండాలి.

నమతారావు 'మామతో ఒక మాట' అనే గేయంలో మచ్చను గూర్చి వ్యంగ్యంగా

''పొన్న చెట్టుందంటే పూలు పూస్తున్నదా
లేడి పిల్లుందంటే ఆడు కొంటున్నదా
అవ్వొక్కతుందంటే నూలొడుకు తున్నదా.''

(బాలగేయాలు. మూడవ భాగం. పుట:49)

అని ప్రశ్నించారు.

మచ్చను గూర్చిన ఇలాంటి భావాలు హిందీ బాలగేయాల్లోనూ కన్పిస్తాయి. అయోధ్యా సింహ ఉపాధ్యాయ వ్రాసిన గేయంలో ఒక చిన్నపిల్లవాడు చందమామను రమ్మని పిలుస్తూ ''వచ్చి నీ జింక పిల్లను చూపించిపో. పాలగిన్నెలో పాలు నింపి తెచ్చి తాగించిపో. దాని కేరింతలు చూసి దాన్ని ముద్దు పెట్టుకుంటాను.'' అంటాడు. ఆగేయం:

''మేరే పాస్ చాంద్ తూ ఆజా
ఆకర్ అప్నా ఖానా ఖాజా
ముఝకో ఆప్నా హిరణ్ దిఖాజా
మీఠీ మీఠీ బాత్ సునా జా
చందా మామా దౌడే ఆవో
దూద్ కటోరా భర్‌కర్ లావో
ఉసే ప్యార్ సే ముఝే పిలావో
ముఝా పర్ ఛిడక్ చాంద్‌నీ జావో
మై తేరా మృగ చాయ్‌నా లూంగా
ఉస్‌కే సాథ్ హంసు ఖేలూంగా
ఉస్‌కీ ఉఛల్ కూద్ దేఖూంగా
ఉస్‌కో చాటూంగా చూమూంగా.''

(బాల్‌గీత్ సాహిత్య. పుట:57)

తెలుగు లో లాగే హిందీలో కూడా ముసలవ్వగా కల్పించి రాసిన గేయం ఉంది.

''బుఢీమాయీ, బుఢీమాయీ
ఉతర్ చాంద్ సే నీచే ఆయీ
మున్నా కే ఘర్ దావత్ ఖాయీ
లడ్డూ పూరీ ఖీర్ మలాయీ
సారీ చీజోంకో ఖా పీకర్
వహ్ చల్ దీ ఉడ్ కర్ అపనే ఘర్
హమ్‌నే ఉస్‌కో ఆతే దేఖా
హమ్ నే ఉస్‌కో జాతే దేఖా
అబ్ హమ్ భీ ఉడ్ కర్ జాయేంగే
ఉస్‌కీ ఘర్ దావత్ ఖాయేంగే.

(పుట: 57)

ముసలమ్మ చంద్రునిలో నుంచి కిందికి వచ్చి పాప ఇంట్లో లడ్డూ, పూరీలు, మీగడ, పాయసం బాగాతిని తాగి పైకెగిరి పోయిందట. అది చూసిన పిల్లలు ఇలా అంటారు. 'మేము

అవ్వ వస్తుంటే చూసినాము. పోతుంటే చూసినాము. మేమూ ఎగిరివెళ్లి ఆమె ఇంట్లో తిండి తింటాము.' - పిల్లల అమాయకత్వం, వాళ్ల చిన్ని బుర్రల్లో మెదిలే ఊహలు ఈ పాటలో కన్పిస్తాయి.

చందమామను ఎంతో సంబరంగా, సంతోషంతో ఆహ్వానించడాన్ని మనం పిల్లల్లో చూడగలం. పిల్లలే గాక పెద్ద వాళ్లు చిన్న పిల్లలకు అన్నం తినిపించేటప్పుడు ఆకాశంలోని చందమామను చూపిస్తూ -

''చందమామ రావె - జాబిల్లి రావె
కొండక్కి రావె - గోగు పూలు తేవె''

అంటూ పాడతారు. తెలుగు దేశమంతటా వ్యాప్తిలో వున్న ఈ పాటకు లెక్కలేనన్ని పాఠాంతరా లున్నాయి.

ఉదాహరణకు :

''చందమామా రావె - జాబిల్లిరావె
కొండెక్కి రావె - కోటి వేలు తేవె
బండి మీద రావె - బంతిపూలు తేవె
తేరు మీద రావె - తేనె పట్టు తేవె
అన్నిటిని తేవె - మా అబ్బాయికీవే.''

మరొకటి :

''చందమామరావె - జాబిల్లిరావె
ఒలవని పండు ఒళ్లో ఉంచుకొని
ఒల్చిన పండు చేత బుచ్చు కొని
పయిడి గిన్నెలో పాలు పోసు కొని
వెండి గిన్నెలో వెన్న పెట్టుకొని
అమ్మా నువ్వూ తిందురుగాని
అట్టా అట్టా రావె!''

(వేటూరి ప్రభాకర శాస్త్రి బాలభాష)

ఈ పాట జానపదుల్లో ప్రచారంలో ఉంది. ఇది తెలియని తెలుగు తల్లి కాని, వినని తెలుగు బిడ్డగాని లేదంటే అతిశయోక్తి కాదు.

ఆకాశ మార్గంలో మెల్లగా పయనిస్తూ మబ్బుల్లో దాగి దోబూచులాడే చందమామను రమ్మంటూ పాడే పాటలు ఆధునిక రచయితలు రాసినవి చాలా ఉన్నాయి.

''మేఘాల్లో చందమామ
మురిపెంపు ముద్దుల మామా
పరుగు పరుగున తరలి రమ్మ
మా పక పక నవ్వుల వేడుక జూడన్.''

(న్యాయపతి రాఘవరావు బడిగంట)

చందమామను ఇవీ - అవీ తెమ్మనడం గాక తానే చందమామకు పాలూ నీళ్లూ లాంటివి ఇస్తానని పిలిచే పాట చూడండి

''అందాల చంద్రుడా! అలనాటి చంద్రుడా!
విందార గింపను రారా......
చల్లని పానీయ మిదో - వేగ రావోయీ
చిన్ని పాపాయీ - నిను వేడిన దోయీ
మబ్బుల లోనా - మాయ మయ్యావే
మరుగును వీడి - ఇలా - సరగున రారా చిన్ని
చక్కని రాజా - చుక్కల తేజా
ఎక్కడనో నిక్కినిక్కి చూచావు రాజా చిన్ని''

(దేవకి తిరుపతి శోభ.)

హిందీ బాలగీతాల్లో ఇలాంటివి ఎక్కువగా కన్పిస్తాయి. పెద్ద వాళ్లు రాసినవే అయినా అవి పిల్లలు మనస్తత్వాన్ని చక్కగా చిత్రిస్తాయి చంద్రుని మీద పిల్లల కున్న స్వాభావికమైన ఆకర్షణ యొక్క వర్ణన ప్రాచీన సాహిత్యంలోనూ కన్పిస్తుంది. సూరదాసు తన పద్యాల్లో ఇలా వర్ణించాడు

''బార్ బార్ జసుదా సుత్ బోధ్‌లీ
ఆవూ చంద తోహి లాల్ బులావై
మధు మేవా పక్వాన్ ఆపున్
ఖైహై తోహి ఖవావై
జల్ పుట్ ఆని ధుర్‌ని పర్ రాఖ్‌యో
గహి ఆన్యో వహ్ చంద్ర దిఖావై
సూరదాస్ ప్రభు హంసి ముస్కానే
బార్ బార్ దోవ్ కర్ నావై.''

ఒక పిల్లవాడు చందమామతో 'నేనిక్కడ కూర్చున్నాను. నీవు అంత దూరంలో వున్నావే. తియ్యని మిఠాయిలు ఇస్తాను. ఆడుకోవడానికి రా' అంటాడు. ఆధునిక హిందీగీతాల్లో ఇలాంటి పాట లెక్కువ. ఉదాహరణకు కొన్ని :

శకుంతలా సిరోఠియా చంద్రుడు ఎంత పిలిచినా రావడంలేదని తల్లితో ఫిర్యాదు చేయడాన్ని వర్ణించారు.

''ఝూంక్ రహా బాదల్ సే చందా
అమ్మా ఉసే బులా లే తు,
తుఝు కో హీ వహ్ దేఖ్ రహాహై
అపనే పాస్ సులా లే తు,

సుబహ్ వుఠేంగే ఏక్ సాథ్
ఫిర్ మిలా కర్ దోనో ఖేలేంగో
జో కుచ్ భీ ఖానే కో దేగీ
బాట్ బాట్ కర్ లే లేంగే.''

(పుట: 59)

'అమ్మా చంద్రుడు మేఘాల్లో నుంచి తొంగి చూస్తు న్నాడు. నిన్నే చూస్తున్నాడు. పిల్చి నిద్దుర పుచ్చు. పొద్దున్నే లేచి మేమంతా ఆడు కుంటాము. నీ విచ్చే తినుబండారాలు పంచు కొని తింటాము.'

శ్రీమతి శాంతి అగర్వాల్ రాసిన బాలగేయం పై పాటకంటే భావగర్భిత మైంది. అందులో ఒక చిన్నపిల్లవాడు తానే స్వయంగా చంద్రుని రమ్మని పిలుస్తూ వస్తే రొట్టె, వెన్న తినిపిస్తాననే గాక అవ్వచేత దేవతల కథలు వినిపిస్తానని కూడా మాట ఇస్తాడు.

''చందా ఆవో మాఖన్ రోటీ
తుమ్‌కో ఖూబ్ ఖిలావుంగా
అపనీ నానీ సే ఫరియోంకీ
క్యా తుమ్ హేసున్‌వావుంగా.''

(పుట: 59)

తనకు అన్నిటికంటే ప్రియమైన రెండు వస్తువులు ఒకటి రొట్టె, వెన్న. రెండు అవ్వ నోటిలో వినవచ్చే మంచి మంచి ఆసక్తికరమైన దేవతల కథలు. వాటిని అర్పించడానికి కూడా తయారవుతాడు వాడు. నిజంగా చంద్రుడు వాడి పిలుపుకు వస్తాడని చలిరాత్రుల్లో చంద్రునికి పరుపు ఏర్పాటు చేయాలని గుర్తువచ్చి 'అవ్వ చెప్పేకథలు వింటూ నిద్రవస్తే నా పరుపు తీసుకో' అంటాడు. ఇంత చెప్పినా చంద్రుడు రాకపోయేసరికి 'నీవు నన్ను చిన్నవాడను కొని నాదగ్గరకు రావడం లేదా, లేక నేను నీతో మాటాడనని రావడం లేదా అంటూ ఇంకో మాట కూడా ఇస్తాడు. 'నీవు వచ్చేయి. నా దగ్గరుండే గుర్రం, రథాలు, ఏనుగులు ఇస్తాను. నా పూలతోటలో ఆడుకుందాం' అని చందమామ మేఘాల్లో దాక్కుంటాడని వాడికి బాగా తెలుసు. అందుకే చివరి కిలా అంటాడు. 'చంద్రుడా! మా అమ్మ మన దిండు మీద మేఘాలన్నీ చిత్రించింది. అవే నీకు ఇష్టమైతే ఈ మేఘాల్లో వచ్చి దాక్కో'- రచయిత్రి కళా ప్రియత్వం ఈ గేయంలో సువ్యక్తం. ఇలా పిల్లల మనోభావాలను వర్ణించే పాటలు తెలుగులో అరుదుగా కన్పిస్తాయి.

ఎంత పిలిచినా రాని చంద్రుణ్ణి తెచ్చిపెట్టమని కొంత మంది మారాం చేస్తుంటారు. రామాయణంలో రాముడు చంద్రుని తెచ్చిపెట్టమని పట్టుబడితే మంత్రి సుమంతుడు రామునికి అద్దంలో చందమామను చూపి ఆపదను గట్టెక్కి స్తాడు.

ఇంగ్లీషు Fairy tales లో 'Many Moons' అనే అద్భుత కథ ఒకటుంది. Lenore (లెనోర్) అనే పదేళ్ల అమ్మాయి (రాజకుమార్తె) చంద్రుడు కావాలంటూ అనారోగ్యానికి గురి అవుతుంది. రాజు పండితుల్ని పిలిపించి చందమామను తెచ్చే మార్గం చెప్ప మంటాడు. అది వీలుకాదని వాళ్ల సమాధానం. రాజు ఆదేశానుసారం Court Jester ఆ అమ్మాయి దగ్గరకు వెళ్తాడు. ఆ అమ్మాయి అతనిని చూసి సంతోషంగా లేచి 'నాకు చందమామను తెచ్చావా' అని అడుగుతుంది. అతడు తీసుకు రాలేదు. అయినా తప్పక తెస్తా నంటూ' కొన్ని ప్రశ్నలు వేస్తాడు. 'చందమామ ఎంత ఆకారంలో ఉన్నాడని నీ వూహా' అని అడిగితే 'నా చేతి గోరంత' అంటుంది. ఎంత దూరంలో ఉన్నాడంటే 'కిటికీ ప్రక్కనున్న పెద్ద చెట్టంత ఎత్తులో ఉన్నాడు. ఒక్కోసారి పై కొమ్మల నుంచి అందుకోవ'చ్చంటుంది. 'చందమామ దేనిలో చేయ బడినా' డంటే 'బంగారంతో' అంటుంది. ఆ అమ్మాయి అన్నట్లే బంగారు చందమామను తయారు చేసి తెచ్చి ఇస్తాడు. దాన్ని గొలుసుకు తగిలించు కొని మెడలో అలంకరించు కొంటుంది. కాని రాజు భయం తీర లేదు. రాత్రికి చందమామను చూస్తే నిజమైన చందమామను ఇవ్వలేదని మళ్లీ బాధపడుతుందని ఆయన భయం. పండితుల సలహా మీద నల్లటి అద్దాలను తయారు చేసి ఆ పాపకు ఇవ్వమంటాడు. ఏ వస్తు వెక్కడో తెలియకుండ మళ్లీ అనారోగ్యానికి గురవుతుందేమో నని ఆ ప్రయత్నం విరమించు కుంటాడు. సర్కస్ టెంటులాగ నల్లటి పరదాలను తయారు చేయించాలనుకొని చల్లటి గాలి లేక బాధపడుతుందని ఆ ప్రయత్నమూ మానేస్తాడు.

రాజు Court Jesterని సలహా అడుగుతాడు. అతడు ఏకంగా ఆ అమ్మాయి దగ్గరికి వెళ్లగా కిటికీలో నుండి ఆకాశంలో ప్రకాశిస్తున్న చంద్రుని చూస్తుంటుందా అమ్మాయి. చేతిలో అతడు తయారు చేసి ఇచ్చిన చంద్రుడుంటాడు. ఆమె వంక దీనంగా చూస్తూ ఇలా ప్రశ్నిస్తాడు. 'చంద్రుడు నీ గొలుసులో వ్రేలాడదీసి ఉండగా ఆకాశంలో ఎలా వున్నాడు?' ఆ అమ్మాయి నవ్వి 'సిల్లీ క్వశ్చన్' అంటూ 'నేను పళ్లు పొగొట్టు కుంటే ఆ స్థలంలో మళ్లీ పళ్లు వచ్చినట్లే, తోటమాలి పువ్వులను కోసివేస్తే మళ్లీ వేరే పువ్వులు వచ్చినట్లే చంద్రుడు కూడా మళ్లీ పుట్టాడు' అని నిద్రలోకి జారుకుంటుంది. Court Jester కిటికీ దగ్గరికి వెళ్లి చంద్రుని చూచి కనుసైగ చేస్తాడు. చంద్రుడు కూడా కనుసైగ చేసి నట్లనిపిస్తుం దతనికి. పిల్లల

లేత మనసులు, చిన్ని బుర్రలు ఎలా ఆలోచిస్తాయో, వాళ్ల వూహలు ఎంత దూరం ప్రసరిస్తాయో ఈ కథలు, గేయాలు చెప్తాయి.

చందమామ దగ్గరికి పిల్లలు తామే స్వయంగా వెళ్లాలను కోవడాన్ని వర్ణించే పాటలు చూడండి. అశోక ఇలా వర్ణిస్తారు.

''చందామామా చందామామా
అపనే పాస్ బులాలో
ముఝె బిఠాకర్ అపనే రథ్ మే
నభ్ కీ సైర్ కరావో
చందా మామా జల్దీ సే అబ్
ముఝె దిఖావో తారే
చమక్ రహే హై దమక్ రహే హై
లగతే హై జో ప్యారే.

(పుట: 60)

'చందమామా! నన్ను నీ దగ్గరికి పిలుపించుకో. నీ రథంలో కూర్చో బెట్టుకొని ఆకాశంలో షికారు కొట్టించు. నాకు చాలా ప్రియమైన మిణుకు మిణుకుమని ప్రకాశించే నక్షత్రాలను చూపించు' అని కోరడం పై పాటలోని అంశం.

హిందీకి తెలుగుకు పిల్లల చందమామ పాటల్లో ఎంత సామ్యమున్నా కొన్నిచోట్ల భిన్నత్వం కూడా కన్పిస్తుంది. హిందీ లోని కొన్ని బాలగీతాల్లో చంద 'మామ' తో బాటు 'అత్త' ప్రసక్తి కూడా ఉంది. శ్రీ బాబూ లాల్ శర్మ చంద్రుని భార్యను 'పూనం అత్త' అనే పేరుతో క్రింది కల్పన చేసినారు.

''చందా మామా పూనం మామీ
మామీ మేరీ బడీ సుహానీ
రోజ్ ఉతర్ తరియోంకే రథ్ తర్
దూద్‌నదీమే భర్తీ పానీ

క్యామా యహ్ దోనో సబ్ కో హీ
ప్యారె లగతే హై బచపన్ మే
ముఝె జగా దేనా మా జబ్
చందా మామా చమ్కే అంగన్ మే.

(పుట: 61)

చిన్న పిల్లవాడొకడు వాళ్ల అమ్మతో చందమామ, పూనం అత్త గురించి చెప్తూ 'పూనం అత్త రోజూ దేవతల రథం నుండి దిగి దూధ్ నదిలో నీళ్లు నింపుతుంది. చందమామ, పూనం అత్త మన ఇంటి దగ్గరికి వచ్చేసరికి నన్ను నిద్రలేపేయి. అంటాడు. దూద్ నదిలో నీళ్లు నింపుతుంది అని చెప్పడాన్ని బట్టి కవి మేఘాన్ని (నల్లని మబ్బుల్ని) పూనం అత్తగా భావించి ఉంటాడనిపిస్తుంది. ఈ గేయం గురించి చెప్తూ నిరంకార్ దేవ సేవక్ 'ఈ పూనం అత్త కల్పన నిస్సందేహంగా మధురంగా వుంది. కాని బాలలకు కావలసిన సరళత, సున్నితత్వం ఇందులో లోపించింది, అంటారు.

పండిత రాం నరేశ్ త్రిపాఠీ అత్త కల్పనను రాత్రిరూపంలో, చేసినారు.

''చందా మామా గయె కచేహరీ
ఘర్ మే రహా న కోయీ
మామీ నిషా అకేలీ ఘర్ సే
కబ్ తక్ రహతీ సోయీ
చలీ ఘూమ్‌నే సాథ్ న లేకర్
కోయీ సఖీ సహేలీ
దేఖీ ఉస్‌నే సజీ సజాయీ
సుందర్ ఏక్ హవేలీ
చందామామా బహుత్ భలే హై
బోలే క్యోం హై రోతీ
దీయా లేకర్ ఘర్ సే నికలే
చలే బీననే మోతీ.

(పుట:62)

ఈ గేయంలో అంధకారమై రాత్రి రావడం, నక్షత్రాలు ప్రకాశించడం, చంద్రుడు ఉదయించడం మొదలైన కల్పన ఒక కథానిక రూపంలో చాలా అందంగా వర్ణించబడింది. చందమామ ఇల్లువదిలి కచేరీకి వెళ్లిపోతే రాత్రి అనే అత్త ఒంటరిగా ఇంట్లో ఉండిపోయిందట. కొంతసేటికి సుందర మైన బండిలో కూర్చొని విహారానికి వెళ్తూ ప్రకృతి రమణీయంగా ఉండడంతో పరవశించి నాట్యం చేయడం మొదలుపెడుతుంది. అలా నాట్యం చేస్తుండగా ఆమె ముత్యాల హారం తెగి ముత్యాలన్నీ చెల్లాచెదురై పోయాయి. అందుకామె ఏడుస్తుంటే ఆమె పరిస్థితి తెలుసుకొని చంద్రుడు రెండవరోజు వచ్చాడట. వచ్చిన చంద్రుని చూచి మొహం వ్రేలాడేసి నిలబడిందట అత్త. చంద్రుడామెతో 'ఎందుకలా ఏడుస్తావు. దీపం తీసుకెళ్లి ముత్యాలన్నీ ఏరుకొని ఉండొచ్చు కదా!" అంటాడు.

పై గేయంలో మనోజ్ఞమైన కల్పన ఉంది. కవి భావనాశక్తి కిది తార్కాణం. అంధకారమైన రాత్రి చంద్రుని భార్యగా ఇక్కడ కల్పించబడింది. చంద్రు డున్నప్పుడు చీకటి ఉండదు. కాబట్టి అత్తను వదిలి చంద్రుడు కచేరికి వెళ్లిపోయాడన్నారు. సుందరమైన రాత్రిని వర్ణిస్తూ అత్త

సముద్రంలోని తరంగాలు, చెట్లపైన వీస్తున్న గాలులు మొదలైన ప్రకృతిలోని కదలికలను కవి ఆమె నాట్యంగా భావించినారు. ఆకాశంలోని నక్షత్రాలను తెగి చెల్లాచెదరై పోయిన ముత్యాలుగా ఊహించినారు. రాత్రిలో కురుస్తున్న మంచు బిందువులను తెగ పోయిన ముత్యాల హారంకోసం ఏడుస్తున్న ఆమె కంటిలోని కన్నీటి బిందువులన్నారు. అమావాస్య తర్వాత వచ్చే చంద్రుని రాకను అత్త పరిస్థితి చూచి వచ్చినట్లు చెప్పారు. అలా వచ్చిన చంద్రుని చూచి మొహంవేలా డేసి నిలబడిందట అత్త. అంటే చీకటి చంద్రుని ముందు వెలవెల పోయిందని చెప్పడం. ఇలాంటి భావాలు చిన్నపిల్లల ఊహాకందకపోయినా ఇలాంటి కథల్ని మాత్రం ఎంతో ఆసక్తితో వింటారు.

చందమామ మీదపడే సూర్య రశ్మివల్ల మనం ప్రతిరోజూ నిండు చంద్రుని చూడలేక పోతున్నాము. చంద్రుడు పెరుగుతూ తరుగుతూ ఉంటాడు. ఈ వృద్ధిక్షయాలకు సంబంధించి పురాణాలు రెండు కథలు చెప్తాయి. 1. దక్షుని కుమార్తెలైన ఇరవై ఏడుమంది తారల్ని చంద్రుడు పెళ్లి చేసుకున్నాడు. వాళ్లలో రోహిణి పట్ల చంద్రునికి విశేషమైన అనురాగం. ఈ కారణంగా దక్షుడు అల్లుణ్ణి క్షయరోగ పీడితుడవు కమ్మని శపిస్తాడు. చంద్రుడు శివుని శరణు జొచ్చాడు. శివుడతనిని తలపూవుగా ధరించాడు. ఫలితంగా చంద్రుడు తారలకు మరింత దూరమైనాడు దక్షుడు శివుని వద్దకు వచ్చి చంద్రుణ్ణి విడవమని కోరాడు. శరణార్థిని విడవనన్న శివుని దక్షుడు శపించడానికి పూనుకున్నాడు. ఇంతలో విష్ణుమూర్తి వచ్చి రాజీ చేసి చంద్రుణ్ణి రెండు భాగాలు చేసి ఇద్దరికీ ఇచ్చాడు. శివుని తల పువ్వైన చంద్రుడు క్షీణించడు. తారల భర్త అయిన చంద్రునికి వృద్ధిక్షయాలు న్నాయి.

2. చంద్రుడు దేవతల కోపం శుక్లపక్షంలో దినదినమూ అమృతాన్ని కూరుస్తాడు. కాబట్టే అతను క్రమంగా తేజస్వి అవుతూ ఉంటాడు. పూర్ణిమనాటికి అమృత భాండం నిండుతుంది. మరునాటి నుండి దేవతలు, పితరులు దాన్ని పానం చేయడం ఆరంభిస్తారు. ఆ కారణంగా చంద్రుని కాంతి తగ్గిపోతూ వస్తుంది. అమావాస్య నాటికి అమృతం అంతా ఆరగింపు అయిపోతుంది. మరునాటి నుండి చంద్రుడు తిరిగి అమృతాన్ని తయారు చేయడానికి పూనుకుంటాడు. చంద్రుడు మంచుకొండ అని చంద్రశిలలు కరిగి పడుతూండడం వల్ల చంద్రుడు తరిగి పోతాడనీ అంటారు.

పూర్ణిమ నాడు చంద్రుడు పూర్ణుడై భూమికి దగ్గరగా జరుగుతాడు. అప్పుడు భూమిపై చంద్రాకర్షణ శక్తి ఎక్కువగా ఉంటుంది.

పురాణాల్లోని ఈ కల్పనాచ్ఛాయలు, వైజ్ఞానికులు జెప్పిన వాస్తవాలు, పిల్లల పాటల్లోను కన్పిస్తాయి. ఉదాహరణకు :

"ఆనీల నగరిలో అద్దాలవాడ
అద్దాల వాడలో అతి తెల్ల మేడ
ఆ మేడ దాపునను అమృతంపు కొలను
కొలనులో చక్కగా కులికేటి పువ్వు."
(రాయప్రోలు సుబ్బారావు కన్నెపాటలు)

నీలనగరు ఆకాశం. అమృతపు కొలను వెన్నెల . ఆ కొలనులో కులికే పువ్వు చంద్రుడు. ఆ పూలలో పొంగే పాలధారలను వెండిగిన్నెలో నింపి 'మా చిన్ని పాపలకు మాపురేపులును- చల్లగా తేవోయి సరి చందమామ' అని కోరుతూ పున్నమ సంతలకు వెళ్లే వెన్నెల బండ్లను కలువ పాపలకు కావాలంటూ ఆపమని వర్ణించే ఈ పాట చమత్కారంగా ఉంది.

"......
ఆనాటి కానాటికి అంతు లేక పెరిగేవు
కొన్నాళ్లకు కొన్నాళ్లకు కొంత కొంత తరిగేవు
పూర్ణమైన మోము నొక్క నాటికైన చూపేవు
చిన్నిపాప చిరునవ్వుల లోన చింది పోయేవు."
(దేవకి తిరుపతి శోభ)

అంటూ చంద్రుని పెరుగుదలను, తరుగుదలను వర్ణించారు.

హిందీలో శ్రీ రామ్‌ధారీసింహ్ దినకర్ 'చంద్రమా కా కుర్తా' అని ఒక చక్కని గేయాన్ని రాశారు.

"హఠ్ కర్ బేఠా చాంద్ ఏక్ దిన్
మాతా సే యహ్ బోలా
సిల్వా దే మా ముఝె ఊన్ కా
మోటా ఏక్ ఝుంగోలా
సన్ సన్ చల్తీ హవా రాత్ భర్
ఝూడేసే మై మర్తాహు
ఠిఠుర్ ఠిఠుర్ కర్ కిసీ తరహ్
యాత్రా పూరీ కర్తా హు."
(పుట. 63)

చంద్రుడు తల్లితో 'అమ్మా పన్నెండు మాసాలు చలిలో, వానలో, ఎండలో నగ్నంగా తిరుగుతూ కష్టాల్ని సహిస్తు న్నాను. నా కొక చొక్కా కుట్టించు' అని అడుగుతాడు.

దానికి తల్లి 'నీకష్టాల్ని నేను అర్థం చేసుకోగలను. కానీ నీవు ఒక కొలతలో ఎప్పుడూ ఉండవు ఒక్కోసారి కంటికే కన్పించవు. ఏ కొలతలతో చొక్కా కుట్టించాలి?' అంటుంది. వెంటనే చంద్రుడు రోజు కొక చొక్కా చొప్పున పదిహేను చొక్కాలు కుట్టించ మంటాడు. ఇలాంటి కల్పన సిద్ధహస్తుడైన కవిమాత్రమే జేయగలడు. యథార్థాలు కాకపోయినా ఈ కల్పనలు పిల్లల మనోవికాసానికి, భావనాశక్తికి దోహదం చేస్తాయి.

భవిష్యత్తులో మనుషులంతా చంద్రుని దగ్గరికి వెళ్లిపోవచ్చు అన్న నమ్మకాన్ని వైజ్ఞానికులు కల్గిస్తున్నారు. ఇప్పుడు వస్తున్న బాలగీతాలలో కూడా పిల్లలు చంద్రుని దగ్గరికి వెళ్లడానికి ఉద్యుక్తులవుతున్నట్లే కల్పనలు చేస్తున్నారు ప్రాచీన కాలంలో చంద్రుని దైవంగా తప్ప ఒక గోళంగా భావించే వాళ్లు కారు. చంద్రునిపై కల్పించిన కథలు వాళ్లకలాంటి భావాలను కలుగ జేయలేదు. అందుకే చందమామను తమ దగ్గరికి రమ్మని పిల్చేవారు. ఇప్పటి బాలలకు చంద్రుని దగ్గరికి వెళ్లడానికి ప్రోత్సహించే బాలగీతాలు ఎంతైనా అవసరం. సమతారావు విజ్ఞానానికి చమత్కారాన్ని మేళవించి 'మామతో ఒకమాట' (బాలగేయాలు 3వ భాగం) అనే గేయాన్ని రాశారు.

''రావోయి రావోయి ఓ చందమామా
రాకుంటివా మేమె రాగలము మామా''

అని హెచ్చరించారు.

''పాల సంద్రాన నీవు ప్రభవించి నావనుచు
ఫాలాక్షునకు నీవు జడలోని పువ్వనుచు
దక్షప్రజాపతికి ముద్దులల్లుడ వనుచు
ఎన్నెన్నొ గాథలను విన్నాము నిను గూర్చి''

అంటూ పురాణ సంబంధమైన విషయాలను ప్రస్తావిస్తూ 'ఇవన్నీ నిజమేనా?' అని ప్రశ్నించారు. చందమామను చూస్తే మనసులో కలిగే భావాల్ని

''నీ మోము చూడంగ మామనసు లుప్పొంగు
నీ వెన్నెలలు సోక మా శోభ పెంపొందు
మా భూమి చూడగా మీ భూమి కెట్లుండు
మా కాంతి కిరణాలు మీ భూమి కెట్లుండు?''

అనడంలో చంద్రగోళం కూడా ఒక భూమే అని తెలియ జెప్పినారు. 1971 ప్రాంతంలో వ్రాసింది గేయం. అందుకే

''ఈనాటి నరుడంటె ఏమిటనుకుంటివో
పరమాణుశక్తిగల అనమాన బలశాలి
ప్రకృతినే శాసించు పరమ శివు డొక్కొకడు
దివికి నిచ్చెన వేయు ధీశాలి ప్రతియొకడు
చూచావు గదటోయి స్పుత్నిక్కు మామా
కన్నావు గద మాదు రాకెట్టు మామా!''

అని అడిగారు.

''వెండి బంగారాలు రకరకపులోహాలు
కొండలకు కొండలే దండిగా గలవటే
అనుభవించెడివారు అచ్చోట కరువటే
ఉన్నాము కోట్లాది ఉర్విపై దిగులేల
అల్లుళ్లమై మేము వత్తుములె మామా!
అనుభవింతుము నీ సొత్తంత మామ!''

అని చందమామతో చమత్కారాలాడారు. రష్యా ప్రథమ స్పుత్నిక్కును ప్రయోగించి నప్పుడు ఈ గేయాన్ని రాసినట్లు రచయిత పేర్కొన్నారు.

చంద్రుడు గోళమని చెప్పే గేయమే ఆంధ్ర జ్యోతి సచిత్ర వార పత్రికలో 'బొమ్మరిల్లు' శీర్షిక కింద ఒకటి ప్రచురించ బడింది. రచయిత పేరు లేదు. అన్నాదమ్ముల సంభాషణ రూపంలో ఉందాగేయం అల్లరి చేస్తున్న తమ్ముణ్ణి చూసి

''చందమామ నవ్వుతుంది తమ్మూ చూడు
గందర గోళమ్మింక త్వరగా వీడు''

అన్న అన్నకు

''చందమామ నవ్వదులే కోతలు మాను
కన్నాల గోళమది అన్నావినరా''

అంటాడు తమ్ముడు. అలా నీకెవరు చెప్పారని అడిగిన అన్నతో

'' అపోలో పంపించే బొమ్మలు చూశా
చూశాకే మామమీద మక్కువ పోయే''

అంటాడు.

హిందీలో కూడా ఇలాంటి గేయాలున్నాయి.

ఈ పాటలు రాకెట్టు గురించి, అంతరిక్ష యాత్రగురించి కృత్రిమ గ్రహాలను ఆకాశానికి పంపడాన్నీ తెలియ జేస్తాయి.

హిందీ తెలుగు బాలగేయాల్లో ఉన్న సామ్యాన్ని బట్టి చూస్తే భారతీయ భాషలన్నింటిలోను 'చందమామ' ప్రసక్తి ఉన్న పాటలు ఒకే విధంగా ఉండవచ్చనిపిస్తుంది. ప్రాంత భేదాల వల్ల కొన్ని భావనల్లో స్థూల భేదాలున్నట్లు కనిపిస్తున్నప్పటికీ ఈ గేయాల్లో భారతీయాత్మైకత అంతర్నిగూఢంగా అలరారు తున్నది.

# తెలుగువారి హిందీ రచనలు

శ్రీ భీమసేన్ నిర్మల్

ప్రాచీన కాలంలో కవులు భరతఖండంలో ఛప్పన్న (56) దేశాలు ఉండేవని వర్ణించేవారు. (ప్రస్తుతం మన దేశంలో రాష్ట్రాల సంఖ్య 25. ప్రస్తుత పరి ~ లను బట్టి చూస్తే రాష్ట్రాల సంఖ్య త్వరలోనే 56కు రుకోవచ్చు.) అవన్నీ సర్వస్వతంత్రమయిన రాచరిక వ్యవస్థ కలిగి ఉండేవి. అయితే బలాఢ్యుడూ, శక్తి సంపన్నుడు అయిన ఎవరో ఒక రాజు అశ్వమేధమో, రాజసూయ యజ్ఞమో చేసి, దిగ్విజయుడయి చక్రవర్తి, సమ్రాట్టు ననిపించుకునేవాడు. అయితే ఆయన చక్రవర్తిత్వం నామ మాత్రంగానూ, తాత్కాలిక మయిందిగానూ ఉండేది.

ఇలా రాజకీయంగా దేశం విభక్తమయి ఉన్నా, సాంస్కృతికంగా అవిభక్తమయి ఉండేది. సంస్కృతి, మతం, వాఙ్మయం మొదలయిన రంగాలలో మనదేశం అవిభక్తంగా ఉండేదనడానికి ఆధారాలు కోకొల్లలు. బాహిరంగా కనిపించే వైవిధ్యం వెనక ఆంతరంగికంగా నిక్షిప్తమయి ఉన్న ఏకత్వం, అఖండత్వం విదేశీయులకు ఆశ్చర్యం కలిగించ వచ్చునంటూ పండిత జవాహర్ లాల్ నెహ్రూ ఇలా అన్నారు:

'and yet underneath all this there is an Indianness which distinguishes every part of India and is something unique and deeper than the external differences that may strike the casual observer. **India is a curious mixture of amazing diversity and abiding unity.**'

సాంస్కృతికంగాను, మతపరంగాను అభివ్యక్తమయిన ఈ సమైక్య దృక్పథం భారతీయ భాషల్లోని సాహిత్యాల్లో అనేక రూపాలతో మనకు గోచరిస్తుంది. దీనికి మూలకారణం దేశమంతటా సార దేశికమయిన ఒక అనుబంధ భాష (lingua-franca) చారంలో ఉండడమే. ఈ సార్వదేశిక భాష మన ఆచార వహారాలను, వాఙ్మయ రీతులను తీర్చి దిద్ది, మనలను ఒక శ ప్రజలుగా - భారత జాతీయులుగా తీర్చి దిద్దింది. సంస్కృతం, పాళీ-ప్రాకృతం, అపభ్రంశం, ఆ తరవాత హిందుస్తానీ - ఆయా కాలాలలో ఈ భాషలు సార్వదేశిక భాషలుగా ప్రవర్తిల్లి దేశ సమైక్యాన్ని కాపాడాయి.

నేటి ఉత్తరప్రదేశ్‌లో ఢిల్లీ-మీరట్టుల మధ్యలో మాట్లాడబడే ఖడీబోలీ (శౌరసేని ప్రాకృతం నుండి ఉద్భవించిన మాండలికం) కారణాంతరాల వల్ల దక్షిణ భారత దేశానికి తరలి వచ్చింది. మహమ్మద్ తుగ్లక్ ఢిల్లీ నుండి దౌలతాబాదుకు తన రాజధాని మార్చిన కాలంలో ఉత్తరభారతం నుండి సైనికపరంగాను, వ్యాపారపరంగాను, ఎంతోమంది దక్షిణదేశం వచ్చి స్థిరపడి పోయారు. వారు తమ భాషలో సాహిత్యరచనలు చేశారు. అయితే ఆ రచనలన్నీ దాదాపు ఫారసీలిపిలో ఉండడం చేతనూ, ఇస్లాంమతానుయాయులవల్ల రచించబడడం చేతనూ, భాషా శాస్త్ర పండితులు ఆ రచనలకు హిందీ సాహిత్యంలో స్థానం కల్పించలేదు, ఆ రచయితలు తమ భాషను 'హిందవీ' 'హిందుఈ' అని పేర్కొన్నా. ఈ భాషలో రచించబడిన మొదటి రచన (14 శతాబ్దం) 'మస్నవీ కదంరావ్-పదమ్‌రావ్' అనే కావ్యంలో దాదాపు 85% సంస్కృత సమాలు సంస్కృత భవాలు ఉన్నాయని ఒక పండితుడు (డా.యన్.పి. మహమ్మద్ కుంజ మేత్తర్) నిరూపించాడు. శ్రీ మేత్తర్ ఆ భాషను ప్రస్తుతం ప్రచారంలో ఉన్న ఖడీబోలీ యొక్క ఆదిరూపమని కూడా సోపపత్తికంగా నిరూపించాడు. అయితే ఉర్దూ పండితులు దానిని ఉర్దూ భాష యొక్క మూలరూపమని అంటారు. 1954లో మొట్టమొదటి సారి సుప్రసిద్ధ భాషా శాస్త్రవేత్త డా. బాబూరాం సక్సేనా ఈ దక్ఖినీ (దక్షిణీ) భాషను గురించి శాస్త్రీయంగా గ్రంథ రచన చేశారు. 'దక్ఖినీ కా గద్య-పద్య' అనే పేరుతో మహా పండిత రాహుల్ సాంకృత్యాయన్ దక్ఖినీ భాషలోని కొన్ని గద్య పద్య ఖండికల సంకలనం ప్రచురించారు. ఆ తరవాత చాలా మంది హిందీ పండితులు దక్ఖినీ (ఈ పేరు ఆధునికులు పెట్టినది) రచనలను గురించి చాలా-చాలా రచనలు చేసారు. ఆయినా హిందీ భాషావేత్తలు వ్రజభాష, అవధీభాష, భోజపురి మొదలయిన మాండలికాలకు యిచ్చిన గౌరవం 'దక్ఖినీ'కి ఇవ్వలేదు.

ఆంగ్లేయులు మనదేశం వచ్చేటప్పటికి, మనదేశంలో ద్విభాషా సూత్రమే ప్రచారంలో ఉండేది. ప్రాదేశిక భాషతో పాటు, సార్వదేశిక భాష. అంటే ఆంధ్రదేశంలో తెలుగు భాషతో పాటు సార్వదేశిక భాష (పండితులలోనే) ప్రచా

రంలో ఉండేది. 18-19 శతాబ్దులలో హిందూస్తానీ భాష ప్రచారంలో ఉండేదనడానికి ప్రమాణాలు గోచరిస్తున్నాయి. (బహమనీ సుల్తానులు ఈ భాషలో సాహిత రచనలు చేయడమే కాకుండా రాజకీయ (administrative) వహారాలకూ ఈ భాషనే వాడారు.) నేడు భాషా శాస్త్రవేత్తలు 'దక్కినీ' అని పేర్కొనే భాషకు మూడు ముఖ్యమైన కేంద్రాలు- ఒకటి గోల్కొండ, రెండు గుల్బర్గా, మూడు ఔరంగాబాదు. ఈ మూడు కేంద్రాలలో వికసించిన దక్కినీ మీద క్రమంగా తెలుగు, కన్నడం, మరాఠీ భాషల ప్రభావం గోచరిస్తుంది. ఈ మూడు భాషల ప్రకృతి-వ్యాకరణాలను దృష్టిలో ఉంచుకొని, దక్కినీ భాష యొక్క స్వరూపాన్ని తులనాత్మకంగా పరిశీలించవలసిన అవసరం ఎంతగానో ఉన్నది.

తంజావూరును పరిపాలించి 'ఆంధ్రభోజుడ'ని ప్రఖ్యాతి వహించిన షాహజీ మహారాజు హిందీ భాషలో రెండు యక్షగానాలు (రాధావంశీధర విలాసనాటకం, విశ్వాతీత విలాస నాటకం) రచించాడు. ఈ నాటకాల రెండు ప్రతులు తెలుగులిపిలోను, ఒకటి దేవనాగరి లిపిలోను లభ్యమవుతున్నాయి. షాహజీ మహారాజు 'పంచభాషా విలాస నాటకం' అనే యక్షగానం రచించి, ఒక వైచిత్ర్యాన్ని ప్రయోగం చేశాడు. ఒకే రంగస్థలం మీద ఐదుభాషలను ప్రయోగించాడు. సూత్రధారుడు మాత్రం సంస్కృత భాషనే వాడతాడు. ఈ నాటకాల్లో ప్రయుక్తమయిన భాషస్వరూపాన్ని శాస్త్రీయంగా సమీక్షించ వలసిన అవసరం ఉంది.

విజయనగరం మహారాజా వారి ఆస్థానంలో ఉండి తులసీదాస కృత రామచరితమానసాన్ని ఆంధ్రీకరించిన శ్రీ శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారు, వారి సహాయకులు శ్రీ మండ నరహరి లేక కామయ్య శాస్త్రిగారిని గురించి చెప్పుకోవాలి. వారు మూల మానసంలో వాడిన దోహా చౌపాయి ఛందస్సులలో మొత్తం ఏడు కాండలను అనువదించారు. ఛందస్సు హిందీది. తెలుగులో వలె ద్వితీయాక్షర ప్రాస, హిందీలో వలె అంత్యానుప్రాస నియమాలనుపాటిస్తూ కావ్యానువాదం చేయడం చారిత్రికంగా మహత్త్వ పూర్ణమయిన విషయం. ఈ అనువాదానికి శ్రీ ముక్కామల రుక్మేశ్వర శాస్త్రి వ్రాసిన ప్రతిలిపి శ్రీ పి.వి.జి. రాజుగారి రాజకీయ గ్రంథాలయం నుండి సాహితీ బాంధవులయిన డా. బెజవాడ గోపాల రెడ్డిగారు సాహిత్య ఆకాడమీకి తెప్పించారు అనువాదంలో ఎక్కడా అరసున్న ప్రయోగం లేకపోవడం ఒక విశేషం.

విజయనగరం వారి గ్రంథాలయంలోనే హిందీ లో ప్రథమ నాటకంగా పేరెన్నిక గన్న 'నహుష్' నాటకం మొదటి వ్రాతప్రతి లభించింది. దానిని డా.వి.వి.ఎల్. నరసింహారావు గారి ఆధ ర్యంలో డా. గుర్రం సుబ్బారావుగారి సంపాదకత్వంలో చురించడం జరిగింది. అయితే ప్రస్తుతం హిందీలో లభ్యమవు న్న 'నహుష్' నాటకానికి, దీనికి అక్కడక్కడా పాఠాంతరాలు కనిపిస్తున్నాయి. సంపాదకుల దృష్టి ఈ విషయంపట్ల ప్రసరించకపోవడం పెద్దలోపమనే చెప్పాలి. ఈ నాటకంలోని భాషను గురించి తులనాత్మకంగా పరిశీలన జరగాలి.

వెంకటగిరి సంస్థానంలో 1843లో రచించబడిన 'వ్రజ చౌరాసీ కోశ్ యాత్రా వర్ణనం' అనే వ్రాతప్రతి లభించింది. ఇది తెలుగు లిపిలో వ్రాసిన శుద్ధమయిన వ్రజభాష, యాత్రావివరణం కూడా ప్రామాణికంగా ఉన్నదని మధురా నివాసి అయిన ప్రొ.సూర్యభాన్ రావత్ గారు అన్నారు. ఈ రచనలోని వ్రజభాషను కూడా అధ్యయనం చేయవలసిన అవసరం ఉన్నది.

ఆ తరవాత పేర్కొన దగిన కృషి చేసినవారు శ్రీ నాదెళ్ళ పురుషోత్తమ కవిగారు. మచిలీపట్నంలో ఉంటూ వారు హిందీలో 32 నాటకాలు (1864 నుండి 66 మధ్యకాలంలో) వ్రాశారు. అవికాక కొన్ని భజనలు కూడా హిందీలో వ్రాశారు. వారు 19[illegible]లో స్వర్గస్థులు కాగా, వారి సుపుత్రుడు శ్రీ మేధా దక్షిణామూర్తి శాస్త్రిగారు, తమ తండ్రిగారి హిందీ రచనలను, ఇచ్చవచ్చినట్లు మార్చి, తెలుగు లిపిలో ప్రచురించారు. అయితే స్వయంగా పురుషోత్తమ కవిగారు 1916 లో తాము రచించిన భక్త రామదాసు నాటకాన్ని ప్రచురించారు. వారు స్వదస్తూరితో ఉన్న (1864) 'అహల్యా సంక్రందనీయం' అనే నాటకం వ్రాతప్రతి లభించింది. ఈ రెండు నాటకాలు ఆధారంగా పురుషోత్తమ కవిగారి హిందీ భాషను పరిశీలించ వలసిన అవసరం ఉంది. రామదాసు నాటకానికి పీఠిక వ్రాస్తూ పురుషోత్తమ కవిగారు 'హిందూస్థానీ' 'హిందీ' శబ్దాలను నిర్వచించే ప్రయత్నం చేశారు.

ఇక్కడ గమనించవలసిన ఒక్క విషయం ఉంది. పైన పేర్కొన్న రచనలన్నీ, గాంధీగారు హిందీ ప్రచార కార్యక్రమాన్ని ప్రారంభించడానికి (1918) ముందు వ్రాయబడినవే. అందు చేత ఈ రచనలో ప్రయుక్తమయిన హిందీ భాషా స్వరూపాన్ని భాషా శాస్త్రనియమాలు ఆధారంగా, పరిశోధన దృష్టితో పరిశీలించాలి.

దక్కినీ భాషలో వ్రాసిన సాహిత్యం దాదాపు 75% ఇంకా వ్రాతప్రతుల రూపంలోనే ఉన్నది. ఆ సాహిత్యాన్ని వెలుగులోకి తేవలసిన అగత్యం ఉంది. అప్పుడే మన తెలుగు వారు హిందీలో వ్రాసిన రచనల గొప్పతనం తేటతెల్లం కాగలదు.

# లంబాడీల సామెతలు, పొడుపు కథలు

శ్రీ కె. ఓబిరెడ్డి

సామెత లేని భాషలేదు. ఆమెత లేని ఇల్లు లేదు. సామెత తెలియని వ్యక్తే లేడు విషయాన్ని నిశితంగా, సూటిగా, స్పష్టంగా సామ్య రూపంలో వ్యక్తం చేయడానికి సామెత ప్రతి ఒక్కరికీ ఉపకరిస్తుంది. సామెతలు ప్రపంచం లోని అన్ని వర్గాలలోను, కులాల్లో కన్పిస్తాయి. ఒక దేశంలోని వానినిగాని, ఒక భాషలోనివిగాని, మాండలికంలోని సామెత లను గాని పరిశీలిస్తే, ఆయా దేశ, భాష, మాండలిక, జీవన విధానం, మతం వానిని సంప్రదాయం, ఆచార వ్యవహారాలు, నైతిక విలువలు, మనస్తత్వం అన్నీ బయట పడుతాయి అని చెప్పడం సమంజసం.

నిత్య జీవితంలో మానవుడు సుఖదుఃఖాలను రెండింటిని సమానంగా అనుభవిస్తాడు. తాను అనుభవించిన దాన్ని ఇతరులకు ఉపదేశాత్మకంగా, సందేశరూపంలో, చిన్న వాక్యంలో అందిస్తాడు. సామెత అల్పాక్షరాలలో అనల్ప భావాన్ని, అనుభవాన్ని సూటిగా చెప్పగలుగుతుంది. జీవితం అనుభవాల కూడలి. అట్టి అనుభవాల ఆధారంగా పుట్టినదే సామెత. కేవలం అనుభవాల నుంచే గాక కథలలోని నీతులనుండి ఏర్పడిన సామెత లెన్నో ప్రచారంలో ఉన్నాయి. అందుచేత సామెత ప్రజల సంస్కృతిని, జనజీవనాన్ని, జీవన సిద్ధాంతాన్ని, మానవ మనస్తత్వాన్ని ప్రతిబింబించే సాధనం.

అన్ని భాషల్లోలాగే లంబాడీల వ్యవహారంలోను సామెతలు కొల్లలుగా ఉన్నాయి. వారు వీటిని సమయస్ఫూర్తితో, చాలా తెలివిగా ప్రయోగిస్తారు. వారు సామెతలను ''వాతేర, ''తోది'', ''కావత్'' అని పిలుస్తారు. వీటిని వాడేటప్పుడు మాటల సందర్భంలో ''కావతేన్ ఇం చాల్ గీఛ'' అంటే ''ఇలా జరిగి పోయింది'' అని అంటూ సామెతను ఉదాహరిస్తారు. ఈ ''కావత్'' అనే పదానికి ''సమాజం, ప్రపంచం'' అనే రెండు అర్థాలున్నాయి. సమాజంలో ఇంతకు ముందు జరిగిపోయిన సత్య సంఘటనలే ఈ ''కావత్''ల రూపంలో చిరస్థాయిగా నిలిచాయని వాళ్లనమ్మకం. అందుకే వాళ్లు వాటిని ఎంతో ఆదరపూర్వకంగా ఉపయోగిస్తారు లంబాడీలు వాటిని న్యాయ పంచాయతీలలో విశేషంగా వాడుతారు. ''వతనేన్ జతన్ గరుణోవ గతేపర్ ఖర్చ కరణో''- జ్ఞానంతోగూడిన మాటలను చాలా గోప్యంగా ఉంచుకొని, సమయం వచ్చినప్పుడు మాత్రమే ఖర్చు చేయాలి ''అనే సామెత సామెతలను ఎంత జాగ్రత్తగా వాడాలి. అనే అంశాన్ని తెలియజేస్తుంది.

లంబాడీల సామెతలను మూడు విధాలుగా విభజించ వచ్చు. 1. వృత్తులకు సంబంధించినవి. 2.ధర్మనిష్ఠ, ఆచారవ్యవహారాలు, సంప్రదాయాలకు సంబంధించినవి. 3.సమాజ వ్యవస్థను తెలిపే సామెతలు.

1. వృత్తులకు సంబంధించిన సామెతలు:-

కొన్ని లంబాడీ సామెతలు వాళ్లు సంచార జీవులు అనే విషయాన్ని స్పష్టంగా తెలియజేస్తాయి.

1. ఊటరే చందాతో ఊజ్ దందా
- ప్రొద్దున నుండి సాయంత్రం వరకు ఒక్కటే వ్యాపారం.

2. కాకదేర్ ఘర్ పోటే పాచ్
- నత్తగుల్ల ఇల్లు వీపు మీద.
- ఈ సామెత వాళ్లను రేపు గురించిన ఆలోచన లేకుండా కడుపు నింపుకోవడం కోసం ఉన్న తట్టబుట్ట భుజాన వేసుకొని ఒక చోట నుండి మరో చోటికి సంచరించడాన్ని తెలియజేస్తుంది (సూచిస్తుంది).

3. కొరా పేట్ దుకతో కూన్ అజమో కావా
- ఎవరికి అజీర్ణమై కడుపు నొప్తోందో వాడే మందు తినాలి. లంబాడీలు న్యాయ నిర్ణయం చేసేటప్పుడు పై సామెతను వాడుతారు. ఎవరి కష్టాన్ని వాళ్లే పరిష్కరించు కోవాలి అనే సూచన నిస్తుందీ సామెత.

4. పూల్ వచేరా జాగ్ కడవే చేరా వేజాయ
- పూలు అమ్మినచోట గడ్డి అమ్మేటట్లు అయింది.

లంబాడీలు చాలా బీదవాళ్లు అయినప్పటికీ మానం, మర్యాద, ప్రతిష్ఠల ప్రశ్న వచ్చినప్పుడు చాలా గంభీరంగా, హుందాగా వ్యవహరిస్తారు. పరిస్థితుల ప్రభావం వల్ల ఒకప్పుడు బాగా బ్రతికిన కుటుంబాలు చితికిపోతే (దెబ్బతింటే) పూలమ్మిన చోట గడ్డి అమ్మాల్సిన పరిస్థితి వచ్చిందని వాపోతారు.

5. నూనే వాలేర్ అంగా నాళారే వాళో రోగో తోకచ
- వాన వచ్చేటప్పుడు ఉప్పు అమ్మేవాడు ఊరకుంటే టెంకాయలమ్మేవాడు పొర్లిపొర్లి ఏడుస్తాడు.

6. రాబే బనా చాబేనా మళేణి
- కష్ట పడితే తప్ప తినడానికి దొరకదు.

2. ధర్మ నిష్ఠ, ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలకు సంబంధించిన సామెతలు:-

1. ధర్మవేగో కోటాతో భగవాన్ వేగో రోటో
భగవాన్ వేగో రోటోతో సాంసో వేగో జాటో

- తలవ్రాత సుమారుగా ఉంటే భగవంతుడు కూడా శత్రువు అవుతాడు. భగవంతుడే శత్రువైతే మనిషి ప్రయత్నాలు అన్నియు వ్యర్థమని వాళ్ల నమ్మకం.

2. ధర్మేర్ ధర్మజ్ పాపేర్ పాపజ్ తరీయా
- ధర్మానికి ధర్మం, పాపానికి పాపం లభిస్తుంది.

3. పాప మరీయా ధర్మ తరీయా
- పాపం మునిగి పోతుంది, ధర్మం తేలుతుంది.

4. రీతేన్ టీచ్ నీతర్ బడేన్ టీచ్
- తానే గొప్పవాడనని భావించకు, తెలిసిన వాళ్లను అడిగి ముందుకు పోవాలి.

5. మోటో మోటో నేను మాటో మారేను పేను
మోటో మోటో కే తానీ మోట్ మనూతినవే జాణో
- నీతిగల వాళ్లను మాత్రమే పెద్దలు అనాలి. పెద్దలు నీతి తప్పకుండా ఉండాలి.

6. లగిబిగి టళేణి మాంగో దావ్ మళేణి
- దైవ లిఖితం తప్పదు, ఆశించిన దంతా దొరకదు.

7. కాగళార్ సరాపేతి బూదో బళద మరేణి
- కాకి శాపానికి ముసలి ఎద్దు చచ్చి పోదు

3. సమాజ వ్యవస్థను తెలిపే సామెతలు:-

1. ఘర్ కా భేది లంకా భేది
- ఇంటిలోని వ్యక్తి ఇంటి గుట్టును రట్టు చేస్తాడు.

2. గాళా దేన్ హాత్ బందాళ జీవ్
- పగ్గమిచ్చి (త్రాడు ఇచ్చి) చేయి కట్టేసి కొన్నట్లు అబద్ధం చెప్పి తన్ను తానే కట్టించు కొన్నాడు.

3. దావు దేకన్ ఘావు గాదె
- గాయం మీద వాత పెట్టడం.

4. సాంజేరో పామణో సవారె రోపై తీసరే దాతేరో కు కాయీ.
- సాయంకాలం వచ్చిన చుట్టం మరుసటి దినం బంట్రోతు ఆ మర్నాడు బిచ్చగాడు. ఇంటి కొచ్చిన చుట్టాలు ఎక్కువ రోజులుంటే చులకనై పోతాడని ఈ సామెత చెపుంది.

5. పేళో జోడా సోనేరూ తోడా
దూసరోజోడా చాతీరో పోడా
- మొదటి జంట బంగారం లాగా సౌఖ్యం, రెండవ జంట ఎదలోని పుండు. అంటే ఒక భార్య సుఖాన్నిస్తుం దని, ఇద్దరు భార్యలుంటే ఎదలోని పుండులా ఉంటుందని చెప్తారు.

పొడుపు కథలు: జానపద విజ్ఞానంలో ప్రత్యేక శాఖగా పరిగణించ దగినంత వ్యాప్తి కలది పొడుపు కథ. వీటికి జీవితమే మూలధనం. జీవితంలోని సమస్యల్ని విడగొట్టడా నికి మనిషి చేసే ప్రయత్నమే వీటికి ప్రేరణ. సామాన్య జనుల్లో పొడుపు కథలు బుద్ధికి పదును పెట్టి కుతూహలాన్ని రేకెత్తించే ప్రక్రియ. ఇది వినోదంతో పాటు విజ్ఞానాన్ని అందిస్తుంది. సంకేత భాషతో గూఢార్థాన్ని పొంది ఉండే ఈ పొడుపు కథలు ప్రశ్నోత్తర రూపంలో ఉంటాయి. అంటే ఒకరు పొడుపు కథ ఒడ్డితే (వేస్తే), ఎదుటివాడు దాన్నివిప్పుతాడు. సామాన్యులు తీరిక వేళల్లో వినోదం కోసం లెక్కలేనన్ని పొడుపు కథల్ని వేసుకొని అదొక సవాలుగా భావించి వాటికి పరిష్కారాల్ని అన్వేషించి సమాధానం చెప్పడానికి ప్రయత్నిస్తారు.

లంబాడీ భాషలో పొడుపు కథలను ''కబద్'', ''పాడే రాసాది'' అనే పేర్లతో పిలుస్తారు. ఈ పొడుపు కథలు వాటిని ప్రయోగించే ప్రజల తెలివి తేటల్ని సూచిస్తాయి. ఒక భాష యొక్క సమృద్ధికి ఈ పొడుపు కథలు ప్రతీకలని చెప్ప వచ్చు.

1. తాటి ఊట పర బాతీనా
దల్ డామా హతా గాలరీ

- కాంచలి (రవికె)

- సామాన్యంగా లంబాడీస్త్రీలు రాత్రివేళ నిద్రబోయేట ప్పుడు తమ రవికెను విప్పివేసి నిద్రబోతారు. తిరిగి ప్రొద్దున్నే వేసుకొంటారు. అందువల్ల ఈ పొడుపు కథ ప్రచారంలోకి వచ్చింది.

2. బా పేతి బేటా బడో
పోతో బడో సరదారా

తేని ఏ కజ దాడ పై వావచ
ఓ కూన్ వీయ - దై - మాణి - గీ
(పెరుగు-వెన్న-నేయి)
- తండ్రి కంటే కొడుకు ముందు, కొడుకు కంటే మనమడు ముందు, వీళిద్దరికంటే సరదార్ ముందు. ఈ ముగ్గురు ఒకే రోజు పుడుతారు. వాళ్లెవ్వరు? - (పెరుగు, వెన్న, నేయి)

3. అంగడీ మా ఛేని
తాకిడిమా తోలేని
ఓరసాయి పూజా వేణి (గోబర్ - పేడ)
- అంగడిలో దొరికేది కాదు, తక్కెడలో తూచేది కాదు. అదిలేక పోతే పూజలేదు - పేడ.

లంబాడిలు గో పూజ చేస్తారు. వాళ్లలో ఏ పూజా పురస్కారాలు జరిగినప్పటికి ఆవు పేడతో అలికి ముగ్గు వేసి పూజకు సిద్ధంచేస్తారు. వాళ్లదృష్టిలో పేడ లేకపోతే పూజజరగదు అనే అంశాన్ని ఈ పొడుపు కథ చెప్పుతుంది

4. నాణక్యాసో మాటి తాలన్ తోలన్
కాందే పరగోతి మాతే పరచోటి (కూకదో-కోడిపుంజు)
- భుజం మీద వస్త్రం, తల మీద జుట్టు, పొట్టి మనిషి, ఊగులాడుతూ నడుస్తాడు - కోడిపుంజు

5. హల్ హల్ కర్తా దహిసహి జంతా
మూమాంగ్ తా హత్ సహి పూచ్తా (నారల - టెంకాయ)
- హల్ హల్ అంటుంది, పాలు తోడు వేస్తే పెరుగు కాదు. అయితే నోరు అడుగుతుంది కాని, చేతికి మాత్రం అందదు - టెంకాయ నీళ్లు.

ఈ విధంగా లంబాడీ సాహిత్యం చాలా వైవిధ్యంతో కూడి ఉంది. ఈ సాహిత్యంలోని ప్రతి ప్రక్రియ లోతు, వైశాల్యం నిరూపించడానికి విశాల ' తిపదిక అవసర మెంతైనా ఉంది సాంస్కృతిక విలువల ద్ప ో కొన్ని సామెతలను, పొడుపు కథలను వ్యాసంలో పరిశీ ంచడం జరిగింది

ఆంతర దర్శన విధితః స్సరసం సాధు జన విపశ్చితాం చేతః।
సౌజన్య మివ హితోక్త్యా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

తనలో తాను చూచుకోడంవల్ల, ఆత్మ సాక్షాత్కారంవల్ల సహృదయుల, సాధువుల, విద్వాంసుల మనస్సులాగ, హితవచనాలవల్ల సౌజన్యంలాగ ఓ సుందరీ! నీ దేహకాంతి యౌవనంవల్ల వెలుగొందుతున్నది

— ఉపమావలి నుండి

* * *

పరకృత తనయ శ్లాఘా శ్రవణా జ్జనక ఇవ సద్వినీత మతేః।
గృహ మివ బంధు సమేతం తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

తన కుమారుని గొప్పతనాన్ని ఇతరులు పొగడడంవల్ల తండ్రిలాగ, బంధువుల రాకవల్ల వినయ సంపన్నుడైన గృహస్థు ఇల్లులాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావలి నుండి

# తొలినాళ్ళ తెలుగు కథానిక

శ్రీ అక్కిరాజు రమాపతి రావు

తెలుగులో చిన్న కథ ఆధునిక సాహిత్య ప్రక్రియ. దీనిని పూర్తిగా పాశ్చాత్య సాహిత్యంనుంచి దిగుమతి చేసుకోక పోయినా ఈ ప్రక్రియ ఉద్భవ వికాసపరిణామంలో విదేశీ సాహిత్య ప్రభావం అనల్పం. మానవ జీవితం ఈ ప్రక్రియకు ముడి వస్తువు. మానవ జీవితాన్ని మానవ సంబంధాలను, ఉద్రేకాలను, ఆశలను, ఆశయాలను, ఆదర్శాలను, మానవుడు అందుకోగల ఎత్తులను, చేరుకోగల అధోగతిని, ఈ ప్రక్రియ వస్తువుగా చేసుకున్నంతగా, మానవుడి సహజాతాలను ఈ ప్రక్రియ ప్రతిబింబింపజేసినంతగా మరొకప్రకియ పట్టించుకోలేదు. ఈ శతాబ్ది తెలుగు సాహిత్య చరిత్రలో మొదటి పాదం కథాయుగం అని చెప్పాలి. పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థంలో నాటక రచనకు పూనుకోని ప్రసిద్ధ రచయిత లేనట్లే ఈ శతాబ్ది ప్రథమపాదంలో ప్రతిప్రసిద్ధ రచయితా కథా రచనకు పూను కున్నాడు. మహోపాధ్యాయ ఆచంట వేంకట సాంఖ్యాయన శర్మగారిని కథా రచన ఆకర్షించడం ఆశ్చర్యం కాదా?! అదిన్నీ గురజాడ అప్పారావు కంటే ముందేను. తెలుగు కథ సద్యోయౌవ్వనంతో ఆవిర్భవించింది. గురజాడ వంటి ప్రతిభావంతుడు ఆధునిక ప్రమాణాలతో, సాహిత్య ప్రయోజనాకాంక్షతో ఈ ప్రక్రియను తెలుగువారికిచ్చాడు కాబట్టి ఆధునిక సాహిత ంలో ఈ ప్రక్రియ అంత ఆకర్షకమైందేమో?! ఈ శతా  మొదటి రెండు దశకాలలో కొమర్రాజు లక్ష్మణరావు,  టంరాజు పున్నయ్య వంటి మహా ప్రతిభావంతులు కథారచన పట్ల ఆకర్షితులైనారు. ఇంచు మించుగా గురజాడ అప్పారావుతో పాటే వీరు కూడా కథారచన చేపట్టారు. సాంఖ్యాయనశర్మ గారు గురజాడ కన్నా పదేళ్ళముందే తమ పత్రిక కల్పలతలో 'అపూర్వోపన్యాసం' వంటి కథ ప్రచురించారు. అపూర్వోపన్యాసం, పౌరాణిక, చారిత్రకేతి వృత్తంతో ప్రతిపాదించిన కథ కాదు. భాషకూడా శిష్టవ్యవహారానికి చాలాదగ్గరగావుంది. అంతకు పూర్వమే శర్మగారు 'లలిత' అనే కథను కూడా వ్రాశారుకాని అది పాత కాలపు శృంగార వీర ప్రణయగాథాత్మకంగా వుంది కాబట్టి ఆధునిక వాసనలు లేవనవచ్చు. 'అపూర్వోపన్యాసం' అలాంటిది కాదు. కొంత పరిహాసపేశలంగా కూడా వుంది ఈ కథ. రాజ మహేంద్ర వర వితంతు సమాజ ప్రస్తావన కూడా వుంది. వితంతు వివాహం అవశ్యాచరణీయమూ, అనివార్యకర్తవ్యమూ అంటూ శ్రీధర శాస్త్రి సంఘ సంస్కరణాభిమానుల సమావేశంలో ఉపన్యసించి ఒకవితంతు యువతి మనసు చూరగొనడం ఇందులోని కథావస్తువు. అయితే ఆ ఉపన్యాసం చేయగల సత్తా అతనికి లేదు. అందువల్ల శ్రీధరశాస్త్రి భాషా సాహిత్య ప్రావీణ్యమున్న ఒకమిత్రుణ్ణి ఆశ్రయించి తన భావవ్య "రణ సామర్థ్యానికి మెరుగుపెట్టు కుంటాడు. ఆమెఅత  అభిమానిస్తుంది. వాళ్ళిద్దరూ పెళ్లాడటానికి ఉద్యుక్తుల తారు. ఈ కథలో భాషా నవ్యతకూడా లేకపోలేదు. గురజాడ అప్పారావుగారి దిద్దుబాటులో కూడా సరళ గ్రాంథికఛాయలు లేక పోలేదు. ముందాయన ఈ కథను గ్రాంథికంలోనే రాసి తర్వాత వ్యావహారికంలోకి మార్చారు. అట్లానే గురజాడ రచించిన 'మీ పేరేమిటి' అనే కథలో కూడా పాత్రోచితంగా గ్రాంథికఛాయలు కనపడతాయి. కాబట్టి గ్రాంథికమా వ్యావహారికమా అన్నదానిని బట్టి కాక ఇతివృత్త న తను బట్టి తెలుగు కథా ప్రక్రియ ఆవిర్భావాన్ని ని  ంచవలసి ఉంటుంది. సాంఖ్యాయన శర్మగారు పాతకాల  పండితుల ప్రతినిధికాదు. గిడుగు వారి వ్యావహారిక భాషోద్యమాన్ని ఆయన సమర్థించారు. గురజాడ ప్రతిపాదించిన 'పాత కొత్తల మేలుకలయిక'కు ఆయన ప్రతినిధి. ఆయన కథారచనను చేపట్టడమే గొప్ప సంగతి.

ఈ శతాబ్దం కాలయవనిక మీద కనపడటానికి ముందే 'జనానా' వంటి పత్రికలో కథలు వచ్చాయి. అయితే—అవి సాంఘికేతి వృత్తాలే అయినా పాతకాలపు ఫక్కీలో ఉండటం, పూర్తిగా గ్రాంథికశైలిలో ఉండటం వల్ల అవి సాహిత్య పరుల దృష్టిని ఆక  చలేదేమో! 1893, 94 ప్రాంతాలలోనే తెలుగు జనానా ప  క ప్రారంభమైంది. ఈ పత్రికను మల్లాది వెంకట రత్నంగా  ు విద్యాశాఖ ఉన్నతోద్యోగి ప్రారంభించగా ఐదారు సంవత్సరాల తర్వాత రాయసం వేంకట శివుడుగారనే విద్యావేత్త, ఆ రోజుల్లో ఉన్నత కళాశాల ప్రధానాధ్యాపకులుగా పనిచేసిన వారి నిర్వహణలోకి వచ్చింది ఈ పత్రిక. దీనిలో ఇవటూరి కనకాచలంగారనే వారు ఈ శతాబ్ది ఆగమనపు తొలిరేకలు విరుస్తుండగానే కథలు వ్రాశారు. ఈయనే కృష్ణా

పత్రికలో కూడా కథలు వ్రాశారు. 1912 ఏప్రిల్‌లో షవటూరి కనకాచలం గారి చిన్న కథ ఒకటి కనపడుతుంది. అయితే తెలుగు కథకుల జాబితాలో ఈయన పేరు ఎక్కినట్లుగా కనపడదు. అప్పట్లో ఉన్న పత్రికలలో ఈయన 10, 15 సంవత్సారాల పాటు కథలు వ్రాశారు.

గురజాడ అప్పారావు గారి 'దిద్దుబాటు' కథ 1910 ఆంధ్రభారతి ఫిబ్రవరి సంచికలో వచ్చింది. ఈ కథ చదివిన పాఠకుల కళ్ళుజిగేల్మన్నాయి. నన్నయ్యగారి భారతం వెలువడగానే అంతకు పూర్వం పద్యాలూ, గేయాలూ, పాటలూ, స్తుతులూ విస్మృతమై పోయినట్లు ఆధునికమైన చిన్నకథకు అప్పారావే జనకుడైనాడు.

తెలుగులో కథా రచనను ప్రోత్సహించిన తొలి పత్రిక 'సాహితి'. ఇంచు మించుగా ఇది కథల పత్రిక ఏమోనను కోవచ్చు. 1919 ప్రాంతాలలో మొదలైంది. రెండు మూడేళ్ళ కన్నా ఎక్కువ కాలంరాలేదు. అయితే చింతాదీక్షితులు, చలం, మునిమాణిక్యం, శ్రీనివాస శిరోమణి, వంటి ప్రతిభావంతులైన కథా రచయితలను పరిచయం చేసింది. సాహితి వెలువడటానికి ముందే 'ఆఖ్యాయిక' అనే పేరుతో ఒక్క కథల పత్రిక (మరే రచనలూ ఉండవు) వెలువరించాలని శివశంకర శాస్త్రిగారు ప్రయత్నం చేసినట్లూ, అది సాగనట్లూ వారేవ్రాశారు.

ఈ శతాబ్ది మూడు దశకాలను తెలుగు కథ ఉద్భవ వికాస పరిణామందృష్ట్యా సమీక్షిస్తే వంగూరి సుబ్బారావు వంటి సాహిత్య, చరి పరిశోధకులు, వేలూరి శివరామ శాస్త్రి గారి వంటి ..నీ పారంగతులు, శేషాద్రి రమణ కవుల వంటి పరిశో లు, భులుసు వేంకట రమణయ్యగారి వంటి సాహిత్య శాస్త్ర పారీణులు, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి వంటి తరతరాల వైదికాచార వాతావరణ ప్రభవులూ కథారచన పట్ల మక్కువ చూపిన వైనం తెలుస్తుంది.

1923లో బందరు నుంచి 'శారద' పత్రిక ప్రారంభమైంది. ఆ తర్వాత సంవత్సరానికి గాని కాశీనాథుని వారు 'భారతి'ని ప్రారంభించ లేదు. 'శారద'ను దత్తం చేసుకోవల్సిందిగా ఆ పత్రికా నిర్వాహకులు కాశీనాథుని వారిని అర్థించి నట్లూ అయినావారు అందుకు అంగీకరించక 1924 జనవరి నుంచి భారతిని నడిపినట్లూ, ఆనాటి సాహిత్య వాతావరణనేపథ్యం తెలిసినవారు వ్రాశారు. బందరు నుంచి శారద పత్రికను తీసుకొని రావడం కష్టమై పోయి సంవత్సరం గడిచిన తర్వాత ఆ పత్రికను నిలిపివేశారు. కౌతా శ్రీరామ శాస్త్రి, నడింపల్లి వేంకట లక్ష్మీ నరసింహా రావు ప్రభృతులు 'శారద' పత్రిక నిర్వాహకులు. బందరు జాతీయ కళాశాలలో చిత్ర కళాధ్యాపకులైన ప్రమోదకుమార్ చటర్జీ 'శారద' పత్రిక ముఖ చిత్రాన్ని రూపించారు. వీణాపాణియైన సరస్వతీ దేవి చిత్రం ఇది. ఇంచు మించు 'భారతి' పత్రిక కూడ తరవాత ఇటువంటి ముఖ చిత్రాన్నే స్వీకరించింది.

ఇంతకూ 'శారద' మాస పత్రిక మూడు సంవత్సరాలు మాత్రమే వెలువడ్డా ఆధునిక తెలుగు సాహిత్యంలో అత్యంత ఉన్నత ప్రమాణాలను నెలకొల్పింది. మంచి కథలూ ప్రచురించింది. ప్రతి సంచికలోనూ ఒకటో, రెండో కథలుం డేవి. అయితే అన్ని కథలు బాగా లేవు. సమకాలీన సమాజం, ఆ సమస్యలు, సంఘర్షణలు ఇతివృత్తంగా తీసుకున్నా భాష చాలా కృతకంగా ఉండేది చాలా కథలలో. శిల్పం అంటూ వారప్పటికి ఎరగరేమోననిపిస్తుంది. ఒకటో రెండో సంఘట నల చుట్టూ సాంద్రంగా ఎత్తుగడ, ముగింపు, క్రమోన్మీలనం విన్యసింప జేయకుండా పాత్రల మనసులలో కథకుడు తాను దూరి, వంతపాటగాడిలాగా మధ్యమధ్య తాను కల్పించుకుని వ్యాఖ్యానం చేస్తూ, పాత్రల వ్యక్తిత్వాన్ని భావశీలాలను పాఠకుడెక్కడ గ్రహించలేకపోతాడో అని ఆత్రుత చూపుతూ కథవ పద్ధతినే ఎక్కువగా అనుసరించారు చాలా మంది రచయితలు. మరొక విశేషం ఏమిటంటే కథానిక వీలైనంత సంగ్రహంగా చిక్కగా ఉండాలన్న ధ్యేయంతో కాక నవలలో లాగా సంఘటన బాహుళ్యాన్ని, స్వగతాలను, ప్రకృతి వర్ణనలను గుప్పించే వారు తొలి తరం కథారచయితలు చాలామంది. ముఖ్యంగా భాషాశైలి చాలా సంక్లిష్టంగా ఉంటూవ చ్చింది. పది మందికి ఒకరు కూడా చక్కని వ్యవహారికరచ నను అభ్యసించలేదని ఆ కథలను బట్టే తెలుసు కోవచ్చు. పారనంది జగన్నాథ స్వామిగారు ఎమ్.ఎ., ఎల్.టి విద్యాధి కులు. పర్లాకిమిడి జా గారి ఫస్ట్‌గ్రేడ్ కళాశాలలో ప్రధానాధ్యాపకులు. 19 4 మార్చి సంచిక 'శారద'లో వారు ఒక కథ ప్రచురించారు. ఆ కథపేరు 'అంతకంటే తక్కువ మరిలేదు'. కథ పేరే గం' గోళంగా ఉంది. జైలు గదిలో ఒక ఖైదీ స్వగతంతో ' రంభమవుతుంది. ప్రారంభం ఆకర్షణీయంగా ఉంది అ కుంటే తర్వాత కథ అంతా 'ఫ్లాష్ బాక్' పద్ధతిలో అగమ్య గోచరంగా తయారయింది. ఆనాడు పెద్దలు వ్రాసిన చాలా కథలు కూడా భాషా విషయంగానూ శిల్పవిషయంగానూ ప్రాథమిక స్థాయిలోనే ఉన్నాయి. సుదీర్ఘమైన సంభాషణలు, రచయిత స్వయంగా కల్పించు కొన్న వ్యాఖ్యానాలూ కనపడతాయి. సామాన్య పాఠకుడికి అవి సరళంగా బోధపడవు. కార్యకారణ సంబంధం కూడా దూరాన్వయంగా ఉంటుంది. ఈ కథలలో గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి ఉద్యమించిన ప్రాంతంలో, వారి ప్రభావానికిలోనై కూడా ఒక విద్యాధిక రచయిత ఇటు

వంటి కథ వ్రాయడం విస్మయావహమే. ఇలాంటి కథలలో హఠాత్సంభవాలు, అభౌమమైన వృత్తాంతాలు, వాస్తవికతను దూరంచేస్తాయి. 1940 దాకా కథను అంకెలు వేసి భాగాలుగా రాయటం ఉండేది. కొందరు రచయితలైతే క, చ, ట, త పలు య, ర, ల, వ, శ, షలు అని కథా కథన విభాగాలకు పేర్లు పెట్టారు. జగన్నాథ స్వామిగారు రాసిన కథ ఇలా మొదలవుతుంది. ''విశాఖ పట్నం జైలు అరలో ఇటికెల వెంకటప్రసాదము ఈతాకుల చాపపై పరుండి తన నలుప్రక్కలను కావలి కాచియున్న వెలుతురు వైపు అదేచూస్తూవున్నాడు. ఒక కూనీ కేసులో వానిని పట్టుకొని రిమాండులో ఉంచియున్నారు.

పట్టుకొన్న నాటి నుండి ఎన్నో మార్లు అను కొని యున్నట్లు ఈ రోజు కూడా తనలో తాను ఈ లాగు అనుకొంటూ వున్నాడు; ఎంత మాత్రం నేరము చేసిన వాడుకాడనిన్నీ అందు చేత నేరము చేసినట్లు తాను ఒప్పుకోనవసరము లేదనిన్నీ వాని అభిప్రాయము''. ఈ ఖైదీ ఇదివరలో 15 సం.లు జైలు శిక్ష అనుభవించి విడుదలకాగానే మళ్ళీ ఖూనీ చేసి జైలుకు వచ్చినట్లూ, జడ్జిగారు జైలుకు వచ్చి హంతకుడుగా అనుమానితుడైన ఈ ఖైదీని తన నేరం వొప్పుకోవలసిందిగా నిక్కచ్చి చేసినట్లూ, హంతకుడికి ఒకకూతురు ఉన్నట్లు, ఆ కూతురిని తాను ఇరవై ఏళ్ళుగా చూడక పోయినా రక్షించే ఉద్దేశంతో నేరాన్ని వొప్పుకున్నట్లూ రచయిత గంద్రగోళం సృష్టించాడు. బహుశా ఏదైనా ఇంగ్లీషు కథను దృష్టిలో పెట్టుకొని దానిని అనుసరించబోయి తికమకపడ్డట్లున్నది. ఆ వాతావరణము, సంభాషణలూ, సన్నివేశాలూ దేశీయ సమాజానికి అనుగుణంగా లేవు. శ్రీశ్రీ కూడా భారతిలో ఒక అపరాధ పరిశోధక కథ వ్రాశాడు. 'మధుసూదనుడాలోచ నాయత్త చిత్తుడైయుండెను'' అని మొదలవుతుందా కథ. ఈ కథ 1930 ప్రాంతాలలో వచ్చింది. కాబట్టి దీని వల్ల ఆంగ్లసాహిత్యంలో మంచి పరిచయం వున్న రచయితలు కూడా తెలుగులో రాయడానికి పూనుకొనే సరికి భాష విషయంలో, శిల్పం విషయంలో వారెంతో తబ్బిబ్బు పడేవారని తెలుస్తుంది.

'శారద' రెండో సంపుటం మొదటి సంచికలో ఆంధ్ర శేషగిరిరావు గారి కథ వుంది. 1924 సెప్టెంబరు సంచిక అది. ఆంధ్ర శేషగిరిరావుగారు 1930లలో ఆంధ్రభూమి అనే మాస పత్రిక నడిపారు. ఈ పత్రికలో చలం, పురాణం కుమార రాఘవశాస్త్రి, కొడవటిగంటి, తాత కృష్ణమూర్తి మొదలైనవారి కథలు వచ్చాయి. 'ఆంధ్ర భూమి' పత్రిక మొదలయ్యే కాలానికి వస్తువు, శిల్పం, భాష కొంత మెరుగు దేరాయి.

శారద పత్రికలో ప్రకటిత మైన ఆంధ్ర శేషగిరి రావుగారి కథ పేరు 'సుందరశివరావు'. కథలోని పాత్రపేరు ఆ కథ పేరుగా చేయడం శిల్ప విషయ మైన అతి ప్రాథమిక స్థాయి అని చెప్పాలి. కథ వాతావరణం, చెప్పేతీరు, శైలి సాపుదేరాయి. అయినా కథలోని ఇతివృత్తాన్ని బట్టి ఇంతకన్నా మంచిపేరు పెట్టవచ్చు. ఇతివృత్తనవ్యత మాత్రం శేషగిరి రావు గారీ కథలో సాధించారు. వ్యాపారస్థుల మధ్య అనుచితమైన పోటీ ఉండకూడదనీ, ఒకకట్టుబాటు ఉండాలనీ లేకపోతే నష్టపోయే అవకాశం ఉందనీ, ఒకరిని చూసి ఒకరు అదే వ్యాపారానికి ఎగబడకూడదనీ ఈ కథలో సందేశం వుంది దాని నిర్వహణ కూడా బాగుంది. ఇది చిన్న కథ అయినప్పటికీ రచయిత అయిదు భాగాలుగా విభజించారు. నాటకంలోనూ నాటికలోనూ అంకాలు, రంగ స్థలాలు విభజన ఉన్నట్లు తొలి రోజుల్లో కథారచయితలు కూడా రూపక శిల్పాన్ని దృష్టిలో పెట్టుకొని దాన్ని కథకు కూడా అనువర్తింప చేశారేమోననిపిస్తుంది ఈసన్నివేశ విభాగం చూస్తే. మరయితే కథనం మీదనే దృష్టి ప్రసరింప చేశారు కాని సంభాషణల ద్వారా కథ నడపలేదు.

''సుందర శివరావు'' కథ ఇట్లా ప్రారంభమవుతుంది. ''పెనుగొండ గోదావరి కాలువయొడ్డున నున్నది. అక్కడి భూములు సస్యవంతములైన సుక్షేత్రములు. ఎకరమునకు వచ్చు పంట రెండు పుట్లు. ఆగ్రామములో నూరెకరము లున్న వానిని పిల్లజమీందారనవచ్చును. సుందరశివరావు తండ్రి గంగాధరశాస్త్రి యట్టి పిల్లజమీందారులలోనొకరు విశేషించి విద్యావంతులు, పెనుగొండకు గరణముకూడా అందుచే వారికి నా యూరిలోమాట చెల్లుబడి విశేషము.''

ఈ శైలి ఇంతకు పూర్వం 50 సంవత్సరాల కిందట వీరేశలింగం రచించిన సత్యవతీ చరిత్రను పోలి ఉంది. లేదా విశ్వనాథ సత్య నారాయణ గారిశైలిలాగావుంది. చిన్న కథకు వ్యావహారికం శోభించి నంతగా గ్రాంథికం అందం చేకూర్చ లేదని చిన్న కథ తెలుగులో రూపరేఖలు దిద్దుకొన్న నాలుగు దశాబ్దాల దాకా బహుళ సంఖ్యలోని రచయితలు తెలుసుకోలేక పోవడం విచిత్రమే. ఆధునిక వచన రచనకు అరసున్న లక్కర లేదన్న విషయం ఈ శతాబ్ది పూర్వార్ధం వరకు పండితులు గమనించక పోవడం అంతకన్నా విచిత్రం వచనం వైశద్య ప్రధానమైనది. సృజనాత్మక రచనకు శాస్త్రకట్టు అక్కరలేదు. పనికిరాదు.

స్థూలంగా 'సుందర శివరావు' కథలోని కథ ఇది. రావు విద్య పూర్తిచేసుకున్న తర్వాత ప్రభుత్వ నౌకరీని ఆశించ లేదు. అది అంటే అతనికి అయిష్టం అందువల్ల వ్యాపారంచేసి

పైకి రావాలని నిర్ణయించుకున్నాడు. వ్యాపారం చెయ్యాలంటే డబ్బుకావాలిగా! తండ్రిని అడిగాడు. తండ్రికి వ్యాపారం ఇష్టంలేదు. అయినా రావుతన పట్టువీడలేదు. అత్త మామలు, తల్లిదండ్రులు, బావమరిది ఎవరెన్ని విధాలుగా ప్రాధేయ పడినా రావు ససేమీరా అని మంకు పట్టు పట్టి ఆస్తి పంచుకున్నాడు. అతడికి తండ్రి 30 యకరాల పొలం దఖలు పరిచాడు. ఆ పొలాన్ని వెంటనే 35 వేలకు అమ్మివేశాడు రావు. గోదావరి జిల్లాలో ఎకరం వెయ్యి రూపాయలు అంటే కారు చవక. అప్పటి పరిస్థితి అది. ఒక షావుకారు బియ్యంమర అమ్ముతుంటే దాన్ని కొనుగోలుచేశాడు రావు. పెను గొండలో బియ్యంమర స్థాపించాడు. మొదటి రెండు నెలల్లోనే అతడికి రెండువేల లాభం వచ్చింది. మూడు పువ్వులు ఆరుకాయలుగా సాగింది అతడి వ్యాపారం. ఊళ్ళో డబ్బుగలవారికి అసూయాజనకమైంది అతడి 'మిల్లు'. ఇందుకు తోడు ఒకసారి రామిరెడ్డిగారి వడ్లు మిల్లులో ఆడటం ఆలస్యమైంది. అంతేకాదు రామిరెడ్డి విరోధి సుబ్బిరెడ్డి వడ్లు ముందుగా బియ్యమాడించి ఇచ్చాడు రావు. ఇక్కడ రచయిత లోకరీతి పరిశీలన ప్రశంసావహంగా ఉంది. ఆయనిట్లా అన్నారు. ''మన వారిలో నొక దుర్గుణమున్నది. ఒక డొక వ్యాపారములో బాగుపడుచుండిన నందలు కూడ నా పని చేసి తమకును దమకంటె ముందా వ్యాపారము చేయుచున్న వారికి నష్టము కల్గింతురు''. చూపోపమియే కాకుండా తన వడ్లు మర ఆడించటంలో రావు నిర్లక్ష్యమూ, జాప్యమూ దర్శించి నందువల్ల రామిరెడ్డి తాను కూడా ఒక 'మిల్లు' రంభించాడు ఆ ఊళ్ళోనే. పర్యవసానం ''రెండు మరలకు టీ సంభవించెను. ఒక మరకంటెవేరొకటి తక్కువ ధర కాడ మొదలు పెట్టెను''. ఈ దెబ్బతో సుందర శివరావు పని ఆరుమూడైంది. వరసగా నష్టాలు వచ్చాయి. మిల్లుకు మరమ్మతులు కూడా కలసి వచ్చాయి. రెండున్నర సంవత్స రాలయ్యేప్పటికి ఇరవైవేల రూపాయలు అప్పు తేలింది. ''శివరావునకు ఆతని సంతోష స్రవంతి యెండిపోయినది. ఉత్సాహదీపిక కొండ యెక్కినది. అప్పు తీర్చుటకు మర విక్రయింపక తప్పదు. ఎంతలోనెంత మార్పు.'' ఇక్కడికి రెండు భాగాలు (ఒకటి, రెండు) కథ అయిపోయింది. ఇక్కడ ఒక వింత మలుపు తిరిగింది కథ. గంగాధర శాస్త్రి గారింటిలో తులసికోట దగ్గర కూర్చుని పదహారేళ్ళమ్మాయి ప్రవిమల గాంధర్వం అద్భుతంగా ఆలపిస్తున్నది. ఇరుగు పొరుగు వాళ్ళంతా పేరంటానికి వచ్చినట్లుగా ఉంది. ఆ అమ్మాయి సంగీతానికి ముగ్ధులైపోయినారు. ఇందులో రామిరెడ్డి భార్య సూరమ్మ కూడా వుంది. ఆమెకు ఆ అమ్మాయి సంగీతం మరింత ముచ్చట వేసింది. ఇంతకూ ఆ సత్యవతి గంగాధర శాస్త్రి గారి కోడలు. సుందరశివరావు భార్య. రామిరెడ్డి భార్య శివరావు తల్లి కామేశ్వరమ్మగారిని 'అమ్మా మీ కోడలిని ఒక సారి మా ఇంటికి పంపించరా అని బ్రతిమాలుకొంది. 'వెళ్ళిరా అమా ' అని అత్తగారు కోడలిని పురమాయించింది. రామిరె భార్య సూరమ్మ సత్యవతిని వాళ్ళింటికి తీసుకొని వెళ్ళి స ల రాజోపచారాలు చేసింది. బంగిన పల్లి మామిడి పళ్ళు కొన్ని యిచ్చి సత్యవతి తిన్నదాక బలవంతపెట్టెను. నాటి యుదయముననే వారి యింటిగేదె యీనుటచే బర్రెజున్ను కూడ బెట్టెను. జున్నంటె సత్యవతి చెవిగోసికొనును? ప్రేమతో బెట్టిన జున్నామె సంతుష్టిగభుజించె.'' ఈ విధంగా సూరమ్మకు, సత్యవతికి ప్రాణస్నేహమైపోయింది. నీకు సంగీతం నేర్పిస్తాను అని సత్యవతి అంటే సూరమ్మ సంబర పడిపోయింది. దాని ఫలితం ఊరికే పోలేదు. ఐతంపూడి వెంకట సుబ్బయ్యగారి ఆరువందల బస్తాల ధాన్యం శివరావు మిల్లుకి రాగా అతడు అప్పటిదాకా తీసుకుంటున్న బస్తాకు పావలా చొప్పున మర ఆడించటానికి ఒప్పుకోలేదు. రూపాయిన్నర చొప్పున బస్తాకి ఇస్తే తప్ప ఆ ధాన్యం ఆడించనని చెప్పాడు. 'అబ్బోనిన్నదాకా లేని టెక్కు' ఇప్పుడొచ్చిందని జీతగాడు రామిరెడ్డి దగ్గరకు వెళ్ళాడు. శివరావు గారి దగ్గర నుంచి వస్తున్నావా అని అతణ్ణి అడిగాడు రామిరెడ్డి. అయితే ''ఆయన దగ్గరకేపో. నేను కూడా రూపాయిన్నరకు తక్కువ దమ్మిడీ కూడా తగ్గించను. అదీకాక ముందుగా ఆయన దగ్గరకు వెళ్ళావు కాబట్టి అక్కడికే తీసుకొని పో.'' ''వారి మీద పోటీగా మేము వ్యాపారము చేయము.''

సుందర శివరావుకు మళ్ళీ దశ తిరిగింది. కొద్ది రోజుల్లోనే ఇరవైవేల అప్పు నాలుగు వేలల్లోకిదిగింది. సుందరశివరావు, రామిరెడ్డి స్నేహితులైనారు. ''సత్యవతిరానిచో నీపాటికి సుందరశివరావు పనియేమైయుండునో'' అన్న వాక్యంతో కథ ముగిసింది. ఈ కథ సుందరంగా ఉంది. చిన్నకథకు కావలసిన అందచందాలన్నీ ఉన్నాయి. గ్రాంధికం ఒకటీ, మధ్య మధ్య రచయిత కల్పించుకొని సూరమ్మ, సత్యవతులు ఏమేమి మాట్లాడు కొనిరో మనకు తెలియదు, కొన్ని మాటలు మాత్రం విన్పించినవి-అన్న వ్యాఖ్యానాలు మాత్రం కథా శిల్పంలో లోపాలు.

ఇక 1925 ఫిబ్రవరి 'శారద' సంచికలో 'లాజరస్' అనే కథ ప్రచురితమైంది. రచయిత ఎవరో తెలియదు. 'భానుడు' అనే గుప్తనామంతో ఈ కథ రచితం. ఇది రెండు పుటల చక్కని చిక్కని కథ. 'గాంధీ మహాత్మునికి జై' అని ఫలశ్రుతితో ముగుస్తున్నది కాబట్టి గాంధీజీ ప్రారంభించిన హరిజనోద్ధరణ ప్రభావం కొట్టవచ్చినట్లు కనపడుతున్నది. కడుపు నిండా కూరికూరితినే సంతర్పణలు ఒక చోట,

నకనకలాడే కడుపులు ఒక చోట; ఇది దురన్యాయం కాదా అని ఈ కథలో విచికిత్స ధ్వనితం. ఇంత చిన్నకథను ఐదు భాగాలుగా విభజించాడు రచయిత. కథ కరుణరస ప్రపూర్ణం. ఈ రచయిత ''భాసుడు'' ఎవరో ఇంత వరకూ తెలియక పోడవడం విచారకరం.

''భోజనకాలే సీతారామస్మరణ గోవిందా గోవింద'': అని ఈ కథ మొదలవుతుంది. ఇది శిల్పవిషయంగా పురోగతి.

''రామయ్య గారు సప్తాహం మొదలుపెట్టినారు. సప్తాహ మల్లా దోనయజ్ఞంగా మార్చారు. గడ్డం పెంచటానికి ప్రారంభించారు. యజ్ఞం ఆరునెలలకు కాని ముగియదు. బ్రాహ్మణులు పంక్తులు తీర్చికూర్చున్నారు. వర్తకులు బియ్యం నెయ్యి బండ్లతో తోల్తున్నారు. వ్యవసాయదారులు గుమ్మడికాయలు తెచ్చిపోగు వేస్తున్నారు. ఆ గుట్టలు కొండంతైనవి. రామయ్యగారిపేరు వారి గడ్డంతో పాటు గ్రామంగ్రామం పాకిపోతున్నది. ఈ సంగతి విన్నవూళ్ళ వాళ్ళంతా రామయ్య గారికి మొక్కుబళ్ళు చెల్లిస్తున్నారు. ఊరంతా పందిరివేశారు. ఇళ్ళన్ని గంగాళాలు చేశారు.'' బ్రాహ్మలు భోజనాలు చేస్తున్నారు. తిన్నది అరిగేట్టు గోవిందలు కొడుతున్నారు.

వీరడు నెలరోజు లైంది పట్టెడు మెతుకులు తిని. పిల్లల గోడుచూడ లేక పందిరి దగ్గరకువెళ్ళాడు. రామయ్య గారికి ఆగ్రహం ముంచుకొనివచ్చింది. వీరడికి దేహతాడనం జరిగింది. అతడు దెబ్బల కోర్వలేక అసలే శుష్కించిన శరీరం వదిలిపెట్టాడు. వీరడి కొడుకు నాగడికి ఈ దురాగతం, ఈ దుర్మతం అర్థంకాలేదు. క్రైస్తవ మతాచార్యుడ తణ్ణి చేరదీశాడు. అతడు 'లాజరస్' అయి బాగాచదువుకొని వృద్ధిలోకి వచ్చాడు. కళింగపట్నం కమీషనరైనాడు. నెలకు నాలుగు వేలపైజీతం. తల్లీ ముగ్గురు పిల్లలతో మంచి బంగళాలో కాపురమున్నాడు. ఇంతలో గాంధీ మహాత్ముడి సహాయ నిరాకరణం ప్రారంభమైంది. ఉద్యమం ఉవ్వెత్తుగా లేచింది. రోజుకు 3 వందల మందిని కారాగారంలోకి పంపిస్తున్నాడు లాజరస్. ఇది అతడికి బాధగా ఉంది. ఉద్యోగం మానేద్దామా అనుకున్నాడు. అయితే అన్నంఎట్లా? అన్నంలేకనేకదా తన తండ్రి చచ్చిపోయింది? ''దేశమునన్ను త్యజించునప్పుడు నేనేల దేశమును త్యజించకూడదు? అని చాలా బాధ పడ్డాడు. అతడి సంస్కారం అతణ్ణి గుచ్చి గుచ్చి ప్రశ్నిస్తున్నది. ఒక రోజు రామయ్య అతడి ముందు నిందితుడిగా హాజరుకావల్సిన సంఘటన తటస్థించింది. పరస్పరం ఒకరి నొకరు గుర్తించుకున్నారు. రామయ్య సత్యాగ్రహం చేసిరాలేదు కమీషనర్‌గారి ముందుకు. బీదవా ళ్ళపై దౌర్జన్యం చేసినందు వల్ల వచ్చాడు. ఆయన అప్పటికే 'రావు బహుదూర్' అయినాడు. లక్షలు లక్షలు గడించాడు. లాజరస్ రూపంలో ఉన్న తమ ఊరి నాగణ్ణి చూసేప్పటికి రామయ్యకు చాలా పశ్చాత్తాపం కలిగింది. వీరణ్ణి నిష్కార ణంగా తాను హతమార్చినట్లు కుమిలి పోయినాడు. తన ఆస్తిని హరిజనోద్ధరణానికి వినియోగించటానికి కృతనిశ్చయు డైనాడు. 'లాజరస్'ను సంకోచం లేకుండా కౌగలించుకు న్నాడు.'' ఇదీ కథ. 'లాజరస్' బైబిల్ లోని ఒక ముఖ్య పాత్ర. క్రీస్తు ప్రభువు అనుగ్రహానికి పాత్రుడైన నిరుపేద.

ఈ కథ రచించిన 'భాసుడు' బాగా విద్యాధికులై ఉంటారు. బైబిలుతో కూడా బాగా పరిచయం ఉండి ఉండాలి వారికి. కళింగ పట్నం రంగస్థలంచేశారు కాబట్టి విజయన గరం, శ్రీకాకుళం ప్రాంతాల వారేమోనవిపిస్తుంది.

1929, 30 సంవత్సరాలలో కథారచనను మరింత ప్రోత్సహించే ఉద్దేశంతో మూడు పత్రికలు బయలుదేరాయి. ఇవి పూర్తిగా కథల పత్రికలే అని చెప్పడానికి వీలు లేక పోయినా కథలకే ప్రాధాన్యం ఇచ్చే ఉద్దేశంతో బయలు దేరిన పత్రికలు. ఇందులో 'ఆనంద భారతి' అనే పత్రిక ఇట్లా అన్నది...... కథలకై ప్రత్యేకింపబడియున్న పత్రిక యొక్కలే నియు కాను పించుటలేదు. ఆ కొరతను దీర్చుటకే ఈ పత్రిక ప్రచురించుటకు మేము పూను కొనుట యైనది.'' అయినా ఈ మూడు పత్రికలూ మఖలో పుట్టి పుబ్బలో మాయమైన చందమైనాయి. ఈ ఆనంద భారతి సంపాదకులు ఎస్.జి.ఆచార్య. ఈ పత్రికలో శ్రీ బులుసు వేంకటరమణ య్యగారు 'శ్యామల' అనే పెద్ద కథ ప్రచురించారు. తక్కిన రెండు పత్రికలు ఆనందవాహిని, ఆనందబోధిని అనేవి. ఇవి రెండూ 1930 జనవరి, జూన్‌లలో ప్రారంభమైనాయి. ఈ పేర్లు చూస్తుంటే తమిళంలో అత్యంత ప్రాచుర్యం పొందిన 'ఆనంద వికటన్' ప్రభావం జ్ఞాపకానికి వస్తుంది. అయినా ఈ పత్రికలు మూడున్నూ కొన్ని సంచికలతో మాత్రమే ఆగిపోయినాయి. కాశీనాథుని వారి 'భారతి' మాత్రమే ఆ తర్వాత 60 సం.లు తెలుగు కథా వికాసానికి దోహదం చేసింది. 1936లో ప్రారంభమైన 'ప్రతిభ' అంతకుపూర్వమే నవ్యసాహితీసమితి పక్షాన బయలు దేరిన 'సఖి' ఆ కాలంలోనే ఒకటి రెండు సంపుటాలు మాత్రమే వెలువడ్డ 'జయంతి' తెలుగు కథావికాసానికి తమతమ పాత్ర నిర్వహించాయి.

# శ్రీ రామాయణ పరమార్థము సత్ప్రవర్తనము

శ్రీ శ్రీభాష్యం అప్పలాచార్యులు

శ్రీరామాయణము మహాకావ్యము. వేదసమ్మితము. పూర్వభాగ, ఉత్తర భాగములలో వేదము నిరూపించిన బాహ్య వర్తనమును, ఆంతరజ్ఞానమును ప్రతిపాదించినది. శ్రీరామాయణమున వేద తిపాదితమైన ధర్మమే బాహ్యవర్తనము. ఉపనిషత్ప్రతి పా మగు బ్రహ్మజ్ఞానము శ్రీరామాయణమున వ్యంగ్యప్రతి ద్యము. శ్రీరామాయణమును పోలిన మహాకావ్యము వేరొకటిలేదు. బాహ్యముగా మధురము, ఆంతరముగా మధురాక్షరము అయిన కథను వాల్మీకి ఇందు ప్రతిపాదించినాడు. శబ్దార్థములలో, భావములలో, భావనలలో, వర్ణనలలో, రసపోషణలలో మధురమైన కావ్యము. ఆంతరముగా ఆనందస్వరూపమై, సత్యమై వెలయు మధురాక్షర తత్త్వమగు బ్రహ్మమిందు ప్రతి పాదింపబడినది. అందు చేతనే వాల్మీకి ప్రార్థనలో ''కూజంతం రామరామేతి మధురం మధురాక్షరం'' అని ప్రార్థించినాడు. అలౌకికము. వేదచోదితము అగు అభ్యుదయ నిశ్రేయస స్థాధనము ధర్మము. అభ్యుదయ సాధనమగు ధర్మములు లౌకికములు, పారలౌకికములు అని రెండు విధములు. నిశ్శ్రేయస సాధనమగు ధర్మము ఉపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మజ్ఞానము. ఈ రెండును ప్రత్యక్షముచే గాని, అనుమానముచే గాని ఎరుంగ వీలుకానివి. అందుచే దీనిని తెలియజేయు గ్రంథమును 'వేదము' అందురు. ఆ వేదమే లౌకికమగు ఛందమున కావ్యముగా చతుర్ముఖ ప్రసాదలబ్ధ దివ్యజ్ఞాన సంపన్నుడు, నారదోపదిష్ట రామకథాకుశలుడును అగు వాల్మీకిచే ఈ లోకమునకు అవతరించింది. వేదపూర్వభాగప్రతిపాదితమగు ధర్మము బాహ్య కథారూపములోను, ఆంతరమగు జ్ఞానము వ్యంగ్యార్థమునందు నిక్షేపించి వాల్మీకి శ్రీ రామాయణమును రచించినాడు. వేదమంతయూ ధర్మప్రతిపాదక మగుటచే శ్రీ రామాయణము ధర్మమునే ప్రధానముగా నిరూపించినదనుటచే శ్రీ రామాయణ ప్రతి పాద్యుడగు శ్రీ రామచంద్రుని ''రామో విగ్రహవాన్ ధర్మః'' అనినారు. సమాజములో తమచుట్టునూ తనతో సంబంధించి ఉన్న వారందరినీ తనప్రవర్తనచే ఆనందింపజేయుచూ, తానానందించుటయే ధర్మము. శ్రీరాముడు దుశ్శకములైన సత్య, ధర్మములను నడిపిన మహాధీరుడు. అందుచే శ్రీ రామాయణము తరచుగా రాముని 'సత్యపరాక్రమః' అనియు 'సత్యధర్మపరాయణః' అనియూ కీర్తించుచుండును.'' మానవుడు ప్రధానముగ పాటించవలసినధర్మము సౌశీల్యము. అభిజన, విద్యా, విత్తములచే తానధికుడయ్యు తనకంటె తక్కువ వారిని తక్కువగ చూడకుండ ఉండుట మానవత్వము. శ్రీరాముని ప్రధానలక్షణము ఈ నిరహంకారత. తనకంటె తక్కువవాడైన గుహుని 'ఆత్మసమస్సఖా' అని ప్రశంసించిన మహా శీలసంపన్నుడు. అతడు తనకు చేయ బూనిన ఆరాధనను స్వీకరించుటకంటె ''పద్భ్యామభిగమాచ్చైవ స్నేహసందర్శనేనచ'' నాలుగడుగులు ఎదురుగా వచ్చుట చేతను ప్రఫుల్లమునైన ముఖముతో సుగ్రీవునితో అగ్ని సాక్షికముగ సఖ్యము చేసికొని రావణుని చేతిలో అతడు చనిపోవునేమో అని భయపడి అశ్లీలమగు ఆమాటకూడ అనుకొనలేక 'త్వయికించిత్స మాపన్నే కింకార్యంసీతయామమ' అనిన పరమోదారుడు. భార్యాపహర్తయైన రావణుని వాని సోదరుడు విభీషణుడు దహన సంస్కారమునకు సంశయించినపుడు 'యథాహ్యేష తథామమ' నీకెంతో నాకంత. అని, తాను సంస్కరించుటకు సిద్ధపడిన పరమోదారుడు శ్రీ రామచంద్రుడు. తిర్యగ్జాతికి చెందిన జటాయువు చనిపోయినపుడు ''రాజ్యాద్భ్రష్టః వనేవాసం సీతానష్టా హతో ద్విజః ఈ దృశీయం మమాలక్ష్మీః, నిర్దహేదపి పావకమ్'' అని తన దౌర్భాగ్యము చేతనే జటాయువు చనిపోయినాడని విలపించి స్వయముగ సంస్కరించినాడు. ఇట్టి సన్నివేశములు చూచినపుడు సాక్షాత్ శ్రీ మహా విష్ణువైన శ్రీ రాముడు మానవుడుగా దిగివచ్చి మానవుల కొఱకు ఎంతటి సత్ప్రవర్తనమును ఆచరించి నేర్పినాడో స్మరించు కొనిన అతని ఋణమును మానవజాతి ఏనాటికీ తీర్చలేదు. ఎంతటి జ్ఞానమున్ననూ ప్రత్యేకమైన వరము వాక్కు ఒక్క మానవునకే లభించినది. దానిని దుర్వినియోగ పరచుకొనకుండ, కాపాడుకొనుటయే మానవుని కర్తము. మాటకు నాలుగు లక్షణములుండవలెను. సత్యము, యము, హితము, మధురము. ప్రధానముగ పారుష్యములేకుండుట అవసరము. శ్రీ రామునిగూర్చి ''ఉచ్యమానోపి పరుషం నోత్తరం ప్రతి పద్యతే, మృదుపూర్వంతు భాషతే'' అని మాటలో పారుష్యములేకుండుట, మార్దవముండుట ప్రధానలక్షణములుగా పేర్కొనినారు. పరుషముగా మాట్లడిననూ పరుషముగా బదులు పలుక లేకుండటకు కారణము అశక్తికాదు.

''ఉత్తరోత్తరయుక్తాచ వక్తావాచస్పతిర్యథా'' మాటకుమాట సమాధానము చెప్పుటలో వాచస్పతి యంతటి వాడు అని నారు. మాటతో తపసుచేయవలెనని భగవద్గీత వాఙ్మయ తపసును చెప్పినది. ''అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియక రంచయత్'' అని మనసుకు వెగటు కలిగించనట్టి సత్యము, ప్రియము, అయిన మాటమాట్లాడుట వాఙ్మయ తపస్సు. స్మిత పూర్వాభి భాషీచ, పూర్వ భాషీచ రాఘవః'' ముందుగ చిరునవ్వుతో పలుకరించువాడు, ముందు పలుకరించువాడు శ్రీ రాముడే, అంతే కాక మాటలో ''సత్యవాదీచ భూతానాం ప్రియవాదీచ రాఘవః'' అని సత్యమును, ప్రియమును పలుకు వాడని పేర్కొనినారు. మాటకు ప్రధానముగ రెండు లక్షణము లుండ కూడదు. ఒకరాడిన మాటను అవసరము లేకున్నను కాదని ఖండించుట, కలహించి పలుకుట. రాముడు ఈ రెండు లక్షణములు లేనివాడని ''నవిగృహ్య కథారుచిః, నవిరుద్ధకథా రుచిః'' అంటాడు వాల్మీకి. మాటలలో ఈ లక్షణములు పాటించుటచే మానవులలో అన్యోన్యము స్నేహభావము, సద్భావము పెంపొందును. ఇట్లు నిరహంకారత, సాధువా దము, సౌశీల్యము చాల ఆవశ్యకములని శ్రీ రామచంద్రుడు తనప్రవర్తనచే నిరూపించినాడు. సత్ప్రవర్తనము కలవానికి లోక మంతయు సాయపడును. దుష్ప్రవర్తనము కలవానిని లోకమం తయు ఏవగించు కొనును అను సిద్ధాంతమే శ్రీ రామాయణ పరమార్థమని మన పెద్దలు సంగ్రహముగా ఒక శ్లోకములో చెప్పిరి.

> ''యాంతి న్యాయ్య ప్రవృత్తస్య తిర్యంచోపి సహాయతాం
> అపంథానం తు గచ్ఛంతం సోదరోపి విముంచతి''

ధర్మమార్గమును వీడక నడుచువానికి తిర్యక్కులు కూడ సాయపడును. ధర్మ మార్గమును తప్పి నడచువానిని సోద రుడు కూడ విడచిపోవును. శ్రీ రాముని విషయములో, రావణుని విషయములో ఈ నీతి స్పష్టముగా గోచరించును. రామాయణ పరమార్థమైన సత్ప్రవర్తనము అలవడిన వ్యక్తి శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు. వారి సౌజన్యము, సౌశీల్యము, వినయము, నిరహంకారత తరువాతి వారందరికి ఆదర్శభూత ములు. మహావిమర్శకులై ఉండి మహోన్నత పదవులను చేపట్టి అపూర్వ భాషా శాస్త్ర సిద్ధాంతములను ప్రకాశింప జేసియూ సహజ వినయ సౌజన్యములు వీడని మహనీయ మూర్తి శ్రీ రామకృష్ణయ్య గారు. శ్రీ రాముడు అహల్యా శ్రమమునకు విశ్వామిత్రునితో వెళ్లినపుడు అది నిర్జనమగు వనము. ఆ వనమున రాముడు ప్రవేశించగనే ఒక స్త్రీ లేచి నిలువబడి శ్రీరాముని సత్కరించెను. ఆమె శాపవృత్తాంతము, శాపమోక్ష ప్రకారము అంతకు ముందే వినినారు రామలక్ష్మణులు. తమవల ననే ఆమె శాపవిముక్తురాలైనదని వారహంకరించలేదు. ''తస్యా జగృహతః పాదౌ'' ఆమె పాదములను పట్టి నమస్కరించినా రట. అట్టి వినయ మేదుర దివ్య స్వరూపము శ్రీ రామచంద్రు నిది. విశ్వామిత్ర యాగ సంరక్షణమునకు ఆరు రాత్రులు ఆశ్రమమున నిలచి కాపాడి మారీచ సుబాహులను తొలగించిన తరువాత విశ్వామిత్రుని ఎదుట నిలచి ''ఇమౌ స్మ మునిశా ర్దూల! కింకరౌ సముపస్థితౌ'' అని తాము కింకరులమని చెప్పిన మహనీయమూర్తి శ్రీ రామమూర్తి. గొప్ప పరాక్రమశాలి అయి ఉండియు ''మహతా స్వేన వీర్యేణన విస్మితః'' తన పరాక్రమ మునకు తాను గర్వించెడి వాడుకాదు. సుగుణాకరుడగు శ్రీ రామునిలో గనిలో రత్నములవలె గుణములు లెక్కించుటకు శక్యముకాదు. చూచినవారి నందరినీ ఆకట్టుకొనెడి అనుభా వము శ్రీరామునిది. ఇట్టి సత్ప్రవర్తనమే తమ జీవిత సారముగా నడచిన మహనీయుడు శ్రీరామ కృష్ణయ్యగారు. పదవీ కాంక్ష, అర్థతృష్ణ, కీర్తి లోభముగల పండితులు, విమర్శకులు ఎందరో ఉండవచ్చుకాని ఆదోషము లేమియులేక తాముచేయు భాషా కృషియే పరమధర్మముగా పాటించిన మహనీయులు శ్రీరామ కృష్ణయ్యగారు.

వారితో నాకు గల పరిచయము వారి పరిశ్రమకు సంబం ధించి కాదు, వారి భాషా శాస్త్రమును గూర్చియు కాదు. వారింటిలో రెండు సంవత్సరములు ఉండుటచే వారు నన్నాక ర్షించిన తీరు నా మనసును వీడక ఏవో కొన్ని మాటలు వారిని గూర్చి పలికి వాక్కును సార్థకము చేసుకొనవలెనని వ్యాసమును వ్రాసితిని. ఆదర్శమూర్తులైన అట్టివారి శాస్త్ర పరీక్ష, ప్రవర్త నము కూడ లోకమున కాదర్శమై వెలయగలదు.

నాకీ అవకాశమునొసంగిన కార్య నిర్వాహకులకు కృతజ్ఞత తెలియజేసి కొనుచు ఈ వాచికమైన ఉపాయనమును శ్రీ రామకృష్ణయ్యగారి దివ్యస్మృతికి అర్పించు కొనుచున్నాను.

# భారతీయ సౌందర్యతత్త్వం

## (శకుంతల - గౌరి)

శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి

మనం ప్రకృతి సౌందర్యాలను తిలకించినపుడల్లా అవి మనలో ఆనందాన్ని ఆవిర్భవింపజేస్తాయి. ఇట్లే అజంతా, ఎల్లోరాగుహలలోని సౌందర్యశిల్పాలను, దివ్యదేవాలయాల మీది శిల్పసౌందర్యాలను చూసినప్పుడు కూడా అవి మనమానసాల్లో మధురానుభవాలను రేకెత్తిస్తూంటాయి, కనుక ''సౌందర్యం'' అనేది సర్వదా మనకు సమధిక సంతోష సంధాయక మౌతుందని తేలింది. ఈ విషయాన్నే, సౌందర్యతత్త్వోపాసకుడైన ''కీట్సు జోహన్'' అనే ఇంగ్లండు దేశపుకవి "A thing of beauty is a Joy for ever" అని తెలిపినాడు. ఇక అమరనిఘంటువునకు వ్యాఖ్యానగ్రంథమైన *గురుబాలప్రబోధిక* సుందరశబ్ద నిర్వచనంచేస్తూ- ''సుతరాం ఆద్రియతే ఇతి సుందరం. *దృజఆదరే*'' అని చెప్పినది. అంటే - మిక్కిలి సంతోషపెట్టేదే *సౌందర్యం* అనిపించుకొంటుంది అని ఆ ధాత్వర్థం. ఇంత వరకు చెప్పినది ప్రపంచంలోని విశిష్టవస్తువులను ఆశ్రయించి ఉన్న *సౌందర్యం*. ఇట్టి ఈ సౌందర్యం ప్రపంచాన్ని వ్యాపించి ఉన్నట్లే మహాకవుల కావ్యప్రపంచాన్ని కూడా వ్యాపించి ఉంది. ఉదాహరణకు - క్రీస్తుశకమునకు ముందుకాలంలో ఉన్న కాళిదాసమహాకవి, ''అభిజ్ఞాన శాకుంతలము'' అనే తన నాటకంలో ''శకుంతల యొక్క దివ్యసౌందర్యమును అద్భుతంగా వర్ణించినాడు. ''గౌథే'' అనే యూరోపుదేశమహాకవి, ఆ సౌందర్య వర్ణనంలోని తీరుతీయందనాలకు, గురుత్వ, మహత్త్వ, పటుత్వప్రాభవములకు పరవశుడై నాట్యం చేసినాడు. అంతటి దివ్యసౌందర్య సమలంకృత ఐన శకుంతల ఇప్పుడు లేదు. ఐనప్పటికీ ఆ శకుంతలాదులయొక్క దివ్య సౌందర్యమణికాంతులు ఇప్పటికినీ, ఆ మహాకవుల కావ్యాలనే నిలువుటద్దాలలో నిత్యంగా ఆ చంద్రతారకంగా ఆ మహాకావ్యాలలో ప్రకాశిస్తూనే ఉన్నాయి. కనుక, మహాకావ్యాలను ఆశ్రయించి ఉన్నసౌందర్యమే సత్యశాశ్వత సౌందర్యం అనిపించుకొంటుందని శుక్రనీతిసారం, ''శాస్త్రమానేన యోరమ్య స రమ్యోనాన్య ఏవహి'' అని తెలిపింది కనుకనే రెండువేల యేళ్ళ నాటిశాకుంతలనాటకగతమైన శకుంతలా సౌందర్యవర్ణనమును చూసిముగ్ధుడై ఆ గోథే ఒళ్ళుమరచి నాట్యం చేసి ఈ క్రింది గీతమును ఆలపించినాడు:

### SAKUNTALA ITS INNER MEANING

" Would'st thou the young year's blossoms and the fruits of its decline,
And all by which the soul is charmed,
Enraptured, feasted, fed.
Would'st thou the Earth and Heaven itself
ɔine?
I name thee, O Sakuntala! and all at
Once is said, (Goethe)

మీది గోథే ప మునకు, విశ్వకవి రవీంద్రనాథ ఠాకూర్ మహాశయుని ఆం గాషా వివరణమే ఈ క్రిందిది. ఈ వివరణము, మీది ఆం -ద్యమునకు మహాభాష్యమనదగియున్నది.

'Goethe' the master poet of Europe, has summed up his criticism of Sakuntala in a single quatrain; he has not taken the poem to pieces. This seems to be a small thing like the flame of a candle, but it lights up the whole drama in an Instant, and reveals its inner nature.

In Goethe's words, Sakuntala blends together the Young years blossoms and the fruits of maturity; it combines heaven and earth in one

We are apt ogy lightly as mere poetical out burst. We are apt to consider that it only means in effect that Goethe regarded Sakuntala as fine poetry. But it is not really so His stanza breathes not the exaggeration or rapture but the deliberate judgment of a true critic. There is a special point in his words. Goethe says expressly that Sakuntala contains the history of a development-- the development of flower into fruit, of earth into heaven, of matter into spirit....

In truth there are two unions in Sakuntala and the motif of the play is the progress from the earlier union, of the first Act, with its earthly unstable beauty and romance, to the higher union in the heavenly hermitage of eternal bliss described in the last Act

This drama was meant not for dealing with a particular passion, not for developing a particular character, but for transmitting the whole subject from one world to another-- to elevate love from the sphere of physical beauty to the eternal heaven of moral beauty..

This is a proof of the simplicity of Sakuntala. Dushyanta's conquest of Sakuntala has been very naturally drawn With equal ease has the poet shown the deeper purity of her character inspite of her fall-her unimpaired innate chastity. This is other proof of her simplicity.

The flower of the forest needs no servant to brush the dust off her petals. She stands bare, dust settles on her, but inspite of it, she easily retains her own beautiful cleanliness. Dust did settle on Sakuntala. But she was not it like the simple wild deer; like the mountain spring, she stood forth pure inspite of mud."

రవీంద్ర కవీంద్రుని యొక్క మీది ఆంగ్లవాక్యముల భావం ఇది. ''గొథే'' శాకుంతలనాటకమును గూర్చిన తన విమర్శను ఒక్కచిన్నపద్యంలో అఖండముగ నిట్లు సంగ్రహించెను. పై పద్యము దీపకళికవలె మనకు చిన్నదిగ కనుపించుచున్నను ఈ పద్యం శాకుంతలనాటకమునంతటినీ ఒక్క క్షణములో ప్రకాశింపజేసి దాని యంతరార్థమును ఒక్కసారిగ ప్రస్ఫుటము చేసినది.

గొథేమహాశయు డనినట్లు నవయౌవన వికాసవిలసితము లగు పుష్పములు తమపరిణామ రూపములైన ఫలములతో చెందిన సరస సమ్మేళనమే 'శాకుంతలనాటకము'. మరియు నీనాటకము స్వర్భూలోకములను ఒక్క చోట అతిసహజముగ కలుపగల్గిన పరంధామము.

ఈ నాటకము, దివ్యకవితాసౌందర్య సందేశసంభరితమని యెంచి ''గోథే'' ఆనందపారవశ్యముతో చేసిన కేవల తత్కావితావేశమే అనుకొని మనము పై ప్రశంసా పద్యమును చులకనగ భావింపరాదు. పైపద్యము ''గొథే'' మహాకవి కేవల ఆనంద పారవశ్యముతో చెప్పినదికాదు. ఇక ఆ పద్యము కాళిదాసకవీంద్రుని కవితాతత్త్వ నిర్ణాయకమైన ఒక సాహిత్య విమర్శ కాగ్రేసరుని నిష్పాక్షికమైన, నిస్సంకోచమైన, న్యాయసమ్మత మగు తీర్పు.

కనుకనే గొథే యొక్క పైసుభాషితములలో ప్రత్యేక మగు పరమార్థము, లేక సత్యము అంతర్లీనమైయున్నది. అదే మనగా పుష్పము ఫలముగను, భూతలము స్వర్గముగను, భౌతికము ఆధ్యాత్మికముగను, పరిణామముచెందుట - వీని క్రమపరిణామచరిత్రయే శాకుంతలనాటకమని, ''గొథే'' తన పద్యములో నొక్కివక్కాణించినాడు.

వాస్తవమునకీ నాటకములో చక్కని రెండుకలయికలున్నవి. మొదటియంకములోని నాయికానాయకుల కలయిక భౌతికమై అస్థిరమైన సౌందర్యముతోను, శృంగారముతోను కూడియున్నది. ఇక చివరియంకములోని కలయిక శాశ్వతానందదాయక మగు మారీచమహర్షి దివ్యా శ్రమములో జరుగుటచే ఆధ్యాత్మికానందదాయకమై యున్నది. ఇట్లే నాయికానాయకుల మొదటి సమావేశము చివరి నైతికసమ్మేళనముగా నెట్లు పరిణతమైనదో అట్టి పరిణామక్రమమును జూపుటయే ఈనాటక లక్ష్యము.

ఈ నాటకములోని కవితా కథా శిల్ప చిత్రణవిషయంలో కాళిదాస కవీంద్రుడు ప్రదర్శించిన అపూర్వాద్భుత కళాప్రతిభలను, రవీంద్రకవీంద్రునిమీది ఈ మలిపలుకులు, మన మానస ముకురాలలో నూటిగా ప్రతిబింబింపజేస్తున్నాయి.

భౌతిక సౌందర్యమూలకమైన ప్రేమ, ఆనందము, శృంగారము అనేవి సహజంగానే అస్థిరములు, చంచలములు, కనుకనే చంచలమైన కృత్రిమప్రేమను మాత్రమే కలిగించేవి. భారతీయుల పవిత్రదాంపత్య జీవితములకు ఈ చంచలప్రేమాదులు పూర్తిగా ప్రతికూలములైనవి. ''నిజానికి మన భారతీయ సౌందర్య తత్త్వం ప్రధానంగా భౌతిక విషయలంపటమైనది కాదు. కాక, అది ఆధ్యాత్మికభావనా ప్రభావితమై ఆధ్యాత్మిక సౌందర్యంగా పరిణతిచెందిప్రపంచమాంగళ్య సంపాదనకు పచ్చని మంగళతోరణంగా భాసింపవలసి ఉన్నది. ఈ సత్యాన్ని సంప్రకాశితంచేయడానికే మన కవికులగురువు, కవితాప్రపంచంలో ఉత్తమపాత్రలనదగిన తన గిరిజా శకుంతల పాత్రల మొదటి భౌతికసౌందర్యాలను అపూర్వమైన అద్భుతరీతిలో వర్ణించినాడు. కాని అంతటి అపురూపసౌందర్యాలు కూడా తమ ప్రియతమనాయకుల యొక్క మానసములను ఆకర్షింపలేకపోవడం అటుంచి అవి అపజయాన్ని పొందినరీతిని, మనజాతీయ మహాకవి ఐనకాళిదాస మహాకవి అతిసహజంగా ప్రదర్శించినాడు.

నిజానికి ''భౌతికం'' అనేది అంతాపరిణామంలో దుఃఖమే ఫలంగా కలది.'' అని భగవద్గీత - ''యేహి సంస్పర్శజా భోగాః దుఃఖయోనయ ఏవ తే...'' అని సిద్ధాంతం చేసింది. ఈ సిద్ధాంతంలోని సత్యాన్ని స్పష్టం చేస్తూ భర్తృహరిమహాకవి తన ''సుభాషితత్రిశతి'' లో

''భోగా న భుక్తా వయమేవ భుక్తాః
తృష్ణా న జీర్ణా వయమేవ జీర్ణాః''

అని త్రికాలాబాధ్యమైన సత్యాన్ని ప్రపంచం ఎదుటపెట్టినా అసలు నిజం చెప్పాలంటే - ఈ భౌతిక భోగానుభవదృష్టి మానవ జీవితంలో ''వివాహం''తో ప్రారంభమౌతుంది. కను కనే మనమహర్షులు ఈరహస్యాన్ని ముందుగానే తెలుసుకొని, ''భారతీయ వరులు అర్థకామాలకు దాసులు కారాదు'' అనే పవిత్రధ్యేయంతో - దూరదృష్టితో కన్యాదాతచేత (నూత్న వరునికి కన్యాదానం చేయడానికి ముందే) (ఆ మహర్షి పుంగవులు) ఇలా చెప్పించినారు. ''దాతా-ధర్మార్థకామేషు త్వయైషా నాతి చరితవ్యా'' అని అంటే, ఓనూతనవరా! నీవునీ దాంపత్య జీవితంలో ఈ నూతనవధువు విషయంలో ధర్మ, అర్థ, కామ, పురుషార్థాలను, సమానాదరంతోనే సేవించవలెనుగాని, అర్థకామాలను మాత్రమే సేవించరాదు. అని కన్యాదాత నూతనవరునికి గట్టి కట్టడిచేసి ఈ నిబంధనకువరుడు ''నాతి చరామి'' అనే తన అంగీకార వాక్యాన్నిచెప్పిన పిమ్మటే కన్యాదానం చేస్తాడు. ఈ ప్రమాణవాక్యాన్ని పూర్వపువరులు యథాతథంగా అమలు చేసేవారు. కాని నేటివారలు పెద్దమొత్తం మీద (99%) నూతనవధువు తమ చేతికి చిక్కేవరకే మామ చెప్పిన వాక్యాన్ని చిలకపలుకుల్లా పెదవిమీదే పలికి (నేటిమంత్రుల ప్రమాణవాక్యాలవలె) రంగంలోనికి ప్రవేశించిన తక్షణం తాము పలికిన మొదటి ప్రమాణాలను ''త్రోసిరాజా'' చేసి, అర్థానికి మాత్రం దాసులైతమ గృహలక్ష్ముల జీవితాలతో చెలగాటమాడి వాళ్ళ ప్రాణాలను చాలామంది పతిత్రవాచ్యులు బలిగొంటున్నారు. కేవల భౌతికమైన ఈ ''అర్థిక'' విషయానికి గల యావిషలక్షణాన్ని విశదంచేస్తూ శ్రీ శంకరభగవత్పాదుల వారు ''అర్థ మనర్థం భావయ నిత్యం, నాస్తి తతస్సుఖలేశ స్సత్యం'' అని, త్రికాలములలోకూడా అబాధ్యమైన సత్యాన్ని ''విశ్వసందేశ'' రూపంలో చాటినారు.

ఇంతకుముందు చెప్పినట్లు భారతీయుల పవిత్ర దాంపత్య జీవితధ్యేయాలకు కేవల భౌతిక సౌందర్యం ప్రతిబంధకసామగ్రి కనుక మహేశ్వరుడు గిరిజా ప్రథమ (భౌతిక) సౌందర్యాన్ని నిషేధించినట్లు, మన కవీశ్వరుడు కూడా గిరిజా, శకుంతలా భౌతికసౌందర్యాలకు అపజయ కల్పన ద్వారా నిషేధాన్ని సూచించి ఆ పాత్రలకు ఆధ్యాత్మికసౌందర్యప్రాప్తికై వారిచేత ''మహాతపస్సు'' చేయించినాడు. వీరిద్దరిలో ''గౌరీతపస్సు'' ప్రత్యేకంగా పేర్కొనదగినది.

గౌరీదేవి, ఆధ్యాత్మిక మూర్తి ఐన ఆ మహేశ్వరుణ్ణే పతిగా పడయుటకుగాను మండువేసవికాలంలో మధ్యాహ్న సమయంలో నిప్పులు కురిసే ఎండలో నిలబడి'' పంచాగ్నిమధ్య తపస్సు'' చేసినది. ఇక వర్షాకాలంలో రాత్రులందు వర్షధారల మధ్య ఆరుబయట చాపరాళ్ళమీదపరుండి తపస్సుచేసింది. ఇక్క చలికాలంలో కంఠంలోతునీళ్ళలో నిలబడి కఠోరతపస్సు చేసింది. ఈమె చేసిన మహాతపస్సునకు రాత్రులు ప్రత్యక్షసాక్షులుగా ఉన్నాయని - ''-----మహాతపస్సాక్ష్య ఇవ స్థితాఃక్షపాః'' అని మహాకవి వర్ణనం. ఇట్టి తపశ్చరణకారణంగా ఈ మెలోని భౌతికసౌందర్య స్థానంలో ఆధ్యాత్మికసౌందర్యం ఆవిర్భవించింది. బ్రహ్మచారి వేషంలో వచ్చిన మహేశ్వరుని ''మౌఖిక'' పరీక్షలో కూడా ఉత్తీర్ణఅయింది. పరమేశ్వరుడు పరితృప్తిచెంది స్వస్వరూపంతో నూతనవరుడై నూతనవధువు పాణిగ్రహణం చేసినాడు ''గౌరీతపస్సు'' ధర్మమా అని మృత్యుంజయుని చేబట్టిన పార్వతీదేవి ''సర్వమంగళా''దేవిగా మారినది. ఈ తపః ప్రభావంతో ఈమెకు ''మాతృత్వ''సిద్ధితోబాటు ''జగన్మాతృత్వసిద్ధి'' కూడా సిద్ధించినది. వీరు జగత్తునకు ఆది దంపతులైనారు. నేటి మన కన్యకామణులు, తమవివాహమునకు ఆదిలో చేసే ''గౌరీపూజ''కు నాటి ''గౌరీతపస్సు'' మూలమై అది వారిసౌభాగ్య జీవితమునకును, వారిభర్తల జీవిత సౌభాగ్యమునకును మూలకారణమయింది. ఈతపఃప్రభావంతోనే శకుంతల కూడా ఆధ్యాత్మిక సౌందర్య సందీపితయై పతి జీవితమునకు భాగ్యదేవతయై భరతునకు మాతయై క్రమంగా ''భరతమాత'' గా మారినది. ఇప్పటి ఈ దంపతుల దాంపత్య ప్రేమ స్థిరమైనది; ఎప్పటికినీ చలించనిది. శాశ్వతానందాయకమైనది. రవీంద్రకవీంద్రుడు చెప్పినట్లు, ''---భౌతికసౌందర్య పరిమితమగు ప్రేమనుండి నైష్ఠికసౌందర్య సంయుతమై, శాశ్వతానంద దాయకమైన దివ్యప్రణయస్వర్గమునకు భారతీయ దంపతులను ఉద్ధరింపజేయుటే'' కాళిదాస కవీంద్రునిపరమ ధ్యేయం కదా! అతడి ఆ మహోన్నతధ్యేయం గిరిజా, శకుంతలా పాత్ర చిత్రణలతో పూర్తిగా నెరవేరినది; ఈనాటకరచనతో ఈ మహాకవి జీవన్ముక్తుడైనాడు. కనుకనే ఈ నాటకాంతగత భరత వాక్యంలో తనకు ''పునర్జన్మరాహిత్యమును'' ఆ పరమాత్మ ప్రసాదించు గాక అని అతడిని అర్థించి ధన్యజీవనుడైనాడు.

# మహాకవి కాళిదాసు - శైవోపాసనము

శ్రీ ఆచార్య శ్రీనివాస్ వేదాల

సంస్కృతకావ్య ప్రపంచమున కాళిదాసు వంటి ప్రతిభా భాస్కరుడు మరియొకడు లేడు. ఖండఖండాంతరములందు పొగడ్తగొన్న గీర్వాణకవులలో ఇతడు ముఖ్యుడు.

మహాకవి కాళిదాసు శివభక్తి తత్పరుడు. రఘువంశాది కావ్యారంభమున

''వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే,
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ.''

అని జగత్పితలగు పార్వతీపరమేశ్వరులను శబ్దార్థములవలె, అవినాభావ సంబంధము గలవారని నిర్దేశించుటలో స్త్రీ పురుషు లిరువురకును కల నిత్యదాంపత్యమును అట్టి నిత్య దాంపత్యమును ఏకపదమగు నిత్య సమాసముతో కావ్యారంభ మును కావించి యున్నాడు.

కుమార సంభవమున బ్రహ్మస్తవమున

''స్త్రీ పుంసౌ ఆత్మభాగౌ తే భిన్న మూర్తేః సిసృక్షయా,
ప్రసూతి భాజః సర్గస్య తావేవ పితరౌ స్మృతౌ.''

అనగా మిథున సృష్టికై రెండుగా జేయబడిన నీదేహమే స్త్రీ పురుషులు, ఆరెండు భాగములే ప్రాదుర్భవించు జంతువునకు, త దండ్రులనుగా పెద్దలు చెప్పుదురు. ప్రకృతి పురుషులు ని ణబ్రహ్మ యొక్క బింబమైన మాయోపాధికుడగు ఈశ్వ రు గ్రహించు ప్రేమ, లోకకళ్యాణాధిష్ఠితమగు సృష్టికి నైజము. అట్లే

''జగద్యోని రయోనిస్త్వం జగదన్తో నిరన్తకః,
జగదాదిరనాదిస్త్వం జగదీశో నిరీశ్వరః''

అనగా జగములకు నీవు కారణుడవు నాశకుడవు దొరవు. మొదటి వాడవు, నీకంటె ఇట్టి కారణుడు మఱియొక్కడు లేడు. అనగా

''యతోవా ఇమాని భూతాని జాయన్తే
యేన జాతాని జీవన్తి''

అను శ్రుతిని ప్రమాణీకరించెను. ఈ విధముగనే శంకర భగవత్పాదులు

''శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో....''

ఇత్యాది శ్లోకమున పై కాళిదాసు భావమునే పలికిరి అనవచ్చును. ''ప్రకృతిః కర్త్రీ పురుషః పుష్కర పలాశవత్ నిర్లిప్తః'' అనుసాంఖ్యసిద్ధాన్తముకూడ ఇందు సమన్వయించు చున్నది.

కాళిదాసు పరమశైవుడు. ఆయన నాటకముల మూడింటను తొలుత శివునే స్తుతించెను. శాకుంతలమున మొదట ''యా సృష్టిః స్రష్టురాద్యా'' ఇత్యాది శ్లోకమున, అష్టమూర్తియైన శివుని వర్ణించెను.

''భూమి రాపో నలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా''

అనగా పృథ్వి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, మనము, బుద్ధి, అహంకారము అనెడి అష్టరూపములతో ప్రకృతి యున్న దని, స్వయంభూబ్రహ్మ, విష్ణువు, శివుడు అను త్రిమూర్తుల అద్వైత భావమును వ్యక్తపరచుచున్నవి. ఈ గీత యందలి శ్లోక భావమునే కాళిదాసు శాకుంతలమున పైవిధముగనే మంగళ మాచరించెను. కాళిదాసు వేదాంతప్రతిపాదితమైన బ్రహ్మపదార్థ మునే శివుడనును. బ్రహ్మకు శివుడను పదము వేదములందు కొన్ని స్థలములందు ప్రతిపాదించబడినది. ''నమశ్శంభవే చ మయోభవాయ చ, నమశ్శంకరాయ చ మయొభవాయ చ, నమశ్శివాయ చ, శివతరాయ చ'' ఇచట శివునకు, శంభుశంకర మయస్కర మయోభవ నామములు వచ్చినవి. శివుని అఖండ స్థితిని కాళిదాసు విరామము లేక ప్రస్తుతించెను.

''అజఃస్వయంభూః'' అనియు, రఘువంశమున అష్టమూర్తిః అనియు (3-35), పరమేశ్వరుని సర్వ శివంకరుడైన శివుని ''సర్గస్థితి ప్రత్యవహారహేతుః స్థావర జంగమానాం'' (రఘు 2-44) చరాచరమైన ప్రాణికోటిపుట్టుకకు, బ్రతుకుటకు, మర ణమునకు కూడ కారణమైనవాడు ఆ పరమేశ్వరుడే అనియు, ''మాన్యస్స మే'' నాకతడే పూజ్యుడనియు కాళిదాసు తన మనోగతమైన శైవోపాసనను తనకావ్యములందు అన్నిస్థలముల వ్యక్తపఱచెను. కాళిదాసు కవిలోక మూర్ధన్యుడే గాక శైవోపాసనా ధన్యుడు.

# వైరభక్తి

శ్రీమతి పల్లె నాగమణి

ఆధ్యాత్మిక సాధనయందు జ్ఞానమార్గము, భక్తిమార్గము నని రెండు విధములైన సంప్రదాయములున్నవి. ఇందు మొదటి మార్గము ననుసరించువారిని జ్ఞానులనియు, రెండవ మార్గము ననుసరించువారిని ప్రపన్నులనియు నందురు. జ్ఞానమార్గము నవలంబించువారు తమ తప్పొప్పులకు తామే బాధ్యులు. భక్తులన్నచో భగవంతుని పట్ల సర్వసమర్పణ బుద్ధితో నుందురు గాన వారి సమస్త బాధ్యతలను భగవంతుడు తానే వహించును. భాగవతమున మొదటి తెగవారికి ఉదాహరణ ముగా సనక సనందనాదులు, రెండవ తెగవారికి ఉదాహరణ ముగా జయవిజయులు చిత్రింపబడినారు. సనకాదులు వైకుంఠ నగరము నారోహణ చేసి, ఆ మార్గమున ఆరు కక్ష్యలలో సర్వత్ర విష్ణుని దర్శించియు ఏడవ కక్ష్యయందు ద్వారపాలకు లైన జయవిజయులలో విష్ణువునకన్న అన్యమును దర్శించి నారు అందువలన ద్వారపాలకులు వారి నడ్డగించినారు. నమార్గానుగాములైన సనకాదులు వారిని శపింపగా, భక్తిమా మునకు చెందిన జయవిజయులు తమ్ము శపించిన ఋషుల ను విష్ణువునే దర్శించినారు. ఈ రెండు తరగతుల వారికిని భగవంతు డొసగిన శాశ్వత ధర్మరూపమైన పరిష్కార మార్గమే ద్వారపాలకుల శాప కథ.

భారత జాతికి శ్రీమద్రామాయణ, భారత, భాగవత ములు మహానిధానములు. వీనిలో భక్తి ప్రధానమైనది భాగవ తము. భాగవత సప్తమ స్కంధమున నవ విధ భక్తిమార్గములు వర్ణితములు.

> ''శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్,
> అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్.''
> (7-5-23).

ఇవిగాక భగవంతుని జేరుటకు భాగవతమున మఱియొక మార్గము నిరూపితము. దీనికే 'వైరానుబంధ'మని శ్రీమద్భా గవత వ్యవహారము. 'వైరమ్' అను రూపము తద్ధిత వృత్తి - వీరునకు సంబంధించినదని యౌగికార్థము. నేటి యర్థమున నిది ద్వేషమున రూఢము. కాని సమాస వృత్తియందు కాని, తద్ధిత వృత్తిగా కాని దీనికి యౌగికార్థము గ్రహించినను దోషము కాదు. 'వీరస్యకర్మ' అనునది వైయాకరణ సమ్మత మార్గ మనియు, సమాసమున కరణముగా నిది అన్వయించుననియు 'వైరభక్తి' శబ్దార్థము చెప్పుట సముచితము.

విష్ణు పార్షదులైన జయవిజయులు సనకాది మహర్షుల శాప ప్రభావముచే రాక్షస జన్మత్రితయమును పొందినారు వారే హిరణ్యాక్ష హిరణ్యకశిపు; రావణ కుంభకర్ణ; శిశుపాల దంత వక్త్రులు.

> ''వైరానుబంధ తీవ్రేణ ధ్యానే నాచ్యుత సాత్మతామ్,
> న తౌ పునర్హరేః పార్శ్వం జగ్మతు ర్విష్ణు పార్షదౌ''
> (7-1-47).

అని వ్యాస వాణి. అంతే కాదు,

> ''యథా వైరానుబంధేన మర్త్యస్తన్మయతామియాత్,
> న తథా భక్తియోగేన ఇతి మే నిశ్చితా మతిః.''
> (7-1-27).

అని దేవర్షి నారదమతము.

శాపవశమున రాక్షస జన్మలెత్తిన హిరణ్యాక్షాదులు నిరంతర వైర సాధనతో భగవత్సాన్నిధ్యమును పొందిరని భాగవతోక్తి.

## హిరణ్యాక్షుని సాధకత్వము

నవ విధ భక్తులు భగవానుని జేరుటకు శ్రేష్ఠ మార్గము లయ్యు, వైరము సులభ సాధక భక్తిమార్గముగ భాగవతమునను, ఇతర ప్రామాణిక గ్రంథములలోను నిరూపితము. వైర భక్తు లలో కారణ జన్ములైనవారికి మాత్రమే ఈ మార్గ మను శ్రేయము. జయవిజయులు వైరభక్తి మార్గమున తిరిగి భగవం తుని జేరుటకు భగవత్సంకల్పమే కారణము. అందువలన జన్మాంతరమునను వారు కారణజన్ములు. ఈ విషయము భాగవతమున నిశ్చప్రచముగ నిరూపితము. శ్రీధరీయమును దీనిని దృఢీకరించును.

''మమైవతు మతం సమ్మతమ్. ఇదమత్రతత్త్వమ్ యద్యపి సనకాదీనాం క్రోధోపి న సంభవతి. న చ భగవత్పార్షదయోః తయోర్వా బ్రాహ్మణ ప్రాతికూల్యమ్. నచ భగవతః స్వభక్తో పేక్షా. నచ వైకుంఠ గతానాం పునర్జన్మ. తథాపి భగవత్ సిసృక్షాదివత్ కదాచిత్ యయుత్సా సమజని....''

(శ్రీధరీయము, తృతీయ స్కంధము, 16వ అధ్యాయము, శ్లో. 29,30).

శాపము భగవానునకు సమ్మతము. కాని శాపతత్త్వమిది. సనకాదులకు కోపమే కలుగకుండవచ్చును. అంతేకాదు, భగవత్పార్షదులకు బ్రాహ్మణ ప్రాతికూల్యమును కలుగదు. నారాయణుడు శాపము నుపసంహరింపగలిగియు భక్తుల నుపేక్షించుచు తూష్ణీంభావము వహింపలేదు. అట్లే వైకుంఠములోని వారికి పునర్జన్మయు కలుగరాదు. కాని భగవంతుని సంకల్పము, సృష్టి చేయవలెనను కోరిక ఇట్టిది. భగవంతునకు యుద్ధము చేయవలెనను కోరిక కలిగినది. ఇతరులందరును తనకంటె నల్పసత్త్వులు. తన పార్షదులు సమాన బలవంతులైనను వారి యందు శత్రుత్వము కలుగదు. అందువలన వారిని బ్రాహ్మణ నివారణమునందు ప్రవర్తింపజేసి, వారియందు క్రోధము కలిగించి, వారి శాపవ్యాజమున ప్రతిపక్షమును సృష్టించి పోషించి భరించి యుద్ధ కౌతుకమును తీర్చుకొనవలెననెడి సర్వమును భగవత్సంకల్పమే. అందువలన దీనిలో జయవిజయులకు కాని, మహర్షులకు కాని దోషస్పర్శ లేదు.

హిరణ్యాక్షుడు నారాయణారాధనమునకై ఉదాత్త సిద్ధిప్రదమైన, అనన్యాదృశమైన వైరమార్గము నవలంబించినాడు. సాధకుడు గురువుల అనుగ్రహమునకు పాత్రుడు కావలెను. హిరణ్యాక్షుడు నారాయణు నన్వేషించుచు జైత్రయాత్ర ప్రారంభించినపుడే ఆతని యందలి జిజ్ఞాస వ్యక్తము. ఈ జిజ్ఞాసారంభముచే జ్ఞానప్రాప్తికి హిరణ్యాక్షుడర్హుడైనాడు. పరీక్ష మాత్రము శిష్యుని యోగ్యతా నికషమునకై చిరకాలము సాగినది. తుదకాతని సాధన ఫలించి వరుణుని వంటి యోగ్యుడైన గురువు లభించినాడు.

హిరణ్యాక్షుడు వరుణుని జూచిన సందర్భములోని వర్ణన మిది:

''స వర్షపూగానుదధౌ మహాబల
శ్చరన్మహోర్మీన్ శ్వసనేరితాన్ముహుః,
మౌర్వ్యాభి జఘ్నే గదయా విభావరీ
మాసేదివాం స్తత్ర పురీం ప్రచేతసః.''

''తత్రోపలభ్యా సురలోకపాలకం
యాదోగణానా మృషభం ప్రచేతసమ్,
స్మయన్ప్రలబ్ధుం ప్రణిపత్య నీచవ
జ్జగాద మే దేహ్యధిరాజ సంయుగమ్''

(3-17-26,27)

హిరణ్యాక్షుడు విభావరీ నగరమున నున్న వరుణుని చేరుటకు కొన్ని సంవత్సరము లన్వేషింపవలసి వచ్చినది. ఈ యన్వేషణ తపస్సులో భాగము. అచట 'ప్రచేతసు'ని దర్శించి, యుద్ధ భిక్షను కోరినాడు. ప్రచేతసుడన జ్ఞానసంపన్నుడని యర్థము. హిరణ్యాక్షుని సుకృతము కొలది అట్టి గురువు లభించినాడు.

'ప్రలబ్ధుమ్' అను పదమునకు ఉపహాసము రూఢ్యర్థము. కాని 'లభ్' ధాతువు ప్రాప్త్యర్థకము. పొందదలచిన దానిని చక్కగా పొందుటకై అని యౌగికార్థము. కృద్వ్యుత్తి వలన హిరణ్యాక్షుడేదియో ఉత్తమగతి నన్వేషించుచున్నాడని సూచితము. ఇట్లే 'సంయుగమ్' అనునది యుద్ధమున రూఢి. చక్కని యోగము నుపదేశింపుమని వరుణుని కోరినాడని వ్యంగ్యము. ఇది శబ్దశక్తి మూల ధ్వని. 'నీచవత్ ప్రణిపత్య' - మిక్కిలి వినయముతో నమస్కరించి అని అన్వయము.

పురాతనుడైన నారాయణుని కన్న 'రణమార్గ కోవిదుడైన హిరణ్యాక్షుని వంటి 'మనస్వి'ని యుద్ధోత్సవముచే నారాధింప గలవాడు మఱియొకడు లేడని వరుణుడు తెలిపినాడు. విరాట్స్వరూపమైన నారాయణునకు రసనేంద్రియమైన వరుణ ముఖమున హిరణ్యాక్షునకు నిర్వాణ మార్గము ఉపదేశింపబడుట భగవత్ప్రతిజ్ఞ కనుకూలము.

మూలమునందలి ''నారదాద్రసాతలం నిర్విశే'' అను వాక్యాంశము పోతనగారి యందు విస్తృతమైనది. ఇచటి హిరణ్యాక్షుని పలుకులన్నియు నాతని విష్ణుపార్షదత్వ సూచకములు. వరుణుని యుపదేశమునకు పిమ్మట హిరణ్యాక్షుని యన్వేషణము లక్ష్యోన్ముఖమైనది. హిరణ్యాక్షుడిట్లు

''చను నవసరమున నారద
మునివరు డెదురేగుదెంచి ముదముదలిర్పన్
దనుజేంద్ర యెందుబోయెద
వని యడిగిన నారదునకు నతడిట్లనియెన్''

(3-630)

రాక్షసుని చూడగనే నారదుడు ''ముదము దలిర్పన్'' ఎందుబోయెదవని ప్రశ్నించినాడు. నారద హిరణ్యాక్షుల సమాగమము సార్థకము కానిచో నారదునకు కలిగిన ముదము నిరర్థకమనక తప్పదు. ఇది గంభీరార్థ ప్రతిపాదకము కావుననే సమాగమ సంతోష సాంగత్యము సిద్ధించును. రసాతలమున కేగిన హిరణ్యాక్షుడు ఆది వరాహమును జూచి పలికిన శ్లోకముల లోని 'వనగోచర', 'మృగ', 'అజ్ఞ', 'అభవ' మున్నగు పదములకు స్తుత్యర్థమును శ్రీధరీయము విశదమొనర్చును. యుద్ధ ప్రవృత్తికై భగవంతుడు వాచ్యార్థమాత్రమును గ్రహించి 'నీకొర్కులు నేడు దీర్తున'నుచు హిరణ్యాక్షుని వధించినాడు. హిరణ్యాక్షుని మరణము మహోదాత్తమని ఆతని పరమ శత్రువులైన

దేవతలే శ్లాఘించుటయు, ఆతడు నారాయణుని పార్షదుడను విషయమును స్మరించుటయు హిరణ్యాక్షుని వైరభక్తి తత్పర తను నిగదిత మొనర్చును.

## హిరణ్యకశిపుని సాధకత్వము

హరిపార్షదునిగా నున్నప్పటి సంస్కారము శాపగ్రస్తమైన జన్మయందును హిరణ్యకశిపునకు సిద్ధించినది. హిరణ్యాక్షుని మరణానంతర మాతడు తల్లికి చేసిన జ్ఞానబోధ ఇందుకు నిదర్శనము.

హిరణ్యకశిపుడు బాహిరముగ రాక్షస రాజైనను ఆంతర్య మున విష్ణు పార్షదుడు. భ్రాతృవధకు కుపితుడైన ఆతడు గోబ్రాహ్మణ యజ్ఞాదికముల నాశమొనర్పుడని తన యనుచ రుల నాజ్ఞాపించు సందర్భములోని

''తస్య త్యక్త స్వభావస్య ఘృణేర్మాయా వనౌకసః,
భజంతం భజమానస్య బాలస్యేవాస్థిరాత్మనః'' (7-2-7)

అను శ్లోకమున ఘృణి, మాయా, వనౌకసః అను పదముల ప్రయోగముచే వ్యాస భగవానుడు హిరణ్యకశిపుని జ్ఞానమును సూచించినాడు. అదే సందర్భము నందలి

''మచ్ఛూల భిన్నగ్రీవస్య భూరిణా రుధిరేణవై,
రుధిర ప్రియం తర్పయిష్యే భ్రాతరం మే గతవ్యథః'' (7-2-8)

అను శ్లోకమున హిరణ్యకశిపునకు తాను విష్ణు పార్షదుడ నను జ్ఞాపిక యున్నట్లు మహర్షి ధ్వనింప జేసినాడు. శ్రీధరీ యమిట గుంఫనముగా నుండ, వంశీధరీయము ''మచ్ఛూల భిన్నా తదగోచర భూతా గ్రీవా తదుపలక్షితో విగ్రహో యస్య తస్య మే రుధిరేణ నృసింహతయా ఆవిర్భావే తస్మాత్ భూత మదీయ రుధిరేణ రుధిర ప్రియం భ్రాతరం తర్పయిష్యే'' అనినది. 'శూల' అను పదమునకు క్రోధమను నుపలక్షితా ర్థము, 'భిన్నా' అను పదమునకు అగోచరమైన అనునర్థముల సంయోజనచే హిరణ్యకశిపుని ఆంతర్యమును ప్రకాశితమొనర్చి నది. 'నాశూలమున కగోచరమైన నా కంఠమును నేనే భిన్నము చేసికొని, నా రుధిర ధారలచే, రుధిర ప్రియుడైన నా సోదరుని తృప్తి పఱచెదన'ను పలుకులు హిరణ్యకశిపుని విష్ణుపార్షదత్వ జ్ఞాపకమునకు నిదర్శనములు.

హరి సౌకర్యాంగము దాల్చి తన సోదరుని సంహరించె నను హిరణ్యకశిపుడు పలికిన పలుకులు విష్ణుతత్త్వ ప్రతిపాద కములు.

''వనముల నుందు జొచ్చు ముని
వర్గములోపల ఘోణిగాదు సం
జనన మెఱుంగ రెవ్వరును
జాడ యొకింతయు లేదు తన్ను డా
సిన మఱిడాయు వెంటబడి
చిక్కక చిక్కదు పీని నొక్కకీ
లున మనమెల్ల లోబఱచి లోబడ
పట్టుకొనంగ వచ్చునే'' (7-31).

అను మాటలలో నాతనిలో గాఢముగను, గూఢముగను ఉన్న భక్తి వ్యక్తమగును. 'సంజనన మెఱుంగ రెవ్వరును' అనుట నారాయణుని అనాదిత్వమునకు సూచకము. 'జాడ యొకింతయు లేద'నుట నారాయణతత్త్వము నెఱుగుట దుస్త రమను నభిప్రాయమును సూచించును. భక్తపరాధీనుడైన భగ వానునకు 'మనమెల్ల లోబఱచి' ఆయనను పట్టుకొన వచ్చునను గంభీరార్థము పూర్వవాసనా వాసితమై యిట ధ్వనించును.

''భుజశ నాతోడ బోరాడ శంకించి
ము ౧ట మునిగిన మునుగుగాక
యలయిం పెనగు నా యచల సంభ్రమమున
కెఱగి వెన్నిచ్చిన నిచ్చుగాక
జగడంబు సైపక సౌకర్య కాంక్షియై
యిలక్రింద నీగిన నీగుగాక
క్రోధించి యటుగాక కొంత పౌరుషమున
హరిభంగి నదరిన నదరుగాక...'' (7-32)

ఇందు వరుసగా మత్స్య, కూర్మ, వరాహావతారములు, రాబోవు నృసింహావతారము కూడ హిరణ్యకశిపునకు మనో గోచరములైనవి. ప్రథమ జన్మమున శాపావసాన కాలము సంకల్ప గోచరమైనది కావుననే హిరణ్యకశిపుడు తన తపము నకు మెచ్చి ప్రత్యక్షమైన బ్రహ్మను ''గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్...'' మృత్యువు లేని జీవన మును వరముగా వేడినాడు. ఆతడడిగిన వర విధానము వలన భగవానుని అంకస్థలి తప్ప ఆతనిని సంహరించు స్థలాంతరము లేకపోయినది. ఇది ఆతని వైరభక్తి నైశిత్యమునకు నిదర్శనము. వర సంపాదనమునకు పిమ్మట 'నిరంతరాక్రాంత దురంత వైర వేగుండై'న హిరణ్యకశిపుడు అర్థసిద్ధికై భాగవత శ్రేష్ఠుడైన ప్రహ్లా దుని హింసించుట, గోబ్రాహ్మణాదికముల ద్వేషించుట అను మార్గమున ప్రయత్నముల నారంభించినాడు. భగవంతుడు శీఘ్రముగ తనను చేర్చుకొండునని తన పార్షదులకు చేసిన వాగ్దానమునందలి ఏకదేశమును నిర్వర్తించుటకు హిరణ్యకశి పుని అట్లు ప్రవర్తింప జేసినాడు. నారాయణుడీ కార్యమున ప్రవర్తించుటకు కారణము స్వభక్త పక్షపాతము. ''స్వభక్తపక్ష

పాతేన తద్విపక్ష విదారణమ్'' అని శ్రీధరీయము. ఈ వాక్యము చదువగనే 'దేవతలయందలి పక్షపాతమ'ను నర్థము స్ఫురించును. కాని హిరణ్యకశిపు నందలి పార్షదముఖ్యుడను పక్షపాతముచే శాపసిద్ధమైన విపక్షత్వ విదారణము భగవత్సంక ల్పము. ఈ యభిప్రాయమునే ''స్వభక్తంచ సదా విష్ణుః ద్విషంత మపి రక్షతి'' అని శ్రీధరుడు స్పష్టమొనర్చినాడు.

హిరణ్యకశిపుని వైరసాధన నృసింహావిర్భావ సమయము నకు పచేళిమమైనది.

''సత్యం విధాతుం నిజభృత్య భాషితమ్,
వ్యాప్తించ భూతేష్వఖిలేషు చాత్మనః...''
(7-8-17).

అని శ్లోకము. దీనికి శ్రీధరీయము హిరణ్యకశిపుని నిజ భృత్యత్వమును నిగదిత మొనర్చును. 'నిజభృత్య భాషిత మ'ను మాటలో వ్యాసభగవానుడు ప్రహ్లాద, సనకాది ముని ప్రవర, బ్రహ్మ, నారదులతో పాటు హిరణ్యకశిపుని కూడ నిజ భృత్యునిగ సూచించునట్లు శ్రీధరీయము వ్యాఖ్యానించుచు, భగవానుడు ప్రహ్లాద హిరణ్యకశిపులను సంసార సాగరము నుండి సముద్ధరించి నాడని తెలిపినది తాను భావించిన నరసింహ రూపమున నారాయణుడు ప్రత్యక్షము కాగా, హిర ణ్యకశిపుని మనస్సు ఒక విధమైన నిశ్చల స్థితి నందినది.

''తెంపున బాలుడాడిన
సుధీరత సర్వగతత్వముం బ్రతి
ష్ఠింప దలంచి యిందు నర
సింహ శరీరము దాల్చి చక్రి శి
క్షింపగ వచ్చినాడు హరి
చే మృతి యంచు దలంతునైన నా
సొంపును బెంపునందఱును
జూడ జరింతు హరింతు శత్రువున్'' (7-287).

అని పోతన మహాకవి ఇందలి 'సర్వగతత్వముం బ్రతిష్ఠింప దలంచి', 'చక్రి శిక్షింపగ వచ్చినాడు', 'హరిచే మృతి యంచుద లంతు' నను హిరణ్యకశిపుని పలుకు లాతని వైర యోగమునకు పరాకాష్ఠ. స్వామి ఆతనిని ఊరువులందు చేర్చుకొని, నఖ సంఘాతములతో చీల్చినాడు. ఆ సందర్భమున విష్ణు పార్ష దులు పలికిన 'భక్తితోడ సేవించుట కంటె వైరమున వేగమ చేరగవచ్చునిన్ను' అను పలుకులు పై విషయమున కంతటికిని ఉపబలకములు.

## కుంభకర్ణుని సంస్కారము

విష్ణుపార్షదుల మూడు జన్మములలో నొకనికి ప్రధానముగ నున్న వైరము ద్వితీయుని యందు తీవ్రత తగ్గి, గౌణమైనట్లు భాసించును. కుంభకర్ణుని యందు రావణుని యందున్నంత తీవ్ర వైరము కన్పట్టదు. రావణునితో విరోధించినాడను కారణ ముగనే కుంభకర్ణుడు శ్రీరామునితో యుద్ధమునకు సన్నద్ధుడై నాడు.

వానర సేనలతో శ్రీరాముడు సముద్రమును దాటి వచ్చినా డను వార్త తెలిసి రావణుడు మంత్రులను సమావేశపరచి మంత్రాలోచనము చేసినాడు. అపుడు కుంభకర్ణుడు

''న్యాయేన రాజా కార్యాణి యః కరోతి దశానన,
న స సంతప్యతే పశ్చాత్ నిశ్చితార్థమతిః నృపః''
(శ్రీమద్రామాయణము, యుద్ధకాండ, 12వ సర్గ, శ్లోకముః 30)

'ఏ పనినైనను చక్కగా ఆలోచించి చేయవలెను. ఒక కార్య మును ముందు వెనుకలుగ చేయుట రాజధర్మము కాదు' అని ఇత్యాదిగ పలికిన పలుకులలో ఆతని రాజనీతిజ్ఞత, హితవాక్కు ప్రస్ఫుటములు ఇట ఆంధ్ర వాల్మీకి పలుకులును స్మరణీయ ములు.

''రెండవ శరమున రాముడు
ఖండించెదు నంతలో దగగ నానెత్రు
ద్దండత నేద్రావెదజమి
ఖండిత సురజాల సుఖముగాంచుము మీదన్''
(మందరము, యుద్ధకాండ, 12వ సర్గ. పద్యము 246)

'తగగన్ + ఆనెత్తురని యొక పదచ్ఛేదము. తగగ + నానెత్తురని యొక పదచ్ఛేదము. రెండవ యర్థమున నానెత్తురు నేనే త్రావెదను, ఆవల నీవు సుఖపడుము' అని. ఈ సందర్భము నందలి పద్యములు కుంభకర్ణుని జ్ఞానమునకు నికషోపలముగ నున్నవి 'శత్రునాశనంబు-శత్రువగు రాముని వలన నాశము నేను చేయించుకొని' అనునాతని పలుకులు 'మచ్చూల భిన్నగ్రీ వస్య - నాశూలమున కగోచరమైన నా కంఠమును నేనే ఉత్తరించుకొని' అను హిరణ్యకశిపుని పలుకులను స్ఫురింప జేయును.

ఆధ్యాత్మ రామాయణమున కుంభకర్ణుడు రావణునకు చేసిన ఉపదేశములో శ్రీరాముడే నారాయణుడను నిశ్చయ జ్ఞానమున్నది.

''రామో న మానుషో దేవః సాక్షాన్నారాయణోవ్యయః,
సీతా భగవతీ లక్ష్మీ రామపత్నీ యశస్వినీ.
రాక్షసానాం వినాశాయ త్వయా నీతా సుమధ్యమా.''
(ఆధ్యాత్మ రామాయణము, యుద్ధకాండ, 2వ సర్గ. శ్లోకము 15)

రంగనాథ రామాయణ, భాస్కర రామాయణ, శ్రీమద్రామాయణ కల్పవృక్షాది గ్రంథముల ననుసరించియు కుంభకర్ణునకు శ్రీరాముడే నారాయణుడను నిశ్చయ జ్ఞానమున్నది.

**"రామచంద్రుండు నారాయణుండు బలిముఖులు బర్హిర్ముఖులిది నిక్కువంబు నన్ననుగ్రహించి విగ్రహంబు విడిచి సీతనిచ్చి పుచ్చి రాక్షస కులంబును లంకను రక్షింపుము. మన కొలుము బ్రహ్మకు నుపాస్యుడగు నద్దేవదేవునకు నమస్కరించిన నేమి కొఱంత"**

**(భాస్కర రామాయణము, యుద్ధకాండము, వచనము : 892).**

అను పలుకులు కుంభకర్ణుని సంస్కారమునకు, జ్ఞానిత్వమునకు నిదర్శనములు. శ్రీరామునితో యుద్ధము చేయవలసి వచ్చుట దైవసంకల్పము. కుంభకర్ణుడు వీరోచితముగ యుద్ధ మొనర్చి, తుదకు రామబాణ ప్రహారములచే నిహతుడైనాడు. ఇట్లు వీరమరణము నందిన కుంభకర్ణుడుత్తమ వైరభక్తుడనుట నిర్వివాదము.

## రావణుని సాధకత్వము

రావణుడు భగవత్పార్షదుడను మాట శ్రీమద్రామాయణమున లేదు. కాని భాగవత వాక్యమే దీనికి ప్రమాణము. జన్మలు గడచుకొలది వైరము క్రమముగ తగ్గినది. హిరణ్యకశిపునిలో నున్నంత తీవ్రతర వైరము రావణునిలో కన్పట్టదు. తృతీయ జన్మమగు శిశుపాలుని యందింకను తీవ్రత తగ్గినది.

రావణుడు మునులను, వేదకర్మలను బాధించుట శ్రీరామునాకర్షించుటకే యుద్దిష్టము లనవచ్చును. మారీచ సుబాహుల వృత్తాంతము నుండి కథ క్రమముగా రావణ ముక్తి మార్గమున కున్ముఖమై నడచినది. అది బీజము. సీతాపహరణమున్న లుప్తప్రాయమై జటాయు వృత్తాంతమున అవమృష్టమై, లంకాక్రమణముతో ఫల పర్యంత నిరూఢమైనది.

రావణునకు కలిగిన శాపములు క్రమముగా నాతని ముక్తికి వరములై పరిణమించినవి. లౌకిక వ్యవహారమునకు ఈ శాపములే రావణుని బల ప్రయోగమును నిరోధించినవి. లేనిచో ధాన్యమాలిని వంటి అంతఃపుర స్త్రీలు చేసిన యుపదేశమును విని, రావణుడూరకుండెనని ఆతని యశక్తతనో, అసహాయతనో కారణముగ చెప్పవలసి వచ్చును. పరమార్థ దృష్టితో చూచినచో రాముని తన కడకు రప్పించుకొనుటకే సీతనపహరించెను కాని కాముకుడై కాదు. రావణుడు మృత్యులోభము చేతనే సీతను విడువలేదనుట సరమ వాక్యముల వలన వ్యక్తము.

**"న త్వాముత్సహతే మోక్తుం అర్థమర్థపరో యథా,**
**నోత్సహత్యమృతో మోక్తుం యుద్ధే త్వామితి మైథిలీ.**
**సామాత్యస్య నృశంసస్య నిశ్చయో హ్యేష వర్తతే,**
**తదేషా నిశ్చితా బుద్ధిః మృత్యులోభాదుపస్థితా.**
**భయాన్నశక్తః త్వాం మోక్తుం అనిరస్తస్తు సంయుగే"**

**(శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, 34వ సర్గ, శ్లోకములు: 20 నుండి 23)**

ఏమాటనైనను నిశ్చయముగ చెప్పదలచినప్పుడు 'ముమ్మాటికి' అనుట లోక సంప్రదాయము. 'అమృతోమోక్తుమ్', 'మృత్యులోభాత్', 'సంయుగేన అనిరస్తః' అని రావణుని మరణము ముమ్మారు సరమా వాక్యములలో సూచితము.

రావణునకు శ్రీరాముడే నారాయణుడను నిశ్చయ జ్ఞానమున్నట్లు యుద్ధకాండమున స్పష్టముగ పేర్కొన బడినది.

**"యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనం గతాః,**
**తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్"**
**(శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, 72వ సర్గ, శ్లోకము 11)**

యుద్ధకాండమున అనరణ్యుని శాపము గుర్తు వచ్చినప్పుడే రాముడు నారాయణుడను నిశ్చయము రావణునకు కలిగినది.

'రాముడు మానవమాత్రుడు కాడు. పరమేశ్వరుడే.... విరోధము చేతనే నేను హరిని చేరగలను. విరోధముతో ననుగ్రహించినంత సులభముగ భగవంతుడు ,భక్తిమార్గమున ననుగ్రహింపడు' (అధ్యాత్మ రామాయణము, అరణ్యకాండ, 5వ సర్గ, 58 నుండి 60 శ్లోకముల భావము) అను రావణుని పలుకులు "యథా వైరానుబంధేన మర్త్యస్తన్మయతామియాత్..." అను భాగవత వాక్యములను స్ఫురింపజేయును.

రంగనాథ రామాయణ, భాస్కర రామాయణ, శ్రీమద్రామాయణ కల్పవృక్షేత్యాది గ్రంథముల వలనను రావణుని వైరసాధన, శ్రీరాముడే నారాయణుడను నిశ్చయ జ్ఞానము సువ్యక్తములు.

**"...పౌలస్త్యుండు సిరికొల్వు**
**చవికయౌ వక్షమ్ము చంద్రహాస**
**దారితమొనర్చి ఆగంటుదారివెంట**
**హృదయమున్ జొచ్చి యేకాంత మిచ్చగించి**
**స్వాగతము బల్కుమనని విన్నపమ్ము సల్పు**
**మచటనే పునర్దర్శన మగుత మనకు"**
**(పౌలస్త్య హృదయము, శ్రీ కాటూరు వేంకటేశ్వరరావు).**

అనుచు తాము (జయ విజయులు) ఏకాంతులైన విష్ణుపార్షదులమను విషయమును స్మరించి, స్వామి హృదయ మందిర ప్రవేశమును వాంఛించినాడు భక్తుడు 'వెన్నుడెట్లైన వచ్చి

విజవృత్తిని మున్నటు నిల్పుపొంటె నీ మన్నగు దేహమూడ్వ వలెన'ని యెంచిన రావణుడు తాను కోరుకొనిన మార్గమున తన మరణమును పొందినాడు. ఈ విధముగ భాగవత దృష్టితో రామాయణ కథ ననుసరించి ప్రాచీనార్వాచీన మతములను సమన్వయించినచో రామరావణులకు బాహ్య వైరము ప్రధానము కాదనియు, పార్షదుల ముముక్షుత్వమే రామరావణ యుద్ధ హేతువనియు ఫలితాంశము.

## దంతవక్త్రుని సంస్కారము

శిశుపాల దంతవక్త్రులు అక్క చెల్లెండ్ర సంతానము. శాప కాలమున జయవిజయులకు ఏకస్థాన స్థితి సిద్ధించినను, వారి యనుబంధము క్రమముగా తగ్గుచు వచ్చినది. మర్త్యయోని యందనురాగము మిగిలిన జన్మములలో కంటె నధికముగ నుండును. భగవంతుడీ రహస్యమును పాటించియే కాబోలు మొదటి రెండు జన్మలలోను ఏక గర్భ జనితులైన వారికి, మూడవ జన్మమున నట్టి యనుబంధమును తప్పించినాడు. శిశుపాల దంతవక్త్రుల ప్రత్యక్ష సంబంధము అన్నదమ్ముల వరుస గల బంధుత్వము. పరోక్ష సంబంధము నారాయణ పార్షదత్వము. శాప శేషము దంతవక్త్రుడే. అందువలన శిశుపాలుని మరణానంతరము 'పారోక్ష్య సౌహృద' కర్తవ్యముతో నతడు అసహాయుడై హరినెదుర్కొనినాడు.

''...దిష్ట్యా దిష్ట్యా భవానద్య మమ దృష్టి పథం గతః,
''త్వం మాతులేయో నః కృష్ణ మిత్రధ్రుఙ్మం జిఘాంససి
అతస్త్వాం గదయా మంద హనిష్యే వజ్రకల్పయా''
(శ్రీమద్భాగవతము, 10-78-4 నుండి 5 శ్లోకములు).

ఇత్యాదిగ నున్న దంతవక్త్రుని నిందను శ్రీధరస్వామి స్తుతి పరముగ వ్యాఖ్యానించినాడు.

''తర్హ్యా నృణ్యముపై మ్యజ్ఞ మిత్రాణాం మిత్రవత్సలః,
బంధు రూపమరిం హత్వా వ్యాధిం దేహచరం యథా''

(10-78-6)

ఇందలి 'అజ్ఞ' శబ్దమును స్తుత్యర్థములో బహువ్రీహిగను, 'ఆనృణ్యమ్' అనగా ఈ దేహసంబంధమైన ఋణ శేషమును తీర్చుకొనుటగను, 'వ్యాధి' శబ్దము విశేష ధ్యాన పరముగను పర్యవసితములై దంతవక్త్రుని వైరానుబంధ ప్రకటనా సమర్థము లైనవి.

దంతవక్త్రుడిట్లు తననెదుర్కొనగా,

''పడిజనుదేర జూచి యదు
వల్లభుడుల్లము పల్లవింప న
వ్వుడు గద గేల బూని రథ
మున్ రయమొప్పగ డిగ్గి యుగ్రతన్''
(దశమ స్కంధము, ఉత్తర భాగము,
పద్యము 9:16).

ఎదురు నడచినాడు. హరి తన పార్షదుల కిచ్చిన వాగ్దానము నెరవేర్చవలసిన సమయ మాసన్నమైనది. శాపావధి పూర్తియైనది. కావున స్వామికి ఉల్లము పల్లవించినది. హిరణ్యాక్ష వధ యందు వలెనే యథాశ్రుతార్థమును గ్రహించినాడు. ఫలితమే కౌమోదకీ ప్రహారము.

''తత సూక్ష్మతమం జ్యోతిః కృష్ణమావిశ దద్భుతమ్
పశ్యతాం సర్వభూతానాం యథా చైద్యవధేనృప''
(10-78-11)

''అప్పుడు నిఖిల భూతంబులు నాశ్చర్యంబు నొంద దగ్ధాత్రంబున నుండి యొక్క సూక్ష్మ తేజంబు వెలువడి గోవిందుని దేహంబు బ్రవేశించె'' (దశమస్కంధము, ఉత్తరభాగము, వచనము: 919)

ఈవిధముగ దంతవక్త్రుడు తిరిగి హరిపార్షదత్వము నందినాడు.

## శిశుపాలుని సాధకత్వము

కర్మ సంస్కారము మిగిలి హిరణ్యకశిపుడు రావణుడై, రావణుడు శిశుపాలునిగ జన్మించిన కథ సప్తమ స్కంధమున ప్రసిద్ధము. ''గోప్యః కామాద్భయాత్కంసో ద్వేషా చ్చైద్యాదయో నృపాః...'', ''కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైర క్రియా సామగ్రిన్ శిశుపాల ముఖ్య నృపతుల్...'' ఇత్యాదిగ వైరభక్తికి భాగవతమున శిశుపాలుడే ప్రధానోదాహరణముగ గ్రహింపబడినాడు.

ధర్మజుడు రాజసూయ యాగానంతరము శ్రీకృష్ణున కగ్రపూజ యొనర్ప, శిశుపాలుడందుల కంగీకరింపక కృష్ణుని నిందించినాడు.

''సదసస్పతీ నతిక్రమ్య గోపోయం కులపాంసనః,
యథా కాకః పురోడాశం సపర్యాం కథమర్హతి''
(10-74-35).

ఇత్యాదిగ నున్న శిశుపాలుని నిందను శ్రీధరుడు స్తుతిపరముగ నన్వయించినాడు. 'గోపాలకుడనగా వేదధర్మ రక్షణ తత్పరుడు. కు + లప + ఆంసనః అని పదచ్ఛేదము. కుత్సితమైన వేద విరుద్ధ మతము ననుసరించువారిని ధ్వంసము చేయువాడు. 'యథానేక' అనుదాని యందు యథా + అనేక అని

ఛిదము, సుఖదుఃఖాతీతుడనియర్థము. సాక్షాదీశ్వర స్వరూపు డైన నిట్టి నారాయణునకు ఈ పూజ పర్యాప్తమా' అని శిశుపాలుని స్తుతి. పోతనగారి యనువాదము నందును 'పెక్కు భంగుల వర్తించువాడు', 'విగత సంబంధుండు', 'ముప్పోక లాడు' ఇత్యాది విశేషణములు గంభీరార్థ స్ఫోరకములు.

శిశుపాలునకు కైవల్య మొసగ దలచి శ్రీకృష్ణుడే ఆతని బుద్ధిని వైరాభిముఖముగ తీవ్రమొనర్చి వాని ననుగ్రహింప గోరుచున్నాడని భీష్ముని యభిప్రాయము.

''నైషా చేదిపతేర్బుద్ధిః యథా త్వాహ్వయతే చ్యుతమ్,
నూనమేష జగద్భర్తుః కృష్ణ స్యైవ వినిశ్చయః''
(మహాభారతము, సభాపర్వము,
44వ అధ్యాయము, శ్లో. 1).

మహాభారతమునందలి ఈ వాక్యముల వలన శిశుపాలుని దోషము తొలగిపోయినది. కేవలమాతని వైరభక్తి తాత్పర్య మును కొనియాడుటకే వ్యాఖ్యాతలు స్తుతికల్పన మొనర్చినా రని చెప్పవచ్చును.

భారతమున శిశుపాలుడు నారాయణాభిన్నునిగ వర్ణింపబడి నాడు.

''తతః శ్రుత్వైవ భీష్మస్య చేదిరాడురువిక్రమః....''
(సభాపర్వము, 45వ అధ్యాయము, శ్లో.1).

ఇచటి 'ఉరువిక్రమ' శబ్దము శిశుపాలునకు నారాయణాభేద సూచకమని నీలకంఠుడు.

మాఘ కావ్యము చివరి నాలుగు సర్గల యందును వైరానుబం ధము భక్తి సాధనా ఫలోన్ముఖముగ నుత్తరోత్తర తీవ్రతతో వర్ణితము. మాఘ కావ్య వ్యాఖ్యాతయైన మల్లినాథ సూరి శిశుపాలుని పలుకులను భక్త్యర్థ పరముగ వ్యాఖ్యానించినాడు.

''అహితాదనపత్రపస్త్రసన్
అతిమాత్రోజ్జిత భీరనాస్తికః,
వినయోపహిత స్త్వయా కృతః
సదృశోన్యోగుణవా నవిస్మయః''
(మాఘము 16-7)

'నీకు సరికాగల లజ్జాహీనుడు, గుణహీనుడు, నాస్తికుడు, గర్వితుడు మరియొకడు లేడ'ని నింద.

శిశుపాలుని పలుకులలో నంతర్గూఢమై యున్న స్తుతి:
అహితాత్ త్రసన్ - అధర్మమునకు భయపడువాడు;
అనపత్రపః - అకార్యముల యందు జుగుప్సకలవాడు;
అతిమాత్రోజ్ఝితభీః - పూర్తిగా శత్రువులనినచో భయము లేనివాడు;
అనాస్తికః - నాస్తికుడు కానివాడు;
వినయోపహితః - వినయము చేత నమ్రత కలవాడు;
అవిస్మయః - (స్మయము = గర్వము, విస్మయము = విశేష గర్వము) గర్వరహితుడు.

కర్తవ్య నిర్వహణమునకై భగవానుడు యథాశ్రుతార్థమును గ్రహించి చక్రాయుధముతో శిశుపాలుని మస్తకమును ఖండిం పగా.

''చైద్య దేహోత్థితం జ్యోతిర్వాసుదేవముపావిశత్,
పశ్యతాం సర్వభూతానా ముల్కేవ భువి ఖా చ్చ్యుతా''
(10-74-46).

సర్వులు నాశ్చర్య చకితులై చూచుచుండ శిశుపాలుని దేహము నుండి అనుపమ తేజము వెలువడి వాసుదేవునిలో ప్రవేశించినది. ఇట్లు శిశుపాలుడు నిరంతర వైరసాధనతో శాపాం తమును పొంది తిరిగి విష్ణు పార్షదుడైనాడు. శిశుపాల దంతవ క్త్రుల నుండి వారి మరణానంతరము తేజస్సు భగవంతునిలో లీనమైనట్లు హిరణ్యాక్ష హిరణ్యకశిపు; రావణ కుంభకర్ణుల విషయములో జరుగలేదు. అందుకు కారణము కర్మశేషము.

జీవి ఒకసారి సంపూర్ణ స్థితినిపొందిన పిదప శాపకారణముచే బాహ్యరూపాదికములు మారినను స్వస్వరూప జ్ఞానము నశిం పదు. జయవిజయులు భగవత్సాన్నిధ్యము పొందిన సంపూర్ణ మూర్తులు. బ్రాహ్మణ శాపముచే రాక్షస జన్మయెత్తినను వారు స్వస్వరూప జ్ఞానమును మఱచిపోదురా? అట్లు మఱచి పోయి నచో ఏ మోక్షపదము గూడ శాశ్వతము కాదన్నమాటే! జడ భరతుడు తన తరువాతి రెండు జన్మలలో స్వస్వరూప జ్ఞాన మును మఱచి పోలేదు.

భగవంతుడు తాననుగ్రహింప దలచిన రీతిలో నాయా ప్రాణులను కర్మమార్గమున ప్రవర్తింపజేయును. జయ విజయు లకు జన్మత్రయమున వైర సాధనము భగవత్సంకల్పమే. కావున వైరభక్తి మోక్ష హేతువనుట, అదియును భగవత్సంకల్పము వలన కొందరు సాధకులకే పరిమితమనుట భాగవత సిద్ధాం తము.

# సంగచ్ఛధ్వమ్

శ్రీ ప్రభాత్ రంజన్ సర్కార్

ఇది సాధారణమగు వైదిక శ్లోకము. ఇది ఈ వ్యాసమున వ్యాఖ్యానింప బడును.

సంగచ్ఛధ్వం సంవదధ్వం
సంవో మనాంసి జానతామ్
దేవభాగం యథా పూర్వే
సంజనానా ఉపాసతే.

సమానీ వ ఆకృతీ సమానా హృదయాని వః,
సమానమస్తు ఓ మనో యథా వః సుసహాసతి.

''మన మందరము కలసి నడచెదము, కలసి పాడుదము; మన మనోభావములను కలసి తెలుసు కొందము. పూర్వపు ఋషుల వలె ప్రజలందరము కలసి విశ్వమునంతను ఆనంద ముగ అనుభవించుటకు పంచుకొందము. మన అభిప్రాయము లను ఏకీభవింపజేసికొని హృదయములు విడదీయరానివిగా చేయుదము; మనము ఒకరి నొకరు యథార్థముగ తెలిసి కొనుట వలన అందరము ఏకమయ్యెదము.''

**సంగచ్ఛధ్వమ్:** ఇచటి ఉపసర్గమగు 'సమ్'నకుగల అర్థము 'సరియైన పద్ధతిలో', 'సరియగు మా మున', 'సరియగు లయలో' ప్రతి యొక్కరు కదులుదురు, తి వస్తువు పూర్తిగా కదులును. సమస్తము, తమ తమ వ్యక్తిగ సామర్థ్యము ననుస రించి కదలుచునేయుండును. కదలుట యనగా నేమి? కద లుట యనగా స్థలమును మార్చుట. కదలిక వేగమును తెలియ చేయును. సంస్కృతమునందు మూలక్రియ 'గమ్' వేగమును సూచించును. అది జీవమును కూడ తెలియ చేయును. కావున ప్రతి యొక్కరు, సమస్త ప్రాణులు కదలవలసినదే, వేరు మార్గము లేదు.

కాని కదలికలన్నియు 'సంగచ్ఛధ్వం' కానేరవు. సమాజ మనగా నేమి? దానిని ఏర్పరచిన దేమి? సమానమ్ ఏజతి ఇతి సమాజః. ఏజతి అనగా 'గచ్ఛతి'. కదలికకు, నడకకు, సంస్కృ తమున అనేక క్రియలున్నవి - గచ్ఛతి, చలతి, చరతి, వ్రజతి ఏజతి - వేర్వేరు అర్థములుగల, మరియు విభిన్న భావములు గల ఎన్నో క్రియలు గలవు. ఇపుడు మనకిచట కలసి పయ నించు నట్టి ప్రజలెందరో కలరు. ఇచట కలసి నడచుట యనగా కవాతు, లేక డ్రిల్లు చేయుట యని కాదు. కలసి పయనించుట యనగా సమాజమునందలి అన్ని భాగములు, సమూహము యొక్క అన్ని అంశములు, ముందునకు, అనగా ప్రగతి పథమున పయనింప వలెనను భావమును కల్గియుం డుట. ఉదాహరణకు మీరు ధనమును సంపాదించి యుండు టచే మీ ఇంట ఆహారమున కెట్టి కొఱతయును లేదు. కాని మిగిలిన సమాజ భాగమగు మీ ఇరుగు పొరుగువారు, మీ మిత్రులు డబ్బులేక, తిండి, బట్టలు లేక బాధ పడుచున్నారను కొనుడు. అనగా మీరు 'సంగచ్ఛధ్వం' యొక్క ఉద్దేశ్యమును పాటించుట లేదని బోధ పడుచున్నది 'సమ్ గచ్ఛధ్వమ్' అనగా పీడనకు', ఆధిక్య భావమునకు లేక న్యూనతాభావము నకు తావు లేనట్టి శక్తిమంతము మరియు పటిష్ఠము నగు సమాజమును నిర్మించుట.

**'సమ్‌గచ్ఛధ్వం'** యొక్క ఉద్దేశ్యమును తెలియ చేయుటకే నేను 'ప్రఉట్' సిద్ధాంతమును మీ ఎదుట పెట్టియున్నాను. కావున ఈ ప్రఉట్ సిద్ధాంతమంతయు ఈ వైదిక ధర్మాది విషయకమైన 'సంగచ్ఛధ్వమ్' పైన నిలబడియున్నది.

**'సమ్‌వదధ్వమ్':** సంస్కృతము నందలి క్రియయగు 'వద' కుగల అర్థము 'మాట్లాడుట'. ప్రతివారును మాట్లాడుదురు. ఇక 'సమ్‌వదధ్వమ్'నకుగల తాత్పర్యమేమి? 'సమ్‌వదధ్వమ్' అనగా ఒక పద్ధతిలో మమ్ములను మాట్లాడునట్లు చేయునట్టి పరమ భావముచే మీరు ఆదేశింప బడవలెను; అనగా మీభాష రెండర్థములతో కూడినది గాక యుండవలెను. అది సమ సందిగ్ధార్థములకును దూరముగా నుండవలెను. మరియు స్ప మైనదిగను, నిష్కృష్టమైనట్టిదిగను, నిశ్చయాత్మకముగ ఉండవలెను.

**'సమ్ తా మనాంసి జానహోమ్:** 'వః' షష్ఠీ, బహువచనము, మీ యొక్క అని అర్థము. 'వః' యనునది పురాతన సంస్కృత మగు వైదికపదము. లౌకిక సంస్కృతమున, అనగా తదనంతర సంస్కృతమునందు 'మీ' యను పదమునకు 'యుష్మాకం' అందురు .

సృష్టికంతకును మూలము మరియు సమస్త జీవరాశికిని మూలాధారము పరమ పురుషుడని మీరు తెలుసు కొనవలెను. సమస్త జీవకోటియు పరమపురుషుని నుండియే ఉద్భవించు

చున్నదను విషయమును మీరు తెలుసు కొనవలసి యున్నది. ఈ ప్రాథమిక సత్యమును మీరెన్నటికిని విస్మరించరాదు. జీవుల మధ్యగల వ్యత్యాసము వారివారి జీవపరంపరాగత ప్రార బ్ధము మాత్రమే యైనను, ఈ సమస్త జీవకోటికి మూలాధా రము ఒకే ఒక భౌమ తత్త్వమైన పరమపురుషుడు మా మే యనునది మీరు సదా జ్ఞప్తియందుంచు కొనవలెను. అ డు మానవులకు మధ్యగల సంబంధము దగ్గర పడును. 'స ఓ మనాంసి జానతామ్', ఈ సత్యమును మీరు తెలుసు కొన వలసియున్నది. దీనిని మరువ రాదు.

**దేవభాగం యథాపూర్వే సంజనానా ఉపాసతే:** 'దేవ' అను పదము 'దివ్' అను ధాతువు నుండి వచ్చు చున్నది. 'దివ్' అనగా 'ఒక దైవ ఉపస్థితి. యా వల్క్య మహర్షి ఇట్లు చెప్పెను: 'ద్యోతతే క్రీడతే యస్మాదు తే దివి, తస్మా ఇతిప్రోక్తః స్తూయంతే సర్వ దేవతాః'. పిత యొక్క ది ప్రకంపన యుత ఆరోపణలు, దివ్య సాక్షాత్కారములు, ది కంపనలు, దేవతలుగా తెలియబడుచున్నవి.

'దేవ భాగమ్ యథాపూర్వే' - అనగా 'ప్రాచీనమునందలి దైవప్రకంపనలు'. 'ప్రాచీనము' అను శబ్దమేల ప్రయోగింప బడినది? ఎందు చేతననగా, మానవ నాగరకత ఆవిర్భవించి నది మొదలు, ఈదైవ ప్రకంపన లున్నవి, మరియు నివి వ్యత్యాసముల నెరగవు. అంతియే గాక క్రియారంగమునందు గూడ, ఎట్టి వ్యత్యాసములు నుండవు. సమానత, మరియు సమతుల్యత, సదా పరిపోషింప బడుచున్నవి.

గాలి, నీరు, వెల్తురు, ఉచ్ఛ్వాస నిశ్వాసములు నగు సమస్త విషయములను పరికించండి. అందరకు వీని ఆవశ్యకత సమాన ముగనే యుండును. ఎట్టి తేడాయును లేదు. సమాజ మునందు మనము చూచునట్టి విభేదములు, స్వార్థపరులు, దుర్నీతిపరులు, హీనులు, మరియు అవినీతి పరులచే సృష్టింప బడి నట్టివే! కావున అవినీతిపరుల ఈ దుష్కార్యములకు మీరు ఆలంబన మీయరాదు. మీరు దైవ ప్రకంపన విధానమును అవలంబింపవలెను. అనగా వ్యక్తుల మధ్య ఏ విధమైన వ్యత్యాస ములను పాటించుటకు మీరు ప్రయత్నింపరాదు.

'దేవభాగమ్ యథాపూర్వే సమ్ జానానా ఉపాసతే. భేద భావములు లేకుండుట, పీడనాపరుల, మరియు పీడితుల వర్గములు లేకుండుట యనునది దైవీయ వ్యక్తీకరణకు గల పరిపాటి. అనగా వ్యత్యాసములను సృష్టింపక పోవుటయను అలవాటు దేవతల బాధ్యత మాత్రమేగాక, వారివారి ఉపాసన, ఉపస్థితగతికి ప్రధానముగ ఆవశ్యకమై యున్నది.

**సమానీ వ ఆకృతి :** ప్రతి పదార్థము ఒకే మూలము నుండి, ఒకే సృష్టికారకుని నుండి ఆవిర్భవించి, చివరకు అదే మూలస్థా నమునకు తిరిగి వెళ్ళి చేరునపుడు, సమానవాంఛలు, సమాన మగు తపన, ప్రతి వాని హృదయమున నుండవలెను. కాని అవినీతిపరుల దుష్కార్యాచరణము వలన, పీడితులై, అణగ ద్రొక్క బడిన ప్రజలు తమ లక్ష్యమును బలిమిని విస్మరించు నట్లు గావింప బడుచున్నారు. తమ జీవిత ధ్యేయము నుండి దూరముగ కొనిపోబడుచున్నారు. ఇట్లు జరుగరాదు. ప్రతి ఒక్కరును పరమపురుషుని కొరకు తమకుగల సహజవాంఛను వృద్ధిగావించు కొనుటకు అవకాశమును పొందవలసియున్నది.

**సమానా హృదయాని వః.** ప్రతి పదార్థము ఒకే సాక్షికర్త నుండి ఆవిర్భవించి, పరమోన్నతస్థానమునకు ఒకే మా మున పయనించునపుడు, ఒక వ్యక్తికి, మరియొక వ్యక్తికి మధ్య త్యా సము లుండునా? లేదు, బేధములుండరాదు. ప్రతి క్తికి అవకాశము నిచ్చి, లేక, అట్టి పరిస్థితులను కల్పించి, వారెవ కిని వారి వారి భవిష్యత్తు శాశ్వతముగ ముగిసి పోయెనను భావము కల్గు అవకాశము లేకుండునట్లు చూడవలెను. కావున, ఈ వ్యక్త జగత్తంతయు ఒకే బృహత్తర కుటుంబమునకు చెందిన దను భావముతో ప్రతివారు నుండవలెను.

### ఏక్ కౌకా, ఏక్ చూల్హో, ఏక్ హై మానవ సమాజ్.
### (ఒకే వంటిల్లు, ఒకేపొయ్యి, ఒకే మానవ సమాజము)

**'సమానమస్తు ఓమనో :** సమస్త జీవులు ఒకే పరమబ్రహ్మ నుండి వచ్చి, చివరకు జీవులన్నియు అదే యైకైక పరమ బ్రహ్మలో ఐక్యమగుచున్నవి. కావున వారు సమాజమునందున్నపుడు, ఈ ప్రత్యక్ష భూమండలమున నివసించునపుడు, ఈ పరమ సత్యముము గుర్తింపవలసి యున్నది: యథార్థమునకు తామం దరును ఒకటేయనియు, ఒకే తత్త్వము విభిన్న శరీర నిర్మాణ ముల ద్వారా వ్యక్తమగు చున్నదనియు తెలియనగును. మరియు నిట్లు చేసిన పిమ్మట-ఇదేమంత కష్టమైన పనికాదు -అప్పుడదేమగును? పదమును సరియగు భావముతో తీసు కొనినపుడు, అది ఒక సమాజ మగుచున్నది. మరియు నిది మహోన్నతమైనట్టి, మానవాళి కంతకును చెందిన బృహత్తర యజ్ఞము. ఎవరైతే ఈ సత్యమును గుర్తించరో, దీనిని విస్మరింప గోరుదురో, వారు నిజమునకు సమాజమునకు శత్రువులు. కులతత్త్వము, వర్గతత్త్వము, స్వ పరదేశీయతాతత్త్వము, మొద లగునవన్నియు ఈ బృహత్తర మానవ సమాజమునకు శత్రు వులు. అట్లుగాక, మానవ సమాజము ఏకైక తత్త్వమగు విశ్వ మానవ తత్త్వముపై ఆధారపడి యుండవలెను.

**(బెంగాలీ మూలమునకు శ్రీమతి జి.- సోమిదేవమ్మ స్వేచ్ఛానువాదము.)**

# హైందవం - సిద్ధాంతం

శ్రీ బెంగుళూరు సురేశ్వర

''నాగరికత'' అనబడే లక్షణాన్ని అన్వయించడానికైనా, ఆపాదించడానికైనా అర్హతగల జాతి మానవజాతి ఒక్కటే. అయితే యీ నాగరికతా లక్షణం ఎక్కడనుండి పుట్టిందన్నది ప్రశ్న. పూర్వులయిన మహానుభావులు ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆదిభౌతికాలను గూర్చి చేసిన ఆలోచనలే మతాలై, మోక్షభావాలై, సాంఘిక వ్యవస్థలై, నీతిమార్గాలై, ధర్మశాస్త్రాలై, ఋజు మార్గాలై, వెలుగుబాటలై, హృద్గత తిమిరాన్ని పారద్రోల గలిగే తేజఃపుంజాలై 'నాగరికత'కి రూపాంతరాలుగా మనకీనాడు మిగిలాయి. ఈ నాగరికత జీవిగతం, జీవగతం కూడాను. ఒక విధంగా ఆలోచిస్తే యీ నాగరికతే మతం. జాతి సాంఘిక వ్యవస్థల బట్టి మతం భిన్నరూపాలు దాలుస్తుంది; క్రొత్త పాతల ప్రమేయం లేకుండా! ఇది సమాధానం.

''నదీనాం సాగరో గతిః'' ఇది ఆర్యోక్తి-ఈ సూక్తిప్రస్తావనకి కారణం తర్వాత రాయబడుతుంది. విశ్వాసం అన్నది ఒకగుణం. సుగుణం. మనిషి ఆత్మశక్తి బట్టి భిన్నమయే లక్షణం. ఇక మతాలున్నాయి-ఈ రెంటికి ముడి ఉంది. ఏ మతంవారామతసిద్ధాంతాలనే విశ్వసిస్తారు. ''ఒక్కటే'' అని ముక్తకంఠంగా చెప్పినా ఎవరి దేవుడు వారికే. అయితే ప్రాధాన్యం ఇవ్వబడుతున్నది భగవంతునికా? సమీపించే మార్గాల్లో నిగూఢంగా, బాహాటంగా ప్రస్ఫుట మవుతున్న భిన్నత్వానికా! ప్రస్తుత వర్తమానకాలంలో ఇన్ని మతాలు త్పన్న మవడానికి కారణం పైన ప్రస్తావించిన ప్రశ్నకి వచ్చే సమాధానం.

మతమన్నమాటకి-అభిప్రాయం, శాస్త్రం, సమ్మతం, తెలియబడినవి, పూజింపబడినవి, జాతి, సమూహం-అని నానార్థాలున్నాయి. ఎన్నున్నా మానవుల జీవితాన్ని నియమబద్ధం చేసి అభ్యుదయసృజనాత్మక మార్గబద్ధం చెయ్యడానికి తోడ్పడే ఒకానొక మహా ఆయుధం మతం.

'మతం' అని చెప్పి, దానికి పేరు పెట్టి దాన్ని గురించి చర్చించే ముందు 'మతం' అంటే స్వల్ప మాత్రంగానైనా తెలుసుకోవడం అవసరం. పైన చెప్పబడ్డ ఆర్యోక్తికింతవరకు చెప్పబడ్డ వివరణే సమాధానం.

చరిత్రలో ప్రసిద్ధి పొందిన మతాలు హైందవం, క్రైస్తవం, బౌద్ధం, జైనం, ఇస్లాం, మరియు జూడా మతాలు. వీని మార్గాలు బహుధాభిన్నాలు. స్వరూప సిద్ధాంతాలలో సాపత్యం లేశమంత కనిపించక పోయినా తాత్కాలికానుభవ జనితమైన ఆనందాభాసని కాక నిత్యమైన ఒకానొక అభితృప్తిని మనిషికి కలిగించడమే మతధ్యేయం. సిద్ధాంతపరంగా కాక, అనుష్ఠాన పూర్వకంగా యీ మతతత్త్వాలు అఖండ చిన్మయానందాన్ని సిద్ధింప చేస్తాయి. జీవి తాలూకు స్వభావాన్ని, ఆత్మతాలూకు స్వరూపాన్ని కొంతవరకు చూపెడతాయి.

మనిషి శరీరంతో అనుభవిస్తున్న మనోగత అనుభవం మతం. ఈ మతమను అంశం ఊహించ తగ్గది, కనిపించేదేదీ కాదు. సాధుత్వా సాధుత్వాలు ప్రత్యక్షాలు కావు. క్రియాను మతాలు. మతమయినా, భగవంతుడయినా జగత్కార్యం చేత ఊహించబడే కారణాలు కదా. వీటిని చూడడం ఎలా!!

ఈ యుగంలో ప్రబలంగా ఉన్న మతాలన్నిటిలో అతిప్రాచీనం హిందూమతం. శాస్త్ర మార్గాల్లో, ఆధునికులు, మతాల ట్టుక గురించి చేసిన పరిశోధనలలో బయటపడ్డ సత్యం ' స్తుపూర్వం 5000 సం.లకు పూర్వం కూడా హిందూ తం ప్రబలంగా ఉన్నదన్న విషయం. ఆధారాలేవీ హిందూమతం పుట్టుకను చెప్పడం లేదు. ప్రాక్పశ్చిమాలలో విస్తరించిన హిందూమతానికి ''సనాతన ధర్మ సిద్ధాంతం'' జీవనాడి వంటిదే. కర్మ సిద్ధాంతం, పునర్జన్మ సిద్ధాంతా లీ సనాతన ధర్మానికి ముఖ్య లక్షణాలు. హిందూమత స్వరూపం తెలియాలంటే ప్రతీవారూ ఆత్మావలోకనం చేసుకోవడమే నన్నమాట.

నదీ తీరాల్లో, మహారణ్యాలలో, పర్వతగుహామధ్యాల్లో, ప్రాపంచిక వాసనలకి, విషయలాలసతకి మనసుని దూరం చేసి, శరీరాన్ని నియమబద్ధం చేసి, తనను తాను తెలుసుకోవాలన్న జీవుని వేదనని పరాకాష్ఠనంట చేసిన మహాతపస్వులయిన మన పూర్వికుల నిగ్రహ పూజాఫలమే హిందూమతం.

మన పూర్వపు తరాలవారు అమూల్యమయిన జీవిత సత్యాలని మతం పేరిట మనకి ప్రసాదించారు. మానవజాతి ఇన్నివేల సంవత్సరాల ప్రగతిని, నాగరికతని, అభ్యుదయాన్ని, మేధని, విజ్ఞానాన్ని, పరిణతిని సాధించాక, కోటాను కోట్ల అనుభవాలని, సంస్కార రూపంలో అరగించుకున్నాక - ఒక్కమారు వెనక్కితిరిగి ''ఇదంతా అబద్ధం-అసత్యం'' అన్న నిజాన్ని మనసా ప్రస్ఫుటంగా తెలుసుకున్నా ఆ సత్యాన్ని భరించలేడు. అప్పుడు మనిషిలో జీవి మానవుడవుతాడు. అల్పుడవుతాడు. ఈ అవరోహణదశని ఆపగల శక్తి 'సత్యం'. అది కర్మకి విధికి సంబంధించింది.

సర్వ సృష్టిలో మానవుడొక్కడే విచక్షణ జ్ఞానం కలవాడు. ఉత్పత్తికి, నశింపుకి మధ్య ప్రవహిస్తున్న యీనిరంతర చైతన్య స్రవంతికి కారణం యీ జీవన్మరణాల కతీతమైనశక్తి - ఆత్మ. అదే పరబ్రహ్మ. 'హిందూమతం' అన్నది మతం క్రింద నామ మాత్రంగా చెప్పినా, యీ మతం చేసే ఒక్కొక్క ప్రబోధం ఒక్కొక్క జీవికి వేరు వేరుగా వారి వారి స్వరూపాన్ని చూపిస్తుంది.

గుణరహితుడైన మహాదేవుడు సృష్టికి కర్త. గుణసహితాలయిన యజ్ఞ యాగాది విధులన్నీ సృష్టికి విధింపబడ్డ కర్మలు. ఇక కర్మఫలం మీద అధికారం జీవికి ఎప్పుడూ లేదు. కత్తితో మనిషి మనిషిని ఖండిస్తే ఫలం మనిషిది, పాపం మనిషిదే కాని కత్తిది కాదు. ఒకానొకదశలో మనిషిశరీరం ఆయుధం అవుతుంది. క్రియాఫలం కర్తది కానీ కర్మది కాదు. ఏకాగ్రత, ఆత్మ సంయమనం సత్య దర్శనానికి మొదటి మెట్టు. సత్యమే భగవంతుడు. అది కేంద్రం. ఆ స్వరూపం అగ్ని కావచ్చు. రాయికావచ్చు. మనిషి తానే కావచ్చు. సృష్టిలో ఏదైనా కావచ్చు. ఏమీకాకనూ పోవచ్చు. ఎప్పుడు? గ్రహించదలుచుకున్నది రూపరహితంకావాలని మనిషికున్నప్పుడు. హైందవం బోధించే ఒకానొక మహత్తర విషయం ఇది. 'హైందవం' అనేకన్నా 'సనాతన ధర్మం' అందాం. ఎందువల్లనంటే ఇది అన్ని మతాలకి సంబంధించినది. ఏ మతానికి ప్రత్యేకంగా సంబంధించినది కాదు కనుక!!

మనిషికి జీవితంలో సంప్రాప్తమవుతున్న బాల్యయవ్వన వృద్ధాప్యాది దశలు అనివార్యాలు. అత్యంత సహజాలు. ఉత్పత్తి ఉన్న చోట లయం తప్పదు. ఇంద్రియాలకీ, శరీరానికి సంబంధించినవన్నీ, ప్రాపంచికమైనవన్నీ ద్వంద్వాలయిన రాకపోకల సిద్ధాంతానికి బద్ధులు మరణమంటూ వేరేయేమీలేదు. ఎన్నెన్నో మార్పులు శరీరానికి జరుగుతున్నాయి. పుట్టుక, పెరుగుదల, సుఖభోగాది ఆనందాభాస, మమకారానురాగాది బలహీనతలు, వీటన్నిటివలన జీవి అనిత్యమైపోతున్నాడు.

భౌతికమయిన శరీరం భూగోళ సంబంధి. అందువలన వికారాలన్నీ జరిగి ఒకనాటికి దుర్బలమయిన శరీరం నీరసిస్తుంది. చైతన్యఘటనాప్రవాహం నీరసించిన శరీరాన్ని వదిలి వేరే శరీరంలో ప్రవేశిస్తుంది. ఆ మధ్య నున్న దశ మరణం. ఆ రెండో దశారంభం పునర్జన్మ. రెండు దశలూ తప్పవు జీవికి. ఇవి పుట్టుక, పెరుగుదల కన్న ఏ మాత్రం భిన్నమైనవి కాదు. నిర్దుష్ట జీవితానికి సహజాతి సహజం పునర్జన్మ.

జగద్రచనా రహస్యం ఒకటుంది. చిత్రకారుడు ఒకే కుంచెతో విచిత్ర రూపాలు చిత్రిస్తాడు. గాయకుడు సప్తస్వరాలతో కోటాను కోట్ల రాగాలు సృష్టిస్తాడు. వాఙ్మయంలో ఉన్న కొద్ది అక్షరాలతో మహాప్రపంచాన్ని సృష్టిస్తాడు రచయిత. సృష్టి అంతే. అసంఖ్యాకంగా ప్రవృత్తులెన్ని కనబడ్డా యీ ఆంతరబాహ్య సృష్టికి కారణం అఖండమైన ఆత్మ. అదే బ్రహ్మ. పరబ్రహ్మ!.

పరబ్రహ్మ స్వరూపాన్ని తెలియడం హిందూ ధర్మంలో ప్రాథమికధర్మం. ఈ భగవదైక్యం, ఇంద్రియనిగ్రహం, చిత్తశుద్ధి, ధర్మానుసరణ, నిష్కాముకత, స్థితప్రజ్ఞత్వం, - వీటివలన సులభసాధ్యం. ఈ పదాలు విడదీస్తే కన్పడేది మనిషి తనను తానెరిగి ప్రవరిస్తే భగవానుడు తానే అవుతాడన్న సత్యం. కర్మని చేస్తూ, ఫలాన్ని ఆశించకుండా ప్రాప్తాప్రాప్తాలలో సమభావం కలిగి ఉంటే ఆ జీవిస్పందన, ఏకాగ్రతలో సర్వసృష్టీ తానే కాగలదు. ప్రాపంచిక జీవనం ఆనాడు ఎంతో అల్ప మయిన, స్వల్పమయిన ఒక దశగా కనపడుతుంది. త్రిగుణాలకీ అతీతమైనది ఆత్మ. అదే హిందూమత సిద్ధాంతం. జాతి, కుల, దేశ, సాంఘిక పరిస్థితులచేతగానీ, వ్యష్టి సమిష్టి వ్యాపారాల చేత కానీ ప్రభావితం కాని మతం.

కర్మ సిద్ధాంతం, పునర్జన్మ సిద్ధాంతాల ప్రకారం అంటే హిందూ మత ఉపదేశాల ప్రకారం జీవితం ధర్మార్థకామమోక్ష సూత్రం చేత నియమబద్ధం అయితే శరీరాన్ని నడిపే ఆత్మని తెలియడం సులభతరం. ధర్మం కర్మకి లోబడివుంటుంది. కర్తవ్యం నిష్కామంగా పరిపూర్తి చేసి, ధర్మం ఆచరించి అర్థాపేక్ష లేకుండా కామం శరీర సంబంధిగా గ్రహించి, నశించే శరీరాన్ని ఆత్మ నుంచి వేరు చేసి చూడగలగాలి మనిషి. ఇది కర్తవ్యం. కర్మ, జ్ఞాన, యోగ మార్గాలు ప్రవృత్తి నివృత్తి మార్గాలలో నడిచే వారికి వర్తిస్తాయి. తాను చేయవలసిన పనిచెయ్యకుండా ఉన్నా, కర్మచేస్తూ సన్యసించినా ఏ సిద్ధీ జరగదు, అధోగతి తప్ప. అర్థం, కామం పంచేంద్రియ తృప్తికి

సహాయపడతాయి. లింగభేదం, ఇంద్రియవాంఛ, పరస్పరాకర్షణ, తృప్తి, ఇవి శరీరానికి సహజమే. కానీ శరీరవాంఛ తృప్తిపడ్డాక 'తర్వాత ఏమిటన్న' ప్రశ్న మిగులుతుంది. అహంకారానికి, అంతర్యానికి మధ్యనున్న దశ లీ ధర్మార్థకామాలు. ఆతర్వాత 'నేనెవ'రని అయోమయావస్థపాలవుతాడు మనిషి. పతనం ప్రారంభమవుతుంది. ఎంతటి మనిషీ కర్మకి అధీనుడే. ఆయా జన్మల్లో చేసిన కర్మల ఫలితం ఆ జన్మలోనో తర్వాతజన్మలోనో అనుభవించక తప్పదు. స్వయంకృతాలయిన జీవిత ఘటనలకి కర్తతానే. వెనుకటి జన్మలో తనుచేసిన క్రియాఫలంగా వారివారికున్నటువంటి సత్త్వరజస్తమో గుణాలబట్టి జన్మల పరంపర సంప్రాప్తమౌతుంది. ఈ జన్మలకి కర్మతోగల సంబంధా న్నెరిగినవాడు జ్ఞాని. గతం మరపువలన మరచిపోతాం. 'రేపే'టి స్వరూపం తెలియదు. ఉన్న వర్తమానం బహుస్వల్పం, అల్పం, అనిత్యం కూడాను. ఇది సామాన్యునికి సంబంధించినంత వరకు నిజం. ఇంతకీ చిక్కువిడని ప్రశ్న ఏమిటంటే??-

మనిషి ఉన్నాడు. జీవితం ఉంది. ఒకటి కర్త. ఇంకొకటి కర్మ. జీవింపబడడం అనేది క్రియ. అనుస్యూతంగా, నిరంతరంగా లోపల ఇంకొకచైతన్య సంపుటి వుంది. సర్వసృష్టిని సామూహికంగా చేసి చూస్తే కనిపించే వైశిష్ట్యానికి కారణం మరొకటి కనిపిస్తుంది. అది ఆత్మ. సమాజంలో మనిషి చేత మాట్లాడించేది అంతర్గతంగా ఉన్న ఆత్మ! సృష్టిని చేసిన పరమాత్మ! ఇలా జీవిని చూసే ప్రయత్నం చేస్తే విచికిత్స విరాట్స్వరూపం పొందుతుంది. ఆలోచనలో పరిణతి ఆరంభమయితే జీవితం అల్పమవుతుంది. ఆత్మ ఉపాధి భేదంవలన జీవాత్మ, పరమాత్మ రూపాలు పొందుతుంది. అన్నీ ఒకటే అయినా పరమాత్మ ఆదేశాలిచ్చేదైతే జీవాత్మ ఎదుర్కొనే సంక్షోభం విశిష్టం అయింది కనుక ఔపచారికంగా జీవాత్మ విశిష్టం అంటారు.

యోగం అన్న మాటకి బంధించుట, ఉపాయం, ధ్యానం, మార్గం అని అర్థాలున్నాయి. జీవితం కన్నా భిన్నమైనది, విశిష్టమైనదీ వేరే ఉన్నదని మనం అనుకుంటున్న ఆ ఆత్మ దర్శనానికి మార్గం ఈ యోగం కర్మ, భక్తి, జ్ఞానం ఇత్యాదిగా పలు యోగాలవుతోంది. అన్నిటి ఉద్దేశ్యం ఒకటే. మనిషి జ్ఞాని కావాలి. రాగద్వేషాల్ని జయించినవాడు తత్త్వమెరిగినవాడు, తాత్త్వికుడవుతాడు. కర్మలని సక్రమంగా ఆచరిస్తున్నా కర్తృత్వాన్నీ, కర్మఫలాన్ని కోరనివాడు 'సిద్ధాంతి' అవుతాడు. ఎప్పుడూ జీవి సృష్టికర్త కాడు. ఫలభోక్తకాడు. శరీరానికి సంబంధించినంతవరకు యీ నటనంతా ప్రకృతి వలన జరిగిపోతోంది. కర్మల ఫలాన్ని జన్మ పరంపరలో అనుభవించి ఆత్మని ప్రతిష్ఠించిన తర్వాత అతి సూక్ష్మమయిన అనంతమయిన పరమపదం పొందగలడు. ఆత్మధ్యానపరులకి, నిర్గుణోపాసకులకీ జీవన్ముక్తి చాలా త్వరగా లభిస్తుంది.

హిందూమతం బోధించే ఉపదేశాలన్నీ ఆత్మ, పరబ్రహ్మ, కర్మ, పునర్జన్మల చుట్టూ పరిభ్రమిస్తూ వుంటాయి. చరిత్రలో అతిప్రాచీనమైన హిందూమతం ఆధ్యాత్మికతే ఏ మతానికయినా సారం అని చెబుతుంది. మనిషి మనీషి కాగలిగితే మతమూ సార్థకమవుతుంది. జీవితమూ పునీతమవుతుంది. మనీషి అంటే ''అహం బ్రహ్మాస్మి'' అ ̄వాడు. ఆ జీవుడే అధ్యక్షుడు. వాక్కు, ప్రాణం, మనసుని, ' ణాలని నియమించి విశ్వస్థితికి హేతువయిన జీవచైతన్యాన్ని ందర్శించగలగడం యోగి లక్షణం.

ప్రతీ మతంలోనూ ప్రత్యేక లక్షణాలుంటాయి; వైశిష్ట్యం ఉంటుంది. మానవజాతి ప్రగతి మార్గానికి, అభ్యుదయానికి ఆ మతం మార్గం అయి మానవులంతా వివేకవంతులై ఆత్మజ్ఞాన సంపన్నులై సత్యాన్ని దర్శిస్తే వారే జగన్నిర్మాతలు కాగలరు.

''సర్వ భూతస్థ మాత్మానం, సర్వ భూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః''

– భగవద్గీత – 6 – 29శ్లో.

అనువాదం : శ్రీమతి శారదాపూర్ణ శొంఠి

# అలంపురమున ఆలయ నిర్మాణములు - అపూర్వ విశేషవ

శ్రీ ఐ. కార్తికేయశర్మ

ఆంధ్రదేశమున మహబూబునగరు జిల్లా అలంపుర మనుచోట శ్రీశైల జలాశయమున మునిగిపోకుండ రెండు దేవాలయ సముదాయములను యిటీవల భారత ప్రభుత్వ పురావస్తు సర్వేక్షణ శాఖ, హైదరాబాదు మండలమువారు పునర్నిర్మించిరి. ఈ కార్యక్రమములో కొన్ని విశిష్ట అవశేషములు, ఆనాడు ఆచరణలోనున్న ఆలయ వాస్తు, మూర్తి ప్రతిష్ఠా పద్ధతుల విశదీకరించు విశేషములు వెలుగుకు వచ్చినవి.

పవిత్రములు, పురాతనములు అపూర్వములు నైన దైవ కట్టడములను పునాదుల సహితము కదలించి వెలికి తీసిన సన్నివేశములు భారతదేశమున మిక్కిలి యరుదు. కాని ఆంధ్రావనిలో అట్టి సంఘటనలు కొన్ని తప్పనిసరిగా జరిగినవి. రమారమి 30 యేండ్ల క్రిందట గుంటూరు జిల్లా, నాగార్జునసాగర నిర్మాణములో నాగా నకొండ లోయలలో ప్రపంచ ఖ్యాతి గాంచిన ప్రాచీన వా , శిల్ప, కళాఖండములను జలాంతర్గతము గాకుండ వెలికి సి కొండ పైని భద్రము చేసితిమి. ఈ బృహత్తర కార్యము 1954-61 సంవత్సరములలో పరిపూర్ణముగ కొనసాగించినంతనే, మరల కృష్ణానది పైనే శ్రీశైలమున మరొక విద్యుత్ జలాశయ పథకము చేపట్టబడెను ఆ కారణముగా అనేక పురాతన క్షేత్రములు, మహబూబునగరు - కర్నూలు జిల్లా ప్రాంత ముల నీట మునుగుట తథ్యమయ్యెను. నూరు గ్రామము లతో నున్న ఈ ప్రాచీన ఆలయ సంపద నంతటిని సంరక్షించుట కష్టతరమయ్యెను. కొన్ని మహత్తర కృత ములు, శిల్ప వాస్తు ప్రాభవము గల్గి, యపురూపములుగా పేరుమోసిన వాటిని సురక్షిత ప్రాంతములకు తరలించు కార్యక్రమమును భా త ప్రభుత్వము మరియు ఆంధ్రప్రదేశ ప్రభుత్వము చేప యిటీవల చాలా ఆలయములను కాపాడుట జరిగిన . విశేష ప్రజ్ఞతో, శ్రమతో కూడిన యీ కార్యక్రమములను రెండు చోట్ల పరిపూర్ణముగ చేయగల్గితిమి. ఈ అధ్యాయమున, కొన్ని అపురూప వాస్తు అవశేషములను గూర్చిన ఆలయ వాస్తు, మూర్తి ప్రతిష్ఠా రీతులను నిశితముగా సాక్ష్యాధారములతో పరిశీలించి, చదువ రులకు వివరముగా నందజేయుదును.

ఈ ఆలయములు రెండు సముదాయములకు చెందినవి. 1. కూడలి గ్రామములో తుంగభద్రా - కృష్ణానది సంగమమున గల సంగమేశ్వరాలయము 2. పాపనాశి యను నామముతో ప్రసిద్ధి గల్గిన 23 ఆలయముల సముదాయము. ఈ రెండును చాళుక్యనృపుల కాలమున ప్రతిష్ఠితములు. మహబూబునగరు జిల్లా, అలంపురమునకు చెందిన భూములలో పునర్నిర్మిత ములై శోభించుచున్నవి. (రేఖా పటము - 1).

## 1. చాళుక్య పూర్వ రంగము : శాసనాధారములు, చరిత్ర

విష్ణుకుండి వంశజులను, బాణనృపులను జయించి వాతాపి నేలు మొదటి కీర్తివర్మ (క్రీ.శ. 566-67) అధికారములోకి వచ్చెను. చాళుక్య విషయముగా ఖ్యాతికి వచ్చిన యీ మహబూబునగరు - కర్నూలు - కడప జిల్లా ప్రాంతములు ప్రముఖ విద్యావంతులకు, రాజవంశములకు ఆకర్షణీయము లయ్యెను. రెండవ పులకేశి కాలమునకు చెందిన తుమ్మెయ నేరు శాసనము కృష్ణా - తుంగభద్రా నదుల సంగమములో నున్న కూడలి సంగమేశ్వర క్షేత్రమును గూర్చి స్ప గా పేర్కొనుచున్నది. ఈ తుమ్మయనేరు గ్రామమును లకేశి ప్రభువు స్వయంగా కూడలి సంగమేశ్వరునికి య ము గావించి కార్తీక పౌర్ణమి నాటి చంద్రగ్రహణ పుణ్యకాలమున బ్రాహ్మణులకు దానమిచ్చెను. గర్భాలయపు తూర్పు గోడ పైన పద్మనిధి - యర్ధనారి శిల్పముల మధ్య ఇ-44గా గుర్తించబడ్డ రాతి ఫలకము మీద తెలుగు - కన్నడ లిపిలో లిఖింపబడిన ఒక శాసనము ''శ్రీ పుత్పత్తి పిడుగు ఏకాంత నివాశి''[3] చాల ముఖ్యమైనది. ఇటువంటి లేఖనము లాంఛన ముతో సహా సత్యవోలు, కడమర కాలువ, ప్రాతకోట వంటి పూర్వ చాళుక్యుల దేవాలయము లందు కూడ కలదు.

ఈ చోట్లనే గాక ఉండవల్లి, అక్కన్న - మాదన్న గుహలలో (విజయవాడ) గూడ చెక్కబడి యున్నది. ఈ నామము స్థపతుల సంఘము యొక్క సంకేతముగాను, రెండవ పులకేశి కాలమున కన్న పూర్వమైనదిగాను పలువురు నిర్ణయించియు న్నారు.[4] ఇటువంటి లేఖనము మొదటి విక్రమాదిత్యుని కాలమునకు చెందినది (క్రీ.శ. 654-681), అలంపూరునగల చాళుక్య కృతములైన నవ బ్రహ్మ ఆలయముల[5] కన్న నిస్సందేహముగా ప్రాచీనమైనదిగా చెప్పనగును. ఈ విక్రమా దిత్యునకు శివ మండల దీక్ష నొసగిన శ్రీ సుదర్శనాచార్యుల వారి ఆశ్రమము చిన్న మారూరు గ్రామమున గలదు. అలంపురమునకు చేరువైన యీ గ్రామమున విక్రమాదిత్యన్న పుడు స్మృతి మందిరమును గూడ నిర్మింప జేసెను.[6] కడమర కాలువ గ్రామము నందలి శివ నందీశ్వరాలయము లోని మరియొక శాసనమున[7] విక్రమాదిత్యుడు తన 8వ రాజ్య సంవత్సరమున కార్తీక శుద్ధ పంచమి నాడు స్వయముగా నొసగిన దానముల పేర్కొనుచున్నది. ఈ మధ్యనే లభించిన అర్క బ్రహ్మ ఆలయములోని స్తంభ శాసనము వలన యీ అనివారిత విక్రమాదిత్యుని మహాదేవి మహాదేవాలయమున లింగప్రతిష్ఠ జేసి భారద్వాజస గోత్రుడైన పిష్ఠి శర్మ యను మహాబ్రాహ్మణునకు యేబది నివర్తనముల భూమిని దానమొసంగినటుల తెలుపుచున్నది. విక్రమాదిత్యుని తరువాత వారయిన వినయాదిత్య, విజయా దిత్య రాజుల పాలనలో కూడ చాళుక్యుల అధికారము సుస్థిరమే గాక ఆ రాజులు అనేక ధార్మిక కార్యక్రమములు గావించి ప్రసిద్ధి గాంచిరి. బాలబ్రహ్మ ఆలయములోని మండప స్తంభ శాసనము వారి కాలమునకు చెందినది. ఆ తరువాత కూడ విజయాదిత్యుని కాలము వరకును అలంపూరు సీమ సుసంపన్నమై యున్నట్లు, ఆ పరిసరములలో కూడ విస్తృతంగా ఆలయ కార్యక్రమములు, శైవాచార్యుల, బ్రాహ్మ ణుల పోషణ విరివిగా జరిగినటుల తెలియుచున్నది.[9]

## 2. కూడవల్లి (లేక) కూడలి సంగమేశ్వరాల యము:

రాతిగుట్టల లేక పంటపొలముల మధ్యగా యెగుడు -దిగుడు బాటలో, వేసవి రోజులలో మాత్రమే ప్రయాణ సాధ్యమైన మార్గము గల్గి అలంపురమునకు 20 కి.మీ. ఈశాన్యముగ యీ ఆలయమున్నది. రెండు నదుల పవిత్ర సంగమ స్థానమున (ఛాయా చిత్రము - 1). పడమటి నుండి కృష్ణవేణీ, ఉత్తర వాహిని తుంగభద్రా నదుల మేలు కలయిక ఈ మహోత్తర వాస్తు శిల్పకళా భండారమునకు పునాది స్థలమయ్యెను. ఇట్టి కూడలి వలననే చేరువైన గ్రామమునకు కూడవల్లి లేక కూడలి యను వ్యవహారిక నామము సంభవించెను. తీర్థసంగమమే కాక జీవనదులు సరి యీ ప్రాంతముననే ఉత్తర వాహినులగుట మహత్తరము పూర్వ చాళుక్య ప్రభువులు యీ ప్రకృతి దృశ్యము పరవశించి శివుని కాలయము గావించిరి. ఈ యేకై ఆలయము తక్క తరువాత కాలమున మరెట్టి కట్టడమ నిర్మింపబడలేదు. ప్రతి సంవత్సరము యీ రెండు నదు వరదల ముంపు వల్లనే ప్రక్క గ్రామప్రజలు యిచ్చటికి చేర కున్నారు. ఈ కారణము వలననే ఆలయ నిర్మా కార్యక్రమములు అలంపురమునకే తరలింపబడెను కాబోలు చాళుక్య నృపులు మరెట్టి దేవాలయమును యీ చో నిర్మింపలేదు.

## ఎ) ఈ ప్రాంతమున త్రవ్వకములు: (రేఖా పటము -2)

ఆలయమునకు తూర్పున మరియు దక్షిణ భాగము గల యెత్తయిన దిబ్బన, 1978-79 సంవత్సరముల శ్రీ యస్.సి. ఘోష్ త్రవ్వకములు జేసెను. ఈ త్రవ్వకము ఫలితముగా క్రీస్తబ్దము 4-6 శతాబ్దములకు చెందిన యిటు దేవాలయములు యెరుపు రంగు కొద్దిగా నలుపు-యెరుప గల మట్టి పాత్రలు అట్టడుగు స్తరములలోలభించెను ఆలయము నెం. 1 తూర్పు ముఖస్థమై 3.84 X 2.6' మీ.గల్గిన దీర్ఘచతురస్రాకారములో గల గర్భగృహము ముందుగా 1.96 X 0.87 మీ. అగ్రమండపమున్నది. గర్భ గృహమున వెనుక గోడకు ఆనుకొని యిటుకలతో నిర్మితమైన వేదిక లింగపీఠముగా నుపయోగించిరి.

ఈ ఆలయమునకు చేరువ వుత్తరముగా ఆలయము నెం.2 సంగమేశ్వరాలయ దక్షిణ ప్రాకారమున క్రిందుగ పోయినది. ఈ యిటుక ఆలయము అందున నేలపైని ప్రాంగణముల పలక రాతి పరుపు గలదు. కనీసము రెండు దఫాలు మరమ్మత్తులు కూడ జేశిరి.[10] దాచేపల్లి తెల్లరాతి లింగములు చిన్న యిటుకతో నిర్మితములైన గుళ్లలో నదీతీరమున అంచున కానవచ్చినవి. ఈ సంగమ స్థానము పవిత్రమైన తీర్థస్థలము. క్రీస్తబ్దము 5-6 శతాబ్దులలో ఖ్యాతి బడసి పెక్కు చిన్న చిన్న యిటుక దేవాలయములు నిర్మింపబడి దాచేపల్లి తెల్లరాతి లింగములు ప్రతిష్ఠితములయ్యె నని నిస్సంకోచముగా తెలియ వచ్చెను. ఇవిగాక శ్రీ ఘోష్‌గారు కొన్ని యపురూప పురావస్తు అవశేషముల వెలికి తీసిరి. యేనుగు, చంద్రవంక మరియు ఉజ్జయినీ చిహ్నములు గల రెండు పోటీను నాణెములు, సాతవాహను రాజుల కాలము నాటివి, 4వ శతాబ్ది బ్రాహ్మీలిపి శాసనము (కొలను) అదే కాలమునకు చెందిన గుండ్రని (రాతి చిప్పరాయి) ముద్రిక

- కలభన యను నామముతో 'కలభ' యనువానిది లభించినవి.[12] ఇవిగాక రోమను చక్రవర్తి కాన్‌స్టైన్ టైన్ ది గ్రేటు (క్రీ.శ. 306-337) మరియు బైజాన్‌టైన్ చక్రవర్తి అనస్టాషియన్ (క్రీ.శ. 491-518) యొసగిన రెండు బంగారు నాణెములు పై స్తరముల నుండి లభించినవి[13] ఈ నాణెములను కంఠహారముల పతకములుగా నుపయోగించి నట్లు వానికి గల రంధ్రముల బట్టి తెలియుచున్నది. రోమనులు, బైజాన్‌టైన్‌లు యీ కాలమున యీ ప్రాంతముల వ్యాపార సంబంధములు కలిగియుండిరి కాబోలు బంగారునా ణెములు విరివిగా యీ చోట్లకు చేరుటయే గాక ఆభరణము లుగా వాడుకొనుట యాచారముగా నుండెను. ఈ వస్తు సముదాయములను బట్టి క్రీస్తుశకము 4వ శతాబ్ది నాటికే యీ సంగమస్థానము ప్రముఖ ధార్మిక తీర్థక్షేత్రముగానే గాక, వ్యాపార స్థలముగా కూడా ఖ్యాతికి వచ్చెను. మహారథుల కాలానికి, తరువాత గౌతమీ పుత్ర శాతకర్ణి మరియు ఇక్ష్వాకుల కాలానికి చెందిన శైవాలయములు, నాణెములతో సహా, నందికొట్కూరు తాలూకా, వీరాపురము[14] సిద్దేశ్వ రము, రంగాపురము మున్నగు చోట్ల గావించిన ఖనన పరిశోధనలలో లభించినవి. ఈ విధముగా తుంగభద్ర కృష్ణ - భవనాశి సంగమ స్థానములు దేశీయులనే గాక విదేశీయ వ్యాపారులను గూడ ఆకట్టుకొన్నవి. వీరు కూడలి వంటి చక్కని సంగమ స్థానముల దర్శించి తరించిరి.

## బి) ఆలయ వాస్తు లక్షణములు:

తుమ్మయనేరు శాసనమున కూడలి సంగమేశ్వరాలయ రూపమును గూర్చి వర్ణన కానరాదు. ఈ ఆలయ మేరీతిని కనుపించేదో తెలియదు. చాళుక్య ప్రభువు రెండవ పులకేశి యిక్కడకు వచ్చినప్పుడు (క్రీ.శ. 620) యితర యిటుక ఆలయ కట్టడములు లేకపోయినా కనీసము సంగమ స్థానమున లింగ ప్రతిష్ఠలు వుండవలె! ఈ స్థానము తీర్థక్షేత్రముగా పవిత్రత గల్గియుండుట వలననే మహారాజైన పులకేశి యిచ్చటకు వచ్చెను. ఆధారములు కొద్దియైనను యీ ప్రాంతము విజయపురి ఇక్ష్వాకుల ఆధీనమున వుండినట్లు తెలియుచున్నది.[15] ఇక్ష్వాకురాజైన రుద్రపురుషదత్తుని కాల మున హలంపుల స్వామికి యిచ్చిన భూదానము (గురజాల శాసనము) వీరాపురం త్రవ్వకముల[16] లభించిన ఇక్ష్వాకు నాణెములు, ఈ అలంపురసీమ తరువాతి సాతవాహన, ఇక్ష్వాకు కాలమున రాజ్యభాగమై యుండెను. వీరి తరువాత విష్ణుకుండి ప్రభువులు కొద్ది కాలము పాలైన రాజ్యముచేశి యుండనగును.[17] కూడలి యందు అలంపురము త్రవ్వక ముల విష్ణుకుండిన నాణెములు లభించినవి. పద్మబ్రహ్మ ఆలయము క్రింద త్రవ్వగా యిటుక దేవాలయ పునాదులు కూడ వెలుగుకు వచ్చినవి.[18]

## 1) వాస్తు విన్యాసము :

నేలమీద మానమును బట్టి ఆలయము దీర్ఘచతురస్రాకార ముగా తూర్పు ముఖంగా నున్నది. (రేఖా పటము - 2). వెనుక గర్భగృహము, దానిముందు అంతరాళం, మధ్యగా సోపానమున్నది. ముందు అగ్రమండపము యొక్క స్థంభ ములు రెండు వరుసలుగా నమరియున్నవి. వీని పైకప్పు ఏటవాలుగా రెండు స్తరములలో (లూపారోహిత శిరము) అంతస్తులుగా స్తంభముల బారు కనుగుణంగా వేయబడినది. గర్భాలయమునకు అగ్రమండపమును చుట్టూ గూడా మండపమున్నందున ఆలయము చక్కగ శోభాయమానమై వెలుపలి గోడలపైని యెన్నో రీతుల శిల్పశోభితములై యున్నవి. మండపము యొక్క బహిర్భాగము నలువైపుల చిత్రితములైన కుడ్య శిల్పములు మరే ఆలయమున ఇంతటి మేలురీతిగా కానము. గంధర్వ దంపతులు, కిన్నర మిథున ములు, - కోష్ఠముల దేవతలు, తోరణాలంకృతములై కుడ్య స్తంభికల మధ్యను, అనేక రకములైన భద్రావలోకనములతో శోభాయమానమై ఉన్నది. (ఛాయా చిత్రము-2) ఈ ఆలయము సాంధార రేఖానగర ప్రాసాదము. పై శిఖరము చక్కని వంపైన తలచ్ఛందము గలిగి, ఐదు తలముల నిర్దేశించు కర్ణామలకములు శోభస్కరములుగా కానవచ్చుచు న్నవి. శిఖరాగ్రముపైని ఆమలకశిల, దానిపైని పూర్ణ కలశ స్తూపిని ప్రస్ఫుటముగా నమర్చిరి.

ఆలయ తూర్పు ముఖ ద్వారమున కెదురుగా చతుస్తంభ స్ఫటికా తలముపై నొక పెద్దనందిని ప్రతిష్ఠించిరి. నందీశ్వ రుడు దైవవీక్షణ తత్పరుడు గదా! రమారమి 3.30 మీటర్ల యెత్తున ఆలయము చుట్టునూ ప్రాకారము గలదు. తూర్పున యెనిమిది మెట్లతో యెత్తయిన సోపానమున్నది. ప్రాకారము యొక్క నాలుగు ముఖముల చిత్రితమై అత్యంత శోభాయమా నమై తీర్చియున్నది. లోపలి ప్రాంగణమున ఆలయము యొక్క నేలమట్టము వరకును, షుమారు ఒకటిన్నర మీటర్లు మందము మట్టితో నింపిరి. ఆలయము చుట్టూ ప్రదక్షిణ మార్గము గలదు. దేవకోష్ఠములతో శోభించు గూఢ మండపమును చక్కగా సమీపించి చూడనగును. అంతః ప్రాకారమెట్లు సుచిత్రితమో, బహిర్ ప్రాకారము కూడ నంతకు మించియే కనులపండువుగా నున్నది. నూపురముగా ఈ ప్రాకారాగ్ర భాగమున - శాల, కూట, పంజర శిఖరములు తోరణములుగా తీర్చిరి. ప్రధానాలయమున కెట్లు జగతి - యధిష్ఠానములున్నవో, అట్లే ప్రాకారమునకు కూడ

ఉపానము, స్పష్టమైన కోణములతోటి పద్మజగతి, సుందో భేదముగా లేక వృత్తముగానో కుముదము (అయిహోళే ఆలయము వలె) కంఠము, నకులపాద అర్ధ స్తంభముల మధ్య నిండుగా చెక్కిన శిల్ప ఫలకములతో నలంకృతమైన రీతి చూడముచ్చటగా నున్నవి. (ఛాయా చిత్రము-5). శిల్ప ఫలకముల మధ్యగా చిన్నగణములు, మిథున దంపతులు, అపురూపమైన మూర్తి శిల్పములు - లకులీశుడు, భూవరాహ, బ్రహ్మ మున్నగునవి కంఠభాగమున అమర్చిరి. (భిత్తి సమాశ్రిత) కోణముల గజముఖములు భార వాహకుల వలె సహజ రూపమున కానవచ్చును. ఈ గజముండములు మహాబలిపురములోని పంచ రథముల, సత్యవోలులోని భీమేశ్వరాలయమున కూడ చూడనగును. ఆగమ శాస్త్రానుసారముగ ప్రాకారమున ఆగ్నేయ మూల సప్తమాతృకల ఆలయమున్నది.[19] బాలబ్రహ్మ ఆలయమున గూడ నిట్లున్నది.

చిత్రమేమన ఈ కూడలిని ఈ సంగమేశ్వరాలయమును తప్ప మరొక కట్టడమును యిచ్చట చాళుక్యులు నిర్మింప లేదు. ఆలయములోని వివిధ భాగముల మీద శాసనములన్నియు యీ కూడలి సంగమేశ్వరునికి సంబంధించినవే. ఈ మధ్యనే ప్రధానాలయములోని ఒక రాతిపై 6వ శతాబ్దికి చెందిన నామలేఖనం ''శ్రీ విశిద్ధకజాగచారి' ఒక స్థపతి పేరును తెలుపుచున్నది. దీనివలన అలంపూరు రాతి ఆలయములన్నింటిలో ఈ కూడలి సంగమేశ్వరాలయమే మొదటి కృతముగా సూచితమగుచున్నది.

మరికొన్ని శాసనములు క్రీ.శ. 1028, 1045లో దీపదానాలను గురించి,[20] క్రీ.శ. 1187లో ప్రముఖ శైవాచార్యులు[21] మల్లికార్జున పండితారాధ్యులు యిచ్చటికి వచ్చిన సందర్భంగా జరిపిన భూదానమును, 13వ శతాబ్దంలో మల్లిదేవ స్థానాధిపతి విగ్రహాన్ని నిలిపినట్లు[22], మహామండలేశ్వర వీరకేసరదేవు (క్రీ.శ. 12వ శతాబ్ది)ని భార్య మైలాలదేవి యాత్రికులను ఉచితంగా నదిని దాటించడానికి పడవల వారికిచ్చిన ధర్మరేవు భూదానమును[23] గురించి ఉదహరించుచున్నవి.

శక సంవత్సరం 1320-1322 నాటి ఒక లేఖనం ద్వారా ఈ ఆలయం మొత్తం, దాని శిఖరం, మండపము భవంతిని [24] కందెనవోలు (కర్నూలు) పెద్దకరణమైన సుఖామృత శ్రీపాదుడు పునర్నిర్మాణము చేయించి[25] నటుల విదితమగుచున్నది. కాలానుగుణంగా వరదల వలన ప్రజలు క్షేత్రమును విస్మరించినందున కొన్ని భాగములు నేలకొరిగి యుండవచ్చును. బాగుచేసి కొన్ని నూతనముగా చేర్చిరి. ముఖ ద్వారమున గ్రానైటు రాయి ద్వారబంధము, వీరభద్ర విగ్రహము, నాల్గు చేతులున్న విష్ణుమూర్తి (గోపాలుడు) క్షేత్రమూర్తులుగా ప్రతిష్ఠించిరి. ముఖమండపము పైని తెలుగు శాసనమును బట్టి[26] క్రీస్తబ్దము 1724 వరకు యీ ఆలయము పోషణలో నుండినటుల స్పష్టముగ తెలియవచ్చుచున్నది.

## సి) ఆలయపుచెంత త్రవ్వకములు: (రేఖా పటము-4)

చిత్రిత ప్రాకారము యొక్క దక్షిణపు వైపున, తూర్పు ప్రక్క నది అంచున శ్రీ ఎన్.సి. ఘోష్ కొనసాగించిన త్రవ్వకముల గూర్చి పైన వివరించితిమి. ప్రస్తుతమీ త్రవ్వకములు సంగమేశ్వర గర్భగృహము, మండపముల మీదుగా వాని పునాదులెట్లు వేయబడినవో, వాస్తు విన్యాసము లెట్టివో తెలుసుకొనుటకై నుద్దేశింపబడెను. ఆదిలో గావించిన వాస్తు మండల నిర్మాణము దాని కనుబంధముగ పాటించిన గర్భ విన్యాస క్రతువులే రీతిని ఆచరించిరో తెలుసుకోవలసిన యవసరము ఆలయ పునర్నిర్మాణమునకై అత్యంత ముఖ్యములైనవి. ఈ కార్యమున కనువుగా రెండు కందకములు (ట్రెంచీలు), కె.డి.యల్ - 1, కె.డి.యల్. - 2 త్రవ్వబడెను. మొదటిది గర్భగృహము పైగా ఉత్తర - దక్షిణముగాను, రెండవది మండముపై తూర్పు - పడమర దిశలుగాను వేయబడెను. ఆలయ పైభాగములను నేలమట్టమునకు తీశిన తర్వాత యీ త్రవ్వక ములు జేయబడెను. ఆలయ ప్రాంతమున నేల శుభ్రము చేసినప్పుడు క్రిందుగా నున్న ఉపానభాగము లభించెను. ఇది దీర్ఘ చతురస్రాకారముగ రాతితో దిమ్మలు పరచిరి. గర్భాలయము 7.30 మీటర్లు చతురస్రమై వాస్తు మండలమునకు పడమటి అంచున వేయబడెను. ముందు అంతరాళము, దాని ముఖస్తముగా పదునారు కంభముల పైని అర్ధమండపము, పై భాగములన్నింటిని కలుపుచూ గూఢా మండపము ఆలయ సముదాయములను సాంధార ప్రాసాదముగా తీర్చినవి.

ఉపానమునందు వేయబడిన రాతిఫలకములపై గీతలు వరున క్రమమును సూచించును. మాన సూత్రపు సూచికలు, పై నిర్మాణమున కాధారములు. రాళ్ల వరుసలు, నిలువు స్తంభములనే రీతిని అమర్చవలెనో సూచించు పునాది ప్రక్రియలు గమనించవలసియున్నది. పునాదిని పరచిన రాళ్లను ఒకదానికి మరొకటిని యినుప బద్దీలతో ముడిపెట్టిరి.

కె.డి.యల్. - 1 కందకమున గర్భాలయ ప్రాంతమును చక్కగా సమమట్టము చేసి మొట్టమొదటగా 7.45 మీటర్ల లోతున పునాది త్రవ్విరి. ఈ మట్టం మీద పుట్టమట్టితో గట్టిగా దిమ్మిసకొట్టిరి. ఈ మట్టిపై 'టాకి' రాళ్ల వరువు

చేసిరి. ఈ 'టాకీ' రాళ్ల పలకలను పుట్టమట్టిని పొరలు పొరలుగా నింపి మొత్తము 7 మీటర్ల మందము గర్భాలయము క్రింద దిట్టముగా పునాదిని చేసిరి. (రేఖా పటము-3) ఇంతటి గట్టి పునాదికి కారణము గర్భాలయము పైని అనేక శృంగములతో కూడిన బరువైన రేఖాశిఖరము 15 మీటర్లు యెత్తున నిర్మింపబడుటయే! ఈ ఆలయ పునాది ఆగమ శాస్త్రానుసారము శిఖరపు యెత్తులో సరిగా సగమున్నది.

ఈ పునాది త్రవ్వకములందు మూడు దశలుగా నిర్మాణ కలాపములు జరిగినట్లు తెలియుచున్నది. మొట్టమొదట నేల మట్టము 7.10 మీటర్ల లోతున చేయబడెను. ఈ స్తరములు పాత మట్టి పాత్రల అవశేషములు - ఎరుపు రంగువి, మెరయుచున్నవి. లభించినవి (Red Polished Ware), చిన్న యిటుకలు (5.4 X 5.2 సె.మీ.), బాణలింగము (మరకతము) ఛిద్రమైనది లభించెను (రేఖా పటము - 5, ఛాయాచిత్రము - 6)

రెండవ దశ (Phase - 2) లో పైని లభించిన మృణ్మయ పాత్రలే గాక యిటుక ముక్కలు లభించినవి. మూడవ దశలో నొక శాసన ఫలకము - ఆగడికోల్‌శ్రీ యను నామమున్నది. క్రీస్తబ్దము ఆరవ శతాబ్ది వ్రాత శైలి గల్గినది లభించెను. ఈ దశలలో చక్క రాతి పలకలతో పరచుటయే గాక మధ్యగా యెర్ర పుట్టమ స్తరముల దిట్టముగా పరుపు చేసిరి. గర్భాలయము క్రింద విధముగా ఆలయపునాదిని కొ ్ర క్రతువుల - అద్యేష్టకలు, మరకత లింగము - మ వా్రలతో నాచరించి నటుల విదితమగుచున్నది. ఈ వి ముగా ఆలయ వాస్తు క్రతువుల గూర్చి గ్రంథస్థముగా తెలియుచున్నదే కాని, పురావస్తు పరిశోధనల యిదియే మొదటి దృష్టాంతముగా నెరుగగల్గితిమి.

కె.డి.యల్. - 2, కందకమున పునాది వేసిన తీరున రాతి పలకలు - పు మట్టి పొరలు ఒక దానిపై నొకటి క్రమముగా 3.90 మీట మందము వరకె గావించిరి. మిగతా భాగమున సాధారణమై నదియొక్క ఒండ్రుమట్టి నిండియున్నది. ఇచట యెట్టి పురావస్తువులు లభ్యము కాలేదు. ఈ పునాదిపై మండప స్తంభములు తీరుగా నమర్చిరి. ముక్తసరిగా మూడు 'అంచెలతో తక్కువ బరువు గల్గిన పై కప్పు (ఛాయాచిత్రము - 3) యుండుటచే తక్కువ మందపు పునాది వేసిరి. ఆలయ నిర్మాణమునకు కావలసిన యెరుపు యిసుక రాయి (Red Hardstone), తుంగభద్ర నది వొడ్డున (అలంపూరు నుండి - కూడలి వరకు) గలదు. ఇక్కడనే వాస్తు - శిల్పకారులు పనిచేశిరని తెలుపుటకు, పనిముట్లు మరియు అసంపూర్ణముగా చెక్కిన కొన్ని రాతి ఫలకములు కూడ లభ్యమయినవి.

## 3. పాపనాశి ఆలయ సముదాయము, అలంపురము:

అనాదిగా ఖ్యాతి బడసిన పాపనాశి తీర్థము అలంపురమునకు 3 కిలోమీటర్లు దక్షిణముగా ఉత్తరవాహిని యైన తుంగభద్రా నది గట్టున వెలసియుండెను. (రేఖా పటము-6). ఆలయములు మొత్తము 23 గుర్తింపబడియున్నవి. రమారమి క్రీస్తబ్దము 10-11 శతాబ్దముల నుండి [28] వృద్ధిజెందినవి. బయటనుండి చూచిన సాధారణమైన రాతి కట్టడములుగా కనుపించును. పేర్చిన మెట్లవలె రాతి పలకలతో కట్టిన చతురస్ర - బ్రహ్మచ్ఛందశాల లేక మండపముల వలె యున్న శిఖరములు, ఒకచో గుమిగూడి యున్నట్లు కనుపించును. ఆలయములు జె.యన్.వి. పైన వివరించిన ఆకారములను పొందియున్నవి. ఆలయము అర్. గజపృష్ఠాకృతి శిఖరము గల్గియున్నది. చిన్న చిన్న లింగ పీఠములు పలు విధముల ప్రాంగణములో నున్నవి. ఆలయము లన్నియు ప్రాకారమున భద్రితములు. తూర్పు ముఖముగా నది వైపు ప్రవేశ ద్వారశాల (ప్రతోలి) కలదు. తీర్థము చేరుటకు సోపానములున్నవి.

ఇచ్చటి పాపనాశేశ్వర ఆలయము (అనగా - యఫ్) ప్రధానమైనది. (ఛాయా చి ము-7). అన్నింటి కన్న పెద్దది. నేలపై చతురస్రాకారము గ సాధారణమైన గోడలు, మెట్లవలె చతురస్ర పుపరితలము ( ంశనా). మీద బ్రహ్మచ్ఛంద గ్రీవ శిఖరమున్నది. ముందుగా రంగమండపము గలదు. శిల్ప శోభతో నున్న యీ రంగమండపపు కంభములపై చాల చ ని పురాణ గాథలున్నవి. సముద్ర మంథనము మున్నగు న వి. ఈ మండపవితానముపై అష్టదిక్పాలకుల శిల్పము - ధ్యగా నటరాజు - చాల ఖ్యాతిబడసిన మూర్తి శిల్పములు అత్యంత శోభాయమానములు. గర్భగృహ ద్వారము పంచశాఖలున్నది. లలాటము పైని ద్వారశాల, కూట శిఖరముల మధ్య చక్కగా నమరినది. ముఖ్య ద్వారమునకు మెట్టుగా అర్ధచంద్రశిల శంఖాలంకార తోరణముతో అలంకృతమై యున్నది.

ఈ ఆలయ సముదాయమును నీటి ముంపు నుండి సంరక్షింపవలసిన బాధ్యత పురావస్తు సర్వేక్షణ, హైదరాబాదు మండలముపైబడెను. స్వస్థలము నుండి రెండు కిలోమీటర్ల దూరముగా యెత్తయిన మరొక స్థలమున నదీప్రాంతమును చూచునట్లు మరల యీవత్తు ఆలయములు పునర్నిర్మితములయినవి. ఆలయ నిర్మాణ విధానమును పరిశీలించిన పిదప, ప్రతి రూపములను కొలతలతో చిత్రములపై వేసి, ప్రతి

రాతిని అంకెలతో నిర్ధారించితిమి. ఈ విధముగా నమూనా లను చేసి ప్రతి రాతిని జాగ్రత్తగా వూడతీసి అవి తరలించబడెను. ఈ పనిచేయు నప్పుడు విడి శిల్పములు, మూర్తి విగ్రహములను, కొన్ని ముఖ్య ఆలయ భాగములను తగు శ్రద్ధతో గడ్డి సంచులను, వెంటిని చేసి యెటువంటి ఆపద రానీయక, అతి జాగరూకతతో, శ్రద్ధా భక్తులతో నీతరలింపు కార్యక్రమమును సర్వశ్రీ సుంకర కొండారెడ్డి, జయరామిరెడ్డి, అయ్యలన్న ప్రభృతులు చక్కగా నిర్వర్తించిరి.

ఈ ఆలయములు, కూడలి సంగమేశ్వర ఆలయము వలె చిత్రితములు కావు. కానప్పటికిని పునాది పద్ధతులలో వీనియందున కొన్ని సామ్యములున్నవి. రాతి (టాకి) పలకలను, పుట్టమట్టిని పొరలుగా వేసి దట్టించి యెత్తుగా నమర్చిరి. షుమారు ఒకటిన్నర మీటర్లు మందముగ నిట్టి పునాది వుపానము క్రిందుగా అన్ని ఆలయముల వెలికివ చ్చెను. దీనివలన తేలినదేమన చాళుక్యవంశీయులు పునాదుల నిర్మించుటలో నొక నిర్దిష్ట విధానమును రూపొందించి పాటించి రన్నమాట.

రాతి పలకలు, పుట్టమట్టి పొరలతో తయారుచేసిన పునాది ''ప్రకృతి భు''[29] మీద నిలపిన స్తంభమూలము లేక పాదవర్గము యొక్క మట్టమునకు ఆలయ వుపానము సమతలములో నున్నది. వాస్తు మండలమును నిర్ణయించుట, ఆలయ వైశాల్యమును నిర్ణయించుట మొదలగు క్రతువిధాన మును ప్రతి ఒక్క దానిలో అనుసరించుటకు తోడుగా వుపానాది కలశ స్థూపి పర్యంతముగల వుపరితల నిర్మాణమున కనువగు నటుల మానసూత్ర రేఖలను, చుక్కలతోను లేక గీతలు చెక్కితాపీ వాని పనికి వీలుగా శిలలపై సంకేతముల చేసిరి.

ఆలయము 'బి' నందున లింగపీఠమును లేవనెత్తగా మధ్యలో గుంటవంటి పల్లము కనుపించెను. కొన్ని చిన్న యిటుకలతో వాస్తు మండలమున క్రతువు లొనర్చిరి కాబోలు. అద్యేష్టకల నుంచి పూలు, నీరు లోహములు, ధాన్యములు (బీజములు) మొదలైన వస్తువుల నుంచుట క్రతు విధానము. మానవాకృతిని బోలిన బంగారు రేకు అయిదు జీర్ణమైన రాగి నాణెములు యిందున లభించెను[30] గర్భన్యస్తముగా నున్న వాస్తుదేవతలకు శ్రద్ధాంజలి ఘటించి యిచ్చిన వస్తువులుగా వీటి నెరుంగవచ్చును.

అంతియేగాక ఆలయ శిఖరములను తీయు సందర్భమున గూడ కొన్ని నూతన సాక్ష్యాధారములు లభించినవి. అలంకరించిన తామ్రకలశమును, గృహపిండిని లేక మధ్య రంధ్రమున కప్పిన రాతిపలక క్రింద శిఖరమూలమున నిక్షిప్తము చేసిరి. ఇది స్థూపిని నిలువు మధ్య స్థానమునక క్రిందుగా నున్నది. ఆలయములు బి.సి.ఇ.యఫ్.హెచ్ కే.టి.వి. ఛాయా చిత్రములు - 8,9,10; రేఖా పటములు -6,7: యీ విధముగా యెనిమిది రాగి కలశములు కొమ్ము చెంబులను బోలినవి లభించెను. ఛాయా చిత్రము - 10 ఆలయములు బి.హెచ్.టి.లలో దొరికిన కలశములకు మూతలున్నవి. మిగిలిన వానికి మూతలు లేవు. పొంద్రు మట్టితో పూర్తిగా కుక్కి నింపియున్నవి. ! నిక్షిప్తమైన వస్తువులు చాల ముఖ్యమైనవి. ఆలయము 'ఎఫ్ యొక్క గ్రీవము నుండి లభించిన (ఛాయా చిత్రము 9) కమండలము వంటి కలశమున అండాకృతిలో నున తెల్లటి రాతి ముక్క (క్వార్ట్జైట్ రాయి పురుషాకృతి చిహ్నము (చిత్రము - 7)గా గర్భన్యస్తము చేసిరి. ఆలయమ 'బి'లో లభ్యమైన కలశము యొక్క కొమ్ము యేను తొండము వలె నున్నది. పలువరుసను బోలిన అంచు గ మూతగట్టిగా బిగింపబడెను. ఇందున అయదు విలువ గ వజ్రములు ఒక పలుచని బంగారు రేకులో చుట్టి సువర్ణపు ములతో నంతర్గతము చేసిరి (ఛాయాచిత్ర-10)ఈ నిక్షిప్తమై పాత్ర రత్నన్యాస కలశముగా నెరుగనగును. మరొక సా అంచు కల కలశము, ఆలయము - కె నుండి లభ్యమయ్యెన ఒక యినుప బాణము నందుంచిరి. ఆలయము - ఓ నం గర్భాలయపు నేల పునాదిని ఒక చిన్న యినుపగ దానితోబాటు ఆరు రాగి నాణెములు లభించెను. పూర్తి జీర్ణించి పోయినందున ఈ నాణెములను గుర్తించ వీలు కాలే అయినను ఒక నాణెముపై ప్రక్క చతురస్రమున మ త్రిశూల చిహ్నము కనుపించుచున్నది. ఆలయము 'ఎ' పిడితో నున్న పదునైన కత్తి లభించినది. ఆలయ హెచ్.టి.లలో లభించిన కలశములలో అట్టడుగున పల రాగి రేకుతో పద్మాలంకారము గల్గిన మట్టుల నుంచి నేపాల్ తారాయి లోని సాగ్రహ వద్ద[31] క్రతు విధానము భాగముగా పద్మములతో అచ్చొత్తిన యిటుకలు పునాది లభించెను. ఈ విధమైన వాస్తు కలశములు అందున నిక్షిప్త వస్తువులు తీర్థక్షేత్రమున ఆలయముల నిర్మించినప్పుడు ప్రతిష్ఠా పద్ధతుల కనుగుణముగా వివిధ క్రతువులనాచరించి తెలుపుచున్నవి.

## 4. పునాది నిర్మాణ పద్ధతులు:

పురాతత్వజ్ఞుల త్రవ్వకముల లభించిన నూతన సాక్ష్యవ వివరించిన తర్వాత ఆగమ శాస్త్రముల సహాయము లభ్యమైన వాస్తు రీతులను తత్సంబంధిత వస్తు శకలము సరియైన దృక్పథముతో పరిశీలించి పూర్వ క్రతువుల

ఆచారముల గూర్చి చర్చింతును. ప్రాచీన కట్టడముల పునాది రీతుల గూర్చిన పరిశోధన చాలా అరుదుగా చేపట్టబడెను. మొత్తము కట్టడమును పునాదులతో సహా పెకలించుట పురావస్తు త్రవ్వకము లందు వీలుగాదు. యెవ్వరును అంగీకరింపరు గూడ. ఏలనన ప్రాచీన ఆలయములను యథాతథముగా భద్రము చేసి, భావితరాల వారికి అందజేయుట పురాతత్వ సర్వేక్షణ యొక్క గురుతర బాధ్యత గదా! కాని పైన వివరించిన రెండు ఉదాహరణలు అత్యంత జుగుప్సాకరమైన, అపురూప కార్యక్రమములుగా గ్రహింపవలెను. దేవాలయములు ఆమూలాగ్రము - ఉపానాది స్తూపి పర్యంతము పీడదీసి, మరొక స్థలమునకు తరలించి పునర్నిర్మాణము గావించుట యెప్పుడో కాని జరగదు. అట్లు జరిగినను శాస్త్ర పద్ధతుల ననుసరించి వాస్తురీతుల - మూర్తి ప్రతిష్ఠ పద్ధతుల అవగాహన చేసుకొనవలెనని ప్రయత్నము జరుగలేదు. భగవదిచ్ఛ కాబోలు ఈ కార్యక్రమములు అట్టి వస్తు ఆధారములు, గ్రంథముల నిర్దేశించియున్న క్రతు విధానముల రుజువు చేయుచున్నవి.

## అ) క్షేత్ర నిర్ణయము:

అజితాగమములోని 6, 7వ అధ్యాయముల దేశనిర్దేశమును అనగా భారతదేశము నందలి పవిత్రస్థలముల నుదాహరించి, తగిన స్థలమును యెన్నుకొనే విధానము వివరింపబడెను. పవిత్ర స్థలము అనగా క్షేత్రము నీటి తీరము లేక నదీ స్థానమున (తీర్థము). అందువలన కూడలి సంగమేశ్వరాలయము రెండు నదుల కృష్ణా - తుంగభద్ర సంగమమున స్థాపించిరి (చిత్రపటము - 1). అట్లే పాపనాశి తీర్థము తుంగభద్రానది గట్టున స్థాపితమయ్యెను.

## ఆ) స్థల పరీక్ష:[34]

స్థల నిర్దేశమునకు మూడు పరీక్షలు చేయుదురు. నేల యొక్క గట్టితనము, మట్టి యొక్క బిగువు, నేలలోని తడి, నేల క్షేత్ర నిర్మాణమునకు కనువైనదా లేదా అను విషయమును తెలుసుకొనుటకై భూమిని పరీక్షించుట జరుగును. సాగుచేసి గింజలు చల్లుట మొట్టమొదటి కర్తవ్యము. పైన లభ్యమైన సాక్ష్యాధారముల బట్టి నదుల సంగమ స్థానమగుట చేత సస్యశ్యామలమైన భూమియే కాని ఆలయ నిర్మాతలు అత్యంత జాగరూకులై గట్టి పునాదులను లోతుగా నిర్మించిరి

## ఇ) నేలపై ఆలయ మానము గుర్తించుట?

నిర్మించవలసిన కట్టడపు నమూనాను నేలమీద గుర్తించుటకు దాని వెడల్పు (విస్తార), పొడవు, (ఆయము), మానసూత్రము వెంబడి గుర్తించెదరు. స్థలమును దిశాభిముఖము చేసి కట్టడపు కొలతలను నేల మీద గుర్తించుదురు. పునాదిని వేయు స్థలమున రక్షక దేవతలను స్థాపించుట యాచారము.[135] కట్టడపు పరిణామమును నిర్ణయించుట వాస్తు పూజా సమయమున జరుపుదురు

## ఈ) పునాదుల రీతి: (రేఖా పటము-3)

పునాది లోతు నిర్మించదలచిన కట్టడపు యెత్తును బట్టి, బరువును బట్టి మరియు నేలలోని నీటి పార యొక్క లోతును జూచి నిర్ణయింతురు. ఈ ఆలయ నిర్మాణ కాలమునకు చెందిన వాస్తు గ్రంథము ''మయమతము''ను బట్టి [36] ఆలయము యొక్క వెడల్పు బట్టి పునాదిలోతును నిర్ణయించవలెనని యెరుగవలెను. కూడలి ఆలయమందు యిట్లే పాటించిరి ఇందున గర్భాలయము 7.30 మీ వెడల్పు గల చతురస్రము. పునాది 7.10 మీటర్ల లోతున వేసిరి. గర్భాలయపు గోడలు వానిపైని రేఖాశిఖరము కలిసి 15.75 మీటర్ల యెత్తు నిర్మింప బడెను. కాశ్యప శిల్పమను గ్రంథమున (84-1-10) పునాది యొక్క మందము ఆలయ శిఖరము యొక్క యెత్తులో సగము గాని లేక నేల క్రింద నీటి పార, తగులు వరకు గాని వేయవలయునని నిర్దేశించుచున్నది. సమరాంగణ సూత్రధారము నందున[37] పునాది లోతు మానవుని యెత్తులో నాల్గవ వంతుగా చెప్పబడినది. కూడలి సంగమేశ్వరాలయమున పునాది గర్భాలయము యెత్తుతో (అనగా ఉపానాది స్తూపి పర్యంతము) సగమున్నది. దీనితో మూడవ వంతు మహామండపము పునాది యున్నది. గర్భాలయము క్రింద త్రవ్వకములందు చాల పెద్ద బండ రాళ్లపరువు గావించిరి ప్రతిరాతి పారపైని పుట్టమట్టి నింపి దిమ్మిస చేసిరి. ఈ విధానము (Raft Foundation) తీరును బోలియున్నది. గర్భాలయము వద్ద మాత్రమే యిట్టి పునాది 7.10 మీ. మందమున పెద్ద చతురస్రపు అరుగువలె నిర్మింపబడుట పై రేఖా శిఖరమును భద్రముగా నిలుపుట కోసమే. గర్భాలయపు కొలతల కన్న పెద్దదైన కందకమును 7.45 మీటర్లు లోతు వరకు త్రవ్వి దానిలోని యేటి మట్టిని (నల్లని వొండ్రు మట్టి) తీసివైచి పై విధముగా బండలతో మరియు పుట్ట మట్టితో దట్టించి, ధృఢమైన పునాదిని వేసిరి నదుల సంగమ స్థానమగుటచే నేల యొక్క బిగుతు మోయు సామర్థ్యాన్ని సరియైన అంచనాలు వేసుకొని ప్రత్యేక శ్రద్ధతో, సామర్థ్యముతో నీ ఆలయమునకు పునాదిని వేసిరి.

## ఉ) పుట్టమట్టిని యేల యెన్నుకొనిరి?

నిత్య వైదిక ఆహ్నికములకు - అగ్నిహోత్రము చేయుటకు గుండములు పుట్టమట్టితో నిర్మించుట, ఆవు పేడచే

అలుకుట యాచారము గదా! దీనికి గాఢమైన ధర్మ సంబంధమైన అర్థమున్నది. ధార్మిక కట్టడములను నిర్మించుటలో పుట్టమట్టి, గోమేధ్యము ముఖ్యపాత్ర వహించచున్నవి.[38] ఆలయ నిర్మాణ క్రమములు నిర్వహించు క్రతువు లలో పుట్టమట్టి పిండము తీసుకొని ''గర్భస్త పిండముగా'' పునాదుల నుంచుట ఒక క్రతువు.[39] హరప్పా నాగరికతకు చెందిన పెద్ద కట్టడములందున కూడ యిట్టి మట్టి పిండములు - పలు రకములుగా లభ్యమైనవి. కాని వీని యుపయోగము, వాస్తు క్రతువుల లేక నిత్యకర్మల యిట్టి మృత్తికా పిండముల ప్రాముఖ్యతను సరిగా అవగాహన చేసుకొనలేదు. ఆపస్తంబ శ్రౌత సూత్రములలో (15-2-1), చీమలు పె న పుట్టలు ఆదివరాహమూర్తి మూతితో పైకెత్తిన మట్టి ము గా చెప్పబడియున్నది.[40] ప్రపంచమున మొదట పుట్టిన గా పుట్ట చీమలను (తెల్లచీమలు), శతపథ బ్రాహ్మణము పేర్కొనుచున్నది. - పృథివీ భూతస్య ప్రథమజా. ఈ చీమల పుట్టలే నాగుపాములకు ఆవాసముల య్యెను. ఈ పుట్టలలోని మట్టి భూమి క్రింద పొరల నుండి పైకి తేబడినది. ఖనిజ సంపదలతో నిండిన యీ భూమి బలమైనదిగా[41] చెప్పబడెను. వాస్తవానికి చెద చీమలు బంగారమును కూడ బెట్టునవిగా పేర్కొనెదరు. ఈనాటికిని చీమలపుట్టల వద్ద నాగపంచమి జరుపుట హిందువుల పవిత్ర యాచారము[42]. ఇది వాసుకి జన్మదినముగా పూజార్హమైనది. భారతావనిలో అత్యంత ప్రాచీనమైన పర్వదినముగా శ్రద్ధతో పాటించుచున్నారు.

## ఊ) తాత్కాలిక ఆలయము:

రౌరవాగమములోని 27వ అధ్యాయము[43] పూర్తిగా ఆలయ 'బాలస్థాపన'ను గూర్చి వివరించుచున్నది. ఉద్దేశించిన ప్రధానాలయమునకు తూర్పు దిశన లేక ఈశాన్యమున తరుణాలయము అందున బాణలింగము ప్రతిష్ఠించుదురు. ఈ బాలస్థాపనము అతి ముఖ్యము. యెందుచేతనంటే 'బాలస్థాపనం వినా మూల స్థాపనం మృత్యుహేతుకం' (రౌరవాగమము, 27-3). అసంపూర్ణముగా లభ్యమయినను, కూడవల్లి ఆలయ స్థలమున యిట్టి తరుణాలయము ప్రతిష్ఠితమైనదని తెలుపుటకు కొన్ని ఆధారములు లభ్యమయినవి. కె.డి.యల్. కందకమున మొదటి స్తరమున చిన్న అద్యేష్టకములు, మరకతలింగము (పటము - 6) ముఖ్యాలయము క్రిందుగా నున్న పునాది స్తరముల దొరికినవి. ఈ బాలాలయమును లింగముతో సహ భగ్నము కావించి ప్రౌఢాలయము పూర్తి కాగానే దాని క్రిందనే మట్టిలో వేసిరి.

## ఎ) మొదటి యిటుక నుంచుట:

పాపనాశి సముదాయము అందలి ఆలయముల గర్భగృహముల క్రింద పునాది గుంటలలో 5 అద్యేష్టకములను సుస్థాపితము చేసిరి.[44].

## ఏ) క్రతువులు:

వాస్తు పూజా క్రతువులు ఆలయ సీమలను నిర్ణయించిన యనంతరము క్షేత్రపాలురగు దేవతలకు శాంతి స్తోత్రములతో అద్యేష్టకలను నిక్షిప్తము చేయుదురు. ఈ విధానములలో ముఖ్యక్రతువు పునాదులనిధి కుంభముల నుంచుట ''పాపనాశి ఆలయము'' యిట్టి కుంభములు గ్రీవశిఖరమున గృహపిండి లేక మధ్యరంధ్రముపై మధ్యగా లభించినవి. ఈ కలశములు రాగివి. వీటిని నదిలోని మృణ్మయము నింపిరి. అందున మధ్యగా నిక్షిప్తములైన రత్నములు (రత్నన్యాసము - దేవాలయము - బి), సువర్ణపుష్పములు, శ్రేష్ఠ ధాతువులు - ఆయుధములు పేర్కొనవలసి యున్నవి. అంతేగాక ఈ కలశములు పళ్ల అంచుగల మూతలతో బిగువుగా మూసివేయబడెను.

కుంభముల (నిధి కుంభములు) నిక్షిప్తము చేయుట వాస్తు గ్రంథముల విపులీకరింపబడి యున్నది. విశ్వకర్మ వాస్తు శాస్త్రమున యిట్లు వివరణ గలదు.

దేవాలయే దైవగర్భే రత్నన్యాసో విశేషతః,
దైవవాస్తుషు సర్వేషు సౌవర్ణం భాజనం శుభమ్.

ఈ క్రతువులు ఆలయ పునాదిలో జరుగవలసినవిగా అన్ని గ్రంథములు పేర్కొనుచున్నవి.[46] కాని మనకు లభించిన సాక్ష్యాధారముల బట్టి ''దైవగర్భ''యను పదము శిఖర ప్రారంభమున అనగా గ్రీవము వద్దననియె అన్వయము చేసుకోవలసి యున్నది. గర్భగృహము యొక్క పునాది లేక అంతర్భాగము పైని కాదు. దక్షిణ దేశమున ఆలయ విమానమున శిఖర భాగము అత్యంత పవిత్రమైనది. కారణాంతరమున గర్భాలయము నందలి మూల బేరమును దర్శింపజాలకున్న శిఖర దర్శనము చేసిన పునర్జన్మ లేదని సూక్తి. ఆలయమున శిఖరము తలవంటిది. - ''శిఖరం శిరయిత్యాహుః గర్భ గేహం గలస్తథా॥ కాన ముఖ్యమైన క్రతువులు - కలశ స్థాపనము, ఆమలక స్థూపి, ఆయుధ ప్రతిష్ఠ మున్నగునట్టివి గ్రీవాగ్రముననే ఆచరించుచుండిరి.

పైన వివరించిన అంశములన్నియు అరుదైనవియే. ఇంకను అపూర్వ విశేషమేమన సవిస్తరముగా పరిశోధన చేసి యిట్టి వాస్తు - దేవతా ప్రతిష్ఠ కార్యక్రమముల పాటించిన ఆచార

క్రతువుల వివరములు సేకరించగల్గుట. యేలనన యిట్టి పవిత్ర కట్టడములను సమూలముగా పెకలించి స్థలాంతరము చేసి ఉపానాది స్థూపి పర్యంతము తిరిగి నిర్మించిన కార్యక్రమము మరెక్కడను చేపట్టబడలేదు. అతి మెళకువతో జాగ్రత్తగా ప్రతి శిలను, మూర్తి శిల్పములను కొన్ని కిలోమీటర్లు దూరము తరలించి మరల ప్రతిష్ఠితము గావించిన భారత పురావస్తు సర్వేక్షణ, హైదరాబాదు మండలము వారికి భావితరములు ఋణపడియున్నారు.

అలంపురము వద్ద కూడలి సంగమేశ్వరాలయ పునర్నిర్మాణము 1990 జనవరి నాటికి పూర్తియైనది. పశ్చిమ ప్రాకారము కొంత భాగము. యితర సహజ ప్రకృతి నిర్మాణం కావలసి వుంది. (పటము - 65) ఈ ప్రాచీన ఆలయము ప్రారంభము నుండి ఆరాధనలో నుండి యుండెను. కనుక భారతీయ సర్వేక్షణ, ఏన్షియంట్ మాన్యుమెంట్స్ ఆర్కియాలాజికల్ సైట్సు అండ్ రిమైన్స్ ఆక్టు 1958 అండ్ రూల్సు దేర్ టు, 1959 లోని నిబంధనల ప్రకారము.[47] ఆలయ ప్రాచీనత యథార్థ స్థితికి అనుగుణముగా ధార్మిక వుపయోగము పూజా సంస్కారముల సంప్రదాయ రీతుల అవిచ్ఛిన్నముగా కొనసాగించుటకై రక్షణ కల్పించవలసిన బాధ్యత ప్రభుత్వముపై నున్నది. ప్రజలు ప్రత్యేకముగా కూడలి గ్రామవాసులు, నిత్య పూజా క్రమమును పునః ప్రారంభించుటకు వుత్సుకులై నిరీక్షించుచుండిరి. ఈ అంశముల దృష్టిలో నుంచుకొని మూల బేరమును తరలించునప్పుడు కలాకర్షణము యితర అనుబంధిత ప్రకరణములు యథావిధి పాటించితిమి. లోగడ లింగపీఠమును పునర్నిరా ణ స్థలమునకు మార్చి తాత్కాలికముగా ఆరు బయలును పించి పూజారులు సాంప్రదాయ విధానమున ప్రతి నిత్యము ంగపూజ, కలశ పూజలను కొనసాగించు చుండిరి.

## పునః ప్రతిష్ఠా కార్యక్రమములు:

పునః ప్రతిష్ఠా కలపామంతయు మూడు దినములు ఆచరింపబడెను. శుక్ల నామ సంవత్సర మాఘ బహుళ త్రయోదశి శుక్రవారం తేది. 23-2-1990. శ్రవణ నక్షత్రయుక్త మీన లగ్న ప్రదోష కాలమున గం. 12.05 నిముషములకు మహాశివరాత్రి పర్వదినమున లింగ ప్రతిష్ఠతో పరిసమాప్తి గావించబడినది. భావి పరిశోధకులకు గాను క్రతు విధానమును యిచ్చట పేర్కొనుచున్నారము.

మొదటిరోజున (21 ఫిబ్రవరి 1990) మాఘ బహుళ యేకాదశి బుధవారము గం. 8.05 నుండి వరున క్రమముగా యీ క్రింది క్రతువుల నాచరించడమైనది. గణపతి పూజ, స్వస్తి వాచనము, మాతృపూజ, ఆచార్య - ఋత్విక్కులకు ఆమంత్రణము, యాగశాలా ప్రవేశము, పంచగవ్య ప్రాశనము, మండప పూజ, భద్ర దేవతాహ్వానము, కలశ స్థాపనము, నవగ్రహ పూజ, మహానీరాజనము జరుపబడెను. సాయంకాలమున 17.00 గం.నుండి జలాధివాసము, మృత్సంగ్రహణము, అంకురారోపణము, అగ్ని ప్రతిష్ఠ, దీక్ష హోమము, ప్రదోష పూజ, స్వస్తి పూజ యథాక్రమముగ నిర్వహింపబడెను.

రెండవ రోజున తేది. 22-2-1990 గురువారము ఉదయం 8 గంటల నుండి మండల పూజ, జపము, క్షీరతర్పణము, హోమము, మహాస్నపనము, మహానీరాజనము గావింపబడెను. సాయంకాలము గం. 18.00 నుండి ప్రదోషపూజ శయ్యాధివాసము, ధాన్యాధివాసము, పుష్పాధివాసము నిర్వహించిరి. అనంతరము స్వస్తి వాచనము, హారతి కావింపబడెను. ప్రతి దినము వేదపారాయణ పురాణ - ఇతిహాస పఠనము మహానీరాజనము లను యథారీతిని సాగించిరి.

మూడవ దినమున (23-2-1990) శుక్రవారము మహాశివ రాత్రి పర్వదినమున ఉదయం 12.05 లకు మండప పూజ, లింగప్రతిష్ఠ, బలిప్రదానం, పూర్ణాహుతి, మహానీరాజనము జరుపబడినవి. పుష్పగిరి (కడప జిల్లా) మహా సంస్థాన పీఠాధిపతులు శ్రీ విద్యానృసింహ భారతీ తీర్థ స్వామివారు స్వయముగా పునఃప్రతిష్ఠా కలాపమును నిర్ణీత శుభముహూర్తమున స్వహస్తములతో గావించి ఆహూతులను ఆశీర్వదించిరి. ఈ కార్యక్రమము కూడలి సంగమేశ్వరాలయ చరిత్రలో మరువరాని మరపుకు రాని ఘట్టము. చాళుక్య నృపులు ఈ ఆలయమును ప్రతిష్ఠింపజేసిరి. రమారమి 14 వందల సంవత్సరముల యనంతరము పీఠాధిపతులు మహారాజాధిరాజుల కన్న మిన్నయైన యోగీశ్వరులు శ్రీ విద్యా నృసింహ భారతీతీర్థుల వారు ఇట్టి పునర్నిర్మిత ప్రాచీన ఆలయమున మూలబేరమును పునః ప్రతిష్ఠను తమ కరకమలముచే గావించుట, దేవాలయ - వాస్తు మూర్తి ప్రతిష్ఠా చరిత్రలోనే ప్రప్రథమము. సువర్ణాక్షరాలతో లిఖింపవలసిన అపూర్వ విశేషముగా పాఠకులెరుగుదురు గాక!

లోగడ గర్భాలయపునాదులందు 7.10 మీటర్ల లోతున మొదటి స్తరమున (ఫేజ్ - 1), 19 సెం.మీ. యెత్తు గల మరకతలింగమును గూర్చి పేర్కొంటిమి; ప్రధాన లింగమును, పీఠముతో సహా పునఃప్రతిష్ఠించు సమయమున నీ బాలలింగమును (ఛాయా చిత్రము - 9) తిరిగి పునఃప్రతిష్ఠింపవలెనా? యను చర్చ వచ్చెను. అట్లగుచో యే స్థలమున? ఈ బాల లింగము పగిలి యుండినది. దీనిమీద పగుళ్ళు తీరునుబట్టి ఈ లింగమును ముఖ్యాలయము పూర్తియైన తదుపరి విరుగగొట్టి విసర్జింపబడినటుల తెలియుచున్నది పుష్పగిరి పీఠాధిపతులున్ను, ప్రధాన యాజ్ఞికులైన

సర్వశ్రీ ధోరణొసాబ్రహ్మణ్య శాస్త్రి మరియు చేవూరి దత్తాత్రేయ శర్మ గారలు మహామండపమున చిన్న నంది పీఠమునకు ముందు ప్రతిష్ఠింప తగునని నిర్ణయించిరి. నిర్ణయ సింధు వచనానుసారము యిట్టి భగ్నలింగములు పూజార్హములే కాని గర్భగృహమున మూలబేరముగా ప్రతిష్ఠా యోగ్యము కావని విద్వజ్జనుల యభిమతముగా నెరిగితిమి.

## అథ జీర్ణోద్ధారః[48]

''దగ్ధే భగ్నే చలితే వా కార్యః అయంచ అనాది సిద్ధ ప్రతిష్ఠిత లింగాదౌ భంగాది దుష్టే పిన కార్యః తత్రతు మహాభిషేకం కుర్యాదితి త్రివిక్రమః''

## ఉపయుక్త గ్రంథములు

1. ఐ.కె. శర్మ ''సమ్ యాస్పెక్ట్స్ ఆఫ్ సాల్వేజ్ ఆర్క్యాలజీ ఇన్ ఆంధ్రప్రదేశ్'' ఇతిహాస్ (హైదరాబాదు, 1988 (పుటలు 96-101).

నాగార్జున కొండ లోయలో (1956-60) పెద్దఎత్తున స్తూపములను, ఆలయములను త్రవ్వి వెలికి తీయుట జరిగినది. కాని వాని పునాదుల వివరములను, వాస్తుర ...న విపుల పరిశీలన చేయలేదనియే అంగీకరింపవలసియున్నది. ముఖ్యముగా శైలాలయములను త్రవ్వి కొండమీద పునర్నిర్మాణము గావించితిమి.

2. యన్. రమేశన్: కాపర్ ప్లేట్ ఇన్స్క్రిప్షన్స్, సంపు.1

(హైదరాబాదు 1972) పుటలు 58-60, తుమ్మయనేరు గ్రామము చాళుక్య విషయములో నున్నది. ఈ గ్రామము మహబూబునగర్ జిల్లా దక్షిణ భాగమున నున్నది. ఇప్పటనే ...రించినవి.

దీనిలోనే పుటలు 42-43. ఈ మధ్యనే ఈ ఆలయముల పైని ఫ్రెంచ్ ఇన్స్టిట్యూట్ ఇండాలజీ సంస్థ పాండిచ్చేరి వారు వివరములతో నొక గ్రంథమును ప్రచురించిరి. చూడుడు: ఎన్ప్రైౖ అలంపూర్ ఎట్ శ్రీశైలం (పాండిచ్చేరి 1984) టోమ్-1. పుటలు 20-21, కూడవెల్లి 376-387, పాపనాశి (పుటలు 401-410) చిత్రములు టోమ్ 2, కూడవెల్లి,
పటములు 440 - 482.

3. ఇండియన్ ఆర్కియాలజీ, 1978-79, ఎరెవ్యూ. పు. 76 నెం. 5 (ఐ.ఎ.ఆర్.)

4. కె.వి. సౌందరరాజన్ ఈ శాసనమును, తూర్పు ఆంధ్రములోని గుహ సముదాయముల లభించిన పీటితో సహా 7వ శతాబ్ది నాటివిగా నిర్ణయించిరి. చూడుడు; వారి కేవ్ టెంపుల్స్ ఆఫ్ ది దక్కన్ న్యూఢిల్లీ, 1981, వి ... ష్ణుకుండినుల కాలము నాటి గుహలని నిర్ధారించిరి. చాలకాలము క్రిందటనే ఆనంద కె. కుమారస్వామి వారు నిర్ణయించిరి. ఎర్లీ ఇండియన్ ఆర్కిటెక్చరు 4 ''హట్స్ అండ్ రిలేటెడ్ టెంపుల్స్'' (ఎడిమైఖేల్ డబ్లు. మైస్టర్ అండ్ జోసఫ్ రిక్వైర్స్, ఇన్ రివర్పెస్ (స్ప్రింగ్, 1988) పుట. 20-21.

5. బి. రాజేంద్రప్రసాదు: అలంపూరు ఆలయ శైలిచేత సంగమేశ్వరాలయము ప్రభావితమైనదని భావించిరి. పట్టడకల్ ... స్వా ... లులోని భీమ-రామలింగేశ్వరాలయములలో వలె ఇది 'లాటిన' ఆకారము ... పూర్వపు ఇటుక ఆలయముల ... పూరు ఆలయముల క్రింద లభించినవి. (అధోజ్ఞాపిక 15 చూడుము) బి.ఆర్. ప్రసాద్ చూడుము: ''టెంపుల్స్ ఆఫ్ లాటిన ఫారం ఎట్ ఆలంపూరు'' ప్రొఫెసర్ ఎ.ఎస్. అగ్రవాలాక మెమొరేషన్ వాల్యూం (జె.ఐ.యస్.ఓ.) భాగం - 2 పు. 53 పాదజ్ఞాపిక 44. 57, 65 మరియు 69.

6. ఐ.ఎ.ఆర్. 1976-77, పు. 57 1972-73 పు. 59.

7. ఎపిగ్రాఫియా ఇండికా పు. 141, 142, బి. రాజేంద్ర ప్రసాదు, ''శివా నందీశ్వర టెంపుల్ ఎట్ కడమర కాలువ'' జర్నల్ ఆఫ్ ఇండియన్ సొసైటీ ఆఫ్ ఓరియంటల్ ఆర్ట్. (1975-76 పుట. 27-32) పి.వి. పరబ్రహ్మ శాస్త్రి యొక్క ఆసక్తికరమైన వ్యాసమును చూడుడు. సత్యవోలు, అలంపూరాలలో విష్ణుకుండినులు ఆలయములను నిర్మించిరి. వీనిని కాపాడి వృద్ధిపరచుటలో చాళుక్యులు ఎపిగ్రాఫికల్ నోట్సు ''క్రోనాలజీ ఆఫ్ ఎర్లీ చాళుక్యన్ టెంపుల్స్ ఇన్ ఆంధ్రప్రదేశ్'' ఎ.పి. ఆంధ్రికా (హైదరాబాదు 1974) పుట. 141-142.

8. పి.వి. పరబ్రహ్మశాస్త్రి, శ్రీనివాసరిత్తిగారి సంకలన వ్యాసములు, ఏ డికేడ్ ఆఫ్ ఎపిగ్రాఫికల్ స్టడీస్ ఇన్ సౌత్ ఇండియా, ధార్వాడ్ 1985) పు. 13

9. కె.వి. రమేశ్ ''రీసెంట్ డిస్కవరీస్ అండ్ రీసెర్చ్ మెథడ్స్ ఇన్ ది ఫీల్డ్ ఆఫ్ సౌత్ ఏషియన్ ఎపిగ్రఫీ'' నోబోరు కరాదిమా (ఎడి), ఇండస్ వాలీ టు మేకాంగ్ డెల్టా మద్రాసు 1985 పుటలు 18-24.

10. ఐ.ఎ.ఆర్. 1978-79 పుటలు 39-40, పటములు బి.ఎ. సంగమేశ్వర దేవాలయము, పట్టడకల్‌లో కూడ ఇదే స్థితి. పెద్దరాతి దేవాలయముమును, క్రింద నున్న పురాతన యిటుక ఆలయపునాదులపై నిర్మించిరి. జార్జి మైఖేల్, ''ది సంగమేశ్వర టెంపుల్ ఆఫ్ పట్టడకల్'' ఎ.ఎ.ఆర్.పి. (లండన్ 1972) పు. 47.

11. ఆన్యువల్ రిపోర్టు, ఇండియన్ ఎపిగ్రఫీ, 1978-79 బి. 26, పుట - 28.

12. ఐ.ఎ.ఆర్. 1978-79 పుట-39, పటము బి.

13. ఐ.ఎ.ఆర్ ... ్నల్ ఆఫ్ ది న్యూమిస్మాటిక్ సొసైటీ ఆఫ్ ఇండియా (1980 పుటలు 12-7).

14. ఐ.కె. శర్మ ది డెవలప్‌మెంట్ ఆఫ్ ఎర్లీ శైవ ఆర్ట్ అండ్ ఆర్కిటెక్చర్, న్యూఢిల్లీ 1982) పుటలు 90-92, ఐ.ఎ.ఆర్. 1978-79 పుటలు 116-117, పటము. టి.వి.జి. శాస్త్రి, వీరాపురం ఎ టైప్ సైట్ కల్చరల్ స్టడీ ఇన్ ది కృష్ణా వాలీ హైదరాబాదు, 1984) అధ్యాయము చిత్రము - 12.

15. ఇక్ష్వాకు వంశములోని చివరివాడగు రుద్రపురుషదత్తుని కాలము (క్రీ.శ. 344) నాటి శాసనమున హలంపురస్వామి ఉదహరింపబడ్డాడు. చూడుడు. ఎపిగ్రాఫియా ఇండికా పుటలు 124-125, కీర్తిశేషులు నేలటూరు వేంకట రమణయ్యగారు పరిగణించిరి. చూడుడు జర్నల్ ఆఫ్ ది మద్రాస్ యూనివర్సిటీ, నెం. 2, (జులై 1975) పుటలు 76, 77.

16. టి.వి.జి. శాస్త్రి లోగడ ఉదాహరించినది 1984) పుటలు 73-86 (రెండు నాణెములు).

17. పి.వి. పరబ్రహ్మశాస్త్రి, ఎపిగ్రాఫియా ఆంధ్రికా, హైదరాబాదు, 1975 పుటలు. 141-142.

18. ఐ.కె. శర్మ, ''ఎపిగ్రాఫికల్ డాటా ఫ్రామ్ అలంపూర్ టెంపుల్స్ అండ్ ది ష్రయిన్ ఆఫ్ జోగులాంబ'' కె.డి. బాజపాయి (సంకలనం); జి.సి. పాండి ఫెలిసిటేషను వాల్యూమ్ (న్యూఢిల్లీ 1990).

19. బ్రూనో డాజెన్స్, ఆర్కిటెక్చర్ ఇన్ ది అజితాగమ అండ్ ది రౌరవాగమ, ఎ స్టడీ ఆఫ్ టు సౌత్ ఇండియన్ టెక్ట్స్ పాండిచ్చేరి 1984). పుట. 147. యస్.ఎ. హైదరాబాదు సర్కిల్ వారి నుండి సమాచారము. ఈ

యస్. కొండారెడ్డి, సీనియర్ కన్సర్వేషన్ అసిస్టెంటు. ఈ ముఖ్యమైన లేఖనాన్ని గురించి దాని ఫోటో కాపీని పంపినారు.

20. జి.ఆర్. శర్మ (సంకలనము), తెలంగాణా శాసనములు హైదరాబాదు, 1968, పుట. 214, యం.ఆర్. శర్మ టెంపుల్స్ ఆఫ్ తెలంగాణా (1972), పుట. 57, యాన్యువల్ రిపోర్టు, ఇండియన్ ఎపిగ్రఫీ, 1962-63, బి-209, పుట 73 వేరు కూడల్లగా పేర్కొనిరి.

21. ఎ.ఆర్.ఐ.ఇ. 1962-63, బి-210, ఇందున దేవుని; స్పష్టముగ "కూడలి సంగమేశ్వరదేవ" యని పేర్కొనబడెను.

22. ఎ.ఆర్.ఐ.ఇ. 1962-63, బి-163, పుట 169. ఇందున దేవుని స్పష్టముగ "కూడలి సంగమేశ్వరదేవ" యని పేర్కొనబడెను. సిరీస్ 19 భాగమం పుటలు 71-72.

23. జి.ఆర్. శర్మ (సంకలనము) లోగడ ఉదహరించినది, పుట 170, ఐ.ఎ.ఆర్. 1971-72, పుట 53, ఎ.ఆర్.ఐ.ఇ. 1970-71 పు 36, బి 42.

24. ఇచ్చట 'భవన' శి- పూర్తి కట్టడమును తెలియజేయుచున్నది. బ్రూనోడా జెన్స్ (1984) పుట 84.

25. ఎ.ఆర్ పుట. 73 మరియు అన్యువల్ రిపోర్టు ఆఫ్ ఎపిగ్రఫీ 1966 (ఆం.ప్ర. ప్రభుత్వము) పుట 58, నెం. 259.

26. ఐ.పి.ఆర్. 1978-79, పుట 77 నం. 5 మరియు ఏ.ఆర్.ఐ.ఇ. 1978-77, పుట 28, బి 26.

27. ఐ.ఎ.ఆర్. 1982-83, పుటలు 9-10 మైఖేల్ డబ్ల్యు మీస్టరు మరియు ఎమ్.ఏ. ఢాకి (సంకలనము), ఎన్సైక్లోపీడియా ఆఫ్ ఇండియన్ టెంపుల్ ఆర్కిటెక్చరు, సౌత్ ఇండియా, అప్పర్ ద్రవిడ దేశ సంపుట 1, భాగము – 2, (న్యూఢిల్లీ 1986) పుటలు 175-176.

28. పాపవినాశి క్షేత్రమున క్రీస్తుశము 10వ శతాబ్ది శాసనము మొట్టమొదట పేర్కొనుచున్నది. ఏ.ఆర్ ండి 71 వరకు కళ్యాణ చాళుక్య కాలమునకు చెందిన మరొక శాసనము (శుక్రవారము 2 జూన్ ్సరం) నాటిది పాప వినాశ తీర్థమును, త్రిభుభవశక్తి పండితుని పేర్కొనుచున్నది. ఏ.ఆర్.ఐ.యి. 1960-61, బి. 72, పుట 59.

29. బ్రూనో డాజెన్స్ (1948) పుట 35.

30. మరియు 10.

31. డా. దేబల మిత్రాగారు సాగ్రహన (జిల్లా తౌలివాహ, నేపాల్ తారాయ్) యను చోట దేవాలయ ప్ర దుట గమనించిరి. ఈ ఆయుధ చిత్రములు దిక్పాలకుల దిక్‌విదిక్కుల చూపు నము – తూర్పు), శక్తి – అగ్నికి చిహ్నము, ఖడ్గము – నైఋత్; పాశము – వరుణుడు, పశ్చిమము, ధ్వజము – వాయువు గద – కుబేరుడు, ఉత్తరము, త్రిశూలము – ఈశానుడు పునాదులందు ధారణీలు లేక అద్వైష్టకలుగా నీ యిటుకలనుంచిరి. డి. మిత్రా "ది రెలిక్స్ ఆఫ్ సాగ్రహవ. ఎస్టడీ ఆఫ్ ది ఫౌండేషన్ డెపాజిట్స్ అండ్ "ది యిష్టకాన్యాస" జర్నల్ ఆఫ్ ది ఆంధ్రా హిస్టారికల్ రిసెర్చి సొసైటీ, XXXIII హైదరాబాదు

32. పి.హెచ్. జోషి "ఏన్షియంట్ ఇండియన్ ఫౌండేషన్ ఇంజనీరింగ్ ఫార్ మాన్యుమెంట్స్" ఇండియన్ జియో టెక్నికల్ కాన్ఫరెన్స్ రూర్కీ, డిసెంబరు 16 – 18, 1985 పుటలు. 589-93.

33. బ్రూనో డాజన్స్; (1984) పుటలు 29-30.

34. పై గ్రంథముః పుటలు 30-31, అజితాగమము, అధ్యాయము-8.

35. ఐ.కె. శర్మ, "బ్రాహ్మణికల్ బ్రిక్ టెంపుల్స్ అండ్ కల్ట్ ఆబ్జెక్ట్స్ ఫ్రం కేసరిగుట్ట" కుసుమాంజలి - శ్రీ శివరామమూర్తి స్మృతి గ్రంథము (న్యూఢిల్లీ, 1987) పుటలు 235, 237.

36. టి. గణపతిశాస్త్రి (సంకలనము) ది మయామత ఆఫ్ మయముని, తిరువనంతపురము, సంస్కృత మాలిక, (తిరువనంతపురము, 1919) మరియు బ్రూనో డాజెన్స్ మయమతా, పాండిచ్చేరి 1970) పుటలు 99 – 105.

37. డి.యస్. శుక్లా, సమరాంగణ సూత్రధార వాస్తు శాస్త్రము, న్యూఢిల్లీ 1965).

38. జాన్ ఇర్విన్ "ది సేక్రెడ్ అన్ట్ హిల్ అండ్ ది కల్ట్ ఆఫ్ ది ప్రైమార్డియల్ మౌండ్స్" హిస్టరీ ఆఫ్ రిలిజియన్స్, చికాగో యూనివర్సిటీ, సంపుటి. 21, సంచిక 4 (1982) పుటలు 339 – 360.

39. పి.యస్. గొడ్రియస్, కాశ్యపాస్ బుక్ ఆఫ్ విస్డం, (కాశ్యపజ్ఞాన కాండ) డెన్ హెగ్ 1965) పుట 63.

40. యె.ఫా.బి.జె. కుయిపర్, కాస్మోజెని అండ్ కన్సెప్షన్, మెక్వైరీ, హిస్టరీ ఆఫ్ రిలిజియన్స్, సంపుటి 10, సంచిక 2 (1970) పుటలు 91, 138.

41. జె.పి. వాట్సన్, ది డిస్ట్రిబ్యూషన్ ఆఫ్ గోల్డ్ ఇన్ టెర్మైటు మౌండ్స్, సాయిల్ సైన్సు, 113, పార్ట్ 5 (1972) పుటలు 317-321.

42. ఎడ్గర్ థర్స్టన్, ఓమెన్స్ అండ్ సూపర్‌స్టిషన్స్ ఆఫ్ సదరన్ ఇండియా, (లండన్ 1912) ష యన్ ఆన్టిక్వేరీ (1876), సంపుటి పుటలు 187-88.

43. బ్రూనో డాజెన్స్ (1984) పుటలు 31-32, 36 మరియు 137.

44. అజితాగమ, అధ్యాయము 10, 2, 8, 12 మరియు 24.

45. కె. వాసుదేవ శాస్త్రి మరియు యస్.టి. గద్రే (సంకలనము) విశ్వకర్మ వాస్తు శాస్త్రము, (తంజావూరు) 1958) పుటలు 41-42.

46. ప్రియబాల షా (సంకలనము), విష్ణు ధర్మోత్తర పురాణ. పురాణ. మూడవ కాండ, (బరోడా 1958) పుటలు 266-267, పి.యె. మంకడ్ (సంకలనము) అపరాజిత పృచ్ఛ ఆఫ్ భువనదేవ, (బరోడా 1950) పుట 375, పి.ఓ. సోంపుర, దీపార్ణవా, (పాలిటానా 1960) పుటలున 178, 180; మరియు విశ్వకర్మ ప్రకాశ అధ్యాయం శ్లోకములు 34-37.

47. ఆరాధనా స్థలమును దురుపయోగము నుండి, కాలుష్యము లేక అపవిత్ర ఉపయోగము నుండి కాపాడుట.

6) 1. ఈ చట్టము క్రింద కేంద్ర ప్రభుత్వము వారిచే కాపాడబడుచున్న రక్షిత కట్ట ్ర అట్టి దానిని భిన్నంగా యే యితర

2. కేంద్ర ప్రభుత్వము వారు సెక్షన్ 13 క్రింద రక్షిత కట్టడమును పొందినను డైరెక్టర్ జనరల్ (భారతీయ పురావస్తు సర్వేక్షణ) కొనుగోలు చేసినను, తీసుకొన్నను, దాన స్వీకారము చేసికొన్నను, లేక కాపాడు బాధ్యతను చేపట్టి పోషణకు తగు యేర్పాటు చేయునప్పుడు సెక్షను-5 కనుగుణముగా అట్టి ఆ కట్టడము లేక దానిలోని భాగము ధార్మిక ఆరాధనకు ఏ మతము వారైనను ్లా కలెక్టరు ఆ కట్టడపు స్థలమును లేక దానిలోని భాగమును కాలుష్యము ే క్షించుటకై తగిన ఏర్పాటు చేయవలసియున్నది.

48. శ్రీ కమలాకర భట్టుః నిర్ణయ సింధుః పునః ప్రతిష్ఠా విధిః తృతీయ పరిచ్ఛేదః (మద్రాసు 1909) రెండవ ముద్రణ 1986) పుట. 282.



(ఛాయాచిత్రము–1) కూడలి సంగమేశ్వర ఆలయము కృష్ణ-తుంగభద్రల సంగమము



(ఛాయాచిత్రము–2) కూడలి సంగమేశ్వరాలయము : ఆలయ ఖండిక (దక్షిణముఖము)



(ఛాయాచిత్రము-3) కూడలి సంగమేశ్వరాలయము : అలపురమున పునర్నిర్మిత మగుచున్న తీరు : శిఖర నిర్మాణము



(ఛాయాచిత్రము-4) కూడలి సంగమేశ్వరాలయము : పునర్నిర్మితములో నున్న శిఖరము : ఆమలకముపై దృశ్యము



(ఛాయాచిత్రము–5) కూడలి సంగమేశ్వరాలయము : పునర్నిర్మితమైన ఆలయం : సంపూర్ణదృశ్యము



(ఛాయాచిత్రము–6) సంగమేశ్వరాలయము : పునాదులందు లభించిన మరకత లింగము



(ఛాయాచిత్రము-7) పాపనాశి ఆలయము - ఎఫ్



(ఛాయాచిత్రము-౮) పాపనాశి దేవాలయము - ఎఫ్ : శిఖర భాగము తీసిన దృశ్యము



(ఛాయాచిత్రము-9) పాపనాశి దేవాలయము - ఎఫ్ : గృహపిండి మధ్యగా స్థాపితమైన కలశము



(ఛాయాచిత్రము-10) పాపనాశి దేవాలయములో లభ్యమైన కలశములు, ఆయధములు


శ్రీశైల ప్రాంతముల జలాశ
న మునిగిన
దేవాలయ స్థానములు
కొల్లాపురము
గుమకొండ
కృష్ణానది
శ్వరము
సంగమేశ్వరము
శ్రీశైలము
వీరాపురము
కూడవల్లి
సాతానికోట
తుంగభద్రానది
అలంపురము
నందికొట్కూర్
కర్నూలు

రేఖా 1

సంగమేశ్వరాలయము
కూడలి.



1 0 1 2 3 4 5 6 m.







ప్రాకార చిత్రము
ఖండిక అ-అ




రేఖా పటము - 2

సంగమేశ్వరాలయము, కూడలి
ఖండిక, శిఖరము, గర్భగృహము క్రిందపునాదులు




రేఖా పటము – 3


కూడలి 1978-79
మహబూబునగరు జిల్లా (ఆ.ప్ర).
0 1 2 3 4 5 m.
SITE KDV-2
ఉత్తరము
J 10
BRICK SHRINE
77(I, 3)
PROJECTED
SLAB WALL
NATURAL SOIL
STONE FLOOR
UNEXCAVATED
సంగమేశ్వరదేవాలయము
(వెనుక దృశ్యము)
SITE KDV-2A
దక్షిణాము
STONE SLAB WALL
43 X
DISTURBED PIT
BRICK STRUCTURE
GOLD COIN (BYZANTINE)
PERIOD I
PERIOD II B
PERIOD II A
NATURAL SOIL
GOLD COIN (ROMAN)
COPPER COIN (BAHMNI)
21(II B, 2)

రేఖా పటము - 4







రేఖా పటము – 5




రేఖా పటము - 6




పాపనాశి ఆలయముల, గ్రీవ-శిఖరములందు లభించిన వాస్తు కలశములు

రేఖా పటము - 7

# శంకరాచార్యుని కాలనిర్ణయము -
# ఒక పునః పరిశీలన

శ్రీ చీమకుర్తి శేషగిరిరావు

## I

ప్రాచీన భారతీయ సంస్కృతికి ప్రోదిజేసిన మహనీయులలో దాదాపుగ అందరి జనన, జీవితకాలాలు అనిశ్చితాలు. ఆకోవకు చెందినదే శంకరాచార్యుని కాలము కూడ.

కాంచీ మఠమువారి లెక్కప్రకారము శంకరభగవత్పాదులు క్రీ.పూ.509లో జన్మించెను, మాధవీయ శంకర విజయము, ఆ ఆచార్యుని జననము విక్రమ శకము 14న (క్రీ.పూ.44) ఈశ్వర నామ సంవత్సరమున జరిగినటుల పేర్కొనినది; శృంగేరి మఠమువారు ఆమోదించిన కాలమిది. కాని ఆధునిక చారిత్రక పరిశోధకులు కొందరు అందలి విక్రమ శకమును చాళుక్య విక్రమశకముగ పరిగణించి క్రీ.శ.668ని శంకరాచార్యుని జననకాలముగ తెలిపిరి.

శంకరుని జనన జీవితకృషి వివరములను తెలుపు సారస్వతము విరివిగ ఉన్నను, అది యంతయు క్రీ.శ. 1200కు తరువాతిదే. 'శ్రీమచ్ఛంకర భగవత్పాద చరిత్ర' అను పేరున తాను రచించిన ఒక గ్రంథమున డా. పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి, ఆ సారస్వతమునకు చెందిన 63 గ్రంథములను పేర్కొని, ఆయా గ్రంథములందలి విషయములను చర్చించి, పరస్పర విరుద్ధములుగను, సుప్రసిద్ధ చారిత్రకాంశములకు వ్యతిరేకములుగను ఉన్న అందలి కథనములు సత్యనిరూపణమునకు సాయపడవని గ్రహించి, శంకరాచార్యుని రచనలుగ అందరును అంగీకరించు ప్రస్థాన త్రయ భాష్యములను, తదితర ప్రసిద్ధ గ్రంథములను మాత్రమే ఆధారములుగ గ్రహించి శంకరుని కాలమును క్రీ.శ. 392-424 మధ్యకాలముగ నిర్ణయించెను. ఈ వాదమును చారిత్రకులు పలువురు అంగీకరించినవారు కాదు; గౌడపాదుని ' .శ. 1వ శతాబ్దివాడుగ సంభావించుట అందలి ప్రముఖ లో ము.

ప్రస్తుతమున భారతదేశ చరిత్రకారులు పలువురు క్రీ.శ. 788ను శంకరుని జనన సంవత్సరముగ ఇచ్చుచున్నారు. పలువురు సాహిత్య, దార్శనిక వేత్తలకు ఇది ఆధారరహితముగ కన్పించుచున్నను, మొత్తముమీద చరిత్ర రచయితలలో అధిక సంఖ్యాకుల ఆమోదముద్రను అది ఆర్జించినదనియే చెప్పవచ్చును. ఈ నడుమనే ఆ నిర్ణయమునకు అనుగుణముగ 1987 సం. మేనెల మొదటి వారమున శంకరాచార్యుని 1200 వ జయంతి ఉత్సవములు భారతదేశములోని కొన్ని ప్రధాన నగరములందు జరుపబడినవి.

శంకరుని జననము క్రీ.శ. 788లో జరిగెననుటకు తొలుతటి ఆధారము నీలకంఠ భట్ట రచితమగు 'శంకర మందార సౌరభము'న కననగుచున్నది. అందు శంకరుని జననకాలమును ఈ క్రింది శ్లోకము తెలుపుచున్నది:

ప్రాసూతతిష్య శరదా మతియాతివత్యా
మేకాదశాధిక శతోన చతుస్సహస్ర్యామ్,
సంవత్సరే విభవనామ్ని శుభే ముహూర్తే
రాధే సితే శివగురోర్ గృహిణీ దశమ్యామ్.

కలియుగాబ్దము 3889లో శంకరుడు జన్మించెననుట పై శ్లోకపు భావము. ఇది క్రీ.శ. 788కు సరికుదురును. శంకరుని జననకాలమును ఇందులకు విరుద్ధముగ వేర్వేరు తీరులలో తెలియజేయు శంకర విజయ, బృహత్ శంకర విజయాది గ్రంథములను కాదని, 'శంకరమందార సౌరభము' లోని పై శ్లోకమును మాత్రమే తమకు ఆధారముగ చారిత్రక పరిశోధకులు గ్రహించుటకు ఒక కారణము కలదు: ప్రాచ్య ఆసియా యందలి కాంపూచియా (కాంబూజ) దేశమును క్రీ.శ. 877 మొదలుగ 889వరకు పాలించిన ఇంద్రవర్మ తన గురువగు శివసోమునకు ఇచ్చిన దానశాసనమున అతనిని ఈ రీతిగ ప్రస్తుతించెను:

**యేనాధీతాని శాస్త్రాణి భగవచ్ఛంకరాహ్వయాత్,**
**నిశ్శేష సూరి మూర్ధాళిమాలాలీఢాంఘ్రి పంకజాత్.**

పై శ్లోకమువలన, శివసోముని గురువు 'భగవచ్ఛంకర' నాముడనియు, ఆతడు తనకాలపు పండితులలో నెల్ల ప్రముఖు

డనియు మాత్రమే తెలియనగుచున్నది. ఆ భగవచ్ఛంకరుడు అద్వైత మతప్రవర్తకుడనిగాని, పరివ్రాజకాచార్యుడనిగాని, ప్రస్థానత్రయ భాష్యకర్తయనిగాని అచట ఎట్టి విశేషణములు లేకున్నను, ఆ భగవచ్ఛంకరనాముడు శంకరాచార్యుడేయగు నని తొలుత భావించినవాడు ప్రసిద్ధ చారిత్రక పరిశోధకుడు రమేశచంద్ర ముజుందారు. ఇండియన్ రివ్యూ పత్రికలో ఒక లఘులేఖనమున ఆ పండితుడు ఆ అభిప్రాయమును తెలియజే సెను. అంతట దానిని సమర్థించుచు ఒక వ్యాసమును కె.ఎ.నీల కంఠశాస్త్రి రచించెను (J.O.R. XI 285). పై శాసనమునందలి శివసోముని కాలము, ఇటుల 'శంకర మందార సౌరభము'లో ఈయబడిన కాలమునకు, సన్నిహితమగుటవలన, క్రీ.శ. 788యే చారిత్రక పరిశోధక లోకమున, శాస్త్రి - ముజుందారుల యెడగల మన్ననవలన, శంకరుని జననకాలముగ పరిగణనను ఆర్జించినది.

## II

కాని శాస్త్రి - ముజుందారుల వాదమున కొట్టవచ్చినటుల ఒక లోపము కన్పించుచున్నది. వారి వాదమును అనుసరించి చూడ, శంకరుడు తన ప్రస్థానత్రయ భాష్యములను క్రీ.శ. 9వ శతాబ్దమున తొలుతటి రెండు దశకములలో రచించినవాడ గును. అతడు ఆ భాష్యములందు ముఖ్యముగ విమర్శించినది సాంఖ్యమత, విజ్ఞానవాదములను. ఇందలి రెండవ వర్గమునే ఆ ఆచార్యుడు 'వైనాశికులు' అని వ్యవహరించెను (బ్రహ్మ సూత్ర భాష్యము 2-2-27). అందువలన శంకరుని కాలమున బౌద్ధమతమునందలి విజ్ఞానవాదపువ్యాప్తి అత్యధికముగ ఉండెన నియు, దానిని అరికట్టి అంతరింపజేయుటకే ఆ ఆచార్యుడు తన శేముషిని వినియోగించెననియు స్పష్టమగుచున్నది. శా' - ముజుందారుల నిర్ణయము సరియైనదైనచో క్రీ.శ. 9వ శతా ఆరంభమున బౌద్ధమతమునందలి విజ్ఞానవాదశాఖ, భార దేశమున, విపులాదరణను ఆర్జించియుండవలెను. కాని అట్టి పరిస్థితి ఆనాడు కన్పట్టదు.

క్రీ.శ. 711లో ఇస్లామిక్ అరబ్ సేనలు భారతదేశమున సింధు రాష్ట్రమును వశపరచుకొనినవి. ఆ సేనలు ఆకాలమున ఎదుర్కొనినది హిందువుల ప్రతిఘటననే; బౌద్ధ మతము అంతకు పూర్వముననే అట నామమాత్రావశిష్టమైనది ఇక తక్కిన ఉత్తర భారతమున అత్యధికభాగము ప్రతీహారులపాల నలో ఉండినది; కాశ్మీరము కర్కోటవంశజుల ఆధిపత్యమున మనినది; దక్షిణభారతమున ఆ కాలమున వివిధ ప్రాంతము లందు రాష్ట్రకూట, చాళుక్య, పల్లవ రాజవంశములు ఆధిపత్య ములను వహించినవి. ఇందు ఎవరును బౌద్ధమతమును ఆదరిం చినవారు కారు. ఏడవ శతాబ్ది ప్రథమ పాదమున యువాన్ - చ్వాంగ్ భారతదేశమును దర్శించు నప్పటికే బౌద్ధమతము తన ప్రతిపత్తిని కోల్పోయినది. ఇక ప్రాచ్య భారతమున 8వ శతాబ్దిలో 'పాల' రాజుల ఆదరణవలన బౌద్ధమతము కొంతకా లము మనుగడను సాగించినను, అపుడు అచ్చట మన్ననను పొందినది విజ్ఞానవాదపు బౌద్ధశాఖ కాదు. అందువలన 9వ శతాబ్ది ఆరంభమున విజ్ఞాన వాదావలంబకులగు 'వైనాశికుల'ను ఖండించవలసిన ఆవశ్యకత ఎట్టిదియు ఉండదు. అస్తిత్వమునే కోల్పోయిన ఒక వాదముపై దండెత్తి, తన ప్రజ్ఞాపాటవమును అంతటిని శంకరుడు అందులకై ఉపయోగించెనని శాస్త్రి - ముజుందారుల వాదమువలన అంగీకరింపవలసి వచ్చును. ఇది అసంగత విషయము. కావున ప్రస్థానత్రయ భాష్యకర్తయగు శంకరాచార్యుడు, కాంపూచియాలోని శాసనమున పేర్కొనబ డిన 'భగవచ్ఛంకరుడు' కాడని నిశ్చయముగ చెప్పవచ్చును.

## III

అయినచో ఎవరా భగవచ్ఛంకరుడు? కాంపూచియా దేశ ములోని ఒక పండితుడే అతడు కావచ్చును. క్రీ.శ. 4వ శతాబ్దికే ప్రాచ్య ఆసియా రాజ్యములందు సంస్కృతమునకు విస్తృతాద రణ లభించినది; వేద శాస్త్రములను బోధించు పాఠశాలలు వెలసినవి: కావున శివసోమును గురువుగ కాంపూచియాలోని శాసనమున పేర్కొనబడిన 'భగవచ్ఛంకరుడు' ఆ దేశవాసి యగు ఒక ప్రసిద్ధ పండితుడే యగునని సంభావించుటలో అసంబద్ధత ఎట్టిదియులేదు. లేదా వేరొక దృక్కోణము నుండియు ఈ విషయమును పరికించ వచ్చును. అద్వైత మతవ్యాప్తికై నెలకొల్పబడిన ప్రసిద్ధ మఠములలో అంతటంతట కొందరు పీఠాధిపతులు 'శంకర' నామమును వహించిరి. అట్టి వారిలో ఒకడు క్రీ.శ. తొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధమునకు చెందినవాడై ఉండవచ్చును.

శంకరాచార్యుడే పీఠాధిపతిగ 'శంకర' నామముతో అయిదు పర్యాయములు జన్మించెనని కామకోటి పీఠము వారు లెక్కించె దరు. అట్టివారిలో అయిదవ శంకరునే అభినవ శంకరుడని ఆ పీఠమువారనెదరు. ఆ అభినవ శంకరుడు క్రీ.శ. 788 నుండి 840 వరకు మనెనని ఆ పీఠపు ఆచార్య పరంపర వలన తెలియనగుచున్నది. ఆ అభినవ శంకరుడే కాంపూచియా శాసనములోని 'భగవచ్ఛంకరుడు' కావచ్చును.

ఇది ఎటులున్నను అద్వైతమత పీఠములను అంతటంతట అధిష్ఠించిన 'శంకర' నాములలో కొందరికి ఆదిశంకరాచార్యు నితో అభేద భావమును కల్పించి, ఆ వినూత్న శంకరుని జనన కాలాదులనే ఆదిశంకరునికి అంటగట్టి, ఆదిశంకరుని విజయగా థలను వర్ణించు 'శంకర విజయము'లు అంతటంతట అనేక ములు వెలసెనని 'శంకర' సారస్వతము వలన సుస్పష్టము. అట్టి

గ్రంథముల రచయితలలో ముఖ్యునకు పేర్కొనదగినవాడు అనంతానందగిరి (14వ శతాబ్ది. శంకరుని భాష్యములకు టీకలు రచించిన ఆనందగిరి ఈతడు కాదు.) అతడు తాను రచించిన 'శంకర విజయము'న ఇటుల తన కృషిని మొదటి ప్రకరణమున వివరించెను:

''అనంతానంద గిరిరహమ్ అప్రతిహతాజ్ఞస్య భగవతః శిష్యః స్వగురోరవతార ప్రయోజనమ్ వర్ణయామి, సంత్యత్ర మమ పరమగురోః.''

తాను శంకర భగవానుని శిష్యుడగుటవలన, ఆ గురువు యొక్క అవతార ప్రయోజనమును వర్ణించుచున్నాననియు, ఆ శంకరుడే తన పరమగురువనియు ఆ రచయిత స్పష్టము చేసెను. ఈ విధముగ తన గురువగు శంకరునికి పరమ గురువగు శంకరునితో అభేదతను కల్పించి తన రచనను ఆయన సాగించెను. తత్ఫలితముగ ఆదిశంకరుని జన్మస్థల, నిర్యాణ స్థలముల పేరులే మార్పొందినవి. పారంపరిక కథనమును అనుసరించి బహురచనలు శంకరుని జన్మస్థలమును కేరళ యందలి 'కాలడి'గను, నిర్యాణస్థలము 'బదరి' గను పేర్కొనగా, అనంతానందగిరి వ్రాతలో శంకరుని జన్మస్థలము చిదంబరము; మరణించినచోటు కాంచీనగరము. ఈ విధముగనే తమ కాలముల శంకరాచార్యులకు ఆదిశంకరునితో అభేదతను కల్పించుచు వివిధ రచయితలు రచించిన శంకర విజయములలో కొన్నింట కేరళ యందలి 'శశల' గ్రామము అతని జన్మస్థలమైనది; అతని జన్మతిథిని కొందరు వైశాఖ శుద్ధ పంచమి అనిరి; కొందరు దశమి అనియు, వేరుగ కొందరు తృతీయ అనియు వ్రాసిరి. ఇటుల శంకరాచార్యులు పెక్కురగుటతో, ఆదిశంకరుని చరిత్రలలో అసత్యములు, అభూత కల్పనలు తావు కల్పించుకొన్నవి. ఆ గ్రంథములలో కొన్నింట సత్యలేశము ఏదైన ఉండవచ్చును; కాని దానిని మరుగుపరచునంతగ సత్యేతర కథనము అందుండుట వలన, శంకరుని జనన కాల నిర్ణయమున ఆ 'శంకర' సారస్వతము మనకు తగినంతగ సాయపడజాలదు.

# IV

అందువలన శంకరాచార్య రచితములుగ నిర్దిష్టముగ తెలియవచ్చు ప్రస్థానత్రయ భాష్యములను, శాంకరాద్వైత మతానుయాయుల రచనలలో కాలనిర్ణయము సరిగ చేయుటకు సాధ్యమగువానిని ఆధారములుగ గ్రహించి శంకరుని జననకాలమును కనుగొను కృషి జరుగవలసి యున్నది. పై ఆధారములలో రెండవ వర్గమునకు చెందినవానిలో ముఖ్యముగ పేర్కొనదగినది 'సంక్షేప శారీరకమ్'; దానిని రచించినవాడు సర్వజ్ఞాత్మముని. (శంకరుని రచనలను, అతని మతానుయాయుల రచనలను ఆధారముగ గ్రహించి శంకరుని కాల నిర్ణయమునకై కృషి చేసిన శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి ఈ గ్రంథమును ఎందువలననో పేర్కొనలేదు).

సర్వజ్ఞాత్మముని, తన గ్రంథపు రచనాకాలమును అందే ఇటుల తెలియ జేసెను:

'శ్రీ దేవేశ్వర పాదపంకజరజ స్సంపర్క పూతాశయః
సర్వజ్ఞాత్మ గిరాంకితో మునివరః సంక్షేప శారీరకమ్,
చక్రే సజ్జన బుద్ధివర్ధకమిదమ్ రాజన్యవంశే నృపే
శ్రీ మత్యక్షత శాసనే మనుకులాదిత్యే భువిం శాసతి.

సురేశ్వరాచార్యుని శిష్యుడగు సర్వజ్ఞాత్మముని 'సంక్షేప శారీరకమ్'ను రచించు కాలమున రాజన్య వంశీయుడు, మనుకులాదిత్యుడు, శ్రీమంతుడు, అక్షత శాసనుడు భూమిని పాలించుచుండెనని పై శ్లోకపు భావము.

'సంక్షేప శారీరకమ్' లోని ఆ శ్లోకము తొలుతగ భండార్కరు పండితుని దృష్టిని ఆకర్షించెను. బొంబాయి గజెటీరుకై తాను రచించిన దక్కన్ చరిత్ర (''హిస్టరీ ఆఫ్ దక్కన్'') లో ఆయన దానిని ఉటంకించెను. శంకరుని భాష్యములపై వార్తికములను రచించిన సురేశ్వరాచార్యుని శిష్యుడగుటవలన సర్వజ్ఞాత్మముని శంకరుని తరువాత సన్నిహిత కాలపువాడే అగునని ఆ పండితుడు గుర్తించెను; కాని శాస్త్రి - ముజుందారుల వాదమును ఆ పండితుడు అదివరకే అంగీకరించినవాడు అగుటవలన ఆ శ్లోకమున పేర్కొనబడిన రాజుకొరకై I .శ. 9వ శతాబ్దిలోని భారత దేశీయ రాజలోకమున తన అన్వేషణను కొనసాగించెను; కాని అట్టి 'రాజన్యవంశీయుడు మనుకులాదిత్యుడు, అక్షత శాసనుడు' ఎవడును కన్పట్టలేదు. కడకు ఆ పండితుడు 'రాజన్యవంశము' చాళుక్యవంశమే అనియు, అందలి పశ్చిమ శాఖకు చెందిన ఆదిత్యవర్మ, విక్రమాదిత్య I వినయాదిత్య, విజయాదిత్య, విక్రమాదిత్య II లలో ఎవడో ఒకడు ఆ శ్లోకములోని 'మనుకులాదిత్యుడు' కానగుననియు తన అభిప్రాయముగ తెలిపెను ఆతని ఆ వ్యాఖ్యానము అసంగతమని వేరుగ చెప్పవలసిన పనిలేదు ఛందోగతిని బట్టియు 'చాళుక్య' పదము చక్కగ ఇముడగల చోట 'రాజన్య' పదమును వాడి రచయిత ఎందులకు రాజవంశపు పేరును మరుగు పరచెను? పశ్చిమ చాళుక్యులు ఎటనైన రాజన్య వంశీయులుగ పేర్కొన బడిరా? 'మనుకులాదిత్య' పదము నామముగ గాని, బిరుదముగ గాని పశ్చిమ చాళుక్య శాసనములలో ఎచటనైనను కలదా? - ఈ ప్రశ్నలకు సమాధానము భండార్కరు పండితుని వ్యాఖ్యానములో కన్పట్టదు. బహుశః శాస్త్రి-ముజుందారుల పట్ల భండార్కరు పండితునికి ఉండిన అతిమాత్రపు గౌరవమే అట్టి ఆధార రహిత వ్యాఖ్యానమునకు ఆ పండితుని పురికొల్పియుండును.

# V

'రాజన్య' నామము కలిగిన రాజవంశము ఒకటి మథుర ప్రాంతమున, ఉత్తర హిందుస్థానమున ఒక గణరాజ్యపు పాల నను వరాహమిహిరుని కాలమున నిర్వహించుచుండెడిది. తాను రచించిన బృహత్సంహితలో (XIV 28) వరాహమిహి రుడు ఆ విషయమును పేర్కొనెను. వరాహమిహిరుని కాల మును-అతని రచనల వలన - క్రీ.శ. 475-550 గ పండితులు నిర్ణయించిరి. రాజన్య వంశపు నాణెముల ప్రతిరూపములను కన్నింగ్‌హామ్ పండితుడు తన 'ప్రాచీన భారతపు నాణెములు' (Coins of India-Ancient period) లోను, అల్లాన్ పండితుడు 'బ్రిటిష్ మ్యూజియములో' నాణెముల పట్టిక-ప్రాచీన భార తము' (Catalogue of the coins in the British Museum-Ancient India) లోను ప్రకటించిరి. వీనిలో హోష్యియార్ పూరులోని 'రాజన్య' వంశపు శాఖకు చెందిన నాణెములు. క్రీ.శ. 3వ శతాబ్దికి చెందినవిగను, మథుర ప్రాంతపు 'రాజన్య' శాఖకు చెందిన నాణెములు క్రీ.శ. 5, 6 శతాబ్దులకు చెందినవి గను లిపిరీతిని బట్టి నిర్ణయింపబడినవి. గుప్తవంశీయ రాజుల కాలమున, గుప్త సామ్రాట్టుల సర్వాధిపత్యమును మన్నించి తన అస్తిత్వమును నిలుపుకొనగలిగిన మథురా రాజన్య గణరా జ్యము, క్రీ.శ. 600 ప్రాంతమున హూణుల దండయాత్ర వలన అంతరించినది. కావున 'రాజన్య' వంశమునకు చెందిన 'శ్రీమ త్యక్షత శాసన మనుకులాదిత్యుడు' గాని, అతని కాలమున గ్రంథరచన సాగించిన సర్వజ్ఞాత్మముని గాని క్రీ.శ. 600 తరువాత ఉండియుండరు. ఈ రీతిగ శంకరాచార్యుని కాల నిర్ణయమున క్రీ.శ. 600ను ఉత్తరావధిగ నిర్ణయించుకొనుటకు తగిన ఉపపత్తి కలదు.

ఇక పూర్వావధిని ఏర్పరచుకొనుటకును ఒక మార్గము కలదు. స్కంద స్వామి అను పండితుడు ఋగ్వేద భాష్యమును రచించెను; అతని శిష్యుడను తానని చెప్పుకొనిన హరిస్వామి శతపథ బ్రాహ్మణముపై భాష్యమును రచించెను; ఆ భాష్య మును తాను శకవర్షము 561 (క్రీ.శ. 639)లో ముగించినటుల అతడు పేర్కొనెను; స్కందస్వామి యొక్క వేరొక శిష్యుడగు మహేంద్రుడు నిరుక్తముపై వ్యాఖ్య రచించెను. వీరందరును కుమారిల భట్ట రచితములగు శ్లోక, వాక్యములను ఉట్టంకిం చిరి. కావున కుమారిల భట్టు క్రీ.శ. 500 ప్రాంతమున ఉండి యుండునని, ఆ గ్రంథములను నిశితముగ పరిశీలించిన ప్రసిద్ధ పండితుడు కున్హన్ రాజా తన అభిప్రాయము తెలిపెను.

కుమారిలుడు, గురుద్రోహ ప్రాయశ్చిత్తమునకై తుషానల మున దగ్ధుడగుటకు పూనుకొనిన సమయమున శంకరుడు అతనిని దర్శించెననియు, అప్పటిలో శంకరుని వయస్సు 15 సంవత్సరములనియు, శంకరుని కన్న కుమారిలభట్టు 48 సంవత్సరములు పెద్దయనియు చిత్సుఖానందుని బృహత్ శంకర విజయమువలన తెలియనగుచున్నది. కాని ఈ కథ కల్పితమనియు, శంకరుని అద్వైత మతపు ప్రాశస్త్యమును తన చరమ దినములలో కుమారిలుడు సైతము అంగీకరించెనని తెలుపు ఆకాంక్షతో ఈ ఉదంతము కల్పింపబడెననియు అను వారును కలరు. ఇది ఎటులున్నను శంకరుడును, కుమారిల భట్టును విభిన్న మా ~ లను అవలంబించిన వారే అయినను, వైనాశికులను మా ము తమ తమ రచనలలో తీవ్రముగ ఖండించిరి. అయి ను శంకరుని రచనలలో కుమారిలుని వాద ప్రసక్తిగాని, కుమారిలుని రచనలలో శంకరుని వాదప్రసక్తిగాని కన్పట్టదు. కావున వారు ఇరువురును గౌతమబుద్ధ, మహావీరుల వలె కొంత వరకు సమకాలీనులై ఉందురనియు, కుమారిలభట్టు కన్న శంకరుడు వయసున చిన్నవాడై ఉండుననియు భావింపవ చ్చును. ఈ కారణమువలన క్రీ.శ. 500 ను శంకరాచార్యుని కాలనిర్ణయమున పూర్వావధిగ గ్రహింపదగును.

# VI

పైన సూచింపబడిన పూర్వావధి ఉత్తరావధుల మధ్యకాల మున విజ్ఞాన వాదము భారతదేశమున దాదాపుగా అన్ని ప్రాంతములందును ప్రతిష్ఠతో మనుచుండినది. క్రీ.శ. రెండవ శతాబ్దికి చెందిన నాగార్జునుడు మహాయానమునకు ఒక దార్శ నిక ప్రతిపత్తిని కల్పించిన తరువాత ఆ దర్శన శాస్త్రమున పలురీతుల శాఖలు వెలసినవి; వానిలో ఒక ప్రత్యేకశాఖయే విజ్ఞానవాద బౌద్ధము. అసంగ, వసుబంధు, దిజ్ఞాగులు తమ తర్కప్రజ్ఞచే ఆ వాదమునకు క్రీ.శ. మూడవ, నాలుగవ శతాబ్ద ములలో విపులాదరణను కల్పించిరి; ఆ కోవకు చెందినవారిలో కడపటి ప్రసిద్ధుడు భావవివేకుడు. అతడు ఆంధ్ర దేశీయుడు. ఆరవ శతాబ్ది మధ్యకాలమున అతని గ్రంథములు చీనీయ భాషలోనికి అనువదింపబడుటవలన అతడు అయిదవ శతాబ్ది అంతమున ఉండియుండును. అతని 'తర్కజ్వాల' యందు గౌడపాదుని మాండూక్య కారికలనుండి నాలుగు కారికలు ఉటంకింపబడినవి. కావున అతడు శంకరుని పరమగురువగు గౌడపాదుని తరువాతి వాడగుట సుస్పష్టము. ఈ వివరములు అన్నియు శంకరుడు ఆరవ శతాబ్దికి చెందినవాడనుటను ధ్రువపరచుచున్నవి.

శంకరుని ప్రస్థానత్రయ భాష్యములందు - ము ముగ బ్రహ్మసూత్ర భాష్యమున-కొందరు రాజులయు, ప్రసి నగర ములయు ప్రసక్తి కన్పట్టును. అందు పేర్కొనబడిన టలీ పుత్ర, అయోధ్య నగరములు ఆరవ శతాబ్ది అంతమునకే ప్రసిద్ధతను కోల్పోయినవి. ప్రముఖ రాజుల నామములు

కన్పట్టు సౌహవర్మ, జయసింహ, పూర్ణవర్మాది నామములను గురించి చర్చించిన సుబ్రహ్మణ్య శాస్త్రి ఆరవ శతాబ్ది తరువాత సమకాలీనులగు అట్టి ప్రముఖులు లేరనియు, ఆరవ శతాబ్దికి పూర్వముననే అట్టిది కన్పట్టుననియు స్పష్టీకరించెను.

ఇంకొక విషయమును కలదు: కాశ్మీరమున నేడు ఒక పర్వతము 'శంకరాచార్య పర్వతము' అను పేరున వ్యవహృతము; దానికే గోపాద్రియనియు పర్యాయనామము కలదు. శంకరాచార్యుడు, ఆ పర్వతముపైన సంస్థాపించుటకై పృథుల ప్రమాణము కలిగిన ఒక లింగమును తన వీపుపై పెట్టుకొని కొండపైకి చేర్చెననియు, ఆ కాలపు ప్రభువగు గోపాదిత్యుడు ఆ లింగమునకై ఒక ఆలయమును అట నిర్మింప జేసెననియు పారంపరిక కథనము కలదు. కాశ్మీర చరిత్రకారుడగు కల్హణుని 'రాజతరంగిణి'లో ఈ ఉదంతము కన్పట్టదు; కాని గోపాదిత్యుడు ఆర్యదేశవాసులగు బ్రాహ్మణులను కొనివచ్చి అగ్రహారములను ఇచ్చి, వైదిక మతమును ఉద్ధరించెననియు, గోపాద్రిపై జ్యేష్ఠేశ్వరుని ఆలయమును నిర్మించెననియు మాత్రమే ఆ గ్రంథమున కలదు (రాజతరంగిణి-1వ తరంగము-శ్లో. 339-341). అందువలన శంకరాచార్యుని ఆధ్వర్యవమున బయలుదేరిన వైదిక మతోద్ధరణోద్యమమును గోపాదిత్యుడు ఆదరించి యుండెనని చెప్పవచ్చును. 'రాజతరంగిణి' సాయమున గోపాదిత్యుని కాలమును నిర్ణయింప వలనుపడకున్నది. అయినను గోపాదిత్యుని కుమారుడగు గోకర్ణుని నాణెము కాశ్మీరమున లభించినది; దాని ప్రతిరూపమును కన్నింగ్‌హామ్ తన గ్రంథమున ముద్రింపజేసెను. అందలి లిపిరీతినిబట్టి అది క్రీ.శ. ఆరవ శతాబ్దికి చెందినదే. కావున శంకరుడు ఆరవ శతాబ్దిలో పూర్వభాగమున ఉండెననుటకు తగు ఉపపత్తి కలదు.

## VII

ఇక శంకరాచార్యుడు జన్మించిన వత్సరమేది? దీనిని ఆ ఆచార్యుని రచనల నుండిగాని అతని అనుయాయుల రచనల నుండి గాని మనము గ్రహించుటకు తగు ఆధారములు కన్పట్టుటలేదు. అయినను పారంపరిక కథనమునుండి కొన్ని విషయములను గ్రహింప వీలున్నది. అన్ని మతములవారును పంచాంగకర్తలును సాంప్రదాయికముగ వైశాఖ శుద్ధ పంచమినే ఆ ఆచార్యుని జన్మదినముగ పరిగణించు చున్నారు. ఆర్ద్రానక్షత్రమున ఆయన జన్మించెనను కథనముసైతము ఇందులకు సరికుదురుచున్నది. 'శంకర మందార సౌరభము'ను ఆశ్రయించి క్రీ.శ. 788 ని ఆచార్యుని జన్మవత్సరముగ గ్రహించిన పెద్దలు నయితము, ఆ గ్రంథమున చెప్పబడిన శుద్ధ దశమిని కాదని ఈ ప్రభవ సంవత్సరమున వైశాఖ శుద్ధ పంచమి నాడే శంకరుని 1200వ జయంతిని నిర్వహించిరి. ఇక సంవత్సర విషయమున, కంచి, శృంగేరీ మఠముల లెక్కలలోనే వైరుధ్యము కన్పించుచున్నది. కాని ఇచట ఒక విషయము గమనించ వలసియున్నది. 'మాధవీయ శంకర విజయము'న అవతారికలో ఈయబడిన విక్రమ శకము 14లో సత్యలేశము కలదని తోచును. శంకరుడు ఏదియో ఒక కాలమానపు లెక్కను అనుసరించి 14వ సంవత్సరమున జన్మించగ, ఆ కాల మానపు వివరమును విస్మరించిన పీఠాధిపతులు దానికి విక్రమ శకమును జోడించియుందురు.

భారతదేశమున ప్రాచీన కాలమున లౌకికాబ్దము (సప్తర్షి కాలము) వాడుకలో ఉండెడిది. ఈ పద్ధతిలో నక్షత్రముల పేరులతో శతాబ్దములు వ్యవహరింపబడెడివి. లోకవ్యవహారమున మాత్రము శతసంఖ్య వదలివేయబడెడిది. అల్బెరూని, భారతదేశమున పర్యటించుకాలమున సైతము ఇది వాడుకలో ఉండెను. అందువలన ఇందలి '14' అను వ[illegible]ఖ్య ఏదో ఒక లౌకిక శతాబ్దికి చెందినదై యుండును. '.పూ. 3076తో లౌకికాబ్ద పరిగణన ఆరంభితమయ్యెనని [illegible]ాదుల రచనల వలన సుస్పష్టము. ఆ విధముగ లెక్కించినపుడు క్రీ.శ. 524 నాటికి లౌకికాబ్ద పరిగణనలో 36 శతాబ్దములు నిండి, ఒకటి మొదలుగ వర్షసంఖ్య లెక్కింపు మొదలగును. అట్టి సందర్భమున '14' వర్షసంఖ్య-క్రీ.శ. 538-శంకరుని జన్మవత్సరము కాగలదు.

పై జన్మ సంవత్సర నిర్ణయము, శృంగేరి మఠమువారి పారంపరిక కథనమున కొంత సత్యము-మరుగునపడిన రూపముననైనను-ఉన్నదను భావనపై మాత్రమే ఆధారపడి యున్నది. దానిని సరియైన ఉపపత్తిగ అంగీకరించని వారును ఉండవచ్చును. అది ఎటులున్నను శంకరుని జన్మవత్సరము క్రీ.శ. ఆరవ శతాబ్దిలో మాత్రమే ఉండుననుట సునిశ్చితము.

# శ్రీ కంచి కామకోటి చరిత్ర

శ్రీ మణి

నత్వా గజాననం సద్యః కృత్వాచ గురు వన్దనమ్,
లిఖామి మహిమోపేతం చరితం కామ కోష్ఠకమ్.
శ్రీ శంకరాచార్య మథాస్య పద్మ
పాదం చ హస్తామలకంచ శిష్యమ్,
తం త్రోటకం వార్తికకార మన్యా
నస్మద్గురూ న్సంతతమానతోస్మి.

''ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే'' అన్న తన ప్రతిజ్ఞకు తానే బద్ధుడై భగవంతుడు జైన బౌద్ధాది వేద బాహ్య మతములను ఖండించి మ్లేచ్ఛా చారములను నిర్మూలించి శుద్ధాద్వైత స్థాపనకు కలియుగమున రెండువేల సంవత్సరములకు అనంతరం ''శంకర'' నామమున అవతరించునని, శివరహస్యేతిహాసం, లింగపురాణం, కూర్మ పురాణం, వాయు పురాణం, మార్కండేయ సంహితలలో వివరింపబడియున్నది. భవిష్యోత్తర పురాణమందు కూడా ''కల్యాదౌ ద్వి సహస్రాన్తే లోకానుగ్రహకామ్యయా, చతుర్భిస్సహ శిష్యైస్తు శంకరోవతరిష్యతి'' అని శంకరాచార్యావతారమునకు భవిష్యద్వాణి చెప్పబడినది ఇదే సూచనలతో కేరళలోని శశలగ్రామం (కాలడి) లో కలియుగం 2593 వ సంవత్సర నందన నామ సం. వైశాఖ శుద్ధ పంచమి ధనుర్లగ్న పునర్వసు నక్షత్రమున కుజ, సూర్య, శని, గురులు కేంద్రమున నుండగా శివగురు-ఆర్యాంబలకు సుతుడై బ్రహ్మకు తానిచ్చిన వరము ననుసరించి పరమశివుడు ''శంకర'' నామమున క్రీ.పూ. 509న అవతరించెను. శ్రీ శంకరుల జన్మదినము పూరీ గోవింద మఠమునందును, ద్వారకా మఠమున యుధిష్ఠిర శకమునను సరించియు ''పండిత భగవాన్ లాల్ ఇంద్రాజి'' సంపాదిత నేపాల్ రాజవంశావళియందును నిర్ధారితమైనది. శ్రీ వృషదేవవర్మ కాలమున శ్రీశంకరులు నేపాలుకు అరుదెంచి వృషదేవుని శుద్ధాద్వైతిని గావించెనని శ్రీ ఇంద్రాజి వ్రాశారు. వృషదేవుని పరిపాలన క్రీ.పూ. 509కి పూర్వము నుండియే యుండినది.

శ్రీ శంకరులకు 3,5 వయస్సులలోనే చౌలోపనయనములు జరిగినవి. అష్టవర్ష ప్రాయమునకు వేద, వేదాంగ, శాస్త్రములలో నిష్ణాతుడయ్యెను. ''అష్టవర్ష చతుర్వేదినే నమః, ద్వాదశాఖిల శాస్త్రవతయే నమః'' అని నామావళి. 8వ సంవత్సరమున శ్రీ గోవింద భగవత్పాదుల వద్ద తురీయాశ్రమము స్వీకరించి ఆధ్యాత్మిక విద్యా రహస్యములను ఉపదేశము పొందెను. అప్పటి నుండి భారతమున నలుమూలల సంచరిస్తూ 72 వేద బాహ్యమతములను ఖండించుతూ శుద్ధాద్వైతమును నిరూపించుచుండెను. పిమ్మట గుర్వాజ్ఞను పొంది ''అద్వైత ప్రతిపాదకములు అయిన ప్రస్థానత్రయమునకు (అనగా ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు, భగవద్గీత) భాష్యము వ్రాసి, విష్ణుసహస్రనామ స్తోత్రమునకు భాష్యము రచించిరి.

''భాష్యంచోత్తరమీమాంసా సూత్రాణా మతి విస్తరమ్,
దశోపనిషదామ్ దివ్యం చ కరోతి మనోహరమ్.
తథైవ భగవద్గీతా భాష్యం భూష్యం సురైరపి,
విష్ణోస్సహస్రనామ్నాంచ శ్రీరుద్రస్య చ నిర్మలమ్.
సౌందర్యలహరీ స్తోత్రం స్తోత్రాణా ముత్త మోత్తమమ్,
స్తోత్రాణ్యన్యాని దివ్యాని పవిత్రాణి వ్యధత్త సః''

అను ప్రమాణం జ్ఞేయం.

శ్రీ శంకరుల ప్రథమ శిష్యులు పద్మపాదులు పిదప హస్తామలక త్రోటకాచార్యులు. శ్రీ శంకరులు సశరీరముగా కైలాసమునకు వెళ్లి సాంబశివుని స్తుతించి పంచ స్ఫటిక లింగములను, సౌందర్యలహరీ స్తోత్రమును, శివరహస్య ఇతిహాసమును తీసికొని మనుష్యోద్ధరణకై తిరిగి భూలోకమునకు వచ్చెను. మార్గమధ్యలో నందీశ్వరుడు సౌందర్యలహరిలోని కొంత భాగాన్ని శంకరుల వద్దనుంచి తిరిగి తీసుకుని వెళ్లినట్లు తెలియుచున్నది. కాశ్మీరమున సాక్షాత్ బ్రహ్మావతారమగు మండనమిశ్రుని, అతని భార్య సరసవాణి (సరస తీ యవతారము)ని శాస్త్ర వాదము చేసి జయించెను '' మండన మిశ్రార్య స్స్రష్ట ద్ధాత్రుకళోద్భవః భార్యా సరసవా- తి తస్యాసీ చ్చుభలక్షణా'' అని ప్రమాణము. మండవ మిశ్రులు వాదమున పరాజితులు కాగానే సరసవాణి దుర్వాసముని ఇచ్చిన శాపనిర్ముక్తయై బ్రహ్మలోకానికి బయలుదేరెను. వెంటనే శ్రీ శంకరులు మహా విద్యయను వనదుర్గా విద్యతో ఆమెను బంధించి (''మంత్రేణ వనదుర్గాయాః బధ్వా దశదిశోదృఢం'' అని) ఆమెను కూడా శాస్త్రవాదమున జయించెను. మండన మిశ్రునికి ''సురేశ్వర'' అను యోగపట్టణమున సన్యాస మిచ్చిరి

సరసవాణిని ప్రార్థించి శృంగగిరిలో ఆమెను శారదాదేవిగా ప్రతిష్ఠించి, అచ్చట ఒక స్పటిక లింగము వుంచి శారదా పీఠమును స్థాపించిరి. అలాగే నాలుగు దిక్కుల నాలుగు ఆమ్నాయ పీఠములు స్థాపించగా, అందు దక్షిణమున, కాంచీ పురమందు సురేశ్వరాచార్యులు అధిపతిగా, కామకోటి పీఠ మును స్థాపించిరి. అందు స్పటిక లింగమునుంచి (చంద్రమౌళీ శ్వరులు) పూజ నిమిత్తం బ్రహ్మచర్యము నుండియే యతియ గువారు అర్హులు కాన తన శిష్యుడగు ''సర్వజ్ఞాత్మ'' అను నాతనిని నియమించిరి. అలా కామకోటి పీఠము ఆవిర్భవించి నది. ఉగ్రరూపంగా వున్న కామాక్షి దేవిని శ్రీచక్ర ప్రతిష్ఠచేసి శాంత పరచి అక్కడ వామాచారములను ఖండించి శుద్ధ వైదిక పూజలు ఏర్పాటు చేసిరి. మరియు జంబుకేశ్వరం (తిరువాన క్కావల్) క్షేత్రమున అఖిలాండేశ్వరిని, లాలగుడి గ్రామంలోని అమ్మవారికిని ''తాటంకాభరణము'' (కర్ణాభరణము) నందు శ్రీచక్రమును లిఖించి దేవికి ధరింపజేసి ఉగ్రకళను శాంతపర చిరి. ఇందులో జంబుకేశ్వరం అఖిలాండేశ్వరి ఆలయ నిర్వహ ణాధికారం శ్రీ కంచి పీఠానికి వుండేలా శాసించియున్నారు. శ్రీ శంకర భగవత్పాదులు కాంచీపురమందే సర్వజ్ఞాన పీఠము నధిరోహించి, కలియుగం 2625 నందు రక్తాక్షినామ సం. వృషభ మాసం శుక్ల ఏకాదశినాడు క్రీ.పూ. 476న కాంచీపుర మందే కామాక్షీదేవి యందు ఐక్యమయ్యారు. ''స కాంచ్యామథ సిద్ధిమాస'' అని ప్రమాణం. కామాక్షి ఆలయమందు శ్రీ శంకరుల అద్భుత విగ్రహం ప్రతిష్ఠించబడి నేటికిని వైభవంగా పూజింపబడుచున్నది.

శ్రీ కంచి కామకోటి పీఠం ఆది శంకరులు స్థాపించింది కాదనిన్నీ ఆది శంకరుల పరంపర వీరికి లేదనిన్నీ భూత పూర్వం కాశీలో ఒక వైదిక సదస్సు తీర్మానించగా, దానిని ఖండించుతూ కంచిపీఠం పండితులు ''నైషధకావ్యం'' అను గ్రంథమును రచించిరి. అందులో ''కాంచ్యాం కామకోటౌతు యోగలింగమనుత్తమమ్. ప్రతిష్ఠాప్య సురేశార్యం పూజార్థం యుయుజే గురుః'' అను ప్రమాణమును ఉదాహరించి విశద ముగా శంకర స్థాపిత కంచికామకోటి పీఠం వివరించబడినది. (కంచి శ్రీ మఠం నైషధ కావ్యం చూడగలరు)

అథ యోగపట్టవిచారః: విశ్వేశ్వర స్మృతిలో ''సరస్వతీ సంప్రదాయవిదౌ - ఆనంద సరస్వతీ ఇంద్రసరస్వతీచేతి'' అను ప్రమాణము ననుసరించి కామకోటి పీఠాధిపతులకు ఇంద్ర సరస్వతీయని యోగపట్టం విధిగా ఇవ్వడం సంప్రదా యంగా వున్నది. కామకోటి పీఠానికి ప్రప్రథమాచార్యులు శంకర భగవత్పాదులు. వీరి తరువాత సురేశ్వరాచార్యులు క్రీ.పూ. 491-407 వీరు కంచిలో వుంటూ ఆచార్యుల ఆజ్ఞ మీద శృంగగిరి వెళ్ళి అక్కడ వ్యాఖ్యాన సింహాసనం యేర్పరచి, మఠం నిర్వహణకు శ్రీ పృథివీధరాచార్యులను నియమించి మరల కంచి వచ్చారు. ఇలా అనేక పర్యాయములు శృంగగిరి వస్తూ వుండటం చేత శృంగగిరి శారదాపీఠ పరంపరలో వీరు కూడా చేరి వున్నారు. వీరు తన పేర మండనమిశ్ర అగ్రహారం నిర్మించి మహా పండితులకు ఇచ్చారు. మండనమిశ్రుల వంశ జులు ఇప్పటికీ కంచిలోని ఈ అగ్రహారంలో వున్నారు. ''నైష్కర్మ్య సిద్ధి'' అను గ్రంథమును అనేక ఇతర ప్రకరణ గ్రంథములను రచించారు. వీరు కలి 2695నకు సరియగు భవనామ సం॥ జ్యేష్ఠ శు॥ ద్వాదశి పుణ్య దినమందు కంచి యందు సిద్ధి పొందారు. శ్రీ ఆదిశంకరులు ప్రస్థానత్రయ భాష్యమందు అతిమానుష ప్రజ్ఞాపాటవాన్ని ప్రదర్శించి, అని తర సాధ్యమగు గంభీరమగు భాష్యము రచించగా ఈ ప్రస్థాన త్రయ భాష్య తత్త్వాన్ని శ్రీ సురేశ్వరులు తమ ప్రకరణ గ్రంథములలో (సాక్షాత్ చతుర్ముఖ బ్రహ్మావతారం గనుక) గంభీరంగా తెలియపరిచారు. వీరి బృందావనం కామకోటి మఠంలో వున్నది. తృతీయ పీఠాధిపతి శ్రీ సర్వజ్ఞాత్మేంద్ర సరస్వతి క్రీ.పూ. 407-364. వీరు మున్ను శంకరులచే చంద్రమౌళీశ్వర పూజకు నియమితులు కాగా, తామ్రపర్ణీనదీ తీరంనుంచి వచ్చి 8వ ఏటనే శంకరులతో శాస్త్రవాదం చేసి పరాజితులు అయి సన్యాసం తీసుకున్నవారు. ఈ శాస్త్రవాదం నాలుగు రోజులు జరిగినది. ''సంక్షేప శారీరకం'' అను గ్రంథ కర్త సురేశ్వర కృత నైష్కర్మ్య సిద్ధికి వ్యాఖ్యానం రచించినవారు. వీరితోనే కంచి పీఠాధిపతులందరికీ ''పరమహంస పరివ్రాజకా చార్య'' మరియు ''ఇంద్ర సరస్వతీ'' అను యోగపట్టములు వచ్చుచున్నవి. వీరి తరువాత మహాత్ములు మహాతపస్సంప న్నులు అయిన 64 మంది ఆచార్యులు ఈ పీఠాధిపత్యం వహించారు. (అందరి వివరాలూ సేకరించాను గ్రంథ విస్తృతి భీతిచే వ్రాయలేదు.) 67వ పీఠాధిపతి యగు శ్రీ మహాదేవేంద్ర సరస్వతి క్రీ.శ. 1907. వీరు పీఠానికి వచ్చిన 7వ రోజుననే సిద్ధి పొందారు. వీరి శిష్యులే 68వ పీఠాధిపతియగు శ్రీచంద్రశేఖర సరస్వతి. వీరు ఇప్పుడు పీఠమందు అలంకరించి యున్నారు. కర్ణాటకకు చెందినవారు. వీరి జన్మస్థానము తమిళ నాడులోని విళుపురం. వీరి శిష్యులు 69వ పీఠాధిపతి శ్రీజయేంద్ర సరస్వతి, తమిళనాడుకు చెందిన వీరు తంజావూరు జిల్లా ''ఇరుళ్లినికి'' అను గ్రామమున జన్మించి 1954 నుంచి పీఠాధిపత్యం నిర్వహించుచున్నవారు. వీరి శిష్యులు ప్రస్తుతం 70వ పీఠాధిపతిగా వున్న శంకరవిజయేంద్ర సరస్వతి, వీరు ఆంధ్ర దేశీయులు కాగా తమిళనాడులోని ''తండలం'' గ్రామంలో జన్మించి 1983లో సన్న్యాసం పొంది పీఠాధిపతిగా వుంటున్న వారు. శ్రీ చంద్రశేఖరస్వాముల మాహాత్మ్యం పరమపావనం. వీరికి పూర్వం 67 మంది పీఠాధిపతులలో 12 మందికి మాత్రమే ప్రస్తుతం అధిష్ఠానములు వున్నవి. మిగతా

బృందావనములు కాలగర్భంలో కలిసిపోయినవి. ఇప్పుడు వున్నవి, దక్షిణ పినాకినీ తీరం వడవాంపళం గ్రామంలో రెండు, తిరువట్టియూరులో రెండు, శ్వేతారణ్య, మణికర్ణికా ఘట్టంలో ఒకటి, కంచి దగ్గర అంబికా గ్రామం (అంబి) ఒకటి, కుంభకోణంలో మూడు, కలవ గ్రామంలో రెండు, ఎత్తాళం గుడి గ్రామంలో ఒకటి. ఇందు నిత్యం పూజలు జరుగుతున్నవి.

బ్రిటిష్ కాలంలో మహమ్మదీయులు, ఆంగ్లేయులు పరస్పరం యుద్ధం చేస్తూ రాజ్యములు, నంస్థానములు స్వాధీనం చేసుకుంటున్న సమయంలో కాంచీపురంలో శ్రీమతానికి సరియైన రక్షణ లేకపోగా శ్రీమతాన్ని మరోచోటికి మార్చాలని 1746లో ఆలోచింపసాగారు. మరికొంత కాలానికి శ్రీ మతానికి, కామాక్షి దేవికి రక్షణ, ప్రశస్త వాతావరణానికి భంగం కలుగగా 62వ కంచి కామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వాములు చంద్రమౌళీశ్వరులను (స్ఫటిక లింగం), కామాక్షి దేవిని (బంగారు విగ్రహం) వెంట తీసుకుని సపరివారంగా చెన్నపట్టణానికి విచ్చేశారు. అక్కడ కొంతకాలం నివాసం చేసి చంద్రమౌళీశ్వరులకు, కామాక్షికిని నిత్యం పూజలు చేస్తుండేవారు. కంచిలో అధిష్ఠానములు మొదలగు వాటికి సాధారణ పూజలు జరుగుచుండేవి. చెన్న పట్టణం నుంచి ఒడయారు పాళెంకు వచ్చి కొంతకాలం వున్నారు. ఈ విషయాలన్నీ అప్పటి తంజావూరు ప్రభువు ప్రతాపసింహుడు ఎప్పటికప్పుడు తెలుసుకుంటూండేవాడు. బంగారు విగ్రహం కామాక్షిదేవిని తంజావూరులో ఒక పీఠాధిపతులకు తగు సదుపాయం కల్పించి క్రీ.శ. 1747న ప్రతిష్ఠించారు. (ఈ విగ్రహాన్ని తిరిగి తీసుకువెళ్ళాలని ప్రయత్నించగా స్థానికుల ప్రార్థన మీదట అక్కడనే వుంచేశారు. ఇప్పటికీ ఈ బంగారు కామాక్షిదేవి విగ్రహం తంజావూరులోనే వున్నది. కంచిలో నూతన కామాక్షి విగ్రహం ప్రతిష్ఠ చేశారు. తంజావూరు ప్రభువు శ్రీ చంద్రశేఖరులను దర్శించి శ్రీ స్వామి వారిని మఠం సకల పరివారంతో కూడా తన రాజ్యానికి రావలసినదిగానూ, కావేరీ పీఠంలో ఎచ్చటనైనా నివాసం చేసేందుకు తగు ఏర్పాట్లు చేసేందుకు అనుగ్రహించవలసిందగా ప్రార్థించుకున్నారు. శ్రీ సా ములు చిరకాలానికి అనుమతినిస్తూ కుంభకోణం మహాక్షే ంలో ఏర్పాట్లు చేయమని ఆజ్ఞాపించారు. వెంటనే ప్రతా సింహుడు కుంభకోణంలో కావేరి పక్కన విశాలమైన నూతన మఠం నిర్మించి ఇచ్చాడు. కావేరీ పరీవాహ ప్రాంతంలో బంజరు భూములు, అగ్రహారాలు సమర్పించుకున్నాడు. కంచికామకోటి పట్టానికి పీఠాధిపతులగు గురుపరంపరలో 62వ పీఠాధిపతి 1749లో కుంభకోణంలో నూతన మఠానికి సపరివారంగా విచ్చేశారు. ఇక్కడ శ్రీ చంద్రమౌళీశ్వరులకు అశేష పూజలు చేస్తూ తపోనిరతులు అయ్యేవారు. అక్కడ ఆర్కాట్, కాంచీపురం వద్ద యుద్ధావరణం తొలగనందున స్వస్థానమైన కంచికి వెళ్లే యోచన చేయక 1749 నుండి 1907 వరకు 150 సంవత్సరములకు పైగా వాసం చేశారు.

కుంభకోణంలో 68వ పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి భారతదేశం మొత్తం కాలినడకన 1909 తరవాత ప టనకు బయలుదేరడంతో ఈ కుంభకోణం మఠం కేవలం కా స్థానంగానే యుండినది. 69వ పీఠాధిపతి శ్రీమజ్జయేంద్ర సర ీ స్వామి వారిచే నూటయాభై సంవత్సరములు పైగా శ్రీమఠంగాను 1907 నుంచి ప్రధాన కార్యస్థానంగా వున్న కుంభకోణం శ్రీమఠం 228 సంవత్సరములు తరువాత 1977లో ఫిబ్రవరిలో అధికారికంగా, స్వస్థానమైన కాంచీపురమునకు మార్చబడినది అని కుంభకోణం శ్రీ మఠం, శ్రీ కార్యం భూతపూర్వ ఏజెంటు శ్రీ వెంకట్రామ అయ్యరు తెలియచేశారు. (ఇప్పుడు కుంభకోణం శ్రీమఠంలో వేదపాఠశాల జరుగుచున్నది.) 62వ పీఠాధిపతి నుండి 68వ పీఠాధిపతి వరకు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ - మహాదేవేంద్ర సరస్వతీ అని ఈ రెండు యోగపట్టములు మాత్రమే 7 మందికి ఇవ్వబడ్డాయి. కుంభకోణమే కాక తిరువైక్కా, తిరువిడైమరుదూరు, తిరువెట్టియూరు, రామేశ్వరం, శ్వేతారణ్యం, ఎత్తాళంగుడి, కలవ, అంబికాగ్రామం, వడవాంపళం మొదలగుచోట్ల కంచి అధిపతులకు సొంత మఠాలు ఏర్పడ్డాయి. యీ మఠాలు ఏర్పడ్డా ఈ స్వాములు ఎచ్చట వున్నా కాంచీపురం మూల స్థానంగానే వుండేది. అప్పుడప్పుడు పర్యటనకు వెళ్లి వచ్చేవారు.

62వ పీఠాధిపతి (కుంభకోణంలో వాసం చేసిన మొదటి స్వామి) శ్రీ చంద్రశేఖర ఇంద్ర సరస్వతి. 1746-1783 వీరి కాలంలో ధర్మాత్ముడగు తంజావూరు మహారాజు ప్రతాపసింహుడు శ్రీమఠంలో చంద్రమౌళీశ్వర పూజకూ వ్యాస పౌర్ణమి పూజకుగాను 1747లో 3,000/- చక్రములు (3 1/2 కిలో బంగారమునకు సమానం) సమర్పించాడు. అలాగే మరాఠా రాజులు అనేక ప్రభువులు తమతమ భక్తి ప్రపత్తులు తెలియజేస్తూ శ్రీ మఠానికి ఏనుగులు, గుఱ్ఱాలు, వాహనాలు, గోవులు, అనేక ఇతర కానుకలు విశేషంగా సమర్పించుకున్నారు. (అన్ని వివరాలు సేకరించాను) ప్రతాపసింహ ప్రభువు, తన చోళ రాజ్యంలో 1747లో ఒక శాసనం చేశాడు. దాని ప్రకారం శ్రీ మఠంలో శ్రీ చంద్రమౌళీశ్వర పూజా వ్యాస పూజకు గాను ఇంటికి ఒకటికి ఒక సంవత్సరానికి వారివారి ఇళ్లలో వివాహం జరిగినప్పుడు రెండు కాసులు, ఉపనయనం జరిగితే కాసు, చాతుర్వర్ణ్యముల వారు కూడా ఇతర శుభకార్యములు జరిగితే ఒక కాసు ఇచ్చి తీరాలి అని, ఇది వెంటనే అమలు పర్చబడుననీ ఆజ్ఞలు జారీ చేశాడు. వారి లెక్కల ప్రకారం యీ

ఆజ్ఞ ఉల్లంఘించినవారికి దండన విధించాడు. ఇలా వసూలు చేసి శ్రీ మఠానికి సమర్పించేవాడు. ఈ చట్టంలో కొన్ని చిక్కులు ఏర్పడ్డాయి. గాన అమలు పరచడం కష్టతరంగా పరిణమించింది. అందుకు, 1750లో పై ఉత్తరవు రద్దు చేసి దాని స్థానంలో క్రొత్త చట్టం చేశాడు. ఈ కొత్త చట్టం ప్రకారం, ఒక సంవత్సరానికి ఒక ఇంటికి ఒక కాసు ఇవ్వవలసిందిగాను, ఈ చట్టంలో కఠినంగా అమలు చేయబడుననీని ''దండోరా'' వేయించాడు. తన ప్రభుత్వం నుంచి పూజలకు గాను 3,000/- చక్రములు ప్రతి సంవత్సరం ఇవ్వబడునని శ్రీ మఠానికి తెలియపరచుకున్నాడు. ఇక మరాఠీ ప్రభువులు శ్రీ త్రిపుర సుందరీ సమేత చంద్రమౌళీశ్వర పూజకు వ్యాసపౌర్ణమికి గాను 3,000 చక్రములు ఇచ్చేవారు. 1780లో 4,500 చక్రములు, 1786లో 4,500 చక్రములు, 1787లో 4,500 చక్రములు, 1794లో 4,624 చక్రములు, 1795లో 4,625 చక్రములు సమర్పించుకున్నారు. తంజావూరు ప్రభువులు 1768 వరకును నిత్య పూజకు, వ్యాసపూజకు గాను 4,626 చక్రములు సమర్పించారు. ఈ వివరాలు శ్రీమఠం ఆయా ప్రభువులు ఏర్పరచుకున్న , అక్కర గౌరవ ప్రపత్తులకు నిదర్శనములు.

ఈ మఠాలు శ్రీ ఆది శంకరులచే అద్వైత ప్రతిపాదకములు అగు వేదవేదాంగములు, శాస్త్రములు వీటిని సర్వదా కాపాడుతూ, అద్వైత మతస్థాపనకుగాను ఏర్పడ్డవి గాన, యీ మఠంలో అనేకమంది ఆస్థాన పండితులు వేదశాస్త్రముల యందు నిమగ్నులయి వుండేవారు. వారిలో కొందరిని తెలుసు కొనుట యుక్తం. శ్రీ మఠ ఆస్థాన విద్వాంసులు, కొత్తకోట సంస్థాన ధనాధికారియూ, మీమాంస శాస్త్రములోనున్నూ, వేదాంత శాస్త్రములోనున్నూ అతి నిపుణులైన కళ్యాణపురం బ్రహ్మ శ్రీ కుప్పుస్వామి శాస్త్రులువారు, తర్క వేదాంత శాస్త్రములలో ప్రచండులగు శ్రీ తిరువిశెనల్లూరు మహాలింగ శాస్త్రులు వారు, తర్కం, వేదాంతం శ్రౌతం ఇందులో సమర్థులగు బ్రహ్మ శ్రీరాయలు - వెంకట్రామ శాస్త్రులువారు, మహిసూరు సంస్థానపు ధర్మాధికారులున్నూ తర్క శాస్త్ర నిపుణులైన బ్రహ్మశ్రీ నరసింహ శాస్త్రులు వారు, వేదాంత శాస్త్రములో మహామేధావులైన బ్రహ్మశ్రీ తిరుశెనల్లూరు రామచంద్ర శాస్త్రులు వారు, వ్యాకరణ నిపుణులైన ''బాలసరస్వతీ'' ''భట్టశ్రీ'' గౌరవ కితాబు పొందిన బ్రహ్మశ్రీ కుంభకోణం నారాయణ శాస్త్రులు వారు, వేదాంతం, వ్యాకరణం ఇందులో సమర్థులు మహా ప్రజ్ఞాశాలు రగు శ్వేతారణ్యం నారాయణ దీక్షితులు వారు, త్రిశిరపురం వాస్తవ్యులు వేదాన్త డిండిమ బ్రహ్మశ్రీ నప్త ఋషి శాస్త్రులువారు, మహా విద్వాంసులు

బ్రహ్మశ్రీ సప్త ఋషి శాస్త్రులువారు, మహా విద్వాంసులు
బ్రహ్మశ్రీ కుంభకోణం కస్తూరి రంగయ్య సూరి వారు, మీమాంసా శాస్త్ర చండప్రచండులైన బ్రహ్మశ్రీ రాయులు - వేంకట సుబ్బాశాస్త్రులు వారు, వేదాంతం, తర్కం, శ్రౌతం ఇందులో ప్రచండులైన బ్రహ్మశ్రీ వాజసేయం రాజగోపాల తాతాచార్యులవారు, తర్కశాస్త్ర మహోదధి బ్రహ్మశ్రీ కళ్యాణపురం గోపాల దేశికాచార్యులు వారు, తిరుక్కోటి కావల్ బ్రహ్మశ్రీ రామస్వామి శాస్త్రులు వారు. వేద శాస్త్రములలో అపరాజితులు, అజేయులగు ఇట్టి మహాపండితులు శ్రీమఠ ఆస్థాన విద్వాంసులుగా వుండియున్నారు. ఇది కాక ఈ పీఠాధిపతులు అందరూ అఖండమైన వేదశాస్త్ర పండితులు గావడం మరొక విశేషం. ప్రస్తుతం 68వ పీఠాధిపతిగా వున్న శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ మహాస్వామి వారు అమిత తపస్సంపను లు అయి ఆది శంకరుల వలె యావద్భారతం మూడు మా  కాలినడకన పర్యటన చేసి సనాతన వైదిక మతాన్ని జా `తం చేసినారు. ఒకమారు శ్రీమఠానికి ఒక ఆంగ్లేయుల బృందం వచ్చి పెద్దపెద్దలను దర్శించి తాము ఆంగ్లంలో రచించిన రామాయణ గ్రంథాన్ని చూపించారు. ఆ గ్రంథం చేత పుచ్చుకుని స్వాములు ఆ చివరనుంచి ఈ చివర వరకు నాలుగు పేజీలు త్రిప్పి చూచి ఆంగ్లేయులతో ''ఇందులో బాగా తప్పులు ఉన్నాయే'' అన్నారు. ఆంగ్లేయులు, ''ఈయన అసలు పుస్తకంలో ఓ పంక్తి కూడా చదవకుండా వుత్తగా పుస్తకం తిరగవేసి తప్పులు వున్నాయంటున్నాడే'' అని మనస్సులో అనుకుంటూ తమతమ విద్యాభ్యాసం తాలూకు యోగ్యతా పత్రాలు చూపించుతూ ''మేము చాలా శ్రమపడి తప్పులు లేకుండా రచించి ఆపై మా దేశంలోని భాషా విజ్ఞానుల చేత పరిష్కరింపచేసి మీ వద్దకు తీసుకువచ్చాము. దీనిలో మీకు తప్పులు దొరకవు'' అన్నారు. అందుకు స్వాములు చిరునవ్వుతో పలానా పేజిలో, ఫలానా పంక్తిలో యీ, యీ తప్పులు ఇవిగో ఈ విధంగా వుండాలి కదా అని ఏ కరువు పెట్టసాగారు. పాపం ఆ ఆంగ్లేయులు అవనత శిరుస్కులు అయి స్వామివారినే ఆ గ్రంథమందు శుద్ధాశుద్ధములు పరిష్కరించి ఇవ్వమని కోరారు. ఈ మహాస్వాములు అనూచాన వైదిక సంస్థాపనకు దాదాపు 40కి పైగా వేదశాస్త్ర పాఠశాలలు నిర్వహించుచున్నారు. ఇందు 500కి పైగా విద్యార్థులు వేదశాస్త్రములు నియమాధ్యయనము చేయుచున్నారు. 69వ పీఠాదిపతియగు శ్రీమజ్జయేంద్ర సరస్వతీ స్వాములునూ వీరి శిష్యులు 70వ పీఠాధిపతియగు శ్రీ శంకర విజయేంద్ర సరస్వతీ స్వామివారున్నూ జిజ్ఞాసులకు విశదీకృత వేద వేదాంత మార్గ ప్రవర్తకులై శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులై వున్నారు.

# ఎఱ్ఱన, సోమన - శాసనములు

శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి

ఎఱ్ఱాప్రెగ్గడ పేరున్న కొల్లూరి శాసనము, నాచన సోమనాథుని పేరున్న పెంచుకలదిన్నె శాసనము పునఃపరిశీలనము చేయవలసినవి.

కొల్లూరి శాసనము తామ్రశాసనము కాని రాగిరేకులు లేవు. దాని నకలు ఇలియట్ శాసనసంపుటము పుట 206లో కలదు. అది రెడ్డిసంచికలో ప్రకటింపబడినది. నకలునందు "నాలుగో పలక పోయినది" అని లేఖకుని సూచన కలదు. మొదటి మూడు పలకలలోను వంశానుక్రమణికను అనపోతారెడ్డి వ నము కలదు. అయిదవ పలక నుండి ఒక శ్లోకము, సుదీ వచనము కలదు. ఆ వచనమునందు ప్రతిగ్రహీతల గో' ములు, పేరులు, భాగములు కలవు. అంతయు సంస్కృతభాష లోనే కలదు. అంతమునందు "ఏతే విశ్వామిత్రగోత్రాః కొప్ప రపు లక్ష్మణభ ః సార్ధభాగీ ఏతే భారద్వాజగోత్రాః" అను సంస్కృత ములకు, "ఏతద్విశేషణాదిలిఖితేభ్యో న్యే ఏకైక భాగినః స - శూకాధ్యాపకాః" అను సంస్కృతవాక్యము లకు నడుమ "యఱ్ఱయ ప్రగడగారికి తాడినగరపు పొలమున ఇరుపుట్టి 57 వేమూరి పొలాన 50 బెరసి కేసరిపాటి 53 కంఢ్రికె" అను తెలుగు వాక్యము కలదు. తదుపరి గ్రామసీమా చిహ్నములు అనగా ఎల్లలు తెలుగునందుండుట సర్వసాధారణము. రెండు సంస్కృత వాక్యముల మధ్య ఒక తెలుగు వాక్యముండుట విపరీతము.

"ఏతే విశ్వామిత్రగోత్రాః కొప్పరపు లక్ష్మణభట్టః" అను సమగ్రసంస్కృతవాక్యమునకు తర్వాత "ఏతే భారద్వాజ గోత్రాః" అను అసమగ్రసంస్కృతవాక్యము కలదు. అనంతరము "యఱ్ఱయప్రగడ" అను తెలుగు వాక్యము కలదు. కనుక యఱ్ఱయప్రగడ భారద్వాజగోత్రుడగును. కాని ఎఱ్ఱా ప్రెగ్గడ శ్రీవత్సగోత్రుడు (469ప. 7 ఆ.ఆ.ప; 15ప.1 ఆ నృ. పు; 36 ప. 1 ఆ. హ. వం.). అంతేకాదు తెలుగు వాక్యము తర్వాతి సంస్కృతవాక్యము నందు "సర్వే శూకాధ్యాపకాః" అని కలదు. అందఱును శూకాధ్యాపకులని అర్థము. శూకమన ధాన్యము. శూకాధ్యాపకుడన ధాన్యమునకు వేదములను చదివించువాడని అర్థము వచ్చును. ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవియైన ఎఱ్ఱాప్రగ్గడ శూకాధ్యాపకుడు కాడు. ఈ సంస్కృతశాసనమునందు "ఈ" అను తెలుగు నిర్దేశవాచకసర్వనామము బహుధా కలదు. నిర్దేశించినది ఇంటిపేరు. ప్రతిగ్రహీతలందఱు కిని ఇంటిపేరులు కలవు. "య యప్రగడగారి"కి మాత్రము లేదు. శాసనస్వరూపమును బ "ఏతే భారద్వాజగోత్రాః" అను సంస్కృతవాక్యము సమ' ము కాదు. తర్వాత పేరు, భాగవివరమును ఉండవలయును. అలతి అలతి సంస్కృతపద ములవి తొలగించి, రెండు సంస్కృతవాక్యముల మధ్య ఒక తెలుగు వాక్యమును బహుశః లేఖకుడు చేర్చినట్లు సూక్ష్మపరిశీలనకు సుగోచరము.

ఎల్లలు తెలుగుభాషయందు తెలిపిన తర్వాత మఱల "యీ రాజు తమ్ముడు అనవేమభూపతి మజ్జసాలకె వేమూరి తూర్పు పొలానను పదిహేను పుట్ల క్షేత్రమున్నూ తాడినగరి పొలం చుట్టు నాను వాగు వెంట ముప్పదేను పుట్ల క్షేత్రమున్నూ బెరసి కేసరిపాటి యాభైపుట్ల చేను ధారవోసి యిచ్చి ఈ వూరనే కలిపెను." అను తెలుగు వాక్యము కలదు. అనవేమారెడ్డి ధారవోసి ఇచ్చెననియేగాని ఎవరికి ధారవోసి ఇచ్చినది లేదు. మొదటి తెలుగు వాక్యమునందున్న తాడి నగరము పొలము, వేమూరి పొలము, బెరసి కేసరిపాటి రెండవ తెలుగు వాక్యమునందు కలవు. అవి సంఖ్యలు. ఇవి పుట్లు. మొదటి తెలుగు వాక్యము అనపోతారెడ్డికి సంబంధించినది. రెండవ తెలుగు వాక్యము అనవేమారెడ్డికి సంబంధించినది. ఇద్దఱును అన్నదమ్ములు. కొండవీటి సామ్రాజ్యాధిపతులు. ఇద్దఱికిని సంబంధించిన ఈ శాసనమునందు శాసనకాలముండు నాల్గవపలక లేకుండ పోయినది. అనపోతారెడ్డి రాజ్యకాలము 1353-1364. అనవేమారెడ్డి రాజ్యకాలము 1364-1386. అనపోతారెడ్డికి సంబంధించిన తెలుగు వాక్యము స్వతస్సిద్ధమైనచో, ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవియైన ఎఱ్ఱాప్రెగ్గడ అనపోతారెడ్డి ఆస్థానకవియును అగును. అనవేమారెడ్డికి సంబంధించిన తెలుగు వాక్యము ఎఱ్ఱాప్రెగ్గడకు సముద్దిష్టమైనచో ఎఱ్ఱాప్రగ్గడ అనవేమారెడ్డి ఆస్థానకవి కూడ అగును. కాని, ఎఱ్ఱాప్రగ్గడ అనపోతారెడ్డి, అనవేమారెడ్డి - ఇద్దఱికి గాని, ఒక్కరికి గాని ఆస్థాన కవి అనుటకు ప్రమాణాంతరము లేదు. అనపోతారెడ్డి, అనవేమారెడ్డి ఇద్దఱును కవిపోషకులే. ఎఱ్ఱాప్రెగ్గడ అనపోతారెడ్డికి అంకితముగ కాని, అనవేమా

రెడ్డికి అంకితముగ కాని రచించిన కావ్యము లేదు. ప్రోలయ వేమారెడ్డి రాజ్యకాలము 1324,25 - 1353. ఎఱ్ఱాప్రగ్గడ ప్రోలయ వేమారెడ్డి ఆస్థానకవి కాకపూర్వమే లబ్ధప్రతిష్ఠుడైన కవి. కానిచో ''నా తమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు నిన్నాతత శ్రీతోడన్ సముపేతు జేసి యిలమిం జేపట్టి మా కిచ్చుటన్ ''అని ప్రోలయవేమారెడ్డి అనుట (39 ప.1ఆ. హ.వం.) సంగతము కాదు. అట్టి ఎఱ్ఱాప్రెగ్గడ అనపోతారెడ్డి ఆస్థానమునందు గాని, అనవేమారెడ్డి ఆస్థానమునందు గాని, వారి కాలములందు గాని కలడనుటకు అవకాశమెల్ల కొల్లూరిశాసనములోని రెండుసంస్కృత వాక్యముల నడుమ సందర్భోచితము కాని, విపరీతమైన, మొదటి తెలుగు వాక్యము, గ్రామసీమాచిహ్నముల చివఱ శాసనసాధారణము కాని రెండవ తెలుగు వాక్యము మాత్రమే. ఈ రెండు తెలుగు వాక్యములును ఆగమప్రాయములే. అవి ఎఱ్ఱాప్రెగ్గడ కాల నిర్ణయమునకు నిర్ధారకసాధనములు కావు. ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవియైన ఎఱ్ఱాప్రెగ్గడ కాలము పదునాల్గవశతాబ్ది పూర్వార్ధమే.

పెంచుకలదిన్నె శాసనము కూడ తామ్రశాసనము. రెండు నాగరలిపి తామ్రశాసనములు, రెండు మూడు కన్నడలిపి ప్రతులు కలవట! ప్రతిగ్రహీతలు పలువురైనను శాసనమొకటి యుండుట పరిపాటి. అట్టిది రెండు నాగరలిపి తామ్రశాసనములు, రెండు మూడు కన్నడలిపి ప్రతులును ఉండుటయే ఒక అసాధారణవిషయము. అంతేకాదు. పెంచుకలదిన్నె శాసనమునందు అసాధారణవిషయములు బహుళము.

ఎపిగ్రాఫికా కర్ణాటికా పదవ సంపుటమునందు పెంచుకలదిన్నె శాసనము జి. డి. 46వ సంఖ్యను, ఎం. బి. 158వ సంఖ్యను ప్రకటింపబడినది. ఒకటి రోమను లిపిలోను. మఱొకటి కన్నడలిపిలోను కలవు. రోమను లిపిలోని శాసనప్రతియందు శాసనకాలము ''రసర్తునయనేందుభిః'' అని కలదు. కన్నడలిపిలోని శాసనప్రతియందు ''రసభూనయనేందుభిః'' అని కలదు. చదివిన పాఠము ''రసాభ్రనయనేందుభిః'' ఇది శకసంఖ్య సంవత్సరము తారణ. మాసము చైత్రము. తిథి శుద్ధనవమి. వారము లేదు. రసాభ్రనయనేందు సంఖ్య 6021=1206 + 78 = 1284. రసభూనయనేందు సంఖ్య 6121 = 1216 + 78 = 1294. ఈ రెండు సంవత్సరములును అగ్రహారప్రదాత బుక్కరాయల రాజ్యకాలములోనివి కావు. హరిహరరాయల రాజ్య కాలములోనివి కూడ కావు. రసర్తునయనేందుసంఖ్య 6621 = 1266 + 78 = 1344 ఈ సంవత్సరము కూడ బుక్కరాయల రాజ్యకాలములోనిది కాదు. మొదటి హరిహరరాయల, మొదటి బుక్కరాయల సంయుక్తరాజ్యకాలములోనిది డ కాదు. మొదటి బుక్కరాయల రాజ్యకాలము 1357 - 1378. మొదటి హరిహరరాయల, మొదటి బుక్కరాయల సంయుక్త రాజ్యకాలము 1346-1357.

''బుక్కరాయలు సింహాసనము నధిష్ఠింపక పూర్వమే యాతనిని విజయనగరాధీశునిగా వ్యవహరించుచున్నట్లు .... దెలియుచున్నది'' అని డాక్టర్ వేదుల కామేశ్వరరావు ఉదాహరించిన రెండు శాసనములలోను మొదటి శాసనము మొదటి బుక్కరాయలకు సంబంధించినది కాదు. రెండవ హరిహరరాయల కుమారుడైన రెండవ బుక్కరాయలకు సంబంధించినది. అందు శాసనసంవత్సరము కాళయుక్తి అని కలదు. శకసంఖ్య లేదు. కాళయుక్తి సంవత్సరము 1348 కాదు. 1378 శాసనమునందు ''మామండ లేసురన్ అరియరరాయన్ కుమార పక్కరాయకన్'' అని కలదు. భాష తమిళము మహామండలేశ్వరుడైన హరిహరరాయల కుమారుడు బుక్కరాయలని అర్థము. మొదటి బుక్కరాయలు మొదటి హరిహరరాయల కుమారుడు కాడు. సోదరుడు రెండవ బుక్కరాయలు రెండవ హరిహరరాయల కుమారుడు. ఈ శాసనమునందు రెండవ బుక్కరాయలైనను విజయనగరాధీశుడుగా వ్యవహరింపబడలేదు. రెండవ హరహరరాయలు మహామండలేశ్వరుడు. అతడు 1378వ సంవత్సరమునుండి విజయనగరాధీశుడే.

రెండవ శాసనము మొదటి బుక్కరాయలదే. శాసనసంవత్సరము వ్యయ. శకసంఖ్య 1268. 1268+78 = 1346 వ సంవత్సరము. శాసనమునందు ''రాజాధి రాజ రాజపరమేశ్వర శ్రీ వీరబుక్కరాయరు'' అని కలదు, భాష కన్నడము. రాజాధిరాజ, రాజపరమేశ్వర విశేషణములు సంయుక్తరాజ్యాధికారమును సూచించునవియే. మొదటి బుక్కరాయలు 1346వ సంవత్సరమునందే సింహాసనమును అధిష్ఠించినట్లు షిమోగామండల శాసనమునందు కలదు. సంయుక్త రాజ్యాధికారమును సూచించు విశేషణములు కల శాసనము ఆశ్వయుజమాసములోనిది. సింహాసనమును అధిష్ఠించినట్లున్న శాసనము మార్గశిర్షమాసములోనిది. అది బహుళపంచమి. ఇది శుద్ధవిదియ. అంతరము నెలమీద పండ్రెండు రోజులు సంయుక్త రాజ్యాధికారము సంక్రమించిన అనంతరము నెలమీద పండ్రెండు రోజులకు సింహాసనమును అధిష్ఠించుట - అనగా పట్టాభిషేకము చేసికొనుట - విపరీతము కాదు. కారణరహితమైన రెండు సంవత్సరముల వ్యవధానము విపరీతము. మొదటి బుక్కరాయలకు 1344 వ సంవత్సరమునందు సంయుక్తరాజ్యాధికారము లభించిన, 1346 వ సంవత్సరము వఱకు సింహాసనమును అధిష్ఠింపకుండ - అనగా పట్టాభిషేకము చేసికొనకుండ ఆగవలసిన ఆవశ్యకము లేదు. 1344 వ సంవత్సరమే తారణనామ సంవత్సమును సంవదించినను చరిత్రను సంవదించునది కాదు.

బుక్కరాయలకు పెంచుకలదిన్నె శాసనమునందు ''రాజాధిరాజ రాజపరమేశ్వర'' అను విశేషణములు మాత్రమే కాదు; ''భాషాలంఘితభూపాల భుజంగమ విహంగమ, రాజరాజభుజంగ, పరరాజభయంకర, హిందూరాయ సురత్రాణ'' అను విశేషణములు కూడ కలవు.

ఇందు ''హిందూరాయ సురత్రాణ'' విశేషణము సాధారణ విశేషణము కాదు. సార్థక విశేషణము. ప్రత్యేకవిశేషణము. చరిత్రాత్మకము. సురత్రాణశబ్దము సులతాను శబ్దమునకు సంస్కృతీకరణము. హిందూరాయసురత్రాణుడన హిందువులైన రాజులలో ఇంద్రుని వంటి వాడని అర్థము కాదు. సుల్తాను వంటి వాడని అర్థము. అట్టి విజయనగరరాజు రెండవ ప్రౌఢదేవ రాయలు. అతనికి హిందూరాయసురత్రాణ బిరుదము కలదు. రెండవ ప్రౌఢదేవరాయలు తన సేనలో మహమ్మదీయులను చేర్చుకొని, మహమ్మదీయమతమునకు పూర్తిస్వేచ్ఛ నిచ్చి, వారి కోసము తన సింహాసనము సమ్ముఖమునందు మహమ్మదీయుల మతగ్రంథమైన కొరాన్ పెట్టెను. అతనికి హిందూరాయసురత్రాణబిరుదము సార్థకము. అంతేకాదు. రెండవ ప్రౌఢదేవరాయల-1424 వ సంవత్సరము నాటి లేపాక్షిశాసనములోని - బిరుదావళికి, పెంచుకలదిన్నె శాసనములోని బుక్కరాయల విశేషణములు సహోదరము.

హిందూరాయసురత్రాణబిరుదము రెండవ ప్రౌఢదేవరాయలకు అన్వర్థము. మొదటి బుక్కరాయలకు అర్థరహితము. అనగా లేపాక్షిశాసనములోని శ్లోకములు పెంచుకలదిన్నె శాసనములోని శ్లోకములయినవని అవగాహన మగును.

బుక్కరాయలు విద్యారణ్యుడు నిర్మించిన విద్యానగరములోని రత్నసింహాసనమునందు ఆసీనుడైనట్లు కూడ పెంచుకలదిన్నెశాసనమునందు కలదు.

> ''విద్యాభిధాననగరీ విజయోన్నత శాలినీ,
> విద్యారణ్యకృతా తస్యాం రత్నసింహాసనే స్థితః''
>
> 16 శ్లో.

మొదటి హరిహరరాయల లభించిన మొట్టమొదటి శాసనము 1340వ సంవత్సరము నాటి కొడుమూరి శాసనము (కర్నూలు జిల్లా). అందు మొదటి హరిహరరాయలు జగతాపిగుత్తి నుండి పరిపాలించుచున్నట్లు కలదు. 1346 వ సంవత్సరము నాటి ఆతకలగుండు శాసనమునందును మొదటి హరిహరరాయలు గుత్తినెలెవీడు నుండి పరిపాలించుచున్నట్లు కలదు. మొదటి బుక్కరాయల 1355 నుండి 1368 వఱకు గల పెక్కు శాసనములందు అతని రాజధాని హొసపట్టణమని కలదు. 1346-1357 మధ్య మొదటి హరిహర రాయల, మొదటి బుక్కరాయల సంయుక్తరాజ్యపరిపాలనము హొసపట్టణము నుండి జరిగినను, హొసపట్టణమే విజయనగరమైనను, దానికి విద్యానగరవ్యవహారము. విద్యారణ్యనిర్మాణవ్యవహారము స్థూలముగ 1380వ సంవత్సరమునకు పూర్వము నిరవకాశము.

విద్యారణ్యుని అసలు పేరు మాధవాచార్యులు. మాధవాచార్యుల ఆశ్రమనామము విద్యారణ్యనామధేయము. పారాశరమాధవీయమ్, జైమినిన్యాయమాల, వైయాసికన్యాయమాల, కాలమాధవమ్ లేక కాలనిర్ణయమ్ మొదలైన ఉద్గ్రంథములు మాధవాచార్యకృతములుగాను; పంచదశి, వివరణప్రమేయసంగ్రహమ్ లేక వివరణోపన్యాసమ్, అనుభూతిప్రకాశమ్ మొదలైన ఉద్గ్రంథములు విద్యారణ్యకృతములుగాను కలవు. అవి, ఇవి ఏకకర్తృకములే; ఏతత్కర్త మాధవాచార్యులుగా మొదటి బుక్కరాయల మంత్రి. విద్యారణ్యులుగా శృంగేరీపీఠాధిపతి. పారాశరమాధవీయమ్ లో మాధవాచార్యులు బుక్కరాయల మంత్రి అని కలదు.

> ''ఇతి శ్రీరాజాధిరాజ రాజపరమేశ్వర వైదికమార్గప్రవర్తక బుక్కభూపాల సామ్రాజ్యధురంధరస్య మాధవామాత్యస్య కృతౌ-''

మాధవాచార్యులు మొదటి బుక్కరాయల మంత్రి అయిన కాలము 1368వ సంవత్సరము. విద్యారణ్యులు శృంగేరీపీఠాధిపతిగ జగద్గురువైనకాలము 1380 వ సంవత్సరము. విద్యారణ్యుల అవసానకాలము 1386వ సంవత్సరము. జగద్గురువు అనగా శృంగేరీపీఠాధిపతి అయిన కాలము 1374వ సంవత్సరమును కావచ్చును. తత్పూర్వము కాదు. 1357వ సంవత్సరమునందు శృంగేరీపీఠములోని ఒక కడితమునందు విద్యారణ్యనామధేయము కలదుగాని, అది కాలాంతరసంక్రాంతము. విద్యారణ్యనామధేయము కల పెంచుకలదిన్నె శాసనము కూడ కాలాంతరసంక్రాంతమే కావలయును.

విజయనగరనిర్మాణమునకు శంకుస్థాపనము చేయించినది విద్యారణ్యమహర్షి అని, అది 1336వ సంవత్సరమునందు జరిగినదని ప్రసిద్ధము. కాని, 1380 లేదా 1374వ సంవ ‍ రము నకు పూర్వము విద్యారణ్యనామధేయమే లేదు. విదా రణ్యులకు పూర్వము శృంగేరీపీఠాధిపతి భారతీతీర్థులు; భార తీర్థులకు పూర్వము శృంగేరీపీఠాధిపతి విద్యాతీర్థులు; విద్యాతీర్థుల శిష్యుడు మాధవాచార్యులే భారతీతీర్థుల తర్వాత శృంగేరీపీఠాధిపతి అయిన విద్యారణ్యులు. విద్యాతీర్థులు విద్యారణ్యుల కంటె మహావ్యక్తి. మహర్షి అగును. విద్యాతీర్థులు చేయించిన విజయనగర నిర్మాణశంకుస్థాపనమే విద్యారణ్యమహర్షిపేర విఖ్యాతమైనదని ఒక చారిత్రికాభిప్రాయము. మాధవాచార్యులు చేయించిన విజయనగరనిర్మాణశంకుస్థాపనమే మాధవాచార్యులే విద్యారణ్యులగుటవలన విద్యారణ్యమహర్షి పేర విఖ్యాతమైనదని

మఱొక చారిత్రికాభిప్రాయము. 1386వ సంవత్సరము చరమకాలమైన విద్యారణ్యులు మాధవాచార్యులుగా 1336వ సంవత్సరమునందు సుమారు నలుబది సంవత్సరముల వాడగును. అంతేకాదు. మాధవాచార్యుల ప్రమేయము మొదటి బుక్కరాయల రాజ్యకాలమునందేగాని, మొదటి హరిహరరాయల రాజ్యకాలమునందు గాని, తదుభయల సంయుక్తరాజ్యకాలమునందు గాని కానరాదు. అందువలన శృంగేరీపీఠాధిపతి అయిన విద్యాతీర్థులు విజయనగర నిర్మాణమునకు శంకుస్థాపనము చేయించిన మహర్షి కావచ్చును. మాధవాచార్యులైనను విజయనగరము విద్యారణ్యకృతమని విఖ్యాతమగుట 1380 లేదా 1374 కంటె పూర్వము సంభవము కాదు. 1386 తర్వాత సుసంభవము. మాధవాచార్యులు 1374వ సంవత్సరమునందు శృంగేరీపీఠాధిపతిగ విద్యారణ్యులగుట సంభావ్యమైన సమన్వయము. 1380వ సంవత్సరమునందు సప్రమాణనిరూపణము. 1380వ సంవత్సరమునందు రెండవ హరిహరరాయలు శృంగేరీ పీఠమునకు తన పూర్వులు కావించిన దానములెల్ల నిరాఘాటముగా కొనసాగుటకు విద్యారణ్యులకు తామ్రశాసనము నొసగెను. కావున విద్యారణ్యకృతమైన విద్యాభిధాననగరమని యున్న పెంచుకలదిన్నె శాసనము కాలాంతరసంక్రాంతమే కావలయును. 1374 - 1386 తర్వాతిది మాత్రమేగాక 1424 తర్వాతి దగుట తథ్యము. అనగా పెంచుకలదిన్నె శాసనము కూటశాసనమని (స్పూరియస్ ఇన్‌స్క్రిప్షన్) అవగాహనమగును. అందుకే రెండు నాగరలిపితామ్రశాసనములు, రెండు మూడు కన్నడలిపి ప్రతులు వెలసినవి కాబోలు!

నాచన సోమనాథుని కాలము నిర్ణయించుటకు పెంచుకలదిన్నె శాసనము నిర్ధారకసాధనము కాదు. నిర్బాధకసాధనము కాదు. మఱొక నిర్ధారకసాధనము లేదు. నిర్బాధకసాధనములు కలవు. అవి కూడ శాసనములే. కాని సమకాలిక శాసనములు కావు. ఒకటి అర్వాచీనకాలికశాసనము. మఱొకటి పరమార్వాచీన కాలికశాసనము.

కడపజిల్లా కడపతాలూకా తురుమిలదిన్నె గ్రామములోని కేశవాలయము ప్రధానద్వారము పైన ఱాతి పలకమీద ఇట్లు కలదు.

''నాచన సోముని అగ్రహారం ఏకభోగం తురిమిళ్లదిన్నె
ప్రౌఢదేవరాయలు ఇచ్చిన దత్తం.''

ఇందలి లిపి పదునెన్మిదవశతాబ్ది నాటిది. కనుక పరమార్వాచీన కాలికశాసనము. స్వతః ప్రమాణము కాదనవచ్చును. కాని, 1529వ సంవత్సరము నాటి శ్రీకృష్ణదేవరాయల శాసనమునందు ఇట్లు కలదు.

''ఘండికోట సీమలోని పుష్పగిరిప్రాంత్యం పెంన్నకు
వుత్తరం నాచిరాజు సోముని అగ్రహారం తురుమిళదిన.''

ఇది పదునారవశతాబ్ది నాటిది. కనుక అర్వాచీనకాలికశాసనము. పరమప్రమాణము కాకపోయినను అప్రమాణము కాదు. అంతేకాదు. పదునారవశతాబ్ది శాసనము, పదునెన్మిదవ శతాబ్ది శాసనము పరస్పరోపబలకములుగ కలవు. అందును, ఇందును నాచన సోమనాథుని అగ్రహారము తురుమిలదిన్నె అని కలదు. పదునారవశతాబ్ది శాసనమునందు అగ్రహారపుదాత పేరు లేదు. పదునెన్మిదవశతాబ్దిశాసనము నందు అగ్రహారప్రదాత పేరు ప్రౌఢదేవరాయలని కలదు.( అంతవఱకు ప్రౌఢదేవరాయల పేరు స్మర్యమాణమగుట విస్మయజనకము).

ప్రౌఢదేవరాయనామధేయులు నలుగురు కలరు. మొదటి దేవరాయలు మొదటి ప్రౌఢదేవరాయలు. రెండవ దేవరాయలు రెండవ ప్రౌఢదేవరాయలు. మొదటి మల్లికార్జునరాయలు మూడవ ప్రౌఢదేవరాయలు. రెండవ మల్లికార్జునరాయల రెండవకుమారుడు నాల్గవ ప్రౌఢదేవరాయలు. వీరిలో రెండవ ప్రౌఢదేవరాయలు హిందూరాయసురత్రాణబిరుదాంకితుడు. అంతేకాదు. శ్రీనాథుని ముత్యాలశాలలో దీనారటంకాల తీర్థమాడించిన దక్షిణాధీశుడు. శ్రీనాథుని కాలములోని (1360 – 1450) కవులెవ్వరును నాచన సోమనాథుని పూర్వకవిస్తుతులలో పేర్కొనలేదు. ఇది గమనార్హమైన విషయము. సమకాలికులను సమీపపూర్వకాలికులను పూర్వకవిస్తుతులలో పేర్కొనుట సముదాచారమైనట్లు కానరాదు. కావున నాచన సోమనాథుడు శ్రీనాథుని సమకాలికుడో, సమీపపూర్వకాలికుడో కావలయును. అందువలన నాచన సోమనాథునికి తురుమిలదిన్నె అగ్రహారమిచ్చిన ప్రౌఢదేవరాయలు మొదటి ప్రౌఢదేవరాయలే అనగా మొదటి దేవరాయలే అగును.

మొదటి దేవరాయల రాజ్యకాలము 1406 - 1422. అయినను మొదటి దేవరాయలు 1385వ సంవత్సరము నుండి రాజ్యాంగవ్యవహారములందు పాల్గొనుచున్నట్లు శాసనప్రమాణము కలదు. అది త్రిపురాంతకశాసనము. అందు రెండవ హరిహరరాయల కుమారుడైన వీరదేవరాయలకు 1385వ సంవత్సరమునందు సుకృతముగా భూదానము చేసినట్లు కలదు. మొదటి దేవరాయలు విజయనగరసామ్రాజ్యాధిపతి కాక పూర్వము ఉదయగిరి దుర్గాధిపతి కూడ. కాబట్టి ప్రౌఢదేవరాయలు నాచన సోమనాథునికి తురుమిలదిన్నె అగ్రహారమిచ్చిన కాలము స్థూలముగ 1390వ సంవత్సరము కావచ్చును. అయిన నాచన సోమనాథుని హరివంశరచనాకాలము స్థూలముగ 1380 ప్రాంతమగును.

# శ్రీకృష్ణదేవరాయలు - నూతనాంశాలు

శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి

సర్వ దక్షిణా పథ చక్రవర్తిగా ఇరువది సంవత్సరములు (క్రీ.శ 1509-1529,) శుక్రమహాదశా కాలము, ప్రకాశించిన శ్రీ కృష్ణదేవరాయలను గుఱించి ' యుటకు నేడు ఎంతో సామగ్రి దొరకియున్నది. తామ్ర ప కలును శిలాశాసనములు దాదపు ఐదువందల వఱకును కల ట. ఇవి సంస్కృతాంధ్ర ద్రావిడ కర్ణాటక భాషలలో కలవు. నాటి కవీశ్వరులును పండితులును, రాయలనేకాక తమ మాండలిక ప్రభువులను, ధనికులను కొనియాడుచు వ్రాసిన గ్రంథములున్నవి. సమకాలిక మహమ్మదీయులును, విదేశీయ వర్తకులును, ముఖ్యముగా పోర్చుగీసు (బుడత కీచు) వర్తకులు విజయనగరము మీద విస్తారముగా వ్రాసియున్నారు. ఇవిగాక దేశమందలి గ్రామముల లోని దండ కవిలెలు, కైఫీయతులును అపారముగా దొరకియున్నవి. అన్నిటికిని మకుటాయమానముగా రాయలవారి ఆముక్తమాల్యద ఆనాటి జనజీవనమును మనకు కన్నులకు కట్టినట్లు తెలుపు చున్నది. వీని నెల్ల సమన్వయించి చరిత్రకారులు పలువురు చక్కని గ్రంథములు వ్రాసియున్నారు. కాని అవి పూర్తి చరిత్రకు చాలవు. ఇంకను వ్రాయవలసియున్నది.

ఏ శుభముహూర్తమున (క్రీ.శ. 1336) శ్రీవిద్యారణ్యస్వాములవారు తుంగభద్రానది యొక్క దక్షిణ తీరమున విజయనగర నిర్మాణమును కావించి హరిహరరాయలకు పట్టాభిషేకము చేసినారోగాని, అది మొదలు 229 సంవత్సరములు మహోజ్జ్వలముగా వెలిగిన దీ హిందూ మహా సామ్రాజ్యము. ఇది నాటి రాజకీయ చరిత్రలో నొక మహత్కార్యము. విజయనగరము ఊరక రాజ్యకాంక్షకు ఏర్పడినది కాదు. ఆనాడు హిందూ ధర్మమును కాపాడవలసిన ఆవశ్యకత ఎంతయో యుండినది. ఓరుగంటి కాకతీయ చక్రవర్తి పడిపోగానే హిందువులకు నిలువ నీడలేక పోయినది. అట్టి తరుణమున హిందూధర్మ పునరుద్ధరణమునకును, దేశము తురుష్కాక్రాంతము కాకుండుట కొరకే శ్రీవిద్యారణ్యస్వాములవారు స్థాపించిరి. వీరే లేకపోయిన మన హిందూధర్మ మేమైయుండెడిదో!

ఈ మహా సామ్రాజ్యమును మొదట సంగమవంశపు రాజులు, హరిహరరాయలు మొదలు ప్రౌఢదేవరాయల వరకు పాలించిరి గాని తాము రాజ్యము తమదని చెప్పు కొనలేదు. తమ శాసనములలో 'శ్రీవిరూపాక్ష' అనియే వ్రాసిరి. ఆశ్చర్యకరముగా గుర్తింపవలసినది ఏమనగా తాము శ్రీవిరూపాక్ష దేవుని దాసులమని చెప్పుకొనిరి. రాజ్యము దేవునిది. తమది కాదు. తాము దేవుని సేవకులుగా యుద్ధములు చేసినారు. దేవుని ఖజానాద్రవ్యమును ఖర్చు పెట్టినారు. హిందూమత ద్రోహులను దేశమునుండి తఱిమి రాజ్యమును, మరల దేవునికే సమర్పించినారు.

ఇట్లు కొంతకాలము గడిచిన తర్వాత దేశమందు వైష్ణవమతము ప్రబలినది. మధ్యకాలమున వీరశైవ, వీర వైష్ణవ ఘర్షణలు దుర్భరములు కాగా క్రీ.శ.1250 ప్రాంతమున తిక్కన సోమయాజుల వంటి పెద్దలు హరిహరాభేదమును ప్రతిపాదించి దేశమందు కొంత శాంతి భద్రతలు సమకూర్చినారు. శివుడే విష్ణువు, విష్ణువే శివుడు అను భావములు జనుల హృదయములలో గాఢముగా నాటుకొని తిరుపతి వేంకటేశ్వరుడు, శ్రీనివాసుడు, శివవిష్ణు శక్తి స్వరూపుడను భక్తిభావము కుదిరినది. కాబట్టియే శివునికి జరుగు బిల్వార్చన, శక్తికి జరుగు నవరాత్రి కైంకర్యములు, విష్ణువునకు జరుగు పూజలు ఇక్కడ ఒక్క చోటనే మేళవించినవి. ఉత్తర హిందూస్థానము వారికి బాలాజి. బాల అనగా త్రిపురసుందరి. ఈ చోటనే ఆళ్వారులు పూజించిరి, శ్రీ శంకరాచార్యులు శ్రీచక్రము వేసిరి. శ్రీరామానుజులు నామములు పట్టించిరి. మధ్వాచార్యులును పూజించిరి.

అట్టి క్షేత్రమున, సంగమరాజుల తర్వాత సాళువవంశము వారు చక్రవర్తులై విరూపాక్షప్రాధాన్యమును తగ్గించి, తిరుమలకు ప్రాధాన్యమీసాగిరి. తుళువ వంశము వారి కాలమున దీని ప్రభావము అధికరించినది. శ్రీ కృష్ణదేరాయల పట్టాభిషేకముతో(1509) దేశమే మారిపోయినది. ఈతడు చక్రవర్తి యగు నాటికి ఇరువది యేండ్లకు కొంచెము పైబడ్డ వయసువాడనియు, చనిపోవునాటికి నలవది నాలుగేండ్లకు మించని ప్రాయము వాడనియు, ఇదివరలో చరిత్రకారు లూహించిరి. కాని ఇటీవల ఆ యభిప్రాయము పోయి కొంత వయసు చెల్లినవాడేయను నభిప్రాయము వచ్చినది. తాను జన్మములో ఒకనాటికి రాజు కాబోవుచున్నానని కలలో కూడ శ్రీ కృష్ణరాయడు తలంచినట్లు కానరాడు.

బాల్యము నుం                    గోష్ఠిలో, కళావం తుల సాహచర్యములో, వైష్ణవాచార్యుల సన్నిధిలో, కవీశ్వరుల విద్యా వ్యాసంగములో కాలము గడపినవాడు. 'అప్పాజి' యని తాను ప్రియమార పిలచు తిమ్మరసుతో కూడ నుండి ఎన్నియో విషయములు గ్రహించినాడు. మాధ్వ గురువులైన శ్రీరాఘవేంద్రస్వామివారి పూర్వులలో నొకరైన శ్రీకృష్ణాచార్యుల యొద్ద వీణ వాయింప నేర్చుకొనెనట. పట్టాభిషేక శాసనములోనే 'కావ్యనాటకాలంకార మర్మజ్ఞేన ధర్మజ్ఞేన' అనియు 'హిందు సురత్రాణ' (హిందువులకు సుల్తాను) అనియు పొగడబడినాడు. క్రీ.శ. 1529లో చనిపోవునాటికి అల్లునికి, అళియ రామరాయలకు అరువది యేండ్ల వయస్సట. అట్లని పాశ్చాత్యుల రచనల చేత తెలియుచున్నది. వారు కంటితో చూచినవారు. అల్లునికి అరువదియైన మామకు డెబ్బదియైన నుండవా? కాని అల్లునికి అంత వయస్సు లేదేమో. రాయలకు ఎక్కువగానే ఉండియుండును. దాదాపు 55 ఏండ్ల వయస్సున్న చక్రవర్తి యైనాడు కాబట్టియే, టకటక మని కటకము వరకు పోయి, పది యేండ్లలోపల సర్వదక్షిణా పథ చక్రవర్తియై, ఉత్తరమున సికందరులోడి సుల్తానును జయించి, గయలో పితృశ్రాద్ధముపెట్టి, కూడ వచ్చియుండిన ముక్కుతిమ్మన వ్రాసిన పద్య శాసనమును చెక్కించి, దిగ్విజయముతో విజయ నగరమునకు వచ్చినాడు.

అటువంటి చక్రవర్తి పరమభాగవత శిఖామణి. విదేశీయ యాత్రికులును, ఆంధ్రరచయితలును ఈతని దినచర్యను వర్ణించుటలో కొంత భేదిల్లినను, బ్రాహ్మణుల తోను, ఆచార్యుల తోను భగవత్కైంకర్యమున కాలము గడుపు చుండినది అందరును ఒప్పుకొనియున్నారు. ఈతని అన్నయైన వీరనర సింహరాయల దినచర్య రాయవాచకములో ఇట్లు వర్ణింప బడి నది. ఇతనిది ఇంచుమించు ఇట్లే ఉండియుండును.

''వీరనరసింహరాయలవారు విద్యానగరమందు బ్రాహ్మీ ముహూర్తాన లేచి, ఆరాధ్యనామావళులును, అ   త్మ సంకీర్త నలున్ను, పాండవగీతలు, భ్రమరగీతలు, గజేం   మోక్షము, భారత సావిత్రి, దధివామనస్తోత్రము, గంగావత ణము, నదీ ప్రార్థనమున్ను, భారత భాగవత రామాయణం, ముచికుంద స్తుతి, అక్రూరస్తుతి, భీష్మస్తుతి, సంజయనీతి, విదురనీతి, చాణక్యనీతి- ఇవి మొదలైనవిన్ని, వైరాగ్య శతకం, పురాణశ్రవణ మున్ను, రాజనీతులన్నియు విని, దర్పణావలోకనానంతరం కన్యకామణుల కపిల కామధేనువును స్పృశించి విప్రవరుల దర్శనంబు చేసిన పిమ్మట, దంతధావన ముఖమజ్జన నామతీర్థమై, విభూతి ధరించి, పేరోలగంబై కూర్చుండగాను, నూట యెనుబది తిరుపతుల నుండిన్ని తీర్థప్రసాదములున్ను, డబ్బై రెండు దేవస్థలాల నుంచి విభూతి గంధప్రసాదములున్ను రాగా, ఎదురుకొని, ప్రత్యుత్థానముచేసి, అంజలిచే నందుకొని, శిరసావహించి, స్థలాంతరాల నుంచి వచ్చిన అయ్యంగార్లనున్ను, ఆరాధ్య పీఠం వార్లనున్ను ఉచితాసనముల యందు కూర్చుండ నియమించి, అష్టస్వయంవ్యక్తం, శ్రీరంగం శ్రీముష్ణం వెంకటాచలం సాలగ్రామం తోతాద్రి నైమిశారణ్యం పుష్కరక్షేత్రం-ఇవి మొదలైన స్థలాలకు సురక్షితము గలదా అని అడిగినందుకు 'దేవరవారి ప్రతాపాతిశయమువల్ల ఆయా స్థలాంతరముల వున్న ముద్రకర్తలు వొకటికొకటి కొదువ లేకుండా నడుపుతావున్నారు. నూటయెనిమిది తిరుపతులున్ను నిత్యోత్సవముగా నడుస్తావున్నవి' అని అయ్యంగార్లు పలుకగా పృథివ్యాపస్తేజోవాయు రాకాశాత్మకమైన యేకామ్రనాథ, జంబు నాథ, అరుణాచలేశ్వర, కాళహస్తీశ్వర, చిదంబరం మొదలైన డెబ్బైరెండు దేవస్థలాలకున్ను పదునెనిమిది శక్తులకున్ను నిండు పడి తరములు గలిగి నిత్యోత్సవములు గలిగి ఉన్నదనేటట్టుగా ఆరాధ్యులు దెలుపగా, విన్నవాడై, చాలసంతోషభరితుండై వార్లకు పచ్చెలు యిచ్చి, ధర్మాసనం ధర్మయ్యను పిలువనంపగా, ఆయన వచ్చినిలిచి - దేవరవారు ఆనతిచ్చిన ప్రకారం ద్రావిడ రాజ్యంలోగల అగ్రహారములకున్ను, ఆంధ్రదేశం, హయసన దేశం, మొరసునాడు, మేల్నాడు, కర్ణాటకం, ఘట్టంశీమ, చేరచోళ పాండ్య మగధమలయాళ అగ్రహారములకున్ను, అవధి ఆటంకములు లేక నిత్యకర్మానుష్ఠానపరులై, బుగ్యజుస్సామాధర్వణ పారీణులయి, పంచయజ్ఞపరాయణులై, అతిథిసంతర్పణ చేసుకొని, నిర్వివారులై, సుఖవసతిగా వున్నారని విన్నపం శాయగా, రాయలవారు విన నవధరించి దళనాయకులను పిలువ నంపగా వారు వచ్చి, పొడగని నిలిచి, వినయముతోడట్టు సింహాసన రాజ్యములోగల గిరిదుర్గ వనదుర్గ జలదుర్గ స్థలదుర్గముల యందు, కావలికట్లు ప్రహరి బడగరములున్ను బీగము ద్రలు స్వామివారి ప్రతాపంవల్ల జతనమైవున్నవి, సామంతరాచ కార్యములు విశేషములుగా లేవు -అని విన్నపం శాయగా, ఆవెంబడిగా, తలారి జంగమయ్య వచ్చి రాయలవారి సముఖానకు అడ్డపడి చేతులు కట్టుకొని నిలిచి, దళనాయకులతోను, విద్యానగర పట్టణములోనున్న వెలి పాళ్యముల యందున్ను అది హెచ్చరికలుగలిగి రాత్రి పగళ్లు తలార్లు జతనమై జాగ్రత్తగా కాస్తావున్నారు. గనుక పట్టణములోగల అష్టాదశ వర్ణాల వారున్ను అత్యంతసంతోషపరులై అతివైభవముతోడట్టు నిత్య కల్యాణములున్ను పచ్చతోరణములున్ను గల్గివున్నారని విన్నపం శాయగా దళనాయకులు విని రాయులవారికి విన్నపం జేసినారు.

అటు పిమ్మట-విరూపాక్షస్వామి ధ్వజారోహణమై వున్నది. రథోత్సవానకు విజయం శాయవలెను-అని విన్నపం శాయగా దగ్గరవున్న దళనాయకులు ఆతీరున్నె రాయలవారు

విచ్చేస్తావున్నారు, స్వామిరథారూఢులయిన తోడుతోనే వచ్చి విన్నపం శాయమని అంపించ్చి, రాయలనగేరి తొమ్మిది సంప్రతులనున్ను పిలువనంపగా, కరణాలువచ్చి పదునెనిమిది రేవుల లెక్కలున్ను వినిపించిన తర్వాత రాయలవారు...''

ఇటువంటిది ఈతని దినచర్య. అన్నయైన వీరనరసింహ రాయల కాలమున, అతనికి కుడిభుజముగా నుండినాడు శ్రీకృష్ణదేవరాయలు. తటాలున ఎదురు చూడని విధమున రాజకీయములు మారినవి. తత్పూర్వము, తాతల కాలము నుండియు తాము మంత్రులు, సేనాపతులు; నాయనయు దండనాయకుడే. అన్నయే కొంతకాలము మంత్రియు దండనాయకుడుగా నుండి తటాలున రాజ్యమును అపహరించి, చక్రవర్తియై, అడ్డుపడువారు లేకుండ, తన్ను కూడ కలుపుకొని, రాచకార్యములు నిర్వహించుచుండెను. ఆకస్మికముగా అన్న జబ్బుపడి, మరణశయ్యమీద నుండి, మంత్రి తిమ్మరుసుతో తన (కృష్ణరాయల) కండ్లు తీయించి, తనకుమారునికి, ఎనిమిదేండ్లవానికి పట్టము కట్టుమనుటయు, ఆ సందర్భములో తాను, తనకు రాజ్యకాంక్ష లేదనియు, అన్న కుమారునికే పట్టాభిషేకము చేయుమనియు, తనకండ్లు తీయవలదనియు, తానెచ్చటికైనను జోగిగా పోయెదననియు తిమ్మరసును ప్రార్థించుటయు జరిగినవి. ఆ మహామంత్రి తిమ్మరుసే, దేశమును కాపాడుటకు, ఆ క్లిష్ట పరిస్థితులలో శ్రీకృష్ణదేవరాయడు తప్ప మఱియొక సమర్థుడు లేడని, ప్రాణావసానమందున్న అన్నకు, అట్లే గుడుగుడు జీవముతో నుండిన మేక కన్నులు తీయించి చూపి, తనకు పట్టాభిషేకము చేసియుండెను.

రాయలు ధార్మికుడు. ఇదంతయు మరచిపోలేదు. అన్న కుమారుని బాలుని హింసింపక, వానిని తన సవతి తమ్ముడు అచ్యుతదేవరాయలతో కూడ చంద్రగిరి కోటలో విడిదిలో నుంచి, వారికి సకల భోగములను అక్కడ సమకూర్చెను. అన్నకుమారుడు ఇరువదియేండ్ల తర్వాత జబ్బుపడి గతింపగా తన వెనుక అళియరామరాయలకు రాజ్యమీయ వలసినదని రాణులు ఒత్తిడి చేయుచుండినను, అల్లునికి మహాశక్తి సంపన్నునికి రాజ్యమీయక, తన సవతి తమ్మునికే ఇచ్చి, అతని రాకకు తగిన ఏర్పాట్లుచేసి తాను ప్రాణములు నిశ్చింతగా వదలెను.

రాయలు ప్రధానముగానే వెంకటేశ్వర భక్తుడు. కాని రాజు కాబట్టి నిష్పక్షపాతముగా శివక్షేత్రములను కూడ సేవించి సత్కరించినాడు. ఆముక్తమాల్యదలో గ్రంథకర్త వీరవైష్ణవుడుగా నగపడుచున్నాడు. కాని ఆస్థానపండితులలో కవులలో అల్లసాని పెద్దన్న వైష్ణవుడు. మాదయగారి మల్లన్న, ముక్కుతిమ్మన్న శైవులు. అఘోర శివగురుశిష్యులు. అట్లే ''స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి'' శైవుడు, కాళహస్తీమాహాత్మ్యకావ్య కర్త. అష్టదిగ్గజ కవులందరును వీరవైష్ణవులు కారు. ముక్కుతిమ్మన ఆరువేలనియోగి, హరిహరోభయభక్తుడే, తిక్కనవలె. ఎవరిమతము వారిది. తన మతము తనది. రాయలు మహమ్మదీయులను క్రైస్తవులను కూడ ఆదరించినాడు: జైనులు బౌద్ధులు కూడ ఉండిరి.

ఆండాళ్ చరిత్రను, ఆముక్తమాల్యదను వ్రాయవలెనను నుద్దేశము, అభిలాష రాయలకు దిగ్విజయములకు బయలుదేరిన కాలమందే ఏర్పడినది. కళింగ దేశము మీదికి దండయాత్ర బయలుదేరి (క్రీ.శ.1515-1516 ప్రాంతము?) బెజవాడకు పోయి దానికి సమీపముగా బందరు వద్ద శ్రీకాకుళమను క్షేత్రమందలి ఆంధ్ర విష్ణువును ఒక హరివాసరమున (ఏకాదశి నాడు) సేవింపబోయినప్పుడు కలిగినది. దానిని తానే ఆముక్తమాల్యదలో చెప్పుకొన్నాడు. భగవంతుడు తానే స్వప్నదర్శన మనుగ్రహించి కృతిని వ్రాసి అంకితము కోరుట చేత రాయల ఎంతటి భక్తుడో తెలియుచున్నది. పైగా రాయలను తనతో సమానునిగా చెప్పుట - ''నేను తెలుంగు రాయడన్ కన్నడ రాయ'' - ఎంతో ఉత్కర్షగదా రాయనికి. తర్వాత దేవుడే తెలుగును ప్రశంసించినాడు:-

''తెలుగదేల యన్న దేశంబు తెలు, గేను
తెలుగు వల్లభుండ, తెలుగొకండ,
యెల్ల నృపులు గొలువ నెఱుగవే బాసాడి
దేశభాషలందు దెలుగులెస్స''

రాయడు బహుభాషాకోవిదుడు. ఎందఱో సామంతరాజులు, అనేక భాషలలో తనతో నిత్యము మాటలాడుచుండగా, వారితో ఆయాభాషలలో మాటలాడుచుండును. అట్లు తారతమ్యములు చూచునప్పుడు అన్నిటికన్నను తెనుగుభాష సుందరము సరళము అని గ్రహించియుండును. తర్వాత తెలుగురాయడు అంకితము తనకు చేయక తిరుపతి వేంకటేశ్వరస్వామికి చేయుమనియు తానును అతడును ఒకరే యనియు చెప్పును:

''అంకితమొయయన, నీకల
వేంకటపతి యిష్టమైన వేల్పగుట, తదీ
యాంకితము సేయుమొక్కొక
సంకేతముగా కతడ రసన్నెగానే''

''నీకు ఇష్టమైన వేల్పు తిరుమలలో వేంచేసియుండు వేంకటేశ్వరస్వామిగాన ఆయనకు అంకితము సేయుము, వల్లభరాయడని, వెంకటేశ్వరుడని - ఇవన్నియు వేఱువేఱు సంజ్ఞలే గాని, భూలోకములో మేము వేరు కాము, ఒకరమే. ఈ విధముగా కావ్యము వ్రాసిన నీకు ఉత్తరోత్తరాభివృద్ధి యగును'' అని, దేవుడు అంతర్ధాన మాయెను.

అంతట రాయలు మేలుకొని, ఆశ్చర్యపడి, భక్తి రెండిం తలు కాగా, ఆ దేవాలయము యొక్క గోపురమునకు నమస్కా రము చేసి, తెల్లవారినంతట, సంధ్యావందనాది అనుష్ఠానములు కావించుకొని, నిండుసభతీరి, దండనాథసామంత సందోహ ములను, ప్రాతఃకాలమందే వారివారి మందిరములనుండి పిలి పించుకొని, నానావిధవేదములను ఆగమశాస్త్రములను ఎరిగిన పెద్దలను కూడ ఆహ్వానించి, తన శుభస్వప్నమును తెలుపగా, వారు సంతోషించి, ఆశ్చర్యపడి ''దేవా, దేవదేవుండు విజ యంబు చేసిన యాస్వప్నంబు అనేకశోభనపంపరలను తెలుపు చున్నది.

ప్రబలరాజాధిరాజ వీరప్రతాప
రాజపరమేశ్వరార్థదుర్గానటేశ,
సాహితీసమరాంగణసార్వభౌమ
కృష్ణరాయేంద్ర కృతి వినిర్మింపు''

మనిరి. అది మొదలు రాయలు ఆముక్తమాల్యదను, ఆండాళ్ చరిత్రను, వ్రాయనారంభించెను. దీనివ్రాత ఒక సంవత్సరము లోనో, రెండేండ్లలోనో పూర్తిగా వ్రాయబడలేదు. కొన్ని సంవత్సరములు పట్టినది. పారిజాతాపహరణము, మనుచరి త్రము, ఆయాకవులు వ్రాసి, సర్వదిగ్విజయానంతరమే పూర్తి చేయబడి, రాయలు అంకితమంది, వారికి సమ్మానములు (క్రీ.శ. 1522) చేయబడినవి. ఆతర్వాత ఆముక్త మాల్యదను పూర్తి చేసినట్లున్నాడు. కాని తిరుమలకు పోయి భగవంతుని దర్శించి, తన చేతులతో అంకిత మిచ్చినట్లుకానరాదు. చివరిది నములలో రాయలకు మనశ్శాంతి చెడినది. కుట్రలు, కుయు క్తులు, అంతఃపుర రహస్యచర్యలు - తి రునువంటి మహా త్ముని, మహామాత్యునే తన్ను ఎంతో ఉ ంచిన అప్పాజీనే సందేహించునంతటి పనులు జరిగినవి. నన్ను పరిపరివిధ ముల చీకాకుపడినది. తాను మెచ్చుకొని, దగ్గరకు తీసి తన. కుమార్తెనిచ్చి అల్లుని చేసికొనిన రామరాయలకే రాజ్యమీయక చివరకు తన సవతి తమ్ముని, అచ్యుతదేవరాయలను తనకు వారసునిగా నియమించి గతించినాడు.

ఆండాళ్ కథను వ్రాయుచు, ఇది కావ్యముకాబట్టే రాయలు కొంత మార్చినాడు. ఆండాళ్ పెంపుడుతండ్రియైన పెరియా ళ్వారైన, విష్ణుచిత్తస్వామి చరిత్రతో ప్రారంభించి నడుమ ఉదాహ రణార్థము ఆళవందారు (యామునా చార్యుల)ను చాలపూర్వ డుగా వర్ణించినాడు. అట్లే ఉదాహరణార్థము ఖాండిక్యకేశిధ్వజ సంవాదమును, కైశికపురాణమును (మాలదాసరి కథను) వ్రాసి నాడు. ఇది కావ్యము. కావ్యములో ఉపదేశమే ప్రధానము. అందులకుగాను కథను కొంత మార్చుకొనవచ్చును. ఇందు కావ్యాలంకార శాస్త్రము అవకాశమిచ్చుచున్నది.

ఈ కావ్యమందు విశిష్టాద్వైత సిద్ధాంత సారము, మాలదాసరి యొక్క చిత్తశుద్ధి, స్థిరభక్తి జ్ఞానమహిమ, జ్ఞానబోధనము, అతడు అనుగ్రహించిన మాత్రాన బ్రహ్మరక్షస్సునకు వైష్ణవోత్త మత్వము కలుగుట, గోదాదేవి యొక్క భక్తితో కూడిన శృంగారము హృదయంగమముగా వర్ణింపబడినవి. భగవదనుగ్ర హమునకు భక్తి ప్రధానముగాని జాతి ప్రధానము కాదు అని కృష్ణరాయల బోధ.

'సాహితీసమరాంగణ సార్వభౌముడే' గాక శ్రీకృష్ణదేవరా యడు పరమ భాగవత శిఖామణిగాను కనబడు చున్నాడు. కాబట్టియే కాబోలు ఆయనను ఆశ్రయించుకొనియుండిన అల్ల సాని పెద్దన్నయు వైష్ణవము గ్రహించి, పెద్దయ్యంగార్తై తనకు రాయలు ''కోకట గ్రామాద్యనేకాగ్రహారములు అడిగిన సీమల యందు'' ఇచ్చినవానిని వైష్ణవులకు తాను దానము చేసి, రాయలు గతించిన తర్వాత ''అట్టి శ్రీకృష్ణదేవరాయలతో దివికేగలేక బ్రదికియున్నాడ జీవచ్ఛవంబనగుచు'' అని వాపో యినాడు.

రాయలు గతించినను, ఆయన చేసిన దానధర్మాదికములు కాలక్రమమున నశించినను, విజయనగరమే పాడైపోయినను, ఆతని కావ్యము ఆముక్తమాల్యద ఆచంద్రార్కము ఆయన కీర్తిని నిలిపినది.

# తరిగొండ వెంగమాంబ దానపత్రాలు

శ్రీ కె.జె. కృష్ణమూర్తి

ఆంధ్ర సారస్వతంలో తరిగొండ వెంగమాంబకు గల స్థానం విశిష్టమయింది. సహజ పాండిత్య విరాజితుడైన బమ్మెర పోత రాజు, పదకవితాపితామహుడుగా పేరుగాంచిన తాళ్లపాక అన్న మాచార్యుడు మున్నగు మహాకవిశేఖరుల శ్రేణిలో ఎన్నదగిన మహనీయ సాహితీమూర్తి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ.

శతకం, యక్షగానం, ద్విపద, మాహాత్మ్యకావ్యం - వంటి వివిధ ప్రక్రియలలో ఇంచుమించు ఇరువది రచనలను వెలయించిన విశిష్టవాఙ్మయ తపస్విని వెంగమాంబ. ఆ రచనలన్నీ ఒక యెత్తు కాగా, ఆమె మహానుభావతను ప్రత్యక్షరమూ చాటుతున్న ఆమె దానపత్రాలు ఒక యెత్తు!

భక్త కవయిత్రియగు వెంగమాంబ(క్రీ.శ. 1730-1817) తిరుమల పుణ్యక్షేత్రమున ప్రతి సంవత్సరం వైశాఖమాసంలో నృసింహజయంతి మహోత్సవాలను పదిరోజుల పాటు ప్రజా రంజకంగా నిర్వహిస్తూవుండేది. ఆ ఉత్సవదినాలలో పేదలకు అన్నదానం, చలివేంద్రలు నెలకొల్పడం మొదలైన ధార్మిక కార్యక్రమాలు జరుపబడుతూ వుండినవి. ఈ పవిత్ర కార్యక్ర మాల నిమిత్తమై దక్షిణాన దిండుగల్లు నుండి ఉత్తరాన గోల్కొండ వరకు గల దేశంలోని జమీందారులు, పాళెగార్లు, భూస్వాములు, ధనస్వాములు, రైతులు, వర్తకులు, తదితరులు -మున్నగా గల భక్తజను లనేకులు సమర్పించిన భూ, ధన, ధాన్యాదికాన్ని గూర్చి వెల్లడించే ఆదానపత్రాలు ''శ్రీశేషాచల నివాసులయిన, శ్రీ తరిగొండ లక్ష్మీనృసింహస్వామి దివ్య శ్రీ పాదారవింద మధుకరాయమాన మానసులయిన మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ గారి'' మహనీయమూర్తిమత్త్వాన్ని చక్కగా చాటుతూ వున్నాయి.

ఈ దానపత్రాలు శాలివాహనశకం 1707 విశా సు సంవత్సర చైత్రమాసం నుండి శా.శ. 1730 విభవసంవ ్సర ఫాల్గుణ మాసం దనుక - అనగా క్రీ.శ. 1785 నుండి 1 09 వరకు గల ఇరువది యైదు సంవత్సరాల కాల పరిమితిలో వెలువడి ఉన్నాయి. ఇవన్నీ వేర్వేరు కొలతలు గలిగిన 31 తాళప లలో లిఖింపబడివున్నాయి. 'వర్షాశనదాన పత్రిక, మా పత్రము, ధర్మశాసన దానపత్రిక, సన్నదు' - అనేవి వీటి పర్యాయ పదాలుగా ఎడనెడ ప్రయోగింపబడినాయి.

ఈ దానపత్రాలలో ఆయా గ్రామాల్లో నివసించే రెడ్డి, కరణాలు, పురోహితులు, శెట్టివర్తకులు, కాపులు, పణాల వారు యావన్మంది ఏకస్థులై వ్రాయించి యిచ్చినవి అధిక సంఖ్యలో వుండటం విశేషం. వాళ్లందరూ కుళబడి, పేరుబడి, యిల్లు 1కి, నెల 1కి యథాశక్తిని సేకరించి సంవత్సరాని కొక పర్యాయం సమర్పించిన బియ్యము, రూకలు, వరహాలు-మొదలయినవి తిరుమల యాత్రకు వచ్చే తైర్థికుల అన్నపానాలు నిమిత్తంగా వినియోగమౌతూ వుండేవి. ఇలాంటి గ్రామీణులందరి దాన పత్రాలు కొన్నింటిలో చివరన ''యీధర్మానకు యెవరు ఆక్షేప ణచేశి నిల్పినా, కాశీలో గోబ్రాహ్మణవధ, మక్కాలో వరాహవధ చేశి భక్షణ చేశిన పాపాన పోగలవారు'' - ఇత్యాది శపథవాక్యాలు గోచరిస్తూ వున్నందున, హిందూ మహమ్మదీయ భేదం లేకుండా, ఆనాటి సమాజంలోని ప్రజానీక మంతా తరిగొండ వెంగమాంబ యొక్క ధార్మిక కైంకర్యాలకు తోడ్పడేవాళ్లనే విషయం వెల్లడౌతున్నది.

ఇదిగాక, కొన్ని కొన్ని వర్గాలవారు - ఉదాహరణకు చిత్తూరి దేశం రెడ్లు, తిరుపతి బేరిసెట్లు, తిరుమల వర్తకులు-మొదలైన వాళ్లు సాముహికంగా చేరి, దానపత్రాలు వ్రాయించి యిచ్చినట్లు తెలుస్తున్నది. ఈ గ్రామీణుల్లో చాలా మంది నేటి సామాజిక దృ 'అక్షరాస్యులు' కాకపోయినా, కేవలం గంటం ముట్టిన సం తో యథాశక్తిని ధార్మిక కార్యక్రమాలకు చేయూత ని నవారు. ఆ గ్రామీణుల ఔదార్యం వేనోళ్ల ప్రశంసింపదగింది.

వీళ్లేగాక, మరికొందరు జమీందారులు, పాళెగారలు తమ తమ అధీనంలోని గ్రామాలను, భూములను, ద్రవ్యాన్ని -మాతృశ్రీ తరిగొండ వెంగమాంబగారి మతానకు భక్తిప్రపత్తులతో బహూకరించి వున్నారు. ఈ పాళెగార్లందరూ ఆ కాలపు 'ఈస్టిండియా కంపెనీ రికార్డు'ల్లో 'పరస్పరం కలహించుకొం టూవుండే దోపిడి కాంద్రు'గా చిత్రింపబడివున్నారు. కాని, ఈర్ష్యాసూయలకు తావలమైన ఆ ఆంగ్లేయుల వ్రాతలలో పరి పూర్ణ సత్యం చోటు చేసికోలేదనీ, ఆయా పాళెగార్లు తిరుమల - తిరుపతి క్షేత్రానికి ''కావలిగార్లు''గా కర్తవ్య నిర్వహణ చేస్తూ, ''శత్రురేవ హి శత్రు స్స్యాత్; ధర్మ శత్రు ర్నకస్యచిత్''

(శత్రువు శత్రువే; అయినా ఆతడు ఆచరించిన ధర్మం మాత్రం ఎవ్వరికీ శత్రువు కానేరదు)-అనే ఆదర్శంతో పాటుపడినవార లనీ పైన పేర్కొన్న దానపత్రాలు ఘోషిస్తూ వున్నాయి.

భూమిదానాలను వివరించే ఈ దానపత్రాలు కొన్నింటిలో ''తొండమండలం'' ''తిరువిళయాట్టం'', ''ఉళ్మండలం'', ''గొడుగులనాడు'' - అనే పదాలు తరచుగా కనిపిస్తున్నాయి. పరిశీలింపగా ఇవి ఆయా దేశవిభాగాలను సూచించేవని వెల్లడా తున్నది. వీటిలో 'తొండమండల' మనేది పల్లవ చక్రవర్తుల కాలంనుండీ ప్రముఖంగా వాడుకలో నెలకొని వున్న రాష్ట్రనామ ధేయం. 'తిరువిళయాట్టం' అనేది ''తిరువిడయాట్టం'' - అనే తమిళ పదబంధానికి వ్యవహారంలో స్థిరపడిన రూపం. 'దేవుని నిమిత్తమై విడువబడిన ప్రాంత'మని అర్థం. తూర్పున శ్రీ కాళహస్తి, దక్షిణాన నారాయణ వనము, పశ్చిమాన నాగపట్ల ప్రాంతం ఉత్తరాన మట్లవారి సీమలోని ఎర్రగుంటకోట - ఈ సరిహద్దులకు లోబడి విస్తరించి వున్న ప్రాంతమే ''తిరవిళ యాట్టం''. శ్రీ వేంకటేశ్వరుని ''లీలావిహారభూమి''యైన ఈ ప్రాంతాన్ని విజయ నగర చక్రవర్తులు 'దేవదానం'గా మన్నించి భక్తి శ్రద్ధలతో పరిరక్షిస్తూవచ్చారు. ఈ ప్రాంతానికే ''తిరుపతి రాజ్య''మని ప్రాచీన వ్యవహారం. ఇక, ఉళ్మండలం అంటే లోతట్టుప్రాంతం (inner region) అన్నమాట. తిరుమల - తిరుపతి క్షేత్రానికి చుట్టుపట్టుల నున్న ప్రదేశమని దీని భావం. 'గొడుగులనాడు' అనేది తిరుమల-తిరుపతి క్షేత్రానికి దక్షిణదిక్కున గల సువర్ణముఖీ నదీ పరీవాహక ప్రాంతం. తొండమండలంలో చేరిన 'తిరుపతి రాజ్యం' లోపలి భాగమైన గొడుగులనాటిలోని ఫలానా గ్రామంలోని భూమి తరిగొండ వెంగమాంబగారి మఠానకు ధారాదత్తం చెయ్యబడిం దని పేర్కొనడం పై దానపత్రాల్లో సర్వసాధారణంగా గోచ రించే ముఖ్యాంశం.

ఈ దానపత్రాల్లోని భాష ఆనాడు వాడుకలో ఉన్న శిష్టవ్యావ హారికం. అందుల 'మహసూళ్లు, సదరహి, ఇనాం' - వంటి అన్యదేశ్యాలు అక్కడక్కడ అనువుగా నెలకొని వున్నాయి. ఆనాడు చలామణిలో వున్న గగ(వరహా), రూక, శంఖులు( శంఖం గుర్తుగల నాణేలు), పూలవరహా, కుంపిణీ రూపాయలు - మున్నగు నాణేల పేర్లు, నీరారంభం, కాడారంభం, దశ బంధం - వంటి వ్యావసాయిక పరిభాషా పద జాలము మొదలైన వనేకం ఆనాటి సాంఘిక చరిత్రను అన్వేషించడానికి పనికి వచ్చే అంశాలుగా వీటిల్లో దర్శనమిస్తున్నాయి.

మొత్తంమీద, అసంఖ్యాక భక్తజనులు అయాచితంగా అంద జేసిన సాహాయ్య సహకారాలతో తిరుమల పుణ్య క్షేత్రంలో- ఆనాడే (క్రీ.శ. 18వ శతాబ్దిలోనే) అన్నదాన పథకాన్ని దిగ్విజయంగా అమలు పరచిన ఆధ్యాత్మిక శ్రీ సారస్వత మూర్తి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ అనే సత్యం పై దాన పత్రాల పరిశీలన ఫలితంగా తెలియదగిన ముఖ్యాంశం!

క్రీ.శ 18వ శతాబ్దిలో 'తిరుపతిరాజ్యం' లోను, తత్పరిసరా లలోను నివసించిన సామాన్య ప్రజల స్థితిగతులకు, ధార్మిక దృక్పథానికి అద్దం పట్టిన ఈ దాన పత్రాల్లో నుండి 'మచ్చుతు నక'గా ఈ క్రింది శాసనం ఈ సందర్భంలో తిలకింపదగివుంది.

శ్రీమన్ నృసింహాయ నమః
రాజశ్రీ క్రిష్ణమనాయనివారు వ్రాయించి యిచ్చిన దానపత్రం

స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకాబ్దాః1729 కల్యాబ్దాః 4908 అగునేటి ప్రభవనామ సంవ్వత్సర వైశాఖ శు 10లు యీ శుభదినం తిరుమలయంద్దు శ్రీమదఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకులైన శ్రీ వేంకటేశ్వరస్వామి సాంన్నిధ్య మున శ్రీమదఖండ సచ్చిదానంద నిత్యపరిపూర్ణులయ్ని శ్రీ తరిగొండ లక్ష్మీ నృసింహ్వస్వాము దివ్య శ్రీ పాదారవింద మధుకరాయ మానమానసులై వున్న మాతృశ్రీ వెంగమాంబ గారి మఠానకు సకల జననయన మనోహర సకలదురితనివారణ నిపుణ సకల శోభన కారణ తదియ్యా నియతవైశాఖ మాస శ్రీమన్ నృసింహోత్సవ అన్నదాన ధర్మమునకు రాజమాన్య రాజశ్రీ మాముదూరి శిద్దమనాయని కుమార క్రిష్ణమ నాయని వారు వ్రాయించ్చి యిచ్చిన భూదానధర్మశాసన దాన పత్రికె క్రమమెట్లంన్నను శేషాచలపర్వతానకు దక్షిణం తిరువిళ యాట్టం వుళ్మండలంలో మాయేలుబడి అయిన పుదిపట్ల గ్రామంలో తుంగల పాళ్లకు పశ్చిమం పెరుమాళ్లపల్లెకు తూర్పు వంకకు తూర్పు యీశాన్యపుదిక్కున యాగనగారి ముత్యాలు దుంన్నుతూ వున్న బరిణిగెడ్డ చేలో శాలివాహన శకవర్షంబులు 1718 అగునేటి నళనామసంవ్వత్సరం కార్తిశుద్ధ 10 మీకు మాన్యం గుంట్టలు 97 అక్షరాలా తొంబైయేడు గుంట్టలకు దానపత్రం వ్రాయించ్చి యిచ్చి వుంట్టిమి గనుక ఆమాన్యం మీరు అనుభవిస్తూవున్న యడలలో అది వర్షంచాత వంక్కపారి నంద్దున అది చక్కగా ఫలించనంద్దున సదరహి మాన్యానకు బదులు చెప్పమని తమరు అడిగినంద్దున సదరహి బరిణి గెడ్డ చేలో గుంట్టలు 27న్నూ నిలచిన బాకి గుంట్టలు 70కి యీ ప్రభవ సంవ్వత్సరం బదులు చెప్పిన భూమికి హద్దులు వివరం పుదిపట్ల గ్రామానకు నైరుతి భాగమంద్దు వుత్తరం సంప్రతి గురుమూర్తి కట్టడిచేను హద్దు తూర్పు పాలివారినేల చాట్లజం గని కట్టడిమడి హద్దు దక్షణం పాలివారినేల కంమ్మవెంకట చలం కట్టడి మడి హద్దు పడమర పాలివారు మీకు మాన్యం చెప్పివున్న మడిగెనిమె హద్దు యీ మధ్యే వున్న మడిగుంట్టలు

70 యీ డెబ్బై గుంట్టలతో కూడా వుభయం గుంట్టలు 97 అక్షరాలా తొంబ్బై యేడు గుంట్టలున్నూ్న యీమడి శ్రీ లక్ష్మీనృసింహార్పితముగా సహిరణ్యోదక దానధారాపూర్వక ముగా సమర్పించ్చినాము గనుక యీ మాన్యం భూమికి నగిరి ఆటంకాలు మరేమి లేకుండ్డా నిరాక్షేపణగా సర్వదుంబాలాగా నిధినిక్షేప జలతరు పాషాణ అక్షీణ ఆగామి శిద్ధ సాధ్యములు కలుగునట్లుగాను దానాది వినిమయ విక్రయంబ్బులకు యోగ్య మగునట్లుగాను తమ శిష్యపారంపర్యం మా పుత్రపౌత్ర పారం పర్యం ఆచంద్రార్క స్థాయిగా అనుభవించుకుని సుఖాన వుండ గలవారు. యీ ధర్మానకు యవరైనా ఆక్షేపణ చేశి నిలిపినట్టుల యితే కాశీలో గోబ్రాంహ్మణ వధ చేశిన పాపాన పోగలవారు. యింద్దుకు సాక్షులు హరిహరాదులు. యిటని మారాజీని మా సంప్రతి లేఖ వ్రాశే కరణం లక్ష్మయ చేత వ్రాయించ్చి యిచ్చిన భూదాన ధర్మ శాసన దాన పత్రికె.

దాన పాలనయో ర్మధ్యే దావా ఛ్రేయ్యోస్య పాలనం,
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం.
స్వదత్తా పుత్రికా ధాత్రీ పరదత్తాను సోదరీ,
రాజదత్తా భవేన్మాతా విప్రదత్తా వసుంధరా.
స్వదత్తాం పరదత్తాం వా యో హరేత వసుంధరాం,
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః.
స్వదత్తా ద్విగుణం పుణ ం పరదత్తానుపాలనం,
పరదత్తాపహారేణ స్వద - నిష్ఫలం భవేత్.
మద్వంశజాః పరమహీ తి వంశజా వా
యే భూమిపాః సతత ముజ్వల ధర్మచిత్తాః,
మద్ధర్మమేవ పరిపాలన మాచరంతి
తత్పాదుకాద్వయ మహం శిరసా వహామి.

మాముదూరి కొమార క్రిష్ణమనాయనివారి చేవ్రాలు.

దూర ప్రియ కుశల కథా శ్రవణా త్సాధ్వీవ సౌరభ సమృద్ధిః।
వికసనజ సంపదా వా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

దూరదేశంలో ఉన్న ప్రియుని కుశలవార్త వినడంవల్ల సాధ్వీలాగ, పూవులు వికసించడంవల్ల సువాసనల గుబాళింపులాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి



# వీరశిలలు

**శ్రీ ఆర్. శేషశాస్త్రి**

శిల అనాదిగా మానవునికి అనేక విధాల ఉపయుక్తమౌతూనే వుంది. మనిషి తన నాగరికత ప్రారంభకాలంలో దాన్ని ఆయుధంగా మలచుకొన్నాడు. బృహచ్ఛిలలతో సహజ సిద్ధాలైన గుహలలో నివాసం సాగించాడు. తరువాతి కాలంలో శిలను తనరాతకు, చిత్ర, శిల్పరచనలకు, తన వస్తునిర్మాణానికి మాధ్యమంగా చేసుకొన్నాడు. అంతేకాదు. మృతుల ఆత్మలను రాతిలో । తిష్ఠాపించే ప్రయత్నమూ చేశాడు. మూర్తి పూజ ప్రారంభ న తరువాత తన దైవాలకూ శిలలలోనే రూపాన్ని వ్వడం ' రంభించాడు. ఇలాంటి రాళ్లు కేవలం రాళ్లుగానే మిగిలిపో , అవి అతని నమ్మకం, భావన, కల్పనల అమూర్త రూపాలకు స్పష్టమైన రూపాన్నిచ్చిన సంకేతాలైనాయి. నేడు ప్రాచీన మానవుడి జీవనాన్ని గురించి అధ్యయనం చేసే పరిశోధకులు, శిలల ద్వారా లభించే దాఖలాలనే చాలమట్టుకు అవలంబించవలసి వుంది.

ఒకానొక పోరాటంలో, తన ప్రాణాన్ని అర్పించి, తన ప్రభువు కోసమో, ఊరికోసమో లేదా లోకోపకారం కోసమో వీరోచితమైన రీతిలో మరణాన్ని పొందిన వాళ్ల స్మారకంగా అర్థాత్ వాళ్ల ఆదర్శాలూ, పరాక్రమమూ, లోకోపకారైక గుణమూ, చిరస్థాయిగా రాబోయే తరాలకు తెలియాలనే ఉద్దేశంతో నిర్మించిన శిలలను 'వీరశిలలు' అంటారు.

వీర శిలలు శాసనాలే అయినా, ఇతిహాసపు మూల సామగ్రులుగా శాసనాల కంటె ప్రత్యేక స్థానాన్ని పొందాయి. శిల్పమూ, వ్రాత అనే రెండు అంశాల ద్వారా వీరశిల మరణించిన వీరునిగురించి తెలుపుతుంది. వీర శిలలో మరణించిన వీరుడు పోరాడుతూ వున్నట్లు శిల్పం ఉంటుంది. క్రింది భాగంలో ఆవీరు డెవరు? ఏ పోరాటంలో ఎందుకు ఎలా మరణించాడు అనేవివరాలు వ్రాయబడి వుంటాయి. ఇది వీరశిలల ప్రత్యేక లక్షణం ఒక శిలను వీరశిల అనాలంటే ముఖ్యంగా గమనించవలసిన అంశం దాని శిల్పం. శాసనం లేక పోయినా కేవలం శిల్పం వుంటేచాలు అది వీర శిల అనిపించుకోవడానికి అర్హమౌతుంది.

పోరాటంలో మరణించిన వీరుల స్మృతిచిహ్నంగా, ఇలాంటి వీరశిలలు నిౌ ంచే సంప్రదాయం నేటికీ, అనేక ఆదివాసి జనసముదాయా గుర్తించవచ్చు. చనిపోయిన వ్యక్తి ఆత్మ దేహాన్ని పోగొట్టుకొ గాలిలో తిరుగుతూ వుంటుంది. దానికొక ఆశ్రయాన్ని ఇవ్వాలనే ఆదిమానవుని మరణానంతర జీవనకల్పన ఇలాంటి వీరశిలా ప్రాదుర్భావానికి కారణమయింది. నాగరికత పెరిగేకొద్దీ, ఈ సంప్రదాయాన్ని అనుసరిస్తూ వచ్చిన సమాజం, తాను అసామాన్యుడని భావించిన వ్యక్తికి స్మారకాలను నిర్మించ సాగింది. తన యజమాని కోసమో, లేదా అబలా మాన సంరక్షణార్థమో, ఒక క్రూరమృగాన్ని ఎదుర్కోవడానికో జరిగే పోరాటాన్ని గొప్ప వీరత్వంగానూ దాన్నే జీవన మూల్యంగానూ, సమాజం గుర్తించింది. దాన్ని వైభవీకరించడానికి వీరశిలలు ఆధారలయ్యాయి.

ఇక్కడ గుర్తించవలసిన అంశం ఒకటుంది. బలవంతులూ, పరాక్రమవంతులూ అయిన అందరినీ సమాజం వీరులుగా గుర్తించలేదు, ఎవని బలపరాక్రమాలు సమాజ శ్రేయస్సుకు ఉపకరించాయో వానినే వీరునిగా గుర్తించింది అన్నదే ఆ అంశం.

దక్షిణ భారతదేశానికి సంబంధించినంతవరకు, సహగమన పద్ధతి, సుమారు పదవ శతాబ్దం ప్రారంభంలో మొదలై క్రమంగా వెలుగుచూచింది. సహగమనం చేసిన స్త్రీజ్ఞాపకార్థమై శిలను నిల్పడమూ, ఆ శిలపై ఆస్త్రీశిల్పమూ, ఆమె పేరు, ఆమె భర్త మొదలైన వివరాలు చెక్కడమూ చేసే వాళ్లు, వీటిని 'మహాసతి శిల'అంటారు.

వీరశిలకానీ, మహాసతిశిలకానీ ముఖ్యంగా రెండు ఉద్దేశాలతో స్థాపిస్తారు. ఒకటి: ఇది మరణించిన వ్యక్తికి స్మారక చిహ్నం. రెండు: ఇది చనిపోయిన వ్యక్తి ఆత్మకు ఆశ్రయం అయినందువల్ల, ఆ వ్యక్తికి సంకేతమూ పూజార్హమూ అయిన మూర్తి. ఈవిధంగా స్మారక శిలలు ఇతిహాస, జానపదశాఖలకు మూల ఆకరాలౌతాయి.

ఉత్తర భారతంతో పోలిస్తే, నేటికీ దక్షిణ భారతంలో 'వీరశిల' నిలిపే సంప్రదాయం ఒక వైశిష్ట్యాన్ని కలిగివుంది. ఉత్తర భారతంలో ఇది అంతిమ సంస్కారానికి అంగం మాత్రమే కాగా, దక్షిణ భారతంలో మరణించిన వ్యక్తి పరాక్రమాన్ని చాటి జ్ఞప్తికి తేచ్చే గుర్తు.

దక్షిణభారతంలో వీరశిలలను నిలిపే సంప్రదాయం చాలా ప్రాచీన కాలం నుండి కనిపిస్తుంది. తమిళంలో అత్యంత

ప్రాచీనమైన సంగమ సాహిత్యంలో వీటి ప్రస్తావన వుంది. వీరశిలలు నిలిపే పద్ధతి, పూజావిధానం, వీటిని గురించి ప్రజలనమ్మకం, మొదలైన పలు అంశాలు అందులో కనిపిస్తాయి.

ప్రారంభకాలంలో వీరోచితంగా పోరాడి మరణించిన వారి కోసమే ఈ వీరశిలలను నిలిపేవాళ్లు. తరువాతి కాలంలో పోరాటంలో మాత్రమేకాక, ధార్మిక సామాజిక కారణాలతో అసాధారణ రీతిలో ప్రాణత్యాగం చేసిన వాళ్లు కూడా వీరులుగా గుర్తించబడ్డారు. ఇలాంటి వాళ్లకోసం నిలుపబడిన స్మారకాలు కూడా వీరశిలలనే పిలువబడ్డాయి.

ఈనేపథ్యంలో ఇంతవరకు లభ్యమైన వీరశిలలను రెండు ముఖ్య విభాగాలు చేయవచ్చు:

1. ఆత్మార్పణ చేసుకొన్న వీరుల స్మారకాలు.
2. పోరాటంలో మరణించిన వీరుల స్మారకాలు.

**ఆత్మార్పణ చేసుకొన్న వీరుల స్మారకాలు :**

ఈ స్మారకాలను మరలా రెండు ఉప విభాగాలుగా విభజించవచ్చును.

1. ధార్మిక ఉద్దేశాలకై ఆత్మహత్య చేసుకొన్నవీరుల స్మారకాలు.
2. సామాజిక కారణాలకోసం ఆత్మార్పణ చేసుకొన్న వీరుల స్మారకాలు.

1. దక్షిణభారతంలో శక్తి పూజ ప్రచలితమైన కాలంలో సాధకుడు తనదేహంలోని కొన్ని భాగాలను ఒక్కొక్కటిగా ఖండించి దేవికి అర్పిస్తూ దేహత్యాగం చేసే ఆచారం ఉండేది. ఇలాంటి వాళ్ళ స్మారకాలను దేవీ ఆలయం ముందు నిలిపేవాళ్ళు. ఇలాంటి వీరసాధకులు తమతల నరుక్కోవడానికే శ్రీశైలంలో ఒక మంటపం ఉండేది. అది శాసనాలలో వీర శిరఃఖండన మంటపం అని పిలువబడింది. ఈ విధంగా చనిపోయిన వాళ్ళకు స్మారకాలు నిర్మించి రాతికప్పులతో గుడులనూ నిర్మించారు. వీటిని 'వీర గుడ్డములు' అని పిలిచారు. ఇలాంటి కొన్న గుడులలో ఇప్పుడూ పూజలు జరుగుతూ వున్నాయి. సూర్యగ్రహణ పర్వకాలంలో ప్రాణత్యాగంచేసే పద్ధతి కూడా వుండింది. ఈవిధంగా మరణించిన వీర సాధకుల స్మారక శిలలు కూడా లభిస్తాయి.

ఆంధ్రప్రదేశంలో వీరశైవమతం విశేష ప్రచారంలో వున్నప్పుడు వీరమాహేశ్వరాచారం విశేషప్రచలితమై వుండింది. శివుని తప్ప అన్యదేవతలను స్తుతించడం మాట అటుంచి చూడనుకూడా చూడము, అకస్మాత్తుగా వారిస్తుతి. చెవిలో పడినా ప్రాణత్యాగం చేసికొంటాము అని ప్రతిజ్ఞపూనిన వాళ్ళు తమను తాము అలాంటి సందర్భాలలో చంపుకొనేవాళ్ళు. ఇలాంటి వాళ్ళను 'వీరమాహేశ్వరులు' అనేవాళ్ళు. పాల్కురికి సోమనాథుడు తనను 'వీరమాహేశ్వరాచారుండ'నని పిలుచుకొన్నాడు. వ్రతభంగమయిందని తెలుస్తూనే స్వయంప్రేరణతో వీళ్ళు ఆత్మార్పణం చేసుకొనే వారు. ఈ వీరవ్రతం కారణంగా సమాజదృష్టిలో వీళ్ళు 'వీరులు' అయ్యేవారు. వీళ్ళకు స్మారకాలు కూడా నిర్మితమయ్యాయి. వాటిని శివాలయాల ప్రక్కన నిలిపేవాళ్ళు. ఈ ఆచారాన్ని అప్పటికే కర్నాటకంలోని 'శివశరణులు' ఖండించారు. కాని ఇది ఆంధ్రదేశంలో విశేషంగా ప్రచలితమై వుండింది. త్రిపురాంతకం, మోపూరులలో ఈ వీరశిలలు కనిపిస్తాయి. హైదరాబాదు ప్రాచ్యవస్తు సంగ్రహాలయంలో ఇలాంటి వీర శిలలు భద్రపరచబడివున్నాయి. పురుషులేకాక స్త్రీలుకూడా ఈ వీరమాహేశ్వర వ్రతాన్ని ఆచరించారని ఈస్మారక శిలలద్వారా తెలుస్తూవుంది.

2. ప్రభువుకు కుడి భుజం వంటి వాళ్ళు, తమ ప్రభువు యుద్ధంలోగానీ, సహజంగా గానీ మరణించినప్పుడు తామూ ఆత్మార్పణం చేస్తామని ప్రతిజ్ఞపూనేవాళ్ళు. అలాగే ఆచరించే వారు కూడా. వీళ్ళను లెంక, వెళవాళె అని పిలిచేవారు. ఈ 'లెంక, వెళవాళె'లను గురించి ప్రాచీన తమిళ, కన్నడసాహిత్యాలూ, శాసనాలూ స్వారస్యపూర్ణమైన వివరాలను అందిస్తాయి. పాల్కురికి సోమనాథుడు తనను 'బసవని లెంక'గా చెప్పకొనడాన్ని ఇక్కడ స్మరించవచ్చు. వీళ్ళు కొన్ని శాసనాలలో 'కీళ్గుంటె' లేదా కాళ్ళుంటి అని పేర్కొన బడ్డారు. ప్రభువు మృతుడైనప్పుడు, సంస్కార సమయంలో ఈ సేవకుడిని చితిపై మొదట పడుకోబెట్టి తరువాత ఇతనిపైన ప్రభువు కాయా ౹ ఉంచి సంస్కారం జరిపేవారు. 'కీళ్గుంటె'ల ప్రస్తావం అనంత ౹గం జిల్లా హేమావతి, అట్లే కడపజిల్లా శాసనాలలోనూ శిల్ప ంగా లభిస్తుంది.

ఇంత వరకు గమనించిన ఆత్మ బలిదాన ప్రకరణాలు, ఒక యుద్ధంలోనో, పోరాటంలోనో మరణించిన వీరుల హింసాత్మక, వీరోచిత మరణం కంటే ఏ మాత్రమూ తక్కువైనవి కావు. ఒక విధంగా ఈ కారణం వల్లనే మనవాళ్ళు ఈ విధంగా చనిపోయిన వాళ్ళను 'వీరులు'గా పరిగణించి వుంటారని పిస్తుంది.

జీవితంలో వైరాగ్యాన్ని పొంది, జైనమతానుసారంగా సల్లేఖన వ్రతాన్ని స్వీకరించి, ఉపవాసంతో, దేహత్యాగం చేసిన వాళ్ళ స్మారకాలు కూడ లభిస్తాయి. కాని వాటిని 'వీరశిలలు'గా కాక 'నిషధిశిలలు'గా పరిగణిస్తారు. వారి దేహత్యాగ విధానం 'శాంత' మైనందు వల్ల వాళ్ళు వీరులుగా పరిగణించబడలేదు.

**పోరాటంలో మరణించిన వీరుల వీరశిలలు :**

పోరాటంలో మరణించినవారి వీరశిలలను వారి మరణాలకు గల కారణాలనుబట్టి ఈ విధంగా వింగడించవచ్చు.

1. దొంగలతో పోరాడి మరణించిన వారు. 2. స్త్రీ మానసంరక్షణకై పోరాడి మరణించినవారు. 3. ఊరిపొలిమేరకు సంబంధించిన పోరాటంలో మరణించినవారు. 4. తమ ఊరిపై శత్రువులు దాడి చేసి కొల్లగొట్టేటప్పుడు గ్రామరక్షణకై పోరాడి మరణించినవారు. 5. క్రూరమృగాలతో పోరాడి మరణించిన వారు 6. గోగ్రహణంలో మరణించినవాళ్ళు, 7. అన్న ఋణం కోసం తమ ప్రభువుపరంగా పోరాడి మరణించిన వాళ్ళు.

వీరశిలలను నిలిపే సంప్రదాయపు మూలాన్ని అంతిమ సంస్కార విధులలో వెదకడానికి అవకాశమున్నా, ఇది వ్యాపకంగా, వైవిధ్యమయంగానూ పెరగడానికి కారణం - యోధులను యుద్ధానికి ప్రేరేపించే ఉద్దేశమే. పోరాడి చచ్చిన వీరుని స్తుతించి, వాని కీర్తి శాశ్వతంగా నిలిచేలా శాసనాలను వేయించే వారు. ఇలా యుద్ధంలో చావడం వల్లవాడు స్వర్గానికి వెళతాడు. అక్కడ అమరాంగనలతో సుఖిస్తాడు అనేనమ్మకాన్ని బలంగా విత్తారు. ఈ నమ్మకం ప్రజల హృదయంలో నాటుకొనేటట్లు చేసే అనేక సంస్కృత శ్లోకాలు వీరశిలల శాసనపాఠంలో ప్రార్థనా శ్లోకాలైనాయి.

భగవద్గీత పారమార్థిక ఆశయాలేవైనా కానీ, అది యుద్ధ ప్రవృత్తికి ప్రేరణ నిచ్చిందనడంలో సందేహం లేదు.

హతో వా ప్రాప్స్యసి స్వర్గం
జిత్వా వా భోక్ష్యసే మహీం!
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ
యుద్ధాయ కృతనిశ్చయః.

అనే శ్రీకృ  ని మాటలు,
జితేన ల  తే లక్ష్మీః
మృ  నాపి సురాంగనా
క్షణ విధ్వంసిని కాయే
కా చింతా మరణే రణే.

అనేది 'వీరశిల' ప్రార్థనా శ్లోకంగా మారాయి. అట్లే
అకీర్తించాపి భూతాని
కథయిష్యంతి తే వ్యయామ్,
సంభావితస్య చా కీర్తి
ర్మరణా దతిరిచ్యతే.

అనే గీతాశ్లోకమూ నాటి వీరుల వీరభూషణగా ఉండేది. ఈ గీతా శ్లోకం -

వరం తేజస్వినో మృత్యు
ర్నతు మానావఖణ్డనమ్,
మృతుస్తు క్షణికం దుఃఖమ్
మానభంగం దినేదినే.

అని శాసనాలలో ప్రతిధ్వనించింది.

సూర్యమండలాన్ని ఇద్దరు మాత్రం భేదిస్తారు: ఒకడు యోగ సాధకుడైన పరివ్రాజకుడు. మరియొకడు రణరంగంలో పరాక్రమం చూపిన యోధుడు.

ద్వావిమౌ పురుషౌ లోకే
సూర్యమండల భేదినౌ,
పరివ్రాడ్యోగముక్తశ్చ
రణే చాభిముఖే హతః.

అనే ఈ శ్లోకం కర్నాటకంలోని అనేక వీరశిలా శాసనాలలో లభిస్తుంది. ఇదే అర్థం వచ్చే మాటలు నన్నయ భారతంలోనూ వున్నాయి. ( సభా పర్వం 1-192).

ఈ జీవనమూల్యాన్నే నమ్మినందువల్ల ఆనాటివారు, తమ జీవనసార్థక్యాన్ని ఆ వీర మూలా న్ని సాక్షత్కరింపజేసుకోవడంలో కనుగొన్నారు. ప్రభువు వ  సైనికవృత్తిలో వున్న వాళ్ళు ఆ ప్రభువుపరంగా పోరాడడం క  పై వుండింది. దాన్నే పై నమ్మకం కారణంగా నిర్వంచనగా నడిపే వాళ్ళు, ప్రభువులూ 'వీరశిల' లు నిలపడం ద్వారా వారికీర్తిని అజరామరం చేసేవారు. మృతునికుటుంబ నష్టానికి పరిహారం ఇవ్వబడేది.

తమ వూరి గోధనాన్ని దొంగలో లేదా ఇతర రాజులో అపహరించినప్పుడుగాని, యుద్ధంలో గెలిచిన సైనికులు వూరిపై బడి స్త్రీలకు మానహాని కలిగించేటప్పుడుగానీ, వూరిని దోచుకొనేటప్పుడుగాని చూచీచూడనట్లుండడం పేడివాని లక్షణంగా భావించేవారు. వృత్తిరీత్యా సైనికులుకాని వాళ్ళూకూడా దాన్ని ప్రతిఘటించి పోరాడేవారు. అలా పోరాడి మరణించిన వాళ్ళస్మారకాలుగా వీరశిలలు నిలిపారు. తమ వూరి పంట పొలాలను నాశనంచేసే అడవిపందులనూ, పశువులను, మనుష్యులను బలితీసికొనే పులి, సింహం, ఎలుగు మొదలైన మృగాలనూ వేటాడుతూ మరణించిన వారికి ఆవూరి జనం కృతజ్ఞతా పూర్వకంగా 'వీరశిలను' నిలపడమూ కద్దు. ఇటువంటి పోరాటంలో మరణించిన మనుష్యులకేకాక, వేటలో తమకు సాయపడిన, తమను క్రూరమృగాల బారిన పడకుండా కాపాడి, ఆ మృగాన్ని చంపడానికి సహకరించి, తమ ప్రాణాలను త్యజించిన కుక్కలకు కూడా వీరశిలలను నిలిపిన నిదర్శనాలు కనిపిస్తూ ఉండడం స్వారస్యపూర్ణమైన సంగతి.

పైన చెప్పబడిన అంశాలన్నీ వీరశిలల శాసన పాఠంనుండి తెలియవచ్చేవి. వీరశిలల అధ్యయనంలో దానిపై వున్న శాసన అధ్యయనం ఎంత ముఖ్యమో, దాని శిల్ప అధ్యయనమూ అంతే ప్రాముఖ్యం కలది. దక్షిణ భారతపు మూర్తిశిల్పం అధ్యయనంలో వీరశిలల శిల్పాలకు ప్రత్యేక స్థానం వుంది. వీరశిల వీరుని పరాక్రమాన్ని తన శిల్ప శాసనాలు రెండింటి ద్వారానూ చాటుతుంది.

శిల్పం వివరాలను చూడడంద్వారా వీరుని పరాక్రమాన్ని గ్రహించవచ్చు. ఈ దృష్టిలో వీరశిల శాసన కర్తకంటే శిల్పి ప్రతిభయే గొప్పదై వుంది.

భారతీయ శిల్ప శాస్త్రగ్రంథాలలో ఇటువంటి స్మారక శిలలను నిర్మించడాన్ని గురించిన నిర్దేశనం లభించదు. కాని వీటిని చెక్కిన శిల్పులు కాలానుక్రమంగా తమదే అయిన ఒక ప్రత్యేక పద్ధతిని నిర్మించుకొని రూఢిచేసికొన్నట్లు, నిశిత అధ్యయనం ద్వారా గ్రహించవచ్చు.

వీరశిలను సమతలమైన బండరాయినుండి చేసి దానిపై ఉబ్బెత్తు శిల్పాన్ని చెక్కివుంటారు. వీరుడు వీరశిలయొక్క కుడివైపునుండి ప్రవేశిస్తూ ఉండినట్లు చెక్కబడి వుంటుంది. కొన్నిచోట్ల ప్రత్యర్థులమూర్తి చెక్కబడివుంటుంది. కొన్ని చోట్ల వుండదు. ప్రత్యర్థిగా వుండేవాడు వీరశిలయొక్క ఎడమ వైపు నుండి ప్రవేశించి యుద్ధం చేస్తూ వున్నట్లు తీర్చబడివుం టుంది. ఏ వీరశిలలోనూ వీరుడు మృతుడైనట్లు చెక్కబడివుం డదు. దీనికిమారుగా వాడు చంపిన శత్రువుల వివరాలు చెక్కబడివుంటాయి. వీరుడు యుద్ధంలో అనేక ఆయుధా లతో ఆహతుడైనట్లు సూచించడానికి, వీరుని శరీరంపై అనేకాయుధాలు నాటుకొన్నట్లు తీర్చబడివుంటాయి. వేట యొక్క వీరశిలలోనూ, క్రూరమృగమే ప్రత్యర్థిగా భావించి, ఆమృగం ఎడమవైపునుండి ప్రవేశించి వీరునిపై వురుకుతూ వున్నట్లుగా చెక్కబడి వుంటుంది. అతని వేటలో వేటకుక్కల సాయమూ వుంటే, వాటి వివరాలూ శిల్పంలో వుంటాయి. పోరాటంలో వీరుడు చావక, క్రూరమృగము, కుక్కలూ చచ్చివుంటే, శిల్పంలో వీరుని మూర్తి వుండదు, కుక్కలూ మృగాలు పోరాడుతున్నట్లు మాత్రమే చెక్క బడివుంటుంది.

మరణించిన వీరుడు స్వర్గాన్ని పొందాడని సూచించేం దుకు, వీర శిలల శిల్పులు, శిల్పాన్ని మూడు భాగాలుగా విభజిస్తారు. క్రిందిభాగం నుండి ప్రారంభించి పైపైకి వివరాలు చెక్కబడివుంటాయి. మొదటి భాగంలో వీరుడు యుద్ధం చేస్తూవున్నట్లూ, రెండవభాగంలో మరణించిన వీరుని అప్సర సలు విమానంలో తీసుకు పోతున్నట్లూ, పైభాగంలో వీరుడు స్వర్గంలో ఉన్నట్లూ శిల్పం వివరాలు వుంటాయి.

దక్షిణభారతంలో భక్తిమార్గం ప్రాచుర్యాన్ని పొందిన తరు వాత - చనిపోయిన వీరుడు స్వర్గాన్ని దాటి తన ఇష్టదైవ సన్నిధిని పొందుతాడనే నమ్మకం పెరిగింది. ఈ నమ్మకానికి అనుగుణంగా వీరశిలాశిల్ప రచనకూడా ప్రారంభమయింది. ఇక్కడ శిల్పి చేసుకొన్న చిన్నమార్పు - పైభాగంలో స్వర్గానికి బదులుగా వీరుని ఇష్టదైవం వివరాలను చెక్కడం. మరణించిన వీరుడు వీరశైవుడైతే అతడు శివలింగ సాన్నిధ్యంలో వున్నట్లూ, వైష్ణవుడైవుంటే శంఖ చక్ర పద్మాలను పూజిస్తూవున్నట్లూ తీర్చబడివుంటుంది. ఇది కడకు యుద్ధంలో మరణించిన జైనులు, జినముని సాన్నిధ్యంలోవున్నట్లు శిల్పం చెక్కేంత వరకు పోయింది. శిల్పి కళానైపుణ్యం, జీవితానుభవం, అతనికి లభించిన ప్రోత్సాహం. అతడు ఎంచుకొన్నశిల అనేవాటిని అనుసరించి, వీరశిల యొక్క శిల్ప సౌందర్యం వుంటుంది. మూర్తి శిల్పము వాస్తు శిల్పమూ కాలానుక్రమంగా మార్పును పొందుతూ వచ్చి, ఒక ప్రత్యేక శైలి నిరూపించు కొన్నట్లే, వీరశిలల శిల్పమూ మార్పును పొందింది. వివిధ కాలాలలో వివిధరాజవంశాల ఆశ్రయంలో తనకొక ప్రత్యేకవైశిష్ట్యాన్ని రూపించుకొన్నది.

యుద్ధంలో, పోరాటంలో మరణించిన వీరుని పత్నికూడా వానితోపాటు సహగమనం చేసివుండిన పక్షంలో - వీరశిల శిల్పి ఆవివరాలను చెక్కి, ఆ దంపతుల స్మారకంగా నిలపడాన్ని గమనించవచ్చు. దీనిలో వీరుడు పోరాటానికి బయలుదేరి నట్లూ, పోరాడుతూవున్నట్లూవుండి, అతని భార్య అతని వెనుక భాగంలో తనకుడిచేయి పైకెత్తి, ఎడమ చేతిలో కలశమో, లేదా అద్దమో పట్టుకొని వుంటుంది. శిల్పి ఇంకా ఎక్కువ వివరాలను చెక్కేటట్లుంటే, పోరాటపు దృశ్యాన్ని ఒకభాగంలో చెక్కి, తరువాతి భాగంలో ఆమె సహగమనం చేస్తూవున్నట్లో, లేదా పుష్పక విమానంలో దంపతులిద్దరూ వెళ్ళుతూవు న్నట్లో, స్వర్గంలో వాళ్ళిద్దరూ ఉన్నట్లో దైవపుశిల్ప అంశం ఉంటే వాళ్ళిద్దరూ దైవ సన్నిధిలో వున్నట్లో చెక్కబడివుం టుంది.

వీరశిలనూ, మహా సతిశిలనూ వేరు చేసే అంశం - ఆ శిల నిలుపడం వెనుకవున్న ఉద్దేశం. సహగమనం చేసిన స్త్రీ భర్త సహజ మరణాన్ని పొందివుంటే - అక్కడ - ఆమె యొక్క వీరోచిత త్యాగమనోధర్మానికి విలువ పెరిగి జనుల దృష్టిలో ఆమే మహాసతి అవుతుంది. ఆమె భర్త మరణం ఒక నెపం మాత్రమే. ఈ కారణం వల్లనే మహాసతీశిలలో కేవలం ఒక స్త్రీ తన కుడిచేయి పైకెత్తి, ఎడమచేతితో కలశాన్ని పట్టుకొన్న శిల్పంమాత్రం వుంటుంది. ఆమె పుట్టింటినుండి మగనింటికి వచ్చేటప్పుడు ఏవిధంగా అలంకృతురాలౌతుందో ఆదేవిధంగా శిలలో తీర్చబడివుంటుంది. కేవలం ఆమె కుడి చేతి చిత్ర మున్నా అది మహా సతిశిలయే అవుతుంది. ఇలాంటి మహాసతి శిలలు చాలాచోట్ల పూజలందుకొంటున్నాయి.

ఆత్మార్పణం చేసికొన్న వీరుల శిల్పాలు పైన చెప్ప బడిన వీరశిలల శిల్పాలకంటె సరళంగా వుంటాయి. వీటిలో వీరుడు మరణించిన విధం వివరాలుంటాయి. ఒక వ్యక్తి తన శరీర భాగాలను తానే పొడుచుకుంటున్నట్లూ, తన తలను తానే కత్తిరించుకొని పళ్ళెములో వుంచి హారతి పట్టినట్లూ వుంటుంది. ఆత్మార్పణం చేసుకొనడంలో చాలా పద్ధతులుం

డేవి. అందులో 'సిడిదలె' ఒకటి. ఆత్మార్పణం చేసు కొనే వాడు ఒక పీఠంపై కూర్చుని వుంటాడు. అతని ప్రక్క ఒక వెదురుగడను నాటి, దాన్నివంచి ఆవ్యక్తితలకు కట్టివుంటారు. వేరొకడు అతని తలను ఖండించగానే వంచబడిన వెదురుగడ నిలువై, తటాలున వాని శిరస్సును పైకెత్తుకు పోతుంది. సూర్య గ్రహణ సమయంలో ఆత్మార్పణ చేసికొన్నవారి శిల్పాలలో ఆత్మార్పణ చేసికొన్న వ్యక్తి చేతులు జోడించి నిలిచినట్లూ, అతని ప్రక్కలో అద్దమూ, కలశమూ వున్నట్లూ చెక్కబడివుం టుంది. ఇక వీర శైవుల వీరమాహేశ్వరాచారం ప్రకారం మరణిం చిన వారి శిల్పాలు చాలా సరళంగా వుంటాయి. కుడి చేతితో తన ఇష్ట లింగాన్ని పట్టుకొని, ఎడమ చేతితో తన్నుతానే పొడుచుకుంటున్నట్లు వుంటుంది. కుడి చేతిలో వున్న అతని ఇష్టలింగమే అతడు వీరమాహేశ్వరుడని సూచిస్తుంది. - ఈ వివరాలు దక్షిణ భారతపు వీరశిలలన్నింటిలోనూ కానవచ్చే సామాన్య అంశాలు మాత్రమే.

వీర శిలలను చేసిన శిల్పియొక్క జీవితానుభవం, కల్పనాశక్తి సృజనాత్మకత, అనే వాటిని అనుసరించి వీరశిలల శిల్పం వుంటుంది. వీరశిలల శిల్పంద్వారా ప్రాచీనకాలంనాటి, కట్టు, బొట్టు, అలంకారాలు, ఆయుధాలు, యుద్ధసామగ్రులు, యుద్ధోపయుజ్యాలైన ఏనుగు, గుర్రం, ఒంటె మొదలైనవాటి వస్త్రాలూ, యుద్ధ వాద్యాలూ, వీరుల కేశాలంకారం మొదలైన పలు అంశాలను గ్రహించవచ్చు. వీటిని గుర్తించి విశ్లేషించడం ద్వారా మనవారి సామాజిక ఇతిహాసాన్ని తెలుసుకొనే అవకాశం వుంది.

ఇతిహాసమంటే కేవలం రాజమహారాజుల తేదీవారి దినచర్య కాదు. ఎవరి కారణంగా కొందరు మహారాజులైనారో వాళ్ళ ఇతిహాసమే నిజమైన ఇతిహాసం. సామాన్య జనుల జీవనాన్ని తమ శాసనపాఠం మరియు శిల్పాల ద్వారా వ్యక్తం చేసే వీరశిలలు, ఈ దృష్ట్యా బహుప్రముఖమైన దాఖలాలు అవుతాయి. మనవారు తాము నమ్మిన జీవన మూల్యాలకు (బతుకు విలువలకు), తమ బ్రతుకునే పణంగా పెట్టి, జీవితాన్ని ఎలా సాక్షాత్కరించుకొ న్నారు, నిర్వంచనతో ఆవిలువలను ఎలా వుద్ధరించారు - అనేదాన్ని మిక్కిలి ప్రభావకారిగా చిత్రిస్తాయి ఇవి. వీటిని ఇతిహాసకారుడు ఆకాలపు చట్రంలో పరిశీలించి తన ఆరోగ్యకర మైన ప్రతిక్రియను ప్రకటించినప్పుడు, ఆ అంశాలే మన వెను కటి జీవనానికి విమర్శగానూ, భవిష్యత్తుకు దారిదీపంగాను అవుతాయి. ఇతిహాసం విమర్శకాక పోతే - ఇతిహాసం ద్వారా మనం నేర్చుకొనేదేమీ లేకపోతే - దానికి విలువ ఇంకెక్కడిది?



పడువ-వీరులు



వీర-మాస్తిశిల. శైవధర్మం

# భారతీయ శిల్పకళాసంపద: వాటి రక్షణ, పునరుద్ధరణ

శ్రీ నేమాని కృష్ణమూర్తి

ఈ విశ్వ సృష్టిలో మానవ జీవితంలో స్పష్టంగా కనిపించే శాశ్వత ఉత్తమరూపం సంస్కృతి. సంస్కృతికి ఉత్తమరూపం కళలు. ఆ కళలలో ఒక ప్రధానమైన కళ శిల్పం.

ప్రాచ్య, పాశ్చాత్య దేశములన్నిటిలోకి మన దేశం ఈ శిల్పకళలో ముఖ్యంగా అలంకరణశిల్పంలో అతివిశిష్టమైన స్థానంగడించి ప్రపంచఖ్యాతి నొందింది. శిలల్లో, పాషాణాలలో అనేక పురాణగాథలు, ఇతిహాసములు, చరిత్ర తలదాచుకొన్న విషయం మనందరికి తెలుసు. ఉత్తర భారతంలోను, దక్షిణ భారతంలోను అనేక దేవాలయాలు, బౌద్ధ స్థూపాలు ఈనాడు శిధిలావస్థలో పడ్డాయి. ఈనాడు వాతావరణ కాలుష్యం ఎంత గానో మన శిల్పసంపదకు అనివార్యమైన వినాశనమునకు దోహదకారులయ్యాయి. సాక్షాత్తు పోతపోసిన లోహపువిగ్ర హాల్లా అతి సన్నని నగిషీలతో అసాధారణమైన కల్పనలతో, జీవకళతో సాక్షాత్కరించే ఈ మహాసంస్కృతిని, ఈ మనజాతి వారసత్వాన్ని మనం ఏపాటి కాపాడుకుంటున్నాం అనేది చాలా తర్కించుకోవలసిన విషయం.

కాలం విధ్వంసకారి. అంతకంటె మానవుడు విధ్వంసకారి ఈ మానవ విధ్వంసానికి మనదేశం అతిగా దెబ్బతింది. హిందూ, బౌద్ధమత విభేదాలు, దండయాత్రలు ఇవన్నీ శిల్పశి థిలాలకి తోడ్పడ్డాయి. తత్ఫలితంగా అనేక బౌద్ధ స్థూపాల పైన, హిందూ దేవాలయాలపై మసీదులు నిర్మింపబడ్డాయి. ఎంతశిల్పసంపదలు ఈ మారణహోమంలో భూస్థాపితం అయ్యాయో, భూమాత గర్భంలో ఇతిహాసపు చీకటికోణంలో అనామకమైపోయాయో అనిర్వచనీయం. ఇలాగ కోల్పోయిన మహా శిల్ప సంపదకి తోడుగా ఇంకాదీన్ని కోల్పోవలసిందేనా అని ఆలోచించే తరుణం ఇది. ఈ పని అంత సులభ సాధ్యం కాదు. చాలాకాలం తరువాత ఇప్పుడిప్పుడే ఒక సుస్పష్ట విధానం రూపొందుతోంది. కేంద్రప్రభుత్వ సంరక్షణలో ఉన్న కట్టడాలే మూడు వేలుకు పైబడి ఉన్నాయి. ఇంకా రాష్ట్రాలలో ఆయా ప్రభుత్వాల సంరక్షణలో అనేక వందలు ఉన్నాయి. సురక్షిత నిర్మాణాల జాబితాలో లేనివి ఇంకెన్నో.

మొదట్లో పల్లవులదేవాలయాలు భారతదేశంలో తొలి నిర్మాణములుగా అభిప్రాయపడినా నాగార్జున కొండలోని త్రవ్వకాల ఫలితంగా దేవాలయనిర్మాణం మొదటి సారిగా ఇక్ష్వాకుల కాలంలో ప్రారంభమైనట్లు రుజువైంది. అశోకుని మరణానంతరం, బౌద్ధం సన్నగిలి, శైవ, వైష్ణవ దేవాలయాలు విలసిల్లాయి. తరువాత చాళుక్యులు కాకతీయ రాజు గణపతి దేవుడు, పల్లవులు, రాష్ట్రకూటులు, గుప్తులు, చాందేలు రాజవంశీయులు ఈ దేవాలయ నిర్మాణానికి పట్టుకొమ్మలు. ఫలితంగా మహాబలిపురం, కాంచీపురం, నాగార్జున, అమరావతి, అజంతా, ఎల్లోరా, ఎలిఫెంటా, కోణార్క, ఖజురాహో మొదలగు దేవాలయాలు వెలిసాయి.

ఇట్టి మహోత్కృష్టమైన సంపదని సంరక్షించుకునేవి రెండు మార్గాలు. కాలగతిలో జరిగే విధ్వంసం అరికట్టడం ఒకటి. దీనికి రసాయన శాస్త్రవేత్తలను, పారిసరిక విజ్ఞాన నిపుణులను, ఇంజనీర్లను, ఆర్కియాలజిష్టులను అనేమందిని నియమించి తగుచర్యలు తీసుకోవాలి. ఇందుకుగాను ఢిల్లీలో ఒక జాతీయ పరిశోధన శాల ఉంది. ఇంకా మధ్యప్రదేశ్, బరోడా, మద్రాసు, హైద్రాబాదు, ఔరంగాబాద్ మొదలగు ప్రదేశములలో రసాయన పరిశోధన శాలలు నిర్మింపబడ్డాయి. ఇంక రెండవ సంరక్షణవిధానం కళాఖండాలను నాశనం చేసే వారినుండి, చోరీ వస్తువులను కొనేవారినుంచి, స్మగ్లర్ల బారినుండి సంరక్షించే కృషి. 1904 లో లార్డు కర్జన్ ప్రాచీన కట్టడముల సంరక్షణ శాసనంచేసి నాందిపలికి కొంతమేలు చేకూర్చారు. ఇటీవల పురావస్తువులకు, కళాఖండములకు సంబంధించి చేసిన శాసనముల వల్ల కొంత ప్రయోజనం చేకూరింది.

శిల్పకళాఖండముల పరిరక్షణ చిత్ర కళాఖండముల పరిరక్షణంత జటిలం కాదు. చిత్రములకు వాడేపదార్థములన్నీ కాలానుగతంగా రసాయన పరిణామంచెంది శిధిలమైపోతాయి. కానైతే సృష్టిలోనే వెలసి ఆచంద్రార్కం సృష్టిలోని భాగంగా ఉండే శిలతో చేసిన శిల్పానికి శిధిలత స్వల్పం. కాలానుగతంగా రాతిలో వచ్చే రసాయనమార్పుకి వేలసంవత్సరాలు

పడుతుంది. ఇనుము, ఇత్తడి, రాగి, కంచు మొదలగు లోహ ములు కూడ, ఎండ, వాన, వేడిమికి రసాయన మార్పుపొంది వాటి తొలిప్రకృతిసిద్ధమైన ఖనిజరూపము దాలుస్తాయి. కాని, రాయికి ఆ భయం లేదు. అలాంటి వస్తువును శిల్ప పదార్థంగా మనదేశీయులు ఎంచుకోవడం ప్రశంసనీయము. అందుచేత చాలా దేవాలయములు శిథిలత చెందడం, శిల్పపదార్థం పాడవ డంకన్న, దేవాలయనిర్మాణంలోను, శిల్పంలోని పేర్పులేక అమరికలో వచ్చిన బలహీనతవల్ల శిల్పం విడిపోయి కింద పడడం లేదా మానవమూర్ఖతవలన బ్రద్దలుకొట్టడంవల్ల జరు గుతుంది. అందువలన దేవాలయనిర్మాణశాస్త్ర అవగాహన దాని పరిరక్షణకు చాలా ముఖ్యం.

వాస్తు మథనామృతం, గృహవాస్తు రత్నావళి, శిల్పమథానా మృతము అను శిల్పశాస్త్రములు భారతీయ శిల్పకళను గురించి వివరంగా చెప్పాయి. విశ్వకర్మ ప్రకాశ, కాశ్యప శిల్పంలో దేవాలయశిల్పపు ఇంజనీరింగు విషయాలు కూలంక షంగా ప్రస్తావింపబడ్డాయి. ఈ శిల్పపరిభాషలో వాజము, వజ్రపట్టము, కోష్టమ పంజరము, శఖరము, అనేక బంధములు స్తంభ, శిఖర లక్షణములు ప్రాసాద విషయములు చర్చించబ డ్డాయి. పండితులు, విజ్ఞానవేత్తలు, ఇంజనీర్లు వీటిని తర్కించి ఏ బలహీనత ఎక్కడవచ్చునో ఊహించి తదనుసారముగా పునరుద్ధరణ చేయవచ్చు.

ఇక ఏ శిల్పానికి ఏ రాతిని వాడేరు అనేది ముఖ్యాంశము. నల్లరాయి అగ్నిశిలకు చెంది, గట్టిగా ఉండి కోసివేతను నిరోధి స్తుంది. సెడిమెంటరీ శిలలో ఇసుక, మన్ను, గులకరాయి ఉండి, మెత్తదనం గల్గి ఉంటుంది. ఈ రాయితో శిల్పం వేగిరం శిథిలత చెందుతుంది. పలకరాయి, చలువరాయి రూపాంతర శిలలకు చెందినవి. శిల్పానికి వలయు శిల గట్టిగా (దగ్గరి అణుసముదాయం గల్గి), పెళుసుదనం లేకుండా, పొరలు లేకుండా తెగే స్వభావం గల్గిఉండాలి. ఈ గుణములు, దొరకే రాయి ఒకదానికొకటి విరుద్ధములు, కనక శి ౧ంకి శిలాని ర్ణయం పెద్ద సమస్య, పెద్దకళ. అసలు విగ్రహ ౹భావంబట్టి కూడా శిలని నిర్ణయిస్తారు. స్థానిక వనరునిబ నల్లరాతినే హెచ్చుగా వాడడం జరిగింది. ఇట్టి రాతిని మలచడానికి అతి సూక్ష్మమైన అనేకరకముల ఇనుప పనిముట్లు, వజ్రపుకొనలతో చేయబడిన పనిముట్లు కూడా వాడబడినవి. మెత్తని పదార్థము లతో పోతపోయు విధానం సులువు, కాని రాయి, లోహం, చలువరాయి, కర్ర వీటిని చెక్కి విగ్రహం చేయడం అతిక్లిష్టమైన కళ. దీనికి అతి నిశితమైన సులువు, అంచనా, జాగ్రత్త, సంకల్పసిద్ధి ఉండాలి. శిలనుండి పదార్థం తీయటమేకాని కలిపే అవకాశం ఉండదు. అదే శిలాచూర్ణాన్ని కొన్ని జిగురులతో కలిపి అతికే పదార్థంగా వాడి ఉండాలి. ఇలాంటి అతుకులు కాలాను గతంగా పోవడం సాధారణం. ఒకరకం శిల్పం ఒక తెగ శిల్పులసొత్తు. అందుకే దేవాలయ శిల్పబాణీలు ఒకటిగా గోచరిస్తాయి.

ఇక శిల రసాయనికంగా ఏ విధంగా శిథిలత చెందగలదో ఆలోచిద్దాం. వాన వల్ల శిల్పంపై పేర్కొన్న ధూళి, పొగ, లవణములు అన్నీ కడగబడతాయి. సముద్రతీరాన కట్టిన కోణార్క, మహాబలిపురం, పూరివంటి దేవాలయములపై గాలి లోని తేమ, సముద్రలవణాలు పేర్కొని శిలయందుగల ఇతర మూలకములతో విద్యుత్ ఘటములుగా అమరి మెల్లగా శిలను తినివేసే అవకాశం ఉంది. ఇదిగాక ఆమ్లములు గాను, క్షారము లుగా మారి శిలతో రసాయన క్రియనొంది శిలాక్షయము సంభవిస్తుంది. ప్రస్తుత వాతావరణ కాలుష్యాలతో సల్ఫర్ డైఆక్స యిడు, సల్ఫరుట్రైఆక్సయిడు, నైట్రొజన్ ఆక్సయిడులు కర్బన రసాయనముల ఆవిరి, ధూళి పొగ తదితర రసాయన ములు శిల్పములపై పేర్కొనుట అతిప్రమాదకరం.

ఇక పరిశ్రమల నుండి వచ్చు ఆమ్లవాయువులు, శిలలతో అతి వేగము రసాయన చర్యనొంది శిథిలతకు దారితీస్తాయి. ఇవికాక దేవాలయములపై మొలచు మొక్కలు, పిట్టల గూళ్లు కూడా శిథిల కారణములు.

అట్టి తరుణంలో మనం ఏం చేస్తున్నది మనవి చేస్తాను. అసలు ఈ విధమైన పరిరక్షణ ప్రక్రియను తొలిసారిగా చేపట్టిన వారు ఇటలీ దేశస్థులు. ఈ విజ్ఞానములో ఇప్పటికీ వారు సిద్ధహస్తులు. మన దేశంలో కూడ ఇటీవల జాగరూకత, కృషి చాల పెరిగిందనే చెప్పాలి. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములు పురావ స్తుశాఖవారు బహుముఖ జాగ్రత్తలు వహిస్తున్నారు. ఉదాహర ణకు తాజమహలుని వాతావరణ కాలుష్యం నుండి రక్షించడానికి రసాయన పూత మందును తయారు చేశారు. అట్టి భవన ప్రాంగణంలోని స్తంభ పంక్తిని పునరుద్ధరించారు. కుతుబ్ మీ నారు, రాజస్థాన్, చిత్తూరులలో ప్రసిద్ధ గోపురాలను మర మ్మత్తు చేయించారు. ఒరిస్సాలో కోణార్క. భువనేశ్వర దేవాల యాన్ని శుభ్రపర్చి రాళ్లలోని నాచు మొక్కలు, అపాయకర లవణాలను తొలగించి బాగుచేశారు.

మహాబలిపురంలో సముద్ర తీరంలో ఒక గోడ నిర్మించి జీడిచెట్లను పెంచి దేవాలయ శిల్పానికి సముద్రం యొక్క తేమనుండి రక్షణ ఇచ్చారు. పూరి దేవాలయానికి సున్నం పూతనిచ్చి కొంత రక్షణ కలుగజేశారు. ప్రపంచఖ్యాతిని చెందిన అజంతా కుడ్యచిత్రాలు, ఎల్లోరా, ఎలిఫెంటా గుహల పరిరక్షణ చాలా జరిగింది. ఇట్టి జాగ్రత్తలు తీసుకున్నా మనం మేల్కొనేట ప్పటికే శిలాక్షయం, విధ్వంసం జరిగిపోయాయి. ఎంత శ్రద్ధవ హించినా మరామత్తు చేయగల స్థితి కొన్ని సందర్భములలో

చేయిజారిపోయింది. అసలు లేనిదానికన్నా ఆలస్యం అయినా ప్రయత్నం జరగడం చాలా సమంజసం. ఈ రోజుల్లో ఒక క్రొత్త దేవాలయం నిర్మాణానికి వెచ్చించే కన్న, ఉన్న అపురూప దేవాలయ సంపదపై శ్రద్ధవహించడం, పరిరక్షించుకోవడం చాలా వివేకం. అప్పటి కళానైపుణ్యం, వైశిష్ట్యం ఇప్పుడు లేదనే చెప్పాలి. ఈ విషయంలో మనం మన పూర్వీకులకు ఏ మాత్రం సాటిగాము.

నిశితంగా చూస్తే మనకు దేవాలయ శిల్పంలో కానవచ్చేవి రాతిశిల్పం, పాలరాయి, కంచు, రాగి, ఇత్తడి, వెండి, బంగారం మొదలైన శిలా మూర్తులు. వీని పరిరక్షణలో మనం అనుసరించదగిన జాగ్రత్త లేవంటే -

1. దేవాలయ నిర్మాణమందుగల పటుత్వమును ఇంజనీర్లతో సంప్రదించి ప్రస్తుత పద్ధతులను ఉపయోగించి, శాశ్వత ప్రాతిపదికపై దేవాలయ మందు చేర్పులు, మార్పులకు వెనకదీయక, దేవాలయ రక్షణ ముఖ్యాంశముగా దలచి రక్షణ ఇవ్వాలి.

2. పోయిన శిలాభాగములను మరల దరిదాపు ఆ జాతిరాయితోనే చెక్కించి అతకడం తప్ప సిమెంటుతో కలపడం వలన సహజత్వం దెబ్బతింటుంది. ఈ విషయంలో ఆర్థిక ప్రలోభం పడరాదు.

3. దేవాలయం సహజంగా వానలవలన కడగబడినా మంచినీటితో కడుగుట ఎంతవరకు ఉపయోగకరం అనేది ఆలోచించాలి.

4. రసాయనపు పూతలు వాడడం మంచిది. ఇందుకుగాను తైలద్రవ్యములు, లిన్ సీడ్ నూనె, anthroceno, creasdo, నూనెల పూత, 0.6శాతం మెర్క్యురిక్ క్లోరైడు, 5 శాతం జింకు క్లోరైడు, జింకు మెటాఆర్సినైటు మొదలగు రసాయవముల వాడుక ఇటు రాతి శిల్పానికి అటు దారు శిల్పానికి కూడా రక్షణ ఇస్తాయి. లోహమూర్తులకు ఆక్సయిడ్ పూత ఆసిడ్ (ట్రీట్‌మెంట్ మొదలగునవి ఇచ్చి) రక్షణ కలిగించవచ్చు.

5. ధూప, దీప, నైవేద్యముల వల్ల వచ్చు పొగ, ఆవిరులు పోవుటకు ఎగ్జాస్టర్స్ అమర్చాలి.

6. దేవాలయ నిర్మాణంలోని శిల్పప్రతిమలను విడిపోకుండా లోహపు ఊచలతో కలిపి బలపర్చాలి.

7. అన్నిటికన్నా ముఖ్యమైనది, దేవాలయ శిల్పం అన్ని నమూనాలను కోవిదులైన శిల్పులచే అచ్చులు తీయించి వాటిని పేపరు పల్ప్, కంచు, ప్లాస్టర్ ఆఫ్ పారిస్ మొదలగు వాటితో విగ్రహములు చేసి సామాన్య ప్రజానీకమునకు అందుబాటులోకి తీసుకురావాలి.

8. దేవాలయ నిర్మాణమందుగల విశేషములు, ప్లానులు తదితరములు అన్నీ ఫొటోలు తీయించి చిత్రములతో దేవాలయ శిల్పసంపదను పుస్తకరూపంలోకి మార్చి పదిలపర్చ వలసి ఉన్నది.

శిష్య స్సదుత్తర విధేః ర్గురు రివ సత్ప్రశ్నత స్సుశిష్యస్య!
శుశ్రూషయేవ విద్యా తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

సరైన సమాధానంవల్ల శిష్యునిలాగ, శిష్యుడు సరైన ప్రశ్నలు వేయడంవల్ల గురువులాగ, గురుశుశ్రూషవల్ల విద్యలాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి

# ఆంధ్రుల నృత్యకళ

శ్రీ పప్పు వేణుగోపాలరావు

**ఆంగికం భువనం యస్య వాచికం సర్వ వాఙ్మయమ్,**
**ఆహార్యం చంద్ర తారాది తం వందే సాత్త్వికం శివమ్,**

ఆదిమానవుని తొలి కేక సంగీతము; భాష తెలియని ఆనాటి మానవుని సంజ్ఞలు నృత్యమునకు బీజప్రాయములని నా అభిప్రాయము. భారతీయ సంస్కృతి ఒక సజీవ స్రోతస్విని. రెండువేల సంవత్సరములకు పూర్వము నృత్యమును, సంగీతమును గురించి శాస్త్రీయముగా వివరించిన తొలి గ్రంథము భరతుని నాట్యశాస్త్రము. భరతుడు తన గ్రంథమున ''ఆంధ్రీ'' అను పదము భాషాపరముగా ఉపయోగించినాడు. ఆ నాటికే ఆంధ్రులకు ఒక భాష, ఒక నాట్య శైలి ప్రత్యేకముగా కలవనుటకు ఇంకను అనేక తార్కాణము లున్నవి. 'దాక్షిణాత్యులు బహు నృత్య - గీతప్రియులు' అని భరతుడు తన నాట్యశాస్త్రమున పేర్కొనినాడు.

అనాదిగా రెండు విచ్ఛిన్న నాట్య స్రవంతులు ఆంధ్రజాతి సంస్కృతిని సుసంపన్నము గావించినవి. అందొకటి దేవదాసీ నృత్యము. రెండవది రాజనర్తకుల నృత్యము. దేవదాసీలు ఆలయములలో నాట్యమాడుదురు. రాజనర్తకులు ఆస్థానము లలో నాట్యమాడుదురు. వారు ఇచట గాని, వీరచటగాని నాట్యమాడు సంప్రదాయము లేదు. వీరి నాట్య పద్ధతులలో శాస్త్రీయముగా భేదమేమంతగా నున్నట్లు తెలియరాదు. ఒకటి భక్తి ప్రధానమైన నాట్యము, ఇంకొకటి శృంగారపరమైన నాట్యము. కాని కాలక్రమమున రాజుల భోగలాలసతకు లోనై ఇవి రెండును వాటి పవిత్రతను కోల్పోయినవి. అట్టి సమయమున ఇది కేవలము బ్రాహ్మణులకును, పురుషులకును మాత్రమే పరిమితము చేసి ఒక సంప్రదాయ నృత్యమునకు జీవము పోసినాడు సిద్ధేంద్ర యోగి.

కొందరు పండితు లనుకొనుచున్నట్లు కూచిపూడి నాట్యము సిద్ధేంద్రునితోనే మొదలుకాలేదు. ఆయన దీనిని పునరుజ్జీవింప చేసిన మహనీయుడు మాత్రమే. సిద్ధేంద్రయోగి 16వ లేక 17వ శతాబ్దులకు చెందినవాడు. కూచిపూడి భాగవతుల గురించి మనకు లభ్యమగుచున్న మొదటి చారిత్రక ఆధారము 1502 నాటి మాచుపల్లి కైఫీయతు. అదియును కాక ఈ కైఫీయతును బట్టి విజయనగర ప్రభువగు వీరనరసింహరాయల యెదుట సిద్ధవటమును పాలించుచున్న సమ్మెట గురవ రాజు చేయుచున్న దారుణ కృత్యములను భాగవతులు నాట్య రూపమున ప్రదర్శించిరని తెలియుచున్నది. అట్లయిన ఇది యొక సాంఘిక ప్రయోజనము సాధించుటకు రూపకల్పన చేసిన రూపకము. ఒక నృత్యరూపకము రూపొందుటకు, అదియును సర్వమును ముక్తి మార్గములే అనుకొను ఆనాటి పరిస్థితులలో, చాలా పరిణామము అవసరము. అందువలనను, ఇంకను ఈ వ్యాసపరిమితిని అధిగమించరాని కొన్ని కారణముల వల్లను 'కూచిపూడి' సిద్ధేంద్రుని కంటె ప్రాచీన మని నొక్కి-వక్కాణించుచున్నాను.

విజయనగర సామ్రాజ్యము క్షీణించిన తరువాత ఆంధ్ర సంస్కృతి తమిళనాడు నడిబొడ్డునకు తరలిపోవలసి వచ్చినది. అట్టి పరిస్థితులలో కొందరు కూచిపూడి భాగవతులు మెలట్టూరు (తంజావూరు ప్రాంతము) నకు వలస పోయిరి. వారిదే మెలట్టూరు భాగవత మేళ. వీరందరికిని సిద్ధేంద్రుని వలన ఏర్పడిన మధురభక్తి తత్త్వము వలన భగవదారాధనము వలన, భాగవతులని పేరు ఏర్పడినది.

మధ్యయుగములలో భరత నాట్య శాస్త్రము ఆంధ్ర దేశమున ప్రాచుర్యము వహించినదని, కాకతీయుల, రెడ్డి రాజుల పరిపాలనా కాలమున భరత శాస్త్రము తెలిసిన పండితు లనేకు లుండెడి వారని, కూచిపూడి భాగవతులు భరతశాస్త్ర సంప్రదాయమును నిలువ బెట్టిన వారని పలువురు పండితులు అభిప్రాయ పడుచున్నారు.

'గీతం వాద్యం చ నృత్యం చ త్రయం సంగీత ముచ్యతే' అని శాస్త్రకారులు చెప్పియున్నారు. తెలుగునాట గీతము, వాద్యము, నృత్యము సమృద్ధిగా పెంపొందినవి. కాకతీయ గణపతి దేవుని సైన్యాధిపతియు, గజదళాధిపతియు నైన జాయపసేనాని 1253 ప్రాంతములో నృత్త రత్నావళిని రచించెను. ఈతడే సంగీతమును గూర్చి 'గీతరత్నావళి'యు రచించె నందురు. కాని అది అలభ్యము. జాయప సేనాని విరచించిన నృత్త రత్నావళిలో రెండు ముఖ్యమైన భాగములు ఉన్నవి. అందొకటి మార్గ నృత్తము. రెండవది దేశి నృత్తము. పేరణి, చర్చరి, దండరాసక, ఘటసరి బహురూపము, చిందు,

కోలాటము మొదలగు తెలుగు దేశ నృత్యరీతు లెన్నియో ఇందు సమగ్రముగా వర్ణింపబడినవి.

నృత్తరత్నావళి నాగరలిపిలో నున్న యొక వ్రాతప్రతి బెంగాల్ లో లభించినది. ఇది తెలుగు వారి నృత్యజ్ఞానమునకు పతాక!

ఆంధ్రదేశమున రామప్పగుడి క్రీ.శ. 1213 ప్రాంతములలో నిర్మించబడినది. ఇందలి శిల్ప ఖండము లన్నియు నృత్య భంగిమలే. తెలుగువారి నాట్యజ్ఞాన పరాకాష్ఠకు ఇది నికషోపల మైన స్థలము. జాయపసేనాని కూడ ఈ ఆలయ శిల్పముల నుండి ఉత్తేజితుడై నృత్తరత్నావళి వ్రాసి యుండును.

తెలుగుదేశమున బ్రాహ్మణులు, పురుషులు నాట్యా చార్యులై యుండుట ఇంకను ఆశ్చర్యకరమైన విషయము. ఇది కేవలము కూచిపూడి వలననో సిద్ధేంద్రుని వలననో ఏర్పడినది కాదు. భారతదేశమున ఏవంక జూచినను ఏరీతి శాస్త్రీయ నృత్యమును చూచినను నాట్యాచార్యు లెప్పుడును పురుషులే! నట్టువరాండ్రు స్త్రీలు. ఆంధ్రదేశమున కేవలము బ్రాహ్మణులే ఈ కళను పోషించిరి. నాట్యము పంచమ వేదమని నమ్మి సంస్కృత భాషాజ్ఞానము కలవారైన పండితులే నాట్యము నాదరించి, ప్రోత్సహించి ఆచార్యత్వమును గఱపిరి.

తెలుగునాట దేవాలయములలో మేలుకొలుపు మొదలు కొని నిద్రబుచ్చుట వరకు దేవదాసీ నృత్యము లనేకము లున్నవి. స్వాతంత్ర్యానంతరము ఈ పద్ధతి నిషేధింపబడు వరకు ఈ కళలను నిలువబెట్టిన కీర్తి దేవదాసీలకే చెందును. సంగీతము తెలిసి, సాహిత్యమెఱిగి, సంస్కృతమున ప్రవీణలై దేవదాసీలుగా జీవితమును గడపిన సాధ్వీ మతల్లులెందరో గలరు. కొన్ని బ్రాహ్మణ కుటుంబములలోని బాలికలనే వారు దేవుని కర్పించి దేవదాసీలుగా మలచిన సంఘటన లెన్నియో కలవు.

వీరు కాక రాజాస్థానమునను విదుషీమణులైన నర్తకీ మణు లెందరో ఉండి రనుటకు చారిత్రకాధారములున్నవి. శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానమున రంజకం కుప్పాయి అను రాజనర్తకి యుండెడిది. వసంతరాయ బిరుదాంకితుడైన కుమార గిరిరెడ్డి ఆస్థానమున లకుమాదేవి రాజనర్తకిగా యుండెడిది. లకుమా వసంతరాయల ప్రేమ చెరుగని చారిత్రక సత్యము! కుమారగిరి రెడ్డి 'వసంత రాజీయము' అను నాట్యశాస్త్రమును రచించిన నాట్య విద్యాపారంగతుడు.

కూచిపూడి గ్రామమునందు తదితర ప్రదేశములందును అనేక ఆలయములపై నాట్య భంగిమలు శిల్పములో జీవము పోసుకొన్నవి. అమరావతి, సింహాచలము, రామప్పగుడి మొద లగునవి తెలుగువారి నృత్యకళకు శిల్పమున కనిపించెడి ప్రతిబిం బములు. నాట్యమండపములు లేని దేవాలయములే అరుదు.

తెలుగు సాహిత్యమున నృత్యములకు సంబంధించిన వర్ణన లనేకములు గలవు. పాల్కురికి సోమనాథుడు, శ్రీనాథుడు, కొఱవి గోపరాజు, శ్రీకృష్ణదేవరాయలు మొదలగు వారు వారి కావ్యములలో నృత్యములను వర్ణించిరి.

నాట్యశాస్త్రము తరువాత ప్రసిద్ధిపొందిన గ్రంథము 'అభి నయ దర్పణము'. దీనిని రచించిన నందికేశ్వరుడు తెలుగు వాడని కొందరు పండితుల అభిప్రాయము. జాయపసేనాని 'నృత్తరత్నావళి' గురించి ఇంతకు ముందే చర్చించియు న్నాను. సింగపాలుని 'రసార్ణవ సుధాకరము', కుమారగిరి రెడ్డి 'వసంత రాజీయము' పెదకోమటి వేమారెడ్డి 'సంగీత చింతా మణి', భండారు లక్ష్మీనారాయణ రచించిన 'సంగీత సూర్యోద యము', చెరుకూరి లక్ష్మీధరుని 'భరత శాస్త్రము, రఘునాథ భూపాలుని 'సంగీత సుధ', పోలూరి గోవిందకవి వ్రాసిన 'తాల దశప్రాణదీపిక' 'రాగతాళ చింతామణి' లింగము గుంట మాతృ భూతయ్య వ్రాసిన తెలుగు పద్యములలో 'అభినయ దర్ప ణము' కంఠీరవ రాజు 'నాట్యవిద్యా విలాసము', ఇంకను వెలికిరాని అనేక గ్రంథములు తెలుగువారి సంగీత నృత్య శాస్త్రజ్ఞతను చాటి చెప్పుచున్నవి.

ఇటీవలి కాలమున వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి గారు, తాడేపల్లి పేరయ్య, చింతా కృష్ణమూర్తి, వెంపటి చినసత్యం మొదలైన వారెందరో కూచిపూడిని పరిష్కరించి రూపకల్పన చేసినారు. ఒక నాడు స్త్రీలకు నిషేధింపబడిన కూచిపూడిలో ఈనాడు పురష పాత్రలు కూడ స్త్రీలే ధరించునంతటి అవకాశ మేర్పడుటకు వీరందరు కారణభూతులు. అట్లే కేవలము నృత్య నాటకములకే పరిమితమైన కూచిపూడిలో ఏకపాత్ర నర్తకులకు కూడ అవకాశమేర్పరచబడినది. తెలుగు సంస్కృతి నిలుచునంతదాక తెలుగుజాతి సంగీత నృత్య పతాకము దశ దిశల కాంతు లీనుచునే యుండుననుటలో సందియము లేదు.

జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి యేషాం యశః కాయే జరామరణజం భయమ్.

# కూచిపూడి - నాడు, నేడు

శ్రీ వెంపటి చిన్నసత్యం

ఏ దేశపు సంస్కృతి అయినా ఆదేశం నిర్మించుకొన్న కళల అభివృద్ధిమీద చాలవరకు ఆధారపడి ఉంటుంది. కవిత్వం, సంగీతం, చిత్రలేఖనం, విగ్రహ శిల్పం అనే నాలుగు లలితకళలకు సమాహారరూపమైన సమ్మోహకళ నాట్యం. దీనికి లక్షణ గ్రంథం రచించిన వాడు భరత మహర్షి. అతని 'నాట్యశాస్త్రం' అనే నాట్య లక్షణ సర్వస్వానికి విపులమైన వ్యాఖ్యానం రచించినవాడు అభినవగుప్తుడు. భరతుని నాట్య శాస్త్రాన్ని ఆధారం చేసికొని భారతదేశంలో అనేక ప్రాంతాల్లో అనేక శాస్త్రీయ నాట్య శైలులు ఆవిర్భవించాయి. వాటిలో కూచిపూడి నాట్యశైలి ఒకటి. భరతుని నాట్య శాస్త్రానికి, కూచిపూడి నాట్యశైలికి ఎంతో సన్నిహితమైన సంబంధం ఉంది. నాట్య శాస్త్రం ప్రధానంగా రూపక లక్షణాన్ని చెప్తుంది. కూచిపూడి నా ం కూడ రూపక ప్రయోగానికి చాల అనువైన అభినయశైలి. అ ౧ భారతీయ నాట్యశైలుల వలెనే కూచిపూడి కూడ మధుర భ తత్త్వాన్ని ప్రపంచిస్తూ తద్ద్వారా మోక్షసాధ నకు దారితీస్తుం .

భరతుడు నాట్య శాస్త్రంలో పేర్కొన్న పాద విన్యాసా లన్నీ కూచిపూడి ప్రయోగంలో ఈ నాటికీ కనబడతాయి. శాస్త్రంలో ఉన్న కొన్ని పేర్లు ఇప్పటి నాట్యా చార్యులకు కొంత మందికి తెలియక పోవచ్చు. సమపాదం, స్థితావర్తం, శకటాస్యం, అధ్యర్థకం, పదకాక్రీడితం, ఉద్వృత్తం, విచ్యవం, జనితం, ఊరూద్వృత్తం, స్యందితం, అపస్యందితం, మత్తల్లి వంటి పేర్లుగల పాదవిన్యాసాలు ఇప్పటికీ కూచిపూడి నాట్యా చార్యులు శిష్య గణానికి నేర్పుతూనే ఉన్నారు. వీటికి భౌమీ చారులని పేరు. ఇవిగాక విద్యుద్భ్రాంతం, నూపరపాదిక, లాంటి ఆకాశికీ చారులైన పాదవిన్యాసాలను ప్రాథమిక శిక్షణ లోనే కూచిపూడి వారు నేర్పుతున్నారు.

కూచిపూడి నాట్యం అనే పేరు ఏ వంద సంవత్సరాలు గానో ప్రచారంలో ఉంది. కాని, ఈ కళ శాతవాహనుల కాలంలో కూడ దేవాయతన ప్రాంగణాల్లో, త్రైర్ధికజన సమ్మేళనాల్లో ప్రయోగింప బడుతూ ఉండేది. ఇది కేవలం పురుషప్రయుక్తం కావటం మూలాన ఇప్పుడున్నంత ప్రాచుర్యం బహుశః అప్పు డుండేది కాదు. ఈ శతాబ్దంలో స్త్రీలే స్త్రీ పాత్రలు ధరిం చటం, స్త్రీలు లాస్యప్రధానాలైన పురుష పాత్రలను కూడ ధరించటం అనే సంస్కరణం జరిగాక కూచిపూడి నాట్య శైలిలోని సహజ సమ్మోహ శక్తి ద్విగుణీకృతమై దేశ విదేశ రసజ్ఞుల నందఱిని ఆకట్టుకొంది.

శాతవాహన రాజులు సంగీత, సాహిత్య, చిత్రలేఖన, శిల్పా లనే కాకుండా నాట్యకళను క ు. వారు బహుపాత్రయుక్తమైన నాట్యమేళ పద్ధతినీ, ఏక పాత్ర ప్రయుక్త మైన నట్టువమేళాన్నీ సమాదరించారు. నట్టువ మేళ పద్ధతిలో దేవాలయపు గర్భ గుడికి ముందు దైవసన్నిధిని మధురభక్తి భావతరంగితాలైన అంతరంగాలతో భోగకాంతలు అనుదినం నాట్యమాడేవారు. ఇక్కడ భోగకాంతలంటే దేవభోగం కోసం ఉద్దేశింపబడిన స్త్రీలని అర్థం. వారినే దేవదాసీలని కూడ అనేవారు. వారు పరమ భాగవతులు. జీవితాలను భగవంతునికి కైంకర్యం చేసి నాట్యం ద్వారా ముక్తిని సాధించిన పవిత్రలు. ఈ వ్యవస్థ క్రమంగా శిథిలమై భోగకాంతలు రాజాస్థాన నర్తకులై సంపన్నుల ఉంపుడుగత్తెలై భోగం వారుగా మారిపోయారు. వారు కందుకూరి వీరేశలింగం వంటి ఎందరో మహానుభావుల కృషి వల్ల నేడు కులపాలికలై వైవాహిక జీవితాన్ని గడుపు తున్నారు.

ఎన్నో శతాబ్దాల క్రితం వీరి పూర్వీకులైన దేవదాసీలు దేవాలయాల్లో చేసిన ఏకపాత్రికమైన నాట్య విశేషం కూచిపూడి నాట్య శైలిలోనూ ప్రవేశించింది. అన్నమాచార్యుల వారి సంకీర్త నలు, కంచెర్ల గోపన్న కీర్తనలు, జయదేవుని అష్టపదులు, నారాయణ తీర్థుల వారి తరంగాలు, క్షేత్రయ్య పదాలు, త్యాగ రాజ స్వామివారి కృతులు, ఆధునిక వాగ్గేయకారుల రచనలు వంటివి కూచిపూడి వారు తమ సాంప్రదాయిక శబ్దాలతో పాటు నేడు బహుళంగా అభినయిస్తున్నారు. ఆధునిక నృత్య రూపకా లను ప్రదర్శిస్తున్నారు. ఈ అవిరళ కృషి వల్ల కూచిపూడి తన శాస్త్రీయతను పరిరక్షించుకొంటూనే బహు ప్రయోగవిస్తృతిని పొంది నిరంతరం సుసంపన్నంగా రూపొందుతున్నది.

అక్షయనిధి కూచిపూడి. కేవలం ఆంధ్రుల అభినయ శిల్పా నికి, భావ బంధురతకు, ద్రుతగమన సౌందర్యానికి, కరచరణ శరీర విన్యాసమనోజ్ఞతకు, శాస్త్ర సంప్రదాయవైదుష్యానికి కూచిపూడి నాట్యశైలి కల్పించే అవకాశం ప్రపంచంలోని ఏ ఇతర నాట్యశైలీ కల్పించదు. ఈ అక్షయ సంపదను పదిలం గాను, పవిత్రంగాను కాపాడు కోవటం ఆంధ్రుల కర్తవ్యం, బాధ్యత.

# రాళ్ళూ-రత్నాలూ

**శ్రీమతి శారదాపూర్ణ శొంఠి**

మనకు ప్రకృతి ప్రసాదించిన వస్తు సంపద లోనివే రాళ్ళూ- రత్నాలూ. మొదటివి విలువ లేనివయితే రెండోవి విలువ కట్టలేనివి. కాగా శాస్త్రజ్ఞులు వస్తు స్వరూపాన్ని, గుణాన్ని, వాడకాన్ని బట్టి విలువ కడుతున్నారు. రత్నాల ఖరీదులు మారుతూ వుంటాయే కానీ విలువ తరగడం లేదు. నిన్నమొన్నటి దాకా రత్నాలూ, రాళ్ళూ మూఢ విశ్వాసాలకూ, తాంత్రిక ప్రయోగాలకూ ప్రతీకలుగా ఉన్నాయి. వేదకాలానికి సంబంధించినంతవరకూ రత్నాల రూపగుణ లాభశక్తుల వివరణ ఈ క్రింది విధంగా కొన్ని గ్రంథాల్లో కనిపిస్తుంది:

విష్ణు పురాణంలో - నవరత్నాలను గూర్చిన వివరణ

పాణిని వ్యాకరణంలో - నగలను గూర్చిన చర్చ

కౌటిల్యుని అర్థశాస్త్రంలో - ఆభరణాల పనితనం, నేర్పు.

వరాహ మిహిరుని కాలం నాటి గ్రంథాల్లో - నవర త్నాలూ, తత్సమరత్నాల గుణాలూ ప్రభావాలను గూర్చిన వివరణ, మానసిక ప్రవృత్తుల మీద వాటి ప్రభావం.

ఆయుర్వేద గ్రంథాల్లో - నవరత్నాలే కాక ఖనిజాలూ, లోహాలూ, రత్నాల ఔషధశక్తిని గూర్చిన విపుల వివరణ.

అగస్త్యునిచే రచింపబడిన రత్నశాస్త్ర గ్రంథం.

క్రీ.శ. 1500లో గౌరనామాత్యుని కుమారుడైన భైరవుని 'రత్నపరీక్ష' గ్రంథం.

ముందుగా మనదేశంలోని రత్నాల పరిస్థితిని పరిశీలిద్దాం. రత్నాలను వాడడం అనాది నుండి వుందని వింటూనే ఉన్నాం. చరిత్ర కందని రోజుల్లో కూడా ఉన్నదని చరిత్ర పరిశోధకులు చెప్తూనే వున్నారు.

అందంకోసం, ఆనందం కోసం దాచిన రత్నాలు కాలక్రమేణ విలువ పుంజుకుని యజమానిని ధనవంతుడుగా పై సంఘంలో గొప్ప వాడుగా కీర్తిమంతుడుగా చెయ్యడం ముసల్మానుల కాలం నుండి నేటి ఎలిజిబెత్ టైలర్ దాకా చూస్తున్నాం.

అందానికీ, ఆరోగ్యానికీ, ఆదాయానికీ, ఆపైన ఆనందానికీ కారణాలయిన రాళ్ళు రత్నాలుగా ఎలా మారతాయో వేదాల్లోనూ, గృహ్య సూత్రాల్లోనూ ప్రస్తావించబడింది. వేరువేరు ప్రయోజనాలాశించి వేరువేరు దశల్లో వేరు వేరు రత్నాలు ఉపయోగించడం ఎందుకో వివరించబడింది.

నామకరణ దశతో ప్రారంభమై విద్యారంభం, వడుగు, స్నాతకం, వివాహం, శిశు జననం, గృహస్థదశ, చివరికి దహన కర్మవరకు వివిధ పరిస్థితులలో రత్నాలను బంగా రంలో పొదిగి వాడడం చూస్తున్నాం.

శిశువు పుట్టిన పన్నెండో రోజునే మొదటిసారి నొప్పి కలిగించే చెవులు కుట్టడం అనే కర్మ జరుగుతుంది. కంసాలి బంగారు తీగెను కాల్చి రెండు చెవుల తమ్మలలోనూ దూర్చి బిగిస్తాడు. మంత్రించిన తాయెత్తునో, కోసిన బొడ్డునో బంగారంలో పొదివి నల్లని తాడుతో మెడలోనో మొలలోనో, బిడ్డకి రక్షగా కడతారు. ఇందుకు కొందరు వెండిని వాడడం కూడా కద్దు.

చెవులు కుట్టడంవల్ల నరాల బలహీనతల నుంచీ, తద్వారా వచ్చే మూర్ఛ రోగాల నుంచీ రక్షణ కలుగుతుంది. వివాహాల్లో నల్లపూసల ప్రాముఖ్యం అందరికీ తెలిసిందే! స్త్రీలు ఋతు వ్యాధులపాలు కాకుండా నల్లపూసలను (Onyx) వాడుతారు.

సూర్యుని నుండి కేతువు వరకూ గల నవగ్రహాలకూ, మేషం నుండి మీనం వరకు గల పన్నెండు రాశులకూ, అశ్విని నుండి రేవతి వరకూ గల ఇరవై ఏడు నక్షత్రాలకూ నడుమ గల అంతరంలో మనుష్యులంతా పుడతారు. అందుచేత వాటి ప్రభావం మనుష్యుల భౌతిక, తాత్త్విక, మానసిక జీవితాలలో కనిపిస్తుంది.

వర్ణాన్ని బట్టి, గుణాన్ని బట్టి, రసాయనిక శక్తిని బట్టి మానవ శరీరం మీద ప్రభావం కలిగించగలవని ఒక్కొక్క గ్రహానికి ఒక్కొక్క లోహం, ఒక్కొక్క రత్నం నిర్ణయించారు.

ఈ రాళ్ళు, రత్నాల విషయంలో ప్రపంచ వ్యాప్తంగా కనిపించే చారిత్రక సత్యాలను, ఆధారాలను, నమ్మకాలను

కూడా ఒకమారు పరిశీలిద్దాం: రోమన్ దేశస్థులయిన ప్లెనీ సోలినస్‌ల గ్రంథాలలోనూ, గ్రీసుకి చెందిన 'సిసియ నైడేస్' లోనూ, క్రీ.శ. 1200 నాటి ఆల్బెర్టస్ మాగ్నస్ వ్రాసిన గ్రంథాల్లోనూ, క్రీ.శ. 1500 నాటి 'పాపిరస్ ఎబర్స్' 'పాపిరస్ బుక్ ఆఫ్ డెడ్ ' అనే గ్రంథాలలో కూడా రత్నాల చర్చ ఉంది.

రత్నాలతో వైద్యం (Gem therapy) సాధ్యమని పాశ్చాత్య దేశాల్లో జరుగుతున్న వైజ్ఞానిక పరిశోధనలు నిరూపిస్తు న్నాయి. మూలికలతో వైద్యం వంటిదే రత్నాలతో వైద్యం కూడా! మనుష్యుల అనారోగ్య కారణాల నివారణకు ప్రకృతి దారి చూపిస్తోంది.

ఈ శతాబ్దంలోని వైద్య శాస్త్రాల్లోనూ, ఔషధ శాస్త్రా ల్లోనూ, శాస్త్ర పరిజ్ఞాన పరిశోధన శాస్త్రాల్లోనూ రత్న శాస్త్రం కూడా చోటు చేసుకుంది.

ఈరోజు రత్నాలుగా మారిన రాళ్ళ విలువల విధానం తత్కాల పరిస్థితులను బట్టి ఏర్పడింది. రత్న సంపదగా తీర్మానింపబడ్డ రాళ్ళు ఆనందానికి, ఆరోగ్యానికీ, ఉల్లాసానికీ, రక్షణకీ, కాలజ్ఞానానికీ, యంత్రానికీ, తంత్రానికీ, ఔషధానికీ వాడుతున్నారు. పదార్థ స్వరూపాన్నీ, రాసాయనిక గుణాన్నీ కొంతవరకు వివరించిన శాస్త్రాలు ఈ రత్నాంతర్గతమైన గుణాలకూ, మానవ జీవగుణాలకూ ఉన్న సంబంధాన్ని గురించీ, వస్తు జీవరసవాద సిద్ధాంతాన్ని గూర్చి వివరించే ప్రయత్నం చేస్తున్నాయి. ఈ పరిశోధన పశ్చిమ దేశాల్లో అధికంగా జరుగుతోంది. అట్టి ప్రముఖ పరిశోధకులలో కొందరు·

1. Dr Jaroslav Baver - London
2 Dr Iry Bannaman Philips - California
3 Dr William Fernic - New York
4 Dr Isador Kozmemsky - Michigan

రత్న పరిశోధనలను గూర్చి వీరు పలు గ్రంథాలు వ్రాశారు.

ఈజిప్షియన్లు, బాబిలోనియన్లు, మాయనులు, మెసపటే మియన్లు, రోమనుల శాసనాధారాల వలన, వారి చరిత్ర లోనూ, జీవితాల్లోనూ నవరత్నాలే కాకుండా తత్సమ తద్భవ రత్నాల వాడకం, వాటిప్రభావం ఎక్కువగా ఉన్నట్లు తెలియవస్తోంది. నేషనల్ జియోగ్రాఫికల్ సొసైటి వారి పరిశోధనలూ, వ్యాసాలూ ఇప్పుడు ఎక్కువగా లభ్యమవుతు న్నాయి.

పాశ్చాత్య చరిత్రలో చోటు చేసుకున్న కొన్ని ముఖ్యమైన విషయాలు ఇక్కడ వివరిస్తాను :

ప్రాచీన ఈజిప్టులో గృహ నిర్మాణవేత్తలు, వాస్తు శాస్త్ర వేత్తలు కార్నీలియన్ (ఆకీకీరాయి)తో చేసిన కవచాన్ని ఉర స్త్రాణంగా (రొమ్ము కవచంగా) వాడే వారు.

రోజ్ క్వాట్జ్ అందాన్ని ఇనుమడింపచేసే లేహ్యాల్లోనూ, చర్మ సౌందర్యాన్ని పెంపుచేసే ద్రవాల్లోనూ చేర్చి వాడే వారు. లాపిజ్ లాజులీ (నీలోపలం) ఒక తరహా వైడూర్యం. ప్రాచీన కాలపు మంత్రులూ, అధినేతలూ దీనిని నిత్యం ధరించే వారు. వీరి బుద్ధి కుశలతకు ఈ మణి ప్రధాన కారణమట! ఓపల్ (Opal) (గోపాలరాయి) రోమన్ దేశ చరిత్రకూ, వైభవానికీ, ఆక్టేవియన్ సీజర్ కీర్తికీ, ఆ దేశ పతనానికీ కారణమైంది.

ఈజిప్టు దేశపు సమాధులలోని మృతదేహాలలో వేరువేరు శరీర భాగాలలో ఈ క్రింది రాళ్లను ధరించడం కనుపించింది:

వంగపండురంగు - amethyst కురివిందరాయి
ఎరుపురంగు - Coral పగడము
పచ్చ - Jade ఏగెటు జాతికి చెందిన ఒక తరహా రాయి.
కాషాయవర్ణంలో ఉన్న Cornilian యమునారాయి.

పచ్చ ఎరుపు రంగు కలిసిన చెకుముకిరాయి (Blood Stone) ఐరన్ ఆక్సైడు అధికంగా గలరాయి. రక్త ప్రసరణను శుభ్రం చేయడానికి ఈరాతినికి ఉపయోగించే వారు.

పసుపురంగులో మెరిసే తృణమణిని (Amber) పొడిచేసి, ముద్దచేసి చర్మవ్యాధులకు వాడేవారు.

క్రైస్తవ మతాధికారులైన పన్నెండుగురు క్రీస్తు శిష్యులూ (Apostles) వివిధాలయిన మణులతో 'గుర్తింపబడేవారు:

సెయింట్ థామస్ పుష్యరాగపు (Acquamarine) కవచం ధరించేవాడట.

సర్‌వాల్టర్ స్కాట్ తన నవలలో క్షీరస్ఫటికం (Opal) విలువ చరిత్రలో జీవితానుభవాల ఆధారంగా ఒకప్పుడు ఏ విధంగా ఆకాశమంటిందో మరొకప్పుడెలా అధఃపాతాళానికి పడిపోయిందో వివరించాడు.

ఆఫ్రికాదేశస్థుల నిత్య జీవితాల్లో ఈ క్రింది రాళ్లు ప్రధానపాత్ర నిర్వర్తించేవి :

Realgar - సింధూర రాయి
Onyx - శేషమణి
Moonstone - చంద్రకాంత రాయి
Turquoise - ఫిరోజా రాయి.

వాటిని నిత్యాభరణాలుగా, కేశాలలో బంధించి జీవితాంతం వారు ధరించే వారు.

కంటికి కనిపించే బాహ్య శరీరమే కాకుండా మిగిలిన జీవకోటి నుంచి మనిషిని వేరుచేసి ఉత్కృష్టుణ్ణి చేసేది అతని ఆలోచనా శక్తి. మనిషి బాహ్య శరీరంలో నిగూఢంగా వున్న సూక్ష్మ దేహాన్ని ప్రకృతి ప్రభావితం చేస్తుంది. స్థూల సూక్ష్మదేహాలమధ్యగల అవినాభావ సంబంధం అదృశ్య రజతసూత్రప్రాయం. ఇది ప్రకృతి సంబంధి. ప్రకృతిలో భాగం రాళ్ళూ, రత్నాలూ - మనిషికీ ప్రకృతికీ మధ్యగల బ్యాటరీ వంటివి ఈ రాళ్ళు!

ఆధునిక రాసాయనిక శాస్త్రాలు రాళ్ళ శాస్త్రాన్ని వివరిస్తుంటే, వైద్యశాస్త్రాలూ, మానసిక తత్త్వశాస్త్రమూ మానసిక స్థితికీ, రత్నాలకూ మధ్యగల సంబంధాన్ని గురించి పరిశోధనలు చేసి క్రొత్త విషయాలు వివరిస్తున్నాయి.

మరుగున పడి ఉన్న ఈ మహావిజ్ఞానం, రత్న సంపదను గూర్చిన పరిశోధనలూ, చర్చలూ మానవజాతిని మరింత అభ్యుదయ పథంలో నడిపించ గలవవని ఆశిద్దాం.

## కొన్ని రత్నాలు - వాటి ప్రభావాలు

Diamond - వజ్రం. నిద్రాభంగం తప్పిస్తుంది. బుద్ధిని పదును పెక్కిస్తుంది.

Ruby - రత్నం. స్త్రీలకి సంబంధించిన ఋతు వ్యాధిని నివారిస్తుంది.

Sapphire - నీలం. శనికి ప్రీతికరమైంది.

Emarald - గరుడపచ్చ. అజీర్తి వ్యాధి నివారణ చేస్తుంది.

Pearl - ముత్యం. సుఖవ్యాధి నివారించి, శాంత చిత్తత కలిగిస్తుంది.

Coral - పగడం. ఉల్లాసాన్ని కలిగించి, వైవాహిక జీవితాన్ని సుఖప్రదం చేస్తుంది.

Topaz - గోమేధికం. మల మూత్ర పిండ వ్యాధులను నివారిస్తుంది.

Cat's eye - వైడూర్యం. గర్భస్థ శిశువు ఆరోగ్యంగా పెరిగేలా చేస్తుంది.

Moon stone - చంద్రకాంత రాయి. గర్భధారణకు, కాన్సరు వ్యాధి నివారణకు, నరాల బలహీనత తొలగించడానికీ సహాయ పడుతుంది.

Amethyst - కురివింద రాయి. మానసిక రుగ్మతలకూ, రక్త ప్రసరణ సవ్యంగా జరగడానికీ తోడ్పడుతుంది.

Zircon - ఒక తరహా వైడూర్యం. క్షయ వ్యాధినీ, పోలియో వ్యాధిని నివారణ చేస్తుంది

Turquoise - ఫిరోజా రాయి. ఉబ్బసం నివారణకూ, గాయాలు మాన్పడానికీ పనిచేస్తుంది.

Jade - పచ్చరాయి. మూత్రపిండాల వ్యాధిని నివారిస్తుంది.

మాలిన్య మార్జనా దివ ముకుర స్సత్పాత్ర లాభతో దాతా।
శ్రోతా స్వదైవత నుతేః తారుణ్యా త్తవ విభాతి తనుశోభా॥

మైలను తుడిచి వేయడంవల్ల అద్దంలాగ, తగిన దానార్హుడు లభించడంవల్ల దాతలాగ, తన ఇష్టదైవాన్ని స్తోత్రం చేయడం విన్నందువల్ల భక్తుడైన శ్రోతలాగ ఓ సుందరీ! యౌవనంవల్ల నీ దేహకాంతి వెలుగొందుతున్నది.

— ఉపమావళి నుండి

# జానపదుల క్రీడలు

**శ్రీ జి.ఎస్. మోహన్**

మానవుని సాంఘిక జీవితానికీ, క్రీడలకీ తరతరాల నించీ అవినాభావ సంబంధం ఉంది. ఎందుచేతనంటే ప్రాచీన మానవుడు అడవి మృగాలతో పోరాడవలసివచ్చినప్పుడు 'ఆత్మరక్షణ'గా భుజబలాన్ని ప్రదర్శించాల్సిన అవసరం ఉండేది. విలువిద్యలాంటి విద్యలు నాటి మానవ జీవితావసరాలై రాను రాను క్రీడలుగా పరిణమించాయని విద్వాంసుల అభిప్రాయం. అందువల్లే ప్రాచీన సంస్కృతిలో క్రీడల్ని ఒక భాగంగా పేర్కొనడానికి వీలవుతుంది.

మానవునికి అన్ని రకాలైన వినోదాలు అనుభవంలో ఉండేవి. 'మనస్సుకు ఉల్లాసము కలిగించు విషయమేదియో అని అన్వేషించుచు, ఆ అన్వేషణలోనే వివిధ రకముల వినోద క్రీడలను ఆతడు కనుగొనగలిగెను. పేక, గాలిపటములు మొదట చీనాలో కనిపెట్టబడినవి. పోలో (గుర్రముల పైనుండి ఆడెడు బంతియాట) ఆట పరిష్యాలోను, పాచికల ఆట భారతదేశములోను కనుగొనబడినవి[1] అనే అభి యాన్ని గమనిస్తే సాంస్కృతిక జీవనంలో ఒక భాగమైన । డలు మన సంప్రదాయాన్ని ప్రతిబింబిస్తాయని చెప్పవచ్చు. ' డలు క్రీడాకారుల్లో వినోదాన్ని, స్పర్ధను, శారీరక శక్తిని ఇవ్వడమే కాకుండా, ఆ ప్రాంత సంస్కృతిని అధ్యయనం చెయ్యడానికి తోడ్పడుతాయి. మెదడుకు సునిశితమైన పనిని కల్గిస్తాయి. ఆడపిల్లల ఆటల్ని గమనిస్తే వాటిలో సంసార శిక్షణ చక్కగా గోచరిస్తుంది.

మానవులకు ఆటలు-పాటలు నైసర్గికంగానే లభించాయి. తల్లి ఊపే ఊయల్లో తనయుడు కాళ్ళు చేతులు ఆడిస్తూ ఆనందడోలికల్లో ఊగుతుంటాడు. తల్లి తన తొడలమీద కూర్చోపెట్టించుకొని, ఆమె ఆడిస్తూ పాడుతూ ఉంటే తన్మయత్వాన్ని పొందుతాడు. కాస్త పెరిగి పెద్దకాగానే తల్లితో దాగుడుమూతలాడుతాడు. మరి కాస్త పెద్దవాడయ్యేటప్పటికి, తల్లి కౌగిటిని వదలి వీథిలోనికి పరుగెత్తుతాడు. వీథి పిల్లలతో రకరకాల ఆటల్ని ఆడుకొంటాడు. ఆటల మైదానాల్లో కుంటికాలితో గెంతుతాడు, మట్టిలో ఆడుకుంటాడు. వర్షాకాలంలో నీళ్ళల్లో కాగితాలతో చేసిన పడవల్ని వదలుతూ సరదా పడతాడు. చలికాలం వస్తే చాలు గాలిపటాలను ఎగరేస్తూ, అవి చేసే విన్యాసాలకు ఉబ్బితబ్బిబ్బవుతాడు. గోలీలాట, కోతికొమ్మచ్చి ఆట, బొంగరాలాట, బంతాటలు ఆడుకుంటూ ఉత్సాహ ఉల్లాసాలతో వ్యాయామం చేస్తాడు.

సాధారణంగా పిల్లల్లో అనుకరణ శక్తి అధికం. వంటయింట్లో తల్లి చేసే వంటావార్పును గమనిస్తూనే ఉంటుంది తనయ. వంట వండడం, వడ్డించడం ఆడ పిల్లలు ఆడుకునే ఆటల్లో చెప్పుకోదగ్గది. అలాగే బొమ్మల పెళ్ళి. ఇది కూడ అనుకరణకి సంబంధించిందే. తల్లి పిల్లని లాలించినట్టుగా, ఈ పిల్లలు బొమ్మల్ని తమ తొడలమీద పడుకోబెట్టించుకుని లాలిస్తారు. పల్లెల్లో బయలాటలు, వీథి నాటకాలను చూస్తూ పిల్లలు తాము ఆయాపాత్రలు ప్రయోగించినట్టుగానే చీపురు పుల్లల్ని బాణాలుగా ప్రయోగిస్తూ ఆడుకుంటారు; పాడుకుంటారు. ఇటీవల టి వి.లో రామాయణం చూసిన పిల్లలు బాణాలను ప్రయోగించడం మనం గమనించిందే. చేతుల్ని క్రిందపెట్టి ఇసుకతో వాటిని మూసి ఇళ్ళు కట్టుకోవడం; అంగడి పెట్టడం-అంగట్లో ఉత్తుత్తి సరుకుల్ని అమ్మడం; పాలు, నెయ్యి, ఆకుకూరలంటూ అరుస్తూ అమ్మడం, మొదలైన అనుకరణల్ని చేస్తూ పిల్లలు ఆడుకోవడం మనం గమనిస్తూనే ఉంటాం.

పిల్లలకు వినోదంగా తయారైన ఇలాంటి ఆటలు క్రమబద్ధంగా ఆడబడి సమాజంలో నిలదొక్కుకుంటాయి. ఆయా వయస్సులకి తగినట్టుగా పలురకాల ఆటలు ప్రచారంలోకి వచ్చాయి. ఈ ఆటలకి క్రమంగా నియమ నిబంధనలు చేరాయి. వీటినే మనం 'క్రీడలు' అంటున్నాం.

సాధారణంగా ఏదేని ఒక వేడుక లేదా వినోదం క్రీడ అని చెప్పవచ్చని Standard Dictionary of Folklore లో చెప్పబడింది. వినోదభరితుడైన మానవుని చిత్తవృత్తి విశేషాన్ని సహజ చేష్టావృత్తిని ప్రాయికంగా మనం ఆట-క్రీడగా భావించవచ్చని క్రీడా వినోదాల మీద పరిశోధన చేసిన శ్రీ వడ్లా సుబ్రహ్మణ్యం గారి అభిప్రాయం.

ఆటకూ క్రీడకూ తేడా వుందని చెప్తూ 'ఒక తోటలో ఇద్దరి మధ్య లేదా జట్టుకూ మధ్య పోటీ లేనంతవరకూ దాన్ని ఆట

(PLAY) అని అనవచ్చు. పోటీ ఉన్నప్పుడు గెలుపు ఓటములు తప్పవు. కాబట్టి పోటీలు ఉండి, గెలుపు ఓటములు కలిగిన ఆటలను క్రీడలు (GAMES) గా భావించవచ్చు' నని అభిప్రాయపడ్డారు డా. సుబ్రహ్మణ్యంగారు. ఆటలకు సర్వసాధారణంగా నిబంధనలంటూ ఉండవనీ, అయితే క్రీడకు నియమనిబంధనలూ, గెలుపు ఓటములు ఉండడం సహజమనీ సుబ్రహ్మణ్యంగారు అభిప్రాయపడ్డారు.

వినోదానికీ క్రీడకు తేడా Folklore and Folk life లో చెప్పబడింది. 'As long as there is no competitive interaction the pastime can be called non-game or for convenience here, recreation Games, however differ from other play activities in that they involve competition between at least two persons'.

R.S. Boggs ఆటల్ని క్రియా సంబంధి వర్గం (Action types) లో చేర్చాడు. ఆయనే మరోచోట జానపద విజ్ఞానాన్ని కొన్ని గుంపులు, (Groups) గా వర్గీకరిస్తూ C గుంపులో చేర్చాడు. ఈ గుంపులో క్రీడలతో పాటు గేయకథ, జానపద గేయం, నృత్యం, సంగీతం మొదలైన వాటిని కూడ చేర్చాడు.

Richard M. Dorson వినోదాలు క్రీడల్ని (Recreations and Games) సాంఘిక జానపద ఆచారం (Social Folk Custom) లో చేర్చారు.

జానపద విజ్ఞానాన్ని శాబ్దిక కళలు (Verbal Arts), శాబ్దికేతర కళలు (Non-verbal Arts), సమాహార లేక మిశ్రమ కళలు (Mixed Arts) అని విభజించి మిశ్రమ కళల్లో క్రీడలు-వేడుకల్ని చేర్చారు డా. సుబ్రహ్మణ్యం.

జానపద విజ్ఞానానికి సంబంధించిన ప్రతి అంశంలోనూ దాదాపు ఒకే రకమయిన లక్షణాలను మనం గమనించవచ్చునంటూ అజ్ఞాత కర్తృత్వం, రచనాకాలం తెలియకపోవడం, సామూహిక ప్రచారం, పాఠాంతరాలు కలిగివుండడం, ప్రాచుర్యాన్ని పొందివుండడం, నియమిత స్వరూపం లేకపోవడం, సరళత్వాన్ని కలిగి వుండడం, జనసామాన్య పరిచితమై వుండడం అనే కొన్ని లక్షణాలను వివరించారు డా. సుబ్రహ్మణ్యం.

## వర్గీకరణ:

క్రీడల స్వభావాదుల్ని బట్టి, ఆటల్లో పాల్గొనే వాళ్ల లింగ భేదాల్ని బట్టి, ఆటల్లో ఉపయోగించే క్రీడా సాధనాలను బట్టి క్రీడల్ని వర్గీకరించవచ్చని Robert A Georges అభిప్రాయం.

నేదునూరి గంగాధరంగారు 1. ఇంట ఆడునవి - ఆరుబయట ఆడునవి 2. స్త్రీలు ఆడునవి-పురుషులు ఆడునవి. 3. బాలికలు ఆడునవి-బాలురు ఆడునవి 4. ఎవరైనను సరే ఆడునవి 5. శాస్త్రానుభవం కలవి-చతురంగాదులు 6. నిషిద్ధాలు - జూదం, పేకాట మొదలైనవి అని వర్గీకరించారు.

అలాగే టేకుమళ్ళ కామేశ్వరరావుగారు పాటలున్న ఆటలు కొన్ని, పాటలు లేని ఆటలు కొన్ని, చిన్నపిల్లలు ఆడుకునే ఆటలు కొన్ని, పెద్దవాళ్ళు ఆడుకునేవి కొన్ని అని ఆటల్ని వర్గీకరించారు.

నీలా జంగయ్యగారు ఆంధ్రదేశంలో ఉన్న ఆటపాటల్ని చాల చక్కగా వివరించారు కానీ వాటిని సక్రమంగా విభజించి, అవి ఏ కోవలో చేర్తాయో నిర్దిష్టంగా చెప్పలేకపోయారు. ఆటపాటల్ని స్థూలంగా రెండు విభాగాలుగా చెప్పుకోవచ్చనీ అవి 1. అనంత జీవజాలంలో శ్రేష్ఠతారూపులైన మానవుల మధ్య రూపొందించిన ఆటపాటలు 2. మానవుల మచ్చిక పడిపోయిన జంతువులకు మానవులు నేర్పిన ఆటపాటలు - ఇవి ఆయా భాషలలో - ఆయా జాతులలో - ఆయా ప్రాంతాలలో ఆయా దేశాలలో - ఖండాలలో రకరకాలైన నియమ శోభితాలై ఆనందాన్ని అందిస్తున్నాయి అని వివరించిన నీలా జంగయ్యగారు ప్రపంచ పరివ్యాప్తంగా ఉన్న ఆటపాటలన్నీ మూడు రకాలుగా విడదీయడానికి వీలున్నదని అవి 1. మౌనంగా ఆడే ఆటలు ఉదా: పులిజూదం, ఇస్పేటు, చదరంగం (కూర్చుండి ఆడే ఆట) ఇవి ఎన్నో రకాలుగా ఉన్నవి. 2. పలుకు అనుబంధంలో ఆడే ఆటలు. ఉదా: గద్దొచ్చె కోడి పిల్లాట, బండారు మైసీఆట, దాగిళ్ళు మూగిళ్ళు ఆట. 3. పదంతోనో లేదా పాటతోనో, చిందుతోనో ఆడే ఆటలు. ఉదా: అడుగుల భజన, జడకొప్పు కోలాటం, బ్యాట్‌మెంటన్, చెండాటలంటివి అన్నారు. వీరే ఈ ఆటపాటలు పండగల ననుసరించి కూడా ఉన్నాయని వాటిని స్త్రీల సంబంధమైన ఆటపాటలు, పురుష సంబంధమైన ఆటపాటలు అని రెండు భాగాలుగా చేసుకొనవలసి ఉంటుందన్నారు. ఈ ఆటపాటలు ఈడు ననుసరించినవిగా అభిరుచి ననుసరించినవిగా ఎన్నో విభాగాలవుతూ ఉంటాయి. సమయ సందర్భాలను బట్టి వాటి లక్ష్య లక్షణాలు వేరుకావచ్చు అన్నారు. ఇంకొకచోట ఈ ఆటపాటలు వృత్తులను అనుసరించి కూడా ఉన్నాయి అన్నారు. పైగా వీరు వ్యాసాన్ని ముగిస్తూ, 'ఆయా ఆటపాటలను గూర్చిన చరిత్ర అనిర్వచనీయమైందే, అయినా వాటి తీరునుబట్టి ఇవి ప్రాకృతికములు - ఇవి సాంస్కృతికములు - ఇవికాల్పనికములు అని మూడు భాగాలుగా విభజించుకోవచ్చును' అన్నారు. ఇలా వీరు ఆటపాటల్ని చెప్తూ పోయారేకానీ వీటిని ఒక నిర్దిష్టమైన చట్రంలో ఇముడ్చ లేకపోయారు.

క్రీడావినోదాల్ని డా. వడ్లా సుబ్రహ్మణ్యంగారు 12 రకాలుగా విభజించారు.

1. మానవుని వివిధ దశలననుసరించి (According to different stages in life) వయోభేదాన్ని బట్టి (According to age) (a) బాల్యం: పూర్వబాల్య దశ (5 ఏళ్ళ లోపు) (pre-childhood) ఉత్తర బాల్యదశ (5 నుంచి 15 ఏళ్ళలోపు (post child)

(b) యౌవనం: (15 నుంచి-25 ఏళ్ళ లోపు) (youth)
(c) కౌమారం: (25 నుంచి-60 ఏళ్ళ లోపు)
(d) వార్ధక్యం (60 ఏళ్ళ పైబడి) దశలలో ఆడే ఆటలు.

2. స్త్రీపుం భేదాశ్రాన్ని బట్టి (According to sex) (a) స్త్రీలు (females) - బాలికలు, యువతులు, స్త్రీలు ఆడేవి (b) పురుషులు (Males) - బాలురు, యువకులు, పురుషులు ఆడేవి (c) స్త్రీపురుషులు (both females and males) కలిసి ఆడేవి.

3. ఉత్సాహాంకాలు - సామాన్య రోజులలో ఆడే ఆటలు (ordinary days games)/ఉత్సవాంకాలు-పండుగ పబ్బాలలో ఆడే ఆట (with reference to feasts and festivals)

4. ఇంటి లోపల ఆడే ఆటలు (Indoor games)/ఆరుబయట ఆడే ఆటలు (Outdoor games)

5 పగటి వేళల్లో (During day time), రాత్రిళ్ళలో (During night time) ఆడే ఆటలు.

6. పౌర (urban)/జానపద (rural) భేదాన్నాశ్రయించి

7. క్రీడాకారుల సంఖ్యను బట్టి (According to the number of participants)

(a) వ్యష్టి నిరూపకాలు (Individual)
(b) సమిష్టి నిరూపకాలు (Group)

(i) సామూహికంగా కలిసికట్టుగా ఆడే ఆటలు (Combined group games).

(ii) రెండు జట్లుగా ఏర్పడి ఆడే ఆటలు (Team games).

8. క్రీడాసాధనాలను బట్టి (According to the type of equipment used).

(a) నిర్జీవ పదార్థాల తోడ్పాటు కలవి (with the help of inanimate objects)

(b) జీవజంతువుల ఆధారంతో ఆడేవి (with the help of animate objects).

(c) ఏ పరికరాల తోడ్పాటు అవసరం లేనివి (without the help of any equipment)

9. బుద్ధి (Related to mind)/శరీర సంబంధుల (Related to body and) ద్వ్యవధానానికి సంబంధించినవి కొన్ని (Related to both mind and body).

10. మతపరమైనవి (Related to religion), మతేతరమైనవి (Non religious)

11. ఋతువులను బట్టి (according to seasons), నైసర్గిక స్థితిని బట్టి (according to geographical distribution).

12. ఆర్థిక, సామాజిక అంతరువులను బట్టి (according to economical and social status).

డా. సుబ్రహ్మణ్యంగారి పై విభజన క్రీడలకు సంబంధించిన అన్ని అంశాలను లోగొన్నదిగా ఉన్నది; అత్యంత సమంజసంగా కన్పిస్తున్నది.

## క్రీడల ప్రస్తావన - కృషి

మానవ జీవన విధానంలో ' డలకి ప్రముఖ స్థానం వుంది. ఆటల్ని గురించి ప్రచురింపబ గ్రంథాలు తక్కువే. క్రీడా స్వభావాన్ని గురించి పూర్వ ప శోధకులెవ్వరూ పట్టించుకోలేదు. ఇంగ్లండు దేశస్థుడైన Joseph Strutt తన దేశంలోని విరామ సమయాలలోని activities గురించి The sports and pastimes of the people of England (1801) వివరించి ఒక చక్కని ఉపోద్ఘాతం వ్రాశారు. పందొమ్మిదో శతాబ్దాంతానికి యూరోపు దేశంలో చాలమంది క్రీడల్ని సేకరించారు. జర్మన్, రష్యా, హంగేరి, నార్వే, డెన్మార్కు దేశాల్లో సేకరణ, ప్రచురణలు జరిగాయి.

క్రీడలకు సంబంధించి ప్రకటింపబడ్డ గ్రంథాలు తెలుగులో అత్యల్పం. అయితే ప్రాచీన సాహిత్యంలో తెలుగు కవులు తమతమ కాలాల్లో ఉన్న ఆటపాటల్ని తమ రచనల్లో ముందు తరాలవారికి అందించడం శ్లాఘనీయం. పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్ర, బసవపురాణాల్లోను, నాచనసోమన ఉత్తర హరివంశంలోను, కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలోను తెలుగువాళ్ళ ఆటల్ని పేర్కొన్నారు.

వేదాల్లో, ఉపనిషత్తుల్లో వేట, గుర్రపుసవారి, ధనుర్విద్యలు, ఈత మొదలైన క్రీడలు చెప్పబడ్డాయి. ప్రాచీనకాలంలో పగడాలాట, జూదం మొదలైనవి అనిష్టాలని తెలిసినా వాటికి బహుజనాదరణ ఉండేది. జూదానికి మహాభారతం నిదర్శనం. కుస్తీ ముష్టియుద్ధాలు నాటికాలానికి నిత్య క్రీడలుగా ఉండేవి.

బొంగరాలాట పల్నాటివీరచరిత్ర, బాలనాగమ్మకథ, పరంజోతి కథలోను, కోతిపోరు పల్నాటి వీరచరిత్ర, బొబ్బిలిరాజు కథలోను కన్పిస్తాయి. రూకలకుప్పలు, గోలిగుండు, చిల్లగోనె, కుందినగురి, పాచికలాట మొదలైనవి కూడ జానపద గేయ గాథల్లో చోటు చేసికొన్నాయి.

తెలుగులో క్రీడల స్వరూప స్వభావాలని, వివిధ రకాల క్రీడల్ని వివరించే వ్యాసాలు చాల తక్కువగా వచ్చాయి. నేదునూరి వారు తమ 'ఆటలు-పాటలు' గ్రంథంలోను, ఓకుమళ్ళ కామేశ్వరరావుగారు తమ సాంప్రదాయిక విజ్ఞానంలోను, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, మంగిపూడి వేంకటశర్మగారు 'భారతి' పత్రికలోను క్రీడలకు సంబంధించి తెలియజేశారు. 'గృహలక్ష్మి' పత్రికలో కూడ ఆటల్ని గురించి వ్యాసాలు ప్రకటింపబడ్డాయి. 'యుగయుగాల్లో భారతీయ మహిళ' అన్న గ్రంథంలో శ్రీమతి జె. వరలక్ష్మి గారు 'సారస్వత నవనీతం' అన్న గ్రంథంలో దేవులపల్లి రామానుజరావుగారు, క్రీడల్ని ప్రస్తావించారు. అలాగే మాగంటి బాపినీడు 'ఆంధ్ర సర్వస్వము' గ్రంథంలోను సురవరం ప్రతాపరెడ్డిగారు 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'లోను, మల్లంపల్లి సోమశేఖర శర్మ, కావూరి ప్రసన్న సత్యనారాయణ మొదలైన వాళ్ళు 'వి న సర్వస్వం', 'సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం' సంపుటాల్లోను ' డల్ని గురించి ప్రస్తావించారు. డా. బిరుదురాజు రామరాజుగా , డా. తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు ఆటలకు సంబంధించి కొంత కృషి చేశారు.

ఇటీవలి కాలంలో 'ఆటలు-పాటలు' గురించి శ్రీ నీలా జంగయ్యగారు, 'తెలుగు సాహిత్యంలో క్రీడా వినోదాలు' అన్న అంశంపైనే పిహెచ్.డి చేసిన డా వడ్డా సుబ్రహ్మణ్యంగారు, 'ఆంధ్రుల జానపద విజ్ఞానం'లో ఆటలు-వినోదాలకు సంబంధించి చక్కని వివరణ నిచ్చిన డా. ఆర్వీయస్ సుందరంగారు క్రీడల స్వరూప స్వభావాలను గురించి విశ్లేషించడం జరిగింది.

## క్రీడల ప్రయోజనం-ఆవశ్యకత

ఆటలు పిల్లలకి ఆనందాన్నిస్తాయి. బుద్ధికి పదును పెడతాయి. శారీరక వికాసానికి దోహదం చేస్తాయి. ఆటల సమయాల్లో పలురకాల ఆటగాళ్ళతో కలవడం వల్ల పరస్పరం స్నేహం ఏర్పడుతుంది. ఒకర్నొకరు అర్థం చేసుకోవడం జరుగుతుంది. స్పర్థాత్మక క్రీడలకోసం పలు ప్రాంతాలను దర్శించడం వల్ల ఆయా ప్రాంతాల సంస్కృతి అవగాహన అవుతుంది. ఒకవిధంగా క్రీడలు జాతీయ సమైక్యతకి నాంది పలుకుతాయి.

క్రీడల వల్ల క్రమశిక్షణ ఏర్పడుతుంది. గెలుపు ఓటముల్ని సమానంగా తీసుకునే మనోభావన ఏర్పడుతుంది. మనోధైర్యం పెరుగుతుంది. స్పర్థించాలనే ఉత్కటమైన కాంక్ష, సాహస లక్షణాలు పెంపొందుతాయి.

పాశ్చాత్య సంపర్కం వల్ల మన సాహిత్యంలోను, సంస్కృతిలోను మార్పు వచ్చినట్టుగానే క్రీడల్లోను వస్తోంది. పాశ్చాత్యుల ఆటలు మనలోను చోటు చేసికొని మన ఆటలు కనుమరుగై పోయే అవకాశం కన్పిస్తోంది. మన ఆటల్ని మరచిపోతున్నాం. ఉదాహరణకి ఇస్పేటు, గుర్రపు పందేల ఆటలు మనమీద, మన సంస్కృతి మీద ఎలాంటి ప్రభావాన్ని చూపిస్తున్నాయో మనకు బాగా తెలుసు. ఇవి డబ్బు కోసం ఆడే ఆటలు. మనవి పైసా ఖర్చు కాకుండానే ఆడే ఆటలు. విదేశీ ఆటలు మన జనపదాలకు ఎగ్రబాకి మానసిక దౌర్బల్యాన్ని తెచ్చి పెడ్తున్నాయి.

కొంతకాలం పోతే మనం మరచిపోతున్న ఆటల్ని మళ్ళీ కొత్త తరహా ఆటలుగా ఆ పాశ్చాత్యులే పరిచయం చేసే ప్రమాదం ఉంది. మనం మన దేశీయ క్రీడల్ని 'పాత చింతకాయ పచ్చడి' లాగా అనుకుంటున్నాం. అయితే ఆ పాత పచ్చడిలో కూడ సారం ఉందని తెలుసుకోలేకపోతున్నాం.

మన సంస్కృతీ, సంప్రదాయాలతో కూడుకొన్న క్రీడల్ని పరిరక్షించడం మన విధి, కర్తవ్యం.

## ఒక జానపద క్రీడ – గాలిపటం

ఆకాశంలో గాలిపటాన్ని ఎగిరించడం ఒక జానపదక్రీడ గాలిపటాన్ని తయారుచెయ్యడం ఒక జానపద కళ ఈ ఆటకి చిన్నా, పెద్దా తేడా లేదు. ఇదొక స్పర్థాత్మక క్రీడ శారీరకంగాను, మానసికంగాను ఉల్లాసం, ఉత్సాహం, వినోదం, వేడుక కల్గించడమే ఈ ఆట ప్రయోజనం.

ఆషాఢ మాసం ఈ ఆటకు అనువైన సమయం. ప్రపంచాద్యంతం ఈ క్రీడ వ్యాప్తిలో వుంది. భారత చైనా దేశాల్లో ఇది వినోదాన్నిచ్చే క్రీడ అయితే, కొరియా దేశంలో దౌర్భాగ్యాన్నీ, దుష్ట శక్తుల్నీ పారద్రోలేందుకు గాలిపటాల్ని ఎగరవేస్తారట. చైనా దేశంలో దీన్ని జాతీయ క్రీడగా పరిగణిస్తారు.

క్రీ.పూ. మూడో శతాబ్దంలో గ్రీసు దేశపు అబిటస్ అనే ఆయన గాలిపటం తయారుచేయడం కనిపెట్టారని పెక్కు చిత్రకారుల అభిప్రాయం చైనా దేశంలో క్రీ.పూ 206లో హనసిన్ అనే ఒక సేనాధిపతి యుద్ధ తంత్రంలో ఉపయోగించేందుకు గాను దీన్ని కనిపెట్టారని చైనీయుల విశ్వాసం.

గాలిపటాల్ని ఉత్తర హిందూస్థానీయులు 'పతంగ్' అంటారు. తెలంగాణా ప్రాంతంలో 'పతంగ్' అన్న పేరే వినవస్తుంది. కన్నడ దేశంలో 'గాళిపట' అన్న పేరు వ్యవహారంలో వుంది. గాలిపటాల్లో ఎన్నో రకాలు ఉన్నాయి. వాటి సైజును బట్టీ, ఆకారాన్ని బట్టి పేర్లు విన్పిస్తాయి.

# మనిషి పేరు

శ్రీమతి సుసర్ల లలితా కుమారి

పంచభూతాత్మకమైన ఈ జగత్తులో మానవునిదే అగ్రస్థానం. దీనికి కారణం ఏమిటి? మానవుడు మనన శీలుడు. అనగా సంకల్ప వికల్పాత్మకమైన మనశ్శక్తే మనన శీలత్వం. ఈ సంకల్ప శక్తి మూలంగానే ఈశ్వరుడు జగత్తును సృష్టించి తాను అదే అయ్యాడట. ''సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్. ఏకమే వాద్వితీయమ్. తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి. తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్.'' అని యోగప్రత్యక్షం చేత గ్రహింప గల్గిన భారతీయ మహర్షులు ఉపనిషద్వాక్యాలలో చెప్పారు. పంచ భూతాత్మకమైన ఈ సృష్టిలో ప్రవేశించి, ''అనేక జీవాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరణం విశతి'' వీటికి నామ రూపాలు ఆతడే కలుగజేయాలని సంకల్పించాడట. దీనిని బట్టి నామ రూపాత్మకమయిన ఈ జగత్తంతా సత్యరూపం కావడమే కాక తన్నామ రూపవ్యాకరణం కూడ ఈశ్వర కల్పితమే అన్నట్లు తెలుస్తున్నది.

''ఇదేమిటి? మనం మన పిల్లవాడికి రామయ్య, సోమయ్య అని పేర్లు పెడితే, ఇవి ఈశ్వర సంకేతాలు ఎలా అవుతాయి?'' అని ప్రశ్నించ వచ్చు. జగత్తులోని వస్తువులకు ఆ పేర్లు ఎలా వచ్చాయి అనే విషయం ఎలా ఉన్నా, మనుష్యులకు మాత్రమే పేర్లు పెట్టుకుంటాము; నామకరణం చేస్తాము.

పేరు అనేది దేశీయ పదం. తమిళంలో దీనిని పేర్, పెయర్ అని, కన్నడంలో హెసరు, పెసరు అని అంటారు. ఇవి భాషణార్థకమైన పెళ్ అనే మూలధాతువు నుంచి వచ్చాయి. పేరు 'పేచు' అని తమిళు, హేళు కన్నడం, 'ప్రేలు', తెలుగు అతిగా వాగడం అనే అర్థంలో ఉంది. అంటే మనః కల్పితమైన ప్రతి అర్థానికి, శబ్దాత్మకమైన ఒక పేరుకు దగ్గర సంబంధం ఉంటుందన్న మాట.

పేరు పెట్టడం - నామకరణం మన జాత కర్మాది షోడశ సంస్కారాలలో ఒకటి. ఒక విధంగా ముఖ్యమైందే మన ప్రాచీన మహర్షులు మానవ జీవితానికి ప్రాప్య మేమిటో తెలుసుకొని తదనుగుణంగా జీవిత పథాన్ని దిద్దుకొనడానికి చేసిన యత్నంలో ఈ షోడశ కర్మలు రూపొందించారు నామకరణానికి కూడా నియమాలు నిర్ణయించారు. ఏదో డిత్థ డపిత్థ శబ్దాల వంటి పేర్లు వద్దన్నారు. మౌంట్, హిల్, బ్రూక్స్ వంటి పేర్లు ఇతర దేశాలలో పెట్టుకుంటారు. కాని, మన సంప్రదాయం వేరు. ధర్మశాస్త్రాలు ఇలా చెబుతున్నాయి: ''దశమ్యుత్త రకాలం పుత్రస్య జాతస్య నామ విదధ్యాత్, ఘోష పదాద్యంత రంతస్థం, త్రిపురుషానూనం, అనరి ప్రతిష్ఠితం, ద్వ్యక్షరం, చతురక్షరం వా సామికృతం కుర్యాన్న తద్ధితమ్'' అనగా పుట్టిన పదవదినం తర్వాత పేరు పెట్టాలి. అది మృదువైన సరళాక్షరాలతో ఉండాలి శత్రువుల పేరు కారాదు రెండు, నాలుగు అక్షరాలదిగా ఉండాలి, కృదంతమే కాని, తద్ధితం ఉండరాదు స్త్రీల విషయంలోను సుఖోచ్చారం కలది, క్రూరం కానిది, మనోహరమైనది, దీర్ఘవర్ణాలు అంతంలో గలది బేసి సంఖ్య అక్షరాలు గలది కావాలి. రామయ్య - రామః ఇది కృదంత రూపం దాశరథి అనేది తద్ధిత రూపం.

ప్రపంచాన్ని చూస్తూవుంటే, ఇన్ని భాషలేమిటి? ఇన్ని శబ్దాలేమిటి? వాటిలో ఇన్ని మార్పులు ఏమిటి? అనే ప్రశ్నలు వస్తాయి వీటికి మహాభాష్యకారుడు ఇలా సమాధానం చెప్పాడు. ప్రపంచంలో ఈ శబ్దార్థ సంబంధం నిత్యం ఎందుకంటే, రెండూ కూడ, అనాది నిధనమైన బ్రహ్మస్వరూపాలే గనుక. అయితే, ఆయా శబ్దాలను ప్రయోగించడం లోకం పని. ''సిద్ధే శబ్దార్థ సంబంధే లోకతః అర్థ ప్రయుక్తా'' శబ్దార్థ సంబంధం నిత్యం అంటే, ప్రతి వస్తువుకూ ఏదో పేరు ఉండక తప్పదు. ప్రతి వ్యక్త శబ్దమూ ఒక వస్తువును సూచించక పోదు. కాబట్టే గోడ మేడ చెట్టు పుట్ట అంటే ఆయా అర్థాలు నియతంగా స్ఫురిస్తాయి అయితే, ఆయా శబ్దాలను ఆయా అర్థాలలో ప్రయోగించేది లోకమే గనుక, లోకమందలి ధ్వన్యుచ్చారణ భేదాన్ని బట్టి శబ్ద స్వరూపంలో భేదాలు ఏర్పడుతున్నాయి. అలా ఏర్పడిన వాటిలో శాస్త్రకారులు ఆయాకాలాల్లో నియమాలు చేసి, పదవ్యుత్పత్తి ఏర్పరిచారు రామశబ్దం రమ్ అనే ధాతువు నుంచి ఘఞ అనే ప్రత్యయం చేరితే ఏర్పడిందన్నారు. ఈ ధాతువులు, ప్రక్రియ అంతా కాల్పనికం. ఇలా లోకంలో పదాలకూ, అర్థాలకు గల సంబంధం నిత్యమైనా, లోకంలో మనుష్యుల పేర్లు మాత్రం ఎప్పటికప్పుడు తల్లిదండులు పెట్ట వలసిందే. ఎందుకంటే మనిషి ఎప్పటికప్పుడు జనన మరణాలకు లోనై ఈ లోకానికి వస్తూ వుండేవాడు గనుక, ఇలా పేరు పెట్టడం వాడుకలోకి వచ్చింది.

